First Edition: 5000 copies
May 1960.

# NEHRU LEKHALU

## ( A BUNCH OF OLD LETTERS )

*Translated by :*

*A.* SURYA RAO

*Copyright :*
*JAWAHARLAL NEHRU*
(ENGLISH EDITION PUBLISHERS · ASIA PUBLISHING HOUSE, BOMBAY.)

**PRICE Rs. 10-00**

---

*Published under the auspices of*

**The Southern Languages Book Trust, Madras**

**Telugu-60**

---

*Published by :*

Adarsa Grandha Mandali, Vijayawada.

*Printed at:*

*VICTORY PRESS VIJAYAWADA*

# పరిచయము

ప్రజాసామాన్యానికి ఆకర్షకంగా, విశేషోపయోగకరంగా ఉండే పుస్తకాల ప్రచురణకు దోహదం చెయ్యాలనే సంకల్పంతో దక్షిణభాషా పుస్తకసంస్థ లోగడ కొన్ని పుస్తకాలను ప్రచురింపజేసింది. ఆ ప్రచురణవలన కలిగిన అనుభవంతో ఇప్పుడు మరికొన్ని పుస్తకాలను వివిధ ద్రావిడభాషలలోకి అనువాదంచేయించి ప్రచురింపజేస్తూంది. పాఠకులలో భిన్నభిన్న అభిరుచులకు తగినట్టు ఈపుస్తకాలను శ్రద్ధగా ఎన్నిక చేశాము. అందువల్ల, మానవజీవితానికి సంబంధించిన వివిధవిషయాలనుగురించిన రచనలు ఇందులో ఉండటం సహజం. భారత మహానాయకుల జీవితచరిత్రలు, వారుచేసిన ఘనకార్యాలు వివరించే గ్రంథాలు ఈ ద్వితీయ గ్రంథపరంపరలో ఒకశాఖ. మన దేశశ్రేయస్సుకోసం, అభ్యుదయంకోసం ఆ మహాపురుషులు ఏమిచేసినది, వారికి తామెంత ఋణపడి వున్నది, ప్రజలకు ముఖ్యావశ్యకములైన హక్కులను సంపాదించటానికి వారెన్నెన్ని పాట్లుపడినది ముందుతరాలవారంతా తెలుసుకుని ఉండటం మంచిది.

తత్వశాస్త్రం, గణితం, విజ్ఞానశాస్త్రం, సాహిత్యం— ఈ గ్రంథపరంపరలోని ఇతర శాఖలు. కథానికలు, ప్రాచీన కళాసంపదలను అభినిర్ణించే గ్రంథాలుకూడా ఇందులో ఉండటం ముదావహం. నాటకకళ, శిల్పశాస్త్రం, పురావస్తు పరిశోధనలు, సిరతాద్భుతావహములైన [illegible]

దేశాలయాలనుగురించిన గ్రంథాలు ఈపరంపరలో ఉన్నవి. విజ్ఞానవికాసదాయకములైన భిన్నభిన్నవిషయాలను గురించిన ఈ గ్రంథాలు ప్రజలను విశేషంగా ఆకర్షింపగలవని, ఆవిధంగా ఇట్టిప్రచురణలకు ముందుముందు విస్తారప్రచారం కలుగగలదని నా విశ్వాసం.

దక్షిణభారతభాషలలోని ఉత్తమగ్రంథాలు కొన్నింటిని మిగిలిన దాక్షిణాత్యభాషలలోకి అనువదింపచేయటం ఈ ద్వితీయ గ్రంథపరంపరలోని మరొక ప్రశంసనీయమైన విశేషం. ఈ పుస్తకాలన్నీ పూర్తిగా వెలువడినప్పుడు విద్యాసంస్థలలో ఎక్కువమందిని వివిధవిషయాలనుగురించిన జ్ఞానాసక్తిగల పాఠకులుగా ఆకర్షించి ఆ జ్ఞానపిపాసను తృప్తిపరచటానికి యోగ్యమైన గ్రంథాలనుకూడా వారికి అందజేసినట్టు అవుతుంది.

ఈ దక్షిణభాషాపుస్తకసంస్థ ఆశయాలు శీఘ్రగతిని సఫలంకాగలవని ఆశిస్తున్నాను.

ఎ. యల్. మొదలియార్
వైస్ ఛాన్సలర్,
మద్రాసు విశ్వవిద్యాలయం.

7-10-1958

# ఉపోద్ఘాతము

ఈ లేఖా సముచ్ఛయం వైవిధ్యపూర్ణమైనది. ఈ లేఖలన్నిటినీ సంకలనంచేసి, ప్రచురణోచితములైనవాటిని నిర్ణయించడం దుష్కరమయింది. ఈ ప్రచురణలోని ఔచిత్యాన్ని నిర్ధారణచేయడం నేను చేయదగిన పని కాదు. దాదాపు ఇందులోని లేఖలన్నీ నేడు సుదూరంగా కనిపిస్తూన్న భూతకాలానికి సంబంధించినవి. ఏవో కొన్ని తప్ప, మిగిలినవన్నీ భారతస్వాతంత్ర్యప్రాప్తికి పూర్వం వ్రాసినవి. మన దేశీయ సమస్యలు, మనపైన వాటి ప్రభావాలు ముఖ్యంగా ఈ లేఖలలో చర్చించబడినవి. ఇప్పుడు మళ్ళీ ఈ లేఖలను చదువుకుంటే వెనుకటి వివాదాలు పొటమరించడం, దాదాపు విస్మృతములైన విషయాలను సంస్మరించుకొనడం జరుగుతుంది. ఈ ఉత్తర ప్రత్యుత్తరాలలో చాలా భాగం 1910 - 1945 మధ్యకాలంలో మన స్వాతంత్ర్య సంగ్రామసమయంలో, మధ్య మధ్య నేను జైలువెలుపల ఉన్న వ్యవధికాలంలో వ్రాసినవి.

ఈ లేఖలను శ్రద్ధగా భద్రపరచడానికి తగినంత వ్యవధిగాని, అవకాశంగాని ఆరోజులలో నాకు ఉండేవి కావు. అందువల్ల వాటిని గజిబిజిగా కట్టగట్టి పెట్టవలసి వచ్చింది. అప్పుడప్పుడు పోలీసులు మా నిలయాల్పై దాడి చేసి, తమకు చిక్కిన కాగితాలన్నీ పట్టుకుపోతూవుండేవారు.

చిరకాలం జైలులో గడిపి, విడుదలపొంది వచ్చేసరికి, తరచుగ నా కాగితాలలో చాలాభాగం చెదపురుగులకు భుక్తమై వుండేవి. అయినప్పటికీ చాలా లేఖలు మిగిలినవి. పిమ్మట చాలాకాలానికి మిత్రులు నా కాగితాలను పరిశీలించి, ఏదో ఒక పద్ధతిలో విడదీసిపెట్టారు. నేను ఇటీవల హిమాలయాలలోని కులూలోయలో స్వల్పకాలం విశ్రాంతి తీసుకున్న సమయంలో ఆ కట్టలలోనించి ఈ లేఖలను ఎన్నికచేసి తీశాను.

మహాత్మా గాంధి నాకు వ్రాసిన ఉత్తరాలను మాత్రమే తీసి ప్రకటించాలని మొదట నా సంకల్పం. అయితే, ఆ లేఖలలోని అంశాలు పూర్తిగా బోధపడడానికి గాను ఇతరులు వ్రాసిన లేఖలు, నేను వ్రాసినవి కొన్ని కూడా చేర్చవలసివచ్చింది. కాలక్రమమే ఈ సంకలనంలోని లేఖల క్రమం. కొన్ని సందర్భాలలో మాత్రం సుబోధకత కోసం ఈ నియమాన్ని ఉల్లంఘించవలసివచ్చింది. లేఖలలోని అంశాలకు అక్కడక్కడ నేను కొన్ని వివరణలు, సూచికలు వ్రాశాను. అయినా, ఆసమయంలో భారతదేశంలో జరిగిన సంఘటనలతో పరిచయంలేనివారికి ఈ లేఖలలోని కొన్ని అంశాలు పూర్తిగా బోధపడకపోవచ్చు.

ఇందులోని కొన్ని లేఖలు నేడు మనమధ్య సజీవులై ఉన్న మిత్రులు వ్రాసినవి. వారు తమ లేఖలను ప్రచురించడానికి దయతో నాకు అనుమతి ఇచ్చారు. కొన్ని లేఖల

విషయంలో మాత్రం ముందుగా అట్టి అనుమతి పొందడం సాధ్యంకాలేదు. నేను సాహసించి వాటినికూడా ఈ సంపుటంలో చేర్చినందుకు వారు నన్ను మన్నించగలరని ఆశిస్తున్నాను.

ఈ సంపుటాన్ని ప్రచురించేకృషిలో వివిధదశలలో నాకు తోడ్పడిన మిత్రులందరికీ నా ధన్యవాదాలు. నిజానికి వారి సహకారం లేకపోతే నే నీ లేఖల ప్రచురణకు ఉద్యమించడంగాని, పూర్తి చేయడంగాని సాధ్యమయ్యేదికాదు.

న్యూఢిల్లీ,
అక్టోబర్ 5, 1958.

జవహర్‌లాల్ నెహ్రూ

# లేఖానుక్రమణిక

అరబ్బీభాషలోవున్న 225, 232, 244 నెంబర్లుగల లేఖల అనువాదములు అందుటలో కలిగిన యిబ్బందులు కారణంగా అవి వరుసక్రమంలో చేర్చుటకు వీలుపడ లేదు. అందుచే గ్రంథాంతమున చేర్చడమైనదని పాఠకులు గ్రహింతురు గాక.

ప్రకాశకులు

1. సరోజినీనాయుడువద్దనుంచి

[ఇది నా కుమార్తె ఇందిర పుట్టినపుడు (యిపుడు ఇందిరాగాంధీ) సరోజినీనాయుడు వ్రాసినలేఖ]

మదరాసు
డిసెంబరు 17, 1917

ప్రియమైన జవహర్,

ఈ శుభవార్త విన్నప్పటినుంచి, నీకు కమలకు అభినందనలందచ జేయడానికి, నా కొత్త మేనకోడలి కాశీస్సులను పంపడానికి నా కౌక్షణం తీరికలేకపోతున్నది. ఎప్పటిలాగే. ఇవాళకూడా, పనులు ఉక్కిరిబిక్కిరిగా వున్నా, ఎలాగో క్షణకాలం వీలుచిక్కించుకుని, వాటిని మీ కందచ చేస్తాను. మద్రాసునగరం పిచ్చెత్తినట్లుంది. ఒహో! బాగా పిచ్చెత్తినట్లు! నాకు సైతం పిచ్చెత్తించాలని ప్రయత్నిస్తోంది.

నువ్వు కలకత్తావచ్చినట్లయితే, నన్ను కలుసుకోకుండా వెళ్ళవద్దు. 7, హంగర్‌ఫోర్డువీథిలో నా బస. అక్కడ కలుసుకోవచ్చును. 'భారతీ యాత్మ' గ్రంథప్రతి నొకదానిని నీకు పంపుతున్నాను. మాంటాగూ వైఖరిపట్ల మన ప్రతిఘటనోద్యమానికి ఇది నా సహాకృతి.

అందరికీ నా ప్రేమాభివందనాలు. భారతీయ నూతనాత్మ (నీ పాప)కు ముద్దులు.

ఆదరాభిమానాలతో,
సరోజినీనాయుడు.

2. బి. జి. హార్నిమన్‌వద్దనుంచి

ది బొంబాయి క్రానికల్
(సంపాదకశాఖ)
జూలై 1, 1917

ప్రియమైన జవహర్‌లాల్,

మే 29వ తేదీ ఉత్తరానికి కృతజ్ఞుణ్ణి. పొరపాటున గాంధీ ఒక దానికొరకటనుకున్నారు. మేం, మా నిరసనసమావేశాన్ని వచ్చేశనివారం

ఏర్పాటుచేయబోతున్నాం. దానిని ఏర్పాటుచేయకుండావుందామని, మేము ఎన్నడూ అనుకోలేదు. సాత్త్వికనిరోధనోద్యమానికి ముందు రోజున సమావేశతేదీని నిర్ణయించాలన్నసూచనతో. గాంధీ ఇక్కడకు వచ్చారు. మేం - చర్చకు హాజరయినవారిలో చాలామందిమి - అందు కంగీకరించాము. ఈలోపునే, తాను మాలవ్యాను కలియగలనని, అంత వరకు వేచివుండమని, గాంధీ మమ్మల్ని కోరారు. పిమ్మట సిమ్లానుంచి మాలవ్యా ఇంకా తిరిగిరాలేదని, అలహాబాద్ నుంచి ఆయన తంతి ఇచ్చారు. అందువల్ల మాఏర్పాట్లు మేం చేసుకున్నాం. అయితే,. నేను సాత్త్వికనిరోధనోద్యమానికి పూర్తిగా అనుకూలుణ్ణి. ఆచరణసాధ్యమైన ఏదో ఒకపని విధిగా చేయవలసివుంటుంది. సంతకాలకోసం, సాత్త్విక నిరోధనోద్యమ ప్రమాణపత్రాన్ని, మే మిక్కడ పదిమందికీ పంపు తున్నాము; ప్రమాణపత్రంమీద మొట్టమొదట నేను సంతకంపెట్టాను. కాంగ్రెసువారిలో పెద్దలతో మాకు చిక్కులుసైతం వున్నట్లు, మీరు గుర్తెరిగివుంటారు. అయితే వారిని మేం బాగా సమాధానపరచి మే మెన్నడూ అనుకోనిదానికంటె, ఎక్కువదూరం తీసుకువచ్చాము.

మద్రాసుకు వెళ్ళడంవల్ల చెప్పుకోతగ్గ ఫలితం చేకూరింది. రెండు రోజుల్లో మళ్ళీ 'న్యూ ఇండియా' పత్రికను మేం వెలువరించడం మీ రెరి గినదేకద. అదొక మహత్తరవిజయం; శత్రువు కొక ఎదురులేనిదెబ్బ. అదింక వెలువడదని, శ్రీమతి బిసెంటు ఆశలన్నీ ఒడులుకుంది. మద్రాసు సమావేశంకూడా చక్కగా కొనసాగింది. జె. డి. ఆర్.కు సంబంధించి నంతవరకు, ఇక్కడ మనవాళ్ళు, లేక వాళ్ళల్లో చాలామంది, మీచర్యకు అనుకూలురని తెలియజేయడానికి నేను విచారిస్తున్నాను; కాని అది మాటియైనదని, సరియైనదని ఇప్పటికీ నా అభిప్రాయం. దళాలను చేర్పించే ఉద్యమాన్ని మొట్టమొదట అతికష్టంమీద ఒప్పుకున్న జిన్నా, ఇప్పుడు దానిని అసమ్మతిసూచకంగా విడనాడడానికి సుతరామూ అంగీ కరించడంలేదు: ఇక నేనొక్కడినే నిలబడి వుండిపోయాననిపిస్తోంది.

అఖిలభారత కాంగ్రెసు, ముస్లిములీగుల కార్యనిర్వాహకవర్గ సమష్టి సమావేశాన్ని 8వ తేదీన జరుపుదామని సూచిస్తూ మాలవ్యా

జిన్నాకు తంతినిచ్చినట్లు నా కివాళ తెలిసింది. మనం, ఆరితేరిన వృద్ధులకు జవసత్వాలను కలిగింపగలిగినట్లయితే, యిది మంచిసూచన అని నా అభిప్రాయం. ఈ సమావేశమేర్పాటయితే, మీరంతా అలహాబాద్‌నుంచి బయలుదేరి వస్తారని ఆశిస్తున్నాను. మాలవ్యా ఇక్కడకు వచ్చివుండక పోయినట్లయిన, ఆయన్ని స్వయంగా కలుసుకుని, మనఃపూర్వకంగా మాట్లాడడానికి ప్రత్యేకం నేనే, అలహాబాద్ వచ్చివుండేవాడిని. సురేంద్రనాథును కలియడం సంభవిస్తే, ఆయన కొంత కలసివచ్చేటట్లు చేయగలనని నా నమ్మకం. 11 ఏళ్ళక్రితం భారతదేశానికి నేను వచ్చిన నాటనుంచి ఆయన్ని ఎరుగుదును; ఆయనతో ఎలావ్యవహరించాలో నాకు తెలుసును; కాని ఆయన మిత్రశక్తుల పలుకుబడికి లోబడివున్నారు.

ఉద్యమసాఫల్యానికి అత్యావశ్యకమైనవి రెండు.

1. కౌన్సిలుసభ్యుల రాజీనామా (ఈ అభిప్రాయానికి అలహాబాదును దేవుడు దీవించుగాక !)

2. ప్రభుత్వం తనవిధానాన్ని మార్చుకుని ఏదోఒక నిర్దిష్టమైన తేదీన నిర్బంధితులను విడుదలచేయకపోయినట్లయితే, సాత్విక ప్రతిఘటన ప్రారంభించుట.

నేను, బొంబాయికి సంబంధించినంతవరకు, నా శక్తికితగినట్లుగా వీటికోసం పనిచేస్తాను. కాని అఖిలభారత మహాసభ జరపడం అవశ్యకం.

మీకు పత్రికను పంపమని ఉత్తరువిచ్చాను. ఇదివరకే పంపించానని మొదట అనుకున్నాను.

అందరికి నా గౌరవపూర్వకాభివందనాలు.

మీ విశ్వాసపాత్రుడు,

బి. జి. హార్నిమన్.

[బి. జి. హార్నిమన్ 'బొంబాయి క్రానికల్' పత్రికకు సంపాదకుడుగా పేరు ప్రతిష్ఠలార్జించుకున్నవ్యక్తి. ఆయన ప్రథమ ప్రపంచ యుద్ధ చరమ సంవత్సరాలలోను, అనంతరం, భారత జాతీయోద్యమంలోను పాల్గొని ప్రముఖపాత్రను నిర్వహించారు.]

## 3. మోతీలాల్ నెహ్రూ వద్దనుంచి

[పంజాబులో, సైనికశాసన ప్రయోగానంతర దురదృష్టకర సంఘటనలపట్ల, మా తండ్రిగారు ప్రత్యేకమైన శ్రద్ధవహించి పనిచేశారు. సైనికశాసనపు తీర్పుల విచారణనిమిత్తం, ఆయన పూనికపై, ప్రివీకౌన్సిలుకు కొన్ని అపీళ్ళు పంపబడినవి. అందరి దృష్టిని ఆకర్షించినవాటిలో బుగ్గా, రతన్‌చందుల అపీలు ఒకటి. ఈఉత్తరం, తదుపరి ఉత్తరాలు, మా తండ్రిగారు బీహారులో అర్రా నుంచి వ్రాశారు. అప్పుడక్కడ ఆయన ఒక పెద్ద జమీందారీ కేసును నడిపిస్తున్నారు.]

అర్రా,
ఫిబ్రవరి 25, 1920

నా ప్రియమైన జవహర్,

బుగ్గా అపీలు విషయంలో ప్రివీకౌన్సిలుతీర్పుకు నేను పూర్తిగా సంసిద్ధుణ్ణికాకపోలేదు. ఈ విషయం, నే నింతకుముందువ్రాసిన ఉత్తరం వల్ల నీవు గ్రహించివుంటావు. కాని అపీలును త్రోసిపుచ్చారన్నవార్త నా కొక పిడుగుపాటు. ఒకవేళ మిగిలిన అపీలుదార్లు అల్లరులలో ఏం చేసినా చేసివుండవచ్చును కాని బుగ్గా, రతన్‌చందులు ఈ విషయంలో పాప మించుక అంటని అమాయికులు. పంజాబులో ప్రతివానికి - అధికారికి అనధికారికి—ఈ సంగతి తెలుసును; అయినా, వారికి ఉరిశిక్ష విధించ బడింది. భారతదేశంలో ప్రతిదినం జరుగుతున్న లక్షలాది దురన్యాయాలకు యిది ఒక ఉదాహరణ మాత్రమే.

మనం, మనవిధిని మాత్రం నిర్వర్తించగలం. వీలైనంతమటుకు, మార్గాంతరాలను అన్వేషించగలం. నేను తీసుకున్న చర్యలనుగురించి నీ కప్పుడే తంతినిచ్చాను. కాని అవి చాలవు. నేను సూచిస్తున్న మిగిలిన చర్యలివి:

1. విచారణకు వెళ్ళిన కేసులన్నిటిలోను అపీలుదార్లెవరో, వారిపేర్ల పూర్తిజాబితాను జగన్మోహన్‌దాస్ తయారుచేయాలి. ఎవరెవరు విడుదలయ్యారో, యింకా జైలులో ఎవరెవరున్నారో పరిశీలించేటందుకు,

ఆ జాబితాను ఊక్ చందుకు పంపించాలి. జైలులోవున్నవారిపై దయచూప మని పిటీషనుపెట్టవలసినదిగా నెవిలీనికోరుతూ, వెంటనే ఊక్ చందు వారిపేర్లను ఆయనకు కేబిలుచేయాలి.

2. రాజప్రకటనమును ఈ కేసులకనువర్తింపచేయాలనికోరుతూ, భారతదేశమంతటా ప్రధానస్థలాలలోను, పంజాబులో ప్రతినగరంలోను, అమృతసర్‌లో వాడవాడల బహిరంగసభలు జరపాలి. బుగ్గా, రతన్ చందులు నిరపరాధులని అమృతసర్ సభలలో తీర్మానించాలి.

ఇవి చేయడంకంటె, చెప్పడం అతితేలిక. అయినాసరే, ప్రయత్నించితీరాలి. ఈ విషయం గాంధీజీతో సంప్రతించాలి; కాని వ్యవధి ఆట్టేలేదు. లాహ సంబంధించిన వ్యవహారమంతా ముగిసిన తరువాత, శిక్షలు తొందరతొందరగా అమలుజరిగిపోతాయి. ఇందుకు కతరుపూరు శిక్షలు మనకు దృష్టాంతం.

3. మొదటి రెండుప్రయత్నాలు విఫలమైతే, ఏమిటిచేయాలి? ఇందువిషయమై, నాకు కొన్ని విస్పష్టమైన అభిప్రాయాలున్నాయి; కాని మొదటిరెండింటి ఫలితం తేలేవరకు, నా అభిప్రాయాలను వ్యక్తపరచడం నాకిష్టంలేదు.

నేను హంటిజీకేసును ఒదులుకొనైనాసరే, మీ జిల్లా మహాసభకు హాజరుకావలెననుకుంటున్నాను. నిజానికి నేను ఆయనకి అవసరంలేదు; ఆయనప్పుడు నాకూ అవసరంలేదు — కనక ఉన్నస్థితి చక్కగా తేటపడింది. ఇంక నాకు రెండుమూడురోజులు వ్యవధివుంది. ఆలోచించి ఒకనిర్ధారణకువస్తాను.

ప్రేమతో,
నీ తండ్రి.

4. మోతీలాల్ నెహ్రూవద్దనుంచి

[1920 ఫిబ్రవరి 27 వ తేదీన, మోతీలాల్ నెహ్రూ, అలహాబాదునుంచి, జవహర్‌లాల్ నెహ్రూకు వ్రాసిన లేఖలో ఒకభాగం.]

గాంధీజీరాజకీయసూత్రాలకు సంబంధించినంతవరకు, ఆయనంటే నా కెంతగౌరవం వున్నప్పటికీ. ఆయన వెలిబుచ్చినాడన్నంత

మాత్రంచేత, వాటిని నే నామోదించడానికి సిద్ధంగాలేను. మనం పెద్ద సంఘర్షణకు సింసిద్ధులంకావాలని నే నిదివరకే దాసును హెచ్చరించాను. శాస్త్రితో సంప్రదింపులకు గాంధీజీ ఢిల్లీవెళ్ళడం, మాలవ్యాతో సర్వసాధారణంగా కలిసిపోతూవుండడం, ఆయనతో సమాధానపడడం, ఇవేవీ మనపార్టీకి శుభశకునాలుకావు సరికదా, అవి గాంధీజీకిమైతం అంత మంచిశకునాలు కావు. వ్యక్తి, ప్రజలలో తనకుగల పలుకుబడిని విపరీతంగా విశ్వసించడమంటూ ఒకటి లోకంలోవుంది. అందుకు శ్రీమతి బిసెంటు తగిన మూల్యం చెల్లించుకుంటోంది. మరికొందరుకూడా అదే చేస్తున్నారు. గాంధీజీకూడా అలా చేసినట్లయితే, నా కది మిక్కిలి దుఃఖకరమైనవిషయం. ప్రస్తుతపరిస్థితినిబట్టి ఎవనితోనూ రాజకీయాభిప్రాయాలను పురస్కరించుకుని దెబ్బలాడడానికి నాకు హక్కులేదు; అందులోను గాంధీజీ, మాలవ్యాలవంటి ప్రసిద్ధపురుషులతో అసలేలేదు; కాని దేశం ఏపద్ధతిలో రూపొందుతున్నదో చూడకుండా నేను నా కళ్ళు మూసుకోజాలను. అధికారులతోకాని, మితవాదులతోకాని ఏమాత్రం రాజీప్రయత్నంచేసినా, అది విధిగా దుష్ఫలితాలకు దారితీయకతప్పదు. ఇది ప్రస్తుత పరిస్థితులదృష్ట్యా, నాకు కలిగిన అభిప్రాయం.

5. మోతీలాల్ నెహ్రూవద్దనుంచి

అగ్రా,
ఫిబ్రవరి 20, 1920

ప్రియమైన జవహర్,

హరికృష్ణలాల్ ఇవాళప్రొద్దున్న వచ్చారు. రాత్రి ఎనిమిదిగంటల పాపింజరులో బయలుదేరుతున్నారు. ఇందిర కులాసాగావున్నట్లు. నువ్వు రేపుప్రొద్దున బొంబాయివెళుతున్నట్లు. నువ్వు యిచ్చినతంతి నా కిప్పుడే అందింది. హరికిషన్‌లాల్, రేపు వేకువున అక్కడకు చేరుకోగలరని, కొన్నిగంటలు మాత్రం అక్కడాగుతారని, నీకు తంతినిచ్చాను. ఆయన ఎక్స్‌ప్రెస్‌లో ఢిల్లీ వెళుతున్నారు. ఈ ఉత్తరం ఆయనకిస్తున్నాను.

ప్రొద్దున్న ఫలహారాలవేళ చాలసేపు హరికిషన్‌లాల్, దాసు, నేను పంజాబు వ్యవహారాలనుగురించి, రాజకీయ సాధారణపరిస్థితిని గురించి

దీర్ఘంగా సంభాషించుకున్నాము. మే మే నిర్ణయాలకువచ్చినదీ, హరి కిషన్‌లాల్, నీకు తెలియజేస్తాయి. దయవుంచి ఆయన్ని 'ఇండిపెండెంటు కార్యాలయానికి తీసుకువెళ్ళు. అక్కడి అధ్వాన్నపుస్థితిని కళ్ళారాచూచి, స్వయంగా ఒక అభిప్రాయాన్ని ఏర్పరుచుకోనీయి.

బొంబాయిలో నువ్వెన్నాళ్ళుంటావో నాకు తెలియదు. నువ్వు సాధ్యమైనంత త్వరలో తిరిగి రావాలని నా కోరిక. బొంబాయికేసులో వాదికి సమాచారాన్నందజేయుడంవిషయమై నువ్వేమైనాచేశావా ? చేయక పోతే, స్వయంగా ఈ విషయంలో శ్రద్ధవహించు.

గాంధీజీ, రాజకీయాలలో, తనవైఖరినిగురించి, ప్రధానమైన ఒక ప్రకటనచేయబోతున్నారు. ఈవిషయంమీద నే నిదివరకే నీకు వ్రాశాను. దాసు నేనుచెప్పినదానితో ఏకీభవిస్తున్నారు. పొద్దున్న మేం, మిగతా వాటితోపాటు, ఈసంగతికూడా మాట్లాడుకున్నాం. గాంధీజీ కాంగ్రెసు తీర్మానాలకన్నిటికీ అనుగుణమైన వైఖరిని అవలంబించబోరని స్పష్ట పడుతోంది. శాస్త్రి, మాలవ్యాలను గాంధీజీ తన ఆంతరంగికులుగా ఎంచి, మమ్మల్ని పూర్తిగా ఎడంగా ఉంచుతున్నారు. ఇదే మాకుజరిగిన అన్యాయం. ఏమైనప్పటికీ ఆయన నూతనవైఖరి ప్రకటితమయేవరకు వేచి చూడవలసివుంది. ప్రకటితమయిన పిమ్మట, అది మనకు మార్గదర్శక మగునో, కాదో ఆలోచించి మనం నిర్ణయించుకుంటాము. నీ కిదివరకు ఉత్తరం వ్రాస్తున్నపుడు నే నిదేనిర్ణయానికివచ్చాను. నా నిర్ణయాన్ని దాసుకు తెలియజేశాను; ఆయన నాతో ఏకీభవించారు. కాని అన్యాయం జరిగిందన్న అభిప్రాయం, స్వతస్సిద్ధంగా తనకు కలగలేదని, నావద్ద నుంచి మాత్రమే తాను స్వీకరించాననీ, ప్రత్యేకం, నీతో నన్ను చెప్ప మన్నారు. గాంధీజీతో తనపై కొందరు చాటుగా చాడీలు చెపుతున్నారని దాసు భావిస్తున్నారు; అందువల్ల నీ కీ విషయం ప్రత్యేకంగా పేర్కొన వలసినదని, న న్నాయన కోరారు.

ప్రేమతో,
నీ తండ్రి.

## 6. యం. యల్. ఓక్స్‌కు

[సంఖ్య 6 నుంచి 14— ఈ ఉత్తరాలు ముసోరిలో నాపై జారీకాబడిన ప్రవేశ నిషేధపుటుత్తరువునకు చెందినవి. నాకుచేరిన యిలాంటి ఉత్తరువులలో ఇది మొదటిది.]

శవాయ్‌హోటల్, ముసోరి.

మే 14, 1920

ప్రియమైన శ్రీ ఓక్స్,

సన్ను, ప్రభుత్వం కోరినప్రకారం, ఇప్పుడు ముసోరిలోవున్న ఆఫ్ఘన్ ప్రతినిధులను కలుసుకోనని, వారితో ఎలాంటి సంబంధంపెట్టుకోనని, నేను "నిక్కచ్చి అయిన హామీకత్తు" ఇవ్వాలన్న విషయాన్ని గురించీ, నేటి ఉదయం మనకుజరిగిన సంభాషణగురించీ, నేను జాగ్రత్తగా ఆలోచించిచూశాను. ఈవిషయంలో నా అభిప్రాయాన్ని, నేను మార్చుకోలేకపోయినందుకు చింతిస్తున్నాను. నా భార్యకు అస్వస్థత మూలంగా, మాఅమ్మ, నా భార్య, అక్కచెల్లెళ్ళతో నేను ముసోరికి వచ్చినట్లుగా మీకుతెలుసును. ముసోరికి రావడానికి మానాన్నగారికి తీరుబడి చిక్కేవరకు, మా కుటుంబంతో కొంతకాలం నే నిక్కడ వుందామనుకున్నాను. ఆఫ్ఘను ప్రతినిధివర్గసభ్యులతో నా కెట్టి ప్రమేయంలేదు; వారూ మేమూ ఒక హోటలులోదిగడం, తలవనితలంపుగా తటస్థపడింది. నిజానికి, వా రిక్కడ బసచేయడంవల్ల, ప్రస్తుతం వారున్నగదులలో నేను దిగుదామనుకోవడంవల్ల, నాకు కొంత యిబ్బందికలిగింది. అయితే తెలివిగలవారందరికీ వుంటున్నట్లే, ఆఫ్ఘను ప్రతినిధివర్గంపట్ల, నాకూ అస్థవుంది. కాని, నాపద్ధతులకు విరుద్ధంగా, వారిని నేను కలుసుకోవాలని ఇంతకుముందెన్నడూ అనుకోలేదు; ఇప్పుడనుకోవడంలేదు. మేమిక్కడ పదిహేడు రోజులనుంచి వుంటున్నాము; ఈ పదిహేడుదినాలలోను, ప్రతినిధివర్గసభ్యులెవరినీ, ఆఖరికి దూరంనుంచయినా, నేను చూడలేదు. మీ కీ విషయం ఎలాగూ తెలుసును; ఇవాళప్రొద్దుట, మీరే నా కీ మాట చెప్పారు.

ఆఫ్ఘనులను చూద్దామని, వారితో ప్రమేయంపెట్టుకుందామని, నాకు లేకపోయినా, ప్రభుత్వంకోరికననుసరించి హామీనీయడం పెద్ద కష్టం

కాకపోయినా, నాకునేనై హామీనిచ్చి కట్టుబడివుండే ఎట్టిచర్యను, ఎలాంటి భావాన్ని నే నెంతమాత్రం అంగీకరించను. వాస్తవానికిది సిద్ధాంతానికి, ఆత్మచైతన్యానికి సంబంధించిన సమస్య. నాపై ఖరిని మీరు హర్షిస్తారన డానికి నా కెట్టి సందేహమూలేదు. అందుచేత, ఉదారమైన మీ సలహాను అంగీకరించి, ప్రభుత్వానికి హామీకత్తునీయలేనని చెప్పడానికి విచారిస్తున్నాను.

ప్రభుత్వంకనక, నాపై, ఉత్తరువేదైనా జారీచేయదలుచుకుంటే, ప్రస్తుతం దానిని నేను పాటించడానికి సిద్ధంగావున్నాను. ఇక్కడ మా కుటుంబాన్ని ఒంటరిగా ఒదిలిపెట్టి హఠాత్తుగా నేను వెళ్ళిపోవడం నాకు కష్టంగావుంటుంది. నా భార్య ఆరోగ్యాన్ని మేము శ్రద్ధగా చూచుకోవలసి వుంది. మా అమ్మగారు జబ్బుమనిషి; వారిని నిర్లక్ష్యంగా ఒదిలిపెట్టడం ఎంతోకష్టం. నేను అకస్మాత్తుగా వెళ్ళిపోవడంవల్ల మానాన్నగారు నేను అనుకున్నపనులు తారుమారై, మా కనేక యిబ్బందులను, ఆందోళనను కలిగిస్తాయి. అయితే, ప్రభుత్వ ప్రదానవ్యవహారాలను ఆలోచించేటపుడు, వ్యక్తుల సౌలభ్యాలను పరిగణించరనుకుంటాను.

మీ విశ్వాసపాత్రుడు,
జవహర్‌లాల్ నెహ్రూ.

యం. యల్. ఓక్స్, యస్క్వైర్.,
సూపరింటెండెంట్ ఆఫ్ పోలీస్,
హెర్మిటేజ్ లాడ్జి,
ముసోరి.

7. జి. యఫ్. ఆడమ్సుకు

శవాయ్‌హోటలు, ముసోరి,
మే 15, 1920

ప్రియమైన శ్రీ ఆడమ్స్,

నే నీ విషయాన్ని పూర్తిగా మళ్ళీ ఆలోచించాను; ప్రభుత్వం కోరినప్రకారం, నేను హామీకత్తునీయలేకపోతున్నందుకు, విచారిస్తున్నాను. ప్రభుత్వం నన్ను ముసోరినుంచి వెళ్ళిపొమ్మని ఉత్తరువుచేసి

నట్లయితే, ప్రస్తుతపరిస్థితులలో నే నలాచేయడానికి సిద్ధంగావున్నాను. మీ సూచనను పాటించి, ప్రభుత్వంవద్దనుంచి లిఖితపూర్వకమైన ఎట్టి ఉత్తరువులేకుండా,నాఅంతట నేను వెళ్ళిపోవాలని, మొదటఅనుకున్నాను. కాని ఆలోచించిచూడగా, అలాచేయడం నాకు సబబనిపించలేదు. కనుక, లాంఛనప్రాయమైన అట్టి ఉత్తరువుకోసం ఎదురుచూస్తున్నాను.

మీ విశ్వాసపాత్రుడు,
జవహర్‌లాల్ నెహ్రూ.

జి. యఫ్. ఆడమ్స్. ఎస్క్వైర్., ఐ. సి. యస్.,
డిస్ట్రిక్టు మేజస్ట్రేటు,
ది మోరెస్టరి, ముసోరి.

8. ఉత్తరువు :—

అలహాబాదువాస్తవ్యుడు జవహర్‌లాల్ నెహ్రూ ప్రజాభద్రతకు భంగకరమైనవిధంగా ప్రవర్తిస్తున్నాడని, లేదా ప్రవర్తించబోతున్నాడని నమ్మడానికి తనవద్ద సహేతుకమైన ఆధారాలున్నాయనీ స్థానికప్రభుత్వం అభిప్రాయపడుతోంది. అందువల్ల యిప్పుడు, సంయుక్తరాష్ట్ర లెఫ్టినెంటు గవర్నరు, 1915 భారతదేశ రక్షణనిబంధనలలో 3వ నిబంధనాను సారం, తనకుసంక్రమించిన, అధికారాన్ని పురస్కరించుకుని, అలహాబాదువాస్తవ్యుడు సదరు జవహర్‌లాల్‌నెహ్రూ, సంయుక్తరాష్ట్ర డెహ్రాడున్ జిల్లాపరిమితులలో ప్రవేశించరాదని, నివసించరాదని, లేదా వుండరాదని, ఆజ్ఞను జారీచేయడానికి యిచ్చగిస్తున్నాడు. సదరు జవహర్‌లాల్ నెహ్రూ బుద్ధిపూర్వకంగా ఈ ఉత్తరువు నుల్లంఘించినట్లయితే, 1915 భారతదేశ రక్షణనిబంధనలలోని 5వ నిబంధన, సబ్‌సెక్షన్ (1) లో ఉదాహృతమైనప్రకారం దండనార్హుడని యిందుమూలకంగా అతనిని హెచ్చరించడమైనది. 5వ నిబంధన సబ్‌సెక్షన్ (1) నకలు యిందు జతచేయడమైనది.

నైనిటాల్
మే, 1920.

యం. కియాన్,
ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి,
యు. పి.

శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ ఈరోజునే డెహ్రాడున్ జిల్లాను విడిచి పెట్టవలసివుంటుంది.

బై ఆర్డర్ ఆఫ్ సూపరింటెండెంటు
డెహ్రాడున్

యం. యల్. ఓక్స్
యస్. పి. డెహ్రాడున్
16—5—20

9. మోతీలాల్ నెహ్రూ సర్ హారుకోర్టుకు వ్రాసినది

బెనారసు,
మే 19, 1920.

ప్రియమైన సర్ హారుకోర్టుకు,

నిన్న నేను నా కుమారుని కలుసుకున్నాను; స్థానికప్రభుత్వ ఉత్తరువులపై, అతను డెహ్రాడున్ జిల్లానుంచి ఎట్టిపరిస్థితులలో బహిష్కరింపబడినదీ, అతనివల్ల నేను తెలుసుకున్నాను. సూచీకత్తునీయ నిరాకరిస్తూ, శ్రీ యం. యల్. ఓక్స్‌కు వ్రాసినలేఖలో అతను, తనవైఖరిని పూర్తిగా స్పష్టపరిచాడు, (లేఖప్రతిని యిందుతో జతచేయడమైనది) ఇంతకు మించిన సమాచారాన్ని నా కతను తెలుపలేకపోయాడు.

ప్రభుత్వ ఉత్తరువులఫలితంగా, మా కుటుంబంలోని ఆడువారికి సంతృప్తికరమైన ఏర్పాట్లుచేయజాలక, అతను ఆకస్మికంగా ముసోరి నుంచి వెళ్ళిపోవలసివచ్చింది; మా కుటుంబీకులలో ఇద్దరికి (నా భార్య, నా కోడలు) మిక్కిలి అస్వస్థతగావుంది. అందువల్ల పర్వతప్రాంతాలకు స్థలం మార్పు అత్యవసరమైంది; చార్లివిల్, శవాయ్ హోటలులకు సర్వసౌకర్యాలుగల గదులకోసం తంతినిచ్చాము. మొదటి హోటల్‌వారు మేం కోరినప్రకారం, వసతిచూపించలేకపోయారు; రెండవవారు, యించుమించు, మేం కోరినవసతిని చూపిస్తూ, తమహోటలులో భారత ప్రభుత్వంవారు తీసుకొన్న గదులను వారు ఖాళీచేసినతరువాత, యింతకంటె మంచివసతిని ఏర్పాటుచేయగలమన్నారు. ఇంటి బాదరబందీలకు దూరంగా, వెనకటిలాగ, వేరొకచోట విశ్రాంతితీసుకుంటే, మా ఆడవాళ్ళకు కొంత నయంగావుంటుందని మేం అనుకున్నాం; అందువల్ల హోటలువారిచ్చిన గదులను బోలెడు డబ్బుపోసి తీసుకోవలసివచ్చింది.

ఈ సంవత్సరారంభంనుంచి, నేను అ్రా, డ్యుమరాన్ కేసులో ఊపిరిసలపకుండా పనిచేస్తున్నాను. హైకోర్టులో తనపనితోపాటు, జవహర్‌లాల్ నెహ్రూ నాపనికూడా చూచుకుంటున్నాడు. వాటిని విడిచి పెట్టి అతను మావాళ్ళతో ముసోరీకిరావడంవల్ల, కొన్ని కష్టనష్టాలకు గురికావలసివచ్చింది. ముసోరీలో వుండడానికతను, కావలసిన ఏర్పాట్లు చేసుకుంటూవుండగా, హఠాత్తుగా "ప్రభుత్వ ప్రమేయం" వల్ల కుటుంబ శాంతి అల్లకల్లోలమయింది. అతను తన చెల్లెలిని బడిలోవేసిన ఆ ప్రొద్దుచే, పోలీసు సూపరింటెండెంటు తొలిసారి అతనిఎదుట ప్రత్యక్షమయాడు; ముసోరీలో అతని ఉపయోగార్థం అలహాబాద్ నుంచి పంపించిన గుర్రాలు అక్కడకు చేరలేదు. ఈలోపున ప్రభుత్వ హుకుమునమసరించి, అతను ముసోరినుంచి వెళ్ళిపోవలసివచ్చింది; అతను వాటికి దారిలో ఎదురయాడు.

పరిస్థితులిలావుండగా, "అలహాబాదు వాస్తవ్యుడు జవహర్లాలు నెహ్రూ, ప్రజాభద్రతకు భంగకరమైనవిధంగా ప్రవర్తిస్తున్నాడని, లేదా, ప్రవర్తించబోతున్నాడని, నమ్మడానికి తనవద్ద సహేతుకమైన ఆధారాలున్నాయని స్థానికప్రభుత్వం అభిప్రాయపడుతోంది." కాని, తానెన్నడు చేయనూహించకపోయినా, విరుద్ధమైనపక్కలు చేయనని తనను తాను న్యూనతపరుచుకుని, జవహర్లాల్ నెహ్రూ, "స్పష్టమైన పూచీకత్తు" నిచ్చినట్లయిన, అప్పుడు, స్థానికప్రభుత్వంవద్ద యిప్పుడున్న "సహేతుకమైన ఆధారాలు" మటుమాయమౌతాయి; పోలీసు సూపరింటెండెంటు జవహర్లాలుతో జరిపిన సంభాషణనుబట్టి, మరి అలాగే అనుకోవలసివస్తోంది. జవహర్లాలు పై ఖరిని పూర్తిగా నేను ఆమోదిస్తున్నట్లు వేరే చెప్పనక్కరలేదు. వాస్తవానికి, అదొక్కటే అతనికున్నమార్గం. మా ఒద్దకిరాజకీయాలు అందరికి బాగా తెలుసును. వాటిని మేమెన్నడు ఎంత మాత్రం దాచిపెట్టలేము. అవి ప్రభుత్వఅనుగ్రహాన్ని సంపాదించిపెట్టే తరహాకుచెందినవికావని మాకు తెలుసును. వాటివల్ల, ఎట్టియిక్కట్లు కలిగినా, మేం భరించడానికి సిద్ధంగావున్నాం. కాని జవహర్లాలుపై మోపిన ఆరోపణ, మే మేసిద్ధాంతాలకోసం నిలబడి, అవస్థలుపడడానికి

సిద్ధంగావున్నామో, ఆ సిద్ధాంతాలకుమాత్రం, పూర్తిగా వ్యతిరేకమైనది. ప్రభుత్వం అనుమానించినట్లుగా, యువకుడు జవహర్లాలు, రహస్యమైన కుట్రలను సాగించేసమర్థుడని బహుశా, సి. ఐ. డీ లు తప్ప, భారత దేశంలో అతన్నెరిగినవారెవరూ విశ్వసించరు; ఈ విషయం నేను దృఢంగా మీకు చెప్పగలను. మీ రతనితో స్వయంగా, చాలాసేపు సంభాషించారు. మానవుల వివిధస్వభావాల నవగతంచేసుకున్న మీరు, అతని వ్యక్తిత్వాన్ని రూపొందించిన లక్షణాలను శంకిస్తారని నే నంత సులభంగా నమ్మజాలను. పొరబడడంవల్లనో, అజాగ్రత్తవల్లనో, లేదా పై అధికారుల బలవంతంవల్లనో, ఈ ఉత్తరువు జారీచేయబడేవుండాలి. ఈ రెండింటిలో ఏదోఒకటి జరిగివుంటుందని నేననుకుంటున్నాను ; ఈ రెండూ నిజంకాకపోతే, ఇంతవరకు ఎవరిమూనాన వారిని పోనిచ్చే, మీ ప్రభుత్వవిధానం మారిపోతున్నదనే బాధాకరమైన నిర్ణయానికి నేను రావలసివుంటుంది.

మనం ముప్పైఏళ్ళనుంచి ఒకరినొకరము ఎరుగుదుము. కాబట్టి నా భావాలను నేను దాపరికమేమీలేకుండా నిస్సంకోచంగా వ్యక్తపరచడం మంచిదని అభిప్రాయపడ్డాను. ఆ ఉత్తరువు స్థానికప్రభుత్వం సరిగా ఆలోచించి జారీచేసినదవునోకాదో, అయినట్లయితే, అందుకుగల ఆధారాలేమిటో—యింతే నేను తెలుసుకోగోరుతున్నాను. ఈ సమాచారాన్ని నా కందజేయవలసినదిగా మీరు మీ ఉద్యోగులను ఆదేశిస్తే నేను మిక్కిలి కృతజ్ఞుణ్ణి.

మీ విశ్వాసపాత్రుడు,
మోతీలాల్ నెహ్రూ.

గౌరవనీయులైన సర్ హారుకోర్టు బట్లర్,
లెఫ్టినెంటు గవర్నరు, సంయుక్తరాష్ట్రములు,
నైనితాలు.

10. సర్ హార్ కోర్టు బట్లరువద్దనుంచి, మోతీలాల్ నెహ్రూకు

లెఫ్టినెంటు గవర్నరు మకాం,
సంయుక్త రాష్ట్రాలు, అలహాబాదు
మే 26, 1920

ప్రియమైన శ్రీ మోతీలాల్ నెహ్రూ,

మీరు. మే 19వ తేదీన వ్రాసిన ఉత్తరం నా కిక్కడ అలహాబాదులో, యిప్పుడే అందింది. మీరు వ్రాసినట్లుగానే, నేనూ నిష్కల్మషంగా, వెంటనే జాబువ్రాస్తున్నాను.

ప్రభుత్వవిధానంలో మార్పుకలుగుతున్నట్లు నాకెక్కడా స్ఫురించడంలేదు. అడిగినహామీకత్తు, మీ కుమారుడు యిచ్చినట్లయితే, అందులో న్యూనత ఏముందో నా కవగాహనకావడంలేదు. ఇక్కడే, మనకు. అభిప్రాయభేదాలు కలుగుతున్నాయి. అధికారులు హామీకత్తు అడగడంవల్ల మీ కుమారునికి మీకు ముఖ్యంగా మీ స్త్రీలకు యిబ్బందికలిగినందుకు నాకు నిజంగా విచారంగావుంది. కాని అధికారులు అలా అడగడం, మీ కుమారుడు అంతఃకరణకు సంబంధించిన విషయంగా కాక, వేరొక విధంగా, తనమీద విశ్వాసముంచినట్లుగా, భావించివుంటే చాలా బాగుండిపోయేది.

ఈ ఉత్తరం మీ కేవిధమైన సంతృప్తి కలిగించదని, నా కొక ప్రక్క వెరపుగానేవుంది. అయితే ప్రజావ్యవహారాలపట్ల మన అభిప్రాయాలెలావున్నా, వ్యక్తిగతజీవితంలో, ముప్ఫైఏళ్ళనుంచి మనకున్న స్నేహసంబంధాలకు అంతరాయం కలిగించేదేదీ వుండదని నేను మీకు చెప్పగలను; నా మాట మీరు విశ్వసిస్తారని నే నాశిస్తున్నాను.

మీ విశ్వాసపాత్రుడు,
హార్ కోర్టు బట్లరు

ది ఆనరబుల్ పండిట్ మోతీలాల్ నెహ్రూ

ఆగ్రా,
ఓహారు.

11. మోతీలాల్ నెహ్రూవద్దనుంచి

[అలహాబాదునుంచి 1920 జూన్ 3వ తేదీన, మోతీలాల్ నెహ్రూ జవహర్లాల్ నెహ్రూకు వ్రాసిన లేఖలో ఒకభాగం]

నువ్వు ప్రవేశనిషేధపుటుత్తరువునుల్లంఘిస్తాననడం, నాకు సుతరాము యిష్టంలేదు. ఉల్లంఘించడం అంత అవసరమైతే, దానిఫలితం ఎలావుంటుందన్న ప్రశ్నతో నాకు నిమిత్తంవుండదు. నిన్న నేను నీతో చెప్పినట్లుగా, ఇంతవరకు నువ్వుచేసినపని అన్నివిధాలా యుక్తంగా వుంది. ఇక ఆ మార్గంలో చేయవలసినదేదీలేదు. లజపతిరాయ్ నాతో పూర్తిగా ఏకీభవిస్తున్నారు. చిత్తశుద్ధితో మనం కడచిన ఆరునెలలు ఎంతబాధపడాలో అంతాపడ్డాం. దవ్వింపుదవ్యలకుదిగి యింకా కష్టాలు తెచ్చిపెట్టుకోవడం నాకిష్టంలేదు. బాహ్యాంతర పరిస్థితులదృష్ట్యా అందువల్ల కలిగే పరిణామాలు సుస్పష్టం. అవి ఎలావుంటాయో వేరే చర్చించనక్కర్లేదు. కుటుంబం విచ్ఛిన్నమౌతుంది. మన స్వంతపనులు, వృత్తిధర్మం, ప్రజావ్యవహారాలు, అన్నీ అస్తవ్యస్తమౌతాయి. ఒక పరిణామం యింకొక పరిణామానికి దారితీస్తుంది. నీతోపాటు నేను జైలుకి రావలసిరావడమో లేక అలాంటిదేదో ఒకటి తప్పనిపరిస్థితి సంభవిస్తుంది. చికాకులుపడకుండా నాకు ప్రశాంతంగా వుండాలనివుంది. ఇంతవరకు మనం సక్రమంగానే వ్యవహరించాం; ఇక రానున్న పరిణామాలకోసం మనం ఎదురుచూడవలసివుంటుంది.

12. మోతీలాల్ నెహ్రూవద్దనుంచి సర్ హార్ కోర్టు బట్లరుకు

కలకత్తా,
జూన్ 8, 1920.

ప్రియమైన సర్ హార్ కోర్ట్,

మీరు మే 24 వ తేదీన వ్రాసిన ఉత్తరాని కింత ఆలస్యంగా సమాధానమిస్తున్నందుకు నన్ను మన్నింపకోరుతున్నాను. కాశీ, అల్హాబాద్ లలో జరుగనున్న సమావేశాలకు, నేను అలహాబాదునుంచి బయలుదేరి వెళ్లేముందు సరిగ్గా ఆ సమయానికే మీ లేఖ నాకు చేరింది. సమావేశాల

నుంచి అల్రాకు తిరిగి వచ్చేరాగానే, నేను కలకత్తాకు బయలుదేర వలసివచ్చింది.

నాపట్ల, మా కుటుంబీకులపట్ల మీరు వ్యక్తపరచిన సానుభూతికీ, పౌరవ్యవహారాలపట్ల మన కెన్ని అభిప్రాయభేదాలున్నా, అవి, మనవ్యక్తిగతసంబంధాల కంతరాయం కలిగించజాలవని మీరిచ్చిన వాగ్దానానికీ, కృతజ్ఞుణ్ణి. ఏమైనప్పటికీ, తనదేశంలోవున్న ఒక విదేశప్రభుత్వానికి వ్యతిరేకంగా రహస్యకుట్రలను కొనసాగించబోనని, ఒక పెద్దమనిషిని పూచీకత్తు వ్రాసియిమ్మనడం, అతనిపట్ల తన స్వంతప్రభుత్వం విశ్వాస ముంచడమేనని మీరంటున్నారు. కాని మీ అభిప్రాయంతో నే నేకీభవించ లేకపోతున్నందుకు నా కెంతో విచారంగావుంది.

నాటుమాపనిపై యిలాంటిచర్య తీసుకునేందుకు ఆధారాలున్నాయో లేవో, వుంటే అవిఏమిటో తెలుసుకోవాలనుకున్నాను. ఈ ఉద్దేశంతోనే, మీకు నేను ఉత్తరంవ్రాస్తూ, యిలాంటిచర్యవల్ల యింతవరకు మీ ప్రభుత్వం అనుసరిస్తున్నవిధానం మార్పుచెందుతున్నట్లుగా స్ఫురిస్తోందని చెప్పను సాహసించాను. మీ ఉత్తరం, నేనడిగిన సమాచారాన్ని ఏమీ అందచేయలేదు; కాని ప్రభుత్వవిధానం మార్పుచెందుతున్నట్లుగా మాత్రం మీ రనుకోవడంలేదని మీ ఉత్తరంవల్ల గ్రహించగలిగాను. అందుచేత, ఉత్తరువు యోగ్యతలు ఎలాంటివో యింతకంటె చెప్పడానికి నాకు ఆస్కారమేమీ కనిపించడంలేదు. కాగా ఆ ఉత్తరువు మా కెటువంటి స్థితిని తెచ్చిపెట్టిందో మీకు తెలియచేయడ మొక్కటే నాకు మిగిలింది.

ముస్సోరిలో మా ఆడవాళ్ళు నిస్సహాయులుగా వున్నారు; వారి కక్కడ మగదిక్కులేదు. వారిలో యిద్దరికి ఆరోగ్యం సరిగాలేదు; వారిని యింటికి తిరిగి తీసుకువెడదామంటే, అలహాబాదులో ఎండలు మిక్కుటంగా వున్నాయి. అందువల్ల వా రక్కడే వుండిపోవలసివచ్చింది; వారికి సివిల్‌సర్జను మందుయిస్తున్నాడు. వర్షాలుపడేవరకు పరిస్థితి సవ్యంగా వుంటే, వా రప్పుడు అలహాబాదుకు తిరిగివస్తారు. ఈలోపున, ఒకవేళ, ఏరోగి పరిస్థితైనా బాగుండకపోయి, జవహర్లాలు, ముసోరివెళ్ళవలసివస్తే,

ప్రభుత్వ ఉత్తరువుపాటించక, అతను తనవిద్యుక్తధర్మాన్ననుసరించి, ఆ రోగిని ఆదుకోవలసివుంటుంది. ప్రభుత్వంకోరినట్లుగా హామీనిచ్చి అతను తనగౌరవానికి భంగకరంగా ప్రవర్తించడు. ఇక అతనికున్న మార్గమల్లా, ప్రభుత్వఉత్తరువు అసలు లేనట్లుగా భావించి దాన్నిపాటించక పోవడమేకదు! అలాచేయడంవల్ల, బహుశా అతను తనవాళ్ళకు యిప్పటికంటె యింకా ఎక్కువదూరంలో వుండవలసివస్తుంది. కానైతే, తన విద్యుక్తధర్మాన్ని తాను నెరవేర్చానన్న సంతృప్తి అతనికి కలుగుతుంది. అలాంటి పరిస్థితికనకవస్తే, నిషిద్ధప్రాంతంలో తా నెపుడు ప్రవేశిస్తున్నదీ, అతను, మీకు, గ్రేహామ్ సూపరింటెండెంటుకు ముందుగా తెలియచేస్తాడు. అధికారులు తా మవసరమనుకున్న చర్యలను తీసుకునేందుకు అత సవకాశంకలిగిస్తాడు.

ఈవిషయం కూలంకషంగా నాతో చర్చించినతరువాత, జవహర్లాలు, నేనిపుడు మీకుచెప్పినపద్ధతి అవలంబించడానికి అంగీకరించాడు. ఇందువల్ల, వ్యయప్రయాసలుకలుగుతున్నా, ఇంతవరకు ఏమాత్రమే అతను దిగిరావడానికి అంగీకరించడు; నేను అతను తనసిద్ధాంతాన్ని ఒదులుకొని దిగిరావాలనీ కోరను; అలాగ అతను దిగివస్తాడనీ అనుకోను. ప్రభుత్వ చర్యఫలితంగా తనకుటుంబాన్ని జవహర్లాలు విడిచిపెట్టవలసివస్తుంది. ముసోరీలోవున్న మావాళ్ళ ఆరోగ్యానికి ప్రమాదస్థితి ఏర్పడకపోవచ్చును; కాని వారికి దుర్వవస్థలు తటస్థిస్తాయి. ఇంతవరకు వ్యయమైన డబ్బు వ్యర్థమౌతుంది. ఇన్నీ మేం భరించగలం; కాని మీమీద మాకెంతగౌరవమున్నా మేం దేనిని అన్యాయమైనదని అసాధ్యమైనదని అనుకుంటున్నామో, ఆ ప్రభుత్వ ఉత్తరువుమాత్రం గత్యంతరంలేనందువల్ల, గౌరవించలేం.

అలహాబాద్‌నుంచి మీ కీ ఉత్తరం వ్రాయడానికి నాకు తీరికలేకపోయింది. కాని నేను జవహర్లాలుతో ఏకీభవిస్తున్నట్లుగానే, అతనూ నాతో ఏకీభవిస్తున్నాడని, నేను పైన చెప్పినవిషయాలు అతని అభిప్రాయాలనుకూడా వివరిస్తున్నాయనీ అనుకుంటున్నాను. అయినప్ప

టికీ, ఈ ఉత్తరాన్ని అతను ఆమోదించినట్లయితే అలహాబాద్‌నుంచి మీకు పోస్టుచేయమని కోరుతూ, దీన్ని అతనికి పంపిస్తున్నాను.

మీ విశ్వాసపాత్రుడు,
మోతీలాల్ నెహ్రూ

హిజ్ ఆనర్ సర్ హారుకోర్టు బట్లరు, కె. సి. యస్. ఐ.
లెఫ్టినెంటు గవర్నరు, యు. పి.

13. సర్ హార్కోర్టు బట్లరువద్దనుంచి మోతీలాల్ నెహ్రూకు

నైనిటాల్
జూన్ 15, 1920

ప్రియమైన శ్రీ మోతీలాల్ నెహ్రూ,

మీ 8 వ తేదీ జాబు నాకు అందింది. స్త్రీల ఆరోగ్యాన్నిగురించి మీరువ్రాసినదానినిబట్టి, వారివిషయమై జాగ్రత్తతీసుకునేందుకు, జవహర్లాలు ముసోరికిచేరినట్లయితే, అభ్యంతరపెట్టవలసినవసరంలేదని డెహ్రాడూన్ జిల్లా సూపరింటెండెంటుకు నేను ఉత్తరువు పంపించాను.

మీ విశ్వాసపాత్రుడు,
హారుకోర్టు బట్లరు.

ది ఆనరబుల్ పండిట్ మోతీలాల్ నెహ్రూ
అలహాబాదు.

14. మోతీలాల్ నెహ్రూవద్దనుంచి సర్ హార్కోర్ట్ బట్లరుకు

జూన్ 1920

ప్రియమైన సర్ హార్కోర్ట్,

జవహర్లాలు ముసోరీ ప్రవేశించరాదన్న ఉత్తరువును ఉపసంహరించినట్లుగా మీరు 15వ తేదీన ఉత్తరం వ్రాసినందుకు, మీరు చూపిన సుహృద్భావానికి కృతజ్ఞుణ్ణి. వచ్చిన ఆపదలనుబట్టి, ఇది యింకొంచెం ముందుగా జరిగివుంటే, బాగుండుననిపించింది. 14వ తేదీన నా భార్యకు ప్రమాదకరమైన ఏర్పడింది. డాక్టరు డౌలటతో సంప్రదించినమీదట, సివిల్ సర్జను నే పక్కనుంచు రావడం అవసరమని సలహాయిచ్చాడు. కర్నల్

చెయిర్దు టెలిగ్రాం అందేసరికి అదృష్టవశాత్తూ జవహర్లాలు అలహాబాదులోనే వున్నాడు. ఇద్దరం 10వ తేదీ ఉదయం అక్కణ్ణుంచి బయలుదేరాం; నిన్న సాయంత్రానికి యిక్కడకు చేరుకున్నాం.

ఒక పార్సీ పెద్దమనిషి, పాపం, తనువుంటున్న గదులను మా కిస్తూ ఇద్దరు సుశిక్షితులైన నర్సులను సహాయార్థం పంపించాడు. అతనిచ్చిన గదులు మేముంటున్న గదులకంటె యిమిడికగా వున్నాయి. నా భార్యకు చాలా నీరసంగావున్నా యిప్పుడు ఆమె కులాసాగానే వుంది. మేజర్ స్టార్లిస్మిత్‌తో ఇవాళ డాక్టర్లు సంప్రదిస్తారు; అలహాబాదులో కేసు ఎలాగైనా కావచ్చునన్నస్థితిలోవుంది; సాధ్యమైనంత త్వరలో నే నక్కడకు వెళ్ళాలి. జవహర్లాలును ఇక్కడవుంచి, నేను అక్కడికి రేపు చేరుకోగలననుకుంటున్నాను.

మీ విశ్వాసపాత్రుడు,
మోతీలాల్ నెహ్రూ.

15 మోతీలాల్ నెహ్రూ వద్దనుంచి

[సైనికశాసనం అమల్లోవుండగా, పంజాబులో జరిగిన సంఘటనల్ని విచారించేనిమిత్తం ప్రభుత్వం ఒక సంఘాన్ని నియమించింది. అదే హంటరు కమిటీ.]

అలహాబాదు,
మే 27, 1920

ప్రియమైన జవహర్లాలు,

హంటరుకమిటీ విచారణనివేదికను, ప్రభుత్వతీర్మానాలను నేను జాగ్రత్తగా చదివాను. అవి అత్యంత ఆశ్చర్యకరంగా వున్నాయి. ఇంక మనం ఆలస్యంచేయకూడదు. మీ పార్లమెంటరీవిషయంలో జరిగిన ఉదంతానికి సువ్వేమతచిరాకుపడకుండావుంటే బాగుంటుందేమో. ప్రస్తుతంపటుకు అందులో సభ్యత్వాన్ని ఒదులుకున్న వ్యక్తిని ఏమనడానికి వారికి సమయం మించిపోయివుంటుంది. ఈమధ్య పట్టిన అదృష్టంవల్ల న్యాయవిభిన్నభావాలు అతనికి విస్తృతంగా కలిగివుంటాయి. సరే, అదేమైనప్పటికీ, గాంధీజీ 29వ తేదీ ఉదయానికి చేరుకుంటారు.

మాలవ్యాజీ, ఈసరికే రాజీ చేసుకున్నారు. బి. చక్రవర్తి, హసన్ ఇమాంగార్లను 29వ తేదీ ఉదయం ఇక్కడనుంచి వచ్చే పంజాబు మెయిల్లో బయలుదేరమని తంతి యిచ్చాను. నేను వారితో కలిసి వస్తాను. నువ్వు నీ చిన్నకారులో కాస్త ముందుగా బయలుదేరితే, మమ్మల్ని దారిలో స్టేషనువద్ద కలుసుకోవచ్చును. 29వ తేదీన సమావేశం ఆరంభమవుతుంది; 30వ తేదీ ఉదయానికల్లా ప్రధానమైన ఆ పని పూర్తిఅవుతుంది.

సభ్యులందరూ హాజరుకావాలని ఆదేశమిస్తూ ముఖ్యమైనపత్రికలకు పంపిన ప్రకటనను పంపించాను. నాతోపాటు తానూ బయలుదేరాలని దాసు ప్రయత్నిస్తున్నారు. కాని ఆయనకు క్లిష్టమైన సమయం. అయినా సమావేశానికి హాజరౌతారు. రేపటితో మన కేసు మనం పూర్తిచేస్తాం. దాసు అభ్యంతరం చెప్పడానికి ముందు తనకు కాస్త వ్యవధికావాలని కోరబోతున్నారు. అందుకంగీకరించడానికి మేం యిద్దరం మాటలు కున్నాం,

నువ్వు నాతోపాటు ఒకచోటవుంటే, మనంయిద్దరం ఎక్కువసేపు కాలక్షేపంచేయవచ్చును. దాసు, చక్రవర్తి, హసన్ ఇమాంగార్లు మనతో వుండేందుకు బస సరిపోదు. నువ్వూ నేనూ కలసియుంటే బసచేస్తామని శ్రీమతి జ్ఞానేంద్రకు జాబువ్రాస్తూ, యింకొకచోట వీలుకాకపోతే కొంత మందినేతలు అక్కడి హోటళ్లలో సర్దుకోవలసివస్తుందని తెలియ చేశాను. ముందుజాగ్రత్తకోసం ఈమాట వ్రాశాను.

అమృతసరు కుట్రకేసుకు సంబంధించినఫైలు నువ్వు నీవెంట తీసుకురావడం మంచిది. కాని అందులో ఏప్రియల్ 13వ తేదీనాటి జలియన్‌వాలాబాగ్ సభాతీర్మానం లేదేమో అని నా అనుమానం. ఆ తీర్మానాన్ని ఎవరూ విశ్లేషించేయలేదు. ప్రివీకౌన్సిలుకు సిద్ధపరచబడిన, లాహోరులో నేనుండగా లీగల్‌రిమంబ్రెన్సర్ పంపించిన ఫైలు ఒకసారి చూశాను. బహుశా అందులో ఒకజాబితా వుంటుంది. దానినిబట్టి, అమృతసరు కుట్రకేసుకు సంబంధించిన ఫైలులో ఏ యే పత్రాలువున్నదీ తెలుసుకోవచ్చును. ఫైలు నీదగ్గర వున్నట్లయితే, దాన్ని వెతికిచూడమని సంతానానికి ఉత్తరం వ్రాస్తున్నాను; మన కాతీర్మానం దొరకకపోతే, ఒక బహి

రంగప్రకటనచేయవలసినదిగా, జగత్‌నారాయణ్‌ను అడగవలసి వుంటుంది. ఇదేదో అంతరంగికవిషయమని చులకనగా భావించకూడదు. నువ్వుపంపిన ఆ నివేదికల సారాంశాన్ని చదివినప్పట్నుంచీ, నా నెత్తురు కుతకుతలాడుతోంది. ఇప్పుడిక మనం ప్రత్యేకకాంగ్రెస్‌ను జరిపి, ఆ దుర్మార్గులకు గట్టిగా బుద్ధిచెప్పవలసివుంది.

నివేదికపూర్తిసారాన్ని, ఉత్తరాలను తప్పకుండా నీవెంట తీసుకురా; మరచిపోకు.

ప్రేమతో,
నీ తండ్రి.

## 16. మోతీలాల్ నెహ్రూవద్దనుంచి

[1920 జూన్ 16వ తేదీన ఆగ్రానుంచి, మోతీలాల్‌నెహ్రూ జవహర్లాలుకు వ్రాసినలేఖలో ఒకభాగం.]

సాధారణపరిస్థితినిగురించి నువ్వు మాలవ్యాజీతో సంభాషణలు జరిపివుంటావని నేనాశిస్తున్నాను. నీవు పంజాబువెళ్ళడం కేవలం అనవసరమన్న నీ అభిప్రాయంతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. ఏవో కొన్ని కేసులు తీసుకుని, దొరికినమట్టుకు సాక్ష్యాధారాలు సేకరించి, వాటిని, వాదులపేర్లజాబితాను ఒకపద్ధతిలో అమర్చి, వాటిని పంపించనీయ్; అప్పుడు దాసు, స[illegible], నేను వాటినిపరిశీలించి తగినసలహాలనిస్తాం.

కౌన్సిలు ఎన్నికలనుగురించి మాలవ్యాజీ, నేను ఇప్పుడొకనిర్ణయానికి రావలసివుంటుందనుకుంటాను. ఆయన శాసనసభకు, నేను స్థానిక కౌన్సిలుకు నిలబడితే బాగుంటుందని నా అభిమతం. ఇలాగ నిలబడుతున్నామని, ఆ యా నియోజకవర్గప్రజలకు ముందుగా తెలియపరచాలి. నే నే నియోజకవర్గంనుంచి పోటీచేస్తే యుక్తంగావుంటుందో, యింకా నాకొకఅభిప్రాయం ఏర్పడలేదు. నువ్వు పరిస్థితినంతటినీ, మాలవ్యాజీతో చర్చించడం మంచిది. నీకొకనియోజకవర్గాన్ని నిర్ణయించడం అత్యంతముఖ్యం; కూబడ్డైన మేజరు బలహీనతనుగురించి నువ్వెంత చెప్పినప్పటికి, తన స్వస్థానంలో, అత నంతబలహీనుడని నే ననుకోను.

ప్రత్యేకకాంగ్రెసు సమావేశమయేదాకా, మనం వారికే కూర్చుంటే, ఆనక ఏంచేయడానికీ వ్యవధివుండదు. కాంగ్రెసు బహుశా, తనకురాను కాంగ్రెసుగా సహాయనిరాకరణకు కట్టుబడివుంటుందని నేను భావించను. అది అలా కట్టుబడివుండడానికి వీలులేనంత పెద్దసంస్థ. మహాఅయితే, అది, సహాయనిరాకరణసూత్రాన్ని ఆమోదించి, సభ్యులు తమ తమ అభిమతానుసారం నడుచుకోవచ్చునని అంగీకరిస్తుంది. కాని మనం శాసన సభలలో సహకరించడం మానుకుందామని ఎప్పుడు నిర్ణయించుకుంటే, అప్పు డా పని మనం చేయవచ్చును.

## 17. మోతీలాల్ నెహ్రూవద్దనుంచి

[1920 జూలై 5వ తేదీన మోతీలాల్‌నెహ్రూ అలహాబాదునుంచి జవహర్లాలుకు వ్రాసినలేఖలో ఒక భాగం.]

నే నిక్కడున్న రెండురోజుల్లో వచ్చిన ఉత్తరాలు మొదలైనవి ఇందులో జతపరచి నీకు పంపిస్తున్నాను. ఫతేపూర్‌నుంచివచ్చిన ఉత్తరం గురించి జాగ్రత్తగా ఆలోచించాలి. గతరాత్రి పురుషోత్తమ్, కపిల్‌దేవులతో నేను చాలాసేపు సంభాషించాను. కపిల్‌దేవుకు నువ్వు వ్రాసినఉత్తరం ఆయన చదివి నాకు కొంత వినిపించారు. నువ్వు గాంధీజీ కోరినమార్గాన్ననుసరిస్తాననడంలో నీకు చెప్పవలసిందేమీలేదు. అది మనోభీష్టానికిచెందినవిషయం. అటువంటివాటికి నా మనస్సులో చోటులేదు. సమస్యాభాగోగుల్ని బాగా ఆలోచించిచూస్తే, గాంధీజీకూడా తనకార్యక్రమానికి తుదివరకు అంటిపెట్టుకునివుంటారని నాకెంతమాత్రం తోచడంలేదు. అది ఆయనకొక్కడికే సంబంధించినదైతే, ఆయన దానికి అలాగ అంటిపెట్టుకుని వుంటారు. కాని ఇది ఆయన ఇతరులమీద ఆధారపడవలసినవ్యవహారం; వారు, ఎప్పుడోఒకప్పుడు మధ్యలో మెల్లిమెల్లిగా జారుకుంటారు. ఇలాజరగదని ఎంతమాత్రం సందేహించనక్కరలేదు. సమస్య చాలా జటిలమైనది; నేనెట్టి స్పష్టమైననిర్ణయానికీ రాలేదని అంగీకరించక తప్పదు. అసహాయోద్యమసిద్ధాంతంపట్ల నాకు సంపూర్ణ సానుభూతి వుంది; కాని అది ఆచరణలో ఏస్వరూపాన్ని

దరించవలసివుంటుందో, నా కొక స్పష్టమైనఅభిప్రాయం ఏర్పడలేదు. నేను ఒక్క పంజాబువిషయంలో తప్ప, మిగిలిన విషయాలలో లాలా లజపతిరాయ్‌తో ప్రస్తుత పరిస్థితులదృష్ట్యా ఏకీభవిస్తున్నాను. అంతేకాని, భారతదేశంలోవున్న అన్ని శాసనసభలను బహిష్కరించా లన్న గాంధీజీ అభిప్రాయాన్ని అంగీకరించలేను. నే ననుకుంటున్న పద్ధతివల్ల, మన లక్ష్యానికి మహత్తరమైన బలం చేకూరుతుంది. మనం శాసనసభలలో ప్రవేశిస్తాం; తరువాత వాటినుంచి నిష్క్రమిస్తాం. లేదా వాటి కార్యక్రమానికి అవరోధం కలిగిస్తాం. ఏమైనప్పటికీ, మిగిలిన పరిణామాలు పొడచూపేవరకు, మనం వేచివుండాలి. ఈలోపున అంతిమ నిర్ణయమేదంటూ ఏదీ మనలో ఎవరూ చేయకూడదని నా అభిప్రాయం.

18 మోతీలాల్ నెహ్రూ నుంచి,

చెస్టనట్ లాడ్జి, ఆల్మోరా
జూన్ 3, 1921

నా ప్రియమైన జవహర్,

నగినానుంచి నువ్వు వ్రాసిన ఉత్తరం ఇవాళ పొద్దున్న అందింది. నీ పర్యటన జయప్రదంగా సాగిందని నేననుకుంటాను.

మెల్లమెల్లగా నేను కోలుకుంటున్నాను. ఇక్కడిగాలి ఒక విధంగాలేదు. మాటిమాటికి మారిపోతోంది. ఒక్కొక్కప్పుడు పగళ్లూ రాత్రులూ కూడా అతివేడిగా వుంటోంది. మరొక్కప్పుడు అతి చల్లగా వుంటోంది. నే నిక్కడకొచ్చి అయిదురోజులయింది. బాగులేదనడానికి అప్పుడే ఆస్కారంలేదు. బాగా నయంకావడానికి యింకా నేను అయిదు రోజులు చూడాలి. ఇప్పటిమటుకు ఉబ్బసం ఇదివరకటికంటె చాలా నయంగావుంది; కాని కాస్త అలా నడిచివద్దామంటే, సాధ్యంకాకుండా వుంది. ఇంట్లోంచి బయిటికి రోడ్డుమీదికి రావడమే మహాకష్టంగా వుంటోంది.

అలీసోదరులు చేసినపని నాకెంతమాత్రం యిష్టంలేదు. ఈసంగతి గురించి గాంధీజీకి నేనువ్రాసిన ఉత్తరంప్రతిని నీకు దీనితోపాటు

పంపుతున్నాను. అది రాజ్ టైపుచేసిపెట్టాడు. నా భావాలనన్నిటిని నీకు వ్యక్తపరచలేకపోయాను; ఆఖరికి సగంకూడా తెలుపలేకపోయాను. నా ఉత్తరం పొందికగాలేదని నాకు తెలుసును. కాని, కనీసం నా బుద్ధి ఏమి ప్రసరిస్తున్నదీ నీకు విశదపరుస్తుంది.

నీ ప్రేమగల
తండ్రి

19 మోతీలాల్ నెహ్రూ వద్దనుంచి మహాత్మాగాంధీకి,

ఛస్ట్‌నట్ లాడ్జి,
అల్మోరా,
జూన్ 3, 1921

ప్రియమైన మహాత్మాజీ,

అలీసోదరులు పత్రికలకు విడుదలచేసిన ప్రకటనగురించి నేను మీకు మొన్న ఒక లేఖ వ్రాశాను. వారి ప్రకటన మే 31వ తేదీ 'ఇండిపెండెంట్' పత్రికలో సంక్షిప్తంగా అచ్చుపడింది; ఇది నా ఉత్తరానికి ఆధారం. వారి ప్రకటనను పురస్కరించుకుని భారతప్రభుత్వం కావించిన అధికారప్రకటనను ఇప్పుడే చదివాను. షెమ్స్‌ఫర్డుక్లబ్బులో వైస్రాయి ఇచ్చిన ఉపన్యాసాన్నికూడా నేను చదివాను. అవి చదివినతరువాత, నా కేలాంటి సంతృప్తీ కలగలేదు. ఇలా మీకు చెప్పడానికి నాకు విచారంగావుంది. ఇంతకుముందూ, అటుపిమ్మటా జరిగిన సంఘటనలను విడిచిపెట్టి, కేవలం దానినే ప్రత్యేకించి చూసినప్పుడు, అలీసోదరుల పత్రికాప్రకటన మగటిమిగానేవుంది. అప్పుడు, ఉద్రేకపూరిత వాతావరణంలో, తాముకావించిన ఉపన్యాసాలలో దౌర్జన్యప్రేరేపణ అంతర్గర్భితంగా వుందని, తా మిప్పుడు, భావించినట్లయితే, అందుకు పరిహారంగా విచారాన్ని వెలిబుచ్చుతూ, వారు పత్రికాప్రకటనచేయడం యుక్తియుక్తంగానే వుంది. ప్రజలమన్ననలను పొందిన వ్యక్తుల కిది గౌరవప్రదమైన పద్ధతి. ఇక భవిష్యత్తులో తా మిలాంటివి చేయబోమని, అలీసోదరులిచ్చిన హామీ, దౌర్జన్యసిద్ధాంతంపట్ల ఎట్టిపరిస్థితుల్లోనూ, విశ్వాస

ముంచని, తమ సహాకార్యకర్తలకై ఉద్దేశించినదే అయితే, దానిని నేను సమర్థించడానికి సైతం సంసిద్ధుణ్ణి. కాని "ఎవరు కోరితే, వారందరికీ బహిరంగ హామీయిస్తున్నా వాగ్దానమిస్తున్నా" అనే మాటలు, ఆలాంటి "హామీని వాగ్దానాన్ని" ఎవరు కోరారో, అవి ఎవరిఆజ్ఞను పురస్కరించుకుని యిచ్చినవో, నిస్సందేహంగా తెలియచేస్తూనే వున్నాయి. వైస్రాయి ఉపన్యాసంవల్ల యిది యిప్పుడు మరింత స్పష్టపడుతోంది. అసహాయోద్యమనాయకుడు ఇండియా గవర్నమెంటుతో ఒక ఒడంబడికకు వచ్చి, బహిరంగ క్షమాపణ హామీలను యిచ్చేటట్లుగా, ఆలీసోదరులను ఒడబరిచాడనీ, ఆలీల్యా వారిపైవున్న నేరారోపణ ప్రభుత్వం ఉపసంహరించుకొనేటట్లుచేశాడనీ కళ్ళకుకట్టినట్లు కనిపిస్తున్నది. ఈ వాస్తవికవిషయాన్ని ఎవరూ కాదనలేరు.

యథార్థమిలావుండగా దీన్ని యింకొకదృక్పథంతో ఎలా వీక్షించాలో, నాకు దురవగాహంగా వుంది. యావదుద్యమానికి సంబంధించిన అనేక ప్రధానమైన, పరిశీలనార్హమైన ప్రశ్నలు దీనిలో తలయెత్తుతున్నాయి. అసహాయోద్యమ మూలసిద్ధాంతం దీనితో గాలికి ఎగిరిపోయినట్లు, నిశ్చయంగా నాకు బోధపడుతోంది.

నేను ప్రభుత్వంపేరు విన్నంతమాత్రాన, శంకించి, దూరంగా తొలగిపోయేవాడినికాను; లేదా, మనదోషపరిహారణకు స్వరాజ్యసాధనకు ప్రభుత్వంతో ఒడంబడికకురావడ మొక్కటే మార్గమని నమ్మేవాడినీ కాను. స్వరాజ్యసాధన సర్వవిధాల, మనస్వశక్తిపై ఆధారపడివున్నదన్న మీ నిరంతరబోధనపట్ల నాకు విశ్వాసముంది. అయితే, అంతమాత్రంచేత, ప్రభుత్వంతో, యుక్తపరిస్థితులలో పరిష్కారంకుదరడం అసాధ్యమని నేను భావించడంలేదు. మీరలాగభావిస్తున్నారని ఇంతవరకు నేననుకోవడంలేదు. కాని అలాంటి పరిష్కారానికి సిద్ధాంతాలతో సంబంధంవుండేతప్ప వ్యక్తులసౌకర్యంతోనో, వారిక్షేమంతోనో దానికి ప్రమేయంలేదు. సహకార్యకర్తలలో, మీరుఒకరినొకలాగ, యింకొకరినొకలాగ చూడవీలులేదు; వారిలో అతిముఖ్యులు, నాయకులవల్ల ఎట్టిరక్షణను పొందుతున్నారో, అతిసామాన్యులుకూడాసైతం అట్టిరక్షణను పొందడానికి

అర్హులు. ఆలీసోదరులకు ఏమాత్రం తీసిపోకుండా, వారివలె పరుషంగా ఉపన్యసించి, వందలకొద్దీ కాకున్నా, పదులకొద్దీ, మనవాళ్ళు బహిరంగా జైళ్ళకువెళ్ళారు. కనీసం వారిలో కొంతమంది. అలాంటి క్షమాపణహామీల ఇచ్చివుంటే, ఈపాటికి సులభంగా బయటపడివుండేవారు. కాని వారి కలాంటి సలహాయివ్వాలని యింతవరకు ఎవరికీ బుద్ధిపుట్టలేదు. పైగా, వారిసఖ్యను అసహాయోద్యమంలోనివారు, నాయకులు శ్లాఘిస్తున్నారు. ఇప్పుడు అన్నిటికంటె, ముందుగా నాకు హమీద్ అహమ్మదుసంగతి జ్ఞప్తికివస్తోంది. ఆయన కీమధ్యనే అలహాబాదులో యావజ్జీవకారాగార శిక్ష విధించారు; ఆయన ఆస్తిపాస్తులను స్వాధీనపరచుకున్నారు. నే నాయన్ని స్వయంగా ఎరుగుదును. ఆయన అతిసాధువు. పెద్దతెలివైనవాడు కాడు; చెప్పుకోదగ్గ ఉపన్యాసకుడూకాడు. ఇతరుల ఉపన్యాసాలు ఆయన చదివాడు; విన్నాడు; వాటిని తనకుతోచినవిధంగా అనుకరించాలనుకున్నాడు. అలా అనుకరించడంలో బహుశా, ఆయన కొంత హద్దుమీరి వుండవచ్చు. అంతకుతప్ప ఆయనకు ఎన్నడూ ప్రత్యక్షహింసను ప్రబోధించే ఉద్దేశంలేదని నేను గట్టిగాచెప్పగలను. ఇటువంటివ్యక్తినిఎందుకు కాపాడరాదు? అందుకుకారణాలేమిటి? మే 30వ తేదీన శ్రీ మహమ్మదాలీ, తన బొంబాయి ఉపన్యాసంలో ఈయనను విశేషంగా ప్రశంసించాడు, కాని యిటువంటి క్లిష్టపరిస్థితిలోనే చిక్కుకుని, క్షమాపణ హామీలనిచ్చి బయటపడ్డవ్యక్తికి కావించిన ప్రశంసవల్ల అహమ్మదుకు ఏమి ఊరట కలుగుతుందో నా కర్థంకావటంలేదు. ఇది యిలావుండగా అనేకమంది నిరపరాధులు జైళ్ళలో మగ్గుతున్నారు. మరెంతోమంది యిదేనేరానికి శిక్షలనుభవిస్తున్నారు. మనంమట్టుకుమనం సుఖమైనస్థానంలో హాయిగా వుంటూ, వారికి మన శుభాకాంక్షలను అందించితే సరిపోతుందా?

వైస్రాయితో మీ రనేకసార్లు జరిపిన సంభాషణలఫలితంగా, క్షమాపణహామీలనిచ్చారని, అంతకంటె వాటివల్ల కలిగిన ఫలితమేదీ లేదని, వైస్రాయి తన ఉపన్యాసంలో స్పష్టపరిచాడు. మీరున్నూ మీ ఇటీవలి ఉపన్యాసాలలో మన ఉద్యమం నిరాఘాటంగా సాగుతూ వుంటుందని విస్పష్టపరిచారు. ఏపక్షంవారూ రాయబారం నడుపనవసరం

లేని విషయంమీద, అంటే, హింసను ప్రేరేపించకూడదన్న అంశం మీదతప్ప, సిద్ధాంతసంబంధమైన ఏ విషయంమీద ఒక ఒడంబడిక కుదిరినట్లు కనిపించడంలేదు. ప్రభుత్వంతో ఒడంబడికచేసుకోరాదన్న నృక్పథాన్ని బలపరచడానికి, కారణాలెన్నివున్నప్పటికీ, ప్రస్తుత పరిస్థితులలో అది కూడదని నేను చెప్పను. ఉభయంగు ప్రభువు, మీరు, గౌరవంగల యీ ఇరుపక్షాలవారు. ఒక ఆటను ఆడక తప్పనపుడు, ఆ ఆటలో అన్యాయాలు జరుగుతుండా, దాని నిబంధనలను అంగీకరించి వుంటే ధర్మంగావుండేది. ఈ నిబంధనలు, అనుగ్రహపాత్రులైన ఏ ప్రత్యేకవ్యక్తులకో మాత్రమే కాక, ఆటలో పాల్గొన్నవారందరికీ అనువర్తింపబడి వుండేవి. ఏ సాధనాలవనరమో, అందువిషయమై, ఇరుపక్షాలవారికీ ఒక ఒప్పందం కుదిరివుండవలసింది. అది అన్నింటి కంటె ముఖ్యం. ప్రచారాన్ని ప్రచారంతోనే ఎదుర్కొంటామని కొన్ని స్థానికప్రభుత్వాలు చెప్తుతుంటున్నప్పటికీ, వాస్తవానికి అవి క్రూరాతి క్రూరమైన నిర్బంధవిధానాన్ని అవలంబిస్తున్నాయి. ప్రధానసమస్యపై ఒక అంగీకారానికి రాలేకపోయినప్పటికీ, ఇలాంటి అనేక ఇతర విషయాలు మీరు చర్చించడానికి తగినవని నా అభిప్రాయం.

మీరు నన్ను అపార్థంచేసుకోరని ఆశిస్తున్నాను. ఆలీసోదరుల త్యాగాలను ప్రశంసించడంలో నేనెవరికీ తీసిపోను; వారి స్నేహం నాకు లభించడం నా భాగ్యమని నేనెంచుకుంటున్నాను. నన్ను చాలాకాలం నుంచి వేధిస్తున్నదల్లా యిది: చాలామంది మన కార్యకర్తలు జైళ్ళకు వెళ్ళడానికి, ఇతరకష్టా లనుభవించడానికి, సాక్షాత్తూ మనం బాధ్యులమై వుండి, మనమసుకు మనం, నిరపాయంగా నిశ్చింతగా వుంటున్నాం. నా కరపత్రాన్ని పంచిపెట్టినందుకు, అమాయకులైన పిల్లల్ని జైళ్ళకు పంపడంకంటె, నా కెక్కువ బాధాకరమైనదీ, మనస్తాపాన్ని కలిగించేదీ యింకొకరకమైన శిక్షను ప్రభుత్వం బహుశా ఊహించలేకపోయి వుంటుంది. నాయకులు కష్టాలననుభవించే అవకాశాన్నాహ్వానించడానికీ, తప్పించుకుందుకున్న అవకాశాలను సూచనలను మనఃపూర్వకంగా త్రోసిపుచ్చడానికి తగిన సమయమాసన్నమైందని నేను భావిస్తున్నాను.

నేను ఈ దృష్ట్యా ఆరోపణల పద్యను అధిక్షేపించాను. కాని వారంటే నాకు ప్రేమ లేకపోలేదు.

ఇప్పటికే చాలా అలసిపోయినాను. త్వరలోనే మిమ్మల్నికలుసుకో గలనని ఆశిస్తున్నాను. మీతో అనేకవిషయాలు మాట్లాడవలసివుంది. నే నిక్కడకువచ్చి నాలుగురోజులయింది. ఒంట్లో కాస్త నయంగావుంది; కాని ఉబ్బసం పూర్తిగా నన్ను విడిచిపెట్టలేదు; జీవితంలో యింత నీరసంగా నేనెప్పుడూలేను. బొంబాయిలో 14వ తేదీన జరుగబోయే సమావేశానికి వెళ్ళగలనో, లేనో అనుమానంగావుంది.

మీ విశ్వాసపాత్రుడు.

మోతీలాల్ నెహ్రూ.

## 20. మహాత్మాగాంధీవద్దనుంచి

[1921 డిసెంబరులో భారతదేశమున జరిగిన అసహాయోద్యమంలో పాల్గొని తండోపతండాలుగా ప్రజలు జైళ్ళకు వెళ్ళడం, ప్రథమంగా ప్రారంభమయింది. న్యాయశాస్త్రాన్ని ఉల్లంఘించారన్న ఏదో ఒక సాంకేతికమైననెపంతో వేలాదిప్రజలు జైళ్ళకు పంపబడ్డారు. మాలో చాలామందిమి మాతండ్రిగారితోసహా జైలులో వుండగా, మహాత్మాగాంధీ హఠాత్తుగా ఈ ఉద్యమోపసంహారణకు ఆదేశమిచ్చారన్నవార్త వినవచ్చింది. సంయుక్తరాష్ట్రంలోని గోరఖ్‌పూర్‌జిల్లా, చౌరీచౌరాలో, ఉద్రిక్తులైనరైతులు కొందరు, ఒక పోలీస్టేషనుపై దాడిసల్పి నిప్పంటించి, అందున్న కొంతమంది పోలీసుల్ని దహనం యిందుకుకారణమని చెప్పారు. ఒక గ్రామంలో, కొందరు ధూర్తంగా ప్రవర్తించినంతమాత్రాన, ఆకస్మికంగా ఈ మహోద్యమాన్ని ఉపసంహరించడం జైలులో వున్న మమ్మల్నందర్నీ కలవరపరిచింది. ఆసమయంలో మహాత్మాగాంధీ స్వేచ్ఛగా వున్నారు; అంటే, ఆయన జైలులోలేరు. ఆయనచర్యవల్ల మాకుకలిగిన మనస్తాపాన్ని జైలునుంచి ఎలాగో

ఆయనకు మేం తెలియచేయగలిగాము. ఇది, మహాత్మా గాంధీ ఆ సందర్భంలో వ్రాసిన ఉత్తరం. మాతో జరిపిన ఒక ఇంటర్వ్యూలో మాకు చదివి వినిపించినదానికై, నా సోదరి (ఇప్పుడు విజయలక్ష్మి పండిట్)కి ఆ ఉత్తరాన్ని యిచ్చారు.

బార్డోలి,
ఫిబ్రవరి 19, 1922

నా ప్రియమైన జవహర్లాల్,

వర్కింగ్ కమిటీ తీర్మానాలవల్ల మీకందరికీ ఎంతో మనస్తాపం కలిగిందని నేను గ్రహించాను. మిమ్మల్ని నేను సానుభూతితో అర్థం చేసుకుంటున్నాను. నా మనస్సు నాన్నగారిమీదనే వుంది. ఆయనహృదయం ఎంత క్షోభించివుంటుందో నాకు నేను ఊహించుకోగలను. మొదట ఆకస్మికంగా, అసంతృప్తి కలిగించే దెబ్బ తగిలినప్పుడు, పరిస్థితిని యథాతథంగా అవగాహన చేసుకుంటేతప్ప ఈ ఉత్తరం వల్ల ప్రయోజనం వుంటుందని నేననుకోను. దేవదాసుది యవ్వనోద్రేకం. అవివేకాన్ని మనం పట్టించుకోకుండా వుండాము. బుద్ధి సమస్థితిని కోల్పోయి. అతను ఉద్రిక్తుడై వుండవచ్చును. కాని క్రోధోద్రిక్త ప్రజాసమూహం, అసహాయోద్యమానికి సానుభూతిపరులుగా పోలీసులను కాల్చి హత్యనూ మనం కాదనలేం. ఆ ప్రజలు రాజకీయమనస్కులన్న విషయాన్నీ మనం కాదనలేం. ఇటువంటి స్పష్టమైన హెచ్చరికను నిర్లక్ష్యంచేసివుండినట్లయితే, అది ఘోరతప్పిదమై వుండేది.

ఇదివరకు జరిగినవాటిలో ఇది తృణప్రాయమైన ఆఖరిచర్య అని నేను మీకు చెప్పకతప్పదు, వైస్రాయికి నేను వ్రాసిన ఉత్తరం, దాని భాష ఎంత సుస్పష్టంగావున్నా, కొన్ని అపోహలకు తావీయకపోలేదు. మద్రాసులో జరిగిన సంఘటనలకు నా మనస్సు వికలమైంది; కాని అంతరాత్మ హెచ్చరించినా, నేను అది పాటించలేదు. దోషం ప్రభుత్వానిదెంతమాత్రం కాదని, రాను రాను మన ప్రజలు బెదిరింపులతో కయ్యానికి కాలుదువ్వారని, ఎవరి అదుపులోనూ వుండక, వారు, అహింసాసూత్రాలకు విరుద్ధంగా ప్రవర్తించారని, కలకత్తా, అల్లాహాబాద్, పంజాబులనుంచి

చాలామంది హిందువులు ముస్లిములు కూడ, నాకు ఉత్తరాలు వ్రాశారు. ఫిరోజ్‌పూర్ జిల్లా సంఘటన ప్రభుత్వానికి అప్రతిష్ఠాకరమైనదయినా, మనంమాత్రం పూర్తిగా నింద్యార్హులం కాకపోము. బెరేల్లీ గురించి హకీమ్జీ ఫిర్యాదులుచేశారు. జజ్జార్‌ను గురించి నేను పేర్కొనవలసిన దోషాలు చాలా వున్నాయి. షహజాన్‌పూర్‌లో సైతం పుంమందిరాన్ని బలవంతంగా స్వాధీనంచేసుకోవాలనే ప్రయత్నం కొనసాగింది. కనోజ్‌లోకూడా వలంటీరుకుర్రవాళ్ళు కట్టుతప్పి, దూర్తంగా హైస్కూలువద్ద పికెటింగు చేస్తూ పదహారేళ్ళలోపు పిల్లల్ని పాఠశాలకు వెళ్ళకుండా నిరోధిస్తున్నారని. కాంగ్రెసు కార్యదర్శి స్వయంగా తంతియిచ్చాడు. వలంటీర్లుగా 36000 మంది చేరారు; కాని వీరిలో వందమందికూడా, కాంగ్రెసు ప్రతిజ్ఞాపత్రాన్ని లక్ష్యపెట్టలేదు. కలకత్తాలో స్థితి తారుమారుగా వుందని, వలంటీర్లు విదేశవస్త్రాలను ధరిస్తున్నారని, ఎంతమాత్రం అహింసా సిద్ధాంతానికి కట్టుబడివుండలేదని జమ్నాలాల్జీ నాతో చెప్పారు. ఇవేకాక ఇలాంటిఅనేకవార్తలు దక్షిణాదినుంచి నాకు చేరగా, చౌరీచౌరా వార్త తుపాకీమందువలెవున్న వీటిపై అగ్గిపుల్లగీసింది; దానితో అది పగిలింది; మంట లేచింది. ఇంతటితో దీన్ని మనం ఆపివుండకపోయినట్లయితే, అహింసాయుత పోరాటంకాక, మనం ప్రధానంగా హింసాయుత పోరాటాన్ని నడిపినవాళ్ళమౌతామని నేను నిస్సందేహంగా మీకు చెప్పగలను. అహింసా సిద్ధాంతం గులాబీ అత్తరువవలె, దేశం నలుమూలలా పరిమళిస్తున్నమాట ముమ్మాటికీ నిజం. కాని హింసాసిద్ధాంతం దుర్గంధం యింకా హెచ్చువ్యాప్తిలోనే వుంది. అది లేనట్లు అనుకోవడం, దాన్ని తక్కువగా అంచనావేయడం తెలివితక్కువపని. ఈ తిరోగమనంవల్ల మన ఉద్యమం పురోగమిస్తుంది. ఉద్యమం యిప్పుడు అనుకోకుండా తప్పుదారిబట్టింది. మనం తిరిగి మన మామూలుచోటుకి వచ్చేశాం; మళ్లీ అక్కడినుంచి అంగలువేసుకుని తిన్నగా, బయలుదేరి వెళతాం. సంఘటనలను వాటి సంబంధసాపేక్ష్యాన్ని వివేచించగల అనువైన స్థితిలో నేనున్నాను. మీరు అట్టి అనువైనస్థితిలో లేరు.

దక్షిణాఫ్రికాలో నా అనుభవమేమిటో మీకు నేను చెప్పనా? అక్కడ జైళ్ళలో మేం వుండగా, అనేకరకాల వార్తలు మాకు ఎలాగో చేరుతూవుండేవి. వీటిని వినడానికి మొదట నాకు రెండుమూడురోజుల పాటు ఆసక్తి కలిగింది. కాని తరవాత, ఇలాగ చాటుమాటున చేరే వార్తలపట్ల కుతూహలంచూపడం వ్యర్థమని వెంటనే గ్రహించాను. నేనేమీ చేయలేకపోయాను; ఉపయోగకరమైన సూచనలను పంపలేక పోయాను. కాని నాఆత్మనుమాత్రం నేను క్షోభపెట్టుకున్నాను. జైల్లోవుండి ఉద్యమాన్ని నడపడం సాధ్యంకాదని నేను తెలుసుకున్నాను. అందు వల్ల బయటవున్నవారిని కలుసుకునేవరకూ, వారితో సాకల్యంగా మాట్లాడేవరకూ నేను వేచివున్నాను. అప్పుడుకూడా, కేవలం విషయాలనుతెలుసుకోవాలని మాత్రమే, నేను కుతూహలపడ్డానంటే నా మాట నమ్మండి. ఏమీఅంటే, వాటిని తెలుసుకోవడంవరకేతప్ప, అంతకు మించి వాటిని బేరీజువేసి తీర్పుచెప్పడం నాకు ధర్మంకాదనిపించింది. ఈ భావం ఎంతసరియైనదో, తరవాత నేను గ్రహించాను. జైలులో వున్న పుడు నాకుగల భావాలు ప్రతిసారి, జైలునుంచియివతలకురాగానే. స్వయంగా నాఅంతటనేను సమాచారాన్ని తెలుసుకున్నతరువాత. మారి పోతూవుండేవి, కారణమేమైనప్పటికీ, పరిస్థితుల సమగ్రస్వరూపాన్ని జైలువాతావరణం మీకు తెలియచేయదు. కనుక, మీరు బాహ్యప్రపం చాన్ని పూర్తిగా విస్మరించాలని, దాని అస్తిత్వం లేనట్లుగా పరిగణించా లని నేను మిమ్మల్ని కోరుతున్నాను. ఇలా పరిగణించడం చాలా కష్ట మైనపని అని నాకు తెలుసు; కాని నిరంతర గ్రంథపఠనంవల్లనో, శరీరశ్రమయందో, ఇది సాధ్యపడుతుంది. అన్నింటిమాటకేం, మీరేం చేయండి, రాట్నమంటేమటుకు చిరాకుపడకండి. ఏవేవో పనులు చేశామని, వేటినో విశ్వసించామని, మీరూ, నేనూ మనమీదమనం ఒకవేళ చిరాకుపడితే పడవచ్చును; కాని రాట్నంమీద మనం సంపూర్ణ విశ్వాసముంచామనో, లేదా, మాతృదేశంకోసం, రోజు కొన్నిగజాల నూలు వడికామనో, మనం విచారించడానికి మాత్రం ఆవగింజంత ఆస్కారంలేదు. మీకు భగవద్గీత వుండనేవుంది. ఎడ్విన్ ఆర్నాల్డు

యొక్క అనుపమానువాదాన్ని మీకు నే నందివ్వలేను కాని, సంస్కృత మూలానికి ఇది యథానువాదం; ఇందులో శ్రమ నిష్ఫలమన్న ప్రసక్తి లేదు. ఇందులో వినాశనం అసలేలేదు. ఈ ధర్మం ఏమాత్రం నిర్వర్తించినా అది అతనిని గోతిలోపడనీయక రక్షిస్తుంది. "ఈ ధర్మం" భగవద్గీతలో కర్మయోగానికి సంబంధించినట్టిది. ఇక మనయుగపు కర్మయోగం రాట్నం. ఇదివరకు ప్యారీలాల్ ద్వారా నా కొంత ఘాటైన ఉత్తరాన్ని పంపించాడు; ఇప్పుడలాగకాక, మీరు ఉల్లాసకరమైన జాబును వ్రాయాలని కోరుచున్నాను.

మీ విశ్వాసపాత్రుడు,
ఎం. కె. గాంధీ.

నా ప్రియమైన స్వరూప్,

ఈ నా ఉత్తరం లక్నోలోవున్న నిర్బంధితులకు ఏమైనా ఊరట కలిగిస్తుందని మీకు తోస్తే, ఈసారి మీరు జవహర్లాలును కలుసుకున్నపుడు. దయవుంచి, ఆయన కిది చదివివినిపించండి. అక్కడి పరిస్థితి ఏరూపుదాలుస్తున్నదో నాకు తెలియచేయండి. మీ రెవరో ఒకరు. ఢిల్లీ వస్తున్నారని ఆశిస్తున్నాను. నాన్నగారు మీకు వ్రాసిన ఉత్తరాలలో ఒకదానిని, చదవడానికి, రంజిత్ నాకు పంపించారు.

మీ,
బాపు.

బార్డోలి,
20-2-1922

మీ చిరునామాకు ఉత్తరాలు వ్రాస్తే, బహుశా అవి ఆలస్యంగా మీకు అందవచ్చునని ప్యారీలాల్ నాతో అన్నారు. అందువల్ల, దీనిని మర్గిద్వారా మీకు పంపిస్తున్నాను.

## 21 సరోజినీనాయుడువద్దనుంచి,

తాజ్‌మహల్ హోటల్,
బొంబాయి, జూన్ 13, [? 1923]

ప్రియమైన జవహర్,

ఆశీస్సులు! ఈ తుపానును మనం ధైర్యంతో తట్టుకుందాం; మనకృషిని ఒకయుద్ధంగా, మన శాంతిని విజయంగా రూపొందించాలన్న సలహాను పాటిద్దాం. దానిని నెరవేరుద్దాం. బక్రీదునుగురించి నిండు * సమావేశం జరగాలన్న అభిప్రాయం చాలా యోగ్యంగావుందని నేననుకుంటున్నాను; సమావేశం అనేక కారణాలవల్ల, నాగపూర్‌లో కాకుండా, అల్హాబాద్‌లో జరగాలని నా అభిప్రాయం. ఖిలాఫత్, కాంగ్రెస్ కార్యవర్గ సమష్టిసమావేశం జరపాలన్న యోచన ఒకటుంది.

నాగపూర్ సత్యాగ్రహం చక్కటి నిర్మాణపద్ధతులమీద కొనసాగుతోంది; కాని స్థానికప్రజలు అందులో పాల్గొనడంలేదు. అదే ఉన్నలోపమల్లా. ఈదృష్ట్యా చూస్తే, ఇంతకన్న, జబల్‌పూర్ సత్యాగ్రహం, ఎక్కువ చిత్తశుద్ధితో నడుస్తోంది; ఎవరైతే మొదట దానిని ప్రోత్సహించారో, అధికారికంగా 15000 రూపాయలిచ్చి మద్దతునిచ్చారో, వారే దానిపై శీతకన్నువేశారు; కుంటుపరిచారు. ఏమైనప్పటికీ, పురమందిరంవద్ద సాగుతున్న సత్యాగ్రహాన్ని 20వ తేదీనాటికి విరమించవలెనని నేను వారిని కోరాను. పాతకార్యవర్గ ఆదేశానుసారం, వారు ఈ చర్యను నడిపిస్తున్నారన్నభావంతో వారికి కొన్నిహామీలనీయడం సంభవించింది. ఈదృష్ట్యా వెనువెంటనే సత్యాగ్రహాన్ని ఆపివేయవలసిందిగా వారిని ఆజ్ఞాపించడం సమంజసంకాదు.

---

* శ్రీమతి సరోజినీనాయుడు జాబులను పోల్చుకుని చదవడం చాల కష్టం. అందుకని, మేం, ఆమె కుమార్తెలు పద్మజనాయుడు, లీలామణినాయుడుల సహాయాన్ని అపేక్షించవలసివచ్చింది. ఇక్కడ "నిండు" అనే పదం, అంత సాభిప్రాయప్రయోగం కాదు; కాని ఇంతకంటె సరియైనపదాన్ని మేమెవరమూ సూచించలేకపోయినాము.

ఎవరి ఆత్మను వారు శోధించుకోవాలన్న ఋజుమార్గాన్ని. వృద్ధులు రాజగోపాలాచారి అతిక్రమించి విస్మయకరంగా ప్రవర్తిస్తున్నారు ॥

ఇక్కడ దాదాపు స్వరాజ్యపక్షం అంతమౌతున్నట్లే. పటేలు, స్వరాజ్యపక్షానికి పోటీగా కొందరభ్యర్థుల్ని నిలబెడుతున్నట్లు విన్నాను. సి. ఆర్. దాసు, దక్షిణాదిలో తన ఉపన్యాసాలవల్ల వ్యవహారాలను ఎంతో గడబిడచేస్తున్నారు।

ఎన్ని అవాంతరాలొచ్చినా — సమన్వయాన్ని సాధించగలిగే అమృతం లభించేవరకు మనం సముద్రాన్నిమథిద్దాం — ఈలోపున క్రిమి వెల్లువను అరికడదాం. అల్లా అనుగ్రహిస్తే మనం దానిని అరికట్టితీరుతాం। సోదరప్రేమతో.

సోదరి సరోజిని.

22 మహాదేవ దేశాయ్ వద్దనుంచి

డెహన్, వయా సూరత్,

జూలై 5, 1923

నా ప్రియమైన జవహర్లాల్,

మీరు ప్రేమాభిమానాలతో వ్రాసిన సుదీర్ఘమైనలేఖ అందింది. మీకు సమాధానం వ్రాయడానికి బదులుగా, మిమ్మల్ని నేను కలుసుకోవాలని, మీతో కాస్సేపు కలివిడిగా మంచీచెడ్డా మాట్లాడాలని, అనుకున్నాను. కాని అలాగ జరిగిందికాదు. మా నాన్నగారు 2వ తేదీన హఠాత్తుగా గుండె ఆగి, మరణించారు. అప్పుడు నేను ఆశ్రమంలో వున్నాను. ఆయన తుదిఘడియలలో వారిచెంత వున్నాననే సంతృప్తి నాకు లేకపోయింది. అది నా దురదృష్టం. తండ్రి అంటే ఆయనే అని చెప్పుకోతగ్గ తండ్రి యథార్థవాత్సల్యాన్ని చూరగొన్న మీరు నా దుఃఖాన్ని ఊహించుకోగలరనుకుంటాను. ఆయన, నన్నావిధంగా ప్రేమించడంవల్ల, నేను గత ఆరేడేళ్ళలో నాయిష్టమొచ్చినపనిని నేను చేయగలిగాను. ఇంటి వ్యవహారాలు నన్ను కలతపెట్టనీయక, వాటిని ఆయనే చూసుకుంటూ,

నన్ను నా యిష్టమొచ్చినరీతిని సంతోషపూర్వకంగా మసలనిచ్చారు. మిమ్మల్ని, పండిట్జీ ప్రేమిస్తున్నట్లుగానే, నన్ను ఆయ నెంతగానో ప్రేమించారు; నేను అల్పుణ్ణి; పనికిరానివాణ్ణి. ఆయన కెప్పుడూ నేను సేవచేసినపాపానపోలేదు. ఆయనే నాకోసం కష్టపడ్డారు. ఆయన శ్రమఫలితాన్ని నే ననుభవించాను. ఆయనఋణాన్ని తీర్చుకోలేకపోయాను. నన్ను భగవంతు డెలాగ క్షమిస్తాడు ? ఇలాంటి భావాలు నన్ను కలవరపెడుతూవుంటే, నాకు పండిట్జీ జ్ఞాపకంవచ్చారు; ఆయన కొక చిన్న ఉత్తరం వ్రాశాను; అస్వస్థులుగావున్న ఆయన కీ ఉత్తరం చిరాకు కలిగించదని మీకుతోస్తే దీన్ని ఆయనకు పంపించండి.

రాజకీయాలను గురించి ఆలోచించే గట్టితనం నాకు లేదు; తమ అభీష్టానుసారం, రాష్ట్రాలు నడుచుకోవచ్చునన్న స్వేచ్ఛను యిచ్చినట్లయితే, చాలామటుకు, చిక్కులు విడిపోతాయని నా అభిప్రాయం. నాగపూర్ విషయం మీరేంచేస్తారో నాకు తెలియదు; కాని మీ రొక నిశ్చితమైన దృక్పథాన్ని అవలంబిస్తారని నా నమ్మకం.

అత్యంతప్రేమతో,

ప్రేమగల మీ
మహాదేవ్.

23. మహాదేవదేశాయికి

ఆగష్టు 1923

నా ప్రియమైన మహాదేవ్,

అదేమిచిత్రమో, మనం వ్రాయాలని మనసారా కోరుకుంటున్న ఉత్తరాలు, సాధారణంగా ఆలస్యంగా వ్రాస్తాము. వ్యవహారధర్మాలకు సంబంధించిన మామూలు ఉత్తరం యిట్టే వ్రాసి పంపించివేస్తాము; మనం వ్రాయాలి వ్రాయాలనుకుంటున్న ఉత్తరం యింకా వ్రాయకుండా అలాగే వుండిపోతుంది. నేను నాగపూర్లోవుండగా ఆగష్టు 6వ తేదీనో, 7వ తేదీనో, హృదయాన్నికలచివేసే మీ ఉత్తరం నా కందింది. నాటినుంచి ప్రతిరోజు మిమ్మల్ని నేను జ్ఞాపకంచేసుకుంటూనేవున్నాను. మీ నాన్నగారు పోయారన్నవార్త, రైలుదిగీదిగడంతోటే, నాకు నాగపూర్లో

తెలిసింది. రామదాసు నాకీ విషయం తెలియచేశారు. నా హృదయం కలవరించింది; మీకుకలిగిన ఆపదకు నాకెంతో దుఃఖంకలిగింది. మీరెంతటి దిగులుపడుతున్నారో నాకు తెలుసును. అనేకపొరపాట్లు దోషాలు చేసిన మాలో కొంతమందిమి, లోకసంశివల్ల, బాగా మొండికెత్తిపోయాము. కాని, మీ మీ అమాయికత్వంవల్ల, అవి అత్యంత కష్టతరమైనవిగా గోచరిస్తున్నాయి. మీ హృదయక్షోభను, ఆత్మనివేదనను నేను అర్థంచేసుకోగలను.

అపారమైన పితృప్రేమను పొందే అదృష్టం నాకూ కలిగింది. పుట్టినదిమొదలు నాపై మా తండ్రిగారుచూపిన ప్రేమకు, శ్రద్ధకు తగినట్లుగా, నేను, ఆయనఋణం తీర్చుకుంటున్నానా అని నన్ను నేను ప్రశ్నించుకునేవాడిని. ఈప్రశ్న నన్ను తరుచు ఎదుర్కొనేది. నేను సిగ్గుపడుతూవుండేవాడిని. ఒకొక్కప్పుడు, జటిలమైనప్రశ్న లుత్పన్నమౌతూవుండేవి; నేను బాధపడేవాడిని; మనస్సు కష్టపెట్టుకునేవాడిని. అప్పుడేంచేయాలో నాకుబోధపడేదికాదు. సత్యాగ్రహసభకుపూర్వం, ఆ రోజుల్లో నామనస్సులోరేగిన సంక్షోభం అంతా ఇంతాకాదు; అదిభరించడం ఎంతోకష్టమైపోయింది; అప్పుడు బాపూ నాకిచ్చినసలహా నే నెన్నడూ మరచిపోను. ఆయనఉపశమనవాక్యాలు నా కష్టాలను తగ్గించి, నాకు మనశ్శాంతిని ప్రసాదించాయి. 1919 మార్చిలో ఢిల్లీలో ప్రిన్సిపాల్ రుద్రా ఇంటిలో మనం మొట్టమొదటిసారి కలుసుకున్న నాటిరోజులు మీకు జ్ఞాపకంవున్నాయనుకుంటాను. మనం—బాపూ, మీరూ, నేను, ఆ చిన్న డాక్టరూ అలహాబాదువరకు ప్రయాణంచేశాం; ఒకటి రెండు రోజులతరవాత మీరు లక్నోకో, కాశీకో కాబోలు వెళ్ళారు; బాపూ కోరిన ప్రకారం ప్రతాపఘర్ వరకు నేను మీవెంట వచ్చాను. ఆయనా, నేనూ చాలాసేపు మాట్లాడుకున్నాం. ఆయనతో అంతసేపు సాకల్యంగా ప్రసంగించడం నాకదేమొదటిసారి. ఇదిజరిగి నాలుగేళ్ళయింది; కాని ఎన్నోఏళ్లా పూళ్ళా గడిచిపోయినట్లనిపిస్తోంది!

మీనాన్నగారిని కలిసేభాగ్యం నాకులేకపోయింది.కాని సివిల్‌వార్డులో మా చిన్నతోటలో ఒకసారి మనం కలుసుకున్నపుడు, మీరు, నాతో వారిని

గురించి కొంతసేపు ముచ్చటించారు. మీవంటి సుపుత్రుడు కలిగినందుకు ఆయ నెంత గర్వించివుంటారో, తనుపడినశ్రమ ఫలించినందుకు ఆయన ఆత్మ ఎంత సంతృప్తిపడివుంటుందో, నేను వూహించుకోగలను; కాని మీరే మీ మనస్సును అనవసరంగా ఖేదపెట్టుకుంటున్నారు. మీ నాన్నగారు మీకుబోధించిన సేవాధర్మాన్ని మీరు లోకంపట్ల పాటించి ఇతరులకు మీ రాదర్శప్రాయులయారు; దేశాన్ని సేవించడానికిబదులుగా, మీరు మీశక్తినీ మీ కాలాన్ని సంకుచిత గృహవ్యవహారాలకోసం వినియోగించాలని ఆయన ఎన్నడూ అభిలషించివుండరు. మానసికంగా నేను అలసి పోయాను; నా మనస్సు వ్యాకులపడుతోంది. నాగపూరులనుభవం నా కెంతో బాధకలిగించింది. మనస్సు తేటపడేటందుకు, మనుష్యులకు దూరంగా కొంతకాలంపాటు యిక్కడ తిరుగాడాలని నే నీప్రాంతాలకు వచ్చాను. కాని మానాన్నగారికి జబ్బుతిరగపెట్టడంవల్ల, నేనలావుండలేక పోతున్నాను. దూరంగావుండాలన్న మనఃస్థితి నా స్వభావానికి విరుద్ధం; అయినా ఆ భావాన్ని మెల్లమెల్లగా, నేను అలవర్చుకున్నాను, కాని ఇప్పుడు దానిని ఒదిలించుకున్నాను.

జవహర్లాల్

24

[1923లో నాభా సంస్థానప్రభుత్వం నన్ను హఠాత్తుగా అరెస్టుచేసింది; తరువాత నామీద కుట్రకేసుతోసహా అనేక నేరాలను ఆరోపించింది. ఈ వార్త విని మా నాన్నగారు నిర్విణ్ణులయ్యారు. ఆరోజుల్లో స్వదేశసంస్థానాల ప్రభుత్వాలు ఏ చట్టప్రకారం పరిపాలించేవో ఎవరికీ తెలిసేదిగాదు. అవి అనుసరించే చట్టాలు "ఇవి" అని చెప్పడానికి ఆస్కారంవుండేదిగాదు. అందువల్ల మా నాన్నగారు మరీ గాభరాపడ్డారు. నేను జైల్లో వుండగా, నన్ను ఆయన చూడడానికి వచ్చారు; నన్ను విడుదల చేయించాలని ఆతురతపడ్డారు. ఇందుకు నేను కలవరపడ్డాను,

ఆయన, అనుగ్రహించమని ప్రభుత్వాన్ని కోరడం నా కెంత మాత్రం ఇష్టంలేదు.]

సెప్టెంబరు 28, 1923

నా ప్రియమైన జవహర్,

నిన్నటి నా రాక నీకు కాస్త మనశ్శాంతినివ్వడానికి బదులు జైలుజీవితంలో నీకున్న ఆ కొద్దిపాటి ప్రశాంతతను భగ్నపరచిందని గ్రహించి నేను చాలా బాధపడ్డాను. నే నెంతో ఆతురతతో దీర్ఘంగా ఆలోచించినపిమ్మట నా కొక నిశ్చితాభిప్రాయం కలిగింది. నిన్ను చూడడానికి మాటిమాటికి నేను రావడంవల్ల నాకూ ప్రయోజనంలేదు; నీకూ ప్రయోజనంలేదు. నువ్వు అరెస్టుఅయినతరువాత నేను చేసిన పనులకు భగవంతునిఎదుట, మానవునిఎదుట శుద్ధాంతఃకరణలో నేను నిలబడగలను: కాని నువ్వు మరోవిధంగా భావించినట్లయితే పరస్పర విభిన్న దృక్పథాలను కలపడానికి ప్రయత్నించిలాభంలేదు.

నేను వ్రాసుకున్న నోట్సును కపిల్ చేతికిచ్చి నీకు పంపిస్తున్నాను: వీటిలో కొత్త ఏమీలేదు; కాని ప్రస్తుత నా మానసికావస్థలో నే నింతకంటే ఎక్కువ చేయలేకపోయాను. కపిల్ నాకు ఏ సమాచారం పట్టుకు రాగలిగితే దానిలోనే నే నిప్పుడు సంతృప్తిపడతాను. ప్రస్తుతానికి నే నేంచేయాలో నాకు బోధపడటంలేదు; ఇక్కడ నేను రెండు మూడురోజులపాటుంటాను. నా గురించి నువ్వేమీ ఆందోళనపడకు. నువ్వు జైల్లో ఉన్నట్లుగానే, నేను బయట హాయిగా వున్నాను.

ప్రేమగల నీ,
తండ్రి.

నీకు నేను ఈ ఉత్తరం కోపంతోనో, విచారంతోనో వ్రాసినట్లుగా నువ్వు భావించకు. ఆచరణసాధ్యమైన ప్రశాంతచిత్తంతో పరిస్థితిని అవలోకించాలని ఇంచుమించు ఒకరాత్రల్లా యోచించి నేను నిశ్చయించుకున్నాను. నువ్వు నా మనస్సును నొప్పించావని ఎన్నడూ భావించకు,

మన యిద్దరి అపుపులోనూ లేని పరిస్థితి దానంతటదే వచ్చి మనమీద పడింది.

మో. క.

25 లాలా లజపతిరాయ్‌వద్దనుంచి

తిలక్ రాజకీయపాఠశాల,
లాహోరు,
నవంబరు 19. 1923

నా ప్రియమైన జవహర్లాల్.

నీ ఉత్తరం అందింది. రాంక్‌నాథ్‌దాస్ వ్రాసిన ఉత్తరం చదివాను; అది నీకు పంపుస్తున్నాను. అతని సూచనలు కొన్ని బాగున్నాయి; అవి కాంగ్రెసునాయకులు ఆలోచించతగినవే. కాకినాడ మహాసభలోనో అంతకుముందో, వాటిని ఆలోచించడానికి అవకాశం కలుగుతుందని ఆశిస్తున్నాను. అకాలీ రక్షణసమితిని గురించి మీ నాన్నగారు, వారితో ఏమి ఏర్పాట్లుచేశారో అకాలీదళనాయకులనుంచి నా కింతవరకు ఎట్టి సమాచారం అందలేదు; వారివద్దనుంచి సమాచారం అందేవరకు యిందు విషయమై నే నెట్టిచర్యనూ తీసుకొనేందుకు సంకల్పించుకోలేదు. నా శరీరం అంత దారుఢ్యంగా లేదు. కొన్నాళ్ళలో నేను హఠాత్తుగా చనిపో వచ్చు. నువ్వు నిర్దేశించుకున్న కార్యక్రమం నేను గమనించాను; దానికి నా అభ్యంతరంలేదు. నువ్వు నీ ఆరోగ్యాన్ని జాగ్రత్తగా కాపాడుకుంటా వని ఆశిస్తాను; తన ఆరోగ్యాన్ని తాను నిర్లక్ష్యంచేస్తున్న నావంటి వ్యక్తి ఇలాంటి సలహాయివ్వడం అంత సముచితంగా ఉండదేమో!

నీ విశ్వాసపాత్రుడు,
లజపతిరాయ్.

26 మా. మహమ్మదాలీవద్దనుంచి

[ప్రఖ్యాతివహించిన అలీసోదరులిద్దరిలో మౌలానా మహమ్మదాలీ ఒకరు; వీరిద్దరూ భారతదేశంలో ఖిలాఫత్ ఉద్యమానికి నాయ

కులు. 1920 ప్రాంతాల్లో భారతదేశంలో జరిగిన అసహాయోద్యమంలోనూ, జాతీయోద్యమంలోనూ, అలీసోదరులు అత్యంత ప్రముఖమైన పాత్రను నిర్వహించారు. వీరిలో మౌలానా షౌకతాలీ పెద్దవారు. ఆయన వ్రాసిన ఉత్తరాలు ఈ గ్రంథంలో ముందు పొందుపరచబడ్డాయి. మౌలానా షౌకతాలీ ఆజానుబాహుం; దృఢశరీరుడు. ఆయన్ని అందరూ, "పెద్దన్నయ్య" అని పిలిచేవారు.]

ఫెయిరీ విల్లా,
ఖొవాలీ, యు. పి.,
(తేదీలేదు —? 1923)

నా ప్రియమైన జవహర్,

నా విడుదలఅనంతరం నా స్వరాష్ట్రంలో జరిగిన ప్రప్రథమరాజకీయమహాసభకు నేను హాజరుకాలేకపోయానని. నే నెంతదిగులుపడ్డానో మీకు చెప్పలేను; నాకేమాత్రం అవకాశమున్నా నేనుకూడా మీతోపాటు పాల్గొనివుండేవాడినని నా తంతివల్ల మీకు బోధపడివుంటుంది. ఢిల్లీనుంచి నేను తిరిగివచ్చాక నా ఒంట్లో బొత్తిగా బాగులేదు: చాలారోజులు జ్వరంతో తీసుకున్నాను. ముందు అనుకున్న ప్రకారం అక్టోబరు ఒకటవ తారీఖున నేను ఆల్మోరా వెళ్ళలేకపోయాను. నేను కొద్దిగా కోలుకున్న తరువాత ఆల్మోరాసంఘటన ఈ అసహాయోద్యమకేంద్రానికి నన్ను తీసుకువచ్చింది. నేను, నా పాతస్నేహితులు సర్ విలియం "మారిస్"ను (మారీస్) నిమిపెస్స్వలె అనుసరించవలసివచ్చింది.

నేను ఢిల్లీలోవుండగా నా కుమార్తెశరీరఉష్ణోగ్రత బాగా తగ్గిపోయింది. అప్పుడు ఇక్కడ వాతావరణం మధ్యాహ్నం నూరుడిగ్రీలు, సాయంకాలం నూటరెండు డిగ్రీలు ఉండేది. నే నింక రెండురోజులకు వస్తాననగా వాతావరణం చల్లబడిపోయింది. తత్ఫలితంగా పదిరోజుల్లో క్రమేపీ వాతావరణం తిరిగి నూటమూడు డిగ్రీలకు పెరిగింది. 5వ తేదీ నుంచి అమీనా క్రమక్రమంగా కోలుకుంటోంది. ఇప్పు డామెదేహ

ఉష్ణోగ్రత. మధ్యాహ్నం నూరు; సాయంకాలం 101.4 డిగ్రీలుఉంటోంది. అక్టోబరులో ఆమెఆరోగ్యం బాగుపడుతుందని ఆశిస్తున్నాను; ఈ వారా వరణంలో జాగ్రత్తగా ఆమెకు ఉపచర్యచేసి ఈ నెలల్లా ఆమెవెంతనే కనిపెట్టుకొని ఉండాలనుకొంటున్నాను—"దీపం ఉండగానే ఇల్లు చక్క బెట్టుకోవాలిగదా!" కాని ఈలోపుగా షౌకతాలీ ఏ క్షణంలోనైనా జైలు నుంచి విడుదలకావచ్చును; అప్పుడు నేను ఇక్కడినుంచి బొంబాయిరాష్ట్రా నికి బయలుదేరవచ్చును. అక్టోబరు 31వ తేదీలోపున షౌకతాలీ జైలు నుంచి విడుదలకాకపోతే నేను నవంబరు 7వ తేదీవరకు బొంబాయి రాష్ట్రంలోనే వుంటాను. నే నిక్కడినుంచి వెళ్ళడం అమీనాకు ఇష్టం లేదు. అది సహజమేగద. 17, 18 తేదీలలో నేను జలంధర్ వెళ్ళడానికి ఆమె ఎంతో కష్టంమీద అనుమతించింది. నే నిక్కడనుంచి జలంధర్‌కి 15వ తేదీన బయలుదేరాలనుకున్నాను. కాని మౌలానా అబ్దుల్‌బారీ నేను లక్నోవరకు వెళ్ళనక్కరలేదని ఇక్కడికివచ్చి నన్ను రెండుసార్లు వారించాడు. ఇప్పుడు నేను 14వ తేదీన భోవాలీనుంచి లక్నోకు బయలు దేరాలనుకుంటున్నాను. అక్కడినుంచి 16వ తేదీన జలంధర్‌కు బయలు దేరుతాను. ఆరోజునే పంజాబ్ మెయిల్‌లో మీరు నన్ను విధిగా కలుసు కోవాలి. మనం మాట్లాడుకోవలసినవీ, నిర్ణయించుకోవలసినవీ చాలా ఉన్నాయి.

గత్యంతరంలేక నేను మహాసభకు హాజరుకాలేకపోయానని, అందు కెంతో విచారిస్తున్నాననీ దయవుంచి వారికి తెలియజేయండి. మీతోపాటు నే నక్కడవుంటే, నమ్మండి, నేను వెనుకంజవేసేవాడినికాను; సంయుక్తరాష్ట్రం "ఐకమత్యములేని రాష్ట్రమన్న" అపప్రథను మీ మహా సభ తొలగిస్తుందని నేను విశ్వసిస్తున్నాను. బలోపేతమైన, అత్యున్నత మైన సంఘటన. భారతజాతీయసంఘటనయొక్క సందేశాన్ని రాష్ట్రా

..57

కాంగ్రెసు అసెంబ్లీ—పవిత్రస్థలం—కాశీనగరంనుంచి దేశమంతటికీ అందించుగాక! బ్రిటిషుసామ్రాజ్యవాదపాదాలక్రిందపడి నలిగిపోతున్న అశేష పీడితమానవాళిని సుసంఘటితపరిచే సందేశాన్ని అది అందించు గాక! ఒక్కొక్కరి శారీరిక మానసిక బానిసత్వంనుంచి మన మాతృదేశవిముక్తి కోసం మనం దురభిమాన, అసహన సంకుచితత్వాలను ఈ సమావేశంలో దహితమైనప్పుగాని విశుద్ధాత్ములమై అప్రతిహతంగా పురోగమించెదము గాక! భగవంతుడు మీ కృషిని జయప్రదమొనర్చుగాక! భగవంతుని అనుగ్రహంవల్ల నూతనధైర్యమూ, విజయాన్నిచేపట్టే దృఢచిత్తమూ మనకు చేకూరుగాక. కాశీలో అప్పటి పవిత్రత ఏమైనా మిగిలివుంటే, భక్తిప్రపత్తులతో, అలౌకికస్ఫూర్తితో, మనం మన నాయకోత్తముడు గాంధీజీ ఆదేశానుసారం కృషిని తిరిగి ప్రారంభిద్దాం. భారతదేశ విముక్తికి, వాస్తవానికి, సర్వమానవుల విముక్తికి అది ఒక్కటే మార్గం.

అందరికీ ప్రేమతో, నీకు నా ముద్దులతో,

ప్రేమతో నీ,
మహమ్మదాలీ.

27 మహమ్మదాలీవద్దనుంచి

భొవాలీ, యు. పి.,
నవంబరు 7, 1923

నా ప్రియమైన జవహర్,

ఒకటవ తారీఖున మీరు వ్రాసిన ఉత్తరానికి, నా ధన్యవాదాలు. జలంధర్, అమృతసర్, ముఖ్యంగా, లాహోరులో "నాయకులు" చెప్పరానంత సంకుచితస్వభావంతో ప్రవర్తించారు; మీరు సమావేశాలకు రాకపోవడం మాకెంతో వెలితనిపించింది. న్యాయవాదులు తమ వృత్తిని విడిచిపుచ్చాలని ఆనాడు పట్టుబట్టిన "సహాయ నిరాకరణవాదులు" హిందువులకు, ముస్లిములకు సహకారమంత్రి (ఈయన ఒక ముసల్మాను) ప్రత్యేకించిన పదవుల శాతాన్నిగురించి ఈనాడు కీచులాడుకుంటున్నారు.

ఒక్కసింహాసనంలో, తదితరు రేకొద్దిమందిలోనో. గాంధీజం అంటో ఇంతో వున్నట్లు కనిపిస్తుందేతప్ప, ఈ లాహోరు నాయకులలో, అది అణుమాత్రమైనా వున్నట్లు నాకు కనిపించదు; అయినప్పటికీ, ఘటిత పంజాబు రాష్ట్రం భారతదేశప్రజలకు ఆవేశమిచ్చింది. నిజంగా, పంజాబు ఎప్పటికీ నా కొక సమస్యగానే వుంటున్నది. సమయమాసన్నమైనపుడు, సాహసాన్ని ప్రదర్శించే పంజాబీలు, భారతదేశంలోవున్న బ్రిటిష్‌వారి సైన్యాలలో అత్యధిక సంఖ్యాకులుగా చేరిన ఆ ధైర్యవంతులు, ఏమాత్రం అపచారానికైనా యిట్టే కోపోద్రిక్తులయే పంజాబీలు, ఒకప్పుడు బ్రిటిష్‌వారు తమకుచేసిన అవమానాలను, ఇంత త్వరగా ఎలాగ మర్చిపోగలిగారో, ఇప్పుడు తమలో తాము ఎలాగ కీచులాడుకోగలుగుతున్నారో నా కర్థంకాకుండావుంది. సిక్కుల సమస్యను చర్చించేటందుకై, అమృతసర్‌లో వర్కింగుకమిటీ సమావేశాన్నేర్పాటుచేయమని మేం వెంకటప్పయ్యను కోరాము, పంజాబు, యు. పి. లలో జరిగిన మత కలహాలనుగురించికూడా మనం నిస్సందేహంగా చర్చిస్తాము. మీరు, సమావేశానికి రావడం అత్యవసరం. మీ కానాటికి మళ్ళీ ఒంట్లో సుస్తీ చేస్తే మాత్రం, నేను మిమ్మల్నెన్నటికీ క్షమించేదిలేదు. ఆరోగ్యం జాగ్రత్తగా కాపాడుకొని, అమృతసర్ సమావేశానికి విచ్చేసి, సముచిత నిర్ణయాన్ని గైకొనేందుకు మాకు, మీరు తోడ్పడండి: నేను 12వ తేదీన లక్నో మెయిల్‌లో బయలుదేరి లక్కడకు చేరుకుంటాను.

అల్హాబాద్‌లో, రీడింగ్‌కు లభించిన స్వాగతం నిజంగా ఎలాంటిదో మీరు వ్రాయకపోయివుండినట్లయితే, ఆ స్వాగతవిశేషాలను గురించి "లీడర్" పత్రిక కావించిన వర్ణనలు, బహుశా, నన్ను తప్పదారి పెట్టించి వుండేవి; మీ మీద, మీ నాన్నగారిమీద అల్హాబాద్ ప్రజలకున్న విశ్వాసం యింతేనా. మీరు అల్హాబాద్ ప్రజల ఎదుటవుంచిన ఆదర్శాలశక్తి ఇంతేనా, అనుకునేవాడిని. అయితే ఒకటి; మనకు "లీడర్" పత్రిక సంగతికూడా తెలుసునులెండి ! నేను బొంబాయికి వెళ్ళినప్పుడు, నాకు స్వాగతమియ్యడానికి స్టేషనుకు, ఏభై మంది మనుష్యులకన్న ఎక్కువ మంది రాలేదని, వార్త పంపించడానికి లీడరుపత్రికావిలేఖరికి సిగ్గూ

ఎగురా లేకపోయింది. అక్కడకు ఒక ఫొటోగ్రాఫరూ వచ్చాడు, సినిమా మనిషీ వచ్చాడు; ఆనాటి దృశ్యాన్ని ఫొటోగ్రాఫరు ఫొటోతీశాడు. "బొంబాయి క్రానికల్" ఆదివారం సంచికలో అది ప్రచురితమయింది. స్టేషనుకు వచ్చినవాళ్ళు రెండు మూడు వేలమంది వుంటారని ఆ ఫొటో వల్ల మీరు తెలుసుకోవచ్చును. నాకోసం, అమ్మగారికోసం నిరీక్షిస్తున్న ప్రజాసమూహాన్ని త్రోసుకుంటూ నేను వెళ్ళవలసివచ్చింది. సరి సరి, "లీడర్" "వంగడం" మనకు బాగా తెలుసును.

కుమారి ఇందూకు, శ్రీమతి జె, "స్వరూప్ అపా" లకు, నాన్న గారికీ నా గాఢాభిమానాలను తెలియచేయండి.

అభిమానపూర్వకంగా, మీ
మహమ్మదాలీ.

26. మౌలానా షౌకతాలీ పెద్దనుంచి

సుల్తాన్ మేన్షన్, డొంగ్రే, బొంబాయి,
నవంబరు 29, 1923

నా ప్రియమైన సోదరరత్నమా,

నే నిక్కడ కొన్ని పంక్తులు వ్రాస్తున్నాను. మీ "పెద్దన్నయ్య" దొంగల, కసాయివాళ్ళచేతుల్లో పడిపోయాడు, వా రతనిచేతిలోని "మాంసపుముక్క" కోసం పెనుగులాడారు. నాకు పెద్ద గాయం తగిలింది. అది నన్ను బాధించింది. విశ్రాంతితీసుకునేందుకు ప్రస్తుతం మన కవకాశంలేదు. ప్రేమతో చూడడానికి వచ్చేవారిని వద్దని వారించ లేము. అదీకాక, అనేకవ్యవహారాలు నేను సర్దుబాటుచేసుకోవలసి వచ్చింది. అన్నిండికంటె ముఖ్యంగా, బుద్ధి పలువిషయాలపైకి ప్రసరించింది. ఎక్కడా దానికి తీరుబాటే లేకపోతూంది. ఇప్పుడు నా ప్రాణం కొంచెం తెరిపినపడినట్లుంది. అందువల్ల 4వ తేదీకల్లా అల్లాహాద్ వచ్చి మిమ్మల్ని కలుసుకోగలననుకుంటాను; అక్కడ నాకు స్వాగతపత్రాలు సమర్పిస్తారన్న సంతోషంకంటే, అక్కడి కార్యకర్తలను కలుసుకుని వారితో కలివిడిగా మాట్లాడగలనన్న సంతోషంకంటే, ముఖ్యంగా

మిమ్మల్ని కలుసుకొని, మనసారా మాట్లాడవచ్చునన్న ఆనందంతో నేను అల్హాబాద్ వస్తున్నాను. ముందుకు తీసుకుపోగల, స్పష్టమైన సాహసో పేతమైన విధానం, మనదేశానికి నేడు అత్యావశ్యకమని, ఇదివరకటి కంటే ఇప్పుడు నేను గాఢంగా విశ్వసిస్తున్నాను. భగవదనుగ్రహంవల్ల, మనం స్వరాజ్యాన్ని సాధిస్తాము, మన "ప్రధాన నాయకుడు" మనల్ని మళ్ళీ ముందుకు నడిపిస్తాడు; లేదా మనం వేలాదిమందిమి, ఆయనతో పాటు జైళ్ళల్లో చేరి, అక్కడే మన సహావేశాలను జరుపుకుంటాము. చౌకబారు వీరముద్రలు పొందాలని నాకులేదు; జైలులో పడివుండడం కంటె నేను స్వేచ్ఛగా వుండటమే కోరుతాను; కాని ఈ స్వేచ్ఛ గాలి పోకగా తిరగడంకోసం కాదు, కాలం వృధాపుచ్చడంకోసం కాదు. కేవలం పనిచేయడంకోసం. కృషిగావించడంకోసం నేను స్వేచ్ఛను అభిలషిస్తాను. మనం కలుసుకున్నప్పుడు, యింకా విపులంగా ముచ్చ టించుకోవచ్చును. అమ్మగారికి, కమలాబెన్‌కి, స్వరూప్ బెన్‌కి, పాప ఇందూకి, చెల్లెలు ఉమకు, నెహ్రూ కుటుంబీకులందరికీ నా నమ స్కృతులు.

ప్రేమతో,

ప్రేమగల నీ
షౌకతాలీ.

29 మౌలానా మహమ్మదాలీవద్దనుంచి

[అప్పుడు మౌలానా మహమ్మదాలీ భారత జాతీయకాంగ్రె సుకు అధ్యక్షులుగా ఉండేవారు; నేనొక ప్రధాన కార్యదర్శిగా ఉండేవాడిని.]

జాతీయ ముస్లిం విశ్వవిద్యాలయం,
ఆలీఘర్.

ఆంతరంగికం. జనవరి 15, 1924

నా ప్రియమైన జవహర్,

మీరు వ్రాసిన ఉత్తరం ఇప్పుడే అందింది. చూపకూడనిచోట మీరు నమ్రతను చూపుతున్నందుకు మళ్ళీ నేనొకసారి నా "క్రోధావేశ

నిరసనను" ప్రకటించవలసివుంటుంది! నా ప్రియమైన జవహర్, మీరు కార్యదర్శిగా ఉండటం కొంతమంది కార్యవర్గసభ్యులకు యిష్టం లేదుగనుకనే, నా కది యిష్టంగావుంది. నేను అధ్యక్షునిగా వుండటం వాళ్ళ కిష్టమనుకున్నారా? నన్ను వాళ్ళు నమ్ముతున్నారనుకుంటున్నారా? నా స్నేహితుల్లో చాలామంది, నే నేమిటిచెయ్యాలని కోరుతున్నారో, ఢిల్లీలో ఉండగా నేను బాధపడుతూ గ్రహించాను. నన్ను నాయకునిగా స్తుతిస్తూ వారు పలికిన పలుకులు కేవలం స్తోత్రపాఠాలు; కాని వాటి అంతరార్థం నాకు తాము నాయకత్వంవహించాలని మాత్రమే. ఇలాచేస్తే బాగుంటుందని నే నేదైనా ఆదేశమిస్తే, దాన్ని వారు అడుగడుగునా అనుమానిస్తూ అంటీఅంటనట్టు దూరంగా తొలగిపోయారు. కాంగ్రెసు అధ్యక్షునిగా నేను నా బాధ్యతలను నిర్వర్తించలేను. నేను సంకుచిత, స్వపక్షమనే భిమానాలకు దూరంగావుంటూ మీయొక్క, కిష్లూ, దేశపాండే తదితర కార్యవర్గసభ్యుల యొక్క ప్రాపకాన్ని కోరినానంటే దానికి కారణం జంతువులపట్ల నేను క్రూరంగా ప్రవర్తించలేక కాదు. మన కార్యవర్గం అంతగా ఏకైకాభిప్రాయం కలది కాదనడం ముమ్మాటికీ నిజమే: ఏ ప్రతిపాదనసైనా, అది సులభంగా ఒకరికి అంగీకరించదన్నమాటా నిజమే; కాని కార్యవర్గంవల్ల పని జరుగుతుందనే నే ననుకుంటాను; ఇందుకు ముఖ్యంగా మీవంటి స్వపక్షాభిమానంలేని వ్యక్తులమీద నేను పూర్తిగా ఆధారపడుతున్నాను. "నే నొకశ్రుతిలో ఆలాపిస్తూంటే నా తంబురా ఇంకొక శ్రుతిలో పలుకుతోంది" అని పెర్షియన్‌లో ఒక సామెత వుంది. అలాగే మన సంగీతవాయిద్యాలుహా వేటిత్రోవను అవి మోగుతూవుంటాయి. కాని దానికి మనం ఏమీ చేయలేం. ఎప్పుడో చేసిన పొరపాట్లకు యిప్పుడు కన్నీళ్ళు కార్చడం మీ పద్ధతికాదని మీరు చెప్పకుందానే నాకు తెలుసును. అవును; అది గతజలసేతుబంధనం!....వెనుక ఇప్పుడు మనం ఉత్సాహంతో పని ప్రారంభిద్దాం. మనం నిరాశతో క్రుంగిపోతున్నామా? లేము.

ఇంకా ఇప్పటికి అఖిలభారత కాంగ్రెసుకమిటీ కార్యాలయం తరలించబడలేదు. అన్నీ సర్దుకుని పని ప్రారంభించామని వారికి మీరు

తంతినివ్వండి. నేను విశ్రాంతితీసుకోవడం అయిపోయింది. అన్ని రాష్ట్రకార్యాలయాలలోనూ, విడివిడిగా కార్యవర్గసభ్యులతోనూ నేను ఉత్తరప్రత్యుత్తరాలు జరుపవలసివుంటుంది. నాదగ్గర సరైన షార్టు హాండు టైపిస్టు ఎవ్వరూలేరు. నాదగ్గిర పనిచేయడానికి షార్టుహాండ్ టైపు వచ్చిన పార్టీ సచివాలయగుమాస్తానొకరిని మీరు పంపించండి. ఇందు వల్ల అతను సేప్వరి కాకపోయినట్లయితే అతన్ని పంపించివేయడానికి నాకు అవకాశముంటుంది. ఇలాంటివాళ్ళను ఉద్యోగంలోనుంచి తొలగిస్తే మనకు దుర్వ్యయం తప్పుతుంది. మంచి స్టెనోగ్రాఫర్‌ను నాకు పంపించేప్రయత్నం చేయండి.

ఇక దరఖాస్తులను గురించి; మీకు వచ్చిన అసంఖ్యాక దరఖాస్తులలో మీరు ఎన్నికచేసిన కొన్నింటిని నాకు పంపిస్తే నేను చూస్తాను. మన స్థాయి తప్పక ఉన్నతంగానే వుండాలి; ఏమంటే, అసమర్థులైన సైనికులు పెక్కుమందికంటె సమర్థులు కొంతమంది వున్నా అదినయం. సహాయకార్యదర్శి పదవులలో ఒకదానిబాధ్యతను స్వీకరించమని నేను షెర్వానీని బలవంతపెడుతున్నాను. కాని ఇది మీరనుకుంటున్న పదవి కాదు. కాంగ్రెసు నిత్యకార్యకలాపాలను పూర్తిగా అంటిపెట్టుకొనివుండే పదవికి ఒకమనిషి ప్రత్యేకంగా కావాలని మీరు కోరుతున్నారు. కాంగ్రెసు సభ్యత్వపరిశీలనశాఖను షెర్వానీకి వప్పగించాలని నా అభిప్రాయం. అత నందుకు చక్కగా పనికొస్తాడు. సభ్యత్వాలను పెంచవలసినదిగా రాష్ట్రాలకు మాటిమాటికి ఉత్తరాలువ్రాసి చికాకుపెట్టేకంటె అతనే స్వయంగా ఆ యా రాష్ట్రకేంద్రాలకు అప్పుడప్పుడు వెడుతూ వుంటాడు. వారు, సభ్యత్వాన్ని పెంపొందించేటట్టుగా తగిన కట్టుదిట్టాలు చేస్తాడు.

అటూ ఇటూ తిరుగకుండా ఒకేచోట స్థిరంగావుండే వ్యక్తులు మీకుకావాలని నాకుతెలుసును; కాని కొన్నిశాఖలను నిర్వహించేటప్పుడు యిది పొసగదు. మందకొడిగావున్న రాష్ట్రాలను చురుకుగాపనిచేయించడానికి సహాయకార్యదర్శి ఆ యా ప్రాంతాలకు వెడుతూ కేంద్రసంస్థతో

కొన్నిపనులు చేయించవలసి వుంటుంది. ఇది ఇనస్పెక్టరు జనరల్ లేదా కమీషనర్ నిర్వహించే బాధ్యతవంటిది.

మీ రాష్ట్రసంఘాన్ని గురించి మీరుచెప్పినట్లుగానే సభ్యత్వరుసుము విషయంలో యించుమించు మిగతా అన్నిరాష్ట్రాలు దివాలాకోరుగానే ఉన్నాయి. వాళ్ళు తక్కువే యిచ్చినా ఎంతోకొంత వాళ్ళు మనకియివ్వాలి. ఇంకా ఎక్కువమంది సభ్యులను త్వరితంగా చేర్పించాలని మనం ఒత్తిడిచేయాలి. తిలక్ స్వరాజ్యనిధికోసంలాగ, మనం ప్రచారోద్యమం ప్రారంభించాలి. అది "యు. పి."లోనే మొదట ప్రారంభమవాలని నా అభిప్రాయం. "నయగల"స్నేహితులు "యు. పి." ఖిలాఫత్ కమిటీకి నన్ను అధ్యక్షుణ్ణిచేశారుగదా; ఆకమిటీలకన్నింటికి నేను ఉత్తరాలువ్రాస్తున్నాను. కాంగ్రెసుసంస్థలతో మీరు కలసి సన్నాహంచేయవలసిందని, మీరు, కాంగ్రెసుకమిటీలూ యివ్వబోతున్ననిధితోసహా అన్నివివరాలు గురించి నేను ఖిలాఫత్‌కమిటీలకు వ్రాస్తున్నాను. సంయుక్తరాష్ట్రాలలో నేను కొంతకాలం పర్యటిస్తాను. మీరు నాతోపాటు రాగలరా, లేక అలహాబాదులోనేవుండి కార్యాలయనిర్వహణలో నిమగ్నులై వుంటారా? సమర్థుడైన ఒకహిందువు నాతోపాటు పర్యటించడం అవసరం. మీరు రాలేక పోయినట్లయితే యింకెవరినైనా మీరు సూచించగలరా?

కార్యనిర్వాహకవర్గ సమావేశాన్ని జనవరి మాసాంతంలో అనుకూలమైన ఏదోఒక తేదీన ఏర్పాటుచేయండి. మహాత్ముని అనారోగ్య పరిస్థితివల్ల మనం పూనా వెళ్ళవలసివస్తేతప్ప సమావేశాన్ని అంతకన్నాముందు జరుపడం సాధ్యంకాదు. పూనాలోనే మనం సమావేశాన్ని ఎందుకు జరపగూడదు?

లజపతిరాయ్ తంతిని ఉదహరిస్తూ మీ రిచ్చిన టెలిగ్రాం అందింది. మహాత్ముని విడుదలచేయవలసినదిగా, మనం దేశవ్యాప్తమైన ఆందోళనను లేవదియ్యాలని ఆయన మనతో చెబుతున్నారు. అలాగ ఆయన మనల్ని అడగడానికి, మనం అంటే ఏమిటనుకున్నారు? ఇంతవరకు ఆయన ఒంటబట్టించుకున్న అసహాయోద్యమతత్త్వాన్ని పూర్తిగా త్యజించాలనుకుంటాను. గాంధీజీకి జబ్బుచేయడంవల్ల ఆయన్ని విడుదల

చేసిన ప్రభుత్వం, ఆయనజన్ను మరింత ప్రమాదకరంగా పరిణమించి నప్పుడు జైల్లో అట్టిపెట్టవని నే ననుకుంటాను. మహాత్ముణ్ణి విడుదల చేయవలసినదిగా ఆందోళన లేవనీయడం మాలవ్యాలకు, గురువులకు వెళ్లుతుంది. అది మనం వారికే వదిలివేద్దాం. లాలాజీనూడా వారిమతానికే చెందినవాడుగనుక అందులో చేరడం మంచిది. మహాత్ముని తత్త్వాన్ని పూర్తిగా వ్యతిరేకిస్తున్న వీరే ఆయన్ని ప్రభుత్వం విడుదలచెయ్యాలని పెద్దగా ఆందోళనచెయ్యడం వింతగాలేదూ? ఆయన్ని విడుదలచేయ వలసిందిగా మనం ప్రభుత్వాన్ని అర్థించం; ఆయన విడుదలకోసం ప్రయత్నించమని ప్రజల్ని మనం కోరుతాం; దేశాన్ని అభ్యర్థిస్తాం; అదే మనంచేసేది.

మీ చెల్లెలికి, కూతురు ఇందిరకు ప్రేమపూర్వకమైన ఆశీస్సులు. మీ ప్రియమైన తల్లికీ, భార్యకు గౌరవపూర్వకమైన నమస్సులు.

అత్యంత ప్రేమతో, నీ
మహమ్మదాలీ.

30 మౌలానా మహమ్మదాలీనుంచి

జమియా, మిలియా, ఇస్లామియా,
అలీఘర్.
జనవరి 21, 1924

నా ప్రియమైన జవహర్,

మాలవ్యాజీతోపాటు మీరూ అరెస్టుఅవుతారనీ, మీ అరెస్టుఅయితే వెంటనే నా కా వార్త తెలియజేసేవారెవరూ లేకపోవచ్చుననీ భయపడుతూ ఆ వార్తను తెలుసుకొనేందుకు నేను ప్రతిరోజూ 'లీడరు' పత్రికను చూస్తున్నాను; కాని నేటి 'లీడరు' పత్రిక నా ఆందోళనను పోగొట్టింది, చిట్టచివరకు పండిట్ జీవల్ల గవర్నరు సరైనత్రోవకువచ్చాడనీ, ప్రయాగకు తాను స్వయంగా విచ్చేయడమేకాకుండా, మిమ్మల్ని ప్రభుత్వభవనానికి తీసుకువెళ్ళాడనీ, గంగా, యమునా, త్రివేణీ సంగమముల విష

యమై మీ పురపాలకసంఘంవారు చేసిన తీర్మానాన్నిగురించి, దాను మధురంగా మాట్లాడటానికి ప్రయత్నించారనీ, పత్రికద్వారా నాకు తెలిసింది. పరిస్థితిని నేను సవ్యంగా అర్థంచేసుకున్నానా ? మీతోపాటు దురదృష్టకర సంఘటనలో పండిట్ జీకూడా కలతపడేవిధంగా, మీరు మళ్ళీ జైలుకువెళ్ళాలని నిశ్చయించుకున్నారా ? లేకపోతే మీరు అరెస్టుగాకుండా బయటవున్నట్లయితే, యిదివరకు మీరువ్రాసిన మూడు ఉత్తరాలకు సమాధానంగా ఒక పెద్దఉత్తరమే వ్రాద్దామనుకుంటున్నాను. 24వ తేదీ రాత్రికి నేను ఢిల్లీలో వుంటాను. అక్కడినుంచి ఆ మర్నాడురాత్రి ఎక్స్‌ప్రెస్‌లో కళ్యాణ్ వెళతాను. 27వ తేదీకి పూనా చేరుకుని నా బాపూజీని సందర్శిస్తాను. నేను వచ్చి కలుసుకోవచ్చునా అని ఆయిన్ని నే నడిగాను. రావచ్చుననీ, కాని ఎవ్వరూ పని పాడుచేసుకోగూడదని బాపూజీ కోరారు. తరువాత నాతోపాటు అన్సారీ, హకింజీలు రావచ్చుననీ కబురు వచ్చింది. కాని ఏవిధమైన ప్రదర్శనలు జరుగకూడదని ఆదేశించారు. అందుకని ఎవరికీ తెలియనీయకుండా మే మక్కడికి వెళదామనుకుంటున్నాం. అలాఅయితే ఏ హడావిడీవుండదు. కాని, అన్సారీ డాక్టరు గనుక వెంటనే వెళ్ళవద్దని మమ్మల్ని వారించారు. బాపూజీని మేము చూస్తే, మా ఉద్రేకాలను అణుచుకొనలేమని, అందువల్ల బాపూజీ ఆరోగ్యం దెబ్బతినవచ్చునని ఆయన భయపడ్డారు, ఆయన చెప్పిన ప్రకారం కొన్నిరోజులపాటు ఆగి, మేం బయలుదేరాలనుకుంటున్నాం. 27వ తేదీన పూనా చేరుకుంటాను. 29, 30 తేదీల్లో బొంబాయిలో పని వుంది గనుక అక్కడికి వెడతాను. బాపూజీకోరినట్టు, నా ప్రయాణంవల్ల నా పని పాడవదు. 29, 30 తేదీలనాటికి ఆయనకూడా బాగా కోలుకోవచ్చును. మీరు "మా ముగ్గురు సోదరుల్ని" మధ్యమార్గంలోకాని, కళ్యాణ్‌స్టేషన్‌లోకాని కలుసుకోగలరా? అలాఅయితే మనం 27వ తేదీని బాపూని చూడవచ్చును. మీరు మమ్మల్ని కలుసుకోగలరో లేదో, ఎక్కడ కలుసుకోగలరో తంతిద్వారా తెలియజేయండి. ఈ విషయం

యువకుల చెవినివేయని స్నేహితులున్నప్పుడు మీరెవ్వరికీ తెలియనీయకండి. రేపటి నా జాబులో అన్నీ వివరంగా వ్రాస్తాను.

సదా ప్రేమించు, మీ,
మహమ్మదాలీ.

వి. యస్. శాస్త్రి, శాస్త్రి అనుయాయులవల్ల నేను చాలా బాధ పడుతున్నాను. లేబరుపార్టీ విజయాన్ని నా అభినందించినప్పటికీ మితవాదులవల్ల ప్రయోజనంలేదు. శాస్త్రిగారి పొరపాటువల్ల నాకు రెండు రోజుల పని పాడైంది. ఇప్పుడు నేను ఆయన ప్రకటనకు సమాధానంగా ఒక ప్రకటన సిద్ధంచేసి పంపించాను. ముందు ఆయన కొక తంతినిచ్చి జవాబుకోసం నిరీక్షించాను. నేనుతంతియిచ్చిన నాల్గురోజులకు క్షమాపణ చెప్పుకుంటూ ఆయన నాకొక ఉత్తరం వ్రాశాడు!!! నా ప్రకటన ప్రచురణ కాకుండా నేను ఆపివేయవలసివచ్చింది.

31 హకీం అజమల్ఖాన్ దగ్గరనుంచి

(అంతరంగికం) ముసోరీ, జూన్ 15, 1924

నా ప్రియమైన జవహర్,

ఇన్నాళ్ళూ మీకు ఉత్తరం వ్రాయనందుకు నన్ను మీరు క్షమించ కోరుతున్నాను. నా ఆరోగ్యం మందగించిన పిమ్మట, నా కెంత విశ్రాంతి అవసరమో, మీకు తెలుసును; కాని ఏప్రియల్లో షౌకతు జబ్బు తిరగబెట్టినందువల్ల, ఆహూహా సంభాషణలవల్ల, నా విపుల భారతదేశ పర్యటనవల్ల, నా కెంతమాత్రం విశ్రాంతితీసుకునేందుకు వీలుకలగలేదని మీరు గమనించివుంటారు; మే 20వ తేదీన నే నిక్కడనుంచి బయలుదేరాను; జూన్ 3వ తేదీకి తిరిగివచ్చాను. "మోతాదుప్రాయమైన" విశ్రాంతిమాత్రమే చిక్కింది. కాని పూర్తిగా విశ్రాంతితీసుకోవాలని నాకువుంది. నేను ఢిల్లీ, లాహోరు, ఆలీఘర్, రాంపూర్, (బ్రిటిష భూభాగంలోవున్న ఆఖరి రైలుస్టేషను) నైనిటాల్, లక్నోలలోవుండగా 650/30, 750/25, 752/72, 780 సంఖ్యలుగల మీ ఉత్తరాలన్నీ నాకు అందాయి; నే నిక్కడ ప్రయాణబడలికతీర్చుకుంటున్న సమయంలో

824/53 సంఖ్యగల మీ ఉత్తరం చేరింది. ఈ ఉత్తరాలలోని విషయాలనుసరించి. మీకు, నేను సూచించవలసినదేమీలేదు. కాంగ్రెసు చలాసాలు కుంటుపడతాయని నేను భయపడ నగత్యంలేదు. ("కష్టపడి పని చేసే" కార్యదర్శిని ఎంచుకొనే తెలివితేటలుకనక, అధ్యక్షునికివుండే, అతను బద్ధకించడంవల్ల పనులేమీ పాడుకావు!) కొండా వెంకటప్పయ్యగారి మధ్యప్రదేశ్ ఎన్నికల తీర్పునుసరించి మీరు మీ 862/40 సంఖ్యగల ఉత్తరంలో ప్రస్తావించారు. కాని అందులవిషయమై నే నేమిచేయవలసివుంటుందో మీరు సూచించలేదు; ఆ తీర్పువల్ల లాభం కనుపించడంలేదు. ఇప్పుడు శ్రీ మండలిక్ వ్రాసిన ఉత్తరంవల్ల నేను విధాయకంగా జోక్యం కల్పించుకోవలసివచ్చింది. అఖిలభారత కాంగ్రెసు సభావేశాలలో రూలింగులివ్వడం చెడ్డపని; సభావేశాలను ముందు, రూలింగులివ్వడం అంతకంటే చెడ్డపని. ఆ విషయాన్నిగురించి మీకు వేరే యింకొక ఉత్తరంవ్రాస్తూ. నేను శ్రీ పటేలుయొక్క, మండలిక్ వ్రాసిన లేఖల ప్రతులను అందులో జతపరిచి మీకు పంపించాను. 20వ నిబంధనలోని చివరిసూత్రం మొత్తం అఖిలభారత కాంగ్రెస్ కమిటీకి తప్ప ప్రత్యేకమైన ఏ రాష్ట్రప్రతినిధులకు వర్తించదని నా అభిప్రాయం. నా అభిప్రాయంతో మీ రేకీభవిస్తారనుకుంటాను. నా రూలింగు, శ్రీ మండలిక్ కు రుచించదని నాకు తెలుసును. అనవసరమైన గడబిడ ఏర్పాటు కొంచుకు, కేవలం శాంతికోసం, అతని వర్గీయులు అహమ్మదాబాద్ వచ్చి మనతో చేరడానికి నే ననుమతించివుండేవాడిని. కాని ఆ "శాంతి" నాకు చేకూరదు. కనక న్యాయపద్ధతులు ఎలావుండే అలాగే వ్యవహారం నడిపించవలసివచ్చింది. సకాలంలో తమ ప్రతినిధులను సక్రమంగా ఎన్నుకోలేని ఒక రాష్ట్రం, ఇతరులు తన కేదో అన్యాయంచేశారని చెప్పుకుందుకు దానికి అర్హతలేదు. ఆ రాష్ట్రానికి ప్రాతినిధ్యంవహించే వా రెవరూ లేరనిచెప్పి, మనం పాతప్రతినిధులనే ఆహ్వానిస్తూవుండే దాని సూక్ష్మబుద్ధీ, కొత్తప్రతినిధులను ఎన్నుకునే ఉత్సాహం, సహజంగా నశిస్తాయి. రాష్ట్ర కార్యనిర్వాహకవర్గంమీద ఆ రాష్ట్రం అసంతృప్తి చెందుతోందని నాకు తెలుసును. ఆ అసంతృప్తి ఏమిటికానీయండి;

నాయకత్వంవహిస్తున్నాడని, హిందూ—ముస్లింల ఐకమత్యం ఆయన ఆదర్శంకాదనీ, నాతోపాటు మీ నాన్నగారుకూడా అంగీకరించారు. నా ప్రియమైన జవహర్! ముసల్మానులుకూడా తమ "మాలవ్యాలను" సంగంలోకి దింపుతారేమో ఎవరికితెలుసు? కాని, వారికీ నాకూ ఎట్టి అనుబంధమూ లేదు. అయితే భగవంతునికృపవల్ల ముస్లింలకు తమ మనుష్యులమీద పలుకుబడిలేదు. అందుకుకారణం వారికి శక్తి సామర్థ్యాలు, ఆత్మత్యాగం చేశామనే లబ్ధప్రతిష్ఠ, కులతత్వంతో పనిచేసేదృష్టిలేకపోవడం; పండిట్‌జీకిమాత్రం తనమతస్థులలో అధికసంఖ్యాకులమీద పలుకుబడివుంది. బాపూ చెప్పినట్లుగా పండిట్‌జీ అంత సాధువుఅయితే మరి ముస్సోలినీ. మీ నాన్నగార్ని నేను ఏ ఉన్నతస్థానంలో చేర్చవలసివుంటుందో నాకు బోధపడడంలేదు. మీ యిద్దరికి, ఆయనకి ఏమాత్రం పోలికలేదని నానమ్మకం. కాని యిప్పుడు హిందూ—ముస్లిములమధ్యవున్న ఉద్రిక్తత నాకు ప్రధాన సమస్యకాదు. మొదట నేను తలపోసినట్లుగా అదంతత్వరగా సమసిపోయే సమస్యకాదని నేను గుర్తించాను. స్వరాజ్యవాదులపై బాపూ పిడుగుపాటుదెబ్బతీస్తారని నాకు ముందే తెలిసినప్పటికీ, అలా జరగకుండా వుంటే బాగుండునని ఆశించాను. కాని బాపూజీవల్ల స్వరాజ్యవాదులు పిడుగుదెబ్బతిన్నారు. అదే నన్నెక్కువ కలవరపెడుతోంది. స్వరాజ్యవాదులమార్గం సుగమంకావడానికి మనలాంటివాళ్ళం ఎంతో కృషిచేశామని మీనాన్నగారు గుర్తిస్తూ, అది తగినంతగాలేదని భావిస్తున్నారు. కేవలం కృషియొక్క స్వభావాన్నిబట్టిగాక దానిఫలితాన్నిబట్టి, ఆయన బాగోగులు నిర్ధారణచేసుకుంటారు. కనుక అత్యున్నతస్థానంలోవున్న వ్యక్తి అలాభావించడం సహజమే మరి. కాని "పిడుగు"ను మాత్రం మనం ఎవ్వరం ఆపలేకపోయాం. అందుకు ప్రధానకారణం ఏమంటే అది ఆకస్మికంగా "ఆకాశంమీదనుంచి" వచ్చిపడింది. [illegible] మేము జుహూవెళ్ళినప్పుడు, ఆఖరుక్షణంలో తాము ఏమిచేయబోతున్నారో బాపూ నాకూ, షౌకత్‌కు చెప్పారు. ఆవిషయం మీకు స్వయంగా నేను తెలియజేశాను. మాతో ఆ క్షణంలో అలా అన్నారేగాని, తరువాత ఆయన మనస్సుమార్చుకుంటారని ఆశించాను. అప్పటికికూడా

బ్రిటిషు మంత్రివర్గముంవలితో సామ్యం సరిపోల్చడం సరికాదని అ. భా. కాం. వర్కింగ్ కమిటీకి మంత్రిమండలికీ దేనితో ఎక్కువ పోలిక లున్నాయని మీరు లేఖలో సూచించారు. వాస్తవానికి పోలికేదీనూ వానికిసామ్యంలేదు. అలా అనుకోవడం శుద్ధ పొరపాటు. అఖిలభారత కాంగ్రెసు కార్యవర్గం ఒక ఫెడరల్ సంస్థ. నో-ఛేంజర్లకు అందులోను, కాంగ్రెసులోను అధికసంఖ్యాకుల బలం వున్నప్పటికీ, వారికి అన్ని రాష్ట్రాలలోనూ అధికసంఖ్యాకుల బలంలేదు. అలాంటప్పుడు, రాష్ట్రాలలో అధికసంఖ్యాకులను, అల్పసంఖ్యాకుల ఒగ్గి మనసారం రాజీనామాపెట్టమనడం పొరపాటవుతుంది.

ఈవిషయంలో మీరుకూడా, బాపూతో ఏకీభవించనంతేనని నేనను కోవటం సరియైనదేనా? మీ రాయనతో ఏకీభవించగలరేమో నాకు చెప్పండి మరి.

నాయొక్క యోగ్యత ఎలావున్నా, స్వరాజ్యవాదులను రాజీనామాపెట్టమనడం, "న్యాయశాస్త్ర"రీత్యా ఎంతవరకు సబబు అనే ప్రశ్న బయలుదేరుతుంది. స్వరాజ్యవాదులు రాజీనామాపెట్టి, బయటికిరావాలని ఒత్తిడిచేయగల "లా" ఏమైనా వున్నదా? ఫలానాసభ్యుడు నూలువడక లేదనో, నిర్మాణకార్యక్రమాలలో పాల్గొనలేదనో కారణంచూపి, అతన్ని రాజీనామాయివ్వమనడానికి ఏ అఖిలభారతకాంగ్రెసు కార్యవర్గతీర్మానాలలోనైనా ఆస్కారంవున్నదా? బాపూసూచనకుగల యోగ్యతను గురించి నా అభిప్రాయం ఎట్టిదైనా, దానికి "న్యాయశాస్త్రదృష్ట్యా" ఎట్టి ప్రతిపత్తికలదో పరిశీలించడం, కాంగ్రెసు అధ్యక్షునిగా నా ప్రథమ కర్తవ్యం. మరి మీ రేమంటారు: న్యాయశాస్త్రం ఏమిచెబుతున్నదని మీ ఉద్దేశ్యం?

ప్రస్తుతపు ఈ "సంఘర్షణ" అంతంకావాలన్న బాపూతో నేను విధిగా ఏకీభవిస్తున్నాను. నిర్మాణకార్యక్రమంపట్ల, చాలామంది కాంగ్రెసువాదులకు గౌరవం యించుమించు లేకపోవడమనీ, వారు, వేరేవున్నప్పుడూ, అంతరంగికంగా స్నేహితులవెంతనూ, నిర్మాణకార్యక్రమాన్ని

కింపబడుతున్నారనీ, అవంటే వారికి అగౌరవంమాత్రమే వుందనీ, నే ననుకుంటున్నాను. నిర్మాణకార్యక్రమాన్ని యించుమించు ఒక మత ధర్మంగా భావించి, మనకుమనం ఆచరించనిదే, దాన్ని ఆచరించమని దేశీయులకు ఎలాగ నచ్చచెప్పగలమో నాకు అర్థంకావడంలేదు. ("మత ధర్మంగా భావించి"అన్న మాటకు, "యించుమించు" అనేది కొంత మినహాయింపు!) అయినప్పటికీ, బాపూతత్వంలో ఎక్కడో ఒకలోపం వుందని నా భావం. స్వరాజ్యవాదుల రక్తంత్రాగి దాహంతీర్చుకోవాలనుకున్న కొందరి "నోఛేంజర్ల"మొహాలలో అపవిత్రమైన ఉల్లాసం నాకు పొడగట్టింది. బాపూ స్వరాజ్యవాదులను ఖండించడంవల్ల, మన కే మాత్రం మంచి చేకూరినా, అదికాస్తా ఆయన ఇటీవలచేసిన ప్రకటనతో గాలికి ఎగిరిపోయింది. ప్రభుత్వంలో ఒకవిధమైన సహకారం నెరపాలనే స్వరాజ్యవాదులభావాలకు బాపూప్రకటన దోహదపడుతున్నదో, లేదో నాకు తెలియడంలేదు. నే నాశించినదానికంటె మీ నాన్నగారు ఎక్కువ సహనాన్ని, చిత్తస్థైర్యాన్ని వహించారు. బహుశా ప్రజల కోసం ముఖ్యంగా ప్రభుత్వంకోసం అలాచేయవలసివచ్చిందేమో. మీ జోస్యం నిజమౌతుందేమోనని, స్వరాజ్యవాదులు మనకింకా దూరమౌతారని వారు మనమీద కత్తికడతారని నాకు భయంగానేవుంది. ఈమధ్య జరిగిన ఇంటర్వ్యూలో నేను చెప్పినట్లుగా, స్వరాజ్యవాదులు చేయలేకపోయిన, నోఛెంజర్లు చేయవలసిన నిర్మాణకార్యక్రమంమీదనే నా దృష్టి కేంద్రీకృతమైవుంది. ఈ కృషికి సానుకూలమైన వాతావరణాన్ని, స్వరాజ్యవాదులు చాలావరకు పాడుచేశారని నాకుతెలుసు. శాసనసభల్లో స్వరాజ్యవాదులకార్యక్రమాన్ని విద్యావంతులైన తరగతులవారు అమిత శ్రద్ధతో పరిశీలిస్తూవుంటారు. వారి శాసనసభాకార్యక్రమం ఇంగ్లండులోను, ఇంగ్లండు-యిండియాప్రభుత్వాలమీదను ఎటువంటి ఫలితాలను చేకూర్చగలదో ఆసక్తితో పరికిస్తుంటారు; ఇంతకీ ఈ తరగతులవారే ప్రజలకు నాయకత్వంవహిస్తూవుంటారు. స్వరాజ్యవాదులు ఏంచేస్తున్నారో పరిశీలిస్తూ కూర్చుని వారికార్యకలాపాలపట్ల అసంతృప్తిపడుతూ కాలం వృథాచేయడం మనవంటివారికి తగదు. అందువల్ల మన కేమీ మేలుచేకూ

రదు. వారిని మనం అపహాస్యంచేయగూడదు. మనం మన కార్య క్రమాన్ని చేపట్టాలి.

ప్రస్తుతం నన్ను వేధిస్తున్న సమస్య లివి: నేను ముస్లింనుకావడం వల్ల, అందులోనూ యథార్థమైన ముస్లింను కావడంవల్ల నా స్థితి ఏమీ మెరుగుకాలేదు. ప్రధానసమస్యలమీద కాంగ్రెసు అధ్యక్షుడిగా నేను మౌనంగానూ ఓటుచేయలేను; లేదా చిన్నసమస్యలమీద అధ్యక్షుడు తనను ఓటుచేయనప్పటికి కొందరికివలె అసలు ఓటుచేయకుండానూ ఉండలేను. మీరు అలహాబాద్‌లో రాజీనామాచేసినట్లుగా నేను రాజీనామాయిచ్చి తప్పించుకోలేను. నేను ముస్లిమును; నేను కనుక రాజీనామాపెడితే, అది హిందూ ముస్లిము ఐకమత్యానికి తప్పక భంగం కలిగిస్తుంది. కొంతమంది రాజీనామాపెట్టమని నన్ను అవమానించినప్పటికీ, చాలామంది తమ సంసర్భశుద్ధిలేని పొగడ్తలవల్ల కించపరచినప్పటికీ, నేను రాజీనామాపెట్టకపోతే నా గౌరవానికేదో భంగంకలుగుతుందని నే ననుకోవడంలేదు. ఇంతవరకు నా భావాలను నా మనస్సులోనే అట్టేపెట్టుకున్నాను. వాటిని ఇతరులకు ఎరుకపరచడానికి నేను విముఖుణ్ణికావడంవల్ల మీకు నేను ఇంత ఆలస్యంగా ఉత్తరం వ్రాస్తున్నాను. ఇప్పుడు వాటిని ఒక క్రమపద్ధతిలో కాకుండా నా మనస్సులో వున్నవి వున్నట్లుగా మీకు వ్యక్తపరిచాను. ఈ ఉత్తరం వ్రాసిన తరువాత దీన్ని చింపి చెత్తబుట్టలో పారవేయాలని చిన్నా చెప్పినట్లుగా నాకు దాదాపు బుద్ధిపుట్టింది; కాని నా బుద్ధి మార్చుకున్నాను. కనుక ఉత్తరం మీకు చేరుతోంది! అన్నట్టు అహమ్మదాబాద్‌కు మీరు ఏ దారిన వస్తారు? 24వ తేదీ రాత్రో, 25వ తేదీ ప్రొద్దున్నో నాతోపాటు మీరు ఢిల్లీ మీదుగా ఎందుకు రాకూడదు?

మీ కుమార్తె ఇందుకు నా ప్రేమాశీర్వచనాలు; శ్రీమతి జవహర్‌లాల్‌కి, మీ సోదరికి, గౌరవ ఆదరణపూర్వకాభివందనాలు.

ప్రేమతో, మీ
మహమ్మదాలీ.

పి. యస్. కాంగ్రెసుతోనూ, ఖిలాఫత్‌తోనూ (వీటిని పురస్క రించుకొని నా పేరెత్తకుండా మౌలానా అబ్దుల్‌కలాం ఆజాద్ నన్ను పత్రికల్లో తీవ్రంగా విమర్శించారు) నాకున్న బాధలు చాలవన్నట్లు కొత్తగా ఇంకొక బాధ వచ్చిపడింది; మా అమ్మ మళ్ళీ మంచాన పడింది.

## 42 మహాత్మా గాంధీవద్దనుంచి

[డబ్బుకోసం మా నాన్నగారిమీద ఆధారపడడం నాకు చాలా బాధాకరంగావుందని, నా కాళ్ళమీద నేను నిలబడాలని నాకుందనీ గాంధీజీకి ఉత్తరంవ్రాస్తూ నేను తెలియచేశాను. వచ్చిన చిక్కే మిటంటే నేను నా పూర్తికాలాన్ని కాంగ్రెసుకోసం వినియో గిస్తున్నాను. ఈ సంగతి విని మా నాన్నగారు చాలా ఖేదపడ్డారు. ఈ ఉత్తరంలో పేర్కొనబడిన "హసరత్" పూర్తిపేరు "హస రత్ మొహానీ". ఆయ నొక ఉర్దూకవి. విప్లవకార్యకలాపాలలో జాతీయ రాజకీయాలలో ఆయన అత్యంత వీరోచితమైనపాత్ర నిర్వహించారు.]

సెప్టెంబరు 15, 1924

నా ప్రియమైన జవహర్లాల్,

హృదయం కరిగించే నీ స్వకీయలేఖ నాకు అందింది. నువ్వు ధైర్యంగా నిలబడగలవని నాకు తెలుసును. నాన్నగా రిపుడు యిట్టే కోప గించుకొనే మానసికావస్థలో వున్నారు. వారిని రెచ్చగొట్టే ఏ పనీ మనం చేయకూడదు. అవకాశం కలిగితే, ఆయనతో నువ్వన్నిసంగతులు దాపరికంలేకుండా ముచ్చటించాలి. ఆయనకు కోపంకలిగించే ఏ పనీ చేయవద్దు. ఆయనమనసు కష్టపడుతున్నదని నాకెంతో కష్టంగావుంది. ఆయన కిపుడు యిట్టే కోపంవస్తుంది. అది మానసిక అశాంతికి దారి తీస్తుంది. హసరత్ యివాళ యిక్కడకు వచ్చి వెళ్ళాడు. కాంగ్రెసువాదు లంపటు మాలువడకాలని నేను చేసిన ప్రతిపాదన పైతం, ఆయన్ని

కలతపెట్టిందని అతను చెప్పాడు. నాకు కాంగ్రెసునుండి వైదొలగి, ప్రశాంతంగా నిర్మాణకార్యక్రమాన్ని చేపడితే, బాగుంటుందనిపిస్తోంది. మనకు మనుష్యులెంతమంది వున్నా లాభంలేదు. నిర్మాణకార్యక్రమాన్ని మనం ఆచరిస్తే మన కదే చాలు. కాని దానికికూడా కొంతమంది కలవర పడుతున్నారు. పూనా స్వరాజ్యవాదులతో నేను చాలాసేపు ముచ్చటించాను. వారు నూలువడకడానికీ యిష్టపడరు; నేను కాంగ్రెసునుంచి వైదొలగడానికీ యిష్టపడరు. నా వ్యక్తిత్వాన్ని నేను కోల్పోయినతరువాత, నావల్ల ప్రయోజనం ఏమీ వుండదని వారు గుర్తించడంలేదు. ఇది ఒక దౌర్భాగ్యమైనస్థితి; కాని నేను నిరాశచెందను. నాకు భగవంతుని మీద సంపూర్ణ విశ్వాసముంది. ఈ క్షణానికి యిది చేయాలని మాత్రమే నాకు తెలుసును. నా అంతఃకరణ నన్నంతకంటె ఎక్కువ తెలుసుకోనీయదు. అలాంటపుడు నే నెందుకు బాధపడాలి?

నీకు కొంతడబ్బు సర్దుబాటుచేయించడానికి ప్రయత్నించనా? సంతోషకరంపచ్చే పని నువ్వెందుకు చేయకూడదు? నువ్వెంత నాన్నగారి ప్రాపకంలో వున్నప్పటికీ, నీ అంతట నువ్వు కష్టపడి నీ సంపాదన నువ్వు సంపాదించుకోవాలికదా? ఏదైనా వార్తాపత్రికకు విలేఖరివిగా వుంటావా? లేక, ఎక్కడైనా ప్రొఫెసరుగా వుంటావా?

నీ విశ్వాసపాత్రుడు,
యం. కె. గాంధీ.

33 మహాత్మా గాంధీవద్దనుంచి

[తాను మూడువారాలపాటు నిరాహారదీక్ష పూనుతున్నానని ప్రకటించిన సందర్భంలో గాంధీజీ ఈ ఉత్తరం వ్రాశారని అనుకుంటాను.]

సెప్టెంబరు 19, 1924

నా ప్రియమైన జవహర్‌లాల్,

నువ్వేమీ ఆశ్చర్యచకితుడవు కానక్కరలేదు. నా కర్తవ్యాన్ని నేను నిర్వర్తించడానికి తగిన ప్రజ్ఞాశక్తులను భగవంతుడు నాకు కలిగి

స్తాడని నువ్వు ఆనందించాలి. ఇంకొకలాగ నేను చేయలేను. అసహా యోద్యమకర్తగా గురుతరబాధ్యతలు నా భుజస్కంధాలమీదున్నాయి. లక్నో, కాన్పూరులలో నీ అనుభవాలనుగురించి నాకు వ్రాయి. నీ అభిప్రాయాలను నువ్వు పూర్తిగా తెలియజేస్తే నేనెంతో సంతోషిస్తాను. నా మనసు ప్రశాంతంగా వుంది.

నీ విశ్వాసపాత్రుడు,
యం. కె. గాంధీ.

34. మహాత్మా గాంధీవద్దనుంచి

నవంబరు 16, 1924

నా ప్రియమైన జవహర్‌లాల్,

మాతృదేశానికి సేవచేయడంకోసం ఆత్మస్వరూపాన్ని అవగతం చేసుకోవడం కోసం, రోజులు నీకు శుభప్రదంకావాలని వాంఛిస్తున్నాను. నీకు అవకాశముంటే తండ్రిగారితో నువ్వూ రా.

నీ విశ్వాసపాత్రుడు,
యం. కె. గాంధీ.

35 మహాత్మా గాంధీవద్దనుంచి

[నా కొక మగపిల్లవాడు పుట్టాడు. పుట్టిన ఒకవారంలోకా బోలు పిల్లవాడు పోయాడు. అప్పుడు గాంధీజీ ఈ తంతినిచ్చారు.]

తంతి నవంబరు 28, 1924

సదిస్మృతి

నెహ్రూ అలహాబాద్

బిడ్డమరణవార్త విని చాలా విచారించాను. అంతా భగవదిచ్ఛ.

గాంధీ.

## 36. మహాత్మా గాంధీవద్దనుంచి

ఏప్రియల్ 25, 1925

నా ప్రియమైన జవహర్లాల్,

నేను తిథాలకు చేసుకున్నాను. ఇది యించుమించు జూహూవలె వుంటుంది; బెంగాల్ అగ్నిపరీక్షను తట్టుకునేశక్తిని పుంజుకుందుకు, ఇక్కడనేను నాలుగురోజులపాటు విశ్రాంతితీసుకుందామనుకుంటున్నాను. నాకువచ్చిన ఉత్తరాలకు జవాబులు వ్రాద్దామని చూస్తోగానే, నీఉత్తరం నాకంటపడ్డది. "దేవుడు-కాంగ్రెస్" అనే వ్యాసంగురించి నువ్వు నీ అభిప్రాయాలను వ్యక్తపరిచావు. నీకుకలిగిన సాధకబాధకాలకు నేను సానుభూతిచూపుతున్నాను. యథార్థమైన మతం జీవితంలో ప్రపంచంలో అత్యున్నతమైనది కావడంవల్ల, దానిని చాలామంది స్వార్థంకోసం వినియోగించుకుంటున్నారు. అది అలా ఉపయోగపడడాన్నీ అలాగ ఉపయోగించుకుంటున్నవారినీ చూసి సహజంగా కొందరు, దాని అంతరార్థాన్ని గ్రహించక, మతమంటేనే విముఖత చూపుతున్నారు. ఇంతాచేస్తే,మతం వ్యక్తికి సంబంధించినది; అంతేకాదు; అది అతని హృదయానికి సంబంధించినది. దానిని మీరు ఏపేరుతో పిలిచినా పిలవచ్చు. మతం మానవునకు అత్యంత ఆత్మశాంతిని చేకూర్చుతుంది. అలాంటి శాంతిచేకూర్చే తేజస్సే దేవుడు. ఏమైనప్పటికి, నువ్వు మంచిదారిలోనేవున్నావు. కేవల తర్కం మనుష్యుని విభ్రాంతిపరుస్తుంది. దోషాలకు ఛాందసత్వాలకు దారితీస్తుంది. అన్నింటికీ అదే పరీక్ష అంటే నే నంగీకరించను. గోసంరక్షణ అంటే నా ఉద్దేశంలో ఆ రక్షణ గోవుకుమాత్రమే పరిమితంకాదు, జీవరాశులన్నిటికీ గోవుప్రాతినిధ్యంవహిస్తుంది; చెవిటివారిని, మూగవారిని, నిస్సహాయులను, దుర్బలులను రక్షించడం గోసంరక్షణ అంతరార్థం. అప్పుడు మానవునికి, తాను సృష్టికి అధిపతిననేభావం పోయి దానికి నేను సేవకుడననే భావం కలుగుతుంది. విశాలమైన కారుణ్యదృష్టిని పెంపొందించుకోమని బోధించడానికి గోవు నాకొక ఆలంబనం మాత్రమే. కాని యింతవరకు మనం గోసంరక్షణ అనే మాటలతో కాలక్షేపంచేస్తున్నాం; అందు

వల్ల మనం యథార్థాన్ని గమనించి శీఘ్రగతిని దానిమీదే మనదృష్టిని కేంద్రీకరించాలి.

ఇదివరకు నేను నీకువ్రాసిన ఉత్తరాలన్నీ నీకు అందివుంటాయను కుంటాను. డాక్టరు సత్యపాల్‌వద్దనుంచి నా కొక దుఃఖకరమైన జాబు చేరింది. కొన్నిరోజులకే ఐనప్పటికీ నువ్వు సంచారానికి వెళ్ళడం నా అభిమతం. నువ్వు వెళ్ళడంవల్ల ఆయనహృదయం తేలికపడుతుంది. ప్రశాంతమైన నల్లిచిప్రదేశంలో నాన్నగారు రెండునెలలవరకుఉంటే బాగుంటుం దనుకుంటాను. నువ్వు అల్మోరావెళ్ళి ఒకవారంరోజులపాటు ఏంచేయకుండ చూడటం? అక్కడ పల్లెని వాతావరణంలో చక్కగా పనిచేసుకోవచ్చును కదా:

నీ

బాపు.

[గాంధీజీని మేమందరం బాపూ అని పిలిచేవాళ్ళం. మేమేకాదు; ఇంచుమించు భారతదేశంలోవున్న ప్రజలందరూ ఆయన్ని బాపూజీ అనే అంటారు. బాపూజీ అంటే తండ్రియని అర్థం]

57 సరోజినీనాయుడువద్దనుంచి

ది గోల్డెన్ త్రెషోల్డు,
హైదరాబాద్, దక్కన్,
మే 11, 1925

నా ప్రియమైన జవహర్,

నేను ది గోల్డెన్ త్రెషోల్డునుంచి రాస్టఫారి, పోవోపౌమీ నికాలో పిసానో టిక్‌టిక్, మహజాన్, మహజింగ్, ఈ నలుగురు భవన పరిపాలకుల చిత్రపటాలు చుట్టూ వుండగా, నల్లని నగిషీ చెక్కిన నా స్వంత సోఫాలో కూర్చుని, గుల్ మోహర్ ఎర్రగులాబీలు నిండుగా పూసిన తోటలో, రకరకాల పిట్టలు సంగీతం వినిపిస్తుండగా, నీ కీ ఉత్తరం వ్రాస్తున్నాను. నే మీ సాయంకాలం ఉస్మాన్‌సాగర్‌కు బయల్దు

దేరి వెడుతున్నాం గనుక, మీనా పుస్తకాలూ. బట్టలూ, క్రాస్‌వర్డుపజిల్సు కోసం నిఘంటువులు సర్దుకోవడంతో, సతమతమౌతున్నది. ఇప్పుడే బొంబాయినుంచి సరికొత్త 'పియట్' వచ్చింది. పద్మజ కారునుచూసి మురిసిపోతోంది. గోవింద్ ఇంటికి ఆలస్యంగా వచ్చి వంకాయకూర, ఫాల్వా షర్‌బత్‌లతో కూడిన భోజనం ఆరగిస్తూ. ప్రయాణం సుకరం కావాలని, కొండలవల్ల నీటివల్ల ఇబ్బంది కలగకుండా భగవంతుణ్ణి ప్రార్థించుకుంటున్నాడు.

ఒక్కమాటలో చెప్పాలంటే 1921 తరువాత ఇదే నాకు నిజమైన విశ్రాంతి. ఇతర వ్యాపకాలు, బాధ్యతలు, విధులు అనేరూపంలోవున్న సర్పాలనోరినుంచి తప్పించుకొన్న నాకు స్వర్గతుల్యమైన ఈ ప్రదేశంలో ఎంతో హాయిగావుంది. తగినంత కారణం లేకుండానే నా పదవిని నేను కొన్ని వారాలపాటు విడిచిపెట్టాను. కారణం మరేమీకాదు. చిగిర్చిన పుష్పించిన వృక్షాలతో, పక్షులతో, గూళ్ళతో, కుక్కపిల్లలతో, చిన్న పిల్లలతో గేయకవులతో, పాటస్నేహితులతో కూడిన సౌందర్యమయమైన వాతావరణంకోసం, నా ఆత్మ ఆక్రోశించింది. మన రాజకీయాలనబడే ఆత్మవిధ్వంసక కార్యక్రమంనుంచి, నిర్మాణకార్యక్రమంనుంచి తప్పించుకొని కొంచెం దూరంగా ఉంటూ కాస్త విశ్రాంతితీసుకోవాలని నా హృదయం పరితపించింది. నే నెప్పుడు నిర్లక్ష్యంచేసిన విధులను, త్వరలో రెట్టింపు ఉత్సాహంతో నిర్వర్తిస్తాను. కాని ఈ లోపున నువ్వు మాతోపాటు ఈ మహదానందాన్ని పొందాలని కోరుతున్నాను. హైదరాబాద్‌లో మీర్ ఆలాంమీద బోటులో షికారువెళ్ళడం. ఇక్కడా అక్కడా పనీపాటు లేకుండా కులాసాగా తచ్చాడుతూ రకరకాల మనుష్యులను కలుసుకుంటూ కాలంగడపడం ఎంత బాగుంటుంది! దిగోల్డెన్ థ్రెషోల్డు నా పూర్వీకులైన మొదటితరంనుంచీ ఈ నాల్గుతరాలవరకూ భారతదేశంలోగల అనేకమంది ప్రజలకు యాత్రాస్థలంగా ఉంటున్నది. మన తరవాత తరానికి చెందిన చిన్నపిల్లలు, ఆ భవనపు ప్రాంగణంలో కూర్చుని రొట్టెలు తింటూ, రొట్టెముక్కలు పిల్లలకు పెడుతూ, ఆడుకుంటూ షరబత్ తమ దుస్తులమీద ఒలకబోసుకుంటూంటే ఆ దృశ్యా

లను చూస్తూ, ఆ భవనంలో కాలం గడపడం ఎంతో సంతోషంగావుంది. అక్కడి పని కాస్త అవతలపెట్టి నువ్వు యిక్కడికివచ్చి కొంతకాలం ఎందుకు విశ్రాంతితీసుకోకూడదు? షబూబ్‌నికూడా ఇక్కడికి రమ్మని చెబుతాను. కాని నీ యితర సహచరులవిషయంలో మాత్రం ఒక హద్దు గీస్తాను. ఈ హద్దును భగవంతుడు రక్షించుగాక!

కలకత్తాలో జరుగబోయే వర్కింగుకమిటీ సమావేశానికి నేను హాజరుకావడంలేదు. కొన్ని వారాలనుంచి నా ఒంట్లో బాగుండడంలేదు. శారీరకంగాకంటె మానసికంగా వాతావరణంమార్పును నేను కోరుతున్నాను. అదీగాక వర్కింగుకమిటీ ముందున్న ఎజండా అంత ముఖ్యమైనదికాదు. బహుశా దేశబంధు చిత్తరంజన్‌దాస్ సృష్టించిన ప్రస్తుత పరిస్థితినిగురించి తప్ప, అక్కడకు వెళ్ళి నే నాలోచించతగ్గ విషయం ఏమీ లేదనుకుంటాను. బాపూజీ, మామాజీ కులాసాగా ఉన్నారనుకుంటాను. కమలకు మళ్ళీ బలంచేకూరిందని ఆశిస్తాను. పద్మజ అందరికీ, ముఖ్యంగా, సౌందర్యనేత్రి బెట్టీకి తన ప్రేమను వ్యక్తంచేస్తున్నది. లీలామణి మళ్ళీ అక్కువద్దు వాతావరణంలో అడుగుపెట్టింది; ఎంతో కులాసాగావుంది.

ఎప్పుడు కలుసుకుంటామో మరి; ప్రస్తుతం నా ప్రేమాభివందనాలు. ఇక్కడికివచ్చి ఈ జీవితానందాన్ని పొందాలని నిన్నాహ్వానిస్తున్నాను.

ప్రేమతో, నీసోదరి,
సరోజిని.

## 58. మహాత్మాగాంధీవద్దనుంచి

[కుడిచేత్తో అన్నివేళల వ్రాయడానవసరంలేకుండా, గాంధీజీ ఎడంచేత్తోకూడా వ్రాయడం అలవాటుచేసుకున్నారు. ఈ జాబు ఆయన ఎడంచేత్తో వ్రాశారని స్పష్టపడుతోంది. యం. ఇ. అనగా "యంగ్ ఇండియా" ఆంగ్లవారపత్రిక. గాంధీజీ దానికి సంపాదకులుగా వుండేవారు.]

సెప్టెంబరు 30, 1925

నా ప్రియమైన జవహర్,

మనం జీవిస్తున్నకాలం వింతగావుంది. సిట్లాసాహైా తననుతాను సమర్దించుకోవచ్చుగాక. దయవుంచి జరుగబోయే పరిణామాలను ఎప్పటి కపుడు నాకు తెలియచేస్తూవుండు. ఆయనఎవరు? న్యాయవాదియా? విప్లవ కార్యకలాపాలతో ఆయన కెపుడైనా, ఏదైనా సంబంధంవున్నదా?

కాంగ్రెసుకు సంబంధించినసంతవరకు, ప్రస్తుతం మిగిలివున్న కార్యకర్తలు. దానితోసరిపుచ్చుకుందుకు, దాన్ని సులభతరంచేస్తే బాగుం టుంది. నీపై వున్నభారం ఇప్పుడింకా పెరుగుతుందని నాకు తెలుసును. అయితే నీ ఆరోగ్యాన్ని నువ్వు ఏవిధంగాను పాడుచేసుకోకూడదు. నీ ఆరోగ్యం ఏమౌతుందోనని నాకు భయంగావుంది. తరుచు నీకు జ్వరం వస్తోంది. అలారాకుండా నువ్వు జాగ్రత్తపడాలి; నువ్వూ కమలా కాస్త విశ్రాంతితీసుకుంటే బాగుంటుంది.

నాన్నగారు నాకు ఉత్తరం వ్రాశారు. ఆయనభావిస్తున్నంత దూరం వెళ్ళాలని నే నెన్నడూ అనుకోలేదు. ఆయన్ని బలపరచండని నే నెవర్నీ అడగను. కాని నువ్వుచేస్తున్న ప్రజాసేవకు కొంతధనం చెల్లించే అవ కాశం కలిగిందని భావించే స్నేహితులను అలా చెల్లించమని అడగడానికి నేను వెనుదీయను. నువ్వున్నపరిస్థితి కనుగుణంగా ప్రజలవిరాళాలనుంచి కొంతడబ్బు నువ్వు తీసుకుతీరాలని నా కోరిక. అయితే నీ అవసరాలు విపరీతంగామాత్రం వుండకూడదు. నువ్వు ప్రజాసేవచేసే పరిస్థితులు కల్పించుకోవడంకోసం, వ్యాపారంచేసో, స్నేహితులవద్దనుంచి విరా ళాలు వసూలుచేసో, కొంతధనాన్ని సమష్టినిధిగా సేకరిస్తే బాగుంటుందని నాకుతోచింది. ఇందుకు తొందరపడవలసిన అగత్యంలేదు; ప్రశాంతంగా ఆలోచించుకుని, ఏంచేయాలో ఒకనిర్ణయానికి నువ్వు రావచ్చును. ఏదో ఒకవ్యాపారంచేద్దామని నువ్వు నిర్ణయించుకున్నా ఫరవాలేదు. నీమనస్సు ప్రశాంతంగావుండాలని నా వాంఛ. వ్యాపారయజమానిగా అయినప్పటికీ, నువ్వు దేశానికి సేవచేస్తావని నాకు తెలుసును. నువ్వేంనిర్ణయించుకున్నా

అవి నీకు పూర్తి శాంతినిస్తున్నంతకాలం, నాన్నగారు దానికి అభ్యంతరం పెట్టరని నా విశ్వాసం.

నీ

బాపూ

యం. ఇ. కోసం నా కుడిచేతిని భద్రంగా దాచుకోవాలి మరి.

39 యం. ఎ. అన్సారీవద్దనుంచి

ఫతేపురి, ఢిల్లీ,

అక్టోబరు 11, 1925

నా ప్రియమైన జవహర్లాల్,

మీరు ఉత్తరం వ్రాసినందుకు, మీకు నేను కృతజ్ఞతాబద్ధుడనై వున్నాను. స్థలం మార్చడంవల్ల, ఎక్కువ విశ్రాంతితీసుకోవడంవల్ల వెనకటికంటె, ఇప్పుడు నా ఒంట్లో నయంగావుంది. కాని హృద్రోగంవల్ల కొంతకాలం బాధపడ్డాను. మనసును ఎట్టి ఉద్రేక ఆవేశాలకు లోనుకానీయవద్దని, నియమబద్ధంగా జీవితాన్ని గడపమని, డాక్టర్లు నన్ను గట్టిగా హెచ్చరించారు. అందువల్ల అన్ని కార్యకలాపాలను ఆపుచేసుకుని, కేవలం విద్యాసంబంధమైన పనికిమాత్రమే అంటిపెట్టుకుని వుండాలను కుంటున్నాను. నేను యూరపుకు బయులుదేరివెళ్ళేముందు, జాతీయముస్లిం విశ్వవిద్యాలయ కార్యనిర్వహణపదవిని స్వీకరించవలసినదిగా నన్ను గాంధీజీ హకీంసాహేబు ఒప్పించినట్లు మీకు తెలుసును. ఇది అనేక బాధ్యతలతో కూడినపని; నేను మిగిలినకాలమంతా దీనికోసం పనిచేయవలసి వుంటుంది. అలాచేస్తేనేతప్ప, విశ్వవిద్యాలయ బాధ్యతలను నిర్వర్తించలేను. కనక యిదితప్ప మిగతా ప్రజాహితకార్యాలను యికనుంచి మాను కుంటున్నాను.

అదీకాక, పాట్నాలో కావించిన నిర్ణయంవల్ల, కాంగ్రెసు కార్య క్రమమంతా, స్వరాజ్యవాదులచేతుల్లోకి సహజంగానే పోతున్నది. కనక

చర్ఖాసంఘంలో సభ్యునిగా వుంటూ జాతీయవిద్యకోసం నా యావచ్ఛక్తిని నేను వినియోగించడం నాకు కష్టంకాదు.

మధ్యవర్తిత్వ పరిష్కారం విషయమై, మీరు సూచించినప్రకారం నేను చేస్తాను. వారి కేసులకు సంబంధించిన పూర్తి వాఙ్మూలాలను పంపమని, శ్రీ భార్గవాకు, అజ్మీరు మార్వాడు రాష్ట్రీకాంగ్రెసుసంఘ కార్యదర్శికి ఉత్తరాలు వ్రాస్తున్నాను. మీ సలహా ననుసరించి, ఆ పత్రాలను పరిశీలించి, వాటినకళ్లను వారికి .పంపిస్తూ, వారిని కొన్నిప్రశ్నలు అడుగుతాను; నేను తీర్పుయిచ్చేముందు నన్నొకసారి కలుసుకోమని తెలియచేస్తాను.

అత్యంత గౌరవ ప్రేమలలో,

నీ విశ్వాసపాత్రుడు,
యం. ఎ. అన్సారీ.

40. మహాత్మా గాంధీనద్దనుంచి

టెలిగ్రాం

అహమ్మదాబాద్ డిసెంబరు 1, 1925

జవహర్లాల్ నెహ్రూకు, ఆనందభవనం, అల్లాబాద్.

నిరసనవ్రతం విరమించాను. ఆరోగ్యం బాగానేవుంది. కమల నెమ్మదిగా కోలుకుంటున్నదని ఆశిస్తున్నాను. సటూవ్ యిక్కడే.

గాంధీ.

41. మహాత్మా గాంధీవద్దనుంచి

[1926 సంవత్సరారంభంలో నా భార్యను చికిత్సచేయించడం కోసం ఆమెను యూరప్‌కు తీసుకువెళ్ళాను.]

జనవరి 21, 1926

నా ప్రియమైన జవహర్,

నీతో కమలను యూరప్‌కు తీసుకువెళ్ళుదున్నందుకు నాకు సంతో

షంగా వుంది. అవును; అక్కడకు బయలుదేరేముందు మీరిద్దరూ రాలేక పోయినా, ఆఖరికి నువ్వయినా ఒకసారి యిక్కడకు రా. దేశబంధు స్మారకనిధి విషయమై జమన్‌లాల్‌జీకి నువ్వు వ్రాసిన ఉత్తరం చాలును. అఖిలభారత చరఖాసంఘానికి నువ్వు కార్యదర్శిగానే వుంటావు. కాని అవసరమైతే శంకర్లాల్‌కు ఒక సహాయకుని యివ్వవచ్చును. పట్టిక తయారుచేయలేదని నిన్ను నేను తప్పుపట్టను. నీ కాలాన్ని నువ్వు వృథా పుచ్చలేదు. యూరప్‌వాతావరణానికి తగిన దుస్తులను నువ్వు సిద్ధపరుచుకోవాలి.

నీ బాపు.

42 మహాత్మా గాంధీవద్దనుంచి

ఆశ్రమం, సబర్మతి,
మార్చి 5, 1926

నా ప్రియమైన జవహర్‌లాల్,

మొదటితేదీన నువ్వు వ్రాసిన నోట్ నాకు అందింది. డాక్టరు మెహతాకు నువ్వీ నోట్ వ్రాసినా ఆయనకి హెచ్చరికచేయడంకోసం నేను మళ్ళీ ఉత్తరం వ్రాశాను. సముద్రప్రయాణంలో కమలఆరోగ్యం చాలా బాగానే వుందనుకుంటాను. సముద్రయానంవల్ల మీకు మరింత ఆరోగ్యం చేకూరిందా? ఇంతకంటె ఎక్కువ వ్రాయడానికి వ్యవధిలేదు.

నీ విశ్వాసపాత్రుడు,
ఎం. కె. గాంధి.

43 మహాత్మా గాంధీవద్దనుంచి

ఆశ్రమం, సబర్మతి,
ఏప్రియల్ 23, 1926

నా ప్రియమైన జవహర్‌లాల్,

నీకు ఉత్తరం వ్రాద్దామని ప్రతివారం అనుకుంటున్నాను. కాని అలా వ్రాయలేకపోతున్నాను. ఏమైనప్పటికి ఈ వారం అలా పోనివ్వ

కూడదు. నాకు ఉత్తరం వ్రాసితీరాలి. సహకారవాదులను కలుసుకునేందుకు నాన్నగా రిక్కడకు వచ్చినప్పుడు నీ యోగక్షేమాలనుగురించి నాకు తెలియజేశారు. వారు కుదుర్చుకున్న ఒడంబడిక నువ్వు చూసేవుంటావు.

హిందువులు, ముస్లిములు రానురాను ఒకరికొకరు మరింత దూరమౌతున్నారు. కాని యిందుకు నేను గాభరాపడడంలేదు. ఈ ఎడబాటు ముమ్ముందు వారు సన్నిహితులుకావడంకోసమే ఏర్పడుతున్నదని భావిస్తున్నాను.

కమలఆరోగ్యం బాగుపడుతున్నదని ఆశిస్తున్నాను.

నీ, బాపు.

## 44. రొమెయిన్ రోలండ్ లేఖ

విల్లినోవ్, ఓల్గావిల్లా,
మే, 21, 1926

శ్రీ జవహర్‌లాల్ నెహ్రూగారికి,

మీ లేఖ, గాంధీజీలేఖ చేరినవి. చాలా సంతోషం. మీపేరు నాకింతకుపూర్వమే తెలుసును. నేడూ, ఇంతకుపూర్వము హిందూస్థాన్ టైమ్స్‌లో పడిన ప్రసంగంలో మీపేరున్నది. నా సహోదరీ, నేనూ మిమ్మల్నిచూడాలని చాలా కుతూహలపడుతున్నాము. శ్రీమతి నెహ్రూ, మీరూ మొందువారంలో ఎప్పుడైనా సాయంకాలంవేళ యిక్కడికివచ్చి మాతోకలిసి టీపుచ్చుకుని సంతోషంగా కొన్ని గంటలు కాలక్షేపంచేయటానికి వీలుపడుతుందా? మే, 19,22 తారీఖుల్లో మీ కెప్పుడు వీలుగా వుండగలదో తెలియజేయవలసిందని కోరుచున్నాను. అప్పుడు పడకపోతే మీ కేనాడు వీలైనాసరే ముమ్ముందుగా వుదయమే మీరు వచ్చేముందు నాకు టెలిఫోన్ చేయవలసిందని కోరుతున్నాను. స్విట్జర్లాండ్ వాతావరణపరిస్థితి శ్రీమతి నెహ్రూకు బాగా సరిపడిందని ఆమెఆరోగ్యం బాగా కుదటపడుతుందని అనుకుంటున్నాను. మీ అమ్మాయి జెనీవా అంతర్జాతీయ పాఠశాలలో చదువుకుంటున్నదికదా. ఆమెకు ప్రొఫెసర్ కుమారి హోవ్లాష్-బాగా దగ్గర స్నేహితురాలు. ఆమె గొప్పవ్యక్తి. సమస్య

రాలు. అంతటి గొప్ప ఉపాధ్యాయుని సన్నిధిని మీ చిరంజీవిని విద్య అభ్యసిస్తున్నది. శుభాభివందనాలతో

రొమెయిన్ రోలండ్

ఓల్గా విల్లా బైరన్‌హోటల్ పరిసరంలోనే వున్నది. బోటులో రావల్సుకుంటే విల్లినోవ్‌నుంచి ఆరునిమిషాలలో అక్కడికి చేరుకో వచ్చును. రైలుమీద రాదలుచుకుంటే టెరియట్ స్టేషన్‌లో దిగి ట్రామ్ మీద హోటల్‌బైరన్‌దగ్గర దిగవచ్చును.

## 45. సరోజినీనాయుడువద్దనుంచి

బొంబాయి,

అక్టోబరు 15, 1926

ప్రియమైన జవహర్,

రేపటి మెయిలుకు అందేటట్టు నీకు జాబువ్రాయడం మర్చిపోయా ననీ, తనకు స్వస్థత చేకూరుతున్నదని, ఆరోగ్యం బాగా అభివృద్ధిచెందు తున్నదని, అందరూ కులాసాగా ఉన్నారని నీకు ఉత్తరం వ్రాయవలసి నదిగా పాపాజీ యీవాళ ఉదయం నాకు వైరిచ్చారు. సిమ్లావెళ్లకమునుపు పాపాజీ ముస్సోరిలో చాలాకాలంపాటు విశ్రాంతితీసుకున్నారు. అప్పుడు ఆయనఆరోగ్యం చాలా బాగుంది. కాని సిమ్లా వెళ్ళి వచ్చాక ఆయన కృశింపజొచ్చారు - కృశించడమనే మాట సరైనదనే అనుకుంటాను. దీనికి శారీరకమైన కారణాలకంటె - మానసికకారణాలు ఎక్కువగా కనిపిస్తున్నాయి : దౌర్భాగ్యరాజకీయపరిస్థితి ; అంతఃకలహాలు; తాను నమ్మిన, తనతో పనిజేసినవ్యక్తుల హేయమైన విచ్ఛిన్నకరమైన చర్యలు ప్రతిచర్యలు .... ఇవిగాక ప్రయాణాలవలన ఆయనకుకలిగిన అలసట. ఆమధ్య జ్వరం తీవ్రంగావచ్చింది. అది తగ్గేక ఇప్పుడు ఆయన నిజంగా బాగా కోలుకుంటున్నారనే అనుకుంటున్నాను. ఎన్నికలు ఆయనకు లేని పోని బెడదను కలిగిస్తున్నాయి. ఆయన భయపడుతున్నట్లుగా ఆయన

పక్షానికి మొత్తంమీద పరిస్థితి అంత అంధకారబంధురంగా లేదనుకుంటాను. ఇంతవరకు మతదురభిమానాలతో పరస్పర హానికరమైన చర్యలతో వ్యక్తిగత సమస్యలతో పరిస్థితి ఉద్రిక్తమైవుంది. ఇది కేవలం కృత్రిమంగా తయారుచేయబడింది. వచ్చే రెండు మూడు వారాల్లో ఈ ఉద్రిక్తత సడలిపోతుందని నాకు సంతోషంగావుంది.

నీ గురించి పలువిధాలైన చక్కటి గాలికబుర్లు నేను వింటున్నాను. నీవు జీవనోత్సాహాన్ని తిరిగి పొందుతున్నావనే వార్తలు విని చాలా ఆనందిస్తున్నాను. జడబద్ధ భయానక భారతీయ జీవితంనుంచి కాస్త తెప్పరిల్లి నువ్వక్కడ ఉల్లాసంగా వున్నందుకు సంతోషం. యూరప్ నిన్నుగురించి నీకు నూతనవిషయాలను తెలిపేదిగానూ, ఆత్మ వైక్లబ్యాన్ని తొలగించేదిగానూ నీకు గోచరించాలి మరి. కమల కోలుకుంటున్నదని అనుకుంటున్నాను. ఆమెకు స్విస్ వాతావరణం, స్విస్ ప్రజలు అంటే ఇష్టంగాఉండేమోనని నా కాశ్చర్యంగా వుంది. అక్కడి నిమ్నోన్నత ప్రదేశాలు శరదృతుపుష్పాలతో కన్నులవైకుంఠమువలె నాకు పొడకట్టి భక్తిభావాన్ని కలిగిస్తాయి. అయినప్పటికి స్విట్జర్లండ్ అంటే నే నంతగా యిష్టపడను. ఇందిర హాయిగా ఆడుకుంటుందనుకుంటాను. సరూప్, రంజిత్‌లు చాలా ఉల్లాసంగా కాలం గడుపుతున్నట్టు విన్నాను. ఆహా! అక్కడ ఆ సముద్రాల అవతల నేనుంటే ఎంత బాగుండును! ఈమధ్య అటూ యిటూ ప్రయాణంచేస్తూ తగాదాలను పరిష్కరిస్తూ కొంతకాలం కష్టంగా గడిపాను. ప్రస్తుతం నా ఒంట్లో కులాసాగాలేదు. పద్మజ కులాసాగా వుంది. కాని లీలామణికి మొన్ననే ఆపరేషన్‌చేశారు. ఇప్పుడిప్పుడే ఆమెకు స్వస్థతచేకూరుతోంది. హెడాజీ హాజీప్సు విసుగెత్తిపోయి వెనక్కివచ్చాడు. మౌలానా సావూద్‌మీద విపరీతంగా ఆర్భాటంచేస్తున్నాడు. సావూద్ అంత ఉల్లాసంగా వున్నట్టు కనుపించటంలేదు. బొంబాయిలో ఏదైనా వ్యాపారంచేయాలని తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. అన్సారి యిన్నినెలలూ యించుమించు తన వృత్తికి అంటిపెట్టుకుని నర్సులాగ రోగులకు పరిచర్యచేస్తున్నాడు. అందులోనే అతను మునిగిపోయి ఒకవిగ్రహంలాగ అయిపోయాడు. ధర్మామీటర్లతో

మంచునీళ్ళతో. వాండేవిలలో అతను బంధింపబడ్డాడు. అతని కారాగారంలో అవే అతని అనుభవాలు. ఉమర్ చనిపోవడంతో బొంబాయి నా కొక పీడకలగా తయారైంది....పాపం! ఉమర్, ఉదాత్తహృదయుడు ఉమర్, బతికున్నన్నాళ్లా అతను బాధపడ్డాడు. ఆత్మకు శాంతి చేకూరుతుందో లేదో! అతను నిన్నెంత ప్రేమించాడు....గజిబిజిగా ఉన్న నా వ్రాత నీకు బోధపడుతుందో లేదో నా కనుమానంగావుంది. చేతి మణికట్టు బాధతో బిగిసిపోయింది.

ప్రియమైన జవహర్! ఇక ఉంటాను. నువ్వు విదేశాలలో వున్నందుకు నీ ఆత్మ తన యౌవనోత్సాహదీప్తులను, దివ్య సౌందర్య దార్శనికతను, పునరుజ్జీవింపజేసుకునే అవకాశం నీ ఆత్మకు లభించినందుకు నా కెంత మహానందంగా వుంది! ఆడపిల్లలకు, తల్లికి, నీబిడ్డకూ నా ప్రేమాభివందనాలు.

నీ ప్రియమైన సోదరి,
సరోజిని.

## 46 మోతీలాల్ నెహ్రూవద్దనుంచి

ఆనందభవన్,
అల్హాబాద్
డిశంబరు 2, 1926

నా ప్రియమైన జవహర్,

నేను నీకు ఉత్తరం వ్రాయకుండా ఎన్ని టపాలు వెళ్ళిపోయాయో నాకు తెలియదు; బహుశా అవి మూడుకంటే ఎక్కువే అనుకుంటాను; ఎన్నికల ప్రచారం ముగింపుకాని నేను నిన్ననే అల్హాబాదు తిరిగివచ్చాను. ఎన్నికలఫలితాలు నీకీ ఉత్తరం అందకమునుపే తెలుస్తాయి. మద్రాసు, బెంగాలులో మెజారిటీ రాకపోయినా, మేము ఎక్కువమందిమే గెలిచాం. బీహార్‌లో ఓట్లలెక్కింపు యింకా పూర్తికాలేదు. కాని ఈ రాష్ట్రం మద్రాసు, బెంగాలులకు ఏమాత్రం తీసిపోదు. బొంబాయి, మధ్యరాష్ట్రాల

స్థితి బాగాలేదు. కాని, సంయుక్తరాష్ట్రాల్లో చాలా అధ్వాన్నమైపోయింది. పంజాబునుంచి మేమంతగా మంచిఫలితాలు ఆశించడంలేదు. అసెంబ్లీలో మా కొకస్థానంకూడా లభించకపోవచ్చును—లజపతిరాయి అబద్ధప్రచారానికి కృతజ్ఞత. చిన్నరాష్ట్రమైన అస్సాంమట్టుకు చక్కగా పనిచేసింది. బర్మా తన రెండు శాసనసభాస్థానాలలోనూ మనలను గెలిపించింది. గత మూడు సంవత్సరాలలోకంటె అసెంబ్లీలో మనబలం కొంచెం ఎక్కువగానే వుంటుంది. కాని యు. పి. కౌన్సిల్‌లో పరిస్థితి తారుమారైంది. గతసారి అక్కడ పరిస్థితి ఆశించినంతగా లేకపోయింది. ఇప్పుడు ఆమాత్రంకూడా లేకుండా అంతకంటె అధ్వాన్నంగావుంది. నా స్వంతరాష్ట్రంలో నాకు సహాయంచేయడానికి కార్యకర్త అని పిలువదగ్గవ్యక్తి ఎవడూ లేకుండాపోయాడు. అదీకాక, నేను ఇతరరాష్ట్రాల్లో ఎక్కువకాలం పర్యటించవలసివచ్చింది. కాలమంతా వాటికే వినియోగించాను. అలాకాకుండా యు. పి. లో నా శక్తినీ, కాలాన్నీ ధారపోసినా యింతకంటె ఎక్కువఫలితాలు వస్తాయనే ఆశ నాకు లేదు. మాలవ్యా-లజపతిరాయ్ ముఠా ఆధ్వర్యాన నాపై జరిగిన ప్రచారాన్ని ఎదుర్కోలేకపోయాను. నేను హిందూమతవ్యతిరేకిననీ, మహమ్మదీయులకు అనుకూలుడననీ, నన్ను బహిరంగంగా వారు నిందించారు. ఇంచుమించు ప్రతీ ఓటరువద్దకూ పోయి, నేను గొడ్డుమాంసం తింటాననీ, గోహత్యను చట్టబద్ధంచేయాలనే మహమ్మదీయులకు మద్దతునిస్తున్నాననీ, బాహాటంగా నాపై అపప్రచారంచేశారు. ఈ ప్రచారానికి శ్యామ్‌జీ ఎంత తోడ్పడ్డాడో నేను చెప్పలేను. తన గోసంరక్షణపట్టం అసెంబ్లీలో చర్చించనీయకుండా నేనే ఆపుచేయించానట! ఫైజాబాద్ డివిజన్‌నుంచి ఆయన శాసనసభకు పోటీచేశాడు; మిగిలిన ఇద్దరు ప్రత్యర్థులలో ఒకరు స్వరాజ్యవాది; యింకొకరు దద్దన్‌సాహేబు; స్వరాజ్యపక్షపు అభ్యర్థి పేరుప్రఖ్యాతులుగల ఒక లాయరు; కాని ఈవిషయంలో దద్దన్‌సాహేబు డబ్బు పనిచేసింది. శ్యామ్‌జీకి మాలవ్యా మదుపుపెట్టాడు. కాని తనపార్టీ అభ్యర్థి దద్దన్‌సాహేబు అని ప్రకటించారు. శ్యామ్‌జీ తన ధరావతు పోగొట్టుకున్నాడు కాని, స్వరాజ్యపార్టీఅభ్యర్థి, దద్దన్‌లమధ్య "నువ్వా-

సేనా" అన్నట్లుగా పోటీ జరిగింది. విచిత్రమేమిటంటే దద్దన్‌వంటి ఒక అవివేకి సామర్థ్యము, పేరుప్రఖ్యాతులున్న వ్యక్తిని సహితం ఓడించ గలిగాడు. బాబాజీ మరణించినసంగతి నీకు తెలుసుననుకుంటాను. ఓమ్మట శ్యామ్‌జీ రోతపుట్టించే "మా తల్లి చనిపోయింది; చనిపోయింది మా తల్లి" అనే నినాదాన్ని చేపట్టాడు.

ఎన్నికలలో కులతత్వప్రచారం, ఓట్లకోసం విరివిగా డబ్బు వెద జల్లడం ఈరోజులలో ఒక ఆనవాయితీ అయిపోయింది. పరిస్థితి నాకు చాలా అసహ్యంగావుంది. రాజకీయరంగంనుంచి విరమించాలని నేను తీవ్రంగా ఆలోచిస్తున్నాను. అయితే కాలం ఎలా గడపడమనే ప్రశ్న నన్ను వేధిస్తోంది. గౌహతిలో కాంగ్రెసుమహాసభ జరిగేవరకు నేనేమీ మాట్లాడకుండా నిరీక్షిస్తూవుంటాను. బిర్లాధనసహాయంతో కాంగ్రెసు సంస్థను ఆక్రమించుకునేందుకు మాలవ్యా - లాలామురా, అతి తీవ్రంగా ప్రయత్నిస్తోంది. మనం నిస్సహాయస్థితిలోవున్నాం కనుక బహుశ వాళ్ల ప్రయత్నాలు ఫలించవచ్చును. దేశంలో అతి బలమైన ఒకపక్షానికి నాయకుణ్ణిగా నన్ను చెప్పుకున్నప్పటికీ గౌహతీ కాంగ్రెసు అనంతరం నేను నా శాసనసభ్యత్వానికి రాజీనామాయిస్తూ ఒక బహిరంగప్రకటన చేద్దామని అభిప్రాయపడుతున్నాను. ఈ రకమైన మనుష్యులతో, ప్రస్తుతం మనకున్న సంఖ్యాబలంతో అసెంబ్లీలోనూ కౌన్సిల్‌లోనూ మనవల్ల మంచి ఏమీజరగదు. కొంతమంది సభ్యులు మనపక్షంనుంచి జారిపోతారని నాకు భయంగావుంది. అదలావుంచగా మనం దేనినీ సాధించలేని స్థితిలోవున్నాము. ఇక దేశంలో చేయవలసిన పనులుగురించి ఆలోచిద్దామంటే, ఏపనీ జయప్రదంగా కొనసాగించే అవకాశం నాకు కనుపించడంలేదు. హిందూముస్లిం సామరస్యము సాధించడంకోసం నేను నెలకొల్పిన జాతీయసమాఖ్య ఒకటి ఉన్నదనుకో; కాని ప్రస్తుత మతోద్రేకపరిస్థితులలో నే నేంచెప్పినా అది చెవిటివానిముందు శంఖం వూదినట్లుంటుంది. గాంధీజీతో నేను సంప్రదిస్తాను; కాని కొంతమేరవరకు తప్ప ఆయన అభిరుచులు నాకు రుచించవు. నువ్వు నాకు చాలాదూరంలో వున్నావు; కనుక నువ్వు సలహాయివ్వలేవు; కాని నీ అభిప్రాయాలు

ఏమిటో తెలిపితే సంతోషిస్తాను. గత తొమ్మిది పది మాసాలనుండి వర్తమాన భారతీయరాజకీయాలతో స్పర్శమాత్రంగానైనా సంపర్కంలేని నిన్ను, నీ అభిప్రాయం చెప్పమని అడగడం సముచితంకాదని నాకు తెలుసును. కాని నేనేవిధంగా కాలం గడపాలో నువ్వు సూచనలిస్తే అవి నాకు సహాయపడతాయి.

ఎన్నికలవల్ల నేను బాగా అలసిపోయాను. కాని ఇప్పటికికూడా విశ్రాంతి చిక్కడంలేదు. కపిపూర్ రాష్ట్రీయమహాసభ జరగబోతోంది. అది అయినతరువాత డిసెంబరు అయిదవతేదీనుంచి, తొమ్మిదవతేదీ వరకు రాష్ట్రీకమిటీ రొపీ సమావేశం జరుగుతుంది. పిమ్మట గౌహతిలో కాంగ్రెసుమహాసభ ప్రారంభంకానున్నది. ఈ సమావేశాలన్నీ ఒట్టి గడబిడతప్ప మరేమీచేయవు. అయినప్పటికి వాటిలో ఎంతవరకు చెత్తచేరిందో పూర్తిగా అంచనావేసుకోడంకోసం వాటిని చూడదలుచుకున్నాను. గౌహతికి కలకత్తానుంచి పడవమీద సుందరవన్ మీదుగా ప్రయాణంచేద్దామని అనుకుంటున్నాను. పడవమీద వారంరోజులు ప్రయాణంచేస్తే యిన్నాళ్లూ నాకుకలిగిన అలసట తప్పక ఉపశమిస్తుంది. నాకు ఒంట్లో నీరసంగాఉంది. ఒంట్లో నెత్తురు లేకపోవడంవల్ల, నీరు చేరడంవల్ల, మళ్ళీ ఎక్జిమా ఎక్కువైంది. అక్కడక్కడ రసి కారుతోంది. ఇంతకుతప్ప నా ఒంట్లో మరేమీలేదు.

నీ ఉత్తరం వస్తుందేమోనని మొన్నటి టపా చూశాం; ఇంట్లో ఎవరికీ నీవు ఉత్తరం వ్రాయలేదు. బహుశా నువ్వు జర్మనీ వెడతావు కాబోలు; అలా అని నాన్ చెప్పుతున్నది. మాంటానా వెళ్ళినట్లు నువ్వు యిదివరకు ఉత్తరాలు వ్రాశావు. అక్కడకు వెళ్ళడంవలన కమల ఆరోగ్యం కాస్త మెరుగైనదనుకుంటాను. మిగతావిషయాల్లో మెరుగు కనుపించినా, ముఖ్యంగా మనం చూచుకోవలసినది టెంపరేచరు. కనీసం టెంపరేచరు ఒకనెల్నాళ్ళు నార్మల్ గావుంచేతప్ప ఆరోగ్యం బాగుపడుతున్నట్టులెఖ్ఖకాదు. ఇంకా కొన్నివారాలపాటు మాంటానాలో వుంచే అనుకున్న అభివృద్ధి కనిపిస్తుందని ఆశిస్తాను. నీ ప్రియమైన,

తండ్రి

## 47 మోతీలాల్ నెహ్రూ వద్దనుంచి

పి. యస్. ఐరోటి,
సుందరబన్స్,
డిశంబరు 15, 1926

నా ప్రియమైన జవహర్,

సుందరబన్సుకు వెళ్తూ నీకీ ఉత్తరాన్ని వ్రాస్తున్నాను. నాతోపాటు కొందరు, ఈ దారినే వస్తామన్నారు; కాని ఉపాధ్యాయ, హరిదత్తు మొగలావాళ్ళంతా. ఎవరిదారినవారు బయలుదేరారు. రెండవతరగతిలో స్వామీ సత్యదేవ్ యిద్దరు శిష్యులతో ప్రయాణంచేస్తున్నాడు. కలకత్తానుంచి యిక బయలుదేరబోతామనగా నాతో తనూ వస్తానని తొందరపడ్డాడు. ఇప్పుడు నేనతన్ని దూరంగానే వుంచాను. మాట్లాడడానికి నేను పిలిస్తేతప్ప అతను నా దగ్గరకు రాడు. మొదటితరగతి ప్రయాణీకులు యింకొకరెవ్వరూ లేకపోవడంవల్ల అతన్ని అందులో కూర్చోనిచ్చారు.

సుందరబన్సు అనే పేరు ఎవరు పెట్టేరో కాని అది పేరుకు తగినట్లుగానే వుంది. భారతదేశంలో, నీటిమీద ప్రయాణం ఇక్కడ ఉన్నంత అందంగా హాయిగా మరెక్కడా ఉండదు. ఇలాగా ప్రయాణం చేయాలని నాకు తోచినందుకు సంతోషంగావుంది. ప్రవాహం చిన్న చిన్న అడవులిచుట్టూ వలయాలుగా తిరుగుతూ ప్రవహిస్తోంది. మా నౌక ఆ సుడిగుండాల్లో మెల్లిగా గంటకు ఎనిమిదిమైళ్ళచొప్పున ముందుకు సాగుతోంది. అటూ ఇటూ ఎన్నిమైళ్ళు చూచినా మనుష్యులు నివసిస్తున్న జాడ కనపడదు. ఎటుచూచినా దట్టమైన అడవి కనిపిస్తూంది. అడవిలో జింకలదగ్గరనుంచి పెద్దపులులవరకు అన్నిరకాల మృగాలు ఉన్నాయట. నావెంట రైఫిల్ తెచ్చుకోవడం మర్చిపోయాను. మీదగ్గర తుపాకి ఉన్నట్లయితే నియమానికి వ్యతిరేకమైనా నౌకను కొంచెం దారితప్పించి వేటాడడానికి మీకు కావలసినంత అవకాశం కలిగించుదుమని సరంగు (కమాండుపనిని నిర్వహిస్తున్నందుకు నెలకు అతనిజీతం రు 70/-) అన్నాడు. వారి ప్రశ్నించకుండా యిక్కడినుంచే వెడుతూ వెడుతూ

తుపాకీ గురిచేయవచ్చును; నదీమార్గం సాధారణంగా దారిపొడుగునా యిరుకుగా వుంది. సరిగ్గా నౌకపట్టేటంత వెడల్పుమాత్రమే వుంది. విశాలమైన, దట్టమైన అడవులను పూర్తిగా దాటినతరువాత స్టీమరు హఠాత్తుగా ఒకానొక సన్నటి పాయలోకి ప్రవేశిస్తుంది. ఆ పాయలోనుంచి తిన్నగా పోయి ఒక నదీముఖద్వారంలోనికి ప్రవేశిస్తుంది. నదీతీరాల యిరువంకల పెద్దవీ, చిన్నవీ, అనేకరకాల అడవివృక్షాలు వ్యాపించి ఉన్నాయి. పొట్టిగా, పొడుగ్గా అక్కడక్కడ ఈతచెట్లూ, తాడిచెట్లూ పల్చపల్చగా కనిపిస్తున్నాయి. ఆహ్లాదకరమైన ఈ దృశ్యం మనస్సును ఆకట్టుకుంటూవుంది. నే నలాగ దానికేసి గంటలకొద్దీ చూస్తూ ఉండిపోయాను. కటకటాలవద్ద నించుని నువ్వు పంపించిన దూరదర్శినిలో వంపులుతిరిగి ప్రవహించే నదినీ, దూరప్రదేశాల్నీ చూస్తూ కాలం గడిపాను.

ఇక్కడి స్టీమర్లు నిర్ణీతకాలానికి గమ్యం చేరుకుంటాయి, కనుక 22, 24 వ తేదీల లోపున మేము గౌహతి చేరుకోవచ్చును. 24 వ తేదీని విషయనిర్ధారణసంఘసమావేశం జరుగుతుంది. నేను ఆ సమావేశానికి అందుకోగల ననుకుంటాను. ప్రయాణంలో మహోల్లాసాన్ని కలిగిస్తున్న సుందరబన్సుప్రాంతాన్ని ఈ రాత్రి ఖుల్నా చేరడంతో దాటిపోతాం. ప్రకృతిరామణీయకతకు బదులు, యిక నాగరికత అనబడేది మా కళ్లకు కనిపిస్తుంది. రెండు మూడు రోజుల్లో మేము గొలందో చేరుకుంటాము. మార్గమధ్యంలో అద్భుతమైన ప్రకృతిదృశ్యాలు మేము చూడబోతున్నాము. గొలందో దాటి కొన్నిమైళ్లు వెళ్లాక తల్లి గంగానదిని విడిచిపెట్టి మా నౌక తండ్రి బ్రహ్మపుత్రలో ప్రవేశిస్తుంది. గౌహతి దాటేక ఆ చిన్న ప్రయాణంలోసైతం ఎన్నో అందాలు మాకు నేత్రానందం కలిగించనున్నాయి.

ఈ ప్రయాణంవల్ల నా శక్తిని నేను పుంజుకుంటున్న లక్షణాలు కనిపిస్తున్నాయి. ఏదో విపరీతం జరిగితేతప్ప ప్రయాణం ముగిసేసరికి నా శరీరం యింతకన్న తేటపడుతుంది,

రీ ఉత్తరం ఖుల్నాలో పోస్టుచేస్తాను. ఈవేళ అక్కడినుంచి కలకత్తాకు మెయిలుటపా వెడుతుంది. ఖుల్నా అనేక రైలుమార్గాల కూడలిస్థలం కనక ఈ ఉత్తరం అక్కడ వారంరోజులవరకు వుండిపోవచ్చును. అయినప్పటికీ మళ్లీ మెయిలుటపా ఎప్పుడో తెలియదు కనుక దీన్ని అక్కడే పోస్టుచేయడం మంచిదనుకుంటున్నాను.

నేను అల్లాహాబాద్‌నుంచి బయలుదేరిన తరువాత నీ నవంబరు 23వ తేదీ ఉత్తరం అక్కడకు చేరింది. నేను కలకత్తానుంచి బయలుదేరే ముందు రంజిత్ దానిని నాకు పంపించాడు. నువ్వు మాంటనా చేరినట్లు వ్రాశావుకాని నువ్వు జర్మనీనుంచి తిరిగివచ్చేక కమలకు ఎలాగుందో వ్రాశావుకావు. ఆమెకు ఒంట్లో బాగున్నట్లు వెంటనే ఉత్తరం వ్రాస్తావని ఆశిస్తాను.

పాపం, ఇందిర పుట్టినరోజు పండుగకు మేము కానుక ఏమీ పంపించలేకపోయాం. ఎన్నికల అదావిడివల్ల, యితర వ్యాపకాలవల్ల ఆమాట మరచిపోయాను. అందుకు చాలా విచారిస్తున్నాను.

యూరప్‌లో అంతకాలం వుండి, నాన్. తిరిగివచ్చాక అనుకున్నంత ఆరోగ్యంగా కనిపించలేదని నేను నీకు వ్రాశాను. కాని ఆమె గర్భిణితో ఉన్నదన్న సంగతి మర్చిపోయాను. ఆమె ఒంట్లో హాయిగానే వుంది.

నీ దగ్గర ప్రస్తుతం ఉన్న డబ్బు డిశంబరు 15వ తేదీవరకు సరిపోదంటావు. నవంబరు 23వ తేదీన జాబులో వ్రాశావు. జమ్నాలాల్‌జీ నాకు వ్రాసిన ఉత్తరం ఇప్పుడు నాదగ్గిర వుండటం తటస్థించింది. అదొకసారి చూశాను. నీకు నవంబరు 11వ తేదీన 300 పౌన్లు పంపించినట్లుగా అందులోవుంది. ఈపాటికి నీ కా డబ్బు అందివుంటుంది. దాని విషయమై నేనేమీ పట్టించుకోవడంలేదు. నా భవిష్యత్ కార్యక్రమాన్ని ఇంతవరకు నేను నిర్ణయించుకోలేదు. దాన్నిగురించి ఆలోచించడానికి నాకు వ్యవధిలేకపోయింది, గౌహతీ కాంగ్రెసు అయిన తరువాత ఏదో ఒక స్పష్టమైన అభిప్రాయానికివస్తాను. ఈలోపున నాకు కలుగుతున్న

అభిప్రాయాలు నీకు ఎప్పటికప్పుడు తెలుపుతూవుంటాను. ఇంకా నాకు వారంరోజులు వ్యవధి వుంది.

అందరికీ ప్రేమతో,

నీ ప్రేమగల,
తండ్రి.

## 48. మోతీలాల్ నెహ్రూవద్దనుంచి

ది అస్సాం మెయిల్,
డిసెంబరు 30, 1926

నా ప్రియమైన జవహర్,

గౌహతినుంచి రైలులో తిరిగివెళ్ళిపోతూ, నీ కీ ఉత్తరం వ్రాస్తున్నాను. నాతోపాటు అధ్యక్షుడు, మాజీ అధ్యక్షుడు, అనేకమంది ప్రతినిధులు ప్రయాణంచేస్తున్నారు. ప్రయాణీకులతో క్రిక్కిరిసిపోయి రైలు ఊగిసలాడుతోంది. సరిహద్దుప్రాంతపు యిటుకుపాడులపోయే రైలు కావడంవల్ల, భారతదేశంలో యిన్ని సదుపాయాలున్న రైలు, మరొకటిలేదని అంటారు. కాని దారిలో అక్కడక్కడ పత్రికావిలేఖరులు కాసుకూర్చున్నారు. మా స్థలాలలో మమ్మల్ని వాళ్ళు కూర్చోనివ్వేటట్లులేరు. నీకు తరువాత టపాలో విపులంగా ఒక ఉత్తరంవ్రాస్తాను. ఈలోపున నీ కీ వార్త చెబితే చాలును; అనుకున్నదానికంటె, గౌహతీ కాంగ్రెసు జయప్రదంగా జరిగింది. అభివృద్ధినిరోధకులకు వ్యతిరేకంగా మేం గట్టిగా నిలబడ్డాము. మా ప్రతిపాదన లన్నిటిని అత్యధిక సంఖ్యాకులు బలపరిచారు; గెలిపించారు.

శ్రద్ధానందస్వామిని హత్యచేయడంవల్ల, మతోద్రేకాలు మళ్ళీ పెరిగిపోతున్నాయి; ఇందుకు ప్రతిక్రియగా దెబ్బకుదెబ్బతీస్తామనే బెదరింపులు పలు ప్రాంతాలనుంచి వినవస్తున్నాయి. నిజమైన ప్రమాదం బెంగాలునుంచి సంభవించవచ్చును. అక్కడి విప్లవవాదులలో చాలామందికి కులతత్త్వం పూర్తీభవించివుంది.

కమలఆరోగ్యం బాగుపడుతున్నట్లు నీ గత రెండు జాబులవల్ల తెలుసుకుని. చాలా సంతోషించాను. పీడితదేశప్రతినిధుల అంతర్జాతీయ మహాసభకు నువ్వు కాంగ్రెసుప్రతినిధిగా ఎన్నికయినావు. అంతర్జాతీయ మహాసభ అక్టోబరులోనే జరుగనున్నది కనుక నిన్ను తప్ప, యింకొక రిని ప్రాతినిధ్యంవహించమని కోరడానికి వ్యవధిలేకపోయింది. నీ ఖర్చులను కాంగ్రెసు భరిస్తుంది. నీ కీ విషయాలు రంగస్వామి కేబుల్ ద్వారా తెలియచేశారు; లాంచనప్రాయమైన ఉత్తరాలు నీకూ, మహా సభకార్యదర్శికీ ఈరోజుటపాలో ఆయన పంపిస్తారు.

పూర్తివిశేషాలు వచ్చేసారి వ్రాస్తాను.

నీ ప్రేమగల,
తండ్రి.

## 49 మహాత్మా గాంధీవద్దనుంచి

నందిహిల్,
మైసూరుస్టేట్,
మే 25, 1927

నా ప్రియమైన జవహర్‌లాల్,

నీ ఉత్తరం అందినప్పుడు, నేను జబ్బుతోవున్నాను; ఉత్తరాలు వ్రాసేస్థితిలో లేను. ఇప్పటికింకా, ఆరోగ్యం పూర్తిగా కుదుటపడలేదు. కొద్దిమాత్రపు పనిమాత్రం చేయడానికి ఓపికవచ్చింది; కాని స్వస్థత క్రమగతిని చేకూరుతున్నది.

నువ్వు విదేశాలకువెళ్ళి యిప్పటికి చాలాకాలమయింది; అయితే నువ్వు కాలం వృథాచేయడంలేదని నాకు తెలుసును. నువ్వక్కడకు వచ్చే సరికి, కమలకు పూర్తిగా నయమౌతుందని ఆశిస్తాను. ఆమెకు పూర్తిగా నయంకావడానికి, యింకా కొంతకాలం వుండవలసివస్తే, మీ రక్కడ వుంటారనే, నేను తలుస్తాను.

వలసదేశ అంతర్జాతీయ మహాసభా కార్యకలాపాలను గురించి, పత్రికలలో పడిన నీ నివేదికను అంతరంగికంగా నువ్వు పంపిన రహస్య నివేదికలు నేను చదివాను. ఈ సమితినుంచి పెద్దగా ప్రయోజనం చేకూరుతుందని నేనాశించడంలేదు; ఏమంటే పీడితదేశాలను ఏరాజ్యాలైతే దోచుకుతింటున్నవో ఆ రాజ్యాల దయాదాక్షిణ్యంమీద దీని స్వేచ్ఛా ప్రవర్తన ఆధారపడివుంది. సమితిలో చేరిన పాశ్చాత్యదేశాల సభ్యులు తుదివరకు నిలబడతారని నే ననుకోను. సమితి చర్యలవల్ల తమ స్వలాభానికి భంగంవాటిల్లనున్నదని భావించినప్పుడు ఆ వాదాన్ని వారు యిముడ్చుకోలేరు. ఇక మన పక్షంనుంచి ఆలోచించి చూద్దాం. దేశవిముక్తి కోసం స్వశక్తిని కూడగట్టుకోవడానికి బదులు బాహ్యశక్తుల సహాయం కోసం మన ప్రజలు మళ్ళీ ఎదురుతెన్నులు చూస్తారు. కేవలం స్థూలంగా నా అభిప్రాయం చెప్పాను; అంతకుతప్ప ప్రత్యక్షజ్ఞానాన్ని పురస్కరించుకొని నే నీమాట చెప్పడంలేదు. పాశ్చాత్యదేశాల్లో జరుగుతున్న సంఘటనలను నేను జాగ్రత్తగా పరిశీలించడంలేదు. నువ్వక్కడున్నావు. అక్కడి వాతావరణం, పరుల కుపకారంచేయాలనే భావంతో నిండివున్నట్లు నీకు స్ఫురించివుంటుంది. కాని అది నా కంటికి పిసరంత కనిపించడంలేదు. కాంగ్రెసు అధ్యక్షుడుగా నిన్నీసారి వరించాలని కొందరనుకుంటున్నారు. ఆమాట అక్కడక్కడ వినపడుతోంది. నాన్నగారితో ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతున్నాను. హిందూ ముస్లిం సమస్యపై అ. భా. కాం. కార్యవర్గం ఏకగ్రీవంగా తీర్మానించినా, ఆచరణలో పరిస్థితి అలాగేవుంది. ఆ సమస్యపట్ల కొందరి దృక్పథం సంతోషదాయకంగా లేదు. తలలు బద్దలుకొట్టుకునే పద్ధతిని ఏవిధంగానైనా మనం ఆపగలమో లేదో నాకు తెలియడంలేదు. మనం ప్రజల్లో పలుకుబడి పోగొట్టుకున్నాం. నువ్వు అధ్యక్షుడవైతే ఒక ఏడాదివరకు ప్రజలకు దూరంగా ఉండిపోతావని నా కనిపిస్తోంది. అయితే అంతమాత్రంచేత కాంగ్రెసుపని నిర్లక్ష్యంచేయబడుతుందని దాని అర్థంకాదు. అది ఎవరో ఒకరు ఎలాగూ చేస్తారు; ఆ పని చేయడానికి ఒకరుకాదు; అనేకమంది ఆతురపడుతున్నారు; ముందుకు వస్తు

న్నారు; ఇలా రావడంలో వారికి అనేక ఉద్దేశ్యాలు, స్వలాభాపేక్ష ఉంటే ఉండవచ్చును; కాని వారు కాంగ్రెసును ఏదోవిధంగా నడిపిస్తారు. వారు కోరినట్లుగా ఆ సంస్థ ప్రజలలో పనిచేసే అర్హతకలిగినవ్యక్తుల, ప్రజల మన్ననలపొందిన వ్యక్తుల ఆధీనంలో ఎప్పుడూ వుంటుంది. కాని నీవు అధ్యక్షుడుగా ఉండకపోయినట్లయితే యిక నీసేవను ఏవిధంగా ఉపయోగించుకోవచ్చుననే ప్రశ్న ఉదయిస్తోంది. నీ అంతట నీవు ఆలోచించుకొని నీకు ఎలాతోస్తే అలాచేయి; రాగద్వేషాలు లేకుండా నువ్వు విషయాత్మక దృక్పథంతో దాన్ని వీక్షించగలవని నాకు తెలుసును; ఎలాంటి స్వార్థంలేకుండా దాదాభాయ్, మాక్స్వినీలవలె "నా శిరస్సుమీద యీ కిరీటాన్ని ఉంచండి" అని అనగలిగేశక్తిమంతుడవని నాకు తెలుసు. నువ్వలా అంటే ఆ కిరీటాన్ని నిస్సందేహముగా నీ శిరస్సుపై పెడతాను. కిరీటాన్ని నువ్వు ధరించాలని నీతో వాదించడానికీ, అది నువ్వు ధరించేటట్లుగా నిన్ను బలవంతంచేయడానికి నాకంత అవసరం కనిపించడంలేదు. ఈ విషయాన్ని గురించి నాన్నగారు నీకీసరికి వ్రాయకపోయినట్లయితే, వెంటనే ఆయనకూడా వ్రాస్తారు. ఈ జాబు ప్రతిని ఆయనకు నేను పంపిస్తున్నాను.

నీ అభిప్రాయాలేమిటో నువ్వు కేబుల్ద్వారా తెలియపరిస్తే బాగుంటుంది; జూలై నెలాఖరువరకు నేను బహుశా బెంగుళూరులో వుండవచ్చును. కనుక నువ్వు సరాసరి బెంగుళూరుకే నీ కేబుల్ పంపు. తిరాజేపి అప్పుడు అక్కడ ఉంటానో ఉండనో. నువ్వు ఆశ్రమానికే కేబుల్ పంపితే అక్కడివారు నేనెక్కడవుంటే అక్కడికి ఆ విషయాలను వెంటనే తెలియజేస్తారు.

మీ అందరికీ ప్రేమతో.

సీ,

యం. కె. గాంధి.

50. మహాత్మా గాంధీవద్దనుంచి,

[ 1927 డిసెంబరులో నేను యూరప్నుంచి తిరిగివచ్చి మద్రాసులో జరుగుతున్న అ॥ భా॥ కాం॥ మహాసభకు సరాసరి హాజరయ్యాను. నా ప్రోద్బలంవల్ల అక్కడ అనేక తీర్మానాలు

ఆమోదింపబడ్డాయి. మహాసభలో నా కార్యకలాపాలు కొన్నింటిని మహాత్ముడు ఆమోదించలేదు. దానిని పురస్కరించుకొని ఆయన ఈ ఉత్తరం వ్రాశారు. ]

సత్యాగ్రహాశ్రమం,
సబర్మతి,
జనవరి 4, 1928

నా ప్రియమైన జవహర్‌లాల్,

నువ్వు నన్ను అమితంగా ప్రేమిస్తున్నావు. అందుచేత నే నిప్పుడు వ్రాస్తున్నవిషయం నీకు యిట్టే ఆగ్రహం కలిగించవచ్చును. ఏమైనప్పటికి నిన్ను నే నమితంగా ప్రేమిస్తున్నాను. అందుచేత నేను వ్రాసితీరవలసిన విషయాలను వ్రాయడానికి కొంత వెనుకాడుతున్నాను.

నువ్వు చాలా తొందరపడుతున్నావు. అంత తొందరపడి అడుగు వేయకూడదు. కొంతకాలం ఆలోచించిచూడాలి. ఇక్కడి వాతావరణానికి నువ్వు అలవాటుపడాలి. నువ్వు రూపొందించి, గెలుపొందించిన తీర్మానాలలో చాలావాటివిషయమై తొందరపడనవసరంలేదు. ఒక ఏడాదివరకు వాటిని ఆపివుంచవలసింది. ప్రజాసైనికదళాన్ని ఏయత్తిపరచాలనే తీర్మానం ఒట్టి తొందరపాటుచర్య. నువ్వుచేసిన యీ పనులకు నే నంతగా బాధపడటంలేదు. కాని నిన్ను ప్రోత్సహిస్తున్న దుశ్చేష్టాపరుల, దుండగీడుల చర్యలకు ఆందోళనచెందుతున్నాను. విశుద్ధమైన అహింసాతత్త్వంమీద నాకు నమ్మకంఉందో లేదో నాకు తెలియదు. నీ దృక్పథాలను నువ్వు మార్చుకున్నప్పటికీ, ఒక హద్దూ పద్దూ లేని విశృంఖల హింసాచర్యలు, దేశాన్ని విముక్తిపరుస్తాయని నువ్వు ఎంత మాత్రం భావించజాలవు. నీ పాశ్చాత్యదేశాల అనుభవాలదృష్టితో ఈ దేశాన్ని జాగ్రత్తగా పరిశీలించినపిదప మనం లనుసరిస్తున్న మార్గాలు, పద్ధతులు దోషభూయిష్ఠంగా ఉన్నాయని నువ్వు నమ్మినట్లయితే, నీస్వంత అభిప్రాయాలు ఆమోదింపబడడానికి నువ్వు అన్నివిధాలా ప్రయత్నించు. కాని దయవుంచి క్రమశిక్షణగల ఒక పార్టీనిమాత్రం స్థాపించు.

కాస్పూరుఅనుభవాలు ఏమిటో నీకు తెలుసును; క్రమశిక్షణకు లొంగి వుండే వ్యక్తులు ప్రతీ పోరాటానికి అవసరం. నీ సాధనాలపట్ల నువ్వు నిర్లక్ష్యంగా ఉండడంవల్ల నువ్వు ఈ యథార్థాన్ని మరచిపోయినట్లున్నావు.

ఇప్పుడు నువ్వు అ. భా. కాం. కార్యదర్శివి. ప్రధానతీర్మానానికి నీ శక్తినంతా కాంగ్రెసు కార్యదర్శిగా వినియోగించడం నీ కర్తవ్యం; అంటే ఐకమత్యంకోసం సైమన్ కమీషన్‌ను బహిష్కరించడంకోసం నువ్వు దీక్షవహించవలసివుంటుంది. సమైక్యభావమును సాధించాలనే తీర్మానం నీ ప్రజ్ఞనూ, నిర్మాణదక్షతనూ, ఓర్పునూ వాంఛిస్తున్నది.

ముక్తసరిగాతప్ప నా అభిప్రాయాలను నేను వివరించడానికి నాకు వ్యవధిలేదు.

యూరోపులో ఉన్నట్లుగానే కమలకు కులాసాగానే ఉంటను కుంటాను.

నీ,

బాపు.

## 51. మహాత్మా గాంధీవద్దనుంచి

ఆశ్రమం,
సబర్మతి,
జనవరి 17, 1928

నా ప్రియమైన జవహర్‌లాల్,

భుజం నొప్పిపెట్టడంవల్లనూ, త్వరగా ముగుస్తున్నదన్న భావంతోనూ, ఈ ఉత్తరం యింకొకరికి నోటితోచెప్పి వ్రాయిస్తున్నాను. ఫెన్నర్ బ్రాక్వేనుగురించి నీకు మొన్న ఆదివారంనాడు ఉత్తరం వ్రాశాను. ఆ ఉత్తరం నీకు సకాలంలో అందిందనుకుంటాను.

అఖిలభారత వస్త్రప్రదర్శినతప్ప మిగిలిన ఆ వ్యవహారాల్లో నువ్వు ప్రధాన భాగస్వామివి కనుకనే నేను ఆ వ్యాసాలు వ్రాశాననేసంగతి నీకుతెలుసునా? నా వ్యాసాలను నువ్వు విమర్శించావు. నేను నా వ్యాసాలను

ఏ ఉద్దేశంతో వ్రాశానో, ఆ ఉద్దేశాన్ని, నీకూ నాకూ ఉన్న సంబంధాన్ని బట్టి అపార్థంచేసుకోవనే ధైర్యం నాకుంది. కాని అన్నివిధాలా వాటికి గురి తప్పింది. అందుకు నేను విచారించడంలేదు. కాని అవి ఒకందుకు తోడ్పడ్డాయి. అనేక సంవత్సరాలనుంచీ నువ్వు లోలోపల అణచు కుంటున్న భావాలను నువ్వు వ్యక్తపరచడానికి అవి సహాయపడ్డాయని స్పష్టపడుతోంది. ఉభయుల దృక్పథాలలోనూ కొంత భేదం కనిపిస్తున్న దని నే నిదివరకే పోల్చుకోగలిగాను. అయితే అది యింత విపరీతంగా వుంటుందని నే నెన్నడూ ఊహించలేదు. దేశక్షేమాన్నికోరి, నీ అభి ప్రాయభేదాలను, నువ్వు లోలోపల వీరోచితంగా యిన్నాళ్లూ అణచిపెట్టు కుంటూవచ్చావు. నీకు అభిప్రాయభేదాలు ఉన్నప్పటికీ, నా సహచరు నిగా నాతోకలసి పనిచేయడంవల్ల దేశానికి సేవచేయగలనని, ఎట్టి హానీ కలగజేయకుండా ఉండవచ్చునని నువ్వు విశ్వసించావు. ఇలాగ అస్వా భావికంగా ఆత్మను అణచుకుంటూ ఆ భావానికి నీ మనసులోనే నువ్వు ఉద్రేకపడ్డావు. ఇప్పుడు వేటిని నువ్వు నా మహాదోషాలుగా పరిగణిస్తు న్నావో, వాటిని అప్పుడు గమనించకుండా విస్మరించావు. నేను కాంగ్రె సుకు ప్రత్యక్షంగా నాయకత్వంవహిస్తున్నప్పుడు అ. భా. కాం. కమిటీ కార్యకలాపాలను ప్రస్తావిస్తూ యంగ్‌యిండియాలో చాలవంటి తీవ్రమైన వ్యాసాలనే వ్రాశాను. అవి నీకు చూపించగలను. ఎప్పుడు ఎవరు బాధ్యతారహితంగా ప్రవర్తించినా, అనాలోచితంగా మాట్లాడినా, నే నీవిధంగానే నిశితంగా అ. భా. కాం. సంఘ సమావేశాల్లో ప్రసం గిస్తూవచ్చాను. కాని అప్పుడు నువ్వు అనేవిధమైన మనస్తత్వంతో ఉండడంవల్ల అప్పుడు యీ విషయాలు ఇప్పటివలె అవసరంగా తోచలేదు. అందుచేత నీ ఉత్తరంలోఉన్న పరస్పర విరుద్ధాలు, వాటి చూపించి ప్రయోజనంలేదు. ఇప్పుడు నాకు భవిష్యత్ కార్యక్రమంతోనే ప్రమేయముంది. నీ విన్ని సంవత్సరాలు, నాపట్ల వినయవిధేయతలతో భక్తిభావంతో మెలగుతూవచ్చావు. ఇప్పుడు నువ్వున్నస్థితిని నేను గ్రహించడంవల్ల నీవుచూపిన భక్తిభావానికి యింకా ఎక్కువ విలువ యిస్తున్నాను. కనుక నాయందు నువ్వెట్టిస్వేచ్ఛను కోరినా, ఇట్టిస్వేచ్ఛను

నీకు నేను యిస్తాను. నాకూ, నా అభిప్రాయాలకూ వ్యతిరేకంగా బాహాటంగా నువ్వు యుద్ధం కొనసాగించవలసిన అవసరంవచ్చిందని నేను గ్రహించాను. నువ్వలా యుద్ధం కొనసాగించాలి. నే నొక దోషంచేస్తున్నప్పుడు, నేను దేశానికి తీరనిహాని కలగజేస్తున్నపుడు, ఆవిషయం నీవు తెలుసుకున్నతరువాత నువ్వు నామీద తిరుగుబాటుచేయడం నీ కర్తవ్యం. నీ అభిప్రాయాలు సరిఅయినవో, కావో అనే అనుమానం నీకున్నపుడు, నీతో నేను వాటిని సంతోషపూర్వకంగా చర్చిస్తాను. నీకూ, నాకూ ఉన్న అభిప్రాయభేదాలు చాలా తీవ్రమైనవని నేననుకుంటున్నాను. వాటి సమన్వయం అసాధ్యం. మనిద్దరిమధ్య అట్టి ప్రాతిపదిక ఉన్నట్లు నాకు కనిపించడంలేదు. నీవంటి వీరోచితుడైన, విశ్వాసపాత్రుడైన, నిజాయితీపరుడైన సహచరుని పోగొట్టుకుంటున్నందుకు నాకు కలుగుతున్న దుఃఖాన్ని నేను దాచుకోలేను. కాని ఒక ఆదర్శంకోసం పనిచేస్తున్నపుడు, అవసరమైతే సాహచర్యాన్ని త్యాగంచేయవలసివుంటుంది. ఒకరిమీద ఒకరికున్న భ్రమలు తొలగిపోతున్నా, ఒకరికొకరికున్న చనువుకు భంగంవాటిల్లదు. మనం చాలాకాలంనుంచీ ఏకకుటుంబీకులంగా వుంటున్నాం. మనకు ఎన్ని తీవ్రమైన రాజకీయ అభిప్రాయభేదాలున్నా మనం ఎప్పుడూ అలాగే వుంటాం. చాలామందితో యిటువంటి బాంధవ్యాన్ని పొందే అదృష్టం నాకు కలిగింది. మాటవరసకి శాస్త్రివిషయాన్ని ఆలోచిద్దాం. రాజకీయవిషయాలలో ఆయనకూ నాకూ ఉత్తరదక్షిణధ్రువాలకున్నంత భేదముంది. ఈ అభిప్రాయభేదాలు కలగనప్పుడు ఆయనకీ నాకూ కలిగిన అనుబంధం అనేకపరీక్షలకు తట్టుకుని యిప్పటికీ అలాగేవుంది,

నీ పతాకాన్ని నువ్వు ధీరోదాత్తంగా ఎగురవేసే పద్ధతిని నేను సూచిస్తున్నాను. నీ అభిప్రాయభేదాలను నువ్వు తెలుపుతూ ప్రచురణార్థమై నువ్వు నాకొక లేఖ వ్రాయి. నేను దానిని "యంగ్ యిండియా"లో ప్రచురిస్తూ క్లుప్తంగా ఒక సమాధానం వ్రాస్తాను. నువ్వు మొదటవ్రాసిన ఉత్తరాన్నిచదివి చించివేశాను. రెండవఉత్తరం నాదగ్గర వుంది. యింకొక ఉత్తరం వ్రాయడానికి నీకు కష్టమనితోస్తే, యీ ఉత్తరాన్ని ప్రచురించ

దానికి సిద్ధంగావున్నాను. ఉత్తరంలో హానికరమైన భాగం ఏదీ ఉన్నట్టు నాకు కనిపించలేదు. కాని మళ్ళీ దాన్ని ఒకసారి చూస్తాను. అలాంటి భాగం ఏదైనావుంటే దాన్ని ప్రచురించనని నువ్వు నన్ను విశ్వసించవచ్చు. ఆ ఉత్తరం చాలా యథార్థమైనదని, చిత్తశుద్ధితో వ్రాసిన పత్రమని నా నమ్మకం.

ప్రేమతో,

బాపూ

52 మోతీలాల్ నెహ్రూనుండి మహాత్మా గాంధీకి,

జూలై 11, 1928

ప్రియమైన మహాత్మాజీ,

చిట్టచివరకు ఎలాగైతేనేం, కమిటీ నివేదికవిషయమై ఏదో ఒకవిధమైన ఏకాభిప్రాయం కుదిరింది. అది సంపూర్ణమైనదీ కాదు; స్వచ్ఛమైనదీ కాదు. కాని అది అఖిలపక్షసమావేశంలోను, దేశంలోను మనం పాటుపడడానికి కొంత సాధనం. వివాదగ్రస్తవిషయాలను మేం ఏ పద్ధతిప్రకారం చర్చించామో, వాటి అంతిమదశను తెలుసుకుందుకు చర్చావివరాలను తేటపరిచే ఒక ప్రతిని, ఈ ఉత్తరంతోపాటు మీకు పంపిస్తున్నాను; నివేదికను తయారుచేసే బాధ్యత జవహర్‌కు నాకు వప్పగించి, సభ్యులందరు తమ యిళ్ళకు వెళ్ళిపోయారు; మేం, నివేదికను రూపొందించడంలో నిమగ్నులమై వున్నాం.

కెనడా ప్రతినిధివర్గసభ్యత్వానికి నేను రాజీనామాయిచ్చినట్లు మీరు పత్రికలలో చూచివుంటారు. ఇప్పుడు నేను మనదేశాన్ని ఒదిలి వెళ్ళడంవల్ల ఒక యిబ్బంది వుంది. అఖిలపక్షసమావేశంలో మా నివేదిక అంగీకరింపబడే అవకాశాలు నేనిక్కడ లేకపోవడంవల్ల తగ్గిపోతాయి.

ఇక 'కిరీటాన్ని' ఎవరు ధరించాలన్న ప్రశ్నను ఆలోచిద్దాము. ఇప్పట్లున దాన్ని ధరించతగిన ధీరుడు వల్లభాయ్‌పటేలు. ఆయన చేసిన

దేశసేవ కఠినంపనసూచకంగా. ఈ కిరీటం ధరించమని ఆయన్ని మనం కోరవలసివుంది. ఆయన కాదన్నపుడు, ఇప్పుడున్న పరిస్థితులను బట్టి అందుకు జవహర్ తగినవాడని నా అభిప్రాయం. అతను ముక్కుసూటిగా మాట్లాడటంవల్ల. నీతివాదులైన మన శిష్యులలో చాలామంది వెదిరిపోయారని నాకు తెలుసును. కాని, అధికశక్తిమంతులైన, నిశ్చల మనస్కులైన కార్యకర్తలు దేశాన్ని రాజకీయంగా నడిపించడంలో తమస్వంతమార్గాన్ని తాము అనుసరించతగిన సమయమాసన్నమయింది. ఈ తరగతికిచెందిన వ్యక్తులకు, మన తరగతికిచెందిన వ్యక్తులకు మధ్య కొన్ని అభిప్రాయభేదాలున్నవని నేను అంగీకరిస్తాను; కాని మన అభిప్రాయాలు అంగీకరించమని వారిని ఒత్తిడిచేయవలసిన అగత్యం వున్నట్లు నాకు తోచటంలేదు. అలాగ బలవంతపెట్టడం సబబనిపించడం లేదు. మనతరానికిచెందినవ్యక్తుల శక్తి త్వరితగతిని నశించిపోతున్నది. కనుక జవహర్‌వంటి యువకులు, నేడు కాకుంటే, రేపైనా, స్వాతంత్ర్య పోరాటాన్ని కొనసాగించవలసిన బాధ్యతను స్వీకరించవలసివుంటుంది. ఆ బాధ్యత వారు ఎంత త్వరగా స్వీకరిస్తే అంత మంచిది.

నామటుకు నే నాలోచించుకుంటే, వెనకటి ఆత్మవిశ్వాసం నా కిప్పుడు లేదు; నా శక్తి ఉడిగిపోయింది. అధ్యక్షస్థానాన్ని ఎవరో ఒకరు ఎలాగూ అలంకరిస్తారు. అదికాదు ముఖ్యం. వారికి వెనక అండగా ఎవరువున్నారో మనం ప్రధానంగా ఆలోచించాలి. నా వెనుక మీరుతప్ప మరెవరూ అండగాలేరు. మీ కోరికను శిరసావహించి, ఈ విషయమై నా అభిప్రాయాలను మీకు నేను విశదపరిచాను, ఇక ఒక నిర్ణయానికి రావలసినభారం మీమీద వుంది.

మీ విశ్వాసపాత్రుడు,
మోతీలాల్ నెహ్రూ

## 53. జె. యం. సేన్‌గుప్తనుంచి మోతీలాల్ నెహ్రూకు

[బెంగాల్ కాంగ్రెసు ప్రధాననాయకులలో, సేన్‌గుప్త ఒకరు. రాబోయే కాంగ్రెసు మహాసభ కలకత్తాలో జరుగనున్నది]

10/4 ఎల్గిన్‌రోడ్డు,
కలకత్తా, జూలై 17, 1928

నా ప్రియమైన పండిట్జీ,

వచ్చే కాంగ్రెసుకు మీరు అధ్యక్షులుగా వుండడానికి అంగీకరించ డంలేదని గాంధీజీ నిన్న నాకు టెలిగ్రాంద్వారా తెలియజేశారు. ఈ వార్త విని, నేను నిశ్చేష్టుడనయ్యాను. నేను వెంటనే నా స్నేహితులందరి తోనూ సంప్రదించాను. మే మంతరం ఒకే నిశ్చయానికొచ్చాము. మిమ్మల్ని ఎలాగైనా అంగీకరించేటట్టు చూడమని గాంధీజీని కోరుతూ తంతినిచ్చాము.

మేము బెదిరిపడడానికి, సందేహించడానికి, వెనుకంజవేయ డానికి యిది సమయంకాదు. మీరు మాకు కావాలి. ఇంటా బయటా రాజకీయసంక్షోభంలో చిక్కుకున్న మాకు, ముందుకువచ్చి మీరు నాయ కత్వంవహించాలి. అత్యధికరాష్ట్రాలవారు మీరు అధ్యక్షులుగా వుండా లని కోరుతున్నారు. ఆ రాష్ట్రాలనుంచి మా కిట్టి సమాచారం అందింది. ఇంకా తదితరులపేరులను సూచించడానికి అవకాశమున్నా, నాలుగైదు రాష్ట్రాలు ఒకే ఒక పేరును అంటే మీపేరుమాత్రమే మాకు సూచించాయి.

బెంగాలు మిమల్ని ఏకగ్రీవంగా ఎన్నుకుంటుంది. ఏమంటే, మీరు లేకపోతే మేము ఒక్కడుగు ముందుకువెయ్యలేం. తనతోపాటు కొడుకుకూడా అదేరంగంలో పనిచేస్తున్నపుడు తండ్రిభావా లెలావుం టాయో నేను బాగా అర్థంచేసుకోగలను. అధ్యక్షస్థానాన్ని అంగీకరించ మని మిమ్మల్ని బలవంతంపెడుతున్నందుకు, మమ్మల్ని మన్నించ ప్రార్థిస్తున్నాము, మీ అనిష్టానికి కారణం ఏమైనప్పటికీ, మా కాశాభంగం

మాత్రం కలిగించ గూడదు. మా కోర్కెను, నేను మ రింతకంటే గట్టిగా మీకు తెలియజేయలేను.

మహాత్మాజీకి యివాళొక దీర్ఘమైన జాబు వ్రాశాను. దాని ప్రతిని మీకు పంపుతున్నాను, మీ అంగీకారం తెలుపుతూ దయవుంచి వారికి ఒక వాక్యం వ్రాయండి.

అందరూ క్షేమంగా ఉన్నారు.

మీ విశ్వాసపాత్రుడు,
జె. యం. సేన్‌గుప్త.

54 సుభాస్‌చంద్రబోసువద్దనుంచి మోతీలాల్ నెహ్రూకు,

1, వుడ్‌బరన్‌పార్కు,
కలకత్తా,
జూలై 18, 1928

నా ప్రియమైన పండిట్‌జీ,

కాంగ్రెసు అధ్యక్షపదవి విషయమై నిన్న ప్రొద్దున్న మీకు నేనొక వైరిచ్చాను. రాత్రి మీవద్దనుంచి జాబు వచ్చింది.

కాంగ్రెసు అధ్యక్షపదవిని మీ రేకారణంచేత నిరాకరించినా, యావత్తు బెంగాల్ ప్రజలూ ఎంతగా ఆశాభంగంచెందుతారో, ఎంత బాధపడతారో, మీకు నేను చెప్పలేను. మీరు స్వరాజ్యపక్ష కార్యకలాపాలతో, విధానాలతో అత్యంత సన్నిహితంగా మెలగుతూ వస్తున్నారు. మిమ్మల్ని కాంగ్రెసుఅధ్యక్షునిగా బెంగాల్‌రాష్ట్రం ఏకగ్రీవంగా వరించడానికి అది ఒక కారణం. మిగతా రాష్ట్రాలవిషయం నేను పేర్కొనను. కాని చివరికి అధ్యక్షుడు ఎవరనే ప్రశ్న వచ్చేసరికి యావద్భారతదేశం మిమ్మల్నే బలపరుస్తుందని నా గాఢవిశ్వాసం.

ఇప్పుడు మనదేశం క్లిష్టపరిస్థితుల్లో వుంది. 1929 సం॥లో మన పరిస్థితులు యింకా గడ్డుగా వుంటాయి. క్షణక్షణం మారిపోతున్న పరిస్థితుల కనుగుణంగా దేశాన్ని నడిపించగల వ్యక్తి మీరుతప్ప అన్యులింకొకరు లేరని మేం భావిస్తున్నాం. మీకు ప్రత్యామ్నాయంగా మరి

కొందరిపేర్లు, మేం విన్నాంకాని, వేరొకపరిస్థితుల్లోఅయితే వారిని గురించి ఆలోచించడానికి అవకాశం కలిగివుండును. కాని వివిధపక్షాలను సమైక్యపరచాలనే ప్రయత్నాలు కొనసాగుతున్న ఈ తరుణంలో, ఏకైక రాజ్యాంగవిధానాన్ని తయారుచేయాలని ప్రయత్నంచేస్తున్న యీ సమయంలో మీకు ప్రత్యామ్నాయంగా యింకొకరిని ఎన్నుకొనేందుకు వీలుపడదు. మీ రేకారణంచేతనైనా అధ్యక్షపదవిని తిరస్కరిస్తే, ఈ రాష్ట్రంలో తత్ఫలితాలు విషమరూపాన్ని ధరించి కాంగ్రెసుమహాసభ జయప్రదంగా కొనసాగడానికి వీలులేని వాతావరణాన్ని కలిగిస్తాయి. నే నీ విషయాన్ని వున్నది ఉన్నట్టుగా మీకు తెలియజేస్తున్నాను. గోరంతలు కొండంతలుచేసి చెప్పడంలేదు. తీవ్రమైన సంక్షోభంలో మనం చిక్కుకుని ప్రయాణంచేస్తున్న తరుణంలో దేశమాతపిలుపును మీరు అందుకుంటారని, మేము ఆశించవచ్చునా?

అత్యంత గౌరవంతో,

మీపట్ల గౌరవంగా,
సుభాస్‌చంద్రబోసు.

పి. యస్. జిల్లాబోర్డులకు, ఎంతమంది ఓటర్లు ఉన్నారో తెలియజేయవలసిందిగా, మీరిచ్చిన వైరు నాకు అందింది. ఆ జాబితాను సంపాదించడానికి ప్రయత్నిస్తున్నాను. కాని సంపాదించగలనో లేనో, నాకు సందేహంగా వుంది. వివిధజిల్లాలనుంచి ఓటర్లజాబితాలను సేకరించిన తరువాత వీటి నొకచోట సమకూర్చడానికి చాలా సమయంపడుతుంది.

సుభాస్.

55. మోతీలాల్ నెహ్రూవద్దనుంచి, జె. యం. సేన్‌గుప్త, సుభాస్‌చంద్రబోస్‌లకు,

ఆనందభవనం,
అలహాబాద్,
జూలై 19, 1928.

923.254 Acc 8716
NEH

నీ ఉత్తరం నా కిప్పుడే అందింది. దానికి వెంటనే జవాబిస్తానని

వాగ్దానంచేస్తూ నేను నీకు వైరిచ్చాను. అధ్యక్షపదవిని అంగీకరించేవిష యంలో, తండ్రీ, కొడుకూ అనే లలితమైన భావం అడ్డువస్తుందనే ప్రశ్న ఉత్పన్నంకావడంలేదు. తండ్రికి సానుకూలంగాఉండడంకోసం, కొడుకును విడిపించుకునేటట్టుచేయవలసిన ప్రశ్న రానేరాదు. మహాత్మాజీచే పేర్కొనబడుతున్న, ఆ "కిరీటాన్ని" ధరించాలని జవహర్ ఎన్నడూ కలలోకూడా అనుకోలేదు. కాంగ్రెసు అధ్యక్షుడు అతన్ని ఉండాలని నేను చాలాకాలంక్రితమే అనుకున్నాను. అతను నాకు కొడుకైనందువల్ల నే నిలా భావించడంలేదు. దానికీ దీనికీ ఎలాంటి సంబంధమూ లేదు. డాక్టరు అన్సారీ గతసంవత్సరం ఎన్నికకావడానికి ముందు, నే నీభావాన్ని మహాత్మునికి వ్యక్తపరిచాను. తనసభ్యులుగా మద్రాసు కాంగ్రెసుకు జవహర్ అధ్యక్షుడుగావుంటే బాగుంటుందని డా. అన్సారీసహితం భావించారు. కాని జవహర్ తను అధ్యక్షుడుగా ఉండడానికి ఎంతమాత్రం ఇష్టపడలేదు.

కడచినసెల నేను కమిటీసమావేశంలో పాల్గొంటున్నసమయంలో, గాంధీజీవద్దనుంచి నా కొక ఉత్తరంవచ్చింది, రాబోయే కలకత్తా కాంగ్రెసుమహాసభకు అధ్యక్షునిగా నాపేరు సేన్‌గుప్తసూచించారట; నే నధ్యక్షుడుగాఉన్న ఆ కమిటీవల్ల, ఏమైన సత్ఫలితం చేకూరేటట్లు ఉంటే, ఈ కిరీటాన్ని' ధరించడం బాగుంటుందని ఆయన నాకు సూచించారు. కమిటీ ఏకగ్రీవాభిప్రాయానికిచేరే అవకాశాలు చాలా తక్కువగా ఉన్నాయనీ, అది అలాంటి నిర్ణయానికి రాలేనపుడు, దేశంలో నేను చేయవలసిన పని యింకేమీ ఉండదనీ భావిస్తున్నానని, నే నాయనకు జవాబు వ్రాశాను. జూలై 8వ తేదీవరకు పరిస్థితి అలాగేవుంది. ఆవేళ కమిటీ ఏదో ఒకవిధమైన ఏకాభిప్రాయానికివచ్చింది. ఆ విషయం నేను గాంధీజీకి తెలియజేశాను. ఆ ఉత్తరానికి నకలువుంటే బాగుండును; నీకు పంపించివుండును. కాని నాకు జ్ఞాపకమున్నంతవరకు, ఆ విషయాల్ని నీకు తెలియజేయడానికి ప్రయత్నిస్తాను. పరిస్థితుల్నిబట్టి కాంగ్రెసు అధ్యక్షునిగాఉండదగిన వీరుడు వల్లభాయిపటేలు. మొదటి అవకాశం అతనికే చెందవలసివుంటుంది. అతను కాదంటే, ఇక రెండవ

వ్యక్తి జవహర్‌లాల్ నెహ్రూ. మాతరంవ్యక్తులరోజులు గతించి పోయాయి. దేశవ్యవహారాల నిర్వహణబాధ్యత యువకులకు అప్పగింప వలసిన సమయమాసన్నమైంది. మేము శాశ్వతంగా ఉండబోము. నేడో రేపో యువకులు కార్యనిర్వహణభారాన్ని స్వీకరింపవలసి వుంటుంది. మన ఆయుష్షు చెల్లి యిక్కడ్నుంచి మనం పోయేవరకు నిరీక్షింపకుండా యిప్పుడే మనంఉండగా, మన కళ్ళయెదుట, అట్టి బాధ్యతను యువకులు స్వీకరించడం ఎంతో బాగుంటుంది. నా మటుకు నేను ఆలోచించుకుంటే, నా శక్తి ఉడిగిపోయింది. అట్టి బాధ్యతను స్వీకరించేశక్తి నాకులేదు. యువకులలో అత్యధికసంఖ్యాకుల విశ్వాసాన్ని జవహర్ చూరగొన్నాడని నా నమ్మకం. అందుచేత అధ్యక్షునిగా అతని పేరు నేను సూచించాను. నన్నూ, అతన్నీ దేశస్థులు ఒకేలాగ పరిగణిస్తున్నారు. అదే అతనికిగల పలుకుబడికి నిదర్శనం. నాతో తాను ఏకీభవిస్తున్నానని జవహరును ఎన్నుకోవలసినదిగా (యంగ్ యిండియా) పత్రికలో సూచిస్తున్నానని, గాంధీజీ అప్పుడు నాకు వైరిచ్చారు. ఈవార్త వింటే, తాను రాజకీయాలనుంచి విరమిస్తున్నానని జవహర్ వెంటనే ఒక ప్రకటనకావిస్తాడని నేను భావించాను. అలా తొందరపడవద్దనీ, ముస్సోరీలో ఉంటున్న అతనికి ఉత్తరువు పంపించాను. ఇదీ జరిగిన వృత్తాంతం. మీరు వ్రాసిన ఉత్తరాలనకళ్ళు, యీ ఉత్తరపు ప్రతిని మహాత్మాజీకి పంపిస్తూ, ఏమిచేయవలసిందీ, యీ విషయం ఆయనకే వదిలిపెట్టాను.

ఇది నాకూ, జవహర్‌కు సంబంధించిన ప్రశ్నకాదు. అధ్యక్షునిగా పరిస్థితి ఎవరిని కోరుతున్నదనేది ప్రశ్న. మీరు చెప్పినదాంట్లో కొంత సబబు లేకపోలేదు. కాని యీ సమయంలో సుశిక్షితంగా ముందుకు పోవలసిన పార్టీ లక్షణం, పరిస్థితులను తన అదుపులోపెట్టుకొని, అడ్డంకుల నధిగమించి పురోగమించగల దక్షత పార్టీకి చేకూర్చవలసి వుంటుంది. సంపూర్ణ స్వరాజ్యంనుంచి అధినివేశప్రతిపత్తికి దిగజారిపోతే, కాంగ్రెసు, అపహాస్యంపాలౌతుంది. ప్రభుత్వం జాప్యం చేయకుండా, అన్ని పక్షాలవారూ ఏకగ్రీవంగా కోరిన కోరికను కపీసం

అంగీకరించితీరాలి; అలా అంగీకరించకుండా ప్రభుత్వం కావించే అర్ధరహితమైన పనులకు దేశం ఎంతమాత్రం సహించజాలదని నేను ప్రపంచానికి ఋజువుచేయదల్చుకున్నాను. అఖిలపక్ష కోరిక అంగీకరింపబడనప్పుడు, దానికి అనుకూలంగావున్నవారంతా, బలమైన పక్షాన్ని చేరడానికి సంసిద్ధులైవున్నారు. దేశపు పోకడనుగనుక గమనించినట్లయితే, అఖిలపక్షసమావేశంలో అంగీకృతమైనదని చెప్పబడుతున్న ప్రణాళిక, రాబోయే కాంగ్రెసు మహాసభలో నెగ్గుకురావడం సులభంకాదు. మహాసభలో దానివిజయం, యువకుల అభిప్రాయాలమీదకంటె, పెద్దల పలుకుబడిమీద ఆధారపడివుంటుంది.

తండ్రీ కొడుకు లిద్దరు దేశసేవానిమగ్నులై వున్నందున, అధ్యక్ష పీఠాన్ని ఎవరు అలంకరించినా, ఇద్దరికీ ఒకటే; కాని దేశానికి ఏది ఉత్తమమో మనం ఆలోచించుకోవాలి. అదీ ముఖ్యమైన ప్రశ్న.

ఈ విషయమై జరిగిన ఉత్తరప్రత్యుత్తరాలను పరిశీలించి, మహాత్ముడు సరియైన నిర్ణయానికివస్తారని నా విశ్వాసం; ఆయన నిర్ణయానికి నేను కట్టుబడివుండడానికి సదా సంసిద్ధుణ్ణి.

మోతీలాల్ నెహ్రూ.

౫౬. మోతీలాల్ నెహ్రూవద్దనుంచి, మహాత్మాగాంధీకి,

ఆనందభవనం,
అల్లాహాబాద్,
జూలై 10, 1928.

ప్రియమైన మహాత్మాజీ,

మీ కిపుడు పంపుతున్న ఉత్తరప్రత్యుత్తరాలనుగురించి నేను వేరే వ్రాయనక్కరలేదు. అన్నిసంగతులు అవే, మీకు తెలియచేస్తాయి. కమల, ఇందూలకు సదుపాయాలు కలిగించడంకోసం, జవహర్ ముస్సోరీ వెళ్లాడు; నువ్వేమీ మాట్లాడవద్దని నే నతనికి ఆదేశించినట్లుగా, సేన్‌గుప్తకు నేను వ్రాసిన ఉత్తరంవల్ల మీకు బోధపడుతుంది. అతన్ని

చాలించుకొనేటట్లు చేయమని సేన్‌గుప్త మిమ్మల్ని అర్థించడం సబబు గానే వుంది. అత న్నల్లా ఒప్పించడానికి చాలా ఓర్పు కావాలని అనుకుంటాను.

కమిటీ నివేదికను తయారుచేయడంలో నేను నిమగ్నుడనైవున్నాను. జవహర్ చాలావరకు నోట్సువ్రాసి, నాకిచ్చివెళ్లాడు. కాని, తీరా ఇప్పుడు నేను నివేదికను వ్రాయిస్తున్నపుడు, ఇంతకుముందు అతడు, నేనూ ఊహించని అనేకప్రశ్నలు నన్ను ఎదుర్కొంటున్నాయి. దీనికి కారణం, కమిటీనిర్ణయాలను వ్రాసేటపుడు పదజాలాన్ని సరిగా ప్రయోగించక పోవడం; చాలాసేపు చర్చించి విసిగెత్తిపోయి. అదావిడిగా, వీటిని వ్రాయడం తటస్థించింది. కొన్నిపదాల అర్థవివరణకోసమో, తు. చ. తప్పకుండావుండడంకోసమో, నా శబ్దాల నంగీకరించేటట్లుచేయడం కోసమో, సభ్యులతో నేను (సభ్యులు ఎవరిళ్లకువాళ్లు వెళ్లిపోయారు.) నిరంతరం ఉత్తరప్రత్యుత్తరాలు జరపవలసివచ్చింది. ఇక సభ్యులవద్ద నుంచి ఆఖరు వివరణవిషయమై సమాధానాలకోసం నిరీక్షిస్తున్నాను. అవి అందినవెంటనే, ముసాయిదానివేదికను సభ్యులందరికి పంపిస్తాను.

బార్డోలీ పరిణామాలను నే నత్యంతాభిలాషతో గమనిస్తున్నాను. కాని ప్రస్తుతం నే నేవిధంగా తోడ్పడగలనో నాకు తెలియరావడంలేదు.

ఇందులో జతపరచి పంపిన ఉత్తరాలను. మీ కేమైనా ఉత్తరాలు వస్తే వాటిని పరిశీలించి, "కిరీటం" విషయమై మీరొకనిర్ణయానికిరండి; దయచేసి, మీ నిర్ణయం నాకు తంతిద్వారా తెలియచేయండి.

మీ విశ్వాసపాత్రుడు,
మోతీలాల్ నెహ్రూ

57. మోతీలాల్ నెహ్రూవద్దనుంచి అనీబిసెంటుకు

అల్లాహాబాద్,
సెప్టెంబరు 30, 1928

ప్రియమైన డాక్టర్ బిసెంట్,

అత్యంత ఉద్రిక్తమైన స్వల్పకాలపు శాసనసభాసమావేశాలు ముగిసిపోయాయి. నేను అల్లాహాబాదుకు తిరిగి వచ్చేశాను; అఖిలపక్ష

సమావేశం మనకు వప్పగించిన పనిలో ఏకాగ్రదృష్టితో లీనమౌతున్నాను.

సిమ్లాలో నా కందిన మీ టెలిగ్రాములు ఎంతో ప్రోత్సాహాన్ని కలిగించాయి. ఇప్పటికప్పుడే మీరు అద్భుతమైన కృషి కావించారు; ఇక ముందుకూడా ఇలాగే మీశక్తినంతా ధారపోసి, ఎనలేని కృషి కొనసాగిస్తారని నా విశ్వాసం. ఏ రాష్ట్రానికా రాష్ట్రంలో, అఖిలపక్ష మహాసభలను జరపాలన్న అభిప్రాయం చాలా బాగుంది; ఇతర రాష్ట్రాలు ఈమార్గాన్ని అనుసరించేలా చేయడానికి నేను కొన్ని చర్యలను తీసుకుంటున్నాను. మహాసభకు సర్ తేజ్‌బహదూర్ సప్రూ వస్తారు. కనుక, ప్రస్తుతం నా మద్రాసు ప్రయాణం వాయిదావేసుకుంటున్నాను. ప్రాతిపదికగా ముందు కొంత పనిచేయవలసివుంది కనక, రాష్ట్రాలలో పని కొనసాగించడానికి కొంత నిధి సేకరించడం అవసరం కనుక, ఈ పనులలో నిమగ్నుడనైనందువల్ల, నా కార్యక్రమం యింకా స్థిరపడలేదు.

అత్యవసర ఖర్చులనిమిత్తం, మనం లక్నోలో అప్పటికప్పుడే ఒక చందాపట్టికను తయారుచేసినట్లు, ఖర్చులు 25000 రూపాయల వరకూ ఔతాయని అంచనావేసినట్లు మీకు జ్ఞాపకముండివుంటుంది. ఇప్పటికి యిందులో చాలా తక్కువసొమ్మమాత్రమే చేతికందింది. ఇటీవల సిమ్లాలో జరిగిన కమిటీ సమావేశంలో ఖర్చులనుగురించి మళ్ళీ ఒకసారాలోచించి. వచ్చే మూడుమాసాల్లోను, అన్ని రాష్ట్రాల్లోను బహుళప్రచారం సాగించడానికి లక్షరూపాయిలకు తక్కువకాదని అంచనావేసుకున్నాం. ఈ మొత్తంలో ఎక్కువభాగం, బొంబాయి, కలకత్తాల్లో వసూలౌతుంది. నేను త్వరలో యీ రెండుచోట్లకు వెళుతున్నాను, బొంబాయినుంచో, కలకత్తానుంచో సరాసరి మద్రాసుకు బయలుదేరతాను.

పంజాబు, బెంగాలు రాష్ట్రాలలో, హిందూ - ముస్లిం సమస్య తీవ్రరూపం ధరించిందికనక మిగతా రాష్ట్రాలలోకంటె, అక్కడ అత్యంత దీక్షతో పనిచేయవలసివుంటుంది. పంజాబు రాష్ట్రకమిటీ, మద్రాసు

పద్ధతిలో ఏర్పాటుచేయబడింది; అక్కడి వ్యవహారాలను చాలా నేర్పుతో ఓర్పుతో, తన అదుపులోనికి తెచ్చుకోగలిగింది. ఎవరో కొందరు కరడు గట్టిన సూఫీమతస్థులుతప్ప, మిగిలిన ముస్లిములందరూ, లక్నో తీర్మానాలకు తా మనుకూలురమని, ఏనాడో ప్రకటించారు. బెంగాలులో ఇంతకంటె ఎక్కువ సత్ఫలితాలు చేకూర్చగలవని, మౌలానా అబ్దుల్ కలాం ఆజాద్, సిమ్లా సమావేశంలో మాకు వాగ్దానంచేశారు. తగిన ధనం సేకరించి యిస్తే, అక్కడ ఆయనకృషి నిస్సందేహంగా జయప్రదమౌతుంది.

పంజాబు, బెంగాలుల్లో అత్యధిక సంఖ్యాకులుగా ఉన్న ముస్లింల హక్కులని చెప్పబడుతూన్నవాటికోసం, అన్యరాష్ట్రాల అల్పాతి అల్ప సంఖ్యాక ముస్లిములు, ఇంతకాలం, పోరాటంసల్పుతూ వచ్చారు. అయితే వీరి హక్కులకోసం అన్యరాష్ట్రాలవారు ఆందోళన చేయనక్కరలేదనీ, పంజాబు, బెంగాల్ రాష్ట్రాలవారు, లక్నో తీర్మానాలను ఆమోదించారనీ చెప్పడమే దీనికి సరియైన ప్రత్యుత్తరం. ఒక పక్షంరోజులలో వారికి యీ ప్రత్యుత్తరం యివ్వబడుతుందని నే నాశిస్తాను. భారతదేశంలో మిగతాచోట్ల అల్పసంఖ్యాకవర్గాలకు కొన్ని సదుపాయాలు కలిగిస్తే హిందూ - ముస్లిం సమస్య సునాయాసంగా పరిష్కృతమౌతుంది. మద్రాసు ముసల్మాన్లు చాలా చక్కని సూచనచేశారు. పంజాబు, బెంగాల్లోతప్ప మిగతారాష్ట్రాల్లో ఈ సూచనలు పాటింపవచ్చునని మా కమిటీ సలహాయివ్వవచ్చు. మనం మన నివేదికలో అల్పసంఖ్యాకవర్గ ప్రాతినిధ్యంవిషయమై స్థిరమైన, కఠినమైన కొన్ని నిబంధనలు రూపొందించేకంటె, ప్రాతినిధ్యం ఏ నిష్పత్తిలో వుండాలో ఆ యా రాష్ట్రాల కొదిలిపెట్టడం మంచిదని, తమ పరిస్థితులకనుగుణంగా అధిక, అల్ప సంఖ్యాకవర్గాలవారు ఒక ఒప్పందంచేసుకునేందుకు వీలుపడుతుందని మద్రాసు ముస్లిములు సూచించారు- అధికసంఖ్యాకులుగావున్న హిందువులవద్దనుంచి, తాము పొందగలిగే ప్రాతినిధ్యాన్ని స్వీకరించడానికి వారు అంగీకరించారు. ఇతర రాష్ట్రాల్లో హిందూ ముస్లిం సమస్య అంత సులభంగా పరిష్కృతంకాదని నాకు తెలుసును; అన్ని రాష్ట్రాలలోనూ

ఒకే ఒక నిబంధనలు, అమలుపరపడానికి ప్రయత్నించపడంకంటె, మద్రాసు సూచనప్రకారం, కుదిరిన ఒడంబడికను ఆమోదించమనడం మంచిది. వారు దీన్ని ఆమోదించడానికి ఎక్కువ అవకాశాలున్నాయి. నా స్నేహితుడు, సర్ తేజ్ బహదూర్ సప్రూ, హిందూ ముస్లిం సమస్య విషయమై దేన్నిగురించి బాధపడుతున్నారో, అది ఈవిధంగా పరిష్కరింపబడుతుందన్నమాట.

ఇక మనం "సంపూర్ణ స్వరాజ్యవాదుల" ముఠానుగురించి ఆలోచింపవలసి వుంటుంది. జవహర్ ప్రోద్బలంవల్ల ఈ ముఠా పెరుగుతూ వస్తూవుంది. అయితే ఈ ముఠావల్ల ఏదో ప్రమాదం జరుగుతుందనే భయం నాకు లేదు. కారణమేమంటే, సంపూర్ణ స్వరాజ్యవాదులను ముందుకునడిపిస్తున్న నాయకుడు చిత్తశుద్ధిగల దేశభక్తుడు; ఒక సమస్యను తన దృక్పథంనుంచే గాక, యితరుల దృక్పథంనుంచికూడా ఆలోచిస్తాడు. సంపూర్ణస్వరాజ్యం కావాలని విధీవిరామంలేకుండా, అప్రతిహతంగా దేశంలో ప్రచారంచేస్తున్నా, అఖిలపక్ష సమావేశ నిర్ణయాలను జయప్రదమొనర్చడానికి జవహర్ తనశక్తిని ధారపోస్తున్నాడు. ఇకపోతే కుహనా సంపూర్ణ స్వరాజ్యవాదులగురించి ఆలోచించిచూద్దాం. వీరికి మీ నగరవాస్తవ్యులైన, శ్రీ శ్రీనివాసయ్యంగార్ నాయకుడు. వీరిని గురించి అసలే భయపడనవసరంలేదు, యథార్థ సంపూర్ణ స్వరాజ్యవాదులతో, మనం ఒక అంగీకారానికి రాగలిగినపుడు, కుహనావాదుల లేనిపోని అనుకరణ, తన నిజస్వరూపంతో బయటపడుతుంది. కుహనావాదులు ఏకాకులై, రానున్న పరిణామాలకోసం వూరికే ఎదురుచూస్తూ కూచోవలసివస్తుంది. యథార్థవాదులతో సంతృప్తికరమైన సమాధానం త్వరలోనే కుదురుతుందని నే నాశిస్తున్నాను. ఆ శుభవార్త నేదో రేపో మీకు తెలియజేయగలనని అనుకుంటున్నాను.

ఇప్పుడిక మనం ఆలోచించవలసింది అభివృద్ధినిరోధకులగురించి మాత్రమే. వాళ్లకి మనం ఎంతమాత్రం చోటివ్వం. వాళ్లతో వ్యవహరించడం ప్రమదాలికే కష్టమైపోయింది. అర్థపర్థంలేని మూర్ఖాతిమూర్ఖమైన

వారికోరికలను, సైమన్స్‌సైతం అంగీకరించడానికి అసాధ్యమైపోయింది. మనవాదన తప్పనో, వారివాదన ఒప్పనో కాకుండా వాటితో ప్రమేయంలేకుండా, మనల్ని, మనవాదనల్ని చులకనచేయడానికీ, దేశంలో మనకి తగినంత బలంలేదని చూపడానికీ, ఈ అభివృద్ధినిరోధకులనూ, వారి ఉనికినీ నిరంకుశప్రభుత్వం చక్కగా ఉపయోగించుకుంటుంది. అదే వీరితో మనకున్న ప్రమాదమల్లా. దీనికి తగిన సమాధానం మనం చెప్పాలంటే, ప్రతిజిల్లాలోనూ వందలకొద్దీ సభలు ఏర్పాటుచేయాలి. దేశంలో ఈ అభివృద్ధినిరోధకులు బహుకొద్దిమందనీ, దేశంలో ఎవరితరఫునా ప్రాతినిధ్యంవహించే హక్కు వీరికి లేదనీ మనం చాటి చెప్పవలసివుంటుంది. ఇందుకోసమే మనం అర్థబలం, అంగబలం చేకూర్చుకోవాలి. ఇప్పటికప్పుడే మీరు, మీ రాష్ట్రంలో యుండుకవసరమైన మందుగుండుఫ్యాక్టరీని కరపత్రాలను అచ్చొత్తించి పంచిపెట్టడంద్వారా ప్రారంభించాలి. లాలా లజపతిరాయ్ ఈవిధంగానే పంజాబులో ప్రారంభిస్తున్నరు; బెంగాలులో మౌలానా అబుల్‌కలాం ఆజాద్ ఇదేపద్ధతిని అనుసరిస్తున్నారు. ముగిరినచోట్లకూడా. నిధులు సమకూరిన వెంటనే, ప్రచారోద్యమం ప్రారంభమౌతుంది.

సాధారణ పరిస్థితి ఏవిధంగా నాకంటికి కనుపిస్తున్నదో, ఏ పద్ధతి ప్రకారం నేను వ్యవహరించతలుచుకున్నానో, మీకు తెలియచేయడం కోసం నేను ప్రయత్నించాను. మద్రాసువిషయంలో నేను కొన్ని సూచనలుచేయదల్చుకున్నాను. ఆ రాష్ట్రంలో అయిదుతరగతుల ప్రజలున్నారు; వారికి మనం కొన్నినదుపాయాలు చేయవలసివుంటుంది. ప్రజలలో కొంత చెప్పుకోతగ్గభాగం, అడయారు ప్రభావానికి ప్రత్యక్షంగా లోనైవున్నారు; ఇదేవిధంగా కొంతమంది, కాంగ్రెసుప్రభావంక్రింద వున్నారు. మూడవ తరగతివారు చాలా హెచ్చుమంది; వీరు బ్రాహ్మణేతరులు. నాల్గవతరగతి వారు వెనకబడిన కులాలవారు: అయిదవతరగతివారు ముసల్మానులు. ఈ అన్నితరగతులప్రజలను కూడగట్టుకుంటూ, ప్రతీ తరగతినుంచి ఒకరిద్దరు అగ్రేసరులను మనం కలుపుకోవలసివుంటుంది; పదుమను తరగతి ప్రజల్లో లాము చేయవలసిన పనిని కొన్ని సందర్భాలలో వారికే చెప్ప

గించవలసివుంటుంది. మీ సహచరులతోనో, కాంగ్రెసుపార్టీ అను యాయులతోనో బ్రాహ్మణేతరులు, వెనకబడినకులాలవారు కలసి పని చేయడానికి సులువౌతుందని నేననుకుంటాను; ఇక పలుకుబడిగల కొందప ముస్లిములు, తమ మతస్థులమధ్య పనిచేయడం యుక్తంగావుంటుంది. కాంగ్రెసు, ముస్లిము కార్యకర్తలకు వేర్వేరు నిర్మాణసంస్థలుండడం అవసరం. ఈ విషయం నేను శ్రీ ఎ. రంగస్వామి అయ్యంగారితోను, సయ్యదు ముర్తుజాసాహెబు బహద్దూర్‌తోను సిమ్లాలో చాలా సేపు ముచ్చటించాను. మీ సాధారణసంఘంలో సభ్యులుగావుంటూనే, కాంగ్రెసు, ముసల్మాను కార్యకర్తల సంస్థలద్వారాకూడా, వారు కృషి సల్పుతారు; ఇందుకుగాను ప్రత్యేకంగా కొంత నిధిని కేటాయించవలసివుంటుందని నే ననుకుంటున్నాను. ప్రస్తుతం, శ్రీ రంగస్వామి అయ్యంగారికి వెయ్యిరూపాయలు, సయ్యదు ముర్తుజాసాహెబుకు అయిదువందలు యిస్తే సరిపోతుంది. వారిద్దరూ గొప్ప గౌరవస్థులు; నమ్మకస్థులు. నిధిని సద్వినియోగపరుస్తారన్న నమ్మకం నాకుంది. ఈ సందర్భంలో శ్రీ యాకూబు హసన్ జ్ఞాపకంవచ్చాడుకాని, ఆయన పొర్తి బద్ధకస్థుడని విన్నాను. ముస్లిము ఉపసంఘానికి అధ్యక్షునిగానో, సభ్యునిగానో వుండమని, ఆయన్నడిగి, ఒప్పించడానికి సయ్యదు ముర్తుజాసాహెబు అంగీకరించారు. ఇది చాలునని అనుకుంటాను.

ఈ సూచన మీ రామోదిస్తున్నారో లేదో, ఆమోదించినట్లయితే, నేను సూచించిన ప్రకారం, సొమ్ము ఎప్పు డివ్వగలుగుతారో, దయవుంచి నాకు తెలియచేయకోరుతున్నాను. లక్నోలో రెండుదఫాలుగా మీరు వాగ్దానంచేసిన 5000 రూపాయలూ, ఇప్పుడు మీరు నిర్వహిస్తున్న కార్యానికి సరిపోవని నా అభిప్రాయం. కొంతమంది ప్రత్యేక వ్యక్తులవద్దనుంచో, ప్రజలనుంచో, మరికొంత ధనం చందాలుగా వసూలుచేయవలసివుంటుంది. మద్రాసు తనకార్యాన్ని తాను చక్కగా నిర్వహించాలి. [illegible]నుంచి చందాలు సేకరించడ మవసరమని మీరనుకుంటే, నేను [illegible]లో కొంత ధనం సేకరించి మీకు పంపించడానికి ప్రయత్నిస్తాను. ఈలోగా, శ్రీ రంగస్వామయ్యంగారికి వెయ్యి, సయ్యదు ముర్తుజా

సాహేబుకు అయిదువందలూ పంపించి మీ రివ్వండి. చందాలు నేరుగా కేంద్రానికి చేర్చి, అవసరాన్నిబట్టి రాష్ట్రాలకు ఆ కేంద్రనిధినుంచి సొమ్ము పంపిస్తూవుండాలని అనుకున్నాం: సాధారణంగా నేను అనుసరిస్తున్న విధానం అది; కాని మద్రాసువిషయంలో ఈ సూత్రాన్ని సడలించవచ్చును; అప్పుడు జాప్యం జరగదాని కవకాశంవుండదు. ఎంత ధనం చందాలుగా వసూలయిందో, దానిలో ఎంత డబ్బు ఏరూపేణా వినియోగపడుతున్నదో ఎప్పటికప్పుడు మీ కార్యాలయంవారు లెక్కలు అవీ జవహర్‌కు పంపిస్తూవుంటే, అతడు జమాఖర్చులను తయారుచేసుకుంటూవుంటాడు.

లక్నోలో జరిగిన అఖిలపక్షసమావేశంవారు. మన కమిటీని భోగట్టా సేకరించవలసినదిగా అనేక ప్రశ్నలు సూచించినట్లూ, అఖిలపక్షసమావేశంతో చర్చించే నిమిత్తం, ఒక కార్యప్రణాళికను రూపొందించి, ఆ ప్రణాళికను అమలులోపెట్టడాని కెంత ధనం కావలసివుంటుందో ఒక పట్టికను తయారుచేయవలసినదని కోరినట్లూ, మీకు జ్ఞాపకం వుండివుంటుంది. మొన్న సిమ్లాలో జరిగిన కమిటీ సమావేశంలో, యిందుకుగాను, ప్రత్యేకం ఒక ఉపసంఘం, నియమించబడింది. అందులో తేజ్‌బహద్దూర్ సప్రూ, పండిత హృదయనాథ్‌కుంజ్రూ, శ్రీ సి. విజయరాఘవాచారి (ఈ పేరు చెవినిపడగానే, సప్రూ చూసిన నిరాశామయమైన చూపులు ఇప్పటికీ నేను మర్చిపోలేదు; కాని రాఘవాచారి ఒక సభ్యుడుగా వుండడం తప్పనిసరయింది.) సర్ ఆలీ ఇమాం, నేనూ సభ్యులుగా వున్నాం; లక్నో సమావేశం సూచించిన ప్రశ్నావళి ప్రకారం, ఈ ఉపసంఘం సమాచారాన్ని సేకరిస్తుంది. అసలు నివేదికలో వున్న ప్రణాళికకు ఎంత వ్యయమౌతుందో, ఒక బిల్లును తయారుచేసి, ఒక నివేదికను రూపొందిస్తుంది. నవంబరు మొదటివారంలో ఢిల్లీలోనో, అలహాబాదులోనో జరుగనున్న కమిటీ సమావేశానికి, ఏదేని తయారు చేసివుంచితే, అఖిలపక్షకమిటీకి పని సులువవుతుంది. అంతేకాక ముందు మన మొక చిత్తుబిల్లును సిద్ధపరిచినట్లయితే, పార్లమెంటు ముసాయిదా-రచయితలకు యిక ఆట్టే పనివుండదు: బిల్లు తుదిస్వరూపాన్ని అసిమ

సులభంగా రూపొందించగలుగుతాడు; మనం అతనికిచ్చే రుసుము తగ్గుతుంది. మీ కామన్వెల్తు ఆఫ్ ఇండియా బిల్లును తయారుచేసిన ముసాయిదా రచయిత ఎవరో, అతను ఎంత రుసుం తీసుకున్నాడో దయివుంచి మీరు నాకు తెలియజేస్తారా ?

అఖిలభారత సమావేశం కలకత్తాలో డిసెంబరు 17వ తేదీన జరపాలని తాత్కాలికంగా నిర్ణయించాం. సమావేశం కొన్నిరోజులపాటు జరుగుతుంది. ఇది చాలా ముఖ్యమైన సమావేశం కనక, మీరు తప్పక హాజరౌతారని ఆశిస్తున్నాను.

సిమ్లాలో జరిగిన సమావేశవివరాలను తెలిపే పత్రాన్ని మీకు రేపో ఎల్లుండో పంపిస్తాను.

ప్రస్తుతం మేంచేస్తున్న పనినిగురించి మీ రేమైనా, సూచనలిస్తే కృతజ్ఞతతో స్వీకరిస్తాను.

ఈ ఉత్తరం మీ కందేసరికి, సర్ తేజ్ బహద్దూర్ సప్రూ మద్రాసు చేరుకుంటారనుకుంటాను. ఆయన కీ ఉత్తరం చూపించండి. దీనిలోని విషయాల నొకసారి చూడమని, ఆయనకు వేరే ఒక ఉత్తరం వ్రాస్తున్నాను.

డాక్టరు అనీబిసెంటు,
అడయారు, మద్రాసు.

మీ విశ్వాసపాత్రుడు,
మోతీలాల్ నెహ్రూ.

58. మోతీలాల్ నెహ్రూవద్దనుంచి యం. ఏ. జిన్నాకు,
నవంబరు 22, 1928.

నా ప్రియమైన జిన్నా,

అఖిలపక్ష సమ్మేళనం ఏ తేదీలలో జరిపితే బాగుంటుందో, నే నింతకాలం ఆలోచించిచూశాను; ఈ విషయమై నా కమిటీసభ్యులతో,

కాంగ్రెసుమహాసభ ఆహ్వానసంఘసభ్యులతో సంప్రదించాను. కాంగ్రెసు మహాసభానంతరం అఖిలపక్ష సమ్మేళనం జరపడానికి వారు తమ తీవ్ర అభ్యంతరాలను తెలియచేశారు. వారుచెప్పిన అభ్యంతరాలు సబబుగానే వున్నాయి; వాటితో నే నేకీభవిస్తున్నాను. అందువల్ల ఇటు కాంగ్రెసుకు, అటు ముస్లింలీగుకు అభ్యంతరం కానివిధంగా నే నొక ఏర్పాటుచేయ తలపెట్టాను. ముస్లిములీగు యిక నాలుగురోజులకు సమావేశమౌతుందనగా, అఖిలపక్షసమ్మేళనం ప్రారంభమౌతుంది. 27, 28వ తేదీలలో ముస్లిములీగు సమావేశంలో వుండగా, అది కొనసాగుతూ వుంటుంది. అవసరమైతే, 29 వ తేదీ ప్రొద్దుటకూడా సమ్మేళనం సమావేశమౌతుంది. ఈ ఏర్పాటువల్ల సమ్మేళన అంతిమసమావేశాలకు ముస్లింలీగు పూర్తి అధికారాలనిచ్చి తన ప్రతినిధులను పంపడానికి వీలవుతుంది. 29, 30, 31 వ తేదీలలో కాంగ్రెసుమహాసభ జరుగనున్నది. కనక, దానికి ముందుగానే అఖిలపక్ష సమ్మేళనం జరపాలని కోరుకున్న ఆహ్వానసంఘంవారిని సంతృప్తిపరచినట్లౌతుంది. 22, 23, 24 వ తేదీలలో అనేక అవివాదగ్రస్తమైన విషయాలు పరిష్కరింపబడతాయి; అవి అందరికీ అంగీకృతమైనవేకనుక, వాటివల్ల ఎవరికీ ఏచిక్కూ కలగదు; కాని వీటిని పునర్విచారించాలని ముస్లింలీగు ప్రతినిధులు భావించినట్లయితే, తాము హాజరౌతున్న అంతిమసమావేశాలలో అలాగ కోరేహక్కు వారికి వుంటుంది. అఖిలపక్ష సమ్మేళనానికి ప్రతినిధులను పంపే అధికారాన్ని ముస్లిములీగు కౌన్సిలుకు యిస్తూ, ముస్లిములీగు గత వార్షికసమావేశంలో ఒక తీర్మానంచేసిందిగదా. ఆ తీర్మానాన్ని పురస్కరించుకొని, ముస్లిములీగు వార్షికసమావేశం జరిగేలోపున సమ్మేళనంలో పాల్గొనడానికి, ముస్లింలీగు కౌన్సిలు తన ప్రతినిధులను పంపిస్తే బాగుంటుంది. సమ్మేళనపు ప్రథమసమావేశాల్లో (22, 23, 24వ తేదీలలో) వారికి అవసరమనితోస్తే, ఏ విషయానికీ తాము కట్టుబడి వుండనక్కరలేదు. ఈ ఏర్పాటు మీకూ మిగిలినవారందరికీ సంతృప్తికరంగా వుంటుందని నమ్ముతున్నాను.

సమ్మేళనం ఆ యా, తేదీలలో జరుగనున్నదని పత్రికల కొక ప్రకటన పంపిస్తున్నాను.

మీ విశ్వాసపాత్రుడు,
మోతీలాల్ నెహ్రూ.

59. మహాత్మా గాంధీవద్దనుంచి,

[ సైమన్ కమీషను లాహోరు వచ్చి రాగానే దానికి వ్యతిరేకంగా చాలామందిమి శాంతియుతమైన ప్రదర్శనలు జరిపాం. ఆ సందర్భంలో గాంధీజీ యీ ఉత్తరాన్ని వ్రాశారనుకుంటాను. మమ్మల్ని పోలీసులు తీవ్రంగా లాఠీలతో కొట్టారు. ]

వార్ధా,
డిసెంబరు 3, 1928

నా ప్రియమైన జవహర్,

నీకు నా ప్రేమాభివందనాలు. అంతా వీరోచితంగా జరిగింది. ఇంతకంటె వీరోచితమైన అనేకపనులు నువ్వు చేయాలి. దేవుడు నీకు దీర్ఘాయువు ప్రసాదించి దాసిసత్వంనుంచి భారతదేశాన్ని విముక్తిచేసే దేవమూర్తిగా నిన్ననుగ్రహించుగాక!

నీ,
బాపు.

60. నరేంద్రదేవ్ వద్దనుంచి,

[ ఈ ఉత్తరంలో పేర్కొనబడిన 'సమితి' అంటే, భారతదేశ సంపూర్ణ స్వాతంత్ర్యవాదుల సమితి అని అర్థం. సంపూర్ణ స్వాతంత్ర్యం, కాంగ్రెసు తనలక్ష్యంగా స్వీకరించేటట్లు ఒత్తిడి చేయడంకోసం ఈ సమితి స్థాపించబడింది. నరేంద్రదేవ్ కాం

[గ్రెసు అగ్రనాయకుల్లో ఒకడు. కొంతకాలం గడచినతరువాత ఆయన, భారతదేశంలో సోషలిస్టుపార్టీని స్థాపించారు.]

బెనారస్,

ఫిబ్రవరి 9, 1929.

నా ప్రియమైన జవహర్‌లాల్‌జీ,

వ్రాతప్రతి నాకు సకాలంలో అందింది. నే నది చదువుతున్నాను. దాన్నిగురించి నా అభిప్రాయమేమిటో త్వరలోనే తెలియజేస్తాను. మీ ప్రశ్నలకు సమాధానమివ్వడానికికూడా నేను ప్రయత్నిస్తాను.

సమితివిషయం నే నాలోచించిచూశాను. దాన్నిగురించి ప్రస్తుతం నాకు కలుగుతున్న భావాలను నేను మీకు స్పష్టంగా వ్యక్తంచేస్తాను. సమితికి ఉజ్వలమైన భవిష్యత్తున్నట్లు నాకు తోచడంలేదు. ఏదో ఒక ఆర్థికప్రణాళికమీద అచంచల విశ్వాసం, చిత్తశుద్ధిగల వ్యక్తులు మనకులేరు. ఒక నూతన ప్రాతిపదికమీద మన సమాజాన్ని పునర్నిర్మించవలసిన ఆవశ్యకత వుందని మనం స్థూలంగా మాత్రమే నమ్ముతున్నాం తప్ప, దానినిగురించి మనకొక స్పష్టమైన అభిప్రాయమంటూ ఏదీలేదు. ఏఏ సామాజిక ఆర్థికసిద్ధాంతాల ప్రాతిపదికమీద సంఘం తిరిగి రూపొందింపబడాలో, మన కొక విస్పష్టాభిప్రాయం లేనంతవరకు, ప్రస్తుత దేశపరిస్థితుల్లో ఏది సాధించవీలవుతుందో మనకు సరిగా తెలియనంతవరకు, ఏదో ఫలితం చేకూరుతుందని మనం ఆశించలేం. మనలో అనేకుల అభిప్రాయాలు అస్పష్టమైనవి; అనిర్దిష్టమైనవి; కార్యాచరణకేవిధంగా ఉపక్రమించవలెనో చాలామందికి తెలియదు. ఇందువల్ల మనం మన కృషిని చిత్తశుద్ధితో కొనసాగించలేకపోతున్నాం. మన చుట్టూవున్న పరిసరాలు జడత్వంతో నిండివుండడం మనం గమనిస్తున్నాం. ఒకదానియందు ప్రతిభాపూర్వకమైన విశ్వాసం లేకపోవడమే ఈ నిద్రాణపరిస్థితులకు హేతువు. నిద్రాణపరిస్థితులనుంచి మన ప్రజలను మనం మేల్కొల్పుకోవాలి. అనేక సమస్యలపైకి ప్రజలదృష్టిని మనం మరల్చి వారిని నిరంతరం ఆలోచించేటట్లుగా చేయాలి. ఇందు

కోసం ఒక వారపత్రికను సమితి విధిగా ప్రారంభించాలి; విరాళాలను సేకరించి సిద్ధాంతగ్రంథాలను అచ్చువేయడమే కాక పుస్తకశాలను నెలకొల్పాలి; దీనితోపాటు సమితి, అధ్యయనతరగతులను ఏర్పాటుచేస్తూ ప్రాంతీయభాషలలో గ్రంథాలను ప్రచురించి ప్రజలకు చౌకగా అందించాలి. ఈ సంవత్సరం మనం చేయవలసిన పనుల్లో ఇది అత్యంత ముఖ్యమైనదని నా అభిప్రాయం; బలమైన పునాదులను నిర్మించడానికి ఇది ఒక్కటే మార్గం. విషయపరిజ్ఞానమున్న వ్యక్తులు; సంతృప్తికరమైన ఆర్థికప్రణాళికను రూపొందించగల సమర్థులు సమితిలో చాలా కొద్దిమందిమాత్రమే వున్నారు. ఈ సమస్యలపై సమితి తన దృష్టిని కేంద్రీకరించేలట్లు మీరు కృషిసల్పాలని నేను ప్రార్థిస్తున్నాను. మన ఉనికిని సమర్థించుకునే పనేదీ యింతవరకూ మనం చేయలేదు. సమితికి అనేక ఆశయాలున్నాయి. సమాజాన్ని నూతన ప్రాతిపదికమీద పునర్నిర్మించడం దాని ప్రధాన ఆశయాల్లో ఒకటి. రాజకీయ స్వాతంత్ర్యాన్ని పొందినంతమాత్రాన సమితి సంతృప్తిపడజాలదు. సమాజ పునర్నిర్మాణానికి ఎలాంటి నూతన ప్రాతిపదిక అవసరమని సమితి భావిస్తున్నదో, తన ఈ లక్ష్యాన్ని ఏ పద్ధతులననుసరించి సాధించాలనుకుంటున్నదో, తెలుసుకోవాలని ప్రజలు సహజంగా వాంఛిస్తున్నారు. ఈ విషయాన్ని గురించి కలకత్తాలో అనేక మంది నన్ను రకరకాల ప్రశ్నలువేశారు. ప్రారంభదశలో తను కలిగించిన ఆశలను సమితి యిప్పుడు నెరవేర్చలేకపోతున్నదన్న సాధారణ భావం అంతటా వ్యాపించివున్నట్లు నాకు ద్యోతకమైంది. సంపూర్ణ స్వాతంత్ర్యసిద్ధాంతాన్ని ఆమోదించాలని కాంగ్రెసుతో పోట్లాడడానికి మాత్రమే సమితి నెలకొల్పబడిందనీ, ఆ పోరాటం యిప్పుడు ముగిసింది కనుక సమితిలో యిక ఒక్కరోజుకూడా వుండవలసిన అవసరం లేనే లేదనీ కొందరు భావిస్తున్నారు. మరికొందరు సంపూర్ణస్వాతంత్ర్య సిద్ధాంతంపట్ల విశ్వాసముంచుతూనే, ఆదర్శాలను లక్ష్యాలను అంతగా సరకుగొనక, వెంటనే అనుసరించదగిన పటిష్టమైన కార్యవిధానంపట్ల అత్యంత శ్రద్ధాసక్తులను చూపుతున్నారు. కాంగ్రెసు నిర్మాణకార్యక్రమం వారిని నిరుత్సాహపరుస్తోంది; అది నిస్సారమైనదని వారి విశ్వాసం.

ఇంతకంటె ఉత్తమమైన కార్యక్రమాన్ని మనం దేశానికి సూచించలేకపోయినట్లయితే, దేశస్థులు, సమితిలో చేరడానికి సహజంగా ఉత్సాహపడరు. వారేకాదు, మన మనుష్యులనుకునేవాళ్ళు కూడా నిరుత్సాహంగా వున్నారు; సమితివిషయాలు వారు పట్టించుకోవడంలేదు. ఎన్ని ఉత్తరాలు వ్రాసినా, కొందరు తమ అభిప్రాయాలు తెలపడంలేదు: మరి కొందరు మిత్రులు ఉత్తరం అందినట్లుకూడా వ్రాయడంలేదు.

సమితి కార్యదర్శిగా వుండడానికి నే నంగీకరించినప్పుడే, విద్యాపీఠ విధ్యుక్తధర్మాలను నిర్వర్తించవలసిఉంటుంది కనుక, దేశంలో పర్యటించడానికి నాకు తీరికచిక్కదని, నేను తెలియచేశాను. ఈ విషయం మీకు జ్ఞాపకంవుండేవుంటుంది. నే నిక్కడనుంచి ఉత్తర ప్రత్యుత్తరాలను మాత్రం జరపగలను; వ్రాసిన ఉత్తరాలకు సమాధానాలు రాకపోతే, నే నింతకంటె చేసేదేమీలేదు.

ఈ పరిస్థితులను సరిదిద్దుకోకపోతే, మనం పురోగమించడంకల్ల.

సాధ్యమైతే, సమితి ఆశయాల కనుగుణంగా, మన మొక ఆర్థికప్రణాళికను రూపొందించుకోవాలి. విడిగా తమ ప్రణాళికలను రచించుకునే స్వేచ్ఛ రాష్ట్రసమితులకుంటే బాగుంటుందని నే ననుకోను. అది వట్టి నిరర్థకం. అటువంటి స్వేచ్ఛ కనుక యిచ్చినట్లయితే, మీరన్నట్లుగా, పరస్పరవిరుద్ధప్రణాళికలు తయారయే ప్రమాదం వాటిల్లుతుంది; పరిస్థితులు మరీ గందరగోళమౌతాయి. సమితి ఒకే ఒక ప్రణాళికకోసం నిలబడాలి; ఒకే ఒక గొంతుకతో మాట్లాడాలి.

ప్రణాళిక ఎలావుండాలో, రాష్ట్రసమితులు తమ సలహాలను, కేంద్ర కార్యవర్గానికి పంపాలన్న మీ సూచన అవశ్యం అనుసరణీయమే. అలాంటపుడు మీ ప్రణాళికముసాయిదా నాధారంగాచేసుకుని చర్చలు కొనసాగించడానికి మన కార్యవర్గం సమ్మతించవచ్చును.

అలాకాకుండా, కేంద్రకార్యవర్గమే ఒక ఆర్థికప్రణాళికను రూపొందించి, దేశానికొక పథకాన్ని సూచించగలిగినట్లయితే అంతకన్నా

మంచిది. ఏమైనప్పటికీ, పైన నేను పేర్కొనిన కార్యభారాన్ని, కేంద్రి కార్యవర్గప్రమేయం లేకుండా రాష్ట్రిసమితులు స్వీకరించవచ్చును.

రాష్ట్రికమిటీ సమావేశం లక్నోలో 24వ తేదీన జరుగుతుంది. మీకు త్వరలో నా నోటీసు అందుతుంది.

మీ విశ్వాసపాత్రుడు,
నరేంద్రదేవ్.

61. మహాత్మా గాంధీనద్దనుంచి

రైలులో,
జూలై 29, 1929.

నా ప్రియమైన జవహర్లాల్,

నువ్వు నీ కుమార్తె ఇందూకి వ్రాసినలేఖ లద్భుతంగావున్నాయి. వాటిని నువ్వు ప్రచురించడం అవసరం. నువ్వాజాబులు హిందీలోవ్రాసి వుంచే బాగుండును. అయినా వాటిని ఆంగ్ల, హిందీభాషలలో ఒకేసారి ప్రచురించవచ్చును.

నీ లేఖల్లో ప్రస్తావించబడిన విషయం శాస్త్రసమ్మతంగా వుంది. తొలిమానవుడు ఎలాగ ఉద్భవించాడన్నది, యిప్పటికీ వివాదగ్రస్తంగానే వుంది; అలాగే, మతం ఎలాగ ఆవిర్భవించినదీ ఇదమిత్థమని చెప్పడం కష్టం. అదీ వివాదాస్పదమైన అంశమే. కాని యీ సిద్ధాంతభేదాలు నీ లేఖలవిలువను తగ్గించడంలేదు. నువ్వు కావించిన నిర్ణయాలవల్ల వాటికి విలువకలగకపోయినా, నీ రచనాధోరణివల్ల లేఖలకు విలువ వచ్చింది; అనేకవ్యాపకాలలో వుంటూకూడా, బాలిక ఇందూ మనస్సుకు హత్తుకునేటట్లు చక్కగా తేటగా,అనేకవిషయాలను నువ్వు బోధించావు.

నేను తీసుకున్న గడియారాన్నిగురించి కమలతో పేచీపెట్టుకోవడం నా కిష్టంలేకపోయింది. బహుమతివెనకవున్న ప్రేమను నేను కాదనలేకపోయాను. అయితే బాలిక ఇందూకోసం, గడియారా న్నొక నిధివలె దాచివుంచుతాను. అనేక మూర్ఖచిత్తులమధ్య ఆ వస్తువును వదిలి

పరచడం కష్టం. కుమా ర్తె ఇంటూశు ఉప్పందానికి చసగడియాలాన్ని స్వీకరించడానికి కమల అంగీకరిస్తుందేమో నేను తెలియగోరుచున్నాను.

కాంగ్రెసు 'కిరీటాన్ని' గురించి వ్రాద్దామనుకున్న నా వ్యాసం పూర్తి అయింది. వచ్చే 'యంగ్ ఇండియా'లో నా వ్యాసాన్ని ప్రచురిస్తాను.

నీ,

బాపూ.

## 62. సరోజినీనాయుడునద్దనుంచి

[నేను భారతజాతీయ కాంగ్రెసు అధ్యక్షునిగా ఎన్నికైన సంద ర్భంలో శ్రీమతి సరోజినీనాయుడు ఈ ఉత్తరం వ్రాశారు.]

లక్నో,

సెప్టెంబరు 29, 1929

నా ప్రియమైన జవహర్,

నిన్నటి విజయంవల్ల నాన్నగారిహృదయం భారతదేశంలో అం దరికంటే మిన్నగా ఆనందాతిశయంతో పులకితమైఉంటుంది; అలాగే నీహృదయం అనేక భావాలతో అత్యంత భారమై ఉంటుంది. ఇక నేను, చిత్రమైన మనఃస్థితిలో పడిపోయాను. అటు నాన్నగారి ఆనందాతి శయాన్ని, ఇటు నీ మనోభారాన్నీ, నేను సరిసమానంగా పంచుకోవలసి వచ్చింది. నువ్వు మాతృదేశంకోసం జీవితాన్ని అంకితంచేయడానికి పుట్టిన కారణజన్ముడవని నే నప్పుడప్పుడు అంటూఉండేదాన్నికదా; ఆ మాటలు జ్ఞాపకమొచ్చి, రాత్రి చాలాసేపటివరకూ ఆలోచిస్తూనే వున్నాను. అధ్యక్షుడుగా ఎన్నికైనతరువాత, ని న్నభినందిస్తూ పలువురు ఉపన్యసిస్తున్నప్పుడు, నీ ముఖకవళికలను నేను గమనించాను. అప్పుడు నాకు, నువ్వు పట్టాభిషిక్తుడవైనట్టూ కనిపించావు; కొరతవే యబడ్డట్టూ కనిపించావు. కొన్ని పరిస్థితులలో, కొన్ని సన్నివేశాలలో ఈ రెండూ అనుసంధించి వుంటాయి. వీటిని మనం వేరుచేయలేం; అహంకారపూరితమైన, ఆర్భాటమైన మాటలమధ్య బలహీనత

దాగివుంటుంది. చాటున ఒకరిని నిరసించడం, వంచన, స్వామిద్రోహం, కపటం యివన్నీ బలహీనతకు లక్షణాలు. అంతంత మాత్రపు లలితమనస్కులు వీటినిచూసి సహజంగా బాధపడతారు. వారి కంటెహూడా, నువ్వు ఎన్నోరెట్లు క్షోభపడతావు. ఈ అవలక్షణాలు ఎక్కడ కనిపించినా నీ మనస్సు కుమిలిపోతుంది. హృదయం ద్రవిస్తుంది. నువ్వు ఆర్ద్రహృదయుడవు; సహృదయుడవు ...

అధ్యక్షపీఠం అతి భారమైనది. కార్యాలయ నిర్వహణ కష్టతరమైనది. నీ అభిప్రాయాలను ఆదర్శాలను ఆచరణలోపెట్టడానికి తగినంత శక్తీ, అంగబలమూ లేదని, నువ్వు నాకు చెప్పినప్పటికీ నీకుగల స్వాతంత్ర్యేచ్ఛ, చిత్తశుద్ధి ఎనలేనివి. వాటియందు నాకు సంపూర్ణ విశ్వాసముంది. నీ కా అధ్యక్షపీఠం, నీ శక్తిని పరీక్షించే ఒక సవాలుగానూ యివ్వబడింది; నీ కొక కానుకగానూ సమర్పించబడింది. ఈ సవాలు నీఉదాత్తగుణాలను ఒకమహత్తరమైనశక్తిగాపరివర్తింపజేస్తుంది. అచంచల విశ్వాసమును, దూరదృష్టిని, ఉపజ్ఞను రూపొందింపజేస్తుంది. ఈ నా విశ్వాసం వమ్ముఅవుతుందనే భయం నాకు లేదు.

నువ్వీ అద్భుత, గురుతరబాధ్యతను నిర్వహిస్తున్నపుడు, అడిగినచోటడవుగా నీకు నా సహాయం, నా తోడ్పాటు లభిస్తుంది. ఏవిధంగా తోడ్పడమని నీ వాదేశించినా, నే నా బాధ్యతను స్వీకరిస్తాను.... యిదీ అని చెప్పుకోదగ్గ సహాయం ప్రత్యేకంగా నేను చేయలేకపోవచ్చును. అయినా సహానుభూతితో సౌమనస్యంతో నీ హృదయాన్ని అర్థంచేసుకోగలను. "ఖలీల్ జిబ్రన్" చెప్పినట్లు "ఒకని దార్శనికత్వం యింకొకని కెగిరే టన రెక్కలను మాత్రం యివ్వదు." అయినప్పటికీ ఒకని అచంచలమైన ఆత్మవిశ్వాసం యింకొకని ఆత్మవిశ్వాసాన్ని రగిల్చి ప్రపంచమంతటా దీప్తినొందింపడానికి సహాయపడుతుందని నా నమ్మకం.

ప్రేమగల నీ స్నేహితురాలు,
సోదరి,
సరోజినీనాయుడు,

## 63. మహాత్మా గాంధీకి

[ఢిల్లీలో నాయకులసమావేశం జరిగినవెంటనే, ఈ ఉత్తరం వ్రాశాను. సమావేశానికి హాజరైన నాయకులు సంతకంపెట్టి ఒక ప్రకటన విడుదలచేశారు. ఎంతో అనిష్టతతో చిట్టచివరకు ఆ ప్రకటనమీద నేనుకూడా సంతకంచేశాను. సుభాస్‌బోసు సంతకం చేయలేదు. ఎలాగో ఒకలాగ దానిమీద సంతకంచేసినా, నేను చాలా బాధతో యీ ఉత్తరంవ్రాశాను. అప్పుడు నేను కాంగ్రెసుకు ప్రధానకార్యదర్శిగా ఉంటున్నాను. వచ్చే కాంగ్రెసుకు అధ్యక్షునిగా ఎన్నుకోబడ్డాను.]

అఖిలభారత కాంగ్రెసుకమిటీ,
52, హెవెట్‌రోడ్డు,
అల్లాహాబాద్, నవంబరు 4, 1929.

నా ప్రియమైన బాపూజీ,

నేను రెండురోజులు జాగ్రత్తగా ఆలోచించాను. ఈ పరిస్థితిపట్ల రెండురోజులకుపూర్వంకంటె యిప్పుడింకా ప్రశాంతమైన వైఖరి అవలంబించడానికి అవకాశముంది; కాని నా మనోవ్యధ నన్ను విడిచిపెట్టలేదు.

క్రమశిక్షణను పాటించాలన్న మీ అభ్యర్థనను నేను నిర్లక్ష్యం చేయలేను. నాకు క్రమశిక్షణయెడల సంపూర్ణవిశ్వాసముంది. అయితే దీన్ని యితరచోట్లకూడా పాటించవలసిన అగత్యంవుందనుకుంటాను. మొన్న సాయంకాలం నా హృదయ మెందుకో క్షోభపడింది. దాన్ని నేను సంబాళించుకోలేకపోయాను. కాంగ్రెసుకు నేను ప్రధానకార్యదర్శిని; కనుక దానికి నేను విధేయుడనై వుండాలి; దాని క్రమశిక్షణను పాటించి తీరాలి. ఇదేకాక, నాకు మరికొన్ని బాధ్యతలున్నాయి. నేను విధేయత చూపవలసిన తదితర సంస్థలుకూడా వున్నాయి. నేను అఖిలభారత ట్రేడు

యూనియన్ కాంగ్రెసుకు అధ్యక్షుణ్ణి, భారతదేశ సంపూర్ణస్వాతంత్ర్య వాలంటరుసమితికి కార్యదర్శిని; నాకు యువజనోద్యమంతో అత్యంత సన్నిహితసంబంధం వుంది. వీటిపట్ల నాకు సంబంధంవున్న తదితర ఉద్యమాలపట్ల నేను విధేయుడనై వుండాలికదా! మరి అలాంటపుడు నేనేంచేయాలి? ఒకేసారి అనేకగుర్రాలమీద స్వారీచేయడం పొసగదని ఇదివరకటికంటె ఇప్పుడు బాగా గుర్తించాను. నిజానికి ఒకగుర్రం మీద స్వారీచేయడమే కష్టం. బాధ్యతలకు విధేయతలకు సంఘర్షణకలిగి నప్పుడు. ఒకవ్యక్తి తనవివేకంపై, తన అంతరాత్మ ప్రేరేపణపై ఆధారపడక యింకేమి చేయగలడు?

ఇతర విధేయతలను సంబంధాలను నే నలాగవుంచి పరిస్థితిని సాకల్యంగా ఆలోచించుకున్నాను. ఆలోచించినకొద్దీ మొన్న నేనుచేసిన పని చాలాతప్పని స్పష్టపడుతూవచ్చింది. ఆ ప్రకటనకుగల యోగ్యత లెట్టివో దాని విధానమెట్టిదో నేను చర్చించదలుచుకోలేదు. మనకా సమస్య పట్ల ప్రధానమైన అభిప్రాయభేదాలున్నాయి. మిమ్మల్ని బహుశా నేను మార్చలేకపోవచ్చును. కనక నేనొక్కవిషయం మాత్రమే చెప్పగలను. ఆ ప్రకటన హానికరమైనట్టిదనీ, కార్మికప్రభుత్వప్రకటన కెంతమాత్రం తగిన ప్రత్యుత్తరం కాదనీ. నా నమ్మకం. మనం మనశిబిరంలోవున్న కొంతమంది పెద్దమనుష్యులను సమాధానపరచి వారిని అట్టేపెట్టుకుందుకు ప్రయత్నించాం; కాని ఆ ప్రయత్నాలవల్ల అంతకంటే హెచ్చుమందిని, మనశిబిరంలో వుండడానికి హెచ్చు అర్హతలున్నవారిని, మనం జారవిడుచుకున్నాం; వారి మనసుకు కష్టంకలిగించాం; మనమొక అతి ప్రమాదకరమైన పద్మవ్యూహంలో చిక్కుకున్నాం; ఇందులోనుంచి బయటపడడం సులభంకాదు. మనం ఇన్ని పెద్దకబుర్లూ చెప్ప కొనడకు ఎంతవస్తే అంతే చాలునన్నట్లుగా చిన్నచిన్న బేరాలకు దిగజారిపోయా మని ప్రపంచానికి వెల్లడైపోయాం.

ఇప్పుడిక బ్రిటిషుప్రభుత్వం ఏమిచేస్తుందో నాకు తెలియదు. బహుశా అది మీ షరతుల కంగీకరించకపోవచ్చును. అలాగ అంగీకరించకపోవడం మంచిదని నా విశ్వాసం. కాని మీరుతప్ప ప్రకటన

మీద సంతకంపెట్టినవారంతా, మీ షరతులకు భిన్నంగా బ్రిటిష్ ప్రభుత్వం సూచించే సూచనలనుసైతం అంగీకరిస్తారని నే ననుకుంటున్నాను. ఏది ఏమైనప్పటికీ, కాంగ్రెసులో నా స్థానం రోజు రోజుకూ, క్లిష్టతరమౌతున్నది. అనేక సందేహాలు కలిగినప్పటికీ, వచ్చే ఏడాది ఒక నిర్దిష్టసమస్యపై మనం పోరాటం కొనసాగించవచ్చునన్న ధీమాతోనే, నేను కాంగ్రెసు అధ్యక్షపదవిని అంగీకరించాను. కాని ఆ సమస్య అప్పుడే మరుగుపడిపోయింది. ఆనాటి నా ధీమా ఈనాడు గాలి కెగిరిపోయింది. ఈ "నాయపల సమావేశాల"తో, నే నేంచేయాలి? నేనప్రస్తుతంగా మధ్యనవచ్చి జోక్యంకలిగించుకున్నట్లు నా కనిపిస్తోంది. ఇది నా కెంతో ఎబ్బెట్టుగావుంది. సమావేశం భగ్నమౌతుందన్న భయంతో నేను నా భావాలను వెలిబుచ్చలేకపోయాను. నన్ను నే నణచుకున్నాను. మనసు నిలాగ అణచిపెట్టడం ఒక్కొక్కప్పుడు దుర్భరమౌతున్నది. నా భావాల నిక అణచిపెట్టుకోలేక వాటిని వ్యక్తంచేస్తున్నా. అవి సరిగా వ్యక్తంకావడంలేదు; నేను పూర్తిగా అనుకోని భావాలను సైతం ప్రకటిస్తున్నాను.

అఖిలభారత కాంగ్రెసుకమిటీ కార్యదర్శి పదవికి నేను రాజీనామాయివ్వవలసివుందనుకుంటాను. నాన్నగారికి నేను లాంఛనప్రాయంగా ఒక లేఖ పంపించాను; దాని ప్రతిని ఈ ఉత్తరంతోపాటు మీకు అందచేస్తున్నాను.

నేను అధ్యక్షునిగా వుండడమనేది అంతకంటె కష్టతరమైనపని. అయితే సమయం మించిపోయింది; ఇప్పు డిక నేనేంచేయగలనో నాకే బోధపడడంలేదు. కాని అధ్యక్షునిగా నన్ను ఎన్నుకోవడం సరైనదికాదని నా నమ్మకం. ఈ సమయంలో వచ్చేసంవత్సరానికి అధ్యక్షునిగా వుండడానికి మీరే అర్హులు. మాలవ్యాజీ విధానమే కాంగ్రెసువిధానమయితే మటుకు నేను అధ్యక్షునిగా వుండలేను. మీరు అధ్యక్షునిగావుండడానికంగీకరిస్తే ఇప్పటికైనా సమయం మించిపోలేదు; అఖిలభారత కాంగ్రెసుకమిటీ సమావేశం జరపనవసరంలేకుండానే మీరు అధ్యక్షునిగా వుండడాని కంగీకరించినట్లుగా సభ్యులకు సర్క్యులరు పంపించ

వచ్చును. నన్ను మన్నించి విడిచిపుచ్చవలసినదిగా సభ్యులను నే నర్థిస్తాను. ఇలాగ నరుక్కోవలసి పంపడం కేవలం లాంఛనప్రాయమైనది మాత్రమే; సభ్యులందరూ నిండుహృదయంతో మీరు అధ్యక్షపదవిని స్వీకరించడానికి అంగీకరిస్తారు.

ఇందుకు ప్రత్యామ్నాయంగా యింకొకసూచన కానవస్తోంది. ప్రస్తుత పరిస్థితులదృష్ట్యా, మరొక అధ్యక్షుని ఎన్నుకోవలసిన యిబ్బందులదృష్ట్యా, కాంగ్రెసుమహాసభ ముగిసినవెంటనే, నేను విరమించడం యుక్తంకాదు, కనుక నేను కాంగ్రెసు ఛైరుమన్‌గావుంటాను; నా నిమిత్తంలేకుండా కాంగ్రెసు తనకిష్టమొచ్చినవారిని అధ్యక్షులుగా ఎన్నుకోవచ్చును.

నా శారీరక మానసిక ఆరోగ్యాన్ని కాపాడుకోవాలంటే, పై రెండింటిలో ఏదో ఒక మార్గం అనుసరించకతప్పదని నా అభిప్రాయం.

ఈ విషయంలో నే నెట్టి బహిరంగప్రకటన చేయదోవడంలేదు. అలాగని, ఢిల్లీనుంచి మీ కిదివరకే తెలియజేశాను. ఇతరులు ఏమన్నా అనకపోయినా, వాటితో నా కంత ప్రమేయంలేదు. వాటినిగురించి నేను బాధపడడంలేదు. కాని నా మనశ్శాంతిని నేను సమకూర్చుకోవాలి.

ఓ ప్రేమపాత్రుడు,
జవహర్‌లాల్.

ఈ ఉత్తరంప్రతినొకదాన్ని నాన్నగారికి పంపిస్తున్నాను, ఇది వ్రాసిన తరువాత నా మనసు కాస్త తేలికపడింది. అయితే ఇది మీకు కొంత చిరాకు కలిగిస్తుందని నాకు తెలుసును; కాని మిమ్మల్ని నొప్పించడం నా అభిమతంకాదు. ఇక్కడకు మీ రెలాగూ వస్తున్నారు కనక అప్పటివరకూ వేచివుండక, ఇప్పుడే ఈ ఉత్తరం మీకు రాయడమెందుకని తటపటాయించాను. ఈ పదిరోజులూ ఆగితే నా ఆందోళనా తగ్గుతుంది; ఇంతకంటె మంచి దృక్పథమూ ఏర్పడుతుంది. నిజమేమరి. కాని నా మనస్సు ఎలాగ వున్నదో, నా ఆలోచనాధోరణి ఎలా వుంటున్నదో ఎప్పటికప్పుడు మీకు తెలపడం యుక్తమని నేను భావించాను,

## 64 మహాత్మా గాంధీవద్దనుంచి

ఆలీఘర్,

నవంబరు 4, 1929

నా ప్రియమైన జవహర్‌లాల్,

నీ ఉత్తరం నా కిప్పుడే అందింది. నిన్ను నే నెలాగ ఉపశమింప చేయగలనో, నీ మనస్థితిని ఇతరులు నాకు చెప్పినప్పుడు, 'నేను నీపై అయుక్తమైన ఒత్తిడి ఏమైనా తీసుకొనివస్తున్నానా?' అని నాలో నేను ప్రశ్నించుకున్నాను. నువ్విలాంటి ఒత్తిడికి అతీతంగా ఉన్నావనే నే నెల్లప్పుడూ భావిస్తున్నాను; నీ అభిప్రాయభేదాలను, నీ ప్రతిఘటనను నే నెప్పుడూ గౌరవిస్తూనేవున్నాను. ఇకముందుకూడా వాటిని నేను గౌరవిస్తాను. ఈ నమ్మకంతోనే నిన్ను నే నలాగ బలవంతపెట్టాను. ఇది నా కొక గుణపాఠమగుగాక. నా సూచన నీ మనసుకు నచ్చనపుడు, అది అయుక్తమని నీవు భావించినపుడు వెంటనే దానిని నీవు ప్రతిఘటించాలని నా కోరిక. నువ్వలా ప్రతిఘటించేవని నే నెంతమాత్రం కినుక వహించను, పూర్వంవలె నేను నిన్ను ప్రేమిస్తూనేవుంటాను.

అయితే నువ్వెందుకు ఖిన్నుడవౌతున్నావు? ఇతరులు ఏమనుకుంటారోనన్న భయం నీకు లేదనుకుంటాను. నువ్వేమీ దోషం చేయనపుడు ఇక మరెందుకు నీకీ విచారం? సంపూర్ణ స్వాతంత్ర్యమనే ఆదర్శానికి, ఉన్నతిమైన స్వాతంత్ర్యానికి మధ్య వైరుధ్యంలేదు. ఇప్పుడు నువ్వు కాంగ్రెసుకు ప్రధానకార్యదర్శివి. వచ్చే సంవత్సరానికి కాంగ్రెసు అధ్యక్షుడవు. అత్యధికసంఖ్యాకులైన నీ సహచరుల సమష్టి చర్యకు సంబంధంలేనట్టు నువ్వు దూరంగా వుండలేవు. ప్రకటనమీద నువ్వు సంతకంపెట్టడం యుక్తంగావుంది. హేతుబద్ధంగానూ ఉంది. కనక నువ్వు నీ విచారాన్ని మానుకుని ఎప్పటివలె సంతోషంగా, ఉత్సాహభరితంగా వుంటావని విశ్వసిస్తున్నాను.

నువ్వు చేద్దామనుకుంటున్న ప్రకటన నిస్సందేహంగా నువ్వు చేయవచ్చును. కాని అందుకు తొందరెంతమాత్రం లేదు. ఇప్పుడే నాకు

రెండు కేబిల్సు అందేయి. వాటినకళ్ళు నీకు పంపిస్తున్నాను. నాన్నగారికి కూడా వాటిని చూపించు.

నాతో ఏ విషయం నువ్వు మాట్లాడాలనుకున్నా, నే నెక్కడ వున్నా నన్ను కలుసుకుని నువ్వు మాట్లాడవచ్చును. అందుకు సంకోచించవద్దు;

నే సలహాబాద్ చేరుకునేసరికి కమలకు బాగా నిమ్మదిస్తుందని, సంతోషంగా వుంటుందని అనుకుంటాను.

నీ,

బాపు.

65. యం. ఎ. అన్సారీవద్దనుంచి,

లక్నో,

నవంబరు 7, 1929

నా ప్రియమైన జవహర్,

మీ రా సాయంకాలం ఢిల్లీనుంచి వెళ్ళిపోతూ మా ఇంటికొచ్చినపుడు నేనొకవిషయం మీతో ప్రసంగించాలనుకున్నాను. నేను మిమ్మల్ని పేన్ గుప్తాగదిలో కలుసుకున్నపుడు ఆ ప్రక్కగదిలో రూపొందించ బడుతున్న ప్రకటనగురించి నేను మీతో ఏదో చెప్పినట్లుగా మీకు జ్ఞాపకముండివుంటుంది. కాని మీ రపుడు సంభాషణలో నిమగ్నులైవున్నారు. మీ సంభాషణల కంతరాయం కలిగించడం నా కిష్టంలేకపోయింది.

సమావేశానికి హాజరైన షువాబ్, ఖాలిక్, మహమ్మద్, తసధుక్ మొదలైన మిత్రులు సమావేశవ్యవహారాలు వాటంతటవే కళ్ళకుకట్టినట్లు కనిపించగా, వాటిని జాగ్రత్తగా గమనించారు. ఎంతో హుందాగా, సాహసోపేతంగా ప్రవర్తించారని మిమ్మల్ని వారు మిక్కిలి కొనియాడారు. వారికి మీమీద అత్యంత ప్రీతిభావమేర్పడింది. మీ చర్యవల్ల కలిగిన అవకాశాన్ని కొందరు తమస్వార్థంకోసం వినియోగించుకోబోతున్నట్లు మేం అప్పుడే అక్కడే గ్రహించాం; (ఇందుకోసం అనాడు

అక్కడ చాలామంది వ్యక్తులు ఒకచోటచేరి గుసగుసలాడడం మేం గమనించాం.) కాని మీ రిలాంటి అల్పాతిఅల్పమైన విషయాలను ఎంత మాత్రం పట్టించుకోరని, అవి మీ కృషికి ప్రతిబంధకం కాజాలవని నాకు తెలుసును. ఏమైనప్పటికీ, సుభాస్‌తోపాటు అనేకమంది రాజీనామా యిస్తారని నే నాశిస్తున్నాను. ఇది సమస్యపట్ల కేవలం నాకున్న వ్యక్తి గత దృక్పథంమాత్రమే.

మీరు పండిట్జీకి మహాత్మాజీకి వ్రాసినఉత్తరాలు చూశాను- అందు లోని విషయాలు నన్ను కలతపెట్టాయని మీకు నేను చెప్పకతప్పదు. కాంగ్రెసు కార్యదర్శిపదవికి వర్కింగుకమిటీ సభ్యత్వానికి రాజీనామా నివ్వడంలో మీరు వేగిరపడ్డారని తొందరపడ్డారని నా అభిప్రాయం. కాంగ్రెసు అధ్యక్షుని ఎన్నికవిషయంలో మీరు సూచించిన సూచనలు సైతం అదే ధోరణిలో వున్నాయని భావిస్తున్నాను. కాంగ్రెసు అభిప్రాయాలు మీ భావాలకు వ్యతిరేకంగా వున్నందున అధ్యక్షపదవికి మీరు రాజీనామా యివ్వనవసరంలేదు. ఆ అవసరం లేకుండానే కాంగ్రెసు మీ భావాలను ఆమోదించడానికి అవకాశాలు హెచ్చుగా వున్నాయని నా నమ్మకం.

మన ఢిల్లీప్రకటన తరువాత, కామన్సుసభలో చర్చ జరిగిన పిమ్మట, మన సూచనలను వారు తిరస్కరిస్తారో ఆమోదిస్తారో మనం తెలుసుకొనడానికి వీలుకలుగుతుంది. అవి ఆమోదింపబడడానికంటే తిరస్కరింపబడడానికే హెచ్చు అవకాశాలున్నాయి; అలాంటప్పుడు మనం ఏంచేయాలో మన లాహోరుసమావేశంలో నిర్ణయించుకోవచ్చును. మన వైఖరిని కాంగ్రెసుసంస్థ యావత్తూ బలపరుస్తుంది, కనుక పండిట్జీ చెప్పినట్లుగా మనం "నిరీక్షించి చూద్దాం". వర్కింగుకమిటీ సమావేశం జరిగేలోపున మీ రేచర్యను తీసుకోకపోవడం ఉత్తమమైన పద్ధతిఅని నే ననుకుంటున్నాను.

పండిట్జీతోపాటు నేనూ అల్హాహాద్ రావాలని చాలా కుతూహల పడుతున్నాను. కాని నన్ను కవిపెట్టుకునివున్న రోగులకెవరికీ తెలియ కుండా చడీచప్పుడూ లేకుండా నేను ఢిల్లీ వొదిలిపెట్టాను. అల్హాబాదులో

వర్కింగ్ కమిటీ సమావేశానికి నే నెలాగూ రావాలికనక, నేను ఒక వారంరోజులపాటైనా రోగులను కనిపెట్టుకుని వుండవలసివుంటుంది.

మాజీకి నా నమస్కృతులు; కమలకు, స్వరూప్‌కు, బెట్టీకి ఇందూకూ నా ప్రేమాభివందనాలు.

మీ ప్రేమపాత్రుడైన,
యం. ఎ. అన్సారీ.

## 66. మహాత్మా గాంధీవద్దనుంచి

బృందావన్,
నవంబరు 8, 1920

నా ప్రియమైన జవహర్,

నీ ఉత్తరం అందింది. నా తంతివార్త నీకు అందివుంటుంది. ప్రస్తుతంమటుకు నువ్వు రాజీనామాపెట్టకూడదు. నా వాదన నేను వివరించడాని కిప్పుడు నాకు వ్యవధిలేదు. నీ రాజీనామావల్ల జాతీయోద్యమానికి నష్టంవాటిల్లుతుందని మాత్రమే నాకు తెలుసును. నువ్వు తొందరపడనక్కరలేదు; నువ్వు రాజీనామాపెట్టకపోవడంవల్ల ఏ ఆశయానికీ భంగంవాటిల్లదోదు. ఇక కిరీటం గురించి: దాన్ని నువ్వు తప్ప మరెవ్వరూ ధరించలేరు. అది గులాబీల కిరీటంకాదు; అదిపుడు ముళ్ళ కిరీటమే కానియ్యి. నేను దాన్ని ధరించడానికి నా మనస్సును నేను లొంగతీసుకోగలిగివుంటే ఆ పని నేను లక్నోలోనే చేసివుండేవాణ్ణి. అయితే నే నందు కంగీకరించకపోవడానికి కారణాలు నువ్విపుడు చెప్తున్న కారణాలవంటివిమాత్రమే కావు. అందు కొక కారణం, నువ్వపుడు అరెస్టుకావడం, ఉధృతమౌతున్న నిర్బంధవిధానం. ఈ విషయాన్ని గురించి మనం కలుసుకున్నపుడు సాకల్యంగా విషయబద్ధంగా చర్చించుకుందాం.

ఈలోపున దేవుడు నీకు ప్రశాంతత నిచ్చుగాక.

బాపూ.

67. సరోజనీనాయుడునద్దనుంచి

తాజ్‌మహల్ హోటల్, బొంబాయి,
నవంబరు 20. 1929

ప్రియమైన జవహర్లాల్,

అనేక కష్టాల్లో స్నేహంకోసం పడే తాపత్రయమే ఈ ఉత్తరం. పద్మజా నేనూ ప్రయాణసన్నాహంలోవున్నాం. మేమిద్దరం దారుణంగా పేరు మోసినవాళ్లం అవడంవల్ల ప్రతిక్షణం "అనేక తరహాలైనవ్యక్తులు" పురుషులు స్త్రీలు మమ్మల్ని చూడ్డానికివచ్చి వేధించుకుతింటున్నారు. పద్మజ, తన గృహకృత్యాలభారంనుంచి తెరిపినపడడం యిదే మొదటి సారి. మొదటిసారి తాను సముద్రయానంచేస్తున్నందు కామె హర్ష పులకిత అవుతున్నది. ఈ ప్రయాణంవల్ల ఆమెఆరోగ్యం బాగుపడు తుందని, ఉల్లాసం అధికమౌతుందని నేననుకుంటున్నాను. ఆఫ్రికావెళ్ళ నా, వద్దా అని నేను ఆలోచించి, వెళ్ళాలని ఒక్కక్షణంలో అకస్మాత్తుగా నిశ్చయించుకున్నాను. కాని వారు కష్టాల్లోవున్నారు; వారికి అత్యవసరంగా చేయూతకావాలి. ... పద్మజ ఆఫ్రికావెళ్లాలని ఊరికే ఆరాటపడుతోంది. నేను బయలుదేరడాని కామె ఆరాట మొక కారణం.

వెళ్లివస్తా, ప్రియమైన జవహర్. నీ కాంగ్రెసుమహాసభకు డిసెంబరు 21వ తేదీనాటికి, నేను తిరిగివస్తాను. అధ్యక్షుడు నాన్నగారు, కూతురు అధ్యక్షురాలికి డిసెంబరు 6వ తేదీనాటికి, నైరోబీలో కాంగ్రెస్ తొలిసమావేశంలో తనసందేశాన్నిచదవడానికి పిలుగా పంపేటట్లుచూడు. జీవితం సుఖప్రదమగుగాక! ఆనందభవన్‌లోవున్నవారందరికీ పద్మజ అభివందనాలు, నా అభివందనాలు.

ప్రేమగల నీ,
సరోజిని.

68. అనీబిసెంటునద్దనుంచి

ది థియొసాఫికల్ సొసైటీ,
అడయారు, మద్రాసు,
నవంబరు 29, 1929.

ప్రియమైన పండిట్జీ,

నేను ఉపన్యసిస్తూవుండగా, కరపత్రాలను పంచిపెట్టినందుకు మీ విచారాన్ని మీరు వ్యక్తంచేసినందుకు కృతజ్ఞురాలను. నమ్మండి, అది నా కెంతమాత్రం బాధ కలిగించలేదు. నాతో ఏకీభవించినా, ఏకీభవించకపోయినా, మన యువకులు ప్రజాహితకార్యాలపట్ల ఆసక్తి చూపుతున్నందుకు నే నెప్పుడూ ఆనందిస్తూవుంటాను. అదీకాక, ఎవరే మనుకున్నా నేను బాధపడను. ఏమంటే, రాజకీయాలలో నా తల బాగా నెరిసిపోయింది.

అనీబిసెంటు.

69. వీరేంద్ర ఛటోపాధ్యాయనద్దనుంచి

[వీరేంద్ర చటోపాధ్యాయ సరోజనీనాయుడు సోదరుడు. ప్రథమ ప్రపంచ సంగ్రామానికి ముందు ఆయన ఆక్స్‌ఫర్డుకు పయనమై వెళ్లాడు; కాని భారతదేశానికి ఆయన తిరిగి ఎన్నడూచేరుకోలేదు. యూరోపులోవున్న అనేక అతివాదోద్యమాలతో ఆయనకు సంబంధంవుండేది.]

సామ్రాజ్యవాదవ్యతిరేక జాతీయ స్వాతంత్ర్యసమితి

అంతర్జాతీయ సచివాలయం,
24, ఫ్రెడరిక్‌స్ట్రాస్,
బెర్లిన్, యస్. డబ్ల్యు. 48,
డిసెంబరు 4, 1929

నా ప్రియమైన జవహర్,

నవంబరు ఏడవతేదీన (రష్యను విప్లవవార్షికోత్సవంనాడు) మీరు వ్యక్తిగతంగా నాకువ్రాసినలేఖ చదువుతున్నపుడు నా కెంతో బాధ కలిగింది. మనదేశ సమస్యలపట్ల నా కొక నిర్దిష్ట విప్లవదృక్పథం వుంది. మన యిద్దరికీ స్నేహమైనప్పట్నుంచి, నే నీ దృక్పథంతోనే, ముక్కుకు సూటిగా నా అభిప్రాయాలు నేను మీకు తెలియజేస్తున్నాను. అది నా కర్తవ్యమని నా భావం. మీ వైఖరిపట్ల ఆశ్చర్యాన్ని వెలిబుచ్చుతూ నా అభిప్రాయాన్ని నే నిదివరకే, మీకు అస్పష్టంగా తెలియచేశాను. కొంచెం అస్పష్టంగా తెలియజేయడానికి కారణంవుంది. టైమ్సుపత్రికలో ఆ వార్తను చదివి, మొదట నే నది నమ్మలేకపోయాను. కాని మీ ఉత్తరం, భారతీయపత్రికలు నా కా విషయాన్ని తేటపరిచాయి. ఢిల్లీలో మీరు విషాదకరంగా నేలకొరిగిపోయారని తెలియజేయడానికి నేను మిక్కిలి విచారిస్తున్నాను. తమ వర్గప్రయోజనాలకోసం రాజీబేరాలు సాగిస్తున్న దేశద్రోహులకు మీరు లొంగిపోవలసివచ్చిందని అందుకనేక కారణాలున్నవని మీరు చెబుతారు. వాటినూటకేమి, మరి అలాంటపుడు వెంటనే మీ రెందుకు రాజీనామాయివ్వలేదో నాకు దురవగాహంగావుంది. అలా మీరు చేసినట్లయితే, దేశంలో మీ స్థానం బలపడివుండును. యువజనులను కార్మిక కర్షకులను సంఘటితపరచి వుండేవారు. ప్రభుత్వంతో రాజీపడాలనే కాంగ్రెసువాదులను మీ రతిసులభంగా ఓడించి ఉండేవాళ్ళు. బ్రిటిష్‌వారి తంత్రాంగం ఫలించినదన్న 'పీపుల్' పత్రిక అభిప్రాయంతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. ప్రజల ప్రయోజనాలకంటె కాంగ్రెసులో ఐకమత్యం అతిముఖ్యమని భావించడం రాజకీయంగా ప్రధానమైన దోషం. మీరు దేశంలో నిస్సందేహంగా యువజన నాయకులుగా గుర్తింపబడినతరువాత, కొసకు శ్రామికజనుల విశ్వాసాన్నిసైతం చూరగొన్నపిమ్మట, మీ రీవిధంగా నిష్కారణమైన త్రుటికాలపు దుర్బలత్వంలో మానసికసంక్షోభంలో చిక్కుకుపోయారు. మీరు మీ అనుచరులను దారీ తెన్నూలేని అగాధంలో విడిచిపుచ్చారు.

ఇంతకూ విపరీత మేమంటే, ట్రేడుయూనియను కాంగ్రెసు అధ్య క్షులుగా మీరు గైకొన్న చర్యమాత్రం అన్నివిధాలా సంతృప్తికరంగానే వుంది, అక్కడంత సముచితంగా ప్రవర్తించిన మీరు ఢిల్లీ ప్రణాళికపై ఎలాగ సంతకంపెట్టారో అందుకు కారణమేమిటో ఊహించడం మరీ కష్టం. భారత కార్మికులలో అత్యధికులు సామ్రాజ్యవాదాన్ని తుదముట్టించాలని, సంపూర్ణ జాతీయ స్వాతంత్ర్యం కావాలని నిస్సందేహంగా వాంఛిస్తున్నారు. మీరు ఢిల్లీలో అవలంబించిన వైఖరి ఎంత తప్పో కార్మికులవాంఛ రుజువుచేస్తూనేవుంది. భారతదేశానికి అధినివేశ ప్రతిపత్తి నామోదించాలని కోరే అధికసంఖ్యాక కాంగ్రెసు వర్కింగుకమిటీ సభ్యుల నొకప్రక్క, భారతదేశానికి సంపూర్ణస్వాతంత్ర్యం కావాలని వాంఛించే అత్యధికసంఖ్యాక కార్మికుల నొకప్రక్క, మీరు బలపరుస్తున్నారు. పరస్పరవిరుద్ధమైన ఈ స్థితిని తొలగించడానికి ఏదో ఒక చర్య తీసుకోవలసివుంటుంది. గొప్ప గొప్ప నాయకులు తమ తప్పును అంగీకరిస్తూ బహిరంగప్రకటనలు తరుచు కావిస్తూవుంటారు. అలాగే మీరూ ఈ దోషాన్ని బహిరంగంగా అంగీకరించి సరియైనమార్గం చేబడితే, అంతర్జాతీయంగా మీ ఖ్యాతి చులకనకాకుండా వుంటుంది. నే డిది మీరు చేయవలచుకుంటే మీ సంతకాన్ని మీ రుపసంహరించుకోండి; కృత్రిమమైన అత్యంత ప్రమాదకరమైన ఐకమత్యాన్ని విచ్ఛిన్నంచేసి, మితవాదులను అధినివేశప్రతిపత్తివాదులను అవతలకు పారద్రోలండి; ఎట్టి రాజీపడకుండా, సామ్రాజ్యవాద వ్యతిరేకపోరాటాన్ని కొనసాగించడానికి యావత్తు కాంగ్రెసు నిర్మాణాన్ని మీ అధీనంలో వుంచుకుంటూ కాంగ్రెసు అధ్యక్షునిగా మీకుగల స్థానాన్ని ఒక అవకాశంగా వినియోగించుకోండి. అప్పుడు మీ రిదివరకు పోగొట్టుకున్న ఖ్యాతిని, స్థానాన్ని తిరిగి పొందగలుగుతారు; మీ ఖ్యాతి అప్పుడు యినుమడిస్తుంది, స్నేహభావం లోపించడంవల్ల నే నీ విమర్శచేయడంలేదు. దయచేసి ఎన్నడూ మీ రలాగ భావించకండి. భారత కార్మిక కర్షకుల ఆశయాలపట్ల నాకున్న శ్రద్ధాసక్తులవల్ల వారి ఉద్యమంపట్ల నాకున్న భక్తివిశ్వాసాలవల్ల నే నీ అభిప్రాయాలను వ్యక్తపరుస్తున్నాను. మన మీ దృక్పథంలో వీక్షించి

సమ్మతిమాత్రమే, మనసర్వులు సంప్రదించినా? కావా? ఆలోచించి నిర్ణ యించుకోగలం; నే నీదృక్పథాన్ని స్వీకరించి మీ పై ఉపరిని పరిశీలించాను. ఢిల్లీ ప్రణాళికపై మీరు సంతకంపెట్టడం, స్వాతంత్ర్యంకోసం పోరాడు తున్న భారతప్రజలకు ద్రోహంచేయడమేనని ఈదృష్ట్యా సూచించినప్పుడు నేను మీకు చెప్పకతప్పదు.

ఈ ఉత్తరం నేను సమితికాగితంపై వ్రాసినా, ఇది కేవలం వ్యక్తి గతమైన లేఖ.

అఖిలభారత సామ్రాజ్యవాద వ్యతిరేక సమాఖ్యను నెలకొల్ప వలసినదిగా మిమ్మల్ని కొందేళ్ళక్రితం నేను కోరుతూ కొన్నిపద్ధతులను సూచించాను. ఆ పద్ధతులపై దాన్ని నిర్మించవలసిన తక్షణ ఆవశ్యకత యెంతేని కలదని మీ రిప్పుడు గుర్తిస్తారని విశ్వసిస్తున్నాను. జాతీయ కాంగ్రెసు అంతో యింతో సామ్రాజ్యవాదవ్యతిరేకపాత్రను నిర్వహించే సంస్థలలో ఒకటిమాత్రమే కదా. అది భారతప్రజలకు ప్రాతినిధ్యం వహించే సంస్థకాదు. అందువల్ల ఈ సంస్థలన్నిటిని ఐక్యపరిచేవాటి ప్రయత్నాల ఫలితాన్ని సాధించే అఖిలభారత సంస్థ నొకదాన్ని రూపొం దించడం అత్యవసరం. ఈ సంస్థ, సామ్రాజ్యవాద వ్యతిరేక కనీస కార్యక్రమంపై కలిసినసంస్థలను సంఘటితపరచి తదనుగుణంగా వాటి విధానాలను సూచిస్తూ అంతిమ స్వాతంత్ర్యపోరాటానికి దేశాన్ని సంసిద్ధ పరచవలసివుంటుంది. ఇటువంటి సామ్రాజ్యవాద వ్యతిరేకసమాఖ్య సంస్థాపనార్థమై సృష్టిసాధించడంకోసం. భారతదేశంలోగల ఇతర సంస్థల కన్నింటికి మేం ఆహ్వానాలు పంపాము. ఇదివరకు మేం పంపిన ఉత్తరం మీ కందివుంటుంది; అయినా యింతటితోపాటు దానినకలు మీకు పంపిస్తున్నాను. ఈ డిసెంబరు ఆఖరున లాహోరులో సామ్రాజ్యవాద వ్యతిరేక మహాసభ జరపాలని మేం అనుకున్నాం. మహాసభ ప్రయ త్నాలు ఫలసాధకమౌతున్నాయో లేదో నాకుతెలియదు. మరి రెండువారాల్లో మీ రీవిషయమై మరికొంత భోగట్టా వినగలరు.

ట్రేడుయూనియను కాంగ్రెసువిషయమై టైమ్సుపత్రికలో మేం ఒంటివార్తనే చదివాం; అదేవిధంగా ఈసంవత్సరాంతాన భారతదేశం

నుంచి పొందే ప్రోత్సాహకంపైనే వార్త ఉంటుందని నేను హృదయపూర్వకంగా ఆశిస్తున్నాను.

కమలకు, కృష్ణకు, మీకూ నా అభివందనాలు.

మీ ప్రేమపాత్రమైన,
వి. ఛటోపాధ్యాయ.

70. మోతీలాల్ నెహ్రూవద్దనుంచి యం. ఎ. అన్సారీకి

ఫిబ్రవరి 17, 1930

నా ప్రియమైన అన్సారీ,

ఇవాళ ప్రొద్దుట నేను అహమ్మదాబాద్‌నుంచి బయలుదేరాను; రైలులో నే నీ ఉత్తరాన్ని మీకు వ్రాయిస్తున్నాను. నేను ఢిల్లీవస్తున్నాను, అక్కడ వారం వెనకా ముందుగా మిమ్మల్ని ఎలాగూ కలుసుకుంటాను; కనుక మీతో వ్యక్తిగతంగా మాట్లాడదామనుకున్నవిషయాలు ఈ ఉత్తరంలో నేను వ్రాయడంలేదు. కారణమేమైనప్పటికీ, అంతటా ఆఖరికి మన స్వంత కాంగ్రెసువాదులకూటమిలోసైతం నిస్తబ్ధత అలముకొని వుంది. మామూలుగా జరగవలసిన పనులుకూడా కొనసాగడంలేదు. నేను చెబుదామనుకుంటున్న ఈ నాలుగుమాటలూ నేను కాగితంమీద పెడదామనుకొంటున్నాను. అలాగైతే నా అభిప్రాయాలనుగురించి పొరపాటు పడడాని కాస్కారంవుండదు.

మొట్టమొదట నన్నొకవిషయం చెప్పనీయండి; మీకు ఉద్యమం పట్ల భక్తివిశ్వాసాలున్నవనీ, నామీద ఎంతో గౌరవం, ప్రేమ కలవని నే నెరుగుదును. మీమీద నాకు ఎనలేని విశ్వాసముంది. మనయిద్దరికీ అభిప్రాయభేదాలు కలగడం యిదే మొదటిసారికాదు. వెనకటిలాగే ప్రస్తుతపరిస్థితుల్లో మనకు అభిప్రాయభేదాలు పొడచూపాయి. మీ కర్తవ్యాన్ని మీరూ, నా కర్తవ్యాన్ని నేనూ నిర్వహించాలన్న న్యాయమైన భావంనుంచి, ఈ అభిప్రాయభేదాలు తలఎత్తాయి. ఇదివరకుకూడా అవి యిందువల్లనే కలిగాయని నేను భావిస్తున్నాను.

మీరు గాంధీజీకి వ్రాసిన లేఖను నేను జాగ్రత్తగా రెండుసార్లు చదివాను. హిందూ-ముస్లిం ఐకమత్యానికి మీరిస్తున్న ప్రాధాన్యమును నేనూ యిస్తాను. కాని ఆ ఐకమత్యం మన యింతవరకూ సాధించలేకపోవడానికి మీ రేకారణాలు పేర్కొంటున్నారో, ఇకముందు దానిని సాధించడానికి ఏయే మార్గాలు సూచిస్తున్నారో. వాటిలో మాత్రం నేను ఏకీభవించలేను. ఈ ఐకమత్యానికి గట్టిపునాదులనువేయడంకోసం. మీరూ నేనూ చాలా సంవత్సరాలనుంచి మన శక్తికొద్దీ కృషిచేస్తున్నాం. కాని మనం ఘోరంగా పరాజితులమైపోయినామని అంగీకరించక తప్పదు. గత అనుభవాన్ని పునస్మరించుకొని జాగ్రత్తగా పరిశీలించి యిప్పుడు నే నొక అభిప్రాయానికివచ్చాను. హిందూ ముస్లిం సఖ్యమును సాధించడంకోసం మన మనుసరించిన మార్గాల మూలప్రాతిపదికలు కేవలం దోషభూయిష్టమైనవి. మనం యిద్దరం కలసి పనిచేస్తున్నప్పుడీ విషయం అప్పుడప్పుడు మీకూ నాకూ మనసులో మెరుపువలె మెరుస్తూనేవుండేది. లాహోరులో మనం మహమ్మదీయుల సమావేశం ఏర్పాటుచేసి వెనుకకు తగ్గినట్లుగా, మనం వెనుకడుగువేస్తూవుండేవాళ్ళం, కాని మనపై ఈ విష వలయాన్ని ఛేదించి బయటపడడం ఆ స్థితిలో అసాధ్యమైపోయివుండేది. అసలుసంగతేమిటంటే మనం యిన్నేళ్ళూ చెవిటివానిముందు శంఖం పూదినట్లు మనకు ప్రమేయంలేని కోర్టులముందు న్యాయంకోసం పడిగాపులుకాశాం. ఇలాగ మనం అనంతకాలంవరకూ పాటుపడవచ్చును గాని ప్రయోజనం మాత్రం శూన్యం. ఒక ప్రదేశంలో ఒకానొకవ్యక్తికి ఘనంగా స్వాగతమిచ్చారని, అదేవ్యక్తికి యింకొక ప్రదేశంలో ఏమాత్రం స్వాగతమీయక నిరసించారని ఈ పత్రికలు జాతీయసమస్య అయిన హిందూ - ముస్లిం సమస్యాపరిష్కారానికి విఘాతం కలిగిందని చెప్పినట్లయితే. మనమింక నిరుత్సాహం చెంది ఎన్నింత వదిలిపెట్టవచ్చును. అప్పుడు మనంచేసిన పొరపాటునే ఇప్పుడు సర్ తేజ్ బహాదూర్ సప్రూ చేస్తున్నారు. మనం ఎక్కడ వదిలిపెట్టామో అక్కడ నుంచి ఆయన పని ప్రారంభించారు. అనతికాలంలో ఆయనకున్న భ్రమలన్నీ తొలగిపోతాయనడానికి సందేహంలేదు. ఆయన మార్గాన్ని అర్థ

రావడం నా కెంతమాత్రం యిష్టంలేదు. ప్రతికూలమైన విమర్శలేవీ లేకుండా ఉన్న మార్గాన తాను కృషిచేయనీయడం మంచిది. కొంతకాలానికి ఆయనే విసిగెత్తి రంగంనుంచి నిష్క్రమిస్తాడు. ఇందుకు కొన్ని రోజులు కాకపోతే కొన్నివారాలు పడుతుంది.

ఈ ఉత్తరంలో నేను నా అభిప్రాయాలను సూచించగలనేతప్ప వాటిని వివరించడం కష్టం. హిందూ - ముస్లిం సఖ్యము ప్రబోధాలవల్ల చేకూరదు. సఖ్యంకోసం తాము పాటుబడుతున్నామన్నభావం హిందువులకు, ముస్లిములకు కలగనీయకుండా దానంతటదే సిద్ధించేపద్ధతిని మనం దాన్ని సాధించాలి. ఒక ఆర్థిక ప్రాతిపదికపై మనం స్వాతంత్ర్యపోరాటం కొనసాగిస్తున్నప్పుడిది చేకూరుతుంది. తాము జీవించడం కోసం ఒక మతంవారు పోరాడుతున్నపుడు, ఆ పోరాటపు జయాపజయాల ఫలితా లెలావుంటాయో, నేడువారు కండ్లు రేపైనా ఇంకొకమతంవారు ఊహించుకోకుండా వుండలేరు. అలాగ వా రూహించుకున్నపుడు, తాము కూడా పోరాటంలోనికి దుమకడానికి సన్నద్ధులౌతారు. ఉప్పుసత్యాగ్రహం పేరిట ఆర్థిక ప్రాతిపదికపై ఇటువంటి పోరాటాన్ని, దూషణ తిరస్కారాలను ప్రతికూలవిమర్శలను లెక్కచేయక ప్రజ్ఞాశాలి గాంధీజీ ఎను గొన్నారు. ఆయనమాటల్లోచెప్పాలంటే ఇది "సమ్మోదగనంతగా సులభమైనది." ఈ పోరాటాన్ని ఆయనతప్ప యింతవరకు కెవరూ ఊహించలేక పోయారు. అదే ఆశ్చర్యం. ఇంత సులభమైన ఈ కార్యం ప్రజల మనస్సుల నాకట్టుకోగలదో లేదో ఇప్పుడప్పుడే మనం చెప్పలేం; కాని అది అలాగ ఆకట్టుకొనిననాడు, హిందువులకు, ముస్లిములకు అద్భుతమైన విజయం చేకూరుతుంది. లేనినాడు మన ఆశలన్నీ అడియాశలవుతాయి; హిందూ - ముస్లిం సఖ్యం అనేది అర్థంపర్థంలేని మాటల్లోనే మిగులుతుంది; మత రాజ్యాంగప్రహక్కులు సాధించడం కలలోనిమాట.

దేశం శాసనోల్లంఘనానికి సిద్ధంగాలేదని మీరంటున్నారు. అయితేమరి, దేశాన్నందుకు మీ రెప్పుడెలాగ ఆయత్తపరుస్తారు? ప్రస్తుతం అదొక మనస్తత్వంతోవున్న ఇరుమతాల నాయకులమనుకునేవారూ, ఒక అంగీకారానికిరాగలరని మీరు విశ్వసిస్తున్నారా? నా కా నమ్మకం

అంతగాలేదు. పోనీ వా రొకవేళ అలా వచ్చినా, కాగితంమీదవున్న ఆ అంగీకారం విదేశప్రభుత్వానికి వ్యతిరేకంగా మనం చేస్తున్న పోరాటానికి ఏవిధంగా తోడ్పడుతుంది? అలాంటి అంగీకారం కుదిరినతక్షణం ప్రభుత్వం పూర్తిగా లొంగివస్తుందని నమ్మడానికి భారతీయ మితవాదులకున్న ఎనలేని ఆశాభావం మనకూ వుండాలి; వారి ఆశావాదం "లేనిదాన్ని" "ఉన్నద"ను కొని భ్రమపడుతుంది. కొందరు భ్రమ కటువంటి హక్కులేకపోయినప్పటికీ, పరస్పరం మినహాయింపులతో ఒక అంగీకారానికిరావడానికి ప్రయత్నిస్తున్నారు; కాని అలాంటి అంగీకారమేదీ హిందూ ముస్లిములను ఇప్పటికంటే ఎక్కువగా సన్నిహితపరచలేదు.

మీరు మీ ఉత్తరంలో కడచిన కొన్నిసంవత్సరాల సన్నివేశాలను సింహావలోకనంచేశారు. ఆ సన్నివేశాలగురించిన్నీ జిన్నాకు నే నిచ్చిన ముభావమైన స్వాగతంగురించిన్నీ చెప్పడానికి నా కేమీ కనిపించడం లేదు. ఆ సందర్భంలో జిన్నాపలికిన పలుకులు నన్ను మూకీభావంవహించేటట్లుగా చేశాయి; ఆయన్ని సంతృప్తిపరచడానికి కృత్రిమంగా ఘనమైనస్వాగతాన్ని నేను ఏర్పాటుచేయలేకపోయాను.

మీ రున్నస్థితిని మీరువివరించారు; మీ ప్రవర్తనకు ప్రోద్బలమైన కారణాలను మీరు విపులీకరించారు. మీ అభిప్రాయానుసారం మీరు ప్రవర్తించారు, అందుకు సబబైన మనిషేనంటూ మిమ్మల్ని తప్పుపట్టను.

మీరు మీ ఉత్తరంలో ఆఖరున. 1920వ సంవత్సరపు పరిస్థితితో నేటి పరిస్థితిని సవివరంగా సరిపోల్చడాని కుపక్రమించారు. కాని ఒక దేశచరిత్రలో పదేళ్ళ వ్యవధిగల ఏ రెండు సంఘటనలూ అప్పుడెలా అలాగే ఒకతీరున వుండవు. కలకత్తా తీర్మానానికి ఉగినంతగా ప్రభుత్వం కదలిందనీ, వైస్రాయిచిత్తశుద్ధిపై కార్మికప్రభుత్వ ధార్మికబుద్ధిపై మన ప్రజలకు విశ్వాసమున్నదనీ మీరు వెలిబుచ్చిన అభిప్రాయాలు నన్నాశ్చర్యచకితుణ్ణిచేశాయి. ఈవిధమైన మీ విషయపరిశీలనతో నే నేకీభవించలేను సరికదా, కలిగే సత్ఫలితమేదో ఇప్పుడే చేకూరాలనీ, ఎప్పుడో కాదనీ నే నభిప్రాయపడుతున్నాను.

గాంధీజీతోపాటు మేము జరుపుతున్న పోరాటంలో పాల్గొనడానికి సంసిద్ధంగా వున్నాను. ఇంత పెద్ద వయస్సులో, శరీరం అస్వస్థంగా వున్నా కుటుంబబాధ్యతలనేకం వున్నా, అనేక కష్టాలకు లోనౌతున్నా, నేను పోరాటానికి సంసిద్ధంగా వున్నందుకు మీరు నన్నభినందిస్తారనుకుంటాను. మనం కాయశక్తులా కృషిచేయవలసిన, సర్వస్వాన్నీ త్యాగం చేయవలసిన సమయమాసన్నమయింది. ఈ దృఢవిశ్వాసంతోనే, నేను పోరాటానికాయత్తపడుతున్నాను. దేశస్వాతంత్ర్యసమరశంఖారావం విన్నందునే, దాన్ని శిరసావహిస్తాను.

మీ విశ్వాసపాత్రుడైన,
మోతీలాల్ నెహ్రూ.

71. మహాత్మా గాంధీనుంచి

[1929వ సంవత్సరం చివరిరోజుల్లోను, 1930వ సంవత్సరంలొ తొలిరోజుల్లోను లాహోరులో జరిగిన జాతీయకాంగ్రెసు సంపూర్ణస్వాతంత్ర్యం కావాలని తీర్మానించింది. 1930 జనవరి 26 వ తేదీన భారతదేశమంతటా "స్వాతంత్ర్యదినోత్సవం" జరిగింది. ఇది జరిగినవెంటనే ఉప్పుసత్యాగ్రహోద్యమాన్ని ప్రారంభించడానికి గాంధీజీ నిశ్చయించుకున్నారు. ఆయన తనసహచరులు కొంతమందితో సబర్మతీ ఆశ్రమంనుంచి సముద్రతీరానవున్న దండిగ్రామానికి బయలుదేరారు. సముద్రతీరానికి యాత్రసాగిస్తున్నపుడు మార్గంమధ్యలో ఆయన ఈ మూడుఉత్తరాలూ వ్రాశారు. ఆయన ఆయనసహచరులు ఏప్రియలు మాసారంభంలో దండిగ్రామంలో అరెస్టయినారు.]

మార్చి 11, 1930.

నా ప్రియమైన జవహర్లాల్,

ఇప్పుడు రాత్రి సుమారు పదిగంటలు కావస్తోంది. ఈ రాత్రి నన్ను అరెస్టుచేస్తారని పుకార్లు అంతటా వ్యాపించాయి. మేము జరిపే

ఉత్తరప్రత్యుత్తరాలు ఆమోదానికిముందు పంపవలసివున్నందున, నేను నీకు తంతియివ్వలేదు; అందరూ చాలాచురుకుగా పనిచేస్తున్నారు. ప్రత్యేకంగా తంతిద్వారా తెలపవలసిన విషయాలేవీ లేవు.

పరిస్థితులు చాలా చక్కగా పరిణమిస్తున్నాయి. మేమంటే మేమని స్వచ్ఛందసేవకులు ముందుకువస్తున్నారు. నేను అరెస్టయినా, సత్యాగ్రహం నిరవధికంగా సాగుతూనేవుంటుంది. నేను అరెస్టుకాకుండావుంటే నీకు తంతియిస్తాను; అరెస్టయితే, నా సూచనలు యిక్కడివారికి చెప్పి వెడతాను.

ప్రత్యేకించి నీకు చెప్పవలసినదేముందో, నాకు తెలియడంలేదు. నేను వ్రాసింది చాలును. ఇసుకతిన్నెలమీద ప్రార్థనకు హాజరైన అసంఖ్యాక ప్రజావాహుళ్యానికి నే నీ సాయంకాలం నా అంతిమసందేశం అందించాను.

ఈ భారాన్ని సహించడానికి తగినశక్తిని భగవంతుడు నీకు ప్రసాదించుగాక.

మీ అందరికీ నా ప్రేమాభివందనాలు.

బాపూ.

72. మహాత్మా గాంధీవద్దనుంచి

మార్చి 13, 1930

నా ప్రియమైన జవహర్లాల్,

నే నేది కట్టకడపటిఉత్తరమనుకుని వ్రాశానో, అది నీకు అందివుంటుందనుకుంటాను. నన్ను అరెస్టుచేస్తారని నా కానాడు విశ్వసనీయమైన వార్త చేరింది. కాని మేం రెండవమజిలీని సురక్షితంగా చేరుకున్నాం. ఈ రాత్రి ఇక్కడనుంచి మూడవమజిలీకి బయలుదేరుతాం. వర్కింగుకమిటీసమావేశానికి నేను అహమ్మదాబాద్ వెళ్ళకూడదని స్నేహితులంతా పట్టుపట్టుతున్నారు. వారిసలహా పాటింపతగినంత శక్తికలదిగా కనిపిస్తోంది. అందువల్ల వర్కింగుకమిటీసభ్యులు

చేమున్నాటికవచ్చి ఒకరోజువుండి వెళ్లవచ్చును; లేదా ప్రత్యేకం మహ్వాకమే వచ్చినా రావచ్చును. పోరాటం ముగియనిదే తిరిగి నేను స్వచ్ఛందంగా వెనక్కి వెళ్లరాదని స్నేహితులు భావిస్తున్నారు. వారి మన్న ఈ సెంటిమెంటు చక్కగావుంది. నేను వెనక్కి ప్రయాణంచేసి నట్లయితే దీనికి భంగంవాటిల్లుతుంది. ఇందువిషయమై నీకు జమ్నా లాల్జీ ఉత్తరంవ్రాసినట్లు నాకు తెలియచేశారు. కమలఆరోగ్యం బాగా వుందని అనుకుంటాను.

నీకు పూర్తి కంతివార్తలను పంపించవలసినదిగా నిన్న ఇక్కడి వారితో చెప్పాను.

నీ విశ్వాసపాత్రమైన
బాపూ.

[illegible] మహాత్మాగాంధీనుండి

మార్చి 31. 1930

నా ప్రియమైన జవహర్లాల్,

నీ ఉత్తరం అందింది. దండిలో పరామతెలుటా లేదని నేను భావించినందున నీకు వంతియివ్వలేదు. ఒకవేళ నా ఇక్కడవున్నా, వారితో నేం సరిపుచ్చుకోగలం. సరిహద్దుప్రాంతాలనుంచి పఠ్యాసంగల స్నేహితు లిటువచ్చినా. అది కొన్నిచిక్కులకు దారితీస్తుంది. నన్ను వెళ్లనిచ్చినట్లయితే నేను దండివెళ్లి ఏవిధమైనచిక్కులు లేకుండా, అక్కడ సత్యాగ్రహం ప్రారంభించాలనుకుంటున్నాను. గుజరాతులో పరిస్థితులు చక్కగారూపొందుతున్నట్లు తోస్తున్నది. ఇప్పటికే వారివిలిలో చాలామందిని అరెస్టుచేసినందుకు నా కాశ్చర్యంగావుంది. ప్రస్తుతం నువ్వు నీదృష్టిని ఉప్పుపన్నుపై కేంద్రీకరించ నిశ్చయించుకోవడం సరియైనదనే నేను భావిస్తున్నాను. మనం యింకా ఏంచేయగలమో. ఏంచేయవలసి వుంటుందో పదిహేనురోజుల్లో మనకు తెలుస్తుంది.

ఏప్రియల్ 6 వ తేదీన ఒకేసారి పలుచోట్ల ఉప్పుసత్యాగ్రహోద్యమం ప్రారంభమౌతుంది. తేదీలో మార్పువుంటే నీకు తెలియపరుస్తాను.

ఇప్పుడు సహూసమీ రాత్రి 10 గంటలు కావస్తోంది. కనక ఈరాత్రి నా అభివందనాలు.

బాపూ.

74. మోతీలాల్ నెహ్రూనుండినుంచి యం. ఎ. అన్సారీకి,

షాహీబాగ్,
అహమ్మదాబాద్,
మార్చి 20, 1930.

నా ప్రియమైన అన్సారీ,

నేనిక్కడ రైలు దిగీదిగగానే మీ ఉత్తరం నాచేతికిచ్చారు. ప్రత్యేక వార్తాహరునిద్వారా మహాత్మాజీ పంపిన ఉత్తరంకూడా జవహర్లాలుకందింది. అతనికోసం అక్కడవేచివున్నకారుమీద వెంటనే బయలుదేరి రావలసిందని. లేకుంటే రేపు అఖిలభారత కాంగ్రెసుకమిటీ సమావేశంలోపున తనను కలుసుకోవడం పడదని మహాత్మాజీ జవహర్లాలుకు వ్రాసినట్లుంది. ఆగ్రానుంచి అహమ్మదాబాద్‌కు మూడవతరగతి రైలుపెట్టెలో ఆ జనసమ్మర్దంలో ప్రయాణంచేయడంవల్ల పాపం పిల్లవాడికి నిన్నరాత్రి కంటిమీద కునుకులేదు; కాని మహాత్మాజీ కోరినట్లుగా అతనలాగే వెంటనే బయలుదేరివెళ్లాడు. తెల్లవారుజామున రెండుగంటలవరకూ ప్రయాణం కొనసాగించవలసివుంటుంది: ఏమంటే మార్గమధ్యనవున్న వాంగయేరును అప్పుడుతప్ప యింకొకసమయంలో దాటడం కష్టం. అనుకున్నట్లుగా ప్రయాణం సవ్యంగా కొనసాగితే మహాత్మాజీని ఆయన ప్రార్థనవేళకు అంటే తెల్లవారగట్ల నాలుగుగంటలకి జవహరు కలుసుకోగలుగుతాడు. అతను యిక్కడికీవాళ సాయంకాలం ఆరుగంటలకి చేరుకోవలసివుంది.

నావంటివాడికిది దుష్కరమైన ప్రయాణంకనక, నేను వెళ్ళకుండా ఇక్కడ ఆగిపోయాను. రేపు అ. భా. కా. కమిటీసమావేశం ఎంతరాత్రయినా ముగించుకుని, వెంటనే ఉదయంబండిలో బ్రోచ్‌కి బయలుదేరాలనుకుంటున్నాను. అక్కడ నాకోసం కారుసిద్ధంగావుంటుంది

ఆవేళ మహాత్మాజీ మజిలీచేసిన స్థలానికి నేను కావుమీగ చేరుకుంటాను. మహాత్మాజీ ఆనాడే సాయంకాలం అయిదుగంటలకి అక్కడనుంచి బయలుదేరతారు. ఇక ఆయనతో గడపడానికి నాకు రెండుగంటల వ్యవధి చిక్కుతుందని ఆశిస్తున్నాను; మహాత్మాజీని కలుసుకోవాలంటె నాకు మూడుమార్గాలు కనిపిస్తున్నాయి; నేను సూరత్‌లోనో, బ్రోచ్‌లోనో, బరోడాలోనో రైలెక్కవలసివుంటుంది. అయితే ఈ రైలుస్టేషన్లకి మహాత్మాజీ మజిలీస్థలానికీ ఎంతదూరంవుందో. రోడ్లు బాగున్నాయో లేవో ఇక్కడివాళ్ళెవరూ నాకు చెప్పలేకపోతున్నారు. ఇక రైళ్ళవిషయం ఆలోచిస్తే రెంటే రెండు వీలుగావున్నట్లు కనిపిస్తున్నాయి. అవి ఫ్రాంటియర్ మెయిలు, బొంబాయి - ఢిల్లీ ఎక్స్ప్రెస్సు; ఫ్రాంటియర్ మెయిల్ బ్రోచ్‌లో ఆగదు; కనుక అది లాభంలేదు. పోతే, ఎక్స్ప్రెస్‌లో బయలుదేరడం బాగుంటుంది. దాన్ని నే నేస్టేషన్లోనైనా ఎక్క వచ్చును; రత్లాంలో దిగి జయోరాకు చేరుకోవచ్చును. అందువల్ల ఒక తాత్కాలికమైన ఏర్పాటు మీకు సూచిస్తున్నాను. నేను ఎక్స్ప్రెస్‌లో బయలుదేరి 23వ తేదీ ఉదయం ఆరుగంటలకు రత్లాం చేరుకుంటాను. ఆవేళల్లా జయోరాలో మీతో కాలంగడిపి, రాత్రి పన్నెండుగంటలకు ఎక్స్ప్రెస్‌లో అల్హాబాద్ బయలుదేరతాను. ఈ ఏర్పాటు స్థిరమౌనో కాదో చెప్పలేను. మరి మీరు రెండురోజులు ముందుగా తెలియచేయ మన్నారు కనక, రత్లాంనుంచి జయోరాకు వచ్చేకారులలో నేను లేక పోతే, మీరు కష్టపడరాదు. మీకు తంతియివ్వడంవల్ల అంత ఉప యోగంలేదు; అయినా, మధ్యదారిలో మీకు సకాలంలో అందేటట్లు తంతి యివ్వడానికి ప్రయత్నిస్తాను.

మహారాజా నన్ను దయతో ఆహ్వానించారు; ఆయన ఆహ్వానాన్ని నే నంగీకరించాను. నే నీ ఉత్తరంలో పైనవ్రాసిన విషయాన్నిబట్టి ఆయన ఆహ్వానాన్ని అంగీకరించడాని కెంత ఆతురపడ్డానో ఆయనకు అవగతమౌతుంది. కాని ఇలా రావడం, అలా వెళ్ళిపోవడం జరుగు తుంది. అయితే అయ నిప్పుడు కాకపోతే ఇంకొకప్పుడు కలుసుకునే

అవకాశంవుండదు. అలాంటి ఆశాభంగం కలగకుండా ఇప్పుడే తెలుపు తుంటాను.

మీ విశ్వాసపాత్రమైన,
మోతీలాల్ నెహ్రూ.

డాక్టర్ యం. ఎ. అన్సారీ.

75. యం. ఎ. అన్సారీనద్దనుంచి

జమోరాస్టేట్,
మార్చి 30, 1930.

నా ప్రియమైన జవహర్.

మహాత్మాజీకి నేను వ్రాసిన ఉత్తరం నకలును మీకు దీనితోపాటు పంపిస్తున్నాను. పండిట్జీకి ఏ విషయమైనా నచ్చచెప్పగల వ్యక్తులు మీరూ మహాత్మాజీయేనని నా అభిప్రాయం. ఆయన ఇంకొకరిమాటను పట్టించుకోరు. నే నిప్పుడు దురదృష్టవశాత్తూ ఆయనతోపాటు ఉద్యమంలోలేను. కనుక ఆయన శరీరపరిస్థితి బాగులేదని నేను సలహా యిస్తే, ఆయన ఏమనుకుంటారో అని నాకు భయంగావుంది. ప్రస్తుతం ఆయనఆరోగ్యంబాగులేదు. ఆయనకు విశ్రాంతి అవసరం. తగినంత విశ్రాంతితీసుకునేటట్లు ఆయన్నొప్పిస్తారని మీ కిలా తెలియపరచడం మంచిదని మీ కీ ఉత్తరం వ్రాస్తున్నాను.

మీ విశ్వాసపాత్రమైన,
యం. ఎ. అన్సారీ.

76. యం. ఎ అన్సారీనద్దనుంచి మహాత్మాగాంధీకి

జమోరాస్టేట్,
మార్చి 30, 1930

నా ప్రియమైన మహాత్మాజీ,

పండిట్జీ ఇక్కడ కొచ్చివెళ్ళిన మర్నాడు 25వ తేదీనే మీకు నేను ఉత్తరం వ్రాద్దామనుకున్నాను; కాని బేగంతల్లికి జబ్బు ఎక్కువ

డంవల్ల అకస్మాత్తుగా నేను భోపాల్ వెళ్ళవలసివచ్చింది. పండిట్జీ వొంట్లో ఇప్పుడు పూర్తిగా బాగులేదు. ఆయనపరిస్థితి నా కాందోళన కరంగావుంది. అసలే ఆయనకు గుండెజబ్బు; అందులోనూ ఈమధ్య ఆయన శారీరకంగా, మానసికంగా చాలా శ్రమపడ్డారు; ఈమధ్యనే మిమ్మల్ని కలియడంకోసం దూర ప్రయాణంచేశారు. వీటివల్ల ఆయనకు మళ్ళీ ఉబ్బసవ్యాధి ప్రకోపించింది; గుండె మరీ నీరసించింది. ఆయ నిప్పుడు ఒగర్చకుండా అడుగుతీసి అడుగుపెట్టలేరు, శరీరం ఏమాత్రం కదలినా రొప్పుతున్నారు. ఒక క్రమమంటూలేని అతి తీవ్రమైన రక్తపు పోటు ఆయనకు పట్టుకున్నట్లు మీ రెరుగుదురు. రక్తపుపోటువల్ల ఆయనశరీరం కృశించిపోయింది; మేధాశక్తి సన్నగిల్లింది. ఆయ నీ వయస్సులో తమశక్తిని తాము పుంజుకోలేరు. కాని ఆయన వీటిని లెక్కపెట్టక ఒంట్లో ఏమీలేనట్లుగానే మసులుతున్నారు. ఇకముందు కూడా ఇలాగే వుండదలుచుకున్నారు. ఆయనఆరోగ్యం ఏ స్థితిలో వుందో మీకు తెలియజేయడం నా విధి. ఎంతమాత్రం శరీరాన్ని కష్ట పెట్టకుండా పూర్తి విశ్రాంతితీసుకునేటట్లు ఆయనకు నచ్చచెప్పమని కోరుతున్నాను.

మీ సత్యాగ్రహసంరంభాన్ని మీ కదలికలను నేను జాగ్రత్తగా గమనిస్తూ మీ విజయంకోసం దేవుని ప్రార్థిస్తున్నాను.

గౌరవాభివందనాలతో,

మీ విశ్వాసపాత్రమైన,
యం. ఎ. అన్సారీ.

## 77. మహాదేవదేశాయ్‌వద్దనుంచి

[మహాదేవదేశాయ్ గాంధీజికి ప్రియశిష్యుడు. ఆయనకు కార్యదర్శి. ఉప్పు సత్యాగ్రహం ప్రారంభమయినవెంటనే ఆయన ఈ లేఖ వ్రాశాడు.]

సబర్మతి, ఆశ్రమం,
ఏప్రియల్ 7, 1930

నా ప్రియమైన జవహర్లాల్,

మీరుపంపిన ద్వితీయసంపుటం అందింది. మీకు నే నెంతోకృతజ్ఞుణ్ణి. కాని అది చదవడానికి నా కెపుడు సమయించిక్కుతుందో తెలియకుండావుంది. త్వరలో జైలుకువెళ్లే అదృష్టంపడితే, బహుశా అక్కడ నేను దీన్ని చదవడాని కవకాశంకలుగుతుందేమో. నేను చాలా ఉల్లాసంగావున్నాను. మేము నిషేధపుటాజ్ఞలు ధిక్కరించి ఉప్పు అమ్ముతున్నాం. ఇది అహమ్మదాబాద్‌లో 6 వ తేదీన ప్రారంభమయింది. దీన్ని ఇలాగే 13 వ తేదీవరకు కొనసాగిస్తాం. సుశిక్షితులైన నలుగురు కార్యకర్తలు అరెస్టయారు. వీరంగామ్‌లో మేం ఉప్పు కొటార్లపైకి దాడి వెళ్లాం; మనిలాల్ కొఠారీ, మరికొందరు మా అహమ్మదాబాద్ కార్యకర్తలు అరెస్టయినారు. జిల్లాలో యింకొక కేంద్రమైన ధోలేరాలో అమృతలాల్ సేఠ్‌ను అరెస్టుచేశారు. కైరాలో గోపాల్‌దాస్‌కు 117 వ సెక్షనుక్రింద రెండుసంవత్సరాల మూడునెలలు కఠినశిక్ష విధించారు. ఈ సెక్షను భారతదేశమంతటా వర్తిస్తుంది కాబోలు. అతనితోపాటు అయిదుగురు కార్యకర్తలు అరెస్టయారు. రేపు డాక్టర్ చందూలాల్‌ను బ్రోచ్‌లో విచారణకు హాజరుపెడతారు. రామదాసు సూరత్‌లో మరి కొందరితోపాటు విజయవతాకా న్నెగురవేశాడు.

మా శక్తివంచనలేకుండా మేం సత్యాగ్రహసమరాన్ని చక్కగా కొనసాగించామని మీరు అభినందిస్తారనుకుంటాను. భగవంతు డనుగ్రహిస్తే, మేం ఇలాగే పోరాటాన్ని యిలోధికంగా కొనసాగిస్తాం. క్రిందటినెల వల్లభాయ్ అరెస్టయినపుడు నామీద నాకే నమ్మకంలేకపోయింది. కాని సత్యాగ్రహపోరాటానికి ప్రజలిస్తున్న అండదండలు చూశాక, నాకు సాటిలేని ఆత్మవిశ్వాసం చేకూరింది. ఇప్పుడు రోజూ నేను సమావేశాలలో ప్రసంగిస్తున్నాను. ఇలాంటి సమావేశాలలో నా జీవితకాలంలో ఇంతకు మునుపెప్పుడూ ప్రసంగించిఎరగను. సభలు క్రమశిక్షణతో ప్రశాంతంగా

కొనసాగుతున్నాయి. రోజూ సాయంకాలం ఆరుగంటలకు ఒక్క ఉపన్యాసాన్ని, అందులోనూ ఎంతమాత్రం వక్తననిపించుకోని నావంటి వాని ఉపన్యాసాన్ని వినడానికి పదివేలూ పదిహేనువేలకు పైగా ప్రజలు వస్తున్నారు. ఉపన్యాసం విని చీకటిపడకముందే ప్రశాంతంగా వెళ్ళిపోతున్నారు. నేనంటే నేనని అనేకమంది వలంటీర్లుగాచేరడానికిముందుకు వస్తున్నారు. రెండురోజులక్రితం అయిదువందలమంది అలాగవచ్చారు; ఈవేళ వెయ్యిమందికి పైగా వచ్చారు. స్త్రీవలంటీర్లు తమపేర్లను చేర్చుకోమంటున్నారు: నిన్న ఏభైమందిస్త్రీలు కొత్తగా వచ్చిచేరారు; వారిఉత్సాహం చెప్పలేను. ఉద్యమం ఇలాగ పొంగులువారుతూంటే ప్రభుత్వం యిక చూస్తూ కూర్చోదు; రెండు మూడు రోజుల్లో నన్నూ అరెస్టుచేస్తారు. కాని అంతటితో ఉద్యమం ఆగదు. దాన్ని నిరాఘాటంగా సాగించడాని కనేకమంది వున్నారు. ప్రస్తుతం నా కాలాన్ని నేను ఆశ్రమానికీ (దానికి పెద్దనేఅయినా నాకేమీ పనిలేదు.) రాష్ట్రకమిటీకి (దీనికి కార్యదర్శినీ, అధ్యక్షుణ్ణీ. యుద్ధమంత్రినీ అన్నీ నేనే) నవజీవన్, యంగ్ ఇండియా పత్రికలకూ (నే నెంత బాగా వెలువరించగలనో అంత బాగా వాటిని వెలువరించాలికాని, నిజానికి బాపూజీ బైటవున్నంతకాలం నాకాపని చిన్నపిల్లల ఆటవంటిది) జిల్లాలో పర్యటించడానికీ వినియోగిస్తున్నాను. నే నిది భేషజంకోసం వ్రాయడంలేదు; పనివచ్చినప్పుడు సామాన్యమానవుడు ఎంతపెద్దపనిచేయగలడో చెప్పడంకోసం వ్రాస్తున్నాను. భగవంతుడెప్పుడూ మోయలేనిభారాన్ని ఎవరినెత్తిమీదా మోపడు.

ఏప్రియల్ ఆరవతేదీన దండిలో బాపూజీ స్వయంగా తమ చేతులతో కాచు ఉప్పు తయారుచేశారు. చిటికెడుఉప్పు చిన్న పొట్లంకట్టి యింటిలో పదిలపరచి మీకు పంపిస్తున్నాను. దీనిని మీ రమూల్యమైన జ్ఞాపకచిహ్నంగా దాచవచ్చును; లేదా దాన్ని వేలంలో విక్రయించవచ్చును; దీనిధర మాత్రం వెయ్యిరూపాయలకు తక్కువ కాకూడదు. ఇప్పుడు నావద్దనున్న చిన్నపొట్లం 501 రూపాయలకి విక్రయించాం. ఈ ఉత్తరం మీ చిరునామాకు వ్రాసినట్లయితే ఉత్తరం విప్పి అమూల్యమైన ఈ

ఒప్పును పోలీసులు కాజేయవచ్చును, కనుక స్పష్ట చిరునామాకు పోస్టు చేస్తున్నాను.

మీ ప్రేమగల,
మహాదేవ్.

78 మోతీలాల్ నెహ్రూ వద్దనుంచి శివప్రసాద్ గుప్తకు,

[యు. పి. ప్రముఖ కాంగ్రెసువాది శివప్రసాద్ గుప్త మా నాన్నగారు కోర్టుఎదుట హాజరుకావడానికి తమ అభ్యంతరాన్ని తెల్పగా, మా నాన్నగారు ఆయనకీ ఉత్తరం వ్రాశారు.]

అల్హాబాద్. జూన్ 1, 1930

ప్రియమైన శివప్రసాద్ జీ,

1986 జ్యేష్ఠమాసం 5న మీరు వ్రాసినఉత్తరం అందింది. కాంగ్రెసు అధ్యక్షునిగా వుంటూ నేను ఈ మాటల్లో "విదేశీ ప్రభుత్వపు కోర్టు" ఎదుట హాజరుకావడం మీకు బాధగావుందని వినడానికి నాకు విచారంగావుంది. అయితే నా కెంతమాత్రం అందుకు విచారంగా లేదు సరికదా, నే నావిధంగా హాజరుకాకుండావున్నట్లయితే నన్ను నేను తప్పుచేసుకున్నవాడి నౌదును.

మీరు పేర్కొంటున్న "ప్రస్తుత క్లిష్టపరిస్థితుల్లో కాంగ్రెసు పరువుప్రతిష్ఠల" విషయం ఆలోచిద్దాం. కాంగ్రెసు అధ్యక్షునిగా వుంటూ ఈ కేసు విషయమై ఈ అసాధారణపరిస్థితుల్లో నే నింకొకవిధంగా వ్యవహరించివుంటే, కాంగ్రెసు పరువుప్రతిష్ఠలు మంటగలసివుండేవి.

ఈ కేసునుంచి బయటపడడానికి నాకు సాధ్యమైన న్యాయమైన అన్ని ప్రయత్నాలూ చేసినతర్వాత నా అంతరాత్మ ప్రబోధాన్ని పాటించి నేను విచారణకు నిలబడ్డాను; గౌరవప్రదంగా కేసు కొట్టివేయబడినప్పటికీ, కోర్టుకు హాజరైన ప్రతిరోజూ వెయ్యిరూపాయల చొప్పున జరిమానాను నాకు నేను విధించుకున్నాను. ఆగ్రాలోవున్న పదిరోజులూ కాంగ్రెసుపనిలో నిమగ్నుడనయాను, పదివేల రూపాయలదాకా మరి

కొంత కాంగ్రెసునది సేకరించాము; కాని నిధులు మంచినీళ్ళల్లా ఖర్చు అయిపోతున్నాయి. పరిస్థితులు ఎలాగుంటే బాగుంటుందో, అలాగేవున్నాయి. విచారించడానికి కారణమేమీ కనబడదు.

మీ విశ్వాసపాత్రుడు,
మోతీలాల్ నెహ్రూ.

బాబు శివప్రసాదగుప్త.
కాశీ.

71) మోతీలాల్ నెహ్రూగారినుంచి కృష్ణ నెహ్రూకు

[1930 జూలై 30వ తేదీన నైనిటాల్ సెంట్రల్ జైలునుంచి మోతీలాల్ నెహ్రూ తన కుమార్తె కృష్ణకు వ్రాసిన లేఖలోని ఒక భాగం.]

ఇప్పుడు నా ఒంట్లో ఎంతో కులాసాగావుందని మనవాళ్ళందరికీ చెప్పు. ఎనిమిది తొమ్మిదిరోజులు అప్పుడప్పుడు జ్వరం వచ్చింది. అన్నం సయించలేదు. ఇప్పుడు జ్వరం ఆగిపోయింది. క్రమక్రమంగా కోలుకుంటున్నాను. ఒంట్లో కాస్త నీరసంగావున్నా మరేంభయంలేదు. వచ్చే శనివారం నువ్వొక్కతెవే వస్తావుకదా, అప్పటికింకా బాగా కోలుకుంటాను. ఇదివరకు నన్నుచూడ్డానికి వచ్చినప్పుడు ఎంతఆరోగ్యంగావున్నానో అంత ఆరోగ్యంగానూ వుంటాను.

ఒక్కొక్కప్పుడు ఆనంద భవనంనుంచి, ఇంకొకప్పుడు 9 కాస్ట్రో రోడ్డునుంచీ (అదిఏమిటో నాకుతెలియదు) నాకు పంపిస్తున్న భోజనం, ఇక్కడి ఆహారంకంటే బాగుంది. నా కిక కొన్నిరోజులపాటు భోజనం పంపిస్తేచాలును. ఆతరవాత సాదాగా వక్కాలేతో నేను వండుకుంటాను. ఇలాంటి పరిస్థితుల్లో ఇది నా అలవాటని నీకుతెలుసునుకదా! ప్రయోగాలుగా రకరకాల కొత్తవంటలు కనిపెట్టి తయారుచేయబోతున్నాను; నేననుకున్నట్లుగా తయారైతే అవి బాగానేవుంటాయి.

ఇలాంటిదేదో ఒకపని కల్పించుకుని నా మనస్సు నన్యథా మళ్ళించడం అవసరమనుకుంటాను. అన్నీ అమర్చిపెడుతున్నాడు కనుక భోజనంచేయడం నిద్రపోవడం చదువుకోవడం తప్ప నా కింకొకపనంటూ లేదు. జవహర్లాల్ పుస్తకాన్ని హరి చదివి వినిపిస్తూ నా కావిధంగా సేవచేస్తున్నాడు. ప్రొద్దున టీ త్రాగినదిమొదలు రాత్రి నేను నిద్రపోయే వరకు కాలు కదపనవసరంలేకుండా అన్నీ వాళ్ళే అమర్చిపెడుతున్నారు. నా కే నిముషంలో ఏదికావాలో ప్రతి చిన్నవిషయంలోనూ వాళ్ళు శ్రద్ధతీసుకుంటున్నారు. అక్కడ ఆనందభవనంలో నా కేది కావలసి వచ్చినా తరుచు బిగ్గరగా పిలిచి చెప్పవలసివచ్చేది. ఇక్కడ ఇప్పుడా అవసరం లేకుండాపోయింది. మహమ్మద్ అప్పుడప్పుడు వచ్చి ఆపనీ ఈపనీ చేస్తూవుంటాడు. అందరిలా సహాయంచేస్తున్నా ముఖ్యమైన భారమంతా జవహర్ తనమీదనే వేసుకున్నాడు. ఈ భారాన్ని తాను వహించకుండా యితరవిధాల తన కాలాన్ని జవహర్ వినియోగించినట్లయితే చాలా బాగుండేది. కాని నేను బద్ధకంవల్ల అతని కాలాన్ని హరిస్తున్నాను. నా బద్ధకానికి నాకే అసహ్యంగావుంది. కాని అతనే నా కేంపనులుకావాలో ముందుగానే ఊహించుకుని, నా ప్రమేయం లేకుండా చేస్తున్నాడు. ఇటువంటి కొడుకులుకలిగే భాగ్యం, చాలామంది తండ్రులకు కలగాలని నా కోర్కె.

ఇంతవరకు మీ కార్యకలాపాలను 'పయనీర్' పత్రికద్వారా మేము తెలుసుకుంటున్నాం. ఈ పత్రికలో వార్తలు సంక్షిప్తంగా అచ్చు పడుతున్నా, వాటినిబట్టి మిగిలిన విషయాల్ని మేం ఊహించుకోగలుగుతున్నాం. మీ కార్యక్రమం అద్భుతంగా కొనసాగుతోంది. ఇలాగే ఇక ముందుకూడా యింతటి ఉత్సాహంతోనూ, శక్తితోనూ కొనసాగిస్తారని ఆశిస్తున్నాను. మిమ్మల్ని పిల్లల్నిచూచి, జవహర్, నేనూ ఎంతో గర్విస్తున్నాం.

౮౧. మోతీలాల్ నెహ్రూనుంచి

[మో॰ నాన్నగారికి వ్యాధి ముదిరేనందువల్ల 1930 సం॥ చివరి భాగంలో, ప్రభుత్వం వారిని జైలునుంచి విడుదలచేశారు. కానిఅయ

నకు వ్యాధి నిమ్మళించలేదు. విడుదలచేసిన రెండు మూడునెల లకు వారు మరణించారు. సముద్రయానంచేస్తే, ఆయనఆరోగ్యం కుదుటపడవచ్చునని అనుకున్నారు గాని, నానాటికి ఆరోగ్యం క్షీణించడంవల్ల అలాచేయడానికి వీలులేకపోయింది. ఇంత వ్యాధి గ్రస్తులైవున్నా, జాతీయోద్యమంపట్ల ఎంతో శ్రద్ధవహిస్తూవచ్చారు. ఆ సమయంలో నేను కారాగారంలో ఉన్నాను.]

ఆనందభవనం,

అలహాబాద్,

నవంబరు 11, 1930.

నా ప్రియమైన జవహర్,

తాజావార్తలను నీకు తెలియజేయడంకోసం నే నీ ఉత్తరం వ్రాస్తు న్నాను. మూడురోజులక్రితం అరెస్టయిన సుందరలాల్, మంజరాలీలను కోర్టుఎదుట విచారణకు హాజరుపరిచారు. వాళ్ళను చూడడానికి, కమలా, నాన్, ఇందూ, మీ అమ్మ అక్కడకు వెళ్ళినప్పుడు, ఆవేళ సాయం కాలం బెట్టీ, శామీలను అకస్మాత్తుగా అరెస్టుచేశారు. నాన్ వెంటనే పరిగెత్తుకువచ్చి నాతో ఈ విషయం చెప్పింది. అప్పుడు నేను దగ్గుతో బాధపడుతూ మంచంమీద కూచున్నాను. నే నక్కడకు వెళ్లడం ఔచిత్య మనిపించలేదు. అదికాక అక్కడకు వెళ్ళాలనుకున్నా, కదలలేనిస్థితిలో వున్నాను. కోర్టులో విచారణ ఎలా జరుగుతున్నదీ చూచిరమ్మని, నాన్‌ను పంపించాను. కాని ఆమె వెళ్ళేలోపున విచారణ ముగిసింది. బెట్టీ, శ్యామీలకు, ఇంతకుముందు అరెస్టయినవారికి ఇండియన్ పీనల్‌కోడ్ 188 సెక్షన్ క్రింద (న్యాయచట్టాన్ననుసరించి ప్రభుత్వాధికారి జారీచేసిన ఉత్తరువును ఉల్లంఘించినందుకు) ఒక్కొక్కరికి యాభై రూపా యలు జరిమానా, జరిమానా చెల్లించకపోతే ఒకనెల విడిఖైదు విధించారు. ఇప్పుడు వారంతా మలకా జైల్లో ఒకరి సహచర్యాన్ని యింకొకరు పొందుతున్నారు. ఇంతవరకు నా కందిన సమా చారాన్నిబట్టి ఉద్యమంలో బెట్టీ, శామీలు కొంతమంది దళసభ్యులు

రోడ్డుమీద జాతీయగీతాలు పాడుతూవుంటే, ఆ దళానికి నాయకత్వం వహించారు. ఇదీ వారు వహించిన పాత్ర. కమలా, నాన్లు యింకా చేరుకోలేదు. త్వరలోనే చేరుకుంటారని ఆశిస్తున్నాను. వారువస్తే ఇంటి ఏర్పాట్లు చేయవలసివుంటుంది. సెక్షన్ 124. ఎ. క్రింద రేపు సుందర లాల్‌ను విచారణచేస్తారు. రేపింకా చాలామందిని అరెస్టుచెయ్యవచ్చును. అలహాబాద్‌లో ఈవిధంగా శాంతిఒడంబడిక దినం, గడిచిపోయింది. యిక్కడికి వచ్చీరాగానే వల్లభాయి. మహాదేవ్‌లకు మలేరియా పట్టుకుంది. రెండురోజులు మంచంమీదనే గడిపారు. ఈవేళ వారు బొంబాయి బయలు దేరి వెళ్ళారు.

రోజుకురోజు నా ఆరోగ్యం క్షీణిస్తోంది. ఇదివరకు అప్పుడప్పుడు మాత్రమే. ఉమ్మిలో రక్తం కనిపిస్తూవుండేది. యిప్పు డలాకాదు. మూడురోజులనుంచి ఎడతెరిపిలేకుండా నోటినుండి నెత్తురు ముద్దలు ముద్దలుగా పడుతోంది. అలహాబాద్‌లో అన్నిరకాల వైద్యాలు చేయించుకుని చూచాను. కాని లాభంలేకపోయింది. బెట్టీ. మదన్, అతల్‌తో కలకత్తాకు బయలుదేరాలని నిన్న ప్రొద్దునే. నేను నిశ్చయించుకున్నాను. 10 వ తేదీన నీతో మాకు ఇంటర్‌వ్యూ ఉందిగదా. అది 15 వ తేదికి మార్చమని మేజర్ ఓబరైకి ఫోన్‌చేశాను. లాంఛనప్రాయంగా అతనికి ఉత్తరంకూడా వ్రాశాను. అందు కతను అంగీకరించాడు. అప్పటికి చాలామంది విడుదలైవస్తారు కనుక, మేమంతా 15 వ తేదీ పదిగంటలకు నిన్ను చూడ్డానికి వస్తాము. 16 నో 17నో కలకత్తానుంచి నేను బయలుదేరదామనుకుంటున్నాను. కలకత్తాలో జరుగనున్న వైద్యసంఘ సమావేశానికి డాక్టరు జీవరాజ్‌మెహతా హాజరుకావలసివుంది. ఆయన సన్నక్కడ కలుసుకుంటారు. బెట్టీకి బదులుగా యింకొకర్ని నావెంట తీసుక వెళ్లడం అవసరంలేదనుకుంటాను. మదన్ యింకా సమాధానం వ్రాయలేదు. అతనొస్తే యిక ఏచిక్కూలేదు. రేపోపున కమల అరెస్టయితే ఇందును. నావెంట తీసుకవద్దామనుకుంటున్నాను. ఏమంటే బెట్టీ, కమలా లేనందువల్ల ఆమె ఒక్కత్తే యింట్లో ఉండిపోవలసివస్తుంది. ఈ ఏర్పాటు

నువ్వు అంగీకరిస్తావో లేదో నాకు తెలియజేయి. ఇందు సముద్రప్రయాణానికి సంసిద్ధంకావలసివుంటుంది.

సింగపూరుకు సంబంధించిన ప్రయాణవివరాలను తెలియజేయవలసినదిగా, రెండవతేదీన థామస్‌కుక్ పేర కలకత్తాకు ఉత్తరం వ్రాశాను. కాని నిన్నటిదాక అక్కడినుంచి జవాబురాలేదు. వెంటనే జవాబీయవలసినదిగా తంతియిచ్చాను. నాదగ్గరనుంచి ఉత్తరమేమీ చేరనట్టు ఈవేళే వారు సమాధానమిచ్చారు. వారికి నేను వ్రాసిన ఉత్తరాన్ని రైలులో ఉపాధ్యాయ పోస్టుచేశారు. శాంతిభద్రతలు కాపాడుతున్న మహానుభావులు, నేను దేశంవిడిచి మాయమైపోతాననుకున్నారో, లేక ఏదో ఘోరకృత్యాన్ని తలపెట్టేననుకున్నారో ఏమో మరి; పాపం, నా ఉత్తరం చేతచిక్కించుకున్నారు. ఐతేనేం, రేపు మళ్లీ ఉత్తరంవ్రాసి సి. ఐ. డి. లకు, ఒక "నోట్" పెడుతున్నాను.

నవంబరు 12, 1930.

బెట్టీ, శామీల జరిమానాలను ఎవరో కొంతమందివ్యక్తులు చెల్లించాలని రహస్యంగా ఆలోచనలు సాగిస్తున్నారని నిన్నరాత్రి నాకు తెలిసింది. నాకెంతో బాధకలిగింది. బెట్టీజరిమానా ఎవరో చెల్లించారని ఆమె యిక గడియకో, క్షణానికో విడుదలబౌతుందని మరికొంతసేపు పోయాక నాకుతెలిసింది. ఈవార్త నాహృదయాన్ని మరీ కలచివేసింది. వెంటనే పత్రికల కొక ప్రకటన పంపించాను. అది ఈరోజుఉదయం అచ్చుఅయింది. ఆ ప్రకటన యింటులోపాటు పంపిస్తున్నాను. ఏమైనప్పటికీ జరుగరాదని ఈ అకృత్యం జరిగిపోయింది. వాడు, ఆ మూర్ఖుడు, గోపీకుంజ్రూ అనేవాడు, అర్ధరాత్రి నేను నిద్రపోతున్నసమయంలో బెట్టీ, శామీలను కారులో యింటివద్ద దిగబెట్టాడు. నాకీవిషయం యీరోజు పొద్దున్నే తెలిసింది. ఎవరోనఒకవ్యక్తి జరిమానాచెల్లించాడనీ, అతనితరఫున తాను వ్యవహరించాననీ, అతనిపేరు, తాను బయటపెట్టజాలననీ, గోపీ మనపిల్లలకు చెప్పాడట. నేటిఉదయం పత్రికల్లో వెలువడిన ప్రకటన వాళ్ళు చదివివుంటారు. నా ప్రకటనచదివేక తమ

అభిప్రాయాలను మార్చుకునివుండాలి. ఇటువంటి అరెస్టులు యికముందు జరిగినప్పుడు, ఈ ప్రకటన ఉపయోగపడుతుందనుకుంటాను. ఈ విధంగా మనకు మహోపకారంచేసే వ్యక్తులు కొంచెం వెనకా, ముందూ ఆలోచించిమరీ చేస్తారనుకుంటాను.

ఇప్పుడు బెట్టీ యింటికి వచ్చింది కనక, మొదట అనుకున్న ఏర్పాట్లప్రకారం, ఆమె నాతో కలకత్తా, సింగపూరులకు వస్తుంది. ఇందిర తన చదువులో తాను నిమగ్నమైవుంటుంది. కూడా వస్తానని పట్టుబడితేతప్ప, ఆమెను నేను వెంట తీసుకువెళ్ళను. ఆమె చదువు పాడుచేయటం నా కిష్టంలేదు.

హిందూ పంచాంగంప్రకారం రేపు నీ పుట్టినరోజు. గ్రిగోరియన్ పంచాంగం ప్రకారం, నీ జన్మదినం ఎల్లుండౌతుంది. రేపుకానీ, ఎల్లుండి కానీ, నిన్ను కలుసుకోటం బాగుంటుందని నాకు కొందరు సూచించారు. నేడో, రేపో కలకత్తాకు వెడతాననగా, నిన్ను చూడాలని అనుకున్నాను. కనుక స్నేహితులసూచన నా కంత నచ్చలేదు. 16వ తేదీ అయితే బాగుంటుందని భావించానుగాని ఆవేళ భారతదేశమంతటా జవహర్ జన్మదినోత్సవం జరుగుతుందికనుక, మన పిల్లలు ఆ వేడుకల్లో మునిగి వుంటారు. అందువల్ల ఆ మర్నాడు పంజాబు మెయిలులో బయలుదేర దామనుకుంటున్నాను.

కలకత్తానుంచి నువ్వు కొన్ని పుస్తకాలు కావాలని కోరావు. ఆర్డరిచ్చి చాలాకాలమైంది. కాని పుస్తకాలు యింతవరకు చేరలేదు. ఈ ఉత్తరం బహుశా సెన్సార్ చేతిలో పడవచ్చు. నేను బయలుదేరేలోపున పుస్తకాలు అందితే సరేసరి; లేకుంటే వాటిని కలకత్తానుంచి నీకు పంపిస్తాను.

మనం కలుసుకున్నప్పుడు అన్నీ మాట్లాడుకొందాము. రంజిత్‌కు నా ప్రేమాభివందనాలు.

ప్రేమగల నీ,
తండ్రి.

107

## పత్రికా ప్రకటన

### కుమారి కృష్ణా నెహ్రూ-అజ్ఞాతవ్యక్తిచే జరిమానా చెల్లింపు?

### పండిత మోతీలాల్ నెహ్రూ ప్రకటన

పండిత మోతీలాల్ నెహ్రూ ఈ క్రింది ప్రకటనలో ఈవిధంగా తెలియజేస్తున్నారు. ఈ సాయంకాలం నా కుమార్తె కృష్ణను ప్రభుత్వం హఠాత్తుగా అరెస్టుచేసి విచారణచేసి, యాభైరూపాయలు జరిమానా విధించిందని. ఎవరో అజ్ఞాతవ్యక్తి ఆ జరిమానా చెల్లించినాడనీ యిప్పుడే నాకు తెలియవచ్చింది. ఇదే కనక నిజమైనట్లయితే, ఆ అజ్ఞాతవ్యక్తి నాకూ, నా కుమార్తెకూ, మనదేశానికీ అనూహ్యమైన అపరాధాన్ని చేశాడని చెప్పకతప్పదు. ఆ అజ్ఞాతవ్యక్తి ఎవరో, అతని పేరేమిటో, అట్టే కాలం దాగివుండదు. నేను దేశానికిచేస్తున్న సేవపై, నాపై, నా దేశస్థులకు ఏ మాత్రం గౌరవం వున్నా, ఆ అజ్ఞాతవ్యక్తి దేశానికీ, నాకూ ఆగర్భశత్రువని భావిస్తారని, అతన్ని, అలాగే పరిగణిస్తారని నే నాశిస్తున్నాను.

## 81. మోతీలాల్ నెహ్రూనుంచి సుభాష్‌చంద్రబోసుకు

అలహాబాద్,

నవంబరు 14, 1930

నా ప్రియమైన సుభాస్,

ఉత్తరం వ్రాసినా, టెలిగ్రాం యిచ్చినా, అవి నీకు అందుతాయని నాకు నమ్మకంలేకపోవడంవల్ల ప్రత్యేకం దీన్నొక వార్తాహరునిద్వారా నీకు పంపిస్తున్నాను. యిక్కడినుంచి 17వ తేదీన పంజాబ్ మెయిల్లో కలకత్తాకు నేను విధిగా బయలుదేరతాను. సింగపూరు వెడితే నా ఆరోగ్యం బాగుపడుతుందని కొందరు నాకు సలహాయిచ్చారు. సర్ నీల్‌రతన్ సర్కార్ అందు కనుమతించినట్లయితే, నా ఆరోగ్యాన్ని ఎలా కాపాడుకోవాలో కొన్ని సూచనలు ఎలాగూచేస్తారు. ఆయన సలహాలను

పాటించి నాకు వైద్యసదుపాయాలు కలిగించడంకోసం నావెంట ఒక డాక్టరు స్నేహితుణ్ణి తీసుకవెళుతున్నాను. నన్ను జాగ్రత్తగా కనిపెట్టు కొనిఉండడానికి నాతోపాటు నాకుమార్తె కృష్ణ బయలుదేరుతోంది.

నానోటివెంట రక్తం ముద్దలు ముద్దలుగా పడుతోంది. ఒంట్లో చాలా బలహీనంగాఉంది. అందువల్ల అక్కడ పౌరస్వాగతాలుకూ వాటికీ నాశరీరం తట్టుకోలేదు. అలాంటి స్వాగతాలు ఏవీలేకుండా కాస్త దయ ఉంచి నువ్వు చర్యతీసుకోవాలి. స్టేషన్‌వద్ద అయిదారుగురు ముఖ్య స్నేహితులువస్తే, వారిలో కొంతసేపు మాట్లాడ్డానికి యిబ్బందిఉండదు.

కార్యకర్తల్నికూడా నే నిప్పుడు కలుసుకోలేను. వారితో చాలాసేపు చర్చించడానికి, వారికి సలహాలివ్వడానికి ఓపిక బొత్తిగాలేదు. అంత అవసరమైతే, ఒకరో యిద్దరో ప్రధానకార్యకర్తలతో కొంతసేపు సంభాషించగలను.

నేను బహుశా కలకత్తాలో ఒకవారంరోజులు ఉండవలసివస్తుం దేమో! అక్కడ సర్ నీల్‌రతన్ సర్కార్‌చేత వైద్యంచేయించుకుం టాను. ఈ వారంరోజులూ ప్రశాంతప్రదేశంలో ఏకాంతంగా ఉండాలని వుంది. నాకూ నాతో వస్తున్నవారికీ తగిన వసతిఏర్పాట్లు మీరు చేయ గలరా? నే నక్కడ ఏ ఏర్పాట్లూ చేసుకోలేను.

మీ విశ్వాసపాత్రుడు,
మోతీలాల్ నెహ్రూ.

శ్రీయుత సుభాస్‌చంద్రబోసు,
1, ఉడ్‌బర్న్ పార్కు, కలకత్తా.

82 మోతీలాల్ నెహ్రూవద్దనుంచి

అలహాబాద్,
జనవరి 20, 1931

నా ప్రియమైన జవహర్,

కమలవద్దనుంచి నిన్న సాయంకాలం ఈ ఉత్తరం అందింది. అది ఈవేళ పొద్దున్న నీకు పంపిద్దామనుకున్నాం. కాని నేను వ్రాస్తున్న

యీ ఉత్తరం అప్పటికింకా పూర్తికాలేదు. ఆమెను అక్కడ జాగ్రత్తగానే మాస్తూఉన్నట్టు ఆమెఉత్తరంవల్ల తెలుస్తోంది. ఇతరులవల్లకూడా నాకా విషయం తెలిసింది. రాజ్, చాలా శ్రమతీసుకుంటున్నాడు. ఈ యిరవై అయిదో తేదీన, ఆమెను "ఇంటర్వ్యూ" చేద్దామనుకుంటున్నాం. ఇంటర్వ్యూ ఎందు కింత ఆలస్యంగా యిచ్చారో బోధపడ్డంలేదు. కాని 24వ తేదీన, నేను ప్రయాణంచేసేస్థితిలో ఉంటానో వుండనో అనుమానంగా వుంది. ఆరోగ్యం అందుకనుకూలించదు. కనక మీ అమ్మ, బెట్టీ, ఇందూ బయలుదేరి వెడతారు.

నా ఆరోగ్యం నిన్నటివరకూ అంతో యింతో బాగానే ఉంది. నిన్న అనుకోకుండా ప్రాణం ఉక్కిరిబిక్కిరైంది. రాత్రల్లా కంటిమీద కునుకులేదు. టెంపరేచరు ఎక్కువైంది. నోటినుండి నెత్తురు ఎక్కువగా పడింది. పొద్దున్న లేచేసరికి నిస్త్రాణ అధికమైంది. రాత్రికి కొంచెం కులాసాగా ఉంటుందనుకుంటాను. ఇంతచేసినప్పటికీ, విశేషమేమిటంటే అప్పటిలాగే యీవేళకూడా 110 పౌన్లు బరువున్నాను.

రెండురోజుల్లో వస్తానని, కవిరాజ్‌బాబు కాశీకి బయలుదేరి వెళ్ళారు. రేపు సాయంకాలం ఆయ నిక్కడకు వస్తాడు. ఏమందు లెలా వాడాలో, ఏ పద్ధతిప్రకారం మెలగాలో ఆయన చెబుతాడు. ఆయనకు అక్కడ ఎవరు సలహాయిస్తున్నారో నాకు తెలియదు. ఈయన చెప్పిన రోగలక్షణాలనుబట్టి అక్కడ ఆయనవైద్యపద్ధతిని నిర్ణయిస్తున్నారు. అంతా ఈయన చెప్పడంమీద ఆధారపడివుంటుంది.

ఇందూ కులాసాగా ఆనందంగా కాలంగడుపుతోంది. పాత చెక్కల యింటిని బాగుచేసుకుంది. అక్కడ ఆ వేసంగిగృహంలో లేడితో రోజూ మధ్యాహ్నంవేళ, బెట్టీ, ఇందూలు కాలక్షేపంచేస్తున్నారు ఈ ఏడు నీ తోటలో 'పీచ్' చాలా చక్కగా పండాయి. ఎంతో మధురంగా ఉన్నాయి. అవి నిన్న నాకిచ్చారు. వాటిని భద్రంగా దాచుకుంటున్నాను. ఇప్పటికీ అవి మాగిపోయినట్టు కనిపించలేదు.

మీ యిద్దరికీ నా ప్రేమాభివందనాలు.

ప్రేమగల నీ,
తండ్రి.

83. రాబర్టు ఓ. మెన్నిల్‌నద్దనుంచి

ఉడెన్‌లా, కెన్లే, సర్రే,
ఫిబ్రవరి 9, 1931.

ప్రియమైన మిత్రమా,

ఈ వారంవారమల్లా క్షణక్షణం మీరు నా మనసులో మెదులు తూనేవున్నారు. మీకు ఉత్తరం వ్రాయాలని నా కనిపించింది. నన్ను మీ రెరుగరు. కాని కోర్టులో మీరు కావించిన ప్రకటన. నన్ను సమ్మోహితుణ్ని చేసింది. అది చదివాక, నాకు మీరంటే ప్రగాఢమైన భక్తిభావం ఏర్పడింది.

మీకు కలిగిన కష్టానికి, నేను, నా గాఢమైన సానుభూతిని తెలుపు కుంటున్నాను. భారతదేశ వాస్తవిక స్వాతంత్ర్యాన్ని. పరిణామాన్ని, మీ నాన్నగారు తన కళ్ళారా చూడగలుగుతారని నే నెంతో ఆశించాను. భారతదేశ స్వాతంత్ర్యసమస్యపట్ల ఇక్కడ ప్రజలభావాల్లో చాలా మార్పు ద్యోతకమౌతోంది. ఐనప్పటికి ప్రభుత్వం. తన అధికారాన్ని ఒదులుకుందుకు వ్యతిరిక్తంగా ఉంది.

కొలదిరోజుల్లో, వారాల్లో, నెలల్లో ఏమి పరిణామాలు సంభ విస్తాయో ఎవరూచెప్పలేరు. కాని నే నొకటిమాత్రం మీకు చెప్పగలను. భారతదేశప్రజలపట్ల ప్రేమభావాన్నీ, నూతన ఉత్సాహాన్నీ పెంపొందించ డంకోసం ఇక్కడ చాలామంది, తమ భావనాపటిమను, ప్రభావాన్ని విధీ విరామం లేకుండా వినియోగిస్తున్నారు. వీరిసంఖ్య మీరు ఊహించ గలిగినదానికంటె అధికం.

రౌండుటేబిల్ సమావేశంలో అంగీకృతమైన సూత్రాలు నిస్సందేహంగా ముందుకు పురోగమింపజేస్తాయి. భారతీయులకు అధికారాన్ని అప్పగించినట్లయితే అది కొంత నయం. అప్పుడు పెట్టుబడివారి నిరంకుశత్వం అధికారం చేజిక్కించుకోకుండా, ప్రజాభీష్టాలపై ఆధారపడిన ప్రభుత్వాన్ని నెలకొల్పడానికి. మీకు మార్గం కనిపిస్తుంది.

మీ మనోగాంభీర్యాన్ని, ధృతిని, కార్యకర్తల ఆత్మార్పణను చూసి. నేను గర్వంతో, ఆనందంతో ఉప్పొంగిపోయాను. నా హృదయ మెంత పులకరించిందో నేను మీకు చెప్పలేను. యుద్ధకాలంలో జరుగు తున్న హేయమైన కృత్యాలను నేను పూర్తిగా నిరసించడంవల్ల, నన్ను అయిదుసార్లు కోర్టుమార్షల్ చేశారు. 27 నెలలు జైలులో నిర్బంధించారు. కనుక నేను భారతదేశపరిస్థితిని అర్థంచేసుకోగలననుకుంటున్నాను. నేను చాలావిషయాలు వ్రాద్దామనుకున్నాను. కాని మీకు చదవడానికి వ్యవధి ఉండదు. ప్రజల జీవితాలను ధ్వంసంచేస్తున్న మత్తుపదార్థాలను, పానీయాలను ప్రభుత్వం అమ్మనీయకుండా అరికడుతుందని, విదేశవస్త్రాల దిగుమతిని తగ్గించుకుంటుందనీ, ప్రజాక్షేమాన్నికోరి ఈ సమస్యపట్ల సరియైన దృక్పథంతో వ్యవహరిస్తుందని నే నాశిస్తున్నాను.

ఇప్పుడు ఈఉత్తరంలో నేనుంచిన 'టైమ్స్' పత్రికభాగాలను మీ కిపాటికి ఎవరైనా పంపిఉండవచ్చును. కాని అలా పంపరేమో అనే అనుమానంతో నేను వాటిని పంపిస్తున్నాను. మీ నాన్నగారిమరణానికి నే నెంతో విచారిస్తున్నాను. ప్రేమపూర్వకమైన, నా అనుకంపాన్ని స్వీకరించవలసిందిగా మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను. మీరు గైకొన్న ఉత్కృష్ట వైఖరికి నా కృతజ్ఞతను, పూజ్యభావాన్ని వ్యక్తపరుస్తున్నాను.

మీ అత్యంత విశ్వాసపాత్రుడు,
రాబర్టు ఓ. మెన్నిల్.

పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ.

84. రోజర్ బాల్డ్విన్‌నుంచి,

ఫిబ్రవరి 13, 1931.

ప్రియమైన జవహర్‌లాల్ నెహ్రూ,

మొన్నమొన్న నేను మీకు ఉత్తరంవ్రాసి పోస్టుచేసినతరువాత సంతాపకరమైన, మీ నాన్నగారి మరణవార్తను పత్రికల్లో చదివాను— మా పత్రిక లన్నింటిలోనూ ఈ వార్త ప్రముఖంగా ప్రకటించబడింది. మీకు, మీ కుటుంబానికి హృదయపూర్వకమైన నా సంతాపాన్ని తెలియ

జేస్తున్నాను. మీనాన్నగారు అత్యున్నత గుణవంతులు. వ్యక్తిగతజీవితంలో, ప్రజాజీవితంలో, ఎప్పుడూ ఈ గుణాలు ప్రస్ఫుటమౌతూవుండేవి. అందు కాయనంటే నాకెంతో గౌరవంగాఉండేది. ఆయన్ని కలుసుకోవడమంటేనే, ఎంతో ఉత్సాహంగా, ఉల్లాసంగా ఉండేది. తనఆదర్శం పట్ల అచంచల విశ్వాసాన్ని ప్రకటిస్తూ, ఎంతమాత్రం రాజీపడని వైఖరిని గైకొన్నందుకు, నా ఉత్సాహం మరీ అతిశయించింది. అటువంటి తండ్రికడుపున పుట్టడంమాట అటుంచి— మీరు అనేకవిధాల అదృష్టవంతులు!

సదా మీ,

రోజర్ బాల్డ్విన్.

85 రోజర్ బాల్డ్విన్‌వద్దనుంచి

100 ఫిఫ్త్ ఎవెన్యూ,
న్యూయార్కుసిటీ,
ఏప్రియల్ 29, 1931

నా ప్రియమైన జవహర్లాల్.

ఇక్కడ పత్రికలలో భారతదేశపరిస్థితిని గురించి వార్తలు, సవివరంగానే ప్రచురితమౌతున్నాయి. వాటిని చదువుతున్నకొద్దీ గాభరా ఎక్కువవుతోంది. ఎటూతోచక యింతకాలం మీకు ఉత్తరం వ్రాయడానికి నేను వెనుకాడాను. దీన్నిగురించి మీ మిత్రులతోను నా స్నేహితులతోను చర్చిస్తూనేవున్నాను. అమెరికను పత్రికల సంపాదకీయాలను జాగ్రత్తగా పరిశీలిస్తూనేవున్నాను. అన్నిటినీ సమగ్రంగా పరిశీలించిన పిమ్మట నేనొక నిశ్చితాభిప్రాయానికివచ్చాను, మీరు మీ ఇంటర్వ్యూలో చెప్పినట్లుగా, స్వాతంత్ర్యోద్యమం మొత్తంమీద ఘోరంగాసన్నగిల్లిపోతోంది. భారతదేశప్రజలు యావన్మందికీ గాంధీ ఒక్కరే ప్రాతినిధ్యం వహించడం, తన విచక్షణాజ్ఞానాన్నుపయోగించి దౌత్యాన్ని నడపవచ్చునన్న విశేషాధికారాన్నాయనకీయడం, రాజీకి ఆయన అర్రులుచాచే స్వభావం కలిగివుండడం, ఇదంతా ఇక్కణ్ణుంచి—దూరంనుంచి గమని

నిస్తుంటే పారిస్‌లో సంప్రదింపులు జరిపిన విల్సన్ జ్ఞాపకమొస్తున్నాడు. ఇంతకాలం మీరంతా దేనికోసమైతే పోరాడారో. ఆసమస్య ఆయ నెంత దృఢనిశ్చయంతోవున్నా, సంక్షోభంలోపడే అవకాశాలు చాలా వున్నాయి. ఇది విషాదకరంగా పరిణమించే ప్రమాదంవుంది. అదీకాక, ఇంగ్లీషు వాళ్ళు ఎంతకైనా సాహసులు. ఎంతటి దుర్మార్గాన్నయినా పవిత్రమైన పదగుంభనతో కప్పిపుచ్చుతూ తమ ప్రయోజనాలు తాము సాధించు కుంటారు. ఎంతటి దైన్యశాలైనా సద్భావపరులైనా మెత్తమెత్తని మాట లతో బుజ్జగించి ఎలాగో ఒకలాగ ఒప్పించి యిట్టే కళ్ళుకప్పుతారు. దెబ్బకు దెబ్బతీస్తే తప్ప మరి దేనికీ, ఆఖరికి మీ అహింసాయుధ విప్లవా నికిసైతం వారు లొంగివచ్చి తమ సామ్రాజ్యాన్నొదులుకుంటారని నేన నుకోను. సంపూర్ణ స్వాతంత్ర్యానికి భిన్నమైన ప్రతిపాదనను తిరస్క రిస్తూ ఎప్పటివలె ఇప్పుడూ మీరు మీ ప్రయత్నాలు కొనసాగిస్తే మీ ఆదర్శం మీకు సిద్ధిస్తుంది.

ఇది నా ఒక్కడి అభిప్రాయం మాత్రమేకాదు. రాజీకంగీకరించడ మంటే భారతదేశ బూర్జువావర్గం తమ ఆస్తిపాస్తులను కాపాడుకొనడానికి జాతీయోద్యమాన్ని బ్రిటిష్‌వారికి అమ్మడమేనన్న కమ్యూనిస్టుల విమర్శ లతో ఏకీభవించలేకపోయినా, వామపక్షీయులందరూ ఒకే ఒక అభిప్రా యంలో వున్నారు; ఆ అభిప్రాయాన్నే నేను మీకు తెలియచేశాను. కాని ఇప్పట్లాగే అప్పుడూ కార్మిక కర్షకులను దోపిడిచేసే వృత్తి కొనసాగు తూవున్నట్లయితే, స్వాతంత్ర్యమనే పదాని కర్థంవుండదని మీ రంగీక రిస్తారనుకుంటాను. సాంఘికవిప్లవాన్ని కార్యదక్షులనుకునేవాళ్ళు అవ లీలగా తీసుకువస్తే తీసుకురావచ్చును; కాని రాజకీయవిప్లవం అలాగ కాదు. వ్యవసాయక పారిశ్రామిక సంస్కరణలను సాధించగలిగే కార్య క్రమాన్ని అది రూపొందించుకోవలసివుంటుంది. ఈ విప్లవాన్ని ఎలా కొనసాగించాలో మీరు చక్కగా ఊహించగలరని నాకు తెలుసును.

భారతదేశ స్వాతంత్ర్యంవిషయంలో నే 'నిపుడు వెలిబుచ్చిన దృక్పథానికి ఇక్కడ అమెరికాలో ఏమీ బలంలేదు. ఇక్కడి పత్రికలన్నీ

ఆఖరికి అప్పుడు భారతదేశస్వాతంత్ర్యాన్ని బలపరచిన మితవాద పత్రికలు సైతం ఇప్పుడు ఒక్కుమ్మడిగా గాంధీజీని సమర్థిస్తున్నాయి. నమ్మకూడని యిట్టి రాజీనిగురించి కాని, భారతదేశభవిష్యత్తును ఒకే ఒక వ్యక్తికి అప్పగించడంలోగల ప్రమాదాన్నిగురించికాని, పత్రికలు విమర్శిస్తూ ఒక్కవాక్యంకూడా వ్రాయడంలేదు. కాని గాంధీజీవిధానానికి విరుద్ధమైన మరొక దృక్పథం రూపొందించబడితే, దాని కిక్కడ మేము బలం చేకూర్చగలం. గాంధీజీని కలుసుకునేందుకు మేం ఒకర్ని లండను పంపిద్దామనుకుంటున్నాం, భారతదేశస్వాతంత్ర్యాన్నంగీకరించవలసినదిగా కోరుతూ ఇక్కడనుంచి అసంఖ్యాకంగా ఉత్తరాలను, తంతులను లేబరుపార్టీలోని స్నేహితులకు అందచేద్దామనుకుంటున్నాం. గాంధీజీ కనక తన విధానానికి అంటిపెట్టుకొని అలాగేవుంటే, మీ రక్కడనుంచి ఆయనమీద గట్టి ఒత్తిడితీసుకురండి; మేమూ ఇక్కడనుంచి అన్ని విధాలా అటువంటిప్రయత్నమే కొనసాగిస్తాం. ఈవిధంగా మేము ప్రయత్నించవచ్చునో కూడదో, మే మిలాగ బలపరచడం మీ అభిప్రాయాలకు, మిగిలిన వామపక్షీయుల. అభిప్రాయాలకు అనుగుణంగా వున్నదో లేదో మీరు కేబుల్ద్వారా తెలియచేస్తారా ?

భారతజాతీయకాంగ్రెసును నేను సమర్థించాననిచెప్పి, సామ్రాజ్యవాదవ్యతిరేకసమితినుంచి న న్నిప్పుడే బహిష్కరించారు ! బహిష్కరిస్తే బహిష్కరించనివ్వండి. అది నా కంత ప్రధానంకాదు. కాని రాజీ కంగీకరించకుండా కాంగ్రెసు తన సామ్రాజ్యవాదవ్యతిరేకవిధానాన్ని కొనసాగిస్తూవుంటే ఆ వైఖరి సామ్రాజ్యవాదానికి లోబడిన ప్రాంతాలంతటా ఇలాంటి విప్లవాలను ప్రోత్సహిస్తుంది. అదే నాకు ప్రధానం. సదా అభివందనాలతో.

రోజర్ బాల్డ్విన్.

86. ఇ. స్టాగ్‌డన్‌వద్దనుంచి

ది వికారేజ్, హారో,
మే 31, 1931.

ప్రియమైన నెహ్రూ,

నెహ్రూఅంటే, అప్పుడు 1906 సంవత్సరంలో ప్రధానోపాధ్యాయునియింట్లో నేనుచూచిన ఆ మంచివ్యక్తి మీరేనా? అలాఅయితే మీకు ఉత్తరంవ్రాస్తూ, మీ తండ్రిగారిమరణానికి నా సంతాపాన్ని తెలియజేయాలని ఉంది. తండ్రిపనిపోవడం ఎంతటివానికైనా మిక్కిలి దుఃఖకరం. మా నాన్నగారుకూడా హారోలో హెడ్‌మాస్టరుగా పనిచేసేవారు. ఆయన చాలా తెలివైనవారు. తన 80వ ఏట మరణించారు. ఆయన మరణం, నా కిప్పటికీ దుఃఖకరంగానేవుంది. ఆయన్ని నేను అమితంగా ప్రేమించాను. ఇప్పటికీ ఆయన నా చెంత ఉన్నట్లుగానే నేననుకుంటూవుంటాను. ఆయ న్నంతగా ప్రేమించడంవల్ల నాకు కొంత ఆత్మసంతృప్తి కలుగుతోంది.

మీ రెప్పుడైనా ఇంగ్లండువస్తే, మీరు నన్ను కలుసుకొనితీరాలి. పాతస్నేహితులనుగురించి మనం ముచ్చటించుకోవచ్చును. హారోలోనే నెప్పుడూ సుఖంగానేఉన్నాను. ఇప్పుడు నేను స్కూల్లో పనిచేయడం లేదు. మతాచార్యునిగావుంటూ బస్తీప్రజలకు మంచిచెడ్డలు బోధిస్తున్నాను.

అభివందనాలతో,
ఇ. స్టాగ్‌డన్.

87. మహాత్మా గాంధీవద్దనుంచి

బోర్‌సద్, జూన్ 28, 1931.

నా ప్రియమైన జవహర్‌లాల్,

నీవు వ్రాసిన ఉత్తరం, పోస్టుకార్డు నా కందేయి. రాయ్‌బరేలీలో విధించిన 144 సెక్షన్ ఉపసంహరించబడినందుకు సంతోషం. ప్రభుత్వ ప్రధానకార్యదర్శికి నువ్వెంత స్పష్టంగా ఉత్తరంవ్రాయడమే అందుకు

కారణం. వర్కింగుకమిటీ సమావేశానికి నువ్వు బొంబాయి వెళ్ళేటప్పటికి, వర్కింగుకమిటీ, ముందు ఏం చెయ్యాలో తన సూచనలను సంసిద్ధపర్చుకోవాలి.

మనకేసు మనం పూర్తిచేసుకునేందుకు గవర్నరును నువ్వు చూడదలుచుకున్నట్టుగా ఆయనకు తెలియపర్చడం అవసరం. రాష్ట్రి ఉన్నతాధికారికి ప్రస్తుత పరిస్థితిని స్పష్టపరచడం అవసరమని నువ్వు భావిస్తున్నట్టుగా ఇంటర్వ్యూకోరుతూ నువ్వు ఆయనకు తెలియజేయి. గవర్నర్ని కలుసుకోవడంవల్ల ఆయన మనకేదో ఒరగబెడతాడనికాదు. కాని ఆయన్ని నువ్వు కలుసుకోవడానికి ప్రయత్నించడంవల్ల, ఒడంబడిక కుదుర్చుకునేందుకు ప్రయత్నించడంవల్ల మన వాదనకు బలం చేకూరుతుంది. ఆయన్ని కలుసుకోగోరడంవల్ల ఆయన్ని కలియడంవల్ల నీకు కలిగే నష్టమేమీలేదు.

ఉనావ్ జిల్లా సంఘటనలగురించి యంగ్ఇండియా పత్రికలో నేను వ్రాసిన విషయాలు నువ్వు చదివేవుంటావు. నువ్వూ, ఇతరులూ పంపే సమాచారాన్ని ఆధారంగాచేసుకొని ఈసారి మరికొంత వ్రాస్తాను.

వర్కింగుకమిటీ సమావేశం వాయిదాపడడం దురదృష్టకరం. అలహాబాద్లోని ప్రస్తుతపరిస్థితుల్నిబట్టి, వల్లభాయి వెళ్ళడానికి వ్యతిరేకిస్తున్నాడు. యు. పి. లో మరికొన్నిచోట్ల, కాన్పూరులోనూ వున్న ఉద్రిక్తపరిస్థితినిబట్టి, ప్రస్తుతానికి అలహాబాదులో సమావేశం జరపడం మంచిదికాదని నేననుకుంటున్నాను.

బాపు.

పండిత జవహర్లాల్ నెహ్రూ,
ఆనందభవనం,
అలహాబాద్.

## ౭౭. మహాత్మా గాంధీనుంచి

బోర్సద్
జూలై 1, 1931

నా ప్రియమైన జవహర్‌లాల్,

నువ్వు జూన్ 27 తేదీన వ్రాసిన ఉత్తరం బార్డోలీనుంచి తిరిగి వచ్చి, యిక్కడ నాకు అందింది. చేయవలసినపని నేనూ, వల్లభాయి పంచుకున్నాం. కనక నేను బొంబాయినుంచి సరాసరి బోర్సద్‌కు వచ్చాను. ఈ సంగతి బహుశా మీకు తెలిసివుండదు. ప్రత్యక్షంగా అక్కడవుండడం వల్ల, అప్రమత్తతలో మెలగడంవల్ల ప్రమాదం తప్పిపోతూవస్తూంది. కాని బోర్సద్‌లో ఏరోజైనా ఉద్రిక్తత అకస్మాత్తుగా కలిగితే కలుగవచ్చును. దక్షిణాఫ్రికాలో భారతీయుల స్థిరనివాససమస్యను పరిష్కరించడంలో నాకు చాలా కష్టమైన అనుభవాలు కలిగినవి. ప్రభుత్వం చక్కగా ప్రవర్తించడంకోసం, నేనుసైతం అరెస్టుకావలసివచ్చింది. ఆ సమస్య నెలా పరిష్కరించానో, ఆ అనుభవాలేమిటో నా కిప్పుడు జ్ఞాపకంరావడంలేదు. కాని వాటిని జ్ఞాపకంచేసుకుంటున్నాను. ఆ అనుభవాలే పునరావృతమౌతున్నాయి. ఒడంబడిక కుదిరినా, పోరాటం కొనసాగినా, మనం విశ్వాసపాత్రమైన సేవకులుగా ఉండాలంటే, దేశంమాత్రం ముందుకు పురోగమించవలసివుంటుంది. అదే నా సంతృప్తి.

ప్రభుత్వ ప్రధానకార్యదర్శికి నువ్వువ్రాసిన ఉత్తరాలన్నీ నాకు వచ్చేయి. గవర్నరు నిన్ను కలుసుకుందుకు అంగీకరిస్తాడనే ఆశిస్తాను.

నీమీద ఒక ఫిర్యాదువచ్చింది. టైపుచేయబడిన ఆ ఫిర్యాదు కాగితాన్ని యిందుతో నీకుపంపిస్తున్నాను. దానికి జవాబువ్రాస్తే, దానితోపాటు దీన్నికూడా నాకుపంపించు. లేదా మనం కలుసుకున్నపుడు దాన్నిగురించి మాట్లాడుకోవచ్చును; అప్పు డీ ఫిర్యాదుకాగితాన్ని వెంటతీసుకురా.

బాపు.

## ౮౧. సరోజినీనాయుడునుండి

ది గోల్డెన్ థ్రెషోల్డ్,
హైదరాబాద్ — దక్కన్,
సెప్టెంబరు 7, 1931

నా ప్రియమైన జవహర్,

నేను తయారుచేసిన అంతిమజాబితాను యిందుతో జతపర్చి పంపుతున్నాను. మిసెస్ తయారుచేసిన జాబితా చాలా దోషభూయిష్ఠంగావుంది. అదిచూచి నేను చాలా ఆశ్చర్యపోయాను; కాని వెనక్కు దిగజారిపోయిన తమ బకాయీలను చెల్లించనివ్యక్తులు ఓటుచేసే హక్కును కోల్పోవాలని అనుకుంటాను. ఈ జాబితా చాలా పరిమితం. ఇంకొక నెలలోపల పేర్లు చేర్చాలని అనుకున్నాను కాని, మరి. అది సాధ్యపడదు.

భాషాసమస్యపై నీవు వెలువరించిన కరపత్రం అద్భుతంగావుంది. ఎంతో అసంతృప్తిపొందినవారు సయితం, నీ కరపత్రాన్ని చదివి చాలా సంతృప్తిపడ్డారు. మౌల్వీ అబ్దుల్ హక్. కరపత్రం చాలా బాగుందని మెచ్చుకున్నాడు. ఉర్దూసాహిత్యరంగంలో ఆయనంటే అమితమైన గౌరవభావముంది. ఈ విషయమై రాజన్‌బాబుతో ఆయన సంప్రదించారు. ఇతరసమస్యల పరిష్కారానికి ఇది ఒక అత్యవసరమైన, చక్కని ప్రాతిపదిక. మిగిలిన సమస్యలుకూడా పరిష్కారమౌతాయి. నా కొక డజనుప్రతులు కావలసివుంటాయి. (మీ ఆఫీసువాళ్లకు డబ్బురావాలని కోరికవున్నట్లయితే వాటిని వి.పి. ద్వారా పంపించమను) పంజాబులోనూ, తదితర ప్రదేశాలలోనూ, నేనీ సమస్యపై చాలామందితో ముచ్చటించాను. వారికీ ప్రతులు పంపిద్దామనుకుంటున్నాను.

ఇప్పుడు నాకు చాలా బాధగావుంది. ఇక సోఫామీద ఒరగడమే గత్యంతరం. బాధ ఏమిటో తెలియదు కాని, వూరికే కాలుపట్టిపెట్టుకుపోతోంది. ఈ బాధ ఎలా తప్పించుకోవడమో తెలియకుండావుంది.

ఓపీ అంత కులాసాగాలేదు. గాలిమారితే పిల్లఒంట్లో బాగుండ వచ్చును. ఎక్కువగా శ్రమపడ్డంవలన, ఈసుఖగాలివల్ల ఆమె ఆరోగ్యం చెడింది. ఇంమాకు ఉత్తరం వ్రాస్తున్నాను.

ప్రేమతో,
సరోజిని.

షి. యస్—పౌ. హ. సం. స. కి అనుకున్నదానికంటె కాస్త ఎక్కువపనమే చేహరింది. (పౌ. హ. సం. స. అంటే అర్థం: పౌర హక్కుల సంరక్షిక సమితి, అది నా ప్రోద్బలంవల్ల నెలకొల్పబడింది. దానికి సరోజినీనాయుడు అధ్యక్షురాలు.)

90. రోజర్ బాల్డ్విన్‌నద్దనుంచి

సెప్టెంబరు 24, 1931.

ప్రియమైన జవహర్‌లాల్,

జెనీవాలో ఉన్న నాకు ఆ తంతిని మీరుదయతోపంపించినందుకు మీకు నేను నా కృతజ్ఞత వెంటనే తెలుపలేదనుకుంటాను. తంతిలో సూచించినప్రకారం జొలోన్ వెళ్లడానికి, పారిస్ చేరుకున్నాను. ఏమంటే. గాంధీజీని చూడ్డానికి నేను ఇంగ్లండు వెళ్లలేను; కారణం నేను యింకా బ్రిటిష్‌వాళ్ల "అవాంఛనీయులైన వ్యక్తుల" జాబితాలో ఉన్నాను. స్టేషన్ ప్లాట్‌ఫారంమీద ఉండగా, నన్ను శ్రీమతి నాయుడు గుర్తుపట్టి తనరైలు పెట్టెలోనికి ఆహ్వానించారు. అందువల్ల పడవప్రయాణీకులకు, ప్రత్యేకించిన రైలు నే నెక్కవలసిన అవసరం లేకపోయింది.

ఇప్పుడు వాల్‌స్ట్రీటుకు కుబేరులు బ్రిటన్‌పక్ష మవలంబించారు. మార్గాలు దోరిగా మారిపోయాయి. కనుక భారతదేశస్వాతంత్ర్యాన్ని గురించి, ఎకీవిరామంలేకుండా అమెరికాలో ప్రచారం కొనసాగించాలి. ఈవిషయాన్నే నేను వీరందరితోనూ గట్టిగా చెప్పాను. నాకు తెలిసినదానికంటే రాజీకి యింకా అధికంగా గాంధీజీ దిగివస్తేతప్ప సమావేశం విధిగా విఫలమౌతుంది. అలా అది విఫలమైతే, అప్పుడు శ్రీమతి సరోజినీ

నాయుడు. తా నమెరికా వెళ్ళరాని కంగీకరించాడు. కాని వీరందరివైఖరీ, వీరిపట్లావున్న వాతావరణం నా కెంతమాత్రం నచ్చలేదని నేను చెప్ప వలసివుంటుంది. వీరు నిర్దిష్టంగా ప్రత్యేకభావంతో, దృఢనిశ్చయంతో ఉన్నట్లు నాకు కనిపించడంలేదు. గాంధీమీదనే దమ దృష్టిని కేంద్రీక రించి చూస్తున్నారు. అదే క్షేమకరమని వారియూహ. ఆయనసూచనలను గురించి అంతా నాకు తెలుసును. ఆయనధైర్యాన్నీ, సూక్ష్మబుద్ధినీ నేను ప్రశంసిస్తాను. కానీ!

సరే, ఒడంబడికమాటకేమి, దాన్నిగురించి నే నంత బాధ పడను. నా పని నేను నెరవేరుస్తాను. సంపూర్ణస్వాతంత్ర్యమంటే, దాని అర్థం సైన్యంపై, కోశాగారంపై, విదేశవ్యవహారాలపై సంపూర్ణ హక్కు కలిగివుండడమేనన్నభావాన్ని అమెరికాలో విస్తృతంగా ప్రచా రంచేసి. ప్రజలు ఆమోదించేటట్లు కృషిచేస్తాను. అదే తన వైఖరి అనీ, ఆ ప్రాతిపదికమీదనే తను నిలబడతాననీ గాంధీ నాకు స్పష్టంచేశారు, మే మావిధంగా కృషిసల్పవచ్చునని, ఆయన అంగీకరించారు. చార్లీ ఆండ్రూస్‌కూడా అందరికంటే ఎక్కువగా దీనిని అంగీకరించారు. అమె రికన్ వ్యాంకర్లలో, బ్రిటన్‌కు యిదివరకున్న సంబంధాలు మారిపో యాయి. ఆ మార్పులోఉన్న అంతరార్థాన్ని మాత్రమే గాక, భారతదేశ రాజకీయవిప్లవాంతర్గర్భిత ఆర్థికసమస్యలనుసైతం ఆయన గమనించడం చూసి, నేను నిజంగా ఆశ్చర్యపోయాను.

ప్రస్తుత ఉద్యమం బూర్జువాస్వభావం కలదని కమ్యూనిస్టులుచెప్పే వాదన తప్పు అని నే ననుకుంటాను. అయితే ఈ ఉద్యమంపై భూస్వా ములు. పారిశ్రామికులు ఎంతవరకు ఆధిపత్యం వహించగలరో, మున్ముందు, కాలం తేటపరిచేవరకూ యీ ఉద్యమం అసలుస్వభావం యిప్పుడప్పుడే స్పష్టంకాదు. భారతదేశ సామాజికవిప్లవాన్నిగురించి, అమెరికాలో మేము బహిరంగంగా మాట్లాడలేమే అనుకోండి; అయితే 1776వ సంవత్సరపు స్వాతంత్ర్య ఆదర్శానికి మేము నిలబడివుంటాము. కాని వ్యక్తిగతంగా మీకూ, నాకూ యావత్తు ఉద్యమానికీ ఆ సామాజిక విప్లవం ప్రాణమయింవంటిది. ధన్‌కూడా ఇదేవిధంగా భావిస్తున్నాడు.

మీ తంతివార్తకు, యింకొకసారి నా అభివందనాలు తెలియజేస్తున్నాను. అమెరికాలో మేమూవిధంగా కృషిచేస్తామని మేము వాగ్దానం చేస్తున్నాం.

మీకూ, మీ కుటుంబీకులకూ నా హృదయపూర్వకాభివందనాలు.

రోజర్ బాల్డ్విన్.

## 91. మేరీ ఖాన్‌సాహేబువద్దనుంచి

[మేరీ ఖాన్‌సాహేబ్, సరిహద్దు రాష్ట్ర ప్రసిద్ధనాయకుడూ, ఖాన్ అబ్దుల్ గఫూర్‌ఖాన్ సోదరుడూ అయిన డాక్టర్ ఖాన్‌సాహెబ్ సతీమణి. ఆమె ఆంగ్లవనిత.]

3 మిచ్నీరోడ్డు,
పెషావరు,
అక్టోబరు 1, 1931

ప్రియమైన జవహర్లాల్,

మీకు ఉత్తరం వ్రాయడం నా విధిగా నేను భావిస్తున్నాను. ఉత్తరాలు వ్రాయడమంటే ఖాన్‌సాహెబ్ ఊరికే బెదిరిపోతారు. ఉత్తరాలు వ్రాయకపోవడంవల్ల అనేకమంది మంచి మనుష్యులతో ఆయనకు సంబంధంలేకుండా పోతోంది. కాసేపు కూర్చుని ఉత్తరం వ్రాయడానికి తనకు ఓపికా తీరుబడి వున్నట్లే కనిపించదు. నిజానికి ఆయ నెప్పుడూ ఇంట్లోవుండరు. ప్రొద్దున్నే బయలుదేరుతారు; రాత్రి చాలా పొద్దుపోయాక చాలా అలసిపోయి యింటికి తిరిగివస్తారు. కాస్సేపు మాట్లాడు కుందామంటే ఆయనకి ఓపికేవుండదు. మీ ఉత్తరాలు ఇదిగో వ్రాస్తా నని ఆ వస్తమానం అనడంతప్ప, వ్రాయడం మాకు కనిపించదు. మీ దగ్గర్నుంచి ఆయన కెన్నో ఉత్తరాలు వచ్చాయి; పదేళ్ళక్రితం రైలులో ప్రయాణంచేస్తూ మీరువ్రాసిన ఉత్తరం ఆయన 'కేసు'లో అలాగేవుంది. మీ ఫొటోగ్రాఫ్ అందిన క్షణమే ఆయన ఉత్తరంవ్రాద్దామను

రున్నారు; తాను ఏమేమి వ్రాద్దామనుకుంటున్నారో అదంతా నోటితో చెప్పడం ప్రారంభించారు. అయితే వెంటనే మొదలుపెట్టండన్నాను. ఇప్పుడుకాదు; అవతల అర్జెంటుపనుంది; తొందరగా వెళ్లిపోవాలి. మనసు నిలకడగాలేదు. పెందరాళే ఇంటికి వస్తాను; తప్పకుండా ఈవేళే వ్రాస్తానన్నారు. కాని ఆ 'ఈవేళ' ఇంతవరకూ రాలేదు. జాన్ ఉత్తరం వ్రాసి ఏనాడికైనా అయింది, ఆయన నిజంగా నాకు అందేనా మరి? ఆయన నా కెప్పుడూ ఉత్తరాలు వ్రాయడు. ఈవేళ వచ్చిన మీ ఉత్తరం విప్పాను; ఆయనకు పంపించాను. దానికాయన జవాబు వ్రాసేటట్లుగా చూస్తాను. మేం మిమ్మల్ని చూడ్డాని కొకసారి వస్తాం; లేదా మమల్ని చూడ్డానికి మీరైనా ఒకసారి రండి.

మీ భార్యకు నా గౌరవాభివందనాలు.

మీ విశ్వాసపాత్రుడైన,
మేరీ ఖాన్‌సాహెబ్.

92. మహాదేవ దేశాయ్ వద్దనుంచి,

[లండన్‌లో జరిగిన రౌండుటేబిల్ సమావేశానికి గాంధీజీ వెళ్లినప్పుడు నాకు ఈ లేఖ చేరింది.]

88. నైట్స్‌బ్రిడ్జి,
లండను, యస్. డబ్ల్యు. 1,
అక్టోబరు 23, 1931.

నా ప్రియమైన జవహర్‌భాయ్,

విమానటపా యీరోజే అందింది. వాళ్ల స్థితి మామూలే. 'రాజమకుటం' క్రింద అనే పదాన్ని, యింకా అలాంటిపదాల్ని మాటిమాటికీ పలకడం తనకు చికాకుకలిగిస్తుందని జాహీరుచేసిన గంధీగారి ఉపన్యాసానికి, యఫ్. యస్. కమిటీలో చిన్న కలకలం బయలుదేరింది. ఈ పదాలను దృష్టిలోఉంచుకొని ఆలోచించడం కాంగ్రెసు ఏనాడో మానుకుంది. ఈ మానసికప్రవృత్తిని వారు ఎంతత్వరగా వదులుకుంటే అంతమంచిది.

బాపూచిత్తశుద్ధిని, ధైర్యాన్ని లార్డు శాంకే ఎంతోకొనియాడేడు. ఆయన ప్రశంస యదార్ధమైనదని అనుకుంటాను. కాని 27వ తేదీలోపున ఏమీ జరగదని నా భావం. ముసల్మానులతో సంప్రదింపులు అక్కడే, అలాగే నిల్చిపోయాయి, వారు కావాలనికోరితేతప్ప, బాపూ వారిని కలుసుకుం డుకు శ్రమతీసుకోరు. దత్తా (డాక్టరు యస్. కె.) మా కొక ముచ్చట చెప్పారు. అది మీకు సరదాగావుంటుంది. మొన్న ఒక ఆంగ్లమిత్రుని - కాంప్‌బెల్ రోడ్సు - యింట్లో జిన్నాతోకలిసి అతను విందారగిస్తున్నా డట. సంభాషణలమధ్య అల్పసంఖ్యాకులసమస్య చర్చకువచ్చేసరికి జిన్నా, మూడవసీసా మద్యం పుచ్చుకోవడం పూర్తిఅయింది. 'రోడ్సు' జిన్నాతో యిలా అన్నాడట: "మీ ఉభయులకు అంగీకృతమైన ఒక పరిష్కారమార్గాన్ని రూపొందించి, ప్రభుత్వాన్ని దిగిరమ్మని నువ్వెందుకు ఒత్తిడిచెయ్యగూడదు?" మద్యం బాగాసేవించిఉన్నాడేమో, జిన్నా ఆ నిషాలో(!) దాని కిలాగ జవాబుచెప్పారు— "సరిగ్గా అక్కడే మీరు పొరపడుతున్నారు. మాకు ఎలాంటిఅధికారం ఒనగూడుతుందో స్పష్టంగా తెలిసేవరకూ అంగీకృత పరిష్కారమార్గం రూపొందించడం అసాధ్యం. ప్రభుత్వం బండిని ముందూ, గుర్రాన్ని వెనకా పెడుతోంది!". సరిగ్గా యిదేవిషయాన్ని బాపూ ఎన్నాళ్లనుంచో చెబుతున్నారు, కాని దాన్నే ముసల్మానులు కాదంటున్నారు! (మనలోమాట: ఇప్పుడు జిన్నా తన హృదయంలోని అసలుభావాన్ని వ్యక్తపరచడానికి కారణం, మద్యపాన మాహాత్మ్యమే. మద్యపాననిషేధ వ్యతిరేకులు, తమవాదాన్ని బలపరుచు కుందుకు యిది చక్కటి ఉదాహరణ.)

లార్డ్ ఇర్విన్ బాపూను కలుసుకున్నాడు. (లేదా బాపూ ఆయన్ని కలుసుకున్నారు) తాను చెప్పేవరకు గాంధీజీ ప్రయాణంకాకూడదని మరీ మరీ కోరాడు. పరిస్థితి నిరాశాజనకంగా లేదనీ, ఎన్నికలు పూర్తి కాగానే పరిస్థితి చక్కబడుతుందనీ, కాంగ్రెసు కోరికలు అంగీకరింప బడేటట్లుగా, తాను శాయశక్తులా ప్రయత్నిస్తాననీ, యితరులచేత ఒప్పి స్తాననీ ఆయన అంటున్నాడు. ఎన్నికలలో కన్సర్వేటివ్‌లు గెలుపొంది నట్లయితే (అలాగే కనిపిస్తోంది) ఇర్విన్ మంత్రివర్గసభ్యుడు కావ

చ్చును; కాని బాపూ ఈ అదృష్ట దురదృష్టాలమీద ఆధారపడదలచుకో లేదు. ఆయన ఎక్కడకువెళ్లినా, వెళ్లిన ప్రతిచోటా తనహృదయం విప్పి మాట్లాడుతున్నారు. కాంఢోమ్‌హౌస్‌లో జరిగిన సమావేశం. నిజంగా చెప్పుకోదగ్గది. సమావేశానికి లోథియన్ అధ్యక్షతవహించాడు. కన్సర్వేటివులకు అది బలమైనకేంద్రం. యూసఫాలీ, కర్నల్ గిడ్నీ ఏమిటేమిటో, అర్థంపర్థంలేకుండా సభలో మాట్లాడారు. అయినప్పటికీ గాంధీజీప్రసంగం సభికులహృదయాన్ని ఆకట్టుకుంది. చరిత్రపరిశోధకులు జి. పి. గూచ్‌ని మీరెరుగుదురుకదా; కాంఢోమ్‌హౌసులో తానింతవరకు యిటువంటి సభను చూడలేదని, అది పలువురిహృదయాన్ని ఆకట్టుకుందని ఆయన చెప్పుకొచ్చాడు. ఈ విషయమంతా సదానంద్ ద్వారా నేను తంతియిచ్చాను. అది మీరు చూచేవుంటారు. కాని సభాస్థలాన్నిమాత్రం నేను నా తంతిలో పేర్కొలేదు. కారణం అది బహిరంగ సభకాదు.

బిషప్పులతోనూ, ఆర్చిబిషప్పులతోనూ బాపూ ఎక్కువకాలం గడుపుతున్నారు. కాలం యిలా వినియోగించడాన్ని, మీరేమంటారో నాకు తెలియదు. కాని వారికది మంచి జ్ఞానాన్ని ప్రసాదిస్తోంది. ఈ అవకాశాన్ని కోల్పోవడం వారికిష్టంలేదు. భారతదేశంతో గౌరవప్రదమైన ఒడంబడిక చేసుకోవలసినదిగా, పార్లమెంటును కోరుతూ (లేదా మంత్రివర్గాన్ని కావోలు—నాకు సరిగ్గా జ్ఞాపకంలేదు) మహజరుపంపించాలన్న ప్రతిపాదన సాకల్యంగా చర్చింపబడుతోంది. మహజరుమీద ఆర్చిబిషప్ బిడ్డుటూ యితరులతోపాటు సంతకంచేస్తారు.

బాపూ మీ టెలిగ్రాం 'హోర్'కు పంపించారు, ఆయ నింకా జవాబివ్వలేదు. గాంధీజీ - మాక్డొనాల్డుల ఉత్తరప్రత్యుత్తరాల ప్రతులు మీకు పంపడం మరచిపోయాను. వాటిలో చెప్పుకోదగ్గ విశేషమేమీ లేదు. కాని నకళ్ళుతీయించి యిందుతోపాటు గురుకు నంపించడానికి ప్రయత్నిస్తాను. ఫెడరల్ ఫైనాన్స్‌విషయమై, ఏ ఏ స్థానాలు, సూత్రాలను సంస్థానాలు అంగీకరించవలసివుంటుందో సూచిస్తూ, బాపూ భోపాల్‌కు ఒక ఉత్తరంవ్రాసి షుయాబ్‌చేతికిచ్చారు. ఈ సమస్యను తెలుసు

రోజులు పట్టింపారు కాని,యింతవరకు ఫలితమేమీ చేకూరలేదు." ప్రత్యేక మందిరంలో నే నొక నాటకప్రదర్శనాన్ని చూశాను! ఇది మీకు ఆశ్చర్యంగా వుండికదూ? సరే; ప్రత్యేకమందిరం అంటే ఎలావుంటుందో నాకు తెలియదు. ఆ ప్రదర్శనానికి లైసెన్సులేదు. ప్రదర్శనాన్ని ఏమాత్రం పట్టించుకోకపోయెను కాని, అందులోని దృశ్యాలన్నీ (దాదాపు పది) ఘోరంగా ఉన్నాయి. అన్నీ పడకటింటిదృశ్యాలే. అతి నీచమైన దృశ్యాలు! అయినప్పటికీ, ప్రదర్శననిర్వహణ అద్భుతంగా ఉందని నే నంగీకరించక తప్పదు! రంగాలంకరణ, పాత్రనిర్వహణ అన్నీ అతి స్వచ్ఛంగాఉన్నాయి. ఔను. 'స్వచ్ఛంగా' అనే పదాన్ని నేను బుద్ధిపూర్వకంగా ప్రయోగిస్తున్నాను. 'ప్రత్యేకమందిరం' స్వచ్ఛంగా ఉంటుందనే నా భావం. కనక మళ్ళీ యింకొకసారి 'బారెట్స్'కు వెళ్ళాను! ఈ ఉత్తరంతోపాటు పంపుతున్నవి మిమ్మల్ని ఉల్లాసపరచవచ్చును. పేదప్రజల ప్రతినిధికి కార్యదర్శులుగా ఉన్న మేము చేస్తున్నపని యిది!

ఈరాత్రి మేము 'ఏటన్' వెడతాం. అక్కడనుంచి ఆక్స్ఫర్డుకు ప్రయాణమౌతాం. ఈ ప్రయాణం ఎప్పుడు సంభవిస్తుందో అని నేను యిన్నాళ్ళూ ఆతురతతో ఎదురుచూశాను.

అంత్యంత ప్రేమాదరాలతో మీ,

మహదేవ్.

సప్రూ అండ్ కో ను గురించి ఒక చిన్న చమత్కారం: బాపూ ఏమి కోరుతున్నారో బయాచా అడుగుతూ,,పాపం—చాలా తెలివైనవాడు—సైన్యంపై పూర్తిఅధికారం ఉండాలని తాను కోరుతున్నానన్నాడు! "మహాత్మాజీ! మీరు అంతర్యుద్ధంవస్తే, దానికేం ఫరవాలేదు; మనం కొట్టుకు చచ్చిపోదాం అంటారు. కాని నేనుమాత్రం అంతర్యుద్ధమొస్తే భరించలేను. దానిని అణచడానికి తప్పకుండా సైనికుల్ని, బ్రిటిషుసైనికుల్ని నేను పిలిపించవలసివుంటుంది!"

ఈ ఉత్తరపుప్రతిని మీరు అన్సారీకి పంపిస్తారా? ఆయన దగ్గర నుంచి, నాకు చక్కటి జాబుచేరింది. అది అందినట్లుగా దయవుంచి ఆయనకు తెలియచేయండి. మీ సోపాను ఆయనసహా ఈ ఉత్తరం చదవాలని నా కోరిక.

ఎం. డి.

## 93. మహాత్మా గాంధీవద్దనుంచి

డిసెంబరు 28, 1931.

నా ప్రియమైన జవహర్,

ఇంపూ నీ ఉత్తరం నా కిచ్చింది. ఏమైతేనేం, నువ్వుఅరెస్టుకావడం నాకాశ్చర్యంగాలేదు. కమలను చూడ్డానికి వెళ్లేంను కింతవరకు నాకు అవకాశం లేకపోయింది. ఈరాత్రో రేపుప్రొద్దున్నో తప్పకుండా వెడదామనుకుంటున్నాను. ఇందూకి నువ్వువ్రాసిన లేఖల ద్వితీయసంపుటం నేను చదివానని విని నువ్వు ఆనందిస్తావు. నీకు కొన్నిసలహాలివ్వాలనివుంది కాని, మనం కలుసుకున్నపుడు వాటిని చెబుతాను. నీకూ షెర్వానీకి నా ప్రేమపూర్వకాభివందనాలు.

బాపూ.

## 94. మహాత్మా గాంధీవద్దనుంచి

జనవరి 29, 1932.

నా ప్రియమైన జవహర్,

నీ ఉత్తరం అందుకొని నే నెంతో ఆనందించాను. జైలుబయట వున్న మావంటి దురదృష్టవంతులస్థితిని నువ్వు అపేక్షించడానికి కారణమేమీ కనిపించదు. కాని బయటనున్నవారికి ఈ చాకిరీనంతా ఒదిలిపెట్టి కీర్తినంతటినీ నువ్వొక్కడవే పొందుతున్నందుకు నీమీద మాకే అసూయగావుంది. అయితేనేం, మేం మా పగను తీర్చుకుంటాం. జైలుకురాడానికి మేం పథకంపన్నుతున్నాం. జైలులో పత్రికలు తెప్పించుకునేందుకు నీకు అనుమతిస్తున్నారనుకుంటున్నాను.

మొన్న కమలను చూశాను. ఆమె చాలాకాలంపాటు విశ్రాంతి తీసుకోవలసివుంటుంది. మళ్లీ ఇంకొకసారి ఆమెను చూడడానికి వెళతాను; వెళ్లి తగినంత విశ్రాంతితీసుకోమని బాగా శక్తివచ్చేవరకూ, గదిలోంచి కదలవద్దని మరీ మరీ చెబుతాను. డాక్టర్ మహమ్మద్ విషయమై తీసుకున్నచర్యను స వ్యామోదిస్తారని నే నాశిస్తాను. ఆనందభవన్ మీద విధించినపన్ను చెల్లింపబడుతుండసే వాగ్దానం నెరవేరుస్తారని ఆశిస్తాను.

ఇద్దరికీ నా ప్రేమాభివందనాలు,

బాపూ.

భగవంతుడు, ప్రభుత్వం అనుగ్రహిస్తే ఆశ్రమానికి బయలుదేరి వెళతాను; రెండుమూడురోజుల్లో తిరిగివస్తాను.

95. డెహ్రాడూన్ జిల్లా, జైలు సూపరింటెండెంటుకు,

[ ఈ ఉత్తరప్రత్యుత్తరా లొక జైలుసంఘటనను తెలియచేస్తాయి. జైలునిబంధనలు దుస్సహమైనవీ, అసంబద్ధమైనవీ ఐతేతప్ప సర్వసాధారణంగా వాటిని మేము పాటించదలచుకున్నాము. అయినప్పటికీ అప్పుడప్పు డేవేవో సంఘటనలు జరుగుతూవుండేవి. నేను నైనీ సెంట్రల్ జైలులో వున్నపుడు ఒకానొక సంఘటనపై నిరసన తెలియజేయడంకోసం మాలో చాలామందిమి, మూడురోజులు నిరాహారదీక్షపూనాము. జైలులో మాకు మామూలుగా ఇంటర్వ్యూలిస్తూవుండేవారు. మొదట మూడునెలల కొకసారి, కొంతకాలానికి నెలకొకసారి మాకు ఇంటర్వ్యూ లిచ్చారు. ఈ ఉత్తరప్రత్యుత్తరాలు జరుగుతున్నసమయంలో నాకు పక్షానికొక ఇంటర్వ్యూ యిస్తూవుండేవారు. నేను డెహ్రాడూన్ జైలులో వున్నప్పుడు నన్నుచూడ్డానికి మా అమ్మగారు, నాభార్య అలహాబాదు నుంచి చాలాదూరంప్రయాణంచేసి వచ్చారు. వారు డెహ్రాడూన్ చేరుకునేసరికి, నన్నుచూడ్డానికి అధికారులు వారికి అనుమతి ఇవ్వలేదు. ఈ సంఘటన కారణంగా, చాలానెలలవరకు నేను

నా ఇంటర్వ్యూలను మానుకున్నాను. అప్పుడు నేను యింతమించు ఒంటరిగావుంచేవాణ్ణి; సహచరులెవరూ వుండేవారుకాదు.]

జిల్లాజైలు, డెహ్రాడూన్.
జూన్ 22, 1932.

ది సూపరింటెండెంటు,
జిల్లాజైలు, డెహ్రాడూన్.

ప్రియమైన అయ్యా,

ఒక నెలరోజులవరకు నేను మా అమ్మగారిని నా భార్యను ఇంటర్వ్యూచేయడానికి అనుమతించరాదని ఉన్నతాధికారులవద్దనుంచి మీకు తాఖీదువచ్చినట్లుగా మీరు నా కీరోజున తెలియజేశారు. జైలు నియమాలను నిబంధనలను ఉల్లంఘించిన నేరానికి శిక్షగా, ఆ నియమాలప్రకారం ఇంటర్వ్యూలు నిలిపివేసినట్లుగా నాకు అర్థమయింది. అయితే నన్నెందుకు శిక్షించారో నాకేమీ తెలియదు. నా నేరమేమిటో, దాని స్వభావమేమిటో. ఆ తాఖీదుపంపిన స్థానికప్రభుత్వానికో, లేదా ఇనస్పెక్టరు జనరల్‌కో, ఎవరు తాఖీదుపంపితే వారికి, మీరు వ్రాసి నాకు సమాచారం తెలుపకుండా. స్థానికప్రభుత్వం మీ కా నన్నదులు పంపి చాలా అమర్యాదకరంగా ప్రవర్తించింది. జైలునిబంధనలకు మర్యాదగా, సబబుగా కట్టుబడిఉండడం మా సంకల్పం. కాని మర్యాదను ఉచితజ్ఞతను కోల్పోయి ప్రభుత్వం అందుకు విరుద్ధంగా ప్రవర్తిస్తే మేము మా ప్రస్తుతవైఖరిని అవలంబించడం కష్టతరమౌతుంది.

ఒక నెలరోజులవరకు, నే నెవరితోనూ ఇంటర్వ్యూచేయకూడదని యీ తాఖీదు అర్థమో, లేక ఈ నిషేధం కేవలం, మా తల్లిగారికి, నా భార్యకుమాత్రమే వర్తిస్తుందో, నాకు అర్థంకావడంలేదు. ఎలా వర్తించినప్పటికి దీనితో నాకు ప్రమేయంలేదు. ఇతరులు నన్ను కలుసుకోవడానికి మీరు అనుమతించినప్పటికీ, నే నా ఇంటర్వ్యూలు వినియోగించుకోదలుచుకోలేను.

మా అమ్మగారు, నా భార్య ప్రత్యేకం నన్ను చూడ్డానికి డెహరాడూన్ వచ్చినట్లు, ఇంటర్వ్యూదినం వచ్చేవరకు వా రిక్కడే నిరీక్షిస్తు

న్నట్లు మీకు తెలిసేవుంటుంది. పైనుంచి మీకుచేరిన లాఖీదువల్ల అను కున్నదంతా తలకిందులౌతుంది. వారిక్కడ వుంచడం వ్యర్థమౌతుంది. ఉన్నతవిధానపద్ధతులతో మెలగుతున్న ప్రభుత్వాలు సాధారణ మర్యాద లను. ఔచిత్యాన్ని పాటించకపోవడం నా కాశ్చర్యంగావుంది.

మీ నిజమైన,

జవహర్‌లాల్ నెహ్రూ.

లెఫ్టినెంట్ కర్నల్ జి. హాల్లాండ్సన్, ఐ. యమ్. యస్. జైళ్ళఇనస్పెక్టరుజనరలు. యు. పి. నుంచి డెహ్రాడూన్ జిల్లా సూపరింటెండెంటుకు.

లక్నో, జూలై 8, 1932.

విషయం : 'ఎ' క్లాసు శిక్షితుడు పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ దరఖాస్తు. అతని ఎండార్సుమెంటు నెంబరు 818/46. తేదీ 23-6-32.

1932 మే 20వ తేదీన దరఖాస్తుదారుని తల్లీ, భార్యా, కూతురూ అలహాబాద్ జిల్లాజైలులోఉన్న శ్రీ ఆర్. యస్. పండిట్‌ను ఇంటర్వ్యూ చేసినట్లుగా, ఆయనకు తెలియజేయవచ్చును.

శ్రీ ఆర్. యస్. పండిట్‌కు ఆయనభార్య ఒకఉత్తరాన్నిచ్చారు. సూపరింటెండెంటు అనుమతిపొందకుండా ఇలాగఉత్తరాన్నీయడం జైలరు అభ్యంతరంపెట్టాడు. అందుమీదట ఆయనతల్లి జైలరును దుర్భాషలాడుతూ నిందించింది. ఎంతచెప్పినా ఆమె వినలేదు.

ఈ కారణాలు పురస్కరించుకొని శ్రీమతి జవహర్‌లాల్‌నెహ్రూ శ్రీమతి మోతీలాల్‌నెహ్రూలు దరఖాస్తుదారునితో ఒక నెలవరకూ ఇంటర్వ్యూలు జరుపడానికి అనుమతించరాదని ప్రభుత్వం ఉత్తరువులు జారీ చేసింది.

(సం)....

లెఫ్టినెంటు కర్నల్. ఐ. యం. యస్.

జైళ్ళ ఇనస్పెక్టరు జనరలు, యు. పి.

96 డెహ్రాడూన్ జిల్లా జైలు సూపరింటెండెంటుకు,

డెహ్రాడూన్ జైలు,
జూలై 11, 1932.

ది సూపరింటెండెంటు,
జిల్లాజైలు,
డెహ్రాడూన్.

ప్రియమైన అయ్యా,

జూన్ 22వ తేదీ నా ఉత్తరానికి జైళ్ళ ఇనస్పెక్టరుజనరల్ వ్రాసిన జవాబును ఈరోజు నాకు చూపించినందుకు మీకు నా కృతజ్ఞతలు. అలహాబాద్ జిల్లాజైలులో ఉన్న శ్రీ ఆర్. యస్. పండిట్‌కు, మే 27వ తేదీన నా భార్య ఒక ఉత్తరం యిచ్చిందనీ, అందుకు జైలరు తన అభ్యంతరాన్ని తెలుపగా, మా అమ్మగారు పరుషంగా మాట్లాడుతూ జైలరును నిందించారనీ, అందులో వుంది.

కాని జరిగినదాని కిది పూర్తిగా విరుద్ధం. ఆమాటకొస్తే, ప్రభుత్వంతీసుకున్నచర్య అనేకసమస్యలను లేవనెత్తుతోంది. అందు వల్ల ఈవిషయాన్నిగురించి మీకు మళ్ళీ వ్రాస్తున్నాను. ప్రభుత్వాని కీ ఉత్తరాన్ని పంపించినట్లయితే, మీకు నేనెంతో కృతజ్ఞుణ్ణి.

మే 27వ తేదీ జరిగిన ఇంటర్వ్యూలో శ్రీ పండిట్‌కు పూనా స్కూల్లో చదువుతున్న ఎనిమిది, ఆరు, మూడు సంవత్సరాల ప్రాయంగల తన కుమార్తెలనుగురించి సమాచారం అందివ్వబడింది. ఈ సమాచారం ఒక ఉత్తరంలోనో, లేదా స్కూలురిపోర్టులోనో రూపొందింపబడింది. నా కుమార్తెకూడా అదే స్కూల్లో చదువుకుం టోంది. అలహాబాద్‌లో సెలవురోజులు గడుపుతోంది. ఈ ఉత్తరాన్ని లేదా రిపోర్టును, ఆమె అక్కడినుంచి తీసుకువచ్చింది. ఇంటర్వ్యూ సమయంలో శ్రీ పండిట్‌కు చదివి వినిపించింది. తరువాత దాన్ని చూడ్డానికి అతనిచేతి కందించింది. ఇందుకు జైలరు అభ్యంతరం పెడుతూ, ముఖ్యంగా శ్రీ పండిట్‌తో పెంచీ చెడ్డాలేకుండా మాట్లాడాడు.

శ్రీ పంపిచ్‌ను నిందించడమే గాకుండా మా తల్లిగారిపట్ల, నా భార్యపట్ల అవమానకరంగా ప్రవర్తించాడు. మా తల్లిగారు అసలు అతనితో మాట్లాడనే లేదు.

మూడురోజుల తరవాత, మే 30వ తేదీన బెరిల్లీ జిల్లాజైలులో మా తల్లిగారు, నా భార్య, నా కుమార్తె నన్ను ఇంటర్‌వ్యూ చేశారు; జరిగిన సంగతి అంతా నాకు తెలియజేశారు. మా అమ్మగారి పట్ల, అంత అమర్యాదకరంగా ఎవరైనా ప్రవర్తించగలరా, అని నా కాశ్చర్యంవేసింది. జరిగినదానికి జైలు అధికారులు తమ విచారాన్ని వ్యక్తపరుస్తారని నే నాశించాను. దానికిబదులుగా, ప్రభుత్వం మా తల్లిగారిని, నా భార్యను, యీవిధంగా ఇంటర్‌వ్యూలు నిరాకరించడంద్వారా శిక్షించదలుచుకుందని నే నిప్పుడు గ్రహించాను. జైలరురిపోర్టును పురస్కరించుకొని, ప్రభుత్వం ఈవిధంగా చేసిందనుకుంటాను. అసలు జరిగినదేమిటో తెలుసుకునేందుకు ప్రభుత్వం ప్రయత్నించలేదు. మా తల్లిగారినికాని, నా భార్యనుకాని ఏ సమాచారం అధికారులు అడిగలేదు. నిజం తెలుసుకోవడానికి ఎట్టి ప్రయత్నం, విచారణ చేయకుండానే ప్రభుత్వం మా తల్లిగారిని, నా భార్యను అవమానపరచడానికి, ఈ విధంగా మా అందరికీ ఇబ్బంది కలుగజేయడానికి ఏమాత్రం సంకోచించలేదు.

జైలులోఉన్న ఒకవ్యక్తికి తనబిడ్డల స్కూలురిపోర్టును చూపించడం నేరం, జైలునిబంధనలప్రకారం నేరమైతే కావచ్చును. అయితే అది చిన్ననేరమే అయినప్పటికీ, ఏదో ఒక కొత్త ఆర్డినెన్సు పుణ్యమా అని, అది ఘోరాపరాధంగా పరిగణింపబడవచ్చును; కనక దాన్ని శిక్షింపదగినంత అపరాధంగా, ప్రభుత్వం భావిస్తే భావించుగాక. అది నేనేం పట్టించుకోను. అంతేకాదు, నా ఇంటర్‌వ్యూలు ఒకనెల, లేదా ఒక సంవత్సరం ఆపివేసినా అభ్యంతరంచెప్పను. కులాసాగా గడపడం కోసమో, ఆరోగ్యాన్ని కాపాడుకోవడంకోసమో, నేను జైలుకురాలేదు.

కాని నాకళ్లముందు జరుగుతున్న కొన్ని సంఘటనలుచూసి నేను మౌనంగా ఊరుకోలేను. మా తల్లిగారిని నిందిస్తున్నారనీ, అవమానిస్తు

న్నారనీ నాకేమాత్రం చూచాయగా తెలిసినా, నేను సహించలేను. ఏ పరిస్థితుల్లోనైనా, ప్రభుత్వంపట్లనుంచి ఎంతో శాంతమర్యాదను నే నాశించాను. మా అమ్మగారిపట్ల ప్రభుత్వం కనీసమర్యాదకూడా చూపనందుకు నేనెంతో విచారిస్తున్నాను. మాతల్లిగారు, జైలరుపట్ల 'మూర్ఖంగా' ప్రవర్తించారనీ, దుర్భాషలాడి అవమానించారనీ, ఇన్‌స్పెక్టరు జనరలు పేర్కొంటున్నాడు. ఈవిధమైన భాషను ఉపయోగించడం, కేవలం అతను ఉచితజ్ఞతను కోల్పోవడమే అవుతుంది. భారతీయసమాజాన్ని గురించి, సంప్రదాయాన్ని గురించి, అతని కేమాత్రం ఇంగితజ్ఞానమున్నా ఇటువంటిభాషను ఉపయోగించడు.

ఇప్పుడు ప్రభుత్వంతీసుకున్న చర్యనుగురించి, దాని పద్ధతిని గురించి ఆలోచించిచూస్తే, ఒకవిషయం స్పష్టపడుతుంది. జైలులోవున్న నన్నుచూడ్డానికి, ఎవరు ఎప్పుడువచ్చినా, వారు ప్రభుత్వాధికారులచేతనో లేక ప్రభుత్వంచేతనో అవమానింపబడరాదన్నమాట. ఇకముందు ఎట్టి పరిస్థితుల్లోనూ ఈవిధంగా నా తల్లిగారిని, భార్యను అవమానిస్తే నేను సహించబోను. ఈపరిస్థితుల్లో నాకు ఒకటేమార్గముంది. నన్నుచూడ్డానికి వచ్చేవారు అవమానింపబడరని తెలిసేవరకూ, ఇంటర్వ్యూలు మర్యాదగా కొనసాగింపబడతాయని నమ్మకం కుదిరేవరకూ, నే నెట్టి ఇంటర్వ్యూను కోరదలచుకోలేదు. కనక ఇకముందు నన్ను ఇంటర్వ్యూ చేయడానికి యింతదూరం రావద్దని మావాళ్లకు నేను తెలియజేస్తున్నాను. ఇన్‌స్పెక్టరుజనరలు నాపేరును భవిష్యత్తులో సరిగా ఉచ్చరించడానికి శ్రమతీసుకుంటే నేను చాలా సంతోషిస్తాను.

మీ విశ్వాసపాత్రుడు,
జవహర్‌లాల్ నెహ్రూ.

97 మహాత్మా గాంధీవద్దనుంచి,

ఎరవాడ సెంట్రల్ జైలు,
పూనా,
డిసెంబరు 31, 1932.

నా ప్రియమైన జవహర్ లాల్,

అస్పృశ్యతనుగురించి తనకున్న ప్రణాళికను చర్చించడంకోసం సరూప్ నిన్న నాదగ్గరకు వచ్చింది. సింహళంలో విశ్రాంతితీసుకోమని ఆమెకు నువ్వు సలహాయిచ్చావట. కాని ఆమె విశ్రాంతితీసుకోవడం అవసరంలేదనుకుంటాను. ఆమె యిపుడు పనిచేయకలిగేస్థితిలోనే వుంది. అస్పృశ్యతను నివారించడానికి, ఎంతో కొంత పనిచేయడానికి ఆమె ఉత్సాహపడుతోంది. పనిచేద్దామని, ఆమెకు కోరికఉన్నంతకాలం, ఆమె నలాగ చేయనివ్వడం మంచిదనుకుంటాను.

నీకు మరి రెండుమూడు పల్లు వూడివచ్చాయనీ, తనతల నెరిసిపోతున్నదనీ ఆమె నాకు తెలియజేసింది. ఇంతకుతప్ప యితరత్రా నీ ఆరోగ్యం చక్కగాఉన్నట్లు నాకు కొందరు తెలియజేశారు. నీకోసం వచ్చే వాళ్లను చూడడానికి. నీ వింకా తిరస్కరిస్తూన్నట్లు కనిపిస్తూవుంది. అవకాశంఉంటే నువ్వు వారినిచూస్తే బాగుంటుందని నాకోరిక. అలా అయితే వారికి సంతృప్తిగాఉంటుంది. ఇప్పుడు కొత్తగా మాలోకి చగన్‌లాల్ జోషి వచ్చిచేరాడు. అతనితో మా సంఖ్య నాలుగువరకూ పెరిగింది. హరిజన సమస్యపట్ల నీకు ఆసక్తి ఉన్నదో లేదో నాకుతెలియదు. శాస్త్రిగార్లతో నేను నా కాలాన్ని అద్భుతంగా గడుపుతున్నాను. శాస్త్రాలను పఠిస్తున్నాను. పూర్వంకంటె శాస్త్రజ్ఞానం ఇప్పుడు అధికంగా అలవరచుకున్నాను; కాని నిజమైన మతమంటే ఏమిటో, ఆ శాస్త్రాలు నాకు వివరించడంలేదు.

అందరికి నా ప్రేమాభివందనాలు.

బాపు.

## 95. మహాత్మా గాంధీవద్దనుంచి

ఎరవాడ సెంట్రల్ జైలు,
పూనా,
ఫిబ్రవరి 15, 1933

నా ప్రియమైన జవహర్లాల్,

నీ అత్యద్భుతమైన ఉత్తరానికి, చక్కటి జవాబు వ్రాద్దామన్న సంకల్పంతో ఇన్నాళ్ళు నేను కాలయాపనచేసుకుంటూవచ్చాను. కాని ఇక అలాగచేయడానికి వీలులేదు. రోజుకురోజూ పని ఊరికే పెరిగిపోతూంది. కనక నేను వ్రాద్దామనుకుంటున్న ఆ ఉత్తరమేదో యిప్పుడే నీకు వ్రాయాలి. కేవలం సాత్త్వికస్వభావం కలిగిన 'హరిజన్' పత్రికను, జైలుఅధికారులు నీకు చేరనిస్తారో, చేరనివ్వరో నాకనుమానంగావుంది; చేరుతుందనే నమ్మకంతోనే దాన్ని నీకు నేను పంపిస్తున్నాను. సనాతనవాదులకు వ్యతిరేకంగా జరుగుతున్న పోరాటం, రానురాను అమితాసక్తిని కలిగిస్తోంది. కష్టతరమూ ఔతోంది. ఎంతో కాలం నిద్రాణంగాపడివున్నవారు, ఇప్పుడు మేల్కొంటున్నారు. అదే చెప్పుకోదగిన విశేషం. వారు వాడుతున్న దుర్భాషలు వినడానికి యింపుగావున్నాయి. వారి దృష్టిలో లోకంలోవున్న చెడుగుకీ, కల్మాషానికి అన్నిటికీ నేనే కారణభూతుణ్ణి. వారు లేవదీస్తున్న దుమారం, వీటిని నశింపజేస్తుంది. అయితే నేనుమాత్రం దెబ్బకుదెబ్బతీసే ధోరణిలో మాత్రం లేను. దానికి బదులుగా అహింసనుమాత్రమే ప్రయోగిస్తాను. ఈ దుర్భాషలను, నేను నిర్లక్ష్యంచేస్తున్నకొద్దీ వారికి ఉద్రేకం మరీ పెరిగిపోతోంది. కాని ఈ రాక్షసనృత్యం ఎంతోకాలం సాగదు. ఇది, చనిపోయేముందు దీపంచుట్టూ మిడతలువేసే నాట్యంవంటిది. పాపం! రాజగోపాలాచారి, దేవదాసుకూడా వారి విమర్శలకు గురిఅవుతున్నారు. లక్ష్మి ఉదంతానికి వారు చిలవలుఅల్లి, హీనమైన నేరాలు ఆరోపిస్తున్నారు. దానిచుట్టూ లేనిపోని కట్టుకథలను, అల్లుతున్నారు. ఈవిధంగా అస్పృశ్యతను వారు బలపరచుకోజూస్తున్నారన్నమాట!

అస్పృశ్యతానివారణను గురించి నాతో సంప్రదించడానికి సరూప్, కృష్ణ లిద్దరూ నన్ను కలిశారు. ఇందూ కూడా వాళ్ళతోపాటు వచ్చింది. ఆమె చాలా ఆరోగ్యంగావుంది. ఎంతో ఆనందంగా ఉన్నట్లు కనుపించింది. అస్పృశ్యతానివారణోద్యమ ప్రచారం చేయడంకోసం సరూప్ కథియవాడ్, గుజరాత్‌లలో కొంతకాలం పర్యటించబోతున్నది. కృష్ణ అలహాబాద్ చేరుకుంది. అస్పృశ్యతానివారణపట్టాలను శాసన సభలో ప్రవేశపెట్టించడంకోసం ఢిల్లీలో రాజా, అసెంబ్లీ సభ్యులతో సంప్రదిస్తున్నాడు. అతనికి దేవదాసు తోడ్పడుతున్నాడు. అస్పృశ్యతా నివారణకృషిలో మేము, మా కాలాన్ని పూర్తిగా వినియోగిస్తున్నాము. నేను వ్రాస్తున్న ఎడతెరిపిలేని ఉత్తరాలకు, వల్లభాయ్ కవర్లను సప్లయి చేస్తున్నాడు. అతనిది చాలా సునిశితమైన దృష్టి. వార్తాపత్రికలను నిరంతరం పరిస్తూవుంటాడు. అస్పృశ్యతను గురించిన వార్తలుగాని, ఇతర ముఖ్యవార్తలుగాని ఎక్కడ కనిపించినా చటుక్కున తీస్తాడు. సంతోషాన్ని ఉత్పత్తిచేసే ఫ్యాక్టరీలా ఉంటాడు. జైలు తన కీరోజునకూడా, ప్రతిరోజూ ఉన్నట్లే తనపనిలో తాను నిమగ్నమై ఉంటాడు. నేను ప్రతిరోజూ, అత న్నేదో చేసిపెట్టమని అడుగుతూనేవుంటాను. అతను ఎన్నడూ నన్నేమీ అడగడు. ఈ రెండింటిలోనూ ఏది సుఖతరమైనదో నాకు తెలియదు. నేనుకూడా, నా ఓటమికి చిన్నబుచ్చుకోకుండా, అతనిలాగే నిత్యం ఆహ్లాదకరంగా ఎందుకుండకూడదు? నువ్వక్కడ ఒక్కడవే ప్రశాంతంగా, గ్రంథపఠనంలో నిమగ్నుడవై ఉండడం, మాకు అసూయగా ఉంది. ఇప్పుడు మేము మోస్తున్నభారం, మేము తెచ్చిపెట్టుకున్నదే; కాదంటావా, తెచ్చిపెట్టుకుంటున్నది. వల్లభాయికి, తాను మంచి సంస్కృత పండితుడు కావాలని వుంది. పాపం, అతని ఆశయాన్ని నేను భంగపరిచాను. నిత్యం పెరుగుతున్న హరిజన కృషి ఊపిరాడనివ్వడంలేదు. అందువల్ల అతనికి గ్రంథపఠనమందు నిమగ్నమయ్యే అవకాశంలేదు. అదీకాక బెంగాలు ఫుట్‌బాల్ ఆటగాళ్ళు తమ ఆటను చూచి ఆనందించినట్లుగా, అతనూ రోజూవచ్చే విమర్శలనుచూసి ఆనందించవలసివుంటుంది. షౌకత్ చెప్పి

నట్లుగా మహాదేవ్ మా అందరిలోనూ రాయికీ రోయికీ ఆగే మనిషి. ఏపనైనా అత నవలీలగా చేస్తాడు. చగన్‌లాల్ జోషీ ఇప్పుడిప్పుడే పని కలవాటుపడుతున్నాడు. అయితేనేం, నెమ్మదిగా రాణిస్తాడు. ఇది వసంతకాలం. ప్రకృతి మా చుట్టూ వికసించివుంది. అతని మనస్సు కూడా వికసించకుండా ఉండలేదు. మేము, ఎవరు ఏ పనిచేయాలో బాగానే నిర్ణయించుకున్నాము. ఈ క్రీడానియమాలను మేము పాటిస్తున్నాము. వర్ణాశ్రమధర్మాలపై పక్కాగా ఏర్పడిన మంచి కుటుంబీకుల వలె. మేము మెలగుతున్నాము. అది డాక్టరు అంబేడ్కరుకు, నాకు రుచిస్తుంది. సనాతనవాదులకు ఉద్రేకంకలిగించడాని కొక కారణమౌతుంది. పని భారంగానే వుంది. కాని నా మాట నమ్ము; అది నేను తెచ్చిపెట్టుకున్నదికాదు. ఇప్పుడే నాకు కొంచెం తీరిక చిక్కింది. నీ అభివృద్ధిని అన్నివిధాలా మేము కాంక్షిస్తున్నాం.

నీకు మా ప్రేమాభివందనాలు.

బాపూ.

99. మహాత్మా గాంధీవద్దనుంచి,

ఎరవాడ సెంట్రల్‌జైలు,
పూనా, మే 2, 1933.

నా ప్రియమైన జవహర్లాల్,

నేను ప్రారంభించబోతున్న నిరశనవ్రతానికి సన్నద్ధుడనౌతూవుండగా, నువ్వు నా ఎదుట మూర్తీభవించినట్లనిపిస్తూంది. కాని అందు కభ్యంతరపెట్టి లాభంలేదు. నిరసనవ్రతం కొనసాగింపకమెంత అవసరమో నువ్వు గుర్తిస్తే ఎంతో బాగుండుననుకున్నాను. కేవలం ప్రజ్ఞాపూర్వకమైన కృషివల్ల హరిజనసమస్య పరిష్కృతంకాదు. లోకంలో ఏదీ అంతచెడ్డదికాదు. అందువల్ల నేను మతాన్ని అందులోనూ హిందూ మతాన్ని వదులుకోలేను. హిందూమతం నా కాశాభంగం కలిగించినట్లయితే నా జీవితమే నాకు భారంగా, దుస్సహంగా తోస్తుంది. హిందూమత దృక్పథంనుంచి వీక్షిస్తూ నేను ఇస్లాం క్రైస్తవ తదితర మతాలనన్నిటినీ

ప్రేమిస్తాను. హిందూమతాన్ని నావద్దనుంచి తీసివేస్తే నా కింకా మిగిలే దేమీ వుండదు. అయినప్పటికీ, ఎక్కువ తక్కువ భావాలతో అస్పృశ్య తతో కూడివున్న హిందూమతాన్నిమాత్రం నేను సహించను. అస్పృష్ట వశాత్తూ దోషపరిహారక సూత్రంకూడా హిందూమతంలో యిమిడివుంది. ఆ సూత్రాన్ని నేను ప్రయోగించి చూశాను. నిరశనవ్రతాన్ని నేను జయ ప్రదంగా కొనసాగించగలిగినా, లేదా జీవించడానికి ప్రయత్నించి ప్రయత్నించి, చివరకీ శరీరం కృంగి కృశించి నశించినా మంచిదే. ఈ విషయాన్ని నువ్వు ఆమోదించాలని కోరుతున్నాను. కేవలం ఇది గాజుకాయకంటె నశ్వరమైనది. గాజుకాయను నువ్వు పదివేల సంవత్స రాలవరకూ వదిలపరచవచ్చును; కాని ఈ శరీరాన్ని చెడిపోకుండా ఒక్కక్షణంకూడా భద్రపరచలేవు. అవును; అన్ని ప్రయత్నాలకు మృత్యువు పరమావధి కాదు. అయితే ఒకొక్కప్పుడది అవసరం కావచ్చును. అయితే సత్యాన్ని నువ్వు నీ అంతర్దృష్టితో గ్రహించక పోతే, నీతో నేను వాదించి నిన్ను ఒప్పించలేను. నిరశనవ్రతం చేయ డానికి నీ అనుమతి నాకు లభించకపోయినప్పటికీ దీక్షాసమయంలో నీ ప్రేమను నా హృదయమందు నిక్షేపించుకుంటాను.

నీ ఉత్తరానికి తీరుబడిగా సమాధానం వ్రాద్దామనుకున్నాను. సరే; భగవంతుని తలంపు యింకొకవిధంగా వుంది! కృష్ణతో నేను ప్రసంగిం చాను. కథియవాడ్‌లో సయాప్ వేస్తున్నపనిగురించి నీకు నేను వ్రాశానను కుంటాను. కమల తన చిరునామాసైతం నాకు పంపించలేదు. ఆమె ఉత్తరంవ్రాసి చాలారోజులయింది. ఆమెను నువ్వు కలుసుకున్నపుడు ఆమెకూ ఇందుకూ నా ప్రేమాశీస్సులు తెలియచేయి. నేను నిరశనవ్రతం ప్రారంభిస్తున్నందుకు కమల గాభరాపడకూడదు. అవకాశంవుంటే నాకు తంతి యివ్వు.

అందరికీ నా ప్రేమాభినందనలు.

బాపూ.

100 మహాత్మా గాంధీవద్దనుంచి

జూలై 22, 1933.

నా ప్రియమైన జవహర్లాల్,

తరచు నీ కుత్తరం వ్రాద్దామని అనుకుంటూనే వుంటాను; కాని ఏమిటిచేయడం. ఒంట్లో శక్తిలేకుండావుంది. కోల్పోయినశక్తి కూడబెట్టుకున్నా, అదికాస్తా, పనులవల్ల సన్నగిలిపోతోంది.

అమ్మగారితోటి, కమలతోటి చాలాసేపు కులాసాగా గడిపాను. సరూప్, రంజిత్‌లనుగురించి అంతగా నాకుతెలియదు.

కృష్ణపెళ్ళిప్రస్తావనగురించి అమ్మగారు చాలా ఆదుర్దాపడుతున్నారు. ఆ విషయం నాతో చాలాసేపు ముచ్చటించారు. నువ్వేమైనా సూచించదలుచుకుంటే, దయవుంచి నీ సూచనలు నాకు తెలియచెయ్యి. నే నెప్పుడు ఎక్కడవుంటానో తెలియదు. అయితేనేం, నువ్వు ఉత్తరం వ్రాయవచ్చును.

దేవదాసు లక్ష్మిలను పూనాలో వదిలిపెట్టి నే నిక్కడకువచ్చాను. నేడో రేపో వా రిక్కడకు చేరుకుంటారు. ప్రస్తుతానికి దేవదాసు ఢిల్లీలో స్థిరపడవచ్చుననుకుంటాను. బా. ప్రభావతులు నాతోనే వున్నారు. త్వరలో వారూ వెళ్ళిపోతారనుకుంటాను.

నిరశనవ్రతంవల్ల కోల్పోయినశక్తిని నేను మెల్లమెల్లగా కూడదీసుకుంటున్నాను. నెమ్మదిగా బలం చేకూరుతోంది.

ప్రేమతో,
బాపూ

101. మహాత్మా గాంధీవద్దనుంచి

[నా చెల్లెలు కృష్ణ, రాజాహఠీసింగ్‌ల వివాహసందర్భంలో ఈ లేఖ నాకు చేరింది.]

అక్టోబరు 18, 1933

నా ప్రియమైన జవహర్లాల్,

నేను నా చేతులతో స్వయంగా నూలువడికి వధూవరులను దీవిస్తూ ప్రత్యేకం పంచలుకట్టి నీకు పంపిస్తున్నాను. నాకు బదులుగా. నువ్వే

దండలతో వారికంఠాల నలంకరిస్తావుకదూ! నీ కివి వ్యసధిమించకుండా అందుతాయనుకుంటాను. సంప్రదాయసిద్ధమైన వివాహవిధులు శ్రీమతి హతీసింగ్ వలదని త్రోసిపుచ్చినందుకు నాకు విచారంగావుంది. అయితే ఇలాంటివిషయాలలో నేను వెనకబడివున్నానుకాబోలు!

దీపక్‌నుగురించి నువ్వుచెప్పిన విషయాలను నేను అర్థంచేసుకున్నాను. నా శక్తికొలదీ నేను సరళాదేవికి సానునయపూర్వకంగా ఉత్తరం వ్రాస్తాను.

ప్రేమాభివందనాలతో,

బాపూ

అమ్మగారు ఈ ప్రయాసకు తట్టుకున్నట్లుగా వివాహమహోత్సవం ముగిసినతరువాత నాకు నీవు తంతియిస్తే సంతోషిస్తాను.

102 మహాత్మా గాంధీనద్దనుంచి

సేవాగ్రాం, వార్ధా,
ఆగస్టు 10, 1934

నా ప్రియమైన జవహర్లాల్‌కి,

బొంబాయిలో జరుగనున్న సమావేశాలకు హాజరుకావలసినదిగా కోరుతూ ఖాన్‌సాహేబుకు మామూలుగా నోటీసు అందింది. ఆయనకు సమావేశాలకు హాజరుకావాలని లేదు; నేనాయన్ని బలవంతంపెట్టదలచుకోలేదు. బొంబాయిలో సభలకు సమావేశాలకు రమ్మని ప్రసంగించమని ఆయన్నాహ్వానిస్తారు; ఇప్పుడప్పుడే ఆయ నలాగచేయడం నాకిష్టంలేదు. ఈ ఏడాదల్లా ఆయన నాతోనే, గడపాలని నా వాంఛ. ఆయనది వజ్రశరీరంకాదు. జబ్బుకు యిట్టె లొంగిపోతుంది. కనక ఆయన సమావేశాలకు రాలేకపోతున్నందుకు. నువ్వు దయవుంచి ఆయన్ని క్షమిస్తావు కదూ?

ప్రేమతో,
బాపూ.

[ఖాన్‌సాహేబు అనగా అబ్దుల్ గఫూర్‌ఖాన్]

103. మహాత్మా గాంధీకి,

[నా భార్య అనారోగ్యపరిస్థితి ఆందోళనకరంగా పరిణమించడం వల్ల, హఠాత్తుగా నన్ను జైలునుంచి విడుదలచేశారు. ఈ విడుదల తాత్కాలికమైనది; నిజానికి పదిరోజులలోపునే నన్ను తిరిగి జైలుకు తీసుకుపోయారు. నేను విడుదలైనవెంటనే గాంధీజీకి ఉత్తరం వ్రాశాను.]

ఆనందభవనం,
అలహాబాద్,
ఆగస్టు 13, 1934.

నా ప్రియమైన బాపూ,

...ఆరునెలల ప్రవాసకాలంలో కాలుకదపకుండా పూర్తివిశ్రాంతి తీసుకుని, విడుదలై వచ్చినతరవాత, ఈ ఇరవై ఏడుగంటలూ ఉద్రిక్తతతో ఆహ్లాదంతో ఊపిరిసలపనిపనులలో గడిచిపోయాయి. కాని బాగాఅలసిపోయాను. ఈ ఉత్తరం మీకు రాత్రి పన్నెండుగంటలకు వ్రాస్తున్నాను. ప్రొద్దుటనుంచి సాయంత్రంవరకూ నన్ను చూడ్డానికి ఎడతెరిపిలేకుండా ప్రజలు వస్తూనేవున్నారు. అవకాశంచిక్కితే మళ్లీ ఇంకొకసారి మీకు ఉత్తరం వ్రాస్తాను; కాని కొన్నినెలలవరకు అట్టి అవకాశం దొరకదనుకుంటాను. కనక, గత అయిదారునూసాల్లో కాంగ్రెసు కావించిన ప్రధాన నిర్ణయాలపట్ల నే నేవిధంగా భావిస్తున్నానో, మీ కీ లేఖలో స్థూలంగా సూచిస్తున్నాను. జైలులోవున్న నాకు బయటనుంచి చేరిన సమాచారం సాకల్యమైనది కాదనేమాట నిజమే; దానికి కొంత పరిమితివున్నమాటా యథార్థమే. కాని సంఘటనల సాధారణధోరణినిగురించి సరియైన అభిప్రాయం ఏర్పరచుకునేందుకు అది చాలుననుకుంటాను.

మీరు శాసనోల్లంఘనోద్యమాన్ని ఉపసంహరించుకున్నారన్న వార్త విని నేనెంతో బాధపడ్డాను. మొట్టమొదట సంక్షిప్తపత్రికటన మాత్రమే నాకు చేరింది. కొన్నిరోజుల తరువాత మీ పత్రికటన చదివాను. విద్యుద్ఘాతంవంటి ఇటువంటిదెబ్బ నా జీవితంలో ఇంతకు ముం

దెన్నడూ నే నెరగను. శాసనోల్లంఘనాన్ని ఉపసంహరించడంవల్ల, నాకు కలిగిన మనోవ్యధను మరచిపోడానికి ప్రయత్నిస్తూ నన్ను నేను సమాధానపరుచుకునేందుకు సన్నద్ధమౌతున్నాను. కాని ఉద్యమాన్నుపసంహరించుకుంటూ మీరు పేర్కొన్న కారణాలు భవిష్యత్‌లో చేయవలసిన పనులనుగురించి మీ రిచ్చినసూచనలు నన్ను మితాశ్చర్యచకితుణ్ణి కావించాయి. ఏదో చెప్పలేని బాధ నా హృదయంలో ప్రవేశించింది. ఇంతకాలం అమూల్యమైనదిగా నేను ఎంచుకొంటున్న హృదయానుబంధమేదో, హఠాత్తుగా పుటుక్కున ఎక్కడికక్కడ తెగిపోతున్నట్లనిపించింది. ఈ విశాలమైన ప్రపంచంలో నేను ఏకాకినైపోతినన్నభావం నన్ను కలచివేసింది. నాకు చిన్నప్పట్నుంచీ ఈ భావం అంతో యింతో వుంటూనేవుంది. కాని కొన్ని హృదయానుబంధాలు నాకు శక్తినిచేకూర్చాయి: కొన్ని శక్తులు నన్ను నిలబెట్టాయి. అయితే నేను, ఏకాకిననే భావం తొలగిపోలేదు; కాని అది తగ్గింది. మళ్ళీ యిప్పుడు నేను ఒంటరివాణ్ణనే భావం నాలో పూర్తిగా ఉదయించింది. జీవితంలో ఆద్రిత లేనట్లు అంతా మొండుబారినట్లు ఎడారిలో నన్నొక్కణ్ణి దిగవిడిచినట్లు నేను బాధపడుతున్నాను.

తమనుతాము సమాధానపరచుకునే అపారమైనశక్తి సహజంగా మానవులకుంది. కనుక కొంతవరకు నేను నూత్నపరిస్థితులకు నన్ను నేను సమన్వయపరచుకున్నాను. ఈవిషయమై నాకుకలిగిన శారీరకమైన బాధ యించుమించు తొలగిపోయింది; కాని దెబ్బవెంట దెబ్బ తగలడం వల్ల వరసవరసగా కొన్ని సంఘటనలు ఘటిల్లడంవల్ల ఉద్విగ్నత తీక్ష్ణమైంది. ఇక నాకు మనశ్శాంతి లభించడం దుష్కరమైంది; ఆందోళన అధికమైంది; నిర్దుష్టమైన ఏకత్రకు దూరంగా వున్నట్లు, మళ్ళా ఆ భావం - ఏకాకినయానన్న భావం నాకు జనించింది; ప్రజలనుంచి మాత్రమేకాదు, ఆఖరికి నేను ఇన్నాళ్లూ ఎవరినైతే సన్నిహితులుగా ఆత్మీయులుగా మన్నిస్తూవచ్చానో ఆ ప్రియస్నేహితులనుంచి సైతం దూరమైనట్లుగా ఆవేదనపడ్డాను. ఇదివరకు నేను జైలులో వున్నప్పుడు నా కింతబాధనిపించలేదు. ఈసారి జైలులో నాకు కలిగిన మనోవ్యధ

అంతా యింతా కాదు; జైలుజీవితం నన్నూ నాశక్తినీ పరీక్షింపసాగింది. వార్తాపత్రికలు నాకంటపడకుండావున్నా బాగుండును. నా కీ మనోవ్యధ తప్పివుండేది అనుకునేవాడిని.

నా శరీరస్థితి బాగానేవుండేది; జైలులో వున్నప్పుడు ఎప్పుడూ నా శరీరం అలాగే వుంటుంది. అది రాటుకీ పోటుకీ ఆగింది; ఎన్ని కష్టాలకైనా ఎంత బాధకైనా నా శరీరం ఓర్చుకుంటుంది. ఈ దేశంలో ఏదో పరమార్థాన్ని నే నింకా సాధించవలసివుందనీ, యిది విధినిర్దేశిత మనీ నిష్ప్రయోజనకరమైన ఏవేవో ఊహలు ఊహించుకుంటూ నేను నా ఆరోగ్యాన్ని జాగ్రత్తగా కాపాడుకుంటూవచ్చాను.

కాని నేను గుండ్రని కిన్నంలో ఇముడజాలని పలకలమేకువంటి వాడినేమోనని, సముద్రం నన్నవతలికి తోసివేస్తున్నపుడు అందులోనికి చొచ్చిన దురహంకారపు బుడగవంటివాడినేమోనని అప్పుడప్పుడు అనుకుంటూ, నే నశ్చర్యపడుతూవుండేవాడిని. కాని భేషజం దురహంకారం గెలుపొందాయి. అయితే నా మేధాశక్తి ఓటమిని అంగీకరించడానికి తిరస్కరించింది. ఏ ఆదర్శాలు నన్ను కార్యాచరణకు పురికొల్పాయో, పెనుతుఫానులకు తట్టుకొనేటట్లు చేశాయో, ఆ ఆదర్శాలు యథార్థమైన వైతే— వాటి యథార్థతపై నాకుగల విశ్వాసం పెరిగి పెంపొందినట్లయితే— అవి విధిగా విజయాన్ని సాధించితీరుతాయి. వాటి విజయాన్ని నాతరం ప్రజలకు కళ్లారాచూచే భాగ్యం కలగకపోవచ్చును; కాని అవి ఎప్పుడో ఒకప్పుడు విజయం పొందడం తథ్యం.

అయితే ఈ సంవత్సరం, దూరంగా మౌనంగా కేవలం సాక్షీభూతుడనుగా నా నిస్సహాయతకు విచారిస్తూ నిరుత్సాహంగా నిస్తబ్ధతగా నేను గడిపిన యిన్నినెలలూ ఈ ఆదర్శాలేమైనట్లు? మహోద్యమాలన్నిటికీ విఘాతాలు, తాత్కాలిక ఓటములూ సర్వసాధారణంగా కలుగుతూనే వుంటాయి. అవి వ్యక్తికి ఖేదంకలిగించినా, అతడు వెంటనే ఆ ఖేదాన్ని జయించి నిలబడతాడు. ఇలాగ దృఢంగా నిలబడాలంటే, ఆదర్శాలకాంతిని మందగించనీయకూడదు; సిద్ధాంతాలను విశ్వా

సాలను ఏమాత్రం సడలనీయకూడదు. చుక్కాని జాగ్రత్తగా పట్టుకొని నౌకను నడిపింపవలసివుంటుంది. అయితే నే నీ విధానాలను, ఓటము లను లెక్కచేయలేదు; కాని ఆదర్శాలకు సంబంధించిన, ఆత్మసంబంధ మైన ఆ ఓటమిమాటేమిటి? దాన్నిగురించే, నే నాలోచిస్తున్నాను. ఈ ఓటమి అన్నింటికంటె ఘోరాతిఘోరమైనది. ఇక్కడ నేను శాసనసభా ప్రవేశంగురించి ప్రస్తావిస్తున్నాననుకోకండి. దానికి నే నంత ప్రాముఖ్య మీయను. ఒకానొక పరిస్థితిలో నేను శాసనసభలో ప్రవేశించగల స్థితిని సైతం ఊహించుకోగలను. శాసనసభలోకానీయండి, బయటకానీయండి నే నెక్కడపనిచేసినా విప్లవకారునిగా పనిచేస్తాను. అంటే రాజకీయంగా సాంఘికంగా మూలప్రాతిపదికల విప్లవకర పరిణామాలకోసం నేను పాటుపడతాను. ఇవితప్ప యింకేవిధాన్నైనా భారతదేశానికి ప్రపంచానికి శాంతిసౌఖ్యాలను చేకూర్చలేవని నా నమ్మకం.

కనుక బయటనున్న నాయకులు ఈవిధంగా పనిచేయడంలేదని నేను భావించాను. శాసనోల్లంఘనం, సహాయనిరాకరణోద్యమాల సంద ర్భంలో వారు ఏనాడో గతించిపోయిన పాతయుగాల మాటలను పట్టు కొని వ్రేలాడారు. ఒక్కొక్కప్పుడు అవే పదాలను, పదసముచ్చయాన్ని ప్రయోగిస్తూవచ్చారు. కాని అవి అర్థంపర్థంలేనివి. నిర్జీవమైనవి. మనం పోరాటం సాగిస్తున్నపుడు, ఈ కాంగ్రెసు నాయకులే, తమ కేమీ సంబంధంలేనట్లు దూరంగా తొలగిపోయారు. ముందుకుపోకుండా మనల్ని అడ్డగించారు. ఆఖరికి ఆపత్సమయంలో, మనకు సహాయ పడకపోవడం అటుంచి, మన విరోధిపక్షంతో సహకరించారు. స్వాతం త్ర్యమనే దేవాలయంలో వారు అపవిత్రులైన పూజారులయ్యారు. పోరా టంలో తమశక్తిని, రక్తాన్ని దారపోసిన స్వాతంత్ర్యయోధులకు ఆ దేవా లయప్రాంగణంలోకి అడుగుపెట్టడానికే హక్కులేకపోయింది. స్వాతం త్ర్యయోధులు, తత్తుల్యులు అంటరానివారుగా మారిపోయారు. వారివైపు ఎవరూ కన్నెత్తి చూడకూడదు. వారిని ఎవరూ నోరుతెరచి పలకరింప కూడదు. కాని వారుకనుక పెదవికదిపి, సాహసించి ఈ నూతన పూజారులను ఏమాత్రం విమర్శించినా, వారిని ఈ పూజారులు

దుయ్యబట్టుకుంటారు. దేవాలయపవిత్రతను పాడుజేసే దేశద్రోహులుగా వారిని పేర్కొంటారు; ఎలుగెత్తి చాటుతారు.

మన జాతీయపోరాటం ఉన్నతపథాలలో కొనసాగుతున్నపుడు, శత్రువు ఆజ్ఞను శిరసావహించి దానిని ఎవరైతే పాతాళానికి దిగలాగారో వారికే యిప్పుడు భారత జాతీయ స్వాతంత్ర్యపతాకం వప్పగించబడింది; ఆనాడు రాజకీయాలు ప్రమాదకరమైనవి కనుక, వాటిని త్యజించామని ఎవరైతే గొంతుకచించుకొని ప్రకటించారో, ఇప్పుడు రాజకీయాలు సుకరమైనవి కనుక వాటిని స్వీకరించి ఎవరైతే ఒక్క ఉదుటున వచ్చి అగ్రశ్రేణిలో నుంచున్నారో, వారే మన భారత జాతీయ స్వాతంత్ర్య పతాకాన్ని ప్రస్తుతం ఎగురవేస్తున్నారు. అయితే దేశానికి, కాంగ్రెసు ప్రతినిధులుగా తాము రూపొందించామని చెప్పుకుంటున్న తమముందు వున్న ఆదర్శాలసూచేమిటి? వీరు తమ కలగాపులగపు ఆదర్శాలతో అసలు సమస్యలు వెనక్కి నెట్టుచూ, చివరకు కాంగ్రెసు రాజకీయ తీర్మానాన్ని సైతం విస్మరించారు; స్వాతంత్ర్య ప్రత్యక్షశత్రువులకు జోహారులుచేసే వీరు కాంగ్రెసు అగ్రగామి సమరశక్తులపై ధ్వజమెత్త డానికి సాహసించారు. గడచిన కొన్ని సంవత్సరాలుగా అప్రతిష్ఠపాలౌ తున్న కలకత్తా కార్పొరేషనుకు కాంగ్రెస్సుక అనుబంధంగా తయారు కావడం ఘోరంగా దిగజారిపోవడం కాదా? దేశంలో శాసనోల్లంఘనో ద్యమం ఉవ్వెత్తుగా సాగుతున్నపుడు, మనలో చాలామందిమి జైళ్ళలో మ్రగ్గుతున్నపుడు, ప్రభుత్వోద్యోగులకు అంతరంగిక పరిపాలనశాఖ సభ్యులకు విందులూ వీడెములూ యిచ్చి ఆనందంతో కాలంగడిపిన పెద్ద మనిషి "శ్రీ నళినీరంజన్ సర్కారు ప్రయోజననిమిత్తం నెలకొన్న సంఘంగా బెంగాల్ కాంగ్రెసుసంస్థలో అధికభాగం పరిగణింపబడడంకాదా? బహుశా, ఆ మిగిలినభాగంసైతం, యిలాంటి స్వప్రయోజనపరుల సంఘంగా మిగిలివున్నదేమో! అయితే, ఈ దోషం ఒక్క బెంగాలుకు మాత్రమే అంటిపెట్టుకునిలేదు. ఇంచుమించు ప్రతీచోటా ఈవిధమైన దృక్పథమే, పాదుకొనివుంది. క్రిందనుంచి మీదవరకు కాంగ్రెసుసంస్థ·

ఎక్కడిక్కడ మురాలతో నిండిపోయింది: అవకాశవాదం జయిస్తోంది.

ఈ దౌర్భాగ్యపరిస్థితులకు కాంగ్రెసు వర్కింగుకమిటీ ప్రత్యక్షంగా బాధ్యురాలుకాదు, కాని వీటి బాధ్యతను అది స్వీకరించక తప్పదు. అనుచరులను సరియైనమార్గాన నడిపించడం నాయకుల ధర్మం; నాయకుల విధానంపై, అనుచరుల ప్రవర్తన ఆధారపడివుంటుంది. అనుచరులను నిందించడం వారిమీద దోషమారోపించడం న్యాయమూకాదు; ధర్మమూకాదు. "ఆడలేక మద్దెల ఓడన్న" సామెత ఇంచుమించు ప్రతిభాషలోను వుంది. వర్కింగుకమిటీ మన ఆశయాలను ఆదర్శాలను అస్పష్టంగా అనిర్దిష్టంగా నిర్ణయించింది. బుద్ధిపూర్వకంగా అట్టి వైఖరిని ప్రోత్సహించింది. ఇలాంటి విధానం సంస్థగోదానికేకాక, అభివృద్ధినిరోధకదశలో నిస్పృహకు నిరాశకు దారితీస్తుంది. అభివృద్ధినిరోధకత్వానికి దబాయింపుకు దోహదంచేస్తుంది.

కాంగ్రెసు తన పరమావధిగా భావింపదుతున్న రాజకీయాదర్శాలను గురించి నేను ప్రత్యేకంగా యిక్కడ ప్రస్తావిస్తున్నాను; సాంఘిక ఆర్థిక సమస్యలనుగురించి అది ఏనాడో స్పష్టంగా ఆలోచించివుండవల్సింది; అయితే ఈ సమస్యలను పూర్ణంగా అవగతంచేసుకునేందుకు కొంత కాలం పడుతుందని, నేను కోరుతున్నంతదూరం, కాంగ్రెసు మొత్తంగా ప్రస్తుతం వెళ్ళలేదనీ, నేను గుర్తిస్తాను. కాని యీ సమస్యల్ని గురించి కాంగ్రెసు వర్కింగ్‌కమిటీకి ఏమాత్రం తెలిసినా తెలియకపోయినా, వీటిని ప్రత్యేకంగాఅధ్యయనంచేసి కొన్ని నిర్దిష్టాభిప్రాయాలనేర్పరుచుకున్న వ్యక్తులను. దుయ్యబట్టుకునేందుకు, వెలివేయడానికి అది మనసారా వాంఛిస్తున్నట్లు కనబడుతోంది. ప్రపంచంలో బుద్ధివైభవమూ త్యాగ నిరతీ గల అనేకమంది ప్రజలకు సాంఘికార్థికసమస్యలను గురించి యిట్టి నిర్దిష్టాభిప్రాయాలు కొన్ని వున్నాయి. వాటి నింతవరకూ కాంగ్రెసు వర్కింగుకమిటీ సభ్యులు తెలుసుకునేందుకు ప్రయత్నించకపోవడం హాస్యాస్పదంగా వుంది. ఈ అభిప్రాయాలు తప్పో ఒప్పో అది వేరే విషయం: కాని వాటిని నిరసించేముందు వర్కింగ్‌కమిటీ వాటినిగురించి

అంతో ఇంతో తెలుసుకోవడం అవసరం. భారతదేశపరిస్థితులు భిన్న మైనవని, ఇతరచోట్ల ఆచరణయోగ్యమైన ఆర్థికసూత్రాలు యిక్కడ పొసగవని కొందరు తేలికగా చెబుతూవుంటారు; హృదయానికి విజ్ఞప్తి చేస్తూవుంటారు. కాని ఈ ఆర్థికసూత్రాలు ఆచరణయోగ్యమని హేతు బద్ధంగా చెప్పే వాదనకు. ఈ చౌకబారుమాటలు సమాధానం కాజాలవు. ఈ విషయంమీద వర్కింగ్‌కమిటీ కావించిన తీర్మానం, సామ్యవాదాన్ని గురించి తనకున్న అజ్ఞానాన్ని వ్యక్తపరచుకొని, అందర్నీ ఆశ్చర్య చకితులనుచేసింది. ఆ తీర్మానం చదవడానికే ఎంతో బాధనిపించింది; దాన్ని ఇతరదేశాలవారు చదువుతారేమోనన్న జంకుపుట్టింది. వర్కింగ్ కమిటీ, ఆఖరికి అర్థంపర్థంలేని పదాలను ప్రయోగించడానికి సైతం వెరవక, ఎలాగో ఒకలాగ, స్వార్థపరులకు. స్వలాభపరులకు భరోసాయివ్వడానికి ఉత్సాహపడింది.

సామ్యవాదమనేపదానికి ఆంగ్లభాషలో ఒక స్పష్టమైన నిర్దిష్ట మైన అర్థం వుండగా, అందుకు పూర్తిగా భిన్నమైనఅర్థాన్ని దృష్టిలో వుంచుకొని, తీర్మానాన్ని రూపొందించడం నిజంగా వింతగానేవుంది. ఎవరో కొందరు వ్యక్తులు భాషాపదాలను తమకుమాత్రమే పరిమితమయే ట్లుగా వింతగా వాడుకుంటూవుండేది, అవి భావప్రకటనకు, సమాజానికి ఉపయుక్తపడదు. ఒకవ్యక్తి, తానొక ఇంజనుడ్రైవరునని చెప్పుకొంటూ, తన ఇంజను కర్రతోచేయబడిందని, అది ఎడ్లతో లాగబడుతుందని చెప్పడం ఇంజనుడ్రైవరు అనేపదాలను తప్పుగా ప్రయోగించడమే నన్నమాట.

ఈ ఉత్తరం నే ననుకున్నదానికంటే చూరిగె పెరిగిపోయింది. ఇంచుమించు రాత్రంతా దీనితోనే గడచిపోయింది. అనేక ఆలోచనంతో నే నలసిపోయివుండడంవల్ల నా ఉత్తరం అంత స్పష్టంగానూ, తేట గానూ లేదేమోననుకుంటాను. అయినప్పటికీ ఈ ఉత్తరం నా ఆలోచన స్వభావంగురించి అంతో ఇంతో తెలియజేస్తుంది. నేను గత కొన్ని మాసాలు ఎంతో బాధాకరంగా గడిపాను. ఇలాగే చాలామంది గడిపా రనుకుంటాను. ఆధునికకాలంలో ఒకరపొత్తు నపహరించేకంటే, ఒకరి

హృదయాన్ని గాయపరచడానికి ఎక్కువ కుతూహలంచూపడం పరి పాటిగా కనిపిస్తూంది. ప్రాచీనకాలంలోకూడా యిదే పరిస్థితి కాబోలు! కాని హృదయాన్ని, జ్ఞానాన్ని, మానవన్యాయాన్ని కించపరచడంకంటే, మానవుల సర్వస్వాన్ని దోచుకోవడమే మంచిది.

మీతో నే నింకొకవిషయం ముచ్చటించ దలచుకున్నాను. స్వరాజ్యభవన్ ట్రస్టునుగురించి మీరు ఒకసంగతి తెలియజేయాలి. స్వరాజ్యభవనాన్ని ఎలా కాపాడాలనే సమస్యను వర్కింగుకమిటీ యీమధ్యనే తీవ్రంగా చర్చించి, అందుకు తన బాధ్యత లేదని నిర్ణ యించింది. ఇంతకుముందే, సుమారు మూడు సంవత్సరాలకిత్రితం కొంత గ్రాంటు మంజూరుచేసినా దానిని యింతవరకు చెల్లించలేదు. ఆ గ్రాంటు చేయుతుందనే భావంతో కొంతసొమ్ము ఖర్చుపెట్టబడింది. పిమ్మట మరికొంత గ్రాంటు మంజూరైంది. ఈ మొత్తం బహుశా కొన్ని నెలలవరకు సరిపోతుంది. ఇక భవిష్యత్‌లో భవనాన్ని, భవనఆవరణను కాపాడే భారాన్ని తాను వహించజాలనని వర్కింగుకమిటీ భావిస్తోంది. ఇంతాచేస్తే ఈ భారం, పన్నులూ అన్నీ కలిపి మొత్తం నెలకు వంద రూపాయలు. ఈ భారానికి ధర్మకర్తలు కూడా కాస్త భయపడ్డారని నాకు తెలిసింది. భవనాన్ని కాపాడేటందుకు అయే ఖర్చుకోసం భవనాన్ని కొన్ని భాగాలుగా అద్దెకిస్తే బాగుంటుందని సూచించారట. భవన ఆవర ణలో కొంతభాగాన్ని అమ్మాలని మరొక సూచన వచ్చిందట. ఈ సూచ నలు న న్నాశ్చర్యపరిచాయి. ఇందులో కొన్ని సూచనలు దానపత్రంలో వున్న ప్రత్యక్షరానికి విరుద్ధంగా ఉన్నాయి. దానపత్రి రాత్ప ర్యానికి ఈ సూచనలన్నీ పూర్తిగా వ్యతిరేకం. ధర్మకర్తలలో నేనూ ఒకణ్ణికనక దీనితో నాకూ కొంత ప్రమేయముంది. ధర్మంగా యిచ్చిన ఆస్తిని ఈవిధంగా ఏమాత్రం దుర్వినియోగపరచినా నేను వ్యతిరే కిస్తాను. మా నాన్నగారు కొన్ని ఆశయాల్ని మనసులో ఉంచుకొని ఈ దానాన్నిచేశారు. ఆయనఆశయాలకు విరుద్ధమైన ఎట్టిచర్యలకు నేను సహించను. ఈ ధర్మం ఆయనఆశయాలకు మాత్రమే ప్రాతి

నిర్వహింపడం లేదు. అంతో యింతో అది ఆయనకు స్మారక చిహ్నంగా ఉంటున్నది. అలాంటప్పుడు నెలకు వందరూపాయలు ఒక లెఖ్ఖలోనివి కావు. ఈ ఖర్చుకంటె, ఆయనఆశయాలు, జ్ఞాపకచిహ్నం నాకు ప్రియతరమైనవి. కనుక భవనాన్ని కాపాడ్డంకోసం వర్కింగు కమిటీ సభ్యులు, ధర్మకర్తలు ఖంగారుపడక్కరలేదు. వర్కింగుకమిటీ కొన్ని మాసాలు ఖర్చులకు మంజూరుచేసిన సొమ్ము అయిపోయిన వెంటనే, భవనాన్ని భద్రపరచే బాధ్యత వ్యక్తిగతంగా నేను స్వీకరిస్తాను. వర్కింగుకమిటీ ఇక డబ్బు మంజూరుచేయనక్కరలేదు. ఈవిషయంలో నా భావాన్ని గౌరవించమనీ. ఆస్తిని విడదీయవద్దనీ, కేవలం అద్దెకోసమే అన్నట్లుగా దానిని అద్దెకివ్వవద్దనీ ధర్మకర్తలను నేను ప్రార్థిస్తున్నాను. ఏదో ఉత్తమప్రయోజనంకోసం, స్వరాజ్యభవనం ఉపయోగపడేటందుకు నేను దాన్ని భద్రపరుస్తూ, దానికయ్యే అన్నిఖర్చులూ భరిస్తాను. స్వరాజ్య భవనం ఇప్పుడున్నస్థితిలో చూచినా వర్కింగుకమిటీసభ్యులకు, అది ఒక భారంగా ఉండడంలేదని నే ననుకుంటాను. అయితే దాని ఖర్చులకు సంబంధించిన సమాచారం నావద్ద లేదు. ఈ భవనభాగంలో ఉంటున్న ఎ. ఐ. సి. సి. కార్యాలయానికిగాను, న్యాయమైన అద్దె నిర్ణయించి నట్లయితే, ఈ అద్దెకంటె కాంగ్రెసు వర్కింగుకమిటీ మంజూరుచేసిన గ్రాంటు ఏమంత ఎక్కువ కాదనుకుంటాను. ఇంతకంటే చిన్న భాగంలోనే వుండే. ఈ అద్దె బాగా తగ్గివుండును. ఇదివరకు ఎ. ఐ. సి. సి. కార్యాలయం మద్రాసులో ఉన్నపుడు మేడమీద ఒక్క గదికిమాత్రమే నెలకు నూటయాభై రూపాయలు అద్దె చెల్లించేది.

ఈ ఉత్తరంలో కొన్నిభాగాలు బహుశా మీకు కష్టం కలిగించ వచ్చును. కాని నా హృదయాన్ని మీవద్ద కప్పిపుచ్చాలని మీరెన్నడూ కోరరుగదా.

ప్రేమగల మీ,
జవహర్.

## 104. మహాత్మా గాంధీవద్దనుంచి

ఆగస్టు 17, 1934

నా ప్రియమైన జవహర్‌లాల్,

మనస్సును కదలించే ఉద్రేకపూరితమైన నీ ఉత్తరం నాకందింది. లేని ఓపికనుసైతం తెచ్చుకొని, దానికి వివరంగా సమాధానం వ్రాయవలసిఉంటుంది. ప్రభుత్వం పూర్తి ఔదార్యాన్ని చూపిస్తుందని నేనాశించాను. అయినప్పటికి నువ్వు విముక్తుడవై ఎదుట కనిపించినందువల్ల కమలకు, అమ్మగారికి ఎంతో మంచి చేకూరింది. మందులవల్ల డాక్టర్లవల్ల యింతటి మంచి చేకూరదు. మామూలుగా నువ్వనుకుంటున్న, ఈ కొద్దిరోజులుమాత్రమే గాక, నిన్నింకా ఎక్కువకాలం జైలుబయట ఉండనిస్తారనుకుంటాను.

నీ ప్రగాఢ మనోవ్యథ నేనర్థంచేసుకున్నాను. నీభావాలను నువ్వు పూర్తిగా, స్వేచ్ఛగా వ్యక్తపరిచావు. అది సహజంగా సబబుగా ఉంది. అక్షరరూపంలోఉన్నదాన్ని, నిశితంగా పరిశీలించి నువ్వింత బాధను, ఆశాభంగాన్ని పొందడానికి నా కంత కారణం కనుపించదు. ఏమీ అంటే నీకూ, నాకూ ఉన్న అనుబంధం అపారమైనది. నా స్నేహభావాన్నినువ్వేమాత్రంకోల్పోలేదని నీకు నేను దృఢంగాచెప్తున్నాను. 1917 లోనూ, అనుపిమ్మటా నేనెలాగున్నానో, ఇప్పుడూ నేనలాగే ఉన్నాను. మన అందరి గమ్యంపట్ల నా కెటువంటి ప్రగాఢమైన వాంఛ ఉండేదో, అప్పుడు నీకు తెలుసును. ఇప్పుడూ నేను అదే వాంఛతో ఉన్నాను. ఆంగ్లభాషలో స్వాతంత్ర్యమనే పదానికి, ఏ అర్థమున్నదో, ఆ అర్థంప్రకారం దేశానికి సంపూర్ణస్వాతంత్ర్యం కావాలని నేను వాంఛిస్తున్నాను. ఈ లక్ష్యాన్నిదృష్టిలోపెట్టుకొని నీకు కష్టంకలిగించిన ఆ తీర్మానాన్నినేను రూపొందించాను. ఆతీర్మానాలను వాటిచుట్టూ వున్న భాషచ్ఛాయలకు నేను పూర్తి బాధ్యతను స్వీకరించక తప్పదు.

ఏకాలానికి ఏది అవసరమో తెలుసుకునే శక్తి నాకు ఉందని నేననుకుంటాను. తత్ఫలితంగా ఈ తీర్మానాలు రూపొందాయి. అయితే

ఇక్కడ అభిప్రాయభేదానికి తావులేకపోలేదు. ఒక లక్ష్యాన్ని ఏపద్ధతి ననుసరించి సాధించాలనే ప్రశ్న ఉండనే ఉంది. లక్ష్యం నా కెంత ప్రధానమో, మార్గంకూడా అంత ప్రధానం. కాని ఒకర్థంలో లక్ష్యం కంటే, మార్గం ఎక్కువ ప్రధానమైనది; ఏమీఅంటే, లక్ష్యాన్ని సాధించే మార్గాలను, మన అదుపులో వుంచుకోవచ్చును. కాని లక్ష్యంపై మన కట్టి అధికారం లేదు. మార్గాలు మన అదుపులోనుంచి జారిపోతే, లక్ష్యం చెదిరిపోతుంది.

"వ్యర్థపరిసంగం" గురించి కావించిన తీర్మానాన్ని నిష్పక్షపాతంగా చదివిచూడు. అందులో సామ్యవాదంగురించి ఒక్కమాటైనా లేదు. సామ్యవాదులకు, తీర్మానంలో ఎంతో ఆదరణ చూపారు. వారిలో కొంతమందిని నేను బాగా ఎరుగుదును. వారుకావించిన త్యాగాలు అల్పమైనవి కావు. కాని మొత్తంమీద వారు అన్నింటికీ ఆందోళనపడతారు. అలా వా రెందుకు పడగూడదు మరి? వారు పరిగెడుతున్నంత రొంవడగా, నేను ముందుకు పడుగెత్తలేనప్పుడు వారిని ఆగమని చెప్పి, నన్ను వారితోపాటు తీసుకువెళ్ళమని అడగవలసివుంటుంది. అక్షరాలా అదే నా వైఖరి. సామ్యవాదమంటే అర్థమేమిటో తెలుసుకుందామని నిఘంటువు పరికించాను. నిర్వచనాన్ని చదవకమునుపు నే నెక్కడ ఉన్నానో, చదివాకకూడా అక్కడే ఉన్నాను.

సామ్యవాదమంటే ఏమిటో సమగ్రంగా తెలుసుకునేందుకు నన్ను ఏ ఏ పుస్తకాలు చదవమంటావు? చదవమని. మసానీ నా కొక గ్రంథాన్నిచ్చాడు. అది చదివాను. ఇప్పుడు నరేంద్రదేవ్ చెప్పిన గ్రంథాన్ని తీరికవేళల్లో చదువుతున్నాను.

వర్కింగుకమిటీ సభ్యులను, నువ్వు తీవ్రంగా విమర్శించావు. వారిభావాలు వారి కున్నాయి. అలా వుంటూనే వారు మనకు సహాయకులైనారు. ఇంతకీ మనసంస్థలో ఎవరి అభిప్రాయాలు చెప్పుకునే స్వేచ్ఛ వారికుంది. వారిమీద విశ్వాసం లేకపోయినట్లయితే, వారిని తొలగించి ఇంకొకరిని నియమించవచ్చును. కాని ఇతరులు కోంపరుపడిన అవస్థ

లను, బాధలను వారు పడలేదని, వారి అశక్తతను చూసి మనం నిందించ గూడదు.

ఒకటి ధ్వంసంచేసినతరువాత, ఇంకొకటి నిర్మించడం అవసరం. కనుక ఇప్పుడే—మనం కలుసుకుంటామో, కలుసుకోమో—నన్నేంచేయమంటావో సరిగ్గా చెప్పు. నీ భావాలను నే నే గ్రంథం చదవడంవల్ల అర్థంచేసుకోగలనో తెలియజేయి.

ఇక ట్రిస్టునుగురించి నాదొకమాట. నే నప్పుడులేను. వల్లభాయ్ ఉన్నాడు. నీ వైఖరిలో క్రోధం ద్యోతకమౌతోంది. ధర్మకర్తలు తమ ధర్మాన్ని నిర్వర్తిస్తారని నువ్వు నమ్మాలి. ఎక్కడో, ఏదో పొరపాటు జరిగిందని నే ననుకోను. దానినిగురించి పరిశీలించడానికి నాకు తీరిక లేకపోయింది. ఇప్పుడు ఆ పత్రాలన్నిటినీ చదువుతాను. మిగిలిన ధర్మకర్తలు నీ భావాలను పూర్తిగా మన్నిస్తారు. ఈ వాగ్దానంచేస్తూ నేను నిన్నొకటి కోరుతున్నాను. ఈ విషయాన్ని నువ్విపుడు తీసుకున్నట్లుగా వ్యక్తిగతంగా ఇకముందు తీసుకోగూడదు; నాన్నగారి జ్ఞాపకచిహ్నంపట్ల నువ్వెంత గౌరవంచూపుతున్నావో, అంత గౌరవం మిగిలిన ధర్మకర్తలకు ఉన్నదని నువ్వు భావించాలి. నాన్నగారిస్మారకానికి, దేశం సంరక్షకురాలుగా ఉంటుంది. అందులో నువ్వు ఒక సంరక్షకుడివి.

ఇందూ కులాసాగా ఉందని, తన నూతన జీవితంపట్ల ఆసక్తి చూపుతున్నదని అనుకుంటాను. అన్నట్టు కృష్ణ ఎలా వుంది?

ప్రేమతో,
బాపు.

105. మహాత్మా గాంధీనద్దనుంచి,

వార్ధా.
నవంబరు 22, 1934

నా ప్రియమైన జవహర్‌లాల్,

నీ యోగక్షేమాలను తెలియచేయవలసినదిగా కోరుతూ కొన్నాళ్ళ క్రితం నే నొక ఉత్తరం పంపాను. అమ్మగారు నిన్న ఇక్కడకు

వచ్చారు; కమల ప్యాకెట్టుతో పంపించిన ఉత్తరంతప్ప, నీ కే ఉత్తరం అందనట్లు ఆవిడ నాకు చెప్పారు. నీ ఉత్తర ప్రత్యుత్తరాలపన్న నిబంధన లేమిటో దయవుంచి నాకు తెలియజెయ్యి. నువ్వెలావున్నావో, ఎలాగ పొద్దుపుచ్చుతున్నావో తెలుసుకోగోరుతున్నాను.

ప్రేమతో,
బాపు.

## 106. రవీంద్రనాథ్ టాగూర్‌నద్దనుంచి

[నా భార్యఆరోగ్యం నానాటికీ క్షీణిస్తూరావడంవల్ల, వైద్యం నిమిత్తం ఆమెను యూరోప్కు తీసుకువెళ్ళాలని అనుకున్నాను. నే నప్పుడు ఆల్మోరా జైలులో ఉన్నాను; భవాలీశానిటోరియంలో వున్న ఆమెను కలుసుకొని వీడ్కోలు చెప్ప డానికి నన్ను ఒక రోజు మాత్రమే జైలునుంచి విడుదలచేశారు; శాంతినికేతనంలో వుంటున్న నా కుమార్తె ఇందిర, వాళ్ళ అమ్మతో యూరోప్కు పయనమై వెళ్ళింది.]

"ఉత్తరాయణం"
శాంతినికేతనం, బెంగాలు,
ఏప్రియల్ 20, 1935.

నా ప్రియమైన జవహర్లాల్,

ఇందిర మా ఇక్కడి కుటుంబంవలె వుండడంవల్ల ఆమెను వదిలి వుండడం కష్టమనిపించింది; భారమైన హృదయంతో ఆమెకు వీడ్కోలిచ్చాము. ఆమె నడవడిని నేను జాగ్రత్తగా గమనిస్తూవచ్చాను; మీ రామెను పెంచిన పద్ధతి చూసి మిక్కిలి ఆనందించాము. ఇక్కడ ఉపాధ్యాయులందరూ ఆమెను గౌరవిస్తూవుండేవారు; ఆమె విద్యార్థులతో కలిసికట్టుగా వుండేది; పరిస్థితులు అనుకూలంగా వుంటాయని, ఆమె తిరిగి యిక్కడకు వస్తుందని, విద్యను అభ్యసిస్తుందని నే నాశిస్తున్నాను.

నీ భార్యకు జబ్బు ఎక్కువైందని, ఆవిడ చాలా బాధపడుతున్నారని విని నే నెంత విచారించానో చెప్పలేను. సముద్రప్రయాణంవల్ల, యూరపులో చికిత్సవల్ల ఆవిడకు స్వస్థత చేకూరుతుందని, అనతికాలంలోనే ఆవిడకు ఎప్పటివలె హాయిగావుంటుందని ఆశిస్తున్నాను.

ప్రేమపూర్వకాశీర్వచనములతో

మీ,

రవీంద్రనాథ్ ఠాగూరు.

## 107. మహాత్మా గాంధీవద్దనుంచి

[ఈ ఉత్తరం, దిగువ అచ్చొత్తించిన మరికొన్ని ఉత్తరాలు, నేను జర్మనీలో వుండగా నా కందాయి. నా భార్యఆరోగ్యం క్షీణించడంవల్ల, ఆల్మోరా జైలులోవున్న నన్ను అకస్మాత్తుగా విడుదల చేశారు. అప్పుడామె జర్మనీలో బ్లాక్‌ఫారెస్టుశానిటోరియంలోవుంది. విడుదలైనవెంటనే నే నామెను చూడ్డానికి బయలుదేరి వెళ్ళాను.]

వార్ధా, అక్టోబరు 3, 1935.

నా ప్రియమైన జవహర్లాల్,

గడియారం ఎంత క్రమంగా వేళ చూపిస్తుందో అంత క్రమంగా నీ ఉత్తరాలు వేళ తప్పకుండా నాకు అందుతున్నాయి. ఇది నా కొక వరప్రదానంవంటిది.

కమలకు స్వస్థత చేకూర్చడానికి గట్టి ప్రయత్నాలు చేస్తున్నారు. అవి ఫలిస్తాయి. ప్రకృతివైద్యంమీద నాకు అమిత విశ్వాస మున్నట్లు నీవెరుగుదువు. జర్మనీలోకూడా ప్రకృతివైద్యశాలలు ఎన్నోవున్నాయి. ప్రకృతివైద్యంవల్ల బాగుపడేస్థితిలో యిప్పుడు కమల లేదేమో. ఆ స్థితి గడిచిపోయివుండవచ్చును. కాని దానివల్ల నయమౌతుందేమో, ఎవరు చెప్పగలరు? శస్త్రచికిత్సవల్లకాని నయంకావనుకున్న కేసులు ప్రకృతచికిత్సవల్ల కుదరడం నాకు తెలుసును. ఎందుకైనా మంచిదని, నా అనుభవం నీకు తెలియచేశాను.

వచ్చే ఏడాది కిరీటధారణగురించి నీవువ్రాసిన ఉత్తరం నా కుత్సాహం కలిగించింది. నీ అనుమతి నాకు లభించినందుకు, నే నెంతో

సంతోషిస్తున్నాను. దేశానికిది సరియైనదని, యింతవల్ల అనేక కష్టాలు గట్టెక్కుతాయని నేను విశ్వసిస్తున్నాను. ఇదివరకు సువ్యవస్థితమైన లాహోరులో అధ్యక్షతవహించడం వేరు, ఇకముందు లక్నోలో అధ్యక్షతవహించ బోవడంవేరు, రెండింటికీ ఎంతో భేదంవుంది. ఏరీత్యా చూచినా లాహోరులో ప్రయాణం సుకరంగా సాగింది: లక్నోలో పరిస్థితులు అంత సుకరంగా వుండవు. కాని ఆ పరిస్థితులను సమన్వయించుకుని, నిలబడగల వ్యక్తి నీవు తప్ప ఇంకొకరు నాకు కనిపించడంలేదు. ఈ గురుతర బాధ్యతను వహించడానికి కావలసిన శక్తిని భగవంతుడు నీకు ప్రసాదించుగాక.

నీ గ్రంథాన్ని త్వరత్వరగా చదువుతున్నాను. అధ్యాయాలు నాకు మిక్కిలి ఆసక్తికరంగా వున్నాయి. ఇప్పుడింతకంటె నే నెక్కువ వ్రాయకూడదు.

అందరికీ నా ప్రేమాభివందనాలు

బాపూ.

108. సుభాస్‌చంద్రబోస్‌నద్దనుంచి

హోటలు బెజర్‌న్షెఫ్,
హోఫ్‌గస్టీన్.
అక్టోబరు 4, 1935

నా ప్రియమైన జవహర్,

మీరు రెండు మూడవ తేదీలలో వ్రాసిన ఉత్తరాలు అందాయి.

ఫ్రిడ్‌బర్గ్ నివేదిక చదివి నే నెంతో సంతోషించాను. ఆయన వైద్యశాస్త్రవిజ్ఞానం రోగికి సహాయపడుతుందని, ప్లూరసీని నయం చేస్తుందని నే నాశిస్తున్నాను. శ్రీమతి నెహ్రూను వేరొకస్థలానికి మార్చడంగురించి ఆయనఅభిప్రాయం మీరు కనుక్కున్నారో లేదో నాకు తెలియదు. ప్రస్తుత కష్టసమయంలో నే నేమాత్రం సహాయపడ గలనని మీరనుకున్నా, వెంటనే నాకు కబురుపెడలారని, అందుకు సంకోచించరని అనుకుంటున్నాను.

నా గ్రంధంలోని ఒక దోషాన్ని మీరు పేర్కొన్నందుకు నేను మిక్కిలి కృతజ్ఞుణ్ణి. మీ రన్నట్లు, యథార్థతనుగురించి అనేక దోషాలు గ్రంథంలో వుండడాని కవకాశం లేకపోలేదు. అయితే ఈ దోషాలు ఏమంత చెప్పుకోతగ్గవి కావని నే ననుకుంటాను. గ్రంథాన్ని వ్రాస్తున్నపుడు సంస్పృష్టవశాత్తూ, నే ననేకవిషయాలు జ్ఞాపకంతెచ్చుకోవలసి వచ్చింది. నా జ్ఞాపకమే నాకు శరణ్యమైంది తప్ప, యింకొక ఆస్కారం లేకపోయింది. ముఖ్యంగా తేదీలను జ్ఞాపకంతెచ్చుకోవడం మరీ కష్టమైపోయింది. ఆ దశనుగురించి వ్రాయబడిన గ్రంథాలు నాకు లభించలేదు; పోనీ ఎవరితోనైనా సంప్రదిద్దామన్నా అదీ సాధ్యపడలేదు. పండిట్ మోతీలాల్జీ ఏతేదీన చనిపోయారో జ్ఞాపకంతెచ్చుకుందామని నే నెంతో సేపు అవస్థపడ్డాను; కాని ప్రయోజనంలేకపోయింది. ప్రూఫులు అజాగ్రత్తగా చూడడంవల్ల అచ్చుతప్పులుకూడా అనేకం దొర్లాయి. ఒక్కసారే నేను ప్రూఫులు చూశాను; అందులోనూ కొన్ని ప్రూఫులు, నేను భారతదేశానికి ప్రయాణసన్నాహంలో వుండడంవల్ల మరీ తొందరగా చూశాను. అదీకాక, ఈ గ్రంథాన్ని నే నెంతో ఒత్తిడిమీద వ్రాశాను; అప్పుడు నా ఒంట్లో ఆరోగ్యంగాలేదు కూడాను; మీరు పేర్కొన్న దోషాలను నేను జాగ్రత్తగా గుర్తుపెట్టుకొని, ద్వితీయముద్రణలో సవరించుకుంటాను;

'మాంఛెష్టర్ గార్డియన్' పత్రికకు నేను వ్రాసిన లేఖాప్రతిని దీనితోపాటు మీకు పంపిస్తున్నాను. ఇది అక్టోబరు మొదటితేదీన పత్రికలో అచ్చుపడింది.

అబిసీనియాలో యుద్ధం ఆరంభమయిందన్న వార్త మీ కీసరికి చేరివుంటుంది. ఇది ఇంగ్లండు ఇటలీలమధ్య యుద్ధంగా పరిణమిస్తుందా పరిణమించదా అన్న ప్రశ్న యిక తేలవలసివుంటుంది.

మీ అభిమానపాత్రుడు,
సుభాష్,

109. రవీంద్రనాథ్ ఠాగూర్ దగ్గరనుంచి

శాంతినికేతనం,
అక్టోబరు 9, 1935.

నా ప్రియమైన జవహర్లాల్,

నీ సతీమణి అనారోగ్యాన్నిగురించి దినపత్రికలలో వెలువడు తున్నవార్తలను ఆందోళనతోనూ. ఆమెకు నిమ్మళించిందనే వార్త వింటామనే ఆశాభావంతోనూ, వాటిని మేం నిత్యం చదువుతున్నాం; ఆమె తనజీవితంలో అనేక దుఃఖాలను చవిచూస్తూ అద్భుతమైన మనో బలాన్ని ప్రదర్శిస్తోంది. ఆ శక్తే ఆమెకు తోడ్పడుతోంది. నా ప్రేమాను రాగాలను ఆమెకు అందింపకోరుతున్నాను.

శీతకాలం వచ్చేసరికి విశ్వభారతి తన పేదరికాన్ని తాను, నాకు తెలియజేస్తుంది. నిధులను వసూలుచేసేందుకు నేను ఆకాలంలోనే బయటకు కదులుతాను. ఇది నాకు అసహ్యాకరమైన పరీక్ష. మనుష్యులతో కులాసాగా కాలక్షేపంచేయడమనే నెపంతోనో, ఏమాత్రం దాతృత్వంలేని మనుష్యుల దాతృత్వానికి విజ్ఞప్తిచేయడంద్వారానో యీ నిధులను సేకరించవలసివస్తోంది. ఎలాగైతేనేం ఇలాగ బిచ్చమడగడం చాలా అసహ్యాకరంగా వుంది. అయితేనేమి, అణకువతో కూడిన, నిరర్థకమైన యీ ముళ్లకిరీటాన్ని ఎట్టి ఫిర్యాదుచేయకుండా దేశంకోసం కృషిచేస్తున్నాననే ఆనందంతో స్వీకరించడానికి నేను ప్రయత్నిస్తున్నాను. మీ వ్యక్తిస్వేచ్ఛకంటే మీ జీవితంకంటె ప్రియతరమైనదిగా భావిస్తున్న లక్ష్యంకోసం మీఅంతట మీరు ఎన్నిబాధలు పడుతున్నారో నాకు తెలుసును. ఆ విషయం దృష్టిలో వుంచుకుని, నన్ను నేను ఓదార్చుకోవచ్చుకదా? కాని లుబ్ధులైన పోషకుల స్వల్ప మాత్రపు దయాధర్మభిక్షకోసం, నాశక్తినంతటినీ వృథాపుచ్చడంకంటె, ఆశాభంగంవల్ల కృంగిపోవడంకంటె, వీటికి దూరంగా ఉంటూ ప్రశాంతమైన మనస్సుతో కాలంగడపటం మంచిదేమో అని అప్పుడప్పుడు నా కనిపిస్తూవుంటుంది. నిధిసేకరణకు మాటసహాయం చేయ

వలసినదిగా నేను మహాత్మాజీని కోరాను. ఆయన అందుకంగీకరించారు. ఆయనపలుకుబడివల్ల ఊహింపజాలని సత్ఫలితాలు చేకూరవచ్చును. సర్ తేజ్ బహదూర్ కూడా తోడ్పడడానికి వాగ్దానంచేశారు. ఈ విషయం నేను మీకు చెప్పవలసివుంది.

ప్రియమైన ఇందిరకు దయవుంచి నన్నొకసారి జ్ఞాపకంచేయండి. ఎప్పుడో ఒక రోజున మా ఆశ్రమాన్ని సందర్శించే అవకాశం ఆమెకు కలుగుతుందని మమ్మల్ని ఆనందపడుస్తూ తాను ఇక్కడ గడిపిన ఆకొలది మాసాలను, రోజులను, స్మృతులను జ్ఞాపకంతెచ్చుకుంటుందని నే నాశిస్తున్నాను.

ప్రేమతో,

మీ,
రవీంద్రనాథ్ ఠాకూర్.

110. ఇ. స్టాన్డన్ వద్దనుంచి

ది వికారేజ్,
హారో,
నవంబరు 5, 1935.

ప్రియమైన నెహ్రూ,

వచ్చే శనివారం ఒంటిగంటకు మీరు యిక్కడికివచ్చి మాతోకలసి భోజనంచేయడానికి ఏమైనా అవకాశముంటుందా? మళ్ళీ మిమ్మల్ని చూడడం నా కెంతో ఆహ్లాదకరంగా వుంది. హారో స్కూల్లో మీరు చదువుకుంటున్నపుడు, చిన్నతనంలో తీసిన ఫొటోగ్రాఫ్ నాదగ్గరవుంది. అది మీకు చూపిస్తాను. ఫొటోలో ఉల్లాసకరమైన చూపులతో మీరు కనిపిస్తున్నారు. నా ఆశ్రమం పర్వతశిఖరంమీద వుంది. నా భార్య మిమ్మల్నొకసారి చూడాలని కుతూహలపడుతోంది.

ఇప్పుడు నేను స్కూల్లో మాష్టరుగా లేను. మతగురువుగా వుంటున్నాను.

మీ విశ్వాసపాత్రుడు,
ఇ. స్టాగ్డన్.

111. హెచ్. జె. లాస్కీవద్దనుంచి

దీ లండన్ స్కూల్ ఆఫ్ ఎకనమిక్స్ అండ్ పొలిటికల్ సైన్స్,
లండన్, డబ్ల్యు. సి. 2

ఆంతరంగికము, రహస్యము నవంబరు 6, 1935

నా ప్రియమైన నెహ్రూ,

హాలిఫాక్సును కలియవలసిందనీ, ఆయనతో భారతదేశపరిస్థితిని చర్చించవలసిందనీ మిమ్మల్ని వత్తిడిపెడుతున్నట్లుగా నాకు తెలిసింది. హాలిఫాక్స్ స్పష్టంగా, వ్రాతమూలకంగా కోరితే తప్ప అలా మీరు చేయరని నే నాశిస్తున్నాను.

అలా కాకపోయినట్లయితే, దానికి ఎన్నో అపార్థాలు కల్పించబడతాయి. అది మీకు ఎంతో హాని కలుగజేస్తుంది.

అత్యంత గౌరవంతో,
మిక్కిలి విశ్వాసపాత్రుడు,
హెచ్. జె. లాస్కీ.

112. సి. యఫ్. ఆండ్రూస్‌వద్దనుంచి

పెంబ్రూక్ కాలేజి,
కేంబ్రిడ్జి,
నవంబరు 6, 1935

నా పి్రియమైన జవహర్‌లాల్,

అక్కడక్కడ శీర్షికలనుబట్టి గ్రంథసంపుటాలు రెండింటినీ చదవడం ఆరంభించాను. అయితే మీరు వ్రాసినదానికి నే నిప్పుడు న్యాయం కలుగజేస్తాను. సంపుటాలను జాగ్రత్తగా చదివి, వేటిని ఎంచుకుంటే మంచి ఎన్నికవుతుందో 'అలెన్ అండ్ అన్‌విన్' ప్రచురణకర్తలకు సూచిస్తాను. ఇలాచేయడానికి సాధ్యపడుతుందని నా నమ్మకం. ఎడింబరోకునేనుఎలాగూ వెళ్లివస్తాను కనుక రైలులో నాకు రెండురోజులు వ్యవధివుంది. అప్పుడు యోపని చేయడం చాలా తేలిక.

సాయంకాలమల్లా సంపుటాలను నేను తిరగవేస్తూనేవున్నాను. కాని వాటిలోని భాగాలను ఎన్నికచేయడం చాలా కష్టమైంది. అంతేకాదు; ఈ ఎన్నిక భాగాల పుస్తకానికి తగినపేరుపెట్టడంకూడా కష్టమైనపని. 'అలెన్ అండ్ అన్‌విన్' ప్రచురణకర్తలకు మీ రిచ్చిన ఆత్మకథకు సంబంధించిన దోగట్టా ఇటీవలిభారతదేశపత్రికపై. మీకుగలఅభిప్రాయాలతో ఏంతవరకు సరిపోతుందో నాకు తెలియదంలేదు. ఈ విషయంలో 'అలెన్ అండ్ అన్‌విన్' ప్రచురణకర్తలు నేడో రేపో తప్పకుండా నన్ను సలహా అడుగుతారు. అప్పుడు మీ ప్రాతప్రతులను చదివే అవకాశం నాకు లభిస్తుంది. అవి చదవవలసినదిగా, నన్నా మీరు కోరరాదని నాకు తెలుసు. పని పూర్తికాగానే ఈ ఎన్నికైనభాగాలు మీకు అందుతాయి. ఈ ఎన్నికభాగాలలో, మీ మనోభావాలూ, మీ వ్యక్తిత్వం చక్కగా వ్యక్తమైనట్లు, మీరు మీరుసంతృప్తిచెందడం చాలా ముఖ్యం. ఈ భాగాలు అలా ఉండేటట్లు ఎంచుకోవడం మీ వంతు. నేను కేవలం కొన్ని సూచనలు మాత్రమే చేయగలను.

ఈ గ్రంథప్రచురణవల్ల పాశ్చాత్యదేశానికి ఎనలేని విలువ చేకూరుతుంది. పశ్చిమదేశాలు సులభంగా వేటిని అర్థంచేసుకుని అనుసరించగలవో సహజంగా తెలిసిన ప్రసిద్ధపురుషులు మీరొక్కరే. ఈ విషయం మనం పూనాలో కలుసుకున్నపుడు నేను మీతో చెప్పినట్లు నాకు జ్ఞాపకం. బాపూజీ చనలను వాగాత్తు ప్తీకరించి,వాటినిమళ్లీ మళ్లీ వివరించవలసివచ్చింది. రోమారోలా అత్యంత ప్రతిభావంతుడు కనుక గాంధీజీహృదయాన్ని విప్పిచెప్పగలిగాడు. ఇలాగ చేసినతరువాత మిగతాపని నా కెంతో సులభమైపోయింది. కాని బాపూను వ్యాఖ్యానించడం ఎప్పుడూ కష్టమే. ఆయనేకాదు, గురుదేవ్‌కూడా అంతే. పద్యంనుంచి గద్యానికి మళ్ళినపుడు గురుదేవుడు ఎవరిచూపుకు అందడు. ఈమధ్యనే డాక్టరు శీతారామయ్యవ్రాసిన కాంగ్రెసుచరిత్ర అనే గ్రంథం ఆంగ్లపాఠకుల కేమీ పనికిరానిదిగా వుంటుంది. భారతీయపదాలనుగురించి స్వచ్ఛందంగా ఆయన కెంతో తెలిసినట్లు ఆయనభావిస్తున్నారు.ఆయన ఒకవిషయాన్ని ముక్తసరిగా చెప్పక, ఊరికే అనవసరంగా విస్తరించి వ్రాస్తూవుంటారు. కాని ఈ

గ్రంథం అలాకాదు. ఇందులోఉన్న 'కారాగార గవాక్షములనుంచి' అనే భాగాన్ని చదివినవెంటనే, ఇది పాశ్చాత్యదేశాల పాఠకులకు ఎంతో అభిరుచి, ఆసక్తి కలిగిస్తుందని ఇట్టే గ్రహించాను; ఇలాంటి ఆసక్తి కలిగించే విషయాలు ఈ రెండు సంపుటాల్లోనూ వున్నట్లు, చూచిన వెంటనే నేను గ్రహించగలిగాను. అయితే వీటిని జాగ్రత్తగా ఒక క్రమ పద్ధతిలో ఎన్నికచేసి ప్రచురించవలసివుంటుంది.

అంటే దాని అర్థం ఎంతో కష్టపడవలసివుంటుందన్నమాట. వెంటనేకాదు, ఈసారి మీరు ఇంగ్లండువచ్చినపుడు మీతోవుండి, మీ సహాయాన్ని పొందుతాను.

ఇది నే నెంత అవసరమని భావిస్తున్నానో,నాకెంత ఆసక్తిఉన్నదో ఈ ఉత్తరంవల్ల మీకు బోధపడుతుంది. ఎడింబరోనుంచి తిరిగివచ్చిన తరువాత, మీకు బేడెన్‌వీలర్ చిరునామాకు ఉత్తరం వ్రాస్తాను.మీతోపాటు నేను కేంబ్రిడ్జిలో ఉండకపోవడం నాకు చాలా ఆశాభంగకరంగా వుంది. అక్కడ కొందరు యువకులు ఆర్థికశాస్త్రవేత్తలు ఉన్నారు. వారిని మీరు కలుసుకుంటే బాగుంటుందని నే నమకున్నాను. ఈసారి మీరు వచ్చినపుడు కలుసుకోదగిన యువకులు యింకా ఎవరెవరున్నారో తెలుసుకునేందుకు సులువౌతుంది.

మీ అభిమానపాత్రుడు,
చార్లీ.

113. సి. యఫ్. ఆండ్రూస్ వద్దనుంచి

పెమ్బ్రోక్ కాలేజి,
కేంబ్రిడ్జి
నవంబరు 7, 1935.

నా ప్రియమైన జవహర్లాల్,

మీ 'ప్రపంచ చరిత్ర'ను నేను చదువుతూవుంటే నాకొక గొప్ప అభిప్రాయం కలిగింది. అది మీకు తెలియచేద్దామనుకుంటున్నాను.

(అ) చైనా భారతదేశాల నాగరికతలు రెండూ - తమ సహజ మనఃప్రేరేపణవల్ల "పాశవికశక్తి" అనాగరికమైనదని, హేయమైనదని త్యజించి వ్యాకులపడ్డాయి. ఆ నాగరికతలలో ఏదో మౌలికమైన బలహీనత వుండడంవల్ల అవి అణచబడ్డాయి; లొంగిపోయాయి.

(ఆ) "పాశవికశక్తి"ని ఎట్టి సంకోచమూ లేకుండా స్వీకరించిన రెండు నాగరికతలూ—యూరోపు, ఇస్లాంలు - ఇంకొకవిధంగా వ్యాకులపడ్డాయి. శాంతికాముక నాగరకతలలో దుర్బలత్వం పొడచూపగానే, వాటిని అవి అధిగమించగలిగాయి.

అయితే. ఏ శాంతికాముక నాగరకత అయినా వ్యాకులపాటు చెందుతూ, అంతకంటె అధిక పాశవికమైన ప్రజలచేత అణగద్రొక్కబడకుండా వుండగలదా? నాకు ఆశ్చర్యంగా వుంది!

ఈ విషయాన్నిగురించి బహుశా మీరు వేరొకచోట చర్చించారనుకుంటాను. దీనిని మీతో చర్చించడానికి నేను కేంబ్రిడ్జి వచ్చివుంటే బాగుండును. ఇది చాలా సాధారణమైన ప్రశ్న అనుకుంటాను. హరిజన్ పత్రికలో బాపూసమాధానం నేను చూశాను. కాని మొత్తం నాగరికతను విషయబద్ధంగా శాస్త్రీయదృక్పథంతో పరిశీలించినపుడు, నా కది ఎంతమాత్రమూ ఇంకొకదానికంటే తక్కువగా కనిపించడంలేదు, సాత్విక సిద్ధాంతాలు నైతికదుర్బలత్వానికి దారితీస్తాయని ముసలోనీ అంటున్న మాటలు నిజమైనవేనా?

ఆదరాభిమానాలతో మీ,

చార్లీ

వీటికి సమాధానాలు వ్రాయడానికి మీ రిప్పుడు శ్రమతీసుకోకండి; ఎప్పుడో ఒకప్పుడు మీరు నాకు ఉత్తరం వ్రాస్తున్నపుడు వీటినిగురించి మీ రేమనుకుంటున్నారో తెలియచేయండి,

114. లోధియన్‌ప్రభువునద్దనుంచి

88 సెయింట్ జేమ్స్‌స్ట్రీట్,
లండన్, యస్. డబ్ల్యు. 1,
నవంబరు 8, 1935

ప్రియమైన పండిట్ జవహర్‌లాల్‌నెహ్రూ,

నా స్నేహితుడు ఎడ్వర్డు థాంప్సన్, మీ రిప్పడు ఇగ్లండులో వున్నట్లుగా నాకు తెలియచేశాడు. నే నొచ్చి మిమ్మల్నొకసారి కలుసుకో వచ్చునా, లేక భారతదేశానికి తిరిగివెళ్ళేలోపున నన్ను కలుసుకునేందుకు మీకు అవకాశంఉంటుందా? ఉంటే ఒకసారి మాయింటికి తేనీటి విందుకు రండి. చాలా సంవత్సరాలనుంచి మీరచనలను, మీ వ్యాసాలను నేను జాగ్రత్తగా చదువుతున్నాను. భారతదేశ పరిస్థితులను గురించి మీతో ముచ్చటించాలని నా కెంతో కుతూహలంగా వుంది. దురదృష్ట వశాత్తు నే నిపుడు సాధారణ ఎన్నికలకార్యక్రమంలో మునిగిఉన్నాను. ఈరాత్రే నేను కార్న్‌వాల్ వెళ్ళవలసివుంది. ఆదివారంఉదయం నేను లండనుమీదుగా వెడతాను. తిరిగి మంగళవారం మధ్యాహ్నం యిక్కడికి చేరుకుని బుధవారం ఉదయంవరకు ఉంటాను. ఈరోజుల్లో ఎప్పుడైనా మిమ్మల్ని నేను కలుసుకోవచ్చునా, లేక మీరే కాస్త శ్రమతీసుకుని ఇంగ్లండులోని అతి సుందరమైన ఎలిజిబెతెన్‌హౌస్, బ్లిక్లింగ్‌హాల్, నార్‌ఫోక్‌కు వస్తారా? అక్కడ ఒకరాత్రి హాయిగా గడపవచ్చు. నే నక్కడ ఒక్కణ్ణే వుంటాను. రోజూ సాయంత్రం ఎన్నికల ఉప న్యాసాలివ్వడానికి చుట్టుపక్కల గ్రామాలకు వెళ్లినా రాత్రి యింటికి చేరుకుంటాను. సౌందర్యమయమైన పరిసరాలమధ్య, అక్కడ మీకు చక్కటి విశ్రాంతి లభిస్తుంది. తేజ్‌బహదూర్ ఎప్పుడువచ్చినా ఇక్కడ నాతోనే కాలంగడుపుతారు. ఇది నార్విచ్‌కి పదిహేనుమైళ్ళ దూరంలో వుంటుంది. మిమ్మల్ని తీసుకువచ్చేందుకు నార్విచ్‌కి కారు పంపుతాను. దురదృష్టవశాత్తు రేపు నా కార్యాలయం తెరచివుండదు. కాని వైట్‌హాల్ 2251 కి తంతియిస్తే, నా కది ఆదివారంఉదయం అందుతుంది. లేదా

సోమవారం ప్రొద్దున్న పదిగంటలతరువాత, అన్నివేళలా నా కార్యదర్శి 17, వాటర్లూ ప్లేస్‌లో ఉంటాడు. అతనికి మీరు కబురుపెట్టవచ్చును.

మీ విశ్వాసపాత్రుడు
లోధియన్,

పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ,
మౌంట్ రాయల్,
మార్బుల్ ఆర్చి,
డబ్ల్యు, 2.

115. లార్డు లోధియన్ నద్దనుంచి,

బ్లిక్లింగ్‌హాల్,
ఐల్‌షాం, నార్‌ఫోక్,
డిసెంబరు 6, 1935.

ప్రియమైన శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ,

మీరు భారతదేశానికి తిరిగివెళ్ళేలోపున, మనిద్దరం కలిసి మాట్లాడుకునేందుకు అవకాశం చిక్కుతుందని నే నెంతో ఆశిస్తున్నాను. దురదృష్టవశాత్తు జనవరినెలలో సాధ్యమైనంత త్వరగా, నేను అమెరికా వెళ్ళవలసివుంది. అందువల్ల సంవత్సరారంభంలో మీరు ఇంగ్లండుకు వచ్చే అవకాశం కలుగుతుందో, కలగదో అని ఆలోచిస్తున్నాను. అలాంటి అవకాశమే కలిగితే మీరు మిస్ అగతాహారిసన్‌తో కలసి యిక్కడికి రండి. మీ రిక్కడ రెండుపూటలు గడపవచ్చును. ఇంగ్లండులో ఉన్న అతి సుందరమైన గృహాల్లో యిది ఒకటి. మనోజ్ఞమైన తోటలల్లో యిది ఒకటి. ఇక్కడఉంటే మనకు లండనుపట్టణపు అడావిడిలో పంపర్కముండదు. నిన్న నేను లార్డు హాలిఫాక్సును కలిశాను. మీరు బయలుదేరి వచ్చినట్లయితే తా నెంతో సంతోషపూర్వకంగా యార్క్‌షైర్‌నుంచి, బ్లిక్లింగుకు వస్తాననీ, వచ్చి మీతో ఆరాత్రి హాయిగా గడుపుతాననీ లార్డు హాలీఫాక్సు నాతో అన్నారు.

మనం కలుసుకోవడం సాధ్యమౌతుందనే హృదయపూర్వకంగా ఆశిస్తున్నాను. ఈమధ్య భారతదేశంలో జరిగిన సంఘటనలపట్ల సాధా

రణ రాజకీయసమస్యలపట్ల మన అభిప్రాయాలు బాగా భేదిస్తాయని నాకు తెలుసును. కాని మంచో చెడ్డో ఆంగ్ల భారతదేశాల భవిష్యత్తులు ఒకదానితో ఒకటి పెనవేసుకున్నాయి; కనుక భారతదేశవ్యవహారాల పట్ల శ్రద్ధాసక్తులుగల మావంటి ఆంగ్లదేశీయులు కొంతమంది, భారత దేశవిధానాన్ని, హృదయాన్ని భవిష్యత్తును రూపొందిస్తున్న మీవంటి యువనాయకుల భావాలను స్వయంగా తెలుసుకోవడం అత్యంత ప్రధాన మని నేను భావిస్తున్నాను. అలాగే మీరూ మాలో కొంతమంది అభిప్రాయాలను స్వయంగా తెలుసుకోవడం అత్యంత ప్రధానమని భావిస్తారనుకుంటాను. అత్యద్భుత ప్రాధాన్యంగల పవిత్రమైన లక్ష్యాన్ని అర్థించి మానవజాతి ఈనాడు పయనిస్తోందని నేననుకుంటున్నాను. పాత అంతర్జాతీయవ్యవస్థ, ఆర్థికవిధానం యిప్పుడు ఛిన్నాభిన్నమౌతున్నాయి. సాధారణంగా విప్లవయుగాలలో నూతన ప్రపంచవ్యవస్థాస్వరూపాన్ని చాలా కొద్దిమంది మాత్రమే చూడగలుగుతారు. చాల కొద్దిమందిమాత్రమే దానిని చేరుకునే సరియైనమార్గాన్ని దర్శించగలుగుతారు. ఇలా దర్శించటంలో, ఏకాభిప్రాయం సాధించడం కష్టం. పురోగమనం ఎంతో మందంగా దుఃఖకరమైన సంఘటనలతో నిండివుంటుంది. స్నేహపూర్వకమైన, లాంఛనప్రాయమైన, వ్యక్తిగతసంబంధాలు, సద్యః ఫలితాన్ని ఏకాభిప్రాయాన్ని చేకూర్చలేకపోయినా, కొంతకాలానికైనా అవి పరస్పర అవగాహనకు దోహదపడవచ్చును.

కనుక నేను సూచించిన సమయానికి మీరు ఇంగ్లండు చేరుకునేందుకు అవకాశం చిక్కుతుందని ఆశిస్తున్నాను. జనవరి 4వ తేదీన ఇక్కడనుంచి నౌక బయలుదేరుతుంది. అటుపిమ్మట పదిరోజులదాకగాని మంచి నౌక నాకు దొరకదు. అందువల్ల నాలవతేదీ రేవారి ఇంగ్లాండ్రోజుకు నా ప్రయాణం సాధ్యమైతే వాయిదావేయదలచనని నే నాతురపడుతున్నాను. మీరు జనవరి మొదటితేదీన ఇక్కడికివస్తే బాగుంటుంది. జనవరి రెండవతేదీ మంగళవారంనాడు లార్డు హాలీఫాక్సు ఇక్కడికివచ్చి ఆరాత్రి గడుపుతారు. మనం ఇక్కడనుంచి బయలుదేరి శుక్రవారం మధ్యాహ్నం లండన్ చేరుకోవచ్చును. ఆ మరునాడు నేను నౌకలో

ప్రయాణం సాగించవలసివచ్చును. లేదా మీరు, మిస్ హారిసన్ మిగిలినవారు ఇక్కడ ఆ వారమల్లా గడిపితే నాకు మరీ సంతోషంగా వుంటుంది. మీరు వస్తున్నపుడు, మీవెంట మీ కుమార్తెను తీసుకువస్తే బాగుంటుందని నే నాశించాను. కాని ఆవిడ అక్కడే వుండక తప్పదని నాకు తెలియవచ్చింది. మీ నిర్ణయాన్ని సాధ్యమైనంత త్వరలో నాకు తెలియజేస్తే నేను నా కార్యక్రమాన్ని రూపొందించుకుంటాను.

మీ విశ్వాసపాత్రుడు,

లోథియన్,

జవహర్‌లాల్ నెహ్రూ ఎస్క్వైర్,
పెన్షన్ ఎహార్‌హార్డు,
బేడెన్‌వీలరు,
జర్మనీ.

పి. యస్. మీరు 17 వాటర్లూ ప్లేస్, లండన్, యస్. డబ్ల్యు-1 కు సమాధానం వ్రాయవచ్చును.

116. లార్డు లోథియన్‌కు

పెన్షన్ ఎహార్‌హార్డు,
బేడెన్‌వీలర్,
డిసెంబరు 9, 1935,

ప్రియమైన లార్డు లోథియన్,

మీరు 6వ తేదీన వ్రాసినఉత్తరం నా కీరోజునే అందింది. విమానంలో వచ్చే ఉత్తరాలుకూడా ఎందుకింత ఆలస్యమౌతాయో నాకు తెలియకుండావుంది. ఏమైనప్పటికి నేను దానికి వెంటనే సమాధానంవ్రాస్తున్నాను.

మిమ్మల్ని కలుసుకుందుకు నే నెంతో ఆసక్తితో ఎదురుచూస్తున్నాను. వివిధవిషయాలపై మీరువ్రాసిన వ్యాసాలను నాకు దొరికినంత వరకు ఆసక్తితో చదువుతున్నాను. ఒకసమస్యను మీరు దర్శించేపద్ధతితో, మీరు కావించే నిర్ణయాలతో తరుచు నే నేకీభవించలేను. కాని అవి నా ఆలోచనాశక్తిని పురికొలుపుతూవుంటాయి. ఒక్కొక్కప్పుడు

వాటితో కొంతకొంత ఏకీభావం కుదురుతూవుంటుంది. భావనాజగత్తు యొక్క సూక్ష్మప్రదేశాల నావిష్కరింపచేసే, సామాన్య ఆలోచనాపరుని దృష్టికందినదానికంటె అధికంగా ప్రపంచస్వరూపాన్ని సందర్శింపచేసే, వ్యక్తులను కలుసుకుందుకు సదా ఉత్సాహంగా ఉల్లాసంగా వుంటుంది. మీరుచెప్పినట్లుగా బహుకొద్దిమందిమాత్రం ప్రపంచాన్ని కొంచెం హెచ్చుగా చూడగలుగుతారు. ఈ సంకుచిత దృక్పథం వల్ల దుఃఖకరమైన సంఘర్షణలు యింకా దుఃఖభాజనమౌతున్నాయి. ఇది ఎప్పుడూ దురదృష్టకరమే; విశేషించి, ప్రస్తుత విప్లవయుగంలో యిది మరీ దురదృష్టకరం. సదుద్దేశాలుగల వ్యక్తులు స్నేహపూర్వక సంబంధాలుపెట్టుకున్నంతమాత్రాన, యివి మంత్రించినట్లు మాయమౌతాయని నే ననుకోను. నిజంగా ఈ సంఘర్షణలు అగాధమైనవి. ప్రధాన శక్తులు విస్తృతపరిధిలో పరస్పరం సంఘర్షిస్తున్నప్పుడు, ఈ పోరాటంలో మహావ్యక్తులువహించే పాత్ర, వాటికంటె తక్కువగావుంటుందని నా భావం. ఈ సంఘర్షణలకు మూలకారణాలేమిటో అర్థంచేసుకునేందుకు మన శక్త్యానుసారం మనం ప్రయత్నించగలం. అలా అర్థం చేసుకుని వాటిని తొలగించడానికి ప్రయత్నించగలం. కాని, మనకున్న మరభిమానాలను, దురభిప్రాయాలను, పక్షపాతాన్ని, పరిమిత ప్రయోజనాలను విడనాడి, వాటినిగురించి విషయబద్ధంగా సమాలోచించడం చాలా చాలా కష్టం. మృదుమధుర మందహాసాలు, మరభిమాన మరభిప్రాయాలను, తజ్జనిత భిన్న భిన్న ప్రపంచదృక్పథాలను తొలగించలేవు. అయినప్పటికీ స్నేహపూర్వకమైన సంబంధాలను పెంపొందించుకునే ప్రయత్నాలు కొనసాగుతూ వుండాలి; ఏమీ అంటే, ఇప్పటికే భయంకరంగా వున్న ప్రపంచం, ఈ సంబంధాలు శూన్యమైతే, యింకా భయంకరంగా తయారౌతుంది. ఇప్పుడుకాకపోయినా, కొంతకాలానికైనా, పరస్పరావగాహనకు అవకాశంకలిగే వాతావరణాన్ని సృష్టించడానికి ఇవి తప్పక కొంతవరకు ఉపయోగపడతాయి. వ్యక్తులకు వ్యక్తులసమూహాలకుగల అసహనాన్ని తగ్గిస్తాయి; వ్యక్తుల దూరదృష్టిని విశాలంచేస్తాయి. తప్పి

లను కలుసుకోవడంవల్ల అనేకవిధమైన ఆనందం కలుగుతుంది. ఇది ముఖ్య జీవితానందాలలో ఒకటి.

ఇలాంటి జీవితానందం నిజంగా వాంఛించతగింది; కనుక యిటువంటి సంబంధాలను పెంపొందించుకోవాలని నేను ఎప్పుడూ ఉత్సాహపడుతూవుంటాను. నాకు దృఢమైన విశ్వాసాలున్నప్పటికీ, విద్యార్థివలె జీవితాన్ని జీవితసమస్యలను నిత్యం జిజ్ఞాసతో పరిశీలిస్తూవుంటాను. పిడివాదాలు మతవిషయికమైనవి కావచ్చును లేదా ఆర్థిక, రాజకీయ సిద్ధాంతాలకు చెందినవి కావచ్చును; ఏ సిద్ధాంతానికి సంబంధించినవైనా సరే, అవి నాకు చాలా చిరాకును కలిగిస్తాయి. నే ననుసరించవలసిన మార్గాన్ని నా మేధ ఎప్పుడూ అన్వేషిస్తూనే వుంటుంది. దానిని మూసివేయడానికె నేనెన్నడూ ప్రయత్నించను. అందువల్ల వ్యక్తిగత పరిచయాలను ఇంకా ఎక్కువచేసుకునేందుకు యిది నాకు తోడ్పడుతూంటుంది. ఈ విషయంలో గ్రంథాలు నాకెంతో ఉపకరించాయి. చాలా సంవత్సరాల నుంచి అవి నాకు సాటిలేని సంతృప్తిని కలిగిస్తున్నాయి. కాని గ్రంథాల వెనుకఉన్న వ్యక్తుల, అభిప్రాయాల, భావాల, చర్యలతో సంబంధం పెట్టుకోవడం చాలా ముఖ్యం. ఈ సంతృప్తిని పుస్తకాలుసైతం చేకూర్చలేవు.

మిమ్మల్ని కలుసుకోవాలని నాకు ఉంది. స్నేహపూర్వకంగా స్వాగతమిస్తూ మీరు వ్రాసిన ఉత్తరం నా కోరికను ద్విగుణీకృతంచేసింది. ఇంగ్లండు పరిసరప్రాంతాలను, గ్రామీణప్రాంతాలను, మీ సుందరతరమైన గృహాలను నేను మెచ్చుకుంటాను. బ్లిక్లింగును గురించి మీరు కావించిన అత్యద్భుతవర్ణన నన్నాకర్షించింది. కాని నేను నిజంగా చూడదలుచుకున్నది గృహయజమానినికానీ, గృహాన్నిమాత్రం కాదు. గతకొన్ని సంవత్సరాలలో పీడకలలవంటి మహాభయంకరమైన ఘటనలను తెచ్చిపెట్టిన భారతదేశంలోవున్న ప్రభుత్వంతో అధికారపూర్వకంగా సంబంధమున్న వ్యక్తులను కలుసుకోడానికి నేనొకవిధంగా సంకోచిస్తూవుంటాను; అయినప్పటికీ, లార్డు హాలీఫాక్సును కూడా కలుసుకోవాలనే అనుకు

న్నాను. కడచిన కొన్ని సంవత్సరాల భారతదేశచరిత్ర మహాభయంకర మైనది. ఆ దశలో భారతదేశమంతటా తీవ్రమైన దమననీతి కొనసాగింది. అక్కడ అనేక ఘోరకృత్యాలు జరుగుతున్నపుడు లలితహృదయుడైన వాడు వాటినిచూచి ఎలా సహించగలడో, అన్నింటికీమించి, దానికి తన ఆమోదముద్రను ఎలా వేయగలడో, నా కర్థంకాకుండావుంది. భారత దేశంలో దారుణంగా జరిగిన బలప్రయోగాన్ని దౌర్జన్యచర్యలనుగురించి నేను పేర్కొనడంలేదు. ఈ దమననీతిని అవలంబించిన పద్ధతినిగురించి నేను ప్రస్తావిస్తున్నాను. ఊహాతీతమైన, అసభ్యమైన, అసహ్యమైన పద్ధతిలో ఈ దమననీతి కొనసాగింది, కొనసాగుతోంది. ఆశ్చర్యకర మైన విషయమేమిటంటే, యింతజరుగుతున్నా ఇంగ్లండులో ఎవరికీ చీమకుట్టినట్లయినా లేదు; భారతదేశంలో ఏమిజరుగుతున్నదో భారత ప్రజల హృదయాలు ఎలా దహించుకుపోతున్నాయో, వారి తలపోత లేమో ఇంగ్లండులో ఎవరూ పట్టించుకున్నట్లు లేదు.

చివరకు ఈస్థితి గడిచిపోతుందని నేను భావిస్తున్నాను. కాని ఇటువంటి దుస్సహవాతావరణం చుట్టూవున్నప్పుడు వ్యక్తిగత పరిచ యాలు కలుగుతాయనుకోవడం కష్టం. తనను గొంతుకపిసికి చంపచూ మనుకుంటున్నవ్యక్తితో, తాను కరచాలనం కావించడం సులభంకాదు; అయినప్పటికీ మనం కరస్పర్శకావించుకునే సమయ మాసన్నమౌతుందని నమ్ముతున్నాను. త్వరితగతిని ఆ సమయ మాసన్నంగావాలంటే అది మనమీదే ఆధారపడివుంది.

మీరు కావించిన ప్రతిపాదన నన్నెంతో ఆకర్షించింది. జనవరి మొదటివారంలో ప్రత్యేకం మిమ్మల్ని చూడ్డానికి ఇంగ్లండు రావాలనే అనుకున్నాను. -నన్ను కలుసుకునేందుకు కొన్నిరోజులపాటు మీ అమె రికా ప్రయాణాన్ని వాయిదావేసుకోవడానికి మీరు యిష్టపడుతున్నందుకు నా ధన్యవాదాలు. మిమ్మల్ని కలుసుకోవాలని నా కెంతవున్నప్పటికీ, యిదివరకే నేనుకావించుకున్న నా ఏర్పాట్లకు భంగంకలుగకుండా నేను మిమ్మల్ని కలుసుకోలేను. నా భార్య ఆరోగ్యం బొత్తిగా బాగులేదు.

సరిగ్గా ఆసమయానికే నాకుమాత్రే యిక్కడికి చేరుతుంది; నేను నాభార్య చెంత వుంటానని, ఆమెకు మాట ఇచ్చాను. యూరపునుంచి మరికొందరు స్నేహితులు కూడా అప్పటికి ఇక్కడికి రాగలరనే ఎదురుచూస్తున్నాను. నే నిదివరకు జనవరిలో కాక యింకొక నెలలో ఇంగ్లండుకు ప్రయాణం పెట్టుకున్నాను. ఇప్పుడు నేను జనవరి మొదటివారంలో ఇంగ్లండుకు వస్తే, యింతకుముందు నేననుకున్న నా యూరోపుప్రయాణం ఆగిపోతుంది. ఆ నెలలో నన్ను చూద్దామనుకుంటున్న నా స్నేహితులకు ఆశాభంగం కలుగుతుంది. బహుశా ఫిబ్రవరి మొదటివారంలో ఇక్కడినుంచి నేను భారతదేశానికి బయలుదేరదామనుకుంటున్నాను.

కనుక మీరు అమెరికా వెళ్ళేలోపున మిమ్మల్ని చూడాలనే నా కోరికను ఎంతో విచారపడుతూ నేను వదులుకోక తప్పదు. ఇది నిజంగా నా కెంతో ఆశాభంగం కలిగించింది. వేసవికాలంలో నేను యూరపు చేరుకునేందుకు అవకాశం లేకపోలేదు. అప్పుడు మిమ్మల్ని విధిగా కలుసుకునేందుకు ప్రయత్నిస్తాను.

మీ భవనంలో శ్రీ అలెగ్జాండరు ఫ్రేజరును నేను కలుసుకొని వుండవలసిందని మిస్ అగథా హారిసన్ నాకు ఉత్తరం వ్రాశారు. పశ్చిమాఫ్రికాలో నెలకొనివున్న తన కళాశాలలో ఆయన అమోఘమైన కృషిచేస్తున్నారట. ఆయనకృషిని దూరంనుంచి ఆసక్తితో నేను గమనిస్తున్నాను. అలాంటివ్యక్తిని కలుసుకోలేకపోవడం నాకు మరింత విచారకరంగా వుంది.

మీ విశ్వాసపాత్రుడు,
జవహర్‌లాల్ నెహ్రూ,

లార్డు లోథియన్,
17, వాటర్లూప్లేస్, లండన్, ఎస్. డబ్ల్యు. 1.

117. లార్డ్ లోథియన్ వద్దనుంచి,

సైమూర్ హౌస్,
17, వాటర్లూ ప్లేస్,
ఆంతరంగికం, లండన్, యస్. డబ్ల్యు-1.
డిసెంబరు 31, 1935.

ప్రియమైన శ్రీ నెహ్రూ,

మీరు దయతో వ్రాసిన ఉత్తరానికి నేనెంతో కృతజ్ఞుణ్ణి. ప్రస్తుతం మనం కలుసుకునేందుకు వీలుపడనందుకు నాకు విచారంగావుంది. ఇంకొకప్పుడు ఏదోరోజున మనసమావేశం సాధ్యమౌతుందని ఆశిస్తున్నాను. మీరు చదవటానికి శ్రద్ధవహిస్తే, ఈలోపున, మీకు నే నొక ఉత్తరం వ్రాయాలనుకుంటున్నాను. బ్రిటన్ పాలకవర్గాల్ని గురించి నాకున్నఅభిప్రాయాలు మీకు తెలియజేయాలని ఉవ్విళ్ళూరుతున్నాను.

మానవచరిత్రలో ఒకానొక సృజనాత్మకయుగంలో ప్రస్తుతం మనం జీవిస్తున్నాం. నానారాజ్యసమితి ప్రాతినిధ్యంవహించే ఆదర్శాలు దృష్టిలో వుంచుకుని మనం క్రమక్రమంగా ముందుకు సాగిపోతున్నాం. సమాన స్వయంపాలిత దేశాలమధ్య న్యాయసంబంధాలు నెలకొల్పి యుద్ధాన్ని అంతమొందించడానికి, ప్రస్తుత సర్వాధికార ప్రభుత్వాల అరాజకత్వంవల్ల ఉత్పన్నమైన పరస్పర భయ ద్వేష అనుమానాలను, అజ్ఞాన దారిద్ర్య నిరుద్యోగాలను నిర్మూలించడానికి మనం కృషి చేస్తున్నాం. ఇలాగ ఒకప్రక్క మనం పయనిస్తూ ఇంకొక ప్రక్క సమాజవాదమనేపదంచే వాచ్యమవుతూన్న ఆదర్శాలవైపు ప్రయాణం సాగిస్తున్నాం. ఆస్తులపై యాజమాన్యం వహించుటవల్లకాక, వ్యక్తులు తాము సమాజానికిచేసే సేవనుబట్టి అర్హమైనఫలితాన్ని అనుభవించ డానికి వీలుగా భూమి, భూసంపదలు సమాజసభ్యులందరికీ క్షేమార్థం వినియోగపడే వ్యవస్థవైపు మనం అడుగుపెడుతున్నాం. ఈ రెండింటి విషయంలోనూ లక్ష్యాన్నిసాధించే మార్గాలు పూర్తిగా విభిన్నమైనవి. నానారాజ్యసమితి కావించుకున్న ఒడంబడిక, నిర్ణయాలు వేరు. సమాజ

వాదలక్ష్యసాధనకు అవలంబించే మార్గాలు వేరు. సమాజవాదవ్యవస్థలో ఉత్పత్తిసాధనాలను పంపకాన్ని జాతీయంచేసి వాటిపై ప్రభుత్వం యాజమాన్యంవహిస్తుంది. ఈ లక్ష్యాలను సాధించడానికి కొన్ని దశాబ్దాలు, బహుశా కొన్ని శతాబ్దాలు పట్టవచ్చు. ఇవి ఫలించాలంటే ఇన్నాళ్లూ ప్రజల్లో పాతుకొనివున్న అలవాట్లు, అభిప్రాయాలు, మనస్తత్వాలు పూర్తిగా పరివర్తనచెందాలి. నూతనరాజ్యాంగపు పరిపాలనాయంత్రం నెలకొనేముందు, వారు తమ నూతన శక్తులను బాధ్యతలను గుర్తించి తదనుగుణంగా ప్రవర్తించాలి. అయితే చివరకు ఈ ఆదర్శాలు చేరుకొనవచ్చును. ఏమంటే ఇప్పటికే తగినంతమంది మనుష్యులు దీన్ని చూచారు. వారు కొంతమందే కావచ్చును.

ప్రస్తుత సమయంలో బ్రిటను-భారతదేశాలు విభిన్నపాత్రలను ధరించవలసివుంటుంది. నూతన సామ్రాజ్యవాద ఆవేశానికి లోనుగాకుండా వుండడానికి, ఇకముందు యుద్ధాలురాకుండాచేసి విశ్వవ్యాప్తమైన జాతీయ స్వయంనిర్ణయసిద్ధాంతం నవీనయుద్ధాలకు అరాచకత్వానికి దారితీయకుండా వారించాలనే దీక్షతో బ్రిటను తన పాతసామ్రాజ్యవాదాన్ని పరిత్యజిస్తూ అనేకవిధాల ప్రయత్నిస్తోంది. వ్యక్తిస్వాతంత్ర్యం, పౌరవా, ఉదారసంప్రదాయాలతో వున్న సమాజవాదాన్ని అన్వయించుకొనే సమస్యపై తనదృష్టిని మళ్లించి బ్రిటను త్వరలో ఆవిధంగాచేయడానికి పూనుకుంటుంది. తన ప్రభుత్వాన్ని తాను నిర్వహించుకునే గురుతర బాధ్యతను భారతదేశం స్వీకరించి అత్యవసరమైన సాంఘిక, ఆర్థిక సంస్కరణలను ప్రవేశపెట్టవలసివుంటుంది. ఇలా చేస్తున్నపుడు యూరప్‌వలె అది తన ఐకమత్యమును పోగొట్టుకోకూడదు. అనేక మత, జాతీయ యుద్ధాలవల్ల యూరపు అరాజకంపాలైంది. ఆధునిక నాగరకత పతనావస్థకు యిదే ప్రధానకారణం.

ఆమోదింపబడిన ఈ రాజ్యాంగంద్వారా భారతదేశం తనలక్ష్యాన్ని చేరుకునేందుకు ఎలా సాధ్యమౌతుందని మీరు నన్ను ప్రశ్నింపవచ్చును. ఔను. నిజమే. అది దోషభూయిష్టమైనదే. అందులోనూ ప్రత్యేకంగా మీ దృక్పథంనుంచి, అది మరీ దోషభూయిష్టం. అయినప్పటికీ

మిమ్మల్ని నే నొకవిషయం ఆలోచించమని కోరుతున్నాను. రాజ్యాంగ చట్టము. అందులో యిమిడివున్న అభివృద్ధులద్వారా తప్ప భారతదేశం తన లక్ష్యాన్ని ఇతరమార్గాలద్వారా సాధించడం అసంభవం అనుకుంటాను.

దురదృష్టవశాత్తు రాజకీయాంలో మనమెవ్వరమూ ఇప్పుడున్న వాటిని పూర్తిగా చెరిపివేసి కొత్తగా యింకొక వ్యవస్థను సృజించలేము. చరిత్రవల్ల ఉత్పన్నమయిన యదార్థవిషయాలనుంచి మనం, మనపని ఎప్పుడూ ప్రారంభించవలసివుంటుంది. ఆదర్శవాదానికి, వాస్తవికతకు ఎప్పుడెప్పుడు సమన్వయం కుదురుతుందో తెలుసుకోవడం రాజకీయజ్ఞుని కర్తవ్యం. అదే అతనుచేసేపని. భారతదేశప్రజలు నిత్యదారిద్ర్యంతో కుమిలిపోతున్నారు. దారిద్ర్యఫలితాలు దుస్సహమైనవే కావచ్చును. వాటిని వెంటనే నివారించడం ఎంతో కష్టంకావచ్చును; కాని, ఇది అంత ప్రమాదకరమైన సమస్య కాదు. భారతదేశంలో ప్రభుత్వం విచ్ఛిన్నమైపోయి దాని రాజ్యాంగం, ఏకత్రా ఛిన్నాభిన్నమైనా, అది ఎంతో దుష్ఫలితాన్ని చేకూర్చుతుంది. ఇప్పుడు భారతదేశాన్ని బెదరిస్తున్న ప్రమాదకరమైనసమస్యఇదిఒక్కటే. ఇంతకంటేప్రమాదకరమైనసమస్య ఇంకొకటి వుంది. బ్రిటనుఆధిపత్యానికో లేదా పరాయిదేశపు ఆధిపత్యానికో భారతదేశంసమ్మతిస్తేఅదిమరీ ప్రమాదకరంగాపరిణమిస్తుంది. భారతదేశం స్వపరిపాలనావిధానాన్నీ ఆంతరంగిక ఏకతనూ కాపాడుకునే ప్రయత్నం విఫలమైతే తప్ప, యీ ప్రమాదం తలెత్తదనే నేననుకుంటాను. భారత దేశానికి స్వాతంత్ర్యం యివ్వకూడదనేవారిని ధిక్కరించి, బ్రిటను, గత ఆగస్టులో ఒక రాజ్యాంగచట్టాన్ని ఆమోదించింది. ఆ రాజ్యాంగ చట్టంద్వారా భారతదేశానికి అధికారాన్ని ఒప్పగించవలసివుంది. ఇది భారత జాతీయఉద్యమశక్తివల్లనూ, బ్రిటను నిర్ణయంవల్లనూ సాధించబడింది. ఈ రాజ్యాంగచట్టాన్ని వ్యాఖ్యానిస్తూ "ట్వంటీయత్ సెంచరీ" అనే భారతదేశపు పత్రికలో ఒక వ్యాసం వ్రాశాను. రాజ్యాంగచట్టానికి నే నెలాగ అన్వయించి అర్థంచెప్పానో, వాటినిక్కడ వివరించవలసినక్కర లేదు. నా వ్యాసప్రతిని మీకు పంపించడానికి సాహసిస్తున్నాను. నేను పేర్కొన్న రెండవ ప్రమాదం తొలగిపోయినా మొదటిప్రమాదం

ఉండనే వుంది. భారతదేశంలో రాజకీయవర్గాలకు అధికారం హస్తగత మౌతున్నకొద్దీ, విద్య, పత్రికలు తమ ప్రభావాన్ని ఎక్కువచేసుకుంటాయి. మతము, జాతి, భాష తమ రాజకీయప్రాధాన్యాన్ని అధికారాన్ని విస్తృతపరుచుకుంటాయి. తత్ఫలితంగా చీలికలు కలగడానికి కారణభూతమౌతాయి. నేటికికూడా భారతదేశప్రజలపై మతానికి ఎంతో ప్రభావముంది. ఒకప్పుడు మధ్యయుగాల యూరప్‌లో కేథలిక్ మతానికి ఈవిధమైన ప్రభావమే ఉండేది. జాతీయ పునరుజ్జీవన, సంస్కరణోద్యమంవల్ల పవిత్ర రోమన్ సామ్రాజ్యం బలహీనపడింది. విజ్ఞాన శాస్త్రం, విద్య, ఫ్రెంచి విప్లవభావాలు నూతన రాజకీయ, ఆర్థిక విశ్వాసాలను నెలకొల్పి మతానికున్న రాజకీయప్రభావాన్ని, అధికారాన్ని తగ్గించేయి. కేథలిక్, ప్రొటస్టెంటుమతాలమధ్య సంఘర్షణవల్ల యూరప్ యావత్తూ నూరుసంవత్సరాలపాటు యుద్ధాలతో రక్తసిక్తమైంది. (జర్మనీ జనాభా 3,00,00,000 నుంచి 50,00.000 లకు తగ్గిపోయింది) ఈ యుద్ధాలు ముగిసిన తరువాత రాజ్యాధిపతులమధ్య పోరాటం చెలరేగింది. ఈ పోరాటం చక్రవర్తిని, పోపును తొలగించింది. పిమ్మట జాతుల భాషల ప్రాతిపదికలపై, జాతీయవాదులకు సంఘర్షణ సంభవించింది. ఈ జాతి, భాషాద్వేషాలు వెనుకటి ఐకమత్యాన్ని యిప్పుడు పూర్తిగా నాశనంచేశాయి. వాణిజ్య వ్యాపారాల ఆయుధాల అరాజకత్వాన్ని, యుద్ధాన్ని సృష్టించాయి. అదే నేటి యూరపు క్షీణతకు, పతనావస్థకు ప్రధానకారణం. ఈ శక్తులు కావించే చర్యల అంతిమదశ ఐర్లెండులో స్పష్టంగా కానవచ్చింది. ఐర్లెండుకు స్వయంపరిపాలన యివ్వడానికి బ్రిటను సమ్మతించినప్పటికీ, జాతి మతావేశంతో, స్కాట్సు ప్రొటస్టెంటు ఆల్సటర్‌ను కెల్టిక్ రోమన్ కేథలిక్స్ ఐర్లెండుకు, రాజకీయవిధేయత చూపరాదని నిర్బంధించింది.

నేను, ఆర్థికప్రాతిపదికను అనగా మార్క్సిస్టు సిద్ధాంతాన్ని నిర్లక్ష్యంచేస్తున్నానని మీరనవచ్చు. నేనలా చేస్తున్నానని అనుకోవడం లేదు. ఆర్థిక లేదా భౌతికవాదదృష్టితో చరిత్రను మార్క్స్ అతిగా అన్వయించాడు. ఆర్థికవిషయాలు ఎక్కువ ప్రభావాలు కలిగివుంటా

యనేదానికి సందేహంలేదు. అవి కొంతవరకు రాజకీయ, సామాజిక, మతవిషయక ఆలోచనలపై ఆధిపత్యాన్ని వహిస్తాయి. కాని వీటి ప్రాధాన్యం ద్వితీయమైనది. పెట్టుబడిదారీవిధానం ద్రవ్యాపేక్షను ప్రేరేపిస్తుందన్నమాట నిజమే; కాని అది జీవనప్రమాణాన్ని ఎంతో పెంపొందిస్తుంది కూడా. అంతర్జాతీయ అవ్యవస్థ స్థితి దుష్ఫలితాలను, అది అతిశయింపవచ్చునే తప్ప ఆ అరాజకత్వాన్ని సృష్టించదు. అది పరస్పర స్పర్ధలకు కారణభూతం కావచ్చును. కాని దేశంలో అంతర్యుద్ధాన్ని తెచ్చిపెట్టదు. ఏమైనప్పటికీ ప్రత్యక్ష రాజకీయరంగంలో మొట్టమొదట రాజకీయదశ ప్రారంభమౌతుంది. రష్యావంటిదేశంలో ఏవో కొన్ని ప్రత్యేక పరిస్థితులవల్ల యిలా సంభవించకపోవచ్చుగాక; అక్కడ పరిస్థితులు వేరు. ఇతర దేశాలతో యుద్ధంలో చిక్కుకోడంవల్ల, పటిష్ట నాయకత్వంగల అపూర్వమైన విప్లవోద్యమంవల్ల జార్-ప్రభుత్వం కూలిపోయింది. ఆ పరిస్థితులలో మధ్యతరగతిలేని ఆ దేశంలో ప్రజలు యింతకుముందు కనీవినీ ఎరుగని ఎత్తుగడలతో విప్లవోద్యమం అన్ని తరహాల జీవితంపై పార్టీనియంతృత్వాన్ని నెలకొల్ప గలిగింది. ఇలాగ జరగడానికి ఇదొక్కటే ఉదాహరణ. సర్వసాధారణంగా ప్రజలు మత ప్రాతిపదికపై ఆధారపడిన జాతీయాభిప్రాయాలపైపు మొగ్గు చూపుతూంటారు. ఇలా చూపిన తరువాతనే వారిబుద్ధి ఆర్థికప్రయోజనాలవైపు మళ్లుతుంది. ఈ విషయం యూరపుచరిత్ర, రష్యావిప్లవానంతరం సైతం తేటతెల్లంచేస్తోంది. ఒకసారి విప్లవపద్ధతి, ప్రజాస్వామిక, చట్టబద్ధమార్గాన్ని త్రోసిపుచ్చినతరువాత, ఆర్థికప్రయోజనాలు ప్రజల యితర ఆశయాలను త్రోసిపుచ్చి ప్రాధాన్యంవహించినపుడు, జయించేది ఫాసిజంకాని కమ్యూనిజంకాదు. ఈ విషయాన్ని వామపక్షంవారు సైతం యిప్పుడంగీకరిస్తున్నారనుకుంటాను.

భారతదేశం రాజ్యాంగమార్గాన్ని తిరస్కరించినట్లయితే అది యూరపువలె మతయుద్ధాలతో రక్తసిక్తమౌతుందని నే నాందోళనపడుతున్నాను. భారతదేశప్రజలు యిప్పటికీ మతావేశానికి లోనౌతారని నేననుకుంటాను. రాజకీయప్రయోజనాలకోసం ఒకసారి వారిని రెచ్చ

గొట్టినపుడు ఇలాగ లోనుగాక తప్పదు. ఇటువంటి పరిస్థితేగనక దాప రిస్తే భారతదేశంలో జాతిభేదాలు, భాషాభేదాలు పెరిగిపోతాయి. వాటి ప్రాతిపదికపై ఎక్కడికక్కడ నియంతృత్వ ప్రభుత్వాలు యూరపులో వలె అక్కడకూడా నెలకొంటాయి. ఇలా ఛిన్నాభిన్నమై ఏర్పడిన ప్రభుత్వాలు, పరస్పరద్వేషంతో ఆర్థిక సైనిక అభివృద్ధి స్తంభించిపోగా, ఆయుధాలను చేపట్టి ఒకదానిపై ఒకటి తలపడతాయి. లేదా భారతదేశం మళ్ళీ ఒకసారి ఏదోఒక బాహ్యసామ్రాజ్యవాదప్రభుత్వానికి పూర్తిగా లోబడిపోతుంది. చైనాలో సరిగ్గా యిదేజరిగింది. ఇంతకన్న ఏదో మహా విపత్తువచ్చినా మంచిదేనన్నట్లు, ఆ మార్గం ముందుకు తీసుకుపోతుందని కొందరంటున్నారు. ఒకసారి నాతో మహాత్మా యిదేమాట అన్నారు, ఇది కొన్నికొన్ని సమయాలలో నిజం కావచ్చునేమోకాని యివి చాలా అరుదు. వేరే యింకొక ఆశలేనప్పుడు మాత్రమే యిలాగ జరుగుతూ వుంటుంది. భారతప్రభుత్వం పతనమైతే శత్రురాజ్యసైన్యాలు మీదపడి నప్పుడు ఇప్పుడు చైనాలో జరుగుతున్నదే అక్కడా జరుగుతుంది; అంతకంటె భారతదేశంలో జాతి భాషాభేదాలు హెచ్చుగావున్నాయి కనుక పరిణామాలు తీవ్రంగావుండడం సహజం. భారతదేశంలో సామాజిక ఆర్థికదోషాలు తొలగినా తొలగవచ్చుగాక; కాని ఇలాంటి పరిస్థితులు సామాన్య మర్యాదలను, అలవాట్లను, సంప్రదాయాలను గత యుద్ధం నాశనంచేసినట్లుగా నాశనంచేస్తాయి. ఇవి లేనినాడు నాగరకజీవితాన్ని నిర్మించడం దుర్ఘటమౌతుంది. ఈ నాగరకజీవితం సమాజవాదపరమైనదీ కావచ్చు; లేదా వ్యక్తిపరమైనదీ కావచ్చును. ఇది రాజకీయ, లేదా సామాజిక అభ్యుదయాన్ని సాధించే పట్టుబద్ధమైన పోరాటంద్వారా మాత్రమే నెలకొల్పబడుతుంది; అభివృద్ధిచెందుతుంది. అంతేకాని, యుద్ధంవల్ల ఎంతమాత్రం సాధ్యపడదు.

ప్రజాస్వామిక ప్రపంచం ప్రసాదించిన రాజకీయ మహావ్యక్తి అబ్రహాం లింకన్ అని నేననుకుంటాను. ఆయనకు సామాన్యప్రజలంటే ఎంతో ప్రేమవుండేది. కాని అమెరికా ప్రధానసమస్య బానిసత్వంకాదని, సమాఖ్యను కాపాడుకోవడమేనని ఆయన గ్రహించాడు. సమాఖ్య చెదిరి

పోయినట్లయితే, బానిసత్వం అలాగే వుండడంమాట అటుంచి, అమెరికా సైతం యూరోపువలె జాతీయరాష్ట్రాలుగా ఎక్కడికక్కడ భిన్నాభిన్నమైపోతుందని, ఇలాగ విడిపోయిన ప్రభుత్వాలు, యూరోపునుండి విభిన్న జాతీయ భాషావిషయిక శక్తులను స్వీకరిస్తాయని, వాణిజ్యవ్యాపారాల ఆయుధపోటీలను పెంపొందించుకొని యుద్ధానికి దారితీస్తాయని, యుద్ధమేకనక సంభవిస్తే అది మన్రోసిద్ధాంతాన్నీ 1784 లో ప్రారంభింపబడిన ప్రజాస్వామికమనే ప్రయోగాన్నీ తుడముట్టించగలదనీ ఆయన ఆందోళనపడ్డాడు. కనుక బానిసత్వ సమస్యపై పోరాడ్డానికి తిరస్కరించి సమాఖ్యారక్షణార్థం పోరాటాన్ని కేంద్రీకరించాడు. సమాఖ్య సురక్షితంగావుంటే, దురదృష్టకరమైన ఈ దుష్ఫలితాలతోపాటు, బానిసత్వం తప్పక నశించిపోతుందని ఆయనకు తెలుసును.

ఇప్పుడు భారతదేశంముందు ప్రపంచంఎదుట ఒక అత్యంత ప్రధానప్రశ్న వుంది. భారతదేశం ప్రజాస్వామిక రాజ్యాంగసమాఖ్యగా వుంటూ, తన లక్ష్యాన్ని సాధిస్తుందా, లేక ఏదో ఒక ప్రళయంద్వారానో విప్లవంవల్లనో తన గమ్యాన్ని చేరుకుంటుందా అనే విషయం చూడవలసివుంటుంది. మొదటిమార్గాన్నది చేపట్టినట్లయితే, దాని సంస్థలు, భారతసంస్థానాలను క్రమక్రమంగా చట్టబద్ధరాజ్యాంగాలుగా మారుస్తాయి. జాతి మత భాషావాదాలను అధిగమించి, భారతీయపద్ధతిలో దేశభక్తిని పెంపొందిస్తాయి. అందువల్ల భారతదేశానికి తన ప్రభుత్వంపై తాను పూర్తి ఆధిపత్యాన్నివహించేశక్తి, క్రమానుగతిని చేకూరుతుంది; సబబైన వ్యక్తిస్వేచ్ఛగల సమాజవాదాన్ని తన విధానంలో సమన్వయించుకునే అవకాశం వుంటుంది. అంతేకాని భారతదేశం తన రాజ్యాంగబద్ధమైన ఏకతను పోగొట్టుకున్నప్పుడు యిక మిగిలేదంటూ ఏమీ వుండదు. అప్పు డది ఒకదేశంగా తనకున్న గణనను, తన భవిష్యత్తుపై అధికారాన్నివహించగలిగే తన శక్తిని తాను కోల్పోతుంది; శూన్యంలోనికి పాతాళానికి దిగజారిపోతుంది. ప్రభుత్వముండదు ఒకటి లేనిదే స్వయంపరిపాలనా వుండదు; సమాజవాదమూ వుండదు.

అయితే మీరు మళ్ళీ అదే ప్రశ్న వేయవచ్చు. ఈ రాజ్యాంగచట్టం బ్రిటన్‌కుగల ప్రధానమైన అంతులేని అధికారాలను రక్షణలను యథా తథంగా వుంచుతూ, మత ప్రాతిపదికపై ఆధారపడుతూ స్వప్రయోజనాల కోసం వినియోగపడుతున్న సంపదలకు, ఆస్తిపైగల యాజమాన్యానికి రక్షణయిస్తూ రచింపబడింది. ఇలాంటి రాజ్యాంగచట్టంద్వారా, ప్రభుత్వ నిర్వహణబాధ్యతను స్వీకరించడానికి, దేశసమైక్యమును సాధించడా నికి తన శాంత్యభివృద్ధులకు అత్యంత ప్రధానమైన ఆర్థిక సామాజిక సంస్కరణలను ప్రవేశపెట్టడానికి భారతదేశానికి ఎలా సాధ్యమౌతుంది? ఈ ప్రశ్నకు నేను రెండువిధాలుగా సమాధానం చెబుతాను. మొట్ట మొదటి సంగతి; కాంగ్రెసు ప్రభుత్వాధికారాన్ని దఖలుపరుచుకొని దేశంలోవున్న ప్రతిపక్షాలను లొంగదీసుకొని స్థిరత్వాన్ని సంపాదించి వేరొకవిధంగా రాజ్యాంగచట్టం రూపొందించబడాలని నిర్దేశిస్తేతప్ప, యింతకంటె విభిన్నమైన రాజ్యాంగచట్టం సాధ్యపడుతుందని నేను భావించను. పరదేశీయులకు స్వస్తిచెప్పి, విదేశవ్యతిరేక జాతీయవాద పద్ధతులను పెంపొందింపజేసే ఏకైకసంస్థగా నిలబడేశక్తి కాంగ్రెసుకు ఉన్నదో, లేదో సరిగ్గా నిర్ణయించిచెప్పడానికి నాకంటె మీరే అర్హులు. భారతదేశంనుంచి బ్రిటిషుప్రభుత్వం హఠాత్తుగా వైదొలగిననాడు రాజ్యాంగసూత్రాలపై అఖిలభారతప్రభుత్వాన్ని నిర్వహించడానికి కావలసినశక్తి కాంగ్రెసుకు ఉన్నదో లేదో, ముస్లింల సంస్థానాధీశుల, కులీనవర్గాల, ప్రజల అండదండలు దానికి లభిస్తాయో లేదో నేను తూచి నట్టు చెప్పలేను. కాని నాకు ఏర్పడిన భావాలుమాత్రం మీకు తెలియ జేస్తాను. కాంగ్రెసు ఎన్నడూ దేశానికంతటికీ వర్తించే అందరూ ఆమో దించగల రాజ్యాంగచట్టాన్ని తయారుచేసుకోలేకపోయింది. అది రచిం చిన రాజ్యాంగచట్టంలోసైతం వివరణలో కాకపోయినా, ప్రధానవిష యాలలో కొన్ని మినహాయింపులు ఉన్నాయి. బ్రిటను తయారుచేసిన ఈ రాజ్యాంగచట్టంలో మతవాదులకు, సంస్థానాధీశులకు, కులీనులకు ఎట్టి మినహాయింపులు ఉన్నాయో, అలాంటి మినహాయింపులే అందు లోనూ పేర్కొనబడ్డాయి. అయితే కాంగ్రెసు బలప్రయోగంద్వారా

అధికారాన్ని హస్తగతంచేసుకునేందుకు ప్రయత్నించినట్లయితే, దేశంలో అంతర్యుద్ధం చెలరేగవచ్చు. అప్పుడు కాంగ్రెసు సైనిక నియంతృత్వాన్ని నెలకొల్పే ప్రయత్నాలకు తప్పనిసరిగా పూనుకోవలసి వుంటుంది. నిరంకుశప్రభుత్వంలో సహజంగావుండే దారుణ నిర్బంధ విధానాలను (ఈ నిర్బంధవిధానాలను మీరూ చవిచూశారు) అనుసరించే పరిస్థితి దానికి సంభవించేది; లేదా భారతదేశ సమైక్యమును కాపాడుకోవాలనే ప్రయత్నాలకే అది తిలోదకాలివ్వవలసివస్తుంది.

ఇక నా రెండోసమాధానం: "రాజ్యాంగచట్టంలో, మీరు ఎన్ని దోషాలుచూచినా ఒకటిమాత్రం నిజం; అది అభివృద్ధికి దోహదపడుతుంది. భారతదేశ రాజకీయ సాంఘికశక్తిని మరింత పుష్టిమంతంచేసి ప్రభుత్వ నిర్వహణకు సాంఘిక, ఆర్థికసంస్కరణలను ప్రవేశపెట్టడానికి అవసరమైన అనుభవాల్ని చేకూర్చుతుంది. భారతదేశానికిప్పుడు సువిశాలమైన మార్గం లభిస్తుంది. ఈ మార్గంద్వారా వెస్టుమినిస్టరు శాసనంలో నిర్వచింపబడిన స్వాతంత్ర్యాన్ని పొందగలుగుతుంది. రాజకీయపక్షాలను పెంపొందించుకుని, రాజ్యాంగ సంప్రదాయాలను అలవరచుకొన్న అఖిల భారతప్రభుత్వాన్ని, దేశరక్షణను కాపాడుకునే బాధ్యతను నిర్వహిస్తూ, భారతదేశం ఎంత త్వరగా పురోగమించగలిగితే అంతత్వరగా ఈ స్వాతంత్ర్యం దానికి సిద్ధిస్తుంది. ఇలాగ నేను భావించడానికి కారణాలేమిటో వాటిని ఈ లేఖలో వేరే పేర్కొనను. అవి "ట్వంటీయత్ సెంచరీ" పత్రికలో ప్రకటితమైన నా వ్యాసంలో వివరించాను. భారతదేశం విభిన్న విశాలప్రదేశాలతో కూడుకునివుంది. అందువల్ల ప్రారంభదశలో కొందరికి కొన్ని రక్షణలు, సౌకర్యాలు యివ్వకపోతే ప్రభుత్వం భగ్నమౌతుంది. ఈ రక్షణలు, సౌకర్యాలు అలాగ ప్రభుత్వం పతనం కాకుండా కాపాడ్డానికి ఉపయోగపడతాయి. దేశంలో విశ్వవిద్యాలయాలు, బహుళవ్రిచారంగల వార్తాపత్రికలు అసంఖ్యాకంగా బయలుదేరి ఏకైక అభిప్రాయాన్ని కలిగించినపుడు పరిస్థితి ఇలాగ ఉండదు. ప్రజలచేత ఎన్నుకోబడిన శాసనసభలకు బాధ్యతవహించే మంత్రివర్గాలకు పరిపాలనాబాధ్యతను అప్పగించవలసినదిగా ఆందోళన ప్రారంభమౌతుంది.

ప్రత్యేక రక్షణలూ, సౌకర్యాలు కలిగిన వ్యక్తులు ఈ ఆందోళనను ఎదుర్కోలేరు. వారివల్ల తాత్కాలికంగా కొంత ఆలస్యం జరగవచ్చును. కాని దానిని వారు ఆపలేరు. బాధ్యతాయుతప్రభుత్వాలు ఎక్కడెక్కడ నెలకొనిఉన్నా వాటిచరిత్ర యీ విషయాన్నే రుజువుచేస్తోంది.

ఈ రాజ్యాంగచట్టం రాజకీయ, సాంఘిక, ఆర్థిక సంస్కరణలతో ప్రమేయంవున్న రాజకీయపక్షాల అభివృద్ధికి పూర్తి అవకాశాన్నిస్తోంది. ఈ రాజకీయపక్షాలు రాజ్యాంగయంత్రంలో బలాన్నీ శక్తినీ సమకూర్చి శక్తిమంతం కావచ్చును. అంతేకాక ఈ రాజ్యాంగచట్టం ఒక బలమైన విస్తృత ప్రాతిపదికను, పునాదిని సమకూర్చిపెడుతోంది. జనాభాలో నూటికి 40 మందికి పైగా వున్న వయసువచ్చిన పురుషుల ఓటును పొందడంకోసం ఈ పునాదిపై ఆ రాజకీయపక్షాలు పని ప్రారంభించవచ్చును.

రాజ్యాంగపద్ధతులద్వారా నిరవధికాభివృద్ధిని సాధించే అవకాశాలు ఈ రాజ్యాంగచట్టంలోనే పొందుపరచబడ్డాయి. నూతనవ్యక్తులకు అధికారాన్ని, బాధ్యతను దఖలుపరచడంద్వారా, బాధ్యతాయుత ప్రభుత్వం నెలకొని అత్యంత ప్రధానమైన మార్పులు సిద్ధిస్తాయి. రాజ్యాంగచట్టంలోని సూత్రాలమాట అటుంచినా, దాన్ని స్వీకరించడంద్వారా ఆచరణలో పాతసంప్రదాయాలు తొలగిపోతాయి. కొన్ని నూతనధర్మాలు తలెత్తుతాయి. ఈదేశంలో పార్లమెంటు ఏర్పడినపుడు, విదేశాలలో అధినివేశప్రతిపత్తి నెలకొనినపుడు, ఇప్పుడున్న తిరుగులేని అధికారాలు అప్పుడు లేవు. క్రమక్రమంగా సర్వాధికారాలు ఏర్పడడం సహజం. ఒకవేళ దేశానికి అభ్యంతరకరమైన విషయమేమున్నప్పటికీ, రాజ్యాంగచట్టంలో ప్రధానమైన మార్పులను పార్లమెంటుమాత్రమే చేయవలసి వుంటుంది. ఈపద్ధతిలో కొన్ని ప్రత్యక్ష ప్రయోజనాలు ఇమిడివున్నాయి. అన్ని రాజ్యాంగచట్టాలు ఒక ధర్మాన్ని విధిస్తాయి. దీనిప్రకారం రాజ్యాంగచట్టాలు సాధారణ పార్టీరాజకీయాలవల్ల మార్చబడకూడదు. కాని వాస్తవంగా దేశమంతా వాంఛిస్తున్నపుడుమాత్రం అవి మార్చబడవచ్చును. ఇదే ఇందులోఉన్న గొప్పచిక్కు. అయితే పార్టీరాజకీయాలవల్ల

సునాయాసంగా మార్చబడుతున్న రాజ్యాంగచట్టాలు పూర్తిగా విఫలమై వాస్తవిక, సామాజిక అభ్యుదయాన్ని నిరోధించే అతిసంకుచిత నియంతృత్వానికో లేదా అరాచకత్వానికో దారితీస్తాయి. అధినివేశ స్వాతంత్ర్యాభివృద్ధిని పదిలపరిచే విధానం ఆచరణలో సమస్యను చాలా చక్కగా పరిష్కరించింది. అంటే మార్పులు అతిసులభంగాచేకూర్చుకొన వచ్చునన్నమాట. కాని యిందుకు పార్టీవిజయంమీద మాత్రమే ఆధార పడక, దేశీయుల అనుమతిని పొందగలిగే గౌరవాన్ని సంపాదించుకొన వలసివుంటుంది.

ఇపుడు రచించబడిన రాజ్యాంగచట్టాన్ని ఆధారంగా చేసుకొని భారతదేశం అతిసులభంగా కాకపోయినా సులభంగా దినదినాభి వృద్ధిపొందుతున్న తనకోరికలను తాను నెరవేర్చుకో గలుగు తుంది; ప్రజల కోరికలను సఫలీకృతం చేయగలుగుతుంది. 1787 సంవత్సరంనాటి అమెరికావలె భారతదేశం స్వయంపరిపాలిత జీవితాన్ని, ఈ రాజ్యాంగాన్ని స్వీకరించడంద్వారా ప్రారంభించనున్నది. రాజ్యాంగచట్టాలంటే, ఈరోజులలో తేలికగాచూడడం ఒక ఫాషన్ అయిపోయింది. నేటి పరిస్థితులలో అత్యవసరమైన ప్రపంచ రాజ్యాంగ చట్టం లుప్తమైనందువల్ల వివిధదేశాలమధ్య అరాజకత్వం పాదుకొని వుంది. ఈఅరాజకత్వం నిరుద్యోగాన్ని, యుద్ధాన్నినియంతృత్వాన్ని తెచ్చి పెట్టింది. తత్ఫలితంగా ఒకదేశంతరువాత మరొకదేశంలో రాజ్యాంగబద్ధ ప్రభుత్వాల మనుగడ అసాధ్యమైపోయింది. తన సమైక్యమును కోల్పో యినట్లయితే ఇలాంటి విధ్వంసకర, అరాజకత్వ ప్రభంజనంలో, యుద్ధ బీభత్సంలో భారతదేశం చిక్కుకుంటుంది. భారతదేశం వీటిని తప్పించు కోవాలి,

కనుక రాజ్యాంగచట్టం ఏరూపంలో ఉన్నదనేది ఇప్పుడు ప్రధాన సమస్యకాదు. భారతదేశం అత్యవసరంగా పరిగణించి చేయవలసిన ప్రధానకార్యం ఒకటివుంది. భారతదేశం శక్తిమంతమైన, నిర్మాణయుత, సృజనాత్మక పార్టీజీవితాన్ని అభివృద్ధిచేసుకోవలసివుంది. భారతదేశ ప్రభుత్వాన్ని జయప్రదంగా నిర్వహించనున్న క్లిష్టసమయంలో ప్రజల

తోడ్పాటును పొందడానికి, ఈ పార్టీజీవితం తోడ్పడుతుంది. దేశీయుల విశ్వాసాన్ని చూరగొంటున్న అర్హతగల ఆ రెండుపార్టీలు యిందుకు పూనుకోవాలి. ఆదర్శవాదానికి - అభివృద్ధినిరోధకత్వానికి, పవిత్రతకు, అవినీతికి ప్రతిపార్టీలోఉండే స్వార్థపరులకు ప్రజలచైతన్యానికి మధ్య జరిగే పోరాటంమీదను, ఎన్నికల యుద్ధరంగంలో వివిధపార్టీలకు లభించే ఓట్లబలంమీదను, ప్రజల రాజకీయాభివృద్ధీ, సాంఘిక, ఆర్థిక సంస్కరణల విజయమూ ఆధారపడివుంటాయి. బాధ్యతాయుత ప్రభు త్వాన్ని చక్కగా నిర్వహిస్తూ ప్రజలకు తామొసంగిన వాగ్దానాలను నెర వేరుస్తూ క్రమశిక్షణతో రాజకీయపక్షాలు మెలగుతూ ప్రజలభావాలను సమాయత్తపరచాలి. అప్పుడు మతవాదమూ, ప్రత్యేకనియోజకవర్గాలూ నశించిపోతాయి. సంస్థానాలలో ప్రాతినిధ్యసంస్థల పెరుగుదలకు, వాస్త వికభారతీయసైన్యాభివృద్ధికీ, బ్రిటను-భారతదేశాలమధ్య ఆర్థికసంబంధాల సమన్వయానికీ అవకాశం ఏర్పడుతుంది. ప్రజల జీవనప్రమాణం అధిక మౌతుంది. పీడకవర్గాలను సవాలుచేసే శక్తి చేకూరుతుంది. ఎలాగో వోట్లను దండుకునే ప్రయత్నాన్ని ఎదుర్కొనేబలం లభిస్తుంది. భవిష్య త్తునుగురించి ఎవరికి ఏ అభిప్రాయాలుంటే ఉండుగాక; ఇప్పుడు భారత దేశ ప్రధానకర్తవ్యం ఇది: దేశంలోగల ముప్ఫైకోట్లమంది ప్రజలతరఫున 2000 (రెండువేల) సభ్యులను ఎన్నుకొనే కార్యక్రమంలో యువకులు, స్త్రీలు, పురుషులు అందరూ పాల్గొని ఆచరణయోగ్యమైన నిర్మాణాత్మక ప్రత్యక్షానుభవాన్ని సంపాదించుకోవాలి. ఇలాగ ఎన్నికైన 12 శాసనసభలసభ్యులూ భారతప్రభుత్వ అధికభాగానికి బాధ్యతవహిస్తారు. అందరికీ యోగ్యమైన సూత్రాలను, సాంఘిక సంస్కరణలనూ ఊహించి, ఒకప్రణాళికను రూపొందించడానికి పూనికవహిస్తారు. సిద్ధాంతాన్నిబట్టిగాక, ఫలితాన్నిబట్టి చట్టసమ్మతంగా వ్యవహరిస్తూ భారత ప్రభుత్వపు యితరబాధ్యతలను స్వీకరించడానికి కావలసిన శక్తిని సంపాదించుకుంటారు.

ఈ ఉత్తరాన్ని ముగిస్తూ ఒక్కమాట చెపుతాను. ఇప్పుడు నేను చెప్పినదంతా మార్క్సుసిద్ధాంతాన్ని విర్లక్ష్యంచేస్తున్నదని బహుశా

మీరంటారు. చట్టబద్ధమార్గాలద్వారా సమాజవాదాన్ని నెలకొల్పడం అసాధ్యమనీ, కార్మికవర్గచైతన్యప్రాతిపదికపై విప్లవనియంతృత్వాన్ని నెలకొల్పడంద్వారా మాత్రమే ఇది సాధ్యమవుతుందనీ యీ సిద్ధాంతం చెపుతుంది. ఇప్పటికే ఈ ఉత్తరం సుదీర్ఘమైనందువల్ల సమాజవాద—వ్యక్తివాదవర్చలోనికి నేను దిగదలుచుకోలేదు. ప్రజాస్వామిక ప్రభుత్వయంత్రాంగంద్వారా సమాజవాద ఆదర్శాన్ని చేరుకోవచ్చునని, ఈదేశంలోని అధికసంఖ్యాక సమాజవాదభావుకులు అభిప్రాయపడుతున్నారని నే ననుకుంటున్నాను. వారి ఆశయాలు నెరవేర్చుకునేందుకు యిది ఉత్తమమార్గం. ఈమార్గం వెనుకటిదశలలో సమకూడిన సత్ఫలితాలను కాపాడుతుంది; కమ్యూనిజాన్ని ధిక్కరిస్తూ ముందుకువచ్చేఫాసిజాన్ని ఆపుతుంది. నా వాదనలతో నన్ను బలపరచుకోకుండా, ఇందుకు మీ కొక చిన్నపుస్తకాన్ని పంపిస్తున్నాను. "సామ్యవాదంలో ఆధునికధోరణులు" అనే ఈ పుస్తకాన్ని కొంతమంది సోషలిస్టు యువకులు రచించారు. దానిని నా స్నేహితుడు జి. ఇ. జి. కాట్లిన్ ఎడిట్ చేశాడు. ఇది నాకెంతోనచ్చింది.

ఇంత దీర్ఘంగా ఉత్తరం వ్రాసినందుకు క్షమించవలసినదిగా కోరుతున్నాను. ఇన్నేళ్లా పనిచేసినతరువాత భవిష్యత్తునుగురించి నాకు కలిగిన ముఖ్యమైన అభిప్రాయాలను, భారతదేశ అగ్రనాయకులలో ఒకరైన మీకు తెలియజేయడం న్యాయమనుకున్నాను. కాంగ్రెసు విప్లవ మార్గాన్ని కోరుకుంటుందా, లేక రాజ్యాంగచట్టమార్గాన్ని వాంఛిస్తుందా? అనేది నేటి సమస్య. నా యూరోపియన్ అనుభవాన్నిబట్టి నేను కొన్ని అభిప్రాయాలను వ్యక్తపరిచాను. ఈ అభిప్రాయాలు మొదటిదానికి వ్యతిరేకమైనవి, రెండవదానికి అనుకూలమైనవి.

మీరు భారతదేశానికి వెళ్ళేలోపున మిమ్మల్ని చూచే అవకాశం కలగనందుకు నేను మిక్కిలి విచారిస్తున్నాను. మీ భార్యకు స్వస్థత చేకూరుతున్నదని ఆశిస్తున్నాను.

మీ విధేయుడు,
లోథియన్.

జవహర్‌లాల్ నెహ్రూ ఎస్క్వైర్,
పెన్షన్ ఎర్‌హార్ట్, బేడెన్‌వీలర్.

118. లార్డు లోథియన్‌కు

బేడెన్‌వీలర్,

జనవరి 17, 1936

ప్రియమైన లార్డు లోథియన్,

మీ సుదీర్ఘ లేఖను, పత్రికావ్యాసాన్ని అనేకపర్యాయాలు చదివాను. మన కమిత ఆసక్తిదాయకమైన విషయాలనుగురించి అంత విపులంగా వ్రాయడానికి మీరు శ్రమతీసుకున్నందుకు మళ్లీ ఒకసారి నా ధన్యవాదాలు. మీ ఉత్తరంలో మీ రెన్నెన్నో విషయాలను ప్రస్తావించారు. వాటి కన్నిటికి సరియైనసమాధానం వ్రాయాలంటే, నేను ప్రపంచ ప్రధాన సమస్యలను చర్చించవలసి వుంటుంది. అది నా శక్తికి మించిన పని. కాని నేను తర్కంలోకి అట్టేదిగకుండా, సమస్యల కొన్నిదృక్కోణాలను స్పృశించడానికి ప్రయత్నిస్తాను. బహుశా ఈప్రయత్నం, నాఅభిప్రాయాలేమిటో తెలుసుకునేందుకు మీకు ఉపకరించవచ్చును.

మానవచరిత్రలో పరివర్తితమౌతున్న ఒకానొక సృజనాత్మక యుగంమధ్య మనం యిప్పుడు జీవిస్తున్నామన్న మీ అభిప్రాయంతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. మనం ఒక శకపు అంత్యదశను చేరుకొని, యింకొక శకపు ప్రాంగణంలో అడుగుపెట్టాం. మృదుహృదయులను, మేధావులను, ఈ రెండు ఆదర్శాలు ఉత్తేజపరుస్తున్నవని నేనూ అంగీకరిస్తాను. పరస్పర భయద్వేషాలతో సంఘర్షణలతో కూడుకొని వున్న, స్వేచ్ఛాసత్తాకప్రభుత్వాల ప్రస్తుత అరాజకత్వాన్ని అంతమొందించి ప్రపంచవ్యవస్థను సృష్టించడానికి మొదటిది కృషిచేస్తున్నది. "ఆస్తులపై యాజమాన్యంవహించుటవల్లకాక, వ్యక్తుల శ్రమశక్తినిబట్టి అర్హమైన ఫలితాన్ని అనుభవింపజేసే భూమి, భూసంపదలూ సమాజ సభ్యుల అందరిక్షేమార్థం వినియోగించే వ్యవస్థ" స్థాపించడంకోసం సమాజవాదఆదర్శం ప్రయత్నిస్తోంది. మొదటి ఆదర్శానికి నానారాజ్య సమితి ప్రాతినిధ్యంవహిస్తున్నదని మీరు చెబుతున్నారు. ఇది బాగా వ్యాప్తిచెందిన ఒక అనుభావం. ఈ అనుభావానికి ప్రాతినిధ్యంవహిస్తు

న్నంతమేరకు ఆ ఆదర్శం నిజమని నేననుకుంటాను. కాని వాస్తవానికి ఆచరణలో ఈవిధంగా అపెంద్రమాత్రం పనిచేయడంలేదు. కొన్ని పెద్ద దేశాల విధానాలకు అది ప్రాతినిధ్యంవహిస్తోంది. ఈ మహారాజ్యాలు తమ ప్రత్యేక సౌకర్యాలను, తమ సర్వాధిపత్యాన్ని వినడానికి ఇష్ట పడడంలేదు. తమ ప్రయోజనాలకోసం ప్రపంచాన్ని సురక్షితంచేసుకు నేందుకు, నానారాజ్యసమితిని, అవి ఉపయోగించుకొంటున్నాయి.

ఇప్పు డింకొక ప్రశ్న ఉత్పన్నమౌతోంది. నానారాజ్యసమితి వెనకాలఉన్న ప్రజలు, సర్వసత్తాక ప్రభుత్వాల అరాజకత్వాన్ని మనస ముట్టించాలని చిత్తశుద్ధితో వాంఛిస్తున్నారనుకుందాము; లేదా ఆ మార్గంలో పయనించాలని వాంఛిస్తున్న ప్రజాబాహుళ్యం, వారిని ఉన్ముఖు లను కావించందనుకుందాము, అలాంటప్పుడు ఈసాంఘికవ్యవస్థను మార్చు కుందా అంటే సమాజవాదాన్ని స్వీకరించకుండా, వారు తమకార్యాన్ని తాము సాధించగలరా ఇలా సాధించాలంటే. తమ సామ్రాజ్యవాదాన్ని తాము పరిత్యజించవలసివుంటుంది. ప్రస్తుతపు పెట్టుబడిదారీవిధానానికి మించి మహాకదానిని నానారాజ్యసమితి నేడు చూడడంలేదు. ఆఖరికి సామ్రాజ్యవాదాన్నిసైతం దుమముట్టించాలని, అవి చలపోయడంలేదు. అది ముఖ్యంగా యథాస్థితిమీదనే ఆధారపడివుంది. ఈ స్థితిని పదిలపరుచు కోవడమే దాని ప్రధాన కార్యక్రమం. కనుక చాలామంది ప్రజలు, అది ప్రాతినిధ్యంవహిస్తుందనుకుంటున్న ఆదర్శానికే, అది ఆచరణలో ఒక అడ్డుగోడగా తయారైంది. ఇదే నిజమైనట్లయితే - ఇది నిజమనే నే నను కుంటున్నాను - ప్రస్తుత పెట్టుబడిదారీవ్యవస్థకు, సామ్రాజ్యవాదమూ సర్వసత్తాకప్రభుత్వాల అరాజకత్వమూ తప్పనిసరియైన, సహజమైన పరిణామస్వరూపాలు. అలాంటప్పుడు మొదటిదాన్ని ఒప్పుకోవాలంటే, రెండవదాన్ని సైతం ఒప్పుకోవలసివుంటుంది. నిజమాలోచించిచూస్తే, తనకున్నవని చెప్పబడుతున్న ఆదర్శాలతో నానారాజ్యసమితికి ప్రమేయం ఉన్నట్లు కనిపించడంలేదు; పైగా వాటికి అవరోధాల్నికూడా కలిగిస్తు న్నట్లు ద్యోతకమౌతోంది. ఇంతకీ దాని ఆదర్శాలుసైతం అదర్శాలుగా

అగమ్యగోచరమైనవి. అవి అంధకారబంధురమైన మార్గానికి తీసుకు వెళుతున్నాయి. అది మాటిమాటికి స్వవచనవ్యాఘాతాలకు, పరస్పర విరుద్ధప్రవర్తనకు గురిఅవుతూనేవుంది. ఇందులో ఏమీ ఆశ్చర్యం లేదు. ప్రస్తుత పరిస్థితిపై ఆధారపడి అది ముక్కుసూటిగా తిన్నగా ముందుకు సాగిపోలేదు. ఏమీ అంటే, ఈ యథాస్థితి దోషభూయిష్ఠమైనది; ఈ దోషానికి మూలకారణం దాని సామ్రాజ్యవాద, సాంఘిక స్వభావంలోనే యిమిడివుంది. నానారాజ్యసమితి, అబిసీనియాపై ఇటలీ దురాక్రమణను ఖండించవలసివుంటుంది; నివారించవలసివుంటుంది. ఇది న్యాయం, ధర్మం. కాని అది ఏవ్యవస్థను పరిరక్షించడానికి, వ్యాపింపజేయడానికి ప్రయత్నిస్తున్నదో, ఆ వ్యవస్థ, అట్టి దురాక్రమణకు విధిగా దారితీస్తోంది. తనంతటి భీషణంగా కాకపోయినా, ఇదివరకు సామ్రాజ్యవాదరాజ్యాలు ఏమిచేశాయో, ఇప్పుడు ఏమిచేస్తున్నాయో, అదే, తానూ చేస్తున్నానని రంకెలువేస్తున్న ముసోలినీకి సరైనసమాధానం చెప్పడానికి ఏ సామ్రాజ్యవాదికి మొహంచెల్లకుండావుంది. ఒకప్రక్క తూర్పుఆఫ్రికాలో బాంబులుకురిపించిన ఇటలీచర్యను ఖండిస్తూ ఇంకొకప్రక్క భారతదేశ సరిహద్దురాష్ట్రాలపై బాంబులతో దాడిచేసిన బ్రిటనుచర్యలపట్ల మౌనంవహించి హుందాగా కూర్చోడం అసంబద్ధంగా వుంది.

నానారాజ్యసమితియొక్క ఒడంబడికపద్ధతులవల్ల ఈ లక్ష్యాన్ని సాధించడం బహుశా అసాధ్యమని మీరే అభిప్రాయపడుతున్నారు. కనుక సమితి కలిగించే ఆశాభావం నామమాత్రమైనది. ప్రపంచశాంతి వ్యవస్థలపరంగా అది ఒక అస్పష్టమైన అనుభావాన్ని బాగా వ్యాప్తిలోనికి తీసుకొచ్చింది. ఈ అనుభావానికి ప్రాతినిధ్యంవహిస్తున్నదనే సంతృప్తితప్ప, అది మరెట్టి తృప్తినీ కలిగించజాలదు. కొన్ని కొన్ని సమయాలలో ఈ అనుభావాన్ని సమాయత్తపరచడానికీ, సంఘర్షణలను వాయిదావేయడానికీ, అది ఉపకరిస్తుంది.

మీరు చెప్పిన ఆ రెండు ఆదర్శాలూ ఒకదానికొకటి అనుసంధించి వున్నాయి. వీటిని విడదీయవచ్చునని నే ననుకోను. సమాజవాదమనే

ఆవశ్యంలో మొదటి ఆదర్శం యిమిడివుంది. సమాజవాదాన్ని ప్రపంచ వ్యాపితంగా సాధించినప్పుడు మాత్రమే, ఆ ప్రపంచశాంతివ్యవస్థలను నెలకొల్పడం సాధ్యమౌతుంది. నిజమే, మీరన్నట్లు నిజమైన సమాజ వాదవ్యవస్థను నెలకొల్పాలంటే, ఇన్నాళ్లూ పాతుకొనిఉన్న అభిప్రాయాలూ, అలవాట్లూ, స్వభావాలూ పూర్తిగా పరివర్తనచెందాలి; అవును; అందుకు కొంతకాలంపడుతుంది. అయితే దీన్ని ఒక తరంలో, అనుకూలపరిస్థితులు పొసగినపుడు, ప్రజల ఆదరణాభిమానాలు లభించినపుడు సాధించవచ్చును. కాని వున్న పరిస్థితులనుబట్టి, ఆ ఆదరణాభిమానాలకు మారుగా, మా దేశంలో అనిష్టతలు, ప్రతికూలభావాలు విస్తరించి వున్నాయి. అందువల్ల సమాజవాదవ్యవస్థను నెలకొల్పడానికి మరి కొంతకాలం ఎక్కువ పట్టవచ్చును. అందుకు ఎంతకాలం పడుతుందనేది ప్రధానప్రశ్నకాదు. ప్రధానమైన ఈమార్పులను తీసుకొని రాగల పరిస్థితులను ఎలాగ సృష్టించవచ్చుననేది మాకుగల ప్రధాన ప్రశ్న. ఈ ప్రశ్నను సాధించినప్పుడు మాత్రమే, మేము సరైనమార్గం లోకి అడుగుపెట్టగలం. ప్రస్తుతంమటుకు వాతావరణం మాకు 'అనుకూలంగా లేదు. సంఘర్షణలను ప్రేరేపించే సంకుచితతత్వాలను, స్వలాభాపేక్షను, పరస్పరద్వేషాలను తగ్గించడానికి మారుగా ఈ పోకడలన్నింటినీ అదిప్రోత్సహిస్తున్నది. ఇంతటి అననుకూలపరిస్థితులలోసైతం, మాలో కొంతమంది ఛాందసభావాలను, సంప్రదాయాలను సవాలుచేస్తున్నారు. కొంత పురోభివృద్ధిని సాధిస్తున్నారు. కాని ఈ కృషి చాలా మందకొడిగా కొనసాగింది. అయితే. ఉత్పత్తిశక్తుల అభివృద్ధికూడా దీనికితుల్యంగానే వుంది.

పెట్టుబడిదారీవిధానం, ఆస్తుల ఆర్జనాపేక్షను ప్రోత్సహిస్తుంది. ఈ సహజప్రేరేపణలు నశించాలని యిప్పుడు మే మభిలషిస్తున్నాం. మొట్టమొదటిదశలో పెట్టుబడిదారీవిధానం చాలా మంచిని చేకూర్చింది. ఉత్పత్తిని పెంపొందించి జీవనప్రమాణాన్ని హెచ్చించింది. ఇతరవిధాలకూడా, ఒక ప్రయోజనాన్ని సాధించింది. ఇది, తత్పూర్వ వ్యవస్థకంటే, నిశ్చయంగా అభివృద్ధికరమైనది. కాని యిప్పుడు ఉపయోగకరమైన తన ప్రయోజనాన్ని పూర్తిచేసి, తద్దశను దాటిపోయింది. ఇక

దానిఉపయోగమేమీ వున్నట్లు కనిపించదు. ప్రస్తుతం ఉపయోగపడక పోవడం అలావుంచగా, సమాజవాదమార్గపురోగతిని నిరోధించడమే కాక, అది, మనలో అవాంఛనీయ సహజప్రేరేపణలను. అలవాట్లను ఇనుమడింపచేస్తోంది. ఆస్తిహక్కులపై సంపదలస్వత్వంపై ఆధార పడివున్న, లాభాలను ఆర్జించిపెట్టడమే పరమధ్యేయంగాగల పెట్టుబడి దారీసమాజంలో, మనం సమాజవాదపద్ధతులపై ఎలా పయనింపగ లమో నాకు అర్థంకాకుండావుంది. మనం ఆమార్గంలో పయనించా లంటే, ఆస్తిహక్కులపై లాభాలఆర్జనపై ఆధారపడివున్న సమాజ ప్రాతిపదికను మన శక్త్యానుసారం మార్చివేసి, వాంఛనీయమైన వినూత్న భావాలను, అలవాట్లను పెంపొందించడం అవసరం. అంతే, ఇందు కోసం, పెట్టుబడిదారీవ్యవస్థను పూర్తిగా మనం మార్చివేయవలసి వుంటుంది.

అవును; మీరు పేర్కొన్నట్లుగా పెట్టుబడిదారీవ్యవస్థ తనకు తానై అంతర్జాతీయ అరాజకత్వాన్ని సృష్టించనిమాట నిజం; కాని అందుకు మార్గాన్నిమాత్రం సుగమంచేసింది. దేశంలో అంతర్యుద్ధ ప్రమాదాన్ని గతంలో అది నివారించింది; లేదా తగ్గించింది. కానైతే భవిష్యత్‌లో అంతర్యుద్ధప్రమాదాన్ని తెచ్చిపెట్టగల వర్గసంఘర్షణను తీవ్రతరంచేసింది. అంతర్జాతీయరంగంలో విస్తృతప్రాతిపదికపై అరాచకత్వాన్ని వ్యాపింపచేసి అల్ప ప్రాదేశిక యుద్ధాలకు బదులు అనల్ప మైన, మహాభయంకరమైన జాతీయ సంఘర్షణలను తెచ్చిపెట్టింది. కనుక ఈ అరాజకత్వాన్ని అది సృష్టింపకపోయినప్పటికీ విధిగా దాన్ని రగుల్కొల్పుతూంది. అది తను అంతంకానిదే, దాన్ని అంతంచేయ లేదు. తమలో తాము నిరంతరం ఘర్షణపడుతూ వివిధదేశాలను, అసం ఖ్యాకప్రజలను పీల్చి పిప్పిచేసి దోచుకతింటున్న ఆధునిక సామ్రాజ్య వాదాన్ని అది రూపొందించింది.

చరిత్రను ఆర్థిక, భౌతికవాదదృష్ట్యా మార్క్స్ కొంచెం అతిగా అన్వయించి చెపితే చెప్పవచ్చును. ఈదృష్ట్యా అది పూర్తిగా నిర్లక్ష్యం చేయబడడంవల్ల, లేదా ఎంతో తక్కువగా చూడబడడంవల్ల బహుశా

మార్క్స్ ఈవిధంగా నొక్కి నొక్కి దాన్ని గురించి చెప్పివుండవచ్చును. కాని సంఘటనలను రూపొందించడంలో యితరశక్తులకున్న ప్రభావాన్ని మార్క్స్ ఎన్నడూ విస్మరించలేదు. ఆర్థికశక్తికున్న ప్రాధాన్యమును గురించి ఆయన నొక్కి నొక్కి చెప్పాడు. ఆయ నీవిషయాన్ని ఎంత ఎక్కువగా నొక్కి నొక్కి చెప్పాడనేది ప్రధానప్రశ్న కాదు.

ఎలాచెప్పినా నిజం వుండనేవుంది. ఆయన చారిత్రకవ్యాఖ్యాన మొక్కటే చరిత్రను కొంతవరకు అన్వయించి, దాని అర్థాన్ని కొంత వరకు విపులీకరిస్తున్నదని నేననుకుంటున్నాను. ప్రస్తుతస్థితిని అర్థం చేసుకునేందుకు అది మనకు తోడ్పడుతుంది; భవిష్యత్తును గురించిన ఆయన జోస్యాలు ఎన్నో నిజమయ్యాయి. ఇది ఎంతో గమనించతగ్గది.

అయితే సామ్యవాదం ఎలావస్తుంది? ఉత్పత్తిని, ఉత్పత్తివిని మయాన్ని జాతీయంచేయడంవల్ల సామ్యవాదాన్ని సాధించలేమని మీరంటున్నారు. అయితే ఇందుకు లాభాల ఆర్జనాదృష్టినీ, సంపదలపై యాజమాన్యదృష్టినీ తుదముట్టించి ప్రజలలో అనుకూల సహకారదృష్టిని పెంపొందించడం అవసరంకాదా? ప్రస్తుత సాంఘిక ప్రాతిపదికకు పూర్తిగా విభిన్నమైన పునాదులపై నూతన నాగరకతను నిర్మించడం అవ సరంకాదా? ఇలాంటి సాంఘికవ్యవస్థను నెలకొల్పినపుడు సాంస్కృతికాది విషయాలు కొన్నింటిలో వ్యక్తిపరమైన పెట్టుబడులకు ఆస్కారంలేకపోతే లేకపోవచ్చునుగాక. ఇలాంటి వ్యక్తిపరమైన దృష్టిని త్రోసిపుచ్చక తప్పదు. ఏమైనప్పటికి ఉత్పత్తిని ఉత్పత్తివినిమయసాధనాలను జాతీయం చేయనిదే సామ్యవాదస్థాపన సాధ్యంకాదు. సామ్యవాదవ్యవస్థను నెల కొల్పడానికి ఏవేవో యితరమార్గాలు వున్నాయని వాదించవచ్చును. అన మగ్రమైన అర్ధమార్గాలు ఉంటే వుండివుండవచ్చును. కాని పరస్పరవిరుద్ధ మైన సంఘర్షణదాయకమైన రెండువిధానాలను ఒకేసారి ఎవరూ స్వీకరించ లేరు. ఎవరైనా ఏదో ఒక విధానాన్ని అనుసరించాలి. సామ్యవాదాన్ని నెలకొల్పాలనుకునేవారికి ఒకే ఒక విధానముంది.

పూర్తి ప్రజాస్వామికయంత్రాంగం పొసగినప్పుడు సమాజ వాదాన్ని, ప్రజాస్వామికపద్ధతులద్వారా నెలకొల్పవచ్చునని నా అభి

ప్రాయం. సిద్ధాంతరీత్యా యిది నిజం కావచ్చును గాని, ఆచరణలో మాత్రం దీనికి ఎన్నెన్నో అవాంతరాలు కనిపిస్తున్నాయి. సమాజవాదప్రతిస్పర్థులు తమ అధికారానికి ప్రమాదస్థితి ఏర్పడుతుందనే భావంతో ప్రజాస్వామ్యాన్ని తోసిపుచ్చుతారు. ఇలాగ ఎన్నటికీ ప్రజాస్వామ్యాన్ని సమాజవాదులు తోసిపుచ్చరు; తోసిపుచ్చగూడదు; దీనిని త్రోసిపుచ్చేవారు సమాజవాదప్రతిస్పర్థులుమాత్రమే. అప్పు డది ఫాసిజమౌతుంది. దీన్ని ఎలా తప్పించుకోవాలి? ప్రజాస్వామికవిధానం తనకు తగినట్టుగా చాలా విజయాలు సాధించింది. కాని సామాజిక లేదా రాజ్యాంగనిర్మాణమూల ప్రాతిపదికకు ప్రమాదం సంభవించినపుడు, దీన్ని పరిష్కరించడంలో అది ఇంతవరకు విజయాన్ని సాధించినట్టు నాకు కనుపించదు. ఈ సమస్య ఉత్పన్నమైనపుడు అధికసంఖ్యాకప్రజలు వాంఛిస్తున్నారన్నంత మాత్రంచేత, రాజ్యాంగయంత్రపై అధికారాన్ని చెలాయించేవర్గం తన అధికారాన్ని తనకులానుగా వదులుకోదు; యుద్ధానంతర పాశ్చాత్యదేశాల చరిత్రలో యిందుకు అనేక దృష్టాంతరాలను మనం చూశాం. యుద్ధానంతరం ప్రజాస్వామికం ఆ దేశాలలో క్షీణించింది. అందులోనూ అనేక ఉదాహరణలు మనకు కనిపించాయి. అసంఖ్యాకప్రజలతోడ్పాటు లభించనిదే, వారి లాభార్జనాదృష్టి తొలగనిదే, సామ్యవాదపరివర్తనను తీసుకురావడానికి వీలుకలగదు.

ఇక మీరు బ్రిటన్ భారతదేశాలనుగురించి మీ లేఖలో ఎన్నెన్నో నిరాధారమైన ఊహలుచేశారు. మీ ఊహలు పెక్కింటితో నేను ఏకీభవించనట్లుగానే, వాటిని పురస్కరించుకుని కావించిన మీ నిర్ధారణలు కొన్నింటిని అంగీకరించలేను. "బ్రిటన్, తన పాతకాలపు సామ్రాజ్యవాదాన్ని పరిత్యజిస్తూ, నూతన సామ్రాజ్యవాద ఆవేశానికి లోనుకాకుండా నివారించి, విశ్వవ్యాప్తమైన జాతీయ స్వయంనిర్ణయసిద్ధాంతం యుద్ధాలకే దారితీయకుండా వారించాలనే దీక్షతో మా కనుగుణమైన మార్గాన్ని అవలంబించడానికి అనేకవిధాల ప్రయత్నిస్తోందని" మీరు పేర్కొంటున్నారు. కాని బ్రిటన్, ఈ మార్గంలో అలాంటి ప్రయత్నమేదీ చేస్తున్నట్లు

నా కెక్కడా కనిపించదు. పాతకాలపు సామ్రాజ్యవాదాన్ని పిసరంత ఒదులుకోకపోవడంమాట అటుంచి, దాన్ని పట్టుకుని ప్రేలాడడానికి, ప్రాకులాడుతోంది. ఒక నూతనవ్యవస్థ ఆవిర్భవించి, ప్రజలకళ్లెదుట కనిపిస్తున్నప్పటికీ, తన సామ్రాజ్యవాదాన్ని బలపరుచుకునేందుకు పడరాని పాట్లు పడుతోంది. బ్రిటను క్రొత్తగా యుద్ధాల్ని కోరడంలేదు. అవి దాని కక్కరలేదు. ఇప్పటికే అనేకరాజ్యాలను కబళించి నిండు సంతృప్తితో వున్నరాజ్యం అది; అలాంటపుడు తన అధీనంలోవున్నవాటిని పణంగా అది ఎందుకు ఒడ్డుతుంది? యుద్ధఫలితాలు తనకనుకూలంగా వుండకపో వచ్చును; కనుక తనకు లాభసాటిగావున్న ప్రస్తుత "యథాతథస్థితిని" అలాగే కొనసాగించాలని కోరుతోంది. దానికి నూతన సామ్రాజ్యవాదా లంటే కిట్టదు; ఇందుకు కారణం సామ్రాజ్యవాదమంటే దానికి యిష్టం లేకకాదు, తన పాతకాలపు సామ్రాజ్యవాదాన్ని నూతన సామ్రాజ్యవా దాలు ఎదుర్కొంటాయని దానిభయం.

భారతదేశంలో "రాజ్యాంగమార్గాన్ని" గురించి మీరు మీ లేఖలో ప్రస్తావించారు. అసలు ఈ రాజ్యాంగమార్గం అంటే ఏమిటి? ప్రజాస్వామిక రాజ్యాంగప్రభుత్వంగలచోట, రాజ్యాంగబద్ధ కార్యకలాపాలంటే ఏమిటో నే నర్థంచేసుకోగలను; కాని అలాంటిదేదీలేనిచోట, రాజ్యాంగ పద్ధతులనబడేవాటికి అర్థంపర్థం లేదు. అపుడు 'రాజ్యాంగబద్ధమైన' అనే పదానికి 'న్యాయశాస్త్రసమ్మతమైన' అని అర్థం; న్యాయశాస్త్ర సమ్మతమైన' అనే మాటకు, ప్రజాభిప్రాయంతో ప్రమేయంలేకుండా, ఆర్డినెన్సులు డిక్రీలు జారీచేసే నిరంకుశప్రభువులచిత్తానుసారంగా అని అర్థం. నేడు జర్మనీలో ఇటలీలో అనుసరిస్తున్న రాజ్యాంగపద్ధతి ఏమిటి? పంథొమ్మిదవ శతాబ్దంలో లేదా ఇరవయ్యోశతాబ్దపుప్రారంభంలో భారతదేశంలో అనుసరించిన, ఇపు డనుసరిస్తున్న పద్ధతి ఎటువంటిది? భారతదేశంలో తగిన రాజ్యాంగయంత్రంద్వారా, ఒక మార్పునుతీసుకురావడానికి భారతీయులకు అప్పుడూ అవకాశంలేకపోయింది; ఇప్పుడూ లేకుండావుంది. ఇక వారు అర్థించనన్నా అర్థించాలి; లేదా తిరగబడనన్నా తిరగబడాలి. తమదేశంలో మార్పుతీసుకురావాలనే భారతీయులకోర్కె ఫలప్రదంకాకే

సంటే, అందుకు వారిఎదుట 'రాజ్యాంగబద్ధమైన మార్గం' అంటూ ఏవీ లేకపోవడమే కారణం. తాము తీవ్రంగా ద్వేషిస్తున్నదానికి వారు లొంగి పోవాలి; లేదా, రాజ్యాంగపద్ధతులనబడేవాటిని కాకుండా మరేవో పద్ధతులను అవలంబించాలి. ఆ యా ప్రత్యేకపరిస్థితులననుసరించి, ఈ పద్ధతులు వివేకవంతమైనవి కావచ్చును; లేదా కాకపోవచ్చును; కాని అవి రాజ్యాంగబద్ధమైనవా, కావా అనే ప్రశ్న ఎన్నటికీ ఉదయించదు.

సాధారణంగా మనలో చాలామందిమి, మనదేశాలంటే మనకుండే పక్షపాతదృష్టిని ఒదిలించుకోలేకపోతున్నా మనుకుంటాను. అంతో యింతో ఈ దృష్టిఅంచులోనూ ముఖ్యంగా బ్రిటన్‌భారతదేశసంబంధాలను గురించి ఆలోచిస్తున్నపుడు - నాకు వుందని నేను గుర్తించకతప్పదు. మీ రంయుకు అనుమతించాలి. బ్రిటిష్‌వారు, తమ స్వప్రయోజనాలను భౌతికలాభాలను సాధించుకుంటూ, వాటికి నైతికసూత్రాలను పక్కాగా ముడిపెడతారు. తా మెప్పుడూ మేలును చేకూర్చుతున్నామని, పరోపకారార్థం పనిచేస్తున్నామని, ఉదాత్తాశయాలతో ప్రవర్తిస్తున్నామని, ఇతరుల వల్ల కష్టాలు యిబ్బందులు గడిబిడలు కలుగుతున్నాయని సాటిలేని అహంకారాన్ని ప్రదర్శిస్తూవుంటారు. నాకు ఇంతకంటే ఇంకేదీ ఆశ్చర్యకరంగా కనిపించదు. కాని ఈ అహంకారాన్ని అందరూ ఆమోదించ లేదని యూరపు అమెరికా ఆసియాలలో యిది అపహాస్యంపాలౌతున్నదని మీకూ తెలుసు. గతంలోనూ యిప్పుడూ బ్రిటిష్‌పరిపాలనను చవి చూసిన తరువాత, ముఖ్యంగా భారతదేశంలో మేము మీ అహంకారాన్ని తిరస్కరించినట్లయితే, పాపం, మీరు మమ్మల్ని మన్నించాలి మరి. భారతదేశంలో జరిపిన జరుపుతున్న ఘోరకృత్యాలను ఎదుట పెట్టుకుని, రాజ్యాంగవిధానాన్నిగురించి, ప్రజాస్వామ్యాన్నిగురించి మాట్లాడడం ఈ పదాలకుగల విశిష్టార్థాన్ని పూర్తిగా చెడగొట్టడమేనని నే ననుకుంటాను. పరిపాలకరాజ్యాలు, పరిపాలకవర్గాలు, తమ అధికారాన్ని ఇచ్ఛాపూర్వకంగా త్యజించినట్లు, చరిత్రలో ఎట్టి ఉదాహరణ కనుపించదు. చరిత్ర బోధిస్తున్న ఈ ఉద్బోధ చాలకపోయినట్లయితే, మా ప్రత్యక్షానుభవమే మాకు చాలును.

అవును; అది నిజమనే అనుకుంటాను: బ్రిటిష్ పరిపాలకవర్గాలకు, పరిస్థితులతో సరిపెట్టుకునే ఒకానొక మానసికశక్తి వుంది; కాని వారి అధికారానికి ఆధారభూతమైన మూలసూత్రాలకు ముప్పువచ్చినప్పుడు, పరిస్థితులతో సరిపెట్టుకోవడమనే ఈ కృత్రిమస్వభావానికి ఆస్కారంవుండదు. భారతదేశ స్వాతంత్ర్యానికి బ్రిటిష్‌ప్రభుత్వం లేదా పార్లమెంటు దస్కత్తు చేసిందనీ, దాని నిర్ణయాలను ఉదారబుద్ధితో కనిపెడుతూవుంటుందని ఎవరైనా ఊహిస్తే వారు కేవలం భ్రాంతిపడుతున్నారని చెప్పకతప్పదు. భారతదేశమంటే, భారతీయులంటే, చాలామంది బ్రిటిష్‌ప్రజలకు అభిమానంవుందని భారతదేశస్వాతంత్ర్యాన్ని చూడగోరుతున్నారని నేను నమ్ముతున్నాను. కాని తమ ప్రభుత్వవిధానాన్ని రూపొందించడంలో వారి లెక్కలోకి రారు; వచ్చినప్పటికీ, వారు, లేదా వారిలో చాలామంది, భారతదేశం పొందే స్వాతంత్ర్యం, బ్రిటిష్‌కోరికలకు ప్రయోజనాలకు పరిమితమైవుండాలనే వాంఛిస్తారు. మేము, మా అర్హతను రుజువుచేసుకుంటున్నకొద్దీ, అందుకు తగినట్లుగా, స్వాతంత్ర్యాన్ని బాధ్యతలను క్రమక్రమంగా మీరు యిచ్చుకుంటూవస్తారు; అర్హతకొద్దీ స్వాతంత్ర్యం; ఎంత హెచ్చు అర్హతవుంటే అంత యెక్కువ స్వాతంత్ర్యం, అంత ఎక్కువ బాధ్యతలు; ఇదీ మీరు మాకు చెప్పినమాట. అయితే బ్రిటిష్‌పత్రంలో మేమెంతవరకు యిమిడివుండగలమో మీరు పరిశీలిస్తారు, అదీ మా అర్హతకుగల పరీక్ష. ఈ సందర్భంలో ఇంగ్లండులోవున్న మా ఉపదేశకులు, శ్రేయోభిలాషులు ఈసప్‌కథలను-ముఖ్యంగా తోడేలు - మేకపిల్ల కథను - మళ్లీ ఒకసారి చదివితే బాగుండునని ఎవరికైనా అనిపిస్తుంది.

అవును, నిజం. అనేక ఇతరవిషయాల్లోలాగే, రాజకీయాల్లో కూడా మనం, వున్నవాటిని చెరిపివేసి కొత్తగా కృషి ప్రారంభించలేం. జీవితం తరుచు మానవతర్కానికి అందనంతటి సంకీర్ణమైనది. మొదటిది ఎంతనిజమో, ఇదీ అంతే నిజం; మనం మనకిష్టమున్నా. లేకపోయినా, వున్నవిషయాలను వున్నట్లుగా స్వీకరించి ఆదర్శవాదాలతో సమన్వయం చేసుకోవాలి, అయితే, మనం సరియైనత్రోవలో నడవవలసివుంటుంది.

మీరు చెప్పినప్రకారంగా దీనికి అర్థం యిది: అన్నిటికంటె మొట్టమొదట భారతదేశపు ఏకతను కాపాడడం, పిమ్మట మతతత్వాన్ని నిర్మూలించి, స్వప్రయోజనపరుల తృష్ణను అదుపులోపెట్టుకుని, క్రమక్రమంగా, దాన్ని తొలగించడం, ప్రజల జీవనప్రమాణాన్ని హెచ్చించడం, నిజమైన భారతీయసైన్యాన్ని అభివృద్ధిచేయడం, ప్రజాస్వామికరాజ్యాని కవసరమైన ఆచరణయోగ్య నిర్మాణకార్యక్రమంలో భారతదేశయువకులకు తరిఫీదుయివ్వడం; ఇవి సాధించినతరువాతనే, సామ్యవాద ఆదర్శాన్ని చేరుకోవడం సాధ్యమౌతుంది; ఈ ఆదర్శాన్ని చేరుకునేందుకు అవసరమైన ఆ ప్రగాఢ సహజప్రేరేపణలను, అలవాట్లను పెంపొందించి, అందుకనుగుణమైన సాధారణవాతావరణాన్ని నెలకొల్పాలి.

ఇంతవరకు ఈ ప్రకటనతో మనలో చాలామంది అంగీకరిస్తారని అనుకుంటాను. దీనిని ఇంకొకవిధమైన మాటలతో, కొన్ని చేర్పులతో కొన్నికొన్ని విషయాలను మిగతావాటికంటె నొక్కినొక్కి చెబుతూ స్పష్టపరచవచ్చును. పోనీ, దానికేమి. అన్నిటికంటె మొట్టమొదట, రాజకీయదశ, వస్తుందన్న మీ అభిప్రాయంతో నే నేకీభవిస్తాను. నిజానికి, ఆ దశ లేనిదే, ఇంకొకదశ లేదు. ఇది, సాంఘికమార్పులను తనతో పాటు తీసుకురావచ్చును; లేదా అటుపిమ్మట తీసుకురావచ్చును. రాజకీయ ప్రజాస్వామ్యం సాంఘిక ప్రజాస్వామ్యానికి మార్గం సుగమంచేస్తుందన్న విశ్వాసంతోమాత్రమే నేను దీన్ని సమ్మతించడానికి సంసిద్ధంగా వున్నాను. రాజకీయప్రజాస్వామ్యం గమ్యానికి మార్గమే తప్ప అదే అంతిమలక్ష్యం కాదు. ఆర్థికసంస్కరణలు కలగాలనే వాంఛ దీని అత్యవసర స్థాపనావశ్యకతను ప్రేరేపిస్తుంది. ఈ మార్పులు జరగనంతవరకూ, రాజకీయవ్యవస్థ అస్థిరంగావుంటుంది. నేటి పరిస్థితులలో భారతదేశంలో ఆర్థికపరివర్తన అత్యవసరమని నా భావం. శక్తివంతమైన రాజకీయపరివర్తన, గణుతింపతగిన ఆర్థికపరిణామాలను తనవెంట తీసుకువస్తుంది; లేదా తన వెనకాల తీసుకువస్తుంది. ఎలాగైనప్పటికీ, ఈ సాంఘికమార్పులకు. రాజకీయపరివర్తన దోహదపడేదిగా వుండాలి;

వాటికి అది ఒక అడ్డుగోడగా తయారైనట్లయితే, ఈ రాజకీయపరివర్తన వాంఛనీయమూ కాదు; అది కలిగివున్నందువల్ల ప్రయోజనమూ లేదు.

భావ్యత ఎరిగిన ఏ భారతీయుడూ, భారతదేశపు ఏకతనుగురించి యింకొకవిధంగా ఆలోచిస్తున్నట్లు నాకింతవరకు కనిపించలేదు. మా రాజకీయవిశ్వాసానికి అది అతిముఖ్యమైన సూత్రం. మేమేదిచేసినా దానికోసమే చేస్తాము. ఈ ఏకత, ఒక సమాఖ్యఏకతవంటిది కాదోతున్నదని నే నంగీకరిస్తాను. అంటే దానర్థం, సూక్ష్మదర్శకింద ఏర్పడుతుందనుకునే సమాఖ్యలోని ఏకతమటుకు ఎన్నటికీ కాదు. ఒక సామాన్యపరిపాలనావ్యవస్థకు లోబడివుండడంవల్ల వచ్చే ఏకత అంతకన్నా కాదు. అస్తవ్యస్తపరిస్థితుల అభ్యాస్నవశ భారతదేశంలో ప్రత్యేకరాష్ట్రాలు ఏర్పడడానికీ, అనైక్యతకూ దారితీయవచ్చును. కాని యింత మాత్రంచేత, ఏదో మహాప్రమాదం ముంచుకువస్తుందన్న గడబిడకు అర్థంలేదు. ఏకతాధోరణి భారతదేశమంతటా చెక్కుచెదరకుండా, ఎంతో బలంగా ద్యోతకమౌతోంది.

మీ ఉద్దేశంప్రకారం విచ్ఛిన్నకరమైన శక్తులు యివి: మతం, జాతి, భాష. జాతికున్న ప్రత్యేకప్రాధాన్యం ఏమిటో నాకు బోధపడకుండావుంది. భారతదేశంలో జాతి అనేది మతంతో పెనవేసుకుని వుంది; కులమనేదూపాన్ని సగంవరకూ ధరించింది. హిందువులు, ముస్లిములు విభిన్నజాతులవారు కారు. వారు ప్రధానంగా జాతుల ఏకైక సమ్మిశ్రితరూపానికి చెందినవారు; ఈవిధంగా అక్కడ పలు జాతులున్నప్పటికీ, ఒకదానితో యింకొకటి సమ్మిశ్రితమౌతూ మొత్తంమీద జాతిపరంగా సాంస్కృతికంగా ఒకేఒక కుటుంబంగా రూపొందాయి. భారతదేశంలో ఏవేవో వందలకొద్దీ భాషలున్నాయని చెప్పబడుతున్నవిషయాన్ని చర్చించడమంటే, మా విమర్శకులకున్నంత ఉత్సాహం మరెవరికీలేదు; కాని సాధారణంగా వారిలో ఎవరికీ ఈ భాషలలో దేనితోనూ పరిచయంమాత్రం శూన్యం. నిజానికి, భారతదేశం భాషాపరంగా ఒకేఒక రూపాన అనుసంధింపబడి వుంది. బహుళ విద్యా

ప్రచారం లు ప్రమైనందువల్లనే, అనేక మాండలికాలు అలాగే వుండి పోయాయి. భారతదేశంలో పది ప్రధానమైన భాషలున్నాయి. కొన్ని చిన్నచిన్న ప్రదేశాలలోవున్న జనులు తప్ప, మిగిలిన ప్రజలందరూ, ఈ భాషలే మాట్లాడతారు. ఇవి ఆర్యభాషా, ద్రవిడభాషా కుటుంబాలకు చెందిన భాషలు. ఈ రెండు కుటుంబభాషలకు సమన్వయ ప్రాతిపదిక సంస్కృతం. ఆర్యభాషాకుటుంబానికి చెందిన భాషలలో హిందూస్థానీ ఒకటి. పలు మాండలికాలతోకూడిన ఈ భాషను పన్నెండుకోట్ల మంది ప్రజలు మాట్లాడుతున్నారు; ఇది దేశంలో ఎక్కువగా విస్తరిస్తోంది. ఆర్యభాషాకుటుంబానికిచెందిన మిగిలినభాషలు బెంగాలీ, గుజరాతీ, మరాటీలు హిందూస్థానీకి అత్యంత సన్నిహితంగా వుంటాయి. భారతదేశ సమైక్యభావమును సాధించడంలో మా కేవేవో ఇతరకష్టాలుంటే వుండవచ్చుగాక; కాని భాషాసమస్య మా కంత జటిలమైనదికాదు. దానిని మేము సులభంగానే పరిష్కరించుకోగలం.

భారతదేశంలోవున్న ప్రస్తుత మతపరిస్థితిని, యూరోపులో జాతీయ పునరుజ్జీవన, సంస్కరణోద్యమాలతోను, ఆనాటి మతపరిస్థితితోను మీరు పరిపోలుస్తున్నారు. భారతదేశప్రజలకు జీవితంమీద ఒక స్పష్టమైన మత దృక్పథంవుంది; దీన్ని యూరపులో మధ్యయుగాలనాటి మతదృక్పథంతో సరిపోల్చవచ్చును: నిజమే. కాని మీరుచెప్పింది ఉపరితలం మేరకే సరిపోతుందితప్ప అంతకుమించి సరిపోల్చడానికి కుదరదు. యూరపును రక్తపుటేరులలో ముంచెత్తిన మతయుద్ధాలవంటివాటికి భారతదేశం తన చరిత్రలో, లా నెన్నడూ లోనుకాలేదు. భారతదేశ సాంస్కృతిక, మతతాత్త్వికసిద్ధాంతాలచుట్టూవున్న వాతావరణం పరమతసహనంతో నిండివుంది. భారతదేశంలోనికి ఇస్లాము ప్రవేశించునపుడు ఒకవిధమైన పోరాటం జరిగింది. ఇందుకు కారణం మతమని నొక్కినొక్కి ఎంత అతిగా చెప్పినప్పటికీ, రాజకీయకారణాలే, అనేకరెట్లు అధికంగా కనిపిస్తాయి. ఇది విజేతలకు, పరాజితులకు మధ్య జరిగిన పోరాటం. ఈమధ్య జరిగిన పరిణామాలను దృష్టిలోపెట్టుకుని ఆలోచించినా, ఏదోఒక పెద్దఎత్తున భారతదేశంలో మతపోరాటం చెల

రేగుతుందని నేను సులభంగా ఊహించలేను. నేటి మతవాదం ప్రధానంగా కొన్ని రాజకీయ ఆర్థికతాత్పర్యాలను ప్రతిస్పందించుకుని తల ఎత్తింది. ఇది ముఖ్యంగా మధ్యతరగతివారిలో కూడుకొనివుంది. నేను అల్‌స్టర్‌లో మతవిద్వేషాలు ఎక్కడచూసినా, బాగా గాఢంగా నాటుకుపోయివున్నాయి; ఇంతటి ఉద్రిక్తత భారతదేశంలో ఎక్కడా కనిపించదు. భారతదేశంలో మతవాదమన్నది ఇటీవల మనకళ్ల ముందర జరిగిన ఒకానొక పరిణామం. ఈ విషయం ఎవరూ మర్చిపోరాదు. అయితే అంతమాత్రంచేత, దాని ప్రాధాన్యం తగ్గిపోయిందని, దానిని ఖాతరు చేయనక్కరలేదని అర్థంకాదు; ప్రస్తుతం అది మా దారికి కొంత అవరోధంగా తయారైంది; ముమ్ముందు మా పురోగతితో అది చోక్యం పెట్టుకోవచ్చును; కాని కొందరు గోరంతలు కొండంతలుచేసి దీనికి అనుచిత ప్రాధాన్యమిస్తున్నారు. మతం అప్పుడప్పుడు ప్రజలను ఆవేశపరుస్తున్నప్పటికీ, అందువల్ల తిరుగులేని పరిస్థితులు కలుగబోవు. సాంఘికసమస్యలు ముందుకు వస్తున్నకొద్దీ, అది, తప్పనిసరిగా వెనక్కి వెళ్ళిపోతుంది. కరుడుకట్టిన మతతత్త్వవాదులు ఏమి కోరుతున్నారో మీ రొకసారి పరీక్షించిచూడండి: వారి కోరికలేవీ ప్రజలకు సంబంధించినవికావు. అన్నిమతాల మతతత్త్వనాయకులు, సాంఘికార్థిక సమస్యల్నిచూసి భయపడిపోతున్నారు, సాంఘికపురోగతిని నిరోధించడానికి, ఒకరితో ఒకరు చేతులు కలుపుతున్నారు.

భారతదేశంలో బ్రిటిష్‌పరిపాలన, దేశంలో రాజకీయసామరస్యమును నెలకొల్పడానికి తోడ్పడింది. బ్రిటిష్ ప్రభుత్వంక్రింద తాము బంధింపబడివున్నామనే పరిజ్ఞానం ప్రజలందరికీ కలిగింది; ఈ జ్ఞానం వలన తాము విముక్తిపొందాలనే కోరిక అందరికీ కలిగింది. ఇది ప్రజలందరినీ సమైక్యపరచిన సూత్రం. ఈసందర్భంలో ఒక యదార్థవిషయాన్ని గుర్తుపెట్టుకోవలసివుంటుంది - దాన్నింతవరకు కొందరు సరిగ్గా గుర్తించలేదు - భారతదేశచరిత్రను పరిశీలించిచూస్తే అది ఇంతవరకూ భౌగోళికంగా సాంస్కృతికంగా అత్యంత సామరస్యం కలిగివున్నట్లు స్పష్టపడుతుంది; ఆధునికకాలంలో వర్తక వాణిజ్యాలు, రాక

పోకపోకలు అభివృద్ధిఅవుతున్నకొద్దీ. రాజకీయ సమైక్యభావం సహజంగా పెంపొందుతూవచ్చింది. కాని ఈ సమైక్యభావమును భగ్నం చేయడానికి బ్రిటిష్‌ప్రభుత్వం, తమ పరిపాలన నెలకొల్పినప్పటినుంచీ ఒకొక్కప్పుడు బుద్ధిపూర్వకంగా, యింకొకప్పుడు అప్రయత్న పూర్వకంగా, ఎత్తుగడలను వేస్తూనేవుంది. ఇలా చేయడం, అన్ని సామ్రాజ్యవాదాలకు, పరిపాలకవర్గాలకు సహజమే మరి. ఇందులో ఆశ్చర్యంలేదు. అది వాటినీతి. ఈ నీతినిగురించి పంథొమ్మిదవ శతాబ్దంలో, భారతదేశంలో వున్న బ్రిటిష్ ఉన్నతాధికారులు వెలిబుచ్చిన అభిప్రాయాలు చదవడానికెంతో చమత్కారంగా వుంటాయి. ఆనాడు ఈసమస్య అంత అత్యవసరమైనది కాకపోయింది; కాని జాతీయోద్యమం పెరుగుతున్నకొద్దీ, ముఖ్యంగా ఈ ముప్ఫైసంవత్సరాల్లో అది ఎంతో గత్యంతరంలేని సమస్యగా మారిపోయింది. బ్రిటిష్‌ప్రభుత్వం, ఈ చీలికలుకలుగచేయడానికి, అవకాశముంటే, వీటిని వ్యాపింపచేయడానికి ఏయే పద్ధతు లవలంబించాలని ఆలోచించుకుంది. భారతదేశవిచ్ఛిత్తికి దారితీసే ధోరణి, అంతర్గతంగా దేశంలో లేకపోయిందని, రాజకీయాధికారం పొందుతున్నపుడు ఈధోరణి పెరగడానికి ఆనాడు అవకాశంలేదని ఎవరూ అనరు. కాని ఈ ధోరణిని తగ్గించే విధానాన్నవలంబించడానికీ ఆనాడు అవకాశంవుంది: లేదా దీన్ని ప్రోత్సాహపరచడానికీ అవకాశం వుంది. ప్రభుత్వం రెండవ విధానాన్ని చేపట్టింది; దేశంలో అన్నివిధాలా విచ్ఛిన్నకర ధోరణులనన్నిటినీ ప్రోత్సాహపరిచింది. అయితే, ప్రజల చారిత్రకాభివృద్ధిని ఆపడం వారితరంకాదు; కాని వారు మార్గంలో కొన్ని అవరోధాలు అడ్డంకులు కలిగించగలరు. అలా కలిగించారుకూడా; ఈ అవరోధాలు, అడ్డంకులు నూత్నచట్టంలో మూర్తీభవించివున్నాయి. ఇది దేశఐక్యభావమును కాపాడుతుందికనుక, దీన్ని ఆమోదించమని మీరు సిఫార్సుచేస్తున్నారు. కాని మీరీవిషయాన్ని పూర్తిగా తల్లక్రిందులుగా చెప్పారు. ఈ చట్టం (దీన్ని ప్రతిఘటించి తిరస్కరించకుండా వున్నట్లయితే) దేశవిచ్ఛిత్తికొక నాంది. మతరీత్యా, దేశాన్ని విచ్ఛిన్నంచేసి, ఇతర విధాలుగా పలుఖండాలుగా ఖండించి, దేశంలో అధికవైశాల్యంగల

భాగాలను సంస్థానాలరూపంలో తనకు కంచుకోటలుగా, ఈ పట్టం తయారుచేసుకుంటుంది. ఇలాగ తయారైన ఈ భాగాలజోలికి ఎవరూ పోకూడదు. వాటిపై ఇతరప్రాంతాలకు అధికారం లేదు; కాని వాటికి వీటిపై అధికారంవుంది, మీరు "భారతదేశాని కత్యవసరమైనవిగా, ప్రధానమైనవిగా" వాదిస్తున్న రాజకీయపక్షాల ఆరోగ్యకరమైన అభివృద్ధిని, ఇవి ఆర్థిక సాంఘికసమస్యలపై ఎదిరిస్తాయి.

బ్రిటిష్‌ప్రభుత్వం సాంఘికసమస్యలపై అవలంబిస్తున్న విధానంసైతం పున్మూర్తులా ఇలాగేవుంది. ఏదో ఒక సమాజవాద వ్యూహాన్ని వీక్షించి స్వప్రయోజనకరసంపదలహక్కులపై అధికారాన్ని కలిగివుండడం, లేదా వాటిని తొలగించడంమాట అటువుంచి, పైగా వాటినన్నిటినీ బుద్ధిపూర్వకంగా కాపాడింది; మరికొన్ని క్రొత్త వాటిని సృష్టించింది; భారతదేశంలోవున్న రాజకీయ, మత, సాంఘిక అభివృద్ధినిరోధకులను నిరంతరం బలపరిచింది. నూతనపట్టం ఈ విధానానికి పరాకాష్ఠ; ఇంతకుముందెప్పుడూ తాము పొందని విశేషాధికారాన్ని స్వప్రయోజనపరులకు సంస్కరణలవ్యతిరేకులకు అభివృద్ధి నిరోధకులకు ఇది దఖలుపరుస్తుంది. భారతీయ విదేశీయ స్వప్రయోజన పరులవిధానాలను న్యాయశాస్త్రరీత్యా, ఈ పట్టం పదిలపరచి, సంరక్షిస్తుంది. మా గమ్యంగావుండాలని మీరు పేర్కొంటున్న సాంఘికపురోగతికవాటాలను ఈ రీత్యా ఇది బంధించివేస్తుంది. దేశానికి ద్రవ్యాన్ని చేకూర్చే అనేక వనరులను స్వప్రయోజనపరులకు ప్రత్యేకిస్తుంది. తాకట్టుపెడుతుంది; సాంఘికసంస్కరణల కేమాత్రం ఈరీత్యా అవకాశంలేకుండాచేస్తుంది.

నేడు అభివృద్ధినిరోధకశక్తులకు దౌష్ట్యశక్తులకు వ్యతిరేకంగా ప్రతిదేశం అప్రతిహతంగా పోరాడవలసివుంది. భారతదేశంకూడా ఈ విధిని నిర్వర్తించకతప్పదు. ఇంతకీ విషాదకరమైన పరిస్థితి ఏమిటంటే, బ్రిటిష్‌ప్రజలు, అప్రయత్నపూర్వకంగా తమ పార్లమెంటూ, ప్రభుత్వోద్యోగులద్వారా, ఈ అభివృద్ధినిరోధక దౌష్ట్యశక్తులకు మద్దతుయిస్తున్నారు. తమదేశంలో తామేది సహించజాలరో, దానిని భారతదేశంలో

ప్రోత్సహిస్తున్నారు. మీరు మీ ఉత్తరంలో అబ్రహాంలింకన్ పేరు ప్రస్తావించి ఆయన, సమాఖ్యకు అధిక ప్రాముఖ్యమిచ్చినవిషయాన్ని నాకు జ్ఞప్తికితెచ్చారు. బ్రిటిష్ప్రభుత్వం అదే ఉదారమైన ఆశయాన్ని దృష్టిలో వుంచుకుని, విచ్ఛిన్నకరశక్తులబారినుంచి భారతదేశసమైక్యతను కాపాడడానికి, కాంగ్రెసుఉద్యమాన్ని అణచ ప్రయత్నించిందని మీరు భావిస్తున్నారు. ఈ ఉద్యమం భారతదేశఐక్యతకు ఏవిధంగా ప్రమాదకరమో నాకు అర్థంకావడంలేదు; ఈ ఉద్యమం, లేదా ఇలాంటి ఇంకొక ఉద్యమం మాత్రమే ప్రజలను సంఘటితపరచి, దేశసమైక్యతను సాధించగలదని, కాని, బ్రిటిష్ప్రభుత్వచర్యలు దేశవిచ్ఛిన్నతకు తోడ్పడేవిగా వున్నాయని నా నిశ్చితాభిప్రాయం. ఈ విషయం యిలా వుంచండి. ఇంతకీ, ఒకదేశంపై అధికారంచలాయిస్తూ ఆ దేశస్వాతంత్ర్యోద్యమాన్ని అణచచూచే సామ్రాజ్యవాదప్రభుత్వప్రయత్నంతో, అబ్రహాంలింకన్ఆశయాన్ని సరిపోల్చడం, బోడితలకూ మోకాలికీ ముడిపెట్టడంవంటిదని మీ రనుకోవడంలేదా?

ప్రజలకుగల అవాంఛనీయమైన అలవాట్లను, స్వలాభాపేక్షను, దురాశాపూరిత మనస్తత్వాన్ని పోగొట్టాలని మీరు వాంఛిస్తున్నారు. అయితే బ్రిటిష్ప్రభుత్వం భారతదేశంలో ఇలాంటిప్రయత్నం ఏమైనా చేసిందా? అభివృద్ధినిరోధకశక్తులను అది ఎలాగూ బలపరుస్తూనేవుంది; ఆ మాట అలావుంచి, బ్రిటిష్పరిపాలన దేనిమీద ఆధారపడివున్నదో, దాని పూర్వరంగ మెటువంటిదో పరిశీలించడం అవసరం. ప్రమాదాన్ని నివారించడమనే సాకుతో, విశృంఖలవృత్తితో దేశమంతటా కొనసాగే హింసాప్రవృత్తిపై బ్రిటిష్పరిపాలన ఆధారపడివుంది. ప్రజలఅభివృద్ధి కవసరమని తలచబడుతున్న సాధారణ హక్కులనుసైతం అది హరిస్తోంది; అన్నివిధాల వారిస్వేచ్ఛను అరికడుతోంది. వీరులను త్యాగులను ధైర్యవంతులను సాహసవంతులను అణచివేస్తోంది. భయస్థులను, అవకాశవాదులను, వంచకులను, నీచులను, నిరంకుశులను ప్రోత్సహిస్తోంది. గూఢచారుల, రహస్యవార్తాహరుల, ఉద్యమవిచ్ఛిన్నకారుల సైన్యాన్ని

సమాయత్తం చేసుకుంటోంది. ఈ వాతావరణంలోనేనా పవిత్రాశయాలు, వాంఛనీయమైన లక్షణాలు, ప్రజాస్వామికసంస్థలు పెరిగి పెంపొందగలిగేది?

భారతదేశానికంతటికీ వర్తించే ఉదారమైన రాజ్యాంగపత్రాన్ని ఏకగ్రీవాభిప్రాయంతో అందరూ అంగీకరించేవిధంగా కాంగ్రెసు ఎన్నడైనా చేయగలిగిందా అని మీరు నన్నడుగుతున్నారు; అది రచించిన రాజ్యాంగపత్రంలోనైతేనేం. ఈ రాజ్యాంగపత్రంలో సంస్థానాధీశులకు మితవాదులకు, కులీనులకు ఏ మినహాయింపులు యివ్వబడ్డాయో, అట్టి మినహాయింపులే వివరాలలో కాకపోయినా ప్రధానవిషయాలలో యివ్వబడ్డాయని మీరు పేర్కొన్నారు. అంతే బ్రిటిష్‌ప్రభుత్వం తయారుచేసిన ఈ పత్రం ఉదారమైన రాజ్యాంగాన్ని అందరూ ఆమోదించేటట్లుగా నెలకొల్పుతుందని మీ అభిప్రాయం ఈ రాజ్యాంగపత్రమే ఉదారమైనదయితే, ఉదారంకాని రాజ్యాంగపత్రమంటూ అస లెలావుంటుందో, దీన్నిబట్టికాక, మరి దేన్నిబట్టి తెలుసుకోగలమో నాకు తెలియడంలేదు. ఇక ఏకగ్రీవాభిప్రాయం మాటకువస్తే, ఇదివరకు భారతదేశంలో బ్రిటిష్ ప్రభుత్వం కావించిన ఏపన్యఅయినా ఇంతటి అసంతృప్తిని, తీవ్ర నిరసనను కలిగించిందా అని నా సందేహం. దేశంలో బలప్రయోగం విచ్చలవిడిగా సాగుతున్నపుడు యాదృచ్ఛికంగా, ఈ పత్రానికి అపరిమితమైనంత ఆమోదం లభించింది; ఇప్పుడునైతేం దీన్ని అమలుజరపడానికి నాందీప్రస్తావనగా, దేశమంతటా హింసత్వహస్తాలను కబళించే అన్నిరకాలశాసనాలను ప్రయోగించారు. ఈ పరిస్థితులలో ఏకగ్రీవాభిప్రాయం అనేమాట ఎత్తడం అసాధారణవిషయం. ఇంగ్లండులో దీన్ని గురించి అమిత్రాశ్చర్యకరమైన మిథ్యాప్రచారం వ్యాపించివుంది. సమస్యను ఎదుర్కొనవలసిన నగ్నసత్యాలను విస్మరించలేం.

ప్రభుత్వం సంస్థానాధీశులతో, వివిధ అల్పసంఖ్యాకవర్గాలతో ఏదో ఒకరకమైన ఒడంబడికను ఎలాగో ఒకలాగ చేసుకోగలిగిందన్న మాట నిజమే; ఈ వర్గాలవారు నైతేం, తమ ప్రాతినిధ్యాన్నిగురించిన

ఏదో స్వల్పవిషయంలోతప్ప, మిగిలిన విషయాలలో ఎంతో అసంతృప్తి తోనే వున్నారు. ఉదాహరణకు అల్పసంఖ్యాకులలో ముఖ్యులైన ముస్లిముల విషయమే తీసుకోండి. రౌండుటేబిలు సమావేశానికి హాజరైన ముస్లిం ముకులీనులు, పెద్దపెద్ద జమీందారులు, ముస్లిముప్రజానీకానికి ప్రాతినిధ్యంవహిస్తున్నారని ఎవరూ చెప్పలేరు. కాంగ్రెసువెనకాల యిప్పటికీ చెప్పుకోతగినంత ముస్లిముప్రజానీకం వున్నదని విని మీ రాశ్చర్యపడవచ్చును.

కాంగ్రెసు ఏమైనా మంచిని చేకూర్చకలిగిందా? కాంగ్రెసు ప్రధాన పాత్రవహిస్తున్న జాతీయోద్యమంవల్ల యింకా యింతకంటె ఎక్కువ మంచి చేకూరివుండును, కాంగ్రెసు ఏమైనప్పటికీ, బూర్జువాసంస్థ (అది ఎక్కువ సమాజవాదపద్ధతిలో వుండివుండవలసినదని నాకోరిక) కనుక ఆ దశలో ఆస్తిహక్కులసమస్య ఒక తీవ్రరూపంలో చర్చకు రానవసరంలేదు. మతసమస్యను ఎదుర్కొని. ఎక్కువ ఏకగ్రీవాభిప్రాయంతో తాత్కాలికంగానైనా పరిష్కరించవలసివుండేది. అప్పుడలాగచేసివుంటే, ఇప్పటీవిషయంలో చేయవలసినపని బహుస్వల్పంగానే బహుశా మిగిలి వుండేది. అన్నింటికంటె ముఖ్యమైనదేమంటే- మతవాదాన్ని సమీపభవిష్యత్‌లో తుడముట్టించగలిగే, సాంఘికపద్ధతులలో అభివృద్ధిని సాధించగలిగే పరిస్థితులుద్భవించివుండును. భూసమస్యను పరిష్కరించడానికి ప్రయత్నాలు కొనసాగివుండేవి. నిజమైనసమస్యలు రెండే రెండు మిగిలివుండేవి. భారతదేశంలో బ్రిటిష్‌ప్రభుత్వానికి, లండనునగరానికి గల స్వప్రయోజనాలు, సంస్థానాధీశుల స్వప్రయోజనాలు. మొత్తం ప్రశ్నలోవున్న అసలు కీలకమంతా యిందుమించు మొదటి సమస్యలోనే యిమిడివుంది. మిగిలినవిషయాలు అంత ప్రధానమైనవికావు. ఆ సమయంతో సంస్థానాధీశులు నూత్నపరిస్థితులలో చాలామటుకు సరిపుచ్చుకునివుండేవారు. దేశప్రజల, చివరకు తమ సంస్థానప్రజల ఒత్తిడికి వారు నిలబడలేకపోయివుండేవారు. భారతసంస్థానాధీశులతో బహుశా కొన్ని తాత్కాలికమైన ఏర్పాట్లుచేసుకునేందుకు అవకాశం

కలిగివుండేవి. ఈ ఏర్పాట్లను పురస్కరించుకుని ప్రజాభిప్రాయం అభివృద్ధిని సాధించివుండేవి. సంస్థానాధీశుల కట్టుగట్టిన పరిపాలనను బ్రిటిషుప్రభుత్వం బలపరచలేదని ఊరికే అనుకుందాం. అలాంటపుడు సంస్థానాలు క్రమక్రమంగా ఈపాటికి ఒక సక్రమమార్గంలోకి వచ్చి వుండేవి.

ఇలాగ నేను భావించడం, కొంచెం అతిశయోక్తికావచ్చును. కాని నే ననుకున్నట్లు జరిగివుంటే ఇది సరియైనపద్ధతిలో తీసుకున్న రాజకీయ ప్రజాస్వామికచర్యగానైనా వుంటివుండేది. ఒక రాజ్యాంగాన్ని లేదా, రాజకీయవ్యవస్థను నిర్మిస్తున్నపుడు, దానికి సంబంధించిన ప్రతివారూ అంగీకరిస్తారని అనుకోవడం అసాధ్యం. తన కనుకూలంగా యింపమింపు అన్నీవుండాలని ప్రయత్నించేవారూ, దానితో ఏకీభవించనివారూ, ప్రజాస్వామికపద్ధతులకనుగుణంగా తాము మారనన్నా మారాలి, లేదా అలాగచేయడానికి ఒత్తిడికి లొంగనన్నాలొంగాలి; నిరంకుశ అధికారిక సంప్రదాయబద్ధమైవున్న, ప్రధానంగా తన ప్రయోజనాలను తాను కాపాడుకోవడమే లక్ష్యంగాగల బ్రిటిషుప్రభుత్వం సంస్థానాధీశుల, తదితర అభివృద్ధినిరోధకుల అంగీకారాన్ని పొందడానికి ప్రయత్నించింది; ప్రజలను బలాత్కరించింది. కాంగ్రెసు ఇందుకు పూర్తిగా విభిన్నంగా ప్రవర్తించింది.

ఆలోచించతగినవిషయం ఇంకొకటి వుంది. గాంధీనాయకత్వం క్రింద కాంగ్రెసు, అహింసావిధానానికి అత్యంత ప్రాముఖ్యాన్నిచ్చింది; ప్రతికూలురను ఒత్తిడిపెట్టడంవల్లకాక, వారినిఒప్పించడంవల్ల తన విధానాలను ఆమోదింపచేయడానికి కృషిచేస్తోంది. అది అనుసరిస్తున్న ఈ సిద్ధాంతం ఎంతవరకు ఆచరణయోగ్యం, దీనివల్లకలిగే ప్రయోజనమేలాటిది అనే ప్రశ్నను అలావుంచుదాం; ఇది అంతఃకలహాలకు అవకాశంలేకుండాచేసి ప్రజల అభిప్రాయాలను చక్కగా ఆకట్టుకోగలిగింది; భారతదేశంలోవున్న వివిధమతాలవారి హృదయాలను చూరగొనడానికి

అనుకూలవాతావరణాన్ని కలిగించింది. భారతదేశపు ఏకతను కాపాడ డానికి, ప్రతికూలశక్తులధోరణిని తగ్గించడానికి, ఈ వాతావరణం మా కెంతో అమూల్యమైనది.

సహాయనిరాకరణ, శాసనోల్లంఘనోద్యమాన్ని ప్రజలు రాజ్యాంగ పర్యలదృష్ట్యానో లేదా ఇతరవిధంగానో చర్చిస్తారు. ఈ విషయాన్ని గురించి నేనింతకుముందు ప్రస్తావించాను. ఈ ఉద్యమాలు, నాకు సదా ఏవిధమైన అభిప్రాయలు కలిగించాయో, కలిగిస్తాయో మీకు నేను చెప్పనా: ఇవి బ్రిటిషుప్రభుత్వంమీద చెప్పలేనంత ఒత్తిడితీసుకు వచ్చాయి; ప్రభుత్వయంత్రాంగాన్ని ఉక్కిరిబిక్కిరిచేసి గడగడలాడిం చాయి. దీనిమాటకేమికాని, ఈ ఉద్యమాల అసలైన ప్రాధాన్యం యిం కొకచోట వుంది. అవి మా ప్రజల, ప్రత్యేకంగా గ్రామీణ ప్రజల హృదయాలపై ఎంతో ప్రభావాన్ని నెరపాయి. భయ నిర్బంధాల వాతావరణంతోకూడిన కొన్ని దశాబ్దాల నిరంకుశ పరిపాలన, దారిద్ర్యం, ప్రజలను అవినీతిపరులను కావించాయి. అధో గతికి తీసుకుపోయాయి. పౌరసత్వానికి అవసరమైన సల్లక్షణాలు వారు కోల్పోయారు; పోలీసుల, భూస్వాములఏజంట్ల, మాసుల్దార్ల, చిన్న చిన్న ఉద్యోగుల జబర్దస్తీలకుసైతం వారు లోనయారు; ఈ నిరంకుశ త్వాన్ని ఎదిరించే గుండెధైర్యం వారికి లేకపోయింది; సమైక్యభావంతో ఈ విధానాన్ని ప్రతిఘటించే సాహసం మృగ్యమైపోయింది. ఉద్యోగుల అడుగులకుమడుగులొత్తుతూ ఒకరిపై ఒకరు చాడీలుచెప్పుకునే స్థితికి దిగజారిపోయారు, జీవితం ఈవిధంగా దుర్భరమైపోతున్నపుడు, యిక మరణించడమే వారికి గత్యంతరమైంది, ఇది చాలా విచారకరమైన విషాదకరమైన పరిస్థితి; కాని ఇందుకు వారిని ఎవరూ నిందించలేరు. దుర్భరపరిస్థితులు వారిని క్రుంగదీశాయి. కృశింపచేశాయి, సహాయ నిరా కరణోద్యమం వారిని ఈ బురదగుమ్మిలోనుంచి బయటకు తీసుకు వచ్చింది; వారిలో ఆత్మగౌరవభావాన్ని కలిగించింది; వారి ఆత్మ బలాన్ని వారి కెరుకపరచింది. సహకారభావాన్ని వారు అలవర్చుకుని, ఒకరితో ఒకరు సఖ్యభావంతో మెలగుతూ కార్యాచరణ కుద్యుక్తు

లయారు. అన్యాయమైన అధర్మమైన నిరంకుశత్వానికి వారంతట సులభంగా లొంగనలుచుకోలేదు; ధైర్యసాహసాలతో మెలగజొచ్చారు. వారి దృక్పథం విశాలతరం కాజొచ్చింది; క్రమంగా దేశాన్నంతటిని తమ దృష్టిలోవుంచుకొని ఆలోచింపప్రారంభించారు; బజారులలో, సభాస్థలాల్లో, నలుగురుకలిసినచోట ఆర్థిక రాజకీయసమస్యలను చర్చించుకోజొచ్చారు. కొద్దిస్థితిలోవున్న మధ్యతరగతివారిలోకూడా యిదే పరివర్తన కలిగింది. కాని సామాన్యప్రజలలో కలిగిన పరివర్తన అత్యంతప్రధానమైనది. గణుతింపదగినది; ఇందుకు గాంధీజీనాయకత్వాన్ననుసరించిన కాంగ్రెసును అభినందించక తప్పదు. రాజ్యాంగాలకంటె, ప్రభుత్వ నిర్మాణస్వరూపాలకంటె, ఇది ఎంతో ముఖ్యమైనది. ఈ పునాదిమీదనే సుస్థిరరాజ్యాంగవ్యవస్థ నిర్మింపబడుతుంది.

ఈ పరివర్తన భారతీయజీవితోద్ధరణమనే మహాప్రవాహాన్ని కొనితెచ్చింది. ఇతరదేశాలలో ఇలాంటి పరివర్తన సాధారణంగా విపరీతమైన హింసను, ద్వేషాన్ని తీసుకువచ్చింది. భారతదేశంలో మాత్రం, మహాత్మాగాంధీజీ పుణ్యమాఅని, ఇతరదేశాలతో సరిపోల్చిచూస్తే, ఇవి నామమాత్రంగా కలిగాయి. యుద్ధదుర్లక్షణాలను దూరంగావుంచి, మేం దాని సల్లక్షణాలను పెంపొందించుకున్నాం. భారతదేశసామరస్యం ఎప్పుడూ లేనంతగా సన్నిహితమైంది. మత, కుల విభేధాలుపైతం తగ్గిపోయాయి. భారతదేశజనాభాలో నూటికి ఎనభైమంది ప్రజలు గ్రామాలలో నివసిస్తున్నారని, భూమిసమస్య గ్రామీణ భారతదేశాన్ని తీవ్రంగా ఎదుర్కొంటున్నదని మీకు తెలుసును. దుర్భర ఆర్థికపరిస్థితులమధ్య బయలుదేరిన అలాంటి ఉద్యమం అదే పరిస్థితులలో ఇంకొకదేశంలో బయలుదేరివుంటే అది రైతులతిరుగుబాటులతో నిండిపోయివుండును. భారతదేశం వాటిని తప్పించుకోడం అసాధారణమైన విషయం. ఇందుకు కారణం ప్రభుత్వ బలప్రయోగం కాదు. గాంధీబోధనలు, కాంగ్రెసు సందేశం దీనికి హేతువు.

కాంగ్రెసు ఈవిధంగా, దేశంలోగల అన్ని జీవనశక్తులను విడుదలచేసింది; విచ్ఛిన్నకర దుష్టశక్తులను అణచిపెట్టింది. అది, శాంతి

యుత్రంగా, క్రమశిక్షణతో, నాగరికపద్ధతుల్లో ఆ ఉద్యమాన్ని నడిపింది. అయితే కొన్ని ప్రమాదాలు సంభవించినప్పటికీ, అప్పటి పరిస్థితులలో సాధ్యమైనంతవరకు కాంగ్రెసు ఈ పద్ధతుల నవలంబించింది. కాని ప్రజానీకాన్ని ఉద్యమానికి సంఘటితపరుస్తున్నపుడు యిలాంటి పరిణామాలు తప్పవు. ఆ ఉద్యమంపట్ల ప్రభుత్వం ఎలాగు వ్యవహరించిందో మీకు పూర్తిగాతెలుసును. పౌరుషవంతమైన ఆ జీవనశక్తులను నాశనం చేయటానికి ప్రయత్నించింది. విచ్ఛిన్నకర దుష్టశక్తులనన్నింటినీ ప్రోత్సహించడానికి ఉద్యమించింది; అసహ్యకర అనాగరికపద్ధతుల్ని అవలంబించింది. భారతదేశంలో, బ్రిటిషుప్రభుత్వం గత ఆరుసంవత్సరాలకాలంలో, శుద్ధ ఫాసిస్టుపద్ధతులను అమలుజరిపింది; ఇలాగ చేశామని బాహాటంగా చెప్పుకుంటూ, ఫాసిస్టుప్రభుత్వాలు గర్వపడలాయి. అలాగ బాహాటంగా చెప్పుకుని బ్రిటిషుప్రభుత్వం గర్వపడదు. అంతే భేదం.

ఈ ఉత్తరం ఇప్పటికే చాలా పెద్దదైపోయింది. నూతన "రాజ్యాంగచట్టాన్ని" గురించి నే నిప్పుడు సవివరంగా చర్చించదలుచుకోలేదు. ఇది అనవసరంకూడాను. భారతదేశంలోవున్న అనేకమంది వ్యక్తులు దీన్ని తీక్ష్ణంగా చర్చించారు. విమర్శించారు, పలురకాల అభియాలు ప్రకటించారు. కాని ఈ చట్టాన్ని ఎంతమాత్రం అంగీకరించకూడదని వారందరూ ఒకే ఒక అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. ఈ మధ్యనే ప్రముఖ భారతీయ మితవాదనాయకులొకరు అంతరంగికంగా ఈ చట్టాన్నిగురించి యిలాగ అభివర్ణించారు; "ఇది మన జాతీయ ఆశయాలనన్నిటినీ నాశనంచేసే కాలకూటవిషం. మా మితవాద నాయకులుసైతం దీన్నిగురించి యిలాగ భావించడం గమనించతగ్గది; అయినప్పటికి మీరు భారతీయుల ఆశయాలపట్ల ఎంతో సానుభూతిచూపిస్తూ "భారతదేశంలో అధికారమనే కోటను ఇది భారతీయులకు ధారాదత్తంచేస్తుందని" చెప్పడం వింతగాలేదా? మన ఆలోచనాపద్ధతులమధ్యవున్న అఖాతం ఇంత పెద్దదా? అలాగ అవెందుకుంది? ఇది

రాజకీయ ఆర్థికవిషయాలకుచెందిన సమస్యకంటె, మన స్వత్వానికి ఎక్కువగా చెందినసమస్య.

ఇంతకీ ఒక విషయంపట్ల మన స్వేలాగ ప్రతిఫలించినదనేది అత్యంత ప్రధానం. గత సంవత్సరాల అనుభవమంటే భారతదేశానికి ఏమిటో, ఇంగ్లండులోనివారు గుర్తించారా? మానవగౌరవాన్ని, మర్యాదను మంటగలిపే ప్రయత్నం, శరీరానికి, అంతకంటె ఎక్కువగా ఆత్మకు కలిగించిన గాయాలు, భారదేశ ప్రజలకు ఏ గాఢాభిప్రాయాలు కలిగించాయో మీరు గమనించారా? నిరంకుశ అధికారాన్ని చలాయించిన వారినీ, దానివల్ల పలుబాధలుపడినవారినీ, అవి ఎంతటి పతనావస్థలో పడవేస్తుందో, యిప్పుడు నాకు బోధపడినంత బాగా, యింతకుముందు బోధపడలేదు. మర్యాదకరమైన గౌరవప్రదమైన ప్రతిదానినీ మర్చిపో కుండా దీనిని మేం ఎలా మర్చిపోగలం? ఇది రోజూ, ప్రతి రోజూ కొన సాగుతున్నపుడు, దీనిని మేం ఎలాగ మర్చిపోతాం? స్వేచ్ఛకు, అధికారాన్ని హస్తగతంచేయడానికి నాంది ఇదేనా?

ఈ దమననీతికి ప్రజలు వేరువేరువిధాలుగా ప్రతిఫలించారు. కొందరు హతాశులయారు; మరికొందరు ధీరతవహించారు. ఇతరచోట్ల వలెనే, భారతదేశంలో ఈ రెండురకాలవారూ వున్నారు. మేం వ్యక్తిగతంగా ఎలాంటి పరిస్థితుల్ని ఎదుర్కోవలసివచ్చినాసరే, జైళ్ళలోనో, మరేవిధంగానో, యిక్కట్లుపడుతున్న మా సహచరుల్ని ఒదిలిపెట్టి వెళ్ళిపోలేం. గాంధీతో మేం ఏకీభవించినా, మానినా ఆయనకేమాత్రం అవమానం జరిగినా, మేమెవరం సహించలేం. మా దేశగౌరవానికి ఆయన ప్రతినిధి. సుస్థిరమతియైన ఏ వ్యక్తీ సంఘర్షణను క్లేశాన్ని ప్రమాదాన్ని కొనితెచ్చుకోడు. తన అస్తిత్వాన్ని తాను నిలుపుకుంటూనే భారత జాతీయోద్యమం, ఈ ప్రమాదంవాటిల్లకుండాచేయడానికి అన్ని ప్రయత్నాలూ చేసింది. కాని బ్రిటిషుప్రభుత్వం ఈ ప్రమాద మార్గాన్నవలంబించి, శాంతియుత పరిష్కారాన్ని మరీ మరీ క్లిష్టతరం చేసింది. ఈ మార్గాన్ననుసరించడంవల్ల తనకు జయం చేకూడుతుందని అది కలలుకంటున్నట్లయితే, చరిత్ర గుణపాఠాన్ని భారతప్రజల యిప్పటి

మనస్తత్వాన్ని అది పొరపాటుగా అర్థంచేసుకుంటోందన్నమాట. ఈ పరిణామం వాటిల్లకుండావుండాలంటే బ్రిటిషుప్రభుత్వం వెనుకంజ వేయవలసివుంటుంది.

ఈ ఉత్తర మింత దీర్ఘమైనందుకు మన్నించండి.

మీ విశ్వాసపాత్రుడు,
జవహర్‌లాల్ నెహ్రూ

దీ మార్క్విస్ ఆఫ్ లోథియన్,
సీమూర్ హౌస్,
17 వాటర్లూ ప్లేస్,
లండన్ యస్. డబ్ల్యు-1

119. ఎడ్వర్డు థాంప్సన్ వద్దనుంచి

లండన్,
నవంబరు 26, 1935

ప్రియమైన నెహ్రూ,

[మనకు లాంఛనపూర్వమైన మర్యాదలు అవసరంలేదు]

ఒక నెలరోజుల్లో నేను భారతదేశానికి బయలుదేరి వెడతాను; ఏప్రియల్‌లో మళ్ళీ ఇక్కడకు చేరుకుంటాను.

మీ భార్య కస్వస్థతగా వున్నందున, మీ గ్రంథంవిషయంలో మీ రక్కడికీ ఇక్కడికీ వచ్చి శ్రమపడలేరు. కనుక ఒక ప్రచురణకర్తను చూసిపెట్టమంటే అలాగే చూస్తాను; మీకు తోడ్పడతాను. ఏప్రియల్‌లో మీరు మీ వ్రాతప్రతులను నాకు తప్పక పంపించండి. మనం ఏకీభవించినా మానినా అదొక లెక్కలోనిదికాదు. మనం చెప్పేదంతా వినే హక్కు మనం సంపాదించుకున్నాం. సమీక్షలవిషయంలోకూడా నేను సహాయ పడగలను.

మీరు చాలా అలసిపోయినట్లున్నారు. నేనూ ఆరోగ్యవంతుణ్ణి కాను; కనుక సానుభూతి చూపగలను. బ్రిటన్ భారతదేశాలమధ్య

స్నేహం నెలకొనాలని నేను కోరుతున్నాను; ఇక్కడ అక్కడ స్వామ్యం పైన సామాజికవిధానం నెలకొల్పబడాలని అంతకంటె ఎక్కువగా కోరుతున్నాను. ఈ గ్రంథంలోనూ, మీ ఆత్మకథలోనూ, మీరు ఆర్థిక సాంఘికసమస్యలపై వ్రాస్తారని నేనాశిస్తున్నాను; నన్ను వినియోగించుకోడానికి మీరు సంకోచించవద్దు. నేను చేయగలపని ఏదివున్నా అది చేసి పెడతాను. శ్రీమతి నెహ్రూ నెమ్మదిగా కోలుకుంటున్నారని ఆశిస్తున్నాను.

యస్. సి. బి. విషయంలో నేను చేయగలిగినంతా చేశాను. కాని ఉన్నతవర్గాలమధ్య దూతగా వ్యవహరించడానికి నేను అర్హుణ్ణికాను.

మీ విశ్వాసపాత్రుడు,
ఎడ్వర్డ్ థాంప్సన్.

[యస్. సి. బి. అనగా సుభాస్‌చంద్రబోస్]

120. రిచర్డు బి. గ్రెగ్ వద్దనుంచి

ఇలియట్ స్ట్రీట్. సౌత్‌నాటిక్,
మాసాచుసెట్స్, అమెరికా.
డిసెంబరు 3, 1935

నా ప్రియమైన నెహ్రూ,

మీరు నవంబరు పద్నాలుగున, ఇరవైయోతేదీన వ్రాసిన కవరుకూ, కార్డుకూ నా ధన్యవాదాలు. నేను పంపిన రెండు గ్రంథాలూ సురక్షితంగా మీ కందినందుకు చాలా సంతోషిస్తున్నాను.

పటిష్ఠమైన సమాజనిర్మాణానికి కేవలం అహింసాపోరాట మొక్కటే చాలదని, దానితోపాటు సాంఘికార్థిక విప్లవకార్యక్రమాన్ని సంస్కరణకార్యక్రమాన్ని చేపట్టవలసివుంటుందనీ మీరు చెబుతున్న వాదనతో నేను ఏకీభవిస్తున్నాను. గాంధీకార్యక్రమంలో ఒక ఆర్థికసూత్రం ఇమిడివుంది; దానిననుసరించి ప్రతివ్యక్తి ప్రతిరోజూ ఎంతో కొంత పనిచేస్తాడు. గాంధీకార్యక్రమాన్ని నే నామోదించడానికి యీసూత్రం ఒక కారణం. ఖద్దరు, కుటీరపరిశ్రమలకుచెందిన కార్యక్రమం, పోషియిండి,

అసమగ్రమైనవని అనుకుందాము; అయినా, అది అహింసాసిద్ధాంతాల కనుగుణంగావుంటూ రైతుల ఆర్థికజీవితపరిస్థితులపై ప్రత్యేకప్రభావాన్ని కలిగివుంటున్నది. అహింసాపోరాటంతోపాటు, సాంఘిక ఆర్థికపరిణామాలను సాధించేవిషయాన్నిగురించి నేను చాలాకాలంనుంచిఆలోచిస్తున్నాను. శేషించిన ఆర్థికనిర్మాణభాగాన్ని చక్కగా పూర్తిగా ఊహించి ఈకార్యక్రమాన్ని సమగ్రమైనదిగా రూపొందించుకోవలసివుంటుంది. విలక్షణ సాంఘికలక్ష్యాన్ని కుదుర్చుకోవడంలోవున్న యోగ్యతలనుగురించి, తల్లక్ష్యసిద్ధికై అవలంబింపదగిన సాధనాలనుగురించి మీరు గాంధీతో జరిపిన ఉత్తరప్రత్యుత్తరాలను నే నమిత శ్రద్ధాసక్తులతో పరిశీలించాను. వాటిని చదువుతున్నప్పుడు, నా ఊహాపథంలో మీరు భావిస్తున్న భవిష్యత్ సమాజం కనిపించింది; అది, ప్రజలశక్తులను ఆకర్షించి వారినుత్సాహపరిచే ఒక చిహ్నంగా స్ఫురించింది. అయితే నన్ను రెండు భయసందేహాలు పట్టిపీడిస్తున్నాయి. మొదటిది, మానవజీవితవ్యవహారాలు సంకీర్ణమైనవి కావడంవల్ల, మనం భవిష్యత్ ఇలావుంటుందని సరిగ్గా చెప్పలేం; భవిష్యత్ప్రభుత్వస్థాపనార్థమై, మనం మన ప్రణాళికను ఎంత సంపూర్ణంగా రచించినా, ఆ పద్ధతిలో దానిని నెలకొల్పడానికి ఎన్నడూ సాధ్యపడదు. అన్నిదేశాల - ఆఖరికి రష్యాదేశప్రభుత్వవిషయంలోసైతం ఈ మాటనిజం. ఇదిఎప్పుడూ యింతేనని నా నమ్మకం. మొదట మనం ఊహించినస్వరూపానికే అక్షరాలా అంటిపెట్టుకునివుండాలని మనం ప్రయత్నించినట్లయితే, మన కృషి నిరర్థకమౌతుంది. అందువల్ల, ప్రచలితశక్తుల అభివృద్ధిపరిణామాలను దృష్టిలో వుంచుకుని సమన్వయపరుచుకోవలసివుంటుంది.

ఇక నా రెండవసందేహాన్ని మీకు తెలియచేస్తాను. భవిష్యత్‌లో ఆదర్శప్రభుత్వం ఎలావుండాలో వివరణలను తయారుచేస్తూ కూర్చుంచే, అవి కలిగించే ప్రభావాన్ని వేరే పేర్కొననక్కర లేదు. ఇది స్వర్గాన్ని గురించిన క్రైస్తవస్వప్నం. క్రైస్తవులపై కలిగించిన ప్రభావాన్ని పోలివుంటుంది. ఆ ఆదర్శానికీ ప్రస్తుత వాస్తవికతకూ గల వ్యత్యాసం

ఆ ఆదర్శాన్ని చాలాదూరం అవతిలకు నెట్టుతుంది. అంతటితో అది కేవలం ఆచరణ్యంతప్ప మరేమీకాదని, దాన్ని సాధించడానికి పెద్దపెద్ద త్యాగాలు చేయనక్కరలేదని ప్రజలు భావిస్తారు. ఈ భావం నిస్సత్తువకు కపటపరివర్తనకు దారితీస్తుంది. ఈ కారణంవల్లనే, గాంధీ, లక్ష్యసాధనాలనుగురించి నొక్కినొక్కి చెబుతున్నారు. ఇది ఎంతో యుక్తియుక్తంగా వుందని నా అభిప్రాయం. అహింసాపోరాటానికి నిండుతనం చేకూర్చడానికి, దైనందిన ఆర్థిక సాంఘికఫలితాలనిచ్చే సూత్రాలతో లక్ష్యమార్గాన్ని విస్తృతంచేయాలి, అలాగ చేయగలిగినప్పుడు ఈ కార్యక్రమంలో పాల్గొంటున్న మూలశక్తులు కృషిపరిశీలనతో చిత్తస్థైర్యంతో ఇతర శక్తులను తమతోపాటు ముందుకు తీసుకువెడతాయి. అప్పుడు మానవశక్తిని పురిగొల్పే, ప్రోత్సహించే, కేంద్రీకృతంచేసే స్వరూపాన్ని ఏర్పరుచుకోవచ్చును; ఈ స్వరూపం భవిష్యత్ సమాజవాదఆదర్శప్రభుత్వస్వరూపం ఎంత శక్తివంతంగా వుంటుందో అంత శక్తివంతంగానూ వుంటుంది. పైగా, దీనివల్లనే నింతకుముందు పేర్కొన్న ఆ రెండుప్రమాదాలూ తప్పిపోతాయి. మరి అలాంటప్పుడు, ఈ స్వరూపాన్ని వీక్షించడానికవకాశంలేదా?

ప్రజాసమూహాలపట్ల నిరాశాభావాన్ని వ్యక్తపరచిన వైఖరితో మీ రేకీభవిస్తున్నట్లు మీ ఉత్తరంవల్ల నాకు బోధపడింది. అదే నిజమైతే మీరూ ఆయనా ఎలాగ సామ్యవాదులుకాగలరో నా కర్థంకాకుండావుంది. సమాజవాదాన్ని అత్యల్పసంఖ్యాకప్రజల హింసాచర్యలవల్ల నెలకొల్పి కాపాడాలనుకుంటే తప్ప, అది ప్రజలవద్దనుంచి అత్యున్నత పవిత్రపరివర్తనను వాంఛిస్తుంది. దాని నిలాగ హింసవల్ల నెలకొల్పి కాపాడుకోవాలనుకుంటే అల్పసంఖ్యాకులు ఆర్థికఉత్పత్తిసాధనాలపై, ఆధిపత్యమేర్పరచుకోవలసివుంటుంది. అలాంటపుడు వీరిని నేను పాలకవర్గంగా పరిగణిస్తాను. వీరి హింసావిధానం ప్రతికూలభావాలను రెచ్చగొడుతుంది. అప్పుడు పాలకవర్గం ఎప్పటివలె తన సహజమార్గాన్ననుసరించి నిర్బంధవిధానాన్ని ప్రయోగిస్తుంది. పరిస్థితి పునరావృత

మౌతుంది. ప్రజలు స్వాతంత్ర్యాన్ని పొందడానికి, హింసాయుత విప్లవం ద్వారా (కనీసం కమ్యూనిస్టుసిద్ధాంతప్రకారం) పాలకవర్గాన్ని తొలగిస్తారు.

మీ భార్యకు స్వస్థతచేకూరుతున్నందుకు ఎంతో సంతోషిస్తున్నాను. ఆవిడ త్వరగా కోలుకుంటారని ఆశిస్తాను. నా కరపత్రాన్ని మీ రింతకుముందు చూసినా, చూడకపోయినా యిప్పుడు దాన్ని మీకు పంపిస్తున్నాను. దానికి పేరు ప్రచురణకర్త పెట్టాడు. సమాజవాదానికీ గాంధేయకార్యక్రమానికి మధ్య వైరుధ్యభావం ఉన్నట్టు కరపత్రశీర్షిక వల్ల స్ఫురిస్తున్నందుకు విచారిస్తున్నాను. నేను నా కరపత్రంలో రెండింటిసీ పరిపోల్చాలనేకాని ఖండించలేదు.

శుభాకాంక్షలతో.

మీ విశ్వాసపాత్రుడు,
రిచర్డు బి. గ్రెగ్.

పి. యస్: నా కింకొక సందేహం కలుగుతోంది. భవిష్యత్ సమాజం సమాజవాదయుతమైనది కావచ్చును; లేక మరేదైనా కావచ్చును. సూక్ష్మాతిసూక్ష్మ వివరణలతో తత్సమాజస్వరూపజ్ఞానాన్ని ప్రజలకు కలిగించడంకోసం శక్తినీ కాలాన్నీ వినియోగించడం వాంఛనీయమేనా అని నేనాలోచిస్తున్నాను. ఆర్థిక రాజకీయవ్యవస్థ ఏరూపంలో నెలకొన్నా అది పరమావధికాదు; పరమావధిని చేరుకుందుకు అది ఒక సాధనం మాత్రమే. దీనికి మరీకే ప్రాధాన్యమిచ్చి దీనిస్వరూపాన్నిగురించి ఏళ్లకొద్దీ ప్రచారం కొనసాగించినట్లయితే, ప్రజల దృష్టిలో దీనికి మితిలేని ప్రాధాన్య మేర్పడుతుంది; సంపన్నమైన జీవితాన్ని ప్రసాదించే సాధనంగా దీన్ని భావించక ఇదే పరమావధిగా వారు పొరబడతారు. ఈ పరమావధిని చేరుకునేందుకు తమ జీవితమే ఒక సాధనమని తలపోస్తారు. భవిష్యత్ సమాజనిర్మాణభావచిత్రణ రాజ్యాంగచట్టరచనకు ప్రేరేపిస్తుంది. ఇలాగ రూపొందే రాజ్యాంగచట్టం భవిష్యత్పరిణామాల

కనుగుణంగా వుండజాలక, ఒక ఉక్కుచిత్రంవలె తయారైంది. ఈదృష్ట్యా లిఖితపూర్వకమైన అమెరికా రాజ్యాంగంకంటె, బ్రిటిష్ రాజ్యాంగం మిన్న. ఒకేఒక నిర్దిష్ట లిఖితరూపాన అది ఘనీభవించి వుండిపోకుండా, మార్పులకు ఒదుగుతూవుంటుంది. అయితే ఏదోఒక నెపంతోనే తరుచు మార్పు తీసుకురాబడుతున్నమాట నిజమే అయినా, మార్పుమాత్రం సంభవిస్తూనే వుంది. సమాజవాదఆదర్శంగురించి ఏకాభిప్రాయం కుదిరినపుడు, ఆనాటినుంచీ కృషి ప్రారంభించవచ్చును. అధికారాన్నిపొందే మార్గాలను ప్రజలకు ప్రబోధించవచ్చును. అధికారం హస్తగతమైనపుడు, తాము వాంఛించే రాజకీయార్థిక రాజ్యాంగ చట్టాలను ప్రజలు ఏర్పరుచుకోగలరు. ఈ నా అభిప్రాయాలు స్థిరమైనవికావు. వీటిని మీరు విమర్శించి నాకు తోడ్పడినట్లయితే నేనెంతో కృతజ్ఞుడను.

ఆర్. బి. జి.

## 121. రఫీ అహమ్మద్ కిద్వాయ్‌వద్దనుంచి

లక్నో,
డిసెంబరు 9, 1935

ప్రియమైన జవహర్లాల్జీ,

మీరు 15వ తేదీన వ్రాసిన ఉత్తరం 28వతేదీన మాసౌలీచేరుకుంది. 2వ తేదీన నేనక్కడకువెళ్ళినపుడు. దాన్ని నే నందుకున్నాను. దానిమీదవున్న "విమానంద్వారా" అనే లేబిల్ క్యాన్సిల్‌చేశారు.

కమలాజీకి మళ్లీ ఎక్కువగావుందని తెలిసి చాలా బాధపడ్డాను. ఆమె త్వరలోనే కోలుకుంటారని మేమంతా ఎంతో ఆశతో ఎదురుచూస్తున్నాం. ఆమెకు నిమ్మళించగానే, మీరు త్వరలోనే ఇక్కడకు చేరుకుంటారని ఆశిద్దాం.

ప్రస్తుతం నేను చాలా క్లిష్టపరిస్థితుల్లో చిక్కుకున్నాను. ఈ పరిస్థితులు తెచ్చిపెట్టినందుకు మిమ్మల్ని నిష్ఠూరమాడకతప్పదు. 1925-27 లో నాకు కలిగిన విచారకర అనుభవాలదృష్ట్యా నేను రాష్ట్రికాంగ్రెసుకమిటీ కార్యనిర్వాహకవర్గానికిబయటవుండాలని నిశ్చయించుకున్నాను. కాని 1931 లో నేను ఎంత ఒద్దంటున్నా వినక మీరు నన్ను అందులోనికి ఈడ్చారు. కమిటీలోని ప్రాతికూల్యాన్నిగురించి నే నప్పుడే మీకు హెచ్చరికచేశాను. నేను సందేహించినట్లుగానే, ప్రాతికూల్యం తలయెత్తింది. ఇప్పుడు నేను వింతపరిస్థితుల్లోపడ్డాను. నేను నా సభ్యత్వాన్ని ఒదులుకొని ప్రశాంతంగా వుంచామనుకుంటే, సంక్షోభాన్ని తెచ్చిపెట్టావని నన్ను నిందిస్తారు. అలాకాక, కాస్త శ్రద్ధవహించి పూనికతో పనిచేసితినా, నన్ను కించపరచడానికి ప్రతీఅవకాశాన్నీ వినియోగించుకుంటారు. ఇలా చేయటం క్రమశిక్షణకు విరుద్ధమనిసైతం సంకోచించరు. మీకు వివరాలను తెలిపి, మిమ్మల్ని బాధించ దలుచుకోలేదు. నే నొక తెలివితక్కువ పని చేశానని మీ రొకరోజున వినడం సంభవిస్తే నన్ను నిస్పృహపరచిన పరిస్థితులే అందుకు కారణమని మీరు భావించాలని నేను కోరుచున్నాను.

మీ

రఫీ

122. రాజేంద్రప్రసాద్ వద్దనుంచి,

మకాం: వార్ధా,
డిశంబరు, 19, 1935

నా ప్రియమైన జవహర్లాల్జీ,

కొన్నిరోజులక్రితం నేను దక్షిణదేశయాత్రచేస్తూవుండగా మీ ఉత్తరం నాకు అందింది. ఇక్కడికి 13వ తేదీన చేరుకున్నాను. బాపూ, మహదేవ్‌లకు మీరు వ్రాసిన ఉత్తరాలు చదివాను. వచ్చే కాంగ్రెసుమహాసభకు మిమ్మల్ని అధ్యక్షులుగా ఎన్నుకునేందుకు అవకాశాలున్నాయి. మీ దృక్పథానికీ, వల్లభాయ్, జమ్నాలాల్జీ, నావంటివ్యక్తుల దృక్పథానికీ తేడావున్నదనీ, ఈ భేదం మూలస్వభావానికి సైతం సంబంధించినదనీ నాకు తెలుసును. ఇన్నిసంవత్సరాలనుంచి ఈ భేదం యిలాగ వుంటూనే వున్నా, మనం కలసి పనిచేశాం. బాపూ తమనుతాము కపిడంగా ఉపసంహరించుకొని, కోరినప్పుడుమాత్రమే సలహాలివ్వదలుచుకున్నారు కనుక, మనభేదాలు యిప్పుడు మరింత స్పష్టంగా ప్రస్ఫుటంకావడానికవకాశంవుంది. కాని కార్యక్రమంలో, కార్యవిధానాల్లో తీవ్రమైన మార్పుచేయబడనంతవరకు మనమంతా కలసి పనిచేయవచ్చును. ప్రస్తుత వ్యవహారాలపరిస్థితి మీకు మిక్కిలి అసంతృప్తిని కలిగించింది. సందేహంలేదు. ఆ వ్యవహారాలనుచూసి, ఇక్కడ మేమెవరం సంతృప్తి పడడంలేదు. కాని పరిస్థితిస్వభావాన్నిబట్టి ఈ చిక్కులు తటస్థపడ్డాయి. శీఘ్రంగా అడుగువేయడానికి, మొత్తంమీద ఒక మార్పుతీసుకురావడానికి సాధ్యంకాదని నాకు కనిపిస్తోంది. మహాపోరాటాలన్నిటిలోను ఇటువంటిపరిస్థితులు మనకు ఎదురౌతాయి. మన కెంత కోపోద్రేకాలు కలిగినా, మనం ఒదిగివుంటూ పనిచేసుకుంటూ కాలం కలసివచ్చేవరకు వేచివుండాలి. ఇలాంటి ఒకానొక సంక్షోభంలోనుంచి మనం యిప్పుడు పయనిస్తున్నాం. కాని, మనం నిరాశపడనవసరంలేదు. స్వాతంత్ర్యకాంక్షను ఎవరూ ఎన్నడూ త్రుంచివేయలేరు. స్వాతంత్ర్యేచ్ఛ వున్నప్పుడు లొంగిపోవాలనేభావానికి, నిరాశకు తావులేదు. అసహాయోద్యమానికి పూర్వం వున్న మనస్తత్వానికి ఎవరూ వెనక్కువెళ్లలేరని నే ననుకుం

టాను. 1923-28 సంవత్సరాలమధ్యకు వెనక్కి మనం వెళ్ళిపోయామని నే ననుకోను. మనం 1928-29 మధ్యకాలపు మన స్తత్వంతోవున్నాం. మనకు త్వరలోనే యింతకంటె మంచిరోజులు వస్తాయని నా విశ్వాసం. మేం మాశక్త్యానుసారం కృషిచేస్తున్నాం; ఇంతకంటె ఎవరూ ఎక్కువ చేయలేరు. ఏమైనప్పటికీ. మీ అభిమతానుసారం వ్యవహారాలను తీర్చి దిద్దడానికి. విచక్షణననుసరించి వర్కింగ్‌కమటీని నియమించడానికి, పూర్తిగా మీకు స్వేచ్ఛవుంది. మేమెవరం ఎలాంటియిబ్బందీ కలిగించ మని మీరు విశ్వసింపవచ్చును. కొన్నిసందర్భాల్లో మేం సహాయపడక పోవచ్చును; కాని, అవరోధాన్నిమాత్రం కలిగించం.

మే మేకార్యక్రమాన్ని నిర్వర్తించ ప్రయత్నిస్తున్నామో ఈ ఉత్తరంలో సుబోధకంగా వివరించడానికి సాధ్యపడదు. దానికి ప్రయోజనం లేకపోనూలేదు; దీన్ని కాలయాపనకోసం చేయడమూలేదు. ఇది మీకు నచ్చకపోయినట్లయితే, యింతకన్న మంచి కార్యక్రమం తయారైననాడు, మూర్ఖంగా దీన్నిపట్టుకొని కూర్చోవాలని ఎవరికీలేదు. ఇప్పటి జటిలసమస్య లెక్కడవున్నవి అక్కడే వున్నాయి. మేమెవరం వాటిని మరింత జటిలంచేయలేదు. మేం వేలుపెట్టనిచోటనుంచి మీరు కొత్తగా పని ఆరంభించవచ్చును.

నూత్న రాజ్యాంగపట్టంప్రకారం రానున్నపదవులనుగురించి తప్ప, వర్కింగ్‌కమిటీ మరేవిషయాన్నీ ఆలోచించడంలేదని భావించడం నిజమూ కాదు, న్యాయమూ కాదు. వాస్తవానికి మేం ఈ విషయానికి ఎలాంటిప్రాధాన్యం యివ్వలేదు. పైగా ఏదోఒకనిర్ణయానికి రావాలని మమ్మల్ని ఒత్తిడిపెట్టడానికి యితరులు ప్రయత్నిస్తున్నారు. మొట్టమొదటి ప్రయత్నం గత ఏప్రియలులో జబల్‌పూర్‌లో జరిగింది; ఇప్పట్నుంచీ ఈ సమస్యను చర్చించి నిర్ణయించనక్కరలేదని మే మప్పుడు భావించాం. ఈ నిర్ణయంతోనే మేం వున్నాం; మద్రాసులో అది బలపరచ బడింది. ఇక లక్నోలో ఈ సమస్యను తేల్చవలసివుంటుంది; ఎలా చూసినప్పటికీ, దీనిలో కష్టాలు లేకపోలేదు.

అధికారాన్ని స్వీకరించటమూ, తిరస్కరించడమూ అన్నది ప్రధాన ప్రశ్నకాదు. అదే ప్రధానసమస్య అయినట్లు ఈ సమస్యను చర్చించడం భావ్యంకాదు. నాకు తెలిసినంతవరకు అధికారంకోసమే అధికారాన్ని స్వీకరించాలని ఎవరూ వాంఛించడంలేదు. రాజ్యాంగపట్టి మొకపద్ధతిలో అమలుజరుపబడాలని ప్రభుత్వం వాంఛిస్తోంది; దాన్నిచే పద్ధతిలో అమలుజరుపబడాలని ఎవరూ ఉద్దేశించడంలేదు. మనల నేడు ఎదుర్కొంటున్న ప్రశ్నలు వేరు. ఈ రాజ్యాంగపట్టంలో మనకున్న ప్రమేయ మేమిటి? దీన్ని మనం ఖాతరుచేయకుండా మనిష్టారాన మనం పోవాలా? అలాచేయడం సాధ్యమేనా? దానిని స్వాధీనం చేసుకుని మనమనుకుంటున్నవిధంగా అదెంతవరకు ఉపయోగపడుతుందో అంతవరకు దాన్ని మనం ఉపయోగించుకుందామా? మనం దానితో లోనుండి పోరాడదామా? బయటనుండి పోరాడదామా? అయితే, ఆ పోరాటం ఏపద్ధతిలో కొనసాగిద్దాం? ఇప్పుడున్న పరిస్థితులదృష్ట్యా ప్రవేశపెట్టబడిన ఈ రాజ్యాంగపట్టం ఒకస్థితిని తెచ్చిపెట్టింది. ఈ స్థితిని ఎదుర్కొనగల నిర్మాణయుత కార్యక్రమాన్ని ఏలాగ మనం రూపొందించుకోవాలన్నది ముఖ్యమైనప్రశ్న. ప్రోఛేంజరు, నోఛేంజరు సహకారవాది అవరోధకుడు అనేపేరులతో మన మేర్పరుచుకున్న అభిప్రాయాలను పురస్కరించుకొని, ముందుగానే ఈ ప్రశ్నకు సమాధానంచెప్పడానికి పోనగదు. ఇప్పుడు కొందరు ఒకరిపై ఒకరు నిందారోపణలు కావించుకుంటున్నారు; కాని, ఇది తప్పు. మనం అన్నింటిని విస్మరించి మనదేశానికేది క్షేమకరమో చక్కగాఆలోచించి నిర్ణయించుకోవాలి. మన దృష్టిపథంలోవున్న మహత్తరలక్ష్యంపై మన మిప్పుడు తీసుకుంటున్న నిర్ణయం ఎలాంటిప్రభావం కలిగివుంటుందో ఊహించుకోవాలి.

సంస్థానాలవిషయంలో మద్రాసులో మనం చేయగలిగిన నిర్ణయం చేశాం. అది ఎంతో దీర్ఘంగా ఆలోచించి కావించిన నిర్ణయం; ఈవిషయంలో మనకూ ఇతరులకూ అభిప్రాయభేదాలువుంటే వాటిని మనం గుర్తించాలి.

విదేశాలలో కావించదగు ప్రచారంవిషయంలోసైతం ఇలాంటిస్థితే కానవస్తున్నది. ఇందుకు కావలసిన సాధనసామగ్రిమాటి అలావుంచినా, దీనివల్ల గట్టిఫలితం సాధింపగలమూఅని మేము సందేహిస్తున్నాం. విదేశాలతో మీదంటిస్నేహితులకున్న సంబంధాలద్వారా మనం విదేశవ్యవహారాలను తెలుసుకుంటూ ఇప్పట్లాగే, ఇకముందుకూడా వాటినిగురించిన జ్ఞానాన్ని మనదేశీయులకు కలిగిస్తూవుండవచ్చును. ఇంతకంటె మరేం చేయడానికి వీలుపడదు. ఇక్కడిపరిస్థితుల వాస్తవికజ్ఞానం విదేశాలలో కొంతఅనుకూల్యం కలిగిస్తుందని మేము ఆశింపకపోవడంలేదు. మనం బలంగా సమైక్యంగా వున్నట్లయితే. తమ జటిలసమస్యలతో తాము సతమౌతున్నదేశాలనుసైతం మనల్ని నిర్లక్ష్యంచేయకుండావుండేటట్లు ఒత్తిడిపెట్టగలం.

ఇదియిలావుండగా కాంగ్రెస్‌నిబంధనావళిని పునఃపరిశీలన కావింపవలసినసమస్యను మనం చర్చింపవలసివుంది. దీన్నిగురించి మీరుపంపిన 'నోట్' చూచాను. మీరు కావించిన కొన్నిసూచనలు నాకు నచ్చాయి. ఈవిషయాన్ని పరిశీలించడానికి మే మొక ఉపసంఘాన్ని నియమించాం; కాంగ్రెస్‌మహాసభ జరిగేలోపున, మేము ఒక నివేదికను అందచేయగలం; మీ రింకా ఏమైనా సూచించదలుచుకుంటే దయవుంచి ఆ సూచనలు మాకు పంపించండి.

ఇప్పు డొక తమాషాఅయినప్రశ్న వచ్చిపడింది. ఒకవ్యక్తి ఏసంఘానికైనా, ఏకార్యాలయానికైనా సభ్యుడుగా ఎన్నికకావాలంటే, నియమావళిననుసరించి అలా ఎన్నుకోబడేముందు అతనికి కాంగ్రెసులో ఆరునెలలసభ్యత్వం వుండాలి; నిత్యం అతడు ఖద్దరు ధరిస్తూవుండాలి; ఏదైనా ఒక కాయకష్టం చేయాలి. ఈ నియమాలను పాటించడానికి వీలివ్వనిపరిస్థితుల్లోవున్నవారికికాని, జైలులోవున్నవారికికాని, ఇదివరకు అధ్యక్షులుగావున్నవారికిగాని, యీ సూత్రం వర్తించదని నియమావళిలో ఎట్టి మినహాయింపు వున్నట్లు కనిపించదు. డాక్టర్ అన్సారీసైతం పొరపాటున, నకాలంలో సభ్యత్వధరఖాస్తుమీద సంతకంపెట్టలేదు. ఈ విషయం నాదృష్టికి తీసుకురాబడింది. ఇంతవరకూ నే నెట్టినిర్ణయం

వేయలేదు. సభ్యత్వాన్ని మంజూరుచేయవలసినదిగా వర్కింగ్ కమిటీ సభ్యులకు ఒక కొత్తరూలును సర్క్యులర్ రూపంలో పంపిస్తున్నాను. అది మీ కీ ఉత్తరంతోపాటు అందచేస్తున్నాను.

కాంగ్రెస్‌మహాసభ జరిగేముందు కాస్త వ్యవధివుండగా మనం కలుసుకొని సమాలోచనలుజరుపుకునేందుకు వీలుకలగనందుకు ఎంతో విచారిస్తున్నాను. ఇక్కడ పరిస్థితులను వున్నవివున్నట్లుగా తెలుసుకునేందుకు మీకు అట్టే వ్యవధిలేకపోవడం ఎంతో దురదృష్టకరం. మీరు బహుశా ఇక్కడికి ఫిబ్రవరి మొదటివారంల్లో చేరుకోలేరు; కాంగ్రెస్ మార్చిలో జరుగనున్నది. నే నింకా తేదీలు నిర్ణయించలేదు. మహాసభ మార్చిమొదటివారంలో కాకుండా వాయిదావేద్దామంటే అనేకకష్టాలు దాపురిస్తున్నాయి. మొదటివారం మీకు సుకరంగానేవుంటుందని ఆశిస్తున్నాను.

జనవరి 7వ తేదీలోవుగానే, ప్రతినిధులఎన్నిక పూర్తికావాలని, జనవరి 25వ తేదీన అధ్యక్షుని ఎన్నుకోవాలని, ఇవి అన్నిరాష్ట్రాల్లోనూ ఒకేసారి జరగాలని నిర్ణయించాము.

అధ్యక్షునిఎన్నికను ప్రకటించడానికి కాంగ్రెసువర్కింగ్ కమిటీ జనవరి ఆఖరివారంలో సమావేశమౌతుంది. కాంగ్రెస్‌మహాసభ పరిశీలనార్థం కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ తయారుచేసిన ముసాయిదా కార్యక్రమాన్ని చర్చించాలని అనుకున్నాను. కాని మీరు లేనందున, అది సాధ్యంకానట్లు కనిపిస్తోంది. అందువల్ల మీరు సూచించిన తేదీన యిందుకోసం ప్రత్యేకంగా సమావేశాన్ని ఏర్పాటుచేస్తాను. ఈలోపున అనకాశం వుంటే, దయవుంచి మీ సూచనలు పంపిస్తూవుండండి; వాటినిగురించి ఆలోచించడానికి మనకు వ్యవధివుంటుంది.

బాపూకు యింకా రక్తపుపోటు హెచ్చుగానేవుంది. రెండురోజుల క్రితం డాక్టరు గిల్డర్, జీవరాజ్ మెహతా ఆయన్ని పరీక్షించి రెండు నెలలపాటు పూర్తిగా విశ్రాంతితీసుకోమని సలహాయిచ్చారు. కమలాజీ, నెమ్మదిగా కోలుకుంటున్నారని, మీ రిక్కడకు వస్తే ఆమెకు అంత యిబ్బందికలుగదని ఆశిస్తున్నాను.

మీ విశ్వాసపాత్రుడు,
రాజేంద్రప్రసాదు.

123. యఫ్. లెస్నీనద్దనుంచి,

ఇండో-జకొస్లొవేకియా సొసైటీ
ఆఫ్
ది ఓరియంటల్ ఇన్‌స్టిట్యూట్,
ప్రాహా 3, వ్లాస్కా 19,
జకొస్లొవేకియా,
ప్రాహా,
నవంబరు 19, 1935.

ప్రియమైన అయ్యా,

తాము రచించిన "గ్లిమ్సెస్ ఆఫ్ వరల్డు హిస్టరీ" అనే గ్రంథ ప్రతిని నాకు దయతో పంపించినందుకు, మీకు నా హృదయపూర్వక ధన్యవాదాలు. ఈ గ్రంథప్రతి నాకు అందకముందే, శ్రీ నంబియార్ కొనుక్కున్న ప్రతిని తీసుకుని (అందు కాయన కభివందనాలు) నేను చదివాను. ప్రపంచచరిత్ర ప్రధానమైనఘోకడలపై మీకుగల సమగ్ర పరిజ్ఞానానికి వాటిపై మీ వ్యాఖ్యానానికి నే నాశ్చర్యచకితుణ్ణయాను. దీనికితోడు, మీ ఉత్తరాలలో మీ ఆర్ద్రహృదయం వ్యక్తమౌతున్నది. మీరు, మరి రెండు పుస్తకాలు ముఖ్యంగా "లెటర్స్ ఫ్రమ్ ఎ ఫాదర్ టు హిజ్ డాటర్" అనే గ్రంథాన్ని పంపినందుకు నా అభినందనా లందచేస్తున్నాను. ఈ గ్రంథం వాస్తవంగా విలక్షణమైనది.

మీరు అఖిలభారత్ కాంగ్రెస్‌కార్యదర్శి శ్రీ కృపలానీని నాకు కొన్ని ప్రచురణలు పంపించవలసినదిగా దయతో కోరారు; ఆయన వాటిన్ని పంపిస్తూ ఎంతో దయతో ఒక ఉత్తరంవ్రాశారు.

మీ అమూల్యమైన తోడ్పాటువల్ల మా సంఘం మీ మహత్తర దేశంతో సంబంధాలను ఇతోధికంగా పెంపొందించుకొని తనలక్ష్యాన్ని నెరవేర్చుకుంటుందని నమ్ముతున్నాను.

శ్రీమతి నెహ్రూఆరోగ్యం బాగుపడుతున్నదని విని నే నెంతో ఆనందించాను. ఇప్పు డామెకు ప్రమాదపరిస్థితి తప్పిపోయిందని అను

కుంటున్నాను. నా గౌరవపూర్వకనమస్కృతులను ఆమెకు అందచేయ వలసినదిగా ప్రార్థిస్తున్నాను.

మా ప్రాహానుగురించి వ్రాసిన ఒక చిన్న పుస్తకాన్ని మీ కుమార్తె ఇందిరకు వేరే పంపుతున్నాను. ఇందులోనిచిత్రాలు చూచినతరవాత, మా దేశాన్ని చూడాలన్నకోరిక మీకు కలగవచ్చును. త్వరలో మా అందమైనదేశానికి మీరు కుటుంబసమేతులై వస్తే, మే మెంతో ఆనందిస్తాము.

అభివందనాలతో, అభివాదాలతో,

మీ విశ్వాసపాత్రుడు,
యఫ్. లెస్నీ

124. శ్రీమతి మాడలీన్ రోలంక్ లేఖ,

విల్లాలయనెవ్, విల్లెనోవ్
జనవరి 12, 1936

ప్రియమిత్రులు శ్రీ నెహ్రూగారికి,

కొంతకాలంనించి గాంధీజీసమాచారమేమీ తెలియడంలేదు. అయితే, ఈవేళ "హరిజన" పత్రికలోను, లాసేన్‌పత్రికలోను ఆయన పరిస్థితి బాగా ఆందోళనకరంగా ఉన్నట్టు ప్రచురించారు. విశ్రాంతిలేకుండా పనిచెయ్యడంవల్ల గాంధీజీ రక్తపుపోటువ్యాధితో బాధపడుతున్నట్టు తెలుస్తున్నది. దీనికిసబంధించిన విశేషవివరాలు తెలియజేయవలసినదని ప్రార్థిస్తున్నాను.

మీ రింకొక్కవిషయం జాగ్రత్తగా గమనించవలసిఉన్నది. గాంధీజీనిగూర్చి శ్రీ సౌమ్యేంద్రనాథ ఠాకూరు రచించిన గ్రంథం ఆధారంగాతీసుకొని, యూరపులో కొందరు కమ్యూనిస్టులు, సోష లిస్టులు ఆయనమీద విపరీతంగా మిథ్యప్రచారం సాగిస్తున్నారు. అంతే కాదు; జెనీవానించి వెలువడుతున్న సోషలిస్టుపత్రిక 'ప్రజల హక్కులు' గాంధీజీని నిందిస్తూ ప్రత్యేకంగా ఒకవ్యాసం ప్రచు రించింది. ఆయన ధనస్వామ్యవాదుల కమ్ముడుపోయారనీ, ప్రజా

విద్రోహి అనీ నిందించింది. తమ పత్రిక లేవి ప్రచురించినా అంధ ప్రాయంగా విశ్వసించే పాశ్చాత్యపాఠకు లనేకు లీ రచనలు చదివి అవి అక్షరాల యథార్థాలేఅని భావిస్తున్నారు.

గాంధీజీఅభిప్రాయాలన్నిటితోను అందరు ఏకీభవించలేక పోవచ్చును. ఆయన సిద్ధాంతాలు కొన్ని సరియైనవి కావనీ, అపాయకర మైనవనీ నిజాయితీతో నమ్మినవారెవరయినా వాటికి వ్యతిరేకంగా వాదోప వాదాలు సాగించవచ్చును. ఆ హక్కెవరూ కాదనలేరు! అయితే, తప్పుడుతేదీలతో, గాంధీజీవాక్యాల కపార్థాలు కల్పించి ప్రచురించే నిందారోపణ లెటువంటివారికయినా మనస్తాపం కలిగిస్తాయి. ఆయన మీద చేసే దోషారోపణ మొత్తంమీద భారతదేశానికంతటికి అపఖ్యాతి కరంగా పరిణమిస్తున్నది.

పాశ్చాత్య ప్రాచ్యఖండాల స్నేహదృష్టితో, చారిత్రికయాథార్థం కోసమై నే నీ విషయం ఇంతగా నొక్కివక్కాణిస్తున్నాను. అంతేకాని, గాంధీజీ యెడలగల మైత్రిదృష్టితో నే నీ విషయం ప్రస్తావించడంలేదు. స్నేహంకోసం యథార్థం కప్పిపుచ్చడం ఆయన కెంతమాత్రము రుచిం చదు. ఇందువల్ల గాంధీజీ శీలమే శంకించే ఈ దూషణ ఆమూలాగ్రంగా ఖండించవలసినదని కోరుతున్నాను.

మీ రెల్లప్పుడు మాతృదేశసేవలో నిమగ్నులై ఉంటారని నే నెరుగు దును. అయినా మీ కీవిధంగా శ్రమకలిగిస్తున్నందుకు మన్నించవలసిన దని కోరుతున్నాను. అయితే గాంధీజీ తమజీవితం సమస్తము స్వదేశో ద్ధరణకై సమర్పించిన మహావ్యక్తి.కనక ఈ దుష్ప్రచారం ఖండించడం అత్యావశ్యకమని నా నమ్మిక. ఈవిషయమై మీరువ్రాసే వ్యాసాలన్నీ నా సహోదరునిసాహాయ్యంతో అనువదించి ఫ్రెంచిపత్రికలలో ప్రకటిం పగలను. శ్రీమతి నెహ్రూ ఆరోగ్యం క్రమక్రమంగా కోలుకుంటున్న దని అనుకుంటున్నాము. మేము ఈనాడే ఆమెను సందర్శించి మా అభి నందనలందించవలెనని అభిలషిస్తున్నాము. మీ కుమార్తె ఇందిరకు మా అభినందనలు.

మాడలీన్ రోలండ్.

125. మాడలీన్ రోలండ్ లేఖ,

విల్లి నోవ్—ఫిబ్రవరి 17 - 1936.

ప్రియమిత్రులు శ్రీ నెహ్రూగారికి,

సహోదరులు రోమెయిన్ రోలండ్ జన్మదినోత్సవానికి తాము పంపించిన అభినందనలకు మీకు వారు హృదయపూర్వకంగా కృతజ్ఞత తెలియజేస్తున్నారు. మీ రిక్కడినించి వెళ్ళేముందు తిరిగి మిమ్మల్ని కలుసుకోలేకపోయినందుకు వా రెంతో కించపడుతున్నారు. ఈ నాలుగు రోజులు మీ రాత్మీయులమధ్య గడపడం అవసరమనికూడా మే మనుకొన్నాము.

శ్రీమతి నెహ్రూ ఆరోగ్యం కొంత కుదుటపడినందుకు నే నెంతయినా ఆనందించాను. వచ్చేనెలలో ఆమె నొకమారు సందర్శించవలెనని అనుకుంటున్నాను. వైద్యులు దీని కనుమతించగలరని ఆశిస్తున్నాను. ఆమె నన్నుచూడగోరి ఎప్పుడు వీలుపడుతుందో తెలియజేయవలసినదని ముందుగా ఆ వైద్యశాలాధికారులతో టెలిఫోనులో మాట్లాడవలెనని అనుకుంటున్నాను.

మీ కీ ఉత్తరంతో 'సెంటినల్' పత్రిక ప్రతి ఒకటి పంపిస్తున్నాను. మీరు గాంధీజీనిగురించి వ్రాసినవ్యాసం దీనిలో ప్రచురించారు. 'వాంద్రిది'లో మీ వ్యాసం ప్రచురించడానికి వీలుపడలేదు. కాని, అది 'యూరపు' పత్రికకు పంపిస్తున్నాను. ఇంతలోనే ఆ పత్రిక యాజమాన్యం మారింది. కనకనే ఈవిషయమై నా కింతవరకు సమాధాన మేమీ చేరలేదు. శ్రీ రాజారావుగా రిక్కడికి వచ్చారు. వారి నీ వ్యవహారం పరిశీలించవలసినదని ప్రార్థించాను.

కాంగ్రెసుఅధ్యక్షులుగా మీ రెన్నికైనవార్త విని మా అభినందనలు పంపించవలసినదని శ్రీమతి ఇందిర కింతకుపూర్వం నేనొక లేఖ వ్రాశాను.

శుభాభినందనలతో,

మాడలీన్ రోలండ్.

అక్కడ మిత్రులందరికి మా నమస్కృతు లందించవలసినదని ప్రార్థిస్తున్నాను.

126. రొమెయిన్ రోలండు లేఖ,

విల్లినోవ్, ఓల్గావిల్లా,
ఫిబ్రవరి 25, 1936.

ప్రియమిత్రమా,

మీ రిక్కడినుంచి బయలుదేరేముందు నా అభినందనం అందజేయ లేకపోయినందు కెంతయినా విచారించాను. దీనికి నా అనారోగ్యమే కారణం. మీ రీదేశంలో ఉన్నప్పుడే స్వయంగా మీ మాతృదేశానికి, మీకు, శ్రీమతి నెహ్రూకు శుభాశీస్సులర్పించవలెనని ఆకాంక్షించాను. త్వరలోనే శ్రీమతి నెహ్రూఆరోగ్యం బాగా కుదుటబడగలదనీ, స్థిర చిత్తంతో మాతృదేశ స్వాతంత్ర్యసమరంలో పాల్గొనడానికై మీ రచిర కాలంలోనే బయలుదేరగలరనీ ఆశిస్తున్నాను. పాశ్చాత్య దేశాలలోలాగే భారతదేశంలోకూడా 'మీ ఆధ్వర్యంలో ప్రజాసామాన్య సంయుక్తప్రతి ఘటననోద్యమం' ఏర్పడగలదనీ, భారతదేశ విముక్తికి, సాంఘికాభివృద్ధికి అది శాయశక్తులా కృషిచెయ్యగలదనీ ఆశిస్తున్నాను.

బహుశా సెప్టెంబరులో జెనీవాలో ప్రపంచ శాంతిసమావేశం ఏర్ప రచగలమని ఆశిస్తున్నాము. శ్రీ గాంధీజీతోబాటు మీ రీసమావేశానికి శాయ శక్తులా చేయూతఈయవలసినదని కోరుతున్నాను. ప్రపంచంలోని శాంతి శక్తులకన్నిటికి ఇదియొక ప్రధానకేంద్రం కాగలదు. ఫ్రాన్సు, ఇంగ్లండు, అమెరికా, చెకోస్లవేకియా, స్పెయిన్, బెల్జియం, హాలండ్ మొదలయిన దేశాలలో విశ్వవిఖ్యాతులయిన మహామహు లెందరెందరో ఈ సమా వేశం జేగీయమానంగా కొనసాగించవలెనని బద్ధకంకణులై ప్రయత్ని స్తున్నారు. (ఆంగ్లదేశంలో లార్డ్ రాబర్ట్ సిసిల్; మేజర్ అట్లీ, నార్మన్ ఏంజిల్, ఫిలిప్ నూయల్ బేకర్, అలగ్జాండర్, ప్రొఫెసర్ లాస్కీ మొదలయినవా రీఉద్యమంబాగాబలపరుస్తున్నారు. ఫ్రాన్స్‌లోహెరియట్, పీర్‌కో, జూమో, కాచాన్, రకమూద్, ప్రొఫెసర్ లాంజువా మొదలయిన వా రీ విషయమై శాయశక్తులా కృషిచేస్తున్నారు. చెకోస్లవేకియాలో డాక్టర్ బెనిఫ్, హెడ్జా, స్పెయిన్‌లో అజానా, ఆల్వార్‌డెల్, వాగో, బెల్జియంలో లూయిడ్ బ్రోకేర్, ఓన్రి, లాఫూతేయిన్ మొదలయినవా

రీ సంస్థకోసమై నడుములుబిగించి పనిచేస్తున్నారు. జాతీయాంతర్జాతీయ శక్తులన్నీ కూడగట్టుకొని ప్రపంచసంగ్రామజ్వాల పల్లార్పవలెనని ఈ సంఘంలోని సుప్రసిద్ధులందరు ఆకాంక్షిస్తున్నారు.

ఈవిషయమై మీరు భారతదేశంలోని మిత్రులందరితోను ప్రసంగించవలసినదనీ, వారికి మా నమస్కృతు లందించవలసినదనీ కోరుతున్నాను. ఫాసిజానికి, యుద్ధానికి వ్యతిరేకంగా అంతర్జాతీయసంఘం ఒకటి ఏర్పడినది. దీనికి నన్ను గౌరవాధ్యక్షుడుగా ఎన్నుకొన్నారు. ఈ సంఘంవిషయమై భారతదేశంలో మిత్రులఅభిప్రాయాలు, వ్యాఖ్యలు నాకు పంపించగలరని ఆశిస్తున్నాను.

(పారిస్, 10-2-37, లాఫాయత్‌వీధి.)

భారతదేశంలో మనమిత్రులతో ఈవిషయమై తరుచు ఉత్తర ప్రత్యుత్తరాలరూపంలో ప్రసంగించవలెనని అభిలషిస్తున్నాను. ఆ దేశంలో సాంఘిక రాజకీయసమరంలో పాశ్చాత్యదేశాల ధోరణు లెంతో జాగరూకతతో పరిశీలించడం చాలా ఆవశ్యకమని నమ్ముతున్నాను.

మీకు నిరంతరశ్రేయోభివృద్ధి కలగవలెననీ, మాతృదేశ స్వాతంత్ర్య సంగ్రామంలో అచిరకాలంలోనే దిగ్విజయంకలగవలెనని ఆకాంక్షిస్తున్నాను.

భవదీయుడు,
రోమెయిన్ రోలండ్.

ఇంకొక్కమాట. ఇక్కడ మా కతిథులుగాఉన్న గాంధీజీకి, మీరాబెన్‌కు, ప్యారీలాల్‌కూ, మహదేవదేశాయికి మా అభినందనలందించవలసినదని కోరుతున్నాను. వీరు 'వాండ్రిది'లో వ్రాసిన వ్యాసం చదివినే నెంతయినా సంతోషించాను. మీరు నాకోసంపంపించినవ్యాసం మార్చినెలలో 'యూరపు' పత్రికలో ప్రకటిస్తున్నారు.

127. బెర్‌ట్రాండ్ రసెల్ వద్దనుంచి,

టెలిగ్రాఫ్ హౌస్.
హార్టింగ్, పీటర్స్‌ఫీల్డు,
జనవరి 30, 1936

ప్రియమైన శ్రీ నెహ్రూ,

మీరు ఇంగ్లండుకు వచ్చినపుడు మిమ్మల్ని కలుసుకోలేకపోయినందుకు నా కెంతో విచారంగావుంది. నా భార్యకు ఒంట్లో నింపాదిగాలేదు; ఆమెను ఉష్ణప్రదేశానికి తీసుకువెళ్లమని సలహాయిచ్చారు; కాని ప్రయాణం చేసేస్థితిలోలేనందువల్ల ఇప్పుడప్పుడే ఆమెను తీసుకువెళ్లడానికి వీలు కాకుండావుంది. తత్ఫలితంగా అంతవరకూ నే నిక్కడ వుండిపోవలసి వచ్చింది. మీ ఉద్యమంపట్ల నాకు సానుభూతివున్నట్లు మీకు తెలుసును; జాతీయోద్యమాన్నిసమాజవాదంతో అనుసందించడానికి మీరు ప్రయత్నిస్తున్నందున, నాకు మరింత సానుభూతి కలుగుతున్నది. ప్రభుత్వవ్యవహారాలదృష్ట్యా, ఇది అంతటి అనుకూలమైనసమయం కాకపోయినా, మీ రాక ప్రయోజనాన్ని చేకూర్చగలదని నే నాశిస్తాను.

అభివందనలతో,

మీ విశ్వాసపాత్రుడు,
బెర్‌ట్రాండ్ రసెల్

128 ఎం. ఎ. అన్సారీవద్దనుంచి,

దార్ - ఇస్ సలీమ్,
దరియాగంజ్, ఢిల్లీ
ఫిబ్రవరి 11, 1936

నా ప్రియమైన జవహర్,

ఆసక్తిదాయకమైన అతి మనోహరమైన మీ ఉత్తరం అందింది. అనేకధన్యవాదాలు. అవును, నిజమే; మీరన్నట్లు లేఖలు వేరు; బొమ్మల కార్డులు వేరు. రెండింటికి పోలికలేదు. లేఖలువ్రాస్తే కలిగే అప్యాయత

బొమ్మలకార్డులు పంపడంలో వుండము. మీకు ఉత్తరాలువ్రాసేభారం ఎక్కువౌతున్నందున, పోనీ, బొమ్మలకార్డు పంపించండని నేను సూచించాను; కాని మీరు అలాకాకుండా ఉత్తరం వ్రాశారు; సంతోషం. విదేశాలలోవున్న స్నేహితులకు నేను మామూలుపోస్టుద్వారా ఉత్తరాలు వ్రాయడం మానుకున్నాను. ఏమీఅంటే, ఒకవారం క్రిందటి పాతవార్తలు తప్ప మిత్రులకు తాజావార్తలు అందివ్వలేం; ఈవారం, వచ్చేసారి రెండు వారాలవ్యవధి తీసుకుంటుంది. ఇలాగ కేవలం కొన్నివారాలక్రిందటి పాతవార్తలనే లేఖల్లో వ్రాయవలసివస్తూవుంటుంది. లాసనేకు మార్చిన తరవాత కమల కాస్తంత తేరుకుంటున్నారని ఆశిస్తున్నాను. అక్కడ ఏ శానిటోరియంలో ఆవిడను చేర్పించారో మరి. లాసనే అంటే నాకెంతో సరదా; అక్కడికి వెళ్లాలని అనిపిస్తూవుంటుంది. అది చాలా చక్కటిపట్టణం; అన్నింటికిమధ్య వుంది. అక్కణ్ణుంచి లేసిన్, మాన్టానాలకు యిట్టే వెళ్లవచ్చును. కమల ఆరోగ్యం దినదినాభివృద్ధిచెందుతున్నదని వినడానికి నేనెంతో ఆసక్తితో నిరీక్షిస్తున్నాను. ఈపాటికి మీరు లాసనే చేరుకునివుంటారు; మీ రాక ఆమెకు ఉత్సాహాన్ని కలిగించివుంటుంది.

కాని, ఇలాంటిపరిస్థితుల్లో మీరు కాంగ్రెసుఅధ్యక్షులుగా ఎన్నికయారు; అధ్యక్షునిగా ఎన్నికై, మీ రేంచేయగలరో నాకు దురూహ్యంగావుంది. కమలను అక్కడనుంచి కదపడానికి వీల్లేనిపరిస్థితిలో వుంది; ఆమెను భారతదేశానికి తీసుకువద్దామంటే ఆమె అతి బలహీన స్థితిలో వున్నారు. మీ రక్కడ మహావుంటే మార్చి పదిహేనవతేదీవరకూ వుండగలుగుతారు; ఆమెను విడిచిపెట్టి మీ రిక్కడకువస్తే,ఆమెఆరోగ్యం మరీ అధ్వాన్నమౌతుంది. ఇలాంటిపరిస్థితుల్లో మీ రిక్కడ ఆట్టేకాలం వుండలేరని అనుకుంటాను. నిర్మొహమాటంగా చెప్పాలంటే; మిమ్మల్నిసంవత్సరం కాంగ్రెసుఅధ్యక్షునిగా ఎన్నుకున్నవారే ఈ చిక్కులన్నిటికీ కారణం; ఏమాత్రం ఆలోచించకుండా మూర్ఖంగా మీపట్ల నిర్దయగా వారు ప్రవర్తించారు. మీ వ్యక్తిత్వం అమోఘమైనది; మీ రెంత కార్యచతురులైనా, ప్రస్తుతపరిస్థితులనుబట్టి, కాంగ్రెసుఅధ్యక్షులుగావుంటూ

ఈ సంవత్సరం మీ రంతగా పనిచేయడానికి అవకాశంవుండదనుకుంటాను. చివరకు సాధించేదేమీ లేకపోతే, మాలో ఒక గొప్పవ్యక్తి మాకు నిరాశకలిగించినవాడౌతాడు. నేటిపరిస్థితులలో శాసనసభాకార్యక్రమం, (ఇది స్వాతంత్ర్యాన్ని చేకూర్చడానికి అంతగా తోడ్పడకపోయినా, స్వాతంత్ర్యతాత్పర్యాన్ని చేరువకుతీసుకురాకపోయినా) యుద్ధంవల్ల అలసిపోయివున్న ప్రజలకు ఉపశాంతిని కలిగిస్తుందని, భవిష్యత్‌పురోగమనానికి పూర్వరంగంగా ఉపకరిస్తుందని నేను భావిస్తున్నాను. నాకు అనారోగ్యంగావుండడంవల్ల నేను ప్రత్యక్షరాజకీయాలనుంచి విరమించినా, మీ రిక్కడకువచ్చాక మీతో ముఖాముఖి అనేకవిషయాలనుగురించి సంభాషించాలనివుంది.

మహాత్మాజీఒంట్లో కులాసాగావుంది. కాని ఈసారి ఆయన ఆరోగ్యం గట్టి దెబ్బతిన్నదని నాకు తెలియవచ్చింది. నా ఆరోగ్యం పూర్వంకంటే ఇప్పుడుబాగుంది.కాని కొంచెంజాగ్రత్తగావుండక తప్పదు. జోహ్రా, తన పరీక్షాఫలితంకోసం ఎదురుచూస్తోంది. ఈసారి ఆమె ఉత్తీర్ణురాలౌతుందనుకుంటాను. ఉత్తీర్ణురాలైతే ఏంచేద్దామనుకుంటోందో నాకు తెలియదు. ఒక్కొక్కపుడు కాలేజీలో చేరి బి. ఏ. చదువుతానంటోంది. ఒక్కొక్కపుడు కేంబ్రిడ్జి వెడతానంటోంది. ఆమె ఏంచేసినా నాకు సమ్మతమే; అంతా ఆమెకే వొదిలిపెట్టాను. మీకు, కమలకు ఇందుకు తన ప్రేమపూర్వకాభివందనాలు తెలియచేయమని కోరుతున్నది. మీ అందరికీ నా ప్రేమాభివందనాలు.

ప్రేమగల మీ,
యం. ఏ. అన్సారీ

పి. యస్: "రీజెనరేషన్ ఇన్ మేన్" అనే నా గ్రంథాన్ని మీకు పంపిస్తున్నాను. అది మీకు నచ్చుతుందని నే నాశిస్తున్నాను.

129. ఎలెన్ విల్కిన్సన్,

హౌస్ ఆఫ్ కామన్స్,
లండన్,
ఫిబ్రవరి 17, 1936.

ప్రియమైన జవహర్లాల్,

నా ఉత్తరం ఆలస్యంచేసి పంపిస్తున్నందుకు క్షమించండి; మీ ఉత్తరం అందిననాటినుంచి ఊపిరిసలపనిపనుల్లో వున్నాను. అందులోనూ విమానంమీద బెర్లిన్‌వెళ్ళి రావలసివచ్చింది.

ప్రొఫెసర్ లాస్కీ, మీ రాకనుగురించి "లైఫ్ అండ్ లైట్" పత్రికలో కొంత వ్యాఖ్యానించారు; ఆయనఅభిప్రాయాలను మేమంతా పునశ్చరణచేస్తున్నాం; ఆయనవ్యాఖ్యానం మీకు ఆసక్తిదాయకంగా వుంటుంది, కనుక పత్రికను మీకు వేరే పంపిస్తున్నాను.

శాంతిపరిరక్షణపద్ధతులకుగల అవకాశాలనుగురించి తనపత్రికలో కొన్నివ్యాసాలు వరుసవరుసగా ప్రకటించాలని లేడీ రోన్డా తలపోస్తున్నది. ఈ పనిని జెరాల్డు హెర్ట్ నిర్వహిస్తున్నాడు; మీరు ఈ శీర్షికక్రింద ఒక వ్యాసంవ్రాయడానికి అవకాశంవుంటుందేమోనని ఆమె నన్ను మీకువ్రాయమని కోరింది.

బ్రిటిష్‌వలసదేశాల, "బడుగుదేశాల" విషయంలో కొన్నిఏర్పాట్లు చేయాలనే లాయడ్‌జార్జిప్రైఖరిని చాలామంది పార్లమెంటుసభ్యులు బలపరుస్తున్నారు; మీరుకావించిన ఉపన్యాసం కలిగించిన స్ఫురణనుగురించి ఆమెకు తెలియచేస్తూ, మీఉపన్యాసంలోని ఈ పంక్తులను నేను ఉదహరించాను. "అయితే వలసదేశాలమాట ఏమిటి? ఇప్పుడా దేశాలు ఏమిటి వాంఛిస్తున్నాయి? ఏమిటి జరగవలసివుంటుందో చెప్పడానికి వాటికి అభిప్రాయాలంటూ లేవా? అవి తమ యజమానులు మారాలని కోరుతున్నాయా, లేక యజమానులంటూ ఎవరూ వుండకూడదంటున్నాయా?" వలసదేశాలదృక్పథాన్నిగురించి, మీరు ఈ దేశంలో జరుగుతున్న స్నేహపూర్వకప్రయత్నాలను దృష్టిలోవుంచుకొని, మీకు తోచినవిధంగా విశదంగా వివరిస్తూ ఒక వ్యాసం వ్రాసిపంపించడానికి మీకు వీలుంటుం

దేమోనని ఆమె ఆశిస్తున్నది. మీకు వ్యవధివుంటే మీరు వ్యాసం వ్రాయడం మంచిదని నేననుకుంటున్నాను. పారితోషికం చెల్లిస్తారు కాని, అది అంత ఎక్కువగాఉండదని నేను భయపడుతున్నాను. వ్యాసం వెయ్యి మాటలకు మించకూడదని ఆమెఅభిప్రాయం. భారతదేశానికి బయలుదేరే లోపున మీరు వ్రాయలేననుకుంటే, పోనీ, ప్రయాణంచేస్తూ నౌకలో వ్రాసి, వ్యాసాన్ని అక్కడనుంచి పంపిస్తే బాగుంటుందనుకుంటాను; అలాచేస్తానని, ఆమెకు తెలియజేస్తే ఆమె ఎంతో సంతోషిస్తుంది. ఆమె ఆఫీసుచిరునామా : 32; బ్లూమ్స్బరీవీధి; డబ్ల్యు. సి. 1.

కమలకు నింపాదిగావుందని అచిరకాలంలోనే పూర్తిగా కోలుకుంటారని ఆశిస్తున్నాను.

మీ రిక్కడకు మామధ్యకు రావడం మేమెంతో ఘనంగా భావించుకుంటున్నాం; మీ రాక మా దేశీయులకు ఎంతో మంచిని చేకూర్చింది.

మీ ఇరువురికీ గౌరవపూర్వకాభివందనాలు,

మీ విశ్వాసపాత్రుడు,
ఎలెన్.

## 130. సుభాష్ చంద్రబోస్ వద్దనుంచి,

కుర్హాస్ హోచ్‌లాండ్,
బడ్గస్టీన్,
(ఆస్ట్రిచ్)
మార్చి 4, 1936.

నా ప్రియమైన జవహర్,

చాలాదూరం ప్రయాణంచేసి ఎంతో అలసిపోయి, నిన్ననే నే నిక్కడకు చేరుకున్నాను. ఇది ఎంతో చక్కటి ప్రశాంతమైనప్రదేశం. మీరు భారతదేశానికివెళ్ళి మళ్ళీ ఆ సుడిగుండాల్లోకి దుమికేలోపున,యూరోపులో కొంత విశ్రాంతితీసుకుంటే బాగుంటుందనుకుంటాను.

మీతో నేను జరిపిన సంభాషణను పురస్కరించుకుని, అదేపోక డతో నేనొక ప్రకటనచేయవచ్చునా అని, మీ దగ్గరనుంచి వచ్చినప్ప ట్నుంచి ఆలోచిస్తున్నాను. అలాగ చేయవచ్చునని భావించాను. ఏమంటే, బహుశా నేను జైలుకి వెళ్ళవచ్చును; నా సూచనలు తెలుసుకోవాలనికోరే వారుకొందరుండవచ్చును. అందుచేత యిప్పుడే సాధ్యమైనంతక్లుప్తంగా ఒక ప్రకటనకావిస్తూ మిమ్మల్ని పూర్తిగా బలపరచదలుచుకున్నానని స్పష్టంగా తెలియచేయాలనుకుంటున్నాను.

నేటి అగ్రనాయకుల్లో కాంగ్రెసును ప్రగతిమార్గాన నడిపించగల వారు మీ యొక్కరేనని నా విశ్వాసం. అంతేకాక మీకున్నస్థానం సాటి లేనిది. మహాత్మాగాంధీసైతం, మీతో సరిపుచ్చుకున్నంతగా, ఇంకెవరి తోనూ సరిపుచ్చుకోరనుకుంటాను. మీకు దేశంలోగల స్థానాన్ని బలాన్ని, నిర్ణయాలుకావించడంలో మీరు పూర్తిగా వినియోగించుకుంటారని నేను ఆశిస్తున్నాను. దయవుంచి మీ స్థానానికిగల బలాన్ని తక్కువఅంచనా వేయకండి. గాంధీజీ మిమ్మల్ని మారించేసుకునేవిధానాన్ని ఏన్నటికీ చేపట్టరు.

మన తుదిసంభాషణలో నేను సూచించినట్లుగా మీరు వెన్వెంటనే చేయవలసినపనులు రెండు ఉన్నవి (అ) అధికారస్వీకరణప్రయత్నాలను అన్నివిధాల నిరోధించడం. (ఆ) కార్యవర్గాన్ని విస్తృతపరచి విశాలం చేయడం. ఇది మీరు చేయగలిగితే, చరిత్రలో నిలిచిపోతారు. పతనా వస్థలోవున్న కాంగ్రెసును మీరు ఉద్ధరించినట్లవుతుంది. సమస్యలనేకాలు కేమి వాటిని కొంతకాలం ఆపవచ్చును; కాని వెనువెంటనే కాంగ్రెసును పతనావస్థనుంచి రక్షించవలసివుంటుంది.

మీరు కాంగ్రెసు కొరకు విదేశశాఖను నెలకొల్పాలని ప్రయత్ని స్తున్నారని విని, నేనెంతో సంతోషించాను. మీ అభిమతాన్ని నేను హర్షి స్తున్నాను.

మీరు ప్రయాణసన్నాహంలో వున్నారు; అందుకనేక ఏర్పాట్లు స్వయంగా మీరు చూసుకోవలసివుంటుంది. కనుక ఈ ఉత్తరాన్ని యింక పెంచరాదని భావిస్తున్నాను. మీ ప్రయాణం సుఖకరంగా కొన

పొగాలాని, మీకై నిరీక్షిస్తున్న బృహత్తర బాధ్యతలనిర్వహణలో మీకు విజయంచేకూరాలని వాంఛిస్తున్నాను. ప్రభుత్వం నన్ను నిర్బంధించకుండా, లక్నో రానిచ్చినట్లయితే, అక్కడ మీ కన్నివిధాల సహాయపడగలను.

ప్రేమతో మీ,

సుభాష్

131. హెచ్. ఎన్. బ్రెయిల్స్‌ఫర్డ్‌వద్దనుంచి

లండను, యన్, డబ్ల్యు-3

దయవుంచి దీనికి సమాధానంవ్రాయకండి: మార్చి 8, 1936,

37, బెల్‌సైజ్‌పార్కు గార్డెన్సు

నా ప్రియమైన నెహ్రూ,

భార్యావియోగంవల్ల మీకుకలిగిన ఈ దుఃఖాన్నుంచి మీరు కొన్ని నెలలవరకు తేరుకోలేరు. అయినప్పటికి ప్రకృతి అద్భుతమైనమార్పులు తీసుకవస్తుందని ఆశిస్తూనే, మీ రీ విషాదాన్ని భరించాలి. కాని మీ రిన్నాళ్లూ పడిన ఆదుర్దా, మీ మనోనిగ్రహాన్ని హరించివుండవచ్చును. స్నేహితులెవరూ మీ దుఃఖాన్ని తగ్గించలేరు. నిజంగా మీ సతీమణి సాటిలేని స్త్రీ. ఈమాట చెప్పి ఆమెను మీకు జ్ఞాపకంచేయడంవల్ల మీ దుఃఖం అతిశయిస్తుందితప్ప ఉపశమించదు. కాని మా సానుభూతివచనాలు మిమ్మల్నేమాత్రం ఉపశమింపజేసినా, మీతోపాటు మేమూ ఈ దుఃఖాన్ని పంచుకుంటున్నాం.

ఈ విషాదకరపరిస్థితిలో మిమ్మల్ని మీరు తక్కువగా భావించకండి. భారతదేశం ప్రత్యేకంగా, వ్యక్తిగతంగా మీనుంచి ఎంతో వాంఛిస్తున్నది. నాకు అంతో, యింతో తదితరనాయకులతో పరిచయమున్నది. మీకున్న ధైర్యసాహసాలు, మేధాశక్తి; అన్నిటికీమించి వర్గరహిత మానవసమాజాన్నిగురించి మీకున్న సమదర్శనము మరేనాయకులకు

లేవు. నాయకత్వంవహించడానికి మిమ్మల్ని చరిత్ర వరించింపన్న విశ్వాసంతో, మీరు బలాన్ని చేకూర్చుకునేందుకు ప్రయత్నిందం డె.

మీ చరిత్రగ్రంధాన్ని నాకు పంపించి గౌరవభావాన్ని చూపి నందుకు మీకు నా కృతజ్ఞత. దాని నెంతో ఉత్సుకతతో చదువుతాను. నన్ను మీరు జ్ఞాపకంపెట్టుకున్నందుకు, నా మనస్సు ద్రవించింది.

అత్యంత విశ్వాసంతో, మీ
హెచ్. ఎన్. బ్రెయిల్సుఫర్డు.

132. మహాత్మా గాంధీవద్దనుంచి,

ఢిల్లీ,
మార్చి 9, 1936

నా ప్రియమైన జవహర్‌లాల్,

పాపం కమలను శాశ్వతంగా యూరోపులో విడిచిపెట్టి, నువ్వు తిరిగివచ్చావు. కాని ఆమె ఆత్మ ఎప్పుడూ భారతదేశంలోనే వుంటుంది. అది నీకూ మాకూ పవిత్రమైన నిధి. మా నాలుగుకన్నులను స్రవింప చేసిన, ఆ తుదిసంభాషణ నే నెన్నటికీ మర్చిపోలేను.

గురుతరబాధ్యత, నీకోసం యిక్కడ నిరీక్షిస్తున్నది. ఆ బాధ్యత నువ్వు నిర్వహించగలవుకనుక, అది నీమీద వుంచారు. మామూలుగా నా ఒంట్లో తేలికగావుంటే, నిన్ను కలుసుకునేందుకు వచ్చేవాడిని; కాని అందుకు సాహసింపలేకపోతున్నాను. శరీరస్థితి అంతా బాగానేవుంది. శరీరంతూకం హెచ్చిందికూడా; కాని, ధాతుపుష్టి తగ్గిపోయింది. ఇది మూడునెలలక్రితం ఆరంభమయించనుకుంటాను. ఇంతకీ, నే నేమీ జబ్బుపడలేదు. అయితేనేమి, శరీరం కుషిక్కించింది; రక్తపుపోటు హెచ్చింది. నేను జాగ్రత్తగావుండాలి మరి:

ఢిల్లీలో నేను కొన్నిరోజులు విశ్రాంతితీసుకుంటాను. నువ్వు మొదటనుకున్నట్లుగా జరిగివుంటే, నేను వార్ధాలోవుండిపోయేను; మనం కలుసుకుని మాట్లాడుకునేవాళ్లం. అక్కడ నీ కెంతో ప్రశాంతంగా

వుండును. నేను ఢిల్లీలో కనీసం 23వ తేదీవరకు వుంటానుకనుక, ఎక్కడైనా ఒకచోటని నీవనుకుంటే. అక్కడ మనం కలుసుకోవచ్చును. కాని వార్ధా అయితే బాగుంటుందని నీకు తోస్తే. నేను ఈలోపునే అక్కడకు చేరుకుంటాను. ఢిల్లీవచ్చినట్లయితే నువ్వు నాతోపాటు హరిజన కాలనీలో బసచేయవచ్చును; కాలనీ కొత్తగా కింగ్స్‌వేలో కట్టారు; చాలా బాగుంది. మనం ఎక్కడ ఏతేదీన కలుసుకోవచ్చునో నాకు తెలియచేయి. రాజేంద్రబాబు, జమ్నాలాల్జీలు నీదగ్గరే వున్నారు; లేదా వుంటారు. వల్లభాయి వచ్చేవాడేకాని ఆయన వుండిపోవటం మంచిదని మేమంతా అనుకున్నాం. ఆ ఇద్దరూ రాజకీయాలు చర్చించడంకోసం కాక, నీకు తమ సాయమాత్రాన్ని తెలపడంకోసం బయలుదేరారు. నీ గృహవ్యవహారాలు నువ్వు చక్కపెట్టుకున్నాక, మనమంతా సమావేశమౌదాం; రాజకీయ సమస్యలు ప్రారంభిద్దాం.

కమలమరణంవల్ల, అనంతరం వెంటనే నీ ఎడబాటువల్ల కలిగిన విచారాన్ని ఇందిర తట్టుకోగలిగిందని అనుకుంటాను. ఆమెచిరునామా ఏమిటి?

పరిస్థితులు నీకు సానుకూలపడుగాక!

ప్రేమతో,
బాపూ

## 133. సుభాస్‌చంద్రబోసువద్దనుంచి

కురహౌస్ హోచ్‌లాండు,
బడగ్‌స్టీన్, ఆస్ట్రియా
మార్చి 13, 1936

ప్రియమైన జవహర్‌లాల్,

వియన్నాలోని బ్రిటిషు దౌత్యప్రతినిధివద్దనుంచి ఈ క్రిందిలేఖ ఎక్స్‌ప్రెస్‌టపాలో ఇప్పుడే నాకు చేరింది.

"మీరు ఈనెలలోనే భారతదేశం తిరిగిపోగోరుతున్నట్టు జారీచేసిన పత్రికాప్రకటనలు భారతప్రభుత్వందృష్టికి వచ్చాయి. మీరు ఆపని చేసినట్లయితే, మిమ్ముల్ని స్వేచ్ఛగా తిరగనివ్వడం సాధ్యంకాకపోవచ్చు

నని భారతప్రభుత్వం స్పష్టంచేయదలచుకొంది. ముందుగానే ఈ హెచ్చరికను మీకు అందచేయమని నిర్దేశిస్తూ విదేశవ్యవహారాల మంత్రిత్వశాఖ కార్యదర్శి పంపిన ఆదేశాలు ఈవేళనే నాకు చేరాయి.

[సం] జె. డబ్ల్యు. టేలర్
హిజ్ మెజెస్టీస్ కాన్సల్"

ఈ చీటీ నాకు చేరేటప్పటికి ప్రయాణసన్నాహాలు చేసుకోవడంలో నేను నిమగ్నమైవున్నాను. ఓడపై ప్రయాణంచేస్తే బాగుంటుందా లేక విమానంలో ప్రయాణంచేస్తే మంచిదా అన్న ఆలోచనతో కొద్ది ఆలస్యం జరిగింది గాని, లేకపోతే ఈపాటికే ప్రయాణసన్నాహాలన్నీ పూర్తి చేసుకొనివుండేవాణ్ణి. మరొక 25 రోజులు ఇక్కడవుంటే, చికిత్స పూర్తి చేసుకోగలుగుతాను. ఆ తర్వాత విమానంలో బయలుదేరితే సకాలానికి స్వదేశం చేరుకోగలుగుతాను.

ఇలాంటి విషయాలలో నేను సలహాలు అడుగదగినవ్యక్తి ఇక్కడగానీ, ఐరోపాఖండంలోగానీ ఎవరూలేరు. ఈక్షణంలో నా మట్టుకు నేను ఏమనుకొంటున్నానంటే - బహుశా మీరుకూడా ఇలాగే భావించి వుంటారనుకొంటాను- ఆ హెచ్చరికను ఖాతరుచేయకుండా, స్వదేశానికి రావడమే మంచిదని. అయితే ఈసందర్భంలో ఏపద్ధతి అవలంబిస్తే ప్రజోద్యమానికి శ్రేయస్కరం అన్న విషయంమాత్రమే పరిశీలించవలసి వుంటుంది. నాకు సంబంధించినంతవరకు వ్యక్తిగతఅంశం అసలు లెక్కలోకేరాదు. ప్రజోద్యమానికి శ్రేయస్కరంగావుండే ఏపద్ధతి అవలంబించడానికైనా నామట్టుకునేను సిద్ధమే. నేను చాలాకాలంగా దేశ రాజకీయాలకు దూరంగావున్నందున, ఇప్పుడు ఏపద్ధతి అవలంబించడం వల్ల ఉద్యమానికి ఎక్కువ ఉపయోగకరంగావుంటుందో తేల్చుకోవడం నాకు కొంత కష్టంగావుంటుంది. బహుశా ఈవిషయంలో మీరు నాకు సలహాయివ్వగలరనుకొంటాను. ఇలాంటి క్లిష్టపరిస్థితిలో మరొకవ్యక్తికి సలహాయివ్వడం మీకుకూడా కొంత కష్టమేనన్నసంగతి నాకూ తెలుసు. అయితే, వ్యక్తిగతఅంశాన్ని మీరు తేలికగా విస్మరించగలరు. రాజకీయ

సమస్యలను పరిశీలించేటప్పుడు మీరు ఆవిధంగానే ఆలోచిస్తుంటారని నేను ఎరుగుదును. అందుచేత ఉద్యమశ్రేయస్సుదృష్ట్యామాత్రమే ఈవిషయంలో తోటిప్రజాసేవకునికి యివ్వదగిన సలహాయివ్వండి. మనదేశ రాజకీయరంగంలో మీరు ప్రధానభూమిక నిర్వహిస్తున్నందున. ఇలాంటి ప్రత్యేక యిబ్బందికరపరిస్థితులలో నాకు సలహాయివ్వవలసినబాధ్యత నుంచి మీరు తప్పుకోలేరు.

మీకు మించిన గురుతుల్యులు నాకు మరొకరు లేరు. అందుకే మీకు ఈవిషయంలో కొంత యిబ్బంది కలుగజేయవలసివస్తోంది. క్షమించండి. ఉన్నవ్యవధి చాలా స్వల్పం. అనేకమందిసలహాలుతీసుకోవడం సాధ్యంకాదు. ఈవిషయంలో నా బంధువులతో సంప్రతించి లాభంలేదు. ఎందుకంటే, వారు ఉద్యమశ్రేయస్సుదృష్ట్యా ఈ సమస్యను అసలు చూడనేలేరు. అందుచేత నేను కేవలం మీ సలహాపైనమాత్రమే ఆధారపడవలసివస్తోంది. మరొకమార్గం లేదు. ఈ నెల 20వ తేదీకి ఈ జాబు మీకు చేరవచ్చును. ఇది అందగానే మీరుకనుక దయచేసి తంతిపంపించితే, అది సకాలంలోనే నాకు చేరుతుంది. ఏప్రిల్ 2వ తేదీన రోమ్ నుంచి బయలుదేరే కె. ఎల్. ఎమ్. విమానంలో బయలుదేరడానికి వీలుంటుంది. అందుచేత భారతదేశానికి బయలుదేరాలని నేను 21వ తేదీని, లేదా చివరకు 22వ తేదీన నిర్ణయించుకున్నానుకూడా; ఏప్రిల్ 2న రోమ్ నుంచి బయలుదేరే విమానంలో సీటుసంపాదించుకోడానికి అవకాశముంటుంది. బహుశా మార్చి 29వ తేదీన బయలుదేరే విమానంలోనే సీటు సంపాదించడానికికూడా వీలుండవచ్చు.

లక్నో కాంగ్రెసు జరిగేసమయానికి భారతదేశం చేరుకోవాలని నేను నిర్ణయించుకొన్నప్పుడు, అన్నివిషయాలు సాకల్యంగా ఆలోచించాను. నే నక్కడకు చేరగానే నన్ను అరెస్టుచేసేఅవకాశం అప్పుడూ వుంది. అయితే, కొంతకాలంపాటు స్వేచ్ఛగా తిరగనిచ్చేఅవకాశం వున్నావుండవచ్చుననుకున్నాను, కాని ఇప్పు డట్టి అవకాశం ఏమాత్రం లేదని తేలిపోయింది. ఇప్పుడు స్వదేశానికి రావడమంటే సరాసరి జైలుకు

వెళ్ళడమే అవుతుంది. అయితే జైలుకువెళ్ళడంకూడా ఉద్యమానికి ఉపయోగకరంగా వుండవచ్చును. ఇలాంటి అధికారఆజ్ఞలను ధిక్కరించి, బుద్ధిపూర్వకంగా జైలుకుపోవటమే అనేకవిధాల వాంఛనీయం కావచ్చు.

దయచేసి సాధ్యమైనంతత్వరలో ఏదోఒక సమాధానం పంపండి. మీరు ఈ క్రిందిచిరునామాకు టెలిగ్రామ్ పంపవచ్చును.

బోసు, కుర్‌హాస్ హోచ్‌లాండ్, బడగ్స్టీన్, ఆస్ట్రియా.

మీ ప్రయాణం సుఖంగా సాగిందనీ, క్షేమంగా చేరివుంటారనీ, మీ ఆరోగ్యం సంతృప్తికరంగావుందనీ ఆశిస్తున్నాను.

భవదీయుడు,

సుభాస్

ఇక్కడ చికిత్సపూర్తిచేసుకొని విమానంలో స్వదేశానికి బయలు దేరవచ్చునని నేను నిన్నమాత్రమే పత్రికాప్రకటనలో సూచనప్రాయంగా వెల్లడించాను.

సు. చం. బోసు.

134. ఎలెక్ విల్‌కిన్‌సన్‌నుంచి...

కామన్సుసభ,

లండన్,

మార్చి 22, 1936

ప్రియమైన జవహర్‌లాల్,

దీన్ని టైప్‌చేస్తున్నందుకు క్షమించండి. తొందరవల్లనో, లేక మొక్కుబడికో నే నిలా చేస్తున్నాననుకోకండి. ఏదో టైప్‌మెషిన్‌కు నేను పూర్తిగా అలవాటుపడిపోయాను. దాదాపు టైప్‌రైటింగే నా సహజ దస్తూరిగా మారిపోయింది. (గాంధీజీ భావవీచికలు) మీ గ్రంథానికి సంబంధించిన పేజీప్రూఫులను 'లేన్స్' వారు నాకు పంపించారు. మీ

గ్రంథం నా మేను పులకింపచేసింది. ఇదేదో మర్యాదకోసం అంటున్న మాట కాదు. ఏదో తొందరపనివుండి, కామన్సుసభనుంచి పెందరాళే ఇంటికివచ్చాను. నా రాకకోసం ఆ గ్రంథం ఎదురుచూస్తూవున్నది. వెంటనే దాన్ని గ్రంథపఠనం ప్రారంభించాను. రాత్రంతా పఠనం సాగింది. తెల్లవారుఝామున నాఅంతటనేనే టీ తయారుచేసుకొన్నాను. వేకువవేళ 5-30 గంటలసమయాన మిమ్మల్ని తలచుకొంటూ టీ సేవించాను.

అది చాలా ముఖ్యమైన గ్రంథం. భారతదేశంలోని వర్తమానపరిస్థితిని ఏమాత్రం అవగాహనచేసుకోవాలనుకున్నా ఆ గ్రంథం చదవక తప్పదు. గ్రంథాన్ని ఎక్కడనిషేధిస్తారోనని మీ ప్రచురణకర్తలు ఆందోళనపడుతున్నారు. నిషేధించేదీ లేనిదీ చెప్పవలసింది కామన్సులందరిగిన పెద్దలుకారు కదా. అది మీకూ తెలుసు. గ్రంథం ప్రచురితమయ్యేసమయానికి వుండే పరిస్థితులనుబట్టి అదంతా ఆధారపడివుంటుందని నేను అనుకొంటున్నాను. గాంధీజీపై మీరుచేసిన విమర్శ కాంగ్రెసులో కీచులాటలు పెంచడానికి దోహదంచేయవచ్చునని వాళ్ళు ఆశించినా ఆశించవచ్చును. మా దేశీయుల అధికారమనస్తత్వంఎలావుంటుందోచెప్పడంకష్టం. చివరకు కుశాగ్రబుద్ధిగలవారికిసైతం అది దురూహ్యంగానే వుంటుంది.

ఏదిఏమైనా, భారతదేశంలోకనుక దానిని నిషేధిస్తే, ఇంగ్లండు, అమెరికాలలో దానికి అశేషప్రచారం సిద్ధించడం తథ్యం. కామన్సుసభలో మేము పెద్ద గొడవచేస్తాం, ప్రజల దృష్టిని దానిపైకి మళ్ళింపచేస్తాం. నిజానికి ఇంగ్లండులోనే అలాంటిగ్రంథం అవసరం హెచ్చు. చివరకు చాలామంది అతివాదులకు సైతం భారతదేశంవిషయంలోగల అజ్ఞానం అంతా ఇంతా కాదు. మీ గ్రంథంలోని ఆఖరిఅధ్యాయాలు, కాంగ్రెసును గురించీ, గాంధీజీ గురించి మీరుచేసిన సాకల్యపరిశీలనా మీ సామ్యవాద దృక్పథ వివరణ ఇంగ్లండులోని సోషలిస్టులలో అమితమైన ఆసక్తి రేకెత్తింపచేస్తాయి. తాలూకాదార్ల విషయంలో గాంధీజీవైఖరి ఏమిటో వారందరికీ పూర్తిగా తెలుసును. 'మాంచెస్టర్ గార్డియన్', 'టైమ్స్' ఆ పని చేసిపెట్టాయి. కాగా, మీరు గాంధీగారి ఆధ్యాత్మికపుత్రులనీ, వారసులనీ ఇక్కడ జనమంతా అనుకోవడం కద్దు.

ప్రధానంగా భారతీయులకే మీ రీ గ్రంథం రచించారు కనుక, అంతా దీనిని మెచ్చుకోకపోవచ్చును. దీనిని వారు నిషేధించడమే జరిగితే, అంతకన్నా అవమానకరమైనవిషయం మరొకటి వుండకపోవచ్చును. ఎందుకంటే, విషయాలను మీరు ఎంతోహుందాగా, వాస్తవికదృష్టితో చిత్రించారు. క్రోధానలంరేగి, నిప్పులుచెరగవలసిన పరిస్థితుల్లోనైనా మీరు నిగ్రహం చూపారు. ఆ గ్రంథం వెలువడడానికిపూర్వమే ఒకళ్ళిద్దరు ముఖ్యులు ఆ గ్రంధాన్ని చదివేటట్టుచూస్తాను. అవి కొంతవరకు ఉపయోగపడవచ్చును.

మీకుసంబంధించిన విషాదకరవార్త విన్నప్పుడు నేను వివరమైన జాబు రాయలేను. అనేకమాటల్లో చెప్పదగినదంతా నా టెలిగ్రామ్ ఒక్కటే వ్యక్తం చేస్తుందని భావించాను. కమల ఇప్పటికీ నా కళ్ళల్లో మెదుల్తూవుంది. మీ గ్రంథం చదువుతూంటే. మళ్ళీ నా స్మృతిపథంలో గతస్మృతులెన్నో మెరిశాయి. మేము భారతదేశం వచ్చినప్పుడు, ఆమె బాధల్లోను, వ్యధల్లోను వుండికూడా నిండుహృదయంతో మాకు ఆతిథ్యమిచ్చినసంగతి మే మెన్నటికి మరచిపోలేము. జీవితంలో పడిపాటి సంపత్తంతా ఆమె భర్తకుమూలంగానే భరించవలసివచ్చింది. మీ యిద్దరినీ ఆవిధంగా వేరుచేసిన ప్రభుద్ధులు ఇప్పుడైనా తగినవిధంగా సిగ్గుచెందగలరని ఆశించడం ఎండమావులలో నీటిని ఆశించడంవంటిదే అవుతుందేమో !

కామన్సుసభలో మా చర్చలన్నీ యుద్ధసన్నాహాలను గురించే కొనసాగాయి. తత్ఫలం యుద్ధానికిఅనుగుణంగా భారీపరిశ్రమలన్నింటిని పునర్నిర్మించాలనికూడా ఆలోచిస్తున్నారు. మీ రిక్కడనుంచి వెళ్ళిన తర్వాత పరిస్థితి మరింత విషమించింది. రైన్‌లాండ్‌పై హిట్లర్ దండయాత్రతో ఫాసిస్టువ్యతిరేకులు మండిపోతున్నారు. అది సహజం. ఇట్టి స్థితిలో ఫ్రాన్సును బలపర్చడంద్వారా హిట్లరును హతమార్చవచ్చునని వారు అనుకొంటున్నారు. 1914లోవలెనే, 'ప్రజాస్వామ్యంకోసం ప్రపంచాన్ని రక్షించండి' అన్న నినాదం మళ్ళీ వినవలసిరావడం దారుణం. దానితో కార్మికోద్యమం మళ్ళీ ఉన్మాదంపైపు మొగ్గడం ఖాయం.

'నిట్వ్యర్థ' ఆందోళన సాగించటంలో లాన్స్‌బరీతో చేతులుకలపడానికి నేను అంగీకరించాను. అది సోషలిజం కాదనుకోండి, అయినా కార్మికులను కాస్త హెచ్చరించడానికి తోడ్పతుంది. సామ్రాజ్యవాదులమధ్య చెలరేగిన కీచులాటలలో కార్మికులు తలదూర్చి, పరస్పరం సహకరించుకోటంలోగల ప్రమాదాన్ని కార్మికులచేత గుర్తింపచేయడానికి ఈ ఆందోళనోద్యమం ఉపకరించవచ్చును.

లక్నోలో మీరు చాలా గడ్డుపరిస్థితినే ఎదుర్కొవలసిరావచ్చును. దానిని మీరు విజయవంతంగా అధిగమించాలని నా ఆకాంక్ష. మీకు మేలు (అదెట్టిదైనా) చేకూరుగాక! ఈ సంవత్సరం కాంగ్రెసు అధ్యక్ష పదవి నిర్వహించడం అన్నది మొత్తం ప్రపంచంలోనే అత్యంత క్లిష్టతరమైన బాధ్యతఅని అనుకుంటున్నాను. మీరుఏమిచేసినా తీవ్రవిమర్శలకు గురికావలసివస్తుంది. మీరు ముక్కుసూటిగా, చిత్తశుద్ధితో వ్యవహరించేవ్యక్తి అనీ, మీ దేశప్రజలపట్ల మీకుగల ప్రగాఢ ప్రేమానురాగాలే మీ కార్యాచరణకు మూలకందమనీ మీ గ్రంథాన్ని చదివినవారంతా గుర్తించకతప్పదు. అయితే రాజకీయాలను ఆషామాషీగా కాక, ముఖ్యమైన వ్యవహారంగా పరిగణించే మాబోటివాళ్ళంమాత్రం కార్యరంగంలో అనేకచిక్కులను ఎదుర్కొకతప్పదు.

మీకు ఎలాంటి యిబ్బందికలిగినా వెంటనే కబురుపంపితే చాలు, నాకు చేతనైనంత సహాయంచేస్తాను. నేను చెప్పితే కాస్త వినేవారిచేత కూడా అవసరమైన సహాయం చేయిస్తాను. ఈ విషయంగురించి ప్రత్యేకంగా చెప్పవలసిన అగత్యంలేదు. లక్నోలోను, ఆటుతర్వాత, ఏమి జరుగుతుందోనని ఆందోళనతోను, ఆతురతతోను మేము ఎదురుచూస్తూంటాం. మీ రిక్కడకు రావడంవల్ల భారతదేశవ్యవహారాలపట్ల లేబర్ పార్టీ ఆసక్తి గణనీయంగా హెచ్చింది. పరిస్థితిఅంతా సజావుగా, సాఫీగా సాగిపోతున్నప్పుడు, కామన్సుసభ ప్రశ్నాసమయంలో మేము ఎందుకు హంగామాచేయవలసివచ్చిందో ఇండియాఆఫీసువారు తెలుసుకోగోరుతున్నారు.

ఎలెన్

135. రవీంద్రనాథ్ టాగూర్‌కు.

1936, ఏప్రిల్ 1,

ప్రియమైన గురుదేవా,

కమలనుగురించి మీరుపలికిన పలుకును ఆంగ్లావాదాన్ని విశ్వ భారతి న్యూస్‌పత్రికాముఖాన ఈవేళనే చూచాను. మీ ఆర్ద్రహృదయం నుంచి పెల్లుబికిన ఆ పలుకులు నన్ను కదిలించివేశాయి. మీ ఆశీర్వచనాలు నాలోనిశక్తిని ఇనుమడింపచేశాయి. మాదోటివాళ్ళం ఒకవేళ ఎప్పుడైనా పొరపాటున దారితప్పితే సరిదిద్దడానికి మీరు వున్నారుగదా అన్న ధీమా నా కెంతో గుండెనిబ్బరం కల్గిస్తున్నది.

ఢిల్లీస్టేషన్‌లో మిమ్మలనుచూసినప్పుడు నే నెంతో సంతోషించాను. అయితే ఇద్దరుకలిసి ముచ్చటించుకోడానికి స్టేషన్ ఏమాత్రం అనువైనస్థలం కాదుగదా. అందుచేత నాకు సంతృప్తికలగలేదు. త్వరలోనే మిమ్ములను ప్రత్యేకంగా కలుసుకొనేసదవకాశం లభించగలదని ఆశిస్తున్నాను.

విశ్వభారతిసహాయార్థం ఢిల్లీలో మీరు పెద్దమొత్తం సంపాదించగల్గినందుకు కడు సంతోషం. మీ యీ పర్యటన పూర్తికాగానే కొంత కాలంపాటు విశ్రాంతితీసుకొంటారని ఆశిస్తాను.

మీ కార్యక్రమంవివరాలు తెలియనందున ఈ జాబును శాంతి నికేతన్‌కే పంపిస్తున్నాను.

ప్రేమానురాగాలతోను. గౌరవభావంతోను,

భవదీయుడు,

జవహర్‌లాల్ నెహ్రూ

[మాలో చాలామందిమి రవీంద్రనాథ్‌టాగూర్‌ను గురుదేవా అని సంబోధిస్తుంటాము.]

1936 ఏప్రిల్ నెల 'విశ్వభారతిన్యూస్' పత్రికనుంచి,

కమలానెహ్రూ స్మృత్యర్థం.

[శ్రీమతి కమలానెహ్రూ స్మృత్యర్థం మార్చి 8వ తేదిన ఏర్పాటుచేసిన సంతాపసభలో ఆశ్రమవాసులను ఉద్దేశిస్తూ విశ్వకవి బెంగాలీ భాషలో చేసిన ప్రసంగం అనువాదాన్ని సంక్షిప్తరూపంలో ఇక్కడ పొందుపరుస్తున్నాము సం.]

మనలోను, మన ఆశ్రమంలోను సన్నిహితసంబంధగలవ్యక్తి స్మృత్యర్థం మన మీ సంతాపసభ జరుపుతున్నాం. మన ఆశ్రమంసేవను ఆపేక్షించదగ్గ ఆమెకు మనం మనస్ఫూర్తిగా చేతనైనసహాయం చేశాం. ఆమెభర్త జైలులోవున్నప్పుడు, ప్రమాదకరమైన జబ్బుతో ఆమెఆరోగ్యం పూర్తిగా క్షీణించిపోయినసమయంలో, ఆమెకుమార్తె ఇందిర పోషణకే బాధ్యతను తీసుకొని, కొద్దికాలంపాటు ఆమె హృదయాందోళనను కొంతవరకు మనం తగ్గించగలిగాం. ఆస్థితిలో నేను ఆమెను చూడటం తటస్థించింది. ఆమెలోని ప్రశాంతత, ఆత్మస్థైర్యం చూసి, నేను ముగ్ధుణ్ణిఅయ్యాను.

సంతాపసభలలో చాలాభాగం కేవలం లాంఛనప్రాయమైనవిగా జరుగుతున్నాయి. కృతకమైన విందుతనంకోసం ఆ సభలలో అతిశయోక్తులు ప్రకటించడం పరిపాటయిపోయింది. కమలవిషయంలో అలాంటి అగత్యంలేదు. ఆమె నిజంగా ఉత్తమురాలు. ఆమెలోని ఔన్నత్యమే అందరిహృదయాలను బంధించింది. అందరికీ ఆమె ఆప్తురాలుకాగలిగింది. ఆమె ఉదాత్తంగా తన జీవితాన్ని గడిపింది. జీవితంలోని ఆటుపోట్లన్నింటిని పొందికైన హుందాతనంతో తట్టుకొని నిలవగల్గింది. అదే వాస్తవాన్ని మన మీనాడు గొంతువిప్పి చెప్పుతున్నాం.

నవభారతసింహాసనాధిపత్యానికి ఆమెభర్త జవహర్‌లాల్ నిజంగా అర్హుడు. "అంతఃపురం సంపదగాని కెట్టితావులేదు. రాజసంఉట్టిపడే వ్యక్తిత్వం

ఆయనది. ఆయనసంకల్పం తిరుగులేనిది; ఆయన ఆత్మస్థైర్యం అజేయం. వీటన్నిటికీ మించిన మంచితనం ఆయనలో మహోన్నతమైనది. అదే ఆయనసహచరులలో బాలాపండిలో లోపిస్తోంది. ఆయనమనస్సు, హృదయమూ పరిశుద్ధమైనవి. ఈవిషయంలో ఆయనతో సాటిరాగలవ్యక్తి మరొకరు లేరు. ఎట్టిపరిస్థితులలోనైనా ఆయన నైతికసూత్రాలను, చిత్తశుద్ధినీ కంటిలోపాపలాగా కాపాడుకుంటూ నిలుస్తారు. అదే ఆయనలోని విశిష్టత. రాజకీయరంగంలో ఎక్కడచూసినా గందరగోళాలు వంచనలు, చివరకు ఆత్మవంచనలు పెచ్చరిల్లుతున్నసమయంలో ఆయన ఉన్నత ప్రమాణానికిచెందిన పరిశుద్ధతను పాటించారు. ఇది అసాధారణం. ప్రమాదాలకు వెరచి ఆయ నెన్నడూ సత్యపాలనకు స్వస్తిచెప్పలేదు. సౌలభ్యాన్ని ఆశించి ఆయ నెప్పుడు అసత్యంతో సేస్తంకట్టలేదు. అవమానకరమైన మార్గానికి దారితీసే కార్యవిధానాలను ఆయన ఎప్పుడూ బాహాటంగా ఖండిస్తూవచ్చారు. ఆ మార్గంపట్టితే విజయం సులభంకావచ్చుకాని, అది అల్పత్వం అనిపించుకొంటుంది. స్వాతంత్ర్యపోరాటానికి జవహర్‌లాల్ నెహ్రూ సమర్పించిన మహత్తరకానుకే సత్యపాలన అన్న మహోన్నత ఆదర్శం.

దీనంతటిలోను ఆయనసతీమణి ఆయనకు తగిన భాగస్వామిగా చేదోడువాదోడుగా నిలిచింది. భర్తవలెనే ఆమె గుంభనగా, గంభీరంగా వుండేది. ఎదురుతిరిగిన అదృష్టం దారుణంగా దెబ్బపై దెబ్బతీస్తున్నప్పటికీ వాటన్నిటినీ ఆమె నిశ్చలంగా ఎదుర్కొంది. ప్రమాదాలనుంచి తప్పించుకొనేందుకు ఆదర్శాలకు అన్యాయంచేసి పారిపోవాలన్న పిరికితనం ఆమె ఎన్నడూ ప్రదర్శించలేదు. తపస్విలోని అపురూపగుణాన్ని సంతరింపచేసుకోవడంవల్ల ఆమె తనభర్తసరసను శాశ్వతమైనస్థానం సంపాదించుకోగల్గింది. ఆమెజీవితకాలంలోను జీవితానంతరంకూడా ఆ స్థానం ఆమెదే.

ఒక్కసారి వెనుదిరిగి గతాన్ని సింహావలోకనంచేసుకొంటే, చరిత్రలో ప్రసిద్ధికెక్కిన అనేకమంది వీరవనితలు మనకు సాక్షాత్కరిస్తారు. కమలానెహ్రూ ఇంకా చరిత్రలో మారుపూలకు చేరనేలేదు. ఆమె ఇంకా

వర్తమానకాల సరిహద్దులసమీపంలోనే వుంది అల్పవిషయాలు, అనల్ప విషయాలు కలగాపులగంగావున్న వర్తమానకాలసరిహద్దులసమీపంలో ఆమె వుంది. అయినప్పటికీ ఆమె మహోన్నతలక్షణంగల మహావనితగా మనకు గోచరిస్తోంది. ఆ మహోన్నతలక్షణాన్ని ఆమె తనభర్తకు పంచి పెట్టింది.

ఈరోజు మనకు పండుగదినం: పర్వదినం. వసంతాగమనశుభ వేళ. పండి, నేలకు రాలి, ఎండిపోయిన ఆకులమధ్యనే, ప్రకృతి మరణదేవతను ధిక్కరించే కొంగ్రొత్త జీవితాగమనానికి స్వాగతసన్నాహాలు పూర్తిచేస్తున్నది. కొత్తగా మొలకలెత్తుతున్న చిగుర్లు తమ ఆనందాన్ని అందరికీ పంచిపెండతాయి. దేశంలో ఉరకలుపెడుతున్న మాతనజీవితాన్ని వసంతంతో మేళవింపచేసే శుభవేళ ఇది. నవయౌవ్వన ఋతువుప, అమర ఆనందానికి ప్రాతినిధ్యంవహిస్తున్న ఋతురాజు జవహర్‌లాల్. తిరుగులేని పోరాట పటిమకు. స్వాతంత్ర్యదీక్షాపరతకు లయనే పవిత్రమూర్తి. భారతదేశంలో ప్రాచుర్యాన్నిపొందిన నూతన జాతీయజీవితానికి కమలానెహ్రూకూడా తనవంతుకానుక సమర్పించుకొని, దానికి వన్నెచేకూర్చింది. వెన్నపూసవంటిమనసు అయినా, ఆమెది వజ్రసంకల్పం. ఆమెలోని మహత్తర మాతృశక్తి చివరకు మనవిజయాలకు మకుటాయమానంగా వెలుగొందకమానదు.

కాలవేగాన సాగిపోతున్న వర్తమానకాలంపై ఆమె కలకాలం నిలచే తన 'ప్రభావము'ద్రను విడిచి మరీ వెళ్ళిపోయింది. ఈ సత్యం మన మీనాడు గుర్తించాలి. అయినప్పుడు మన మేదో అమూల్యమైనవస్తువును పోగొట్టుకున్నట్లు ఎలా భావించగలం? అజేయమైన ఆమె ఆత్మశక్తి సదా మనతోనే వున్నదిగదా!

136 రవీంద్రనాథ్ టాగూర్ నద్దనుంచి

"ఉత్తరాయణ"
శాంతినికేతన్, బెంగాల్,
1936 ఏప్రిల్ 5

ప్రియమైన జవహర్‌లాల్,

మీ లేఖ చేరింది. ఆశ్రమంలోని నా విద్యార్థులను ఉద్దేశించి, కమలనుగూర్చి నేను చెప్పిన కొద్దిమాటలు మీలో ఆశాభావాన్ని, శక్తినీ కలిగించినవని తెలుసుకొనడం నాకు సంతోషదాయకం. మీకు కలిగిన భరింపరాని ఎడబాటుకు నేను నిజంగా ఎంతో ఖేదించాను.

రైలులో కొద్దినిముషాలసేపుమాత్రమే మీతో మాట్లాడటానికి అవకాశంచిక్కింది. అది నాకూ సంతృప్తికల్గించలేదు. ప్రయాణభారం వల్ల నా శరీరమూ, మనస్సూకూడా పూర్తిగా అలసిపోయివున్నవి. మాటాడగల్గినస్థితిలో లేను. మీరు తప్పకుండా ఇక్కడకువచ్చి, కొద్ది రోజులు నాతో గడపాలి. అల్లాదాద్‌కన్నా శాంతినికేతనం ఏమాత్రం తీసిపోదని మరీమరీ చెప్పగలను.

భవదీయుడు
రవీంద్రనాథ్ టాగోర్.

137. రఫీ అహ్మద్ కిద్వాయ్‌నుంచి,

యు. పి. రాష్ట్రీకాంగ్రెసుకమిటీ,
అమీనాబాద్‌పార్క్, లక్నో.
1936 ఏప్రిల్ 20

ప్రియమైన జవహర్‌లాల్జీ,

గడచిన కొలదిరోజులు వేదనతో గడిపాను. మీరొక్కరే మాకు ఆశారేఖగా గోచరిస్తున్నారు. మరి మీరుకూడా చివరకు మాకు ఆశాభంగమే కల్గిస్తారా? కొంతమంది అప్పుడే అనుమానాలు వెలిబుచ్చుతున్నారు. మాకు ప్రతికూలంగా ప్రత్యర్థులంతా ఒక్కటవుతున్నారు; గాంధీయిజం

ప్రభావం వుంటనేవుంది. మరి ఈ రెండుశక్తులను ప్రతిఘటించి, మీరు నిలవగలరా అని కొందరిఅనుమానం.

కార్యవర్గాన్ని పునర్నిర్మాణంచేసే అవకాశం మీకు కలుగజేయబడింది. టాండన్; నారిమన్; పట్టాభి. శార్దూలసింగ్‌లను మీరు మినహాయించారు. గోవిందదాస్, శరత్ బోసులను వదిలేసి భూలాభాయ్‌నీ, రాజగోపాలచారినీ చేర్చారు. మీరు వదిలేసిన ఇద్దరూ మీకు వత్తాసుగానిలిచేవారు. మధ్యస్థంగావున్నవారినుంచి మిమ్మల్ని వేరుచేయటంలో వారు కృతకృత్యులయ్యారు. అటు అఖిలభారతకాంగ్రెసుసంఘంలోను. ఇటు ప్రతినిధులలోను మా సంఖ్యాబలం తగ్గిపోయింది. మీరు కొత్తగా ఏర్పాటుచేసిన కార్యవర్గం ఇంతకుమునుపువున్నదానికన్నా మరింత అభివృద్ధినిరోధకమైనదని రుజువుకాకతప్పదు.

బహుశా నా దృష్టి సంకుచితమైనదే కావచ్చు. సిద్ధాంతచర్చలకన్నా బలాబలసంఖ్యమీద నేను ఎక్కువగా ఆధారపడతాను. ఏది ఏమైనా ప్రస్తుతపరిస్థితిపై నా ఉద్దేశాలను తెలియజేయాలన్న ఆతురతకొద్దీ ఈ లేఖ వ్రాస్తున్నాను. మరి ఇక ఈవిషయంగురించి మాట్లాడను.

రఫీ.

183 మహాత్మా గాంధీవద్దనుంచి

1936 ఏప్రిల్ 21

ప్రియమైన జవహర్‌లాల్,

నోట్సు చదవడానికి బాగానేవుంది. నీ సమాధానాలు మొత్తంమీద శక్తివంతంగానూ, సూటిగానూ వున్నాయి.

వచ్చే సమావేశంగురించి నీవు ఆందోళనచెందడమెందుకు? ఒకవేళ చర్చ జరిగితే, దానివల్ల వచ్చే నష్టమేముంది? ఎవరికివారు తమ అభిప్రాయాల మంచిని ఎదుటివారికి ఎరుకపర్చి, నచ్చజెప్పి ప్రయత్నించడమేగదా. ఒకప్రతిపాదనపై చర్చ సమగ్రంగా జరిగిందని నీవు భావించినప్పుడే ఆ చర్చను నీవు ఆపుచేస్తావు; నీవు కోరుతున్నది టీమువర్కేగదా. అది సంభవమనే నా పూర్తి విశ్వాసము.

28వ తేదీ సాయంకాలానికి నాగపూర్ చేరతాను.

రంజిత్ తనవిషయంలో కాస్త జాగ్రత్తతీసుకొంటాడని ఆశిస్తాను. అతను ఖాలీవెళ్లినందుకు సంతోషం. నటాప్ నీవెంట వస్తాందని భావిస్తాను.

సర్దార్ ఇంకా కోలుకోనేలేదు. కేవలం పాలు- అదికూడా ఇప్పుడిప్పుడే తీసుకొంటున్నాడు. మే 8వ తేదీ తర్వాత ఆయనను నాతోపాటు 'నంది'కొండకు తీసుకుపోతాను. నీవుకూడా వస్తే బాగుంటుంది.

ప్రేమతో
బాపూ.

139 అగథా హారిసన్‌కు మహాత్మా గాంధీ వ్రాసినలేఖ.

వార్ధా,
ఏప్రిల్ 30, 1938

ప్రియమైన అగథా,

ఈనెల 17వతేదీన నీవువ్రాసినలేఖ చేరింది. జవహర్‌లాల్‌నుంచి అంతకుమినహా ఏమీ ఆశించరాదుమి. అతను తనప్రసంగంలో తన విశ్వాసాన్ని పునరుద్ఘాటించాడు. అతడు ఏర్పాటుచేసుకొన్న 'కాబినెట్'ను చూడు. 1920నుంచీ సంప్రదాయసిద్ధమైన అభిప్రాయాలను కలిగివున్నవారే అందులో హెచ్చుగా వున్నారు. మెజారిటీసభ్యులు నా అభిప్రాయాలనే కలిగివున్నమాట నిజమే. నాకు సాధ్యమైతే కొత్తనిబంధనావళిని తక్షణం ఖూనీచేస్తాను. ఆ పని చేయడం నా కెంతో యిష్టం. నాకు నచ్చినవిషయాలేవీ అందులో లేవు. కాని జవహర్‌లాల్‌మార్గం నా మార్గం కాదుగదా. భూమి మున్నగువాటివిషయాలలో అతని ఆదర్శాన్ని నేను ఆమోదిస్తాను. అయితే అతని పద్ధతులను నే నేమాత్రం అంగీకరించను. నా శక్తియుక్తులన్నింటినీ ఒడ్డి వర్గపోరాటం రాకుండా నివారిస్తాను. అలాగే అతనూ అంతేననుకొంటాను. కాని వర్గసంఘర్షణను నివారించడం సాధ్యం అన్నవిషయంలో అతనికి నమ్మకంలేదు.

నా పద్ధతిని అంగీకరిస్తే అది పూర్తిగా సాధ్యమేనని నా విశ్వాసం. జవహర్‌లాల్ తన పద్ధతులనుగురించి వివరించేటప్పుడు తీవ్రవాదిగా వుంటాడు. కాని, కార్యాచరణ వచ్చేసరికి అతను మహా నెమ్మదస్థుడుగా మారిపోతాడు. నాకు తెలిసినంతవరకు, అతను సంఘర్షణను రేకెత్తించడు. అలాగే ఒకవేళ ఎవరైనా సంఘర్షణను ప్రారంభిస్తే, అందులో అతను వెనుకాడడు. ఏదిఏమైనా ఈవిషయంలో కాంగ్రెసు సంస్థ మొత్తంగా ఒకే అభిప్రాయంతో లేదు. అభిప్రాయభేదంమాత్రం వుంది. సందేహంలేదు. సంఘర్షణను నివారించాలన్న స్పష్టమైన దృష్టితో నేను నా పద్ధతిని రూపొందించుకొన్నాను. అతనిపద్ధతికి అంత స్పష్టమైన లక్ష్యంలేదు. జవహర్‌లాల్ తన సహచరులలో మెజారిటీ సభ్యులు చేసిన నిర్ణయాలకి కట్టుబడివుంటాడనే నేను భావిస్తున్నాను. అతని స్వభావానికి ఇది విరుద్ధంగానే వుండవచ్చు. అతనికి కొంత యిబ్బందికరంగానే వుండవచ్చు. అప్పుడే యిబ్బందిపడుతున్నాడు కూడా. అతను ఏపనిచేసినా ఉదాత్తంగానే చేస్తాడు. జీవితాన్ని వీక్షించడంలో మా మధ్యగల అగాధం నిస్సందేహంగా మరింత పెరిగింది; అయితే అదేసమయంలో మా హృదయాలు ఇదివరకెన్నడూలేనంత సాన్నిహిత్యాన్ని ఈనాడు పొందాయని గట్టిగా చెప్పగలను.

ఇది ప్రకటనార్థంకాదు. అయితే దీనిని నీ స్నేహితులకు చూపెట్టే స్వేచ్ఛమాత్రం నీ కున్నది.

ఇంతకుమించి నీ ప్రశ్నకు చెప్పవలసిన సమాధానం ఇంకేదో నీవు కోరుతున్నట్టు నేను భావించను.

ప్రేమతో

బాపూ.

మిస్ అగథా హారిసన్.

'నందీ'కొండ,
మే 12, 1936.

ప్రియమైన జవహర్‌లాల్,

అగథాకు నేనువ్రాసినజవాబులో నీపై ఖరిని నేను సరిగా వ్యక్తీకరించానో లేదో తెలుసుకోడానికి నీకు దానిని పంపిస్తున్నాను.

అయితే నీవే ఈవిషయంలో ముందుకురావడం ముదావహం. 'సర్వవినాశనకారియైన నిరంతర వర్గపోరాటాన్ని ప్రజ్వలితమొనర్చుతుందే వ్యవస్థను' నే నేదో బలపరుస్తున్నాననడం న్యాయమూ కాదు; నిజమూకాదు. అలాగే ఏదో చిన్నచిన్న తప్పిదాలుచేస్తున్న వారిని నిందిస్తున్నాననీ, ఖండిస్తున్నాననీ, పెద్దపెద్ద తప్పులుచేసేవారిని పొగుడుతున్నాననీ అనడంకూడా అన్యాయమే.

నీ వంటున్నట్టు నేను అలాంటి పొరపాట్లు చేసివుంటే, అది ఆదమరపులో జరిగివుండాలి. అంతేకాని, బుద్ధిపూర్వకంగామాత్రం నేను చేసివుండను. నేను ఏ ఏ విషయాలలో తప్పుచేశానో సోదాహరణంగా నిరూపిస్తే సంతోషిస్తాను. నేను ఇంతకుముందే ఒప్పుకున్నట్లు, సమస్యలను పరిష్కరించడంలో నీవు అనుసరించేపద్ధతికి, నేను అనుసరించేపద్ధతికి తేడావున్నమాట నిజం. అంతేకాని, ప్రస్తుతవ్యవస్థను పరిగణించడంలో నీకూ నాకూ తేడాలేదు.

డాక్టరు అన్సారీ మరణం తీవ్రమైన ఆఘాతమే. నాకుసంబంధించినంతవరకు డాక్టరు అన్సారీతో నా సంబంధం కేవలం రాజకీయ స్నేహంమాత్రమే కాదు.

నీవు 'ఖాలి'కి వెళ్లగలవనీ, లేదా నావద్దకు రాగలవనీ, వచ్చి కాస్త చల్లనిగాలిని అనుభవించగలవనీ ఆశిస్తాను.

సరూప్ రాసిన రెండుచీటీలు అందాయని ఆమెతో చెప్పు. సర్ తేజ్‌కు జాబురాస్తాను.

ప్రేమతో,
బాపూ.

141 మహాత్మా గాంధీవద్దనుంచి,

'నందీ'కొండ,
మే 21, 1936.

ప్రియమైన జవహర్‌లాల్,

'హిందూ'పత్రికలోని రెండుకత్తిరింపులను ఇందులో జతపర్చి పంపుతున్నాను. పత్రికావిలేఖరి నీవు చెప్పినవిషయాలను సరిగా రిపోర్టుచేసివుంటాడని నేను నమ్మలేకపోతున్నాను. అయితే ఆ రెండు విషయాలపైన నీవు అసలు చెప్పినమాటలు ఏమిటో యథాతథంగా, వీలు సాధ్యమైతే, నాకు పంపించాలని కోరుతున్నాను. మహిళలను మినహాయించటానికి సంబంధించినంతవరకు, అందులో ఇతరుల ప్రమేయం ఈషణ్మాత్రం లేదు. అది కేవలం నీ సొంతనిర్ణయమే. కార్యవర్గంలో మహిళను లేకుండాచేయడం సాధ్యమని ఇతరులెవరూ కలలోనైనా అనుకోలేదు. ఖాదీకిసంబంధించినంతవరకు, ప్రస్తుతం మన దేశ ఆర్థికవ్యవస్థకు అది అనివార్యమైనదనీ, పోతే దేశం స్వాతంత్ర్యంపొందాక చేనేతవస్త్రాలస్థానాన్ని మిల్లువస్త్రాలు ఆక్రమించగలవనీ నీవు అన్నట్టు తెలిసింది.

ప్రేమతో,
బాపూ.

142 మహాత్మా గాంధీవద్దనుంచి,

బెంగుళూరు,
మే 29, 1936.

ప్రియమైన జవహర్‌లాల్,

ఈనెల 25వ తేదీన నీవు రాసిన లేఖ చేరింది. అయితే నీవు టిక్కెట్లుపెట్టుకుంటూ దేశమంతటా పర్యటిస్తున్నావన్నమాట. అందుకు అవసరమైనశక్తి నీకు చేకూరుగాక! ఒక్కవారంరోజులపాటు నీవు 'ఖాలీ'లో గడపగలిగినా అదృష్టమే.

ఖాదీపై నీ ప్రకటనను పత్రికలకు విడుదలచేయాలనుకొంటున్నాను. నాకు చాలా ఉత్తరాలు వచ్చాయి. ఖాదీపట్ల గాఢవిశ్వాసంగల

మనవాళ్లు అనేకమంది వక్రీకృత సంక్షిప్తీకరణను చూసి ఆందోళన చెందారు.

కార్యవర్గంలోకి మహిళను తీసుకోకపోవడానికి నీవు చెప్పిన కారణాలుమాత్రం నాకు సంతృప్తికరంగాలేవు. కార్యవర్గంలోకి ఒక మహిళను తీసుకోవాలన్న అభిలాషను నిజంగా నీవు సూచన ప్రాయంగా వ్యక్తీకరించివున్నా, పాతవాళ్లలో ఎవరినో ఒకరిని మినహాయించడం అంత యిబ్బందికరమైనసంగతిగా వుండేదేకాదు. ఒకవేళ ఒత్తిడిఅనేది ఏమైనావుంటే, అది ఒక్క ఖాలావాయ్‌విషయంలోనే వుంది. అదీగాక మొదట్లో ఆయనపేరును సూచించినప్పుడు నీవుకూడా ఆ పేరుకు అభ్యంతరంచెప్పలేదు. మిగరాసభ్యులు ఎవరివిషయంలోను ఒత్తిడి అనేదేలేదు. కాగా, ఒక ఘోషలిస్టుపేరును మినహాయించి, మహిళను తీసుకోడం అన్న సమస్య నీఅంతటనీవు స్వేచ్ఛగా నిర్ణయించుకోవలసి నది. అయితే నాకు గుర్తున్నంతవరకు, సరోజనీదేవిస్థానంలో ఇంకొక రిని తీసుకోడంలో నీకే చిక్కుసమస్య ఏర్పడింది. ఆమెను మినహా యించాలని అనుకొన్నది నీవే. అంతేకాదు. కార్యవర్గంలో ప్రతిసారీ ఒకమహిళ. కొంతమంది ముసల్మానులు వుండాలన్న సంప్రదాయంలో నీకు విశ్వాసంలేదనేదాకా నీవు వెళ్లావు. అందుచేత మహిళను మినహా యించడంఅన్నది నీఅంతట నీవు స్వేచ్ఛగా తీసుకొన్ననిర్ణయమే. ఇతరసభ్యులెవరికి సంప్రదాయాన్ని అతిక్రమించాలన్న అభిలాషగానీ అంత సాహసంకానీ లేవు. నీకొక విషయం చెప్పాలి. కాంగ్రెసులోని కొన్నివర్గాలవారు దీనికంతటికీ నేనే బాధ్యుడనన్నట్టు తప్పంతా నాపైత్తినే రుద్దజూస్తున్నారు. శ్రీమతి నాయుడుపేరును నేనే మినహాయించాననీ, మహిళను తీసుకోవలదని నేనేదో అన్నట్టూ వారు ప్రచారంచేస్తున్నారు. ఇంతకుముందే స్పష్టంచేసినట్లు, ఈ పని చేయగల సాహసంపైతం నాలోలేదు. శ్రీమతి నాయుడును నేను మినహాయించలేను; అలాగే ఇతరమహిళనుకూడా.

పోతే, మిగతాసభ్యులవిషయంలోకూడా, మన ఆశయసాధనకు వారిని తీసుకోడం ఉపయోగకరమని నీవు భావించినందుననే వారిని తీసు

కొన్నానని నేను భావించాను. ఇందులో 'బేహాయా' సమస్యగానీ, 'హయాదార్' సమస్యగాని లేనేలేదు. అందరూ ఉదాత్తమైన ఉద్దేశాలుగలవారే. తమకు తోచినపద్ధతిలో దేశసేవకు కంకణధారులైనట్టి వారే. నీ ప్రకటన-నీ లేఖకూడా దానినే ధ్రువీకరిస్తోంది-చూసి, రాజెన్‌బాబు, సి. ఆర్., వల్లభభాయ్ ఎంతో బాధపడ్డారు. తాము శక్తివంచన లేకుండా చిత్తశుద్ధితో వ్యవహరించడానికి ప్రయత్నించామనీ, తమ సహజమైన నీవిషయంలో పూర్తి భక్తిప్రపత్తులతో మసలుకొన్నామనీ వారు భావిస్తున్నారు. వారిలో నేనూ ఏకీభవిస్తున్నాను. నీ కేదో అన్యాయం జరిగినట్టు నీ ప్రకటనలో ద్యోతకమవుతోంది. ఈ దృక్పథాన్నికూడా నీవు పరిగణనలోకితీసుకోగలవనీ, సాధ్యమైతే ఆ రిపోరును సవరించగలవనీ ఆశిస్తాను.

ఇక ఓటూహోవిషయం : ఆ విషయాన్ని స్పష్టంచేసుకోటం చాలా మంచిపని నేనూ భావిస్తున్నాను. దానివిషయంలో నీ ఉద్దేశమేమిటో నాకైతే తెలియదు. మనిద్దరం కలుసుకొన్నప్పుడు దానినిగురించి మాట్లాడుకొందాం. ఇప్పటికే విపరీతమైన ప్రయాసకు లోనవుతున్న నీపై మరింత భారంమోపడం నా కిష్టంలేదు.

డాక్టరు అన్సారీ స్మారకచిహ్నానికి సంబంధించినంతవరకు నా అభిప్రాయాన్ని అసఫ్అలీకి స్పష్టంచేశాను. నాన్నగారివిషయంలోవలెనే డాక్టరు అన్సారీస్మారకచిహ్నంవిషయంలోకూడా రాజకీయపరిస్థితులు కొంత మెరుగుఅయ్యేవాకా ఆగడం మంచిది. మరి నీవు మరొకవిధంగా భావిస్తున్నావా ?

కమలాస్మారకనిధికార్యక్రమం చాలా నెమ్మదిగా ముందుకు సాగుతోంది.

చారుమారిలేఖను ఇందుతో జతపరుస్తున్నాను. అందులో ఇందూ ప్రస్తావన వుంది.

ప్రేమతో,
బాపు.

10 వ తేదీదాకా బెంగుళూరులోనే,

143 మహాత్మా గాంధీవద్దనుంచి,

పెగోన్,

జూన్ 19, 1936.

ఈ వ్రాత చదవటానికి అంత వీలుగాలేకపోతే,
దయచేసి ఈలేఖను అవతలపారేయి.

ప్రియమైన జవహర్‌లాల్,

నిన్న నీ జాబు చేరేటప్పటికే నేను నీ కొక జాబు పంపుదామను కొంటున్నాను.

రంజిత్‌కు స్వస్థతచేకూరినందుకు సంతోషం. ఆరోగ్యవిషయంలో అతను ఇంకా జాగ్రత్త తీసుకోవాలి.

నీవు ఏర్పాటుచేసిన కార్యవర్గంలో మహిళను ఎందుకు మినహాయించవలసివచ్చిందో వివరిస్తూ నీ వొక ప్రత్యేకప్రకటన జారీచేయాలని నేను కోరటంలేదు. ఇతరులను చేర్చుకోటం, చేర్చుకోకపోవటం అన్న సమస్య, మహిళను మినహాయించడం అన్నసమస్య నాదృష్టిలో ఒకటి కానేకాదు. కార్యవర్గంలో అసలు మహిళను లేకుండాచేయాలన్న సాహసంగానీ, అభిలాషగానీ మాలో ఎవరికీలేదు. ఇదేకనుక నీ వైఖరికి సరియైనవివరణ అయినచో, అవకాశం దొరికినప్పుడు ఈవిషయాన్ని స్పష్టంచేయడం మంచిది.

పోతే, మిగతా సభ్యులవిషయంలో నీవు యిప్పటికీ ఇదవుతూండడం విచారకరం. ఆశయప్రయోజనమాశించి నీవు భూలాభాయ్ గురించి కళ్లుమూసుకొని మ్రింగావు గదా. మొదటిసారి మనం చర్చించినపుడు సోషలిస్టులనుకూడా కార్యవర్గంలోకి తీసుకోవాలని నీకన్నా ముందుగానే నేను అన్నాను. పేర్లనుకూడా సూచించాను. ఇంతకీ నేను ఇక్కడ చెప్పదలచిందేమిటంటే, ఎవరిపేర్లను ఎవరు సూచించారన్నది ముఖ్యవిషయంకాదు. సమష్టి ఆశయసాధనకు తోడ్పడాలన్న దృష్టితోమాత్రమే మనమందరం వ్యవహరించామన్నసంగతిని, నేను మరొకసారి చెప్పదలచాను.

నాకు గుర్తున్నంతవరకు నేను చూసిన ప్రకటన, నీవుపంపినది ఒకటేకాదు. నీవుపంపిన ప్రకటనను నేను చూడడం ఇదే మొదటిసారి. డాక్టరు హెచ్. వేరే ఏదైనా ప్రకటన జారీచేశాడేమో కనుక్కో. చివర నకు నీవుపంపిన ప్రకటనకూ, డాక్టరు నాతో చెప్పినదానికీ తేడావుంది. ఆయన అభిప్రాయాలు లోపభూయిష్టమైనవని నేను భావిస్తున్నప్పటికీ, ఆయన తన అభిప్రాయాలను వెలువరించితే నాకు అభ్యంతరంలేదు. ఇంతకీ నా ఆక్షేపణ ఏమిటంటే, ఆయన నాతో ఒకటిచెప్పి, ప్రకటనకు ఇంకొకటి పంపించాడు. దీనిని కావాలనుకొంటే నీవు డాక్టరు హెచ్.కి చూపించవచ్చును.

నీవు కులాసాఅని తలుస్తాను. పంజాబులో నీవు సాగిస్తున్న తుపానువంటి పర్యటనను నేను ఆదుర్దాతో పరికిస్తున్నాను.

ప్రేమతో,

బాపూ

144 రవీంద్రనాథ్ టాగూర్ వద్దనుంచి,

శాంతినికేతన్,

మే 31, 1936.

మీరు పంపించిన ఉద్గ్రంథాన్ని చదవడం నే నిప్పుడే పూర్తి చేశాను. అది నాకు చాలా బాగా నచ్చింది. మీరు సాధించిన విజయానికి గర్వపడుతున్నాను. ఆ గ్రంథంలోని విషయవివరణలో అంతర్వాహినిగా మానవతావాహిని ప్రవహిస్తోంది. దృశ్యవిషయాలను ఆ వాహిని అధిగ మిస్తోంది. వ్యక్తిచేసే పనులకన్నా, అతని చుట్టూ వాతావరణంకన్నా అతనివ్యక్తిత్వం గొప్పది. ఈ గ్రంథం దీనినే సాధించింది.

భవదీయుడు,

రవీంద్రనాథ్ టాగూర్.

145 చార్లెస్ ట్రెవిల్యాన్ వద్దనుండి.

వెల్లింగ్టన్, కాంబో,
మోర్పెత్,
జూన్ 12, 1936.

ప్రియమైన శ్రీ నెహ్రూ,

మీ గ్రంథం చదివాను. ఆ గ్రంథం నా మనోఫలకంపై చిత్రించిన మానవుణ్ణి కలుసుకోవాలని కుతూహలపడుతున్నాను. మీరూ, నేనూ హారోలోనే విద్యనభ్యసించాం. అట్టడుగుజనం భుజంతాయటం మనం అక్కడ నేర్చుకోలేదు. అయినప్పటికీ, పీడనకు లోనవుతున్న మీ దేశ ప్రజల దారిద్ర్యమువల్ల మీరూ, యుద్ధం, మందగమనంవల్ల నేనూ అట్టడుగుప్రజలకు బాసటగా నిలవాలసివచ్చింది. మనిద్దరం దాదాపు ఒకేవిధంగా ఆలోచిస్తున్నాం. మీరు ఇప్పుడు ఇంగ్లండుకు వస్తున్నా, కాస్త నాకు తెలియచేయండి. నేను భారతదేశం రాగలననుకోవటం లేదు. ఎందుకంటే, నల్లచట్టాములతో జర్మనీ, భారతదేశం, ఇటలీలో కాలిడాలన్నఅభిలాష నాకులేదు. అక్కడికి రావడానికి ప్రతిఘాతివారుండనేవున్నారుగదా. ఒకవేళ నేను అక్కడికి రావడమే సంభవిస్తే, అప్పటికి మీరు జైలుగోడలవెలుపల వుంటారేమో, లేదా స్వేచ్ఛావాయువులు పీల్చుతుండటమో జరుగుతుందని ఆశిస్తున్నాను.

సహోదరభావంతో,
చార్లెస్ ట్రెవిల్యాన్.

146 సర్ మహమ్మద్ ఇక్బాల్ వద్దనుంచి.

లాహోర్,
జూన్ 21, 1936.

ప్రియమైన పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ,

మీ లేఖ నిన్ననే చేరింది. మీకు నా హృదయపూర్వకమైన ధన్యవాదాలు. మీరువ్రాసినవ్యాసాలకు నేను జవాబిచ్చినసమయంలో,

అహ్మదీయుల రాజకీయవైఖరినిగురించి మీకు ఖచ్చితమైన అభిప్రాయం లేదేమోనని భావించాను. నేను జవాబుయివ్వడానికి ప్రధానకారణం ఒకటివుంది. ముస్లిం భక్తిసంపత్తులు ఎలా ప్రాబల్యంపొందాయో, అవి క్రమంగా అహ్మదిజానికి ప్రాతిపదికగా ఎలా మార్పుచెందాయో తెలియజేయడం, ముఖ్యంగా మీదృష్టికితేవడమే నా ప్రధానోద్దేశం. నా జవాబు ప్రకటితమైనతర్వాత ఒకవిషయం వెల్లడైంది. అహ్మదిజం ప్రబోధనలు రూపొందడానికి దారితీసిన చారిత్రకకారణాలనుగురించి చివరకు విద్యావంతులైన ముస్లిములకుసైతం సరైనదృష్టి లేదని తేలింది. ఇది నాకెంతో ఆశ్చర్యంకలిగించింది. అంతేకాక, మీ వ్యాసాలు పంజాబులోను, తదితరచోట్లగల ముస్లిములకు, మిమ్మల్ని అభిమానించే ముస్లిములకు, ఆందోళనకలిగించినవి. అహ్మదీయఉద్యమాన్ని మీ వ్యాసాలు బలపరుస్తున్నట్లు వారు భావించి, ఆందోళనచెందుతున్నారు. దీనికికారణం లేకపోలేదు. మీ వ్యాసాలు చూసి అహ్మదీయులు సంబరపడుతున్నారు. మీ విషయంలో ఈ దురభిప్రాయం కలుగజేయడంలో ప్రధానపాత్రవహించింది అహ్మదపత్రికలు. ఏమైనప్పటికి ఈవిషయంలో వారిలో ఏర్పడిన భావం పొరపాటు అని ఇప్పటికి గ్రహించారు; అందుకు సంతసిస్తున్నాను. ఆస్తికవాదంపట్ల నాకంత ఆసక్తిలేదు. అయినప్పటికీ, అహ్మదీయులవాదనలను పటాపంచలుచేయడానికి ఆస్తికవాదంలో కొంతవరకు కసరత్తు ప్రదర్శించకతప్పలేదు. ఇస్లాంమతానికి, భారతదేశానికి హానికరులెవరో చూడాలన్న సదుద్దేశంతో నేను ఆ వ్యాసం వ్రాశానని మాత్రం మీకు హామీనిస్తున్నాను. అహ్మదీయులు అటు ఇస్లాంమతానికి ఇటు భారతదేశానికికూడా ద్రోహంచేస్తున్నారన్నదే నా నిశ్చితాభిప్రాయం.

లాహోరులో మిమ్మల్ని కలుసుకోలేకపోయినందుకు ఎంతో విచారించాను. మీరు లాహోరుకువచ్చినసమయంలో నేను తీవ్రమైన జబ్బుతోవున్నందున, ఇంటిదగ్గరనుంచి కదలడానికి వీలులేకపోయింది. గత రెండుసంవత్సరాలుగా జబ్బుతోతీసుకుంటున్న నేను దాదాపు రిటైర్డ్ జీవితాన్ని గడుపుతున్నాను. ఈ దఫా మీరు పంజాబు ఎప్పుడువస్తారో కాస్త ముందుగా తెలియజేయండి. మీరు తలపెట్టిన పౌరసత్వహక్కుల

సంఘికసంఘంగురించి నేను వ్రాసిన లేఖ మీకు అందిందా? ఆ విషయం మీ జాబులో ప్రస్తావించనందున, అసలు నా జాబు మీకు చేరలేదేమో ననుకొంటున్నాను.

మీ అభిమానపాత్రుడు,
మహ్మద్ ఇక్బాల్.

147. రాజేంద్రప్రసాద్ ప్రభృతుల వద్దనుంచి,

వార్ధా,
జూన్ 29, 1936

ప్రియమైన జవహర్‌లాల్ జీ,

లక్నోకాంగ్రెస్ అనంతరం మీరు మమ్మల్ని కార్యవర్గంలో నియమించారు. మీకు మాకు అభిప్రాయాలలోను, దృక్పథాలలోను చాలా తేడాలున్న సంగతి విదితం. అయినా మీరు మమ్మల్ని కార్యవర్గంలో నియమించారు. అభిప్రాయభేదాలను వెనక్కునెట్టి, ఉభయులకు అంగీకారయోగ్యమయిన అంశాల ప్రాతిపదికపై ఉమ్మడి కార్యాచరణను రూపొందించవచ్చునని, కలిసిమెలిసి పనిచేయవచ్చునని మేము ఆశించాము. సాధ్యమయినంతవరకు సర్దుకుపోవడానికి మేము శతథా ప్రయత్నిస్తూవచ్చాం. కాని, దురదృష్టవశాత్తు విభేదిస్తున్న రెండువర్గాలు సంపూర్ణస్నేహపూర్వకంగా కలిసి పనిచేయడంగానీ, అపార్థములులేకుండా చేయడంగానీ సాధ్యం కాదని అనుభవంవల్ల తేలింది. కాంగ్రెసు సోషలిజాన్ని ఆమోదించలేదు. అదీకాక, ప్రస్తుత పరిస్థితులలో కాంగ్రెసు అధ్యక్షుడు, కార్యవర్గంలోని ఇతర సోషలిస్టు సభ్యులు పనిగట్టుకొని సోషలిజాన్ని ప్రచారంచేయడం, వక్కాణించడం దేశప్రయోజనాలకు హానికరమనీ, స్వాతంత్ర్యసాధన కోసం సాగిస్తున్న జాతీయపోరాట పథానికి ప్రతిబంధకమనీ మేము భావిస్తున్నాం. స్వాతంత్ర్యం సాధించుకోవడమే యీనాడు మన దేశం

ముందున్న ఏకైక ప్రధానలక్ష్యమని మా నిశ్చితాభిప్రాయం. ప్రస్తుత కార్యవర్గం మీ యిష్టానుసారం ఏర్పడలేదనీ, దానిని మీ నెత్తిన ఎవరో రుద్దారనీ, యిష్టంలేకపోయినా విధిలేక దానిని ఆమోదించవలసివచ్చిందనీ, మీరూ భావిస్తున్నారు. అదేవిషయం మీరు వ్యక్తంచేశారుకూడా. లక్నోలో జరిగిన విషయాలననుసరించి మా అవగాహనకు, మీఅవగాహన పూర్తిగా విరుద్ధంగావుంది. మాలో ఎవ్వరంగానీ (మీపై) వీసమెత్తు ఒత్తిడి ప్రయోగించినట్లు మాకు తెలియనేతెలియదు. ఏదిఏమైనా మీ ప్రకటనల వల్ల ఉత్పన్నమైన పరిస్థితి కడు శోచనీయంగావుంది. మీ కాళ్ళకు గుదిబండలుగా తయారయ్యే అనుచరవర్గం కార్యవర్గంలో వుండడం మంచిది కాదనీ మీ యిష్టంవచ్చినట్లుపనిచేయడానికి మీకు పూర్తిస్వేచ్ఛయివ్వడమే మంచిపని మేము తలుస్తున్నాం. ఇదేసమయంలో మరొకవిషయం కూడా స్పష్టంచేయదలుచుకొన్నాం. 1920 లగాయతు యిప్పటివరకు కాంగ్రెసు అనుసరిస్తున్న కార్యవిధానాలు, కార్యక్రమమూ, ఆ సంస్థ పాటిస్తున్న ఆదర్శాలు యికముందుకూడా అనుసరించాలని, పాటించాలని. అవి మన దేశానికి, ముఖ్యంగా ప్రస్తుత పరిస్థితులలో, అత్యంత ఉచితమైనవని మా దృఢాభిప్రాయం, వాటివల్ల ఎంతో మహోపకారం, సత్ఫలితాలు సాధ్యమైనట్లు అనుభవం చాటిచెబుతోంది. మీ ప్రసంగాలవల్లను కొందరు సోషలిస్టు సహచరుల ప్రసంగాలవల్లను, ఈ ప్రసంగాల ప్రోత్సాహంతో రెచ్చిపోయిన ఇతర సోషలిస్టుల బోధలవల్లను దేశం మొత్తంమీద కాంగ్రెసు దెబ్బతిన్నది. పొందిన నష్టానికి ప్రతిఫలంగా లభించిన లాభం ఏమీలేదు. దేశంముందున్న తక్షణ రాజకీయ కర్తవ్యంగురించి, ముఖ్యంగా ఎన్నికల కార్యక్రమం గురించి మీరు ప్రారంభించిన ప్రచారం చాలా హానికరంగా వుంది. ఇట్టిపరిస్థితులలో రానున్న ఎన్నికల నిర్వహణబాధ్యతలను మా భుజస్కంధాలకెత్తి వేసుకోజాలమని మేము భావిస్తున్నాం.

అందుచేత ఎంతో అయిష్టంమీదనే అయినప్పటికీ మేము కార్యవర్గంనుంచి రాజీనామాయివ్వక తప్పడంలేదు. దీర్ఘంగా యోచించిన

మీదట మేమీ నిర్ణయానికివచ్చాం. మా యీ నిర్ణయం మాకు, మీకు కూడా మంచినే కలుగజేస్తుందని, దేశానికి మేలు చేకూర్చుతుందని మేము అనుకొంటున్నాం.

భవదీయులు,
రాజేంద్రప్రసాద్
సి. రాజగోపాలాచారి
జయరామ్‌దాస్ దౌలత్‌రామ్
జమ్నాలాల్ బజాజ్
వల్లభాయ్ పటేల్
జె. బి. కృపలానీ
ఎస్. డి. దేవ్

## 148. రాజేంద్రప్రసాద్ వద్దనుంచి

వార్ధా,
జూలై 1, 1936

ప్రియమైన జవహర్‌లాల్‌జీ,

నిన్న మనం విడిపోయినపిమ్మట, మేము మహాత్మాజీ దీర్ఘ సమాలోచనలు సాగించాం; మాలో మేము సుదీర్ఘమైన సంప్రతింపులు జరుపుకొన్నాం. మేము తీసుకొన్న చర్య మీకు బాధకలిగించినట్లు తెలిసింది. ముఖ్యంగా మా లేఖలో వ్యక్తమైనధోరణి మీ మనస్సును బాగానొప్పించినట్లు విన్నాం. మీకు యిబ్బందికలిగించాలనిగానీ, మిమ్ముల్ని నొప్పించాలనిగాని మేము కలలోకూడా తలంచలేదు. ఆ లేఖ మీకు బాధకలిగించినట్లు మీరు సూచించినా, లేక వెల్లడించినా ఎట్టిసంకోచమూ లేకుండా మేము దానిని సవరించివుండేవాళ్ళం: లేదా మార్చివుండేవాళ్ళం. అయితే మొత్తం పరిస్థితినంతనూ పునరాలోచించిన మీదట మేము ఆ లేఖను, మా రాజీనామాను ఉపసంహరించుకోవాలన్న నిర్ణయానికివచ్చాము.

రాజీనామాను మేము ఉపసంహరించుకొంటున్నామన్న, ఈ సందర్భంలో అంతరంగికమైన ఈ లేఖలో మాభావాలను వివరంగా, స్పష్టంగా ఉదహరించటానికి మీరు అనుమతించగలరు. ప్రకటితమయ్యే లేఖలో

మా భావాలన్నింటినీ స్పష్టంగా పేర్కొనడం సాధ్యంకాదుగదా. మిమ్మల్ని నొప్పించాలన్నదృష్టితోమాత్రం ఈ లేఖను వ్రాయడంలేదని మరొకసారి చెప్పవలసివుంటుంది.

పత్రికలలో ప్రచురితమైన మీ ప్రసంగాలనుబట్టి మేము భావించినది ఏమిటంటే కాంగ్రెసు కార్యక్రమంగురించికన్నా కాంగ్రెసు ఆమోదించని ఏదో ఒక అంశంపై మీరు అమితంగా ప్రసంగాలు చేస్తున్నారు. ఆ విధంగా మీరు కార్యవర్గంలోను, కాంగ్రెసులోను గల అల్పసంఖ్యాక సహచరుల అభిప్రాయాలను ప్రచారంచేశారు; అధికసంఖ్యాక సహచరుల అభిప్రాయాలను విస్మరించారు. కాంగ్రెసు అధ్యక్షపదవిలోవున్న మీరు అధికసంఖ్యాకుల అభిప్రాయాలనే ప్రతిబింబిస్తారని మేము ఆశించాం. మీరన్నట్లు మీ ప్రసంగాలలో సోషలిజానికి సంబంధించిన అంశాన్ని మాత్రమే పత్రికలు ప్రముఖంగా ప్రకటించి, మిగతావిషయాలు అంత ప్రాముఖ్యమైనవికావన్న దృష్టితో ప్రకటించకుండా మానేసివున్నా మానేసివుండవచ్చును. అయితే మీ ప్రసంగాలను స్వయంగా వినేవారిలో ప్రతి ఒక్కరికీ, ఆ ప్రసంగాలను అచ్చులోచూసి చదివేవారు అనేకవందల మంది చొప్పున వుంటారన్న వాస్తవాన్ని విస్మరించరాదు. అందుచేత అచ్చురూపంలో మీ ప్రసంగాలను చదివేవారిపై మీ ప్రసంగాలు కల్గించే ప్రభావాన్ని విస్మరించరాదు.

మాకు వ్యతిరేకంగా కొందరు నిత్యమూ నిరంతరప్రచారం సాగిస్తున్నారు. మా కేదో కాలదోషంపట్టినట్లు చిత్రిస్తున్నారు. మే మేదో పుచ్చిపోయిన పాతభావాలకు ప్రాతినిధ్యంవహిస్తున్నట్లూ, వర్తమానకాలానికి మా భావాలు ఎందుకూ పనికిరావన్నట్లూ వారు ప్రచారంచేస్తున్నారు. మే మేదో దేశాభ్యుదయానికి ప్రతిబంధకంగా తయారైనట్లు, మాకు అర్హతలేకపోయినా ఏవో పదవులుపట్టుకుప్రాకులాడుతున్నట్లూ, ఆ పదవులనుంచి మాకు ఎంత తొందరగా ఉద్వాసనచెప్పితే అంత మంచిదన్నట్లు వారు వాదిస్తూనే ప్రకటిస్తున్నారు. గాంధీజీసహచర్యంలో మేము కొన్ని ఆదర్శాలు అలవర్చుకొన్నాం; కొన్నిపద్ధతులకు అలవాటు పడ్డాం; కొన్నిఎత్తుగడలను అభ్యసించాం. అందుచేత ఏసంస్థలోనైనా

అధికారపదవులకోసం ప్రాకులాడటం మా అంతఃకరణకే ప్రతికూలం. మేము అలవర్చుకొన్న ఆదర్శాలు, పద్ధతులు, ఎత్తుగడలు అందుకు అసలు అనుమతించవు కూడా. కనుక ఇతరులు మాకు ఘోరమైన అన్యాయంచేశారని, చేస్తున్నారని మేము భావించాం. మా సహనమునుగా మా అధ్యక్షులుగా మీరు మాకు ఇవ్వవలసినరక్షణ నివ్వటంలేదనికూడా అభిప్రాయపడ్డాం. మమ్మల్ని బయటకు నెట్టటానికి పెద్దఎత్తున ప్రయత్నాలుసాగుతున్నా, ఆమేరకు మీఎదుటనే కొందరు బాహాటమైన ప్రకటనలుచేస్తున్నా. మీ సానుభూతి అలాంటివారిపట్లనే వున్నట్లు మాకు తెలిసింది. ట్రేడ్‌యూనియన్‌కాంగ్రెసులో సరిగా అలాగే జరిగింది. అందుచేత మాపై ప్రతికూలప్రచారంచేస్తున్నవారితో కొంతవరకు మీరూ ఏకీభవిస్తున్నారని అనుమానించవలసివస్తున్నది. ఇది మా కెంతో బాధకల్గించింది. ఎందుకంటే, పదవులకోసం ప్రాకులాడాలన్న ఈప్సితం మాకు ఈషన్మాత్రమూ లేదు. మేము మీ సహచరులం; అయినా మాపట్ల మీకు ఉండవలసినంతవిశ్వాసం లేదని. మేమన్నా, మా అభిప్రాయాలన్నా మీకు ఎంతమాత్రం గౌరవంలేదని మేము క్రమేణ ఒక అభిప్రాయానికి రావలసివచ్చింది. వీటన్నిటినిబట్టి. మీదృష్టిలో మేము కేవలం మీ కాళ్లకు గుదిబండలంటా తయారైనట్లు మీరు భావించారని మేము అనుకోవటంలో అసహజమేమీలేదుగదా. ఇంకా మేము పదవులలోవుండి ప్రయోజనమేమిటన్న అభిప్రాయానికిరావటం విడ్డూరంకాదుగదా.

దేశంలోని పరిస్థితిని ఎదుర్కోవటంలో మీరు అనుసరిస్తున్న పద్ధతివల్ల, నిర్మాణకార్యక్రమానికి పెద్ద దెబ్బతగులుతోంది. మాదృష్టిలో నిర్మాణకార్యక్రమం కాంగ్రెసుకార్యక్రమంలో అత్యవసరమైన. అతి ముఖ్యమైనభాగం.

ఈ వ్యక్తిగత అంశాలన్నింటినీ కొంతసేపు ఆవలపెడదాం. మేము ఏ ఆదర్శాలకోసం, ఏ కార్యవిధానంకోసం గత పదహారు పదిహేడేళ్లుగా కృషిచేశామో, వాటన్నిటినీ కొందరు దొంగచాటుగా దెబ్బ తీస్తున్నారని మేము గట్టిగా అభిప్రాయపడ్డాం. ఇప్పటికీ ఆ ఆదర్శాలు, కార్యవిధానం దేశానికి అత్యంత శ్రేయోదాయకమైనవని మా ఉద్దేశం.

అలాంటివాటిని దెబ్బతీయడంలో నాటకమాడుతున్నవారిపట్లనే మీకు సానుభూతి ఉంది. వారి అభిప్రాయాలనే మీరూ కలిగివున్నారు. మీతో మేము కలిసివుండటంవల్ల ప్రజలలో పొరపాటు అభిప్రాయమేర్పడడానికి అవకాశం వుంటుంది. అయిష్టంగానూ, అనుకోకుండానూ మేము మా ప్రత్యర్థుల ప్రయత్నాలకు చేయూతనిచ్చినట్లే కాగలదని భావించాం. ఈరకమైన కార్యకలాపమే కాంగ్రెసుసంస్థను, దేశంలో కాంగ్రెసుపలుకుబడినీ క్రమేణా దెబ్బతీస్తోంది. ఎందుకంటే దేశమంతా నేటికీ ఆ ఆదర్శాలనూ ఆ కార్యక్రమాన్ని మాత్రమే శిరసావహిస్తున్నది. దీనివల్ల కాంగ్రెసు బలహీనమైపోతున్నది; కార్యకర్తలలో విచ్ఛిన్నకరపోకడలు ప్రబలడానికి అది దోహదమిస్తున్నది: దీనిఫలితంగా వచ్చేఎన్నికలలో కాంగ్రెసు విజయావకాశాలు సన్నగిల్లడం సహజం. అయితే, ఈఅంశంపై మీరు మాతో ఏకీభవించడంలేదనుకోండి. ఏమైనా ఎన్నికలఫలితాలు ఊహాగానానికి సంబంధించినవి కనుక, ఆవిషయంలో భిన్నాభిప్రాయాలకు తావు వుండనేవుంటుంది. పోతే, మేము తలపెట్టినచర్యవల్ల ఎన్నికలలో విజయావకాశాలు ఇతోధికంకావటంమాట అటుంచి, అవి వాటిని దెబ్బ తీసే ప్రమాదాన్ని పెంచేమాత్రం అష్టి తీవ్రచర్యతీసుకోరాదన్న వాదనలోని పటిమను మేము గుర్తించాం. మేము గైకొన్న చర్యవల్ల ఎన్నికలకుసంబంధించి సంబంధిత సంస్థలు మరింత దిగజారే ప్రమాదంవుందని మాలోకొందరు అభిప్రాయపడుతున్నారు. ఈ విషయంలో భరోసా అంత మంచిదికాదని మేము అనుకొన్నాం. అదేసమయంలో వివిధరాష్ట్రాలలో మా సొంత అనుభవాలనుబట్టి కాంగ్రెసుసంస్థ మొత్తంమీద దుర్బలమైపోతున్నదనీ, క్రమక్రమంగా దెబ్బతింటున్నదనీ మేము భయపడుతున్నాం. ఈ విషయాన్ని మీ దృష్టికి తేవడం, మా కర్తవ్యంగా ఎంచుకొంటున్నాం. మీకు సంబంధించినంతవరకూ — పరిస్థితిని చక్కదిద్దడానికి మీరు తగిన చర్యలు తీసుకోగలరని ఆశిస్తున్నాం.

మేము ఇంతకుముందే పలుసార్లు మీకు చెప్పినట్టు, కేవలం ఏదో ఒక సంఘటననుబట్టిగాని, ఏదోఒక ప్రసంగాన్నిబట్టిగాని మాలో ఈ భావం బలంగా చోటుచేసుకోలేదు. జరిగిన అనేకచర్యల పర్యవసానంగానే మాలో

ఆ భావం ఏర్పడింది. నిర్మొహమాటంగా ఈవిషయం స్పష్టంచేయ దలిచాం. మా మనసులలోని భావమేమిటో విప్పిచెప్పి మీకు తెలియ జేయడం మా విధి అనుకొన్నాం. మిమ్మల్ని బాధపెట్టి, మీకు మంచివని తోచినవిధంగా మీరెప్పుడైనా తెలుపవచ్చును. మీ మనస్సును నొప్పించినందుకు విచారిస్తున్నాం. ఈ లేఖ పరిస్థితిని కొంతవరకు చక్క బరుస్తుందనే ఆశిస్తున్నాం. మిమ్మల్ని నొప్పించాలన్న దృష్టి మాకు ఏకోశానాలేదు. మేమంతా సంప్రదించుకొన్నతర్వాతనే మా అందరితర ఫునా నే ఈ లేఖ వ్రాస్తున్నాను. మాకు సంబంధించినంతవరకు ఈ వ్యవ హారంగురించి మేము చెప్పదలచింది ఒకటే; దేశానికి మేలు చేయగల దన్నదృష్టితో మే మీ పని చేశాం. అంతవరకే మేము బాధ్యులం. మేము అసలు రాజీనామాయివ్వనక్కర్లేదనిపిస్తోంది. అందుచేత దయచేసి మా రాజీనామాపత్రాన్ని మాకు తిరిగి పంపివేయండి.

ఈ లేఖ కేవలం అంతరంగికమైనదనీ, మీకుమాత్రమే ఉద్దేశింప బడినదనీ వేరే చెప్పనక్కరలేదనుకుంటాను, అధికారపత్రాలలో చేర్చ డానికి ఇది ఉద్దేశించబడలేదు.

భవదీయుడు,
రాజేంద్రప్రసాద్.

## 149. మహాత్మా గాంధీజీకి

అలహాబాద్,
జూలై 5. 1936

ప్రియమైన బాపూ,

క్రితంరాత్రే నే నిక్కడకు చేరాను. నేను వార్ధాను వదలివచ్చి నప్పటినుంచి శారీరకమైన దుర్బలత్వానికి, మానసికమైన ఆందోళనకు లోనవుతున్నాను. దీనికి కొంతవరకు భౌతికకారణాలు హేతువు కావ చ్చును. జలుబుచేసి గొంతునొప్పి హెచ్చింది. కాని, దీనికి మరికొన్ని యితర కారణాలుకూడా లేకపోలేదు. అవి సూటిగా మనస్సునూ, హృద యాన్ని కొంతవరకు గాయపరుస్తున్నాయి. నేను యూరోపునుంచి

తిరిగివచ్చినప్పటినుంచీ, కార్యవర్గసమావేశాలు నాలోసత్తువను పూర్తిగా పిండివేస్తున్నట్టు భావిస్తున్నాను. అవి నాలో నిర్జీవత్వానికి హేతువు అవుతున్నాయి. ఒక్కొక్క సమావేశం జరుగుతున్నకొద్దీ నాకు మరింత మనస్తాపం ప్రాప్తిస్తున్నదా అనిపిస్తోంది. కార్యవర్గంలోని నా సహచరులు కూడా ఇదేవిధంగా భావించినా నేను ఆశ్చర్యపడను. ఇది చాలా అనారోగ్యకరమైన అనుభవం. సమర్థవంతమైన కృషికి ఇది తీరని ప్రతిబంధకం.

నేను యూరప్‌నుంచి తిరిగిరాగానే దేశమంతా నిస్పృహలో మునిగి తేలుతున్నదనీ, అందుచేత మనం నెమ్మదిగామాత్రమే ముందుకు సాగాలని వాదిస్తారు. కాని గత నాలుగుమాసాలలో నేనుపొందిన ప్రత్యక్ష అనుభవం పై అంచనాను ఏ మాత్రం ధృవపర్చేదిగా లేదు; పైగా, దేశంలో ఏ ప్రాంతానికి వెళ్ళినా, ప్రజలలోఉప్పొంగే ఉత్సాహం నాకు గోచరమవుతోంది. ప్రజలలోని సమధికోత్సాహాన్నిచూసి నేను ఆశ్చర్యచకితుడనవుతున్నాను. ఈ వుత్సాహానికి కారణమేమిటో మాత్రం నేను స్పష్టంగా చెప్పలేను. అనేక కారణాలనుమాత్రం ఊహించగలను. ప్రజలలో వుత్సాహంచూసి నేను సహజంగానే వుప్పొంగిపోయాను. క్రొత్తశక్తి నాలో ప్రజ్వలితమైంది. కాని, ప్రతిసారి, కార్యవర్గసమావేశంలో పాల్గొన్నప్పుడల్లా నాలో ప్రజ్వలితమయిన శక్తిఅంతా యింకిపో నాకనిపించింది. శక్తివుడిగిపోయిన వ్యక్తిపలె, నేను కార్యవర్గ సమావేశాలనుంచి బయటకువెళ్ళుతున్నాను. ఈసారి నేను శారీరకంగా చాలా బలహీనస్థితిలో వున్నందున, నా పరిస్థితి మరింత దిగజారినట్టు అనిపిస్తోంది.

అయితే, నా శారీరక స్థితినిగురించో లేక మానసికస్థితిని గురించో కాదు నేను మీకు వ్రాయాలనుకొంటున్నది. అంతకన్నా చాలా ముఖ్యమయిన విషయాలున్నాయి. వాటినిగురించే నా ఆందోళనఅంతా. దీనిని అధిగమించే మార్గమేమిటో నాకు బోధపడడంలేదు. తొందరపాటుతో హఠాత్తుగా చర్యతీసుకోవాలన్న దృష్టిగాని. దీర్ఘంగా ఆలోచించకుండా చర్యతీసుకోవాలన్న దృష్టిగాని నాకులేదు. అయితే నే నా విషయంలో

నిర్దిష్టమయిన నిర్ణయానికి రావడానికిముందే నా ఆలోచన ఏ దిశగా పయనిస్తున్నదో మీకు తెలుపదలుచుకొన్నాను.

పరిస్థితులను చక్కబెట్టడానికి, సంక్షోభాన్ని నివారించడానికి మీరు తీసుకొన్న శ్రమకు నా కృతజ్ఞతాభివందనాలు. ప్రస్తుత పరిస్థితులలో ఆ రకమైన తెగతెంపులవల్ల మన కృషికంతటా ఎన్నికలలోనూ తీరని విఘాతం కలుగక తప్పదని యింతకుముందూ భావించాను; యిప్పుడూ భావిస్తున్నాను. అయినా, మనం యిప్పుడు ఎక్కడవున్నాం? మన భవిష్యత్తు ఏమిటి? రాజేన్‌బాబు వ్రాసిన (రెండవ) లేఖను మళ్ళీ చదివాను. ఆయన అందులో నాపైన పెద్ద అభియోగం మోపాడు. ఆ అభియోగం పెద్దదేకావచ్చునుగాని, అది నిర్దిష్టంగామాత్రం లేదు. మహాసభలో నే నిచ్చిన ఉపన్యాసాన్నిమాత్రం నిర్దిష్టంగా పేర్కొన్నారు. అయినా అసలుసమస్యకు అంతగా సంబంధించినది కాదు. నా కార్యకలాపాలు కాంగ్రెసు ఆశయానికి హానికరంగా పరిణమిస్తున్నవన్నదే వారు చెప్పే ప్రధానఅంశం. అవి కాంగ్రెసును దెబ్బతీస్తున్నవనీ, ఎన్నికలలో విజయావకాశాలను పాడుచేస్తున్నవనీ ఆరోపించారు. నేను ఇలానే కొనసాగితే పరిస్థితి మరింత విషమించవచ్చును. ప్రధానమైన యిలాంటి విషయంలో నా సహచరులు భరోసాగా వుండదలుచుకోలేరు.

కనుక యీ ఆరోపణలో ఏమాత్రం సత్యమున్నప్పటికీ, సమస్యను అమీతుమీ తేల్చుకోవలసిందే. ఇది చాలా తీవ్రమైనసమస్య కనుక ఆషామాషీగా త్రోసివేయడానికి వీల్లేదు. ఈ విషయంలో తెలుపు, నలుపు నీడలంటూ లేనేలేవు. మంచీ చెడూ మిళితమైలేదు. అంతా నలుపే. కనుక సమస్యను తేల్చడం చాలా తేలిక. విషయాన్ని ఎంత మృదువుగా మెత్తగా చెప్పినా అసలుసంగతి యిది; నేను సహించరాని న్యూసెన్స్‌గా తయారయ్యాను. నాలోని శక్తియుక్తులు— సామర్థ్యం, సత్తువ, సంకల్పం, అనిర్దిష్టమైన పేరుప్రఖ్యాతులు— ఇవన్నీ సహజా తప్పుడుపంథాకు మళ్ళించినప్పుడు చాలా ప్రమాదకరంగా పరిణమిస్తాయి. దీనంతటి అర్థం ఒకటే, అది విధితంకూడా.

మనమంతా ఈ సంవత్సరం కలసికట్టుగా పనిచేయడం ఏమంత కష్టంకాబోదనుకున్నానని లక్నోకువచ్చాను. చివరకు కొంతవరకు లక్నోలో [illegible] నేను అనుకొన్నాను. ఈ విషయంలో నేను పొరబడ్డానని అనుభవంలో తెలిసింది. ఉభయులం ఎంతగా కృషిచేసినా సామరస్యం సాధ్యం కావడంలేదు. బహుశా యిందుకులోపం నాదేకావచ్చు; ఆ విషయం నాకు తెలియదు. అయితే, తనకంటిలో దూలాన్నిసైతం చూడలేని అంధులు చాలామంది వుంటారు. ఏది ఏమైనప్పటికి ఒకటిమాత్రం వాస్తవం. మన గ్రూప్పు సమైక్యంగా వుంచే శక్తిప్రపత్తి నేడు కరువైపోయింది. అది మూడు రకమైన గ్రూపుగా మారిపోయింది. ఉభయపక్షాలూకూడా 'ఎందుకొచ్చిన విద్వేషం యిది' అన్నభావంతో వున్నాయి. ఉభయులూ మనస్సులు విరుచుకొని వ్యవహరిస్తున్నారు. వీటన్నిటి పర్యవసానంగా, అన్ని వైపుల అవాంఛనీయమయిన ధోరణులు తలెత్తడం సహజం. మానసిక శాస్త్రం తెలిసిన ప్రతివారికి యిది తెలుసును.

నేనీసారి బొంబాయి చేరేసరికి అనేకమంది నా వంక అమితాశ్చర్యంతో చూడసాగారు నేనింకా ఎలావుండగలిగానా అని వారు ఆశ్చర్యపొందారు. రాజకీయరంగంనుంచి నన్ను అతిమర్యాదగా సాగనంపడం ఖాయం అన్నవిషయం అక్కడ విరివిగా ప్రచారమైనట్టున్నది. (ఇది టైమ్స్ ఆఫ్ ఇండియా పత్రికలో అంతకుముందే ప్రకటితమైంది) దహనసంస్కారాలు మినహా మిగతావిషయాలన్నీ నిర్ణయమైపోయాయి. అందుకే వారికంత అమితాశ్చర్యం. వీధుల్లో అనేకమందికితెలిసిన విశ్వసనీయమైన ఈ పుకార్లగురించి నాకు ఈషణ్మాత్రం తెలియకపోవడం చాలా విచిత్రంగానే వుంది. ఈ పుకార్లు నా చెవినిసోకకపోయినా, వాటికి బలీయమైన ఆధారాలు లేకపోలేదు. దీనినిబట్టే నేను ఏకాకిగా మారిపోయినట్టు కొంతవరకు అనుకోవాలి.

నా గ్రంథంలోను ఆతర్వాతకూడా, నా ప్రస్తుతాభిప్రాయాలు ఏమిటో వివరంగా వ్రాశాను. నన్నుగురించి అర్థంచేసుకోటానికి అవసరమైన సమాచారమంతా అందరికీ అందుబాటులోనేవుంది. ఆ అభిప్రాయాలేవో కాకతాళీయంగా ప్రకటించినవికావు. అవి నాలో అంతర్భూతమై

వున్న అభిప్రాయాలు. భవిష్యత్తులో నా అభిప్రాయాలు మారిపోవచ్చు. అయితే నేను ఆ అభిప్రాయాలను కలిగివున్నంతవరకు వాటిని వెలి బుచ్చక తప్పదుగదా. విశాల ప్రాతిపదికపై ఐక్యతకు నేను అధిక ప్రాధాన్యమిస్తున్నాను. కనుకనే, నేను నా అభిప్రాయాలను సాధ్యమై నంతవరకు మృదువైన పద్ధతిలో వెలిబుచ్చుతున్నాను. అంతేకాక వాటిని నా నిశ్చితాభిప్రాయాలుగా కూడా చిత్రించడంలేదు. ఇతరులలో ఆలోచన రేకెత్తించే విధంగామాత్రమే నాఅభిప్రాయాలను నేనువ్యక్తంచేస్తున్నాను. నేను అవలంబించిన ఈ వైఖరికీ, కాంగ్రెసు చేస్తున్నదానికీ చెరికి మధ్య వైరుధ్యం నాకేమీ కన్పించడంలేదు. పోతే ఎన్నికలకు సంబం ధించినంతవరకు, నేను అవలంబించిన వైఖరివల్ల మనకు ఎంతోలాభం చేకూరగలదని గట్టిగా నమ్ముతున్నాను. ఎందుకంటే నా వైఖరి జనసామా న్యాన్ని వుత్సాహపర్చుతోంది. కాని నా సహచరులుమాత్రం నా వైఖరి అత్యంత ప్రమాదకరమైనదనీ, హానికరమైనదని తలంచుచున్నారు. నేను ఎప్పుడూ భారతదేశంలోని దారిద్ర్యంగురించి, నిరుద్యోగంగురించి అదే పనిగా నొక్కిచెప్పుతూండడం కూడా అంత తెలివైనపని కాదని కొందరు నాతోనే అన్నారు. ఏమైనా నేను చేస్తున్నపని పూర్తిగా పొరపాటుపద్ధతిలో వుందని వారిభావం.

సామాజిక సమస్యలపై నా అభిప్రాయాలను స్వేచ్ఛగా వ్యక్తం చేసుకొనే హక్కునాకు వుండాలని పూనాలోను, లక్నోలోను నేనుస్పష్టం చేసిన సంగతి మీకు గుర్తుందేవుంటుంది. మీరు, కార్యవర్గసభ్యులు అందుకు అంగీకరించారనే నేను అనుకొన్నాను. అభిప్రాయాలనుంచి చెడులమాట అటుంచి, అసలు ఆ అభిప్రాయాలను వ్యక్తంచేసే హక్కు నా కుందా లేదా అన్నది యిప్పుడు ప్రధానమైనదిగా తయారైంది. అంతే కాదు. యిది జీవితవిలువలకు సంబంధించినది. మనం దేనిని ప్రాణ ప్రదంగా ఎంచుకొంటామో, దానిని త్యాగంచేయవలేము గదా.

కాదనడానికి వీలులేని సంఘర్షణ వున్నమాట నిజం. ఎవరు తప్పు ఎవరు ఒప్పు అని వాదించి లాభంలేదు. గతవారంలో జరిగిన ఘటనలాగా

బట్టి, మనం అసలు సరియైనమార్గంలో పయనిస్తున్నామా అన్న అనుమానం కలుగుతోంది. ఇప్పుడున్న పరిస్థితులలో విషయాలన్నింటినీ అఖిలభారత కాంగ్రెసుసంఘంముందుంచడం మంచిదని నేను భావిస్తున్నాను. వచ్చే ఎ. ఐ. సి. సి. సమావేశంలో దీనిని చర్చించవచ్చు. ఈ చర్చను ఏ పద్ధతిలో సాధించాలి అన్నవిషయంలో నాకు నిర్దిష్టమైనఅభిప్రాయంలేదు. ఏది ఏమైనా చర్చ క్లుప్తంగావుంటే సరిపోతుంది. నామట్టుకునేను మాట్లాడవలసింది అంతగా వుండదు.

దీనంతటిఫలితంగా నేను పదవినుంచి విరమించడం, మరింత ఐక్యభావంతో పనిచేయగల్గిన కార్యవర్గం ఏర్పడడం సంభవం కావచ్చును.

ఓ రేపో ప్రకటన జారీచేయనున్నట్టు నాతో చెప్పారు. ఆ ప్రకటనకు నా స్వాగతం. ఎందుకంటే, అందరిఅభిప్రాయాలను ప్రజల ముందుంచి, తేల్చుకోవడం మంచిదనినమ్మేవాళ్లల్లో నేనొకణ్ణి.

ఈ విషయంగురించి నేను ఎవరితోను ఇంతవరకు చెప్పలేదు. కాసుకకూర్చున్న వెయిన్నొక్కకన్నులు, ఈ లేఖ మీకు చేరకముందే, లేఖాంశాలను సంగ్రహించవచ్చును! ఏమిచేస్తాం ?

బొంబాయిలో మృదులతో మాట్లాడాను. నా అభ్యర్థనపై ఆమె అహ్మదాబాద్‌నుంచి బొంబాయివచ్చి, కొన్నిగంటలపాటు వుంది. ఆమె చెప్పినదానినిబట్టి నేను గ్రహించినది ఇది: విషయాలకు సంబంధించి వంతవరకు మీరు ఆమెతో చెప్పినదానికి, నేను వ్రాసినదానికి. చెప్పినదానికి తేడావున్నట్టు తనకు కన్పించడంలేదని ఆమె అన్నది. నిజానికి ఆమె మీకు వ్రాసినలేఖలో ఒకవిషయాన్ని స్పష్టంచేసింది. బహుశా ఈ లేఖలో ఒకటి రెండు వాక్యాలు మీదృష్టినుంచి పొరపాటున వైదొలగి వుండవచ్చు. ఆ లేఖప్రతిని మళ్లీ మీకు పంపిస్తానని ఆమె చెప్పింది. మీరే మరొకసారి చూడండి.

కార్యవర్గంలో మహిళ లేకుండాపోవడానికి బాధ్యులు మీరో, లేక వల్లభాయో లేక ఇద్దరూ అని గుజరాత్‌మహిళలు ప్రచారంచేస్తున్నట్టూ వార్తాలో నాకు చెప్పారు. ఈవిషయం మృదులను అడిగాను. తనకు

తెలిసినంతవరకు ఎవరో అలాంటి ప్రచారంచేయడంకాని అలా అభి ప్రాయపడడంగాని జరగలేదని ఆమె వివరించింది.

ఈవిషయంగురించి సరోజినితోకూడా మాట్లాడాను.

జీవరాజ్ మెహతా, ఖుర్షిద్‌లను కలుసుకొన్నాను. నిర్మాణ వ్యయం మున్నగువిషయాలతో జీవరాజ్ ఖేర్‌లో పరిశీలించడంలేదు. కాని, అతను ఇంతకుపూర్వంచేసినలెక్కలను కొంత తగ్గించాడు. నిర్మాణానికి, పరికరాలకు రెండులక్షలుఅయితే సరిపోతుందని అంటున్నాడు. రిజర్వునిధిక్రింద మరొక రెండులక్షలు వుంచాలంటున్నాడు. మొదట అనుకొన్నట్లు స్వరాజ్యభవనం ఆవరణలో నిర్మాణంచూడాలని అతని అభిప్రాయం ఆనందభవనానికిచూస్తున్నవున్న భాగాలలో వానిని నిర్మించాలని అతని ఉద్దేశ్యం. దీనినిగురించి మున్సిపాలిటీవారితో మాట్లాడతాను.

ఏ. ఐ. సి. సి. సమావేశం జరిగినప్పుడే, బొంబాయిలో కమలా నెహ్రూస్మారకనిధి ప్రతిష్ఠాపనసమావేశాన్ని, స్వరాజ్యభవనం ప్రతిష్ఠాపనసమావేశాన్ని ఏర్పాటుచేయదలచాను.

బొంబాయిలో సర్జన్ నన్ను బలవంతంచేసి, జర్మన్ స్పెషలిస్టు దగ్గరకు తీసుకుపోయింది. నా గొంతు బాగుపడాలంటే, ఒక వారం రోజులపాటు నేను నోరుమెదపకుండా ఊరుకోవాలని ఆ పెద్దమనిషి ఆదేశం. ఇది చాలా కష్టమైనపని.

ప్రేమతో..

జవహర్‌లాల్.

150 మహాత్మా గాంధీనుండి.

సెగాన్, వార్ధా,

జూలై 8, 1936.

ప్రియమైన జవహర్‌లాల్,

నీ లేఖ ఇప్పుడే చేరింది. వార్ధాలోజరిగిన ఘటనలనుగురించి నీకు వ్రాద్దామనుకొంటూవుండగానే నీ లేఖ చేరింది. నీ లేఖవల్ల నా

పరిస్థితి మరింత క్లిష్టమైంది. అయితే, నీకొక విషయం వివరించదలిచాను. రాజీనామా ఉపసంహరణలేఖకు నీవు ఇస్తున్న అర్థం సరియైనదికాదని చెప్ప గలను. నేను చూసినపిమ్మటనే దానిని నీకు అందజేశారు. రాజీనామాపత్రా నికి బదులుగా ఆ లేఖను పంపమని సూచించినది నేనే. ఆ లేఖనుగురించి నీవు అంతగా పట్టించుకోవని నేను భావిస్తాను. ఏదిఏమైనా ఇక ఈ సంవత్సరంలో ఈ గొడవలకు పూర్తిగా స్వస్తిచెప్పాలనీ, ఇక రాజీ నామాలు వుండకూడదనీ నేను గట్టిగా అభిప్రాయపడుతున్నాను. ఈ సంక్షోభాన్ని ఏ. ఐ. సి. సి. పరిష్కరించలేదు. ఆ స్తోమత దానికిలేదు. రెండు ఆవేశాలమధ్య అది ఛిన్నాభిన్నమైపోతుంది. ప్రజాస్వామ్యం పేరుతో దానిమీద సంక్షోభాన్ని అకస్మాత్తుగా పడత్రోయటం ధర్మం కాదు. ఇలాంటిసంక్షోభాన్ని అది ఎన్నడూ ఎదుర్కోలేదు, లేఖలోని అంశాల అంతరార్థాలను నీవు గోరంతలను కొండంతలుచేస్తున్నావు, నేను వాదించను. కాని, నా దొకటే కోర్కె: పరిస్థితిని ప్రశాంతంగా పరిశీలించు, నిస్పృహకు లోనుకాకు. అది నీకు తగదు. కార్యవర్గ సమావేశాలమ నీ హాస్యోక్తులతో ఎందుకు రంజితంగా మార్చలేవు, అనేకసంవత్సరాలపాటు ఎలాంటిగొడవలు లేకుండా కలసిమెలసి పని చేసినవారితో కలిసిపనిచేయడం ఇప్పుడు నీకు ఎందుకు సాధ్యంకాదు? వారు అసహనపరులు అంటే. ఆ విషయంలో వారికన్నా నీవేమీ తక్కువతినలేదు. మీరు పరస్పరం అసహనంతో కీచులాడుకోవడంవల్ల దేశం దుర్గతిపాలుకావలసిందేనా? అలా జరగడానికి వీల్లేదు.

జర్మన్ డాక్టరు ఇచ్చిన సముచితసలహాను నీవు పాటించావనే తలుస్తాను.

ప్రేమతో,

బాపూ.

151. జె. బి. కృపలానీ నుంచి,

స్వరాజ్యభవన్,
అలహాబాద్,
జూలై 11, 1936

ప్రియమైన జవహర్‌లాల్,

మీరు బొంబాయినుంచి సుస్తీతో తిరిగివచ్చారు. మీకు చిరాకు కలిగించడం నాకు యిష్టంలేకపోయింది. మీ ఆరోగ్యం యిప్పుడు కుదట పడింది కనుక, ఈ లేఖ వ్రాయడానికి సాహసిస్తున్నాను.

గతసారి వార్ధాలో తీసుకున్న చర్యకు మీరు అనుకొంటున్నంత వ్యక్తిగతసంబంధమైన ప్రాధాన్యంలేదు. కనీసం నాకు సంబంధించినంత వరకు, దానికి రాజకీయప్రాధాన్యం మాత్రమే వుంది. ఏదో మీ పట్ల గౌరవభావం లోపించడంవల్ల నేను నా సహచరులతో చేరలేదు. అలా అని నేను ఎన్నడూ అనుకోనూలేదు. మీ స్నేహాన్ని నేనెప్పుడూ అమూల్యమైనదిగా ఎంచుకొంటాను. ఆ స్నేహానికి ప్రాతిపదిక రాజకీయాలేనని వేరే చెప్పనవసరంలేదు. అయితే, అనేకసంవత్సరాలపాటు మీతోగల సన్నిహిత సంబంధం స్నేహంగా రూపొందింది. ఆ స్నేహం యింత వరకు ఎప్పుడూ మాటలరూపంలో వ్యక్తంకాలేదు కనుక, అదెంత గాఢమైనదో మీకు తెలియకపోవచ్చును. ఒక విషయంచెప్పతే మీకు ఇప్పుడు ఆశ్చర్యం కలుగవచ్చును: కాని అది యథార్థం. మీరు జైలులో వున్నందున, నా వివాహాన్ని సంవత్సరంన్నరపాటు వాయిదావేసుకున్నాను. నా వివాహం జరిగేటప్పుడు యితరులు ఎవరూలేకపోయినా, మీరుమాత్రం వుండితీరాలని కోరుకొన్నాను. ఈ విషయం సుచేతాకు వివరించాను. అప్పటికే నా వయసుమీరిన కారణంగా, వివాహం అంతకాలంపాటు వాయిదాపడడానికి ఆమె అంత సుముఖభావం వ్యక్తంచేయలేదు అది సహజంకూడా. అయినప్పటికీ నా హృదయావేదనను ఆమె అర్థంచేసుకుంది. గౌరవించింది. మీపట్ల నాకెంత అనురాగముందో. మా యిద్దరికి మిత్రురాలయిన ఖుర్షీద్ బెన్‌కు తెలుసును.

నా విషయంలో మీరెంతో విచారం వ్యక్తంచేసినట్లు బాపూ చెప్పారు. ఇంతకుముందు మనిద్దరం అనేకసార్లు కలిసివుండడం తటస్థించినా, నేను మీతో ఏ విషయంపైనా చర్చజరుపలేదని మీ ఫిర్యాదు. మీ ఆరోపణలోని పటిమను నేను అంగీకరించక తప్పదు. మీతో చర్చించగలిగిన సాహసం నాకు లోపించడంవల్లనే అలా జరిగింది. లక్నోమహాసభ జరిగినప్పటినుంచి మీతో మాట్లాడాలని అనుకుంటూవచ్చాను. కాని, పనితొందరలోను, హడావిడిలోను ఎప్పటికప్పుడు దానిని వాయిదావేసుకుంటూనే వచ్చాను. మీతో మాట్లాడే అవకాశాన్ని కల్పించుకోలేకపోయాను.

నాకు తెలిసినంతవరకు వార్ధాలో తీసుకున్నచర్య అకస్మాత్తుగాను, అనుకోకుండాను జరిగిపోయింది. సంతకంచేసినవారందరూ ఒకేవిధంగా భావించారు. ఈ చర్యకు వ్యక్తిగతసంబంధమైన ప్రాధాన్యంవుందని ఎవరూ ఊహించలేదు. మీకు తెలుసో, తెలియదో గాని, యించుమించు మొదటిలేఖను, రెండవలేఖను మొత్తంగా రాజేంద్రబాబు తయారుచేశారు. మేము మీకు ప్రతిబంధకంగా తయారైనట్లు మీరు భావిస్తున్నారని మేమంతా అభిప్రాయపడ్డామంటే, మీకు ఆశ్చర్యం కలుగవచ్చును. అందుచేత మార్పులుజరిగితే అందుకు మీరు విచారించరేమోననుకొన్నాం. సోషలిస్టులు లేకుండానే, కాంగ్రెసు కార్యవర్గాన్ని పునర్నిర్మించడం సాధ్యమనికూడా మేము అనుకున్నాం. సోషలిస్టుపార్టీకి చెందనివారితో, మీతో మొత్తంమీద ఏకీభవించేవారితో కార్యవర్గాన్ని ఏర్పాటుచేయవచ్చునని అనుకొన్నాం. అందరిమాట అలావుండనిండి కాని, మాలో హెచ్చుమంది మాత్రం మీరు యిరకాటంలో పడతారనిగానీ, తలక్రిందులైపోతారనిగానీ, అనుకోలేదని గట్టిగా చెప్పగలను. మేము పొరపాటుబడ్డామని యిప్పుడు రుజువైంది. మేము గైకొన్నచర్యను మీరు సరిగా అర్థంచేసుకోవడానికి వీలుగా ఈ లేఖ వ్రాస్తున్నాను. అనుకోకుండానే తోటిమిత్రులను మీరు అపార్థంచేసుకోకుండా నివారించే నిమిత్తం ఈ జాబు వ్రాస్తున్నాను.

ఇదంతా నా సొంతవిషయం. ఇటీవల నేను వ్యక్తంచేసిన రాజకీయాభిప్రాయాలు మీకు విస్మయం కలిగించవచ్చును మీరు కొంత

కాలంగా రంగంలోలేను. దీనికిపూర్వరంగం ఏమిటో మీకు స్పష్టమైన అవగాహన లేదు. సోషలిస్టు మిత్రులతో వివాదాలు రేగాయి. కాంగ్రెసులో వుత్పన్నమైనవి; పూనామహాసభలోనే అవి ఆరంభమైనవి. బహుశా మీకు గుర్తుండేవుండవచ్చు: పూనామహాసభలో నాకు శాసనధిక్కార ఉద్యమాన్ని విరమించాలని సూచిస్తూ తెచ్చిన ప్రతిపాదనను ఎదిరించినది ప్రధానంగా నేనే; కొంతమంది మిత్రులకు, ముఖ్యంగా భూలాభాయ్, తదితరులకు, నా ప్రాతికూల్యం నచ్చలేదన్న సంగతి కూడా మీకు తెలిసేవుంటుంది. అధికారపదవిలోకి రాకముందే, నేను వారిని వ్యతిరేకిస్తూ వస్తున్నాను. అసలు యీ ప్రాతికూల్యం ఎలా ప్రాదుర్భావంపొందిందో, క్లుప్తంగా వివరించడానికి ఇక్కడ ప్రయత్నిస్తాను. అదే సందర్భంలో నా దృక్పథాన్ని కూడా విశదీకరిస్తాను.

బాపూజీ పేరు ప్రతిష్ఠలను చిన్నబుచ్చడానికి యత్నించడంగానీ, ఆయనవిధానాలపై దాడిచేయడంగానీ పూర్తిగా పొరపాటని నా నమ్మకం. ఆయన వున్నన్నాళ్లూ పోరాటానికి ఆయన సారథ్యంవహించడం మనకు ఎంతో అవసరమని నేను విశ్వసిస్తున్నాను. నిజానికి ఆయన పోరాటానికి సన్నద్ధమవుతున్నారన్న సంగతి నాకు తెలుసును. సమయంకోసం ఆయన వేచివున్నారు; అంతే. అయినప్పుడు ఆయన పలుకుబడిపై దెబ్బతీయడానికి ప్రయత్నించడంగానీ, ఆయన పథకాలను హేళనచేయడంగానీ రాజకీయంగా అవివేకమైనపని కాగలదు. కాంగ్రెసు *సోషలిస్టులు వ్యష్టిగాను, సమష్టిగానూ కూడా అదేపని చేస్తూవచ్చారు; చేస్తున్నారు.

నేనూ ఒకవిధంగా సోషలిస్టునని నమ్ముతున్నాను. రష్యాలో సాధించినవిజయాలు చూచి, అనేకమందివలెనే నేనూ సహజంగానే మెచ్చుకొంటున్నాను. నేనూ అతిముఖ్యమైన సాహిత్యంలో చాలా భాగం చదివాను. నేను కేవలం ఊహాజగత్తులో విహరించేవాణ్ణికాదు, కార్యశీలుణ్ణి. అందుచేత సమగ్రమైన ఊహాచిత్రం పూర్తయ్యేదాకా చేతులుముడుచుకొని కూర్చోవడం నాకు చేతకాదు; నా దృష్టిలో ఏ సంస్కర్తా అలాచేయడు; చేయలేడు. ఒకవేళ ఎవరైనా అలాచేయాలని యత్నిస్తే, అతను కార్యరంగంలో ఎందుకూ పనికిరాని అసమర్థు

గతంసంగతి ఏమైనా, ప్రస్తుతానికిమాత్రం మీరు వృద్ధతరంవారితో కన్నా ఈ యువతరంవారితోనే మరింత సన్నిహితులుగావుంటున్నారని నేను అనుకొంటున్నాను. యువతరంవారితోనే మీరు ఎక్కువగా ఏకీభ విస్తున్నారు. బాపూజీకన్నా వారే సిద్ధాంతరీత్యా మీకు సన్నిహితులుగా వున్నారు. సోషలిస్టుమిత్రులు కట్టుబడ్డ రాజకీయశాస్త్రాలు కూడా నాకు అసహ్యకరంగావున్నాయి. వారు అవకాశవాదులుగా వ్యవహరిస్తు న్నారు. పూనాలో వారు జమ్నాదాస్‌తో చేతులుకలిపారు. పంజాబు, బెంగాల్‌లలో మతతత్వవాదులతో కత్తుకలిపారు. "ఎప్పటి కెయ్యది ప్రస్తుతమో" అన్నవిధంగా వారు వ్యవహరిస్తున్నారు. ఇది భారత రాజ కీయరంగంలో వినాశనాన్ని తెచ్చిపెట్టుతుందని నా భయం. దీనినుంచి బాపూజీ మనలను గణనీయంగా కాపాడారని నా విశ్వాసం. బాపూజీ అనుయాయులుకూడా ఇదేపని చేస్తున్నారన్నసంగతి నాకు తెలుసును. పోతే, వారిమధ్య తరతమ స్థాయీభేదంమాత్రమే వుంది. సోషలిస్టు మిత్రులు ఈవిషయంలో అందరికన్నా తలదన్నుతారని నా అభిప్రాయం. నా అభిప్రాయం పొరపాటుకావచ్చు. కాని నియమంలేని, పతితమైనజాతి చాలా ప్రమాదకరమైనదవుతుంది. సోషలిస్టులు చేస్తున్నది దానికే దారి తీస్తుంది.

అందుచేత సిద్ధాంతరీత్యా బాపూజీకి సన్నిహితంగావున్నపార్టీలో నేను చేరడం సహజం. గతసంవత్సరం ఆ పార్టీతో లోపలనుంచి నేను జరిపినపోరాటం నా సోషలిస్టుమిత్రులకు తెలియనిదికాదు. అయితే ఈనాడు ఆ పార్టీమాత్రమే నిర్మాణాత్మకమైనకార్యక్రమాలను నిర్వహించ గలిగినదిగా వుంది. దానిలో ఏ బలహీనతలున్నా ఇదిమాత్రం నిజం. బాపూజీ భావాలకు కట్టుబడుతున్నవారు వారే, భారతరాజకీయాలలో బాపూజీఅవసరాన్ని గుర్తించినవారూ వారే. లక్నోలోజరిగిన ఒకసంగతి చెప్పితే మీకు విస్మయంకలుగవచ్చును; భూలాభాయ్‌ని కాంగ్రెసు కార్య వర్గంలోకి తీసుకోబోతున్నారని తెలియగానే, నేను జయరామ్‌దాస్‌తో సంప్రతించాను. మేమిద్దరంకలిసి బాపూజీవద్దకు పరుగెత్తాం. వల్లభాయ్ కూడా అక్కడే వున్నారు. ఈవిషయంలో మా అభిప్రాయాలేమిటో

కుంపటబద్దలుకొట్టినట్లు వ్యక్తంచేశాం. జమ్నాలాల్‌జీ కూడా అక్కడే వున్నారు. పార్లమెంటరీబోర్డు రద్దయినది కనుక, పార్లమెంటరీపక్షం నుంచి ఒకరు కార్యవర్గంలోవుండక తప్పదని బాపూజీ చెప్పారు. ఏమైతే నేం, మేము బాపూజీనిగాని, వల్లభాయ్‌నిగానీ, సేట్‌జీగాని ఒప్పించలేక పోయాం. కాని, సోషలిస్టుమిత్రులను కార్యవర్గంలో జేర్చినందుకు మేము అసలు అభ్యంతరమే తెల్పలేదు.

గత రెండుమూడేళ్లగా నా ఆలోచనాధోరణి ఏవిధంగా రూపొందుతూవచ్చిందో స్పష్టంగా విశదీకరించడానికి నేను ప్రయత్నించాను. నేను ఇందులో వ్రాసినవిషయాలు మీకు నచ్చగలవని అనుకోవడంలేదు. అయితే మీ పట్ల నాకు అనురాగమూ, గౌరవభావమూ వుందన్నసంగతి ఈ లేఖద్వారా మీరు గ్రహించగలిగితే నాకు అంతే చాలు. రాజకీయ రంగంలో బాపూజీని మినహాయిస్తే, మీకన్నా ప్రేమపాత్రులూ, గౌరవ నీయులూ నా కెవరూలేరని గుండెమీదచేయివేసుకొని చెప్పగలను.

ఇంత దీర్ఘమైనలేఖ వ్రాసినందుకు నేను చింతించడంలేదు. పైగా, ఇందులో అన్నివిషయాలు వివరంగా పేర్కొనడానికి వీలులేక పోయిందని అనుకుంటున్నాను. కనుక మనమధ్య వివరమైన చర్చలు జరగడానికి ఈ లేఖ ప్రాతిపదికగా ఉపయోగపడితే సంతసిస్తాను. ఉత్తరోత్తరా నేను ఏవిధమైన రాజకీయచర్య తీసుకోవలసివచ్చినా, వ్యక్తిగతంగా మీపట్ల నాకుగల అనురాగాన్ని మీరు సందేహించకుండా ఉండడానికి ఇది తోడ్పడినా నేను సంతృప్తిపడతాను.

సదా మీ

జీవత్

152. సుభాష్ చంద్రబోస్ వద్దనుంచి,...

కేరాఫ్ సూపరింటెండెంట్ ఆఫ్ పోలీసు,
డార్జిలింగ్,
30 జూన్ 1936

ప్రియమైన జవహర్,

ఈ నెల 22వ తేదీన మీరువ్రాసిన లేఖ 27వ తేదీన నాకు చేరింది, సంతోషం. పత్రికలలో వస్తున్నదానినిబట్టి మీరు మితంతప్పి పనిచేస్తున్నట్టు తోస్తున్నది. మీ ఆరోగ్యాన్నిగురించి నేను ఆందోళనపడుతున్నాను. కొద్దిరోజులపాటే అయినా, విశ్రాంతికోసం మీరు ముస్సోరీ వెళ్ళటం నాకు సంతోషదాయకం. పరిమితంగా పనిచేయటం మీకు సాధ్యంకాదన్నసంగతి నాకుతెలుసు. అయినా మీరు పనిలో పడిపోయి, ఆరోగ్యాన్ని పాడుచేసుకోరనే ఆశిస్తాను. మీ ఆరోగ్యం చెడిపోతే, దానివల్ల ఎవరికీ లాభంలేదు.

మీ బావమరిది రంజిత్‌ను గురించి మీరు తెలియజేసిన సంగతులు విచారం కలిగిస్తున్నాయి. అయితే అంత ప్రమాదంలేదని డాక్టర్లు చెప్పుతున్నందువల్ల కొంత ఊరటకలుగుతోంది. విశ్రాంతితీసుకొని, అతను పూర్తిగా కోలుకుంటాడనే ఆశిద్దాం. నేను ఇక్కడ క్షేమంగానేవున్నాను. కడుపుపేగుల్లో ఏదోకొద్దిగా బాధగావుంది. ఫ్లూజ్వరం కొద్దిగా సోకింది. (ఇది గొంతుకుమాత్రమే తగిలినట్టుంది.) ఇది త్వరలోనే నయమైపోవచ్చు.

మీ లైబ్రరీలో యీ క్రిందిపుస్తకాలు వుంటే, మీకు వీలుంటే, ఒకసారి పంపించండి. వాటిని దఫాలువారీగా ఒకటిరెండుచొప్పున పంపుతూండండి;

1. గోర్డాన్ ఈస్ట్ రచించిన ఐరోపా ఖండపు చారిత్రక భూగోళం.
2. పిట్ రివర్స్ రచించిన సంస్కృతుల సంఘర్షణ - జాతుల సమ్మేళన"
3. జె. ఎ. స్పెండర్ రచించిన "వర్తమాన సంక్షిప్తచరిత్ర"

4. రజనీపామీదత్తు రచించిన "ప్రపంచ రాజకీయాలు- (1918 - 35")
5. జె. బి. ఎస్. హాల్డేన్ రచించిన "విజ్ఞానశాస్త్రం భవిష్యత్తు"
6. హక్స్లీ రచించిన "ఆఫ్రికా దృక్పథం"
7. రాల్ఫ్ ఫాక్స్ రచించిన చెంఘీజ్‌ఖాన్.
8. వార్నే రచించిన "సామ్రాజ్యం కర్తవ్యం"

ఇటీవల ఇంకా ఏవైనా మంచిపుస్తకాలు వెలువడితే వీటికి బదులు వాటిని మీరు పంపించండి. ఉత్తరాలుకాని, పుస్తకాలు కాని కేరాఫ్ సూపరింటెండెంట్ ఆఫ్ పోలీసు, డార్జిలింగ్ పేరిట పంపండి.

ప్రేమతో,
సుభాస్.

పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ
అల్హాబాద్.

సెన్సార్ చేయబడి, ఆమోదించబడింది.
(సం) సూపరింటెండెంట్ ఆఫ్ పోలీసు.
డార్జిలింగ్,

155. మహాత్మా గాంధీవద్దనుంచి.

సెగాన్,
నేను దీని ఇంకా పంపించలేదు. 15 జూలై, 1936

ప్రియమైన జవహర్‌లాల్,

1. టైమ్స్ ఆఫ్ ఇండియా'లో ప్రచురితమైన లేఖనుగురించి నేను పంపిన తంతి నీకు అందేవుంటుందని ఆశిస్తాను. దానిని నిన్న సంపాదించాను. పూర్తిగా చదివాను. ఆ విషయంగురించి ఇంతవరకు ఎవరూ నాకు రాయలేదు. ఆ లేఖనుగురించి న్యాయశాస్త్రరీత్యా నీవు చర్యతీసుకోవాలని నేను భావిస్తున్నాను.

2. నీవు నన్ను అపార్థంచేసుకోకుండా వుండేటందుకు ఒకమాట చెప్పాలి. రాజకీయసంస్థల సంఘంనుంచి నన్ను దూరంగావుంచేశాయి. శాసన

శక్తిసామర్థ్యాలు వారికి పూర్తిగా తెలుసు. ప్రజలలోను, యువకులలోను నీకు పలుకుబడి ఎంత హెచ్చుగా వుందోకూడా వారికి తెలుసు. నిన్ను త్రోసిరాజనటం సాధ్యంకాదని కూడా వారు ఎరుగుదురు. అందుకే వారు వై దొలగదలచారు.

ఈ వ్యవహారమంతా విషాదాంత—సుఖాంతమైన అంకంగా నేను పరిగణిస్తున్నాను. అందుచేత నీవు దీనినిగురించి అంతగా పట్టించుకోకు. దీనిని అఖిలభారత కాంగ్రెసుసంఘంముందుకు తీసుకువెళ్లితే నాకు అభ్యంతరంలేదు. అయితే, దీనిని బలపరచాలని ఎ. ఐ. సి. సి. పై ఒత్తిడి తేవటమే నా విన్నపం. కుటుంబకలహాలను తీర్చే బరువు భారాన్ని, నీవా, వారా అన్నవిషయాన్ని తేల్చే కర్తవ్యాన్ని ఎ. ఐ. సి. సి. నెత్తిన పెట్టరాదు. ఆ బరువుభారం వహించగలిగినశక్తి దానికి లేదు. ఎ. ఐ. సి. సి. ముందుకు వెళ్లటానికి పూర్వం అన్నివిషయాలు తేల్చుకొని మరీ వెళ్లు.

అన్ని ఉపసంఘాలలోను మెజారిటీవర్గానికి మెజారిటీవుంటే నీ వెందుకు చింతిస్తావు? అలా మెజారిటీవుండటం సహజమేగదా. వారంతా నిన్ను ఏకగ్రీవంగా ఎన్నుకోబట్టే నీ వీనాడు అధికారపదవిలో వున్నావు. నీ వింకా అధికారంలోకి రాలేదు. తొందరగా నిన్ను అధికారంలోకి తేవటానికే ముందు నిన్ను అధికారపదవిలోవుంచటం జరిగింది. మరొకవిధంగా అయితే నీవు అధికారంలోకిరావటానికి ఇంకా హెచ్చుకాలం పట్టివుండేది. ఏదిఏమైనా ముళ్ల కిరీటాన్ని నీ శిరస్సుకు అలంకరించాలని నేను సూచించినప్పుడు, నా మనస్సులో పై ఉద్దేశం మాత్రమే ప్రధానంగావుంది. నెత్తికి గాయాలువడినా ఆ కిరీటాన్ని తీసి వేయకు. కాంగ్రెస్సభావేశాలలో తిరిగి నీ హాస్యోక్తులధోరణి ఆరంభించు. అదే నీ సహజమైనపాత్ర. అంతేకాని, చికాకుపడటం, చీటికిమాటికి మండిపడటం నీకు పొత్తిగా తగినదికాదు.

ఈ లేఖ చదివినప్పుడు నీవు సంతోషసంబరాలమధ్య తేలి పోతావా? ఆ విషయాన్ని నాకు తంతిద్వారా తెలియజేస్తావని ఆశించమంటావా? లాహోర్‌లో ఉగాదిసందర్భంలో తిరిగి, జెండాచుట్టూ నీవు

నిర్ణయించిన ఆ ఉపవాసం సరియైనదా? అదేవిధంగానే ఇప్పుడూ స్వాగతం చేస్తావుకదా?

నీ గొంతుకకు కొత్త విశ్రాంతియివ్వాలి.

నా ప్రకటనను తిరిగి రాస్తున్నాను. నీవు దానిని చూసేదాకా, దానిని నేను ప్రకటించబోను.

మహాదేవ్ మినహాయించి ఇంకొకరెవరూ మనిద్దరిమధ్య నడుస్తున్న ఉత్తరప్రత్యుత్తరాలు చూడరాదని నేను నిశ్చయించాను.

ప్రేమతో,
బాపూ.

## 154 ఎర్నెస్ట్ టాలర్ దగ్గరనుంచి

లండన్,
జులై 21, 1936,

ప్రియమైన నెహ్రూ,

మీ జాబు అందింది. ధన్యవాదాలు. గతవారం సమీపంలో మనిద్దరి పేర్లు ప్రస్తావించటం నాకూ గర్వకారణంగానే వుంది. మీ ఆత్మ కథ చదివినప్పుడు నాలోకలిగిన భావాలేమిటో చెప్పమంటారా? నేను చదివినవాటిల్లోకల్లా ఉత్కృష్టమైన ఆత్మకథ మీదే. అందులో ఒకమహా పురుషుణ్ణిమాత్రమే కాక, అంతటి. బహిర్శృంఖలాలను ఛేదించుకోటానికి మీ ప్రజలు సాగిస్తున్న ప్రశంసనీయమైన పోరాటాన్నిగూడా దర్శించాను. దానిని చదువుతుంటే మనుష్య బంధాలు ఎంత బలీయమైనవా అనిపించింది. బందిఖానాలో బంధితులుగావున్నవారిమధ్య నిజాని సౌభ్రాతృత్వం వృద్ధిచెందుతుందని నేను అప్పుడప్పుడు అనుకొంటుంటాను. వారిమధ్య ప్రభుత్వానికి బాధలే ప్రాతిపదిక. జైలుజీవితం న్యాయయుతమోశక్తిని పరిపుష్టం చేస్తుంది.

ఇందిర క్షేమసమాచారాలకోసం నేనూ, నా భార్య ఆతురతతో ఎదురుచూస్తున్నాం. మమ్మల్ని చూసేందుకు ఆమె వస్తే మేము

ఎంతో సంతసిస్తాం. నేను ఈమధ్య రచించిన కొత్తనాటకంలో నా భార్య కూడా వేషంవేసింది. ఆ నాటకంపేరు "ఇంకెక్కడ శాంతి?" ఆ నాటకం ప్రేక్షకుల ఆదరాభిమానాలను అపారంగా చూరగొనగలిగింది. బహుశా వచ్చేశీతాకాలంలో ఆమె లండన్‌లో జరిగే నాటకప్రదర్శనాలలో పాల్గొన వచ్చు. సెప్టెంబరునెలాఖరులో నేను అమెరికా వెళ్లబోతున్నాను. అక్కడ ఈ క్రింది అంశాలపై ప్రసంగిస్తాను.

"హిట్లరువాగ్దానం ; వాస్తవం"

"మా కర్మకు మీరే కర్తలా?"

"ఆధునిక నాటకరంగం."

ఐరోపాలోని పరిస్థితినిగురించి ఈలేఖలో నేను అంతగా రాయ దలచిన అగత్యం లేదనుకొంటాను. అన్నివిషయాలు మీకూ తెలుసు. నానాజాతిసమితిలోని అంతర్గతబలహీనతలు అంతకంతకు మరింతగా ప్రస్ఫుటమవుతున్నాయి. వాటిని ఫాసిస్టునియంతలు చక్కగా వినియో గించుకొంటున్నారు. యూరప్‌లో ఫాసిస్టుమూకకు, ప్రజాస్వామికశిబిరా నికి మధ్య అంతిమపోరాటం అనివార్యం. కాగా, ప్రజాస్వామికదేశాలు స్పష్టమైన కార్యక్రమంపైన, సంకల్పసిద్ధిలోను ఐక్యమవుతాయా లేదా అన్నదే సమస్య. ఆ దేశాలు అలా ఐక్యంకానినాడు అవి దేనినైతే నివారించాలని అనుకొంటున్నామో, దానినే చేజేతులా తెచ్చిపెట్టు కొన్నవి కాగలవు. తొందరలోనే యుద్ధం తప్పకపోవచ్చు. దురదృష్ట వశాత్తు పరిస్థితి నేర్పే గుణపాఠాలను ఎవరూ గ్రహించటంలేదు. జర్మన్ ప్రజాస్వామ్యం చాలా [illegible] అంతర్యుద్ధాన్ని నివారిం [illegible] అది హిట్లరు హింసాత్మకపథకాలను ఒకదానితర్వాత మరొక దానిని [illegible] అందుచేత జర్మన్ ప్రజాస్వామికవాదులు తమ గోతులను తామే తవ్వుకొంటున్నారు.

మీ వ్యాసాన్ని కడు శ్రద్ధాసక్తితో చదివాను. పాలస్తీనాలోని [illegible] మీరు వెలిబుచ్చిన అభిప్రాయాలతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. రెండువైపులా ప్రమాదాలు వున్నాయి ; జాతీ [illegible] కొట్టుకుపోతున్న యూదుజాతీయవాదులు వర్త

మానవజాతికిచెందిన ఆదర్శాలపై విశ్వసించే స్వభావం వుంది. అలాగే ఫాసిస్టు విధానానికి లోనైన అనేక జాతీయవాదులు అసలు సమస్యను గ్రహించలేక సిద్ధాంతపు పట్టుదలతో వ్యవహరించే స్వభావమూ వుంది.

మీ గ్రంథం నా దేశంలో అనేకమంది దృష్టిని ఆకర్షించగలిగింది. వివరాలకు ప్రత్యేకమైనదైన మీ గ్రంథాన్ని పంపుతున్నాను.

కొన్నాళ్ళ క్రితం బొంబాయి సభలో ఒక సుప్రసిద్ధవ్యక్తిని కలుసుకోటం నాకు సంభవించింది. ఆయన అప్పటికే మీ గ్రంథాన్ని రెండుసార్లు చదివారట. సిద్ధాంతరీత్యా, ఆపైనా....

మీ

ఎర్నెస్ట్ టాలర్.

155. క్రిస్టియానా టాలర్ వద్దనుంచి..

లండన్,

ఆగస్టు 27, 1936

ప్రియమైన నెహ్రూ,

నిన్న మీ కుమార్తె ఇందిర మా యింటికి వచ్చింది. కలిసి భోంచేశాం. అయితే దురదృష్టవశాత్తు శ్రీ టాలర్ యింటివద్ద లేరు. అమెరికా ప్రయాణానికి అవసరమైన వీసా సంపాదించటంకోసం ఆయన అమెరికన్ కాన్సల్ కార్యాలయానికి వెళ్ళారు. వీసా సంపాదించటంలో ఆయన కొన్ని యిబ్బందులు ఎదుర్కోవలసివచ్చింది. ఇందిరను కలుసుకోలేకపోయినందుకు ఆయ నెంతో ఆశాభంగం పొందారు.

నేను ఆమెను కలుసుకోగలిగినందుకు ఎంతగానో ఆనందించాను. ఆమె కేవలం అందమైనది మాత్రమే కాదు. ఆమెలో ఉట్టిపడుతున్న నాకు నైర్మల్యమే ద్యోతకమైంది. అందుకనే ఆమెతో ముచ్చటించటం ఎవరికయినా ఆనందదాయకమే. ఆమె నా కంటికి ఇప్పుడిప్పుడే కుసుమించుతున్న పుష్పంవలె గోచరమైంది. గాలికి కొట్టుకుపోతుందా అనిపించింది. కాని గాలినిచూసి ఆమె భయపడే వ్యక్తిలాగా కన్పించలేదు.

మీ జీవితగాథను ఇప్పుడే చదవటం ప్రారంభించాను. శ్రద్ధాసక్తిని రేకెత్తించింది.

హృదయపూర్వకమైన ధన్యవాదాలు.

మీ
క్రిస్టియానా టాలర్

మన హృదయపూర్వకమైన అభివందనాలు

భవదీయుడు
ఎర్నెస్ట్ టాలర్

156. మహాత్మాగాంధీదగ్గరనుంచి.....

సెగాన్
జూలై 30, 1936

ప్రియమైన జవహర్‌లాల్,

నీవు 'పిచ్చి పిచ్చి' కార్యక్రమాలన్నింటినీ కట్టిపెట్టి, సామూహిక శ్రేయస్సుకోసం నీ శక్తిని కూడబెట్టగలవని ఆశిస్తాను.

నీవు నీ హాస్యధోరణిని విడనాడకుండా, నిర్ణీతకాలపరిమితి నంతలోను ప్రస్తుత పదవిలోనే కొనసాగించాలని నీవు గట్టిగా నిర్ణయించుకున్నపక్షంలో, ప్రస్తుత కార్యవర్గంతో కాలక్షేపంచేయడం సాధ్యమనే నా ఉద్దేశం. నీ కార్యవిధానాన్ని యితరులచేత అంగీకరింపచేయటానికి నీవు శాయశక్తులా పనిచేసుకోనూవచ్చు. భవిష్యత్తునుగురించి, వచ్చే సంవత్సరపు ప్లానులనుగురించి ఆలోచించవలసిన సమయం ఆసన్నమైంది. ఏమిజరిగినా నీవుమాత్రం ప్రతిపక్షంలో జేరరాదు. ఇదే నా నిశ్చితాభిప్రాయం. నాన్నగారివలెనే, మొత్తం కాంగ్రెసు వ్యవహారాలన్నింటినీ స్వయంగా చూసుకోటానికి నీవు యిప్పుడు సిద్ధంగావుంటే, అప్పుడు నీ సహచరులు ఎవరూ అడ్డుచెప్పబోరనే అనుకొంటాను. బొంబాయిలో అంతా సజావుగానే సాగిపోతుందని ఆశిస్తాను.

కమలా స్మారకనిధి గొడవ నన్ను ఆందోళనపరుస్తోంది. విరాళాలు ఎంతవరకు వసూలుఅయినవో, ఆ పథకం ఏ స్థితిలోవుందో

తెలిసినంతవరకు, నామేధస్సు క్షీణదశలోపడినదని అనుకోటానికిపీల్లేదు. కనీసం నీవైనా నాకు అర్థమయ్యేటట్టు, విషయాలను విడమర్చి చెప్ప రాదా? అసలు నీ ఉద్దేశమేమిటో స్పష్టంగా చెప్పు. నీలో నేను ఏకీభ వించకపోవచ్చు. అలాఅని చెప్పగలిగిన స్థితిలో నేనుండాలిగదా. నిన్నటి సంభాషణకు నీ ఉద్దేశంఏమిటో నా కేమాత్రం బోధపడిలేదు. బహుశా నావలెనే ఇతరులకుకూడా నా వుద్దేశం అవగతమైవుండకపోవచ్చు. యిప్పుడే ఈవిషయమై రాజాతో చర్చిస్తున్నాను. నీకు వీలుంటే నా కార్యక్రమాన్నిగురించి అతనితో ఒకసారి చర్చించమని నా సలహా. అసలే తీరికలేనప్పుడు సుదీర్ఘమైనలేఖ రాయటం మంచిదికాదు. నా ఉద్దేశాన్ని నీవు గ్రహించేవుంటావని తలుస్తాను.

ప్రేమలో,

బాపూ.

158. ఎడ్వర్డ్ థామ్సన్ వద్దనుంచి

హోటల్ సెసిల్

ఢిల్లీ

1936 అక్టోబరు 26

ప్రియమైన నెహ్రూ,

ప్రభుత్వం నా ఉత్తరాలను ఎందుకోగాని, ఒకకంటకనిపెడు తున్నది. (ఈదేశంలో "దేశద్రోహం" చాలా తక్కువ స్థాయిలో వున్న ట్టుంది. అందుచేత నా యీ లేఖ మీకు చేరటంలో జాప్యం జరుగుతుం దనడంలో నాకు సందేహంలేదు. అందుకే తొందరగా రాస్తున్నాను.)

దేశద్రోహిగా పేరుపొందిన రైట్ ఆనరుబుల్ సర్ తేజ్ బహ దూర్ సప్రూగారితో అలహాబాద్‌లో రెండు మూడురోజులు గడపదోతు న్నాను. అక్టోబరు 29నో లేక 31నో నేను అలహాబాద్ చేరుకోగలనను కొంటాను.

మీరు అలహాబాద్‌లో ఎప్పుడు వుండేది కాస్త సప్రూకు తెలియ జేస్తారా?

నేను ఖచ్చితంగా అల్హాబాద్‌కు ఎప్పుడు చేరుకుంటానో చెప్పలేను. ఎందుకంటే. నెహ్రూ వీలునిబట్టి, నేను అక్కడకు రావటం ఆధారపడి వుంటుంది. ఏ విషయమూ ఎల్లుండికిగాని తెలియదు. ఒకరోజులో చేర వలసిన ఉత్తరాలు, నాలుగైదురోజులకుగాని నాకు చేరటంలేదు.

ఈ ఉత్తరం మీకు చేరటానికిపూర్వమే దీనిని చదివే పెద్దమనిషి చాలా బుద్ధిమంతుడై వుంటాడని, ఆశిస్తాను. ఈ లేఖను తిరగరాసుకొని, వెంటనే దీనిని మీకు పంపించగలడనే భావిస్తాను.

భవదీయుడు,

ఎడ్వర్డ్ థామ్సన్

తాజాకలం: అన్నట్టు ఒక లండన్‌పత్రికనుంచి నాకు ఆహ్వానం వచ్చింది, ఏదైనా తమకు రాసిపెట్టమని. దేనినిగురించి రాద్దామా అని యోచిస్తున్నాను. భారతప్రభుత్వంయొక్క దేశద్రోహస్థాయిని గురించి వ్యాసంవ్రాసి దానికి పంపించాలనుకొంటున్నాను. భారతదేశంతో నాకు గల 26 సంవత్సరాల పరిచయాన్ని ప్రస్తావించుకొని వ్యాసం వ్రాస్తే అది చదవటానికి గమ్మత్తుగానే వుండవచ్చు.

## 159. ఎడ్వర్డ్ థామ్సన్‌వద్దనుంచి

30 అక్టోబరు 1936

ప్రియమైన నెహ్రూ,

రేపు 18.38 గంటల రైలుకు నేను కలకత్తాకు బహుశా బయల్దేరవచ్చు. ఈ తొందరలో ఇక్కడ కూర్చొని రాయటం కష్టంగావుంది. రాత బాగా సాగటంలేదు. ఉపోద్ఘాతంపాఠంతో రాసినదానిని మీకు పంపుతున్నాను. అది ఏమీ బాగాలేదు. తీరికవుంటే ఇంకా బాగా రాయగలేవాడిని. అయితే దానిని మీరు ఇప్పుడే చూడటం ఎంతో అవసరం. లేకపోతే, సి. ఐ. డి. పానకంలోపుడకలాగా అవలు దానిని మీకు చేరకుండాచేస్తారు.

దానితోపాటు, మరికొన్ని ప్రశ్నలనుకూడా మీకు పంపుతున్నాను. ఇంగ్లాండులోని మీ మిత్రులు ఆ ప్రశ్నలకు మీ సమాధానాలకోసం ఎదురు చూస్తారు. ఆ ప్రశ్నలుకూడా అంత బాగా నేను రూపొందించలేక పోయాను. కనుక మీరు సమాధానాలుఇచ్చేసందర్భంలో కాస్త జాగ్రత్త తీసుకోండి. అపార్థాలకు దారితీసే ప్రశ్నలు ఏమైనావుంటే, సరిదిద్దండి. ఒకవేళ ముఖ్యమైన ప్రశ్నలను నేను వదిలిపెడితే, మీరు వాటికికూడా సమాధానాలు ఇవ్వవచ్చు.

ఇదంతా చాలా మొరటుగా కన్పించవచ్చు. అయితే నేను అడపా తడపా (చాలా పెద్ద) పాత్రికేయుణ్ణి మాత్రమే.

కొంతకాలంక్రితం 'న్యూస్‌క్రానికల్'లో నేను రాసిన వ్యాసంలో ఈ క్రింది అంశాలు పేర్కొన్నసంగతిని మీ దృష్టికి తేవలసివుంది. (1) కాంగ్రెసు చివరకు రాజ్యాంగాన్ని అమలుజరపటానికి అంగీకరిస్తుంది. (2) గాంధీజీకి రాజకీయరంగంలో ఇక ప్రథమస్థానం ఉండక పోవచ్చు. (ఇవి పొరపాటుఅయితే, అందుకు హెచ్చుగా బాధ్యతవహించ వలసింది ఆయనే. ఎందుకంటే, నాకు నేను ఆయనమిత్రుడని ఆయనే చెప్పారు. పూర్తి అవకాశం ఇవ్వలేదు!) (1) కాంగ్రెసు రాజ్యాంగాన్ని అమలుజరపటానికి పూనుకొనప్పుడు, అది పూర్తిగా మారిపోయింది; ఇంతకుముందున్న కాంగ్రెసు ఉండనే ఉండదు. కనుక కాంగ్రెసు అదృశ్యంఅయిపోతుంది.

ఈ విషయాలలో నేను పూర్తిగా పొరపాటుపడ్డానని అంగీకరించటానికి నేను సిద్ధంగానేవున్నాను. అయితే నేనుచెప్పినవాటిల్లో వాస్తవం కొంత లేకపోలేదు.

నేను వ్రాసిన మరొకదానినికూడా దానితో జతపర్చి పంపుతున్నాను. దీనిని ప్రచురణకోసం ఉద్దేశించలేదు. ఈ దేశంలో కాలుపెట్టగానే దానిని రాశాను. నా భావాలు ఎలాంటివో అందులో మీకు బోధపడగలవు. నేను కేవలం 'మితవాది' ననుకొంటాను.

చదివినతర్వాత దయచేసి దానిని చించిపారవేయండి. అది ఇక ఎందుకూ పనికిరాదు. దానికి కాలదోషంపట్టింది. దానినింకా వుంచి వదలడం పొరపాటే అని ఇప్పుడు గ్రహించాను.

భవదీయుడు,

ఎడ్వర్డ్ థాంప్సన్.

రాజాకాలం ; మీ సమాధానాలకు సంబద్ధపేస్తే, వాటి వివరాలు తెల్పండి. భారతస్వాతంత్ర్యోద్యమానికి నేను ప్రధానంగా మిత్రుడినన్న మాట గుర్తుంచుకోమని మనవి. నా మనస్సుకు నచ్చితే, దానికోసం నేను గట్టిగా నిలబడగలను. విభేదిస్తున్నప్పుడు ఆ పని నేను చేయలేను. నటన నాకు చేతకాదు.

160 ఎడ్వర్డ్ థాంప్సన్‌నద్దనుంచి.

16, సుడ్డర్ స్ట్రీట్,
కలకత్తా.
1 నవంబరు 1939.

ప్రియమైన నెహ్రూ,

మీరు పంపిన పుస్తకాలు అందాయి. చాలా సంతోషం.

అయితే వాటిపై మీరు నాపేరు రాయలేదు.

నేనుకూడా ఏమైనా పుస్తకాలు పంపించవచ్చునా అని అడిగితే మీరు వద్దు అన్నారు. చాలా చింతించవలసిన విషయం. మెసపొటేమియన్ యుద్ధాన్ని గురించి నేను రాసిన నవలమాత్రం చదవటానికి చాలా బాగుంటుందని చెప్పగలను.

గాంధీనిగురించి నేను అదనంగా చెప్పవలసిందిలేదుగాని, ఒక విషయం చెప్పాలి. శాసనధిక్కారోద్యమం దాదాపు విజయవంతమైనప్పటికీ, విఫలమైంది. అందుచేత, గాంధీ మరొక క్రొత్త సందేశాన్ని కనుగొనాలి. లేకపోతే ఆయన కేవలం బలీయమైన గణపతిగామాత్రమే మిగిలిపోయే ప్రమాదంవుంది. ఆ గణపతి గణాలను రెచ్చగొట్టగలడే

గాని, ఆ గణాలకు నిర్దిష్టమైన లక్ష్యాలను రూపొందించలేదు. భారత దేశాన్ని పట్టుకుపీడిస్తున్న అరిష్టాలలో ఒకటైన సంస్థానాధీశుల సంగతి గురించి ఆయన అంతగా పట్టించుకొంటున్నట్టు కన్పించదు. ఆయన మితవాది.

నేను ఇంకొంతముందుగా కలుసుకొనగలిగివుంటే 'న్యూస్ క్రానికల్'లో నేను రాసిన వ్యాసాలు మరొకవిధంగా వుండేవి. ఏమైనా కేవలం కాంగ్రెసువాదులతోమాత్రమే కలిసి తిరిగితే, కాంగ్రెసుబలాన్ని గురించి అధికమైన అంచనావేయటానికి అవకాశంవుందని భావిస్తాను. కొంతమంది యువకిశోరాలు నిన్న నన్ను చుట్టుముట్టి. చాలా గొడవ చేశారు. నేను కేవలం మితవాదులనుమాత్రమే కలుసుకొన్నానని వారి ఆరోపణ. వారి ఆరోపణకు నేను పైనపేర్కొన్నది కొంతవరకు సమాధానంగా ఉపయోగపడుతుందనుకొంటాను.

ఈనాడున్న వాస్తవవిషయాలు ఇవి అని నేను అనుకొంటున్నాను. (1) ఈనాడు పాలకశక్తులబలం గతంలోకన్నా పాలితశక్తుల బలంకన్నా, ఎన్నోరెట్లు ఎక్కువగావుంది; (2) దమననీతి స్థాయి అపారంగా పెరిగింది. మీ ఎత్తుగడలు పెద్దవని చెప్పటంలో నా ఉద్దేశమేమిటంటే, మీకు వ్యతిరేకంగావున్న శక్తులు (అన్నిచోట్లా స్వాతంత్ర్యానికి ప్రతికూలంగా) మరింత కరకుతనం వహించటానికి మీ ఎత్తుగడలు ఉపయోగింపాయి. ఆ శక్తులు ఇప్పుడు మరింత బలపడ్డాయి. జరిగిపోయిన ఘటనల మంచిచెడ్డలను తేల్చటం నా పనికాదు. జరిగిన దానికి ఇతరులపై నెపంవేయటంకూడా నా ఉద్దేశం ఎంతమాత్రం కానేకాదు. రోజూ పత్రికలలో పడుతున్నవార్తలు వ్యక్తంచేస్తున్న వాస్తవాన్నిబట్టి అయినా, మనకుమనంగా మోసంచేసుకోగూడదనే నేను చెప్పదలచుకొన్నాను. ఎవరైనా తమ నాశనాన్ని తామే చేజేతులా తెచ్చుకొంటారా?

భవదీయుడు

ఎడ్వర్డ్ థామ్సన్

161. ఎడ్వర్డ్ థామ్సన్ నుండి,

స్కార్‌బాజ్, బోర్స్‌హిల్
ఆక్స్‌ఫర్డ్,
24 నవంబరు 1936

ప్రియమైన నెహ్రూ,

అనేక ధన్యవాదాలు. మీకు పిలుపివ్వడం చాలా మంచిదైంది.

నేను ముసలివాణ్నయిపోతున్నాను. అదీగాక నా దేశంలోను, పశ్చిమదేశాలలోను జరిగే విషయాలతో నేను ఎంతగానో నిస్పృహ చెందాను; విచారగ్రస్తుడనయ్యాను. అందుచేత నా శేషజీవితాన్ని నా మాతృదేశ వ్యవహారాలపైన మాత్రమే కేంద్రీకరించి పనిచేయాలని నిశ్చయించుకున్నాను. భారతదేశ పురోభివృద్ధికి సాయపడాలన్న దృష్టితో నేను ఇరవై ఆరేళ్ళపాటు కృషిచేశాను. అలా చేయడం ధర్మం అని నమ్మి నేను పనిచేశాను. అదంతా వృథా శ్రమ అని ఇప్పుడు తేలింది. భారతదేశాన్ని గురించి మథనపడే ఏ ఆంగ్లేయుడైనా శుద్ధ తెలివితక్కువ దద్దమ్మ అని యిప్పుడు గ్రహించాను. భారతీయుల తీర్పు అదే. వారి తీర్పు సరైనదనడంలో సందేహంలేదు. కొంతమంది విదేశీయులను మాత్రమే మీ దేశ ప్రజలు మిత్రులుగా ఆమోదిస్తారని అనుభవంలో తెలుసుకొని ఆశ్చర్యపడ్డాను. భారతీయులు తమ మిత్రులుగా ఆమోదించే విదేశీయులు భారతీయమయిన ప్రతిదానినీ ఆదేవనిగా మెచ్చుకొంటారు. అది వారి అదృష్టం. ధనం వ్యవహారాలు వారికి క్షుణ్ణంగా తెలుస్తాయన్నది నిజమేకావచ్చుననుకోండి. భారతదేశ ఆరాధకులైన ఆ విదేశీయులు నిష్ప్రయోజకులన్న విషయాన్ని భారతీయులు గ్రహించలేకపోతున్నారంటే, వాని అర్థం వారెంతో ప్రయోజకులై వుండాలని నేను అనుకోక తప్పదు. బహుశా వారి ప్రయోజకత్వం నా హ్రస్వదృష్టికి అందకపోవచ్చును; అసంఖ్యాకమయిన సెంటిమెంటలిస్టులూ, అంధవిశ్వాస ఉత్సాహవంతులూ కలిసి భారతదేశాన్ని అత్యంత హాస్యాస్పదమైన రూపంలో చిత్రించారు. (మీరు దీనిని కాస్త సహించవలసివస్తే!) బ్రిటను, యిరోపా,

అమెరికాదేశాలకుచెందిన అనేకానేకమంది పురుషులు (ఓ నెహూర్! చివరికు స్త్రీలుకూడా, లెక్కలేనంతమంది ఉన్మాదులు) 'భారతదేశం' పేరు చెబితేనే ఒళ్ళుపులకరించి గంతులువేయడం నేనుచూశాను. వీరి మేధ అధమస్థాయికి చెందినది. భారతదేశం బయట ఎవరూకూడా వీరిమాటలను పట్టుమని అయిదునిమిషాలసేపు విని సహించలేరు. ఎందుకూపనికిరాని దద్దమ్మలకు 'భారతదేశం' కల్పతరువుగా దొరికింది. భారతదేశాన్నిగురించి వారు వాగేచెత్తకు భారతదేశపత్రికలలో మొదటి పేజీలలో ప్రముఖస్థానం లభిస్తుంది. తద్వారా వారు కొంతవరకు ప్రపంచ ఖ్యాతికూడా పొందగలుగుతున్నారు. భారతదేశంపట్ల ప్రేమతోకాక గొప్ప కోసం వా రా పని చేస్తున్నారు.

మిమ్మల్ని చూస్తూవుంటే నాకు జాలివేస్తోంది. మనయిద్దరికిగల పరిచయం బహుస్వల్పం. అయినా మీరంటే నాకెంతో యిష్టం. మనిద్దరికి పరిచయం యింకా ఎక్కువగా వుండివుంటే, మనిద్దరం పరస్పరం అభిప్రాయాలను కలబోసుకొనివుంటే, మనిద్దరం మేధాసంపత్తిని యితోధికంచేసుకోవటంలో ఒకరికి మరొకరం సహాయంచేసుకొని వుండేవాళ్ళం. కాని దురదృష్టవశాత్తూ మనం వేరువేరుబాటలు చేపట్టకతప్పదు. "బాట బాటే; దానికి ఎక్కడో ఒకచోట అంతం అంటూ వుండకతప్పదు. నేనేమో నా శేషజీవితాన్ని ఆంగ్లకవిగా, నవలారచయితగా గడపతలుచుకొన్నాను. అదే నాకు అర్హమైనది. మీరేమో మీ అవివేకజనంకోసం మీ గుండెలను బద్దలుచేసుకొంటున్నారు. కొత్తదేవాలయంలో వెలసిన భారతమాత అనేదేవిని మీరు పూజచేయక తప్పని పరిస్థితిలో చిక్కుతున్నారు. అయినా మీరు కొంతవరకు వివేకాన్ని నిల్పుకోగలుగుతున్నారు, అది నేను గమనించాను. అందుకు మిమ్మల్ని మెచ్చుకొన్నాను. తిరువాన్కూరుమహారాజు హరిజనులకు విరర్థకమైనదానిని ప్రదానంచేస్తే, అది చూసి ఆదేవనిగా భుజాలెగరేసినవారిని ఏమనాలి? మీరుమాత్రం ఆత్మగౌరవాన్ని అపూర్వంగా నిలుపుకొన్నారు. అయినా మీరుమాత్రం దానిని ఎంతకాలం నిలబెట్టుకోగలరు? మహాత్మాజీచుట్టూ ముసిరినట్టే. మీ చుట్టూ అంతకంతకు అధికాధికంగా ముసురుతున్నారు. అది మీ కర్మ. కొన్ని

మైనవే. నన్నూ, నా భార్యను ఆమె స్నేహితులుగా పరిగణిస్తే, మేము గౌరవంపొందినట్లు భావిస్తాం. మేము నిజంగా ఆమెకు ఆప్తులమే.

రొంబాయినుంచి డిసెంబరు 5న పి అండ్ ఓ, 'మలోజా'లో ప్రయాణంచేస్తాను (చిల్లరమల్లరపనులు కొన్ని పూర్తిచేసుకున్నాను. రెండు చారిత్రిక రచనలను పూర్తిచేశాను) దానితో నాకు దాదాపు భారతదేశ వ్యవహారాలతో సన్నిహితసంబంధం సమాప్తమైనట్లే. ఆ వ్యవహారాలేమిటో నాకు అర్థంకానేకావు, అరవిందఘోష్ ప్రపంచానికి ప్రవచించిన కొత్త మతం (ఇంతవరకు వెల్లడించనేలేదు) ఏమిటో నాకు దురూహ్యంగానే వున్నది. అలాగే భారతదేశవ్యవహారాలుకూడా. అవి ఎలాగో ఒకలాగ కొనసాగకపోవు. మీకు వ్యక్తిగతంగా శుభం కలుగుగాక! మీరన్నది నిజం. పైనుంచి క్రిందదాకా ఆమూలాగ్రంగా ప్రతిభాగమూ సరికొత్త మూసతో కొత్తదాపు ఎత్తవలసిందే. అయితే మీ దేశంలో అన్నివర్గాలవారు (మా దేశంలోవారుకూడా) ఒక భాగాన్ని మాత్రమే సంస్కరించా లంటున్నారు. మిగిలినదాన్ని యథాతథంగా వుంచేందుకు శతధా పోరాడడానికి సర్వసన్నద్ధులై వున్నారు.

మీ సోదరిని అడిగానని చెప్పండి. నిండు హృదయంతో ఆమె నా కిచ్చిన ఆతిథ్యాన్ని చాలాకాలం గుర్తుంచుకొంటాను. నా భార్యతో ఆమెకు పరిచయంవుంటే ఎంత బాగుండుననిపిస్తోంది. మీరు మళ్ళీ ఆక్సుఫర్డు వచ్చినప్పుడు, ఆమెకూడా మీతోపాటు రాగలరని ఆశిస్తాను.

మీ,

ఎడ్వర్డ్ థామ్సన్.

## 162 ఎడ్వర్డ్ థామ్సన్ వద్దనుంచి

బోర్స్‌హిల్
ఆక్సుఫర్డ్,
డిసెంబరు 6, 1936,

ప్రియ నెహ్రూ,

మీరు నాకు వ్రాసినందుకు ధన్యవాదాలు. మనం కలుసుకోనక పూర్వమే, 'న్యూస్‌క్రానికల్'కు వ్యాసం వ్రాశాను. కాని, దురదృష్ట

పశాత్తు అందులోని ప్రధానసిద్ధాంతం సరియైనదే. నేను భారతదేశానికి బయలుదేరినప్పుడు, యూరోప్‌లోను, నా దేశంలోనూ కూడా ప్రజాస్వామిక ఆశయం దెబ్బతింటున్న సంగతి నేను గుర్తించాను. అయితే భారత దేశంలో నాదా ప్రజాస్వామిక ఆశయానికి అదే ముప్పుతెచ్చిపెడుతున్నదని నేను ఇప్పుడు గమనించాను. అదే చింతతో నేను భారతదేశాన్ని విడిచి వెళ్లుతున్నాను.

'న్యూస్ క్రానికల్'కు వ్యాసం వ్రాసిన సంవత్సరంలో, నేను ముఖ్యంగా మీ 'ఆత్మకథ'ను గురించే ఆలోచించాను. అందులో మీరు శాస్త్రిని గురించి చాలా నిర్దాక్షిణ్యంగా వ్రాశారన్నభావం చాలామంది పాఠకులకు కలగకమానదు. బహుశా మీరుకూడా దీనిని గుర్తించేవుంటారు. అది చాలా మంచి గ్రంథం. అందులో పెద్దలోపం అదే. నేను మీకు ఒనరించిన అన్యాయాన్ని సరిదిద్దడానికి 'న్యూస్ క్రానికల్'కు మరొక వ్యాసం వ్రాస్తాను.

శాస్త్రి నా మిత్రుడు. అంతేకాక, సమయం వచ్చినప్పుడు ఆయ నెంతో సాహసం ప్రదర్శించాడు. నా దృష్టిలో స్వదేశసంస్థానాల సమస్య నిజంగా అగ్నిపరీక్ష. ఆపరీక్షలో ఆయన నెగ్గాడు. గతరెండేళ్ళబట్టి నేను సాగించిన చారిత్రకపరిశోధనల ఫలితంగా నేను సంస్థానాధీశులకు ఆగర్భ శత్రువుగా తయారయాను. భారతదేశంలోను, ఇంగ్లండులోను, ఆగాఖాన్ చలామణీ అవుతున్న తీరు చూసి, మీరు ఆశ్చర్యచకితులైనట్లు మీరన్నారు. నేనూ అలాగే అమితాశ్చర్యం పొందాను. అయితే, మీదేశంలోని సంస్థానాధీశులు చలామణీ అవుతున్నరీతిని కాంచినా నేను అంతే "ఆశ్చర్యం పొందాను.

'న్యూస్ క్రానికల్'కు వ్రాసినవ్యాసంలో నెహ్రూ, అంబేద్కర్లను కూడా జాతీయ ఐక్యసంఘటనలోకి తీసుకురావడం సాధ్యమేనని అందులో వ్రాశాను. అది పొరపాటని నే నిప్పుడు గ్రహించాను. ఎందుకంటే, నెహ్రూ సోషలిజం గురించి తేనిపోని ఆందోళన చేస్తున్నాడు. పోతే, అంబేద్కర్ వర్గంలో ఇంకా దేశభక్తిభావం వృద్ధికాలేదు. మొదట ఒక

తప్పంపాటు వారు ఆర్థిక, సాంఘికన్యాయం అనుభవించితేగాని, వారిలో దేశభక్తి వృద్ధిపొందనేరదు.

కాని, మీకు మరొక మనవి. భారతదేశంపట్ల నా కేదో ద్వేషభావం వున్నట్లు మీరు అనుకొంటున్నారు. 'మదర్ ఇండియా' ఫక్కీలో నే నేదో నిందిస్తూ కాలంగడుపుతున్నట్లు మీరు భావిస్తున్నారు. మీ భావం పూర్తిగా పొరపాటు. "మోడరన్ రివ్యూ" వంటి పత్రికలలో పడిన వ్రాసాలనుబట్టి, నన్నుగురించి మీరు అలాంటి అభిప్రాయాలకువచ్చారు. ఇటీవలవాకా నేనుకూడా, చెప్పుడుమాటలనుబట్టి మిమ్మల్ని అలాగే అపార్థంచేసుకొన్నాను. నన్నుగురించి మీరు అపార్థంచేసుకోవడం, చేసుకోకపోవడం నాకు అంత ప్రధానవిషయం కాదేమో. మోడరన్ రివ్యూ ముఠావారినిమాత్రమే దేశభక్తులక్రింద లెక్కవేసుకొనేవారిలో మీరూ ఒకరైతే, దీనినిగురించి పట్టించుకోవలసిన అగత్యం నాకూ అంతగావుండదు. ఏమైనా నేను ఇరవైఏళ్ళపాటు రచనలు సాగించాను. ఆ రచనలనిండా పొరపాట్లే వుండవచ్చును; కాని, మీరు నాకు ఆపాదిస్తున్న సంకుచితబుద్ధిమాత్రం నా యింటావంటా లేదు. విమర్శించేవారందరినీ శత్రువులక్రింద జమకట్టటం సహజం. అయితే జాతీయోద్యమానికి నిజమైనశత్రువులు అపవాదులపా విమర్శలుచేసేవారుమాత్రం కాదు. జాతీయోద్యమాన్ని పట్టుకుపీడిస్తున్న సైలన్ఘోష్లూ, పయ్యద్ హూస్సేన్లు వంటివాళ్ళు, (వారిదేశభక్తి టోపీలతరహాకు చెందినట్టిది) వీరిని ఆరాధిస్తున్న పాశ్చాత్యులూమాత్రమే నిజమైనశత్రువులు. ఈ విషయాన్ని మీరుసైతం అంగీకరించేకాలం వస్తుందేమోలెండి. మీరు నామాటను నమ్మినా, నమ్మకపోయినా, భారతదేశానికి పూర్ణస్వరాజ్యం సాధించటంలో నా కాయశక్తులా పాటుపడతానని వాగ్దానంచేస్తున్నాను.

నేను అనుకొన్నట్టే, నా లేఖప్రభావం మీపై పడింది. నా మనస్సూ, హృదయమూ, శరీరమూ పూర్తిగా అలసటచెందివున్నవన్న సంగతి నేను అంగీకరిస్తాను. అయితే, ప్రత్యేకపరిస్థితుల్లో నేను వృసిచ్చేరినుంచి ఆ లేఖ వ్రాశాను. అరవిందుని పాశవిక ఆరాధన అంత ముఖ్యమైనఅంశం కాదని నేనూ అంగీకరిస్తాను. అయినా, అనేక

భ్రమలు వరుసగా తొలగిపోయినతర్వాతకాదా, మరొక భ్రమ తొలగిపోవడంవైతం బాధగానే వుంటుంది మరి. ఆయ నొక గొప్ప మేధావిఅనీ, సద్గుణసంపన్నుడనీ, నిజమైన దేశభక్తుడనీ నేను అనుకొన్నాను. ఆయ నొక చవుకబారు విదూషకుడని నేను అనుకోలేదు. ఆయనశిష్యప్రధానుల్లో ఒకడు నా పూర్వస్నేహితుడు (ఆశ్రమాన్ని చూపడానికి ఆయన నాకు తోడునిచ్చాడు) ఆ స్నేహితుడు పూర్తిగా మారిపోయాడు. నా కాలేజీని పాడుచేయాలని ఆ మిత్రుడు ప్రయత్నించాడు. (అమృతసర్ ఘటనలు జరిగినవెంటనే ఇది జరిగింది.) ఆరోజుల్లో ఆ మిత్రునిలో నిస్స్వార్థమైన దేశభక్తిభావం తొణికిసలాడుతూండేది. నిరాడంబరజీవితం గడుపుతూండేవాడు. మరొక విషయం; భారతదేశమంతటా పేరొందిన ముస్లిం ఒకడు నాకు ఆశ్రమంలో కన్పించాడు. ఆయనలోని పరిశుద్ధమైన భక్తి విశ్వాసం చూసి నేను ముగ్ధుణ్ణి అయ్యాను. ఆయన ఆశ్రమంలో ప్రాతఃకాలపుప్రార్థనలకు నన్ను తీసుకుపోయాడు. ఆయనభక్తిని చూసి హిందువులు సహించలేరు. 'శివుని' అవతారంలోవున్న అరవిందునికి, "పార్వతి" అవతారంలో వున్న ఆ ఫ్రెంచివనితకు పూజచేశాడు. కాంటర్‌బరీ మతాధిపతి ప్రచ్ఛన్న నాస్తికుడుఅంటే నేను నమ్మగలనా? ఈ దృశ్యం చూసినప్పుడు నా పరిస్థితి సరిగా అలాగేవుంది. పేరుపొందిన ముస్లింనాయకుడు ఈవిధంగా పూజచేస్తుంటే, ఇక ఎవరిని నమ్మడం?

మళ్లీ మనం కలుసుకోవటం తటస్థించితే, (మళ్ళీ కలుసుకొంటామనే అనుకొంటాను. మీ రీసారి ఆకస్మికంగా రావడం జరిగితే, మాయింటికే వస్తారుకదా? దీనికి సమాధానం వ్రాయనవసరంలేదు. కాని, దృష్టిలోమాత్రం ఉంచుకోండి) మిమ్మల్ని ఒకటి అడగాలనుకొంటున్నాను. మీ ఆత్మకథలో కొన్నివిషయంలో మీరు ప్రదర్శించిన క్షమాభావం, 'చరిత్రరూపురేఖలు'లో మాత్రం మీ దేశప్రజలవిషయంలో ఎందుకు ప్రదర్శించలేదు? అది మీ గొప్పతనానికే, ఉత్తమపద్ధతికి అనువుగాలేదు! నా స్వదేశీయుల విషయాలకు సంబంధించిన తప్పులను అందరం చేస్తాం. అయితే ఈవిషయంలో మీ గ్రంథం సాటిలేనిది. అయితే అతి

కేవలం వాస్తవికవిషయాలకుమాత్రమే సంబంధించినది కాదు. ఆ పొరపాట్లకు ఇతరకారణాలుకూడా వున్నాయనుకొంటాను. మనస్సు శక్తిం సరిగాలేకపోతే, అది మన మాటల్లోను, రచనలలోను ప్రతిబింబిస్తుంది. ఈమధ్య నావిషయంలోనూ అలాగే జరిగింది. మీ అమూల్య కాలాన్ని నా లేఖకు సమాధానం వ్రాయడంకోసం వెచ్చించవలసినవసరం లేదు. అదీకాక, అసలు లేఖలు ఎప్పుడూ అపార్థాలకేదారితీస్తూవుంటాయి. కాని, కీర్తిమంతులు, పేరుప్రఖ్యాతులుగల మీవంటివారు ఈవిషయం గురించి తప్పక ఆలోచించాలి. మానవజాతి విశ్వాసాన్ని పుంజుకొనేదీ, లేనిదీ మీవంటివారి కృషిఫలితంపైననే చాలావరకు ఆధారపడివుంటుంది. మా దేశప్రజలకోసం కాకపోయినా, కనీసం మీకోసమైనా, దీనికి మీరు కొంత పశ్చాత్తాపం ప్రకటించక తప్పదు.

చివరిమాట: ఈ లేఖ మీకు చేరడానికిపూర్వమే, దీనిని జాగ్రత్తగా చదివేవారు వుంటారని నాకు తెలుసును. అందుకనే, దీనిని సాధ్యమైనంత స్పష్టమైనభాషలో వ్రాస్తున్నాను. అసలు ముఖ్యమైన విషయమేమిటో వివరించడానికి ఇందులో ప్రయత్నించాను.

భారతీయవ్యతిరేకతను నేను ఏమాత్రం అలవర్చుకోలేదు. కాని భారతీయులు ఆంగ్లేయులు మనమంతా అధమశ్రేణికిచెందిన పశుగణం లాంటివాళ్లం. నేను నిరాశావాదంలో, పూర్తిగా హతాశుణ్ణయిపోయాను.

భారతదేశానికి మీ తరఫుననిచెప్పుకొనే ఆంగ్లేయుడెవడూ, ఎన్నడూ అసలు భారతదేశాన్ని విమర్శించరాదని, ఇతర జాతీయవాదులవలె, మీరూలోలోపల భావిస్తున్నారనుకొంటాను. మాదేశంలో లేబరుపార్టీకూడా, (ఈపార్టీ అనేకసార్లు అనేక విద్రోహాలకు ప్రజాస్వామికవిరుద్ధచర్యలకు పాల్పడింది) అదేవిధంగా కోరుకొంటున్నది. ఆ కోర్కెను నేను మన్నించలేను. కావలిస్తే, మీరు నన్ను శత్రువుక్రింద జమకట్టుకోవచ్చును. జరిగేపొరపాటును నేను విమర్శించకుండా వుండలేను.

పదహారేళ్ళక్రితం ప్రారంభమైన సహాయనిరాకరణోద్యమం హానికరమని నేను భావించలేదు. నైతికసూత్రాలదృష్ట్యా అది సమర్థనీయమైనదనికూడా నేను అనుకొన్నాను. దానిని తుదివరకూ కొనసాగిస్తే

అయితే, మొత్తంమీద మీ దృష్టి సరియైనదేనని భావిచరిత్రలో ఋజువు అవుతుంది. మొత్తం ఆర్థిక, సామాజిక (ప్రత్యేకంగా భారతదేశంలో) మతసంబంధమైనవ్యవస్థ చాలా దారుణమైనది. వీటి విషయంలో మీరు అవలంబిస్తున్న ఎత్తుగడలను మార్చుకోవాలని నేను చెప్పజాలను. ఈ ఎత్తుగడలు తాత్కాలికంగా మీ ప్రతికూలశక్తులను బలపర్చితే బలపర్చవచ్చును గాక. అయినా వాటిని మీరు విడనాడనక్కరలేదు.

మీపై బలవంతాన రుద్దబడుతున్నవాటినే నేను పొరపాటుఎత్తుగడలుగా భావిస్తున్నాను. ప్రపంచపరిణామాల తీరుతెన్నులను దృష్టిలోవుంచుకొని, రాజ్యాంగంలో కాంగ్రెసువారు సహకరించాలి; సహకరిస్తామని స్పష్టంగా ప్రకటించాలి. అదేసమయంలో రాజ్యాంగంలోని దుష్టఅంశాలను నిరాకరించవచ్చును; ఆ దుష్టఅంశాలు నైతికంగా సమర్థనీయమైనవి కావు; కేవలం పశుబలంతోనే అవి నిలువగలవు. ఈవిధంగా చేసిననాడు మీకు అండదండలు సమకూరుతాయి. దేవుడు మేలుచేస్తే, త్వరలోనే మీరు అధికారంలోకి రాగలరు. (భగవంతుడు తప్పకుండా మేలుచేస్తాడు. పరిణామాలు ఆదేదిశలో సాగిపోతున్నాయి) ఈనాడు ప్రపంచంలో ఇద్దరే ఇద్దరు సమర్థవంతులైన రాజకీయవేత్త లున్నారు. వారే రూజ్వెల్టు, డివెలిరాలు. వారిద్దరూ ఋజువర్తనులు. తాము గైకొంటున్నచర్యలు ఏవిధంగా పర్యవసిస్తాయో, స్పష్టంగా చెప్పుతున్నదీ వారిద్దరే. డివెలరా ఐర్లెండు దేశాన్ని సక్రమపథంలో క్రమేణా ముందుకు తీసుకుపోతున్నాడు.

మీమీదగలభారం నిజంగా గురుతరమైనదే. ఎందుకంటే. సంస్థానాధీశులు, ముస్లిములు మీకు ప్రత్యర్థులుగా వున్నారు. మీ దేశసరిహద్దులలో వున్నంతవరకు మీ వేషభాషలు భేషుగానే వుంటాయి. అభివృద్ధినిరోధకులకు చెందిన పూజారివృత్తి, మూఢనమ్మకాలవంటివే అవీను. కాంగ్రెసు మాత్రం తనమార్గాన్ని మరింత కష్టతరంచేసుకొంటోంది. మొదట ప్రజలకు [illegible] అటుపిమ్మట ప్రజలలో అనుమానాలను [illegible] చెప్పి, అందుకు పూర్తిగా విరుద్ధమైనపనులు [illegible] చేస్తారు. మీరు చేజేతులా అపజయాన్ని కోరితెచ్చుకొంటున్నారు.

బ్రిటిష్ లోకంలో పొత్తుకలిసినందువల్ల ప్రయోజనంలేదనీ వారు గుర్తిస్తారు. జాతీయోద్యమం ఇప్పుడు హిందువులకుమాత్రమే పరిమితమైవుందని అంటే మీకు కోపంరావచ్చునుగాక! కాని, అది వాస్తవం. ఈ పరిస్థితిని మార్చాలంటే మీరు పై విధంగా నడుచుకోవాలి. అప్పుడే మీ ఉద్యమం నిజమైన భారతజాతీయోద్యమంగా రూపొందుతుంది. నిజానికి మీఉద్యమం కొంత దెబ్బతిన్నది. ఉద్యమం దెబ్బతినలేదని నిజాయితీగలవారెవ్వరూ అనలేరు.

ఈ లేఖకు మీరు జవాబువ్రాయనవసరంలేదు. ప్రస్తుతానికి మీ అభిప్రాయానికే మీరు కట్టుబడివుండండి. నేను భారతదేశంపై పగ బూనినాననే భావిస్తూవుండండి.

మీ

ఇ. థామ్సన్.

163. ఎడ్వర్డ్ థామ్సన్ నద్దనుంచి,

బోర్స్‌హిల్, ఆక్స్‌ఫర్డు
జనవరి 3, 1937

ప్రియమైన నెహ్రూ,

మీరు నాకిచ్చిన ఇంటర్వ్యూ చివర ఈవిధంగా ప్రచురితమైంది. దీనికిపెట్టిన శీర్షికలకు, వక్కాణింపులకు, నాకు ఎట్టిసంబంధంలేదు. నేను వ్రాసిన ఉపోద్ఘాతం కాస్తా ఎగిరిపోయింది. ఇందుకు నేనెంతో విచారిస్తున్నాను. మీరంటే, నాకుగల గౌరవాభిమానాలనుగురించి ఆ ఉపోద్ఘాతంలో పేర్కొన్నాను. కాని నిజంచెప్పాలంటే, ఈనాడు మన నాగరికత, ఎదిగీ ఎదగనిదశలో ఒక యుగసంధిలో వుంది. ప్రతిదాన్ని నీచ ప్రచారస్థాయికి దిగజార్చుతున్నారు. సినిమాలు చూడండి; మరొకటి చూడండి; ఏది చూసినా అసభ్యతే ప్రత్యక్షమవుతోంది. ఈ యుగం ఆద్యంతం కుళ్లిపోయింది.

మహాకలభయంకూడా నన్ను పట్టుకుపీడిస్తోంది. మాదేశంపై కారు మేఘాలు కమ్మటంలో, భారతదేశం మా దృష్టిపథంనుండి తప్పిపోయి,

నేపథ్యంలోకి నిష్క్రమించిది. అన్నట్టు, మీరు ఏకీభవించిన కీ కిష్ట మైన వ్యాసం కొన్నివారాలుగా మూలపడి మూల్గుతోంది. దానిని శ్రీమతి సింప్సన్ తీసుకుపోయింది. ఎవరో సినిమానటుడు మరొక సినిమానటితో ప్రేమకలాపంలో పడిపోయాడట. మనకర్మ. ఏమి చేస్తాం! ఇది నా కొక గుణపాఠం. ప్రజానురంజకమైన పత్రికకు ఇక నేను పచ్చినా వ్యాసం వ్రాయను. వాళ్ళను మనం నమ్మకూడదు.

మాయింట్లో యిప్పుడు పెట్రీషియా ఎస్క్విత్ అనే యువతి అతి థిగావుంటోంది. ఆమె, మీ అమ్మాయి స్నేహితులట. ఇద్దరూ స్కూల్లో కలిపి చదువుకొన్నారట. ఎప్పుడూ మీఅమ్మాయిని గురించే చెబుతూవుంటుంది.

నూతనసంవత్సరాభినందనలతో,

మీ,

ఎడ్వర్డ్ థామ్సన్.

న్యూస్ క్రానికల్
జనవరి 2, 1937

సంస్కరణల ప్రారంభంతో భారతదేశంలో తలెత్తుతున్న
కొత్తప్రమాదం.
న్యూస్‌క్రానికల్ ప్రతినిధితో నెహ్రూ అభిభాషణ.

నూతన సంవత్సరాగమనంలో, ప్రపంచందృష్టి భారతదేశంపై లగ్నంఅవుతోంది. కొత్తరాజ్యాంగం త్వరలో అమలులోకి రాబోతున్నది. కొత్తరాజ్యాంగంక్రింద, వచ్చేనెలలో తొలిఎన్నికలు జరుగుతున్నవి. ఏప్రిల్ 1వతేదీనుంచి రాష్ట్రీయస్వపరిపాలన అమలులోకి వస్తుంది.

భారతజాతీయకాంగ్రెసు జాతీయవాదులు లేక స్వరాజ్యవాదులు అనధికార "పార్లమెంటు" రాజ్యాంగాన్ని తిరస్కరించింది; రాజ్యాంగం అమలులోకిరాకుండా ప్రతిబంధకాలు కల్పించడానికి నిశ్చయించింది.

ఈ ప్రతికూలపక్షానికి జవహర్‌లాల్ నెహ్రూ నాయకుడు. ఈయన హారో, కేంబ్రిడ్జిలలో విద్యనభ్యసించినవ్యక్తి. కొద్దిరోజులక్రితమే మూడవసారి కాంగ్రెసుఅధ్యక్షుడుగా ఎన్నికయ్యారు.

"న్యూస్‌క్రానికల్" తరఫున ఎడ్వర్డ్ థామ్సన్ నెహ్రూను ప్రత్యేకంగా ఇంటర్వ్యూచేశారు. ఎడ్వర్డ్ థామ్సన్ భారతీయవ్యవహారాలన్నీ కూలంకషంగా తెలిసుకొన్న దిట్ట. 'రాజ్యాంగం విఫలమవుతుంద'నీ, 'బ్రిటిషుసైన్యాలు విధిగా వైదొలగా'లనీ నెహ్రూ ప్రకటిస్తున్నారు.

'బంధాలు సడలిపోవాలి'

ఎడ్వర్డు థామ్సన్

భారతదేశం బ్రిటిషుసామ్రాజ్యంతో పూర్తిగా తెగతెంపులు చేసుకోవాలని నెహ్రూ కోరిఉండలేదు. ఆయననుగురించిన నా అభిప్రాయం ఇదే.

బ్రిటిషుసామ్రాజ్యంలోని దేశాలన్నింటికి సమానప్రతిపత్తీ, హోదా వున్నపక్షంలో, సామ్రాజ్యంలోని ప్రతిదేశానికి తన సొంతవ్యవహారాల విషయంలో స్వేచ్ఛ ఇచ్చేపక్షంలో, భారతదేశంకూడా అలాంటి జాతుల కూటమిలో వుండడానికి ఆయన కెట్టి అభ్యంతరంవుండదు.

కాని, మన స్వార్థప్రయోజనాలకోసం భారతదేశాన్ని పూర్తిగా పరాధీనంచేసివేశామని ఆయన భావిస్తున్నారు. అందుచేత మనతో బంధాలు సడలిపోనిదే భారతదేశానికి స్వేచ్ఛవుండదని ఆయన అనుకొంటున్నారు.

నెహ్రూతో నేను జరిపిన సంభాషణలవివరాలను ప్రశ్నోత్తరరూపంలో ఈ క్రింద పొందుపర్చుతున్నాను.

ప్రశ్న : కొత్తరాజ్యాంగాన్ని భారతదేశం స్పృశించదని మీరు చెప్పినట్లు పత్రికలు ప్రకటించాయి. అంటే మీ భావమేమి ?

జవాబు : కొత్తరాజ్యాంగాన్ని స్పృశించకపోవడమంటూ వుండదు. ఎటుతిరిగీ మేము ఎన్నికలలో పోటీచేస్తున్నాంకదా, అయి

నప్పుడు కొత్తరాజ్యాంగంతో మాకు ఏదోఒకవిధమైన సంబంధం వుంచకుండా ఎలావుంటుంది ?

అయితే, సహకారభావంతోమాత్రం, ఈ రాజ్యాంగాన్ని మేము చూడబోము.

మాఅభీష్టానికివ్యతిరేకంగా దానిని మాపై బలవంతానరుద్దారు. అసంపేనగా కేమాత్రం యిష్టంలేదు. సాధ్యమైనంతవరకు అది అమలులోకిరాకుండాచేయడానికే మేము ప్రయత్నిస్తాం.

రాజ్యాంగంలోని సమాఖ్యభాగంమాత్రం కేవలం అమానుషమైనది.

ప్రశ్న : ఏమైనా, భారతదేశం ఇప్పటికీ కటికదారిద్ర్యంలో బాధపడుతున్నదికదా, అయినప్పుడు మీరు ఈ రాజ్యాంగాన్ని ఉపయోగించుకొని, ప్రజలబాధలు కొంతవరకైనా, కడతేర్చడానికి ప్రయత్నించకూడదా ?

## ప్రధానసమస్యలు

జవాబు : రాజ్యాంగం విఫలంకావడం తథ్యం. ఎందుకంటే, అది భారతదేశంలోని ఏ ఒక్క ప్రధానసమస్యను పరిష్కరించజాలదు. భూసమస్య, దారిద్ర్యం, నిరుద్యోగం - ఇవే భారతదేశంలోని ప్రధానసమస్యలు, తక్షణసమస్యలు.

బ్రిటిషుసామ్రాజ్యవాదం వున్నంతకాలం వీటిని సక్రమంగా పరిష్కరించడం సాధ్యమని మేము అనుకోము.

మేము మరొక పరిష్కారమార్గం సూచించాం. అదే రాజ్యాంగసభ నిర్మాణం.

ప్రశ్న : సంస్థానాలప్రజలు కొందరున్నారన్నసంగతినిగాని, వారిహక్కులమాటగాని గుర్తుంచుకోలేని సాహసం కాంగ్రెసుకు లేదని నా విమర్శ. మరి మీరేమంటారు ?

జవాబు : సంస్థానాలలోని ప్రజలను కాంగ్రెసు విస్మరించలేదు. అయితే కాంగ్రెసుకార్యకలాపాలు ప్రధానంగా బ్రిటిషుఇండియా ప్రాంతానికే పరిమితమైవున్నమాట నిజమే. బ్రిటిషుఇండియాలోని

ప్రజలకు ఏ ఏ రాజకీయ, ఆర్థిక, పౌరసత్వాదిహక్కులు కావాలని కాంగ్రెసు కోరుతున్నదో అవేహక్కులు సంస్థానాలలోని ప్రజలకుకూడా కలిగించాలని కాంగ్రెసు కోరుతోంది.

భారతదేశ సంస్థానాలప్రజలకు చేయవలసినదంతా కాంగ్రెసు చేయలేకపోతున్నది. ఇతరబాధ్యతలలో సతమతమైపోతుండడమే దీనికికారణం. ఇప్పటికే కాంగ్రెసు నాయకులబాధ్యతలు, తల మునకలుగా వున్నాయి.

'నియంతృత్వం కాదు'

అయితే లక్ష్యాన్ని సూత్రప్రాయంగా అంగీకరించడం జరిగింది.

ప్రశ్న: నిజమైన 'అధినివేశప్రతిపత్తి' కూడా స్వాతంత్ర్యంతో సరిసమానమైనది కాదంటారా ?

జవాబు: బ్రిటిషుసామ్రాజ్యంలో వున్నంతవరకు భారతదేశం నిజమైనస్వాతంత్ర్యం అనుభవించలేదు. చివరకు బ్రిటిషు అధినివేశప్రాంతాలపాటి స్వాతంత్ర్యంకూడా అనుభవించలేదు.

ఈ రెండింటికి అసలు ఎలాంటి తారతమ్యం లేనేలేదు. స్వతంత్ర భారతదేశం బ్రిటనుతో స్నేహసంబంధాలు ఏర్పరచుకోడానికి నా కెట్టి అభ్యంతరంవుండదు.

ప్రశ్న: ఫాసిస్టుదేశాలలోవలె భారతదేశంలోకూడ నియంతృత్వం ఏర్పడడం మీకు యిష్టమేనా ?

జవాబు: అలాంటిభావానికి నేను బద్ధవ్యతిరేకిని. ముఖ్యంగా వ్యక్తిగతనియంతృత్వం అంటే నాకు అసలే కిట్టదు.

పోతే, తీవ్రమైన సంక్షోభమేర్పడినప్పుడు, అంటే సైనిక సంబంధమైన సంక్షోభ మేర్పడినప్పుడుమాత్రం గ్రూపునియంతృత్వం తప్పనిసరి కావచ్చును.

అయితే దీనిని మామూలుపరిస్థితులు ఏర్పడినతర్వాతకూడా కొనసాగించడం పనికిరాదు.

ప్రశ్న : భారతదేశ ఏకీకరణ చాలావరకు కృతకమైనది కాదా? ఇటీవలి జరిగినది కాదా? అయినప్పుడు దానిని, జాతి, భాషా ప్రాతిపదికలపై వివిధదేశాలుగా విభజించడం మంచిది కాదా?

జవాబు : భారతదేశాన్ని ఆవిధంగా చీలదీయడం, అంటే, అంతకన్నా దురదృష్టవంతమైనది మరొకటి వుండబోదు. భారత దేశ ఐక్యత అత్యంత అభిలషణీయమైనదిమాత్రమేకాక, అత్యవసరమైనదికూడా. భారతదేశంలో శాస్త్ర బుద్ధివున్నవాడెవడూ ఇందుకు భిన్నంగా అభిప్రాయపడుతున్నాడని నేను అనుకోను.

అయితే ఈ ఐక్యత పేరుతో దారుణపీడనమాత్రం కొనసాగరాదు. ఐక్యభారతదేశంలో సంపూర్ణమైన సాంస్కృతిక స్వేచ్ఛ వుండితీరాలి. ఏకత్వంలోనే భిన్నత్వానికి పూర్తిగా అవకాశం వుండాలి.

ప్రశ్న : భారతదేశంలో దారిద్ర్యం దారుణంగావుంది. ఏదేశాలనుంచివచ్చిన యాత్రికులందరు దీనినిచూసి నివ్వెరపోతున్నారు. మరి ఈ దారిద్ర్యనిర్మూలనను మీరు ఎలాసాధించగలరు?

జవాబు : భారతదేశంలోని ముఖ్యసమస్యలను పరిష్కరించడానికి ఒకేఒకమార్గం వున్నట్టు నాకు తోస్తున్నది: భారత ఆర్థిక వ్యవస్థను ఆమూలాగ్రంగా ప్రణాళికాబద్ధం కావించాలి. వ్యవసాయం, పరిశ్రమలు అన్నీ ప్రణాళికాబద్ధంకావలసిందే. పెద్దపెద్ద పరిశ్రమలు, గ్రామాలు, సామాజికసౌకర్యాలు మున్నగువన్నీ ప్రణాళికపరంకావలసిందే.

"స్వార్థపరవర్గాలకు తావువుండరాదు"

అలాంటివ్యవస్థ అవతరణకు స్వార్థపరవర్గాలు ప్రతిబంధకంగా తయారవుతాయి. ఆ వర్గాలను తొలగించినప్పుడే ఆ వ్యవస్థ రూపొందుతుంది. కాబట్టి, ఆ ప్రతిబంధకాలను సాధ్యమైనంతవరకు తొలగించడం అవసరం.

ప్రశ్న : మీకు అవరోధంగావున్నది కేవలం బ్రిటిషువారే కాదు. భారతదేశస్వాతంత్ర్యానికి మీ దేశంలో మతకలహాలు, సంస్థానాధీశులు గూడా ఆటంకంకాదా ?

జవాబు : ఆర్థికసమస్యలకు సంబంధించినంతవరకు మత సమస్య ఏవిధంగానూ యిబ్బందులు కల్గించదు.

పోతే సంస్థానాధీశులసమస్య: సందేశ్ళకుపూర్వం బ్రిటిష ప్రభుత్వ ప్రతినిధులతో సంస్థానాధీశులు ఏదోఒక ఒప్పందం కుదుర్చుకున్నారు. కనుక దానిపేరుతో వారు తమ ఫ్యూడల్, నిరంకుశపాలన యధాతధంగా కొనసాగించుకోవాలనడం హాస్యాస్పదం.

చివరకు ఆ యా సంస్థానాలలోనున్న ప్రజలే సంస్థానాధీశులకు ఎలాంటిప్రతిపత్తి ఒసగాలన్నవిషయం తేల్చగల అధికారం కల్గివుంటారు.

ప్రశ్న : సైన్యానికిసంబంధించినంతవరకు కొన్నిరాష్ట్రాలవారు అసలు సైన్యంలో చేరనేలేదు.మరికొన్ని రాష్ట్రాలకుచెందిన కొన్ని వందలమందిమాత్రమే సైన్యంలో వున్నారు. రెండురాష్ట్రాలకు చెందినవారే సైన్యంలో అత్యధికులుగా వున్నారు. ప్రజలలోని ఒకభాగంవారుమాత్రమే ఆయుధాలు చేతబూని, ఇతరులకోసం ప్రాణాపాయానికి లోనవుతున్నసందర్భంలో ప్రజాస్వామిక ప్రభుత్వం నెలకొనడం సాధ్యమని మీరు తలంచుతున్నారా ?

జవాబు : సైనికసమస్య అంత అధిగమించరాని అవరోధమేమీకాదు. సైన్యం, సైన్యంతోపాటు ఒకరకమైన పౌరసైన్యం, దేశంలోని, అన్నిప్రాంతాలనుంచి రిక్రూట్ చేసుకోబడుతుంది. ప్రస్తుత సైన్యం కొత్తప్రభుత్వానికి విధేయమైవుండబోదని అనుకోనేందుకు ఆస్కారం లేదు.

బ్రిటిషుసైన్యం భారతదేశంనుంచి పోక తప్పదు.

164. రవీంద్రనాథ్ టాగూర్ వద్దనుంచి

శాంతినికేతన్, బెంగాల్
డిసెంబరు 21, 1936

ప్రియమైన జవహర్‌లాల్,

ఇందిర వ్రాసినలేఖ అందింది. అందులోని అనురాగపూర్వక ప్రస్తావన నన్ను పులకితుణ్ణిచేసింది. ఆమె నిజంగా ముద్దుబిడ్డ. ఆమె అధ్యాపకులు, సహాధ్యాయులుకూడా ఆమెను ఎంతగానో మెచ్చుకొంటున్నారు. మీలోని విశిష్టలక్షణమూ; మీ భావాలు ఆమెలో మూర్తీభవించేయి. ఆంగ్లేయసమాజం ఆమెకు పరాయిదేశముగా తోచినా, నేను ఆశ్చర్యపడను. మీరీసారి ఆమెకు జాబు వ్రాసినప్పుడు, నా దీవెనలుకూడా అందజేయండి.

మేము ముప్పటి వార్షికోత్సవాల హడావిడిలో మునిగితేలుతున్నాం. ఈ జనసందోహం, కార్యక్రమాల రద్దీలో నా ఆరోగ్యం కాస్తా దెబ్బతినిపోయేటట్టువుంది. అయినా మీరు పడుతున్న శ్రమలో ఇది ఏపాటిదిలెండి!

అనురాగమయ అభినందనలతో,

మీ
రవీంద్రనాథ్ టాగూర్.

165. మహాత్మా గాంధీవద్దనుంచి

డిసెంబరు 28, 1936

ప్రియమైన జవహర్‌లాల్,

నీవు పనుక ఇవ్వాళ పూర్తిచేస్తే - పూర్తిచేస్తావనే ఆశిస్తాను - రేపు మధ్యాహ్నం భోజనానంతరం నన్ను వెళ్లిపోనియ్యి.

ఇకముందు కాంగ్రెసుమహాసభలు గ్రామాలలోనే జరపాలన్న నా సూచన నీకు నచ్చిందా? నచ్చినట్లయితే. కాంగ్రెసుమహాసభలు ఇంతకు ముందుమాదిరిగానే ఫిబ్రవరి, మార్చినెలల్లో జరిపితేనే బాగుంటుంది. ఆవిధంగా కాంగ్రెసు నిర్ణయంతీసుకొనేటట్టు చూడు. శరీరం కొంకర్లుపోయేచలితో వేలాదిప్రజలు బాధపడకుండా నివారించడానికి అవ

కాళంవుంటే, ఆ పని తప్పకుండా చేయాలి. పార్లమెంటుసభ్యులకుకూడా ఈఏర్పాటు బాగానేవుంటుంది. శాసనసభలలో కాంగ్రెసుకు మెజారిటీ లభించినప్పుడు, క్రిస్మస్, ఈస్టర్ పండుగులకు సెలవులువున్నట్టే, దానికి ఎందుకు సెలవులు ఏర్పాటుచేయకూడదు? తొందరగా ఎక్కడో ఒకచోట స్థలం సంపాదించి, అటుపిమ్మట యింటింటికి తిరిగి కమలా స్మారకనిధికి వసూళ్లు ప్రారంభించడం మంచిదని సరూప్‌తో చెప్పాను.

ప్రేమతో,

బాపూ,

## 166. వి. గొల్లాన్జ్ నద్దనుంచి

లండన్,

ఫిబ్రవరి 8, 1937.

ప్రియమైన నెహ్రూ,

ఆల్బర్ట్‌హాలుసభకు మీరు పంపిన సందేశానికి మనఃపూర్వకమైన కృతజ్ఞతాభివందనలు. ఈ సందేశం ఎవరినుంచి వచ్చిందో ముందుగా నేను ప్రకటించలేదు. "భారతప్రజలు" అంటూ చదివానో లేదో చెవులు గింగుర్లెత్తేట్టు హర్షధ్వానులు మిన్నుముట్టాయి. టెలిగ్రామ్ చదవటం పూర్తిఅయ్యాక మళ్ళీ అదేరకమైన హర్షధ్వానాలు వినిపించాయి. చివరకు మీపేరు చదివినంతనే హర్షధ్వానాలు మరింతగా మారోమ్రాగాయి. అక్కడజేరిన జనసమూహంలో ప్రతిఒక్కరూ మీ విజ్ఞప్తికి తమ హర్షామోదాలు వ్యక్తంచేస్తున్నారనడానికి ఇంతకన్నా వేరే నిదర్శనంకావాలా?

సభ అన్నివిధాల మా అంచనాలకుమించినరీతిని, విజయవంతంగా ముగిసింది. దీనివల్ల తప్పనిసరిగా రాజకీయసత్ఫలితాలు కలిగి తీరుతాయి.

మీ కివే నా శుభాకాంక్షలు,

మీ

వి. గొల్లాన్జ్.

పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ,
స్వరాజ్యభవనం, అల్హాబాద్, యు. పి.

## 167. సర్ స్టాఫర్డ్ క్రిప్స్ వద్దనుంచి

3. ఎల్మ్ కోర్టు,
టెంపిల్ ఇ. సి. 4,
మార్చి 3, 1937

ప్రియమైన నెహ్రూ,

మీరు తీరికచేసుకొని అంత సుదీర్ఘమైన, ఆసక్తిదాయకమైన లేఖ వ్రాసినందుకు చాలా ధన్యవాదాలు. మీ లేఖలో ఎంతో సమాచారం పొందుపర్చబడివుంది; అందులో విజయశంఖానాదం ధ్వనిస్తోంది. మా దేశంలోని ప్రజలకు అలాంటి విజయశంఖారావపు ఆవశ్యకత నే డెంతో వుంది. అందుకనే మీ లేఖను 'ట్రిబ్యూన్' పత్రికలో ప్రచురింపబో తున్నాం.

మేము ప్రారంభించిన ఐక్యతాఉద్యమం, ట్రేడ్ యూనియన్ల లోను, పార్టీలోను అధికారశక్తుల తీవ్రప్రతిఘటనను ఎదుర్కొంటూనే, ముందుకు సాగిపోతోంది. ఈ ఉద్యమం ఇప్పటికప్పుడే విపరీతమైన రాజ కీయ సంచలనాన్ని కలుగజేసింది. దీని సత్ప్రభావం అప్పుడే ప్రస్ఫుట మవుతోంది.

భారతప్రజలలో మీరు జనింపజేసిన సమధికోత్సాహాన్ని గాంచి, నేను నిజంగా అసూయపడుతున్నాను. అక్కడలాగానే ఇక్కడకూడా అలాంటి మహోద్యమం ప్రారంభమైవుంటే ఎంతబాగుండును. కాని, మేమంతా సజాతుతో రాటుతేలిపోయాం. మా ప్రజాస్వామ్యంలో హక్కులు అంతరించుతం. అమోఘమైన విజయాలను సాధించినందుకు మిమ్ములనూ, కాంగ్రెసునూ మనఃపూర్వకంగా అభినందిస్తున్నాను. త్వరలో జరుగనున్న మీ సదస్సు ఎట్టి నిర్ణయంచేస్తుందా అని ఆసక్తితో ఎదురుచూస్తూవుంటాం. రాజ్యాంగచట్టం అమలుజరపడంపట్ల మీరు అవలంబింపబోయేవైఖరి ఏవిధంగావుంటుందా అని ఊహాపోహలంతో ఎదురుచూస్తూవుంటాం.

వివిధరూపాలలో ప్రత్యక్షమవుతున్న సామ్రాజ్యవాదాన్ని, భారత దేశంలో ఈనాడు అమలుజరుపబడుతున్న అనేక ఫాసిస్టుపద్ధతులనూ, మీరు గట్టిగా ప్రతిఘటించగలరన్న విశ్వాసం నాకు ఉంది. మేమిక్కడ మీకు చేయగలిగినసహాయం అతిస్వల్పం. ఎందుకంటే సామ్రాజ్యవాద తీరుతెన్నులలో నిబిడీకృతమైన అంశాలను మా పార్టీ యింకా స్పష్టంగా చూపలేకపోతున్నది. అయినా సామ్రాజ్యవ్యవహారాలలో కార్మికోద్యమం నిర్వర్తింపవలసిన కర్తవ్యాలనుగురించి మాశక్తికొలదీ ప్రచారంచేయ డానికి ప్రయత్నిస్తున్నాం.

'ట్రిబ్యూన్' పత్రికలో భారతదేశాన్నిగురించిన సమాచారాన్ని ఎప్పటికప్పుడు ప్రచురిస్తూవుండడం ముఖ్యమని భావిస్తున్నాను. అందు చేత మీరు అప్పుడప్పుడు సమాచారలేఖనో, చిన్నవ్యాసాన్నో పంపిస్తూ వుండండి. అదెంతో మాకు ఉపయోగకరంగావుంటుంది. మీకు తీరిక వుండదని తెలిసికూడా, ఈవిధంగా కోరుతున్నాను.

మరొకసారి మనఃపూర్వక అభినందనలు.

మీ
స్టాఫర్డ్ క్రిప్స్.

168. లార్డు లోథియన్‌వద్దనుంచి

సిమోర్ హౌస్,
17, వాటర్‌లూప్లేస్, ఎస్. డబ్ల్యు-1
మార్చి 4, 1937

అంతరంగికమైనలేఖ

ప్రియమైన జవహర్‌లాల్ నెహ్రూ,

భారతదేశంలోని ఎన్నికలతీరును నేను శ్రద్ధగా పరిశీలిస్తు న్నాను. ప్రస్తుతం మా దేశం అంతర్జాతీయపరిస్థితినిగురించి ప్రధానంగా యోచిస్తోంది. అందుచేత మేము మీ దేశంలోని ఎన్నికలగురించి కొంత వరకే పట్టించుకోగలం. ఆరురాష్ట్రాలలో కాంగ్రెసుకు మెజారిటీరావడమో, లేక అది అన్నిటికన్న పెద్దపార్టీగా అవతరించడమో జరిగింది. ఇది

ఎంతేని ముదావహం. ఎందుకంటే, భారతదేశంలో అత్యంత క్రియాశీల మైన. క్రమబద్ధమైన జాతీయశక్తి తొలిసారిగా అత్యంత కీలకస్థానాన్ని ఆక్రమించబోతున్నది; అధికారం చేపట్టబోతున్నది. మెజారిటీసంపా దించిన రాష్ట్రాలన్నిటిలోను, కాంగ్రెసు అధికారాన్ని స్వీకరించి, బాధ్యతానిర్వహణకు పూనుకోగలదనే గాఢంగా కాంక్షిస్తున్నాను. మీరు దీనికి భిన్నమైనఅభిప్రాయాన్ని కల్గివున్నారన్నసంగతి నాకు తెలుసును. బ్రిటిషు అధికారాన్ని భద్రపర్చుకొనేఅవకాశం రాజ్యాంగంలో పొందు పర్చబడడమేకాక, కేంద్రశాసనసభలో ధనికవర్గాల ప్రతినిధులుమాత్రమే జొరబడడానికి అవకాశంవుంది. అందుకే మీరు రాజ్యాంగాన్ని అమలు జరపడానికి విముఖులుగా వున్నారు. మీ వైఖరిని మార్చుకోవలసిందిగా నేను కోరుతున్నాను. అందుకు రెండుకారణాలున్నాయి. ఒకటి: ఇది చరిత్రలో అపూర్వమైనప్రయోగం. శాసనసభలో మెజారిటీపార్టీకి పూర్తి బాధ్యతలను అప్పగించకుండానే, బాధ్యతాయుతప్రభుత్వసూత్రాన్ని అమలుజరుప ప్రయత్నిస్తున్నారు. రాష్ట్రాలకుండే అధికారాలకులోబడి, ప్రతిరాష్ట్రంలోను పరిపూర్ణాల బాధ్యతాయుతప్రభుత్వాన్ని స్థాపించా లన్నదే వార్ల మెండుఅభిమతం. రాష్ట్రమంత్రివర్గం అశేషప్రజలకు వ్యతిరేకంచేసే కార్యవిధానాలను అనుసరించనంతకాలమూ, గవర్నరుకు ప్రజాప్రతినిధులను కాదనగలిగిన సాహసంవుండదు. అందుచేత కాంగ్రెసుప్రభుత్వం పూర్తిబాధ్యతను నెరవేర్చడానికి గణనీయమైన అవ కాశంవుందనే నేను భావిస్తున్నాను. పరిపాలనలో కొంత అనుభవం గడించినతర్వాత, సంపాదించే అర్హత తమకుగలదని నిరూపించుకొన్న పిమ్మట కాంగ్రెసు రాజ్యాంగంలోని ఫెడరల్అంశాలనుగురించి బ్రిటిషు ప్రభుత్వంతో మరింత గట్టిగా వాదించడానికి వీలవుతుంది. రాజ్యాంగం లోని ఫెడరల్అంశాలే ఈనాడు నిజంగా బ్రిటనుకు కాంగ్రెసుకు మధ్య వివాదాస్పదంగా తయారయ్యాయి.

రెండవకారణం: భారతదేశంయొక్క భౌగోళికఐక్యతను కాపాడ డమే అతిముఖ్యమైన కర్తవ్యం అని నేను భావిస్తున్నాను. ఫెడరల్ రాజ్యాంగం మూలస్వరూపంలో ఈ ఐక్యత గర్భితమైవుంది. ఈనాటి

ఐరోపాఖండాన్ని ఆవరించిన క్లేశాలను చూస్తే, నిజంగా భారతదేశం ఎంతో అదృష్టవంతురాలని తోచకమానదు. ఐరోపాఖండం 26 స్వతంత్ర దేశాలుగా విభక్తమైవుంది. ఈ దేశాలన్నీ తమ తమ సమస్యలను పరిష్క-రించుకోలేనంత అసమర్థంగా తయారయ్యాయి. కాని, భారతదేశం ఏక ఖండంగానే వుంది; ఒకే ప్రభుత్వయంత్రాంగ అధీనంలోవుంది. నిజమే. ఒకప్పుడు బ్రిటనుకూడా చైనాలోని మంచూస్ చక్రవర్తులవలె, రష్యాలోని జారుచక్రవర్తివలె, భారతదేశంలో నిరంకుశత్వంద్వారా దేశసమైక్యతను కాపాడగలిగినదశలో వుండేది. కాని, ఆరోజులు ఇప్పుడు గతించిపోయాయి. ఈ రాజ్యాంగపరిధిలోనే మరొకరకమైన ఓటింగుహక్కును ప్రవేశపెట్టాలని మీరు కోరుతున్నమాట నిజమే. అయితే, ఫెడరల్ చట్రంలోనే వుంటూ, ఆ మార్పుకోసం పోరాడటం ఉత్తమంగా వుంటుందిగాని, అసలు ఫెడరల్‌వ్యవస్థనే నాశనంచేసి, భారతదేశసమైక్యతకు ప్రమాదంతెచ్చే పనులుచేయడం వివేకవంతమైన చర్య కాబోదు. యూరప్ గుణపాఠం మర్చిపోకండి. నేను సూచించినమార్గం మీరు చేపడితే, మీ లక్ష్యాన్ని మీరు చాలా త్వరలో చేరుకోగలుగుతారు. ఆ మార్గం భారతప్రజలకు ఎంతో ప్రయోజనకరమైనది.

చివరిమాట: గవర్నరు తమ విశేషాధికారాలను ఉపయోగించబోమని హామీయివ్వాలని మీరు కోరడం సబబుకాదనుకొంటాను. గవర్నర్లు ఆ హామీలను యివ్వజాలరు. అలాంటి హామీలను కోరడం అసాధ్యకోరికలకోసం కీచులాడడమే అవుతుంది. ముఖ్యంగా ఇప్పుడు జరగవలసినది బాధ్యతను స్వీకరించడం; అటుతర్వాత ఆ బాధ్యతానిర్వహణలో జోక్యం పనికిరాదని పట్టుబట్టడం. మీ విధానాలను అమలు జరపడానికి అధికారం స్వీకరించడానికి మీరుకూడా సిద్ధంగానేవున్నారు కదా.

నేను ఇలాంటిజాబు వ్రాస్తున్నందుకు నన్ను మన్నిస్తారనే తలుస్తాను. క్రిందటేడు మనంయిద్దరం కలుసుకొన్నప్పుడు ఎంతో స్నేహపూర్వకంగా ముచ్చటించుకొన్నాం. ఆ చనువును పురస్కరించుకొని మీ పట్ల, మీదేశంపట్ల నాకుగల సద్భావంకొద్దీ, ఈ లేఖ రాస్తున్నాను. అంతే

కాదు. ఈ కొత్తరాజ్యాంగంవల్ల అధికారం క్రమేణ బారతీయులపరం కాగలదని నేను నమ్ముతున్నాను. పోరాటం, యిక్కట్టులు అవసరం లేకుండానే రాజ్యాంగపద్ధతుల్లో వానిని మీరు సాధించుకోవచ్చును. ఇటీవలి అనుభవంకూడా ఇదే విషయం చాటుతోంది. పెట్టుబడిదారీ 'దోపిడీ'ని హతమార్చడానికి ఈమధ్య అవలంబించబడుతున్న పద్ధతులవల్ల, మరింత దారుణమైనపరిణామాలు సంభవిస్తున్నాయి. పెట్టుబడిదారీ 'దోపిడీ'ని తొలగించేందుకు అనుసరించదగు ఉత్తమ సాధనం ప్రజాస్వామ్యమే అని తేలుతోంది.

మీ
లోధియన్.

169. వల్లభాయ్ పటేల్ నద్దనుంచి

అహ్మదాబాద్,
మార్చి 9, 1937

ప్రియమైన జవహర్‌లాల్,

మహారాష్ట్ర ప్రదేశకాంగ్రెసుసంఘం ఈనెల 8 వ తేదీన పూనాలో సమావేశమై. అధికారాన్ని స్వీకరించరాదని తీర్మానించినట్లు పత్రికలలోపడినవార్తలను గమనించాను. కాని, అదేరోజున మహారాష్ట్ర (కొత్తగా ఎన్నికైన) శాసనసభ్యులు, వేరొకచోట సమావేశమై, అధికారాన్ని స్వీకరించాలంటూ తీర్మానించారు. అంతటితో వారు ఆగలేదు. మరొక అడుగు ముందుకువేసి, ప్రధానమంత్రిగా నారిమన్ పేరును సిఫారసుచేస్తూ తీర్మానంచేశారు. ఇది చాలా శోచనీయమైనవిషయం. మీరు ఈమధ్య జారీచేసిన ఆదేశాలకు పూర్తివిరుద్ధంగా వారు వ్యవహరించారు. బొంబాయిలో మంత్రిపదవులనుగురించి పెద్దఎత్తునజరిగిన ప్రచారఫలితమే ఈ తీర్మానమని నేను అనుమానిస్తున్నాను. మహారాష్ట్ర కాంగ్రెసుసంఘం తన శాసనసభ్యులను అదుపులోపెట్టలేకపోతున్నట్లు కన్పిస్తోంది. కనుక కేంద్రంనుంచి కఠినమైనచర్యలు సకాలంలో తీసుకోకపోతే, సంస్థలు చెయ్యిజారిపోయేప్రమాదం వుంది. మీ పరిశీలన

కోసం ఇందుకుసంబంధించిన రిపోర్టుల కత్తిరింపులను దీనితో జతపర్చి పంపుతున్నాను.

నేను బొంబాయిమీదుగా 14 వ తేదీ సాయంత్రానికి ఢిల్లీకి చేరు కొంటాను.

మీరు క్షేమమని తలుస్తాను,

మీ
వల్లభాయ్.

170 రవీంద్రనాథ్ టాగూర్ వద్దనుంచి

ఉత్తరాయణ్,
శాంతినికేతన్, బెంగాల్
మార్చి 28, 1937

ప్రియమైన జవహర్‌లాల్,

మీరుపంపిన తంతి ఇప్పుడే అందింది. వచ్చే ఏప్రిల్ 14 న జరిగే మా సభలకు మీరు అధ్యక్షతవహించేఅవకాశం కలదన్న ఆశా రేఖ ఆ తంతిలో మెరిసింది. అయితే, మీ రిక్కడకు రాగల్గిందీ లేనిదీ అప్పటి రాజకీయపరిస్థితిపై ప్రధానంగా ఆధారపడివుంటుందనికూడా అందులో పేర్కొన్నారు. రాజకీయపరిస్థితిలోని ఈ అనిశ్చితత, మా స్వల్పవేడుకలపాలిటి అశనిపాతంగా దాపురిస్తుందా? అయినా ఏప్రిల్ 14 వ తేదీ కార్యక్రమంగురించి నేను ఏవిధంగా భావిస్తున్నానో మీకు తెలియజేయడంకోసం ఈ లేఖ వ్రాస్తున్నాను.

పెద్ద గ్రంథాలయంతోపాటు, యాభై వేలరూపాయలనిదిని చైనా ప్రజలు భారతదేశానికి సమర్పించారు. ఈ కానుకను మనం సరియైన విధంగా అంచనావేయకపోతే అంతకన్నా దురదృష్టకరమైనసంగతి మరొకటి వుండదోదు. చైనా భారతసాంస్కృతికసమాజంవారు ఈ కానుక సమర్పించారు. చైనానాయకులందరూ ఈ సాంస్కృతికసమాజంలో బాధ్యతాయుతస్థానాలు అలంకరిస్తున్నారు. మార్షల్ చాంగ్‌కైషేక్, అధ్య

కుడు డాక్టర్ త్యాయ్ టి టాయో, చైనా జాతీయవిజ్ఞానపరిషత్ డైరెక్టరు మున్నగువారు ఆ సమాజంలో ప్రముఖస్థానాలు అలంకరిస్తున్నారు. అందుచేత ఈ కానుకను సర్వలాంఛనాలతో, స్నేహ సహకారాలతో దీపితమైన వాతావరణంలో స్వీకరించడం మన విద్యుక్తధర్మం. చైనా మిత్రులు మనపట్ల ప్రదర్శించిన మనోహరమైన మైత్రీభావానికి సరితూగేవిధంగా మనం ఆ కానుకను స్వీకరించాలి. చైనా మిత్రులకు మనం ఏవిధంగాను ఆశాభంగం కలిగించరాదు, ఈ కార్యక్రమానికి ప్రారంభోత్సవంజరిపే అర్హత. యోగ్యత అందరికన్నా మీకే హెచ్చుగా వుంది. అందుచేత మీరు తప్పక రావాలి. అవసరమైతే మీరు విమానంలో యిక్కడకు రావచ్చును. ఇక్కడ విమానాలు దిగడానికి అనువైన చక్కనిప్రదేశంకూడా వుంది. వచ్చేటప్పుడు ఇందిరను తప్పకుండా వెంట తీసుకురండి.

శుభాకాంక్షలతో,

మీ

రవీంద్రనాధ్ టాగూర్,

171. ఎర్నెస్ట్ టాలర్ వద్దనుంచి

దిమిరామర్,

శాంతా మోనికా, కాలిఫోర్నియా

మార్చి 30, 1937

ప్రియమైన జవహర్‌లాల్ నెహ్రూ,

అనేకమాసాలఅనంతరం మళ్ళీ మీకు లేఖ వ్రాస్తున్నాను. మీరు కులాసాగావున్నారనే తలుస్తాను.

అత్యంత శ్రద్ధాసక్తులతో, మీ రాజకీయజీవితాన్ని, కార్యకలాపాలను పరికిస్తూవస్తున్నాను. కొన్ని అమెరికన్ వార, మాసపత్రికలు, దినపత్రికలు భారతదేశంలోని యధార్థపరిస్థితులవార్తలను తగినంతగా ప్రచురిస్తున్నాయి.

అక్టోబరు ఆరంభంలో నేను అమెరికా చేరాను. హిట్లరుకు, నాజీ వ్యవస్థకు వ్యతిరేకంగా ప్రచారంచేయటంకోసం నేనిక్కడకు వచ్చాను. హిట్లరు దేశీయవిధానాలను. దారుణదమననీతిని ఖండించడం, అల్పసంఖ్యాకులవిషయంలో, ఉదారవాదుల. సోషలిస్టులవిషయంలో హిట్లరు అనుసరింపుతున్న నిర్బంధవిధానాన్ని ఖండించడంమాత్రమే కాక, హిట్లరుప్రభుత్వ వైదేశికనీతినికూడా నేను, నా ప్రసంగాలలో నిశితంగా విమర్శించుతున్నాను. హిట్లరు వైదేశికనీతి ప్రపంచశాంతికి ఘోరమైన ప్రమాదంతెచ్చిపెడుతుంది. స్పెయిన్‌లో, ఫ్రాంకో తిరుగుబాటుకు సాగించబడిన సన్నాహాలు, అందుకు హిట్లరు యిచ్చిన ప్రోత్సాహ ప్రోద్బలాలను గురించికూడా నేను వివరంగా నా ప్రసంగాలలో పేర్కొంటున్నాను. నేను అమెరికాదేశంలో నలుమూలలా పర్యటించాను. అనేక వర్గాల ప్రజలు హాజరైనసభలలో ప్రసంగించాను. విశ్వవిద్యాలయాలలో, మహిళాక్లబ్బులలో, రచయితలు, పత్రికారచయితలక్లబ్బులలో, రేడియోలో ప్రసంగాలుచేశాను.

నా పర్యటన మూడుమాసాలపాటు సాగింది. తరుచు రోజుకు రెండుసభలలో ప్రసంగించాను. కొన్నిరోజులలో నాలుగేసిసభలలోకూడా మాట్లాడినసందర్భాలు ఉన్నాయి. నేను సాగిస్తున్న కృషిపట్ల మీకు ఆసక్తిగలదన్నసంగతి నాకు తెలుసును. మీతో నాకున్న చనువుకొద్దీ, నా ప్రసంగానికి సంబంధించిన పత్రికల కత్తిరింపులను మీకు పంపిస్తున్నాను.

ఇక్కడిప్రజలు, చివరకు హాలీవుడ్‌లోని సినిమాకళాకారులుసైతం ఎంతో సానుభూతిని వ్యక్తంచేస్తున్నారు. వారినుంచి ఇలాంటి సానుభూతి లభ్యమవుతుందని నేను ఊహించలేదు.

హాలీవుడ్‌లో బలీయమైన ఫాసిస్టుప్రతికూలసంఘం పనిచేస్తోంది. దీనిలో ప్రముఖ చలనచిత్రనిర్మాతలు, రచయితలు, నటీనటులు కలరు.

పర్యటన కార్యక్రమం ముగిసిన తర్వాత నేను హాలీవుడ్ చేరాను. మెట్రోగోల్డ్విన్ మేయర్ వారు తీయబోతున్న 'లోలా మోన్టెజ్' అన్న చిత్రానికి నేను ప్రస్తుతం కథ, మాటలు వ్రాస్తున్నాను. (ఇది 'లోలా మోన్టెజ్' అనే విచిత్ర ఐరిష్ యువతి గాథ. ఆమె ఒక ఆఫీసరు

కూతురు. భారతదేశంలో పెరిగి పెద్దదయింది. తర్వాత లండన్‌లో 'స్పానిష్ నర్తకి'గా ప్రత్యక్షమైంది. అటుపిమ్మట బవేరియారాజు, ఒకటవ లుడ్విగ్‌కు స్నేహితురాలుగా మారింది. ఆ రాజు రాజకీయాలను ఆమె అనేక సంవత్సరాలపాటు బాగు నడిపించింది. 1848 లో జరిగిన విచిత్ర మ్యూనిక్ తిరుగుబాటుతో, ఆమె గాథ అంతమైంది. ఆమెను దేశంనుంచి బహిష్కరించారు. రాజు, సింహాసనాన్ని పరిత్యజించాడు. చరిత్రలో మనకు కన్పించే అనేక విచిత్రసంఘటనలలో ఇదొకటి. యూరప్‌లో అభివృద్ధినిరోధకులు పెచ్చరిల్లినకాలంలో, ఈ 'లోలా మోన్టెజ్' అనేయువతి స్వాతంత్ర్యేచ్ఛకు చిహ్నంగా నిలిచింది.

ఇక్కడ పనిపూర్తికాగానే, న్యూయార్కుకు బయలుదేరివెళతాను. అక్కడ నేను రచించిన నాటకాలను రెండింటిని ప్రదర్శించబోతున్నారు. ఆ రెండునాటకాలు గ్రంథరూపంలో వెలువడగానే, వాటిప్రతులను సంతోషపూర్వకంగా మీకు పంపిస్తాను. స్వీకరించండి.

లోగడ 1929 లో నేను అమెరికాలో పర్యటించాను. అప్పటికీ, ఇప్పటికీ అమెరికా ఎంతో మారిపోయింది. ప్రపంచాన్ని అల్లకల్లోలపర చిన ఆర్థికమహాకసంక్షోభప్రభావం అమెరికాప్రజలపై బాగా పడింది. ముఖ్యంగా అది అమెరికాయువకులను పూర్తిగా మార్చివేసింది. ఇంతకు ముందు అమెరికాప్రజలకు కేవలం డాలర్‌ను ఆరాధించాలన్నదృష్టితప్ప మరొకటి వుండేదికాదు. కాని ఇప్పుడు అలాకాదు. ప్రగాఢ ఆధ్యాత్మిక అశాంతి అమెరికన్‌ప్రజలలో ద్యోతకమవుతోంది. యదార్థ సామాజిక సమస్యలను గూర్చి వారు తలపోస్తున్నారు. సామాజికరంగంలోను, కళా రంగంలోనుకూడా వారు సత్యాన్వేషణ సాగిస్తున్నారు. అంతేకాదు, ఫాసిస్టుప్రమాదాన్ని అందరికన్నముందుగా గుర్తించినది అమెరికాప్రజలే నని నే ననుకొంటున్నాను.

జనాభాలో హెచ్చుమంది 'స్వాతంత్ర్యచైతన్య'ప్రదీప్తులయ్యారు. రూజ్వెల్ట్ ఎన్నికలో ఇది వ్యక్తం అవుతోంది. రూజ్వెల్ట్‌ఎన్నికను, స్వాతంత్ర్యానికి గీటురాయిగా ఇక్కడ పరిగణిస్తున్నారు.

వచ్చేనెలలో రూజ్వెల్ట్‌ను కలుసుకొనబోతున్నాను. అమెరికా చరిత్రలో గణుతికెక్కిన మహనీయులలో ఆయన ఒకరు.

నేను తిరిగి ఎప్పటికి ఇంగ్లండు చేరుకోగలనో ఇప్పుడు చెప్పలేను. ప్రస్తుతం కొంతకాలంపాటు అమెరికాలోనే వుంటాను.

ఐరోపా వ్యవహారాలనుగురించిన సమాచారం నాకు అందుతున్నట్లుగానే మీకూ ఎప్పటికప్పుడు అందుతున్నదని ఆశిస్తున్నాను. మనమిప్పుడు దాదాపు ఐరోపాయుద్ధంలో చిక్కుకున్నట్లే. ప్రస్తుతానికి వివిధ దేశాలసైన్యాలు పెద్దఎత్తున యుద్ధానికి సన్నద్ధమవుతున్నాయి. ఆ సైన్యాలు రణరంగంలోకి దుమికేరోజు ఆట్టే దూరానలేదు. బ్రిటన్ ఇటలీలకుగల వైషమ్యం నానాటికి హెచ్చుపెరిగిపోతోంది. బ్రిటిషువారిపై వ్యతిరేకతకొద్దీ ముస్సోలినీ హిట్లరుతో కత్తుకలిపి వుంటాడని నేను భావిస్తున్నాను. నేటి పరిస్థితినిబట్టిచూస్తే, యుద్ధంఅన్నది మొదట బ్రిటన్ ఇటలీలమధ్య బయలుదేరేటట్లు కనిపిస్తున్నది. హిట్లర్‌కు సోవియట్ రష్యాకు మధ్య, యుద్ధం మొదట ప్రారంభంకాగల అవకాశం అంతగా కన్పించడంలేదు.

స్పానిష్ సమస్యవిషయంలో ప్రజాస్వామికదేశాలు, ఆర్థిక కారణాలదృష్ట్యా పొరపాటుచేశాయి. భావిచరిత్ర దీనిని క్షమించదు. స్పెయిన్‌లో ఫ్రాంకో, అతని ఫాసిస్టు, నాజీమిత్రులు విజయంపొందితే, దానిఫలితంగా, యూరప్‌పరిస్థితులు విషమించగలవన్నవిషయాన్ని ప్రజాస్వామికదేశాలు ముందుగా గుర్తించలేకపోయాయి. అందుకే అవి 'తటస్థ' విధానం అవలంబించాయి. తద్వారా అవి యూరప్‌లో ప్రజాస్వామ్య వినాశనానికే తోడ్పడుతున్నాయి. ఇకనైనా ప్రజాస్వామిక దేశాలు కళ్ళు తెరువగలవనే ఆశిద్దాం.

భారతదేశంలోకూడా ఫాసిస్టుఉద్యమాలు తలెత్తుతున్నాయా? నాజీలు తమ ప్రచారంద్వారా భారతదేశంలో పలుకుబడిని సంపాదించుకుందుకు ప్రయత్నిస్తున్నారా?

మీ కుమార్తె ఎక్కడున్నట్లు? ఇంకా లండన్‌లోనేవున్నారా? నా మనఃపూర్వక అభివందనలను, ఆకాంక్షలను స్వీకరించండి.

భవదీయుడు
ఎర్నెస్టు టాలర్

172. మహాత్మా గాంధీనద్దనుంచి

సెగోన్, వార్ధా
సంస్కరించలేదు. ఏప్రిల్ 5. 1937

ప్రియమైన జవహర్‌లాల్,

నీవు ఆరోగ్యం ఎందుకు పాడుచేసుకున్నావు? పోనీ, ఆరోగ్యం పాడైనతర్వాతనైనా, ఎందుకు విశ్రాంతితీసుకోవు? ఇందు వచ్చినతర్వాత నీవు కంటికికనిపించకుండా ఎక్కడికైనా వెళ్ళిపోతావేమో అనుకొన్నాను. ఆమె రాగానే, ఆమెకు నా ఆశీర్వచనాలు అందజేయి. దీనితోపాటు ఆమెకు ఒక చీటీ పంపుతున్నాను.

పోతే, ఇక నీ ఆక్షేపణ విషయం: అదేమిటోగాని, నేను చెప్పే ప్రతిమాటా, చివరకు, చేసే ప్రతిపనీ, నీకు ఆటంకంగానే తయారవుతోంది. బాగనోముపట్టడం అసాధ్యం. పదాలకుసంబంధించినంతవరకు మర్యాద, అమర్యాద బాగానేవున్నాయి. నా ప్రకటనవిషయంలో కాంగ్రెసువైపునుంచివచ్చిన తొలి ఆక్షేపణ నీదే. అంతా ఆక్షేపించినప్పుడు నేను చేయగల్గింది ఏమీలేదు. నీ ఆక్షేపణ తెలుపుతూ, నీవు జాబు వ్రాసినందుకు సంతోషం. నాకు స్పష్టతఏర్పడేవరకో, లేదా నీ సందేహాలు తీరేవరకో, నా విషయంలో నీవు కాస్త ఓపికపట్టకతప్పదు. నా ప్రకటనవల్ల ముందుకుపోయేది ఏదీ లేదనుకొంటున్నాను. నాకు అర్థంకానిదీ, నీ మనస్సులోవున్నదీ, ఏమైనా వుందా?

వార్ధానుంచి మద్రాసువరకు కమలాదేవి మాతోపాటే ప్రయాణం చేసింది. ఆమె రెండుసార్లు నా రైలుపెట్టెలోకి వచ్చింది. మేమిద్దరం చాలాసేపు మాట్లాడుకొన్నాం. చివరకు ఆమె నన్ను ప్రశ్నించింది: పరోజినీదేవిని ఎందుకు మినహాయించారు? రాజాజీ లక్ష్మీపతిని ఎందుకు

దూరంగావుంచాడు ? అనసూయాబాయిని ఎందుకు వదిలేశారు ? ఇత్యాది ప్రశ్నలెన్నో వేసింది. ఈ మినహాయింపులలో నా పాత్రను ఆమెకు వివరించాను. మౌనవ్రతం అవలంబించిన సోమవారంనాడు నీకు వ్రాసిన చీటీనిగురించి, నాకు గుర్తున్నంతవరకు ఆమెకు తెలియజేశాను. సరోజినీ దేవిని మొదట మినహాయించడంలోగాని, ఆతర్వాత తీసుకోవడంలోగాని నా పాత్ర ఏమీలేదని ఆమెకు చెప్పాను. అలాగే లక్ష్మీపతిని దూరంగా వుంచడంలోకూడా రాజాజీకి ఎట్టిపాత్ర లేదని వివరించాను.

ఈ విషయం నీకు తెలియడం మంచిదన్నదృష్టితో నే నిది వ్రాస్తున్నాను.

ఈ లేఖ చేరేసమయానికి నీవు పూర్తిగా కోలుకోగలవని ఆశిస్తాను. తల్లినిగురించి ఏమీ చెప్పకు.

ప్రేమతో
బాపూ.

173. లార్డు లోధియన్‌వద్దనుంచి

ఆంతరంగికం

బ్లిక్లింగ్‌హాలు,
అయిల్‌షామ్,
ఏప్రిల్ 9, 1937

ప్రియమైన జవహర్‌లాల్ నెహ్రూ,

మార్చి 25 వ తేదీన మీరువ్రాసినలేఖకు కృతజ్ఞతాభివందనాలు. 'టైమ్స్' పత్రికకు నేను వ్రాసినలేఖను మీరు చూసేవుంటారు. కాంగ్రెసు కార్యవర్గంచేసిన నిర్ణయంతో, నేను మీతో పూర్తిగా ఏకీభవించడంలేదని ఆ లేఖనుబట్టి వెల్లడవుతున్నది. "రాజ్యాంగసంబంధమైన వ్యవహారాలలో మంత్రులసలహాలను త్రోసిపుచ్చేందుకు వీలుగా గవర్నర్లు, తమ విశేషాధికారాలను వినియోగించబోరన్న హామీని యివ్వాల"ని కాంగ్రెసుకార్యవర్గం కోరడం చాలా సమంజసమని మీరు అంటున్నారు. దీనితో నేను ఏకీభవించలేను. ఇందుకుగలకారణాలను మళ్లీ నేను ఏకరువుపెట్టదలుచుకోలేదు. కాని, ఒకమాట : గవర్నర్లు తమ విశేషాధికారాలను ఉపయోగించ

వచ్చునా, లేదా అన్నది ఇక్కడ అంత ముఖ్యమైనవిషయం కాదు. గవ ర్నర్ల విచక్షణాదృష్టి ముఖ్యమైనది. ఇదేవిషయాన్ని నిన్న ప్రభుత్వ సభలో జెట్లండ్ కూడా అంగీకరించారు. మంత్రివర్గసలహాను పాటించితే, శాంతిభద్రతలకు, అల్పసంఖ్యాకవర్గాల హక్కులకు హానిజరుగుతుందా లేదా అన్న విషయాన్నే గవర్నర్లు తమ విశేషాధికారాలను ఉపయోగించ డంలో ప్రధానంగా దృష్టిలోఉంచుకొంటారని జెట్లండ్ వివరించారు. బాధ్యతాయుతప్రభుత్వం అన్నసూత్రంలోని ప్రధానాంశం ఇదే. బాధ్యతా యుతప్రభుత్వం ప్రజామంత్రివర్గాలు ఏర్పడిన ప్రతిచోట, అన్ని అధి కారాలు క్రమేణా ఖచ్చితంగా శాసనసభలకు, ఓటర్లకు దఖలుపడు తూంతడం మనం కళ్ళారా చూస్తున్నాం. అందుచేత మంత్రివర్గం విచక్షణారహితంగా వ్యవహరించి, ఓటర్లను దూరంచేసుకొనేవిధానాలు అవలంబిస్తే తప్ప, గవర్నర్లు తమ విశేషాధికారాలను ఉపయోగించ జాలరు. నిష్కారణంగా విశేషాధికారాన్ని ఉపయోగించడం వారికి చాలా కష్టమవుతుంది. ఎందుకంటే, గవర్నర్లు అడవిపేస్తే, దానిఫలితంగా మళ్లీ ఎన్నికలు తప్పవు. ఆ ఎన్నికలలో మళ్లీ పూర్వమంత్రివర్గమే అధికారం లోకి వచ్చే అవకాశంవుంటుంది. ఈ ముఖ్యవిషయాన్ని మీరు గమనిం చాలి.

అందుచేత మీదృష్టితోనే చూసినప్పటికీ, ముందుగా హామీలను కోరేవిధానం సబబుకాదు. మీరుపైతంహామీలుయివ్వడానికిఅంగీకరించరు. అలాగే గవర్నర్లుకూడా అంగీకరించజాలరు. అసలు హామీలు యిచ్చిపుచ్చు కోవడంవల్ల లేనిపోని అనుమానాలు, స్పర్థలు పెరుగుతాయేగాని, తరగవు. అయినా మీ సంప్రదాయసిద్ధమైనవిధానాన్ని మీరు ఎందుకు అనుసరించ కూడదు? అధికారం స్వీకరించండి. శాసనముచేయండి. అప్పుడు గవ ర్నర్లు జోక్యంకల్పించుకుంటారేమో చూడండి. గవర్నర్లు జోక్యంకల్పిం చుకోకపోతే, పూర్తిబాధ్యతను మీరు స్వీకరించినట్టే కాగలదు. కొన్ని వారాలలోనో, నెలలలోనో రాష్ట్రాలన్నింటిలోను పార్లమెంటరీవ్యవస్థ పూర్తిగా నెలకొంటుంది. నెలలు గడిచేకొలదీ మంత్రివర్గం అవివేకంగా ప్రవర్తిస్తేతప్ప, గవర్నర్లు జోక్యంకల్పించుకోవడం మరింత కష్టతర

మవుదూవుంటుంది. వారు అసలు జోక్యంకల్పించుకోకపోతే, మీదృష్టితో చూసినా, అది మీకే ఎంతో ప్రయోజనకరంగా వుంటుంది.

భారతదేశపు భౌగోళికఐకమత్యాన్ని పదిలపర్చుతూ, పటిష్టమొన రింపవలసిన అవసరంకలదని మీలేఖచివరిపేరాలో మీరు పేర్కొన్నారు. అయితే, ఈ ఐక్యతను కాపాడడానికి కొత్త రాజ్యాంగం ఉపకరిస్తుందని మీరు అనుకోవడంలేదు. ఇది నాకు బొత్తిగా అర్థంకాకుండావుంది. కొత్త భారతరాజ్యాంగంకూడా మౌలికాంశాలలో అమెరికా, కెనడా, ఆస్ట్రేలియా దేశాలరాజ్యాంగాలనే పోలివున్నది.

ఫెడరల్ శాసనసభద్వారా భారతదేశపు భౌగోళిక ఐకమత్యం కాపాడబడుతుంది. ఫెడరల్‌శాసనసభ అందరికీ, సామాన్యపుఓటర్లకు, సంస్థానాలకు, రాష్ట్రాలకు ప్రాతినిధ్యంవహిస్తోంది. రాజ్యాంగపరిధిలో వివిధరాష్ట్రాలకు. సంస్థానాలకు న్యాయశాస్త్రరీత్యా అధికారాలు వుంటాయి. మొత్తంగా భారతదేశానికంతటికీ ఏర్పాటుచేసే ఏరాజ్యాంగ మైనప్పటికీ, ఈసూత్రాలమీదనే రూపొందించబడాలిగదా. అయితే కొత్త రాజ్యాంగంలో కొన్ని అభ్యంతరకర అంశాలు, అనవసరమైనఅంశాలు వున్నవన్నసంగతి నిజం. ఉదాహరణకు, ఫెడరల్‌శాసనసభలో ప్రజాస్వామ్యం, నిరంకుశత్వంకూడా ఒకదానిసరసనే మరొకటి వుండడం తటస్థిస్తుంది. మీదృష్టిలో మరొక అభ్యంతరకర అంశంకూడా వుంది; అదే ఆస్తిహక్కులకు రాజ్యాంగంలో పొందుపర్చబడిన రక్షణలు, ఫెడరల్ శాసనసభ నిర్మాణంవిషయంలో పెద్ద పొరపాటు జరిగినదని నేను వ్యక్తిగతంగా భావిస్తున్నాను. ఫెడరల్‌శాసనసభను ప్రజలు సరాసరి ఎన్నుకోరు. వివిధరాష్ట్రాలప్రతినిధులతో ఈ శాసనసభ ఏర్పాటుఅవుతుంది. అందుచేత రాష్ట్రాలలో సహజంగావుండే విచ్ఛిన్నకరధోరణులకుకూడా కేంద్రంలో బలీయమైన ప్రాతినిధ్యం లభ్యమవుతుంది. వీటన్నిటికీతోడు కమ్యూనల్‌అవార్డు అంటూ ఒకటివుంది. అయితే, ఈ అభ్యంతరకర అంశాలన్నింటినీ ఫెడరల్‌రాజ్యాంగాన్ని నాశనంచేయవలసినఅవసరం లేకుండానే, రాజ్యాంగంనుంచి నెమ్మదిగా తొలగించవచ్చునని నేను నమ్ముతున్నాను. ముస్లిములుగానీ, ఇతర అల్పసంఖ్యాకులలో అత్యధి

కులుగానీ కొత్తరాజ్యాంగసభకు హాజరయ్యేటట్లు మీరు వారిని ఒప్పించ గలగడం సందేహాస్పదమే. బాధ్యతాయుత ప్రభుత్వవ్యవస్థయాపేణా, ప్రజాప్రతినిధులకు హస్తగతమయ్యే అధికారాన్ని వినియోగించుకొని, రాజ్యాంగంలోని లోపాలను మరింత తెలివిగాను, మరింత త్వరగాను తొలగింపడం సాధ్యమని నా నమ్మిక. మొత్తం రాజ్యాంగాన్ని నాశనం చేయడానికి ప్రయత్నింపడంకంటే ఆ రాజ్యాంగపరిధిలోనే లోపాలను సరిదిద్దడానికి ప్రయత్నింపడం అన్నివిధాల అభిలషణీయం. అదీకాక, ఫెడరల్ రాజ్యాంగాన్ని నాశనంచేయడానికి ప్రయత్నిస్తే, చివరకు భారతదేశ భౌగోళికఐక్యతకే ప్రమాదం ముంచుకురావచ్చునని నేను భయ పడుతున్నాను. బలీయమైన క్రమశిక్షణగల పార్టీ బాధ్యతాయుతప్రభుత్వ వ్యవస్థకు సారధ్యంవహిస్తూ. శాసనసభల ద్వారా దఖలుపడిన అధికారా లను వినియోగించుకొంటూ, రాజ్యాంగంలోని లోపాలను తొలగింపడం మరింత సులభంకాగలదు; బ్రిటిషుపార్లమెంటుపై ఒత్తిడితెచ్చి. ఆ కార్యం సాధించుకోవచ్చును. ఈ అభిప్రాయంతో మీరు ఏకీభవించక పోవచ్చును. ఎందుకంటే, మీ ప్రథమలక్ష్యమైన "స్వాతంత్ర్యాన్ని" బాధ్యతాయుతప్రభుత్వవ్యవస్థను హస్తగతంచేసుకోవడంద్వారా సాధించు కోవచ్చునన్న విశ్వాసం మీకు లేదు. ఆ నమ్మకం నాకు వున్నది. మీరు కనుక సప్రూను కలుసుకొని మాట్లాడితే, రాజ్యాంగంవల్ల అధికసంఖ్యా కులకు మీరు గుర్తించుతున్నదానికంటె చాలా హెచ్చుఅధికారాలే దఖలు పడుతాయని ఆయన మీకు నచ్చజెప్పగలడనుకొంటాను. అధికారాన్ని హస్తగతంచేసుకోవడానికి అవసరమైనసాధనం కొత్త రాజ్యాంగం; అది మీకు చేజిక్కుతుంది. అయితే ఆ సాధనాన్ని ఉపయోగించుకొనేపద్ధతి మీకు తెలిసివుండాలి. అందుకే కొత్త రాజ్యాంగాన్ని ఇక్కడి అభివృద్ధి నిరోధకులు అంత తీవ్రంగా ప్రతిఘటిస్తున్నారు.

భవదీయుడు,
లోథియన్.

పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ,
అల్లాహాబాద్.

174. ఎడ్వర్డ్ థామ్సన్ వద్దనుంచి

మే 3, 1937

ప్రియమైన నెహ్రూ,

మీరు జబ్బుపడ్డారని తెలిసి, ఎంతో విచారిస్తున్నాను. మీరు కోలుకొన్నారనే ఆశిస్తాను. తీరికచేసుకొని నాకు జాబువ్రాసినందుకు ధన్యవాదాలు.

పోతే, భారతరాజకీయాలకు సంబంధించినంతవరకు, మీతో పోల్చుకుంటే వాటినిగురించి మాట్లాడేఅర్హత నాకు ఎక్కడిది? మనిద్దరి మధ్య అభిప్రాయభేద మేర్పడితే, బహుశా ఆ విషయంలో నేనే పొరబడి వుంటాను. నేను భారత రాజకీయవ్యవహారాలలో ఆసక్తిని ప్రదర్శిస్తున్నానంటే, అందుకు కారణం కాంగ్రెసుపట్ల నాకుగల గాఢాభిమానమే. పరాయివాడిగానో, లేక ఆంగ్లేయునిగానో, నేను ఆ ఆసక్తిని ప్రదర్శించడంలేదు. భారతదేశంలో అత్యంత ఆధునికమైన, ముఖ్యమైన ఉద్యమానికి కాంగ్రెసు ప్రాతినిధ్యంవహిస్తున్నదని నా సంపూర్ణ విశ్వాసం. కాంగ్రెసు ఏ ఆశయాలకోసమైతే పోరాటం సాగిస్తున్నదో, అవే మా దేశంలోకూడా నెరవేరాలని నేను కోరుకొంటున్నాను. అందుచేత మీ పోరాటమే నా పోరాటం అవుతున్నది.

'మ్యాన్‌క్రానికల్'లో ఒకేఒక రాజకీయవ్యాసం ప్రచురితమైంది. ఇంతకుముందే నేను మీకు తెలిపినట్లు, ఆ వ్యాసాన్ని బొంబాయిలోవున్న ప్పుడు వ్రాయకుంటా, ఆ తర్వాత వ్రాయటం జరిగితే అది మరొకవిధంగా వుండేది. పోతే, రెండోవ్యాసం అంత ప్రధానమైనదికాదు. అదీకాక, ఉపసంపాదకుడు దానిని సంక్షిప్తపర్చడంతో అది మరింత అధ్వాన్నంగా తయారైంది. (కొన్ని సందర్భాలలో ఉపసంపాదకుల సంక్షిప్తీకరణవల్ల అనలువిషయం తారుమారౌతుంది. ఉదాహరణకు, మూడు వాక్యాలను తొలగించి, ఒకేఒక వాక్యంలో "జాతీయ కాంగ్రెసును బ్రిటిషుఅధికారులు స్థాపించారు" అని ఉపసంపాదకుడు నా నోట అనిపించాడు!!!)

ఏది ఏమైనా, మీరు నన్ను అపార్థం చేసుకోకండి. మిమ్మల్ని కలుసుకొన్నప్పుడు, నేను మానసికంగా ఎంతో క్రుంగిపోయివున్నాను. అందుకు కారణం నేను పొందిన ఆశాభంగమే. అందుకే మీతో మనసు విప్పి మాట్లాడాను. మీతో మాట్లాడినవిషయాలు యింతవరకునేనుబయట పెట్టలేదు. రెజ్మీ, రామానందచటర్జీ, ఇత్యాదులకు నేను లేనిపోని ప్రాధాన్యంయిస్తున్నట్లు మీరు భావించారు. మీరు అలా భావించడానికి ఆధారంలేకపోలేదు. నేను మానసికంగా ఉల్లాసంగాఉన్నప్పుడు అలాంటి వారిపట్ల నాకెలాంటి గౌరవభావమూ వుండదు. సంవత్సరంలో అయిదు నిమిషాలపాటుకూడా అలాంటివారినిగురించి అసలుతలపోయను. గతంలో వారు నాకు అయిష్టంకలుగజేసే అనేక పనులు కావించారు. ఇలాంటిఉదంతాలు లేకపోలేదు. అనేకమంది స్వార్థపరులు, స్వాతిశయంగలవ్యక్తులు మీ ఉద్యమంచుట్టూ ఈగలవలె మూగారని నా విశ్వాసం. మీ ఉద్యమంతో వారికి సంబంధంలేకపోతే, వారికిఅసలు ఊరూపేరూ అంటూ వుండేదేకాదు. షెల్లీ అన్నట్లు వారంతా ప్రకాశవంతంగా వెలుగొందుతున్న అనామకులు! అలాంటివారిపట్ల మీ ఉద్యమానికి అప్రతిష్ఠ వస్తున్నది. అనేక దేశాలలో భారతదేశాన్ని ఆషామాషీగా చూస్తున్నారంటే, అందుకు కారణం చాలావరకు అలాంటివారే. అయినా అలాంటి వారినిగురించి అంతగా పట్టించుకోవలసిన అగత్యం లేదన్నసంగతి నేను అంగీకరిస్తాను.

నేనిక మనిద్దరిమధ్య ఏకాభిప్రాయంగల విషయాలనుగురించి ప్రస్తావిస్తాను. గతపర్యాయం, నేను భారతదేశంలోకావించిన పర్యటన ఫలితంగా, నేను సంస్థానాధీశులకు బద్ధవ్యతిరేకిగా మారాను. నేనిప్పుడు వ్రాస్తున్న చారిత్రకగ్రంథంలో ఈ విషయం వెల్లడికాగలదు. ఈ సంవత్సరం ఆకురాలుకాలంలో నేను ప్రకటించబోతున్న మరొక గ్రంథంలో అది విదితమవుతుంది. నా దృష్టిలో సంస్థానాధీశులు దేశంపాలిట చీడపురుగులు. వారిలో చాలామంది కేవలం అప్రయోజకులయినవాళ్ళు. వారినిగురించి కొందరు భట్రాజులుపొగడదేశాభక్తులు మహారాజులు! ఏమైనా వారి పీడవదుల్చుకోవడం మాత్రం అంత తేలికకాదు."

జెట్లండ్ ఆర్భాటంగురించి మీరు చెప్పినదానితో నేనూ ఏకీభవిస్తాను. నా దృష్టిలో అతను కేవలం పార్టీమనిషి. సాధారణప్రజలు ఎలాగ ఆలోచిస్తున్నారో, ఎలా బాధపడుతున్నారో, అతనికి బొత్తిగా తెలియదు. అతనివల్ల భారతదేశానికిగానీ, నా మాతృదేశానికిగానీ జరిగే మేలు పూజ్యం. అతను పదహారణాల టోరీ.

నిజమే నేను భౌతికశక్తినిగూర్చి హెచ్చుగా తలపోస్తున్నాను. నా వయస్సు ఇప్పుడు 51 సంవత్సరాలు. నేను ఉల్లాసకరమైన (ఒకప్పుడు ఉల్లాసకరమైన) ఆత్మవిశ్వాసంగల లిబరల్ ఉద్యమానికిచెందినవాణ్ణి. ఆ ఉద్యమంపుణ్యాన, గత యుద్ధానికిపూర్వం, మా దేశపు కార్మికవర్గానికి కొంత మేలుజరిగింది. (కనీసం ఆచరణలో, ఆ వర్గానికి అసలు మేలు కలుగజేసింది ఆ ఉద్యమమే) సర్వత్రా కనిపించే సకల అన్యాయాలను శాంతియుతపద్ధతులలో తొలగించవచ్చునన్నవిశ్వాసం ఆ ఉద్యమానికి వుంది. మాలో చాలామందిమి, కాటికి కాళ్ళుజాపికూర్చున్నవ్యక్తులం. మిగిలినవారు ఆశాభంగంపొందినవారు; కాలంగడవకముందే కాలంతీరిన వాళ్ళు; ఈనాడు ఇలాంటి ఘటనలుజరుగుతాయనిగానీ, జర్మన్ గూఢచారులను కాల్చివేస్తారనిగానీ, మూడవ ఎడ్వర్డ్ నాటి చట్టంక్రింద ఒక వ్యక్తిని 'దేశద్రోహ' నేరానికి ఉరితీస్తారనిగానీ—మేము 1913 లో కలలో కూడా అనుకోలేదు. పిరికితనంప్రదర్శించిన నేరానికి కాల్చివేయబడిన మనిషిని నేను కళ్ళారాచూశాను. ఈనాడు ఏ దేశంలో చూసినా కేవలం ఉదారవాదజనిత రాజకీయాభిప్రాయాలుగలిగివున్న నేరానికి అనేకమంది స్త్రీ పురుషులను ఉరితీయడం మనకు నిత్యం కనిపిస్తున్నది. ఈమధ్య ఒకనాటి రాత్రి రేడియోవార్తలు వినడం తటస్థించింది. మొదట విషాదవార్తలతో ప్రారంభమై, చివరకు విచిత్రవార్తతో ముగిసింది. మొరాకోలో ముప్ఫై మందిని కాల్చివేశారు. స్పెయిన్‌లో ఒక దళాన్ని హతంచేశారు. అబిసీనియాలో మరొక దళాన్ని తుడిచిపెట్టారు. చైనాలో అనేకమందిని చంపారు. చివరివార్త: రష్యాలో జరిగిన ఒక రైలుప్రమాదానికి ఒక స్టేషన్‌మాష్టరు కారణమని ఆరోపించి, అతనిని కాల్చివేశారు. అందుచేత ఈ ఘటనలన్నిటినీ చూస్తూవుంటే, నియంతృత్వం, సైనికపాలన అన్నవి

అసలు ఎన్నటికైనా లేకుండాపోతాయా అన్న అనుమానంకలుగుతోంది. ఐర్లండుదేశం మాకు ఎంతోదూరం లేదు; సముద్రపుపాయ మాత్రమే అడ్డంవుంది. అక్కడి స్వతంత్ర ప్రభుత్వం కొద్ది వారాలలోనే వరుసగా 80 మందిని కాల్చివేసి, ఎంతోకాలం కాలేదు.

రెండో విషయం: స్పెయిన్‌నుగురించి మేము తీవ్రంగా యోచిస్తున్నాం. నా మిత్రుడు జఫెరీ గరాట్, మరికొందరుమిత్రులు ఆ దేశంలో చాలారోజులు వుండి వచ్చారు. నాకన్నా మీకు కాంగ్రెసు ఎలాగ మరింత సన్నిహితమో, అలాగే స్పెయిన్ మీకన్నా నాకు మరింత సన్నిహితం. నేను భారతదేశంలోవుండగా ఒకవిషయం గమనించాను. అవసరమొస్తే, ఇంగ్లండు అండదండలు సంపాదించడానికీ, వీలుగలిగితే, 'దేశద్రోహాన్ని' హింసతోనైతేం అణచివేయడానికి భారతీయులు, ఆంగ్లేయులుకూడా సిద్ధంగావున్నారని గుర్తించాను. కాంగ్రెసు అధికారాన్ని స్వీకరించాలని లోగడ నేను భావించాను. ఇప్పుడుకూడా అలాగే భావిస్తున్నాను. కాంగ్రెసు అధికారాన్నిస్వీకరించి, శాసనాలు తయారుచేయవచ్చును; చట్టంవచ్చేసరికి కాంగ్రెసు అక్కడ వుండాలి. ఒకవేళ కాంగ్రెసు అధికారాన్నిస్వీకరించకపోతే, జరిగే దేమిటి? కాంగ్రెసేతర మంత్రివర్గాలు ఏర్పడటం తథ్యం. కాకపోతే నిరుపయోగమైన మంత్రివర్గాలు ఏర్పడతాయి. మతతత్త్వవాదులో, స్వార్థపరులో అధికారంలోకి వస్తారు. అంతే తేడా. గత 20 సంవత్సరాలనుంచీ చేస్తున్నట్లే, ఆ మతతత్త్వవాదులు, స్వార్థపరులు తమ ముఠాలను, మతాలను మరింత బలపరుచుకోడానికి ప్రయత్నిస్తారు.

సరే. వీటి గొడవ కేమిలెండి. దయచేసి మీ లేఖ నిరుపయోగమైనదనిమాత్రం భావించకండి. దానిని జాగ్రత్తగా చదివాను. అది నాకు గాఢంగా నచ్చింది. ముస్లిముమతతత్త్వపీడను మీరు వదుల్చుకోగలిగితే, అది చాలా గొప్పవిషయమే. మీ లేఖ చదివినతర్వాత మతతత్త్వానికి వ్యతిరేకంగా మీరు సాగిస్తున్నపోరాటంలో మీరు విజయంపొందుతున్నట్లు తెలుసుకొన్నాను. ఒకవేళ మీకు తీవ్ర ప్రమాదావస్థతటస్థించితే, అప్పుడు ఆ మతశక్తులు పటుబలప్రదర్శనకుపాల్పడతాయి. ముస్లింసంస్థానాధీశులు,

మతగురువులుకూడా మీకు వ్యతిరేకంగావున్నారు. ఏమైనా, దేవుడు మీకు మేలుచేయుగాక. భారతదేశంలో కాంగ్రెసుది అంత ముఖ్యమైన పెద్ద ఉద్యమం కాదని నేను అనుకొంటున్నానని మీరు భావిస్తున్నట్లుంది. అలాంటిభావం మీకు ఎలా కల్గిందో నాకైతే తెలియదు. చేతనైనంత వరకు మీకు సాయంచేస్తాను. ఎలాగ సాయంచేస్తారని ప్రశ్నిస్తే జవాబు చెప్పలేను. అవకాశంవచ్చినప్పుడు నా సాయం మీకు తప్పకుండా లభిస్తుంది. నా మాట నమ్మండి.

భవదీయుడు,

ఎడ్వర్డ్ థామ్సన్

"చరిత్రచూపు రేఖలు" (గ్లిమ్ప్సెస్ ఆఫ్ హిస్టరీ) గురించి—

మీ పున్న ఉన్నతస్థానాన్నిబట్టి, మీరు ఆవిధంగా వ్రాయడంతగదు. ఆంగ్లేయులంటే మీకు ఎంతో పగవున్నట్లు దీనినిబట్టి తేలుతోంది. నేనే కనుక మీ స్థానంలో వుంటే, అలా వ్రాసేవాడినికాను. ఆంగ్లేయులను గురించి రాసిన భాగాలన్నింటినీ, కడు జాగ్రత్తగా పరిశీలించివుండేవాణ్ణి. మీ గ్రంథం చదువుతూవుంటే, కొన్నిచోట్ల నాకు చాలా విచిత్రంగా తోచింది. భారతీయులమనస్సులను కలవరపెట్టేవిషయాలలోను మీరు ఎంతో ఉదారస్వభావంతోను, ఉదాత్తంగాను వ్రాశారు; అదేసమయంలో భారతదేశానికి సంబంధించని విషయాలలోమాత్రం, ముఖ్యంగా ఇంగ్లండు విషయంవచ్చేసరికి. చరిత్రకారులంతా ఇంగ్లండునే సమర్థిస్తున్నవిషయాలలో మీరు మాత్రం అంత ఉదారంగాను, ఉదాత్తంగాను వ్రాయలేదు.

ఈ గ్రంథంలోకల్లా నెపోలియన్నుగురించి వర్ణించినభాగాలే మహా చెడ్డవని చెప్పవచ్చును. నిజంచెప్పాలంటే, మీ రెందుకు నెపోలియన్ను అంతగా ఆరాధిస్తున్నారో నాకు బొత్తిగా అర్థంకాకుండావుంది. ఆ వర్ణలతోనింపిన పేజీలన్నీ మసిపూసి మారేడుకాయచేసే చందంగా వున్నాయి. న్యూరెంబర్గ్‌లో ఉరితీయబడిన దక్‌డిఇంఘీన్ గొప్పగానీ, గ్రంథవిక్రేత పామ్‌ఉదంతంగానీ మీరు అసలు ప్రస్తావించనేలేదు. ఆంగ్లేయులు "అల్పబుద్ధితో" వ్యవహరించారని విమర్శించడం ఏమాత్రం

న్యాయంకాదు. 1814లో నెపోలియన్‌ను చాలా బాగా చూడడం జరిగింది. కాని, ఆతర్వాత అతను మళ్ళా విజృంభించాడు. ఐరోపాఖండాన్ని రక్తపు పేరుటలో ముంచెత్తాడు. ఆయన సామంతులకు, ప్రష్యన్లకు అవకాశమే చిక్కితే దేశద్రోహిగాపరిగణించి కాల్చి చంపేసివుండురు. నెపోలియన్ పరాస్తమైన తర్వాత చాలాకాలంపాటు యూరప్‌లో సర్వత్రా అభివృద్ధినిరోధకత్వం పెచ్చరిల్లి నమాట నిజమే. నెపోలియన్‌ను ఓడించినవారు అధమస్థానానికిచెందినవారన్న సంగతి నే నెరుగుదును. అదే సమయంలో వారు అతనిని చాలా తేలికగా చూసి వదిలేశారు. ఎందుకంటే, వారిదృష్టిలో అతడు నిమిత్తమాత్రుడు; రాజులు దేవాంశసంభూతులని వారి విశ్వాసం. నెపోలియన్ ఆరాధత్వాన్నీ, సెయింట్ హెలీనా అమరత్వాన్నీ మీరు గొప్పగా తీసుకోవడం నాకు ఆశ్చర్యంకలుగజేసింది. నా బీరువాలో ఒక పాతపుస్తకం వుంది. అందులో 'సెయింట్ హెలీనా నిజమైన అమరజీవి' గురించిన గాథ వుంది. హడ్సన్‌లోవేని గురించి మీరు వినా వదరా? పగలో, మోసాలతో, వాగ్దానభంగాలతో, నెపోలియన్ తిరిగి అధికారంకోసం ప్రయత్నించడం మీరు ఎరుగనిదా? మీ గ్రంథంలోని ఆ పుటలను తిరగేస్తూంటే, విజయవంతమైన హింసను మీరు మెచ్చుకుంటున్నట్టు అన్పించింది. ఈ విషయాలను మీరు విస్మరించరాదు. వాటివల్ల మీపుస్తకంస్థాయి పడిపోతుంది. వాటర్‌లూ అనంతరం మిత్రరాజ్యాలు చేయగలిందీ చేయవలసిందీ ఏమిటి? మీరే ఆలోచించండి. అలాగే 1814లో మిత్రరాజ్యాలు చేసిన దేమిటో యోచించండి. 1814లో మిత్రరాజ్యాలు మరొకవిధంగా వ్యవహరించివుంటే ఏమి జరిగేదో ఆలోచించండి.

అందుకే మీరు యుద్ధంవిషయంలో నా ప్రజలపట్ల చాలా అన్యాయంగా ప్రవర్తించారంటున్నాను. మీ మాటలు, మీ వాక్యాలు చదువుతూంటే, కేవలం నౌకాదిగ్బంధనలకోసం, డబ్బుకోసం మేము ఆ పని నంతా చేసినట్టుతోస్తుంది. సరీగా నేను కొన్నిసందర్భాలలో చేసిన తప్పి దాన్నే మీరు ఈ సందర్భంలో చేశారా అనిపిస్తున్నది. ఎలుకకు ప్రాణ సంకటం పిల్లికి చెలగాటం అనే సామెత ఈ సందర్భంలో సరిపో

తుంది. దయచేసి ఇలాంటి మన స్తత్వసంబంధమైన పొరపాటుమాత్రం చేయకండి. తర్వాత ఇలాంటి తప్పిదాలకు ఘోరమైన మూల్యాన్ని చెల్లించవలసివస్తుంది. జలియన్‌వాలాబాగ్‌లో జనరల్ డయర్ ఏవిధమైన మనస్థితిలోవుండి, ఆ పనిచేశాడో, నేను వివరించడానికి ప్రయత్నించినప్పుడు, నేను ఇలాంటి తప్పిదాన్నే చేసినట్టు మీరు భావించారు. ఏ యుద్ధంలో అయితే మాదేశం పదిలక్షలమంది యువకిశోరాలను కోల్పోయిందో ఆ యుద్ధాన్నిగురించి మీరు అదేవిధంగా వ్రాశారు. మా దేశప్రజలలోప్రతిఒక్కరూ ఆ యుద్ధంలో ఒక సోదరుడినో, కుమారుడినో, ఆప్తమిత్రుడినో కోల్పోయారన్న సంగతి గుర్తుంచుకోండి.

దీనికిసంబంధించిన మరొక విషయంగురించి మరొకమాట: బెల్జియంపై దండయాత్ర పర్యవసానంగురించి మీరు పూర్తిగా అపార్థం కల్గించేవిధంగా వ్రాశారు. దండయాత్ర ప్రారంభంకావడానికి 24గంటలు ముందుగా, అగ్రగామిదళంకదులుతున్నదన్నవార్త అందరికితెలిసిందిగదా. అయినప్పుడు మీ వాదన పూర్తిగా తప్పని, దానితో తేలడంలేదా? ఫ్రాన్సుతో మేము చేతులుకలపడం తప్పనిసరి. లేకపోతే, మేము ఉత్తరోత్తరా నిర్మూలించబడేవాళ్ళం. బెల్జియం దండయాత్రగురించిన విషయాలన్నీ నాకు ఇప్పటికీ పూర్తిగా గుర్తున్నాయి. యుద్ధంలో పాల్గొనవలసివస్తుందని మా దేశప్రజలు అనుకోనిమాట నిజమే. చేసినవాగ్దానాలను అన్నిదేశాలు పాటించగలవన్న నమ్మకం కొంతకాలం వుంటూవచ్చింది. బెల్జియంరాజుచేసిన బహిరంగవిజ్ఞప్తిఫలితంగా మా దేశప్రజలంతా ఏకత్రాటిపై ప్రభుత్వంఅండను నిలిచారు. కాంగ్రెసునుగురించి మాట్లాడేటప్పుడు నేను ఏరకమైన పొరపాటును చేస్తున్నానని మీరు ఆరోపిస్తున్నారో, అదేపొరపాటును మీరుకూడా ఇతరదేశాలనుగురించి మాట్లాడేటప్పుడు చేస్తున్నారు. ప్రభుత్వాలవెనకాల, నాయకులవెనకాల గల ప్రజలను మీరు మరచిపోతున్నారుగదా?

ఏది ఏమైనా, అష్టకష్టాలకు, యమయాతనలకు లోనైనతర్వాత కూడా మీరు మహోదాత్తమైన గ్రంథాన్ని, మీ ఆత్మకథను, రచించగలిగారు. అలాంటి మీకు, మీ ఆత్మకథలో వ్యక్తమైన మహోదాత్తభావా

లకు విరుద్ధమైనవి, మీ పేరుతో ప్రకటితంకావడం, దానిని బ్రిటిష వారుగానీ, అమెరికన్లుగానీ, ఇతరవిదేశీయులుగానీ, చూడవలసిరావడం ఏమాత్రం వాంఛనీయంకాదు.

ఇంకా అనేక సందర్భాలలో మీరు ఉదాత్తతను ప్రదర్శించలేక పోయారు. వాటన్నిటినీ ఇక్కడ వివరంగా ఏకరువుపెట్టి మిమ్మలను విసిగించదలచలేను. (నిజానికి నేను వాటి నంత జాగ్రత్తగాకూడా పరిశీలించలేదనుకోండి.) కొన్నిలోపాలున్నప్పటికీ, మీ గ్రంథం అత్యంత మహత్తరమైనది; మహోన్నతమైనది. ఇందులో ఎలాంటి అతిశయోక్తి లేదు. (నేను అసలు ఈ విషయాన్ని ఇంతకుముందెప్పుడో చెప్పవలసింది.) అయితే మీ గ్రంథాన్ని స్థూలంగా పరిశీలిస్తున్న సందర్భంలో నా దృష్టికివచ్చిన చిన్నపొరపాట్లను కొన్నిటిని ఇక్కడ పొందుపర్చుతున్నాను.

659వ పేజీ: మెట్‌కాఫ్ 1830లో సుప్రీంకౌన్సిల్‌సభ్యుడు. అంతే కాని అతను 1834 వరకు గవర్నరు (జనరల్) అనడంగానీ, 1836వరకు (ఆగ్రా) గవర్నరు అనడంగానీ, సరికాదు.

673 వ పేజీ; క్రిందినుంచి 4 వ పంక్తిలో "ప్రోఫెస్" అన్న మాటకు బదులు ప్రోగ్రెస్ అని అచ్చు పొరపాటు దొర్లింది.

674వ పేజీ: రామమోహనరాయ్ సహగమనాన్ని నిషేధించడం పొరపాటని మొదట్లో భావించినా, చివరకు దానిని బలపర్చాడు. నాకు తెలిసినంతవరకు ఎవరో కొద్దిమందిని మినహాయిస్తే, అంతకుముందు సహగమనాన్నినిషేధించిన రాజులు లేరనే చెప్పవచ్చును. పెరంపూర్‌లో డచ్చివారు, గోవాలో పోర్చుగీసువారు, తంజావూరులో మహారాష్ట్రులు సహగమనాన్ని నిషేధించారు. తంజావూరులో ఆ నిషేధం సరిగా అమలు జరగనేలేదు. అక్కడ 19వ శతాబ్దంవరకు విధవలు సహగమనంచేస్తూనే వచ్చారు. అయితే స్థానికపరిస్థితులనుబట్టి సహగమననిషేధం అమలు జరపడం కొన్నిచోట్ల సులువు అన్నసంగతి మీరు గుర్తించాలి. మలబారులో మాతృస్వామికం అమలులోవుంది. అందుకే పశ్చిమతీరంలో

సహగమనం లేదు. దాని ప్రభావమే దక్షిణదేశంలోకి చొచ్చుకుపోయింది. మొగల్ చక్రవర్తులవలెనే, మెట్కాఫ్ ఢిల్లీలో సహగమనాన్ని నిషేధించారు. అక్బరు, షాజహాన్‌లకాలంలో దొంగచాటుగా సహగమనాలు పెద్దఎత్తునే జరిగాయి. 1665 లో మద్రాసులోని సిర్కా అనే పట్టణంలో బ్రిటీషు గవర్నరు పట్టుదలపై ఒక సహగమనాన్ని ఆపుచేసిన ఉదంతం నాకు గుర్తుంది.

నావద్ద రిఫరెన్సులు సిద్ధంగాలేవు. నోట్సువ్రాసుకొన్న కాగితాలను ఎక్కడోపెట్టి మర్చిపోయాను. ఏమైనప్పటికీ మహారాష్ట్రులు సహగమనాన్ని నిషేధించారనడం మాత్రం శుద్ధఅబద్ధం. 'సంగం' ప్రక్కనేగల భవనంలో, పూనాలోని బ్రిటిషుఏజెంట్ మాలెట్ నివసించాడు. ఆతర్వాత ఆ భవనంలోకి ఎలిఫిన్‌స్టోన్ ప్రవేశించాడు. ఆ భవనంలో నిలబడిచూస్తే తరచు సహగమనాలే కనిపించేవట. దానితో అతను విసుగెత్తిపోయాడట. భారతదేశంలోకల్లా మహారాష్ట్రులే అత్యంత మానవత్వప్రపూరితమైన సంప్రదాయాలను పాటించారనడం మాత్రం నిజం. అందుకే అక్కడ సహగమనాలు కొంతవరకు తక్కువగా జరిగాయి. అయితే, శివాజీతర్వాత అనేకమంది బానిసలను స్త్రీపురుషులను జంతువులను బలియివ్వడం ఎక్కువగానే జరిగింది. మహారాష్ట్రులపట్ల నాకు అపారమైన గౌరవభావముంది. ఆరోజుల్లో వారు మానవత్వంవిషయంలో మా దేశస్థులకు మిన్నగా వ్యవహరించారు. తంజావూరును మినహాయిస్తే, యింకెక్కడా సహగమనాన్ని నిషేధింపలేదు. తంజావూరులోకూడా ఆ నిషేధం సరిగా అమలుజరగనేలేదు. సహగమనాన్ని నిషేధించినఘనత ఒకేఒకవ్యక్తికి— లార్డు విలియం బెంటిక్‌కు — దక్కాలి. ఆ వ్యక్తి మహాధైర్యశాలి. ఆ విషయం మీరు ఎందుకు ఒప్పుకోలేరు? అలాంటి ధైర్యశాలికి మీ రెందుకు నీరాజనాలివ్వరు? ఉదాహరణకు ఉజ్జయినిలో సహగమనగాథలు అనేకం వున్నాయి. అహల్యాబాయికోడలు మహేశ్వర్‌లో సహగమనంచేసింది.

684వ పేజీ: నిజమే. ఆ మహర్షి రవీంద్రనాథ్‌తండ్రే.

699వ పేజీ: పెకిన్‌జోసిసీలనుగురించి నేను అనేక విషయాలను విన్నాను. చైనాకుజరిగిన అన్యాయాలవిషయంలో నేను చాలావరకు మీతో

ఏకీభవిస్తున్నాను. మతప్రచారకులే దీనికంతటికీ మూలకారకులన్న మీ సిద్ధాంతాన్నిమాత్రం నమ్మలేకుండావున్నాను. హత్యచేయబడినమతప్రచారకులలో చాలామంది చైనాదేశానికిచెందినవారే. వారిలో చాలామంది నిరుపేదలు.కేవలం దేవునిలో పూర్తిసమ్మకంవుంచి. బ్రతుకులు వెళ్ళమార్చుకునేవారు. మతప్రచారకులహత్యను సాకుగాతీసుకొని, జర్మనీ 'కియావో చౌ'ఆక్రమించుకొన్నమాటనిజమే. అయితే ఆసమయంలో బ్రిటనుమాత్రం ఆ హత్యలను స్వార్థానికి వినియోగించుకోడానికి ప్రయత్నించలేదు. (పూర్వం అనుభవాన్ని పురస్కరించుకొని, బ్రిటిషుమతప్రచారకులు తమ ప్రభుత్వానికియిచ్చిన సలహాప్రకారం బ్రిటిషుప్రభుత్వం ఆవిధంగా వ్యవహరించింది) మతప్రచారకులనుగురించి మీకు సరియైన అవగాహన వున్నట్లులేదు. చైనాకుసంబంధించిన వ్యాసంచివరిభాగంలో, బాధ్యతంతా మతప్రచారకులదేనన్నట్లు రాశారు. అది నిజంకాదు. పెకిన్‌దోపిడీలకు మతప్రచారకులు నాయకత్వంవహించారనడానికి (722 వ పేజీ) మీరు ఆధారాలు చూపగలరా? చూపలేరనే నేను అనుకొంటాను.

780వ పేజీ ; పర్షియాకుసంబంధించినది. నిజంగా బ్రిటను తలుచుకుంటే, యుద్ధానంతరం అది తేలికగా పర్షియాను స్వాధీనంచేసుకోగల్గేది లేక పర్షియాను కాపాడగల్గేది, కెమల్‌చేతిలో గ్రీకులపరాజయంగురించి మీరు వ్రాసినది నాకు బొత్తిగా బోధపడలేదు. బ్రిటీషుపన్నాగాలకు పరాజయం అని ఆ ఓటమిని మీరు వర్ణించారు. అదంతా లాయడ్‌జార్జి సొంతపూచీపై జరిగిందన్నసంగతి మీకు తెలిసేవుంటుంది. నిజానికి పర్షియావ్యవహారాలు చేయిజారిపోయినవన్నసంగతిని మా ప్రభుత్వం తమపరి గుర్తించింది. మా పూర్వమిత్రుడు మహమ్మదాషే తన స్వాతంత్ర్యం కోల్పోయాడు. అతను టెహరాన్‌కు పారద్రోలబడ్డాడు. అతనిరాజ్యం పర్షియాలో కలిపివేయబడింది. యుద్ధంముగిసేసమయానికి పరిస్థితి అంతా గందరగోళంగా వుందన్నసంగతి మీరు గుర్తించినట్లు కన్పించదు. బోల్షివిక్కుల ప్రాధాన్యంగురించి మాకు సరియైన అవగాహనలేదనిమాట వాస్తవం. నేను టైగ్రెస్‌నది దూప్పతీరంలో వుండగా, బోల్షివిక్కులు అధికారం చేపట్టినట్లు వార్తచేరింది. ఆ వార్తవిని (1917)

మా సైనికఅధికారులు దిగ్భ్రాంతిచెందారు. తికమకపడిపోయారు, మీరు ఈ సందర్భంలో వెనుక జరిగినఘటన ప్రాధాన్యంగురించి, అటు తర్వాత కొన్నాళ్ళకు వ్రాస్తున్నారన్నవిషయం మర్చిపోకండి.

382: నిజమే. వాషింగ్టన్‌కు బ్రిటిషువారు నిప్పంటించారు. అది పూర్తిగా పొరపాటే. అయితే అది పగతీర్చుకోవడంకోసం జరిగింది. అంతకుముందు అమెరికన్లు కావాలని కెనడియన్ భవనాలకు నిప్పు పెట్టారు. దానికి ప్రతీకారచర్యగా మాత్రమే బ్రిటిషువారు ఆపనిచేశారు.

368వ పేజి: దీనిని గురించి ఇంతకుముందే ప్రస్తావించాను. ఇంగ్లాండు నిర్ణయం చాలకాలంముందే జరిగిందంటే నేను ఒప్పుకోలేను. ఐర్లండ్ సమస్య కేవలం సాకు మాత్రమే ననడం సరికాదు. మీ ఉద్దేశ మేమిటో నాకు తెలుసును. మీరు ఈవిధంగా వ్రాయడం భావ్యంకాదు. ముందుముందు దీనివిషఫలితం అనుభవించవలసివుంటుంది మీరు. నెహ్రూ! ఈవిధంగా వ్రాయకూడదు. మీరు రామానందచటర్జీ కానీ, శైలేంద్రనాథ్‌ఘోష్‌గానీ కాదు. మీరు జవహర్‌లాల్ నెహ్రూ అన్నసంగతి గుర్తుంచుకోండి. ఒక ఆంగ్లేయుడు ఈవిషయాన్ని మీకు జ్ఞాపకంచేస్తున్నందుకు మన్నించండి.

465వ పేజీ: మంత్రగాళ్లు (విచెస్) నిలువునా కాల్చడం గురించి: అది ఐరోపాఖండంలోను, స్కాట్‌లాండ్‌లోను జరిగింది. అంతేకాని, ఇంగ్లండులో అలాంటి అమానుషత్వం జరిగినఉదంతం ఒక్కటీ లేదు. వారిని ముంచిచంపడమో, ఉరితీయడమో చేశారు. అదంత ముఖ్యమైన విషయం కాదు. కాని, "అమెరికాలోని భారత జాతీయకాంగ్రెసు" అధ్యక్షుడు, శైలేంద్రనాథ్ ఘోష్ అడ్డగాడిదవలె బోస్టన్‌సభలో మాట్లాడడం నాకు యిప్పటికీ గుర్తుంది. "1818లో కూడా మీరు బోస్టన్‌లో మంత్రగాళ్ళను నిలువునా కాల్చిచంపుతూవచ్చారు." దానిలో సభలోవారంతా ఒక్కపెట్టున లేచారు. ముక్తకంఠంతో జవాబిచ్చారు. మంత్రగాళ్ళను చంపడం జరిగింది. 1818లో కాదు; 1690లో; అది జరిగింది బోస్టన్‌లో కాదు; శాలేమ్‌లో. వారిని కాల్చిచంపలేదు; ఉరితీశారు. ఆతర్వాత సభలో ప్రతివారు వక్తను గేలిచేశారు.

ఈ సందర్భంలో ఒక మాట; ఆంగ్లేయులలో మూడు సద్గుణా లున్నాయి. మానవజాతిచరిత్ర అంతా దారుణంగావున్న సందర్భంలో మేము మూడు సద్గుణాలను కలిగివున్నాం. దీనిని మీరు ఉత్తరోత్తరా అంగీకరించవచ్చును. మిగతాదేశాలన్నిటికన్నా ముందుగా మంత్రగాళ్ళను ఉరితీయడం మానివేసిన దేశం ఇంగ్లండు; న్యాయశాస్త్రసహాయంలో చిత్ర హింసలుపెట్టేపద్ధతికి మొట్టమొదట స్వస్తిచెప్పింది మేము. బానిసల విముక్తికి దోహదమిచ్చింది మేము. మాలో మంచినికూడా మీరు గుర్తిం చాలి. అప్పుడే విమర్శనపాటవం హెచ్చుతుంది.

481వ పేజీ, మరికొన్ని పేజీలు: 'అశోక్' అన్నమాటకు బదులు 'అసోక్' అనే అసహ్యకరమైనపేరు దొర్లింది.

507వ పేజీ: బ్లాక్ హోల్ ఆఫ్ కలకత్తాఘటన గురించి: అది పూర్తిగా కల్పితమనడం సరికాదు; అది కేవలం అవివేకపుపనిమాత్రమే. అది బుద్ధిపూర్వకంగా జరిపింది కాదు. అలాగే 1918లో మోప్లాసైనికు లనుకూడా ఊపిరాడకుండాచేసి చంపాటు.

510వ పేజీ: 'దక్షిణాన' మహారాష్ట్రులు బ్రిటిషువారి నోడించా రని మీరు చెప్పటంలో మీరు 'దక్కన్'ను లిటరీగా అనువదిస్తున్నారని నేను భావిస్తాను. దక్షిణమంటే మా వుద్దేశంలో మైసూరుప్రాంతంకాని, వార్గాంవ్ ప్రాంతం కాదు.

559వ పేజీ: 13 వలసప్రాంతాలతోనుగల సమస్య మీ రన్నంత తేలికది కాదు; అలాగే ఏ యుద్ధాలవల్ల బ్రిటను లాభంపొందిందో, ఆ యుద్ధాలకు అయిన ఖర్చులను భరించడానికి నిరాకరించడంద్వారా ఆ దేశం పీనాసితనం ప్రదర్శించినదనడంకూడా సరికాదు. దీనికి సంబంధిం చిన వ్రాత అంతా చాలా తక్కువస్థాయిలో నడిచిందని అనుకొంటు న్నాను. మంచి అమెరికన్‌చరిత్రకారులు ఎవరూ దీనిని అంగీకరించరను కొంటాను. బ్రిటను ముందే నిర్ణయంచేసుకొని, తదనుగుణంగా 'బెల్జి యమ్ దండయాత్రను' సాకుగాతీసుకొని యుద్ధంలో ప్రవేశించినపక్షంలో "ప్రాతినిధ్యంలేని పన్ను"మాట ఏమిటి? తాడులాగితే డొంకంతా కదులు తుందన్న సంగతి మీకు తెలుసును. 13 వలసప్రాంతాలు చేసిందేమిటి?

అంతర్యుద్ధం ప్రారంభమయ్యేనాటికి, దక్షిణరాష్ట్రాలకు న్యాయశాస్త్రరీత్యా విడిపోయే హక్కు పూర్తిగా వుంది. 1789 లో వర్జీనియా విషయంలో ఈ హక్కును ఎవరూ కాదనలేదుకూడా. కాని, అమెరికన్ యువచరిత్రకారులు విప్లవకరయుద్ధాన్నిగురించి ఎలా వ్రాస్తున్నారో చూడండి.

609వ పేజీ: ఆఖరిపేరా దయచేసి మరొకసారి చూసుకోండి. కొంతకాలమైన తర్వాత "ఉదారపూరితంగా, మర్యాదపూర్వకంగా చూడడం" అంటే ఏమిటో చెప్పండి.

.........ఇవి గొప్ప గ్రంథాన్నిగురించి స్వల్పవిమర్శలు. విమర్శ పంపమని మీరు కోరారు. దానికి ఎంకాని విమర్శలనుచేసినా, అవి ఖండనగానే కన్పిస్తాయి. అన్నిటికన్నా ముఖ్యమైన ఆక్షేపణ ఒకటుంది. మీరు పంపిన మూడు పుస్తకాలపైన నా పేరు మీరు వ్రాయలేదు. మూడు కాగితపుముక్కలపై "ఎడ్వర్డ్ థామ్సన్‌కు - జవహర్‌లాల్ నెహ్రూ" అని వ్రాసి వెంటనే పంపండి.

ఇందిర, ఇక్కడకు చేరగానే మమ్మల్ని కలుసుకోమని ఆమెతో చెప్పండి. మర్చిపోకండి. నా భార్య ఆప్తమిత్రులకువూర్తై పెట్రికా అగ్నూ (వారు యిటీవలనే చనిపోయారు.)

శుభాకాంక్షలతో,

భవదీయుడు,
ఎడ్వర్డ్ థామ్సన్.

175. మహాత్మా గాంధీవద్దనుంచి

సెగోన్, వార్ధా
జూన్ 25, 1937

ప్రియమైన జవహర్‌లాల్,

సరిహద్దురాష్ట్రసమస్యపై నీవు జారీచేసినప్రకటన ఇప్పుడే నాకు అందింది. నేను, ఖాన్‌సాహెబ్ దానిని చదివాం. అది నాకు బాగా

వచ్చింది. స్పానిష్‌బాంబింగ్‌ను బ్రిటిషువాళ్ళను ఒకేగాటిని కట్టడం యుక్తం కాదేమో అని నా అనుమానం. బ్రిటిషువారికి ఎంత నష్టం కలిగిందో స్పష్టంగా తేలిందా? ఈపాటివిషయాలు తెలియవా అని నీవు నన్ను చూసి నవ్వబోకు; కోపగించుకోకు. నీమాదిరిగా ఇలాంటివిషయాలు నాకు బాగా తెలియవు. ఏవో పత్రికలలో ప్రచురితమవుతున్నంతవరకే నాకు తెలుసును. నాప్రశ్నలకు జవాబుయివ్వడంకోసం నీవు శ్రమపడనక్కరలేదు. నీప్రకటనపై వచ్చే వ్యాఖ్యానాలు పరిశీలిస్తుంటాను. ఆ వ్యాఖ్యానాలను బట్టిఅయినా కొంతవరకు సమస్య అర్థంకావచ్చును. ఏమైనా మనిద్దరం ఈసారి కలుసుకొన్నప్పుడు మిగిలిన విషయాలన్నీ నీవు చెప్పతావుగదా. మౌలానా రాగలరనే ఆశిస్తాను. ఒకవేళ ఆయన రాకపోయినా, నీవు మాత్రం అనుకొన్నప్రకారం వచ్చేయి. మూడురోజులపాటు ప్రశాంతంగా గడుపుదాం.

ఇంటిలో క్షేమమని అలుస్తాను.

ప్రేమతో,
బాపూ.

176. మహాత్మా గాంధీనద్దనుంచి

సెగోన్,
[తేదీలేదు]

ప్రియమైన జవహర్‌లాల్,

మీ లేఖలు నాకువచ్చాయి. ఇతరత్రా నాకు లభ్యంకానిసమాచారం వాటిద్వారా నాకు లభిస్తున్నది. అఖండ ఇస్లామ్ ఉద్యమాన్నిగురించి నాకు బొత్తిగా తెలియదు. అది నన్ను ఆశ్చర్యపర్చలేదు. ఇంటర్వ్యూపై నా ప్రకటన నీవు చూసేవుంటావు. నా పద్ధతి ఏమిటో నీకు తెలియనిది కాదు. ఈ సమావేశాలవల్ల నే నెంతో పుంజుకొంటుంటాను. నేను చేసే దానికి సరియైన నిర్వచనం యిచ్చేబాధ్యత నీదీ, ఇతరసహచరులదీ. పి. ఆర్. వి గురించి నీవు ఆందోళనపడవలసినపనిలేదు. ఆయన గాడి

తప్పలేదు. ఏమైనా నీకున్న అనుమానాలను ఆయనతో చర్చించి, తేల్చు కోవడం మంచిదనుకొంటాను. 15 వ తేదీన శాంతినికేతనానికి బయలు దేరుతున్నాను. అక్కడనుంచి 19 వ తేదిన వాలీకాండకు బయల్దేర్తాను.

ప్రేమతో,
బాపూ.

177. మహాత్మా గాంధీవద్దనుంచి

సెగోన్, వార్ధా
జూలై 10, 1937

ప్రియమైన జవహర్‌లాల్,

నిన్న మౌలానాసాహెబ్‌తో చాలాసేపు ముచ్చటించాను. రాష్ట్రాలలో ముస్లిం మంత్రులను నియమించే విషయంలో, ఆయనతో సంప్రతించాలనుకుంటే, ఆ విషయాన్ని బహిరంగంగా ప్రకటించడం మంచిది. అందుకు మౌలానా అంగీకరించాడు. కార్యవర్గంతో సంప్ర తించడం అవసరమనుకొంటే, ఆ విషయాన్ని వెంటనే తంతిద్వారా తేల్చుకోవడం అవసరం.

హిందీ—ఉర్దూ సమస్యనుగురించి సాధ్యమైనంత త్వరలో లేఖ వ్రాస్తావని ఆశిస్తున్నాను.

నీ
బాపూ.

178 మహాత్మా గాంధీవద్దనుంచి
[సంస్కరించబడనిలేఖ]

సెగోన్, వార్ధా
జూలై 15, 1937

ప్రియమైన జవహర్‌లాల్,

ఈవేళే ఎన్నికలరోజు. పరిస్థితిని గమనిస్తున్నాను.

కాంగ్రెసుమంత్రివర్గాల విధులు, తదితర సమస్యలను గురించి వ్యాసం వ్రాయడం ప్రారంభించాను. ఈ విషయం తెల్పడానికే ఈ లేఖ

వ్రాస్తున్నాను, మొదట్లో కొంత సందేహించాను. కానీ, మనస్సులో గట్టిగా వున్నభావాలను బహిర్గతంచేయటం నా విధి అనుకొని, ఈపనికి పూనుకొంటున్నాను. నా వ్యాసం 'హరిజన్'లో ప్రచురితంకాక పూర్వమే. నీ కొకప్రతిని పంపిస్తాను. మహదేవ్ పంపిస్తాడు. అతని వద్ద ఆ ప్రతి వుంటే పంపిస్తాడు. దానినిచూసినపిమ్మట, నా వ్రాతను కొనసాగింపవచ్చో లేదో తెలియజేయి. పూర్తిబాధ్యత నెత్తినవేసుకుని, నీవు కర్తవ్యాలు నిర్వర్తిస్తున్నప్పుడు మధ్యలో, జోక్యం కల్పించుకోటం నాకు యిష్టంలేదు. దేశానికి నీవల్ల సాధ్యమైన మెచ్చుపనులు సమకూరా అని కోరుకొంటున్నాను. నా వ్రాతలు నీకు ఇబ్బంది తెచ్చిపెడితే, నేను చెప్పనలవికాని హానిచేసినవాణ్నవుతాను.

మౌలనాసుగురించి నేను వ్రాసినలేఖ నీకు అందేవుంటుందని తలుస్తాను.

ప్రేమతో,

బాపూ.

179 మహాత్మా గాంధీవద్దనుంచి

సెగోన్. వార్ధా,

జూలై 22, 1937

ప్రియమైన జవహర్‌లాల్,

మౌలనాసాహెబ్ వార్ధాలో ఒకరోజు గడిపివెళ్ళారు. మేము దీర్ఘంగా ముచ్చటించుకొన్నాం. శాసనసభలోని ముస్లింలీగ్ సభ్యులకు కాంగ్రెసుసభ్యులకు మధ్య కుదిరిన ఒప్పందం ప్రతిని ఆయన నాకు చూపారు. అది బాగుందని భావించాను. అయితే, ఆ ఒప్పందాన్ని నీవు ఆమోదించగా, టాండన్‌జీ వ్యతిరేకిస్తున్నట్టు ఆయన నాతో చెప్పాడు. మౌలానా సూచనప్రకారం దీనినిగురించి టాండన్‌జీకి లేఖవ్రాశాను. అందుకు అభ్యంతరం ఏమిటి?

మంత్రులకు పెద్దభవనం, కారు అలవెన్సులతో రు. 500 జీతం నిర్ణయించడాన్ని తీవ్రంగా విమర్శిస్తున్నారు. దానినిగురించి ఆలోచించే

కొలదీ, ఆడంబరమైన ఈ ఆరంభాన్ని చూస్తుంటే అసహ్యమనిపిస్తున్నది. మౌలానాతో కూడా ఈ విషయం చెప్పేంచాను.

ఇంటిల్లిపాదీ క్షేమమా ?

ప్రేమతో,

బాపూ.

180. వల్లభాయ్ పటేల్ వద్దనుంచి

కాంగ్రెసు భవనం,
బొంబాయి, 4,
1937 జూలై 30

అంతరంగికం

ప్రియమైన జవహర్‌లాల్,

గత కొలది రోజులలోను అతిముఖ్యమైన సమస్యలు కొన్ని ఉత్పన్నం కావటాన నేను 27వ తేదీన వార్ధా వెళ్ళి, ఈవేళ ఉదయమే తిరిగి వచ్చాను. అనేక విషయాలపై బాపూతో దీర్ఘంగా సమాలోచించాను. వివిధ రాష్ట్రాలలో నిర్ణయించబడిన జీతాలను గురించీ, అలవెన్సులను గురించీ ఆయన అధికంగా ఆందోళన చెందుతున్నట్టు కనిపిస్తుంది. బాపూతో చర్చించిన మీదట ముసాయిదా ఆదేశాలను కొన్నింటిని తయారు చేశాను. ఆ ముసాయిదా ఆదేశాల ప్రతిని మీ ఆమోదంకోసం పంపుతున్నాను. అవసరమనుకొన్న సవరణలు మీరు చేయవచ్చును; అయితే ఈ సమస్య తక్షణమైనది కనుక, ఈ ముసాయిదా ఆదేశాల ప్రతిని సరాసరి ఆరు రాష్ట్రాల ప్రధానమంత్రులకు పంపిస్తున్నాను. ఇవి ముసాయిదా ఆదేశాలు మాత్రమేననీ, వీటిని మీరు ఆమోదించవలసివుంటుందనీ, స్పష్టంగా వారికి తెలియజేశాను. మీనుంచి ఆమోదముద్ర లభించినతర్వాత నికరమైన ఆదేశాలను పంపించగలననికూడా వారికి తెలిపాను.

మీరాష్ట్రంలో ముస్లింలీగుతో జరిపిన సంప్రతింపులు విఫలమైనట్లు పత్రికలద్వారా తెలుసుకొన్నాను. ప్రస్తుతపరిస్థితులు పరిష్కారానికి పరివక్వంగా లేవేమోననుకొంటున్నాను.

శ్రీ నారిమన్ వార్ధానుంచి తిరిగివచ్చినపిదప, తన నిందాప్రచారాన్ని మరింత జోరుగా సాగించడానికే నిశ్చయించుకొన్నాడు. పత్రికాప్రచారం అసహ్యకరంగాను, భయోత్పాతంకలిగించేరీతిలోను సాగుతోంది. నారిమన్ జారీచేసిన తాజా పత్రికాప్రకటనను మీరు చూసేవుంటారు. ఆయన ఇంతకుపూర్వం ఏ విచారణనైతే కోరుతూవచ్చాడో, దానినే ఇప్పుడెలాగైనా తప్పించాలని ప్రయత్నిస్తున్నాడన్నవిషయం సుస్పష్టం. నెపాన్నంతా కార్యవర్గంనెత్తినరుద్దాలని ఆయన చూస్తున్నాడు. బాపూతో ఆయన ఉత్తరప్రత్యుత్తరాలు జరుపుతున్నాడు. బహుశా, బాపూ త్వరలోనే తుదిప్రకటన జారీచేయవచ్చు. మీరు తనకు వ్రాసినలేఖలోనుంచి నారిమన్ కొన్ని భాగాలను ఉల్లేఖించాడు. అవసరమైతే, మీ లేఖపూర్తిపాఠాన్ని ప్రకటించడానికి నాకు అనుమతియివ్వండి, హాక్షికపద్ధతిలో కొనసాగుతున్న ఈ వివాదంనుంచి నేను ప్రస్తుతం దూరంగావుంటున్నాను. బాపూ ప్రకటన వెలువడినతర్వాత, మీరుకూడా తుదిప్రకటన జారీచేయడం అవసరంకావచ్చును. వారిద్దరిమధ్య జరిగిన ఉత్తరప్రత్యుత్తరాలన్నింటినీ, రేపు మీకు పంపిస్తాను. వాటిని ఒకసారి పరిశీలించండి.

నేను రేపు అహ్మదాబాద్ బయలుదేరి వెడుతున్నాను. అక్కడ కొన్నాళ్లు వుంటాను.

మీరు కులాసాగావున్నారని ఆశిస్తాను.

భవదీయుడు,
వల్లభాయ్.

తాజాకలం: ఈ లేఖపై సంతకంపెట్టినతర్వాత ఇప్పుడే ఎ. పి. వార్తాసంస్థద్వారా నారిమన్ ప్రకటన చూశాను. విచారణ డిమాండ్‌ను ఉపసంహరించుకొంటూ ఆయనొక ప్రకటనచేశాడు. అయినా, ఆయన తన ఆరోపణలనుమాత్రం ఉపసంహరించుకోలేదు. అది పెద్దమనిషిలక్షణం అనిపించుకోదు. ఇక బాపూ తనప్రకటన జారీచేస్తారు. తర్వాత మీరు తుదిప్రకటన చేయవచ్చు.

పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ
అల్హాబాద్.

## 181. మహాత్మా గాంధీవద్దనుంచి.

సెగోన్, వార్ధా.
జూలై 30, 1937

ప్రియమైన జవహర్‌లాల్,

హిందీభాషపైన నీవు వ్రాసినవ్యాసం అందినది. ఈవిషయం మహదేవ్ నిన్ననే నీకు తెలియజేసివుంటాడని ఆశిస్తాను. దానితోపాటు, వైస్రాయి నన్ను ఢిల్లీకిరమ్మని ఆహ్వానించినసంగతికూడా ఆయన నీకు చెప్పివుంటాడనే అనుకొంటాను. వైస్రాయి ప్రత్యేకకారణాన్ని పురస్కరించుకొని, నన్ను ఆహ్వానించలేదు. కులాసాగా కబుర్లుచెప్పుకొనేందుకు 4వతేదీన రమ్మని ఆయన తెలియజేశారు. అసలు ఆయనను కలుసుకోవాలని నేను అనుకొంటున్నసమయంలోనే ఈ ఆహ్వానం అందింది. ఖాన్ సాహెబ్‌పై నిషేధంగురించి వైస్రాయితో చర్చించాలనీ, అలాగే సరిహద్దురాష్ట్రంలో పర్యటించేవిషయంకూడా ఆయనతో ముచ్చటించాలనీ నేను అనుకొంటున్నాను. ఇదేవిషయాన్ని తెలుపుతూ వైస్రాయికి సమాధానంపంపాను. అనుకొన్నప్రకారం 4వతేదీకి ఢిల్లీ చేరుతాను. 11-30 గంటలకు వైస్రాయిని కలుస్తాను. అందుచేత అదేరోజున మళ్లీ తిరుగు ప్రయాణమవుతాను. 6వతేదీన వార్ధాచేరుతాను.

ఈమధ్య బొంబాయిలో చెలరేగిన కలహాలనుగురించీ, పాడు హిందీ - ఉర్దూవివాదంగురించీ నేనువ్రాసిన లేఖకు జహీర్ జవాబు రాశారు. ఆ జాబుప్రతిని నీకు పంపడంకోసం ఈ లేఖను వ్రాస్తున్నాను. జహీర్‌లేఖ చాలా ముఖ్యమైనది. దానిని నీకు చూపకుండావుండలేను.

ఝాన్సీ ఎన్నికఫలితం ఘోరపరాజయంగా నేను పరిగణించడం లేదు. అది గౌరవప్రదమైన ఓటమే. మనం కనుక గట్టిగా కృషిచేస్తే, కాంగ్రెసుసందేశాన్ని ముస్లిములలోకి సమర్థవంతంగా కొనిపోవచ్చునన్న ఆశ ఈ ఎన్నికవల్ల కలుగుతోంది. అయితే గ్రామాలలో మనం గణనీయమైన కృషిసాగించనిదే కేవలం సందేశాన్ని కొనిపోవడంవల్ల ప్రయోజనం అంతగా వుండదన్న నా అభిప్రాయంలో ఎట్టిమార్పూ లేదు.

అయినా, మనం జనంలో శక్తిని జనింపజేసేపద్ధతిపై అంతా ఆధారపడి వుంటుంది.

మద్రాసులో మెహరాలీ చేసినప్రసంగం నాకు కనువిప్పు కల్గించింది. ఆయన సోషలిస్టులదృక్పథాన్ని ఎంతవరకు ప్రతిబింబిస్తున్నాడో నాకైతే తెలియదు. ఆయనప్రసంగం కత్తిరింపును రాజాజీ నాకు పంపించారు. బహుశా, అదే ప్రసంగంప్రతిని ఆయన నీకూ పంపించివుంటారు. నా దృష్టిలో ఆ ప్రసంగం పాడుది. దీనిని నీవు పరిగణనలోకి తీసుకోవాలి. ఆ ప్రసంగం కాంగ్రెసువిధానానికి విరుద్ధంగా వుంది.

మద్రాసులో రాయ్‌కూడా ప్రసంగించాడు. ఈ ప్రసంగాలకత్తిరింపులన్నీ నీకు అందుతూనేవున్నవని అనుకొంటాను. ఏదిఏమైనా నీ పరిశీలనకోసం ఆ ప్రసంగాలకత్తిరింపులను నీకు పంపిస్తున్నాము. వీటిని ప్యారీలాల్ నాకోసం సమకూర్చిపెట్టాడు. రాయ్ నాకూ లేఖలు వ్రాస్తున్నాడు. అతనువ్రాసిన తాజాలేఖను నీవు చదువు. ఆ లేఖను నేను చించి పారేయకుండావుంటే, దీనితో జతపర్చి పంపుతాను. అతనివైఖరినిగురించి నీ అభిప్రాయమేమిటి? నే నింతకుముందే నీకు తెలిపినట్లు, అతనిని అర్థంచేసుకోటం నాకు శక్యంకాకుండావుంది.

ఖాదీని జీవనాడి'అని నీవు వర్ణించావు. ఈ నానుడి మనదేశంలో ఆంగ్లభాష చలామణీఅవుతున్నంతకాలం సజీవంగా వుంటుంది. ఈ పదబంధం అమోఘమైనది. మహాకవిమాత్రమే దీనిని హిందీలోకిఅనువదించగలడు. దీనిలోని పటుత్వమైనభావాన్ని మరొకభాషలోకి అనువదించడం ఎంతోకష్టం. నాకు సంబంధించినంతవరకు ఇది కవిత్వంమాత్రమే కాదు; శాశ్వత సత్యం ఇందు గర్భితమైవుంది. దీని పూర్తిప్రాధాన్యాన్ని గ్రహించడానికి చాలాకాలం పడుతుంది.

ప్రేమతో,
బాపూ.

రాయ్‌ప్రసంగాన్నిగూర్చిన ప్రస్తావన, మెహరాలీప్రసంగంగూర్చి వ్రాసిన పేరాక్రిందనే వున్నదికాన, నేను ఈ రెండింటినీ ఒకేరీతిని పరిగణిస్తున్నానని నీవు అనుకోనక్కరలేదు.

## 182. మహాత్మా గాంధీవద్దనుంచి

రైలుమీద,
ఆగస్టు 3, 1937

ప్రియమైన జవహర్‌లాల్,

మమ్మల్ని ఢిల్లీకితీసుకుపోతున్నరైలులో కూర్చొని ఈ లేఖ నీకు వ్రాస్తున్నాను. ఉపోద్ఘాతాన్ని—లేదా మరేపేరుతోనైనా పిల్చుకో—దీనితో జతపర్చి పంపుతున్నాను. ఇంతకన్నా వివరంగా వ్రాయడం నాకు సాధ్యంకాదు.

పుష్తూ, పంజాబీలకు ముందు 'బహూశా' అని ఒకపదం ప్రయోగించావు. ఆ పదాన్ని తొలగించడం మంచిదని నా సూచన. ఉదాహరణకు ఖాన్‌సాహెబ్ పుష్తూను వచ్చినా వదులుకోడు. దానికి ఏదో లిపి వుంది. దాని పేరు మర్చిపోయాను. ఇక పంజాబీసంగలా? గురుముఖిలిపిలో లిఖితమైన పంజాబీకోసం సిక్కులు పడిచచ్చిపోతారు. ఈ లిపిమీద అంత మోజులేదు. సింధీవలెనే, సిక్కులను ఇతర హిందువులనుంచి విడతీయడానికి ఈ లిపిని ప్రత్యేకంగా సృష్టించివుంటారు. ఏమైనప్పటికీ, గురుముఖిలిపిని ఒదులుకొనేటట్లు సిక్కులచేత ఒప్పించడం ప్రస్తుతం సాధ్యం కాదు.

దక్షిణాదిభాషలన్నింటికీ ఒకేలిపిని రూపొందించాలని నీవు సూచించావు. దక్షిణాదినవున్న నాలుగుభాషలలిపులను కలగాపులగం చేయడంకన్నా, వారంతా దేవనాగరిలిపిని స్వీకరించడమే సులభమేమో. కలగాపులగపు లిపిని వారు స్వీకరిస్తారనుకోవడం ఆచరణయోగ్యం కాదేమో. అందుచేత, ఈవిషయంలో నా దొకసూచన. సంస్కృతభాషతో మూలసంబంధంగల ప్రాంతీయభాషలన్నీ సవరించబడిన దేవనాగరిలిపిని స్వీకరించడం మంచిదని సూచిస్తే సరిపోతుందనుకొంటాను. ఈ ప్రచారం సాగుతూన్నదన్నసంగతి నీకు తెలిసేవుంటుంది.

నీవు, నావలెనే భావిస్తున్నపక్షంలో ఒకసంగతి స్పష్టంగా ప్రకటించు. ఏదోఒకరోజున హిందువులు, ముస్లిములు కలసిమెలసి బ్రతకక

తప్పదు; అలాగే హిందూస్థానీభాష మాట్లాడేవారంతాకూడా ఏదోఒక రోజున ఒకేలిపిని దేవనాగరిలిపిని చేపట్టకా తప్పదు. ఈ ఆశాభావాన్ని వెలిబుచ్చడంలో, నీవు ఎందుకు సందేహించాలి? దేవనాగరిలిపి మరింత శాస్త్రీయమైనది. సంస్కృతభాషాజనితమైన అనేకప్రాంతీయభాషలలిపు లకు అది సన్నిహితంగావుంది.

నా సూచనలను నీవు మొత్తంగానో, లేక పాక్షికంగానో, అంగీక రించినపక్షంలో,నేనుచెప్పినట్టు సవరించడం, అంత కష్టంకాకపోవచ్చును. నీ కాలాన్నివృథాచేయకూడదన్నదృష్టితో, అసలు నేనే ఆ పని చేద్దామను కొన్నానుగాని, ప్రస్తుతం నా ఆరోగ్యపరిస్థితిదృష్ట్యా అది సాధ్యంకాలేదు.

నేను, నీ సూచనలను బలపర్చుతున్నానంటే, దానిఅర్థం హిందీ సమ్మేళనంవారు హిందీపదాన్నిఉపయోగించకుండా నేను చేస్తానని మాత్రం కాదు. అలా అర్థంచేసుకోవనే అనుకొంటాను. నేను పోగలిగి నంతదూరం ముందుకు పోయి, నీ సూచనలు ఆమోదించాను.

నీవుకనుక నా సూచనలతో ఏకీభవించలేకపోయినపక్షంలో, స్పష్టతకోసం ఉపోద్ఘాతంచివరన ఈ క్రిందివాక్యాన్ని చేర్చు. "ఏది ఏమైనప్పటికీ, జనరల్‌గా వీటిని హృదయపూర్వకంగా ఆమోదించ డంలో నా కెట్టి అభ్యంతరంలేదు."

ఇందూ ఆపరేషన్ సక్రమంగా జరగగలదని ఆశిస్తాను.

ప్రేమతో,
బాపూ

183. మహాత్మా గాంధీవద్దనుంచి

అగస్టు 3, 1937

హిందీ - ఉర్దూసమస్యపైన జవహర్‌లాల్‌నెహ్రూ వ్రాసిన వ్యాసాన్ని శ్రద్ధగా పరిశీలించాను. ఈ సమస్య దురదృష్టవశాత్తు రాను రాను వివాదాంశంగా పరిణమించింది. ఈ వివాదం ఇంత అసహ్యకరంగా తయారుకావలసిన అగత్యమేమిటో నాకు బోధపడడంలేదు. వాద, వివా

చాలసంగతి అటుంచండి. ఈ సమస్యపై జవహర్‌లాల్ వ్రాసిన వ్యాసం చక్కగావుంది. సమగ్రమైనవిధంగా సమస్య విశదీకరించబడింది. విద్యా విషయకంగా వివరించబడింది. ఈ సమస్యతో సంబంధంకలవారంతా, జవహర్‌లాల్‌చేసిన నిర్మాణాత్మకసూచనలను పాటిస్తే, మతతత్వరూపం ధరించిన ఈ వివాదం సమసిపోతుంది. ఈ సూచనలు సమగ్రమైనవి; సహేతుకమైనవి.

ఎమ్. కె. గాంధీ

184. మహాత్మా గాంధీవద్దనుంచి

రైలులోనుంచి,
ఆగస్టు 4, 1937

ప్రియమైన జవహర్‌లాల్,

నా తెలివి పాడుగాను! నీ లేఖ అందినపిమ్మట, నా ఫైలుతీసి చూశాను. తెల్ల బోయాను: మెహరాలీప్రసంగంప్రతి నా ఫైలులోనే వుంది. నేను ప్రస్తావించింది అతని ప్రసంగంగురించే కాని, మసానీ ప్రసంగం గురించి కాదు.

రైలు విపరీతంగా కుదిపేస్తున్నసమయంలో నే నీ లేఖను వ్రాస్తు న్నాను. ఢిల్లీనుంచి వార్ధా తిరిగిపోతున్నాను. ఇప్పుడు రాత్రి 10-30 గంటలయింది. నిద్రనుంచి లేచాను. ప్రసంగంసంగతి గుర్తుకొచ్చి, ఫైలుతీసి పరికించాను. నిన్నటిరైలుపెట్టె కాస్త బాగుంది.

వైస్రాయిని కలిశాను. వెలువడిన అధికారప్రకటనను నీవు ఈపాటికి చూసేవుంటావు. ఆ ప్రకటనలో ఇంటర్వ్యూ సారాంశం చక్కగా పొందుపర్చబడింది. ఇంకా ఇతరవిషయాలు వున్నాయి. కృప లానీ నిన్ను కలుసుకొన్నప్పుడు ఆ విషయాలు నీకు తెలియజేస్తాడు. మరొకమాట: వైస్రాయి నన్ను ఆహ్వానించినట్టే నిన్నూ ఆహ్వానించ వచ్చును. ఆహ్వానం పంపిస్తే, దానిని నీవు తిరస్కరించకపోవచ్చునని నేను ఆయనతో అన్నాను. అంతేనంటావా?

రాయ్ ప్రసంగాలను పంపించి, నీకు అనవసరశ్రమ కల్గించినందుకు విచారపడుతున్నాను. అయినా నీవు వాటిని తప్పక చదువుతావని అభిప్రాయపడ్డాను. ఏమైనా వాటిపై నీవు వెంటనే నీ అభిప్రాయం తెలియజేయనక్కరలేదు. నీవు ఆ ఉపన్యాసాలను ఈపాటికే చదివివుండకపోతే, తీరికదొరికినప్పుడే చదువు.

ఇంకాకు బొంబాయిలో ఆపరేషన్ చేయిస్తున్నట్లు తెలుసుకొన్నాను.

ప్రేమతో,

బాపూ.

185. మహాదేవ్ దేశాయ్ వద్దనుంచి

ఝాన్సీసమీపంలో,

ఆగస్టు 4, 1937

ప్రియమైన జవహర్‌లాల్ భాయ్,

మీకు వ్రాస్తానని వాగ్దానంచేసిన లేఖను ఈవేళ పగలు వ్రాయలేకపోయాను. బాపూలేఖను అర్ధరాత్రి 1-30 గంటలకు ఝాన్సీలో పోస్టుచేయవలసివున్నందున, దానితోపాటే నా లేఖనుకూడా జతపర్చుతున్నాను. నేను వక్కాణించదల్చుకొన్న అంశాలు ఇవి:

(1) పంజాబీ, గురుముఖిపదాలముందున్న "బహూశా" అన్న పదం తొలగించాలి. (2, 10 పేజీలు) బాపూ ఈ సూచనచేశారు. ఈ సందర్భంలో నే నొకవిషయం చెప్పదలచాను. సిక్కులకుచెందిన ఉత్తమ గేయాలన్నీ (గురునానక్‌వీ, ఇతరులవీ) పంజాబీలోనే వున్నవి. అది వారు గర్వించదగ్గసంపద. పంజాబీపరిగణనకోసం సిక్కులు పోరాడకపోయినా, ఆ భాషవిశిష్టతను గుర్తించాలి. పోతే, పుష్తూభాషకు సంబంధించినంతవరకు. వెనక ఎప్పుడో సింధీకివలెనే, పుష్తూకుకూడా ఒకలిపి వుందని ఖాన్‌సాహెబ్ నాతో చెప్పినట్లు గుర్తు. అది ఉర్దూలిపిని పోలివుంటుంది. అది పఠానుల మాతృభాష. ఖాన్‌సాహెబ్, మరికొందరు

ఉర్దూను శ్రమించి నేర్చుకొన్నందువల్లనే దానిని మాట్లాడగలుగుతున్నా పరానుజనసామాన్యానికి ఉర్దూభాష తెలియనే తెలియదు.

(2) పేజీ 4 (1,2 పేరాలు) పేజీ 11 (6,7 పేరాలు) సింధీభాష: సింధీని ఉర్దూ తనలో విలీనంచేసుకోవచ్చునని మీరు సూచించారు. బహుశా ఉర్దూనే సింధీ తనలో విలీనంచేసుకొంటుందేమో! సింధీ ఉర్దూను పరిపూర్ణమొనర్చింది. అరబిక్, పర్శ్యన్‌లిపులలో లేని కొన్ని ధ్వనిసంకేతాలను సంస్కృతంనుంచి తీసుకొని, సిందీ మరింత సంపుష్ట మైంది. కొందరికి కష్టంకలిగితే కలగవచ్చుగాక, ఒకటిమాత్రం వాస్తవం. సింధీ ఉర్దూభాషరూపురేఖలు మరింత చక్కగా తీర్చిదిద్దింది. అందుచేత ఉర్దూనే సింధీ విలీనంచేసుకొంటుందికాని, సింధీని ఉర్దూ విలీనంచేసు కోదు. బహుశా మీ భావంకూడా ఇదేనేమో. అయితే ఇతరులకు కష్టం కల్గింపడమెందుకని ఆవిధంగా మీరు వ్రాసివుంటారు. అంతేకదూ?

దక్షిణభారతదేశం: యథాలాపంగా దొర్లిన పేరావల్ల (4వ పేజీ పైభాగంలోది) ఉన్మాదులైవున్న కొందరు ఆంధ్రులు, తమిళులు, కన్నడి గులలో వేర్పాటువాదత్వం ప్రబలేఅవకాశం వుంది. ఇది హిందీపాలిట ప్రక్కలో బల్లెంగా తయారుకావచ్చును. నిజానికి, తమిళ, మళయాళీ భాషలకు. దేవనాగరికీమధ్య, అలాగే తెలుగు, కన్నడభాషలకు దేవ నాగరికీమధ్య మరింత సన్నిహితసంబంధంవుందని పండితులు గుర్తిం చారు. తమిళ, మళయాళీభాషలు ఒక కోవకు, తెలుగు, కన్నడభాషలు మరొక కోవకు చెందినవి దక్షిణభారతంలో దేవనాగరిలిపిని చేపట్ట డానికివీలుగా, ఆ లిపిలో కొన్ని మార్పులుసూచిస్తూ రాజగోపాలాచారి అనేక వ్యాసాలువ్రాశారు. దక్షిణభారతదేశంలో అనేక లక్షలమంది దేవ నాగరిలిపిని సునాయాసంగా అభ్యసించారు. దీనినిబట్టి మొత్తం దక్షిణాది కంతటికీ దేవనాగరిలిపి తగివుంటుందని గట్టిగా చెప్పవచ్చును. మొన్ననీ మధ్య దక్షిణభారతీయ పౌరాష్ట్రియు డొకడు (జనాభా యాభైవేలు)నా కొక లేఖవ్రాశాడు; తమకు తెలుగు - తమిళ మిశ్రమలిపివుందనీ, ఇప్పు డది అంతరించిపోయిందని తాము తెలుగు, తమిళలిపులు స్వీకరించదంకన్నా, దేవనాగరిలిపిని సంతోషంతో స్వీకరిస్తామనీ అతను తెలిపాడు.

తమిళులు, ఆంధ్రులు, కన్నడిగులుకూడా మన శాస్త్రాలను చద వకతప్పదుగదా. శాస్త్రాలన్నీ సంస్కృతంలోనే వున్నాయిగదా. అందుచేత వారు దేవనాగరిలిపినిస్వీకరించడం కష్టంకాకపోగా,శాస్త్రాల అభ్యాసానికి అది తోహదకారిగావుంటుందికూడా.

అఖరివిషయం : దక్షిణభారతీయభాషలుకనుక తమ సొంత మిశ్రమలిపిని రూపొందించుకోవడమంటే (ఇది సాధ్యమనే నా అభి ప్రాయం) ఉత్తరాదివారు కలకాలం దక్షిణభాషలు నేర్చుకొనే అవకాశం లేకుండాచేసినట్టేఅవుతుంది. సమష్టిలిపివుండడంవల్ల ఉత్తరాదివారు తమిళ, తెలుగుభాషలు నేర్చుకోడానికీ ఎంతో ప్రోత్సాహంకలుగుతుంది. (నేను రెండుభాషలనే ప్రస్తావిస్తున్నాను. ఎందుకంటే మళయాళీభాష తమిళ, సంస్కృతభాషల సమ్మిశ్రం. తమిళ, తెలుగుభాషలతో సరిపోల్చిచూస్తే కన్నడభాషలో చెప్పుకోదగ్గసాహిత్యం లేదు.)

ఒకసంగతిచెప్పడం మర్చిపోయాను. తెలుగు, కన్నడ, మళయాళీ భాషలలో సంస్కృతపదాలు చాలా జాస్తి. పైగా ఈ సంస్కృతపదాలు అంతకంతకు హెచ్చుతున్నాయి. చివరకు తమిళభాషసైతం రానురాను అనేకానేక సంస్కృతిపదాలను తనలో కలుపుకొంటున్నది. దేవనాగరి లిపిని స్వీకరించడంవల్ల ఈ పరిణామం మరింత త్వరితమవుతుంది.

అందుచేత మీరు రెండులిపులను మాత్రమే—దేవనాగరి, పర్షియన్— పరిగణనలోకి తీసుకొంటారని ఆశిస్తాను.

(రి) 7వ పేజీ: ఇది చాలా స్వల్పవిషయం. మీ దృష్టికితేవడానికి మాత్రమే ఈ విషయం వ్రాస్తున్నాను. ప్రజలతో సజీవసంబంధాలుపెట్టు కోవడంలో బెంగాలీభాష చాలా ముందుకుపోయిందని మీరు అంటున్నారు. ఆ విషయం నాకు తెలియదు. మొన్ననీమధ్య అమియచక్రవర్తితో మాట్లాడుతూన్నసందర్భంలో ఆయన అన్నారుగదా: చివరకు రవీంద్ర నాధ్ టాగూర్‌గ్రంథాలుసైతం బాగా అమ్ముడుపోవడంలేదు. ఇన్నాళ్ళ బట్టీ ఖర్చయిన గీతాంజలిప్రతులు రెండువేలుమాత్రమే. బయట జీవన స్మృతి వెయ్యిప్రతులు అమ్ముడుపోయినవి. మరి దీనినిబట్టి మీరు నేను వచ్చినఅభిప్రాయానికే వస్తారు?

ఝూన్సీ వచ్చేస్తున్నది. ఈ లేఖను ముగించకతప్పదు. దీనిని తిరిగి మరొకసారి చూసుకోడానికికూడా నాకు అవకాశంలేదు. దస్తూరీ బాగుండనందుకు క్షమించండి. అది నా తప్పుకాదు; ఈ రైలుబండిది.

మీ
మహదేవ్

186. మహాత్మా గాంధీవద్దనుంచి

సెగోన్, వార్ధా
ఆగస్టు 8, 1937

ప్రియమైన జవహర్‌లాల్,

నేను, నీకు, మెహరాలీగురించి వ్రాసినజాబులో ఒకవిషయం రాయడంమర్చిపోయాను. వేసవిపాఠశాలపై దీలను విడుదలచేస్తూ రాజాజీ జారీచేసిన ప్రకటనవిషయం చెప్పడంమర్చాను. నీ జాబు అందకపూర్వమే నేను దానిని చదివాను. అందులో మనస్సుచివుక్కుమన్పించేవిషయమేదీ నాకు కన్పించలేదు. వేసవిపాఠశాలవిద్యార్థులప్రవర్తనను నీవు ఆమోదించినందున నీకు అలా అన్పించివుండవచ్చును; నేను వారిచర్యలను ఏవిధంగాను సమర్థించజాలను. చట్టప్రకారం శాసనధిక్కారం నేరమేఅవుతుంది. ఖైదీలను విడుదలచేయకమంచే నేరస్థులచర్యలను ఆమోదిస్తున్నట్టు అర్థంకాదు. ఈ విషయం స్పష్టంగా గుర్తించడం అవసరమనుకొంటాను. అధికారంలోవున్న కాంగ్రెసు, అనేక సందర్భాలలో ఇతఃపూర్వపరిపాలకులు ప్రయోగించిన పదజాలంవంటిదానినే ఉపయోగించవలసిరావచ్చును. అయినప్పటికీ అంతర్గతంగావుండే ఉద్దేశం మాత్రం వేరుగావుంటుందన్నసంగతి గమనించాలి.

ఆపరేషన్‌కోసం నీవు బొంబాయిలోవున్నంతకాలం రోజులు హాయిగా గడుపుతావనే ఆశిస్తాను. ఆపరేషన్ పూర్తికాగానే తంతి పంపించు.

ప్రేమతో,
బాపూ.

ఒకవేళ నారిమన్ నీదగ్గరకొస్తే, విచారణజరపడానికి అనుమతించు. నీవు బొంబాయిలోవున్నప్పుడు ఈ గొడవలు నీకు చికాకుగల్గించడం విచారకరం. నేను చేస్తున్న దానినిగురించి మహదేవ్ నీకు తెలియజేస్తాడు.

బాపూ.

## 187. ఎర్నెస్ట్ టాలర్ వద్దనుంచి

శాంతామొనీకా, కాలిఫోర్నియా
ఆగస్టు 23, 1937

ప్రియమైన జవహర్‌లాల్ నెహ్రూ,

జూలై 19వ వ్రాసినలేఖ చేరింది. మీకెన్నో ధన్యవాదాలు. మీ కృషికి నేను సదా కృతజ్ఞుడిని. నా రచనలు హిందీ, మరాఠీభాషలలో ప్రచురితమవుతుంటే, నాకు అంతకన్న మహదానందం ఇంకేమి వుంటుంది?

"ఇక శాంతి నాస్తి" అన్న నా సుఖాంతనాటకం మీకు చేరిందా? దానిని మీకు పంపించవలసిందిగా నా ప్రచురణకర్తను కోరాను.

నా భార్య నాతోపాటే హాలీవుడ్‌లో కాలంగడుపుతోంది. ఆమెకు ఈమధ్య పెద్ద జబ్బుచేసింది. అదృష్టవశాత్తు ఆసుపత్రినుంచి బయటపడి, ఇప్పుడు త్వరత్వరగా కోలుకొంటోంది.

చైనాలో ఘటనలను కడు శ్రద్ధాసక్తులతో పరికిస్తున్నాను. చైనీయులు ఎంతతీవ్రంగా ప్రతిఘటించినప్పటికీ, జపాను తనకు కావలసిన భూభాగాన్ని ఆక్రమించుకోగల్గినస్థితిలోవున్నట్టే కనిపిస్తున్నది. నానాజాతి సమితివ్యవహారాలు చూస్తుంటే, విషాదమూ, వినోదమూ కలుగుతున్నాయి: వివిధదేశాలహక్కులను రక్షించడానికీ, ఒక దేశంపై మరొకదేశం దాడిచేయకుండా అరికట్టడానికీ నానాజాతిసమితి ఏర్పడింది; కాని, అది ఈనాడు ఏమీచేయలేనిస్థితిలోపడిపోయింది. నిర్ణయాలుచేయడంమాట దేవుడెరుగును; తక్షణసమస్యలను చర్చించే సాహసంకూడా దానికి లేకుండాపోతోంది.

తమకు కావలసిందేమిటో, దానిని సాధించట మెలాగో ఫాసిస్టు దేశాలకు, తత్తుల్యమైనరాజ్యాలకు పూర్తిగా తెలుసును; అవి తమ అభీష్టాన్ని ఈడేర్చుకొనేందుకు ఏ పనిచేయడానికైనా సిద్ధమే. అయితే ప్రజాస్వామిక దేశాలుమాత్రం చేతకానితనం ప్రదర్శిస్తున్నవి: ఈ దేశాలకు మనోనిబ్బరం శూన్యం. యథార్థపరిస్థితులను ఎదుర్కొనేసాహసం వీటికి లేదు. అందుకే ఎందుకూపనికిరాని రాజీలుచేసుకోడానికి ఇవి సిద్ధపడుతున్నవి. స్పెయిన్ మరొక ఉదాహరణ. మన మిప్పుడే పెద్ద సంక్షోభంలో కాలుపెట్టబోతున్నాం. దేశదేశాలకు సంబంధించిన జాతీయ, సాంఘిక సమస్యలన్నిటికీ ఈ సంక్షోభం విస్తరిస్తుంది. నిజంచెప్పాలంటే 1914లో ప్రారంభమైన ప్రపంచయుద్ధం ఇంతవరకు ముగియనే లేదు. అది ఇంకా ఎంతకాలంసాగుతుందో ఎవరికీతెలియదు. మనం చేయగలిగిందల్లా ఒకటే: విధిగా సంభవించనున్న పరిణామాలవల్ల ప్రపంచంలోని ప్రాథమికఅంగాలన్నీ సర్వనాశనంకాకుండావుండాలనిమాత్రం ఆశిద్దాం.

జర్మనీనుంచి నాకు అందుతున్న సమాచారంప్రకారం, నాజీవ్యతిరేకోద్యమం వీరోచితమైనప్రతిఘటనకొనసాగిస్తున్నట్టే తెలుస్తోంది. అయినా ఆ ఉద్యమం అంత శక్తివంతమైనదికాకపోవడంవల్ల, ప్రస్తుతం అధికారంలోవున్న ప్రభుత్వాన్ని అదేమీ చేయలేకపోవచ్చును. నాజీల శక్తిస్తోమతలను విస్మరించడానికివీలులేదు. వాళ్ళు జర్మనీలో విధీవిరామం లేకుండా యుద్ధానికి సన్నద్ధమౌతున్నారు. అంటే దానిఅర్థం అద్యతన భావిలోనే, వారు యుద్ధానికిసిద్ధపడతారని నా ఉద్దేశంకాదు. భయపెట్టీ, లేనిపోని హడావిడిచేసీ, కొన్నిప్రాంతాలు ఆక్రమించుకోవాలని వారు చూస్తున్నారు. అదేసమయంలో వారు యుద్ధంరాకుండాచూడాలనికూడా ప్రయత్నిస్తున్నారు. ఎందుకంటే యుద్ధంరావడమే తటస్థిస్తే, వారు సర్వనాశనంకావడం తథ్యం. ఈలోగా ఫాసిస్టురాజ్యాలను ఏర్పాటుచేసుకోవాలని వారి యత్నం. కొద్దిరోజులక్రితం 'న్యూయార్క్‌టైమ్స్' పత్రికలో ఒక వ్యాసం చూశాను. దక్షిణ అమెరికాలో ఫాసిస్టులపలుకుబడి అపారంగా వున్నట్టు ఆ వ్యాసాన్నిబట్టి బోధపడుతోంది.

నాభార్య, నేను, మీకూ, మీ కుమార్తెకూ శుభాకాంక్షలు అంద జేస్తున్నాం. అనురాగపూర్వకమైన అభివందనలు.

మళ్ళీ మీనుంచి జాబువస్తుందని ఆశిస్తూ,

భవదీయుడు,
ఎర్నెస్ట్ టాలర్.

183. రవీంద్రనాథ్ టాగూర్ వద్దనుంచి

శాంతినికేతన్, బెంగాల్
సెప్టెంబరు 20, 1937

ప్రియమైన జవహర్‌లాల్,

కష్టకాలంలో మీ ప్రేమానురాగాలకు పాత్రుడనికావచ్చుననన్న పూర్ణ విశ్వాసంతో వుండగలగడం నిజంగా నా కెంతటి మహద్భాగ్యం. జీవనపటంనుంచి ఆకస్మాత్తుగా నడలిపోయినప్పుడు మీ ప్రేమే నాకు జీవగర్రగా ఉపకరిస్తుంది. ప్రగాఢమైన అనుభూతిపొందాను.

భవదీయుడు,
రవీంద్రనాథ్ టాగూర్

189. మహాత్మా గాంధీవద్దనుంచి

సెగోన్, వార్ధా,
అక్టోబరు 1, 1937

ప్రియమైన జవహర్‌లాల్,

నాకు సంబంధించినంతవరకు పట్టాభిని నిర్ణయించడం చాలా మంచిది. అయితే కార్యవర్గసభ్యులందరి అభిప్రాయాలు కొంతవరకు నీకు తెలిసివుండాలి.

వార్ధాలో జరుగుతున్న విద్యామహాసభకు హాజరుకావడానికి నీకు అవకాశంవుంటుందో లేదో నాకు తెలియదు. ఆహ్వానంపత్రం నీకూ పంపారు. వీలుంటే తప్పకుండా మహాసభకు రా. అయితే ఇంతకన్నా ముఖ్యమైన పనులుంటేమాత్రం వాటిని మానుకొని ఇక్కడకు రావద్దు.

నిజమే, రెండురోజులపాటు ఎంతో శ్రమకుఓర్చుకోవాలి. కాని, నీవు రాగల్గితే, నాకు సంతృప్తికలుగుతుంది.

ప్రేమతో
బాపూ.

తాజాకలం:— సయ్యద్ హబీబ్‌తో నేను జరిపిన ఉత్తర ప్రత్యుత్తరాలను—చెక్‌ను ఇందుతో జతపర్చిపంపుతున్నాను. ప్రతిచోటా డబ్బువసూలుచేయడం మంచిపనికాదని నేను అతనిని మందలించాను. నీతో నేను జరిపిన సంభాషణసంగతి అతనికి చెప్పలేదు.

190. రవీంద్రనాథ్ టాగూర్ వద్దనుంచి

శాంతినికేతన్, బెంగాల్,
అక్టోబరు 10, 1937

ప్రియమైన జవహర్‌లాల్,

మీ లేఖకు ధన్యవాదాలు. మిమ్మల్ని కలుసుకొనే సంతోష సమయం ఎప్పుడువస్తుందా అని ఆతురతతో ఎదురుచూస్తుంటాను. శాంతి నికేతన్‌దాకా మీరు రావలసినపనిలేదు. రేపు నేను కలకత్తాచేరితాను. అక్టోబరు 11 నుంచి నెలాఖరుదాకా నేను అక్కడే వుంటాను. 25వ గాని, లేక మీకు వీలున్నరోజునగానీ మిమ్మల్ని కలుసుకోగలనని ఆశి స్తాను. నే నింకా డాక్టర్ల దయాదాక్షిణ్యాలపైనే ఆధారపడివున్నానన్న సంగతి మీకు తెలిసేవుంటుంది. ప్రకృతిపేరుచెప్పి డాక్టరు నన్ను యింకా బెదిరిస్తూనేవున్నారు. కలకత్తాలో ఏదో తాంత్రికం జరిపిస్తారట. విద్యుత్‌వాహినితో చికిత్సచేస్తారట. మీకు వీలుంటే, ఒకసారికాదు, రెండుసార్లు వచ్చి నన్ను చూసిపొండి. నేను బహుశా కలకత్తాశివార్లలోని తోటమధ్యయింట్లో బసచేస్తాను. కృష్ణకూడా కలకత్తాచేరుతున్నందున, మిమ్మల్ని తీసుకురావడానికి కృష్ణను పంపిస్తాను.

ప్రేమతో,

భవదీయుడు,
రవీంద్రనాథ్ టాగూర్

## 191. మహాత్మా గాంధీనద్దనుంచి

పెగోన్, వార్ధా.
అక్టోబరు 12, 1937

ప్రియమైన జవహర్‌లాల్,

నీ లేఖ చేరింది. ఇక్కడనుంచి 25న బయలుదేరి, కలకత్తారావాలని ప్రయత్నిస్తున్నాను. కాంగ్రెసు రాష్ట్రాలలో మంత్రివర్గాలవ్యవహారాలనుగురించి సకలవిషయాలు అప్పుడు నీవు నాతో చెప్పవచ్చును. నీ గొంతునొప్పి, రొంప, కేవలం తాత్కాలికమైనవనే ఆశిస్తాను. పంజాబు ధాటికి నీవు తట్టుకోగలిగావనేఅనుకొంటాను. సరిహద్దులో వాతావరణం బహు రమణీయంగా వుండివుండాలి. కొంతకాలమైనా నీవు హాయిగా, విశ్రాంతగా గడిపితే ఎంత బాగుండును!

ప్రేమతో
బాపూ.

## 192. అమృత షేర్ గిల్‌నద్దనుంచి

[అమృత షేర్ గిల్ ప్రతిభావంతురాలైన చిత్రకారిణి. పారిస్‌లో శిక్షణపొందింది. అక్కడ అకాడమీలో ఆమెచిత్రాలు ప్రదర్శించబడినవి. పిన్నవయస్సులోనే ఆమె హఠాత్తుగా చనిపోయింది.]

నవంబరు 6, 1937

ఒక క్షణంక్రితం ఎవరో నాతోఅన్నారు: "జవహర్లాల్‌నెహ్రూకు సుస్తీగావుందట; నీకు తెలుసా?" ఆసంగతి నాకు తెలియదు. నే నెప్పుడూ పత్రికలు చదవను.

మిమ్మల్నిగురించి ఆదేపనిగా ఆలోచిస్తున్నాను. బహుశా ఆ కారణంవల్లనేమో, మీకు ఉత్తరంవ్రాయాలని నాకు అనిపించనేలేదు.

మీ లేఖ చూసి ఆశ్చర్యచకితురాలనయ్యాను. మీ జాబు నాకు మహదానందంకల్గించిందని వేరేచెప్పాలా?

మీరు పుస్తకాలుపంపినందుకు కృతజ్ఞతాభివందనాలు.

అసలు జీవితచరిత్రలన్నా, ఆత్మకథలన్నా నాకు బొత్తిగా నచ్చవు. అవి కృతకంగాకన్పిస్తాయి. వాటిలో ఆర్భాటం, ప్రలాపాలు జాస్తి. కాని మీ ఆత్మకథ నాకు నచ్చుతుంది. ఎందుకంటే, మీరు అహంకారాన్ని అధిగమించగలరు. "నేను మొట్టమొదట సముద్రాన్ని చూసినప్పుడు" అని మీరు వ్రాయగలరు. ఇతరులైతే "మొట్టమొదట సముద్రం నన్ను చూసినప్పుడు" అని వ్రాస్తారు.

నాకు మిమ్మల్ని గురించి ఎంతైనా తెలుసుకోవాలనివుంది, మీ వంటివారంటేనే నాకెప్పుడూ ఆకర్షణ ఎక్కువ. భిన్నత్వంలో ఏకత్వం మీలో అనుమేళనపొందింది. గతమంతా వృథాచేశామని విచారించేవారంటే నాకు కిట్టదు.

జీవనప్రాంగణంలో అడుగుపెట్టబోయేముందు ఎవరైనా అరాచక స్థితిలోవుంటారని నేను అనుకోను. జీవనప్రాంగణంలో ప్రవేశించాకనే, అది తటస్థిస్తుంది. అంతకుముందు సునాయాసంఅనుకొన్నవి, వాస్తవానికి అత్యంత బాధాకరంగా, క్లిష్టతరంగా గోచరిస్తాయి. కనుక అనిశ్చితంలోనే ఏదైనా నిశ్చితంవుంటుంది.

అయితే మీ మనస్సుమాత్రం క్రమబద్ధమైనదనుకోండి.

నా చిత్రాలపట్ల మీకు నిజంగా ఆసక్తివుంటుందని నేను అనుకోలేదు. నా చిత్రాలను మీరు పరికించినప్పటికి, పరిశీలనగా చూసివుండరు.

మీరు కఠినాత్ములుకారు. మీ ముఖం చాలా బాగుంటుంది. మీ ముఖంఅంటే నాకెంతో యిష్టం. మీ హృదయం చాలా సున్నితమైంది, ఆదేసమయంలో మీరు నిగ్రహపరులుకూడా. నా తండ్రిగారి ఆదేశం ప్రకారం, ఆయన వ్రాసిన వ్యాసా న్నొకదానిని మీకు పంపిస్తున్నాను.

మీ

అమృత షేర్ గిల్

1[illegible]. సరోజినీ దేవి వద్దనుంచి

మహాత్మా శిబిరం,
కలకత్తా,
నవంబరు 13, 1937

ప్రియమైన జవ్హార్,

అభినవ, అపర 'టవర్ ఆఫ్ బేబెల్' నుంచి వ్రాస్తున్నాను. ఒక ప్రక్క ప్రపంచమంతా అట్టుడికిపోతుంటే, *అల్పజీవి ఒకమూల కూర్చొని గుజ్జెనగూళ్ళు తింటున్నాడు. ఆ అల్పజీవిచుట్టూ, నలుదిశల నుంచీ బెంగాలీ, గుజరాతీ, ఇంగ్లీషు, హిందీ వరదలు ఉవ్వెత్తున ఉరకలుపెట్టుకుంటూ చుట్టుముట్టుతున్నాయి. ఆయన ఆరోగ్యంగురించి బధన్, ఆయనసహచరులు ఆందోళనచెందుతున్నారు. ఆయన నిజంగా జబ్బుతో....నవనాడులలోను, రక్తనాళాలలోనుమాత్రమేకాక హృదయపీఠంలోకూడా.........జీవితంలో ఏకాకి, విషాదజీవి....భావిభారతభాగ్యనిర్ణేత, నిజంగా, శిఖరంఅంచున నిలబడి అగాధపులోతులలోకి........

మరొక భాగ్యనిర్ణేతవైన నీకు జన్మదినశుభాకాంక్షలు పంపుతున్నాను. ఇది నీకు సకాలంలోచేరదు. ఎందుకంటావా, మధ్యలో ఎందరికళ్ళు నీ కొచ్చేలేఖలను తెరిచిచూడవలసివుందో. గత రెండేళ్ళుగా నీ పరిస్థితిని పరికిస్తున్నాను; నీవు పడుతున్నబాధలు, గడుపుతున్న ఏకాకితనం; ఇంతకుతప్ప మరొక మార్గంలేదు మరి.

రానున్న సంవత్సరంలో నీకోసం నేను కాంక్షించవలసిన దేమిటి? ఆనందాన్నా? శాంతినా? విజయాన్నా? మానవులకు ఇవే పరమార్థాలు; కాని నీకు అవి అంత ముఖ్యమైనవికావు....దాదాపు క్షణికాలు....నేను కాంక్షిస్తాను....ప్రియతమా!.... జీవితంకన్నా అమూల్యమైనదిగాఎంచుకొనే స్వాతంత్ర్యలక్ష్మిని చేపట్టడానికి సాగించుతున్న మహాప్రస్థానంలో అచంచలవిశ్వాసం, తడబాటుఎరుగని స్థయిర్యం, నీకు లభించుగాక.... నీవు కోరుకున్నదీ, పోరుతున్నదీ వ్యక్తిగతమైన స్వేచ్ఛకోసంకాదు.

* అల్పజీవిఅంటే గాంధీ.

దాస్యశృంఖలాలమధ్య చిక్కుకున్న దేశ, మతవిముక్తికోసం నీవు పోరాడుతున్నావు....ఎత్తైన ఏటవాలుమార్గంలో, ప్రమాదాలతో ప్రయాణం సాగిస్తున్న నీవు పట్టుతప్పకుండా. ధైర్యంగా ముందుకుసాగిపో.... దుఃఖమూ, బాధ, ఏకాంతత....ఇవే నీకు సహచరులు.... నీ అనుపమ త్యాగాలనుంచి చిట్టచివరకు స్వేచ్ఛాకిరీటం ప్రాదుర్భావంపొందుతుంది.... నీవు ఏకాకివికావు. నీ ప్రక్కన చాలామందివున్నారు.

ప్రేమతో,
సరోజని

## 194 మహాత్మా గాంధీవద్దనుంచి

వార్ధామార్గమధ్యంలో
నవంబరు 18, 1937

ప్రియమైన జవహర్‌లాల్,

ఆ పాడుఆదివారంరాత్రీ, ఆ మౌనపుసోమవారంనాడు నా చుట్టూ అదేపనిగా తిరుగుతున్న నిన్నుచూస్తుంటే, నీ కళ్ళల్లో పొడచూపే ఆ ఆంతరంగికమైన రేఖను నేను చదువుకోగలననిపించింది. బలహీనత నన్నింకా వదలలేదు. అన్నిరకాల మానసికశ్రమనుంచి దీర్ఘకాలంపాటు నాకు విశ్రాంతి అవసరం. అయితే బహుశా అది నాకు లభ్యంకాక పోవచ్చును.

ఇంతకీ నే నీ లేఖను ఒకందుకువ్రాస్తున్నాను. బెంగాల్‌లోని ఖైదీల విషయంలో నేను చేసినదానిని నీకు తెలియపర్చడంకోసం ఈ లేఖ వ్రాస్తున్నాను. నేను చేసినపని నీకు నచ్చుతుందో లేదో తెలియదు. సంభాషణలు తలనొప్పికలిగించాయి. సంప్రతింపులకు ఉపక్రమించటానికిముందు సోదరద్వయంతో సంప్రతించాను; సంప్రతింపులద్వారా కొంత ప్రయోజనంసాధించడానికి ప్రయత్నించడం మంచిదేనా అని వారిని అడిగి తెలుసుకొన్నాను. ఫలితాలకోసం ఎదురుచూడక, ప్రజాభిప్రాయసమీకరణ ద్వారా ఖైదీలవిడుదలకు ఒత్తిడితీసుకురావచ్చుననుకో. అయితే దానివల్ల ఆ ఖైదీలు ఎప్పటికి విడుదలఅవుతారో ఎవరుచెప్పగలరు? సోదరులు

సంప్రతింపులుకావాలని గట్టిగా భావించారు. మరొకవైపున ప్రజాందోళన సాగించాలన్నారు. నేను నా పథకాన్ని వారిముందుంచాను. అండమాన్ ఖైదీలకు నేను పంపిన టెలిగ్రామ్‌నమూనాలోనే అది వుంది. దియోలీ నుంచి తీసుకొచ్చిన డిటెన్యూలను కలిశాను. గతరాత్రి హిజ్లీఖైదీలను చూశాను. వారిని విముక్తలచేయడానికి మంత్రులు అంగీకరించారు. 'గ్రామాలలోను, ఇళ్ళల్లోను' నిర్బంధించిన డిటెన్యూలందరినీ వెంటనే విడుదలచేస్తామని మంత్రులు చెప్పారు. డిటెన్యూశిబిరాలలోవున్నవారి నందరినీ నాలుగునెలల్లో విడుదలచేస్తామన్నారు. మిగతావారివిషయంలో, నా సిఫారసును అంగీకరించగలమన్నారు. అయితే డిటెన్యూలు ప్రస్తుతం ఎలాంటి విశ్వాసాలుకలిగివున్నారో నాకైతే తెలియదు. దానిని బట్టే నా సిఫారసువుంటుంది. స్వాతంత్ర్యసాధనకు ఆ డిటెన్యూలు ఇక ముందు హింసాపద్ధతులు అవలంబించబోరనీ, కాంగ్రెసు ఎప్పటికప్పుడు రూపొందించే కార్యకలాపాలనుమాత్రమే వారు అచరిస్తారనీ నేను ప్రభుత్వానికి చెప్పగలిగితే, ప్రభుత్వం వారిని విడుదలచేస్తుంది. విధానప్రకటన ఎప్పుడైనా చేయవచ్చును; వివిధజైళ్ళలో, హిజ్లీశిబిరంలో ఖైదీలతో నేను జరిపిన సంప్రతింపులవివరాలను ఇక్కడ ఏకరువుపెట్టనవసరంలేదు. అసలు ఇదంతా నీకు నచ్చిందా? దీనిని నీవు గట్టిగా ప్రతికూలిస్తున్న పక్షంలో, తంతివ్వారా తెలియజేయి. లేదా నీ లేఖకోసం ఎదురుచూస్తూ వుంటాను.

అహమ్మదాబాద్, షోలాపూర్‌లలో సమ్మెలు నాకు ఆందోళనకలిగించినవి. పత్రికలలోపడినవార్తలుమాత్రమే నేను చూశాను. మనం పరిస్థితిని అదుపులోపెట్టాలి. ఎవరో కొంతమంది కాంగ్రెసువాదులు క్రమశిక్షణకు కట్టుబడివుండనికారణానో, లేక కాంగ్రెసువెలుపలవున్నవారి చర్యలను కాంగ్రెసు అదుపులోపెట్టలేనికారణానో కాంగ్రెసుఆశయానికే దెబ్బతగులుతుంది. అధికారంలోవున్నతర్వాత కాంగ్రెసు తప్పనిసరిగా పరిస్థితిని అదుపులోపెట్టితీరాలి.

'వందేమాతరం' వివాదం ఇంకా సమసిపోలేదు. కార్యవర్గంచేసిన నిర్ణయం చాలామంది బెంగాలీలకు గ్రుమింగుడుపడడంలేదు. పరిస్థితిని ప్రశాంతపర్చాలని తాను చూస్తున్నట్టు సుభాసు నాతో చెప్పాడు.

కొత్తగవర్నరు పదవీస్వీకారంచేసినవెంటనే, మరొకసారి నేను బెంగాల్ వెళ్ళవలసివుంటుం దనుకొంటాను.

నీవు కులాసాగావున్నావని తలుస్తాను. సరూప్‌నుగురించి పత్రికలలోపడినవార్త ఆందోళనకలిగిస్తోంది. ఆమెఆరోగ్యం మరింత నీరసంగావుందా ఏమిటి ?

నాగపూర్ సమీపిస్తున్నసమయంలో ఈ లేఖ వ్రాస్తున్నాను. నేటి సాయంత్రమే వార్ధా చేరుకుంటాం.

ప్రేమతో

బాపూ.

## 195. మహాదేవ దేశాయ్‌వద్దనుంచి

మగన్‌వాడి, వార్ధా,

నవంబరు 19, 1937

ప్రియమైన జవహర్‌భాయ్,

మీ 8వ తేదీలేఖ చేరింది. శామ్యూల్‌రాకనుగురించి మీరు చెప్పినదంతా నాకు విదితమైంది. తను కావాలనుకుంటే, మిమ్మల్ని కలుసుకోవచ్చునని అతనికి ఇంటర్వ్యూయివ్వడానికి మీకు అభ్యంతరంలేదని, నేను, పోలక్‌కు జాబువ్రాస్తున్నాను.

అనూప్‌చంద్ షా వాగ్దానంగురించి: గాంధీసేవాసంఘం వుందని తెలుపుతూ ఆయనకు మీరు లేఖవ్రాయడం చాలా మంచిదైంది. ఆయనకు నేను ఇప్పుడే జాబువ్రాస్తాను.

మైసూరుతీర్మానంపై బాపూ వ్రాసినవ్యాసంగురించి మీరు 14వ తేదీన వ్రాసినలేఖకు జవాబు బాపూయే వ్రాసివుండేవారు, అయితే ఆయన

చాలా నీరసంగావున్నారు. చివరకు జవాబును డిక్టేట్ చేయగల్గినస్థితిలో కూడాలేరు. ఆయన పూర్తిగా క్షీణించివున్నారనీ, ఏమాత్రం శ్రమించినా ప్రమాదకరమనీ డాక్టర్లు హెచ్చరిస్తున్నారు. అయితే మీ లేఖలోనిసారాం శాన్ని ఆయనకు తెలియజేశాను. 'జోక్యంపెట్టుకోం' అన్న విధానాన్ని అతిక్రమించడం జరిగిందని తాను గట్టిగా భావిస్తున్నట్టు ఆయన నాతో చెప్పారు. గతంలో కాంగ్రెసుకూడా జోక్యంకల్పించుకొన్న సేదానికిపాల్ప డిందని తనకు తెలుసుననీ, అది పొరపాటనికూడా తను ఎరుగుదుననీ ఆయన అన్నారు. పరిస్థితి మితిమీరిందని గట్టిగా భావించబట్టే, ఆయన ఆ వ్యాసంవ్రాశారు. లేకపోతే వ్రాసివుండేవారుకారు. తీర్మానంలో పద బంధంసరిగాలేదన్నసంగతి మీరుగుర్తించినందుకు ఆయన సంతసించారు. ఆ తీర్మానం అక్రమమైనదన్నవిషయం కార్యవర్గసభ్యులు మీ దృష్టికి తెచ్చివుంటే, తీర్మానంపై ప్రసంగాలను, మీరు గట్టిగా నివారించివుండే వారని ఆయన దృఢనమ్మకం. అసలు తీర్మానంకన్న, దానిపైచేసినప్ర సంగాలు మరింత పాడుగావున్నాయని ఆయనవుద్దేశం. మిమ్మల్ని అభిశం సించాలన్నదృష్టి తనకేమాత్రంలేదని ఆయన మీకు తెలియజేయమన్నారు. మీరేమో, పనిలో పూర్తిగా మునిగిపోయివున్నారు. అలాంటప్పుడు కాంగ్రెసుకార్యవర్గంలోని మీ సహచరులు, విషయాన్ని మీదృష్టికి తేవడం వారిబాధ్యత అని, బాపూ అభిప్రాయం. వారు తమ బాధ్యతనిర్వర్తించడంలో విఫలులయారని ఆయన అభిప్రాయపడుతున్నారు. వారు సలహాయిచ్చి వుంటే దానిని మీరు త్రోసిపుచ్చేవారుకారనీ, మీరు క్రమశిక్షణవాదులనీ కూడా బాపూఅభిప్రాయం.

బాపూమనోగతభావాలను నిస్తేజమైన నా మొరకుభాష సరిగావ్యక్తం చేయడంలేదు. ఆ తీర్మానం చూసి ఆయన ఎంతో ఆందోళనచెందారు. ఆ తీర్మానంగురించి ఆయనఅభిప్రాయాలను మీకు తెలియజేస్తానని నేను ఆయనకు హామీయిచ్చాను.

రక్తపుపోటు ఒకవిధంగావుండడంలేదు. జాగ్రత్తలుతీసుకోకపోతే ప్రమాదమని డాక్టర్లు హెచ్చరిస్తున్నారు. పక్షంరోజుల్లో కలకత్తావెళ్ళాలని ఆయన అనుకొన్నారు. అది అసాధ్యమని ఆయన ఇప్పుడు గుర్తించారు. కనీసం పక్షంరోజులపాటు, రక్తపుపోటు ఒకేరకంగా వుండేంతవరకు మంచంపైనుంచికదలనని ఆయన వాగ్దానంచేశారు.

మీ
మహదేవ్.

196. ఆగ్నిస్ స్మెడ్లీవద్దనుంచి

జనరల్ హెడ్‌క్వార్టర్స్
చైనా ఎయిత్‌రూట్ ఆర్మీ (ఎర్రసైన్యం),
పశ్చిమ షెన్సీరాష్ట్రం, చైనా,
నవంబరు 23, 1937.

ప్రియమైన శ్రీ నెహ్రూ,

అత్యవసరమైనసమస్యపైన మళ్ళీ మీకు లేఖవ్రాస్తున్నాను.

జపానుఆక్రమణలోవున్న ష్యవాన్, చాహార్, హోపీరాష్ట్రం వంటిప్రాంతాలలో వేలాది చైనావిద్యార్థులు, కార్మికులు, రైతులు తిరగబడి వాలంటీరుదళాలుగా జపానువాళ్ళపై పోరాటంసాగిస్తున్నారు. వారికి ఆయుధాలైతే వున్నవి కాని, చలికాలపుదుస్తులు, కాళ్ళజోళ్ళు లేవు; రోజులతరబడి వారు పస్తులుకూడా వుండవలసివస్తున్నది. ఇక్కడున్న మా సైన్యం చాలా పేదది. ఉత్తరాదిప్రజలను సంఘటితపర్చి, సాయుధ మొనర్చుతోంది. వాలంటీర్లకు యివ్వడానికి మా సైన్యానికి డబ్బులేదు. సుమారు రెండువేలమంది వాలంటీర్లకు వేయిడాలర్ల మొత్తంమాత్రమే యివ్వగల్గింది. అంటే సగటున వాలంటీరుకు అర్ధడాలరు అన్నమాట। ఈ మొత్తంతో, నాలుగైదురోజులపాటు ప్రాణంనిలుపుకోవచ్చును.

చైనావాలంటీర్లకు భారతజాతీయకాంగ్రెసు ఏమైనా విరాళంయివ్వ గల్గుతుందా? నిన్న, గతవారంలోను ఈ విషయంపై మా జనరల్ హెడ్ క్వార్టర్స్‌తో చర్చించాను. అమెరికాలోను, చైనాలోనుకూడా విరాళాలు

వసూలుచేయాలని చూస్తున్నాం. చైనాలో ప్రతిచోట ప్రజలు భారమైన బ్రతుకులుగడుపుతున్నారనుకోండి. కనుక నేను భారతజాతీయకాంగ్రెసుకు విజ్ఞప్తిచేస్తున్నాను. వాలంటీర్ల కోసం ఏదైనా సహాయంచేయండి. మీరు విరాళంపంపితే, సియాన్‌లోని చైనాబ్యాంకు సియాన్‌ఫూబ్రాంచిద్వారా డ్రాఫ్ట్ ఈ దిగువఅడ్రసుకు పంపండి.

ఎయిర్ మెయిల్
వయా, హాంగ్‌కాంగ్

మిస్ ఆగ్నిస్ స్మెడ్లీ
C/o లిన్ పేచూ, చి షీన్ చ్వాంగ్ 11,
సయల్‌ఫూ, షెన్సీరాష్ట్రం, చైనా.

జపానువారుదక్షిణాభిముఖంగాచొచ్చుకువస్తున్నందున, మీరు చేయగలిగినసహాయం వెంటనే చేయండి. వయా హాంకాంగ్‌ద్వారా ఎయిర్ మెయిల్‌లో పంపితే, సరాసరి సియాన్‌కు విమానంలోనే చేరుతుంది.

పరపీడనకు ప్రతికూలంగా చైనాప్రజలు సాగిస్తున్నపోరాటంలో మీ సహాయాన్ని మేము అర్థిస్తున్నాం.

భవదీయురాలు,
ఆగ్నిస్ స్మెడ్లీ

107. ఛూ టేనద్దనుంచి
చైనాభాషలోవ్రాసినలేఖకు అనువాదం

జనరల్ హెడ్‌క్వార్టర్స్,
ఎయిత్ రూట్ ఆర్మీ,
షాన్సీ, చైనా,
నవంబరు 26, 1937

ప్రియమైన శ్రీ నెహ్రూ,

మా విముక్తిపోరాటాన్ని బలపర్చుతూ, భారతదేశమంతటా బహిరంగసభలు జరపవలసిందనికోరుతూ మీరుచేసిన ప్రకటనలను చైనాలో మేము పత్రికాముఖానచూశాం. చైనాప్రజలతరఫున, ముఖ్యంగా ఎయిత్ రూట్ ఆర్మీ (చైనాఎర్రసైన్యం) తరఫున మీకు కృతజ్ఞతాభివందనము లందజేస్తున్నాను.

చైనాలో అనేక నగరాలను, ముఖ్యమైన రైల్వేమార్గాలను జపాను వాళ్ళు ఆక్రమించుకొన్నసంగతి మీకు తెలియనిదికాదు. చైనాపిప్లప్ సైన్యమైన, మా ఎయిత్ రూట్ ఆర్మీ ప్రజలను సంఘటితపర్చి, సాయుధ మొనర్చి, వారిని దీర్ఘకాలయుద్ధానికి సన్నద్ధపరుస్తోంది. మేము అంతిమ విజయం సాధించగలం. విముక్తిపొందితీరుతాం. మాది చాలా పేద సైన్యంకావడంవల్ల మేము ఎన్నో యిబ్బందులకు లోనుకావలసివస్తోంది. ఉత్తర ప్రాంతమంతటా మా సైన్యంవున్న ప్రతిచోట, రైతువాలం టీర్లకు సహాయంచేయగలుగుతున్నాం. ఆ వాలంటీర్లు త్వరితంగా మా సైన్యంలో అంతర్భాగమైపోతున్నారు. అయితే మా అంతట మేముగా పరిష్కరించలేనిసమస్య ఒకటి వుంది. దానినిగురించే యిప్పుడు నేను వ్రాస్తున్నాను.

జపాను ఆక్రమితప్రాంతాలలోను, షాన్సీలోని ఉత్తర ప్రాంతం లోను, షుయానో, చాహార్ రాష్ట్రంలోను రైలుమార్గాలపొడవునా కార్మి కులు, రైతులు, విద్యార్థులు ఒక్కుమ్మడిగా తిరగబడి, ఆయుధాలు స్వాధీనంచేసుకొని, వాలంటీరుదళాలుగాఏర్పడి జపానుసామ్రాజ్యసైన్యం సాగిస్తున్న దండయాత్రను ప్రతిఘటిస్తున్నారు. ఆ వాలంటీర్లవద్ద ఆయుధాలున్నాయి కాని, చలికాలపు దుస్తులుగానీ, దుప్పట్లుగానీ, కాళ్ళ జోళ్ళుగానీ లేవు. ఆహారపదార్థాలకొరతకూడా హెచ్చుగానేవుంది. ఆ వాలంటీర్లలో 2000 మందిగల గ్రూపు ఒకటి ఈమధ్య షెన్సీరాష్ట్రం లోని ఈశాన్యప్రాంతంలో మా సైనికదళాన్ని కలుసుకొంది. వారికి మేము వెయ్యిడాలర్ల మొత్తంమాత్రమే యివ్వగలిగాము. అంటే మనిషి ఒకటికి అర్థడాలరుచొప్పున యిచ్చామన్నమాట. ఈడబ్బుతో, వారు వంటి పూట భోజనంచేస్తే వారంరోజులుగడపడానికిమాత్రమే వీలవుతుంది. మమ్ములను ఎదుర్కొంటున్నసమస్య చాలా గురుతరమైనది. ఆ వాలం టీర్లకు తగినంతగా, మేము సహాయంచేయలేకపోతున్నాం. ఈ ఆర్థిక సమస్య మాకు ఎప్పుడూ వున్నదే. చైనాలోను, ఇతరదేశాలలోను, విరా ళాలు వసూలుచేయాలనిచూస్తున్నాం. మీకీ విషయం తెలియజేయడం మంచిదని మిస్ స్మెడ్లీ చెప్పింది. మీరు అధ్యక్షులుగావున్న భారతజాతీయ

కాంగ్రెసు విరాళంయిస్తుందని ఆమె గట్టిగా భావిస్తున్నది. మీరు యిచ్చే విరాళాన్ని ఆ వాలంటీర్లకు అందజేస్తాం. మీనుంచి లభించే ప్రతి ఒక అణా ఎంతో మేలుచేకూర్చుతుందన్నవిషయం మీకు తెలియనిదికాదు. ఈవిధంగా ఆ వాలంటీరులు సాగిస్తున్న పోరాటానికి మీరు చేయూత నిచ్చినవా ఏవుతారు.

చైనావాలంటీర్ల కోసం విరాళాలు వసూలుచేసేందుకు మీరు ఒక కమిటీని ఏర్పాటుచేస్తే బాగుంటుంది. అలా చేయదల్చుకొంటేమాత్రం వెంటనే చేయండి. మా పోరాటంపట్ల సానుభూతికలిగివున్న లక్షలాది జనులు, మీ దేశంలో కలరన్నవిషయం మాకు తెలుసును. వారు కొంత సహాయంచేయడానికి వెనుకాడబోరన్నసంగతీ మాకు తెలుసును.

చైనాప్రజల ఎయిత్ రూట్ ఆర్మీతరపున మీకు, భారత జాతీయ కాంగ్రెసుకు, భారతప్రజలకు ఒక విషయం విన్నవించదలుచుకొన్నాను. చైనా పరాధీనంకాలేదు; మమ్మల్ని దాస్యంలోబంధించడం ఎప్పటికీ ఎవరికీ తరంకాదు. ఉత్తరచైనానుంచి మా సైన్యం ఎన్నటికీ తిరోగమించబోదు. మేము సదా ప్రజలతోనే, ప్రజలను అంటిపెట్టుకొనే వుంటాం. వారిని సంఘటితపరుస్తూ సాయుధమొనర్చుతూవుంటాం. మా దేశంపై దండయాత్రప్రారంభించిన జపానుసామ్రాజ్యసేనలను మా దేశంలోనుంచి మంచూరియాలోనుంచిసైతం నిశ్శేషంగా తుడిచిపెట్టేంత వరకు మేము విధీవిరామమెరుగని పోరాటం సాగిస్తాం. జపానువాళ్ళు సాగిస్తున్న అబద్ధప్రచారాన్ని నమ్మకండి. మా పోరాటం ఇప్పుడే ప్రారంభమైంది. చైనాప్రభుత్వసైన్యాలుకూడా పోరాటంసాగిస్తున్నాయి. మేము ఎన్నటికీ ఓడిపోము. ఎందుకంటే మాది ప్రజాసైన్యం. లక్షలాది ప్రజలు మా అండననిలబడి మాతోపాటు పోరాడుతున్నారు.

మా సైన్యం సుశిక్షితమైనది; మాలో ప్రతిఒక్కరూ సంకల్పసిద్ధులు. మా సైనికులంతా — సాధారణసైనికుడుమొదలుకొని, సైన్యాధిపతులవరకు అంతా ఉన్నత రాజకీయశిక్షణపొందినవారు. ఆసియాలో ఈనాడూ, భవిష్యత్తులోను మేము నిర్వహించవలసినపాత్ర ఏమిటో మేము స్పష్టంగా గుర్తించాం. మేము సాగిస్తున్నపోరాటం కేవలం చైనా

దేశానికి, చైనాప్రజలకుమాత్రమే సంబంధించినదికాదు. ఇది, మొత్తం ఆసియాప్రజలందరికీ సంబంధించినపోరాటం. పీడితజాతుల పీడితవర్గాల విముక్తికోసం విముక్తియుద్ధాన్నిసాగిస్తున్న ప్రపంచసైన్యంలో మేము అంతర్భాగంఅనేసంగతి మీకు తెలుసును. ఈ దృష్టితోనే మేము సహాయంచేయవలసిందిగా మీకు విజ్ఞప్తిచేస్తున్నాం. భారతమహాప్రజా నాయకులలో ఒకరైన మీకు ఈవిధమైన విజ్ఞప్తిచేయడంలో అనుచిత మేమీలేదనికూడా నమ్ముతున్నాం. మా పోరాటానికి శాయశక్తులాసాయ పడండి. చైనావాలంటీర్లకు ఆర్థికసహాయంచేస్తే సంతోషిస్తాం. మందులు, వైద్యపరికరాలు పంపిస్తే సంతసిస్తాం. గాయపడిన సైనికు లకు చికిత్సచేసేందుకు డాక్టర్లను, నర్సులను పంపించినా సంతోషంతో ఆహ్వానిస్తాం. మా సైన్యంతోపాటు పోరాడటానికిసిద్ధపడిన వాలంటీర్లను పంపించినా, మహదానందంతో వారికి స్వాగతమిస్తాం. ఈ సమస్యను మీరు తీవ్రంగా ఆలోచించండి. మాఉద్యమానికి సాయంచేయాలన్నఉద్య మాన్ని మరింత పెద్దఎత్తున సాగించవలసిందిగా మిమ్మల్నికోరుతున్నాం. జపాను సరుకులను నిషేధించేఉద్యమాన్ని విస్తృతపర్చి, ప్రయత్నిం చండి. మా విముక్తియుద్ధానికిసంబంధించిన విషయాలను మీ ప్రజలకు ఎప్పటికప్పుడు ఎరుకపరుస్తూవుండండి. చైనాదేశం జపానుహస్తగతం కావడమంటే, ఇంకా అనేక సంవత్సరాలపాటు, అనేక దశాబ్దాలపాటు ఆసియాదేశాలన్నీ పరాధీనబ్రతుకు బ్రతకవలసిన దుర్గతిపట్టడమన్నమాట. మా పోరాటమే మీ పోరాటం.

మా దేశంకోసం మీ రింతవరకు చేసిన సహాయానికి మరొకసారి మా సైన్యంతరపున మనఃపూర్వకమైన కృతజ్ఞతాభివందనాలను అంద చేస్తున్నాను.

సహచరభావంతో

చూ టే.

చైనా ఎయిత్‌రూట్ ఆర్మీ

సర్వసైన్యాధిపతి

198. హాజీ మీర్జా అలీనద్దనుంచి

షివాల్,
(వజీరిస్థాన్)
10 రాజబ్ 1356 ఎ. హెచ్,
సెప్టెంబరు 16, 1937

స్వాతంత్ర్యకాముకులైన ప్రజల నాయకునకు, భారతదేశ అగ్రేసరునకు,

మీపట్ల అత్యంతగౌరవభావంతో ఈ దిగువ వ్రాసినదానిని, మీకు సమర్పిస్తున్నాము.

భారతదేశంనలుమూలలా, మామీద వ్యతిరేకంగా, మితిలేని విష ప్రచారం కొనసాగుతున్నట్లు, భారతదేశ వార్తాపత్రికలవల్ల మేం గ్రహించగలిగాము. (నన్ను క్షమించాలని ప్రార్థన) మెసయ్యాతో సరిపోల్చి చూస్తే మేం నిరర్థకవ్యక్తులమైనప్పటికీ, సరిగ్గా ఆయనవున్నస్థానంలోనే ఇప్పుడు మేం వున్నాము; మేం చిత్తశుద్ధితో, మా హృదయాన్ని మా దేశానికి, మా ప్రజలకు అంకితంచేశాము. ఈ కారణంవల్ల, ఈ యుగం లోని క్రైస్తవవ్యతిరేకులైన పెద్దమనుష్యులు, మా స్వాతంత్ర్యాన్ని అపహరింపచూస్తూ, మామీద అసత్యప్రచారం కొనసాగిస్తున్నారు. కాని మీరొక విషయాన్ని నమ్మకతప్పదు; ఈ ప్రజాపీడకులను కత్తి చేతబూని, మా భూమినుంచి అవతలకి నెట్టివేయనైనానెట్టివేయాలి; లేదా ఈ సమరంలో మేం సమూలంగా నశించిపోనన్నానశించిపోవాలి; అంతవరకూ, మాకూ ఇండియాప్రభుత్వానికీ మధ్య శాంతి అన్నది పూజ్యం. మాకు వేలాదిసంవత్సరాల బానిసత్వంకంటె, త్రుటికాలపు స్వాతంత్ర్యం ఘనమైనది (బానిసత్వం ఇంతకంటె మిన్నఅయిన భౌతికపరిస్థితులను సమకూర్చితే సమకూర్చుగాక!)

బన్నూ, దేరా, ఇస్మాయిల్‌ఖాన్ ప్రాంతాలలో అప్పుడప్పుడు జరిగే మానవాపహరణలకు, దోపిడీలకు, కేవలం బ్రిటిష్ఏజంట్ల చాకచక్యమైన కృషియే కారణం. మే మెంతమాత్రం యిలాంటి దుశ్చర్యలను ఆమో

దించం. మా మతం, యిటువంటి దుర్మార్గతలను స్పష్టంగా పరుషమైన భాషలో నిస్సందేహంగా ఖండిస్తూనేవుంది. ఇలాంటి నేరాలను ప్రోత్స హించే రెచ్చగొట్టేవ్యక్తులు "జనీమ్" "మర్‌దుద్" లని,వారు హద్దుమీరి ప్రవర్తిస్తున్నమనుష్యులని ఇస్లాంమతం పేర్కొంటూనేవుంది. శాంతిని ఐక్యతాభావాన్ని నెలకొల్పడం ఇస్లాం ధ్యేయం. అదే ఆ మతంయిచ్చే సందేశం. పరపీడనను దుష్టవర్తనను ఇస్లాంమత మెన్నటికీసమర్ధించదు. ఇవి రాక్షసప్రవృత్తికి చెందినవని, అమానుషమైనవని అది చెబుతూనే వుంది.

ప్రపంచంలో సంఘర్షణను సమరాన్ని ఇస్లాంమతం ఆదరించదు. అయినప్పటికీ పరపీడనను ప్రతిఘటించక భీరునివలె పీడకులకు లొంగి పోవడం ఇస్లాంమతసిద్ధాంతాలకు వ్యతిరేకం. భీరులు ఘోరమైనశిక్షలు అనుభవించవలసివుంటుందని, అది అనుశాసించింది.

అయ్యా! మీరు ఒకవిషయాన్ని తేటతెల్లంగా అర్ధంచేసుకోవాలి; ప్రజాకంటకమైన, జనపీడకమైన ప్రభుత్వం నిష్కారణంగా, మా స్వేచ్ఛా స్వాతంత్ర్యాలపై దాడిచేసింది. మాకూ ప్రభుత్వానికీమధ్య జరుగుతున్న యుద్ధానికి కేవలం దాని దుశ్చర్యలేకారణం; అన్యమతస్థులను మా మతం లోనికి చేర్చుకోవాలనేఉన్మాదం దీనికి హేతువుకానేకాదు. దేవుడు మాకు స్పష్టంగా కొన్ని మతబోధనలుకావించాడు. "పవిత్ర మతగ్రంథంలో" ఆయన, 'మతంలో ఎవరినీ బలవంతాన చేర్చుకోకూడదని'ఉపదేశించాడు. ప్రతివ్యక్తికి, ఒకమతాన్నిస్వీకరించడంలో సంపూర్ణస్వేచ్ఛవున్నదని, ఈ ఉపదేశాని కర్ధం. ఒకవ్యక్తి తన కిచ్ఛవచ్చినమతాన్ని అవలంబించ వచ్చును. అతడు ముస్లిం, లేదా హిందూ, కాదా క్రైస్తవమతాలను స్వీక రించవచ్చును. కనుక ఖురానుప్రకారం, మతమనేది ఒకవ్యక్తి స్వభా వానికి, మానసికప్రేరేపణకు, ఆధ్యాత్మికదృక్పథానికి సంబంధించినట్టిది. అందువల్లనే, ఈ జీవితంలో మానవుడుచేసిన పాపాలకు, తగుశిక్షలను మరణానంతరం విధించడానికి, ఒకరోజు ప్రత్యేకింపబడింది. ఘనత వహించిన అయ్యా! వజీర్‌స్థాన్‌లో ప్రస్తుతపరిస్థితులకు బ్రిటిష్‌వారిదుండ గాలు ఇండియాప్రభుత్వ దారుణదమననీతి, దురాక్రమణవిధానం తప్ప

మరేమీ కారణాలుకావు. మాకు కొనఊపిరున్నంతకాలం, మేము దాని సత్వానికి లొంగివస్తామని అనుకోవడం కలలోనిమాట. భగవంతునిదయ వల్ల భారతదేశం, బ్రిటిష్‌వారిపాలననుండి విముక్తిపొందుగాక! మేము మాఖడ్గబలంతో మా దేశస్వాతంత్ర్యాన్ని సాధిస్తాం. అలాగే అది జరుగుగాక! అవును అదే నిజం!

హాజీ మీర్జాఅలీ
ఫకీర్‌సాహేబ్ ఇపి.

199. మహాత్మాగాంధీకి

నవంబరు 14, 1937

నా ప్రియమైన బాపూ,

అఖిలభారతకాంగ్రెసుకమిటీ సమావేశాన్నిగురించి మీరు వ్రాసిన వ్యాసం నే నిప్పుడే చదివాను. మైసూరుతీర్మానం అఖిలభారతకాంగ్రెసు కమిటీనిబంధనలకు పూర్తిగా "నియమవిరుద్ధంగా" వున్నదని మీ రన్నారు. అలా అయితే, ఆ తీర్మానాన్ని చర్చించడానికి నే ననుమతించ వీలులేకపోయేది; దాన్ని నేను త్రోసిపుచ్చేవాడిని. ఈవిధంగా చేయడానికి అఖిలభారతకాంగ్రెసుకమిటీనియమావళిలో, తగునిబంధనవున్నట్లు నాకు తోచడంలేదు; అలాంటినిబంధన ఏదో వుంటేతప్ప, అఖిలభారతకాంగ్రెసు కమిటీలో సాధారణపద్ధతిప్రకారం ప్రవేశపెట్టబడి అత్యధికసంఖ్యాకులచే బలపరచబడినతీర్మానాన్ని తిరస్కరించడానికి వీలులేదు. నియమావళి మాట అలావుంచినా, కాంగ్రెసుకాని, లేదా అఖిలభారతకాంగ్రెసుకమిటీ కాని ఇటువంటివిషయాలను చర్చించరాదని, ఇంతకుపూర్వం నిర్ణయం కావించినసంగతి నాకు తెలియదు. అటువంటి నిర్ణయమంటూ ఒకటి వున్నట్లు నాకు కనిపించదు. ఒకవేళ అటువంటినిర్ణయంకోరిన తీర్మానం వున్నప్పటికీ, ఆ తీర్మానం ఆచరణలో ఒక నిబంధనగా రూపొందితేనేతప్ప, అఖిలభారతకాంగ్రెసుకమిటీ చర్చించదలుచుకొన్న విషయాన్ని, చర్చించకూడదని ఏవిధంగా ఆటంకపరచగలరో నాకు బోధపడడంలేదు. అఖిలభారతకాంగ్రెసుకమిటీ, మున్ను తామచేసిన తీర్మా

నాన్నిసైతం కాదని, ఏ విషయాన్నైనా, చర్చించడానికి దానికి సంపూర్ణ స్వాతంత్ర్యం వుంది. ఒక విషయాన్ని చర్చించరాదని, ఆచరణలో లేదా పద్ధతిలో, నిబంధనంటూ ఒకటి వున్నప్పుడు, అఖిలభారతకాంగ్రెసు కమిటీ, దానిని మార్చేవరకు, ఆ నిబంధనప్రకారం నడుచుకోవచ్చును. అటువంటినిబంధన వున్నదన్నప్రశ్న లేనేలేదు. ఏ తీర్మానం నిర్దేశించిన విధానానికి, మైసూరుతీర్మానం విఘాతంకలిగించిందో నాకు బొత్తిగా బోధపడకుండావుంది. సంస్థానాలవిషయంలో కాంగ్రెసు జోక్యంకలిగించుకోబోదని, యిట్టివిధానాన్నే అది అనుసరించదలుచుకుందని, మే మిదివరకు కావించిన పత్రికాప్రకటనలలో సూచించాము. అయితే, అఖిలభారత కాంగ్రెసుకమిటీ, సంస్థానాలవిషయంలో జోక్యంకలిగించుకోవాలని భావిస్తున్నపుడు, ఈ పత్రికాప్రకటనలు, దానిప్రయత్నాన్ని నిరోధింపజాలవు. అలాంటప్పుడు న్యాయశాస్త్రసంబంధమైన "నియమవిరుద్ధమైన" అనేపదం, మైసూరుతీర్మానానికి ఏవిధంగా వర్తించగలదో నాకు అర్థం కావడంలేదు.

ఇంతేకాక, ఇంకొకప్రశ్న ఉత్పన్నమౌతోంది. జోక్యంకలిగించుకోవడమంటే అర్థం ఏమిటి? ఒకానొక తీర్మానంలో, ఒకానొక సంస్థానాన్ని పేర్కొన్నంతమాత్రాన, అది జోక్యంకలిగించుకోవడంక్రిందనే లెక్కకువస్తుందా? పౌరసత్వహక్కులుకోరడం, దమననీతిని ఖండించడం అంటే వాటి అర్థం, జోక్యంకలిగించుకోవడమనే చెప్పుకోవాలా? అలా అయితే, కాంగ్రెసు యిట్టి దోషానికిగురిఅయిందని, గత రెండుసంవత్సరాల ఉదంతాలనుబట్టి, నిర్దిష్టమైననిస్సందేహమైనమాటలలోచెప్పవచ్చును.

అఖిలభారతకాంగ్రెసుకమిటీ మైసూరుతీర్మానాన్ని మిక్కిలి అపసవ్యమైనభాషతో రూపొందించింది. ఆ తీర్మానాన్ని అఖిలభారతకాంగ్రెసు చేత ఆమోదింపచేయడం నాకు యిప్పుడప్పుడే ఇష్టంలేకపోయింది. కాని, ఈవిషయంలో, నా భావాలతో నిమిత్తంలేదు. ఒక ప్రజాస్వామిక సమావేశానికి అధ్యక్షునిగా నేను ప్రవర్తింపవలసివుంటుంది. మైసూరులో జరిగిన ప్రభుత్వఅత్యాచారాలను ఆ తీర్మానం ఖండించింది. ఇక ముందు భవిష్యత్‌లో, ఏ సంస్థానంలోనైనా, దమననీతిఅనుసరింపబడి

నప్పుడు, అది ఎట్టిస్వభావంకలదైనాసరే, మనం దాన్ని ఖండించకుండా ముక్కుమూసుకొని కూర్చొనవలసినదేనా? కాంగ్రెసుపైదాడిసల్పినా, మన పతాకాన్ని అవమానపరచినా, లేక మనసంస్థనే నిషేధించినా, నోరు మెదపకుండా, మనం ఈ దమననీతిని చూస్తూ ఊరుకోవలసినదేనా? మన సంస్థ మన కార్యాలయం ఏ మార్గాన్ననుసరించవలసివుంటుందో స్పష్టంగా అవగాహనచేసుకుందుకు, ఈ విషయాలన్నిటినీ మనం తేల్చు కోవలసివుంటుంది.

అవతలిపక్షంవారు ఏమి చెబుతారో, కనీసం విననైనావినకుండా, ఈ తీర్మానాన్ని అఖిలభారతకాంగ్రెసుకమిటీ ఆమోదించడం భావ్యంగా లేదని మీ రన్నారు. అయితే, విచారణసంఘాలను నియమించి, వాటిని సంస్థానాలకుపంపడంమనకుసాధ్యమేనని మీరుతలపోస్తున్నారా? అందుకు సంస్థానాలు అంగీకరిస్తాయా? సంఘాలమాట కేమి, పోనీ, ఒకవ్యక్తిని అక్కడకు రానిచ్చి, ఉభయపక్షాలవాదనలు విని, సాకల్యంగా దర్యాప్తు చేసేఅవకాశం కలగచేయమని నే ననేకసార్లు సంస్థానాలకు సూచించాను. వా రీ సూచనను ససేమిరా కూడదని, ఎప్పుడూ తిరస్కరిస్తూనే వచ్చారు.

ఈ మైసూరువ్యవహారం ఈనాటిదీ నిన్నటిదీ కాదు. చాలాకాలం నుంచి, ఇది పొగరాజుకుంటున్నట్లు రాజుకుంటూనేవచ్చింది. కర్ణాటక రాష్ట్రకాంగ్రెసుకమిటీ ఈ విషయంలో కొన్నిచర్యలుతీసుకొంది. రాష్ట్ర కాంగ్రెసుకమిటీకార్యదర్శి మైసూరుదివానుతో ఇంటర్వ్యూచేసి చాలా సేపు సంభాషించివచ్చాడు. నేను దివానుకు మాటిమాటికీ ఉత్తరాలువ్రాస్తూ కొన్ని నిర్దిష్టమైనకేసులు ఆయనముందుపెట్టాను. సంస్థానప్రభుత్వవిధానం ఏవిధంగా న్యాయమైనదో పేర్కొనకుండా ఆయన సుదీర్ఘంగా నా కొక లేఖవ్రాశాడు. ప్రభుత్వఉత్తర్వులను ఉల్లంఘించవద్దని కొన్నిమాసాల నుంచి నేను, మైసూరుకాంగ్రెసువాదులను నివారిస్తూవచ్చాను; నిజానికి మొన్నమొన్న నారిమన్‌తప్ప కాంగ్రెసువాదులెవరూ ప్రభుత్వఉత్తరువు లను ధిక్కరించిఎరగరు. చిట్టచివరకు కర్ణాటకరాష్ట్రకాంగ్రెసుకమిటీ పరిస్థితినిపర్యావలోకించి మైసూరుప్రభుత్వనిర్బంధవిధానాన్నిఖండించింది;

ఇకముందు తా మేమిచేయాలో తగు ఆదేశాలనీయవలసిందిగా మమ్మల్ని కోరింది. కనుక అఖిలభారతకాంగ్రెసుకమిటీ ఏమీ వినకుండా ఒకపక్ష పరోక్షన ఎవరినో ఖండించినదని చెప్పటానడం పూర్తిగా తప్పు. మాకు సావకాశంగావున్న అన్నిసాధారణమార్గాలను మేము అనుసరించిచూశాం.

మన విధానమేమిటో నా దృష్టిపథంలో స్పష్టంగా గోచరించ డానికి మీకు నే నిదంతా వ్రాస్తున్నాను. మే మిట్టిచర్యనుగై కొన్నందుకు నన్నూ, అఖిలభారతకాంగ్రెసుకమిటీని మీరు అధిక్షేపిస్తున్నారు. నే నెక్కడ తప్పుచేశానో, నేను చేసినది ఎలాగ తప్పో, నా కింతవరకూ బోధపడలేదు. నా కది బోధపడనంతవరకూ నే నింకొకవిధంగా ప్రవర్తించలేను.

మహాత్మాగాంధీ, ప్రేమగల మీ
వార్ధా (మధ్యరాష్ట్రాలు) జవహర్‌లాల్

200. గోవిందవల్లభపంత్‌కు

నవంబరు 25, 1937

వ్యక్తిగతం.

నా ప్రియమైన పంత్‌జీ,

నే నీరోజున బయలుదేరి అస్సాం వెడుతున్నాను. బహుశా డిసెంబరుమధ్యలోకాని, నేను తిరిగిరాకపోవచ్చును. నేనువెళ్ళేముందు మీ కొక విషయం వ్రాయాలనుకున్నాను; కాంగ్రెసుమంత్రివర్గాలకుసంబంధించి నంతవరకు భారతదేశమం దంతటా జరుగుతున్న సంఘటనలు నన్ను ఎంతో కలవరపెడుతున్నాయి. నేను నా భావాలను వ్యక్తపరుస్తూ, వర్కింగుకమిటీసభ్యులకు ఉత్తరాలువ్రాశాను. నా ఉత్తరపత్రిని మీకు పంపించాను. నాకు కలిగినఅభిప్రాయాన్ని నేను అదుపులోపెట్టుకుని మరీ, వారికి వ్యక్తపరిచాను; నా అభిప్రాయాన్ని నేను ఆత్మసంయమనంతో వ్యక్తపరిచాను కాని, దానిలో ఎంతో విశ్వాసం నిబిడీకృతమైవుంది. దీనిని నేను పారిభాషికపదజాలంతో చెప్పాలంటే కాంగ్రెసుమంత్రి

వర్గాలు రానురాను విప్లవప్రతీఘాతకశక్తులుగా తయారౌతున్నాయి. అయితే ఇవి యిలాగ బుద్ధిపూర్వకంగా తయారవుతున్నాయాఅంటే కాదనిచెప్పాలి కానీ, అవకాశమంటూ ఒకటి యిస్తే వాటిమనస్సు ఈ పద్ధతివైపుకే మొగ్గుచూపుతుంది. ఇది అలావుండగా, ఇక సాధారణవైఖరన్నది చలన రాహిత్యంగా నిస్తబ్ధతగావుంది. మనం ఎన్నటికీ చలనరాహిత్యంగా పడివుండడానికి సాహసించలేం; అలాగపడివుండడమంటే మనం కేవలం వెనకటిప్రభుత్వాల సంప్రదాయాన్ని (స్వల్పమైన మార్పులతో) కొన సాగిస్తున్నామనే దానిఅర్థం. ప్రపంచం చలనసహితమైనది; కనుక మన మెంతోకాలం. చలనంలేకుండా పడివుండలేం. తప్పనిసరిగా ఏదో ఒక దానిని ఎంచుకునేఅవకాశం వుండవలసిందే; కాని సర్వసాధారణంగా మనం చెడుదాన్నే ఎంచుకుంటున్నామేమోనని నేను భయపడుతున్నాను.

కాంగ్రెసుమంత్రివర్గాలు నెలకొన్నఫలితంగా మనకు అమితమైన శక్తి చేకూరిందని నా విశ్వాసం. కాంగ్రెసుమంత్రివర్గాలుగై కొన్న కొన్ని ప్రాథమిక చర్యలవల్ల కొంతవరకు ఈ శక్తి చేకూరినమాట నిజం; అం దుకుసందేహంలేదు; కాని ఈ మార్పు చాలావరకు మానసికమైనది; ఇటు వంటి మానసికపరిణామంకలగడం సహజం. అది తప్పనిసరి. అయితే మానసికంగా మార్పులువచ్చాయనో, లేదా కొన్నిమంచిపనులు కావించా మనో భావించి వాటిపై ఆధారపడి మనం బ్రతకలేం. మనం అధికారాన్ని స్వీకరించి ఇప్పటికి అనేకమాసాలయింది; కనుక మనం ఇంతకంటె ఎక్కువ సత్ఫలితాలను సాధించి చూపించవలసివుంటుంది. తీరా ఇప్పుడు ముందుకుపోవలసినసమయం వచ్చేసరికి, మనం వెనక్కిపోయేస్థితికి దిగజారిపోతున్నాం. అయితే, మనవుద్యమం మహాశక్తివంతమైనది కనుక, మనం వెనక్కిపోవాలనుకున్నా, అది మనల్ని అలాగ పోనీయదు. కాని 'వెనక్కిపోదామనేప్రయత్నంలో, మనం మన ఉద్యమాన్ని ఎంతో బలహీనపరుస్తున్నాము; ఇన్నేళ్ళనుంచీ మనచేత ఏ పనిచేయించాలని బ్రి టిష్ప్రభుత్వం ప్రయత్నిస్తూవచ్చిందో సరిగ్గా అదేపని మనం యిప్పుడు చేస్తున్నాం. కాంగ్రెసును విచ్ఛిన్నంచేయాలని కాంగ్రెసు లేదా కాంగ్రె సులో ఒకభాగం ముఖ్యంగా సామ్రాజ్యవాద అనుకూలవిధానాన్ని అనుస

రించేటట్లు చూడాలని బ్రిటిష్ ప్రభుత్వం ప్రయత్నిస్తోంది. ఇదేకనక మనకు తప్పనిసరిఅయితే, మనం ఎంత త్వరగా అధికారాన్ని ఒదులు కుంటే అంతమంచిది. ఇన్నాళ్ళనుంచి మనం నడుస్తున్న తాబేలునడకను మానుకొని, శరవేగంతో ముందుకుపయనించగలిగితే తప్ప, మనం పద వులలోవుండిలాభంలేదు. మనం పదవులలో వుండడంకంటే బయటవుం డడం ఎంతో శ్రేయస్కరం. ప్రస్తుతానికి ప్రత్యేకించి మద్రాసు, బొంబాయి లలో మనం వెనక్కిపోవడమన్న ప్రశ్న లేనేలేదు.

బహుశా నా దృక్పథం సరియైనది కాకపోవచ్చును. కాని నా వీక్షణననుసరించిమాత్రమే నేను ఆలోచించగలను; పనిచేయగలను. మన ముందువున్న సమస్యలు స్థూలమైనవికావు. వాటిని నిర్లక్ష్యంచేస్తే కళం కాన్ని తెచ్చిపెడతాయి.

మీ విశ్వాసపాత్రుడు,
జవహర్‌లాల్

201. ఖాలిక్-ఉజ్-జమాన్‌కు

అల్లాహాబాద్
జూన్ 27, 1937

నా ప్రియమైన ఖాలిక్,

బుందేల్‌ఖండ్ ఉపఎన్నికనుగురించి, జూన్ 26వ తేదీన ఖిలా ఫత్ వార్తాపత్రికలో అచ్చయిన ప్రకటన నిన్నసాయంకాలం నేను చది వాను. ఆ పత్రికాప్రకటనమీద మీతోపాటు ఆరుగురో, ఏడుగురో సంతకంపెట్టారు. నేనది చదివి చాలా ఆశ్చర్యపడ్డాను. మీ పేరుతో ఇటువంటిప్రకటన వెలువడుతుందని నేను కలలోకూడా అనుకోలేదు. ఎలాంటిపరిస్థితులలోనైనా, ఇలాంటిది జరుగుతుందని నమ్మడం కష్టం. గత ఏప్రియల్‌లో మనం సంభాషించుకున్నపిమ్మట, మీరుకావించిన ఈ ప్రకటనను చూసి నేను నా కళ్ళనే నమ్మలేకపోయాను. భారతదేశంలో ప్రస్తుతం జరుగుతున్న సంఘటనలతో గత రెండుమూడుమాసాలనుంచి నాకుసంబంధంలేదు. నాకు అస్వస్థతగావుండడం నేను ఇక్కడలేకపోవడం

ఇందుకు కారణం. కాని, సంఘటనలు సిద్ధాంతాలను తల్లక్రిందులుచేయ జాలవు. కాని మీరు ఖిలాఫత్‌పత్రికలో కావించినప్రకటన, ఈ సిద్ధాంతాల తల్లి వేరుకే విఘాతంకలిగిస్తోంది. ఎటువంటికార్యక్రమాన్ని చేపట్టాలనేవిషయంల్లో, గతంలో మనం విభేధించివుండవచ్చును. అలాగ విభేధించినప్పటికీ స్థూలంగా మన దృక్పథం ఒకటేనని సదా, నేను భావిస్తూ వచ్చాను. కాని నేను పొరబడ్డానుకాబోలు. నాకు సంబంధించినంతవరకు నా చర్యలవల్ల కలిగే ఫలితాలమాట ఆలోచించకుండా నేను పవిత్రంగా ఎంచుకొంటున్నసిద్ధాంతాలను దృష్టిలోపెట్టుకొని వాటినే నే నిన్నాళ్ళనుంచీ అనుసరిస్తున్నాను. ఇకముందుకూడా అనుసరించబోతున్నాను. ఆలోచనలకు, చర్యలకు ఇలాంటి ఆధారంలేనపుడు నా పని ప్రవాహంలో పడి అటుఇటుకొట్టుకుపోయే గడ్డిపోచ చందమౌతుంది. చుక్కాని, దిక్సూచిలేని పడవమాదిరిగా నేను పయనించవలసివస్తుంది. జీవితం మోయలేని భారంగా తరుచు నా కనిపిస్తూవుంటుంది. కాని, కొన్ని నిర్దిష్టమైనసిద్ధాంతాలకు నేను కట్టుబడి వాటిని అనుసరిస్తున్నానుకదా అనేవిషయం నాకు ఆత్మసంతృప్తిని కలిగిస్తూవుంటుంది.

మీరు చేసిన పనికి, లేదా చేశారని చెప్పబడుతున్నపనికి నే నెంతో విచారించాను. ఈ విషయంలో నే నేమనుకుంటున్నదీ, మీకు నేను చెప్పవలసివుంటుంది. నాతో సంప్రదించకుండా, మీరు అట్టిపై ఖరిని అవలంబిస్తారని నే ననుకోలేదు. అలాగ ఆశించడానికి నాకు హక్కుగలదని నే ననుకొంటున్నాను. మీరు కావించినవాగ్దానం నాకు జ్ఞాపకంవచ్చింది. నేను మీ వాగ్దానానికి చాలా విలువయిచ్చాను. అప్పుడు మీ రిచ్చినవాగ్దానం ఇప్పుడు గాలికి ఎగిరిపోయింది. ఇది నా కొకపిడుగుపాటుగా వుండటం సహజం.

ఇది పూర్తిగా వ్యక్తిగతమైనలేఖ. ఇది వ్రాయడానికి రాజకీయంగా నా కెట్టి అధికారమూ లేదు.

మీ

జవహర్‌లాల్.

[చౌదరి ఖాలిక్-ఉజ్-జమాన్ ఉత్తరప్రదేశ్ కాంగ్రెసు అగ్రనాయకులలో ఒకరుగావుండేవారు. కొంతకాలం గడిచాక ఆయన ముస్లిం లీగ్‌లో ప్రవేశించారు. భారతదేశవిభజనానంతరం, ఆయన పాకిస్థాన్ వెళ్ళిపోయారు.]

202. ఖాలిక్-ఉజ్-జమాన్‌నద్దనుంచి

లక్నో,

నవంబరు 28, 1937

నా ప్రియమైన జవహర్,

మీరు వ్రాసినలేఖ, దానితో జతపరిచినది కొన్నిరోజులక్రితం నాకు అందాయి. గత మేనెలలో బుందేల్‌ఖండ్ ఎన్నికలపోరాటం జరిగినపుడు ముస్లిములతో సంబంధాలుపెట్టుకోవాలనే ఉద్యమంలో గర్భితమైవున్న ప్రమాదాలనుగురించి వివరంగా మీకు నేను లేఖవ్రాసినట్లు మీకు జ్ఞాపకం వుండివుంటుంది. కాంగ్రెసుఅవలంబించిన తద్విధానఫలితమే నేటిపరిస్థితులకు కారణమని నేను భావిస్తున్నాను. ప్రత్యేకనియోజకవర్గాలు, మత ప్రాతిపదికపై ఏర్పడినపుడుపైతం, ముస్లిములస్థానాలకు పోటీచేసే హక్కు కాంగ్రెసుకు లేదని ఎవరూ అనజాలరు. కాని ముస్లిములు ప్రత్యేకనియోజకవర్గాలకు అంటిపెట్టుకున్నంతకాలం తమ ప్రతినిధులను తాము తమ వేదికద్వారా ఎన్నుకుని పంపించేటందుకుగాను, ముస్లిములతో పోటీచేయకుండా వారిమానాన వారిని విడిచిపెట్టడం దేశశ్రేయస్సు దృష్ట్యా అవసరం. ఈ అభిప్రాయాన్ని మీ రంగీకరించేటట్లుగా దుర దృష్టవశాత్తు నేను చేయలేకపోయాను. ఈ ఎన్నికలను పురస్కరించు కొని కొన్ని శోచనీయమైనసంఘటనలు జరిగాయి. ఈ ఎన్నికలు ఈ విధంగా కొనసాగుతున్నంతకాలం ప్రస్తుతపరిస్థితి ఎట్టిపరిష్కారానికీ వీలివ్వదని నా భయం. కాంగ్రెసుతరపున పోటీచేస్తున్న ముస్లింఅభ్యర్థి అతన్ని బలపరిచేవారూ తమ ప్రత్యర్థులైన ముస్లింలీగర్లవలె తామూ పవిత్రులమనీ, ఉత్తములమనీ ప్రకటించుకోకతప్పదు. వారు ఓటర్లను తమపక్షానికి త్రిప్పుకుందుకు పరమరకాంక్షాపరుల మతావేశాన్నంతటినీ

రంగంలోనికితీసుకురాకతప్పదు. ప్రత్యేకనియోజకవర్గాలలోకాంగ్రెసు తన అభ్యర్థులను నిలబెట్టి వారు గెలిచేటట్లు చేయగలిగినప్పటికీ కమ్యూనల్ అవార్డు మార్పుచేయబడనంతవరకూ అది ఇలాగచేయడం భావ్యంకాదని నా వ్యక్తిగతాభిప్రాయం. ఇటీవల డాక్టర్ మూన్జీ తనుకావించిన ఒక ప్రకటనలో బిజ్నొల్ ఎన్నికలఅనంతరం కమ్యూనల్ అవార్డును ముక్కముక్కలుగా చించి ప్రోగుపెట్టినందుకు కాంగ్రెసును ప్రస్తుతించాడు. ప్రత్యేకనియోజకవర్గాలపద్ధతిప్రకారం జరుగుతున్న ముస్లిం ఎన్నికలలో కాంగ్రెసు యిటువంటి ఆశయంతో పోటీచేయదని నాకు తెలుసును. కాని ఒకఒడంబడిక కుదరనిదే, కమ్యూనల్ అవార్డును మార్పుచేయడం దానిని సంస్కరించడం కాంగ్రెసుకు యిష్టంలేకపోయినప్పటికీ అది అనుసరిస్తున్న విధానాలఫలితంగా అవార్డు విచ్ఛిన్నంకాకతప్పదు. ముస్లిములీగు, కాంగ్రెసు కార్యక్రమాలలోవున్న ఈ ఒక్కభేదంతప్పితే కాంగ్రెసు, ముస్లిములీగుసభ్యుల మధ్యవున్న ప్రస్తుత అసంతృప్తికి వేరే యింకొకకారణంవున్నట్లు నాకు కనిపించడంలేదు. అంతేకాక ఈ ఉపఎన్నికలుకూడా అట్టేకాలంకొనసాగవు. అవి ముగిసినవెంటనే ప్రజలు ప్రశాంతంగాకూర్చొని కార్యక్రమాన్నిగురించి, ముమ్ముందు తాము చేయవలసినపనినిగురించీ జాగ్రత్తగా ఆలోచిస్తారు. పరస్పరవైమనస్యాలు తొలగిపోతాయని, ప్రజలు వాటిని విస్మరిస్తారని నేను ఆశిస్తున్నాను.

ఇప్పుడు ముస్లింలీగు దేశస్వాతంత్ర్యాశయానికి కట్టుబడివుంది. సామ్రాజ్యవాదాన్ని ధ్వంసంచేసేఆశయంగల ఎట్టి ఉద్యమంలోనైనా సహకరించడం దాని ప్రథమకర్తవ్యం. కాంగ్రెసు సచేతనమైన ఏపోరాట కార్యక్రమాన్ని ప్రారంభించినా ముస్లింలీగు వెనుకంజవేయకుండా, కాంగ్రెసుతో అత్యంత సన్నిహితంగావుంటూ, ఆ పోరాటంలో పాల్గొంటుంది. అదేవిధంగా శాసనసభాకార్యక్రమానికి సంబంధించినంతవరకూ అది సహకారభావంతో మెలగుతూనేవుంటుంది. వార్ధా కార్యక్రమాన్ని పూర్తిగా ముస్లింలీగు ఆమోదించింది. దాని సభ్యులు ఆ కార్యక్రమాన్ని బలపరచితీరుతారు.

ఇతరులను అవాంఛనీయంగాఒత్తిడిపెట్టడంపై మౌలానాషౌకతాలీ కావించిన ప్రకటననుగురించి నేను సవివరంగా మీకు సమాచారం అందించేస్థితిలో లేను. కాని నే నొకవిషయాన్నిమాత్రం పేర్కొనగలను. గౌరవనీయుడైన హాఫీజ్ అహమ్మద్ ఇబ్రహీం తన మంత్రిపదవిని తాను అట్టేపెట్టుకొని, తిరిగి ఎన్నికలలో పోటీచేయడానికి తన శాసనసభా సభ్యత్వానికి రాజీనామాయిచ్చాడు. ఈ చర్య పూర్తిగా రాజ్యాంగవిరుద్ధమైనది కాకపోవచ్చును కాని, ఇందుకు కాంగ్రెసుప్రభుత్వం అనుమతించడం ఎంతో అసమంజసంగావుందని నేను భావిస్తున్నాను. ఇండియా ప్రభుత్వచట్టాన్ననుసరించి ఏవ్యక్తినైనా మంత్రిగా నియమించడానికి గవర్నరుకు అధికారంవుంది. అయితే ఆ వ్యక్తి తాను మంత్రిగా నియమింపబడిన ఆరునెలలలోపున శాసనసభాస్థానాన్ని పొందవలసివుంటుంది. ఒకమంత్రి తన మంత్రిపదవిని వుంచుకుంటూ, శాసనసభాస్థానానికి రాజీనామాచేయడానికి ఇండియాప్రభుత్వచట్టంలో ఆస్కారంలేదు. ఇది యిలావుంచినా, మీ రింకొకసంగతిని వెంటనే ఆమోదించి హర్షిస్తారన డానికి నా కెట్టిసందేహంలేదు. ముస్లింమతస్థుల ప్రతిఘటనశక్తిని గత ఎనభైఏళ్ళ విదేశపరిపాలన ధ్వంసంచేసింది. వారు అధికారాన్ని చూసి గౌరవించడానికి, భయపడడానికి అలవాటుపడిపోయారు. ముస్లిములకు గల ఈ బలహీనతను మంత్రిగావుంటూ ఎన్నికలలో పోటీచేస్తున్నవ్యక్తి చక్కగా వినియోగించుకోగలుగుతాడు. అతని అధికారం అతని విజయానికి తోడ్పడుతుంది. ఈ పద్ధతిని నిరసిస్తూ నేను ముఖ్యమంత్రికి నా అభ్యంతరాన్ని తెలియచేశాను. కాని, నా లేఖ అందినదన్న సమాచారం తప్ప, ఆయనవద్దనుంచి నా కెట్టి సమాధానం చేరలేదు. ఏమైనప్పటికీ ఇప్పు డది గతానికిసంబంధించినవిషయం. మీ రడిగిన సమాచారం నవాబ్ ఇస్మాయిల్ఖాన్ మీకు తెలియచేయగలడనుకుంటాను.

ఇక ముస్లింలీగ్సభ్యులప్రవర్తన, ముస్లింలీగ్ ప్రచారపద్ధతీ హద్దుమీరివున్నవన్న, లేదా అభ్యంతరకరంగావున్నవన్నసంగతినిగురించి ప్రస్తావిస్తాను. ఈవిషయమై మీ కందిన సమాచారం కొన్ని ఉదంతాలపై ఆధారపడివుండాలి, అది నిజమైవుండాలి. కాని అది సంఘటనల అపలు

స్వరూపాన్ని ఒక పక్షంనుంచిమాత్రమే చూచి మీ కందచేయబడిన సమాచారం. కాంగ్రెసుముస్లిములు, అహ్రారులు, జమాయిత్‌లుప్రతిరోజూ నానా మర్యాషలాడి ముస్లింలీగుసభ్యులను దూషిస్తున్నారు. నిరంతరం నిరాధారమైన అసత్యప్రచారంకావిస్తున్నారు. ఇవి తమపక్షంవారికిపైతం గౌరవాన్ని తెచ్చిపెట్టవని వారు గ్రహించినట్లు కనబడదు. ఈ సందర్భంలో నే నొకదృష్టాంతాన్ని మీ దృష్టిపథంలోనికి తీసుకువస్తున్నాను. ముస్లింలీగ్ ప్రతినిధులు క్రుళ్ళికంపుకొడుతున్న శవాలవంటివారని వర్ణిస్తూ మౌలానా అతుల్లాషా బుఖారీ ఒకసారిఉపన్యసించాడు. అదేవిధంగా "హిందూస్థాన్" అనే కాంగ్రెసుపత్రిక ముస్లింలీగుసభ్యులను ఖాండ్యని, మదరీస్ అని అభివర్ణించింది. బాధ్యతారహిత పత్రికారచనకు ఇలాంటి వ్రాతలు ఉదాహరణలు. కాంగ్రెసును బలపరుస్తున్న అహ్రారులు, లాహోరు మసీదులో ముస్లిములీగు సానుభూతిపరులపై దాడిసల్పారు. దీనినిబట్టి కాంగ్రెసును బలపరుస్తున్న ఈ అహ్రారీలు హింసాయుతచర్యలలో పాల్గొంటున్నట్లు ద్యోతకమౌతోంది. ప్రత్యేకమైన రాజకీయసంస్థయొక్క ఉనికిపట్ల తమకు నమ్మకంలేదని ఒకవంక ప్రకటిస్తూనే వారు యింకొకప్రక్క తామొక ప్రత్యేక రాజకీయసంస్థను ముస్లింలేబిల్ తగిలించుకుని నెలకొల్పుకున్నారు. వీటినన్నిటినిబట్టి చూస్తే, హిందువులకు ముస్లిములకు మధ్యవున్న అసహనంకంటే, ముస్లిములకు ముస్లిములకు మధ్యవున్న వైషమ్యం మిక్కుటమైనదని తేటపడుతోంది. అయితే కొంతకాలానికి ఈఉద్రిక్త మానసికవైమనస్యం, బాధ్యతారహితప్రవర్తన సమసిపోతాయనీ, ఇరుపక్షాలవారి దృక్పథాలకు క్రమ్మిన మంచుతెరలు తొలగిపోయినప్పుడు భారతదేశస్వాతంత్ర్యంకోసం మనమంతా భుజంభుజం కలిపి సమష్టిగా కృషిచేయడానికి అవకాశం లభిస్తుందనీ, నా దృఢవిశ్వాసం. ఈలోపున ఈ సంస్థలనాయకులు అదుపులోలేని తమ అనుచరులను పక్రమమైనమార్గంలోపెట్టి వారిని జాగ్రత్తగా నడిపించడానికి ప్రయత్నించితీరాలి.

మీ విశ్వాసపాత్రుడు

ఖాలిక్

## 203. మహాదేవ్ దేశాయ్ నుంచి

మగన్‌వాడీ, వార్ధా
డిసెంబరు 2, 1937

నా ప్రియమైన జవహర్‌లాల్‌భాయ్,

మీరు 27 వ తేదీన వ్రాసినలేఖ నాకు అందింది. అసలు మీరు ఉత్తరం వ్రాయడమే నా కాశ్చర్యంగావుంది. అందులోను, అంత పెద్ద ఉత్తరం వ్రాయడం నన్ను మరీ ఆశ్చర్యపరిచింది. మీ దన్నదానిని నేను హర్షిస్తున్నాను. నేను మీముందు వాదనాపటిమను ప్రదర్శించాలనివాంఛించ లేదు. దాని అవసరంలేదని భావించాను. మీరు మీ ఉత్తరంలో బాపూను కోరినవిషయమై ఆయనఅభిప్రాయమేమిటో మీకు ఉన్నదిఉన్నట్లు తెలియచేశాను.

బాపూ ఆరోగ్యపరిస్థితి అలాగేవుంది. కొంచెమైనా మెరుగ్గా వున్నట్లు కనిపించలేదు. ఆయనకువచ్చే ఉత్తరాలను మేము భద్రపరు స్తున్నాము. కాని, డాక్టర్ల ఉత్తర్వులను లెక్కపెట్టకుండా నేను ఆయనకి మీ ఉత్తరం చదివి వినిపించాలని నిర్ణయించుకొన్నాను. నేను చదవగా మీ ఉత్తరాన్నివిని ఆయన ఎంతో ఆనందించారు. నాలుగువాక్యాలు నోటితోచెప్పి, నాచేత మీకు జాబు వ్రాయించడానికి అవకాశముంటే, ఆయన అలాగ చేసివుండేవారు. కాని అది అసాధ్యమైనపని. కనుక మైసూరుతీర్మానం "నియమవిరుద్ధంగా" వున్నదని ఆయన మీకు వ్రాసి నప్పుడు ఆయనఅభిప్రాయ మేమైవుండినదో మీకు నేను నా స్వంత భాషలో తెలియచేయడానికి ప్రయత్నిస్తాను. ఇదేవిషయాన్ని బాపూ వర్కింగ్‌కమిటీసమావేశంలోనైతం చెప్పినట్లు మీకు జ్ఞాపకంవుండను కుంటాను. (ఆ అభిప్రాయం ఆయనకువుండెను. జమ్నాలాల్జీని ఈ విషయమై అడుగగా అతను ఆయనతో ఏకీభవించాడు.) ఈ తీర్మానం చర్చకు అనుమతించబడదని ఆయన విశ్వసించారు. కాని అది ఆమో దింపబడినతరువాత, ఆయన ఆశ్చర్యచకితులై నిశ్చేష్టులయారు.

ఆ తీర్మానంలోని భాష బాగాలేదని మీరు మీ ఉత్తరంలో అంగీక రించారు. అంతమాత్రంచేత, అది న్యాయసమ్మతమైనది కాకుండాపోదని

మీరు వాదిస్తారని నే ననుకుంటాను. కాని సంస్థానప్రభుత్వ దమననీతిని నిరసింపడమేకాక మైసూరు ప్రజలకు చేతనైనంత సహాయంచేయవల సిందిగా బ్రిటిష్ ఇండియాప్రజలకు ఆ తీర్మానం విజ్ఞప్తిచేస్తున్నదని. అది న్యాయవిరుద్ధంగావున్నదని వారూ భావిస్తున్నారు. లక్నో తీర్మానాల స్వభా వానికి ఇది విరుద్ధంగావుండక మరి యింక ఏమిచేస్తున్నట్లు? ఎంతో ఆలోచించినమీదట, సుదీర్ఘంగా చర్చించినపిమ్మట లక్నోతీర్మానం రూపొందించబడింది. 35 ఆగష్టు మొదటితేదీన రాజేంద్రప్రసాద్ కావించిన విధానప్రకటనను 35, అక్టోబరు 17వ తేదీన అఖిలభారత కాంగ్రెసుకమిటీ ఆమోదించింది. ఆయనకావించిన అఖిలభారతకాంగ్రెసు కమిటీ ఆమోదించిన విధానాన్నే లక్నోతీర్మానం ప్రతిబింబించింది.

ఈ ప్రకటనలో గమనించవలసిన ముఖ్యమైన వాక్యసముచ్ఛయం యిది: "ఏమైనప్పటికీ సంస్థానప్రభుత్వాలకు వ్యతిరేకంగా సాగుతున్న పోరాటభారాన్ని సంస్థానప్రజలు భరించవలసివుంటుందనీ, ఆ బాధ్యతను వారే తమకుతామే స్వీకరించవలసివుంటుందని మనం అర్థంచేసుకోవాలి. సంస్థానాలలో తనకు ఎక్కడెక్కడ సాధ్యమో అక్కడ కాంగ్రెసు స్నేహపూర్వక నైతికప్రభావాన్ని ప్రసరింపచేయగలదు. భారతదేశ ప్రజలు బ్రిటిష్‌పరిపాలనలోవున్నా, సంస్థానాధీశులపరిపాలనలోవున్నా, లేదా తదితరప్రభుత్వపరిపాలనలోవున్నా చారిత్రకదృష్ట్యా, భౌగోళికరీత్యా వారందరూ ఒకటే; అయినప్పటికీ కాంగ్రెసు ప్రస్తుతపరిస్థితులలో యింతకుమించి మరెట్టిసహాయమూ చేయలేదు. ఇప్పటి వాదప్రతివాదవల ఉద్రిక్తతలో చాలామంది కాంగ్రెసుకుగల శక్తిసామర్థ్యాల పరిమితులను తరుచు మర్చిపోతున్నారు. ఇంతకుమించి కాంగ్రెసు ఇంకొకవిధానాన్ని స్వీకరించినట్లయితే సమష్టిప్రయోజనం పరాజయంపొందుతుంది."

ఇప్పుడీ ప్రకటన కాంగ్రెసు అప్పటివరకూ అనుసరిస్తూవచ్చిన విధానాన్ని పునరుద్ఘాటించినదేతప్ప యిందులో క్రొత్తయేమీలేదు. "సంస్థా నాల స్వాతంత్ర్యపోరాటాన్ని, పరిస్థితులస్వభావాన్నిబట్టి సంస్థానప్రజలు తమకుతామై కొనసాగించుకోవలసివుంటుందని లక్నోతీర్మానం స్పష్టమైన భాషలో తేల్చిచెప్పింది. ఈ తీర్మానం ఆ ప్రకటనకు కాంగ్రెసుఅను

శాసనస్థాయిని చేకూర్చిపెడుతున్నది. కాంగ్రెసు తనకు తానువిధించుకొన్న పరిమితిని మైసూరు తీర్మానప్రతిపాదకులు విస్మరించి ఎంతోకాలమై కాంగ్రెసు ఆమోదించిన విధాన మూలస్వభావానికి వ్యతిరేకంగా ప్రవర్తించారు.

ఇప్పు డిక మీ రెండవప్రశ్ననుగురించి ప్రస్తావిస్తాను. "అఖిల భారతకాంగ్రెసుకమిటీ తీర్మానాలు సత్యఅహింసలను ఉల్లంఘించాయని బాపూ చెబుతున్నారు. ఇది తీవ్రమైన ఆరోపణ. దీనికి ఆధారమేమిటో వివరంగా పేర్కొనవలసివుంటుందని" మీ రంటున్నారు. ఇలాగ మీరు వ్రాస్తున్నప్పుడు బాపూవ్యాసం సహజంగా మీరు చూచివుండరు. మసానీ ప్రతిపాదించిన తీర్మానం, ఆ ఉపన్యాసాలు "సత్యవిదూరంగా వున్నాయని" బాపూ పేర్కొన్నారు. అవి ఎందుకు సత్యవిదూరంగావున్నవో విపులీకరిస్తూ "జవహర్‌లాల్‌నెహరూ తన సుదీర్ఘప్రకటనలో ఈ సమస్యనుగురించి చెప్పిన విషయాల్ని జాగ్రత్తగా పరిశీలించి మననంచేసుకోవలసింతని, సదా జ్ఞాపకముంచుకోవలసినదని" వారిని ఆయనకోరారు. అటుపిమ్మట ఆయన ఈ దిగువవాక్యాన్ని వ్రాశారు: "విమర్శకులు సత్య అహింసలకు దూరంగా తొలగిపోయారన్న నమ్మకం నా కేర్పడింది." ఇది తీర్మానానికంటే, ఉపన్యాసాలకు ఎక్కువగా వర్తిస్తుందన్న నమ్మకంతో ఆయన నుడివారు. తీర్మానంమీద చర్చజరుగుతున్నపుడు మీరనేకమంది ఉపన్యాసకులను వారించవలసివచ్చింది. సిద్ధాంతాలకు, విధానానికి అంటిపెట్టుకుని ఉపన్యసించవలసినదిగా మీరు హెచ్చరించవలసివచ్చింది. శ్రీ మసానీ తన ఉపన్యాసంలో యిలాగ ఉద్ఘాటించాడు: "పెక్కుమంది రాజకీయఖైదీలు విడుదలచేయబడ్డారు. నిషేధాలు రద్దుచేయబడ్డాయి. కాని ఇంకా ఇప్పటికీ కాంగ్రెసు పరిపాలితరాష్ట్రాలలో కొంతమంది జైళ్ళలోవుండిపోయారు." కాంగ్రెసు సమగ్రతాభావంతో శిరసావహించాలని అర్థంకాదు.

మీ ప్రకటనను మీరు పత్రికలకు విడుదలచేశారో లేదో నాకు తెలియదు. ఇంకా దాన్ని విడుదలచేయకుండా వున్నట్లయితే, ఈ ఉత్తరం మీకు అందినదృష్ట్యా మీ ప్రకటనను మీరు కొంతవరకు మారుస్తారని నే

ననుకుంటాను. ఈ లేఖ నేనే వ్రాశాను. ఇది బాపూవ్రాసినఉత్తరం కాదు. ఆయనకి నేను చూపకుండా దీన్ని మీకు పోస్టుచేస్తున్నాను. అయినప్పటికీ ఈ లేఖను లేదా లేఖాభాగాలను మీకు తోచినవిధంగా మీ ప్రకటనలో మీరు ఉపయోగించుకోవచ్చును. మీ ప్రకటన ఎలాంటి మార్పులులేకుండా యథాతథంగా ప్రకటించబడాలని మీరు భావించి నట్లయితే అలాగ చేయడానికి మీకు స్వేచ్ఛ పూర్తిగావుంది. ఈ సమస్యపై మీ నడిగినదానికి మీ కసంతృప్తికరమైన సమాధానం చేరిం దనీ, అందువల్ల మీ అంతఃకరణ ఆదేశించినప్రకారం ప్రకటన పత్రి కలకు విడుదలచేస్తున్నాననీ మీరు పేర్కొనవచ్చును.

మనమంత్రుల్లో కొందరిచర్యలు సత్యఅహింసలకు విరుద్ధంగా వున్నాయన్న విషయాన్నిగురించి నిర్మొహమాటంగా పూర్తి వివరాలతో మీరు తనకు జాబువ్రాయాలని బాపూ కోరుతున్నారు. తనకు ఆరోగ్యం బాగాలేకపోయినా ఆయన మీ లేఖను శ్రద్ధగా పరిశీలించగలరు. ఈ విరుద్ధప్రవర్తన ఎక్కడకనిపించినాసరే దాన్ని తీవ్రంగా నిరసించవల సిందే. మన మంత్రులు నిజంగా ఇలాగ ప్రవర్తించినట్లయితే తొలగింప బడడానికి వా రర్హులు.

బెంగాల్ వ్యవహారాలనుగురించి మీరు చెప్పిన అందరు మంత్రులు సామ్రాజ్యవాదంతో చేతులుకలిపారనో, లేదా హక్, సికిందర్ హయత్ ఖాన్లవలె వారూ పెద్దవారేననో ఋజువుచేయడానికి ప్రయత్నిస్తున్నట్లు ఈ వాక్యాలు ద్యోతకంచేయడంలేదా? మాప్లాలను అణచడానికై తయారుచేసిన చట్టాన్ని కాంగ్రెసు తాను అధికారాన్ని స్వీకరించిన రెండునెలల్లో రద్దుపరచింది. అయినపుడు ప్రజలను అణచిపెట్టే నిరం కుశవిధానమన్న ఆయుధశాల యింకా అలాగే వుండిపోయిందని చెప్పడం భావ్యమేనా? ఇందులో ఏమైనా నిజంవున్నదా? ఇక మిగిలినవారి ఉపన్యాసాలను నేను ప్రస్తావించవలసినపని లేదు.

మనమంతటమనం బుద్ధిపూర్వకంగా మైసూరుసంస్థానంలో ప్రవే శించి చట్టాలను ధిక్కరించామని అలాంటప్పుడు మైసూరు ప్రభుత్వ విధానం నిరంకుశంగావుందని మైసూరుతీర్మానంలో నిర్వచించడం సత్య

సమ్మతంగాలేదని బాపూ అభిప్రాయపడుతున్నారు. "అసహ్యాకరమైన నిరంకుశచర్యలు" కొనసాగుతున్నవనీ, "సంస్థానంలో ప్రవేశించిన వ్యక్తులపై జారీచేయడానికి ముందే అచ్చువేసి ఉత్తర్వులను సంసిద్ధ పరచి అట్టేపెట్టుకున్నారనీ" మైసూరుతీర్మానంలో అనుప్రయుక్తమైన భాష, సత్యాన్ని తల్లకిందులు చేస్తోంది.

ఇక మీ ఉత్తరంలో మీరు పేర్కొన్న మిగతా విషయాలను బాపూ హృదయపూర్వకంగా హర్షించారు. బాపూ చెప్పేరుకదా అన్నకారణాన్ని పురస్కరించుకొని మీరు ఏ విషయాన్నీ అంగీకరించనవసరంలేదు. ఆ ప్రశ్నలేనేలేదు. క్రమశిక్షణఅంటే "ఒకవ్యక్తి స్వంతఅభిప్రాయాన్ని ఇంకొకవ్యక్తి కేవలం విషయాలు ఆయన అర్థంచేసుకొన్నారు. నిర్బంధితుల విడుదల మీదుమిక్కిలి ఉద్రేకాన్ని కలిగిస్తుందని ఆయన ఊహించలేదు. సరికదా ఖైదీలను డెటిన్యూలను విడుదలచేయించడంకోసం తాను గవర్నరును, మంత్రులను ఇంటర్వ్యూచేసినపద్ధతిని మీ రామోదిస్తున్నారో లేదో మీకు వ్రాసి తెలుసుకోవలసిందిగా నన్నాయన కోరారు.

ప్రేమతో మీ
మహాదేవ్

## 204. అడాల్ఫ్ మియర్స్‌నవద్దనుంచి

C/o ది టైమ్స్ ఆఫ్ ఇండియా,
బొంబాయి
డిసెంబరు 6, 1937

ప్రియమైన జవహర్‌లాల్ నెహ్రూ,

"భాషాసమస్య" అనే మీ కరపత్రాన్ని, నే నిప్పుడే చదివాను. అందులో మీరు బేసిక్ ఇంగ్లీషునుగురించి ప్రస్తావించారు. బేసిక్ అనే దానిమీద నా కత్యంతాసక్తివుంది. మీరు అమితోత్సాహంతో దాన్ని గురించి వ్రాశారు కాని మీరు దానికి పూర్తిన్యాయంకలగచేయలేదు. ఈ భావంతో నేను మీరు విడిచిపెట్టినవిషయాన్ని ఏ పదజాలం పరిపూర్తి చేయగలదా అని ఆలోచించిచూశాను. అలాగ ఆలోచించిచూడగా మీరు

మీ ఆత్మకథలో ఉల్లేఖించిన ప్రొఫెసర్ జాన్ డివిలీవాక్యాలు జ్ఞాపకం వచ్చాయి. ఆయనకు బేసిక్ అనేదానిమీద మక్కువ ఎక్కువ. మీ సుల్లే ఖించిన ఆయనవాక్యాలు యివి: "....ఆదర్శలక్ష్యసాధనకు ఉద్దేశింప బడిన ఏ కార్యమైనప్పటికీ దానియందున్న సాధారణవిశ్వాసాన్ని దాని అమూల్యమైన విలువనుబట్టి, అది స్వభావరీత్యా, మతసంబంధమైనదై వుంటుంది."

ఇది నాకు మతసంబంధిగా కనిపిస్తుంది. అంతర్జాతీయదృక్పథాన్ని కలిగించడమెలాగ అనే అత్యవసరసమస్యకు, భావవ్యక్తీకరణార్థమై సర్వులకు అందుబాటులోవుండేభాషను సాధించడంద్వారా ఇది ఆచరణ సాధ్యమైన పరిష్కారమార్గాన్ని సూచిస్తుంది. అటువంటి సర్వసామాన్య మైన భాషద్వారా ప్రపంచచైతన్యాన్ని ప్రసాదిస్తుంది. అంతేకాక ఇది స్వర్గం మనకుప్రసాదించిన ఒకసాధనంవలె కనిపిస్తోంది. దీనిని స్వీక రించడంవల్ల ఇప్పుడు భావదారిద్ర్యంలో, భాషాదారిద్ర్యంతో బాధపడు తున్న మానవజాతికి అసంఖ్యాకమైన వరజాలం లభించగలదు. ఈ విష యాన్ని మీరు మీ గ్రంథంలో ప్రస్తావించారు.

అంతర్జాతీయంగా, సాంఘికశాస్త్రదృష్ట్యా దీనికిగల ఈ రెండు దృక్కోణాలనుగురించి మీరు మీ వ్యాసంలో చర్చించలేదు. అయితే బేసిక్ అనే విషయాన్ని మీరు మీ వ్యాసంలో యాదృచ్ఛికంగా పేర్కొన్నారని మీరు వాదించవచ్చును. మీ వాదనను నేను హర్షిస్తు న్నాను. కాని బేసిక్ అనే దానికిగల విశాలమైన మానవతాప్రయోజనాన్ని అలావుంచి, మీరు మీ బేసిక్ హిందుస్థానీవాదనను బలపరుస్తూ దానికిగల అవకాశాలను, ప్రయోజనాలను ప్రోత్సహించివుంటే బాగుండును. బేసిక్‌ను మీ రెంతవరకు అధ్యయనంచేశారో నాకు తెలియదు. ఆగ్డన్ రచించిన "డెబాబిలైజేషన్" అనే గ్రంథాన్ని రిఛర్డ్స్ వ్రాసిన "బేసిక్ ఇన్ టీచింగ్; ఈస్ట్ అండ్ వెస్ట్" అనే గ్రంథాన్ని, అవి మీరు చూచి వుండకపోతే వాటిని మీరు చదవడానికి తీరికచిక్కగలదని ఆవసర మైనపుడు ఆ గ్రంథవిషయాలను మీ రుపయోగించుకోగలరన్న ఆశయం తోనూ వాటిని మీకు పంపించె స్వాతంత్ర్యాన్ని తీసుకుంటున్నాను.

ఇదంతా మీకు వెర్రిధోరణివలె కనిపిస్తుంది. అయితే "యుద్ధాలు కూడదన్న" ఉద్యమంలో, తదితర ఉద్యమాలలో నేను పాల్గొని నిరాశ చెంది వెనక్కిమళ్ళినప్పటికీ ఘోర ప్రమాదకరపరిస్థితులు మనల్ని చుట్టుముట్టివున్నప్పటికీ మేధాశక్తి సడలిపోనందుకు, వెర్రెత్తనందుకు నాకే ఆశ్చర్యంగావుంది. ఏమైనప్పటికీ మొత్తంమీదచూస్తే, ఆదర్శం ఎంతో దూరంలోవున్నా అడ్డంకులు ఎంత గొప్పవైనా మనం ఒకానొకదశను చేరుకొన్నాం. అందరి ఉపయోగార్థమై ఒక సామాన్యభాష వ్యాప్తి చెందడం మానవాభివృద్ధికి తప్పనిపరిస్థితని మనం గ్రహించగలిగాం. ఇది లేనిదే మానవసమష్టిగమ్యం బలోపేతం కాజాలదు. కనుక దాన్ని ఎవరు సమీపానికి తీసుకువచ్చేందుకు ప్రయత్నిస్తున్నా "చరిత్రగమనంతో పాటు తా మొకఅడుగు ముందుకువేసినట్లు" అనుకోవచ్చును. ఇది ఉదాత్తమైన భావన, చారిత్రక ఆదర్శవాదకారణాలతో నేను ఏకీభవించక పోయినా షా, వెల్స్, హెడెన్, హాగ్‌బెన్, డివే, లియో. హూక్, ఓకాకురా, హక్స్లే, పెర్సినన్, ఇలియడ్‌స్మిత్, విక్‌హాం, ప్లెడ్, లిట్టినోవ్‌సతీమణి మొదలైనవారు బేసిక్ అనే దానికి ప్రపంచమందంతటా లభింపచేస్తున్న ప్రచారాన్ని వారిస్తున్నబలాన్ని చూసి ముగ్ధ నౌతున్నాను. వీ రెవరూ వెర్రివాళ్ళుకారు మరి !

బహూశా అంతకంటె నా విజయం మరీ ప్రోత్సాహకరమైనదను కుంటాను. "కఠినచిత్తులైన" టైమ్స్ ఆఫ్ ఇండియా డైరెక్టర్లను (నేనూ అక్కడ ఉద్యోగంలోవున్నాను.) బేసిక్‌పట్ల శ్రద్ధవహించమని రెండేళ్ళనుంచి శతపోరుతున్నాను. చివరకు ఇంగ్లండులో సెలవుమీద ఈఏడువున్నతర్వాత నేను వారిని ఒప్పించగలిగాను. అభిమానవిషయా లనుపఠించడానికి ఒకఏడాది సెలవుతీసుకొని ఆగ్డన్‌తో ఈ ఏడు గడిపాను. అందువల్లనూ, టైమ్స్ ఆఫ్ ఇండియా డైరెక్టర్లు బేసిక్‌పట్ల శ్రద్ధవహించడానికి నిశ్చయించుకొన్నందువల్లనూ, బేసిక్‌నుగురించి చౌకధరలో మే మొకపుస్తకాన్ని ప్రచురింపదలచాము. ప్రస్తుతం ఆంగ్ల భాషాబోధనలో యిమిడివున్న జటిలపద్ధతిని నిరర్థక వృథాశ్రమను తొలగించి దానిస్థానే బేసిక్ విద్యాబోధనపద్ధతులను ప్రవేశపెట్టడానికి

పీలిచ్చే ప్రాథమికచర్యలను ఈ పుస్తకం తేటపరుస్తుంది. అంతేకాక భారతదేశఅవసరాలకుసరిపోయే పద్ధతులు యిందులో పేర్కొన బడ్డాయి.

ఈ సందర్భంలో మీ వ్యాసంలో మీరు తికమకలుకలిగించే ఒక వాక్యం వ్రాశారు. అది ఇది: "....వాణిజ్య, వైజ్ఞానిక, సాంకేతికపదాలను మినహాయించి బేసిక్‌భాషాపదములసంఖ్య 980 కి తగ్గించబడింది. ఆగ్డన్ గ్రంథాలలో యివ్వబడిన యీ సంఖ్య 850. అంతర్జాతీయపదాలను కలిపి చూసినా, యివి 900 మాత్రమే వుంటాయి....బహుశా ఇది మీ వ్యాసంలో పొరపాటున దొర్లివుండవచ్చును. అవసరంవచ్చినపుడు ఈ విషయాన్ని స్పష్టపరచడానికి మీరు మాకు అధికారమిస్తారని ఆశిస్తాను. ఈ విషయమై వ్రాసిన అధికారయుతమైన లేఖను ఇందుతో మీకు జత పర్చి పంపిస్తున్నాను.

ఇక యిప్పుడు మీ కొకవిషయాన్ని చెప్పదలచుకొన్నాను. ఒక ఏడాదిక్రితం మీ ఆత్మకథ చదివాను. అదిచదవగా నాకు కలిగిన గాఢమైన భావాలను మీకు తెలియచేయాలని నాటినుంచీ అనుకొంటూనే వున్నాను. మొట్టమొదటిసంగ తేమిటంటే మనయిద్దరికీ అనురూపమైన విషయాలు చాలా వున్నట్లు కనిపిస్తోంది. నేను ఇంగ్లండులో పుట్టి పెరిగినా యూదుజాతీయుడనన్న సంగతి మీకు తెలుసునుకదా. మా జాతీయ పునరుద్భవోద్యమసమరంలో నేనూ మీ వలె 'ఏకాకినని, నిరాశ్రయుడనని' బాధపడుతూవుండేవాడిని. నేను కమ్యూనిష్టుతత్వంతో పనిచేసిన పాలస్తీనాలోవున్న యూదులు విదేశీయులుకావడం దీనికి కొంతకారణం. అదీకాక ఆ ఉద్యమ దృక్పథంతో ముఖ్యంగా "ఎంచుకొనబడినజాతి" అనే సిద్ధాంతంతో నే నేకీభవించలేక ఉద్యమానికి దూరంగావుండిపోతున్నాను. నేను ఏకాకిననే, నిరాశ్రయుడననే భావం కలగడానికి ఇది కొంతకారణం.

కాని యిది అల్పాతిఅల్పమైనవిషయం. మీ గ్రంథం చదివాక భారతనాయకుల, ప్రజల నైతిక పరస్వభావాన్ని ఆత్మత్యాగనిరతిని గ్రహించి ఉప్పొంగిపోయాను. వారిపట్ల నాకు పూజ్యభావ మేర్పడింది.

భారతదేశం వెనకబడివున్నా, ఎంత దారిద్ర్యావస్థలోవున్నా అది అచిర కాలంలోనే బాహ్యాంతరప్రవృత్తులఅభివృద్ధిని వాటిసమన్వయాన్ని చక్కగా సాధించగలదని మీ గ్రంధపరనానంతరం గ్రహించగలిగాను. మీరన్నట్లుగా వీటిని పాశ్చాత్యదేశాలు సాధించలేక విఫలమయ్యాయి. భారతదేశం వీటిని సాధించి నాగరీకంగా బ్రతకడానికిగల మార్గాలను నిర్దేశిస్తూ మిగిలిన ప్రచారానికి నాయకత్వంవహిస్తుంది.

మీ గ్రంథంలో మీ రభివర్ణించిన సాధారణ కారాగారవాస జీవిత పరిస్థితులను, దాని భయంకర అమానుషత్వాన్నేకాక ప్రతిభావంతమైన ఉత్తమమానవశక్తులు అక్కడ ఎలాగ నిరుపయోగమౌతాయో నేను చదివి తెలుసుకుంటున్నప్పుడు నాకు భారతదేశంగురించి పైన నేను పేర్కొన్నఅభిప్రాయం కలిగింది. ఇప్పుడు కాంగ్రెసువారు అధికారంలో వున్నారు. కనుక జైలుపరిస్థితులు సంస్కరింపబడడానికి అదేకాలం పట్టదని నేను భావించాను. ఇదివరకు తాము అనుభవించిన జైలుజీవితం సంస్కరింపబడడంతప్పదు. ఈ కారాగారజీవితపరిస్థితులు మారిపోవాలని కొన్నిసంవత్సరాలనుంచి ప్రపంచమంతటా సంస్కరణల ఆందోళన కొనసాగుతోంది. కాని ప్రయోజనంకనిపించకుండావుంది. విద్యావిధానంలో కార్మికశ్రేయస్సులో మార్పులు రావాలని మద్యపాననిషేధం అమలులోకిరావాలని ప్రచారంచేసి జనుల ఆలోచనాప్రవాహాన్ని మళ్ళించేందుకు కావించినప్రయత్నంలో ఒకతరంవారు తీవ్రమైన వ్యతిరేకతను తట్టుకోవలసివచ్చింది. ఇతరదేశాలలో సిద్ధాంతవేత్తలు పడకకుర్చీలలో కూర్చుని సిద్ధాంతాలను వల్లెవేయడంకంటె ఆచరణలో కొన్నిపనులు చేసి చూపించడం మంచిది.

ఈ విషయం నే నొకఏడాదిక్రిందట చెప్పాను. ఈ కొన్నిమాసాలలో నా కెంతో ఉత్సాహంకలిగింది. మీ రిప్పుడు మీ దేశంలో అత్యధిక రాష్ట్రాలలో ప్రజాపాలనసాగిస్తున్నారు. వ్యక్తిగతజీవితానుభవంనుంచి నేర్చుకున్నవిషయాలను ఆచరణలోపెట్టడం మొట్టమొదట చేయవలసిన పని. ఆర్డినెన్సుల ఉపసంహరణ, జైళ్ళనుండి ఖైదీలవిడుదల, మద్య

పానని షేధం, వ్యవసాయసంస్కరణలు, ప్రజలకు విద్యాబోధన మున్నగునవి మీ దృష్టిపథంలోవున్నాయని భావిస్తాను.

ఈ నిర్మాణప్రయత్నం వినాశకర విమర్శకంటె ఎంతో కష్టమైన దని, మీరు భావిస్తున్నారనడానికి సందేహంలేదు. ఈ మార్గం సుదీర్ఘ మైనది. అడ్డంకు లనేకం. అయినప్పటికీ నిరాడంబరత, సత్యం, అహింస అనేవి మీ సూక్తులు. అవి మీ మంత్రాలు. అందువల్ల, మీరు మీ గమ్యస్థానాన్ని సుకరంగా చేరుకోగలరు.

ఆనందదాయకమైన నిజమైన నాగరికసమాజాన్ని నెలకొల్పడమే మీ లక్ష్యం; పాశ్చాత్యరాజ్యాలకంటె ముందుగా బహుశా వాటిప్రమేయం లేకుండా మీరు మీ లక్ష్యాన్ని సాధిస్తారు.

గాంధీజీ ధరించే చిన్న అంగవస్త్రం, ఆయనప్రాగేపాలు, ఆయన బాహ్యాంతరప్రవృత్తుల వికాస సమన్వయాలంటే ఏమిటో ప్రపంచానికి యిప్పటికే కొంత బోధించారని నేను అనుకుంటున్నాను. నిరాడంబరత అనేదానిని గోరంతలుకొండంతలుగా చెప్పినప్పటికీ అందు అంతర్భూత మైన ఆదర్శం భారతదేశానికి సంబంధించినంతవరకు, ఒక చిహ్నమని, అదే మీ సాధనమని, లక్ష్యమని నేను భావిస్తున్నాను.

ఈ ఉత్తరం ఎంతో కొంత గజిబిజిగావున్నదని భయపడుతు న్నాను. ఇందులో అనేకవిషయాలు కలగాపులగం చేశాను. ఈ లేఖలో ఏమైనా అంతర్భూతమైన ఐక్యతంటూ ఒకటివుంటే, భారతదేశం, సాంఘికవిప్లవమనే ప్రాంగణంలో అడుగుపెట్టినదన్న అభిప్రాయంమీద ఈ ఐక్యత ఆధారపడివుంది. ఈ సాంఘికవిప్లవంలో విద్యావిధానం ఎలాగూ చేరివుండాలి. బేసిక్ అనే అభిప్రాయమే విప్లవకరమైనది. కనుక ఈ సామాజికవిప్లవంలో, ఇది అత్యంత ప్రధానమైన పాత్ర వహించవచ్చును. ఇది ఆంగ్లభాషాబోధనపద్ధతులలో మార్పులు తేవడమేకాక మానసికంగాను, విద్యాబోధకులవీక్షణలోను అనేక పరిణా మాలను తీసుకువస్తుంది.

మీ విశ్వాసపాత్రుడు,
ఆడాల్ఫ్ మియర్స్

205. మహాత్మా గాంధీవద్దనుంచి

సేవాగ్రాం, వార్ధా
డిసెంబరు 7, 1937

నా ప్రియమైన జవహర్‌లాల్,

నేను మద్రాసుతీర్మానాలను, నీ ఉపన్యాసాన్ని చదవలేదు. నాకు వాటిని చదవాలనివుంది.

మహాదేవ్‌కు వ్రాసిన ఉత్తరంలో నీవు కావించిన నీ మృదువైన ఫిర్యాదును నేను గమనించాను. నే నేమిచేయగలను? నే నెలాంటి వ్యక్తినో, అలాంటివ్యక్తిగానే నన్ను నీవు గ్రహించాలి. నీవు నాకు తెలుసును. నీవు నాతో ఎంత సరళస్వభావంతో మెలగుతున్నదీ నాకు తెలుసును.

నీ కిష్టమొచ్చినపుడు క్రిప్సును నీవెంట తీసుకురావచ్చును.

ప్రేమతో
బాపూ.

206. రాజేంద్రప్రసాద్‌వద్దనుంచి

జిరాడై పోస్టు (సరాన్)
డిసెంబరు 24, 1937

నా ప్రియమైన జవహర్‌లాల్జీ,

మీరు నవంబరు 27 వ తేదీన వ్రాసినలేఖ, దానితోజతపరచి పంపించినదీ సరియైనవేళకు నాకు చేరాయి. కాని ఆ సమయంలో ఇది వరకు కాంగ్రెసుకావించినతీర్మానాలను నేను పరిశీలిస్తూవుండడంవల్ల మీకు వెంటనే జాబువ్రాయడానికి నాకు తీరికలేకపోయింది. అందుకు నే నెంతో విచారిస్తున్నాను.

అఖిలభారతకాంగ్రెసుకమిటీసమావేశానికి నేను హాజరుకానందున సమావేశకార్యక్రమాలు ఏయే విషయాలలో సత్య అహింసాసూత్రాల

నుండి వైదొలగాయో నేను చెప్పలేను. కాని శ్రీ మసానీ ప్రతిపాదించిన తీర్మానంలోవున్న భాషనుగురించికంటె, దానిపై కావించబడిన ఉపన్యాసాలను ఎక్కువగా దృష్టిలోపెట్టుకొని, మహాత్మాగాంధీ ఆవిధంగాఅనివుంటారని నే నూహిస్తున్నాను.

కాంగ్రెసు మునుపుచేసిన తీర్మానాలదృష్ట్యా మనం మైసూరు తీర్మానం నియమవిరుద్ధంగావున్నదన్నపత్రికటనను పరిశీలించవలసివుంటుంది. మైసూరుసంస్థానంలో పౌరసత్వహక్కుల అణచివేతకు కూత్రనిర్బంధవిధానానికి వ్యతిరేకంగా, అఖిలభారత కాంగ్రెసుకమిటీ రూపొందించిన తీర్మానంలో తన నిరసనను అతి తీవ్రమైనభాషలో వ్యక్తపరిచింది. మైసూరుసంస్థానప్రజలకు తన శుభాకాంక్షలను అందజేస్తూ, వారి న్యాయసమ్మతమైన అహింసాయుతపోరాటంలో వారి విజయాన్ని కాంక్షిస్తూ "స్వయంనిర్ణయాధికారంకోసం ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడుతున్న మైసూరుసంస్థానప్రజలకు అన్నివిధాల తోడ్పడవలసినదిగా, వారిని ప్రోత్సహించవలసినదిగా భారతసంస్థానప్రజలకు, బ్రిటిష్ఇండియాప్రజలకు విజ్ఞప్తిచేస్తోంది." ఈవిధంగా ఏదైనా ఒక భారతసంస్థానచర్యనో, లేదా విధానాన్నో నిరసిస్తూ సంస్థానప్రజల పోరాటానికి అన్నివిధాల తోడ్పడవలసిందిగా, వారిని ప్రోత్సహించవలసినదిగా భారతసంస్థానాల, బ్రిటిష్ఇండియాప్రజలకు విజ్ఞప్తిచేస్తూ అఖిలభారత కాంగ్రెసుకమిటీ ఇంతకుపూర్వం తీర్మానించినట్లు నా కెక్కడా కనిపించదు. భారతసంస్థానాలవ్యవహారాలలో జోక్యంకలిగించుకోనివిధానాన్ని కాంగ్రెసు యింతవరకూ సంప్రదాయసిద్ధంగా అనుసరిస్తూవచ్చింది. కాంగ్రెసు ఇప్పుడా విధానాన్ని పరిత్యజించిందా, కాక సంస్కరించుకున్నదా అనే విషయాన్ని ఇదివరకు అది కావించిన మూడుతీర్మానాలను దృష్టిలోపెట్టుకుని పరిశీలించి నిర్ణయించవలసివుంటుంది. 1928 లో కలకత్తా కాంగ్రెసుమహాసభ ఒక తీర్మానాన్ని ఆమోదించింది. ఆ తీర్మానంలో భారతసంస్థానప్రజలకు తన సానుభూతిని అందజేస్తూ వారి న్యాయసమ్మతమైన శాంతియుతపోరాటానికి తాను తోడ్పడగలనని, వారికి కాంగ్రెసు భరోసాయిచ్చింది. కాంగ్రెసువిధానాన్ని పునరుద్ఘాటిస్తూ 1935

అగస్టునెలలో వర్కింగుకమిటీ సవివరంగా ఒక ప్రకటనకావించింది. ఈ ప్రకటనను అక్టోబరు 17, 18 వ తేదీలలో మద్రాసులో జరిగిన తన సమావేశాలలో అఖిలభారత కాంగ్రెసుకమిటీ ఆమోదించింది. భారత సంస్థానప్రజల న్యాయసమ్మతమైన శాంతియుతపోరాటానికి తన సానుభూతి, సహాయం లభించగలవని తానుచేసిన వాగ్దానాన్ని కాంగ్రెసు పునరుద్ఘాటిస్తూ ఆ సానుభూతిసహాయాల స్వరూపస్వభావాలు ఈవిధంగా వుండగలవని పేర్కొన్నది; "ఏమైనప్పటికీ సంస్థానప్రభుత్వాలకు వ్యతిరేకంగాసాగుతున్న పోరాటభారాన్ని సంస్థానప్రజలు తమకుతామే భరించవలసివుంటుందనీ ఆ బాధ్యతను వారే స్వీకరించవలసివుంటుందనీ మనం అర్థంచేసుకోవాలి. సంస్థానాలలో తనకు ఎక్కడెక్కడసాధ్యమో అక్కడ కాంగ్రెసుస్నేహపూర్వకనైతికప్రభావాన్నిప్రసరింపచేయగలదు. భారతదేశప్రజలు బ్రిటిష్‌పరిపాలనలోవున్నా సంస్థానాధీశులపరిపాలనలో వున్నా లేదా తదితర ప్రభుత్వపరిపాలనలోవున్నా చారిత్రకదృష్ట్యా భౌగోళికరీత్యా వారందరూ ఒకటే; అయినప్పటికీ కాంగ్రెసు ప్రస్తుతపరిస్థితులలో యింతకుమించి మరెట్టిసహాయమూ చేయలేదు. ఇప్పటి వాద ప్రతివాదనల ఉద్రిక్తతలో చాలామంది కాంగ్రెసుకుగల శక్తిసామర్థ్యాల పరిమితులను తరుచు విస్మరిస్తున్నారు. ఇంతకుమించి కాంగ్రెసు ఇంకొక విధానాన్ని స్వీకరించినట్లయితే సమష్టిప్రయోజనం పరాజయంపొందుతుంచి." కలకత్తాకాంగ్రెసుకావించిన తీర్మానాన్ని అఖిలభారతకాంగ్రెసు కమిటీ ప్రకటనను 1936 ఏప్రియల్‌లో జరిగిన లక్నో కాంగ్రెసుమహాసభ పునరుద్ఘాటించి"భారతసంస్థానాలలో స్వాతంత్ర్యంకోసం సాగుతున్న పోరాటాన్ని సంస్థానప్రజలు తమకుతామైనిర్వహించుకోవలసివుంటుందని పరిస్థితులస్వభావాన్నిబట్టి పేర్కొనకతప్పదని" స్పష్టపరిచింది. తీర్మానం చివరివాక్యంలో "ప్రధానంగా" అనే పదాన్ని చేర్చాలన్న సవరణ లక్నో కాంగ్రెసుమహాసభ త్రోసిపుచ్చినట్లు నాకు జ్ఞాపకం. కలకత్తాలో సమావేశమైన అఖిలభారతకాంగ్రెసుకమిటీ, మైసూరుసంస్థానప్రభుత్వచర్యను

విధానాన్ని గర్హిస్తూ, తీర్మానించడమేకాక, మైసూరుసంస్థాన ప్రజల పోరాటాన్ని ప్రోత్సహించవలసినదిగా, వారికి తోడ్పడవలసినదిగా, భారతసంస్థానప్రజలకు, బ్రిటిష్ఇండియాప్రజలకు విజ్ఞప్తిచేసింది. దీనినే యింకొకవిధంగా చెప్పాలంటే, భారతసంస్థానాలలో స్నేహ పూర్వక నైతికప్రభావాన్ని నెరపగలనని ఇదివరకు కాంగ్రెసు కావించిన తీర్మానాన్ని ఈ తీర్మానం అతిక్రమిస్తున్నదనీ, కాంగ్రెసుకుగల పరిమితులను విస్మరించి, సమష్టిప్రయోజనానికి విఘాతం కలిగించే విధానాన్ని అనుసరిస్తున్నదనీ, ఇతఃపూర్వపు విధానప్రకటనను పునఃప్రతిష్ఠాపిస్తున్న లక్నోకాంగ్రెసుతీర్మానానికి అనుగుణంగాలేదనీ, చెప్పవలెను. అయితే తనవిధానాన్నితాను మార్చుకుందుకు, కాంగ్రెసుకు అధికారంవున్నమాట యథార్థమే; దానిని ఎవరూ కాదనరు. కాని, కాంగ్రెసుమహాసభ ఆమోదించిన ఆతీర్మానాలు అలాగవున్నంతకాలం, ఒక సంస్థాన ఆంతరంగిక పరిపాలనావ్యవహారాలలో ప్రత్యక్షంగా జోక్యం కల్పించుకొనేధోరణిలో, అక్కడజరుగుతున్న పోరాటంలో పాల్గొంటున్న ధోరణిలో, ఎట్టి తీర్మానాన్నీ రూపొందించడానికి, అఖిలభారతకాంగ్రెసు కమిటీకి అర్హతలేదు. అదికావించిన ఈతీర్మానం సఫలీకృతంకావాలంటే, వర్కింగుకమిటీ మైసూరుప్రజలకు సహాయంగా డబ్బును మనుష్యులను విధిగా పంపిస్తూ తదితరమార్గాలలో ఆదుకోవలసివుంటుంది. ఇక ఈతీర్మానంలో కావించిన విజ్ఞప్తిని పాటించాలంటే, సంస్థానాలప్రజలు బ్రిటిషు ఇండియాప్రజలు ఇంతే చేయవలసివుంటుంది. కాంగ్రెసు తానీవిధంగా సహాయంచేయాలని తలంచనూలేదు. సహాయంచేస్తానని వాగ్దానం చేయనూలేదు. కాగా అఖిలభారతకాంగ్రెసుకమిటీ కలకత్తాలోచేసిన తీర్మానం లక్నో కాంగ్రెసుమహాసభాతీర్మానానికి అనుగుణంగా లేదు. ఈకారణాన్ని పురస్కరించుకొని కలకత్తాతీర్మానం అఖిలభారతకాంగ్రెసు కమిటీ "నియమావళికి విరుద్ధంగా" వున్నదని, గాంధీజీ పరిగణిస్తున్నట్లు నే ననుకుంటున్నాను.

మీ విశ్వాసపాత్రుడు,
రాజేంద్రప్రసాద్

207. ఎడ్వర్డ్ థామ్సన్‌వద్దనుంచి

స్కార్‌టాప్
బోర్స్‌హిల్, ఆక్స్‌ఫర్డు
జనవరి 2, 1938

ప్రియమైన నెహ్రూ,

మానవవ్యవహారాలు ప్రథమస్థానాన్నాక్రమిస్తాయని నే నంగీకరిస్తాను. కాని ఇతరజంతువులవిషయంకూడా మనం ఆలోచించాలి. కొన్నిజీవరాసులసంతతి నామరూపాలులేకుండా నశించిపోతున్నపుడు నివారించడానికి వీలులేని ఒక దుండగం జరిగిపోతున్నదన్నమాట. ఇది అనాదియైన జీవసంతతి. ఇప్పుడు భారతదేశం అగాధంలోనికి త్రోసివేయబడింది. మీకూ మీ ముందురానున్నతరంవారికీ కనిపించకుండా తమ మాతృదేశలక్షణాలను ధ్వంసంచేయడానికి తమకు హక్కుకలదని వ్రేళ్ళమీదలెక్కించదగిన కొంతమంది ధనవంతులు ప్రభువులు భావించడం నా కెంతో మూర్ఖత్వంగా కనిపిస్తోంది.

మీరు కొన్నిపనులు చేసి సహాయపడగలరు. ఒకజంతువు లేదా ఒకపక్షి నశించిపోతున్నదన్నకారణాన దాన్ని కాపాడి విక్రయించబూనడం, న్యాయశాస్త్రప్రకారం ఒకనేరంగా పరిగణింపబడుతుంది. ఇంచుమించు నశించబోతున్న కొన్నిపశులమాంసాన్ని బహిరంగంగా అమ్మడం మీరు గమనిస్తూనే వుంటారు. కామప్రేరేపకమైనవని కలకత్తా చైనీయులు తదితరులు నమ్ముతూవుండే ఖడ్గమృగాలకొమ్ములను కొందరు అమ్ముతూనేవున్నారు. ఇటువంటి నీచాతినీచమైన ప్రయోజనాలకు ఉద్దేశింపబడినవస్తువులను అంగడినుంచి నిషేధించడంవల్ల కొంప యేమీ మునిగిపోదు.

వందిమాగధులవలె వేటనుస్తుతిస్తూ, దానికి ఆపాదించే లేనిపోని ఘనతను తొలగించడం అన్నింటికంటె ముఖ్యం. ఈవిధంగా ప్రజలభావాలనుంచి, భారతదేశం పశ్చిమదేశస్థులమైన మాకు చక్కటి మార్గాన్ని చూపవలసివుంటుంది. అప్పుడు, ఫలానారాజు అయిదువందల పులులను

చిత్రవధచేశాడనో, ( రీవా మహారాజువలె ) లేక లెక్కలేనన్ని పిట్టలను చంపాడనో, లేదా గంటకు ముప్ఫై మైళ్ళవేగంతో కారులోపోతూ, ఎగిరే పిట్టను తుపాకీతో పడగొట్టగలడనో చెప్పేకబుర్లు విని మేం, భుజాలు ఎగురవేయం. ఇటువంటి విషయాలకు ఆపాదించబడుతున్న ఘనతను తొలగించండి; దక్షిణాఫ్రికాలో దీనికి వ్యతిరేకంగా బయలుదేరిన భావ సంచలనం దీన్ని అప్పుడే పారద్రోలింది. (కెనడాలోసైతం అంతే జరిగింది. ) అహింసాప్రవృత్తి పునర్వికాసం పొందేరీతిగా కృషి సల్పండి; అందమైన అడవిజంతువులుసైతం భారతదేశానికి చెందినవే అనీ, జీవించడానికి వాటికి హక్కుకలదనీ, వాటిని నాశనంచేయడానికి ఎవరికీ హక్కులేదనీ ప్రచారంచేసి, ప్రజలలో దీని కనుగుణమైన హృదయస్పందనకలిగేటందుకు ప్రయత్నించండి.

అన్నట్లు, ఒకఏడాదిక్రితం, మీచెంత "సైమ్ అండ్ షైడ్" అనే పత్రిక వుండడం చూశాను. ఈ సంచికలో (జనవరి 1) ఘనత వహించిన బికనీర్‌మహారాజునుగురించి నే నొక వ్యాసం వ్రాశాను. నా వ్యాసాన్ని చదివినట్లయితే అది మీకు ఆసక్తిదాయకంగా వుండ వచ్చును.

కాంగ్రెసుమంత్రులు, నెలకు ఐదువందలరూపాయలే జీతం పుచ్చుకుంటూన్నారన్నవార్త చదివి, నేను, పులకితహృదయుణ్ణయి పోయాను. నా ఆనందోత్సాహాలకు మేరలేదు. కాని జీవితం నిరాశా పూరితమైనది. జీవితమనే రైలుబండికి, భంగపాటులనేవి పెట్టెలవం టివి. మంత్రులుకావించిన ఈ త్యాగం ఒట్టిబూటకమని, మిగిలినసొమ్ము వారు "అలవెన్సులరూపంలో" తీసుకుంటున్నారని విని, హతాశుణ్ణయి పోయినాను. ఇదేకనక నిజమైనట్లయితే ప్రభుత్వ ఇతరచర్యలకంటే, ఈ చర్య కాంగ్రెసుకు ఎక్కువ హానిచేకూర్చుతుంది. ఇది అబద్ధమని మీ నోట వినడానికి నే నాతురతపడుతున్నాను. సహజంగా ఈవిషయం ఎరి గున్న ఒకభారతీయుడు నాకీ సంగతి చెప్పాడు.

1938 వ సంవత్సరం మీకు గొప్ప అదృష్టాన్ని ప్రసాదించుగాక !

ఎప్పుడూ మీ,
ఎడ్వర్డు థామ్సన్

208. యస్. వజీర్ హాసన్

38, కానింగ్ రోడ్డు
అల్హాబాద్,
ఫిబ్రవరి 11, 1938

నా ప్రియమైన జవహర్ లాల్జీ,

ఈ అసత్యప్రచారం, కులమతవిద్వేషం, కేవలం మునల్మానుల, హిందువులమధ్యమాత్రమే నెలకొనివుండలేదు. మునల్మానులకు మున ల్మానులకుమధ్యసైతం యివి పెరుగుతూవస్తున్నాయి గత అక్టోబరులో లక్నోలో జరిగిన ముస్లిములీగుమహాసభాధ్యక్షుడు, తన అధ్యక్షోపన్యా సంలో వీటికి అంకురార్పణచేశాడు. నాటినుంచినేటివరకు అల్పసంఖ్యాక వర్గాల హక్కులపేరిట, మతదురభిమానాలముసుగుక్రింద సత్యాన్ని తల్ల క్రిందులుచేసే పత్రికాప్రకటనలతో రోజురోజుకూ యివి విపరీతంగా వృద్ధిపొందుతూనేవస్తున్నాయి. ఇవి వేటిని ఆసరాగాతీసుకున్నదీ తెలియ చేయడంకోసం నేను దిగువ కొన్నిటిని ఉదహరిస్తాను.

(1) కాంగ్రెసు హిందువుల మతసంస్థ.

(2) స్వరాజ్యాన్ని స్థాపించడం దాని లక్ష్యంకాదు; భారత దేశంలో హిందూరాజ్యాన్ని స్థాపించడం దానిలక్ష్యం.

(3) కాంగ్రెసు, ఏడురాష్ట్రాలలోవున్న కాంగ్రెసుమంత్రివర్గాలు అల్పసంఖ్యాకవర్గాలను, అందులో ముఖ్యంగా మునల్మానులను అణచి వేయడానికీ, నాశనంచేయడానికీ ప్రయత్నిస్తున్నాయి.

(4) భారతదేశంలోవున్న ఎనిమిదికోట్లమంది మునల్మానుల అభిప్రాయాలకు ఆశయాలకు, ముస్లింలీగు ప్రాతినిధ్యంవహిస్తోంది. ముస్లిములకు అదే నిజమైన ప్రాతినిధ్యసంస్థ.

(5) కొద్దిమందిమునల్మానులుమాత్రమే కాంగ్రెసులో చేరారు. ఆ కొద్దిమందిమునల్మానులు, ఇస్లాంమతానికి విద్రోహులు.

ఈరకంగా సాగుతున్న ప్రచారాన్ని సవాల్‌చేసి, ఈ అబద్ధాన్ని బహిర్గతంచేసి పటాపంచలుచేయకపోతే ఇది నిజమని ప్రజలు భ్రమపడ తారు, అలాగ యిది చలామణీఅయిననాడు మన దేశ ఆర్థిక రాజకీయ స్వాతంత్ర్యంకోసం మనం కొనసాగిస్తున్న పోరాటానికి, ముప్పు వాటిల్లు తుంది.

నేను, మీద ఉదహరించిన అంశాలను దృష్టిలోపెట్టుకొని, ఒక అభిప్రాయానికివచ్చాను. కాంగ్రెసుఆదర్శాలకు కట్టుబడివున్న అన్ని వర్గాలవారిని, ప్రజలను, ముసల్మానులను, కాంగ్రెసు సానుభూతిపరు లను, భారతదేశ మధ్యప్రాంతంలో ఏదో ఒకనగరంలో మార్చి నెలాఖ రునో లేదా ఏప్రియల్ మొదటివారంలోనో అతిత్వరలో ఏదో ఒక తేదీన, సమావేశపరచాలి; ముస్లింలీగ్ ఇప్పుడు కావిస్తున్న ప్రచారాన్ని ఖండిస్తూ, ఆ సమావేశం ఒక ప్రకటనకావించాలి. తదనుగుణంగా కొన్నితీర్మానాలను ఆమోదించాలి. మౌలానా అబుల్‌కలాం అజాద్, సమావేశకర్తగా వ్యవహరించాలి. ఈ సందర్భంలో నేనొకవిషయాన్ని చెప్పదలుచుకున్నాను. ఇప్పుడు కాంగ్రెసుఅధ్యక్షునకు, ముస్లింలీగుఅధ్య క్షునకు మధ్య జరుగుతున్న సంప్రదింపులకు అంతరాయంకలిగించడం నా అభిమతంకాదు. పైగా, నేను సూచిస్తున్న ఈ సమావేశకార్యక్రమాలు ముస్లిములీగులోవున్న ముసల్మానులకు, కాంగ్రెసులోవున్న ముసల్మాను లకు అంగీకారయోగ్యంగావుంటూ, పరిష్కారంకుదరడానికి మార్గాన్ని సుగమంచేస్తాయి. ఈ లేఖలోనివిషయాలను హరిపుర్‌లోవున్న మీ సహ చరులతో మీరు చర్చించి, త్వరలో ఒకనిర్ణయానికిరావాలని మిమ్మల్ని నేను కోరుతున్నాను. ఈ లేఖలో నేను వ్యక్తపరచిన అభి ప్రాయాలతో పెక్కుమంది కాంగ్రెసుముసల్మానులు ఏకీభవిస్తున్నారని, మీకు నేను తెలియచేయడం వాంఛనీయమని భావిస్తున్నాను.

మీ విశ్వాసపాత్రుడు,
యస్. వజీర్‌హసన్

[యస్. వజీర్‌హసన్ ముస్లింలీగులో చాలా సంవత్సరాలపాటు ముఖ్యసభ్యుడుగా వుండేవారు.]

209. ఎమ్. ఏ. జిన్నావద్దనుంచి

హేస్టింగ్స్ రోడ్డు,
న్యూఢిల్లీ,
మార్చి 17, 1938

ప్రియమైన పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ,

1938 మార్చి 8వ తేదీన మీరు వ్రాసినలేఖ నాకుఅందింది. హిందూ ముస్లింసఖ్యతను సాధించాలనే లక్ష్యంతో మీరు, దానికి అంతరాయంకలిగిస్తున్న వివాదగ్రస్తవిషయాలను ఎరుకపరచవలసినదిగా జనవరి 18వ తేదీ, మీ ఉత్తరంలో నన్ను కోరారు. ఈవిషయం ఉత్తరప్రత్యుత్తరాల ద్వారా పరిష్కరింపబడదని పత్రికలలో దీనినిచర్చించడం అవాంఛనీయమనీ, నేను నా ఉత్తరంలో, మీకు తెలియచేశాను; మీరు, ఫిబ్రవరి 4వ తేదీన వ్రాసిన మీ ప్రత్యుత్తరంలో, నేను కాంగ్రెసును విమర్శించానని చెప్పబడుతున్న నా విమర్శను, నేను నుడివినమాటలనుగురించి కొన్ని ప్రశ్నలు వేశారు. కాని మనం యిప్పుడు వెంటనే చర్చించుదామనుకున్న విషయానికీ, ఆ ప్రశ్నలకు ఎట్టిసంబంధంలేదు. కాగా అవి సందర్భశుద్ధి లేనట్టివి. కాని మీరు అదే ధోరణిని అంటిపెట్టుకొనివున్నారు; ప్రస్తుత విషయానికీ. ఆ విషయాలకూ ఎలాంటిసంబంధం లేకపోయినప్పటికీ, వాటిని యింకా చర్చించాలని, ఇప్పటికీ మీరు భావిస్తున్నారు. ఇదివరకు నేను మీకు వ్రాసిన లేఖలో, వాటిని విపులీకరించాను కనుక, యిప్పు డిక వాటిని చర్చించాలని నే ననుకోవడంలేదు.

ముసల్మానుల మత, సాంస్కృతిక, భాషాసంబంధమైన ప్రయోజనాలను,వ్యక్తిగతసూత్రాలను, దేశపరిపాలనలో, ప్రభుత్వయంత్రాంగంలో జాతీయజీవితంలో, వారికిగల రాజకీయహక్కులను ఎలాగ కాపాడవలసివుంటుందనే ప్రశ్నతో, మన మీ సమస్యను చర్చించ ప్రారంభించామని, నే నర్థంచేసుకొన్నాను. అధికసంఖ్యాకవర్గాలలో విశ్వాసభావాన్ని, భద్రతాభావాన్ని కలిగించే, ముసల్మానులను సంతృప్తిపరచే అనేకసూచనలు చేయబడ్డాయి. మీ ఉత్తరంలో ఈ దిగువ ఉదాహృతములైన వాక్యాలను

చదివి నేను ఆశ్చర్యపడ్డాను. "కాని ఒకదానితో ఒకదానికి సంబంధమున్న విషయాలు యిందులో ఎక్కడవున్నాయి. నేను మందమతిని కావచ్చును; లేదా, సమస్యయొక్క సూక్ష్మాతిసూక్ష్మ రహస్యాలతో నాకు తగినంతగా పరిచయం లేకపోయివుండవచ్చును: అలాఅయినట్లయితే, దీనిని సాకల్యంగా తెలుసుకుందుకు నే నర్హుణ్ణి. దీనిని అర్థంచేసుకునేందుకు నాకు తోడ్పడగల, ఇటీవల కావింపబడిన ప్రకటన లేదా ఉపన్యాసం వున్నట్లయితే, దానిని మీరు నాకు సూచిస్తే, నే నెంతో కృతజ్ఞుణ్ణి." బహుశా, మీరు "పద్నాలుగు అంశాలను" గురించి వినివుంటారు.

ఇంకా మీ రిలాగ అన్నారు. "దీని నలావుంచి చూస్తే, పరిస్థితిని మార్చివేసిన, అనేకసంఘటనలు, గతకొన్నిసంవత్సరాలలో జరిగాయని ద్యోతకమౌతుంది." అవును; మీతో నే నేకీభవిస్తున్నాను. ఈమధ్య వార్తాపత్రికలలో అనేకానేకసూచనలు ప్రకటింపబడ్డాయి. ఉదాహరణకు, మీరు, 1938 ఫిబ్రవరి 12 వ తేదీ "స్టేట్స్‌మన్" పత్రికను తిరగవేసి చూస్తే. "ముస్లిముల దృష్టినుంచి" అనేవ్యాసం, మీకు కనిపిస్తుంది. (మీ పరిశీలనార్థం ఆ వ్యాసాన్ని ఇందుతో జతపరిచి పంపిస్తున్నాను) హరిపురకాంగ్రెసుమహాసభలో, మీరు కావించిన ఉపన్యాసాన్ని పురస్కరించుకొని, 1938 మార్చి ఒకటవ తారీఖున "న్యూటైమ్స్" పత్రిక ఒక వ్యాసాన్ని ప్రచురించింది. మీ ఉపన్యాసంలో మీ రిలాగ అన్నట్లు అందులో పేర్కొనబడింది.

"మతసమస్య అని పేరుపెట్టబడిన ఈ విషయాన్ని నేను దూరదర్శినిద్వారా పరిశీలించాను; మీ కేదైనా కనిపించడానికి అందులో ఏమైనా వుంటేకదా !"

1938 మార్చిఒకటవతేదీన "న్యూటైమ్స్" ప్రచురించిన ఈ వ్యాసంలో అనేకసూచనలు కావింపబడ్డాయి. (మీ పరిశీలనార్థం ఆ వ్యాసాన్ని మీకుపంపిస్తున్నాను.) శ్రీ అనే ముస్లింలీగు కోరుతున్న కొన్నిఅంశాలను ప్రస్తావిస్తున్నందుకు కాంగ్రెసును తన ఇంటర్వ్యూలో హెచ్చరించాడు; ఆ ఇంటర్వ్యూ మీరు చూచేవుంటారు.

ఈవిధంగా సూచించబడిన లేదా సూచించడానికి అవకాశమున్న కాదా సూచింపబడగలవని ఆశిస్తున్న అనేకసూచనలను విశ్లేషించి పరిశీలించవలసివుంటుందని చెప్పడానికి యిది చాలుననుకుంటాను. ప్రతి జాతీయవాదీ అత నే రాజకీయపక్షానికి మతానికిచెందినవాడైనా ప్రస్తుత పరిస్థితులను పరిశీలించి హిందూముస్లిములమధ్య పరిష్కారం కుదర్చ డానికి తోడ్పడి వారి సమైక్యసంఘటనను రూపొందించడానికి కృషి చేయాలని, ఇది అతనికర్తవ్యమని నేను భావిస్తున్నాను. మనంయిద్దరం ఏ రాజకీయపక్షానికి లేదా మతానికిచెందినవారమైనప్పటికీ ఈసమస్యపట్ల ఆందోళన వెలిబుచ్చుతూ పరిష్కారసాధనకు తహతహలాడుతున్నారో నేనూ అంతేఆందోళనపడుతున్నాను. తహతహలాడుతున్నాను. అయితే మీరూ మీసహచరులూ పరిశీలించడంకోసం ఈసూచనలన్నిటినీ ఒకచోట వరసవరసగా దరఖాస్తుదారునివలె పేర్కొనాలని మీరు కోరుతున్నట్లయితే నే నలాగచేయలేను. ఆ వివిధసూచనలనుగురించి మీతో ఇక ముందు ఉత్తరప్రత్యుత్తరాలను సాగించలేను. కాని మీ రింకా యీధోరణి కే అంటిపెట్టుకొనివున్నట్లయితే మీలేఖలోని ఈ దిగువ ఉదాహృతవాక్యాలనుబట్టి అలాగే అనిపిస్తోంది. "ఏదైనా ఒకచర్యగైకొనవలెననే ఆలోచనకుముందు, నా మేధ శక్తివంతంగా పనిచేయాలనుకునేముందు, విషయాలను స్పష్టంగా గ్రహించాలని, నా మేధ కోరుతోంది. అస్పష్టతను, లేదా యథార్థవిషయాలను తప్పించుకోవడంవల్ల, సంతృప్తికరమైన ఫలితాలు చేకూరవు. ఏయేవిషయాలు చర్చించవలసివుంటుందో నాకు తెలియ చేయవలసిందని పదేపదే కోరినప్పటికీ, వాటిని చెప్పకపోవడం నాకు వింతగా కనిపిస్తోంది." ఇలా అనడం వాస్తవమూకాదు; న్యాయమూ కాదు. అలా అయినట్లయితే, ఆ విషయాలను తెలియచేయవలసిందని కోరుతూ, నాకు అధికారయుతంగా ఉత్తరం వ్రాయమని, కాంగ్రెసును మీరు అడగండి. ఇదివరకు మీగురించి మీరు "నేను కాంగ్రెసు అధ్య

కూడనుకానుకనుక, ఆవిధమైన ప్రాతినిధ్యంవహించేఅవకాశం నాకులేదు. కాని ఈ విషయంలో ఏమైనా నేను సహాయంచేయగలనని కాంగ్రెసు అనుకుంటే, కాంగ్రెసుకోరినప్రకారం నేను సేవచేస్తాను; కాంగ్రెసు కోరికననుసరించి, నేను సంతోషపూర్వకంగా మిమ్మల్ని కలుసుకొని, ఈ విషయాలు మీతో చర్చిస్తాను." అని చెప్పినట్లుగా, ఇప్పుడు నేను అదే స్థితిలోవున్నాను కనుక, కాంగ్రెసు నా కావిధంగా ఉత్తరం వ్రాసినట్లయితే దానిని పరిశీలించడంకోసం, అఖిలభారతముస్లింలీగ్‌కౌన్సిలుముందుంచు తాను. ఇక మిమ్మల్ని కలుసుకొని, మీతో విషయాలు చర్చించడం నా కెంతో సంతోషదాయకమని, నేను వేరే మీకు చెప్పనక్కరలేదు.

మీ విశ్వాసపాత్రుడు,
ఎమ్. ఎ. జిన్నా.

210. మహాదేవ్ దేశాయ్‌వద్దనుంచి

1, ఉడ్‌బర్న్ పార్కు,
కలకత్తా,
మార్చి 20, 1938

నా ప్రియమైన జవహర్‌భాయ్,

మీరు ఖాశీనుంచి వ్రాసిన ఉత్తరం నన్నెంతో అహ్లాదపరిచింది. అంతేకాక మీరు హార్డికర్‌కు వ్రాసిన సమాధానాన్నిచదివి బాపూ, చాలా ఆనందించారు. ఆయన విడిచిపుచ్చినఅంశాలను మీరు భర్తీచేసినందుకు ఆయన అమితానందభరితులయారు. కొన్నికొన్నిచోట్ల ఆయన విభిన్న మైనభాషను వాడినా, యావత్తువిషయాన్ని మీరు చెప్పేతీరు అద్భుతంగా వుందని ఎంతో మెచ్చుకున్నారు,

ఇక ఖాశీనిగురించిన మీ అభివర్ణన ఆయనకు మిక్కిలి ఆశను కలిగించింది. కాని అంత ఆశపడడ మెందుకనికూడా అంటున్నారు. అక్కడికి వెళ్ళాలని చాలాకాలంక్రిందట ఆయన తరుచుగా పరితపిస్తూ వుండేవారు. అక్కడికి వెళ్ళడం స్థలంమార్పుకోసమూకాదు; రంజిత్

సృష్టించిన ఆ చిన్నస్వర్గాన్ని చూడాలనీకాదు; అక్కడయితే తన కమి తాన_క్తిదాయకమైన పరిశోధనలను సాగించవచ్చునని ఆయన తహతహ. తనపనినుంచి తాను బయటపడినవెంటనే ఆయన అక్కడకు వెళ్ళాలని ఉత్సాహపడుతున్నారు.

ఇదివరకటికంటే ఇప్పుడు ఆయన చాలా ఆరోగ్యంగావున్నారు. అప్పుడూ ఇప్పుడూ కార్యభారం ఒకేలాగవుంది. ఇది ఫలిస్తుందని అను కోను. అయితేనేమి మునపటికన్న ఇప్పుడు దాన్ని బాగానే తట్టుకొం టున్నారు.

ప్రేమతో, మీ,
మహదేవ్

## 211. గోవిందవల్లభ పంత్ వద్దనుంచి

లక్నో,
మార్చి 23, 1938

నా ప్రియమైన జవహర్‌లాల్జీ,

మీ రెంతో దయతో వ్రాసిన లేఖకు నా అభివందనాలు. నిరంతర కార్యభారంవల్ల కలిగిన శ్రమనుపోగొట్టుకునేందుకు మీరు ఖాళీలో కొన్ని రోజులపాటు సేదతీర్చుకుంటున్నందుకు నాకు ఆనందకరంగావుంది. మీ రన్నట్లు ఆ ప్రదేశం అతిఉల్లాసజనకంగావుంటుంది. ఆరోగ్యదాయకమైన మనోజ్ఞపరిసరాలతో మీ కది కొంత విశ్రాంతికలిగిస్తున్నందుకు దానికి నేను కృతజ్ఞుడను. అంతేకాక నాకు మీరు ఉపదేశకమైన ఉత్తరం వ్రాయడానికి అది వీలుకలిగించింది. అందుకు మరింత కృతజ్ఞుణ్ణి.

మీరు మీగురించి చెప్పినదానికీ, పలుసమస్యలపట్ల మీ రనుస రిస్తున్నవైఖరికీ, మీ దృక్పథానికీ నేను ప్రత్యేకమైన విలువనుయిస్తాను. అయితే నాకీ సమస్యలు తెలియనివికావు. కాని మీ ఆలోచనలు ఏ విధంగాప్రసరిస్తున్నదీ గ్రహించడానికి నాకు మీ లేఖ ఉపకరించింది. కొన్నివిషయాలలో మన సాంఘికజీవితం ఎలావున్నదో మీరు మీ లేఖలో ముచ్చటించారు. మనలో చాలామంది ఆంతరంగికజీవితాలు నిస్సారంగా,

నిరర్థకంగా, నిర్దాక్షిణ్యంగా, దుఃఖభాజనంగా వున్నాయని అంగీకరించక తప్పదు. మీరు ప్రస్తావించిన పలుసమస్యలనుగురించి నే నీ ఉత్తరంలో చర్చించినట్లయితే అది అతి దీర్ఘమౌతుందికనుక, నే నలా చేయదలుచు కోలేదు. మీ కిప్పు డొక దీర్ఘమైనలేఖ వ్రాసి మిమ్మల్ని బాధించడానికి నాకు మనస్కరించడంలేదు. ఆ పని యింకొక్కప్పుడు చేయవచ్చును.

ఈమధ్య హిట్లరు యూరపులోకావించినకుట్ర, మనదేశంలో మన స్వంతరాష్ట్రంలో చెలరేగిన మతకలహాలు నన్నమితంగా కలవరపెట్టి నాయి. వాటినిగురించే నే నెప్పుడూ ఆలోచిస్తున్నాను. ఇవి అసాధారణ మైన సంఘటనలు. మిగతాసమస్యలన్నీ వీటితో సరిపోల్చి చూస్తే కేవ లం ఛాయామాత్రమైనవి. ఆస్ట్రియాదురాక్రమణ అత్యంతప్రధానమైన సంఘటన. ప్రప్రధానమైన యీ అంతర్జాతీయసంఘటనవల్ల కొన్ని దుష్ఫలితాలు వుత్పన్నంకాకతప్పదు. దీనిస్వభావం అనల్పమైనది. రాజ కీయవ్యవస్థయావత్తూ ఎక్కడికక్కడ కరిగిపోతూ ఒకమూసలో నూత్న ఆకృతిని ధరించబోతున్నట్లు పొడగట్టుతోంది. ఒకప్రక్క వ్యక్తిగత జాతీయ స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యానికీ ఇంకొకప్రక్క నిర్దాక్షిణ్యమైన పైనికనియంతృత్వానికి పోరాటంసాగుతోంది. ఈ రెండింటిలో, దేనినో ఒకదానిని ఎంచుకోవలసినబాధ్యత ప్రపంచంపై పడింది. ఈ పోరాటం యూరోపులో జరుగుతున్నప్పటికీ, అది మన కేమీ పట్టనట్లు మనం కూర్చోలేము.

ఈ రాష్ట్రంలో జరిగిన మతకలహాలు, దారుణమైన హింసలు, రక్తపాతాన్ని కలిగించాయి. అందుకు నా కెంతో బాధగా, దుఃఖంగా వుంది. ఇప్పుడు అలహాబాద్‌లో, కాశీలో పరిస్థితులు మామూలుగావున్నా, మతావేశం ఏక్షణంలోనైనా మళ్ళీ వెర్రితలలువేసేప్రమాదం లేకపోలేదు. అలహాబాదు కలహాలగురించి మీ రిచ్చిన తంతివార్త నా కందింది; నేను మీకు మళ్ళీ తంతియిచ్చాను. ఇక్కడ జరిగిన సంఘటనలగురించి మీరు పత్రికలలో చదివేవుంటారు. అదీకాక మీ రిక్కడికి త్వరలో రాబోతు న్నారు. కనక వాటినిగురించి వివరంగా యీ లేఖలో ప్రస్తావించదలచ లేదు. రాజకీయాలనే ముసుగుతో గత కొన్నిమాసాలపాటు ముస్లిం

లీగు కావించిన ప్రచారమే యీ దుష్కరపరిస్థితులకు ప్రధానకారణం. మతంపేరిట ఆవేశాలను రెచ్చగొట్టడం అతిసులభం; అయితే ఏ రాజకీయపక్షమైనా తన రాజకీయప్రయోజనాలు సాధించుకోవడంకోసం యీ దుస్థితికి దిగజారిపోయినప్పుడు యిలాంటి అస్తవ్యస్తపరిస్థితులునెలకొన్నాయని ఫిర్యాదుచేయడానికి, దాని కేమాత్రం హక్కులేదు. అది సబబు కాదు.

మీరు ఉల్లాసంగావున్నారనుకుంటాను.

ప్రేమతో, మీ
జి. బి. పంత్.

## 212. సరోజినీ నాయుడువద్దనుంచి

ది గోల్డన్ త్రెషోల్డు,
హైద్రాబాద్-దక్కన్
మార్చి29, 1938.

నా ప్రియమైన జవహర్,

పూర్వం ఒకప్పుడు సామిస్టువలె నువ్వూ పర్వతశిఖరాలనవలోకిస్తూ నీచూపులతో సంభాషిస్తూ చిత్తశాంతినీ చిత్తస్థయిర్యాన్నీఆవేశాన్నీ పొందుతున్నావనుకుంటాను. అతను తన యవ్వనంలో ఏటిదరినవున్న అయిదు గులకరాళ్ళతో గొలియత్ను చంపినట్లుగా నువ్వూ అనేకమంది రాక్షసుల్ని చంపగలిగావు. ఈ గొలియత్లు ప్రత్యేకమైనవారు.

కలకత్తాలో నేనుండలేకపోతున్నందుకు నేనెంతో విచారిస్తున్నాను. మొత్తంమీద నేను హాస్పటల్లో ఇంజక్షన్లకు అలవాటుపడిపోయాను. వాటికి లొంగిపోయాను. శరీర ఆరోగ్యపరిస్థితులవల్ల ప్రస్తుతం నేను కదలలేకపోతున్నప్పటికి, యిక్కడే వుండిపోవడం ఏమంత న్యాయం కాదనుకుంటాను. కాని యిక్కడే వుండకతప్పదు. కనక ఎప్పుడూ సోఫాతోనే కూర్చుని నా తోటలో పిట్టల కలకలధ్వనులను వింటూ కాలం గడుపుతున్నాను. నారింజచెట్లమీద బుల్బుల్పిట్టలుగూళ్ళుపెట్టుకున్నాయి.

నీలినీలి లక్షముకుపిట్టలు కొంచెం పొద్దువాలినతరువాత రెక్కలువిప్పు కుంటూ పొంటెన్‌లో యీతలుకొట్టడాని కొస్తూవుంటాయి. పొదరిండ్లలో లతలమధ్య రకరకాలపిట్టలు గుంపులుగుంపులుగాచేరి వింతవింతధ్వను లనుజేస్తున్నాయి. "పక్షులపార్లమెంటు" అనే పర్షియన్‌గేయాన్ని నువ్వు చదివావా మరి?

ఇతరవిషయాలలో ఆ "వామనమూర్తి" తన "గాంధీమేజిక్" చేస్తుండగా మతసమస్యలసర్దుబాటుపట్ల జరుగుతున్న కృషికి "నెహ్రూ నరాలు" ఎలాస్పందించాయో నాకు కాస్త చెబుమా! చిరాకెత్తిస్తున్న ఆ సమస్యనుగురించి నేను చాలా తెలుసుకోవాలని ఆతురతపడుతున్నాను. బేట్‌కు చాలా శీతలంచేసింది. కొంచెం జాగ్రత్తగా వుండమంటే ఎవరి మాటా వినిపించుకోదు. అయితే యిప్పుడు ఆమెవంట్లో బాగానేవుంది. జోసఫ్‌కోటును రంగుల్లో మించాలని తన వార్డురోబ్‌ను రంగుల్లో ముంచు తోంది.

నా భర్త 14వతేదీన కాంటోరుసోలో బయలుదేరి వియన్నాకు వెడ తారు. ఆయన్ని బేట్ బొంబాయివరకు సాగనంపుతుంది. బహుశా అక్కడ బెట్టీవద్ద ఆమె మకాంచేయవచ్చు. అన్నట్టు, రాజారాజకీయా లను నేను పట్టించుకోవడంలేదని బెట్టీకి నామీద చాలా కోపంగావుంది. ఎంతచక్కటిపిల్ల! అతనూ అంతే. యిద్దరూ చాలా ముచ్చటైన పిల్లలు. వాళ్ళలో ఎవరికి కాస్త చమత్కారమున్నా యిద్దరికీ నాకూ బాగుండును.

నీ క్షేమసమాచారాలుతెలిపికొందుకు నే నీ వుత్తరం వ్రాస్తున్నాను. ఆఖరికిది అర్థంపర్థంలేకుండా గజిబిజిగాతయారైంది. మరి నేను వ్రాస్తున్న యీ కాగితం నూటికినూరుపాళ్ళు అచ్చమైన స్వదేశీపేపరు. మన స్వదే శాభిమానాన్ని యిది ఋజువుచేస్తున్నా, అబ్బా! దీనిమీద వ్రాయడానికి ఎంత బాధగావుంది!

ప్రేమతో,

దయగల నీ పరోజిని.

పి. యల్. యు. నిధికోసం నేను అనేకమందివ్యక్తులకు వుత్తరాలు వ్రాశాను. ఇంతవరకు జవాబులు రాలేదు.

## 213. మహాత్మా గాంధీవద్దనుంచి

సేవాగ్రాం,
ఏప్రియల్ 25, 1938

నా ప్రియమైన జవహర్‌లాల్,

మహదేవ్ దేశాయ్ తన సరిహద్దురాష్ట్రపర్యటనగురించి తయారు చేసిన నివేదికప్రతిని నీకు పంపిస్తున్నాను. అక్కడ పరిస్థితులు సవ్యంగా లేవని వార్తలందడంవల్ల, నేను వెళ్ళడానికి నాకు తీరికలేనందువల్ల అత న్నక్కడికి పంపిస్తే బాగుంటుందని భావించాను. సభ్యులందరికీ యీ నివేదికను నేను అందజేయడంలేదు. మౌలానా, సుభాష్‌లకు దీని ప్రతులను పంపిస్తున్నాను. ఈ నివేదిక నా కసంతృప్తిగావుంది. మహదేవ్ యింకా చాలా చెప్పవలసివుంది. ఖాన్‌సోదరులకు నేను ఒక ప్రతిని పంపిస్తాను. వారికి నచ్చచెప్పడానికి నువ్వు నీ పలుకుబడిని వినియోగిస్తావని నె నాశిస్తున్నాను. వారితో నేను టెలిగ్రాంలద్వారా సంబంధాలుపెట్టుకున్నాను. ఖాన్‌సాహెబు రమ్మని నన్ను కోరినట్లయితే యిదివరకు నేను ఆశాభంగంచెందినా, కొన్నిరోజుల్లో సరిహద్దురాష్ట్రానికి బయలుదేరదామనుకుంటున్నాను. మనం అంతర్గతంగా బలహీనపడుతున్నట్లు కనిపిస్తోంది. ప్రస్తుత క్లిష్టపరిస్థితులలో మనశక్తిని మనం కోల్పోవడం, ప్రధానసమస్యలపట్ల ఏకాభిప్రాయంకుదుర్చుకోలేకపోవడం నా కెంతో బాధగావుంది. ఈ తరుణంలో నిన్ను ఒప్పించి నా దారికి మళ్ళించలేకపోతున్నందుకు నా కెంతో దిగులుగావుంది. ఏకాకినైపోయాననేభావం నన్నెంత కృంగదీస్తున్నదో నీకు నేను చెప్పలేను. నువ్వు ప్రేమించినవారికోసం ఎంతైనా చేయగలవని నాకు తెలుసును; కాని రాజ్యాంగవ్యవహారాలలో భేదాభిప్రాయాలు పొడచూపుతున్నపుడు ఆలోచన తిరుగుబాటు చేస్తున్నపుడు ప్రేమాభిమానాలకోసం ఒకనికిలొంగిపోవడం మంచిది కాదు. నువ్విలా తిరుగబడడంవల్ల నీమీద గౌరవం నాకు మరింత పెరిగింది.

అయితే ఏకాకినైపోయాననే నా దుఃఖాన్ని అదే మరింత ద్విగుణీకృతం చేసింది. ఇంతటితో యీ వుత్తరం ముగిస్తాను.

ప్రేమతో
బాపు.

## 214. మహాత్మా గాంధీకి

అలహాబాద్
ఏప్రియల్ 28, 1938.

నా ప్రియమైన బాపు,

లక్నోనుంచి యీవేళ ప్రొద్దుట అలహాబాద్ చేరుకున్నాను. సరిహద్దు రాష్ట్రపర్యటనపై మహదేవ్ దేశాయితయారుచేసిన నివేదిక ప్రతి, మీవుత్తరం రెండూ నాకు అందేయి. యీ నివేదిక చదివాను. ఖాన్‌సాహెబ్, అబ్దుల్ గఫూర్‌ఖాన్‌లకు వుత్తరం వ్రాస్తాను. మహదేవ్‌నివేదికను చదివి నే నేమీ ఆశ్చర్యపడలేదు. ఈ పరిస్థితి నేను నా కళ్ళారాచూచిన ధోరణుల సహజపరిణామమే; అందులో వింతలేదు. అయితే అప్పుడు కనిపించిన యీ ధోరణులను అదుపులోపెట్టడానికి ఏదో ఒకపద్ధతి అవలంబింపబడుతుందని నే నాశించాను. వీటిని చాకచక్యంగా అరికట్టగల వ్యక్తి మీతోపాటు అబ్దుల్‌కలాం కనిపిస్తున్నారు. ఆయ న్నక్కడికి పంపించడం అత్యవసరమని భావిస్తున్నాను. యీలోపున మంత్రులసమావేశానికి వర్కింగుకమిటీసమావేశానికి ఖాన్‌సోదరులిద్దరూ వస్తారని ఆశిస్తున్నాను.

కాంగ్రెసురాజకీయాలలో గత ఆరునెలలుగా జరుగుతున్న సంఘటనలు న న్నమితంగా వ్యాకులపరుస్తున్నట్లు మీకు తెలుసును. అనేక విషయాలు నన్ను కలవరపెట్టాయి. గాంధీసేవాసంఘాన్ని యిదివర కెన్నడూఎరుగని పద్ధతులమీద నడపబూనడం నా కెంతో బాధఅనిపించింది. నన్ను కలవరపెట్టినసంఘటనలలో యిది ఒకటి. మనం "తమ్మానీహాల్" పద్ధతులను అతిత్వరితంగా అలవర్చుకుంటున్నాం. ఇంతవరకు యితరుల కొక ఆదర్శంగా వుంటున్నదని చెప్పబడుతూ, ఒకరాజకీయ

పక్షసంస్థగావుండడానికి తిరస్కరించిన గాంధీసేవాసంఘం, యిప్పుడు నానాఅగచాట్లుపడి ఎలాగైనాసరే, ఎన్నికల్లోనెగ్గాలనే అతి సామాన్యస్థితికి దిగజారిపోయింది. కాంగ్రెసుమంత్రులు, తాము చేయగలిగినంతకృషిని తాము చేయలేకపోతున్నారు. వారి అసమర్ధత అడుగడుగునకనిపిస్తూనే వుంది. పాతవ్యవస్థకు పూర్తిగా అంటిపెట్టుకుని దానిని సమర్థించడానికి ప్రయత్నిస్తున్నారు. పోనీ, యింతచెడునూ, ఎలాగోఒకలాగ భరిస్తామను కుందాం; యింతకంటే చెడుగు యింకొకటివుంది. ఇంతకాలంగా మన మెంతో శ్రమపడి ఆర్జించుకున్న గౌరవప్రతిష్ఠలు, ప్రజల ఎనలేని ప్రేమాభిమానాలు మనం యిప్పుడు పోగొట్టుకుంటున్నాము. ఏ సిద్ధాంతానికీ కట్టుబడని, దినదినం అవకాశవాదంతో ప్రవర్తించే అతి సాధారణ రాజకీయజ్ఞుల అధమస్థాయికి మనం దిగజారిపోతున్నాము.

ఈ దిగజారిపోవడానికి కొంతవరకు కారణం ప్రపంచమంతటా నేడు సర్వసాధారణంగా కానవస్తున్న హీనస్థితులేనని పేర్కొనవచ్చును. అదీగాక మనం యిప్పుడు సంధియుగంలో జీవిస్తున్నాము. ఈ హైన్య స్థితికి యిదికూడా కొంతవరకు కారణం. మన వైఫల్యాలను యిది ఋజువుపరుస్తున్నది. ఇందుకు ఎవరికైనా బాధాకరంగా వుండకమానదు. దీనిని సరైనమార్గంలో పెట్టి పరిస్థితిని చక్కబరచడానికి తగిన దక్షులు కాంగ్రెసులోవున్నారనే నే ననుకుంటాను. కాని వారిమనస్సులు పార్టీకక్షలతో నిండిపోయివున్నాయి. ఎవరినో ఒకవ్యక్తిని అణచాలనో, ఏదో ఒకముఠాను మట్టుపెట్టాలనో నిరంతరం వారు ఆలోచిస్తూనే వున్నారు. సన్మార్గులకుబదులుగా, దుర్మార్గులకు పార్టీలో ప్రముఖస్థానాలు లభించాయి. పార్టీ ధోరణిని, అన్నిటా సమర్థిస్తూ పక్కతాళంవేస్తారని, చెడ్డవాళ్ళను పార్టీలోకిచేరదీస్తున్నారు. ఈ ధోరణి యిలాగ కొనసాగితే, పార్టీ క్షీణించడం తప్పదు.

భారతదేశంలో జరుగుతున్న సంఘటనలను చూసి నేను జయప్రదంగా కృషిసాగించలేనని కొన్నిమాసాలక్రితం భావించాను. అయినప్పటికీ ఒకవ్యక్తి ఎంతచేయగలడో అంత నేను చేశాను. కాని నేను పనిచేయటం వ్యర్థమనీ అందుకు నేను అనర్హుడననీ అనుకున్నాను. నేను

యూరోపు వెళ్ళడానికి నిశ్చయించుకోడానికి అనేక కారణాలున్నప్పటికీ, యిదీ ఒకకారణం కాకపోలేదు. అక్కడ నేను వుంటే యింటికంటె ఎక్కువప్రయోజనకరంగావుంటుందని చికాకులతో అస్థిమితంగావున్న మనస్సును తేటపరచుకోవచ్చునని భావించాను. మీ ప్రస్తుతఆరోగ్యాన్ని దృష్టిలోవుంచుకొని మిమ్మల్ని చికాకుపెట్టడం నాకు యిష్టంలేకపోతోంది. కనుక మీతో ఏ విషయాన్నీ దీర్ఘంగా చర్చించి మిమ్మల్ని వేధించదలచు కోలేదు. అదీకాక యిలాంటిచర్చలు ఎలాంటి సత్ఫలితాలను చేకూర్చవని కూడా నే నభిప్రాయపడ్డాను.

నేను జూన్ 2వతేదీన బొంబాయినుంచి విదేశాలకు బయలుదేర నిశ్చయించుకున్నాను. విదేశాలలో ఎన్నాళ్ళుంటానో నాకే తెలియదు. బహుశా సెప్టెంబరుమాసాంతంలో స్వదేశానికి చేరుకుంటానేమో!

మే మొదటితేదీన గార్వాల్ వెళ్ళి అక్కడ ఒకవారంరోజులు పాటుంటాను. సరూప్ నాతో వస్తోంది, బదరీనాధ్ పరిసరాలలో కాసేపు విమానంలో విహరిస్తాం. గార్వాల్ నుంచి తిరిగి వస్తున్నపుడు, బొంబాయిలో జరగబోయే వర్కింగుకమిటీ మంత్రులసమావేశాలకు హాజరౌతాను.

మహాత్మాగాంధి
(జుహూ) బొంబాయి.

ప్రేమతో మీ,
జవహర్‌లాల్

215 మహాత్మా గాంధీవద్దనుంచి

పెషావరువెడుతున్న రైలుబోసుంచి,
ఏప్రియల్ 30, 1938.

నా ప్రియమైన జవహర్‌లాల్,

నేను జిన్నాతో జరిపిన మూడున్నరగంటల సంప్రదింపులపై క్లుప్తంగా నోట్సుతీసుకున్నాను. దీనిప్రతిని, మీకు దీనితోపాటు పంపిస్తున్నాను. సంప్రదింపులప్రాతిపదిక, మీకూ, తదితరసభ్యులకూ నచ్చకపోవచ్చును, కాని నామట్టుకునాకు, అది తప్ప మరొక గత్యంతరంలేక

పోయింది. ఇప్పుడు నా కొక కొరత కనిపిస్తోంది. నీవలె, నేను దేశ సంచారంచేయడంలేదు. అంతకంటె ఎక్కువగా నాలోకనిపిస్తున్నలోపం యింకోటివుంది. నా ఆశలన్నీ అడుగంటాయి. నిరాశ ఎక్కువైంది. పని అంటూ ఏదోఒకటి చేస్తున్నానుగాని, యిదివరకు ఒకనెలక్రిందటవున్న నా ఆత్మవిశ్వాసం, నా కిప్పుడు లేకుండాపోయింది. తలుచుకుంటున్నకొద్దీ, యిది మరింత బాధగావుంది. అయితే యిది అట్టేకాలం వుండదనుకుంటాను. నా జీవితంలో ఇది తాత్కాలికమైనదశ. ప్రతిపాదనల బాగోగులను పరిశీలించడానికి నీకు తోడ్పడేటందుకు, నా మనఃస్థితిని నీకు తెలియపరిచాను. మొదటిప్రతిపాదన చిక్కేమీ కలిగించదనుకుంటాను. రెండవ ప్రతిపాదన సరిక్రొత్తది; దానిలో అనేక అంతరార్థాలున్నాయి. అది నీకేమాత్రం బాగులేకపోయినా, నువ్వు దానిని పూర్తిగా తిరస్కరించి, ఈ విషయంలో, నువ్వే నాయకత్వంవహించి ముందుకునడిపించవలసివుంటుంది.

నేను 11వతేదీన తిరిగిరాగలననుకుంటున్నాను. నా టెలిగ్రాంకు సుభాష్ జవాబిచ్చాడు. జిన్నాతో లాంఛనప్రాయమైన సంప్రదింపులు తాను కొనసాగించవలసివుందని, పదవతేదీన తాను బొంబాయిలోవుంటాననీ తెలియజేశాడు. త్వరలోనే నువ్వు అక్కడకు వెడితే బాగుంటుందను కుంటాను. ఇదేవిధంగా మౌలానా సాహెబుకు వుత్తరం వ్రాస్తున్నాను. ఈ వుత్తరంప్రతిని ఆయనకు పంపిస్తున్నాను.

ప్రేమతో
బాపు

## 216 మహాత్మా గాంధీవద్దనుంచి

మే 7, 1939

నా ప్రియమైన జవహర్‌లాల్,

గాంధీసేవాసంఘపునర్నిర్మాణం, ని న్నంత కలవరపెట్టడానికి అందులో ఏముంది? దానికి నేను బాధ్యుడనని అంగీకరించకతప్పదు. నిన్ను కలవరపెట్టిన దేదో, అది ఎట్టి సంకోచంలేకుండా నాకు చెప్పమని కోరు

తున్నాను. నేను పొరపడినట్లయితే, పొరపాటుచేశానని గుర్తించిన వెంటనే, నేను సరిదిద్దుకుంటానని నీకు తెలుసును.

సర్వసాధారణంగా అంతటా క్షీణదశ కనిపిస్తున్నదని, నీతోపాటు నేనూ అంగీకరిస్తాను. బలహీనతలు ఎక్కడ వున్నాయి అనేవిషయంలో మనకు అభిప్రాయభేధాలు వుంటేవుండుగాక!

మనం కలుసుకున్నప్పుడు సావధానంగా మాట్లాడవచ్చు.

ప్రేమతో
బాపు.

217. మహాత్మా గాంధీవద్దనుంచి

సేవాగ్రాం, వార్ధా
మే 26, 1938

నా ప్రియమైన జవహర్‌లాల్,

ఎప్పటికప్పుడు పనులుచక్కబెట్టుకుంటూ నువ్వెంతచక్కగా వ్యవహరిస్తున్నావు. గార్గోయిన్ జిల్లా కాంగ్రెసుకమిటీవ్యవహారాలను నువ్వు పరిశీలించినందుకు నా కెంతో సంతోషంగావుంది. ఇరుపక్షాల వారూ, యధాతధంగా నీ సలహా పాటిస్తారని విశ్వసిస్తున్నాను.

జిన్నాతో నా సంప్రదింపులనోట్సునుగురించి నీవు వ్రాసిన పుత్తరం యీవేళ నా కందింది. నా రెండవతూరిసంప్రదింపులు నా కనివార్యమైపోయాయి. అందులోనివిషయం హానికరంకాదనుకుంటాను. జాల్‌ను నువ్వు చూచినతరువాత నీకు వ్యవధివుంటే అతన్నిగురించి నా కొక ముక్క వ్రాస్తావనుకుంటాను. ఇక్కడివలె కార్యభారంతో సతమతం కాకుండా అక్కడ నీ యూరపుయాత్రలో నువ్వు విశ్రాంతితీసుకోవాలని కోరుతున్నాను.

ప్రేమతో
బాపు.

## 218. గోవిందవల్లభ పంత్ వద్దనుంచి

బ్రూక్‌హిల్ హౌస్
నైనిటాల్,
మే 30, 1938.

నా ప్రియమైన జవహర్‌లాల్జీ,

మీ రిక్కడినుంచి విదేశాలకు వెళ్ళేముందు మిమ్మల్నొకసారి కలుసుకుని మీకు నా శుభాకాంక్ష లందజేయాలనుకున్నాను; కొన్నివిషయాలు మీతో చర్చించాలనుకున్నాను. కాని అందుకు వీలులేకపోయింది. యిందు కెంతో నేను విచారిస్తున్నాను. 21 లేదా 22వతేదీ 10-30గంటలకు అజంగర్ వెళ్ళగలనని మీరు ఉపాధ్యాయతో చెబుతున్నపుడు నే నక్కడేవున్నాను. రాత్రి 8గంటలకు నేను మీరున్నచోటికి వచ్చాను. అక్కడినుంచి వెంటనే రైలుస్టేషన్‌కు బయలుదేరాను. కాని దురదృష్టవశాత్తు మిమ్మల్ని కలుసుకోలేకపోయాను. మీకు వీడ్కోలివ్వడానికి అలాహాబాద్ వద్దామని మొదట అనుకున్నాను. కాని అలా రానడానికి వీలులేకపోయింది. మా అమ్మాయి విషజ్వరంతోబాధపడుతోంది. అందువల్ల హఠాత్తుగా నైనిటాల్ బయలుదేరవలసివచ్చింది. మీరిప్పుడు భారతదేశం వదలి వెళ్ళుతున్నారుకనుక మీకు మన కష్టాలనుగురించి సమస్యలను గురించి నే నేకరువుపెట్టి బాధించను. మీ ప్రయాణం సుఖంగా సాగాలని యూరపులో మీరు వుల్లాసంగా గడిపి అతిత్వరలో భారతదేశానికి తిరిగి రావాలని వాంఛిస్తున్నాను. మీ రిక్కడ లేకపోవడంవల్ల మాకు కష్టాలు మరీఎక్కువౌతాయి. క్లిష్టపరిస్థితులు ఎదురొక్కనవలసివచ్చినపుడు సక్రమమార్గంలో నడిపించగల, సలహాలను సూచనలను యిచ్చి అనువచ్చినపుడు ఆదుకోగల ధీరుడు యీ రాష్ట్రింలో మీరుతప్ప యింకొకరులేరు. ఏమైనప్పటికీ ప్రస్తుత ప్రపంచపరిస్థితులదృష్ట్యా మీ రిప్పుడు యూరపులో పర్యటించడం మనదేశానికెంతో క్షేమకరమని నా అభిప్రాయం. ఇప్పుడు వున్నవ్యవస్థ ఎక్కడికక్కడ కరిగిపోతున్నది. నూతనవ్యవస్థ రూపొందబోతున్నది. దీనిఫలితాలు యితరదేశాలతోపాటు భారతదేశంలోకూడా ప్రస్ఫుటంకాకమానవు. ఇలాంటి తరుణంలో బాహ్యప్రపంచంతో మనం

సంబంధాలు నెలకొల్పుకోవడం అత్యవసరం. ఈ కార్యనిర్వహణకు మీ రెంతో అర్హులు. బహుశా మనం, మన స్థానికసమస్యలలో పూర్తిగా మునిగిపోయి, యితరవిషయాలను విశాలదృక్పథంతో అవలోకించడం లేదనుకుంటాను. ఇంతవరకు దేశంలోవున్న నిద్రాణపరిస్థితులు క్రమ క్రమంగా తొలిగిపోతున్నాయని, నూతనభావాలకు, జీవితానికీ ఆస్కారం కలుగుతూందని అనుకుంటున్నాను. నగర, గ్రామీణప్రాంతాలలో శుభ ప్రదమైన, వాంఛనీయమైన చైతన్యం వ్యక్తమౌతోంది. ప్రజలు నిద్ర నుండి మేల్కొంటున్నారు, సమస్యలు తేటపడుతున్నాయి. ఇప్పటికే ఈ ఉత్తరం పెరిగిపోయిందికనుక యీ విషయాన్నిగురించి ఆట్టే ప్రస్తా వించను.

పునర్నిర్మాణకార్యనిర్వహణలో మనకు తోడ్పడగల తగినవ్యక్తిని చూడమని యిదివరకు మిమ్మల్ని కోరాను. నా కోరిక మర్చిపోకండి. అలాంటి నిష్ణాతుడు మీకు లభించినట్లయిన దయవుంచి మీరు నా కా విషయం తెలియజేస్తారుకదూ ?

కుమారి ఇందుకు నా ప్రేమవాత్సల్యాలను తెలియజేయండి.

శుభాకాంక్షలతో,

ప్రేమతో మీ
గో. వ. పంత్,

(1938 జూన్ ప్రారంభంలో నేను యూరపు వెళ్లాను. బొంబాయి నుండి సముద్రంమీద గినీ వెళ్ళాను. అక్కడినుంచి మార్సెలీన్ వెళ్లాను. భూమార్గంద్వారా మార్సెలీన్‌నుంచి బార్సిలోనా చేరుకొని అక్కడ కొన్ని రోజులు గడిపాను. అప్పుడు స్పెయిన్‌లో అంతర్యుద్ధం జరుగుతోంది. బార్సిలోనానుంచి లండను చేరుకున్నాను.)

219 లార్డు లోథియన్‌వద్దనుంచి.

బ్లిక్లింగ్ హాల్,
ఐల్‌షామ్
జూన్ 24, 1938.

ప్రియమైన నెహ్రూ,

బార్సిలోనాలో ఫ్రాంకోబాంబులను తప్పించుకొని సురక్షితంగా మీరు ఇంగ్లండుచేరుకున్నందుకు ఎంతో సంతోషం। జూలై మొదటి వారాంతంలో 9వ తేదీన మీ గౌరవార్థం నే నొక విందుచేయాలనుకుంటు న్నాను. విందుకు ఆప్తేమందిని ఆహ్వానించను. ఆస్టర్‌సతీమణి విందుకు వస్తుందని అనుకుంటున్నాను. ఆమె సరదాగావుంటుంది. మీకు ఉల్లాసం కలిగిస్తుంది. జనరల్ ఐరన్‌సైడ్ ఇంగ్లండుసేనానాయకులలో చాలా గట్టివాడు. ఆయనకూడా విందుకు వస్తాడు. ఇతరులెవరూ అందివ్వలేని సమాచారాన్ని మీకు ప్రపంచ సాధారణసైనికపరిస్థితినిగురించి ఆయన తెలియజేస్తాడు. విందుకుహాజరయ్యే ప్రముఖవ్యక్తులలో శ్రీ థామస్ జోన్సు ఒకడు. బాల్డ్విన్ ప్రధానమంత్రిగావున్నపుడు ఆయనకు ముఖ్య సలహాదారుగా వ్యవహరించాడు. ఇండియాకార్యాలయప్రధానోద్యోగి సర్ ఫిండ్‌లేటర్ స్టువర్టును ఆహ్వానిద్దామా, వద్దా అని ఆలోచిస్తున్నాను. ఆయన మంచివాడే. కాని ఆయన వీరందరివలెకాక తన వుద్యోగరీత్యా రావడానికి సంకోచించవచ్చును ॥ విందుకుముందుగా మిమ్మల్ని కలుసు కుంటాను. ఏర్పాట్లగురించి ఒకనిర్ణయానికివస్తాను. రమణీయమైన వాతా వరణంలో మీకు చక్కటివిందును ఏర్పాటుచేసి కొంతసేపు మీతో పిచ్చా పాటి మాట్లాడాలని ఉత్సాహపడుతున్నాను.

లోథియన్

పి. యస్: మీవెంటలేకుండా మీకుమాత్రె యింకొకచోటవున్నం దుకు నాకు విచారంగావుంది.

220. సర్ జార్జి షుష్టర్ వద్దనుండి

30, సెయిన్ట్ జేమ్సు ప్లేస్
లండన్, యస్. డబ్ల్యు-1
జూలై 7, 1938.

ప్రియమైన పండిత జవహర్‌లాల్ నెహ్రూ,

మంగళవారంసాయంకాలం మీ రిచ్చిన వుపన్యాసాన్నిగురించి ప్రత్యేకంగా ఆర్థికసమస్యలగురించి నేను చాలా దీర్ఘంగా ఆలోచిస్తున్నాను. మీ గతితార్కికక్రోధాన్ని (అది "గతితార్కికం" తప్ప మరేమీ కాదని నా నమ్మకం) నేను సమర్థిస్తూ వ్యాఖ్యానంచేస్తున్నందుకు నాకు విచారంగానేవుంది. కాని భారతదేశంలో మీరు పరిష్కరించవలసిన ఆర్థిక సమస్యలు ఏంతో మౌలికమైనవీ, జటిలమైనవి. బ్రిటిషుప్రభావం తొలగినంతమాత్రాన అవి పరిష్కృతంకావు.

మీ సమాధానం చదివేక నే నొక అభిప్రాయానికొచ్చాను. ఈ సకలదోషాలకు బ్రిటిషుప్రభావంకంటె పెట్టుబడిదారీవ్యవస్థ ప్రధానకారణమనీ, మీరు, మీ వుత్తరంలో పేర్కొన్నారు. బ్రిటిషుప్రభుత్వపు వునికిపై, పెట్టుబడిదారీవ్యవస్థ ఆధారపడివున్నదన్నభావంతో మీరు బ్రిటిషు పరిపాలనను దుయ్యబడుతున్నారు. ఇది అనేకసమస్యలను లేవనెత్తుతోంది. వీటినిగురించి మీతో చర్చించడానికి నేను కుతూహలపడుతున్నాను.

భారతదేశంలో భౌతికపరిస్థితులను అభివృద్ధిపరచాలంటే, దేశమంతటా నూతనోత్సాహం వెల్లివిరియాలనీ, అందరికి అన్నిఅవకాశాలు కలిగేటట్లుచేయాలనీ మీ వాదనతో నే నేకీభవిస్తాను. మీ రన్నట్లుగా పెట్టుబడిదారీవ్యవస్థ, లాభాలఅన్వేషణ, ఈఉత్సాహాన్ని, అవకాశాలనుకలిగించలేవు. ఇట్టిస్థితి చేకూరాలంటే సహకారవిధానమే శరణ్యం. భారతదేశంలో అన్ని గ్రామాలలో సహకారవిధానాన్ని ప్రోత్సహించడానికి, భారత జాతీయనాయకులు పూనుకోవాలి. అలాచేసినపుడు మీ జాతీయనాయకులు సముచితఫలితాలను పొందగలుగుతారని నా నమ్మకం. ఇప్పుడు ప్రధాన

పారిశ్రామికకేంద్రాలలో నెలకొనివున్న పరిశ్రమలను, వినాశనాత్మక దృక్పథంతో కొందరు దుయ్యబట్టుతున్నారు. వీటిని ఇలాగ విమర్శించ నవసరంలేకుండానే, గ్రామీణప్రాంతాలలో సహకారవిధానాన్ని ప్రోత్స హించడంద్వారా సత్ఫలితాలను సాధించవచ్చును.

ఈ సమస్యలపట్ల నా కొక ప్రత్యేకమైన దృక్పథం వుంది. నా ఆలోచనాధోరణిని తెలియపరచే ఒక కరపత్రాన్ని మీకు దీనితోపాటు పంపిస్తున్నాను. మూడున్నరఏళ్ళక్రితం (భారతదేశంనుంచి నేను తిరిగి వచ్చినతరువాత) లండను రాయల్‌సొసైటీ ఆఫ్ ఆర్ట్సులో నే నొక ఉప న్యాసంచేశాను. ఆ వుపన్యాసపాఠమే యీ కరపత్రం. అయితే ఇది చాలా స్థూలమైనదికనక మిమ్మల్నంతగా సంతృప్తిపరచదని నాకుతెలుసు. కాని నేను చెప్పినదానిలో కొంతసత్యంలేకపోలేదని, నా విషయపరిశీలనా పద్ధతి కొంత సానుభూతిలో కొనసాగిందని, మీరు గ్రహించగలరని నమ్ముతున్నాను. ఈ విషయంపై గాంధీజీవెలిబుచ్చిన పెక్కు అభిప్రా యాలతో నే నేకీభవిస్తున్నానని చెప్పకతప్పదు. ఈ కరపత్రాన్ని చదవ డానికి నాతోచర్చించడానికి మీ కేమాత్రం వ్యవధివున్నా నే నెంతో గౌర వించబడినట్లు భావించుతాను.

ఇదిగాక యింకొకవిషయాన్నిగురించి మీతో ముచ్చటించేఅవ కాశంలభించాలని కోరుతున్నాను. మంగళవారంసాయంకాలం మీతో నే నా విషయాన్ని ప్రస్తావించాను. భారతదేశంలో కొన్ని ప్రత్యేకవిష యాలనుగురించి పరిశోధనచేయడానికి శ్రీ వింట్ అనే యువకుణ్ణి పంపిద్దామనుకున్నాము. అతన్ని మీ కానాడు పరిచయంచేశాను. ఇప్పుడు నన్ను కలుసుకుందుకు మీకు వ్యవధిలేకపోతే శ్రీ వింట్ భారతదేశం వచ్చినపుడు మిమ్మల్నికలుసుకునేఅవకాశం అతనికి కలిగిస్తారని ఆశిస్తు న్నాము. ఈ కోరికను అతనిద్వారా మీకు తెలియజేస్తున్నపుడు పరిశోధన విషయమై పూర్తివివరాలు మీకు నే నందజేస్తాను.

రాజకీయ. ఆర్థికసమస్యలపట్ల మనకు భిన్నాభిప్రాయాలువున్నా, మీరు ఒకసారి మా యింటికివచ్చి మా ఆతిథ్యాన్ని స్వీకరిస్తే. నేను...నా

భార్యా ఎంతో సంతోషిస్తాము. విందుకు మంగళవారంనాడు మీరు రాగ లరా? విందుకు ఎవరినీ ఆహ్వానించను.

పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ, మీ విశ్వాసపాత్రుడు,
ఆర్‌మండీ హౌస్ జార్జిషుస్టర్

221. మదాం సన్‌యట్-సేన్‌వద్దనుంచి

దిచైనా డిఫెన్సులీగ్
సెంట్రల్ కమిటి, హాంగ్‌కాంగ్
జూలై 7, 1938

ప్రియమైన శ్రీ నెహ్రూ,

శ్రీ జాన్‌లీనింగ్ యిక్కడనుంచి భారతదేశానికి బయలుదేరి వస్తున్నారు. ఆయన్ని మీకు నేను పరిచయంచేయవచ్చుననుకుంటాను. ఆయన మా చైనా డిఫెన్సులీగు కార్యవర్గసభ్యుడు. చైనా పరిస్థితులనుగురించి చైనాపై యిటీవల జపానుసలిపిన దాడులఅనంతరం జరిగిన సంఘటనల గురించి శ్రీ లీనింగ్‌కు పూర్తిగా తెలుసును. చైనాపట్ల ఆయనకుగల స్నేహభావం విశ్వసనీయమైనది, ప్రగాఢమైనది. ఎన్ని అవాంతరాలొచ్చినా ప్రజాస్వామ్యరక్షణకోసం పాటుపడేవ్యక్తులలో యీాయన ఒకరు.

చైనాకు మీరు సన్నిహితమిత్రులుగనక మే మిప్పుడు జపానును ఏవిధంగా ప్రతిఘటిస్తున్నదీ తెలుసుకొందుకు సహజంగా ఆతృతపడుతూ వుంటారు. చైనాదేశంలో యువ నవశక్తులతో సన్నిహితసంబంధంగల వ్యక్తిద్వారా ఈసమాచారంవినడానికి మీరు వుత్సాహపడతారనుకుంటాను.

మా పట్ల సహకారంనెరపుతూ సానుభూతిసూచకంగా మీరు కావించినప్రదర్శనలను, యిచ్చిన ప్రోద్బలాన్ని కృతజ్ఞతతో గమనిస్తూ మా స్నేహభావాన్ని, ప్రశంసలను మీకు అందజేయడానికి యీ అవకాశాన్ని వినియోగించుకుంటున్నాను.

హృదయపూర్వకాభివందనాలతో,

స్నేహపూర్వకంగా, మీ,
సూంగ్ చింగ్ లింగ్

222 హ్యూలెట్ జాన్సన్‌నద్దనుంచి

ది టీనరీ, కాంట్రిబరీ
జూలై 16, 1938

ప్రియమైన శ్రీ నెహ్రూ,

మీరు, ఎన్ని చక్కటిపుస్తకాలను పంపించారు. అందుకు నేను చాలా కృతజ్ఞుణ్ణి. తీరికచిక్కినవెంటనే ఎంతో వుత్సాహంతో వాటిని నేను పఠిస్తాను.

మీ రాక, సదా ఆనందదాయకంగా మా స్మృతిపథంలో వుంటూనే వుంటుంది. గాంధీజీరాక మా కెంత ఆనందోత్సాహాలను కలిగించిందో, మీ రాకకూడా మా కంత వుల్లాసాన్ని కలిగించింది. మళ్ళీ మీ రెప్పుడు వస్తారా అని మేము ఎదురుచూస్తున్నాము. ఈసారి వచ్చినప్పుడు, ఇక్కడ యింకా ఎక్కువకాలం వుండాలని కోరుతున్నాను.

గౌరవాభివందనాలతో

మీ అత్యంత విశ్వాసపాత్రమైన
హ్యూలెట్ జాన్సన్.

223 ఎడ్వర్డు థాంమ్సన్‌నద్దనుంచి

బోర్సుహిల్. ఆక్సుఫర్డు
జూలై 20, 1938.

ప్రియమైన జవహరలాల్,

నేను ఒక్కొక్కప్పుడు కొన్ని ప్రత్యేక మానసికావస్థలలో-చాలా గర్విష్ఠిని (ఇందులో వంచన లేదనుకుంటాను. ఈ భావానికి వంచవకు చాలాదూరం) నాకుగల గర్వానికి తగినకారణాలు చాలా వున్నాయి. అయితే నాకు మీరు పంపించినపుస్తకంమీద "నా స్నేహితుడు ఎడ్వర్డు థాంపసన్‌కు" అనే వాక్యాన్ని వ్రాశారు. ఈ వాక్యం నా కెంతో గర్వకారణం. ఇంతటిగర్వకారణమైనది యింకొకటిలేదు. మీరు సాధారణంగా మౌనంవహిస్తారనీ, మీ మౌనం మానవులు భరించలేనంత దుస్సహంగా

ళ్ళుందని, కాని మీరు ఏమిచెప్పినా అది వ్రాసుకోతగినదని నాకు తెలుసును.

మిమ్మల్ని, మీ అనుంగుపుత్రికను, శ్రీమతి రాబ్సన్‌ను చూడడం ఎంతో సంతోషదాయకమైనది.

సదా మీ
ఎడ్వర్డు థామ్సన్.

224. (శ్రీ)మతి పాల్ రాబ్సన్‌వద్దనుంచి

లండన్
శుక్రవారం సాయంత్రం
(? జులై 1938)

నా ప్రియమైన నెహ్రూ,

ఈరోజున మీరు ఇచ్చిన ముచ్చటైన విందుకు నా ధన్యవాదాలు. పాల్‌కూ నాకూ మీరంటే ఏంత ఇష్టమో!— మీతోగడిపిన ఆ రెండు గంటలూ మమ్మల్ని మేము మరచిపోయాము! విచిత్రమైన మా సమస్యలనూ మా పరిస్థితులనూ అర్థంచేసుకుని, మా ఆదర్శాలపట్ల సానుభూతి కనపరచగల ఒకవ్యక్తితో స్వేచ్ఛగా మనసువిప్పి మాట్లాడుకోగల అవకాశం దొరకడం నిజంగా ఒక పండుగవంటిది.

ఇంతకుమునుపు మీకుచేసిన వాగ్దానాన్ని అనుసరించి జాతీయ నీగ్రో కాంగ్రెసు వివరాలను మీకు పంపుతున్నాను. నీగ్రోసమస్యవిషయంలో నేను యథాశక్తిగా చేసిన సేవనుగురించి ఎనిమిదిసంవత్సరాల క్రితం నే నొక చిన్నగ్రంథాన్ని వ్రాశాను. ఆగ్రంథాన్నికూడా మీకు పంపుతున్నాను. రచనలో అది నా తొలియత్నం. అందుచేత ఇప్పుడు ఆ గ్రంథం నాదృష్టికికూడా అసమగ్రంగా కనిపిస్తున్నది. అయినప్పటికీ అమెరికాలో నీగ్రోలపరిస్థితిని వారివిషయంలో నేనుచేసినసేవను ఆ గ్రంథం ద్వారా కొంతవరకు తెలుసుకొనవచ్చును.

నేను ఆ గ్రంథాన్ని స్వీయచరిత్రను వ్రాసినరీతిలో వ్రాశాను. ప్రజా బాహుళ్యానికి నీగ్రోసమస్యను తెలుసుకొనవలెననే ఆసక్తికలుగుతుందని ఆ గ్రంథాన్ని ఆరీతిలో వ్రాశాను.

నేటికీ ప్రజలు ఈ గ్రంథాన్ని బహుళంగా కొని చదివి, నీగ్రో సమస్యనుగురించిన కొన్నివాస్తవాలను తెలుసుకుంటున్నారు. నా ఆశ నెరవేరింది.

వచ్చేసోమవారం, గొలాంజ్‌గృహంలో మీతోకలిసి విందుకు రాను న్నాము. అప్పుడు మిమ్మల్ని కలుసుకోగలము.

హృదయపూర్వకమైన మైత్రితో,

ఇట్లు,
ఇస్లాందా గూడెలారాబ్సెనన్.

226 మహాత్మా గాంధీవద్దనుంచి

సెగాన్, వార్ధా
ఆగస్టు 31, 1938

నా ప్రియమైన జవహర్‌లాల్,

నా శక్తి పరిమితంకావడంవలన ఇంతకాలం నీకు జాబు వ్రాయా లనేకోరికను నేను నిగ్రహించుకోవలసిన అవసరంఏర్పడింది.

'ఇందు'నుగురించి ఇచ్చిన తంతివార్తను జవాబుకొరకు ఎదురు చూస్తున్నాను.

సమాఖ్యనుగురించి నీవుచేసిన హెచ్చరికను నేను గమనించాను. ఆ వార్తను నేను సరకుచేయలేదు. అది పుకారు కావచ్చును. మొదట కాంగ్రెసుఅనుమతిని పొందనిదే వారు సమాఖ్యను సమావేశపరచరు. కాంగ్రెసుఅనుమతి వారికి దొరకదు.

ఇక మరి యూదులవిషయం. ఈవిషయంలో నీతో పూర్తిగా ఏకీభ విస్తున్నాను. నేను విదేశవస్తువులను బహిష్కరిస్తాను కాని, విదేశీయుల

శక్తిసామర్థ్యాలను బహిష్కరించను. యూదులను హింసించడం నాకు ఎంతో బాధకలగచేస్తున్నది.

తప్పనిసరిగా అర్హులైనవారి పేర్లను సేకరించి, మనతోపాటు కష్ట సుఖాలను పంచుకుని, మన జీవనస్థాయిని వారిచే అంగీకరించేవిధంగా చెయ్యడం ఉచితమని నేను నీకు సూచిస్తున్నాను. మిగిలినవిషయాలను మహదేవ్ వ్రాయగలడు.

ప్రేమతో
బాపు.

227. మహాత్మా గాంధీవద్దనుంచి

( ? — 1938-39 )

నా ప్రియమైన జవహర్‌లాల్,

నీవువ్రాసిన ఉత్తరం అందింది. అభిప్రాయభేదాలకు అపార్థాలకు అవకాశంఉన్నదన్నవిషయం నాకు తెలుసును. అజ్ఞానమువల్లకాని, లేక నా శ్రేయస్సుకోరికాని, చేయబడే ఈ విమర్శలప్రభావానికి నేను ఎన్నడూ లోనుకాలేదు. మనకు ఆంతరంగికమైన బలంఉంటే ప్రతికూలశక్తులు మనల్ని ఏమీ చేయలేవు. ఎట్టి అపాయమూ ఉండదని నాకు తెలుసు.

బాహ్యమైనవ్యవహారాలలో నీవు నాకు మార్గదర్శివి. అందుచేతనే నీవువ్రాసినజాబు నాకు ఎంతో సహాయకారి కాగలదు. కుమారప్పవిష యంలో నీవు అవసరమైన ఔదార్యానికంటె ఎక్కువ ఔదార్యాన్నే చూపావు. అతనువ్రాసినజాబును నీవు చూడాలని కోరుతావని అనుకుంటాను. అవసరంతీరినపిదప ఆ జాబును నీవు చింపివెయ్యవచ్చును. కుమారప్ప లాంటి సేవానిరతిగలవారు మనలో ఎందరో లేరు.

ప్రేమతో,
బాపూ

## 228. ఎడ్వర్డ్ థామ్సన్‌వద్దనుంచి

బోర్స్‌హిల్, ఆక్స్‌ఫర్డ్
సెప్టెంబరు 2, 1938

ప్రియమైన జవహర్‌లాల్,

మీ చెల్లెలికీ, కుమార్తెకూ అస్వస్థతగా ఉన్నదని విని ఎంతో విచారించాము. త్వరలోనే వారికి స్వాస్థ్యంచేకూరగలదని ఆశిస్తున్నాము.

నేను ఐర్లండ్‌వెళ్ళేటప్పుడు మీ లండన్ చిరునామాను, నాతో తీసుకునివెళ్ళకపోవడం ఎంత అవివేకమైనపని! మీ చిరునామా సరిగా తెలియనందువల్ల ప్రేగ్‌కు ఒకలేఖ వ్రాశాను. లండన్‌లో ఒక తప్పుడు చిరునామాకుకూడా ఒకలేఖ వ్రాశాను— అది నా స్వకపోలకల్పితమైన చిరునామాలెండి!

ఇప్పుడే కోర్డాతో ఫోనులో మాట్లాడేఅవకాశం కలిగింది. ఆయన ఆదివారంనాడు ఫ్రాన్సుకు, సోమవారంసాయంత్రంఅమెరికాకువిమానంలో వెడుతూవున్నారు. అంటే, మీరు ఇంకా కొన్నివారాలపాటు లండన్‌లో ఉంటేతప్ప ఆయనకు మిమ్మల్నికలుసుకునే అవకాశంకలగదు. ఆయన మిమ్మల్ని కలుసుకోలేకపోవడం, నిజంగా విచారించవలసినవిషయమే.

ఆయన ఒకపక్షంరోజులలో తప్పనిసరిగా అమెరికానుంచి తిరిగి వస్తారు. అనిర్ణీతంగాఉన్న అక్కడి రాజకీయపరిస్థితులకారణంగా ఆయన అక్కడ ఎక్కువకాలం ఉండడం ఉచితంకాదని అక్కడివర్గాలద్వారా ఆయనకు రహస్యమైన హెచ్చరిక అందచేయబడింది. ఇప్పుడు విదేశాలలో పరిస్థితులు అంత ఆశాజనకంగాఉన్నవని అనుకునేఅవకాశం కనిపించదు న్యూరెంబర్గ్ ర్యాలీ (సమావేశం) జరిగేవరకూ వాతావరణం ఇలాగే ఉండవచ్చును.

కోర్డా అమెరికావెళ్ళడం నూటికినూరుపాళ్ళు తథ్యం. ఒకవేళ ఏకారణంవల్లనైనా, అతనిప్రయాణం వాయిదాపడినట్లయితే రేపుమధ్యాహ్నం అతను ఆ విషయాన్ని ఫోనుద్వారా నాకు తెలుపగలడు. కాని, మీరూ, మీవారూ ఒకమాటు అతనిస్టూడియోను సందర్శించకూడదూ?

కోర్డా అమెరికావెళ్ళడం మీరు అతనిస్టూడియోను (ఆధునికనాగరికత యొక్క పీకలలో తొలిపీడ!) సందర్శించడానికి అవరోధం కానేరదు.

ఇప్పుడు మీకు రావడానికి అవకాశంలేకుంటే, ఒకవారంపిదప, మీ చెల్లెలికీ, ఇందిరకూ పూర్తిగా శరీరస్వాస్థ్యం చేకూరినతరువాత మీరు వారితోకలిసి రావచ్చును. బుధవారంనాడుకాని లేక గురువారంనాడుకానీ వస్తారా? నేనూ, నా భార్యా మీకు అరబ్ గ్రామపరిసరంలోవున్న సుదీర్ఘ నదీతీరంలోను, సుడాన్ కోటలోను విక్టోరియన్ భవనంలోను విందువిచ్చి, వినోదింపచెయ్యగలము. అప్పుడు మీరు జోల్టాన్ కోర్డా అద్భుత కళా కల్పనాఫలితమైన స్టూడియోను చూడవచ్చు. ఏమైనా, రేపురాత్రి మీరు నాతో టెలిఫోనుద్వారా మాట్లాడినప్పుడు కోర్డా అమెరికావెళ్ళేదీ, వెళ్ళనిదీ మీకు తెలుపగలను.

ప్రేగ్ నుంచి మీరువ్రాసినలేఖ నాలో ఎంతో ఔత్సుక్యాన్ని ప్రేరేపించింది. ఎంతో ఉద్దీపన కలిగించింది. హర్ట్ విడ్ కుచెందిన ఎలెన్ ను, సహింపరానిపీడగా నేను ఎప్పుడూ పరిగణిస్తూనేవచ్చాను. అతనిని గేలి చెయ్యడానికి లేబర్ పార్టీవారు అతనికి వ్రేలాడబడే జీసస్—అని పేరు పెట్టారు.

కోర్డా అమెరికాప్రయాణఫలితంగా, ఈ వారంలో మరోరోజున మీకు ఇక్కడకురావడానికి అవకాశంకలిగినఎడల, మిమ్మల్నీ, మీ చెల్లెలినీ, మీ కుమార్తెనూ చూడగలగడం మాకు ఎంతో సంతసంకలిగిస్తుంది. బుధవారంనాటికి వారికి శరీరస్వాస్థ్యం పూర్తిగా చేకూరుతుందని ఆశిస్తున్నాను.

ఇప్పుడు పర్యాలోచనచేసినపిదప, కోర్డాకు రహస్యహెచ్చరిక అందచెయ్యబడినవిషయం బయటపెట్టకుండా ఉంటే, ఉచితంగాఉండేదని అనిపిస్తోంది. కాని ఈవిషయాన్ని మీకు తెలియచేసినందువల్ల వచ్చే ప్రమాదమేమీలేదు. అక్కడిపరిస్థితులు తెలిపిన మీరైనా, అతనికి ఈ హెచ్చరికను అందజేసిఉండేవారే!

మీ,

ఎడ్వర్ థామ్సన్

కోర్డాస్టూడియో చూడవలెనన్న డెన్హామ్‌స్టేషన్‌లో దిగవలెను. పాడింగ్‌టన్ బీకన్స్‌ఫీల్డ్‌లైనులో ఉన్నది. ఈ లైనును ప్రిన్సెస్‌రిస్బరో లైను అని పిలుస్తారు. ప్రతిఅరగంటకు ఒక రైలుబండి ఉంటుంది. ఈసాయంత్రం స్టేషనుఆఫీసు మూసిఉండడంవల్ల మాకు రైలుబండి చిక్కలేదు. కాని మామూలుగా రైళ్ళు దొరకుతాయి.

229. జె. బి. కృపలానీవద్దనుంచి

స్వరాజ్‌భవన్,
అలహాబాద్
సెప్టెంబర్ 9, 1938

నా ప్రియమైన జవహర్,

గతమూడువారాలనుంచి మీకు జాబువ్రాయలేనందుకు నేను ఎంతో చింతిస్తున్నాను. ఇన్నాళ్ళూ నేను అలహాబాదులో లేను. నేను మొన్ననే వార్ధాద్వారా అలహాబాద్ చేరుకున్నాను. వార్ధాలో అధ్యక్షుడు, మౌలానా సాహెబ్, వల్లభాయ్, రాజేంద్రబాబు ఉన్నారు. వారు వారివారిపనులమీద వార్ధావచ్చారు. కృష్ణమీనన్‌విషయాన్నిగురించి వారితో మాట్లాడాను. కృష్ణ మీనన్‌నుగురించి నేను నీకు వ్రాసినవిషయాన్ని వారందరూ అంగీకరించారు. గ్లాస్గోలో జరుగనున్న, 'శాంతి మరియు సామ్రాజ్యమహాసభ'లో ప్రతినిధిగాపాల్గొనమని కోరుతూ కృష్ణమీనన్‌కు నన్ను లేఖవ్రాయమని వారుకోరారు. ఆవిధంగా కృష్ణమీనన్‌కు నేను లేఖవ్రాశాను. కాంగ్రెసుతరఫునకూడా ఒకసందేశాన్ని పంపగలనని సుభాష్ అన్నాడు. అతను సందేశమును పంపగలడని ఆశిస్తున్నాను.

వాఫ్‌డిస్ట్‌మహాసభవారు పంపిన ఆహ్వానాన్ని అంగీకరించవలెనా లేదా అన్నవిషయం ఇంకా ఏమీ తేలలేదు. ఈవిషయాన్ని 20వ తేదీన ఢిల్లీలో జరుగనున్న కమిటీసమావేశంముందు ఉంచగలను; ఈమాటు ఎ.ఐ.సి.సి సమావేశంకూడా జరుగనున్నది. గత జూలైలో జరిగిన వర్కింగ్‌కమిటీసమావేశంలో, యుద్ధాన్నిగురించి, సైనికశిక్షణనుగురించి తనఅభిప్రాయాలను బాపూ మాత్మప్రాయంగా చెప్పారు. సమావేశం

ఆఖరుకావస్తూఉండగా, ఈవిషయం ప్రస్తావనకురావడంవల్ల ఈవిషయాన్ని విపులంగా చర్చించే అవకాశం లేకపోయింది.

ఈవిషయాన్ని విపులంగా చర్చించడానికి రెండురోజులు ప్రత్యే కించవలెనని సూచించబడింది. 20వ తారీఖున మేము ఢిల్లీచేరుకోగలము. 22వ తారీఖున లాంఛనప్రాయంగా మా సమావేశం జరుగగలదు. 24వ తేదీన ఎ. ఐ. సి. సి. సమావేశం జరుగగలదు.

ఐరోపాపరిస్థితినిగురించి గత 30వ తారీఖున మీరు బుడాపెస్టునుంచి వ్రాసిన లేఖతాలూకు ప్రతులను వర్కింగ్కమిటీసభ్యులందరికీ పంపించాను. ఇంతత్వరలో మనము సమావేశంకావలసిరావడంవల్ల మధ్య ఐరోపాపరిస్థితులను ప్రత్యేకంగా చర్చించడానికి సమావేశాన్ని ఏర్పాటు చెయ్యడానికి వీలుపడదు. యుద్ధంపట్ల, ఆయుధీకరణపట్ల, సైనికశిక్షణ పట్ల మనము అవలంబించవలసినవైఖరిని చర్చించేసందర్భంలోనే ఈవిష యాల్నికూడా చర్చించవచ్చునని భావిస్తాను.

సైన్యములో చేరవలెనన్నప్రచారాన్ని నిరసిస్తూ కేంద్రఅసెంబ్లీ ఒకబిల్లును ఆమోదించినవిషయం మీకు తెలిసినదే. ప్రభుత్వంతరపున ముస్లింలీగ్ ఓటుచేసింది. అందుచేత, యుద్ధంపట్ల తత్సంబంధమైన ఇతరవిషయములపట్ల మనము అవలంబించవలసినవైఖరినిగురించి వచ్చే సమావేశములో కూలంకషముగా చర్చించబడగలదు. ఈసమయములో మీరు ఇక్కడఉంటే ఎంతో బావుండేదని నేను భావిస్తున్నాను. వార్ధాలోవి మనసహచరులు మరికొందరుకూడా ఈకోరికనే వెలిబుచ్చారు. ఢిల్లీలో సమావేశములుజరిగేసమయానికి మీరు విమానంద్వారానైనా ఢిల్లీరాగలి గితే ఎంతో బావుంటుందని, వల్లభాయ్కూడా అన్నారు. స్వదేశరాజకీయ సమస్యలను పరిష్కరించుకునేసందర్భంలో మీ సహాయము పొందవల సిన అవసరమువచ్చిందని అందరూ భావిస్తున్నారు.

బుడాపెస్టునుంచి మీరు 1వ తారీఖున వ్రాసిన ఉత్తరంతాలూకు ఒక ప్రతిని బాపూకు పంపించాను. సమాఖ్యనుగురించి అచ్యుటిమిత్రులకు బాపూ ఇటీవల విగూఢధోరణిలో వ్రాస్తూవచ్చిన లేఖలదృష్ట్యా, నేను మీ

లేఖతాలూకు ప్రతిని ఆయనకు పంపించాను. నేను వార్ధాలో ఉండగా అగాధా హారిసన్ బాపూకు వ్రాసిన ఒకలేఖను చదవడం జరిగింది. భూలాభాయ్ వైఖరికి అపార్థాలూ అపవ్యాఖ్యానాలు కల్పింపబడుతున్నందుకు తాను ఎంతో చింతపడుతున్నానని ఆవిడ బాపూకు లేఖ వ్రాసింది. మన తీర్మానములలో వ్యక్తీకరింపబడిన కాంగ్రెస్‌వైఖరికి విరుద్ధంగా భూలాభాయ్ లండన్‌లో ఒక్కమాటకూడా మాట్లాడిఉండలేదని ఆవిడ బాపూకు వ్రాసినలేఖలో తెలిపింది. ఈసమాచారమునకు కొంత విలువవున్నది కాబట్టి నేను మీకు తెలియచేస్తున్నాను.

ఇంగ్లండులోని వివిధవ్యక్తులతోను, వివిధవర్గాలతోను మీరు అవలంబించినవైఖరి, బాపూకు అపారమైన సంతృప్తికలిగించినదని నాకు తెలియవచ్చింది. బాపూ, ఇందునుగురించి తన అభిప్రాయాన్ని విపులంగా తెలుపకపోయినప్పటికీ, మీవైఖరిని ఆయన ఎంతో ప్రశంసించినారనిమాత్రం నాకు తెలియవచ్చింది. బాపూతప్ప ఇతరు లెవరూ ఏ అభిప్రాయాన్నీ తెలుపలేదు. నేనుమటుకు నా అభిప్రాయాన్ని ఇంతకుపూర్వమే మీకు వ్రాసివున్నాను. సమాఖ్యపట్ల, రాజ్యాంగఅసెంబ్లీపట్ల, స్వాతంత్ర్య సమస్యపట్ల మీవైఖరి ప్రతిఒక్కరిప్రశంసకూ పాత్రంకాగలదని నా భావం. లేబర్‌పార్టీవారిపథకము ప్రస్తుతపరిస్థితులలో అంత ఆచరణ యోగ్యంగాలేదని నేను అభిప్రాయపడుతున్నాను. భవిష్యత్తులో ఈ పథక పరిణామాలు ఎలా ఉండగలవనేవిషయం ఇంగ్లండులోని పార్టీ రాజకీయాలపై ఆధారపడివుంటుంది. ఈ ఒక్కవిషయముమాత్రమేకాక, ఇతర సమస్యలుకూడా ప్రపంచపరిస్థితిపై ఆధారపడిఉన్నాయి. ప్రపంచపరిస్థితి విషమించేకొద్దీ, ఇంగ్లండు మనహక్కులను మరికొంతమేరకు, అంగీకరించవలసినఅవసరం ఏర్పడవచ్చును. కాని ఇంగ్లండురాజకీయవైఖరి మాత్రం మితవాదవైఖరిగానే ఉండగలదు. విదేశాంగవ్యవహారాలు ప్రమాదకరంగా పరిణమించడంవల్ల ఆ పరిణామాలప్రభావం స్వదేశంలోని అతివాదరాజకీయవైఖరులపై విరుద్ధంగా ప్రసరించేఅవకాశముంది. లేబర్‌పార్టీ నివేదికను అందజేసినట్లయితే, ఆ నివేదికకు ఎక్కువ ప్రచారము రాగలదు. ఇండియాకు బ్రిటన్‌కు ఇకముందు స్నేహపూర్వకమైన

సంబంధాలుతప్ప, మరి ఎట్టిసంబంధాలు ఉండుటకు వీలులేదని, అవసర మైన ఒకవాణిజ్యఒడంబడికను చేసుకొనవచ్చునని, మనవలెనే భావించే కొన్నివర్గాలు—ఆ వర్గాలు ఈనాడు అల్పసంఖ్యకలిగినవైనప్పటికి—బ్రిటన్‌లో ఉన్నవనేవిషయాన్నయినా ఈ నివేదిక తెలుపగలదు.

ఈ నివేదికవల్ల అక్కడిప్రజలకు భారతీయుల స్వాతంత్ర్య కాంక్షతో పరిచయంకలిగే అవకాశమైనా ఉన్నది.

కాంగ్రెస్‌కార్యాలయనిర్వహణవిషయంలో మీరు లేఖలో వ్రాసిన సూచనలన్నీ అమలుకావించబడినవి. లోహియా ఇంకా కార్యాలయం లోనే పనిచేస్తున్నాడు. తన మామూలుపనిని చూచుకుంటున్నాడు. మీరు వచ్చినపిదపనే, అతను కార్యాలయంనుంచి వైదొలిగే అవకాశంఉండగల దని అతనితో చెప్పాను. ఈ నెల మొదట్లో అహమద్ వెళ్ళిపోయాడు. కాని అతను ఇంతకాలంగా ఇక్కడ పాతుకునిపోయిఉన్నాడు. అష్రఫ్ తన మామూలుపనిని చూచుకుంటూఉన్నాడు.

చైనాకు వెళ్ళనున్న వైద్యులవర్గంతోపాటు, ఒకరాజకీయవేత్తను కూడా పంపడం సబబుగాఉంటుందని మీరు చేసిన సూచనను వార్ధాలోని మన సహచరులకు తెలిపాను. కాని ఈ విషయంలో మీరు వ్రాసిన జాబు, చైనాకు వైద్యులరాయబారవర్గం వెళ్ళినపిదప నాకు చేరింది. అందుచేత ఈవిషయం వచ్చేసమావేశంలో సమాలోచింపబడగలదని వార్ధాలోని మన సహచరులు అన్నారు.

ఇక్కడ జరుగుతున్న విషయాలన్నిటినీ, మీకు విజయలక్ష్మి తెలిపేఉంటుందని అనుకుంటాను. ఇందిరకు తిరిగి ఆరోగ్యంచేకూరినదని విని మేము ఎంతో సంతసించాము. స్థలంమార్పు విజయలక్ష్మికికూడా కొంత ఉత్సాహకరంగా ఉండవచ్చునని ఆశిస్తున్నాను. మీ ఆరోగ్యం కూడా అంత సరిగాలేదని అహమదాబాద్‌లో భారతిద్వారా విన్నాను. మీరు కొంత విశ్రాంతితీసుకోకూడదా? మీరు ఇక్కడికి ఎప్పుడు తిరిగి వస్తారని ఇక్కడ అందరూ అడుగుతున్నారు. కాని మీ రెప్పుడు తిరిగి

వస్తారో, మేము ఊహించలేకుండా ఉన్నాము. మీరు ఎప్పుడు వచ్చేదీ మాకు తెలుపగలరా?

సుచేత, నా ఆదర అనురాగాలతో,

ప్రేమతో,
జీవత్

230. క్రిస్టైన్ హెచ్. స్ట్రజియన్ వద్దనుంచి

కెయిరన్ గారమ్,
కర్రీ,
మిడ్‌లోథియన్,
సెప్టెంబర్ 19, 1938

నా ప్రియమైన డాక్టర్ నెహ్రూ,

గతవారం మాంఛెస్టర్ గార్డియన్ పత్రికలో మీరు వ్రాసిన అత్యద్భుతమైన లేఖకు మీకు అభినందనలు తెలియచేస్తున్నాను.

ఈ విషమదినాలలో మాలో చాలామంది పొందుతూఉన్న ఆవేదనను ఆ లేఖ ఎంతో గంభీరంగాను, నిర్మొహమాటంగాను వ్యక్తీకరిస్తున్నది. ప్రస్తుతం మా ప్రభుత్వంలో నైతికవిలువలు, లోపించడంవల్ల నావలెనే ఆశాభంగం, ఆవేదన పొందినవారు మరెందరో మీకు ఈవిధంగానే అభినందనలేఖలను వ్రాస్తారని ఆశిస్తున్నాను.

మేము రాజకీయాలలో ప్రముఖపాత్రవహించేవ్యక్తులము కాము. ఆ మాట నిజమే. కాని ఈ దేశంలో అధికసంఖ్యలోఉన్నవారము మేము. మేము సామాన్యులము. నిరాడంబరమైన వ్యక్తులము. శాంతిని ప్రేమిస్తాము. నీతి, నిజాయితీ, మర్యాద, మన్ననగల మానవులం. అయితే మా అభిప్రాయాలను ప్రకటించడానికి మా కొక సంస్థ లేదు. కాని ఏనాటికో ఒకనాటికి, మా అభిప్రాయాన్ని ప్రకటించేనిమిత్తం, మాలో తీవ్రసంచలనం కలగకపోదు. ముందు పురోగమించవలసినబాట ఎంతో సుదీర్ఘమైనది. ఆ బాట సుగమమైనదికూడా కాదు. అది ముళ్ళబాట.

మేము విద్యావిజ్ఞానాలను సముపార్జించాలి. మాలో ఉత్తేజం కలగాలి. మేము ఒకసంస్థగా రూపొందాలి, అప్పుడుకాని భూగర్భంలో జలవలె నిగూఢంగాఉన్న మా చైతన్యం బయటపడి ఒక మహాసముద్రతరంగము వలె ఉప్పొంగి పురోగతికిగల అడ్డంకులన్నిటిని తుడిచివెయ్యదు. కాని మానసికంగాను, ఆత్మగతంగాను మాలోచాలామంది మీకు సహచరులనే విషయం మీరు తెలుసుకొనవలెనని నేను కోరుతున్నాను. మాంచెస్టర్ గార్డియన్‌పత్రికలో మీరు వ్రాసిన జాబుకు జవాబులు వ్రాసే వ్యక్తులు మాత్రమేకాదు. ఆవిధంగా మీకు జాబువ్రాయడం చేతకాకపోయినా, మీ లేఖవల్ల ఉత్తేజము పొంది, వ్యక్తీకరణకు భాష చాలక ఆ ఉత్తేజాన్ని మీకు తెలపలేకపోయినవారు కొన్నివేలమంది ఉన్నారు.

మళ్ళీ ఒకమారు మీకు అభినందనలు తెలియచేస్తున్నాను. భారత స్వాతంత్ర్యప్రాప్తికీ, ప్రపంచ ప్రజాస్వామ్యఅభ్యుదయానికి మీరు సర్వ విధాలా ఇతోధిక సేవచేయగలరుగాక!

చిత్తశుద్ధితో, మీ,
క్రిస్టైన్ హెచ్. స్టర్జియన్,

## 231. టి. మైస్కీ వద్దనుంచి

అక్టోబరు 10, 1938

నా ప్రియమైన నెహ్రూ,

సోవియట్ యూనియన్‌ను సందర్శించవలెనని మీరు ఎంతో కుతూహలపడినప్పటికి, ప్రస్తుతపరిస్థితులలో సోవియట్ యూనియన్‌ను సందర్శించేఅవకాశం మీకు లేదని విని నేను ఎంతో విచారించాను. ఏమైనా అనివార్యకారణాలవల్ల వాయిదావెయ్యబడిన ఈ పర్యటనను భవిష్యత్తులోనైనా కొనసాగించే అవకాశం మీకు కలగగలదని ఆశిస్తున్నాను.

నేను జినీవాలో మిమ్మల్ని కలుసుకొనగలగడం నా మహద్భాగ్యమని భావిస్తున్నాను. విలువైన ఆ జ్ఞాపకాలను నేను మనస్సులో ఎల్లప్పుడూ దాచుకుంటాను.

మీ కుమార్తెకూ మీ చెల్లెలికీ ఇప్పటికి కొంతవరకు ఆరోగ్యం చేకూరివుంటుందని హృదయపూర్వకంగా ఆశిస్తున్నాను.

నన్ను విశ్వసించండి,

మీ,

టి. మైస్కీ

233. సుభాస్ చంద్రబోస్ వద్దనుంచి

రైలులో,—

అక్టోబర్ 19, 1938

నా ప్రియమైన జవహర్,

మీరు ఇన్నిజాబులు వ్రాసినా, నేను జవాబు వ్రాయనందువల్ల నేను చాలా విడ్డూరమైనవ్యక్తినని మీరు ఆశ్చర్యపడిఉండవచ్చును; కాని మీరు వ్రాసిన జాబులన్నీ నాకు చేరాయి. వర్కింగ్‌కమిటీ సభ్యులకు మీరు వ్రాసిన జాబులు అందరికీ అందచేయబడ్డాయి. ఇక్కడ జరుగుతున్న విశేషాలను కృపలానీ, తదితరమిత్రులు, మీకు తెలియచేస్తూనేఉన్నారు. యుద్ధ విషమసమయంలో మీరు పత్రికాముఖంగాచేసిన ప్రకటనలు మాకు ఎంతో సహాయపడ్డాయి.

ఇన్నినెలలుగా మీరు ఇక్కడ లేకపోవడం నాకు ఎంత విచారాన్నికలగించిందో మీరు ఊహించలేరు. అయితే, మీకు స్థలమార్పు అవసరమన్నవిషయాన్ని నేను గుర్తించకపోలేదు. మీరు అవసరమైనంత శారీరకవిశ్రాంతిని తీసుకొనలేదనిమాత్రమే నేను విచారిస్తున్నాను. ఏమైనా ఇక్కడ మీ విశేషాలను తెలుసుకొనడానికి రూటర్‌వార్తాసంస్థ ఎంతో సహాయకారిగాఉన్నది. ఐరోపాలోని నీ కార్యకలాపాలన్నిటిని రూటర్ వార్తాసంస్థ ఎప్పటికప్పుడు ప్రజలకు తెలియచేస్తున్నది. ప్రజలు మీ ప్రసంగములను ఎంతో శ్రద్ధతో పరిశీలిస్తున్నారు. మీరు ఇక్కడ లేకపోవడం మాకు వెలితిగా వున్నప్పటికి, ఐరోపాలోఉన్నసమయంలో ఇంత అమూల్యమైన కార్యభారాన్ని నిర్వహించగలిగినందుకు నేను ఎంతో సంతసిస్తున్నాను.

మీరు వచ్చి పరిష్కరించేవరకూ అనేకసమస్యలు అలాగే అపరిష్కృతంగా వుండిపోతాయి. హిందూముస్లింసమస్య ఒకటి ఉండనే ఉన్నది. శ్రీ జిన్నా ధోరణి, తను పట్టిన కుందేటికి మూడేకాళ్ళన్న తీరులో ఉంది. ఎ. ఐ. సి. సిలో వామవర్గాలకు మితవాదవర్గాలకు చీలిక ఏర్పడింది. వామవర్గాలవారు నిరసనసూచకంగా సమావేశంనుంచి నిష్క్రమించడంకూడా జరిగింది. మహాత్మాజీ అందుకు ఎంతో నొచ్చుకున్నారు. ఈ సమస్యలుకాక—అంతర్జాతీయ సమస్య ఒకటి వుంది.

ప్రణాళికాసంఘ అధ్యక్షపదవిని స్వీకరించడానికి మీ రంగీకరించగలరని ఆశిస్తున్నాను. ప్రణాళికాసంఘకార్యకలాపాలు విజయవంతం కావలెనంటే మీరు అధ్యక్షపదవిని స్వీకరించితీరాలి.

ప్రేమతో,
మీపట్ల అనురాగంతో,
సుభాస్.

పి. యస్. : రేపు బొంబాయినుంచి కలకత్తా చేరుకోగలను.

234. ఎడ్వర్డ్ థామ్సన్‌వద్దనుంచి

బోర్స్‌హిల్, ఆక్స్‌ఫర్డు
అక్టోబర్ 21, 1938

ప్రియమైన జవహర్‌లాల్,

నేను ఎంతో విచారిస్తున్నాను. నేను జీవితంలో కడకు ఒక నిశ్చయానికివచ్చాను. నేను వట్టి మితవాదినిమాత్రమేనని— అందులోను మామూలుతరగతికిచెందిన మితవాదినిమాత్రమేనని నిశ్చయంచేసుకున్నాను. ఇప్పుడు ప్రతివిషయమూ అస్తవ్యస్తంగా కనిపిస్తున్నది. పాలస్తీనాసమస్యవిషయంలో వామవర్గాలవారివైఖరి ఏవగింపుకలిగిస్తున్నది. మాంచెస్టర్ గార్డియన్‌పత్రిక ఇంతకాలం నిర్మొహమాటంగా జియానిస్టువైఖరినే (ఆధునికయూదులకు పాలస్తీనా వలసగాఉండవలెననువాదము) వెలువరిస్తూవచ్చినది. నాయకుల చిత్రపటాలకు, ప్రకటనలమ వరుసనే

ప్రకటించినది. అరేబియాలో అశాంతికి ఇటాలియన్ల ప్రచారమే కారణమని ఉద్ఘాటించినది. జాతీయవాదులపై తీవ్రచర్యలుతీసుకొనవలెనని కోరుతూ అమెరికన్లు వ్రాసినలేఖలను ప్రచురించే నిమిత్తం హెచ్చు స్థలాన్ని కేటాయించిందికూడా. వారు ప్రచురించడానికి నిరాకరించిన ఒకలేఖను మాంఛెస్టర్ గార్డియన్ పత్రికాధిపతులు ఈరోజున నాకు అందచేశారు. ఈరోజున న్యూ స్టేట్స్‌మన్‌పత్రికలో ప్రకటించబడిన లేఖ ఇదేనని అనుకుంటాను. ఈ లేఖను ముఖానకొట్టినట్లుగా నిరాకరించకపోయినను న్యూస్‌క్రానికల్‌పత్రిక లేఖను ప్రచురించలేదు. ఈ రెండులేఖలలోను ఆ భయంకరమైన సంఘటన ఉదహరింపబడింది. ఈరోజున శతవిధాల యత్నించి టైమ్ అండ్ టైడ్ పత్రికలో ఈ విషయం ప్రకటించేలా చెయ్యగలిగాను (నా వ్యాసంలోని ఈ భాగాన్ని తీసి వారు ప్రచురించారు.) న్యూస్‌క్రానికల్, డెయిలీ టెలిగ్రాఫ్‌పత్రికలుకూడా ఇదేఫొటోను ప్రచురించినవి. కాని న్యూస్‌క్రానికల్‌పత్రికఫొటోక్రింద 'అరబ్‌దోపిడిగాండ్ర'ని డెయిలీ టెలిగ్రాఫ్‌పత్రిక 'అరబ్‌ఖైదీ' లని వ్రాసినవి. ప్రజావ్యతిరేకమైన ప్రచారానికి ఇంతసులువుగా ఇంగ్లండులో ఇంత సానుభూతిరావడం నేను నా జీవితంలో ఇదివరకు ఎన్నడూ చూచిఉండలేదు. యూదులకు ఇంగ్లండులో పత్రికలపై ఇంతప్రభావం ఉన్నదని నేను కలలోకూడా ఊహించలేదు. యూదులు, అమెరికన్లు ఒకవైపు, లిబరల్, లేబర్‌పత్రికలను కైవసంచేసుకుని అరబ్‌ల అభిప్రాయానికి ఆవగింజంతచోటయినా లేకుండా నిర్దాక్షిణ్యంగా అణచివేస్తున్నారు. ఈరోజున 'టైమ్ అండ్ టైడ్' పత్రికలో వ్రాయబడిన 'పాలస్తీనాముచ్చట్లు'— అన్న శీర్షిక ఏవగింపుకలగచేస్తున్నది. నా లేఖను ప్రచురించగలసాహసం న్యూస్టేట్స్‌మన్ పత్రికకు ఉన్నదా లేదా అనేవిషయంలో నాకు తీవ్రమైన అనుమానాలున్నవి.

మనలోమాట—ఎన్నికలలో లిండ్సె గెలుపొందుతాడని నేను అనుకోను. అతనికి ప్రత్యర్థులుగా నిలిచిన ప్రతినిధు లిరువురూ ఎంతో అసహ్యంగా ప్రవర్తించినారు. లేబర్‌ప్రతినిధి తనను అమర్యాదచేసిన ధోరణిలో అగుపిస్తున్నాడు. లిబరల్‌ప్రతినిధితో అతను కలిసే సూచనలు లేవు. అంతేకాక అతను తనకు జరిగిన 'ద్రోహాన్ని' గురించి డెయిలీ

హెరాల్డ్ పత్రికలో ఒకలేఖను ప్రచురించినట్లు విన్నాను. ఆ పాడుపత్రిక లింద్సెకు వ్యతిరేకంగా ఆ లేఖను ఉపయోగించిందికూడా. ఒక ప్రత్యర్థి ఉపసంహరించుకోడాన్ని ఎంతో ఉదాత్తమైనవిషయంగా లిబరల్ అభ్యర్థి భావిస్తున్నాడు. ప్రముఖ లిబరల్‌నాయకులంతా హాగ్‌లో చేరారు.... నామటుకు నేను ఎక్కడైనా ఎప్పుడైనా మాట్లాడడానికి సిద్ధమే— ముఖ్యంగా లిబరల్‌పార్టీ వారితోను. స్త్రీలతోను. ఎందుచేతననగా నేను లిబరల్‌ను (నాకు ఒకపార్టీ అనేది ఉన్నట్లయితే). అప్పుడు నేను ఆ ప్రసిద్ధమైన విందుకుకూడా హాజరయ్యాను. అప్పుడే లిండ్‌బెర్గ్ మా ప్రభుత్వాన్ని పడలెత్తించాడు. (అతను ముందు లాయిడ్ జార్జ్, ఆ పిదప మంత్రివర్గంవద్దకు వెళ్ళాడు) ఆ తరువాత ఇటీవల జరిగిన సంఘటనల అనలుకథనుగురించిన అనేకవిషయాలు నాకు తెలియవచ్చాయి. తత్ఫలి తంగా ఊగిసలాడేవారిపై, నా ప్రభావం నేను చూపగలను. అంతేకాదు— నేను కోపంగాఉన్నప్పుడు ఎంతో గొప్పగా ఉపన్యసించగలను! నేను నా జీవితంలో ఇప్పుడున్నంతకోపంగా మరెప్పుడూ లేను. కాని వారు ఈ ఎన్నికలలో నాలాంటి ఉపన్యాసకులను ఉపయోగించుకోరు. బాగా రాటు తేలిన పార్టీ ఉపన్యాసకులనుమాత్రమే ఉపయోగిస్తారు. అయితే కడకు ఫలితం పార్టీకిచెందని వోటర్లపైనే ఆధారపడిఉంటుంది! వారు నావద్ద నుంచి తీసుకున్న సాయం ఒక్క చందామాత్రమే. వారు నన్ను ఒక చిన్నగదిలో జరిగే సమావేశంలోకూడా ప్రసంగించనివ్వరు. అందు చేతనే ఇరువురు మాజీఅభ్యర్థులను ప్రసంగాలకు పిలుస్తారు. వారిప్రసం గాలు ఆక్స్‌ఫర్డ్‌లో ప్రతివారికీ భట్టీయమే.

ఒకసమావేశంనుంచి బైటపడగలిగినప్పుడే ఆ సమావేశంలో ప్రసంగించే స్వభావంఉన్నవ్యక్తిని నేను. కానీ ఈ మాట నేను చొరవ చేసుకుని వెళ్ళి లిండ్‌బెర్గ్ చెప్పిన కొన్నివిషయాలను, మరికొన్నివిష యాలను చెబుదామని అనుకుంటున్నాను. లింద్సెపై కొందరు పిక్కచ్చిగా ఉండేప్రముఖులు చేసిన దాడి, నే నెరిగినదే. నాపై ఆ దాడి జరిగినప్ప టికీ, దానిని ఎదుర్కోడానికి నేను సిద్ధంగాఉన్నాను.

జలియన్‌వాలాబాగ్‌పై ఇక్కడ క్షమించరాని ఆ రెండుదుర్ఘటనలూ జరిగినప్పటినుంచి, టాగూర్ ఆవేదనపొందినట్లే నేనూ ఆవేదన పొందాను. ఈ ప్రపంచమంతా నన్ను అపార్థంచేసుకున్నట్లుగాఉంది. నేను చెప్పరాని దుఃఖంలో మునిగిఉన్నాను. కాని, అరబ్‌లు లండన్‌లో ఒకసమావేశాన్ని ఏర్పాటుచేశారు; ఆ సమావేశంలో ప్రసంగించడానికి ఒక ఉపన్యాసకుడు అవసరమైనచో ఆ సమావేశంలో నేను ప్రసంగించ గలను. పత్రికలద్వారా నేను చెయ్యగలిగినంతవరకూ చేశాను. కాని అన్నింటిలోకి అధమస్థాయికిచెందిన 'యమ్. జి' పత్రిక (ఈ పత్రిక ఎప్పుడూ ఇలానే ఉంటూవచ్చింది) మాత్రం నీతిబాహ్యంగా ఉన్నది.

ఈ సమస్యల కేమిగాని ఇక కొన్నికులాసా విషయాలు–(డ్రమ్) లో వ్రాసిన విమర్శలు కోర్డాకు ఎంతో బాధకలిగించాయి. పోయినమంగళ వారం అతను నాకు ఫోనుచేశాడు. డెనెహామ్‌కు వచ్చి ఒకమారు తనని కలుసుకోవలసిందిగా కోరాడు. సాబూకొరకు ఒకకథ తయారుచేయించ డానికి అతను ఎంతో ఆతురపడుతూఉన్నాడు. ఏనుగులు - గుర్రాలు - వీటితో చెలిమిచేసేవిషయంలోమటుకు సాబూ సమర్థుడే. కాని అనేక అద్భుతకృత్యాలు చేసే నాటుకుర్రాడిగా సాబూను ప్రదర్శించాలని కోర్డా అభిప్రాయం. సిసలైన భారతీయజీవితాన్ని భారతీయనటులతో ప్రదర్శింప చేయడం తన ఆశయమైనట్లు కోర్డా చెప్పాడు. 'నేను విదేశాలలో ఇండియాకు కొంత ప్రచారంచెయ్యదలుచుకున్నాను. భారతదేశసౌందర్యాన్ని చూపే చిత్రాన్ని, హంతకులనూ ద్రోహులనూకాక మనము ప్రేమించి గౌరవించే భారతీయ స్త్రీలను పురుషులనూ ప్రదర్శించడం నా ఆశయం'- అని చెప్పాడు కోర్డా. దీన్నిగురించి మీ అభిప్రాయం ఏమిటి? ఈ చిత్రం ప్రపంచమంతటా ప్రదర్శించబడుతుంది. మన శత్రువులచేతులలో అన్ని విధాలైన ప్రచారసాధనాలూ ఉన్నవి. ఒక్క ఈ ప్రచారసాధనం మాత్రమే లేదు. వారికి ఒక జవాబుచెప్పాలని నా ఉద్దేశం. భారతీయకార్మికులువివ సించే బస్తీలను వారు పనిచేసేఫ్యాక్టరీలలోని పరిస్థితులను ప్రదర్శించే చిత్రాన్ని తయారుచేస్తాను. మీరూ, నాన్ ఒకమాటు ఆలోచించండి— ఈ పరిస్థితులు మనకు కలకత్తాలో కన్నులకుకట్టినట్టుగా కనుపిస్తాయి.

మురుగుకాలువలు, మురుగుగుంటలు— ఆకలితో కడుపులుకాలేవారు నివసించేప్రదేశాలు కనుపిస్తాయి. కాని ఒకవైపున మీ దేశదారిద్ర్యాన్ని ప్రదర్శిస్తూ, మీ ప్రయాగ సంగమాన్ని, గంభీర గంగా యమునాస్రవంతులనూ ప్రదర్శించేమాట ఏమిటి? విస్మరింపరాని అందాన్ని పుణికి పుచ్చుకున్నవి ఈ దృశ్యాలు. ఈ దృశ్యాలను చిత్రించడానికి కలకత్తా అనువైనస్థలమా? లేక గ్వాలియర్ (ప్రకృతిసౌందర్యదృష్ట్యా)అలహాబాద్, కాన్పూర్‌లు అనువైనస్థలాలా?

నేను ఇండియాలో ఉన్నప్పుడు మానసికంగా అనుభవించిన అస్వస్థత ఈ కడపటినవలలో ప్రతిఫలించినది.

జీవితంలో అలసిపోయిన ఒకవ్యక్తి వ్రాసిన ఒక గ్రంథం అది. ఈ నవలలో వ్రాయబడినది ఒకకథ అని చెప్పడానికి వీలులేదు. ఈ నవల ఎవరికీ ఇష్టంకాకపోవచ్చునుకూడా. ఈ నవలలోని తొలిపేజీలను చదివితే మన సనాతనులే నన్ను నిలువునా కాల్చివేస్తారు. ఇక భారత జాతీయవాది, నాపై రాళ్ళురువ్వాలని కోరుతాడు. ఇది అంత మంచి పుస్తకం కాదు. ఇక వ్రాయవలసింది ఏమీలేదు.

మీకూ, మీ కుమార్తెకు శుభం చేకూరుగాక.

మీ,

ఎడ్వర్డ్

పి. యస్.—హెచ్. యన్. బ్రెయిల్స్‌ఫోర్డ్ వట్టి దుష్టుడు. గత ఆదివారంనాటి రెనాల్డ్‌పత్రికలో చెక్‌శరణార్థులను పాలస్తీనాకు చేర్చాలని కోరుతూ వ్రాశాడు!!! 'టైమ్ అండ్ టైడ్' పత్రికలో నేను సూటిగా అడిగినప్రశ్నకు అతను జవాబుఇవ్వడానికి యత్నించనైనా యత్నించ లేదు. నేను పాలస్తీనాసమస్యను తీసుకొనడం 'టైమ్ అండ్ టైడ్' పత్రికవారికి అంత అంగీకారంగాలేదు. కాని వారు, 'దోవలోముచ్చట్లు' అనే శీర్షికనడుపుతున్నందుకుగాను దానిని ప్రచురించవలసివచ్చింది.

గారట్ వ్రాసిన 'స్వస్తికఛాయ'— అన్న వ్యాసాన్ని మీరు చూచారా?

235. రవీంద్రనాథ్ టాగూర్ వద్దనుంచి

శాంతినికేతన్, బెంగాల్,
నవంబర్ 19, 1938

నా ప్రియమైన జవహర్‌లాల్,

మీరు తిరిగి స్వదేశానికి వస్తున్నారనేవార్త ఇప్పుడే పత్రికలలో చదివాను. యావద్భారతం మీకు పలికే స్వాగతంలో నేనుసైతం నా కంఠస్వరాన్ని మేళవించడానికి ఆతురపడుతున్నాను.

మిమ్మల్ని కలుసుకొనవలెనని నేను ఎంతో ఆతురపడుతున్నాను. మీరు మీ కార్యక్రమంలో శాంతినికేతనసందర్శనాన్ని చేరిస్తే నాకు ఎంతో సంతోషం.

భారతీయపరిశ్రమలను శాస్త్రీయపద్ధతులలో నిర్మించేవిషయమై మొన్నటిరోజున డాక్టర్ మేఘనాధ్ సాహాతో నేను చర్చించినాను. ఎంతో ఆసక్తి కలిగించే ఆ చర్చ చాలాసేపు సాగింది. ఈ విషయ ప్రాముఖ్యాన్ని నేను పూర్తిగా గ్రహించగలిగినాను. కాంగ్రెసుకు మార్గదర్శకంగాఉండేనిమిత్తం సుభాస్ రూపొందించిన ప్రణాళికాసంఘానికి అధ్యక్షుడుగా ఉండడానికి మీరు అంగీకరించినారుగనుక, ఈవిషయమై మీ అభిప్రాయాలను తెలుసుకొనవలెనని కోరుతున్నాను.

దయచేసి, నన్ను ఇందిరకు జ్ఞాపకంచెయ్యవలసింది. అమ్మాయికి నా ప్రేమను అందచెయ్యవలసింది.

మీపట్ల ప్రేమతో,
రవీంద్రనాథ్ టాగూర్.

236. జయప్రకాశ్ నారాయణ్ వద్దనుంచి

కాలికట్,
నవంబర్ 23, 1938

ప్రియమైన భాయీ,

తిరిగి ఇంటిగడపమెట్టుతున్న మీకు స్వాగతమివ్వడానికి యావత్తు దేశంతోపాటు నేనుకూడా ఆతురపడుతున్నాను. సరాసరి అలహాబాద్‌కు

వచ్చి, మిమ్మల్ని కలుసుకుని, ఐరోపాలో మీరు కళ్ళారాచూచిన విషాద సంఘటనలనుగురించి, మీరు విదేశాలకు వెళ్ళిననాటినుంచి ఇక్కడ జరిగిన సంఘటనలనుగురించి మీతో ముచ్చటించవలెనని కోరుతున్నాను. మీరు వచ్చినవెంటనే తుఫానువంటి పర్యటనకార్యక్రమంలో చిక్కుకొనకుండా వుంటే, రెండువారాలలో నా కోరికను నేను ఈడేర్చుకొనగలను. ప్రస్తుతం నేను మలబారులో ఉన్నాను. మోకాలునొప్పికి ఒక ప్రత్యేకమైన ఆయుర్వేదచికిత్సను పొందుతూఉన్నాను. నొప్పి పూర్తిగా తగ్గలేదు. కాని కొంతవరకు నయం. ప్రభావతి నావగ్గరే ఉన్నది. ఐరోపాపర్యటన ఫలితంగా మీ ఆరోగ్యం అభివృద్ధిచెందినదని వార్తాపత్రికలద్వారా తెలుసుకొని ఎంతో సంతసించినాను.

ప్రపంచంలో జరుగుతూఉన్న అనేక అద్భుతసంఘటనలను గురించి విచారించడంలో మనస్సు నిమగ్నమైఉన్నప్పటికీ, నేను మీకు వ్రాసిన సోషలిస్టు బుక్‌క్లబ్‌లాంటి చిన్నివిషయాన్ని మరచిఉండరని ఆశిస్తున్నాను. ఈ పథకంవిషయంలో మేము కొంతవరకు పురోగమించినాము. సుభాస్‌బాబుసాయంతో కలకత్తాలో 3000 రూపాయలు ఇందునిమిత్తమై వసూలుచేయగలిగినాము. క్లబ్‌కార్యాలయాన్ని అలహాబాదులో ఏర్పాటుచేసినాము. క్లబ్‌కు అహమద్ మానేజింగ్ డైరెక్టర్‌గా ఉన్నాడు. క్లబ్ రాజకీయపక్షాలకు చెందిన వ్యవహారంకాదు. రాజకీయపక్షాలతో సంబంధంలేని వ్యవహారం. క్లబ్‌నుగురించి మరికొన్నివిషయాలను తెలుసుకొన్నపిమ్మటకాని క్లబ్‌స్థాపకసభ్యులలో ఒకడుగాచేరేఅవకాశంలేదని, మీరు ఐరోపానుంచి వ్రాసిన లేఖలో వ్రాశారు. ఏ ఒక్కపక్షాన్ని కాని ఆత్మీయంచేసుకోననికూడా మీరు వ్రాశారు. కాని క్లబ్ ఏ పక్షానికీచెందిన వ్యవహారంకాదని నేను మళ్ళీ మనవిచేస్తున్నాను. ఒక్క సోషలిస్టుసాహిత్యంతో తప్ప మరి దేనితోను క్లబ్‌కు సంబంధంలేదు. ఇక యితరవిషయాలు—క్లబ్‌పథకాన్నిగురించినవి—మీకు అవకాశంఉంటే అహమద్ మీతో చర్చించగలడు. అమీదట మీరు ఏవిధమైన సూచనలు చేసినా ఆ సూచనలను ఎంతో సంతోషంగా మేము అంగీకరించగలమని నేను వేరుగా చెప్పనవసరంలేదు. సుభాస్‌బాబు ఇప్పటికే స్థాపకసభ్యులలో

ఒకరు. మీరు స్థాపకసభ్యత్వాన్ని స్వీకరించకపోతే, అది మాకు తీవ్రమైన ఆఘాతం కాగలదు. పరిమితపరిధిలోనే క్లబ్ పనిచేస్తుందనేవిషయాన్నిమటుకు నేను అంగీకరిస్తాను. కాని, భారతదేశంలోసోషలిస్టుఉద్యమంవున్న పరిస్థితులనుబట్టి ఉన్నఉపాధికిమించినఫలితాలను ఈక్లబ్ద్వారా సాధించగలమని అనుకొనడంసముచితంకాదు. కాని, మీరు క్షమిస్తే నేను మరోమాటచెబుతాను. సహజంగా ఏవిషయాన్నయినాఎంతోవిశాలదృష్టితో నిర్వహించడానికి అలవడిన మీరు ఇండియాలోని ఇతరసంస్థలతో పోల్చిచూచిన సోషలిస్టులు బహూ కొద్దిమందిమాత్రమే అయినకారణాలవల్ల వారి కృషిలోసహకరించకపోవడం సబబుగా కనుపించదు. మీరు పూర్తిగా మాలోమమైక్యత పొందకపోయినప్పటికీ, సోషలిస్టుగా మా కృషికి మీరు ఇతోధిక సహాయంచేయగలరని మేము ఆశించడంకూడా అనుచితంకాదు.

ఇండియాలోని రాజకీయాలు మురుగుగుంటగా మారినవని మీరు నాకు వ్రాసిన జాబులో వ్రాశారు. మీరు లేనిసమయంలో అంతకన్న హీనస్థితికి దిగజారినవని నేను అంటున్నాను. కోటానుకోట్ల పీడితప్రజల శ్రేయస్సుకై పోరాడే ప్రజాస్వామ్యసంస్థఅయిన కాంగ్రెస్‌ను కొలదిమంది అభివృద్ధినిరోధకులచేతిలోని కీలుబొమ్మగామారుస్తున్నసంఘటనలు క్రమక్రమంగా జరుగుతూఉన్నవని ఉధృతరాజకీయరంగానికి దూరంగా ఉండి పరిశీలించిన నేను భావిస్తున్నాను. గాంధీజాన్ని భ్రష్టంకావించి అపవ్యాఖ్యానాలుకల్పించడంవల్ల ఈ పరివర్తన మరింత సులభంగా జరిగే అవకాశం ఏర్పడుతున్నది. అంతేకాక, ఈ సంఘటనలు కాంగ్రెసును వ్యర్థప్రలాపకారులమూర్ఖతకు నిలయంగా చేసే అవకాశంకూడా ఉన్నది. ముఖ్యంగా కాంగ్రెస్‌ప్రభుత్వాలుఉన్నరాష్ట్రాలలోనైనా కాంగ్రెస్ అనుసరిస్తున్న విధానాన్ని పునఃపరిశీలించి కాంగ్రెసుయొక్క సామాజిక ఆర్థికలక్ష్యాన్ని పునర్నిర్వచించవలసినఅవసరం ఇప్పుడు ఏర్పడినదని నేను భావిస్తున్నాను. ట్రేడ్‌యూనియన్‌కాంగ్రెస్‌చే నిర్వహింపబడే కార్మి

కోద్యమంపట్ల కాంగ్రెస్‌ప్రభుత్వాలు అవలంబించేవైఖరి, కార్మికసంస్థలను కాళ్ళు చేతులూ కట్టి యజమానులకు అప్పగించడానికి కాంగ్రెస్ ప్రభుత్వాలు సాధనాలు కారాదని కోరేవారికిపైతం కనువిప్పుకలగజేసేదిగా ఉండవలెను. భారతీయపరిశ్రమ భారతజాతీయతకు మారుపేరయ్యేప్రమాదం ఈనాడు ఏర్పడింది. ఇంతేకాక కాంగ్రెస్‌కమిటీల కార్యకలాపాల ధోరణినికూడా మనం పరిశీలించవలసిఉన్నది. చాలాచోట్ల కాంగ్రెస్ కమిటీలు పూర్తిగా పనిచేయడం మానివేశాయి. ఇక, పని చేస్తున్నచోట్ల అవి కేవలం ఎన్నికలప్రచారయంత్రాలుగానో లేక బాధ్యతలను గుర్తెరిగి పనిచేయనిసంస్థలుగానో తయారైనాయి. కాంగ్రెస్ కేవలం నిర్మాణకార్యక్రమంపై ఆధారపడి తన లక్ష్యాన్ని సాధించగలదా అన్న ప్రశ్నకు మీరు అంతగా వాచా కాకపోయినా, కార్యాచరణద్వారానైనా జవాబు చెప్పవలసి ఉంటుందని నేను భావిస్తున్నాను. లక్ష్యసాధనకు తగినరీతిగా కాంగ్రెస్ రూపొందుతూఉన్నదా లేదా అన్న ప్రశ్న గాంధేయవాదిని ఎదుర్కొన్నప్పుడు, నిర్మాణకార్యక్రమముద్వారా మనము లక్ష్యమును సాధించగలమని అతడు స్పష్టముగా చిత్తశుద్ధితో జవాబుచెప్పుకొనగలడు. కాని, ఇంతకన్న అవసరమైన విధ్యుక్తధర్మమేదైనా ఉన్నదా లేదా అన్నవిషయాన్ని అలాటి విధ్యుక్తధర్మం ఉన్నఎడల, ఆ ధర్మాన్ని ఎలా సాధించాలి అన్నవిషయాన్ని దేశానికి చెప్పవలసినబాధ్యత మీపై ఉన్నది. కార్మిక కర్షకసంస్థల కార్యక్రమాన్ని, అందుకు అనుబంధాలుగా యువ, విద్యార్థి, స్వయంసేవకసంస్థల కార్యక్రమాలను పోషలిస్తుఉద్యమం అన్నిటికన్న మిన్నగా ముందుకు తీసుకువివచ్చింది. కార్మిక కర్షక సంస్థలు, కాంగ్రెసుసంస్థకు దోహదంచేసే ఉపాంగాలుగా పనిచెయ్యడానికే రూపొందించబడినవి కాని, కాంగ్రెస్‌కు పోటీసంస్థలుగా రూపొందించబడలేదు. ఈ కార్యక్రమాన్నిగురించి అనేక సందర్భాలలో మీరు మీ వైఖరిని స్పష్టీకరించారు. కాని, అంతకన్న మరొకఅడుగు

ముందుకువేసి మీ వైఖరిని మరింత పటిష్టంగా రూపొందించి అభివృద్ధి చెయ్యవలసిన సమయం వచ్చింది. ఈ దేశంలోని అసంఖ్యాక ప్రజానీకంలో నిస్సంశయంగా గర్భితమైఉన్న సామాజికస్వేచ్ఛావాంఛకు ఒక రూపాన్ని ఇచ్చి, దృఢతరంచెయ్యడానికి మనం ఏమి చేయవలసిఉన్నదో మీరు ఆలోచించవలసిన అవసరం ఉన్నది. మీరుమాత్రమే కాదు—కాంగ్రెసుసభ్యులందరూ ఈ విషయాన్ని పర్యాలోచించవలసిన అవసరం ఉన్నది. దేశంలో ఇంకా శైశవదశలోఉన్న సోషలిస్టుఉద్యమం ఇచ్చిన దోహదంతప్ప ఈ ప్రజావాంఛకు మరే దోహదమూలేదు. ఈ వాంఛకు సంపూర్ణవికాసం చేకూర్చడానికి ప్రాతిపదికగా కొంతపనిని చేయవలసి ఉన్నది. కొద్దికాలాన్ని ఇందుకొరకు వినియోగించి ఆలోచించినఎడల మీ రొక్కరుమాత్రమే ఈ కార్యభారాన్ని నిర్వహించగలరనేవిశ్వాసం నా కున్నది. జాతీయఉద్యమంయొక్క సామాజికలక్ష్యాలను ముందుకు తీసుకునివెళ్ళడానికి కొత్తమార్గాన్నిచూపేవిషయంలో పై విషయాలను ప్రస్తావించినాను. ఇక అవసరముగా పరిష్కరించవలసిన ప్రధానసమస్య ఉన్నది. ఇకముందు మనం శత్రువుపై చేయవలసినదాడి ఏవిధమైనది? ('కడపటిదాడి ఇదేనా?') దీనినిగురించి మనకు ఒక స్పష్టమైన అభిప్రాయంఉన్నదా? ఈ కడపటిసమరానికి సన్నద్ధులంకావడానికి మనం ఎట్టి కృషిని సలుపుతూఉన్నాము? ఈ కడపటిసమరాన్ని మనము ఎన్నడు ప్రారంభించనున్నాము? బ్రిటిష్‌వారు తమకు అనుకూలమైన అదనును ఎన్నుకునేవరకూ మనము వేచిఉండవలసినదేనా? సమరసన్నాహాలు ముందుగా మనము చేయడానికి సత్యాగ్రహపద్ధతి అంగీకరించదని అనుకుంటాను. మనము ఇప్పటిలో ఊహించగల సమరపథకమల్లా, మరింతగా మాత్రయజ్ఞాన్ని చేయడమూ, లేక తద్విధమైన ఆత్మోద్దీపకమైన మరి కొన్నిపనులను చేయడము. కాని, వీనితోమాత్రమే మీరు సంతృప్తి చెంది ఉండగలరా? వర్కింగ్‌కమిటీసమావేశాలలో అంతగట్టిగా పోరాడి

కాంగ్రెసుకార్యక్రమంలో మీరు చేర్పించిన కొత్తవిషయాలన్నీ బీరువాలలో కాగితాలరూపంలో నిద్రిస్తున్నవి. కాంగ్రెసుకమిటీల ప్రజాస్వామ్యీకరణ, ప్రజలతో అనుబంధం ఏర్పరుచుకొనడం, ముస్లిములలో సంబంధాలు, జానిసరాజ్యాంగంపై పోరాటం—ఇలాటి విషయాలన్నీ విస్మరింపబడినవి. అయినప్పటికి ఒకఆశారేఖ కనుపిస్తున్నది. సంస్థానాలలో ప్రజా ఉద్యమాలు తలఎత్తి చైతన్యవంతంకావడము, ఆ విషయంలో మీరు కొంత శ్రద్ధవహించడము ఆశను ఇనుమడింపచేస్తున్నవి కాని ఇతర విషయాలలోకూడా మీరు మరింతశ్రద్ధను చూపవలసినఅవసరం ఉన్నది.

నవంబర్ 23న నేను కాలికట్‌నుండి బయలుదేర డిసెంబరు మొదటివారంలో ఏహార్ చేరవలెనని అనుకుంటున్నాను.

గౌరవపురస్సరంగా,

ప్రేమతో, మీ
జయప్రకాశ్

237. మహాత్మా గాంధీనద్దనుంచి

సెగాన్
నవంబర్ 24, 1938

నా ప్రియమైన జవహర్‌లాల్,

నీవు వ్రాసిన చీటీ అందింది. ఆ చీటీని చదివిన వెంటనే నీ పరిస్థితి తెలుసుకోగలిగాను. ఒకమాటు నీవు నీ కార్యక్రమమనేగానుగకు కట్టబడినతరువాత ఇక నీకు స్వాతంత్ర్యమన్నది ఉండదు. కాలాన్ని నీ ఇచ్ఛవచ్చినరీతిగా వినియోగించలేవు. నామటుకు నేను ప్రాప్తించిన దానితోనే సంతృప్తిచెందుతాను.

గురుదేవుడు ఒక వార్తాహరునిద్వారా ఒక లేఖను పంపించారు. బెంగాల్‌ను అధఃపతనంనుంచి రక్షించదలచుకొన్నట్లయితే, ఆధ్యక్ష బాధ్యతలనుంచి తాను తప్పుకోవలెనని నేను వ్యక్తిగతంగా భావిస్తున్నానని ఆయనకు తెలిపాను. ఈ విషయాన్నిగురించి గురుదేవుడు నీకు తప్ప

కుండా వ్రాస్తారు. లేక నీతో మాట్లాడగలరు. నీవుకూడా నీ అభిప్రాయాన్ని ఆయనకు తెలుపవల్నసింది.

ఇందుఆరోగ్యం ప్రయాణానికి అనుకూలంగాలేదని అనుకుంటాను.

ప్రేమతో,
బాపూ

## 238. రవీంద్రనాథ్ టాగూర్‌నద్దనుంచి

శాంతినికేతన్, బెంగాల్
నవంబర్ 28, 1938

నా ప్రియమైన జవహర్‌లాల్,

ఒకసారి ఇక్కడికివచ్చి నన్ను కలుసుకోమని కోరాను. ఇందుకు ప్రత్యేకమైన కారణమేమీలేదు. మీతో చర్చించవలసిన నిర్ణీతపథకమేమీలేదు. మిమ్మల్ని కోరవలసిందికూడా ఏమీలేదు. బెంగాల్ ప్రస్తుత పరిస్థితినిగురించి మీ అభిప్రాయాన్ని తెలుసుకొనవలెనని అనుకున్నాను. బెంగాల్ ప్రస్తుతపరిస్థితి నాకు ఎంతో దుఃఖంకలగజేస్తున్నది. నన్ను కలవరపరుస్తున్నది. నా రాష్ట్రానికి తెలివితేటలలో తక్కువేమీలేదు. కాని నా రాష్ట్రం నైతికంగా అశిక్షితమైనది. పొరుగువారిని చిన్నచూపుచూచే అహంకారంకూడా దానికి ఉన్నది. తన వాంఛలకు ఏమాత్రం భంగం కలిగినా, తీవ్రమైన ఉద్వేగానికి లోనవుతుంది. నా రాష్ట్రంయొక్క బలహీనత నాకు తెలుసును. కాని నేను మానసికంగా నిర్లిప్తంగాఉండి, నా రాష్ట్రం అధఃపతితమై అంతరించిపోతూఉంటే చూస్తూ ఉండలేను. కాని, నేను నా ప్రత్యేకకార్యక్రమంలో నిమగ్నుడనై, ఇతర విషయాలలో నా రాష్ట్రాన్ని తీర్చిదిద్దేబాధ్యతను మీ కాంగ్రెసుసంస్థకు అప్పగించడానికి సంసిద్ధంగాఉన్నాను. రాష్ట్రమనేయంత్రంలో అవరోధంగాఉన్న భాగాలను తొలగించి, వదులైన 'స్క్రూ'లను బిగించడానికి వ్యక్తిగతమైన ఒకశక్తి అవసరమని నేను భావిస్తున్నాను. ఆ వ్యక్తి మానవుడుగా పరిపూర్ణతను కలిగివుండకపోవచ్చును; కాని నిష్ణాతుడైన నిపుణుడై

ఉండాలి. ఏమైనా, నేను మీతో మాట్లాడవలెనని వాంఛిస్తున్నాను. అంత కన్న మీరు నాతో మాట్లాడవలెనని కోరుతున్నాను. ముఖ్యంగా మిమ్మల్ని చూడాలనే నా కోరిక. కాని ఈ కోరిక సఫలంకావడానికి మీకు తీరిక చిక్కాలి,

ఇందిర ఆరోగ్యపరిస్థితిని తెలుసుకోవలెనని నేను ఎంతో ఆతుర పడుతున్నాను. శీతాకాలాన్ని ఇండియాలో గడపడంవల్ల ఆవిడఆరోగ్యం చక్కబడవచ్చునని ఆశిస్తున్నాను.

అనురక్తితో,
రవీంద్రనాథ్ టాగూర్

239. అనిల్ కె. చందానద్దనుంచి

శాంతినికేతన్, బెంగాల్
నవంబర్ 29, 1938

నా ప్రియమైన పండిట్ జీ,

గురుదేవుడు ఈరోజున మళ్ళీ మీ కొక లేఖవ్రాసినారు. మీరు వ్రాసిన లేఖకు జవాబువ్రాయవలెననే అభిప్రాయంతో ఆ లేఖనువ్రాసి నారు. కాని ఆ లేఖవల్ల మీరు ఎక్కువ విశేషాలను తెలుసుకునేవీలుండ దని అనుకుంటున్నాను.

శాస్త్రీయ ప్రణాళికానిర్వహణనుగురించి డాక్టర్ సాహా భావాలు గురుదేవుణ్ణి ముగ్ధుణ్ణిగావించాయి. ప్రణాళికాసంఘంపై ఆయన ఎంతో ఆశపెట్టుకుని ఉన్నారు. మీరు మరొక కార్యక్రమంలో నిమగ్నులుకాక ముందే గురుదేవులు ఈవిషయాన్ని మీతో చర్చించవలెనని కోరుతు న్నారు. ఎందుచేతననగా పరిస్థితులఒత్తిడివల్ల మీరు మరొకకార్యక్ర మంలో నిమగ్నులై ప్రణాళికాసంఘ కార్యకలాపాలకు దూరమైపో వచ్చును. గురుదేవులు మిమ్మల్ని కలుసుకొనవలెనని తొందరపడడానికి ఇదే ముఖ్యకారణం.

ఇంతేకాదు; వచ్చేఏడాది కాంగ్రెసుఅధ్యక్షుడుగా వినూత్నదృష్టిగల వ్యక్తి ఎవరైనా ఎన్నుకోబడితే ఉచితంగాఉంటుందని గురుదేవుడు భావి

స్తున్నారు. సూత్నదృక్పథంగలవ్యక్తి, కాంగ్రెసుఅధ్యక్షుడైనట్లయితే, ప్రజాశికాసంఘనివేదిక పూర్తిఅయి అఖిలభారత కాంగ్రెసుచే ఆమోదింపబడినపిదప బీరువాలో పడిఉండే అవసరంఉండదు. గురుదేవునిఅభిప్రాయంలోను—మా అందరిఉద్దేశంలోను—కాంగ్రెసు అధిష్ఠానవర్గంలో ఇరువురేయిర్వురు నవీనదృష్టిగలవ్యక్తు లున్నారు. మీరు—సుభాష్‌బాబు. ప్రజాశికాసంఘానికి మీరు అధ్యక్షులుగాఉన్నందువల్ల సచేతనమైనమీ సహకారం లభించినట్లే. అందుచేత సుభాష్‌బాబు మళ్ళీ కాంగ్రెసు అధ్యక్షపదవికి ఎన్నుకోబడవలెనని గురుదేవుడు ఆకాంక్షిస్తున్నారు. ఈవిషయాన్ని మీకు తెలపడంవల్ల నేను అవిశ్వసనీయుణ్ణికానని అనుకుంటాను. గురుదేవుడు ఇటీవలే ఈవిషయాన్ని గాంధీజీకి వ్రాసినారు. ఈవిషయం ఇప్పటికే మీకు తెలిసిఉండవచ్చును; లేకపోతే, త్వరలోనే తెలుసుకోగలరు. ఇప్పుడు గురుదేవుడు మిమ్మల్ని కలుసుకున్నఎడల, సుభాష్‌బాబుఎన్నిక విషయంలో మీ సహాయాన్ని తప్పక కోరగలరు. కాని, ఈవిషయాలు మాత్రమేకాక, గురుదేవులు మిమ్మల్ని కలుసుకుని మీతో మాట్లాడవలెనని ఎంతో ముచ్చటపడుతూఉన్నారు. ఎందుచేతననగా, ఆయనకు మీరంటే ఎంతో ప్రీతి.

ఇక్కడకు వచ్చేఅవకాశం కల్పించుకోవడంకొరకు ఎట్టిపరిస్థితులలోను మీ కార్యక్రమాన్ని తారుమారుచేసుకోవద్దని మిమ్మల్ని కోరవలసిందిగా గురుదేవులు నాకు తెలిపినారు, కాని, వీలైనంతత్వరలో రావలసిందని కోరినారు. మీరు ఇక్కడికి రావడము ఆయనకు ఎంతో సంతోషము కలిగించగలదు. కానీ, మీ కార్యక్రమము, కాంగ్రెస్‌విధులూ అంతకన్న ముఖ్యమైనవి. ఇందిర ఎలాఉన్నది? ఆవిడను ఇక్కడికి పంపకూడదూ? కొద్దికాలం విశ్రాంతితీసుకుంటుంది. అంతకన్న మాకు సంతోషదాయకమైనవిషయం ఏముంటుంది.

ప్రేమ గౌరవాలతో,

ఇట్లు,
అమిల్

240. జాన్ నెగ్రిన్ లోపెజ్ వద్దనుంచి

[1938 వేసవిలో రిపబ్లికన్ ప్రభుత్వ ఆహ్వానముపై నేను బార్సెలోనా (స్పెయిన్) వెళ్ళాను. ఇది స్పెయిన్‌లో అంతర్యుద్ధం జరుగుతున్నప్పుడు జరిగింది. నేను తిరిగివచ్చినపిదప మహాత్మాగాంధీకి ఒక లేఖ వ్రాశాను. నేను కోరినమీదట—గాంధీజీ రిపబ్లికన్ ప్రభుత్వప్రధానికి ఒకలేఖను పంపారు. ఆ లేఖను నేను ప్రధానికి అందచేశాను]

జాన్ నెగ్రిన్ లోపెజ్,
బార్సెలోనా (స్పెయిన్)
నవంబర్ 26, 1938

మిష్టర్ జవహర్‌లాల్ నెహ్రూ,
ఆక్స్‌ఫర్డ్ హౌస్,
సెయింట్ జేమ్స్ స్ట్రీట్,
లండన్, యస్. డబ్ల్యు-1

ప్రియమైన నెహ్రూ,

ఇంతకుపూర్వం 11వ తారీఖున మీరువ్రాసిన స్వాగతలేఖకు జవాబువ్రాయనందుకు నేను ఎంతో విచారిస్తున్నాను. అందుకు, మహాత్మునిఉత్తరంకూడా పంపినందుకు, మీకు నా కృతజ్ఞతను తెలియచేస్తున్నాను.

మీకువ్రాస్తున్న ఈ జవాబుతోపాటు మహాత్మునికికూడా ఒకలేఖ వ్రాస్తున్నాను. మీరు దయతో ఆ లేఖను మహాత్మునికి అందజేయవలసింది,

మా దేశాన్ని సందర్శించిన కొద్దికాలంలో మీకు మా దేశాన్ని గురించి ఎంతో సదభిప్రాయం కలిగిందని తెలుసుకొని నేను ఎంతో సంతసిస్తున్నాను. మీరు మా విజయాన్ని ఆకాంక్షిస్తూ మా ప్రజలకు దయతో అభినందనలు అందజేసినందుకు, నేను మీకు కృతజ్ఞతాభినందనలు తెల్పుతున్నాను.

ఎటువంటి విపరీతమైన అవరోధాలను ఎదుర్కొని మేము పోరాడుతూఉన్నామో మీరు ప్రత్యక్షంగా చూచినారు. ప్రజాస్వామ్యానికి ప్రత్యక్ష శత్రువులతోమాత్రమే కాక, స్నేహితులవలె నటించే ప్రచ్ఛన్న శత్రువులతో సైతం మేము పోరాడవలసివస్తున్నది.

మీరు చూపిన సానుభూతికీ, ప్రోత్సాహానికీ హృదయపూర్వకమైన కృతజ్ఞతాభివందనాలను తెలియచేస్తున్నాను.

ఇట్లు.
జె. నెగ్రిన్,
ప్రధాని

241. జాన్ నెగ్రిన్ లోపెజ్ వద్దనుంచి మహాత్మాగాంధీకి

జాన్ నెగ్రిన్ లోపెజ్
బార్సెలోనా
నవంబర్ 26, 1938

మిష్టర్ మహాత్మాగాంధీ,
సెగాన్, వార్ధా,
ఇండియా.

ప్రియ స్నేహితుడా :

మన సుహృన్మిత్రుడు శ్రీ నెహ్రూద్వారా మీరు సెప్టెంబర్ 4వ తారీఖున పంపిన లేఖ నాకు ఎంతో ఆలస్యంగా చేరింది. అందుచేతనే ఆ లేఖకు జవాబువ్రాయడానికి ఇంతకాలంపట్టింది. నా ఆలస్యాన్ని మీరు దయతో క్షమించాలి.

ప్రియమైన మా మాతృభూమిస్వాతంత్ర్యంకొరకు జీవన్మరణ పోరాటం సల్పుతున్న మా ప్రజలపట్ల మీరుచూపిన సానుభూతికీ, మీరిచ్చినప్రోత్సాహానికి నేను నా హృదయపూర్వకమైన కృతజ్ఞతాభివందనాలను మీకు సమర్పిస్తున్నాను.

తమవంటివారు మా అండన ఉండి మా పోరాటంలోనిన్యాయాన్ని అర్థంచేసుకొనడం మాకు చెప్పరాని సంతోషాన్ని సంతృప్తిని కలగ జేస్తున్నది. స్పెయిన్‌లో జరుగుతూఉన్న సంఘటనలను మీ దేశప్రజలు ఎంతో సానుభూతితో గమనిస్తున్నారని నేను ఎంతో సంతోషించాను. మీరు లేఖలోతెలిపిన అభినందనలను శుభాకాంక్షలను నేను మా ప్రభుత్వా నికి, వీరోచితసేనకు, మా ప్రజలకు సంతోషంతో అందచేయగలను.

వారితరపున నాతరపున కృతజ్ఞతలు—

ఇట్లు,
విశ్వసనీయుడు,
జె. నెగ్రిన్

## 242 ఎడ్వర్డ్ థాంప్సన్‌వద్దనుంచి

బోర్స్‌హిల్,
ఆక్స్‌ఫర్డ్,
నవంబర్ 28, 1938

ప్రియమైన జవహర్‌లాల్,

ఈ లేఖతో నేను మరొకలేఖను పంపుతూఉన్నాను. ఆ లేఖను వ్రాసింది ఒక బ్రిటిష్‌న్యాయవాది. గొప్పశీలసంపన్నుడు. సాక్ష్యమన్న దానిని పూర్తిగా ఎరిగినవాడు. అతడు వ్రాసినవిషయాలనుగురించి నేను కొందరిని విచారించాను. అతడువ్రాసినది అక్షరాలా సత్యమని నమ్మ దానికి తగిన తృప్తి నాకు కలిగింది. లిబరల్‌పత్రికకాని లేబర్‌పత్రికకాని ఈ లేఖను ప్రచురించవు. లిబరల్‌సభ్యుడుకాని లేబర్‌సభ్యుడుకాని ఈ లేఖనుగురించి ప్రస్తావించరు; పీడితులను బలపరుస్తున్న మన స్నేహితు లందరూ జియానిస్ట్‌వాదానికే అనుకూలంగాఉన్నారు. వేరుదృక్పథాన్ని వారు వినరు. 'యమ్. జి.' పత్రికకూడా ఇదేమార్గాన్ని అనుసరిస్తున్నది. అరబ్బులు ఇప్పుడు ఎంతో చిక్కులోఉన్నారు. ఎందుచేతనవగా, నాజీలు యూదులను హింసలుపెడుతూఉండడంవల్ల యూదులు అందరిసానుభూ

తిని సంపాదించుకోగలుగుతున్నారు. ఈ అవకాశాన్ని వినియోగించుకుని యూదులు అమెరికాపై ఒత్తిడిని ఇనుమిక్కిలిచేస్తున్నారు. (పాలస్తీనాను యూదులకు వదలిపెట్టవలెనని రూజ్వెల్టుకూడా ప్రసంగించాడని తెలపటా నికి నేను ఎంతో విచారిస్తున్నాను.) అమెరికానుంచి, మన వామవర్గీయుల నుంచి ఒత్తిడిలేనిపక్షంలో ఈ ప్రభుత్వము చెడ్డదైనప్పటికీ, పాలస్తీనా వ్యవహారములో సమంజసంగా వ్యవహరించిఉండేదే.

సంపూర్ణముగా వాస్తవమని నేను విశ్వసించిన ఈ లేఖను మీకు పంపుతూఉన్నాను. మీ కేదైనా సూచనకావించడం, నాపని కాదు. కాని (1) పాలస్తీనాలో విప్లవప్రతీఘాతుకహింసాచర్యలచే. భారతదేశం, ఆ దేశానికిదూరమైందని. మాలో కొంతమందిమి యిక్కడ చెబుతున్నట్లే, జాతీయకాంగ్రెసు, అరబ్బులపక్షాన నిలబడి తన భావాన్ని స్పష్టంగా అభివ్యక్తీకరించినట్లయితే, అణచివేయబడుతున్న అతి చిన్న దేశానికి సహాయపడినట్లవుతుంది. (భారతదేశంలో పోలీసులు కొనసాగించారని చెప్పబడే దురంతాలను జ్ఞాపకానికితెచ్చే హింసాపద్ధతులు పాలస్తీనాలో అమలుజరుపబడుతున్నట్లు చాలా కథలు వ్యాప్తిలో వున్నాయి.) (2) ముస్లిములీగుచేతకూడా దీనికిసంబంధించిన తీర్మానాన్నైనా ఆమోదింపచేసేమార్గం వున్నదా? ముస్లిములసానుభూతి కోల్పోతున్నామని, మావాళ్ళు భయభ్రాంతులౌతున్నారు. దీనితోపాటు మీకు రెండు ప్రతులను పంపిస్తున్నాను; ఇందులో ఒకప్రతి ముస్లింలీగుకు అందజేయబడుతుందని, నే నాశిస్తున్నాను. ఏ ప్రముఖముస్లిమును నే నెరుగను; ఇక్బల్ మరణించారాయె. అక్బర్ హైదరీని ఎరుగుదునుకాని, ఆయన ఏపనీ చేయడు.

ఈ ఉత్తరం మీకు చేరుతుందో చేరదోనని నాకు అనుమానము గానేవుంది. సందేహిస్తూనే మీ కిది వ్రాస్తున్నాను. ఉత్తరంఅందితే అందినట్లుగామాత్రం నాకు వ్రాయండి.

కంటిఆపరేషనుకోసం నా భార్య లండనుచేరింది. ఆపరేషను బాగా జరగలేదు. కనుపాపచుట్టూవుండే పదార్థం జారిపోయింది. అందువల్ల

రెండవసారి ఆపరేషన్ చేయవలసివచ్చింది. అది ఆమెకు చాలా గడ్డు కాలంగా పరిణమించింది. విపరీతంగాబాధపడింది. ఇప్పటికీ ఆమె నర్సింగ్ హోమ్‌లోనే వుంటూ, నెమ్మదినెమ్మదిగా తేరుకుంటోంది.

క్రిస్మస్ పండుగకు, నూతనసంవత్సరాదికి నా మనఃపూర్వకాభి నందనలు.

ఎప్పటికీ మీ
ఎడ్వర్డు థామ్సన్ ఇ. ఎఫ్. ఐ.

243. మహాత్మా గాంధీవద్దనుంచి

సెగాన్, వార్ధా,
నవంబర్ 30, 1938

నా ప్రియమైన జవహర్‌లాల్,

చైనామిత్రులు వచ్చారు. అయిదునిమిషాలు మాట్లాడవలెనని వచ్చినవారు 35 నిమిషాలు మాట్లాడినారు. ఉండవలసిన సమయంకన్న ఏడురెట్లు హెచ్చుకాలం ఉన్నానని కడకు నేను సాధ్యమైనంత మృదువుగా వారికి చెప్పవలసివచ్చింది.

వై ప్రాయ్‌తో అగాథాచేసిన ఇంటర్వ్యూయొక్క నివేదికప్రతిని, నీకు పంపుతున్నాను. నన్ను ఆంగ్లేయులకు మిత్రుడుగా భావించవలెనని మాత్రమే నా సందేశసారాంశము. అలాగ భావించడానికి రాజకీయాలకు ఎట్టిసంబంధం లేదు.

సుభాస్‌విషయమై గురుదేవుడువ్రాసినజాబును నీకు పంపాను. నీకు ఆ జాబు చేరిఉంటుందని భావిస్తాను.

అవిరామకృషితో అహర్నిశలూ నీవు సతమతమైపోయి నీ ఆరోగ్యాన్ని క్షీణింపచేసుకోవడంలేదని ఆశిస్తాను. ఇందు కులాసాగాఉన్నదనుకుంటాను.

సరూప్‌ను భారవహమైనకార్యక్రమంనుంచి తప్పించాలి. చెదరిపోయిన శరీరారోగ్యాన్ని ఆమె తిరిగి చేకూర్చుకోవాలి.

ప్రేమతో,
బాపూ

245. కమిల్ ఎల్ చాదిర్జి వద్దనుంచి

మిష్టర్ కమిల్ ఎల్ చాదిర్జి శ్రీ జవహర్‌లాల్‌నెహ్రూకు వ్రాసిన ఒకలేఖకు అనువాదం.

బాగ్దాద్
డిసెంబర్ 13, 1938

నా ప్రియమైన శ్రీనెహ్రూ,

వ్యక్తిగతంగా చూచిఉండనివ్యక్తితోకూడా దృఢమైత్రిని ఏర్పరుచుకునే అవకాశంఉండడం ఈనాటి నాగరికత ప్రసాదించిన గొప్ప వరాలలో ఒకటి.

అనాదినుంచి మీ దేశం మహోన్నతమైనది. ప్రకృతి మీ దేశానికి గొప్ప సంపదను ప్రసాదించినది. భువిలో నాగరికత ఉదయించిననాటి నుంచి నేటివరకు భారతదేశం ఈనాడు పొందిన గొప్ప అంతస్థును మరేనాడూ పొందిఉండలేదని నేను భావిస్తున్నాను. ఈనాడు భారతదేశంలోని మేధోబీజాలు ప్రఫుల్లంగా ఫలించాయి. దేశానికి అవసరమైన వ్యక్తులు ఉదయించారు. ముఖ్యంగా ప్రాచ్యదిగంచలాన మీవంటి మహావ్యక్తి అవతరించడం నన్నూ, నా సోదరులనూ విముగ్ధంచేస్తున్నది.

మేధావులు అవతరించి, చరిత్రలో విస్మరింపరాని త్యాగాలను చేసినంతకాలము, ఇండియాభవిష్యత్తు ఉజ్వలంగాఉండగలదని నాకు గట్టి విశ్వాసం ఉన్నది.

మేము మీ సమరాన్ని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాము. ఆ పోరాటంలో కొద్దిగా పాలుపంచుకునేఅవకాశం చిక్కితే బాగుంటుందని కోరుతున్నాము. మీరూ మేమూ ఒకబాటలో నడుస్తున్నాము. సామ్రాజ్యవాదానికి, పరపీడనకు వ్యతిరేకంగా జరుపబడే పోరాటాన్ని వేరువేరు విభాగాలుగా విభజించి భావించరాదు. భౌగోళికమైన సరిహద్దులుకాని రాజకీయఅవరోధాలుగాని ఆ పోరాటాన్ని అణిచివెయ్యరాదు.

ఆరేబియాలో ఈ ప్రాంతంలో నివసిస్తున్న మాకు మీ పోరాటాన్ని గురించి కొద్దివిషయాలుమాత్రమే తెలుసును. ఇచ్చటికి వచ్చి, కొద్ది

కాలముమాత్రమే ఉన్న యూసఫ్ మెహరాలీ మీ పోరాటములోని న్యాయాన్నిగురించి నాకు చెప్పారు.

మీ ఉద్యమంలో సంబంధంపెట్టుకుని ఎప్పటికప్పుడు మీ ఉద్యమం మంచిచెడ్డలను తెలుసుకుంటూఉండవలెనని కోరుతున్నాము. మీవంటి ప్రముఖవ్యక్తులను వ్యక్తిగతముగా చూడవలెననికూడా కోరుతున్నాము. కొద్దికాలంక్రితం మీరు ఈజిప్టుకు వచ్చినట్లుగా. మీకు దాపులోనేఉన్న ఇరాక్‌కువచ్చేఅభిప్రాయము మీకు లేదా? విశాలమైన మీ దేశాన్ని గురించి, మీ పోరాటాన్నిగురించి తెలుసుకోవలసినబాధ్యత మాపై ఉన్నట్లే, అరేబియాలోని ఈ చిన్నప్రాంతాన్నిగురించికూడా తెలుసుకో వలసినబాధ్యత మీకు ఉన్నదని నేనంటే మీరు కాదని అనరనుకుం టాను.

శ్రీ మెహరాలీ మా దేశానికి రావడం మీతోను, మీ ఉద్యమం తోను సంబంధబాంధవ్యాలు ఏర్పడడానికి తొలిమెట్టు.

మీ విజయాన్ని వాంఛిస్తూ,

ఇట్లు,
కమిల్ ఎల్ చాదిర్జి,
కార్యదర్శి,
ప్రజాసంస్కరణపార్టీ.

## 246. శ్రీ యన్. రాధాకృష్ణన్‌వద్దనుంచి

లండన్,
డిసెంబర్ 30, 1938

నా ప్రియమైన నెహ్రూ,

ఇండియాలోఉండగా మిమ్మల్ని కలుసుకోలేకపోయినందుకు చింతి స్తున్నాను. మీతో ఒకటిరెండువిషయాలు మాట్లాడవలెనని అనుకున్నాను.

1. గాంధీజీకి 70 సంవత్సరాలు పూర్తిఅవుతున్నవిషయం మీకు తెలుసును. ఆసందర్భంలో ఒక సంకలనాన్ని ప్రచురించవలెనని సూచిస్తున్నాను. కేవలం అభినందనలనుమాత్రమేకాక ప్రపంచంలో మహా మేధావులూ, నాయకులూ ఆయనజీవితాన్నిగురించి ఆయనకృషినిగురించి వ్రాసిన వ్యాసాలను, వారి అభిప్రాయాలను ఆ సంకలనంలో చేర్చి, ఆ గ్రంథాన్ని వచ్చేజన్మదినంనాడు ఆయనకు బహూకరించవలెనని సూచించాను. నేను ఆక్స్‌ఫర్డ్‌చేరగానే ఆహ్వానాలుపంపినవారిజాబితా మీకు పంపుతాను. మీరు జాబితాలో ఎవరిపేర్లనయినా, అదనంగా చేర్చదలచిన ఎడల చేర్చవచ్చును. ఆవిషయాన్ని నాకు తెలియచేయండి. మన భారత సంస్థానాధిపతులలో ఎవరినైనా మనం కోరవచ్చునా? నాకు ఈవిషయమై బెంగపట్టుకున్నది. నేను దక్షిణాఫ్రికాకు వెళ్ళి స్మట్స్‌ను రామారావును ఈస్టర్‌సెలవుల్లో ఏర్పాటుచేయమని కోరులాను.

1939 డిసెంబర్ 8 వ తారీకునుంచి సెప్టెంబర్ 10 వ తారీకువరకు దక్షిణ కాలిఫోర్నియా విశ్వవిద్యాలయంలో కొంతకాలం కొలువుచేయుటకు నన్ను నియోగించారు. కాని గాంధీజీకి గ్రంథబహూకరణచేయవలసినదృష్ట్యా, ఈ కొలువును వాయిదావేయవలసివచ్చింది. జన్మదినసందర్భంలో బహూకరించడానికి ఉచితంగాఉండేటట్లు సర్వాలంకారశోభితంగా గ్రంథాన్ని తయారుచేయడానికి నేను శాయశక్తులా యత్నిస్తాను. నేను వార్ధాలో ప్యారిలాల్‌తో మాట్లాడినాను. అతడుకూడా ఈ కార్యక్రమం సఫలంకాగలదని అన్నాడు. హిందూకాలెండర్‌ను అనుసరించే, జన్మదినాన్ని నిశ్చయించి గ్రంథాన్ని బహూకరించుటకు నిశ్చయించాము.

మీరుకూడా ఒక వెయ్యిమాటలతోకూడిన వ్యాసాన్ని వ్రాయవలసిఉంటుందని నేను వేరే చెప్పనవసరంలేదనుకుంటాను. 1939 మార్చి ఆఖరుకు మీవ్యాసం నాకు చేరితే చాలును.

2. ఇండియా ప్రభుత్వపట్టాన్ని అనుసరించి ఏర్పరచడానికి సమాలోచింపబడిన సమాఖ్యను గాంధీజీ అంగీకరించకపోవడానికి ముఖ్యకారణం ఆ సమాఖ్యవల్ల ప్రజాస్వామికరాష్ట్రాలలోను, సంస్థానాలలోను అసంబద్ధమైన పరిపాలనాయంత్రం ఏర్పడగలదని ఆయన భావించడమేనని ఆయనతోసంభాషించినమీదట, నేను తెలుసుకోగలిగాను. సమాఖ్యలో చేరడానికిముందు సంస్థానాధీశ్వరులు బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ఏర్పరచితీరాలని ఆయన కోరుతున్నారు. సంస్థానాధీశ్వరుల ప్రతినిధులస్థానే ప్రజాప్రతినిధులు ఎన్నికకావడానికి ఆయనకు అభ్యంతరంఉన్నదాఅని అడిగాను. ఆయనకు ఈ విషయం నచ్చలేదు. మీ అభిప్రాయం ఏమిటి?

ప్రస్తుతరూపంలో సమాఖ్యను కాంగ్రెస్ వ్యతిరేకిస్తూఉన్నప్పుడు, సమాఖ్యను భారతప్రజలపై రుద్దేఉద్దేశం తమకు లేదన్నవిషయాన్ని బ్రిటిష్‌ప్రభుత్వం స్పష్టీకరించవలసిఉంటుంది.

నేను జనవరి 14వరకు ఇంపీరియల్‌హోటల్లో ఉంటాను. ఆ తరువాత ఆక్స్‌ఫర్డ్ వెళుతున్నాను. ఆక్స్‌ఫర్డ్‌లో నా చిరునామా బార్డ్‌వెల్ రోడ్డు, 15.

ఇట్లు.
రాధాకృష్ణన్ (సం)

జన్మదినసమావేశానికి అధ్యక్షతవహించడానికి టాగూర్‌ను మనం ఆహ్వానించాలి.

247. సర్ స్టాఫర్డ్ క్రిప్స్‌నుండి

లండన్,
ఫిబ్రవరి 3, 1939.

నా ప్రియమైన నెహ్రూ,

సుదీర్ఘమైన, ముచ్చటైన మీ లేఖను అందుకుని నేను ఎంతసంతసించానో మీకేవిధంగా తెలియచేయగలను : మనంఇరువురమూ క్షణం

కూడా తీరికలేనివాళ్ళం కావడంవల్ల ఉత్తరప్రత్యుత్తరాలు వ్రాసుకునే అవకాశంలేక మనమధ్య సంబంధబాంధవ్యాలు అంతరిస్తాయేమోనన్న భయం నా కున్నది. మీరు భారతదేశపరిస్థితినిగురించి మీలేఖలో వ్రాసిన విషయాలు నాకు ఎంతో సహాయకారికాగలవు. ప్రస్తుతము నేను అనేక అంతరంగికసమస్యలలో కంఠదఘ్నంగా మునిగిఉన్నవిషయాన్ని మీరు వార్తాపత్రికలద్వారా తెలుసుకునేఉంటారు. లేబర్‌పార్టీలో అంతస్సంఘర్షణకుసంబంధించినసమస్యలుకూడా ఉన్నవి. ఈపరిస్థితులలో భారత దేశవ్యవహారాలలోకాని, ఇతర వలసరాజ్యాలవ్యవహారాలలోకాని మన స్సును, కృషినీ కేంద్రీకరించడం సాధ్యంకాదు.

అయినా, లండన్‌లోజరిగిన భారతస్వాతంత్ర్యదినోత్సవంనాడు ఆ సమావేశంలో ప్రసంగింపగలిగిన అవకాశం నాకు కలిగినందుకు నేను ఎంతో సంతసిస్తున్నాను.

ఇక్కడిపరిస్థితులు రానురాను మరీ క్లిష్టమవుతున్నవి. లేబర్‌పార్టీ జాతీయప్రభుత్వంతో చేతులుకలిపే ధోరణిలో ఉన్నది. ఈ ధోరణికి వ్యతిరేకంగా నేను పోరాడుతున్నాను. నేను, నాపనినిగురించి మీకు వివరంగా వ్రాయనవసరంలేదు. ఎందుచేతనంటే ట్రిబ్యూన్‌పత్రికలో ఈవివరాలన్నీ ప్రచురితమవుతూఉన్నవి. ఏమైనా దేశంలో మనకు కావలసినంత సాను భూతి, బలమూ ఉన్నవని నేను నిస్సంశయంగా చెప్పగలను. వచ్చే కొద్ది మాసాలలో మనము కొన్నికార్యాలను సాధించగలమన్నఆశ నాకు ఉంది.

ఎంతో తొందరపనులున్నందువల్ల, ఇంతకన్న వ్రాయలేక పోయాను. క్షమించాలి.

ఇట్లు,
ఆర్. స్టాఫర్డ్ క్రిప్స్

248. మహాత్మా గాంధీనుంచి

పెగాన్, వార్ధా
ఫిబ్రవరి 3, 1938

నా ప్రియమైన జవహర్‌లాల్,

ఎన్నికతరువాత, ఎన్నికజరిగినతీరును చూచినతరువాత, రానున్న కాంగ్రెసుమహాసభకు హాజరుకాకుండానే, దేశసేవచెయ్యడం ఉచితంగా ఉంటుందని నేను భావిస్తున్నాను. అదీగాక, నా ఆరోగ్యపరిస్థితికూడా అంత బాగాలేదు. ఈవిషయంలో నీవు నాతో సహకరించడం నా అభిమతం. మహాసభకు హాజరుకమ్మని నన్ను ఒత్తిడిచేయవద్దు.

ఖాలిలో విశ్రాంతితీసుకొనడంవల్ల, నీకూ, ఇందుకు కొంత స్వాస్థ్యంచేకూరిందని ఆశిస్తాను. "ఇందు" నాకు తప్పక ఒకజాబు వ్రాయాలి.

ప్రేమతో,
బాపూ.

249. సుభాసుచంద్రబోసుకు

అలహాబాద్

వ్యక్తిగత రహస్యలేఖ
ఫిబ్రవరి 4, 1939

నా ప్రియమైన సుభాష్,

శాంతినికేతన్‌లో మనము ఒకగంటసేపు మాట్లాడుకున్నాము. కాని ఒకనిర్ణయానికి రాలేకపోయినామేమోనని నాకు భయంగాఉన్నది. అనేకవిషయాలు అస్పష్టంగాఉన్నందువలన మనం ఒకనిర్ణయానికి రాని మాటకూడా వాస్తవమే. పరిస్థితులు ఎలా పరిణమిస్తాయో నేను ఊహించలేకుందాఉన్నాను. పరిస్థితులపరిణామాన్ని మనం గమనించవలసి ఉంటుంది. కాని ఈ పరిణామంకూడా మనపైనే ఆధారపడివున్నది. ముఖ్యంగా మీపై ఆధారపడిఉన్నది.

ఏమైనా మీరు పోటీచేసినఎన్నికఫలితంగా కొంత మంచి, కొంత చెడు జరిగినమాటమాత్రం వాస్తవం. ఈవిషయం మనం మాట్లాడినప్పుడు మీతో చెప్పానుకూడా. మీ ఎన్నికఫలితంగా జరిగిన మంచిని నేను గుర్తిస్తున్నాను. కాని తత్ఫలితంగా ఏర్పడే చెడునుకూడా నేను గ్రహింపగలుగుతున్నాను. కాని, మంచిచెడ్డలను రెండింటనీ ఆలోచించినప్పుడు ప్రత్యేకంగా ఈ పోటీ ఈవిధంగా జరగకుండాఉంటే ఎంతో బావుండేదని నేను ఇప్పటికీ భావిస్తూనేఉన్నాను. కాని ఇది జరిగిపోయినవిషయం. జరిగినదానికి చింతించి లాభంలేదు. భవిష్యత్తును మనం ఎదుర్కొనవలసి ఉన్నది. ఈ భవిష్యత్తును మనం విశాలదృష్టితో దర్శించాలికాని, వ్యక్తుల దృష్ట్యా దర్శించకూడదు. మనం ఆశించినరీతిగా పరిస్థితులు పరిణమించలేదు కాబట్టి, మనలో ఎవరుకాని పరస్పరనిందలలోకిదిగడం ఉచితం కాదు. ఏది ఎలా పరిణమించినప్పటికి, మన ఆదర్శంకోసం మనం శాయశక్తులా కృషిచేయవలసిఉంటుంది. అయినప్పటికి, సమ్యగ్భవిష్యాన్ని దర్శింపగలగడం సులువైనపని కాదు. భవిష్యత్తునుగురించిన ఆలోచన నా మనస్సును ఆందోళితంచేస్తున్నది.

సాధ్యమైనంతవరకు మన పరస్పరవైఖరులను అర్థంచేసుకోడానికి ప్రయత్నించడం మన ప్రథమకర్తవ్యం. ఇలా మనం పరస్పరం అర్థం చేసుకున్నట్లయితే తీర్మానాలను రూపొందించడం పెద్ద క్లిష్టసమస్య కానే కాదు. కాని మనమనస్సులు అనేకసంఘర్షణలతో అల్లకల్లోలంగా ఉన్నప్పుడు పరస్పరం ఒకరిపై ఒకరికి అనుమానాలు ఉన్నప్పుడు, భావిస్వరూపాన్ని దర్శించి, భవిష్యత్తును తీర్చిదిద్దగలగడమనేది సులువైనపని కాదు. గత కొద్దిసంవత్సరాలలో గాంధీజీతోను, వల్లభాయితోను, గాంధీజీ రీతిలోనే ఆలోచించే మరికొందరితోను, నాకు సన్నిహితసంబంధం ఏర్పడింది. మేము అనేకపర్యాయాలు అనేకవిషయాలనుగురించి సుదీర్ఘమైన చర్చలుజరిపాము. మేము ఒకరివాదాలను ఒకరం పూర్తిగా అంగీకరించకపోయినప్పటికి, సాధ్యమైనంతవరకు ఒకరినొకరం అర్థంచేసుకుని, ఒకరిప్రభావాన్ని ఒకరం విలీనంచేసుకోగలిగాము. 1933 లో నేను జైలునుంచి విడుదలైనతరువాత గాంధీజీని చూడడానికి పూనా వెళ్లాను.

అప్పుడే ఆయన నిరశనదీక్షానంతరం మెల్లగా కోలుకుంటూఉన్నారు. మన స్వాతంత్ర్యసమరానికిసంబంధించిన వివిధసమస్యలపై మేము సుదీర్ఘ చర్చలను జరిపాము. ఆతరువాత పరస్పరం అనేకలేఖలను వ్రాసుకున్నాము. ఆ లేఖలు ప్రచురితమైనవికూడా. ఆ లేఖలూ, చర్చలూ మా ఇరువురిలోని ఏకత్వాన్నిమాత్రమే కాక, మా స్వభావాలలోని వ్యత్యాసాలను, ఇతర ప్రధానవ్యత్యాసాలను ద్యోతకంచేస్తున్నవి. ఆతరువాత వ్యక్తిగతంగాను, వర్కింగ్ కమిటీలోను మేము అనేకసార్లు చర్చించుకున్నాం. అనేకసందర్భాలలో చర్చలు తీవ్రధోరణిలోసైతం కొనసాగాయి. నేను కాంగ్రెసుఅధ్యక్షపదవికి, తుదకు, వర్కింగ్ కమిటీసభ్యత్వానికికూడా రాజీనామాయిచ్చేవరకూ వచ్చాను. కాని, అలా నేను చేయడంవల్ల ఐక్యత అత్యవసరమైనసమయంలో గడ్డుపరిస్థితి ఏర్పడగలదని నమ్మి నేను విరమించుకున్నాను. బహుశా నేనుచేసింది తప్పేఅయిఉండవచ్చు.

ఇప్పుడు ఈ గడ్డుపరిస్థితి భయంకరరూపంలో వచ్చింది. ఇలా రావడం దురదృష్టమనే అనాలి. నేను అనుసరించవలసినపథాన్ని నేను నిర్ణయించుకొనడానికిముందు, కాంగ్రెసు ఎలాఉండాలి, ఏంచేయాలి అన్నవిషయాలపై మీ అభిప్రాయాన్ని తెలుసుకోదలిచాను. రాజకీయాలను అనుసరించి మీరు ఏమని భావిస్తున్నారో నాకు అగమ్యగోచరంగాఉన్నది. వామవర్గీయులనుగురించి, మితవాదవర్గీయులనుగురించి,సమాఖ్యనుగురించి అనేకులు అనేకరీతులుగా మాట్లాడుతున్నారు. కాని నాకు జ్ఞాపకంఉన్నంతవరకు మీరు అధ్యక్షులుగాఉన్నప్పుడు వర్కింగ్ కమిటీలో ఈసమస్యలకు సంబంధించినప్రధానాంశాలేవీ చర్చింపబడిఉండలేదు. ఎవరిని వామవర్గీయులుగా మీరు భావిస్తున్నారో నాకు తెలియదు. అధ్యక్షపదవికి ఎన్నిక జరిగినసంవత్సరంలోమీరువేసిన ప్రకటనలలోని పదప్రయోగపద్ధతినిబట్టిచూస్తే, గాంధీజీని, వర్కింగ్ కమిటీలో ఆయనవర్గానికిచెందినవారిని మితవాద వర్గనాయకులుగా మీరు పరిగణిస్తున్నట్లు అగుపిస్తున్నది. వారిప్రత్యర్థులు —వారుఏవర్గానికిచెందినవారైనా— వామపక్షీయులు. వామ, దక్షిణవర్గీయులు అని మీరు ఇలా విభజించి ముద్రవేయడం నాదృష్టికి పూర్తిగా అసమంజసంగా తోస్తున్నది. వామవర్గీయులుగా పిలువబడేవారిలో చాలామంది

మితవాదులకన్నకూడా మితవాదవైఖరిని అవలంబించేవారు ఉన్నారు. తీవ్రమైన పదజాలాన్ని ప్రయోగించి కాంగ్రెస్ వృద్ధనాయకత్వాన్ని విమర్శించగలగడం వామపక్షతత్వానికి, రాజకీయాలలో అది ఒకగీటురాయి కాజాలదు. బాధ్యతను ఎరగనివారు, పరిస్థితిని అర్థంచేసుకోనివారు, మేధస్సంపత్తిలేనివారు, బాధ్యతాయుతమైన పదవులలోకిరావడంవల్ల భవిష్యత్తులో ఎంతో ప్రమాదంఉన్నదని నేను భావిస్తున్నాను. ఒక పెద్దకల్లోలానికి దారితీయగల విషమపరిస్థితిని వీరు సృష్టిస్తారు. అప్పుడు అసలు నిజమైన వామవర్గీయులు నామరూపాలులేకుండాపోతారు. ఇందుకు ఉదాహరణగా చైనా మనకు కనుపిస్తూనేఉన్నది. ఇండియాకూడా ఈ త్రోవ త్రొక్కడం నా కభిమతంకాదు. 'వామ'—'మితవాద'—ఇలాటిపదాలను ఉపయోగించడం నాదృష్టికి పూర్తిగా అసంబద్ధంగా కనుపిస్తున్నది.

ఈ పదాలను ప్రయోగించడానికిబదులు మనం రాజకీయవిధానాలను గురించి మాట్లాడుకుంటే ఎంతో బాగుంటుంది. మీరు అనుసరించేవిధానం ఎట్టిది? సమాఖ్యకు మీరు వ్యతిరేకి, కదా? మంచిది. వర్కింగ్ కమిటీలో సభ్యులు చాలామంది అందుకు అనుకూలురనుకుంటాను. అయితే, ఈ విషయంలో వారిబలహీనతను ఎన్నడం సబబుకాదు. వర్కింగ్ కమిటీలో ఈవిషయాన్ని మీరు సమగ్రంగా చర్చించిఉంటే సబబుగాఉండేదికదా! లేక ఈవిషయాన్నిగురించి ఒక తీర్మానాన్ని ప్రవేశపెట్టి ఆతరువాత వివిధ అభిప్రాయాలను తెలుసుకోవడానికి ప్రయత్నించినా సబబుగాఉండేది. ఒకవిషయాన్ని మీ సహచరులతో సమగ్రంగా చర్చించకుండా వారు మిమ్మల్ని పరోక్షంలో నిందించారని వారిపై అభాండాలుమోపడం ఎంతమాత్రం సబబుకాదు. సమాఖ్యలోని మంత్రివర్గాలలోని చీలికలపై మీరు చేసిన ఆరోపణను, ఇప్పుడు మళ్ళీ నేను ప్రస్తావించనవసరంలేదనుకుంటాను. ఈ చీలికలుఏర్పడడానికి కారణం వర్కింగ్ కమిటీలోని మీ సహచరులేనని చాలామంది భావిస్తున్నారు.

ఈ విషయమై ఐరోపానుంచి నేను సుదీర్ఘమైన నివేదికలు పంపడం మీకు జ్ఞాపకంఉండేఉంటుంది. సమాఖ్యపట్ల మనం అవలంబించవలసినవైఖరిని ఎంతో దీర్ఘంగా ఆ లేఖలలో చర్చించాను. మీ సూచన

లను కోరాను. కాని మీరు మీ సూచనలనేమీ నాకు తెలియజేయలేదు. చివరకు రేఖలు చేరినట్లుకూడా నాకు తెలుపలేదు. గాంధీజీ నా వైఖరిని అంగీకరించారు. వర్కింగ్‌కమిటీసభ్యులలో పెక్కుమందికూడా నా వైఖరిని అంగీకరించినట్లు నాకుతెలిసింది. కాని, ఇప్పటికీ—మీరు మీ అభిప్రాయాన్ని నాకు తెలుపలేదు. నాకు మీ అభిప్రాయాన్ని తెలియజేయలేదన్నమాట అలాఉంచండి. పోనీ, ఈవిషయాన్ని వర్కింగ్‌కమిటీలో కూలంకషంగా చర్చించి అటో ఇటో సమస్యను తేల్చే అవకాశం ఉన్నది కదా? కాని, ఈవిషయంలోను, ఇతరవిషయాలలోను మీరు వర్కింగ్ కమిటీలో నిర్లిప్తదృష్టితో మౌనంవహించారు. కాని అవతలకి వెళ్ళిన తరువాత మీ అభిప్రాయాలను బాహాటంగావ్యక్తంచేశారు.అనగా ఫలితాంశంలో మీరు ఒక వక్తగామాత్రమే వ్యవహరించినట్లు తెలుస్తున్నది కాని, మార్గదర్శిత్వంవహించవలసిన అధ్యక్షుడుగా వ్యవహరించినట్లు తేలడం లేదు.

గతసంవత్సరంలో ఎ. ఐ. సి. సి. కార్యాలయంలో కార్యకలాపాలనిర్వహణ ఎంతో క్షీణదశకువచ్చింది. మీరు ఎ. ఐ. సి. సి. కార్యాలయాలగడపనుకూడా త్రొక్కినట్లులేదు. ఎక్కడి ఉత్తరాలు అక్కడే పడిఉన్నాయి. టెలిగ్రాములకుకూడా జవాబులులేవు. అనేక కార్యాలయ వ్యవహారాలకో చెప్పరాని జాప్యంజరుగుతూవచ్చింది.

మన సంస్థపట్ల మనం ఎంతో శ్రద్ధచూపవలసిన ఈ సమయంలోన ప్రధానకార్యాలయంలో కార్యకలాపాలు ఎంతో అసంతృప్తికరంగా నిర్వహించడం శోచనీయం.

ఇక, మనలను ఎదుర్కొంటున్నసమస్యలు అనేకం ఉన్నవి. సంస్థానాలసమస్య, హిందూముస్లింసమస్య, కార్మికులసమస్య, కర్షకుల సమస్య— ఈ సమస్యలన్నిటిని మనం పరిష్కరించుకోవలసిఉన్నది. ఈసమస్యలనుగురించి అనేక భిన్నాభిప్రాయాలున్నవి. విభిన్నవర్గాల మధ్య ఘర్షణవైతం ఉన్నది. మీ సహాయంలో విభిన్నాభిప్రాయాలు గల ఈ సమస్యలనుగురించి మీకు నిశ్చితాభిప్రాయాలేమైనా ఉన్నవా ?

బొంబాయి వాణిజ్యతగాయిదాల బిల్లువిషయాన్ని పరిశీలించుదాము. ఈ బిల్లుకుసంబంధించిన కొన్నిభాగాలు నాకు అంగీకారయోగ్యంగా లేవు. నేను ఇక్కడ ఉండిఉన్నట్లయితే, ఆ భాగాలను మార్పుచేయించడానికి శాయశక్తులా ప్రయత్నించిఉండేవాణ్ణి. ఈ భాగాలు మీకుసైతం అంగీకారయోగ్యంగాలేవా ? అయితే, ఈ భాగాలను మార్పుచేయించడానికి మీరుకూడా ప్రయత్నించారా? వివిధరాష్ట్రాలలోని—బెంగాల్‌తోసహా—వ్యావసాయికపరిస్థితులనుగురించి మీ నిశ్చితవైఖరి ఏమిటో నాకు తెలియదు.

రాష్ట్రాలలోని కాంగ్రెసుప్రభుత్వాలలో కొద్దిపాటి గడ్డుపరిస్థితులు ఏర్పడుతున్నవి. సంస్థానాలలో ఉద్యమం అభివృద్ధిచెందుతున్నది. తత్ఫలితంగా ఒక పెద్ద గడ్డుపరిస్థితి ఏర్పడి, ఆ విషవర్తులంలో రాష్ట్రప్రభుత్వాలతోపాటు మనమంతాకూడా చిక్కుకునే ప్రమాదం లేకపోలేదు. ఇట్టి పరిస్థితులలో మనం ఎట్టిమార్గాన్ని అనుసరించవలెనని మీరు భావిస్తున్నారు? బెంగాల్‌లో మిశ్రమప్రభుత్వాన్ని ఏర్పాటుచెయ్యవలెననే మీ కోరిక కాంగ్రెసు రాజ్యాంగతత్వంవైపు మొగ్గుచూపుతున్నదని మీరు తెలిపిన నిరసనకు అనుగుణ్యంగాలేదు.

సాధారణపరిస్థితులలో అది మితవాదచర్యే కాగలదు. అందులోనూ పరిస్థితులు త్వరితంగా పరిణమిస్తున్న ఈసమయంలో అది తప్పక మితవాదచర్యే అవుతుంది.

ఇక, విదేశాంగవిధానాన్నిగురించినసమస్య ఉన్నది. విదేశవిధానానికి నేను ఎంతో ప్రాముఖ్యాన్నిఇస్తానని మీకు తెలుసును.

ముఖ్యంగా ప్రస్తుతపరిస్థితిలో విదేశాంగవిధానానికి నే నెంతో ప్రాముఖ్యమిస్తాను. నాకు తెలిసినంతవరకు మీరుకూడా విదేశవిధానం ఎంతో ప్రముఖమైనసమస్యగా భావిస్తారు. అయితే, విదేశవిధానంపట్ల మీ వైఖరి ఏమిటో నాకు స్పష్టంగా తెలియదు. గాంధీజీవైఖరి నాకు తెలుసును. నేను ఆయనవైఖరిని పూర్తిగా అంగీకరించను. అయినప్పటికి అంతర్జాతీయంగా గడ్డుపరిస్థితి ఏర్పడిన రెండుమూడుసంవత్సరాలు మేము

ఏదోఒకవిధంగా కలిసి పనిచేయగలిగాము. కొన్నిభేదాభిప్రాయాలు ఉన్నప్పటికీ ఆయన నా పై ఖరిని అంగీకరిస్తూవచ్చారు.

ఇదేకాదు—ఇంకా యిలాంటివి అనేకసమస్యలు నా మనస్సులో మొలకెత్తుతూఉంటాయి. నేనేకాక ఇతరులుకూడా ఈ సమస్యలతో సతమతమవుతున్నారు. ఎన్నికలలో మీకు వోటుచేసినవారుకూడా ఈ సమస్యలతో సతమతమవుతూఉన్నారు. కాంగ్రెస్‌లో కొన్నిసమస్యలవిషయంలో వీరిలో చాలామంది మరోవిధంగా ఓటుచేయడానికి అవకాశంలేకపోలేదు. అప్పుడు కాంగ్రెస్‌లో ఒక క్రొత్తపరిస్థితి ఏర్పడిఉండేది.

వర్కింగ్‌కమిటీనిర్మాణం అనేకసమస్యలతో కూడుకునిఉన్నది. వర్కింగ్‌కమిటీ నిర్మాణానికిసంబంధించిన సమస్యలన్నిటిలోకీ అతి ముఖ్యమైనది, కాంగ్రెస్‌విశ్వాసాన్ని, ఎ. ఐ. సి. సి. విశ్వాసాన్ని చూరగొనగల కమిటీని ఏర్పాటుచేయగలగడం. ప్రస్తుతపరిస్థితులలో ఇదే కొండంతపని. ప్రజలచే బాధ్యతాయుతులైనవ్యక్తులుగా పరిగణింపబడని వారిలోను మితవాదులను విమర్శింపడం మినహా, మరేవిధమైన ప్రాముఖ్యమూ లేనివారిలోను, వర్కింగ్‌కమిటీని ఏర్పరిచి ప్రజలను అవస్థపెట్టడం శ్రేయస్కరమైనపనికాదు. ఇలాంటికమిటీ వామవర్గీయుల విశ్వాసాన్నికాని మితవాదులవిశ్వాసాన్నికాని చూరగొనలేదు. ఈవిధమైనకమిటీ ఛిన్నాభిన్నమైనా కాగలదు, లేదా నామరూపాలులేక నశించిపోగలదు.

సంస్థానాలసమరం మరింత ఉధృతరూపాన్ని పొందడంతో, గాంధీజీ, వల్లభాయ్ సంస్థానాలపోరాటంలో మరింతగా నిమగ్నులయ్యే అవకాశంఉన్నది. అప్పుడు భారతరాజకీయరంగంలో సంస్థానప్రజల పోరాటం ప్రధానభూమికను వహించగలదు. అటువంటిపరిస్థితులలో ఇతరులతో ఏర్పాటుచేయబడిన వర్కింగ్‌కమిటీ, నిష్ఫలంకావచ్చును; లేదా, అది ప్రాధాన్యాన్ని కోల్పోవచ్చును. గత దశాబ్దంనుంచి వర్కింగ్‌కమిటీ భారతీయులదృష్టిలోను, ఇతరులదృష్టిలోను అత్యున్నతమైనస్థానాన్ని ఆక్రమించిఉన్నది. వర్కింగ్‌కమిటీనిర్ణయాలకు ఆదేశాలకు అందరూ ఎంతో ప్రాముఖ్యాన్నిఇచ్చేవారు. వర్కింగ్‌కమిటీ ఆదేశపూర్వకంగా ఒక్కమాట అన్నదీఅంటే ఆమాటకు ఎంతో శక్తి, అధికారమూ

ఉండేవి. వర్కింగ్‌కమిటీ ప్రగల్భాలుపలకకపోయినా. వర్కింగ్‌కమిటీ ఒక్కమాట అంటే, ఆమాటకు బలంఉండేది. ఆ మాట అయితీరేది. వామవర్గీయులని పిలవబడుతున్న మనవారికి తీవ్రవవజాలంలో ఉన్నంత నమ్మకం మరిదేనిలోనూ లేదేమో అనుకుంటాను. నారిమన్‌కోవకుచెందిన ప్రజాసేవకులపట్ల నాకు ఏమాత్రం సానుభూతిలేదు. ఇలాంటిప్రజాసేవకుడు — ఇతనొక్కడే కాదు — చాలామంది ఉన్నారు.

ఏమైనా, మనం ఒక విషమవ్యూహంలో చిక్కుకున్నాము. ఈ విషమవ్యూహంనుంచి బైటపడేమార్గం ప్రస్తుతం నాకు కనుపించడంలేదు. ఈ వ్యూహంనుంచి బైటపడదానికి నేను నా శాయశక్తులా ప్రయత్నిస్తాను. కాని, ముందుమార్గాన్ని చూపవలసింది మీరు; మీరు ముందుమార్గాన్ని చూపినతరువాత ఆ మార్గం అనుసరణీయమా కాదా అన్నవిషయాన్ని ఇతరులు నిర్ణయించుకోగలరు. అందుచేత పరిస్థితిని, పరిస్థితిలో అంతర్నిహితమైఉన్న అనేక క్లిష్టవిషయాలను, వివిధసమస్యలను ఆమూలాగ్రంగా పరిశీలించి, నాకు వివరంగా మీ అభిప్రాయాన్ని తెలుపుతూ ఒకలేఖ వ్రాయవలసినదిగా కోరుతున్నాను. ఆ లేఖను ప్రచురించవలసిన అవసరం వుండదు. కాని దాన్ని మీతో సహకరించవలసినదిగా, మీరు కోరుతున్న వ్యక్తులకు తప్పకుండా చూపించవలసివుంటుంది. ఇలాంటిలేఖ,మనచర్చలకు ప్రాతిపదికకాగలదు. ఈ చర్చలు, ఈవిషమపరిస్థితులనుంచి బయటపడేమార్గాన్ని మనకు చూపగలవు. కేవలం, ముఖాముఖిచర్చలవల్ల అంత ఉపయోగంవుండదు. అవి అస్పష్టంగా వుంటాయి. తరచు అపార్థాలకు దారితీస్తాయి. ఇప్పటికే, మనమధ్య కావలసినంత అస్పష్టత ఉండనే వుంది. బ్రిటిష్‌ప్రభుత్వానికి తుదిహెచ్చరికను యిచ్చేవిషయంలో, మీరు చేసినసూచన మరింత వివరంగా తెలియచేయవలసినదిగా కోరుతున్నాను. ఈవిషయంలో ఎటువంటి నిర్దిష్టపథాన్ని అనుసరించాలని మీరు వాంఛిస్తున్నారు? అటుపిమ్మట మీ రేమిచేయదల్చుకున్నారు? నే నింతకు మునుపు, మీకు చెప్పినట్లుగా, ఈ విషయమై మీరు కావించిన సూచన నాకు నచ్చలేదు. మీరు మరింత వివరంగా ఈవిషయాన్ని తెలుపగలిగినట్లయితే, నే నీవిషయాన్ని సమగ్రంగా అర్థంచేసుకోగలనేమో! పత్రి

కలలో ప్రచురితమైన మీ ప్రకటనను చూచాను. అస్పష్టమైన ఆ ప్రకటన ద్వారా మీ వైఖరిని అర్థంచేసుకోవడం కష్టంగావుంది. అందుచేతే, మీ వైఖరిని సమగ్రంగా స్పష్టీకరించవలసిందిగా కోరుతున్నాను.

ప్రజలకుసంబంధించిన వ్యవహారనిర్వహణసందర్భంలో మనం కొన్నిసూత్రాలను, విధానాలను అనుసరించవలసివుంటుంది. ఒకరినొకరం అర్థంచేసుకుని, సహచరులనిజాయితీపట్ల విశ్వాసంవుంచవలసివుంటుంది. ఈ విశ్వాసం, అవగాహన, లోపించినట్లయితే అవకాశాన్ని సద్వినియోగంచేసుకోవడం కష్టతరంకాగలదు. కలిసికట్టుగాపనిచేసే సహచరులమధ్య అవగాహన విశ్వాసాలుండడం ఎంతో అవసరమని, నా పరిశీలనవల్ల, అనుభవంవల్ల నేను గ్రహించగలిగాను. మనకుసంబంధమున్నవ్యక్తిమీద మనకు విశ్వాసంలేకపోయినతరవాత, మనకు చక్కటి అభిప్రాయాలు, సూత్రాలు, నియమాలు వుంటేమట్టుకు ఏమిప్రయోజనం? అనేక రాష్ట్రాలలో రాజకీయపక్షాలపోటీలు, తగువులు ఈ విషయాన్ని తేటపరుస్తున్నాయి.

సాధారణంగా ఎంతో నిజాయితీ, నీతిగలవ్యక్తులుకూడా పార్టీ పోటీలలోకి దిగి, నీతిని నిజాయితీని పూర్తిగా కోల్పోయి ప్రవర్తించడం, ఒకరిమధ్య ఒకరికి తీవ్రమైన విరోధభావం ఏర్పడడము మనము చూస్తూనేఉన్నాము. ఇలాంటి రాజకీయాలను నేను ఇసుమంతైనా సహించలేను. అందుచేతనే ఇన్నిసంవత్సరాలనుంచి ఇలాంటి రాజకీయాలకు పూర్తిగా దూరంగాఉంటున్నాను. నన్ను బలపరచడానికి, ఒకవ్యక్తితో కాని, లేక ఒకవర్గంతోకాని, నేను వ్యక్తిగతంగామాత్రమే వ్యవహరించగలను. అనేకులవిశ్వాసాన్ని చూరగొనేఅదృష్టం నాకు ఉన్నప్పటికి నేను వ్యక్తిగతంగామాత్రమే వ్యవహరించగలను. రాష్ట్రాలలో ఏర్పడిన ఈ పతనస్థితి ఇప్పుడు యావద్భారతస్థాయికికూడా వ్యాపిస్తున్నది. ఈపరిస్థితి నాకు అమితమైన విచారాన్ని కలిగిస్తున్నది.

ఇక మరి, రాజకీయసమస్యలుమాత్రమే కాకుండా, మానసికమైన సమస్యలుకూడా ఉన్నవి. ఈ సమస్యలను పరిదిద్దుకొనడం మరెంత కష్టతరం. మనఃస్పర్థలు లేకుండాఉండవలెనంటే విస్పష్టంగా మనసువిప్పి

ఉన్నమాటఉన్నట్టుగా చెప్పుకోవడం ఒక్కటే మార్గం. ఈవిషయంలో మనమందరమూ నిష్కపటంగా ఉండగలమని ఆశిస్తాను.

ఈ ఉత్తరానికి మీరు వెంటనే జవాబువ్రాయాలని నేను కోరడం లేదు. మీ రీ లేఖకు జవాబువ్రాయడానికి కొన్నిరోజులు పట్టవచ్చును; కాని, లేఖ చేరినట్లుగా నాకు తెలుపవలసిందని కోరుచున్నాను.

ఇట్లు, ప్రేమతో,
జవహర్

## 250. వల్లభ్‌భాయ్‌పటేల్‌నద్దనుంచి

బొంబాయి,
ఫిబ్రవరి 8, 1939

నా ప్రియమైన జవహర్,

సంయుక్తప్రకటనపై సంతకంచేయవలసిందిగాను, లేకున్న మరొకప్రకటన వ్యక్తిగతంగా అందచేయవలసిందిగాను, మిమ్మల్ని కోరుతూ నేను వ్రాసినలేఖకు జవాబుగా మీరు వ్రాసిన కడపటిలేఖ నేను బార్డోలిలో ఉండగా నాకు చేరినది. బాపూ కోరినమీదట, మీకు నేను ఆ సూచనచేశాను. మీరు వ్రాసినజవాబు ఆయనకు చూపాను. నా అభిప్రాయాన్ని తెలుపుతూ మీకు లేఖవ్రాయమని, ఆయన నన్ను కోరారు. ఆ జవాబు ఆయనకు సంతృప్తికలిగించలేదు. కాని ఇక ఈవిషయంలో మీతో ఉత్తరప్రత్యుత్తరాలుజరిపి, మీకు నేను కష్టంకలిగించదలుచుకోలేదు. ఆయన కోరినమీదటనే, సంయుక్తప్రకటనకూడా అందజేయబడింది. నాపై నిందలువిసరడానికి ఇది మరొకసాకు కాగలదనికూడా నేను ఆయనతో చెప్పిఉన్నాను. కాని ఆయన నన్ను ఒత్తిడిచేశారు. నేను శిరసావహించాను .మౌలానా చివరిక్షణంలో ఉపసంహరించుకున్నారు.

మనం ఓడిపోయినందుకు నాకు నిజంగా సంతోషంగాఉన్నది. ఏకీభావంగల వర్కింగ్‌కమిటీ లేనిదే పనులు సాగవు. ఇలాంటిఅవకాశం కొరకు నే నెప్పుడూ భగవంతుణ్ణి ప్రార్థిస్తూవచ్చాను.

కాని, వామవర్గీయులమని చెప్పుకునేవారు ఇందుకొరకు అనుసరించినమార్గము ముఖ్యంగా నాకు చెప్పరాని ఏవగింపును కలిగిస్తున్నది. ఇంతేకాదు; బ్రిటిష్‌ప్రభుత్వంతో చేతులుకలిపి కుట్రలోకిదిగినామని మాపై నేరారోపణచేశారు. అంతేకాక తాత్కాలిక సమాఖ్యను ఏర్పాటుచేసిన అధ్యక్షుడు అనుసరించినమార్గంకూడా నాకు అసహ్యతను కలగజేసింది. మా శత్రువులుకూడా మేము నిజాయితీగలవారమనేకీర్తిని మాకు ఇచ్చారు కాని, మా అధ్యక్షుడుమట్టుకు మాపట్ల ఆపాటి సానుభూతినికూడా చూపలేదు. ఏమైనా, ఇకనుండు మా కర్తవ్యాన్నిగురించి మాకు ఏవిధమైనసంశయాలూ లేవు. తనకు మేము అడ్డుగాఉన్నపరిస్థితులలో కమిటీనుంచి వైదొలగిపోగలమని నేను సుభాస్‌కు వ్రాశాను. నేను నిన్న జీవత్‌కు పంపిన ఆ లేఖయొక్క ప్రతిని జీవత్ మీకు చూపగలడు.

ఈవిషయాన్నిగురించి మీ అభిప్రాయం ఏమిటో నాకు తెలియదు. కాని మేము చేయదలుచుకున్నదానికి మమ్మల్ని, మీరు నిందించరనిమాత్రం ఆశిస్తున్నాను.

తిట్లనూ, శాపనార్థాలనూ భరించడం నా వంతులాగవుంది. బెంగాలీ పత్రికలు నాపై నిప్పులుకురిపిస్తూఉన్నవి. నారిమన్, ఖరేలసంఘటనలకు నేనే కాక నా సహచరులందరూ కారణమైనా నేనొక్కణ్ణేకారకుడనైనట్లు నన్ను ఆడిపోస్తున్నవి. నిజానికి ఖరేఉదంతం సుభాస్‌సమక్షంలోనే జరిగింది. ఈ వ్యవహారమంతా, సుభాస్, తనచేతులతో తానే నడిపించాడు.

బరోడాలోకూడా నాకారణంగా పెద్ద తుఫానురేగింది. మహారాష్ట్రీ పత్రికలు నాపై నిప్పులుకురిపిస్తున్నవి. మహారాష్ట్రులు నా నెత్తురు చూడడానికి సిద్ధంగాఉన్నారు.

రాజకోటఫలితంగా కథియవార్ యావత్తూ ప్రజ్వలితమైంది. ప్రజానీకంలో అద్భుతమైన చైతన్యంకలిగింది. బ్రిటిషురెసిడెంట్లజోక్యం లేకుండాఉంటే, సంస్థానాధీశ్వరులు దారికొగ్గిఉండేవారే.

మీ ఆరోగ్యం బాగాఉన్నదనుకుంటాను.

ఇట్లు

వల్లభాయ్.

251. సుబాస్‌చంద్రబోస్‌వద్దనుంచి

చారమ్. గయజిల్లా
ఫిబ్రవరి 10, 1939

నా ప్రియమైన జవహర్,

మీరువ్రాసిన సుదీర్ఘమైనలేఖను నేను కలకత్తాలో అందుకున్నాను. నేను సరిదిద్దుకోవలసిన కొన్నిలోపాలనుగురించి మీరు మీ లేఖలో ప్రస్తావించారు; ఆ లోపాలు నేను బాగా గుర్తెరిగినవే. కాని జరిగినకథ మీరు అనుకున్నదిమాత్రమే కాదు. కథకు మరోవైపుకూడా ఉన్నది. ఆప్రక్కనుంచికూడా మీరు చూడాలి. ఇంతేకాక, నేను సరిపెట్టుకొనవలసివచ్చిన అవరోధాలనుకూడా ఈసందర్భంలో విస్మరించరాదు. ఆ విషయాలనుగురించి నేను ఈ లేఖలో ప్రస్తావించదలుచుకోలేదు. అలా ప్రస్తావించడం అనవసరమైన వివాదానికి దారితీయవచ్చును. లేక నేను ఇతరులనుగురించి కొన్నిఅభిప్రాయాలను చెప్పవలసిరావచ్చును. ఇప్పుడు అసలు ముఖ్యంగా మనం శ్రద్ధవహించవలసినవిషయం త్రిపురికాంగ్రెస్‌కు కార్యక్రమాల్ని ఏర్పరుచుకొనడం. జయప్రకాశ్ 12వ తారీఖున మిమ్మల్ని కలుసుకొనగలడు. కార్యక్రమాన్నిగురించిన నా అభిప్రాయాలను ఆయన మీకు తెలియపరచగలడు. అప్పుడే నేనుకూడా మిమ్మల్ని కలుసుకొనదలిచాను. కాని బహుశా, సాధ్యపడకపోవచ్చును; ఏమైనా, 20వ తారీఖున అలహాబాద్‌లో మిమ్మల్ని కలుసుకోడానికి ప్రయత్నిస్తాను.

రాజకోట్‌నుగురించిన మీ పత్రికాప్రకటనను చూచాను. నా దృష్టికి ప్రకటన అద్భుతంగాఉన్నది. కాని ప్రకటనలో ఒక చిన్న లోపం మాత్రం ఉన్నది. బ్రిటిష్‌ప్రభుత్వం కాంగ్రెస్‌ను సంస్థానాధీశులద్వారా పోరాడవలెనని ఉద్దేశిస్తున్నది. కాని మనం సంస్థానాధీశులవలలో చిక్కుకొనకుండా జాగ్రత్తవహించాలి. సంస్థానాలసమస్యలవిషయంలో సంస్థానాధీశులపై ఒకవైపునుంచి పోరాటాన్నిసాగిస్తూ మరొకవైపునుంచి స్వరాజ్యసమస్యను పురస్కరించుకుని బ్రిటిష్‌ప్రభుత్వంపై సవాల్

విసరవలసిఉంటుంది. ఈఅంశం మీ పత్రికటనలో ఉన్నట్లు నాకు తోచ లేదు. స్వరాజ్యపోరాటాన్ని నిలిపివేసి ప్రత్యేకించి సంస్థానాలసమస్య లను పురస్కరించుకుని బ్రిటిష్‌ప్రభుత్వంపై, సంస్థానాధీశులపై పోరా టాన్ని మనం ప్రారంభించినచో ప్రధానమైనపోరాటపథాన్నుంచి మనం వైదొలిగేప్రమాదం ఉన్నది. సమక్షంలోమరికొన్నివిషయాలు మాట్లాడుకో వచ్చును.

ప్రేమతో,

సుభాస్.

252. వై టి. యూవద్దనుంచి

జాతీయకమిటీ
చైనా యువక్రైస్తవసంఘం,
131, మ్యూజియంరోడ్, షాంగే,
ఫిబ్రవరి 23, 1939.

ప్రియమైన నెహ్రూ,

మిమ్మల్ని బార్డోలిలో కలుసుకున్నపిదప, నేను తిరిగి క్షేమంగా సుఖంగా ఇంటికి చేరుకున్నాను. బార్డోలిలో అనేక కార్యకలాపాలలో మునిగిఉండికూడా, మీరు మాకు ఇంటర్వ్యూఇచ్చినందుకు మళ్ళీ ఒక మారు మీకు నా అభినందనలు తెలియపరుస్తున్నాను. స్టీమర్‌వద్దకు మీరు సందేశంపంపినందుకుకూడా నా ధన్యవాదాలు. ఆ సందేశమూ, మిస్టర్ సాయ్‌కు మీరుపంపిన సందేశము, చైనాభాషలోకి తర్జుమాచేయబడి, సింగపూర్, హాంగ్‌కాంగ్, షాంగేలలోని చైనాపత్రికలలోను, విదేశపత్రి కలలోను ప్రచురించబడినవి.

మీ స్వీయచరిత్రను చైనాభాషలోకి తర్జుమాచేసేవిషయంలో మనము మాట్లాడుకున్నవిషయాలను స్థిరీకరిస్తూ ఇప్పుడు నేను మీకు వ్రాస్తు న్నాను. త్వరలోనే మేము ఈ కార్యక్రమాన్ని ప్రారంభించగలము. ఈ సమాచారాన్ని మీ ప్రచురణకర్తలకు తెలుపవలెనని మీరు కోరినట్లు నాకు తెలిపింది. బార్డోలిలో నేను మిమ్మల్నికలుసుకున్నప్పుడు మీకుచెప్పినట్లు,

అంతర్జాతీయ కాపీరైటుపథకంలో చైనా చందాదారు కాదు. ఇంతవరకు కూడా, ఇతరభాషలరచయితలతో ప్రచురణకర్తలు సంప్రదించకుండానే గ్రంథాలు చైనాభాషలో తర్జుమాచెయ్యబడుతున్నవి. కాని, మా సంఘం మటుకు రచయితలకుమాత్రం ఈ విషయాన్ని తెలిపి, వారిగ్రంథాల తర్జుమాలప్రతులను వారికి పంపే ఆచారాన్ని అనుసరిస్తున్నది. కేవలం మర్యాదచిహ్నంగామాత్రమే ఈ ఆచారాన్ని అనుసరించడం జరుగుతున్నది.

ప్రజలకు అందుబాటులోఉండేధరకు గ్రంథాన్ని విక్రయించగలిగే నిమిత్తం, తర్జుమాను కొంత సంక్షిప్తంచెయ్యవలసిఉండవచ్చును. మీకు సమ్మతంకాకపోతే, మేము ఇలా చెయ్యదలుచుకోలేదు. కొన్నిసంవత్సరాలక్రితం శ్రీ గాంధీజీస్వీయచరిత్ర చైనాభాషలోకి తర్జుమాచెయ్యబడి చైనాప్రజలను ఉద్దీప్తంచేసినట్లే, ఈ గ్రంథంకూడా చైనాప్రజలను ఉత్తేజపరచగలదని విశ్వసిస్తాము.

గౌరవపురస్సరంగా

ఇట్లు,
వై. టి. యూ. ప్రధానసంపాదకుడు

## 253 శరత్ చంద్రబోస్ కు

అలహాబాద్,
మార్చి 24, 1933

నా ప్రియమైన శరత్,

గాంధీజీ మౌలానాఅజాద్‌ను కలుసుకొనడంకొరకు నేటిఉదయం ఇక్కడకు వచ్చారు. మార్చి 21న మీరు ఆయనకువ్రాసిన లేఖను నాకు చూపారు. ఆ లేఖను చదువుతున్నప్పుడు నాకు ఎంతో విచారమూ, ఆశ్చర్యమూ కలిగాయి. విధానానికిసంబంధించినవిషయాలలోను, కార్యక్రమానికి సంబంధించినవిషయాలలోను, నాయకశ్రేణిలోఉన్న కాంగ్రెసువాదుల మధ్య అభిప్రాయభేదాలున్నవనే విషయం మనకు తెలియనిదికాదు. మన విభిన్న అభిప్రాయాలను మనం అనేకపర్యాయాలు వ్యక్తీకరించాము కూడా; అయినప్పటికి మనమంతా కలిసికట్టుగా ప్రయాణంచెయ్యగలిగాము.

సాధారణంగా గాంధీజీచెప్పినకార్యక్రమాన్ని కాంగ్రెసు అనుసరిస్తూవచ్చేది. అన్నివిషయాలలోను, ఆయననాయకత్వం అనుసరించబడుతూవచ్చేది. మనలనందర్నీ ఒకచోటచేర్చగల అనుబంధం ఉంది, మనమంతా కలిసి పనిచేయుగలిగినప్పుడు మనకు విభిన్నమైనఅభిప్రాయాలుండడంలో ప్రమాదమేదోవున్నట్లు నా కనిపించదు. ఇంతేకాదు, మన ఉద్యమం నానాటికీ శక్తివంతంగా రూపొందుతున్నలక్షణాలుకూడా కనిపిస్తున్నాయి. కాని, మీరు గాంధీజీకి వ్రాసినలేఖలో, విధానానికిసంబంధించిన ప్రస్తావనకాని కార్యక్రమానికిసంబంధించినప్రస్తావనకాని కనిపించదు. మీ లేఖనిండా, వ్యక్తులను సూచించినసమస్యలే వున్నాయి. పైగా కొందరు వ్యక్తులపై మీరు తీవ్రమైన ఆరోపణలుసైతం చేశారు. ఈ ధోరణి చర్చలకు, సమస్యాపరిష్కారానికి తగినవాతావరణాన్ని కల్పించకపోగా, వాటిని మరింతఅధోగతికి తీసుకుపోతున్నది. వ్యక్తులమధ్య, లేదా, వర్గాలమధ్య ఒకరిపై ఒకరి కీవిధంగా అభిప్రాయాలున్నట్లయితే,అందరూకలిసి, సమష్టిగా నిర్వహించవలసిన కార్యంలో, సహకరించుకోవడమన్నది పొసగదు. ఈవిషయంపై, సుభాష్ అభిప్రాయాలకు, మీ లేఖలోని అభిప్రాయాలు అనుగుణంగావున్నవో, లేవో నాకు తెలియదు. ఏమైనా మీరు, మీ లేఖలో ప్రస్తావించిన వ్యక్తిగతసమస్యలు పరిష్కారంకానిదే, సచేతనమైన సహకారానికి అవరోధం తొలగిపోదన్నవిషయం స్పష్టంగా కనిపిస్తోంది.

వ్యక్తిగతసమస్య మీ లేఖలో మరింత తీవ్రరూపంలో చిత్రించబడింది. ఈసమస్య ఈనాటికీ నిన్నటిదీకాదు. ఇంతకుముందునుంచీ, ఈ సమస్య ఇలాగ వుంటూనేవచ్చింది. అయితే త్రిపురి కాంగ్రెస్లో ఈ సమస్య ప్రధానమైనదిగా రూపొందింది. అధ్యక్షుని ఎన్నికకుపూర్వం, రెండుమూడురోజులక్రితం, నేను సుభాస్ను కలుసుకున్నప్పుడు, ఈసమస్యయొక్కప్రాధాన్యాన్ని గుర్తించగలిగాను, దీనిని వెంటనే పరిష్కరించవలసిందిగా, ఆయన్ని ప్రాధేయపూర్వకంగా కోరాను. అనుకున్నట్లు, వెంటనే, ఫిబ్రవరి 4వ తేదీన, ఈవిషయాన్నిగురించి అతని కొకలేఖ వ్రాశాను. అతనికిసంబంధించినంతవరకు, రాజకీయసమస్యలవిషయంలో

అతను స్పష్టమైనవైఖరిని ప్రకటించలేదుకనుక, నే నతనికి లేఖవ్రాయ వలసివచ్చింది. వామవర్గీయులనుగురించి, మితవాదులనుగురించి అస్ప ష్టమైనప్రస్తావన అతనిలేఖలో వున్నదేకాని. తద్వారా సమస్య స్పష్టంగా పరిష్కృతమయేసూచన కనిపించడంలేదు. అంతేకాక,అతనుపేర్కొన్న వ్యక్తిగతవిషయాలనుగురించికూడా నేను, నా లేఖలో ప్రస్తావించాను.

"ప్రజలకుసంబంధించినవ్యవహారనిర్వహణసందర్భంలో, మనం కొన్నిసూత్రాలను, విధానాలను అనుసరించవలసివుంటుంది. ఒకరినొకరం అర్థంచేసుకుని, సహచరులనిజాయితీపట్ల విశ్వాసంవుంచవలసివుంటుంది. ఈవిశ్వాసం, అవగాహన,లోపించినట్లయితే, అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవడం కష్టం. కలిసికట్టుగా పనిచేసుకుపోయేసహచరులమధ్య అవ గాహన,విశ్వాసాలుండడం ఎంతోఅవసరమని నా వయస్సువల్ల, అనుభవం వల్ల, నేను గ్రహించగలిగాను. మనకుసంబంధించినవ్యక్తిమీద, మనకు విశ్వాసంలేకపోయిన తరవాత, మనకు చక్కటి అభిప్రాయాలు, సూత్రాలు, నియమాలు, వుండిమటుకు ఏమిప్రయోజనం? అనేకరాష్ట్రా లలో రాజకీయపక్షాలపోటీలు, తగువులు ఈవిషయాన్ని తేటపరు స్తున్నాయి.

సాధారణంగా ఎంతో నీతి, నిజాయితీగలవ్యక్తులుసైతం, పార్టీ పోటీలలోకి దిగి, వాటిని పూర్తిగా కోల్పోయి ప్రవర్తించడం, ఒకరిమధ్య ఒకరికి అగర్భశత్రుత్వంఏర్పడడం, మనం చూస్తూనేవున్నాము. ఇలాంటి రాజకీయాలను నేను సుతరాం సహించజాలను. అందుచేతనే, ఇన్ని సంవత్సరాలనుంచి, ఇలాంటివాటికి, నేను దూరంగావుంటున్నాను. నన్ను బలపరచడానికి, ఒకవ్యక్తితోకాని, లేదా ఒకవర్గంతోకాని, వ్యక్తిగతంగా మాత్రమే, నేను వ్యవహరించగలను. అనేకులవిశ్వాసాన్నిచూరగొనే అదృష్టం నాకున్నప్పటికీ, నేను వ్యక్తిగతంగామాత్రమే వ్యవహరించగ లను. రాష్ట్రాలలో ఏర్పడిన ఈ పతనస్థితి, ఇప్పుడు యావద్భారతదేశ స్థాయికి, వ్యాపిస్తోంది. ఈ పరిస్థితి, నా కమితమైన విచారాన్నికలిగిస్తోంది.

ఇక పోతే, రాజకీయసమస్యలుమాత్రమే కాకుండా, మానసికమైన సమస్యలుకూడా కొన్నివున్నాయి. ఈసమస్యలను సరిదిద్దుకోవడం మరింత

కష్టం. మనస్పర్ధలులేకుండావుండాలంటే, నిష్కపటంగా, మనసువిప్పి మాట్లాడుకోవడం ఒకటే మార్గం. ఈవిషయంలో మనమందరమూ నిష్కపటంగా వుండగలమని ఆశిస్తున్నాను."

నే నిలాగ వ్రాసినప్పటికీ, తీరికలేనందువల్ల నేమి, మరి ఏఇతరకారణాలవల్ల నేమి, సుభాస్, రాజకీయసమస్యలనుకాని లేదా వ్యక్తిగతసమస్యలనుకాని స్పష్టీకరించలేదు. అతను తన ప్రకటనలో కావించిన ఆరోపణలు తీవ్రమైనవికావడంవల్ల వాటిని చర్చించకుండా, అలాగ ఒదిలిపెట్టడం మంచిదికాదని, వ్యక్తిగతవిభేదాలను నిష్కపటంగా చర్చించవలసిందని నేను, అతను గాంధీజీని చూడ్డానికి వార్ధావెడుతున్నసందర్భంలో అతన్ని కోరాను. పిమ్మట అతడిచ్చిన సంజాయిషీలు, పరిస్థితులను ఏమాత్రం మార్చలేదు. అతను తాను ఈవిషయాన్ని గాంధీజీతో చర్చించగలనని వాగ్దానంచేశాడు. కాని గాంధీజీతో చర్చలుజరిగినప్పుడు, అతడు వాటి దరిదాపులకైనా పోలేదని ఆతర్వాత నాకు తెలియవచ్చింది.

ఈ రీతిగా, ఈవిషయం కాంగ్రెస్‌లో చర్చకువచ్చి ఇతరసమస్యలన్నిటిని మరుగుపుచ్చింది. ఇలాగజరుగుతుందని, నేను మొదట్నుంచి భయపడుతూ నేవున్నాను. ఈవిషయంపట్ల నా వైఖరి ప్రత్యేకమైనది. నా వైఖరి నాదే. ఇరుపక్షాలకుచెందిన ఎవరిదృక్పథాన్నీ, నే నంగీకరించలేకపోయాను. అందుచేతనే, విషయనిర్ణయసభలో జరిగిన చర్చలలోకాని, కాంగ్రెస్‌మహాసభలో జరిగిన చర్చలలోకాని, నేను పాల్గొనలేదు. అధ్యక్షుడు తన సహచరులపై చేసిన ఆరోపణలు సబబైనవికావని, వాటిని అతను తప్పక ఉపసంహరించుకోవలసిందని, నేను అంతఃకరణశుద్ధిగా భావించాను. అధ్యక్షునికోరకపు, అనుసరించవలసిన కార్యక్రమాన్ని ఇంగ్లీషులో సభికులకు తెలియపరచడానికిమాత్రమే, నేను కాంగ్రెసు బహిరంగసభలో జోక్యంకలగజేసుకున్నాను. నేను ఏమిచెప్పనున్నానో తెలుసుకోకుండానే, సభలో గల్లంతు చెలరేగింది. అది ముందుగా ఏర్పాటుచేయబడినఅల్లరి. కొన్నివేలమంది ప్రతినిధులు, ప్రేక్షకులు నేను చెప్పనున్నవిషయాన్ని ప్రశాంతంగా వినడానికి సంసిద్ధులైవున్నప్పుడు, కొద్దిమందిప్రతినిధులు, గల్లంతుచేసినప్పటికిన్నీ, నేను నా

ప్రసంగాన్ని ఆపివేయడం భావ్యంకాదని భావించాను. అందువల్ల, ఒక గంట గంటన్నరసేపు, నేను ప్రసంగించాను. ఇది రౌడీచర్యఅని, ఫాసిస్టు ప్రవర్తన అని, నేను మీతోఅన్నప్పుడుమటుకు, కొద్దిక్షణాలసేపు ఉద్రిక్తుడనయాను. అప్పుడు ఆమాటలు, నా ప్రక్కనున్న మీతో అన్నానేకాని, సభికులతో అనలేదు. అయితే దూరశ్రవణయంత్రంద్వారా, కొన్నిమాటలు సభికులకు వినిపిస్తే వినిపించివుండవచ్చును. నే నలాఉద్రిక్తుడనైనందుకు విచారిస్తున్నాను. కాని అలాగ నేను ఉద్రిక్తుణ్ణికావడంవల్ల ఎంతబాధను నేను ఓర్చుకోవలసివచ్చిందో మీరు గ్రహించాలి మరి.

ఈ సంఘటనలతో నాకు వ్యక్తిగతంగా, సంబంధమున్నదికనుక, నే నీవిషయా న్నంతదీర్ఘంగా వివరించాను. మీరు మీలేఖలో వ్రాసిన ఇతర విషయాలు నాకు పూర్తిగా తెలియవు. మీరుచేసిన ఆరోపణలు నా కెంతో ఆశ్చర్యాన్నికలిగించాయి. ఆ ఆరోపణలు నిజమైనవని నేను నమ్మలేక పోతున్నాను. కాంగ్రెసుమహాసభలసందర్భంలో ఓట్లకోసం బాహాటంగా ప్రచారంజరిగిందని, ఓట్లసంపాదనార్థం మంచిచెడ్డల తారతమ్యం లేకుండా అనేకవిధాల ప్రచారంజరిగివుంటుందని అనుకుంటాను. సహజంగా ఇలాంటివిషయాలపట్ల నాకు ఏవగింపువుండడంవల్ల, నేను వీటికి దూరంగావున్నాను. మొదట్లో యు. పి. సి. సి. సమావేశానికి హాజరు కావడానికి తప్ప, నేను ప్రతినిధులశిబిరాలకుపైతం వెళ్ళలేదు. పాత వర్కింగ్‌కమిటీలోని ప్రధానసభ్యులుకొందరిపై, మీరు కొన్ని ఆరోపణలుచేశారు. నాకు వాటివిషయమేమీ తెలియదు. అయినా, ఋజువు చేయతగ్గ, స్పష్టమైనసాక్ష్యాధారాలులేనిదే, వ్యక్తులపై ఇలాగ ఆరోపించడం సులువైనపనికాదు. ఈ విషయంలో మీరు నాతో ఏకీభవిస్తారనుకుంటాను. కాంగ్రెసుసభలప్పుడు, సుబాస్‌కు జబ్బుగావుండడం కపటనాటకమని ఎవరైనా అంటే అది కేవలం అసందర్భం. నా సహచరులెవరూ సూచనప్రాయంగానైనా, ఈవిషయాన్ని నాతో అనలేదు. నిజానికి అతనికి జబ్బుగాఉన్నందుకు మేమంతా, ఎంతో ఆందోళనచెందాము. భూలాభాయ్‌దేశాయ్ ఏదోఅన్నాడని మీరన్నారు. అందుకు సమాధానంచెప్పుకోవలసినబాధ్యత ఆయనది; ఆయన ఆవిధంగా అనివుంటారని నే నూహిం

చలేను. కాబట్టి ఆయన ఆవిధంగా అనివుంటారని, మీరు అనుకోవ డంలో పొరబడివుండవచ్చునని నే ననుకుంటాను.

తాత్కాలికఅధ్యక్షుని అనుశాసనాలనుగురించి, లేదా, ప్రవర్తనను గురించి నా అభిప్రాయాన్ని వెలిబుచ్చడం, నా బాధ్యతకాదు కాని, ఆయన చాలా చిక్కుపరిస్థితులలోవుండికూడా, ఎంతో ఉదాత్తంగా, సబబుగా కార్యక్రమాన్ని నిర్వహించగలిగారని నేనంటే మీరు నాతో ఏకీభవిస్తారను కుంటాను. 'జాతీయవాంఛ' తీర్మానంపై మీ సవరణను ప్రవేశపెట్టడానికి మిమ్మల్ని, అనుమతించినపుడు ఆయ నొకఅంశాన్ని సూచించేఅవకాశం లేకపోలేదు; కాని, మీవైఖరిని మీరు కాంగ్రెసుకుతెలపడానికి మీకు పూర్తి అవకాశంవుంది. ఈ తీర్మానం ఓటింగుకువచ్చినపుడు, తీర్మానానికి వ్యతిరేకంగా మీరొక్కరుమాత్రమే ఓటుచేశారు. వామవర్గీయుణ్ణని చెప్పుకొనే కాంగ్రెసువాది ఈతీర్మానానికి ఓటుచేయడం, నాకు చెప్పరాని ఆశ్చర్యాన్ని కలిగించింది. త్రిపురిలో నే నున్నపుడు ప్రతినిధులశిబిరాల నుంచి అనేకవిధాల వార్తలు, పుకార్లు నావద్దకు చేరాయి. ఈ పుకార్లలో కొన్ని వినరానంత అసహ్యకరమైనవి. కాని ఋజువులేవిదే, వాటిని విశ్వ సించడానికి నేను నిరాకరించాను. ముఖ్యంగా మీపై విచారణార్హమైన విషయం ఒకటివుంది. అది బెంగాలుప్రతినిధులకు సంబంధించినవిష యం. బెంగాలునుంచివచ్చిన మహాసభాప్రతినిధులకు త్రిపురిలో ప్రతి నిధిటిక్కెట్లను యిచ్చినట్లు ఒకఆరోపణ గావించబడింది. ప్రతినిధులు కానివారికి ప్రతినిధిటిక్కెట్లు విరివిగా యిచ్చారని, కాంగ్రెసుమహాసభకు ప్రతినిధులను తీసుకురావడంకోసం, ధారాళంగా డబ్బుఖర్చుపెట్టారని, కొందరు బాధ్యతగలవ్యక్తులుచెప్పారు; అంతేకాక, అఖిలభారతకాంగ్రెసు కమిటీ కార్యాలయంద్వారా ఈవిషయం కొంత ధృవపడింది.

మీద్వారా, లేదా, ఇతరులద్వారా, చేయబడిన వివిధ ఆరోపణలను గురించి, ఏదో ఒకవిధమైన విచారణజరపడం ఉచితంగాఉంటుందని నా భావం. అస్పష్టంగా, ఈవిధమైన ఆరోపణలనుచేయడం సబబుకాదు. చాలామంది ఈవిధమైన ఆరోపణలు ఋజువుచేయలేకపోయినప్పటికీ

నమ్ముతూవుంటారు. పరస్పరం ఒకరినొకరు నిందించుకొనే అదోగతికి మన ప్రజాజీవితం దిగజారిపోవడం, మనం సహించలేం.

మీరు వ్రాసినలేఖలో, కాంగ్రెసుమంత్రులనుగురించి మీరు ప్రస్తా వించారు. నేను వారికార్యకలాపాలనన్నిటినీ ప్రశంసించేవ్యక్తినికాను. త్రిపురిసభలలో వారు పాల్గొనడానికి, మీరు అభ్యంతరంతెలపడం, నా కాశ్చర్యంకలిగించింది. మంత్రులైనంతమాత్రాన, వారు, కాంగ్రెసుసభ లలో పాల్గొనకూడదా? పాల్గొనకూడదనే ఈసూచన నాకు చాలావిడ్డూరంగా కనిపిస్తోంది. అంతేకాదు. ఈసూచనలు సబబైనవికూడాకాదు. నాకు తెలి సినంతవరకు, వారు, వారివ్యక్తిగతహోదాలో వ్యవహరించారు. ఈ విధంగా వ్యవహరించడానికి, వారికి పూర్తిగా హక్కుంది. మంత్రులు తమపదవులపలుకుబడిని ఉపయోగించారని మీరు మీ లేఖలో వ్రాశారు. ఈ పదాన్ని ప్రయోగించడంలో, మీ ఉద్దేశమేమిటో నాకు అవగతంకావడం లేదు. ఈవిషయం అతిక్లిష్టమైన అనేక అంతరార్థాలతోకూడుకొనివుంది. కాబట్టి ఈవిషయాన్ని మీరు స్పష్టీకరించవలసివుంటుంది. కాంగ్రెసు కార్యకలాపాలలో, మంత్రులుపాల్గొన్నంతమాత్రాన, కాంగ్రెసుపై వారు ఆధిపత్యాన్నిచలాయించాలని ప్రయత్నిస్తున్నారని ఎందుకు భావించాలో నాకు అర్థంకావడంలేదు. వా రిట్టి ఉద్దేశానికి ఎప్పుడూ ఆమడదూరంలోనే వున్నారు. దేశీయంగా, వైదేశికంగా, క్లిష్టపరిస్థితులు ఏర్పడిన ఈరోజు లలో, కాంగ్రెసువాదులమధ్య ఎంతో సహకారాన్ని సాధించాలని నే నాశించాను. త్రిపురిసభలకుపూర్వం, అటుపిమ్మట, అందుకొరకు కృషి చేశాను. వామపక్షకార్యక్రమాన్ని నిర్వర్తించవలెనన్నా, లేక ఎట్టికార్యాన్ని సాధించాలన్నా, కార్యసిద్ధికోసం మనం పనిచేయవలసివుంటుంది. మనం అట్టికృషిచేయలేకపోతే, ఎలాంటి కార్యక్రమమైనా నిష్ఫలంకాకతప్పదు. కాని ఈవిధమైన లుప్తకార్యాచరణ మనలో క్రమక్రమంగా వ్యాపిస్తోంది.

ఈకారణాన్ని పురస్కరించుకునే, త్రిపురితీర్మానాన్ని అనుస రించి వర్కింగ్‌కమిటీని ఏర్పాటుచేయడం ఉచితంగాఉంటుందని, అలా వర్కింగ్‌కమిటీని ఏర్పాటుచేయవలసిందనికోరుతూ ఢిల్లీనుంచి సుభాస్‌కు

తంతివార్తద్వారా తెలియపరిచాను. అంతర్జాతీయపరిస్థితిని పరిశీలించుటకై ఎ. ఐ. సి. సి. సమావేశాన్ని ఏర్పరచవచ్చుననికూడా సూచించాను.

కాంగ్రెసుఅధ్యక్షునికి గాంధీజీకి మధ్య సహకారంఉండవలెననే ఉద్దేశ్యంతోను, కాంగ్రెసువిధానము ప్రత్యేకమైన కొత్తమార్పులేవీ లేకుండా అనుసరింపబడవలెననే ఉద్దేశంతోను త్రిపురితీర్మానము ఆమోదించబడింది. ఇట్టిది సాధ్యంకాదనే అభిప్రాయం మీరువ్రాసినలేఖలో నిగూఢంగాఉన్నట్లు తోస్తున్నది. సుభాస్అభిప్రాయంకూడా ఇదే అవునో కాదో నాకు తెలియదు. సుభాస్ అభిప్రాయంకూడా ఇదేఅయినట్లయితే, కాంగ్రెసులో ఒక స్తబ్దస్థితి ఏర్పడినదని స్పష్టంగా చెప్పవచ్చును. ఈ స్తబ్ధస్థితిని ఎ. ఐ. సి. సి. సమావేశంమాత్రమే పరిష్కరించగలదు. అందుచేత సాధ్యమైనంతత్వరలో ఎ. ఐ. సి. సి. సమావేశాన్ని ఏర్పాటు చెయ్యడం ఉచితం.

ఇకముందు కాంగ్రెసు అనుసరింపవలసిన విధానాన్నిగురించి కార్యక్రమాన్నిగురించి, మనమనస్సులలో దాపరికంలేకుండా స్పష్టమైన అభిప్రాయాలను ఏర్పరచుకొనడం అత్యావశ్యకమైనవిషయమని ఇంతకు పూర్వం ఎప్పుడూ నేను భావిస్తూవచ్చినట్లుగానే ఇప్పుడుకూడా భావిస్తున్నాను. ముఖ్యంగా 'వామవైఖరి' అని పిలువబడుతున్నవైఖరి స్పష్టీకరించబడవలసిఉన్నది. వామపక్షీయులవైఖరిని అస్పష్టస్థితిలోనే ఉంచడము, అతివాద దుందుడుకుచర్యలకు వారిని పూనుకునేట్లు చెయ్యడం ప్రమాదకరం.

తనవైఖరిని స్పష్టీకరించవలసిందిగా నేను సుభాస్‌ను కోరాను. మిమ్ముకూడా కోరుతున్నాను. తాము వామవర్గీయులమని చెప్పుకుంటూ మితవాదవిధానాలను, పద్ధతులనూ సూచించేవారిని నేను చాలామందిని ఎరుగుదును. బెంగాల్‌లో మిశ్రమమంత్రివర్గసమస్యను తీసుకుందాము. కొన్నిపరిస్థితులలో మిశ్రమమంత్రివర్గాన్ని స్థాపించడము సమర్థనీయంకావచ్చు. కాని ప్రస్తుతపరిస్థితులలో మిశ్రమమంత్రివర్గనిర్మాణము కేవలం మితవాదచర్యమాత్రమే అవుతుంది. మహాసభఅధ్యక్షస్థాన బెంగాల్‌లో మిశ్రమమంత్రివర్గం ఏర్పాటుచేయవలెనని కోరుతూ, ఇతరరాష్ట్రాలలో,

కొన్ని లోపాలు ఉన్నప్పటికీ, ఇంతకన్న ఆరోగ్యకరమైనపరిస్థితులలో వ్యవహరిస్తున్న కాంగ్రెస్‌మంత్రివర్గాలకు మీరు అభ్యంతరం ఎంపచేత తెలుపుతున్నారో నాకు అవగతంకాకుండా ఉన్నది.

వర్కింగ్ కమిటీలోని పాతసభ్యులు కల్పించిన అవరోధాన్ని గురించి మీరు మీలేఖలో ప్రస్తావించారు. ఒకవ్యక్తికాని, లేక ఒకవర్గంకాని కాంగ్రెస్‌కు ఒకసూచనచేయడాన్ని మీరు వ్యతిరేకించనిచో, పాతసభ్యులపై మీరుచేసిన ఆరోపణలోని ఉద్దేశమేమిటో నాకు అవగతంకావడం లేదు. ఇంతకు మినహా, ఇతరవిధమైన అవరోధమేమీ నేను ఎరుగను.

మీరు మీ లేఖలో ఎంతో తీవ్రమైన పదజాలాన్ని, ఎంతో కటువైనపదజాలాన్ని ఉపయోగించారు. నేను ఈలేఖను చదివి ఎంతో విచారపడ్డాను. ఇంత కటువైనపదజాలం ఉపయోగించడంలో న్యాయమేమీ ఉన్నట్లు నాకు తోచదు. అన్నిటికన్న, నాకు ఎక్కువబాధ కలిగించినది వ్యక్తిగతసమస్యను ముందుకుతెచ్చి, రాజకీయసమస్యలన్నిటిని వెనక్కునెట్టడానికి యత్నించడం. ఒకవేళ, కాంగ్రెస్‌వాదులమధ్య ఘర్షణ ఉన్నట్లయితే, ఆ ఘర్షణ కేవలం విధానాలకు, నియమాలకుమాత్రమే పరిమితంచెయ్యబడి ఉన్నతస్థాయిలోనే ఉంచబడగలదని ఆశిస్తున్నాను.

ఈ లేఖతాలూకు ఒకప్రతిని సుబాస్‌కు పంపుతున్నాను. గాంధీజీ కూడా ఆ ప్రతిని చూచారు.

శ్రీ శరత్‌చంద్రబోస్,
కలకత్తా.

ఇట్లు,
జవహర్‌లాల్ నెహ్రూ

254. సుబాస్‌చంద్రబోస్‌వద్దనుంచి

జీల్గోరా, పి. ఒ.
జిల్లా, మాన్‌భుమ్, బీహార్,
మార్చి 28, 1939

నా ప్రియమైన జవహర్,

ఇటీవల కొంతకాలంనుంచి, మీరు నా పట్ల ఎంతో అనిష్టాన్ని పెంచుకోవడం నేను గమనించాను. ఇలాగ నేను ఎందుకు భావించవలసి

వచ్చిందని మీరు నన్ను అడగవచ్చును. నాకువ్యతిరేకమైన ప్రతిఅల్పాంశాన్ని మీ రెంతో ఉత్సాహంతో స్వీకరిస్తున్నారు. నాకు అనుకూలంగా చెప్పబడేవిషయాలను త్రోసివేస్తున్నారు. రాజకీయంగా నా వ్యతిరేకులు చెప్పేవిషయాలను అంగీకరిస్తూ, వారు చెప్పే సంగతులు నిజంకావని అనడానికి ఎన్నిఅవకాశాలున్నప్పటికీ, మీ రా మాట ఎన్నడూ అనడం లేదు. ఈ లేఖలో ఈవిషయాన్ని నేను ఉదాహరణపూర్వకంగా ఋజువు చెయ్యడానికి ప్రయత్నిస్తాను.

నాపట్ల మీరు ఇంత తీవ్రమైన అనిష్టాన్ని పెంచుకోడానికి కారణం ఏమిటో నాకు అనూహ్యంగాఉన్నది. 1937 లో నేను ఇంటర్న్‌మెంట్ నుంచి విడుదలఅయినప్పటినుంచి, వ్యక్తిగతంగాను, ప్రజాజీవితంలోను మీపట్ల ఎంతో గౌరవాన్నిచూపుతూ ఎంతో మన్ననతో ప్రవర్తిస్తూ వచ్చాను. రాజకీయంగా మిమ్మల్ని నా అగ్రనాయకునిగానేను, నాయకునిగానేను ఎంచుతూ, ఎన్నోసార్లు అనేకవిషయాలలో మీ సలహాను అర్థించాను. గతసంవత్సరం మీరు యూరోపునుంచి తిరిగివచ్చినప్పుడు "మాకు ఏమిమార్గము చూపగలరు?"—అని మిమ్మల్ని అడగడానికి అలహాబాద్ వచ్చాను. ఈవిధంగా వినమ్రంగా నేను మీవద్దకు వచ్చినప్పుడు మీరు నాపట్ల చూపవలసినవైఖరి మరోతీరుగా ఉండిఉండవలసింది. కాని మీరు నాకిచ్చిన సమాధానాలు అస్పష్టంగాను, అనిర్దిష్టంగాను ఉన్నవి. ఉదాహరణకు ఒకవిషయం చెబుతాను. గతసంవత్సరం మీరు యూరోపునుంచి తిరిగివచ్చినప్పుడు, మిమ్మల్ని నేను కలుసుకుని కొన్ని విషయాలు ప్రస్తావించగా, మీరు ఆవిషయాలకు నిర్దిష్టమైన జవాబులు చెప్పక, గాంధీజీని సంప్రదించినపిదప ఆ విషయాలకు జవాబులుచెప్ప గలనని నన్ను పంపివేశారు. మీరు గాంధీజీని కలుసుకున్నపిదప మళ్ళీ మనం వార్ధాలో కలుసుకున్నప్పుడుకూడా మీరు నా కేమీ స్పష్టంగా చెప్ప లేదు. ఆతరువాత మీరు కొన్ని తీర్మానాలను తయారుచేసి, ఆ తీర్మానాలను వర్కింగ్‌కమిటీలో ప్రవేశపెట్టారు. ఆ తీర్మానాలలోకూడా దేశానికి బాటచూపే నూతనాంశాలేవీ లేవు.

గతపర్యాయం కాంగ్రెస్‌అధ్యక్షుని ఎన్నిక జరిగినపిదప, తత్ఫలితంగా ఉత్పన్నమైన హేయమైన వివాదంలో నాకుఅనుకూలంగా కొందరు నాకువ్యతిరేకంగా కొందరు మాట్లాడారు. మీ మాటలలోను, మీ ప్రకటనల్లోను ప్రతిచిన్నఅంశమూ నాకువ్యతిరేకంగానే ఉద్దేశించబడింది. అధ్యక్షునిఎన్నిక సందర్భంలో నాతరపున ప్రచారంజరగడం, ఆ ప్రచారం నేను చేసినదైనా, నాతరపున ఇతరులుచేసినదైనా, ఆ ప్రచారంజరగడం మీకు ఇష్టంలేదని, మీరు ఢిల్లీలో ఒకసభలో ప్రసంగిస్తూ అన్నట్లు నాకు తెలియవచ్చింది. అసలు మీమనస్సులో ఉన్న ఉద్దేశమేమిటో నాకు తెలియదు కాని, ఒకవిషయాన్నిమాత్రం నేను స్పష్టంగా చెప్పగలను. డాక్టర్ పట్టాభి ఎన్నికవిజ్ఞప్తి పత్రికలలో ప్రకటితమైనతరువాతనే నా విజ్ఞప్తి పత్రికలలో ప్రకటితమైనదన్నవిషయం మీకు ఎంతమాత్రం తెలియదనిమాత్రం మీరు ఢిల్లీలోచేసిన ప్రసంగాన్నిబట్టి తెలుస్తున్నది. ఇక ప్రచారంజరిగినవిషయాన్ని ప్రస్తావిస్తాను. నాతరపున జరిగిన ప్రచారానికి వేయిరెట్లు ఎక్కువైనప్రచారం డాక్టర్ పట్టాభితరపున జరిగింది. ఈవిషయాన్ని మీరు ఏమాత్రం గమనించినట్లు కనుపించదు. డాక్టర్ పట్టాభికి ఓట్లు సేకరించేనిమిత్తం కాంగ్రెసు మంత్రివర్గాల యంత్రాంగం యావత్తూ పూర్తిగా వినియోగించబడింది. గాంధీసేవాసంఘం, కాంగ్రెసు మంత్రివర్గాలు, బహుశా చర్కాసంఘం, ఎ. ఐ. వి. ఐ. ఎ. వీటన్నిటితోకూడిన ప్రబలమైన ప్రచారయంత్రం డాక్టర్ పట్టాభికి ఓట్లుసేకరించే నిమిత్తం పనిచేసింది. ఇంతేకాక దిగ్గజాలవంటి నాయకులంతా, అటువైపే పని చేశారు. అదీగాక మీరుకూడా నాకు వ్యతిరేకులయారు. మహాత్మాగాంధీ పేరు, ప్రతిష్ఠ, రాష్ట్రకాంగ్రెసుకమిటీలలో హెచ్చుకమిటీలు—ఇవన్నీ వారికి అనుకూలంగా ఉన్నవి. వీటన్నిటికివ్యతిరేకంగా ఒక్కణ్ణి—ఏకాకిని—నేను ఏంచేయగలను? ఇంతేకాక మీకు మరోవిషయంకూడా తెలియజేస్తున్నాను. ఈవిషయం మీకు తెలుసునో తెలియదో కాని నేను వ్యక్తిగతంగా ఈవిషయాన్ని ఎరుగుదును. అనేకచోట్ల జరిగినప్రచారం డాక్టర్ పట్టాభికిజరిగినప్రచారంకాదు—గాంధీజీకి గాంధీజానికి ప్రచారంజరిగింది. ఈ కుహనా ప్రచారాన్ని విశ్వసించడానికి చాలామందిప్రజలు నిరాకరిం

చినప్పటికీ ఈ ప్రమాదం జరిగినమాట వాస్తవం. అయినప్పటికీ, మీరు బహిరంగసభలో నన్నువిమర్శించడానికి ప్రయత్నించారు.

ఇక రాజీనామాలవిషయాన్ని ప్రస్తావిస్తాను. పన్నెండుగురు సభ్యులు రాజీనామాలనిచ్చారు. వారు మూడింటి తమ అభిప్రాయాలనుతెలుపుతూ నాకు ఒకలేఖ వ్రాశారు. ఎంతో సభ్యంగాఉన్నది ఆ లేఖ. ఆ లేఖలో వారు తమ అభిప్రాయాలను తమవైఖరిని స్పష్టంగా తెలిపారు. నాకు అస్వస్థతగాఉండడం గమనించి ఒక్కమాటకూడా నాపట్ల అనాదరంగా వారు తమలేఖలో ఉపయోగించలేదు. వారుకోరినట్లయితే నన్ను వ్యక్తిరేకంగా విమర్శించవచ్చును; కాని అనాదరణతో ఒక్కమాటకూడా వారు ఉపయోగించలేదు. కాని మీ ప్రకటన?—మీ ప్రకటననుగురించి నే నేం చెప్పను? నన్ను నేను నిగ్రహించుకొని తీవ్రపదజాలాన్ని ఉపయోగించకుండా మీ శోకమాట చెప్పి ఊరుకుంటాను; మీ ప్రకటన మీకుతగినట్లుగామాత్రం లేదు. (ఈ ప్రకటనను రాజీనామాలేఖలో చేర్చవలెనని మీరు కోరినట్లు, కాని వారు అందుకు అంగీకరించనట్లు నేను విన్నాను.) ఇక, మిగిలినపన్నెండుగురు రాజీనామానిచ్చినట్లే, మీరుకూడా రాజీనామానిచ్చారనే అభిప్రాయం మీ ప్రకటనవల్ల ఏర్పడింది. అంతేకాని, సాధారణప్రజకు ఇంతవరకుకూడా మీ పరిస్థితి ఏమిటో దురవగాహంగానే ఉన్నది. ఒక విషమపరిస్థితి ఏర్పడినప్పుడు ఒక స్పష్టమైననిర్ణయానికిరావడంలో మీరు తరుచుగా విఫలులైనారు. అందుచేత సాధారణప్రజలకు మీ వైఖరి స్పష్టంగా బోధపడదు. మీరు రెండుపక్షాలపై స్వారీచేస్తున్నారనే ఉద్దేశం కలుగుతుంది. ఇక, ఫిబ్రవరి 22న మీరు ఇచ్చిన ప్రకటనవిషయాన్ని ప్రస్తావిస్తాను. మీరు ఆడే ప్రతిమాటా, చేసే ప్రతిపని, ఎంతో తర్కసహంగాను, సమగ్రంగాను ఉంటుందని మీ కొక అభిప్రాయం ఉన్నది. కాని వివిధసందర్భాలలో మీరు అవలంబించేవైఖరిని ఇతరులుమాత్రము అవగతం చేసుకొనలేరు. కొన్ని ఉదాహరణలను తీసుకుందాము. ఫిబ్రవరి 22న మీరుచేసిన ప్రకటనలో నేను తిరిగి అధ్యక్షపదవికి ఎన్నిక కావడానికి మీరు వ్యతిరేకిస్తున్నట్లు ప్రకటించారు. అందుకు మీరు కొన్ని కారణాలను చూపారు; ఆ ప్రకటనలో మీరు చూపిన కారణాలను

ఆల్మోరానుంచి జనవరి 26న మీరుచేసిన ప్రకటనలోని కారణాలతో పోల్చిచూడవలసిందిగా కోరుతున్నాను. ఆప్రకటనకూ ఈప్రకటనకూ ఎట్టిసంబంధమూలేనట్లు స్పష్టంగా తెలుస్తుంది. వామపక్షఅభ్యర్ధిగా నేను అధ్యక్షపదవికి పోటీచేసినట్లయితే, మీకు ఎట్టిఅభ్యంతరములేదని, ఇంతకు పూర్వం మీరు కొందరు బొంబాయిమిత్రులతో అన్నట్లు వారు నాకు చెప్పారు. మీరు ఆల్మోరానుంచి చేసిన ప్రకటనలో మనము వ్యక్తులను విస్మరించి, సూత్రాలను, మన లక్ష్యాన్నిమటుకే జ్ఞప్తిఉంచుకొనవలెనని అన్నారు; కొందరు వ్యక్తులవిషయంలోమాత్రమే, వ్యక్తులను విస్మరించవలెనని మీ రన్నట్లు, మీ కెప్పుడూ స్ఫురించిఉండదు. సుభాస్ ఎన్నికవిషయం వచ్చినప్పుడు మీరు వ్యక్తులను విస్మరించవలసిందని కోరుతూ లక్ష్యాల ప్రాధాన్యాన్ని గోరంతలుకొండంతలుగాచేసి ఉపదేశిస్తారు. కాని మౌలానా అజాద్ తిరిగి ఎన్నికకు నిలిచినసందర్భంలో మీ రొక సుదీర్ఘమైన్న ప్రశంసాపత్రాన్ని వ్రాయడానికి వెనుకాడరు. సర్దార్ పటేల్‌కు వ్యతిరేకంగా సుభాస్‌బోస్‌సమస్య వచ్చినప్పుడు ముందు వ్యక్తిగతసమస్యను స్పష్టీకరించవలసినవాడు సుభాస్‌బోస్. కాని త్రిపురిలో జరిగిన కొన్ని లోపాలనుగురించి శరత్‌బోస్ తెలిపినప్పుడు (మహాత్మాగాంధీ అనుచరులమని చెప్పుకునేవారి ప్రవర్తననుగురించినవి, వైఖరినిగురించినవి) ఆయన మీదృష్టిలో లక్ష్యాలకు కార్యక్రమాలకు కట్టుబడిఉండక వ్యక్తిగతసమస్యలను చర్చించేస్థాయికి దిగజారినవాడైనాడు. మీ పూర్వాపరసంబద్ధత నా కొద్దిపాటిబుద్ధికి అవగతంకాకుండా ఉన్నది.

ఇక, మీదృష్టిలో ఎంతో ప్రధానంకాదనిపించే వ్యక్తిగత సమస్యనుగురించి ప్రస్తావిస్తాను. నా ప్రకటనలలో నేను నా సహచరులను అన్యాయంగా నిందించినానని మీరు నాపై ఆరోపణచేశారు; కాని, మీరు వారిలో ఒకరుకాదుకదా. ఇక నేను ఏదైనా నేరారోపణచేసిఉన్నానంటే అది ఇతరులపై చేసినదే అవుతుంది. అనగా, మీరు మీతరపునకాక, ఇతరులతరపున వాదిస్తూఉన్నారన్నమాట. న్యాయవాది సాధారణంగా తన క్లైయింటుకన్న, ఎక్కువ ఆడంబరంగా వాదిస్తాడు. అయితే, నేను ఈ

విషయాన్ని త్రిపురిలో సర్దార్‌పటేల్‌తోను (రాజన్‌బాబు, మౌలానాలతోను) మాట్లాడినప్పుడు ఆయన ముఖ్యంగా నాపై చేసిన ఆరోపణ, గత జనవరిలో వార్ధాలో జరిగిన వర్కింగ్‌కమిటీసమావేశంనాటిదికాని, ఈ నాటిదికాదనిఅన్నాడు.ఈవిషయం మీకు ఆశ్చర్యంకలిగించకపోదు. నాపై మీరు ఆరోపణలుచెయ్యడానికి కారణం నా ఎన్నిక ప్రకటనలని సాధారణంగా అందరూ భావిస్తున్నారని నేను ఆయనతో అనగా, అది మరొక కారణంకాని అసలుకారణం కాదని ఆయన అన్నారు. అందుచేత ఈ 'పరస్పరదూషణ వ్యవహారానికి' వారిన్యాయవాదులైన మీరు ఇచ్చినంత ప్రాధాన్యాన్ని వారు ఇవ్వలేదు. వార్ధాలో వర్కింగ్‌కమిటీసమావేశంజరగడానికి పూర్వపుసంఘటనలనుగురించి నేను త్రిపురిలో సర్దార్ పటేల్ మొదలైనవారితో మాట్లాడవలెనని అనుకున్నాను. కాని, ఎ. ఐ. సి. సి. సమావేశానికి వారు వెళ్ళి మళ్ళీ తిరిగిరాలేదు. వారు తిరిగివస్తామని వాగ్దానంచేశారు. కాని తిరిగిరాలేదు. అందుచేత త్రిపురిలో ఆ విషయాన్ని వారితో మాట్లాడలేకపోయాను. కాని మా అన్న శరత్ సర్దార్ పటేల్‌తో ఆ విషయాన్ని గురించి మాట్లాడారు. 1938 సెప్టెంబర్‌లో ఢిల్లీలో ఎ. ఐ. సి.సి. సమావేశంజరిగినప్పుడు, సోషలిస్టులు సమావేశం నుంచి నిష్క్రమించినప్పుడు, నా వైఖరి తనకు అసంతృప్తి కలిగించిందని సర్దార్ పటేల్ మా అన్నగారితో చెప్పారు.

ఆయన ఇలాచెప్పడం నాకు, మా అన్నగారికి చెప్పరానిఆశ్చర్యం కలిగించింది. కాని ఆ "తీవ్రవిచ్ఛిన్నకరచర్యకు" మీ రిచ్చినంత ప్రాధాన్యాన్ని వారు ఇచ్చినట్లు కనుపించదు. నిజానికి నేను త్రిపురిలోవున్నప్పుడు వ్యవహారం పూర్తిగా విస్మరింపబడిందని, మీ మాటలు, ప్రకటనలు ఈ వ్యవహారాన్ని మళ్ళీ రెచ్చగొట్టినవని అనేకమంది ప్రతినిధులు (నన్ను బలపరచేవారుకాదు) నాకు చెప్పారు. ఈ సందర్భంలో నేను మీకు మరొకవిషయాన్నికూడా చెప్పదలిచాను. అధ్యక్షుని ఎన్నిక జరిగిననాటినుంచి వర్కింగ్‌కమిటీ మాజీసభ్యులు పన్నెండుగురుకంటెకూడా ఎక్కువగా ప్రజాదృష్టిలో నన్ను కించపరచటానికి మీరు ఎక్కువగా కృషిచేశారు. నేనేకనక అంతటి దుష్టుడనైవుంటే నా లోపాలను ప్రజ

లకు బాహాటంగా చాటిచేప్పేహక్కు మీకు వున్నది. అది మీ ధర్మం కూడా. కాని మీతోనహా, మహాత్మా గాంధీతోనహా, దిగ్గజాలవంటి నాయకులు వ్యతిరేకించినా, ఏడెనిమిది రాష్ట్రప్రభుత్వాలు వ్యతిరేకించినా, అధ్యక్షునుగా తిరిగి ఎన్నికైన ఈ వ్యక్తిని చల్లనిచూపుచూచిన ఏదో శక్తి వుండితీరవలెనన్నవిషయం బహుశా మీకు స్ఫురించేఉండవచ్చును. తన వెనుక సంస్థ ఏదీ అండగాలేకపోయినప్పటికి, అనేక అవరోధాలు వున్నప్పటికి అతడు గతసంవత్సరం అధ్యక్షపదవి నిర్వహించినప్పుడు దేశానికి కొద్దిగానో, గొప్పగానో సేవచేసినవాడై వుండాలి.

ఫిబ్రివరి 22 న మీరు చేసిన ప్రకటనలో ఇంకా ఇలా అన్నారు: "అన్ని అంశాలలోకి ముఖ్యంగా సమాలోచించవలసిన అంశం ఇది అని నేను కాంగ్రెస్ అధ్యక్షునికి సూచించాను. కాని ఈ విషయమై ఎట్టి యత్నమూ జరిగినట్టులేదు."—ఈ వాక్యాలను మీరు కాగితంపై పెట్టడానికిముందు, ఈ విషయాన్ని స్పష్టంగా పరిష్కరించుకొనడానికి నేను సర్దార్ పటేల్‌ను ఇతరసభ్యులను కలుసుకోవలసిఉన్నదని, అలా వారిని కలుసుకొనడానికి వీలయినసమయం ఫిబ్రివరి 22 న వర్కింగ్‌కమిటీ జరిగినప్పుడేనని మీకు ఒకమాటయినా తట్టిఉండలేదా? లేక నేను వర్కింగ్ కమిటీ సమావేశానికి హాజరుకాకుండా తప్పించుకొనడానికి యత్నిస్తున్నానని మీరు భావించారా? ఫిబ్రివరి 15 న నేను మహాత్మాగాంధీని కలుసుకున్నప్పుడు, ఆయన ఈ వ్యవహారాన్నిగురించిన ప్రస్తావన తీసుకుని వచ్చినప్పటికి, నేను ఈ విషయాన్ని ఆయనతో చర్చించనిమాట నిజమే. కాని, అప్పుడు నేను, వ్యక్తిగతసమస్యలకన్న, లక్ష్యాలకు కార్యక్రమాలకు ఎక్కువప్రాధాన్యాన్ని ఇవ్వవలెననే మీ ఉపదేశాన్నే అనుసరిస్తూ ఉంటిని. అయినప్పటికి, సర్దార్ పటేల్ ప్రభృతుల వర్కింగ్‌కమిటీ ఈ విధంగాఉంటే నాతో సహకరించరని మహాత్మాగాంధీ నాతో అన్నప్పుడు ఫిబ్రివరి 22 న నేను వారిని కలుసుకున్నప్పుడు విషయాలన్నీ వారితో చర్చించి వారి సహకారాన్నిపొందడానికి యత్నిస్తానని నేను ఆయనతో చెప్పాను. అందుచేత ఈ వ్యవహారాన్ని పరిష్కరించడానికి వర్కింగ్

కమిటీసభ్యులతో మాట్లాడవలసిన అవసరం ఉన్నదనే విషయాన్ని మీ
రంగీకరిస్తారని అనుకుంటాను.

'వామ', 'మితవాద' అనే పదాలను నేను ఉపయోగించడంలో నా అభిప్రాయం ఏమిటో వ్రాతపూర్వకంగా నిర్దిష్టంగా నిర్వచించవలసిందిగా పై ప్రకటనలో నన్ను మీరు కోరారు. ఇలాంటి ప్రశ్నలు ఎవరైనా అడగవచ్చునుకాని మీరుమాత్రం అడగరని నేను ఊహిస్తూవచ్చాను. ఆచార్య కృపలానీ, మీరూ హరిపురలో అఖిలభారతకాంగ్రెస్‌కమిటీకి నివేదించిన నివేదికలన్నిటిని విస్మరించారా? మితవాదవర్గాలు, వామపక్షాలను అణచిపెట్టడానికి ప్రయత్నిస్తున్నవని మీరు మీ నివేదికలో పేర్కొనలేదా? 'వామ' 'మితవాద' అన్నపదాలను అవసరమైనప్పుడల్లా మీరు ఉపయోగిస్తే తప్పుకానప్పుడు ఇతరులకుమాత్రం ఆ పదాలను ఉపయోగించడానికి అధికారం లేదా?

జాతీయ, అంతర్జాతీయ వ్యవహారాలనుగురించి నా విధానాన్ని నేను స్పష్టీకరించలేదని మీరు నాపై మరో ఆరోపణచేశారు. నా విధానం తప్పుకావచ్చును,ఒప్పుకావచ్చును; కానిఈవిషయాలలో నా కొకవిధానం మటుకు ఉన్నదని నేను భావిస్తున్నాను. త్రిపురిలో నా అధ్యక్షోపన్యాసంలో ఈ విధానాన్ని నిర్దిష్టమైనమాటలలో సూచనప్రాయంగా చెప్పి ఉన్నాను. ఇండియాలో పరిస్థితులను, విదేశాలలో పరిస్థితులను సమాలోచించినపిదప, మనముందున్నసమస్య, మనవిధ్యుక్తధర్మం బ్రిటిష్ ప్రభుత్వంపై స్వరాజ్యంకొరకు ఒత్తిడితీసుకునిరావడం ఒకటేనని నేను అభిప్రాయపడుతున్నాను. దీనితోపాటు ప్రక్కనే సంస్థానప్రజలఉద్యమాన్ని దేశవ్యాపితంగా నడిపించడానికి ఒకసమగ్రమైన పథకం కూడా అవసరం. త్రిపురిసభలకు ముందే, మనం శాంతినికేతనంలోను, ఆనందభవనంలోను కలుసుకున్నప్పుడు నా అభిప్రాయాలను మీకు స్పష్టంగా సూచించాను. ఇక, ఇప్పుడు నేను ఈరేఖలో వ్రాసినదికూడా నిర్దిష్టవిధానంకాకపోదు. ఇక, మీరు సూచించేవిధానం ఎట్టిదో ఇప్పుడు నేను అడగవచ్చునా? ఇటీవల మీరు వ్రాసిన ఒకలేఖలో కిషన్‌ప్రసాదం గారు నాకో రూపొందించబడిన జాతీయడిమాండుతీర్మానాన్నిగురించి ప్రస్తావించారు. మీరు

ఈతీర్మానం ఎంతోగొప్పదని భావిస్తున్నట్లున్నది. పవిత్రమైన ఉద్దేశాలతో కూడుకున్న అంతఅందమైన అస్పష్టమైన తీర్మానం నాకు నచ్చదని చెప్ప డానికి నేను ఎంతో విచారిస్తున్నాను. ఆ తీర్మానం మనల్ని ఎక్కడికీ తీసు కునివెళ్ళదు. స్వరాజ్యంకొరకు బ్రిటిష్‌ప్రభుత్వంతో పోరాటంజరపడం అవసరమని, అందుకు తగిన సమయంవచ్చినదని మనం అనుకుంటే, మనం ఆవిషయాన్ని స్పష్టంగా చెప్పి ముందుకువెడదాం. బ్రిటిషుప్రభుత్వా నికి కడపటి హెచ్చరిక నివ్వడమనే భావం మీకు రుచించదని మీ రెన్నో సార్లు నాతోచెప్పారు; కాని గడచిన 20 సంవత్సరాలలో, అనేకసార్లు మహాత్మాగాంధీ బ్రిటిషుప్రభుత్వానికి కడపటిహెచ్చరికను చేస్తూవచ్చారు. ఇలాగ బ్రిటిషుప్రభుత్వాన్ని కడపటిసారిగా హెచ్చరిస్తూ, అవసరమైతే పోరాటంసాగించడానికి దేశాన్ని సంసిద్ధపరచడంవల్లనే గాంధీజీ బ్రిటిషు ప్రభుత్వంవద్దనుంచి ఇన్నిసమపాయాలను సాధించగలిగారు. మన జాతీయవాంఛను నెరవేర్చవలసినసమయం వచ్చిందని, మీరు నిజంగా విశ్వసించినట్లయితే, కడపటిహెచ్చరికద్వారాకాక జాతీయడిమాండును మరేవిధంగా అమలుగావించగలం? మహాత్మాగాంధీజీ ఇటీవల రాజకోట సమస్యపై తుదిహెచ్చరికను ఇచ్చిఉన్నారు. తుదిహెచ్చరికను ఇవ్వవ లెననేభావాన్ని నేను సూచిస్తున్నాను గనుక మీరు కాదని అంటున్నారా? అలాఅయితే, ఆ విషయాన్ని స్పష్టంగా ఎందుకుచెప్పకూడదు?

మొత్తంమీద, ఆంతరంగిక రాజకీయాలనుగురించిన మీ విధానం ఎట్టిదో నేను అర్థంచేసుకోలేకుండాఉన్నాను. రాజకోట్, జయపూర్ సమ స్యలు, ఇతర రాజకీయసమస్యలన్నిటికి ప్రాముఖ్యంలేకుండాచేస్తాయని, మీ ప్రకటనలలో ఎక్కడో చదివినట్లు నాకు జ్ఞాపకం. మీవంటి ప్రముఖ నాయకునివద్దనుంచి ఇటువంటి అభిప్రాయం వెలువడడం నాకు ఆశ్చ ర్యంగా కనుపించింది. ఇతరసమస్య ఏదైనా, ప్రధానసమస్యఅయిన స్వరాజ్యసమస్యకు ప్రాముఖ్యంలేకుండా ఎలా చేయగలదో నాకు దురవ గాహంగాఉన్నది. విశాలమైన ఈ దేశంలో రాజకోట్ ఒక చిన్న సంస్థానం. జయపూర్ రాజకోట్‌కన్న కొంచెం పెద్దది. కాని జయ పూర్ సమస్యకూడా బ్రిటిష్‌ప్రభుత్వంపై ప్రధానపోరాటంతో పోల్చి

వట్లయితే ఏపక్షసిద్ధాంతసమస్యకూడా కాదు. ఇంతేకాక, ఇండియాలో కొన్ని చిల్లరసంస్థానాలు ఉన్నాయనేవిషయాన్ని మనం మరచిపోరాదు. ప్రస్తుతం మనం అనుసరిస్తున్న ఈ అయుకులపొందికలాంటి విధానాన్నే అనుసరించి, ప్రతిసంస్థానంలోను ప్రజాపోరాటాన్ని నిలుపుదలచేస్తే, సంస్థానాలలో పౌరస్వేచ్ఛను, బాధ్యతాయుతప్రభుత్వాన్ని సాధించడానికి మనకు 250 సంవత్సరాలుపడుతుంది. ఇక మనం స్వరాజ్యాన్నిగురించి ఆలోచించేది అక్కరలేదనే నన్నమాట!

ఇక, అంతర్జాతీయవ్యవహారాలలో మీ విధానం మరింత అస్పష్టంగా ఉన్నది. ఇండియాను యూదులకు శరణాలయంచెయ్యాలనికోరుతూ, కొద్దిరోజుల క్రితం మీరు వర్కింగ్‌కమిటీలో తీర్మానాన్ని ప్రవేశపెట్టడం నాకు ఆశ్చర్యాన్ని కలిగించింది. ఆ తీర్మానాన్ని వర్కింగ్‌కమిటీ త్రోసి రాజన్నప్పుడు మీ రెంతో బాధపడ్డారు. (బహుశా మహాత్మాగాంధీఅంగీకారంలోనే వర్కింగ్‌కమిటీ ఆ తీర్మానాన్ని త్రోసిరాజనిఉండవచ్చును.) ఒక దేశంయొక్క విదేశాంగనీతి అన్నది వాస్తవికమైన వ్యవహారం. ఈ విదేశాంగనీతి ఒకదేశంయొక్క స్వార్థశ్రేయస్సుదృష్ట్యా రూపొందించబడుతుంది. ఉదాహరణకు సోవియట్‌రష్యాను తీసుకుందాము. అంతరంగికవ్యవహారాలలో సోవియట్‌రష్యా ఎంత కమ్యూనిజాన్ని అమలుచేస్తున్నప్పటికి, విదేశాంగనీతికి సంబంధించిన వ్యవహారాలలోమటుకు హృదయవాదానికి పైచెయ్యినివ్వడం అంగీకరించదు. అందుచేతనే, తన స్వప్రయోజనానికి అనుకూలంగా ఫ్రెంచిసామ్రాజ్యవాదంతో ఒడంబడిక చేసుకొనడానికి రష్యా వెనుకాడలేదు. ఫ్రెంచి సోవియట్ ఒడంబడిక, జెకోస్లోవేకియా సోవియట్ ఒడంబడిక ఇందుకు ఉదాహరణలు. ఈనాడు కూడా, బ్రిటిషుసామ్రాజ్యవాదంతో ఒడంబడికచేసుకొనడానికి సోవియట్ రష్యా ఆతురపడుతున్నది. ఇక ఇప్పుడు, మీ విదేశాంగనీతి ఎట్టిదో దయచేసి చెప్పగలరా? నీటిబుడగలలాంటి నీతులు, పవిత్రాశయాలు విదేశాంగనీతికాలేవు. [illegible]పోయిన విఫలాశ [illegible] [illegible] పోరా[illegible]కూర్చుంటే వచ్చే ఉపయోగ మేమీలేదు. ఒకవైపున, బ్రిటిష్,

ఫ్రెంచిసామ్రాజ్యవాదాల సత్ప్రవర్తనకు భూషణపత్రాలనిస్తూ మరో వైపున జర్మనీ, ఇటలీలవంటి దేశాలను దూషించడంవల్ల లాభంలేదు.

అంతర్జాతీయ పరిస్థితి ఇండియాశ్రేయస్సు కనుకూలంగా వినియోగించుకోవాలని మిమ్మల్ని, మహాత్మాగాంధీని ఇతరరాజకీయనాయకులను నేను కొద్దికాలంనుంచి అర్థిస్తూవచ్చాను. అందుచేతనే బ్రిటిషుప్రభుత్వానికి మనజాతీయవాంఛను కడసారిహెచ్చరికరూపంలో అందచేయాలని కోరాను. కాని ఈ విషయంలో మిమ్మల్ని, మహాత్మాజీని, నేను అంగీకరింపజేయలేకపోయాను. భారతప్రజలలో నావైఖరిని అంగీకరించినప్పటికి, ఇంగ్లండులోని భారతీయవిద్యార్థులు, నా విధానాన్ని అంగీకరిస్తూ అనేకసంతకాలలోకూడినవిజ్ఞప్తిని నాకు పంపినప్పటికి మీరూ, మహాత్మాజీ మాత్రం. నావైఖరిని అంగీకరించలేదు. కాని ఇప్పుడు త్రిపురి తీర్మానానికి సంబంధించిన అవరోధాలు అనేకంవున్నా, నేను వర్కింగ్‌కమిటీని ఏర్పరచలేదనే నెపం నాపై మోపుతున్న ఈ సందర్భంలో అంతర్జాతీయ పరిస్థితి హఠాత్తుగా మీ దృష్టిలో ప్రముఖరూపాన్నిదాల్చింది. ఇంతకాలము జరగని అభూతసంఘటన ఐరోపాలో ఏం జరిగిందో నేను మిమ్మల్ని అడగవచ్చునా ? వసంతంలో ఐరోపాలో ఒక గడ్డుపరిస్థితి ఏర్పడగలదని అంతర్జాతీయ రాజకీయాలను గమనించే ప్రతివిద్యార్థికి తెలుసునుకదా ? బ్రిటిషుప్రభుత్వానికి కడసారిహెచ్చరికను అందజేయాలని నేను ఒత్తిడి తీసుకువచ్చినప్పుడు ఈ విషయాన్ని నేను పదే, పదే చెప్పిఉండలేదా ?

ఇప్పుడు మీప్రకటనలోనిమరోభాగాన్నిగురించి నేనుప్రస్తావిస్తాను. మీరు మీ ప్రకటనలో ఇలా అన్నారు, "ప్రస్తుతానికి మీ వర్కింగ్‌కమిటీ పనిచేయడం మానినట్లే. అందుచేత అధ్యక్షునికి బహుశా తానుకోరినట్లుగా సూచనలను రూపొందించి కాంగ్రెస్‌ముందుఉంచటానికి పూర్తి స్వేచ్ఛవున్నది. అతని అభిమతాన్ని అనుసరించి మామూలు కార్యక్రమాన్ని నిర్వహించడానికి సమావేశంఏర్పరచబడలేదు"—యిలాంటి అర్థసత్యాలను లేక పూర్తి అసత్యాలను మీరు చెప్పగలగడం నాకు చెప్పరాని ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నది. పన్నెండుగురు వర్కింగ్‌కమిటీసభ్యులు వారి రాజీనామాలను హఠాత్తుగా నా ముఖాన విసిరికొట్టారు.

అయినా, తీర్మానాలను రూపొందింపజేసే విషయంలో స్వేచ్ఛఉండాలని కోరింది నేనని మీరు నన్ను నిందిస్తున్నారు; అంతేకాక మామూలు కార్య క్రమాన్ని నిర్వహించకుండా మీకు నే నెప్పుడు అడ్డుపడ్డాను? తీర్మానాలను రూపొందింపజేసే ముఖ్యమైనవిషయంలో కూడా, త్రిపురికాంగ్రెస్ జరిగే వరకు వర్కింగ్‌కమిటీ వాయిదావేయాలని, నేను సూచించినప్పటికీ, తీర్మానాలను రూపొందింపచేసేవిషయాన్ని ఇతరసభ్యులతో సంప్రదించిన మీదట వారి అభిప్రాయాన్ని నాకు తెలుపవలసినదని నేను సర్దార్ పటేల్‌ను టెలిగ్రామ్‌ద్వారా కోరివుండలేదా? ఈ విషయాన్నిగురించి మీకు ఎట్టిసంశయమన్నా వుంటే నేను సర్దార్ కిచ్చిన ఈ టెలిగ్రామ్‌ను దయతో ఒకసారి చూడవలసినది. నా టెలిగ్రామ్‌లో ఇలా వున్నది:

సర్దార్ పటేల్, వార్ధా.

"దయచేసి నా టెలిగ్రామ్‌ను మహాత్మాజీకి అందజేయాలిసింది. కాంగ్రెస్ జరిగేవరకు, వర్కింగ్‌కమిటీ వాయిదావేయవలసివచ్చినందుకు చింతిస్తున్నాను. సహచరులతో సంప్రదించినమీదట వారి అభిప్రా యాన్ని తెలుపవలసినది.—సుభాస్."

త్రిపురికాంగ్రెస్ జరిగిన వారంరోజులతరువాత కాంగ్రెస్‌వ్యవహా రాల్లో స్తబ్ధత ఏర్పడడానికి కారకుణ్ణి నేనేనని మీరు నా కొక టెలిగ్రామ్ పంపారు; మీ రెంత సభ్యతతెలిసినవారైనప్పటికి మీకు ,ఒకవిషయం స్ఫురించివుండలేదనుకుంటాను. త్రిపురికాంగ్రెసులో పండిత్ పంత్ తీర్మా నం ఆమోదింపబడినప్పుడు నేను జబ్బులోవున్నాననీ, మహాత్మాగాంధీ త్రిపురికి రాలేదనీ, త్వరలో, మనం కలుసుకునే అవకాశంవుండదనీ మీరు గమనించలేదనుకుంటాను. రాజ్యాంగనీతికి విరుద్ధంగా, నిరంకుశంగా, వర్కింగ్‌కమిటీని నియమించే అధికారాన్ని నాకు లేకుండాచేసి, విస్తబ్ధ తను కలిగించడానికి కారణం కాంగ్రెసేనన్నవిషయం మీకు స్ఫురించ లేదు. పండిత్ పంత్ తీర్మానం, కాంగ్రెసురాజ్యాంగానికి భంగం కలిగించ కుండా వున్నట్లయితే 1939 మార్చి 13 తారీఖునే నేను వర్కింగ్‌కమిటీని ఏర్పరచివుండేవాణ్ణి. కాంగ్రెసు అయిపోయిన ఏడురోజులకే మీరు నాపై బహిరంగంగా ఆందోళనలేవతీయడం ప్రారంభించారు, నా ఆరోగ్యపరిస్థితి

మీకు తెలిసివున్నప్పటికీ మీరు ఈ ఆందోళన ప్రారంభించారు. మీ రిచ్చిన తంతి నాకు చేరకముందే పత్రికలలో ప్రకటింపబడింది.

త్రిపురికి పూర్వమే వర్కింగ్‌కమిటీనుంచి పన్నెండుగురు సభ్యులు రాజీనామా ఇవ్వడంవల్ల కాంగ్రెస్‌వ్యవహారాల్లో ప్రతిష్టంభన ఏర్పడినప్పుడు మీ రందుకు నిరసనగా ఒక్కమాటయినా అన్నారా? నాపట్ల సానుభూతి కనబరుస్తూ, ఒక్కమాటైనా అన్నారా? ఇటీవల మీరు వ్రాసిన ఒక లేఖలో మీరు ఏమాటమాట్లాడినా, ఏపనిచేసినా, కేవలం మీ అంతట మీరే స్వతంత్రంగామాట్లాడతానని, ఆపని చేస్తానని వ్రాశారు. ఇతరులకు మీరు ప్రాతినిధ్యంవహిస్తున్నట్లుగా భావించరాదని మీరు అన్నారు. కాని దురదృష్టవశాత్తూ, మితవాదులుచేసిన తప్పిదాలకు వారి తరఫున క్షమాపణకోరుకొనేపాత్రను నిర్వహించే వ్యక్తిగా మీరు మాకు అగుపిస్తారని మీకు స్ఫురించివుండదు. ఉదాహరణకు మార్చి 26 న మీరువ్రాసిన కడపటివుత్తరంలో ఇలా వ్రాశారు: "ఈరోజుపత్రికలో మీ ప్రకటనలు చదివాను. ఈవిధమైన వాగ్వివాదధోరణితోకూడిన ప్రకటనలు మనకు ఏమాత్రం సాయపడవు."

అనేక వర్గాలనుంచి అన్యాయంగా నాపై దాడిజరుగుతున్నప్పుడు, అనేకవర్గాలు నన్ను వెనుకపోటు పొడవడానికి ప్రయత్నిస్తున్నప్పుడు, మీరు అందుకు నిరసనగా ఒక్కమాటకూడా తెలుపరు. నాపట్లసానుభూతి తెలుపుతూ ఒక్కమాటకూడా అనరు. నేను ఆత్మరక్షణార్థం ఏదైనా అన్నప్పుడు, ఇలాటి వాగ్వివాదధోరణులు పనికిరావనిమాకు అంటారు. రాజకీయంగా నా వ్యతిరేకులుచేసిన ప్రకటనలలో ఇలాటి వాగ్వివాద ధోరణివున్నదికదా? వున్నప్పుడు మీరిదేవిధంగా అన్నారా? బహుశా ఇలా అనివుండరు. పైగా ఆ ప్రకటనలు మీకు ఎంతో సంతోషాన్నికూడా కలిగించివుంటాయి.

ఫిబ్రవరి 22న మీరుచేసిన పత్రికాప్రకటనలో మీ రిలాగ అన్నారు. "స్థానిక కాంగ్రెస్‌తగాదాలను పరిష్కరించేవిషయంలో మామూలుగా అనుసరింపబడే మార్గం అనుసరింపబడక, కాంగ్రెసు అగ్రశ్రేణిద్వారానే ఈ తగాదాలను పరిష్కరించేధోరణి కనుపిస్తున్నది. తత్ఫలితంగా కాం

గ్రెసులో కొన్నివర్గాలపట్ల ప్రత్యేక పక్షపాతం చూపడం కాంగ్రెసువాది చెప్పాలంటే ఉపయోగపడుతున్నది.....మనసంస్థ అంతరాంతరాల్లోకే క్రొత్తపద్ధతులు ప్రవేశపెట్టబడుతున్నవి. స్థానికవాదాలకు ప్రాధాన్యత వ్యాపింపచేయగల ఈ పద్ధతులు నా కెంతో బాధకలిగిస్తున్నవి."

ఈ ప్రకటనలో విషయాలన్నిటినీ, ఆ సమాచారాలతో ఋజువుచేయడానికి మీరు ప్రయత్నించకపోయినప్పటికీ, ఆ విధమైన ఆరోపణచేయడం, నా కెంతో ఆశ్చర్యాన్ని, బాధను కలిగించింది. మీరు ఈ ప్రకటన చేయడానికిముందు జరిగిన విషయాలను పూర్వాపరాల్లాగా చెప్పవలసిందని కనీసం నన్ను కోరవలసింది. ఆవిషయాన్ని మీరు వ్రాసినప్పుడు మీ మనస్సులో ఏవిధమైనభావమున్నదో నాకు తెలియదు.

ఢిల్లీ రాష్ట్రకాంగ్రెసుకమిటీవ్యవహారాలను మీరు పర్యవేక్షించివుంటారని ఒకస్నేహితుడు నాతో సూచనప్రాయంగా అన్నాడు. మీరు అలాగ ఢిల్లీ రాష్ట్రకాంగ్రెసుకమిటీవ్యవహారాలను మనస్సులోవుంచుకొని ఈ విషయం వ్రాసివున్నట్లయితే, ఆ వ్యవహారాలవిషయంలో నేను అవలంబించినవైఖరి ఒక్కటే సక్రమమైనవైఖరి అని మీకు నేను స్పష్టంగా చెప్పగలను.

ఈ సందర్భంలో మీకు నేను మరొకవిషయాన్నికూడా చెప్పగలను. అగ్రస్థాయినుంచి జోక్యం కలగజేసుకునేవిషయంలో ఏ కాంగ్రెసు అధ్యక్షుడుకూడా మీతో పోటీచెయ్యలేరు. కాంగ్రెసుఅధ్యక్షపదవిలో ఉన్నప్పుడు మీరు చేసినదంతా బహుశా మరచివుంటారని అనుకుంటాను. లేక, ఎవరు చేసిన పనులను వారు నిష్పాక్షికంగా, నిర్లిప్తంగా చూడగలగడం కష్టమైనపని అయినా కావచ్చును. ఫిబ్రవరి 22 న, అగ్రస్థాయినుంచి నేను కాంగ్రెసువ్యవహారాలలో జోక్యం కలగజేసుకున్నానని మీరు నాపై నిందమోపారు; ఫిబ్రవరి 4 న మీరు నాకు వ్రాసిన లేఖలో నేను సచేతనంగా నా అధ్యక్షధర్మాలను నిర్వర్తించడంలేదని మీరు నాపై నిందమోపినవిషయం మీరు మరిచారా? ఆ లేఖలో మీ రిలాగ వ్రాశారు: "చరిత్రలో మీరు మార్గదర్శిత్వం వహించవలసిన అధ్యక్షునివలెకాక [illegible]గానే వ్యవహరించారు"

నేను పక్షపాతధోరణిలో వ్యవహరిస్తున్నానని, ఒకప్రత్యేకవర్గాన్ని అభి షూనిస్తున్నానని మీరు నాపై నేరారోపణ చేశారు. ఈ ఆరోపణ మరింత అనుచితమైనది. బహిరంగంగా పత్రికలలో అధ్యక్షునిపై ఇలాటి నింద లను మోపడానికిముందు, ఈ విషయాన్నిగురించి విచారణజరపవలసిం దిగా కాంగ్రెసు అధికారిక అధిపతిని (వ్యక్తిగతంగా నన్ను కాకపోవ చ్చును) కోరవలసిన బాధ్యత మీకు లేదా?

మొత్తంమీద ఎన్నికవివాదాన్నిసింహావలోకనంచేసుకున్నట్లయితే, ఎన్నికపోటీ ముగిసిన పిదప, వివాదమంతా విస్మరింపబడగలదని, బాక్సింగ్ఆటలోవలె, ఆటగాండ్రిరువురూ కడకు స్నేహపూర్వకంగా కర స్పర్శకావించుకుందురని ఊహించనగును. కాని సత్యాహింసల ప్రభావం ఎంత ఉన్నప్పటికి యిలా జరగలేదు. ఎన్నికలఫలితం ఉత్సాహంతో స్వీక రింపబడలేదు. ఆటలపోటీలలో ఫలితాన్నిస్వీకరించినట్లుగాస్వీకరించలేదు. నాపై, కక్షకట్టి, అది పెరిగేటట్లు చేశారు.

కక్ష సాధించితీరాలని యత్నం ప్రారంభమైంది. వర్కింగ్‌కమిటీ సభ్యులతరపున మీరు నాపై కత్తులుదూశారు. అలాగ నాపై కత్తులుదూయ డానికి మీకు సర్వహక్కులూ ఉన్నవి. కాని నా తరపునకూడా కొంత న్యాయం చెప్పిఉండిఉండవలసిందని మీకు స్ఫురించలేదా? నా పరో క్షంలో వర్కింగ్‌కమిటీసభ్యులు సమావేశమై డాక్టర్ పట్టాభిని అధ్యక్ష పదవికి నిలబెట్టాలని నిశ్చయించడం సబబేనా? ఎన్నికలలో స్వప్రయో జనార్థం మహాత్మాగాంధీపేరునూ అధికారాన్నీ సర్దార్‌పటేల్ సర్వవిధాలా వినియోగించడం తప్పుకాదా? నేను అధ్యక్షపదవికి తిరిగి ఎన్నికకావడం, దేశానికి ఉపద్రవకరమని సర్దార్‌పటేల్ అనడంలో తప్పేమీలేదా? వోట్లు పేకరించేనిమిత్తం వివిధరాష్ట్రాలల్లో కాంగ్రెస్‌మంత్రివర్గాలను ఉపయో గించుకొనడంలో తప్పేమీలేదా?

పరస్పర నిందారోపణలనుగురించి చెప్పవలసిందంతా యింతకు పూర్వమే నేను చెప్పాను. పత్రికాప్రకటనలలోను, త్రిపురిలో విషయ నిర్ణాయకసభలోను నేను ఆ విషయాన్ని వివరించాను. కాని మిమ్మల్ని నేను ఒకప్రశ్న అడగదలచుకున్నాను. లార్డ్ లోథియన్ యిండియాలో

పర్యటనచేస్తూఉన్నప్పుడు, ఫెడరల్ పథకంవిషయంలో కాంగ్రెస్‌నాయకు లందరిలోనూ పండిట్ నెహ్రూపై తప్పితే ఏకీభావంలేదని బహిరంగంగా ఒకమాట అన్నారు. ఈ విషయాన్ని మీరు మరిచారా? ఆయన అలా అన డంలోని అంతరార్థం ఏమిటి?

ఫిబ్రవరి 22 న మీరు చేసిన పత్రికాప్రకటనలో, కాంగ్రెస్ అగ్ర నాయకులలో పరస్పరఅనుమానంతోను, అవిశ్వాసంతోను కూడిన వాతా వరణం ఉన్నదని మీరు ఆరోపణచేశారు. అధ్యక్షుని ఎన్నిక జరిగేవరకు వర్కింగ్‌కమిటీసభ్యులలో, అధ్యక్షపదవీకాలంలో ఉంటూవచ్చిన పర స్పర అనుమాన, అవిశ్వాసాలతో పోల్చిచూచిన ఎంతో తక్కువైన అవి శ్వాసము, అనుమానము నా అధ్యక్షపదవీకాలంలో వున్నవని నేను మీకు మనవిచేస్తున్నాను. మేము ఎప్పుడూ అవిశ్వాసకారణంగాను, అనుమాన కారణంగాను రాజీనామాలిచ్చేవరకు రాలేదు. మీ రన్నట్లు మీరు కొన్ని పర్యాయాలు రాజీనామాఇచ్చేవరకు వచ్చారు; నాకు తెలిసినంతవరకు అసలు ఈ రగడకంతా మూలకారణం నేను ఎన్నికలపోటీలో గెలు పొందడం. నేను ఎన్నికలో ఓడిపోయివున్నట్లయితే, ఈ పరస్పర నిందా వ్యవహారాన్నిగురించి అసలు ప్రజలు వినివుండేవారే కాదు.

మీరు ఎప్పుడూ మీ అభిప్రాయాన్నే చెపుతారని, ఎవ్వరికీ ప్రాతి నిధ్యంవహించరని, ఏ పార్టీతో మీకు సంబంధంలేదని, ప్రకటిస్తూ వుండటం మీకు అలవాటు. ఇందుకు మీరు గర్విస్తూవున్నట్లుగానో, లేక ఇందుకు ఆనందిస్తున్నట్లుగానో అప్పుడప్పుడు మీరు చెపుతూవుంటారు. ఒక్కొక్కసారి మిమ్మల్ని మీరు సోషలిష్టునని చెప్పుకుంటూవుంటారు. అందులోనూ నూటికినూరుపాళ్ళు సోషలిష్టునని చెప్పుకుంటారు. మిమ్మల్నిగురించి మీరు భావించినట్లుగా ఒక వ్యక్తిత్వవాది సోషలిష్టు ఎలాకాగలడో నాకు అర్థంకాకుండావున్నది. సోషలిజం, వ్యక్తిత్వవాదం పరస్పరవిరుద్ధమైనవి. మీ కోవకుచెందిన వ్యక్తిత్వవాదంద్వారా సోషలి జాన్ని ఎలా సాధించగలమో నేను వూహించలేకుండావున్నాను. ఏ పార్టీకి చెందనవని ముద్రవేసుకున్నందువల్ల అన్నిపార్టీలతో కలిసిమెలిసి వుండ వచ్చును. కాని అందువల్ల వచ్చే లాభ మేమిటి? కొన్నిలక్ష్యాలలో, కొన్ని

ఆదర్శాలలో, మనకు విశ్వాసంవున్నప్పుడు, మనం ఆ లక్ష్యాలను, ఆ ఆదర్శాలను ఆచరణలోపెట్టి వాటికి వాస్తవరూపం ఇవ్వడానికి కృషి చేయాలి. ఒక పార్టీద్వారా, లేక ఒక సంస్థద్వారామాత్రమే మనము అలా కృషిచేయగలము. ఏదేశంలోకాని పార్టీ వినా, సోషలిజం స్థాపింప బడడంకాని, లేక సోషలిజంవైపు ఆ దేశం పురోగమింపడంకాని నేను చూచివుండలేదు. మహాత్మాగాంధీకికూడా పార్టీ వున్నది.

మీరు తరచుగా పదే పదే ప్రస్తావించేవిషయం మరొకటి వున్నది. ఆవిషయాన్నిగురించికూడా నేను కొంత చెప్పదలిచాను. అది జాతీయ ఐక్యత. జాతీయఐక్యతను నేను పూర్తిగా విశ్వసిస్తాను; అంగీకరిస్తాను. నేనేకాదు, దేశమంతాకూడా జాతీయఐక్యతను అంగీకరిస్తుంది. కాని ఈ విషయంలో ఒకపరిమితివున్నది. మనం ఏ ఐక్యతకోసం ప్రయత్నిస్తామో ఆ ఐక్యత సచేతనమైన ఐక్యతైవుండవలెనుకాని, కర్తవ్యతారహితమైన ఐక్యతైవుండరాదు. అన్నిపరిస్థితుల్లోనూ, చీలిక లనేవి. అవాంఛనీయ మైనవికావు. పురోగతిదృష్ట్యా చీలికలు అవసరమైన సందర్భాలుకూడా వున్నాయి. 1903లో రష్యాలో సోషల్ డెమాక్రాట్ పార్టీ, బోల్షివిక్‌లని, మెన్షివిక్‌లని రెండువర్గాలుగా చీలిపోయినప్పుడు లెనిన్ తన బరువుతీరి నట్లు భావించాడు. వ్యర్థమైన మెన్షివిక్‌లబరువుతో విసిగిపోయి,శీఘ్రపురో గతికి మార్గము ఏర్పడినందుకు ఆయనకు తృప్తికలిగింది. ఇండియాలో మితవాదులు కాంగ్రెసుకు దూరంగాతొలగినప్పుడు అభ్యుదయదృష్టికలిగిన వారెవ్వరూ, ఈ చీలిక ఏర్పడినందుకు విచారించలేదు. ఆ తరువాత 1920 లో అనేకమంది కాంగ్రెసువాదులు కాంగ్రెసునుంచి వైదొలగినప్పుడు మిగిలినవారు అందుకొరకు వాపోవలేదు. నిజానికి ఈవిధమైన చీలికలు పురోగతికి సహాయకారులు. ఇంతే కాక ఐక్యతకు లేనిపోని ప్రాధాన్యాన్నికల్పించి ఆ భావాన్ని ఒక మతంలాగ తయారుచేస్తు న్నాము. ఇలా చెయ్యడంలో పెద్దఉపద్రవం ఉన్నది.బలహీనతలను కప్పి పుచ్చేముసుగుగాగాని, అభ్యుదయనిరోధకమైన రాజీలను సమర్థించుకొ నడానికిగాని, ఈ ఐక్యతను ఒక సాధనంగా వినియోగించుకునే అవకాశం ఏర్పడుతుంది. ఉదాహరణకు మీ విషయాన్నే తీసు

రంనాము. మీరు గాంధీ ఇర్విన్ ఒడంబడికకు వ్యతిరేకులు. కాని ఐక్యత పేరిట మీరు ఆ ఒడంబడికకు తలఒగ్గారు. రాష్ట్రాలలో కాంగ్రెస్ అధికార స్వీకారం చెయ్యడానికి మీరు వ్యతిరేకులు. కాని కాంగ్రెస్ అధికార స్వీకారం చెయ్యాలని నిర్ణయింపబడినతరువాత మీరందుకు అంగీకరించారు. బహుశా ఐక్యతపేరిటనే మీ రంగీకరించివుంటారు; వారపద్ధతికి మీ విరాగ చెబుతారనుకోండి. ఫెడరల్ పథకాన్ని అనుసరించి పనిచేయడానికి కాంగ్రెసులో అధికసంఖ్యాకులు అంగీకరిస్తే, ఫెడరల్ పథకానికి వ్యతిరేకులు, ఫెడరల్ పథకాన్ని అంగీకరించరాదనే తమ స్పష్టమైన నిర్ణయాన్ని అతిక్రమించి, ఐక్యతపేరిట, తమ రాజకీయవిశ్వాసాలకు అంతరాత్మకు విరుద్ధంగా ఫెడరల్ పథకాన్ని అంగీకరించగలరన్నమాట. విప్లవోద్యమంలో ఐక్యతఅన్నది ఒక సాధనంమాత్రమేకాని దానికదే పరమావధికాదు. పురోగతికి అది దోహదంచేసినంతవరకే అది వాంఛనీయంకాగలదు. పురోగతికి అది అవరోధంగా పరిణమించిన తక్షణం అవాంఛనీయంకాగలదు. కాంగ్రెసులో అధికసంఖ్యాకులు ఫెడరల్ పథకాన్ని అంగీకరించివున్నట్లయితే, మీరు ఏమి చేసివుండేవారని అడగవచ్చునా? ఆ నిర్ణయానికి మీరు కట్టుబడిఉండేవారేనా? లేక ఆ నిర్ణయంపై తిరుగుబాటుచేసిఉండేవారా?

అలహాబాద్ నుంచి ఫిబ్రవరి 4న మీరు నాకు వ్రాసినలేఖ ఒకవిధంగా నాకు ఔత్సుక్యాన్ని కలగజేస్తున్నది. ఎందుచేతననగా ఆ తరువాత మీరు నాపట్ల వైమనస్యం పొందినంతగా అప్పటికి అంత వైమనస్యం పొంది ఉండలేదని ఆ లేఖద్వారా తెలుస్తున్నది. ఉదాహరణకు మీరు ఆ లేఖలో ఇలా వ్రాశారు: "నే నన్నట్లు, మీరు పోటీచేసిన ఎన్నికఫలితంగా కొంత మంచీ కొంతచెడూ జరిగింది". ఆ తరువాత, మీరు, నేను అధ్యక్షపదవికి తిరిగి ఎన్నికకావడంవల్ల కేవలం చెడుతప్ప మంచి జరగలేదనే అభిప్రాయానికి వచ్చారు. ఆ తరువాత మీరు మళ్ళీ ఇలా వ్రాశారు: "మనం ఈ భవిష్యత్తును విశాలదృష్టితో చూడాలి. వ్యక్తులదృష్ట్యా చూడరాదు. మనం అనుకున్నరీతిగా పరిస్థితులు పరిణమించనందువల్ల మనం ఉద్రిక్తత చెంది పరస్పరనిందారోపణలకుదిగి లాభంలేదు. మనం మనశక్తినంతా మన ఆదర్శంకొరకు వాడబోయాలి." ఆ లేఖలో మీరు "పరస్పరం" కు

అంత ప్రాధాన్యం ఇవ్వలేదు. అంతేకాదు. "పరదూషణ" పై ఆ పిదప రెచ్చగొట్టబడిన ఆందోళన ఎక్కువగా మీచే కల్పించబడినదే. ఈసందర్భంలో మీరు మరొక విషయాన్ని జ్ఞప్తికితెచ్చుకోవలెనని కోరుతున్నాను. మనం శాంతినికేతనంలో కలుసుకున్నప్పుడు, నేను మీకు ఒక విషయాన్ని సూచించాను. వర్కింగ్ కమిటీసభ్యుల సహకారాన్నిపొందే విషయంలో మనప్రయత్నం విఫలమైనప్పటికి, కాంగ్రెసుసంస్థను నడిపే బాధ్యతను మనం నిరాకరించరాదని అన్నాను. అప్పుడు మీరు ఆవిషయాన్ని అంగీకరించారు. ఆ తరువాత, మీరు ఇటునుంచి అటువైపుకు మారారు. ఈ మార్పుకు కారణాలు నేను ఊహించలేకుండాఉన్నాను. మీకు అలా మారేహక్కు లేదని నేను అనను. కాని మీ సోషలిజంవిషయం, మీ వామపక్షతత్వంవిషయం ఏమైనట్లు?

సమాఖ్యవంటి ప్రధానసమస్యలు నా అధ్యక్షపదవీకాలంలో చర్చింపబడలేదని ఫిబ్రవరి 4న మీరు నాకువ్రాసినలేఖలో మీరు నాపై ఆరోపణచేశారు; సుమారు ఆరునెలలపాటు మీరు దేశాంతరంలోఉండి మీరు నాపై ఇలా ఆరోపణచెయ్యడం ఎంతో విచిత్రంగా ఉన్నది. లండన్‌లో భూలాభాయ్‌దేశాయ్ ఇచ్చినాడన్న ఒక ఉపన్యాసాన్నిగురించి తుఫాను చెలరేగినప్పుడు, సమాఖ్యకు వ్యతిరేకంగా మన తీర్మానాన్ని పునరుద్ఘాటించవలెనని నేను వర్కింగ్‌కమిటీని కోరినాను. దేశంలో సమాఖ్యకు వ్యతిరేకంగా ప్రచారము సాగించవలెననికూడా కోరినాను. కాని నా సూచన అనవసరమని త్రోసివెయ్యబడింది. ఈ విషయము మీకు తెలుసునా? ఆ తరువాత సెప్టెంబర్‌లో ఢిల్లీలో వర్కింగ్‌కమిటీసమావేశం జరిగినప్పుడు– సమాఖ్యనుఖండిస్తూ తీర్మానముచేయవలసిన అవసరం కడపటికి గుర్తింపబడి ఆ తీర్మానము అఖిలభారత కాంగ్రెస్‌కమిటిచే ఆమోదింపబడినవిషయము మీకు తెలుసునా?

మీరు నాకు వ్రాసినలేఖలో నాపై మరొక ఆరోపణను చేశారు. వర్కింగ్‌కమిటీలో నేను అచేతనవైఖరిని అవలంబించినానని, తత్ఫలితంగా మార్గముచూపవలసిన అధ్యక్షునివలెకాక ఉపన్యాసకునివలెనే వ్యవహరించినానని మీరన్నారు. మీరిలాగ వ్యాఖ్యానించడం నా దృష్టిలో

సబబుగాలేదు. సాధారణంగా వర్కింగ్ కమిటీసమావేశాలలో హెచ్చు కాలాన్ని మీరే గుత్తకుతీసుకునేవారని నే నంటే అందులో అనుచితం ఏమీఉండదని అనుకుంటాను. మీఅంత మాటకారిఅయినసభ్యుడు వర్కింగ్ కమిటీలో మరొకరు ఉంటే, మనపనులు ఎన్నడూ ఒక కొలికికి వచ్చిఉండేవికావు. అంతేకాక, వర్కింగ్ కమిటీలో మీ ప్రవర్తన అధ్యక్షునిబాధ్యతలనుకూడా అక్రమంగా హస్తగతంచేసుకునేదిగా ఉండేది. అలాటి సందర్భాలలో నేను మిమ్మల్ని మందలించి పరిస్థితులను అదుపులోఉంచేవాడనేకాని, అలాచేయడంవలన మనమధ్య బహిరంగంగా చీలికఏర్పడవచ్చునని నేను అలాచేయలేదు. నిర్మొహమాటంగా ఉన్నమాట ఉన్నట్లుగా చెప్పవలెనంటే మీ రొకొక్కసారి వర్కింగ్ కమిటీసమావేశాలలో అల్లరికుర్రవానివలె ప్రవర్తించి, తరుచుగా కోపతాపాలకు గురిఅవుతూవచ్చేవారు. ఇక ఇంత ఉద్రేకపడినపిదప మీరు సాధించగలిగిన ఫలితాలు ఏమిటి? గంటలతరబడి మాట్లాడి కడకు తలఒగ్గేవారు. మీతో ఎంతో తెలివిగావ్యవహరించేపద్ధతి ఏమిటో, సర్దార్ పటేల్, తదితరులకు తెలుసును. వారు మిమ్మల్ని గంటలతరబడి మాట్లాడనిచ్చేవారు. చివరకు 'వారి' తీర్మానాన్ని మీచేత వ్రాయించేవారు. వారు మిమ్మల్ని తీర్మానాన్ని వ్రాయడానికి అనుమతించగానే మీరు అదంతా మర్చిపోయి ఆ తీర్మానం ఎలాంటిదైనాసరే, వ్రాసేవారు. మీరు మీ వాదానికి, చివరివరకూ కట్టుబడిఉండడం నే నెన్నడూ చూడలేదు.

అఖిలభారతకాంగ్రెస్‌కార్యాలయంలోని పనులన్నీ నావల్ల, గత సంవత్సరం ఎక్కడివక్కడ స్థంభించిపోయాయని మీరు నామీద విచిత్రమైన ఆరోపణచేశారు. అధ్యక్షుడు నిర్వహించవలసిన బాధ్యతలను గురించి మీ ఉద్దేశ్య మేమిటి? నా అభిప్రాయంలో అధ్యక్షుడంటే, ఒక పెద్ద గుమస్తాకాదు; లేదా ఒక పెద్ద కార్యదర్శికాదు. మీరు అధ్యక్షులుగా వున్నప్పుడు, కార్యదర్శిబాధ్యతలనుకూడా అనవసరంగా నిర్వహించే అలవాటు మీకు వుండేది. కాని ఇతర అధ్యక్షులుకూడా ఈవిధంగా ఎందుకు చేయాలో, నాకు బోధపడడంలేదు. ఇంతేకాక, అఖిలభారత కార్యాలయం నాకు దూరంలోవుండడంవల్ల ఒక పెద్దచిక్కు వచ్చిపడింది.

ప్రధానకార్యదర్శి నా కోరికపై నియమింపబడినవ్యక్తికూడా కాదు. ఒక కార్యదర్శి అధ్యక్షునిపట్ల, ఏవిధమైనసమ్మకంతో వ్యవహరించవలెనో, అట్టినమ్మకంతో, ప్రధానకార్యదర్శి నాపట్ల వ్యవహరించడంలేదు. (నే నీ విషయాన్ని ఉద్దేశ్యపూర్వకంగానే, సభ్రమరాధావంతో చెప్పవలసివస్తోంది. నిజం చెప్పాలంటే, నా ఇచ్ఛకువిరుద్ధంగా, కృపలానీని, నాపై రుద్దారు. అఖిలభారతకాంగ్రెసుకార్యాలయంలో ఒకబాగాన్ని కలకత్తాకు మార్పించడానికి, నే నెంతో ప్రయత్నించాను. ఆవిషయం మీకు జ్ఞాపకంవుండివుంటుంది. కార్యాలయంలోని కార్యకలాపాలను, నేను పర్యవేక్షించడానికి ఎక్కువ అవకాశంవుంటుందనేఊహతో నేను అలాగ, కార్యాలయాన్ని తరలించడానికి ప్రయత్నించాను. కాని అప్పుడు, మీరందరు, అందుకు వ్యతిరేకించారు. ఇప్పుడు అఖిలభారతకాంగ్రెసు కార్యాలయంలో, లోపాలున్నవని నన్ను ఆడిపోస్తున్నారు. మీ రారోపణ చేస్తున్నట్లుగా, నిజంగా కార్యాలయపనులకు అంతరాయమే కలిగివున్నట్లయితే, అందుకు బాధ్యుడు ప్రధానకార్యదర్శికాని, నే నెంతమాత్రం కాను. నా అధ్యక్షపదవీకాలంలో ప్రధానకార్యదర్శి కావించే పనులలో నేను ఎంతో తక్కువ జోక్యంకలగచేసుకున్నాననిమాత్రమే మీరు నాపై ఆరోపించగలరు. తత్ఫలితంగా ప్రధానకార్యదర్శి, ఇంతకుముందున్న ఎక్కువ అధికారాలను చెలాయించగలిగాడు. అందువల్ల అఖిలభారత కాంగ్రెసుకార్యాలయం నిజంగా క్షీణదశకువచ్చింది. ఇందుకు బాధ్యుడు ప్రధానకార్యదర్శికాని, నేను కానేకాదు.

బొంబాయి వాణిజ్యతగాయిదాలచట్టం ప్రస్తుతరూపంలో, చట్టంగా తయారుకాకుండా, అరికట్టడానికి నేను తగినంతకృషిచేయలేదని మీరు, వాస్తవికవిషయాలను గుర్తించక, నాపై మరొక నేరారోపణకావించడం నాకెంతో ఆశ్చర్యంగావుంది. నిజం చెప్పాలంటే, మీరు నాపై నేరారోపణ కావించేకళలో నిష్ణాతులైనట్లు కనిపిస్తోంది. మీరొక్కొక్కసారి బాహాటంగాకూడా, నేరాలను ఆరోపిస్తున్నారు. మీరు నాపై నేరారోపణచేస్తారే కాని, ఆ ఆరోపణకు సంబంధించిన నిజానిజాలను ఋజువుచెయ్యడానికి మీరు సరకుచేయరు. బొంబాయి వాణిజ్యతగువులబిల్లువిషయంలో నేనేం

చేశానో, మీరు తెలుసుకోవాలనుకుంటే, నా విషయాన్ని సర్దార్ పటేల్ కు అప్పగించడం ఎంతో బాగుంటుంది. అతనితో నేను వివరించకపోవడమే, నా ఈ విషయంలో చేయనిపని; ఇది నేరమైనట్లైతే, ఈ నేరాన్ని నేను అంగీకరిస్తాను. మరొకమాట: బొంబాయి, సి. యస్. పి. ప్రస్తుతమాసంలో, ఈ బిల్లును బలపరిచింది. ఈ సంగతి మీకు తెలుసునా? ఇక ఇది శాసనరూపం ధరించకుండా నిరోధించడానికి, మీరుమాత్రం ఏం చేశారు?

మీరు బొంబాయికి, తిరిగివచ్చినతరువాతకూడా, ఈ విషయంలో కృషిచేయడానికంతా కావలసినంత వ్యవధివుంది. ట్రేడ్ యూనియన్ ఉద్యమానికి సంబంధించినవ్యక్తులు కొందరు, మిమ్మల్ని కలుసుకున్నారని, వారికి మీరు కొన్ని ఆశలుకల్పించారని నేను భావిస్తున్నాను. ఈ విషయంలో కృషిచేయడానికి, నా పరిస్థితికన్న, మీ పరిస్థితి ఎంతో సుకరమైనది. గాంధీజీ ఎప్పుడూ మీ ప్రభావానికి లొంగుతూనేవుంటారు. మీరు ఈ విషయంలో కృషిసలిపిఉన్నట్లయితే, నేను ఏ విషయంలో విఫలుడనైనానో ఆ విషయంలో మీరు విజయాన్ని సాధించివుండేవారు. కాని మీరు అలాగ చేశారా?

ఇక మీరు నాపై తరచుగా మోపే నేరారోపణ మరొకటి ఉన్నది. అది మిశ్రమ మంత్రివర్గానికి సంబంధించినది. మీరు సైద్ధాంతిక రాజకీయవేత్తలు కావడంవల్ల మిశ్రమమంత్రివర్గమన్నది మితవాదపద్ధతి అని ఒకేఒకమాటు మార్పులేకుండా నిర్ణయించివేశారు. ఈ సమస్యపై కడపటి తీర్పును వెలువరించడానికిముందు మీరు దయతో ఒకపని చెయ్యగలరా? అస్సాంరాష్ట్రంలో ఒక పదిదినాలు పర్యటించివచ్చి, మిశ్రమ మంత్రివర్గం అభ్యుదయకరమైనసంస్థయో, లేక అభ్యుదయనిరోధకమైన సంస్థయో నాకు తెలుపండి. అలహాబాద్‌లో కూచుని, వాస్తవపరిస్థితులతో ఏవిధంగాను సంబంధంలేని జ్ఞానోపదేశాలను చెయ్యడంవల్ల వచ్చే ఉపయోగం ఏమిటి? సాదుల్లామంత్రివర్గ పతనానంతరం, నేను అస్సాం రాష్ట్రానికి వెళ్ళినప్పుడు, మిశ్రమమంత్రివర్గం విధిగా ఏర్పడవలెనని నొక్కి వక్కాణించని కాంగ్రెస్‌వాది ఒక్కడూలేడు. అసలు వాస్తవం ఏమిటంటే, అస్సాంరాష్ట్రం అభివృద్ధినిరోధకమంత్రివర్గంక్రింద అణ

గారిపోయి మూల్గుతూఉన్నది. పరిస్థితులు నానాటికి తీసికట్టుగాఉన్నవి. రానురాను అవినీతి హెచ్చుతున్నది. కొత్తమంత్రివర్గం అధికారస్వీకారంచెయ్యగానే అస్సాంరాష్ట్రంలోని కాంగ్రెస్‌తత్వంగల ప్రజలందరూ తమ బరువుతీరినట్లుగా భావించారు. వారిలో మళ్ళీ విశ్వాసమూ ఆశా మొలకెత్తాయి. కాంగ్రెస్ అధికారంస్వీకరించరాదనే విధానాన్ని యావత్తు దేశానికి అనువర్తింపజేస్తే అందుకు నేను కాదనను. కాని, ఏడు రాష్ట్రాలలో కాంగ్రెస్ అధికారస్వీకారం చేసినప్పుడు, యితర రాష్ట్రాలలోకూడా మిశ్రమమంత్రివర్గాలుండడం అవసరం. మిశ్రమమంత్రివర్గం అధికారస్వీకారంచేసిననాటినుంచి, అనేక అవరోధాలను అధిగమించి, అస్సాం రాష్ట్రంలో ఏవిధమైన అభివృద్ధికి కారణమైనదో మీకు తెలిస్తే, మీకు మిశ్రమమంత్రివర్గాన్నిగురించి ఉన్న అభిప్రాయాన్ని తప్పక మార్చుకొనగలరు.

ఇక బెంగాల్‌విషయం—మీకు బెంగాల్‌విషయం ఏపాటికూడా తెలియదని నే ననుకుంటాను. మీరు కాంగ్రెసుఅధ్యక్షులుగాఉన్న రెండు సంవత్సరాలలోను, అనేక దురంతాలవల్ల రాష్ట్రం ఎంతో చితికిపోయి, రాష్ట్రంపట్ల మీరు శ్రద్ధచూపవలసిన అగత్యం ఉన్నప్పటికి, రాష్ట్రంలో పర్యటించడానికికూడా మీరు లెక్కచేయలేదు. హక్‌మంత్రివర్గం పదవీస్వీకారంచేసినపిదప రాష్ట్రంలో ఏమి జరిగినదో తెలుసుకొనడానికి మీరు శ్రద్ధవహించారా? మీకు ఈ విషయాలు తెలిసిఉన్నట్లయితే మీరు సైద్ధాంతిక రాజకీయవేత్తవలె మాట్లాడరు. ఈ విషయాలు మీకు తెలిసిఉన్నట్లయితే, రాష్ట్రాన్ని ఇక్కట్టునుంచి తప్పించడానికి హక్‌ప్రభుత్వం పోవాలని, ప్రస్తుతపరిస్థితులలో మంచిప్రభుత్వం, అనగా మిశ్రమమంత్రివర్గం ఏర్పాటుకావాలనే నా అభిప్రాయంతో మీరు ఏకీభవించిఉండేవారు. ఈ విషయా లన్నిటితోపాటు నేను మరోవిషయాన్నికూడా చెప్పదలిచాను. సంపూర్ణస్వరాజ్యసమరం తాత్కాలికంగా ఆపుచేయబడినది కాబట్టి మిశ్రమమంత్రివర్గం స్థాపించవలెననే సూచనకు లావు ఏర్పడుతున్నది. ఆ సమరాన్ని రేపే ప్రారంభిస్తే మిశ్రమమంత్రివర్గాన్నిగురించిన ఈ వాదోపవాదాలన్నీ ఇట్టే మాయమైపోతాయి.

ఇక, మీరు ఢిల్లీనుంచి మార్చి 20న ఇచ్చిన టెలిగ్రాంనుగురించి ప్రస్తావిస్తాను. ఆ టెలిగ్రాంలో ఇలా ఉన్నది. 'అంతర్జాతీయ పరిస్థితుల దృష్ట్యాను, క్లిష్టరూపంధరిస్తున్న జాతీయసమస్యలదృష్ట్యాను, వర్కింగ్ కమిటీని శీఘ్రంగా ఏర్పరచి కార్యాలయంఏర్పాటుచెయ్యడం అత్యవసరం.' ఇదేకాక మరికొన్నివిషయాలు అందులో వున్నాయి. వర్కింగ్ కమిటీని శీఘ్రంగా ఏర్పరచవలెనన్న విషయాన్ని ఎవరైనా అంగీకరిస్తారు. కాని మీ టెలిగ్రాంలో ఒక విషయం నాకు కొట్టవచ్చేటట్లు కనుపించి బాధకలగజేసింది. అది, నాచిక్కులపట్ల మీకు అణుమాత్రమైనా సానుభూతిలేకపోవడం. పంత్‌తీర్మానం ప్రవేశపెట్టబడి ఆమోదింపబడి ఉండకుండాఉన్నట్లయితే, మార్చి 13వ తారీఖుననే వర్కింగ్‌మిటీ ప్రకటితమైఉండేదన్నవిషయం మీకు బాగా తెలుసును. ఆ తీర్మానం ఆమోదింపబడినప్పుడు, నాకు చాలాజబ్బుగాఉన్నదని, మహాత్మాగాంధీ త్రిపురికి రాలేదని, అవ్యతనభావిలో ఆయన్ని కలుసుకొనడం కష్టమైనవిషయమని కాంగ్రెసుకుతెలుసును. వర్కింగ్‌కమిటీనిఏర్పరచకుండా ఒక నెల రోజులు గడిపితే, ప్రజలలో అశాంతి ఏర్పడుతుందనేవిషయంకూడా నాకు తెలుసును; కాని, త్రిపురికాంగ్రెసుముగిసిన ఒక వారంలోపుగానే ఈఆందోళన ప్రారంభించబడింది. పరస్పర దూషణవ్యవహారంపై నాపై దండయాత్రను ప్రారంభించినట్లే ఈ ఆందోళనకూడా ప్రారంభించింది మీరే. మహాత్మాగాంధీని కలుసుకోకుండా వర్కింగ్‌కమిటీని ఏర్పరచడం సులభసాధ్యమైనవిషయమేనా? నేను మహాత్మాజీని కలుసుకోడానికి అవకాశం ఎక్కడ వున్నది? గతసంవత్సరం హరిపురకాంగ్రెసు జరిగినతరువాత ఆరువారాలకు వర్కింగ్‌కమిటీ సమావేశమైన విషయాన్ని మీరు మరిచారా? మీ టెలిగ్రాం పత్రికలలో ప్రకటింపబడిన తరువాత కొందరు ప్రజలు, కొన్ని పత్రికలు నాపై ప్రారంభించిన ఆందోళన విజాయితీగలిగినదనేనా మీ భావం? వర్కింగ్‌కమిటీని నియమించకుండా

ఉద్దేశపూర్వకంగా ఆపిఉంచి, కాంగ్రెసువ్యవహారాలలో ప్రతిష్టంభన కల్పించడానికి నేను జబ్బుతో మంచంపట్టిఉన్న సమయంలో, నా తరఫున ప్రజలకు ఒక్కమాట అయినా చెప్పడం ప్రజానాయకులైన మీ ధర్మం కాదా ?

నా అధ్యక్షపదవీకాలంలో ఎ. ఐ. సి. సి. క్షీణదశకు వచ్చినదని మీరు చేసిన నేరారోపణనుగురించి ఇంతకు పూర్వమే ప్రస్తావించాను. ఈ సందర్భంలో మరోముక్కకూడా చెప్పవలసిఉన్నది. ప్రధానకార్యదర్శిని, నన్నూ నిందిస్తున్నప్పుడు, నాతోపాటు ఎ. ఐ. సి. సి. కార్యాలయసిబ్బందిని యావత్తూ నిందిస్తున్నానన్నదృష్టి మీకు కలగలేదా?

మీరు ఢిల్లీనుంచి ఇచ్చిన టెలిగ్రాంలో 'క్లిష్టజాతీయసమస్యల'ను గురించి ప్రస్తావించారు. ఈ సమస్యలను పరిష్కరించడంకొరకు, మీరు వర్కింగ్‌కమిటీలో ఉండడానికి సమ్మతించకపోయినా, శీఘ్రంగా ఒక వర్కింగ్‌కమిటీని ఏర్పాటుచేయమని నన్ను కోరారు. ఈ 'క్లిష్టజాతీయ సమస్యలు' ఏమిటో కొంచెం తెలవిస్తారా? ఇంతకుపూర్వం మీరు వ్రాసిన ఒక లేఖలో అన్నిటికన్న క్లిష్టమైనసమస్య, రాజకోట్,జయపూర్‌లలోని పరిస్థితి అని వ్రాశారు. మహాత్మాజీ తాము స్వయంగా ఈ వ్యవహారాలను నిర్వహిస్తున్నారు కాబట్టి, ఒకవిధంగా ఇవి ఎ. ఐ. సి. సి. వర్కింగ్ కమిటీలపరిధికి చెందనివి. ఆ తరువాత, మీ టెలిగ్రాంలో మీరు అంతర్జాతీయ పరిస్థితినిగురించి ప్రస్తావించారు. మీరు ఈ విషయాన్ని ప్రస్తావించిన తరువాత, అంతర్జాతీయదృష్టి ఏమాత్రం లేనివారు, అంతర్జాతీయ వ్యవహారాలను అర్థంచేసుకొనవలెననే ఔత్సుక్యంకూడా లేనివారు, ఇండియాకు లాభసాటిగా అంతర్జాతీయపరిస్థితిని ఉపయోగించుకొనవలెననే ఉద్దేశంలేనివారు, అనేకమంది వ్యక్తులు హఠాత్తుగా బొహిమియా, స్లొవేకియాల భవితవ్యాన్నిగురించి శ్రద్ధచూపడం నేను గమనించాను. నాపై ప్రయోగించడానికి ఇది నిజంగా తగిన దండమే. గత రెండు మాసాలనుంచి ఐరోపాలో అనుకోనిసంఘటన ఒక్కటికూడా జరగలేదు. జెకొస్లొవేకియాలో జరిగింది మ్యూనిచ్ ఒడంబడికఫలితం మాత్రమే. ఐరోపానుంచి నాకు వస్తూఉన్న సమాచారాన్ని ఆధారంగాచేసుకొని, వసం

తంలోమాత్రమే ఐరోపాలో క్లిష్టపరిస్థితి ఏర్పడగలదని, ఆ క్లిష్టపరిస్థితి వేసవివరకూ కొనసాగగలదని, కాంగ్రెస్‌లోని నా మిత్రులకు ఎంతో కాలంనుంచి చెబుతూనేఉన్నాను. అందుచేతనే మనవైపునుంచే ఒక తీవ్రమైనకదలిక రావాలని, పూర్ణస్వరాజ్యాన్నికోరుతూ మనం బ్రిటిషుప్రభుత్వానికి కడపటిహెచ్చరిక నివ్వాలని నేను ఒత్తిడిచేస్తూవచ్చాను. ఇటీవల నేను అంతర్జాతీయపరిస్థితినిగురించి మీతో మాట్లాడినప్పుడు (శాంతినికేతన్‌లోనో లేక అలహాబాద్‌లోనో) బ్రిటిషుప్రభుత్వానికి జాతీయడిమాండును సమర్పించేందుకు అంతర్జాతీయపద్ధతిని ఒకకారణంగా చెప్పగా అంతర్జాతీయపరిస్థితి కొన్ని సంవత్సరాలవరకూ ఇలాగే ఉండగలదని మీరు అన్నారు. అంతర్జాతీయపరిస్థితినిగురించి హఠాత్తుగా మీకు చెప్పుకోవలసిన అవశ్యం ఏర్పడినట్లున్నది, కాని అంతర్జాతీయపరిస్థితిని మన ఉపయోగార్థం వినియోగించుకొనవలెననే ఉద్దేశం మీకుకాని, గాంధీజీవర్గంవారికి ఎవరికి కాని ఉన్నట్లు కనుపించదు. అంతర్జాతీయంగా ఏర్పడిన క్లిష్టపరిస్థితి కారణంగా శీఘ్రంగా ఎ. ఐ. సి. సి. ఏర్పాటుచేయవలెనని, మీ టెలిగ్రాములో వున్నది. కాని ఎ. ఐ. సి. సి. సమావేశాన్ని ఏర్పాటుచేసి మనం చేయగలిగింది ఏమిటి? ఆచరణలో ఏవిధమైన ఫలితములేని స్ఫురద్దీప్తపదజాలంతోకూడిన తీర్మానాన్ని చేయడమేకదా మనం చేయగలిగింది? లేక మీరు మీ మనస్సునుమార్చుకుని పూర్ణస్వరాజ్యసమరాన్ని త్వరితగతిని సాగించి బ్రిటిషుప్రభుత్వానికి కడపటిహెచ్చరికను అందజేయాలని ఆదేశించగలరా? అంతర్జాతీయరాజకీయాలను మనం శ్రద్ధాదృష్టితో పరిశీలించి మనకు లాభసాటిగా వినియోగించుకోనైనా వినియోగించుకోవాలి. లేదా వాటినిగూర్చి మాట్లాడడమైనా మానేయాలి. పనులు తేలకపోయినతరువాత అనవసరమైన ఆడంబరాలతోను, ప్రదర్శనాలతోనూ ఉపయోగంలేదు.

మీరు ఢిల్లీలోవున్నప్పుడు మహాత్మాజీ అలహాబాదువెళ్ళి మౌలానా ఆజాద్‌ను కలుసుకొనవలెనని మీరు మహాత్మాజీకి ఒక వార్తను పంపినారని నాకు తెలియవచ్చింది. ఈ వార్త నిజంకాకపోవచ్చు, కాని ఈ వార్తే నిజమైనట్లయితే ధన్‌బాద్‌కూడా వెళ్ళమానవలెనని మీరు మహాత్మాజీని కోరారా? డాక్టర్ల నిషేధకారణంగా, మహాత్మాజీ ధన్‌బాద్ రాకూడదనే

పత్రికావార్త నిజంకాదని తెలపడంకొరకు మార్చి 24 న నా కార్యదర్శి మీకు టెలిఫోన్ చేసినప్పుడు, గాంధీజీ అభిమతాన్ని అనుసరించి, వర్కింగ్ కమిటీని నేను ఏర్పాటుచేయవలెనని మీరు ఆతురపడుతున్నప్పటికీ గాంధీజీ ధన్‌బాద్ రావలెననే అభిమతాన్ని మీరు వ్యక్తీకరించలేదు. పైగా ధన్‌బాద్ ఆయన పర్యటనకార్యక్రమంలోకూడా లేదని మీరు ఫోన్‌లో చెప్పారు. మహాత్మాజీని ధన్‌బాద్ రావలసినదనికోరడం మీకు అంతకష్టమైనపనైందా? అసలు మీరిందుకు ప్రయత్నించారా? రాజకోట వ్యవహారవిషయంలో ఢిల్లీకి ఆయన తిరిగి వెళ్ళవలసివచ్చిందని మీరు చెప్పవచ్చును; కాని వైస్రాయితో ఆయన ఇంటర్వ్యూ అప్పటికే ముగిసింది. ఇక సర్ మారిస్ గ్వాయర్‌తో ఇంటర్వ్యూచేసేవిషయం సర్దార్ పటేల్‌కు సంబంధించింది కాని, మహాత్మాజీకి సంబంధించిందికాదు.

రాజకోట వ్యవహారాన్నిగురించి నేను మీతో మరికొన్నిమాటలు చెప్పదలిచాను. రాజకోటవ్యవహారపరిష్కారానికి మీరు అనేకపద్ధతులను ఆలోచించి ఒక పరిష్కారమార్గాన్ని సూచించారు. తత్ఫలితంగా మహాత్మాజీ నిరసనదీక్షను విరమించడం జరిగింది. మహాత్మాజీ నిరసనదీక్షను విరమించినందుకు సంతోషపడని భారతీయుడెవడూ ఉండడు. కానీ మీరు సూచించిన పరిష్కారమార్గాన్ని తర్కదృష్ట్యా పరిశీలించిచూస్తే తేలేదేమిటి? మొదటివిషయం: ఫెడరల్ పథకంలో ఒక అంతర్భాగమువంటివాడైనా మారిస్‌గ్వాయర్‌ను మధ్యవర్తిగా ఎన్నుకున్నారు. అనగా ఫెడరల్ పథకాన్నే ఒప్పుకున్నట్లుగా కాలేదా? మరొక విషయం. సర్ మారిస్ మనవాడుకాడు; అతడొక స్వతంత్రుడైన ఏజంటు. పైగా కేవలం అతడు ప్రభుత్వానికి సంబంధించినవ్యక్తి. బ్రిటిష్‌ప్రభుత్వంతో మనకు ఏవిధమైన సంఘర్షణలో వచ్చినపుడు, మనం హైకోర్టు జడ్జీనో, లేక సెషన్‌న్యాయమూర్తినో మధ్యవర్తిగా ఎన్నుకుంటే అందుకు బ్రిటిష్‌ప్రభుత్వం ఎంతో సంతోషంతో అంగీకరిస్తుంది. ఉదాహరణకు విచారణలేకుండా నిలిపివుంచబడిన సంస్థానాలఖైదీలవిషయంలో అవసరమైన కాగితాలు రెండవహైకోర్టులోను, సెషన్స్‌జడ్జీలముందు ఉంచబడినవని చెప్పి ప్రభుత్వ మెంతో గర్విస్తూవుంటుంది. కాని మనం దానిని సం

తృప్తికరమైన పరిష్కారమార్గంగా అంగీకరించం. ఇక రాజకోటవిష యంలో ఇందుకు విభిన్నంగా ఎందుకుజరిగిందో వూహించలేకుండా వున్నాను.

ఈ సందర్భంలో మరొకవిషయంకూడా నాకు దుర్వగాహంగా ఉన్నది. మహాత్మాగాంధీ వైస్రాయినిచూడడానికి వెళ్ళారు. యథావిధిగా ఇంటర్వ్యూజరిగింది. ఆయన ఇంటర్వ్యూజరిగినతరువాతకూడా ఢిల్లీ లోనే ఎందుకని కాచుకునిఉన్నారు? సర్ మారిస్ గ్వయర్ కోరినమేరకు ఢిల్లీలో కాచుకుని ఉండవలసింది సర్దార్ పటేల్. వైస్రాయ్‌తో ఇంట ర్వ్యూ ముగిసినపిదపకూడా మహాత్మాజీ ఢిల్లీలో తచ్చాడుతూఉంటే, అది పరోక్షంగా బ్రిటిష్ప్రభుత్వప్రతిపత్తిని పెంచడానికి దోహదంచేసి నట్లుకాదా? మహాత్మాజీ చాలారోజులు ఢిల్లీలోనే ఉండిపోవలసిన అవస రంఉన్నదని, ఢిల్లీనుంచి కదలడానికి వీలులేదని మీరు మార్చి 24 న వ్రాసినలేఖలో తెలిపారు. ఢిల్లీలో వేచిఉండడంకన్న, ఆయన నిర్వర్తిం చవలసిన ముఖ్యమైనవిధులు మరెన్నో ఉన్నవని నేను భావించాను. మహాత్మాజీ యత్కించిత్ కృషిచేసిఉన్నఎడల మీరు అనే ఈ స్తబ్ధత అనతికాలంలోనే పరిష్కృతమైఉండేది. కాని ఈవిషయంలో మీరు మౌ నాన్ని అవలంబించారు. నిందనంతా మోయవలసినభారాన్ని నాకు కేటా యించారు.

మార్చి 23న మీరు వ్రాసినలేఖలో మీరు ఇలాఅన్నారు. "ఎ. ఐ. సి. సి. సమావేశం ఏర్పాటుచేయవలెనని కొందరు గుసగుసలాడుకోడం నేను విన్నాను. ఈ ధోరణిలో ఆలోచిస్తున్నవారు ఎవరో నాకు స్పష్టంగా తెలియదు. ఎ. ఐ. సి. సి. సమావేశం ఏర్పాటుచెయ్యడంవల్ల పరిస్థితి ఇంతకన్న స్పష్టీకరింపబడవచ్చునుకాని, అంతకన్న మరేఉద్దేశంతో వారు ఎ. ఐ. సి. సి. సమావేశాన్ని ఏర్పాటుచేయవలెనని కోరుతున్నారో నేను అర్థంచేసుకోలేకుండాఉన్నాను—" వార్తలు ఎంతో వేగంతో ప్రయాణం చేస్తాయి. ఎంతోదూరంకూడా ప్రయాణంచేస్తాయి. వాటిద్దకు మరోవార్త కూడా చేరింది. ఎ. ఐ. సి. సి. సమావేశాన్ని ఏర్పాటుచేయడాన్ని నేను వాయిదావేసి తద్వారా కాంగ్రెసువ్యవహారాలలో స్తబ్ధతకు నేను కారకుణ్ణి

అవుతున్నానని వూహించి ఎ. ఐ. సి. సి. సమావేశాన్ని త్వరలో ఏర్పాటుచేయవలసినదని కోరుతూ సభ్యుల సంతకాలతోసహా కొందరు కేంద్ర ఎమ్. ఎల్.ఏ. లు ఒక విజ్ఞప్తి తయారుచేయడానికి యత్నిస్తున్నారని విన్నాను. మీరు ఢిల్లీలోకాని, మరెక్కడకాని ఇట్టివార్తను వినివుండలేదా ? వినివున్నట్లయితే ఇట్టిచర్య గౌరవప్రదమైనదేనని మీరు భావిస్తున్నారా ?

మార్చి 23న మీరు వ్రాసినలేఖలోనే జాతీయడిమాండు తీర్మానాన్ని గురించి, శరత్ ఆ తీర్మానాన్ని వ్యతిరేకించడాన్నిగురించి మీరు ప్రస్తావించారు. శరత్‌పై ఖరినిగురించి బహూశా అతనే మీకు వ్రాయవచ్చును; కాని ఒక్క శరత్ వ్యతిరేకతమినహా తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదింపబడిందని మీ రనడం సరికాదు. ఇతరులు అనేకులు ఆతీర్మానాన్ని వ్యతిరేకించినట్లు, నేను వారిద్వారా వినివున్నాను. అందుకుకారణం ఆతీర్మానంలో లోపంవుండడంకాదు. ఆతీర్మానానికి ఏవిధమైనసార్థక్యం లేకపోవడమే అందుకుకారణము. కాంగ్రెస్ చివరలో ప్రవేశపెట్టబడి ఏకగ్రీవంగా ఆమోదింపబడి అనేక ప్రమాదరహితమైన నిరర్థకమైన తీర్మానాల్లో ఇదీ ఒకటి. ఈ తీర్మానాన్నిగురించి మీరు ఇంతగా ఎందుకు ఉబలాటపడుతున్నారో నేను అర్థంచేసుకోలేకుండావున్నాను. ఆచరణాత్మకంగా ఈ తీర్మానం మనకు ఏవిధంగా దోవచూపేది కాగలదు?

ఈ సందర్భంలో నేను మరొక విషయాన్ని చెప్పకుండావుండలేకపోతున్నాను. ఇటీవల కొన్ని సంవత్సరాలనుంచి కాంగ్రెసులో ఆమోదింపబడుతున్న తీర్మానాల్లో పదాడంబరము, దీర్ఘసమాసాలుతప్ప మరేమీ కనుపించడములేదు. వీటిని తీర్మానాలనిపిలవడంకన్నా వ్యాసాలని, భాష్యాలని పిలిస్తే మరింత సబబుగావుంటుంది. మనతీర్మానాలకు ఈకొత్తస్వరూపాలు ఇవ్వడంలో మీకుకూడా కొంత జోక్యంవుంటుందని నే ననుకుంటాను. నామటుకు నాకు సుదీర్ఘభాష్యాలకంటే, ఆచరణయోగ్యమైన కొద్దిపాటి తీర్మానాలలోనే, ఎక్కువప్రాధాన్యం కనుపిస్తుంది.

ఈనాటి కాంగ్రెసులోని అతివాద దుందుడుకు ధోరణులగురించి, మీరు మీలేఖలో అనేక పర్యాయాలు ప్రస్తావించారు. వీటినిగురించి

ప్రస్తావించడంలో అసలు మీ వుద్దేశ్యం ఏమిటి? వీటినిగురించి ప్రస్తావించేప్పుడు మీ దృష్టిలో కొందరు వ్యక్తులు వుంటేవుంటారనుకుంటాను. స్త్రీలు, పురుషులు కొత్తవారు కాంగ్రెసులో చేరి వారు ప్రాముఖ్యంవహించడం మీకు ఇష్టంలేదా? కాంగ్రెసులోని అధికార కర్తృత్వం కొద్దిమందిచేతులలోనే ఉండాలని మీరు కోరుతున్నారా? కొన్ని కాంగ్రెసుసంస్థలలో ఒకే వ్యక్తి మూడుసంవత్సరాలకంటే ఎక్కువ కాలం పదవిలోవుండరాదని యు. పి. రాష్ట్రకాంగ్రెసుకమిటీ ఒక నియమాన్ని ఒకప్పుడు అనువర్తించినట్లుగా నాకు జ్ఞాపకం. నిజానికి ఈ నియమాన్ని క్రిందిసంస్థలకు, పైసంస్థలకుకూడా అనువర్తింపచేయవలసి వున్నది. ఒకే వ్యక్తి కొన్నిదశాబ్దాలపాటు ఒకేపదవిలోవుండటం సబబు కాదు. మీ వుద్దేశ్యం ఏమైనాకావచ్చును. కాని మనమంతాకూడా సాహస కృత్యాలు చేసేవారమే. ఎందుకంటే, జీవితమే ఒక సాహసం. తమను తాము అభ్యుదయవాదులుగా భావించేవారు కాంగ్రెసుసంస్థలలోని అన్ని అంతస్థులలోను కొత్తరక్తాన్ని ఆహ్వానించితీరతారని నేను భావిస్తున్నాను.

శరత్ మీకువ్రాసినలేఖను నాతరఫున వ్రాసినాడని మీరు భావించవలసిన అవసరంలేదు. (ఇక్కడ నేను మార్చి 24 న మీరువ్రాసినలేఖను గురించి ప్రస్తావిస్తున్నాను.) శరత్కు ప్రత్యేకవ్యక్తిత్వంవున్నది. అతడు ఇక్కడనుంచి కలకత్తా వెళ్ళినతరువాత ఇక్కడివిషయాలను లేఖద్వారా తెలుపవలసిందిగా కోరుతూ గాంధీజీవద్దనుంచి అతనికి టెలిగ్రాంవచ్చింది. గాంధీజీ ఆవిధంగా టెలిగ్రాం ఇచ్చివుండకపోయినట్లయితే శరత్ అసలు గాంధీజీకి వుత్తరంవ్రాసివుంటాడని నేను అనుకోను. ఏమైనా అతడు మహాత్మాజీకి వ్రాసినలేఖలో నా మనోభావాలనుకూడా ప్రతిధ్వనించే విషయాలు కొన్నివున్నవనే చెప్పాలి.

శరత్కు మీరువ్రాసిన లేఖనుగురించి మీకు చెప్పవలసినదొకటి వున్నది. త్రిపురిలోని వాతావరణంగురించి అతడు తనలేఖలో వ్రాసిన విషయాలు మీకు ఎంతో ఆశ్చర్యంకలిగించినట్లుగా మీ లేఖద్వారా తెలుస్తున్నది. ఈవిషయం నాకు ఆశ్చర్యంకలుగచేస్తున్నది. త్రిపురిలో స్వేచ్ఛగా తిరిగేఅవకాశం నాకు లేనప్పటికీ అక్కడి పాపపంకిల వాతావరణాన్ని

గురించి అనేకవార్తలు నాకు తెలియజేయబడ్డాయి. ఇక అక్కడ స్వేచ్ఛగా తిరగడానికి అవకాశమున్న మీరు ఆ వాతావరణాన్నిగురించి వినికూడావుండలేదనడం నాకు విడ్డూరంగా కనుపిస్తున్నది.

మరొకవిషయం: త్రిపురీలో వ్యక్తిగత సమస్యలు ఇతరసమస్యలను ఆచ్ఛాదితంచేసినవని మీరన్నారు. నిజమే. కాని ఈసందర్భంలో మీరు మరోమాటకూడా అనివుండవలసింది. విషయనిర్ణాయకసభలోకాని, లేక కాంగ్రెసు బహిరంగసభలోకాని ఈవిషయాన్నిగురించి మీరు మాట్లాడివుండకపోయినప్పటికి వ్యక్తిగత సమస్యలు ప్రజాదృష్టిలో మరింత ప్రముఖంగా కనుపించేటట్లు చేయడానికి మీరు అందరికన్నా ఎక్కువగా దోహదంచేసినవారైనారు.

శరత్‌కు మీరువ్రాసినలేఖలో మీరిలాఅన్నారు: "సుభాస్‌కు జబ్బుగా వున్నదనడం నటన అని ఎవరైనా అంటే అది కేవలం అర్థంలేనిమాట. నాకు తెలిసినంతవరకూ నాసహచరులలో ఎవరూ సూచనప్రాయంగానైనా ఇలా అనలేదు." త్రిపురీసభలకు పూర్వము, త్రిపురీసభలలో రాజకీయంగా, నా వ్యతిరేకులు ఈవిధమైన ప్రచారాన్ని ఒక క్రమపద్ధతిలో సాగించినప్పటికీ, మీరు ఇలా అనగలుగుతున్నారంటే మీకు పూర్తిగా పక్షపాతదృష్టి ఆవరించివుండాలి. ఇటీవల కొంతకాలంనుంచి మీరు నాపట్ల పూర్తిగా వైముఖ్యం కలిగివున్నారని అనడానికి ఇది మరొక నిదర్శనం.

(ఈలేఖలోని తొలివాక్యాన్ని చూడండి.)

త్రిపురీ వాతావరణాన్నిగురించి శరత్ చెప్పినదానిలో అణుమాత్రమైనా అతిశయోక్తివున్నదని నేను భావించను.

త్రిపురీలో కొన్ని వినరానివార్తలను విన్నానని మీరు మీ లేఖలో పేర్కొన్నారు. మమ్మల్నిగురించి వ్యతిరేకమైన వార్తలుమాత్రమే మీకు సదభిప్రాయం కలగజేయడం నాకు ఎంతోఆశ్చర్యకరంగా వున్నది. మీకు ఈవిషయంలో కొన్ని ఉదాహరణలను చెపుతాను. ప్రతినిధుల టిక్కెట్లను ఇచ్చేవిషయంలో అన్యాయంజరిగిందనే ఆరోపణ ఒక్క బెంగాలురాష్ట్రం

పైనేకాక ఇతరరాష్ట్రాలపైకూడా చేయబడిందనేవిషయం మీకు తెలుసునా? ఆంధ్రరాష్ట్రంపైకూడా ఈవిధమైన ఆక్షేపణ చేయబడిందనే విషయం మీకు తెలుసునా? కాని మీరు ఒక్క బెంగాలురాష్ట్రంవిషయం మటుకే ప్రస్తావిస్తున్నారు. అసలు టిక్కెట్లుపోయినవని బెంగాలీరాష్ట్ర కమిటీకార్యాలయం కొత్తటిక్కెట్లు ఇచ్చినప్పుడు, బెంగాలీరాష్ట్ర కాంగ్రెస్‌కమిటీ విషయంలో ఎ. ఐ. సి. సి. కార్యాలయంవారిని హెచ్చరించి ప్రతినిధుల టిక్కెట్లు ఇచ్చేవిషయంలో జాగ్రత్తవహించవలసిందని కోరిందన్నవిషయం మీకు తెలుసునా? ఈ పొరపాటుకు బాధ్యులెవరనే విషయాన్ని విచారించడానికి మీరు ప్రయత్నించారా?

ఇంతేకాక ప్రతినిధులను తీసుకురావడానికి విరివిగా డబ్బు ఖర్చు చేయబడిందని మీరన్నారు. శ్రీమంతులు, ధనస్వాములు ఎవరిపక్షాన వున్నారో మీకు తెలియదా? లాహోర్‌నుంచి పంజాబ్ ప్రతినిధులు లారీల కొద్దీ చేరవేయబడ్డారని మీరువిన్నారా? ఎవరి ఆదేశానుసారం వీరు చేరవేయబడినట్లు? బహుశా డాక్టరు కిచ్లూ ఈవిషయాన్ని మనకు వివరించవచ్చును. బహుకొలంక్రితం పంజాబ్‌నుంచివచ్చిన ఒక ప్రఖ్యాత కాంగ్రెస్ సేవిక సర్దార్ పటేల్ ఆదేశానుసారం ప్రతినిధులను ఈవిధంగా మహాసభకు చేరవేశారని నాకు చెప్పింది. ఈవిషయంలో నిజమెంతో, అబద్ధమెంతో నాకుతెలియదుకాని, మీరుమటుకు నిష్పాక్షికదృష్టికలిగివుండడం అవసరం.

త్రిపురీలో కాంగ్రెసుమంత్రులు నిర్వహించిన పాత్రనుగురించి నేను కొన్నివిషయాలు చెప్పవలసివున్నది. బేలట్‌ద్వారా ఓటింగుజరిపించాలని ఏ. ఐ. సి. సి. సభ్యులలో చాలామంది నన్ను కోరారు. వారు అలా కోరడానికి కారణమేమిటని నేను అడగగా కాంగ్రెసుమంత్రులకు వ్యతిరేకంగా బహిరంగంగా ఓటుచేస్తే అందువల్ల కొన్ని కష్టనష్టాలున్నాయని వారు నాతోచెప్పారు. దీనిఅర్థమేమిటి? ఇంతేకాక మంత్రులు ఈవిధమైన పాక్షికపద్ధతిలో ప్రచారంచేయడం నాకు గిట్టదు. రాజ్యాంగరీత్యా వారికి ఆవిధమైన హక్కువుండవచ్చును; కాని వారు ఇట్టిపనులు చేయడంవల్ల ప్రతిరాష్ట్రంలోను కాంగ్రెసు పార్లమెంటరీ పార్టీలలో చీలిక

లేర్పడతాయి. వారివారి రాష్ట్రాలలో కాంగ్రెసు ఎమ్.ఎల్.ఏ లు, కాంగ్రెస్ ఎమ్. ఎల్. సి. లు అందరూ వారిని అవిభక్తంగా బలపరచపోయినట్లయితే కాంగ్రెసుమంత్రులు తమ మంత్రిత్వం ఎలా కొనసాగించగలరు ?

త్రిపురీకాంగ్రెసులో విషయనిర్ణాయకసభలోను ప్రతినిధుసమావేశంలోను మంత్రులు ప్రముఖపాత్రవహించినట్లు మీరు అంగీకరించరా? మంత్రులు ప్రముఖపాత్రవహించడము, పాతనాయకులు నిశ్చేతనంగా వుండడము ప్రజలు గమనించగలిగారు. శరత్ ఈమాట అనడం పొరపాటా ?

మీరు శరత్‌కువ్రాసిన లేఖలో "త్రిపురీ తీర్మానం కాంగ్రెసు అధ్యక్షునికి, గాంధీజీకి మధ్య సహకారంవుండవలెననే వుద్దేశ్యంతో రూపొందించబడింది." అని అన్నారు. ఇలా మీరు అనడం వుండుమీద కారంచల్లినట్లుగా వున్నది.

త్రిపురికాంగ్రెసుకుపూర్వము, ఆతరువాత కాంగ్రెసువాదులమధ్య సహకారాన్ని సాధించడానికి మీరు కృషిచేసిఉన్నామని మీరువ్రాసిన లేఖలో అన్నారు. కాని ఇతరుల అభిప్రాయంమటుకు ఇందుకు విరుద్ధంగా ఉన్నదనే అసంతృప్తికరమైన విషయాన్ని నేను మీకు మనవిచేసుకొనవచ్చునా? వారి ఉద్దేశంలో త్రిపురికాంగ్రెసులో కాంగ్రెసువాదికి కాంగ్రెస్ వాదికి మధ్య అఖాతం ఏర్పడిన పాపంనుంచి మీకు పరిహారంలేదు.

మీ విధానాన్ని, కార్యక్రమాన్ని, అస్పష్టధోరణిలోకాక, వాస్తవ వివరాలతో స్పష్టీకరించవలసిందిగా ఇప్పుడు నేను మిమ్మల్ని కోరుతున్నాను. ఇక మీ నిర్వచనమేమిటో తెలుసుకొనవలెననికూడా నేనుకోరుతున్నాను. మీరు సోషలిష్టులా, వామపక్షవాదులా, కేంద్రపక్షవాదులా, మితవాదులా, లేక మరేదైనా వాదులా ?

మీరు శరత్‌కువ్రాసిన లేఖలో రెండు ప్రశంసనీయమైన వాక్యాలున్నాయి. "వ్యక్తిగత సమస్యలు రాజకీయసమస్యలను మరుగుపరచడం నాకు ఎంతో బాధను కలగజేస్తున్నది. కాంగ్రెసువాదులలో విభిన్నఅభిప్రాయాలమధ్య సంఘర్షణను ఉన్నతస్థాయిలోనేఉంచి విధాన, నియమా

లకు సంబంధించినవిషయాలకు మాత్రమే పరిమితంచేసిఉంచడం భావ్యం గాఉండగలదని నేను ఆశిస్తున్నాను." మీ ఉపదేశానికే మీరు కట్టుబడి ఉంటే, మన కాంగ్రెసు రాజకీయాలు ఇలాఉండేవా? అప్పటి కాంగ్రెస్ రాజకీయాలకు ఇప్పటి కాంగ్రెసు రాజకీయాలకు ఎంత తేడాఉండేదో!

త్రిపురిలోకలిగిన అవరోధమేమిటని మీ రన్నారు. ఇలా మీరన డంలో మీ "అమాయకత"ను నేను అభినందించకుండా ఉండలేకున్నాను. త్రిపురికాంగ్రెసు పంత్‌తీర్మానాన్ని ఆమోదించింది. ఆ తీర్మానం అల్పత్వంతో, అసూయతో, శిక్షించవలెననే ఉద్దేశంతో రూపొందించబడింది. సత్యాహింసల ఉద్ధారకులు, అధ్యక్షుని ఎన్నికజరిగినపిదప, మెజారిటీ పార్టీకి అవరోధంగా ఉండమని అంటూ, అవరోధంగా ఉండరాదనే ఉద్దేశంతో వర్కింగ్‌కమిటీసభ్యత్వానికి రాజీనామా యిచ్చారు. కాని త్రిపురిలో వీరు అవరోధాలు కల్పించడంతప్ప చేసింది మరేమీలేదు. అలా చెయ్యడానికి వీరికి సర్వహక్కులూ ఉన్నాయి. కాని, తాము ఆచరించని ఆదర్శాలను వీ రెందుకు ఉపదేశించాలని అడుగుతున్నాను. ఈ దీర్ఘ లేఖను ముగించడానికి మునుపు మరికొన్ని విషయాలను ప్రస్తావిస్తాను.

త్రిపురిలో బెంగాల్ ప్రతినిధులకు టికెట్లుఇవ్వడంలో జరిగిన గొడవనుగురించి మీరు ప్రస్తావించారు. యు. పి. డెలిగేట్లకుకూడా ఇలాటిగొడవే జరిగిందని, వారిద్వారా విన్నట్లు, ఒక ఎ. ఐ. సి. సి. సభ్యుడు కలకత్తాలో బహిరంగసభలో మాట్లాడుతూ అన్నట్లు మొన్న వార్తాపత్రికలో చదివాను.

పంత్ తీర్మాన ముఖ్యోద్దేశం నాపై మహాత్మాజీచేత కయ్యానికి కాలుదువ్వించడమేనని మీరు భావించరా? మహాత్మాజీకి నాకూ మధ్య ఎలాంటి చీలికలూ లేనప్పుడు ఇలాటి ఉద్దేశంతో తీర్మానంచేయడం విజాయితీతో కూడుకొన్న పనేనా? పాతనాయకులు నాతో పోరాడదలుచుకున్నప్పుడు వారు ముఖాముఖీ, నాతో పోరాడకూడదా? మా మధ్య మహాత్మాజీని ఎందుకు తీసుకువిరావాలి? ఇది ఎంతో తెలివితో వన్నిన పన్ను

గడే. సందేహంలేదు. కాని ఇలాంటి చర్య సత్యాహింసలను ఎంతవరకు అన్వయించగలదనేది ప్రశ్న.

నేను అధ్యక్షపదవికి తిరిగి ఎన్నికకావడం దేశానికి ఉపద్రవకరమని సర్దార్ పటేల్ అనడం ఎంతవరకు భావ్యంగా ఉన్నదని, ఇంతకు పూర్వమే మిమ్మల్ని అడిగి ఉన్నాను. కాని ఆతడు అలాటి మాటను ఉపసంహరించుకోవలెనని కోరుతూ మీరు ఒక్కమాటకూడా చెప్పిఉండలేదు. అనగా మీరు ప్రత్యక్షంగా కాకపోయినా, పరోక్షంగానైనా అతని ఆరోపణను సమర్థించినట్లే అవుతుంది. ఇప్పుడు నేను మిమ్మల్ని మరో విషయం అడుగదలుచుకున్నాను.."సరే,ఏదిఏమైనా సుభాస్ దేశానికిశత్రువు కాడని" మహాత్మాజీ అన్నారు. మహాత్మాజీ ఈధోరణిలో నన్ను వ్యాఖ్యానించడం సబబుగా ఉన్నదంటారా? సబబుకానట్లవుతే, నన్ను సమర్థిస్తూ మీరు మహాత్మాజీతో ఒక్కమాటైనా అన్నారా?

మనం త్రిపురిలో ఉండగా, పంత్ తీర్మానాన్ని మహాత్మాజీ పూర్తిగా బలపరుస్తున్నారని కొందరు దినపత్రికలలో ప్రకటించిన చిన్న తమాషానుగురించి మీరు ఎలా భావిస్తున్నారు?

ఇక, పంత్ తీర్మానాన్నిగురించి మీరేమనుకుంటున్నారు? తీర్మానాన్ని సృష్టించినవారిలో మీరుకూడా ఒకరని త్రిపురిలో పుకారు బయలు దేరింది. ఇది ఎంతవరకు సత్యం? వోటింగుసమయంలో మీరు తటస్థంగా ఉన్నారు. కాని మీరు ఈ తీర్మానాన్ని అంగీకరిస్తారా? ఈ తీర్మానాన్నిగురించి మీవ్యాఖ్యానంఎలాటిది? మీ ఉద్దేశంలో ఇది విశ్వాసరాహిత్య తీర్మానమేనా?

ఇంత దీర్ఘలేఖ వ్రాయవలసివచ్చినందుకు నేను ఎంతో విచారిస్తున్నాను.ఈలేఖను చదవడం నిజంగా మీ ఓపికకు పరీక్ష. కాని ఇంత దీర్ఘ లేఖను వ్రాయకతప్పిందికాదు. చెప్పవలసినవిషయాలు ఎన్నోఉన్నాయిమరి.

బహుశా మీకు మళ్ళీ మరొక లేఖ వ్రాయవలసిరావచ్చును. లేక పత్రికాప్రకటన చెయ్యవలసిరావచ్చును. కొన్నివ్యాసాలలో మీరు నా అధ్యక్షపదవిని విరుద్ధధోరణిలో విమర్శించినట్లు నాకు ఒక వార్త తెలుస్తున్నది. అయితే, ఈ వార్త ఇంకా నిర్ధరింపబడలేదు. మీ వ్యాసాలను

చూచిన పిదప కాని, ఆ విషయాన్ని గురించి నేనేమీ చెప్పలేము. రెండు సంవత్సరాల అధ్యక్షపదవీకాలంలో వామపక్ష ఆదర్శాన్ని మీరు ఎంత ముందుకు తీసుకునివెళ్ళారో, ఒక ఏడాది అధ్యక్షపదవీకాలంలో నే నెంత ముందుకు తీసుకుని వెళ్ళానో అప్పుడు మన ఇరువురి సేవను పరి పోల్చి చూచి చెప్పగలను.

ఈ లేఖలో ఎక్కడైనా నేను కఠినోక్తులు పలికి మీ మనస్సును నొప్పించినట్లయితే నన్ను దయతో క్షమించండి. నిష్కాపట్యానికి మించిన మంచిలక్షణం మరొకటి లేదని మీరే అంటారు. నేమా నిష్కాపటంగా ఉండడానికి ప్రయత్నించాము. బహుశా ఇది నిరవధిక నిష్కాపట్యం కావచ్చును. నేను మెల్ల మెల్లగా కోలుకుంటూ ఉన్నాను.

మీరు కులాసాగా ఉన్నారని ఆశిస్తాను.

ఇట్లు, ప్రేమతో,
సుభాష్

255. సుభాస్‌బోస్‌కు

అలహాబాద్,

(వ్యక్తిగతమైన రహస్యలేఖ) ఏప్రియల్ 3, 1939

నా ప్రియమైన సుభాస్,

మీరు, మార్చి 28 వ తేదీన వ్రాసిన సుదీర్ఘమైనలేఖ యిప్పుడే నా కందింది. అందినవెంటనే నేను ఈ జవాబు వ్రాస్తున్నాను. మీరు నా కింతవివరంగా యింత నిష్కపటంగా లేఖవ్రాసి, నన్నుగురించి వివిధ సంఘటనలనుగురించి మీ అభిప్రాయాలు స్పష్టీకరించినందుకు నాకు ఎంత సంతోషం కలిగిందో, నేను మొదట మీకు చెప్పదలుచుకొన్నాను. నిష్కపటంగావుండడంవల్ల తరచు ఇతరుల మనస్సుకు నొప్పికలుగుతూ వుంటుంది. కాని ఎట్టిపరిస్థితులలోనైనాసరే, అలాగవుండడం వాంఛనీయం. ముఖ్యముగా ఒకకార్యక్రమాన్ని ఉపలక్షించి, కృషిచేసే ఇరువురిమధ్య, నిష్కాపట్యం ఎంతో అవసరం. అందువల్ల ఒకరు మరొకరిదృష్టినుంచి తననుతాను సమ్యగ్దృష్టితో అవలోకించగల అవకాశం కలుగుతుంది. అంతేకాదు, మరింత పరిశీలనాత్మకదృష్టితోకూడా ఆ వ్యక్తి తననుతాను వీక్షించుకోగలడు. మీరువ్రాసినలేఖ ఈ దృష్ట్యా, నాకు ఎంతో సహాయకారి కాగలదు. ఇందుకు నేను మీ కెంతో కృతజ్ఞుణ్ణి. వివిధవిధానాలను కార్యక్రమాలను. అనేకసంఘటనలను ఉదహరిస్తూ 27 పుటలపై టైపుచేయబడిన మీ సుదీర్ఘ లేఖకు ప్రత్యుత్తరంవ్రాయడ మన్నది సామాన్యమైనవిషయంకాదు. అందుచేత ఇప్పుడు నేను వ్రాస్తున్న సమాధానం సమగ్రంగా వుండకపోవచ్చునేమోనన్నభయం నాకువుంది. ఈ విషయాలన్నిటిని సమగ్రంగా చర్చించడానికి ప్రయత్నిస్తే, ఒక గ్రంథాన్నే వ్రాయవలసివస్తుంది.

మీరు మీ లేఖలో నా లోపాలను పరిశీలిస్తూ, ముఖ్యంగా నా ప్రవర్తనపై, కొన్ని ఆరోపణలను కావించారు. ఈవిధమైన ఆరోపణలకు జవాబుచెప్పడం కష్టమని మీరుమైకం గ్రహించకపోరు. ఇక లోపాల విషయమంటారా, వాటినిగురించి చెప్పవలసింది అట్టేలేదు. మీ రుదహ

రించిన లోపాలు నా కున్నమాట నిజమే; ఆ లోపాలు వుండకూడదన్న విషయం నాకు తెలుసును. ఐనప్పటికీ, ఆ లోపాలు నా కున్నవని నే నంగీకరిస్తున్నాను. మరొక విషయం; 1937లో ఇంటరన్‌మెంటు నుంచి విడుదలైనతరువాత ప్రజాజీవితంలోను, వ్యక్తిగతజీవితంలోను మీరు నాపట్ల ఎంతో గౌరవ, అభిమానాలను చూపుతూవచ్చినామని వ్రాశారు. ఈ మాటలోని సత్యాన్ని నేను పూర్తిగా అంగీకరిస్తున్నాను. ఇందుకు మీపట్ల నేను కృతజ్ఞుణ్ణి. వ్యక్తిగతంగా నాకుకూడా ఇప్పటికీ మీ పట్ల ప్రేమాభిమానాలున్నవి. అప్పుడప్పుడు, మీరు చేసేపనులూ, మీరు ఆ పనులను చేసే తీరూ, నాకు నచ్చకపోయినప్పటికి, మీపట్ల నాకు ఎంతో ప్రేమాభిమానాలు ఉన్నవి. కొంతవరకు, మనంఇరువురం విభిన్నప్రకృతులుగలవారమని, జీవితంపట్ల, జీవితసమస్యలపట్ల మనవైఖరిలో భేదం ఉన్నదని నేను భావిస్తున్నాను.

ఇక, ఇప్పుడు, మీరు వ్రాసిన లేఖనుగురించి నా అభిప్రాయాలను పేరావారీగా వివరిస్తాను.

గతనవంబరులో నేను ఐరోపాపర్యటన ముగించుకొని స్వదేశానికి తిరిగివచ్చినతరువాత, మీరు నన్ను అలహాబాద్‌లో కలుసుకున్నప్పుడు, మీతో నేను ఏమని చెప్పానో, ఇప్పుడు నాకు జ్ఞాపకంలేదు. కరాచీ నుంచి కలకత్తావెడుతూ, త్రోవలో మీరు అలహాబాద్‌లో కొద్దిసేపు ఆగారు. నేను మీరుఅడిగినదానికి నిశ్చితమైన జవాబుచెప్పడానికి గాంధీజీని సంప్రదించవలసిన అవసరమేమిటో నాకు అవగతంకావడంలేదు. అంతేకాక, మీరుఅడిగిన ప్రశ్న ఏమిటోకూడా నాకు జ్ఞప్తిలేదు. భావిలో నేను అవలంబించబోయే కార్యవైఖరి, వివిధవిషయాలపై గాంధీజీ అవలంబించే వైఖరిపై ఆధారపడిఉండగలదని బహుశా నేను మీతో చెప్పిఉండవచ్చును. హరిపురకాంగ్రెస్‌కుపూర్వము, ఆ తదుపరి, నేను చెప్పినదేమిటో మీకు జ్ఞప్తిఉండేఉంటుంది. సభ్యుడుగా వర్కింగ్‌కమిటీతో నాకున్నసంబంధాన్నిగురించి నేను ఎంతో ఆందోళనచెంది, సభ్యత్వంనుంచి వైదొలగదలుచుకున్నాను. వర్కింగ్‌కమిటీలోఉండి నేను సార్థకమైనపనిఏదీ చెయ్యడంలేదని నేనుభావించడమే యిందుకుకారణం.

ఇంతేకాక, గాంధీజీకూడా ఏకాభిప్రాయంగల వర్కింగ్‌కమిటీఉంటే బావుంటుందనేధోరణిలో ఉన్నారు. ఈవిధమైన వర్కింగ్‌కమిటీలో నేను ఇమడకపోవచ్చును. ఇక, అట్టిసందర్భంలో నేను మెల్లిగా వర్కింగ్ కమిటీనుంచి వైదొలగి, వెలుపలఉండి వర్కింగ్‌కమిటీతో సహకరించ నైనా సహకరించాలి, లేదా, గాంధీజీని ఆయనవర్గాన్ని సవాలుచేసి పోరాడనైనా పోరాడాలి. భారతదేశశ్రేయస్సుదృష్ట్యా, మన లక్ష్యం దృష్ట్యా, నేనుకాని మీరుకాని ఇలాటి చీలికను కల్పించడం ప్రమాదకర మని నేను భావించాను. ఎట్టిపరిస్థితులలోనైనా ఐక్యతఉండవలెనని పంతు పట్టుపట్టడం భావ్యంకాదని నాకూ తెలుసును; ఒక్కొక్కపరిస్థితిలో ఐక్యత ప్రమాదకరంగా పరిణమించవచ్చును. అట్టిపరిస్థితులలో అట్టి ఐక్యతను విడనాడడమే శ్రేయస్కరం. కాని అంతా అప్పటిపరిస్థితులపై ఆధారపడిఉంటుంది. కాని, ఆనాడు, మనం ఒక విషమక్షణాన్ని ఎదుర్కొంటూఉన్నప్పుడు, గాంధీజీని, ఆయనవర్గాన్ని త్రోసివెయ్యడం కాని, అందుకు యత్నించడంకాని, మనలను ఎంతో బలహీనపరచగల దని నేను పూర్తిగా విశ్వసించాను. అట్టిపరిస్థితిని ఎదుర్కొనడానికికూడా నేను సిద్ధంగాలేను. అయినప్పటికి, వర్కింగ్‌కమిటీలో జరుగుతున్న అనేకవిషయాలను నేను ఏవగించుకుంటూ వచ్చాను. సంస్థానాలు, మంత్రివర్గాలువంటి కొన్నివిషయాలపట్ల గాంధీజీ సహజంగా అవలంబించిన వైఖరినికూడా నేను విరసించాను.

ఇలాఉండగా నేను యిరోపా వెళ్ళాను. నేను యిరోపానుంచి తిరిగి వచ్చేసరికి, మళ్ళీ పాతసమస్య నన్ను ఎదుర్కొన్నది. అప్పుడే మీరు నన్ను కలుసుకున్నారు. అప్పుడు నా మనస్సులోఉన్న అభిప్రాయాన్ని మీకు చెప్పిఉంటాను. నేను ఎట్టిమార్గాన్ని అనుసరించాలి అనేవిషయంలో నా అభిప్రాయాలు స్పష్టంగానే ఉన్నాయి. కాని నా కార్యాచరణసూత్రం గాంధీజీ అప్పటిపరిస్థితిపట్ల ఎట్టివైఖరిని అవలంబిస్తారో దానిపై ఆధార పడిఉంటుందని అన్నాను. గాంధీజీ ఇప్పటికీ 'ఏకాభిప్రాయం' గల వర్కింగ్‌కమిటీఉండవలెననే ఉద్దేశంలోఉంటే, నేను వర్కింగ్‌కమిటీ నుంచి బైటికి వచ్చానన్నమాట. లేకుంటే నేను వర్కింగ్‌కమిటీలోనే

సభ్యోద్దేశిగాఉంది. వర్కింగ్ కమిటీతో సహకరించిఉండేవాణ్ణి. ఈ సమస్యపై కాంగ్రెసులో చీలికనుకలిగించే ఎట్టి పని చెయ్యడానికి అప్పుడు నేను సిద్ధంగాలేను. భారతదేశంలోను, ఇతరదేశాలలోను అనేక విషమపరిణామాలు అభివృద్ధిచెందడాన్ని నేను గుర్తెరిగి, కొద్దిమాసాలలో మనము ఒక గొప్పసంఘర్షణను ఎదుర్కొనవలసినపరిస్థితులు ఏర్పడవచ్చునని భావించాను. గాంధీజీ నాయకత్వాన్నివహించి, ఆ సమరంలో పాల్గొనకపోతే, ఆ సమరం సఫలమయ్యే సూచనలుండవు.

ఈ సమరాన్నిగురించి నా దృష్టి సమాఖ్య ప్రాతిపదికగా ఆధారంచేసుకొని రూపొందించబడినది కాదు. సమాఖ్యను సజీవసమస్యగా కాక, మృతసమస్యగా భావించి, స్వయంనిర్ణయహక్కుకొరకు కాక, కాన్‌స్టిట్యుయెంట్ ఎసెంబ్లీకొరకు పోరాటంపై దృష్టిని కేంద్రీకరించవలసిందిగా నేను కాంగ్రెస్‌ను కోరాను. అంతేకాక, ఈ సమరాన్ని ప్రపంచ క్లిష్ట పరిస్థితిదృష్ట్యా నడపవలసిందనికూడా నేను కాంగ్రెసును కోరాను. సమాఖ్యపై పోరాటంజరపడమనేసమస్యకు మితిమించిన ప్రాధాన్యంఇవ్వడం వల్ల, ఆ సమస్యను సజీవంగా అట్టేపెట్టి, తద్వారా మనము మరింత ప్రధానస్థాయిలో ఆలోచించడానికి, ఆ ఆలోచనను కార్యరూపంలోపెట్టడానికి, అవరోధం కల్పించినట్లు అవుతుంది. సమాఖ్యను అంతమొందించేవరకూ పోరాడుతానని, కాంగ్రెసు సమాఖ్యను అంగీకరించినప్పటికి, మీరుమటుకు పోరాటం విరమించుకోరని, నేను ఇంగ్లండులోవుండగా మీరొక పత్రికాప్రకటనచేశారు. ఈ ప్రకటన ఇంగ్లండులో విరుద్ధఅభిప్రాయాలకు దారితీసింది. సమాఖ్య అన్న సమస్యపై కాంగ్రెసుఅధ్యక్షుడు తన అధ్యక్షపదవికి రాజీనామాఇచ్చేధోరణిలో ఉన్నాడని, అందుచేత కాంగ్రెసు తప్పకుండా సమాఖ్యను అంగీకరించేస్థితిలో ఉండిఉంటుందని ఇంగ్లండులో అందరూ చెప్పుకోసాగారు. నన్ను ఈవిషయాన్నిగురించి చాలమంది ప్రశ్నించారుకూడా. వారికి నచ్చచెప్పడానికి నేనెంతో కష్టపడవలసివచ్చింది.

ఈ ప్రాతిపదికను ఆధారంగాచేసుకుని నేను రెండు తీర్మానాలను రూపొందించాను. ఈ తీర్మానాలను ఉద్ఘాటించినతీరులో భేదంవున్నదితప్ప

అంతకుమించి, వీటిలో మరొకవిధమైన ప్రత్యేకతయేమీ లేదు. ఇతర సభ్యులకు అంగీకారయోగ్యంగా ఉండేవిధంగా వర్కింగ్ కమిటీ తీర్మానాలను రూపొందించవలసివుంటుందనే విషయం మీకు బాగా తెలుసును. ఇతరులకు అంగీకారయోగ్యంగాఉన్నా లేకున్నా, తనకునచ్చిన విధంగా తీర్మానాన్ని రూపొందించడం సులువైనవిషయమే. వర్కింగ్ కమిటీ ముందు ఈ తీర్మానాలను ఉంచడంలో నా ఉద్దేశం, వచ్చే కాంగ్రెసులో ప్రతిపాదించబడే తీర్మానాలను జీర్ణంచేసుకొనడానికి తగినపరిస్థితులను కల్పించడంమాత్రమే. అందుకొరకు దేశంయొక్క మనస్తత్వాన్ని సమాయత్తపరచడంమాత్రమే. రానున్న కాంగ్రెసులో ప్రతిపాదింపబడే తీర్మానాలు ఇంతకన్న సమగ్రమైనవి, విశాలమైనదృష్టితోకూడుకున్నవి, దూరదృష్టిగలవి కాగలవు. ఏదిఏమైనా, నా తీర్మానాలు అంగీకరింపబడలేదు. కాంగ్రెసుసభలసందర్భంలో ఈ తీర్మానాలు సమాలోచింపబడగలవని వారు నాతో చెప్పారు.

ఈ వర్కింగ్‌కమిటీసమావేశంలోనే నేను యూదులను గురించిన తీర్మానాన్ని ప్రతిపాదించాను. అంతకుమునుపే, జర్మనీలో యూదులపై తీవ్రమైన హింసాకాండ జరపబడినవిషయం మీకు జ్ఞప్తిఉండేవుంటుంది. ఈవిషయంపై ప్రపంచమంతా గగ్గోలుపుట్టించింది. ఈ సంఘటనను గురించి మనలోకూడా మన అభిప్రాయాన్ని తెలుపవలసిన అవసరం ఉన్నదని భావించాను. "యూదులకు భారతదేశాన్ని శరణాలయంగా చెయ్యాలని కోరుతూ, మీరు ప్రవేశపెట్టిన తీర్మానం నన్ను నిశ్చేష్టుణ్ణి చేసింది" అని మీరు వ్రాశారు. మీరు ఈవిషయాన్ని ఇంత తీవ్రంగా తీసుకోటం నాకు ఆశ్చర్యాన్ని కలుగజేస్తున్నది. పైగా మీరు మీ అభిప్రాయాన్ని స్పష్టంగా వ్యక్తీకరించలేదుకూడా. కాని, ఇండియాలో యూదులకు శరణాలయాన్ని స్థాపించడానికి నా తీర్మానం ఉద్దేశింపబడినట్లు, మీరు నా తీర్మానాన్ని చిత్రించడానికి ప్రయత్నించడం సబబేనా? నావద్ద తీర్మానం పాత ప్రతి ఒకటి ఉన్నది. అందులో ఈవిధంగా ఉన్నది.

"భారతదేశంలో జీవనప్రమాణాలను అంగీకరించి, భారతదేశము లోని నూతనవ్యవస్థలో ఇమడగలిగిన నిపుణులూ, వివిధవిషయాలలో

ప్రత్యేక కృషిసలిపిన నిష్ణాతులూ అయిన యూదీయశరణార్థులకు భారత దేశంలో ఉద్యోగములు కల్పించడానికి ఈ కమిటీ అభ్యంతరం తెలు పదు." యూదులకు సహాయంచేయాలనేదృష్టితో నేను ఈసమస్యను పర్యాలోచించలేదు. మనదేశానికి ఎట్టి హానిలేకుండా ఆవిధమైన సాయం చేయడం వాంఛనీయమైనప్పటికి నేను అట్టిదృష్టితో ఈసమస్యను ఆలో చించలేదు. మన శాస్త్రపరిశోధనాలయాలకు, పరిశ్రమలకు మాములు జీతాలపై ఉత్తమశ్రేణికిచెందిన నిపుణులను రప్పించి, తద్వారా మనకు మనం సహాయంచేసుకొనవలెననేదృష్టితోనే, నేను ఈసమస్యను ఆలో చించాను. నాజీఆక్రమణానంతరం యూదులల్లో ప్రత్యేకనిపుణులను ఎన్ను కొనుటకొరకు అనేకదేశాలు వియన్నాకు ప్రత్యేక రాయబారవర్గాలను పంపినవి. టర్కీ ఈ నిపుణులను రప్పించుకుని ఎంతో లాభంపొందింది. సరియైన యాంత్రికనిపుణులను మనదేశానికి రప్పించడానికి ఇది అద్వి తీయమైన అదనుగా, నాకు కనిపించింది. వారు తక్కువజీతాలపై ఇక్క డికి వస్తే, ఇతరులజీతాలను తగ్గించడానికి మనకు అవకాశం కలుగు తుంది. వారు కొద్దికాలం ఉండిపోవడానికి మాత్రమే ఇక్కడకు వచ్చి ఉండేవారు. అంతేకాని, ఇక్కడ శాశ్వతంగా స్థిరపడిపోయేవారు కాదు. అంతేకాక, కొద్దిమందిమాత్రమే వచ్చిఉండేవారు. మనకు నిర్దిష్టంగా ఉప యోగపడేవారు; మన జీవనప్రమాణాలను, రాజకీయదృష్టిని అంగీక రించేవారుమాత్రమే రాగలరు. ఏమైనా, ఈ తీర్మానంకూడా వర్కింగ్ కమిటీచే అంగీకరింపబడక త్రోసివేయబడింది.

కాంగ్రెసుఅధ్యక్షపదవికి ఎన్నికజరిగినతదుపరి, నేను ఢిల్లీలో చేసిన ఒకప్రసంగాన్నిగురించి మీరు మీలేఖలో ప్రస్తావించారు. కొందరు నాతో ఈ ప్రసంగాన్ని గురించిన పత్రికాప్రకటననుగూర్చి నాకు చెప్పి ఉన్నప్పటికి, మీరు మీలేఖలో ఉదహరించిన ఈ పత్రికాప్రకటనను చూచిఉండనందుకు నేను ఎంతో చింతిస్తున్నాను. నిజానికి, నేను నా ప్రసంగంలో మిమ్మల్నిగురించి కాని, మీ ఎన్నికనుగురించికాని ఏమీ ప్రస్తావించిఉండలేదు. ఢిల్లీ, పంజాబ్ కాంగ్రెసుల వివాదాలను ప్రస్తా విస్తూ పదవీవ్యామోహం హెచ్చిందని, పదవులకొరకు ప్రచారంచేస్తు

కొనడం జరిగిందని అన్నాను. ఇట్టిచర్యలను నిరసించాను. బహుశా ఈ ప్రసంగాన్ని వ్రాసుకున్న విలేఖరిమనస్సులో మీ ఎన్నికవిషయం ఉండిఉండి, నేను చెప్పినదానిని అతడు మరోతీరుగా ప్రకటించివుండ వచ్చును. ఈవిషయమై ఆ సభకు హాజరైన ఇతరులనుకూడా నేను అడిగినాను. వారుకూడా నా అభిప్రాయంతో ఏకీభవిస్తున్నట్లు చెప్పారు.

అధ్యక్షపదవికి ఎన్నికసందర్భంలో, మీతరపున ప్రచారం హెచ్చుగా జరిగినట్లే, డాక్టర్ పట్టాభితరపునకూడా ప్రచారం హెచ్చుగా జరిగినమాట వాస్తవమే. ఎన్నికలలో ప్రచారంచేసుకోడం నాదృష్టిలో దోషంకాదు. పట్టాభికి ఓట్లుసేకరించేనిమిత్తం, కాంగ్రెసుమంత్రివర్గాల యంత్రాంగం ఉపయోగించబడినదని అనడంలో మీ ఉద్దేశం ఏమిటో నాకు అవగతంకావడంలేదు. ఇందుకొరకు ఏ యంత్రాంగం పనిచేసిందో నాకు తెలియదు. యు. పి. లోతప్పించి, మరెక్కడా ఈ యంత్రాంగం పనిచేసినట్లు నాకు తెలియదు. అదిన్నీ మీ తరపున ప్రచారానికే వినియో గించబడింది. మన మంత్రులు ఎలా ఓటుచేశారోకూడా నాకు తెలియదు. వీరిలో సగంమందికంటె ఎక్కువ డాక్టరు పట్టాభికి ఓటుచేసిఉండరని నేను భావిస్తాను. సగంమందికూడా ఓటుచేసిఉంటారని అనుకోను. ఒకమంత్రి అసలు ఓటుచేయడానికే నిరాకరించారు. మరొకమంత్రి బహిరంగంగా మీకొరకు ప్రచారంచేశారు. ఆ మంత్రి మీకొరకు చాలా ఓట్లు సంపాదిం చాడని చాలామంది భావించారు.

బహిరంగసభలో ప్రసంగిస్తూ నేను తొందరపడడం తప్పని మీరు అనడం సబబే. తొందరపాటు అనుచితం. కాని, విజానికి ఢిల్లీలోకాని, మరెక్కడకాని, ప్రసంగిస్తూ నేను తొందరపడలేదు.

ఇక, వర్కింగ్‌కమిటీసభ్యులు పన్నెండుగురు రాజీనామాలిచ్చి నపుడు, నేను అందజేసిన ప్రకటనగురించి ప్రస్తావిస్తాను. రెండుకోజులు ఈవిషయంపై సుదీర్ఘ వాదప్రతివాదాలు జరిగినపిదప, ఈ సమావేశానికి ముందు వర్కింగ్‌కమిటీలోని కొందరుసభ్యులు అవలంబించిన తీవ్ర వైఖరితో పోల్చిచూస్తే, అల్పాతిఅల్ప తీవ్రమార్గాన్ని నేను సూచించాను. వర్కింగ్‌కమిటీసభ్యులు రాజీనామాలివ్వగలరని నేను విన్నవించాను. అట్టి

పనిచెయ్యకుండా వారిని వారించడానికి నేను మళ్ళీ మళ్ళీ ప్రయత్నించాను, కాని అనేకకారణాలవల్ల పరిస్థితి అనుకోనివిధంగా విషమించింది. మీరు అధ్యక్షులుగా చేసినప్రకటనలలో వర్కింగ్ కమిటీసభ్యులనుగురించి వెలిబుచ్చిన కొన్నిఅభిప్రాయాలు నాకు ఎంతో వాధకలిగించినవిషయం మీకు తెలుసును. ఈవిషయాన్ని మీకు పదేపదే చెప్పిఉన్నానుకూడా. మీరు గాంధీజీని చూడడానికి వెడుతున్నప్పుడు, ఆయనతో మీరు రాజకీయసమస్యలను చర్చించడానికిముందు. మీరు ముందు ఆయనతో తేల్చుకోవలసినవిషయం ఇదేనని మీకు ప్రత్యేకంగా నచ్చచెప్పడానికి ప్రయత్నించాను. జయప్రకాశ్ కూడా ఈవిషయంలో నాతో ఏకీభవించాడు. ఇరువురిమధ్య అనుమానము అవిశ్వాసము అడ్డుగోడవలె నిల్చిఉన్నప్పుడు, రాజకీయసమస్యలపై చర్చకు ఎట్టి అవకాశంఉండదు, మీరు మీ ప్రకటనలలో పేర్కొన్నవిషయాలు పూర్తిగా న్యాయవిరుద్ధంగా ఉన్నవి.బాధ్యతాయుతమైన కాంగ్రెసుఅధ్యక్షపదవిలోఉన్నవ్యక్తి, పత్రికలలోపుకార్లను, బజారుమాటలనుమారుపలకడంసబబుకాదు. అన్నివిషయాలను అతడు స్వయంగా తెలుసుకుని మాట్లాడవలసినబాధ్యత అతనిపై ఉన్నది. అతనినోటివెంట వెలువడిన ఏ చిన్నమాటనైనా ఇతరులు విశ్వసించగలరు. మీరు మీ ప్రకటనలో పేర్లను ఉదహరించి ఉండకపోవచ్చును. కాని మీ ప్రకటనలుచదివిన ప్రతిచదువరి అవి వర్కింగ్ కమిటీ సభ్యులకు సంబంధించినవేనన్ననిశ్చయానికి తప్పనిసరిగా వచ్చాడు. ఒక వ్యక్తి, తను బహిరంగంగా కట్టుబడిఉన్నానని చెప్పుకునే లక్ష్యానికి రహస్యంగా ద్రోహంచేసి, సమాఖ్యలో మంత్రిత్వాలపంపకాలను ఏర్పాటుచేశాడని అనడంకన్న నింద మరొకటి ఉండదు. ఇది చాలా తీవ్రమైన ప్రకటన. ఇది వాడిబాణంవలె గ్రుచ్చుకున్నది.

గాంధీజీకి మీకూ మధ్య సహకారం కుదరకపోవడానికి ఈ ఒక్క ప్రకటన చాలును. ఎందుచేతననగా, ఇతరులందరూ గాంధీజీకి ప్రతినిధులు. మీ ఇరువురిమధ్య సహకారంఉండడం ఎంతో అవసరమని నేను భావించాను. మీ ఇరువురిమధ్య సహకారంలేకపోవడంవల్ల, ఎంతో ప్రమాదంఉన్నదని అనుకున్నాను. అందుచేతనే గాంధీజీతో ప్రతివిష

యాన్ని నిష్కపటంగా చర్చించి, ఈ వ్యత్యాసాన్ని స్పష్టంగా పరిష్క రించుకోవలసిందిగా మిమ్మల్ని ఒత్తిడిచేశాను. మీరు గాంధీజీతో మాట్లాడి నప్పుడు ఈవిషయాన్ని మాటవరసకైనా అనలేదని నేను తరువాత గాంధీజీద్వారా, జయప్రకాశ్ద్వారా తెలుసుకొని, ఎంతో ఆశ్చర్యపడ్డాను. మీరు ఇలాచేయడం నాకు ఎంతో ఆందోళనకలిగించింది. మీతోకలిసి పని చేయడమనేది ఎంత కష్టమైనవిషయమో నేను తెలుసుకొనగలిగాను.

మీరు గాంధీజీని సందర్శించి ఆయనతో మాట్లాడినప్పుడు, మీరు యాదృచ్ఛికంగా ఆయనసహకారాన్ని కోరినప్పటికి, ఆయనసహకారాన్ని పొందే విషయంలో మీ కంతగా శ్రద్ధలేనట్లు తాను భావించానని గాంధీజీ ఆతరువాత నాతో అన్నారు. మీరు అంతకుపూర్వమే ఆలోచించిపెట్టు కొనివున్న వివిధవ్యక్తులలో వర్కింగ్‌కమిటీని ఏర్పాటుచేసేధోరణిలో మీరువున్నట్లు కనుపించింది. వీరికి మీరు వర్కింగ్‌కమిటీలో సభ్యత్వం ఇస్తామని వాగ్దానంకూడాచేసివుండవచ్చును. ఇలాచేయడానికి మీకు పూర్తి హక్కువున్నది. ఆ మాట ఎవరూ కాదనరు. కాని, మీరు గాంధీజీతోను ఆయనవర్గంతోను, సహకరించేధోరణిలో కాక, మరొకధోరణిలో ఆలో చిస్తున్నట్లుగా ఈవిషయాలనుబట్టి తెలుస్తున్నది.

పంజాబ్ ఎన్నికవిషయంలో, ఢిల్లీ ఎన్నికలవిషయంలో, ఆంధ్ర దేశంలోని నెల్లూరుఎన్నికలవిషయంలోను, మీరు తీసుకున్నచర్య నా కెంతోఆందోళనకలిగించింది. ఆచర్యకన్నా, ఆచర్యనుఅమలుచేసినచర్య నా కెంతో ఆందోళనకలగచేసింది. ఏ. ఐ. సి. సి. కార్యాలయంతోసంప్ర దించకుండానే మీరు చర్యతీసుకున్నారు. ఆంధ్రరాష్ట్రంవిషయంలో రాష్ట్ర కాంగ్రెస్‌కమిటీతో మీరు సంప్రదించలేదు. పంజాబ్‌విషయంలో ఏ. ఐ. సి. సి. కార్యాలయంతరపున విచారణ విలుపుదలచేస్తూ టెలిగ్రాం పంపారు. ఢిల్లీలో ముందు రాష్ట్రకాంగ్రెస్‌కమిటీకి తెలుపకుండా చర్య తీసుకున్నారు. ఢిల్లీ ఎన్నికవిషయంలో మీరుతీసుకున్న నిర్ణయం సరియై నదికాదని, నేను వ్యక్తిగతంగా భావిస్తున్నాను. కాని ఇప్పు డది ప్రధాన మైనవిషయంకాదు. వ్యక్తుల, వర్గాల ప్రభావాలకులోనై ఒకకార్యాలయం అనుసరించవలసిన నిష్పాక్షికక్రమవిధానాన్ని మీరు అతిక్రమిస్తున్నారని

నేను భావిస్తున్నాను. ఈవిధమైనపద్ధతిని అనుసరించడంవల్ల అనేక ప్రమాదాలున్నాయి.

అగ్రస్థాయినుంచి జోక్యంకలిగించుకునే అలవాటులో, ఏ కాంగ్రెసుఅధ్యక్షుడు కూడా నన్నుమించలేడని మీరు మీ లేఖలో అన్నారు. నేను జోక్యంకలిగించుకునేస్వభావంగల వ్యక్తిననేవిషయం నాకు తెలుసును. కాని, ఏ. ఐ. సి. సి. కార్యకలాపాలకు సంబంధించి నంతవరకు ఏ. ఐ. సి. సి. కార్యాలయ కార్యకలాపాలపై, తరుచుగా నా ప్రభావాన్నిచూపడానికి నేను ప్రయత్నించినప్పటికి ఆ కార్యకలాపాల్లో నేను జోక్యంకలుగచేసుకున్నట్లుగా నాకుజ్ఞాపకంలేదు. జోక్యంకలగచేసు కోకపోవడమే నా విధానం. అంతేకాక, మరో గత్యంతరంలేనప్పుడు తప్ప రాష్ట్రాలకుసంబంధించినవ్యవహారాల్లో ఏ. ఐ. సి. సి. కార్యాల యాన్నికూడా జోక్యంకలుగచేసుకోనిచ్చేవాడినికాదు.

ఈ పరిణామాలన్నీ నాకు ఆందోళనకలిగిస్తున్నసమయంలో గాంధీజీకి, వల్లభాయికి మీరుపంపిన టెలిగ్రాములు వచ్చాయి. వర్కింగ్ కమిటీలో మేము సమావేశముకావడముకాని, లేక మామూలుగా నిర్వ హించే కార్యకలాపాలనుసాగించడంకాని మీకు ఏమాత్రం ఇష్టంలేదన్న విషయం మీ టెలిగ్రాములద్వారా తెలుస్తున్నది. మీవుద్దేశం అదికాదన్న ప్పటికీ, ఆవిధంగా అర్థంచెప్పుకోడానికే ఆ టెలిగ్రాములు అవకాశమిస్తు న్నాయి. మీ వుద్దేశం ఏమిటో తెలుసుకోవడానికి మీకు మరొకలేఖ వ్రాసి వుండేవారమే కాని, అప్పట్లో మీకు ఇష్టంలేనిఒకపని మేము చెయ్యా డానికి మమ్మల్ని అనుమతించవలసినదిగా మీపై ఒత్తిడితీసుకువచ్చినట్లు కాగలదని ఈ ప్రయత్నాన్ని మేము విరమించుకున్నాము. మీఅంతట మీరు ఎన్నుకున్న సహచరులతో ఒక ప్రత్యేకమైన త్రోవననుసరించి వెళ్ళడానికి మీరుఉద్దేశిస్తున్నారని,వర్కింగ్కమిటీలోని పాతసభ్యుల అవ రోధమేకాకుండా, వారితో ప్రత్యేకమైనఅవసరమేమీ లేదని మీరు భావి స్తున్నారని, ఈ సంఘటనలన్నీ స్పష్టంచేస్తున్నాయి. తత్ఫలితంగా వారు వర్కింగ్కమిటీనుంచి రాజీనామా ఇవ్వవలసినఅవసరం ఏర్పడింది. అలాగ వారు రాజీనామా ఇవ్వకుండావున్నట్లయితే, మీపట్ల, దేశంపట్ల,

వారిపట్ల వారు అన్యాయంచేసినవారైవుండేవారు. ప్రజాస్వామికపద్ధతికి వ్యతిరేకంగా సంచరించివుండినవారై వుండేవారు. ఇట్టిపరిస్థితిలోకూడా వారు వర్కింగ్‌కమిటీలో వుండడం ఎలా సాధ్యమో నాకు అర్థం కాకుండావున్నది. వారిరాజీనామాఫలితంగా ప్రతిష్టంభన ఎలా ఏర్పడిందో కూడా నాకు అర్థంకావడంలేదు. వారు రాజీనామాఇవ్వకుండావుంటేనే అట్టి ప్రతిష్టంభన ఏర్పడివుండేది. ఎందుచేతననగా వారు అలా రాజీనామా ఇవ్వకుండావున్నట్లయితే మీరు ఉచితమనిభావించిన చర్యలకు అంత రాయమేర్పడేది.

మీ రన్నట్లు ఈ విషయంలో నేను ఒకవిధంగా తెలివితక్కువ వైఖరినే అవలంబించాను. వర్కింగ్‌కమిటీసభ్యత్వానికి రాజీనామా ఇవ్వకుండానే, రాజీనామాఇచ్చినవానివలె ప్రవర్తించాను. ఇందుకు కారణం నా సహచరులవైఖరిని పూర్తిగా అంగీకరించకపోవడమే. ఈపరిస్థితులలో మీతో నేను సహకరించలేనని నేను భావించాను. కాని అంతతీవ్రతతోనే ఇతర్లతో తెగతెంపులుచేసుకుంటున్నానని భావించాను. నిజానికి ఈ భావం నాలో ఎంతో తీవ్రంగా నాటుకున్నది. ఎందుచేతననగా ఇతర్లతో నేను తెగతెంపులుచేసుకుంటే అది సుదీర్ఘమైన అధ్యాయాన్ని ఆఖరుచేసినట్లేఅవుతుంది. నేను నేషనల్‌హెరాల్డుపత్రికలో తొలివార్తగా వ్రాసినవ్యాసాలను మీరు చదివితే, మీరు అప్పుడు నా మనస్సు ఎలా పని చేసిందో తెలుసుకోగలిగివుండేవారు.

వర్కింగ్‌కమిటీసభ్యులందరూ రాజీనామాలిస్తూ పమర్పించిన లేఖలో ఫిబ్రవరి 22న నే నిచ్చిన ప్రకటన అంతర్నిహితమై ఉన్నది అన్న ప్రశ్నేలేదు. నా ప్రకటన కేవలం నా వ్యక్తిగతమైనది. ఆ ప్రకటనను మరొకవిధంగా అర్థంచేసుకోరాదు. రాజీనామాలో నన్నుకూడా కలవమని నాపై తీవ్రమైన ఒత్తిడితీసుకువచ్చారు. కాని నేను నిరాకరించాను. మీరు పంపినతరువాతకాని, వారిరాజీనామాలేఖను నేను చూడలేదు. గత రెండు మూడుమాసాలలో నా మనస్సును ఎక్కువగా ఆందోళనపరుస్తూవచ్చిన విషయం నేను మీకు ఇంకాకొంతవివరంగా తెలియచెయ్యనా? మీరు ఎన్నికలో పోటీచేయడాన్ని ముఖ్యంగా రెండుకారణాలవల్ల నేను వ్యతిరేకించాను.

అప్పటిపరిస్థితులలో గాంధీజీతో చీలికఏర్పడినట్లు అవుతుంది. అలా జర గడం వాంఛనీయంకాదని నేను అనుకొన్నాను. (ఇలా తప్పనిసరిగా ఎం దుకు జరగవలసినఅవసరం ఏర్పడిందో నేను వేరుగా వివరించవలసిన అవసరంలేదు. కాని ఎందుచేతనోకాని, ఇలా జరగగలదని నేను ముందు నుంచి ఊహిస్తూనేవచ్చాను) ఇంతేకాక, ఈ చీలికవల్ల నిజమైన వామ పక్షఉద్యమంపై దెబ్బతీసినట్లవుతుంది. బాధ్యతాభారాన్నంతటిని తాను స్వయంగా మోయగలిగినబలం అప్పట్లో వామపక్షానికి లేదు. కాంగ్రె సులో అసలైన పోటీకనుక వచ్చినట్లయితే ఆ పోటీలో వామపక్షం నిలవ గలిగివుండేదికాదు. వామపక్షం వోడిపోయి తత్ఫలితంగా కొంత ప్రతిచ లనం ఏర్పడివుండేది. పట్టాభిపై వ్యతిరేకంగా ఎన్నికలో గెలిచేఅవకాశం మీకు వున్నదని అనుకున్నాను. కాని గాంధేయవాదంతో పోటీపడి మీరు కాంగ్రెసును నడపగలరనేవిషయంలో నాకు కొంత అనుమానంకలిగింది. ఒకవేళ మీరు కాంగ్రెసులో మెజారిటీ సంపాదించివుండివున్నప్పటికీ, గాంధీజీసహకారం, సచేతనమైనకార్యక్రమం లేకుండా ఇది ఒకటే తగి నంత బలంవున్నట్లు చెప్పడానికి కారణమయ్యేదికాదు. ఇంతేకాక దేశం సమరానికి సన్నద్ధంకావడంతో ఎన్నో చిక్కులుఏర్పడేవి. దేశంలో ఇప్పటికే అనేక విచ్ఛిన్నకరధోరణులు ఉన్నాయి. ఈ ధోరణులను అరి కట్టడానికిమారుగా, వున్నవాటికితోడుగా మరికొన్ని చేర్చినట్లయ్యేది. ఇం దువల్ల బలం అవసరమైనప్పుడు మనం మన జాతీయోద్యమాన్ని బల హీనపరచినట్లుగాకూడా అయ్యేది.

మీరు అధ్యక్షపదవికి తిరిగి ఎన్నికకావటానికి నేను వ్యతిరేకించ టానికి ఇవిరెండే ముఖ్యకారణాలు. కొందరు బొంబాయిమిత్రులు మీతో చెప్పినమాటలు పూర్తిగా నిజంకావు. మీరు కొన్ని నిర్దిష్ట వామపక్ష ఆదర్శాలకు, సూత్రాలకు, విధానాలకు కట్టుబడివుండివున్నట్లయితే మీరు అధ్యక్షపదవికి తిరిగిఎన్నుకొనబడవలెనని కోరుకొనడంలో కొంత అర్థం వుండివుండేదని నేను వారితో అన్నాను. ఆవిధంగా అయినట్లయితే ఆ ఎన్నిక ఆదర్శాలవిషయంలోను, విధానాలవిషయంలోను ఒక గుణపాఠమై వుండేది. కాని వ్యక్తిగతప్రాతిపదికపై జరిగే ఎన్నికవల్ల ఈమాత్రం

సత్ఫలితంకూడా వుండదు. ఏమైనప్పటికి నేను పైన పేర్కొన్నకారణా లనుబట్టి మీరు ఎన్నికల్లో పోటీచేయడం వాంఛనీయంకాదని నేను భావిం చాను.

జనవరి 26న, ఫిబ్రవరి 22న నేనుచేసిన ప్రకటనలలో వ్యత్యాసం ఉన్నమాట వాస్తవమే. కాని నా దృష్టిలో భేదంఉన్నదని నేను అను కోను. తొలిప్రకటన మీ ఎన్నికకుపూర్వం ఇవ్వబడింది. ఆ ప్రకటనలో ఏపక్షమూవహించకుండా ఉండడానికి నేను సాధ్యమైనంతవరకు ప్రయత్నించాను. డాక్టర్ పట్టాభితరపున విజ్ఞప్తిచేయవలసిందిగా నన్ను కోరారు: కాని, నేను అందుకు అంగీకరించలేదు. అందుచేతనే నేను నాప్రకటనను ఉద్దేశపూర్వకంగా మృదువైనపద్ధతిలో రూపొందించాను. ఆతరువాత మరికొన్నివిషయాలు నాకు తెలియవచ్చాయి. మీ ఎన్నిక ప్రకటనలను నేను చూచాను. పైన నేను ఉదహరించిన మరికొన్నిషయాలనుకూడా గమనించాను. కొందరు విచిత్రవ్యక్తులతో మీరు దగ్గరసంబం ధాన్ని కలిగిఉండటము, తగినంతగా వారిప్రభావం మీ మీద పనిచెయ్య డము నేను గమనించాను. ఈ వ్యక్తులలో కొందరు వ్యక్తిగతంగా వాంఛ నీయమైనవారే కాని, నాఉద్దేశంలో వీరు ఏవిధమైన వామపక్షఅభిప్రాయా లకుకాని, లేక మరేవిధమైన ప్రజాభిప్రాయానికికాని ప్రాతినిధ్యంవహించే వారు కారు. అందుచేతనే, రాజకీయ సాంకేతికదృష్ట్యా, నేను వారిని అతి వాద దుందుడుకువాదులని పిలుస్తాను. సాహసేచ్ఛ అన్నది ఒక వ్యక్తిలోకాని, ఒక దేశంలోకాని వాంఛనీయమైనదే. కాని ఒక రాజకీయ పోటీలో ఈమాటకు ఒక ప్రత్యేకమైన అర్థం వున్నది. ఈ అర్థంలో ఆమాటను వాడడంవల్ల వారిని అగౌరవించినట్లుకాదు. ఈ సాహస ధోరణిఅంటే నాకు ఎంతమాత్రం ఇష్టంలేదు. పైగా, ఈ ధోరణి మన లక్ష్యానికి ప్రమాదంకలిగిస్తుందికూడా. స్పష్టమైన వామపక్షఅభి ప్రాయాలు, నియమాలు లేకుండా అస్పష్టమైన వామపక్షనినాదాలనివ్వడం వల్ల ఎలాంటిఫలితాలు కలుగుతవో, ఇటీవల కొన్నిసంవత్సరాలలో ఐరోపాలో జరిగిన సంఘటనలు ఋజువుచేస్తూనేఉన్నవి. ఈవిధమైన ధోరణి ఐరోపాలో ఫాసిజం అభివృద్ధిచెందడానికి దోహదంచేసింది. ఇట్టి

విషమపరిణామమే భారతదేశంలోనైతం రావచ్చుననేభయం నన్ను కల వరపెట్టసాగింది. అంతర్జాతీయవ్యవహారాలపట్ల, మీరు నాఅభిప్రాయాలకు భిన్నమైనఅభిప్రాయాలను కలిగిఉండడము, నాజీజర్మనీని, ఫాసిస్టుఇటలీని మేము నిరసించడాన్ని మీరు పూర్తిగా అంగీకరించకపోవడము నా మానసికఆందోళనను మరింత ద్విగుణీకృతంచేశాయి. ఏతావాతా, ఈవిషయాలన్నిటిని సాకల్యంగా పరిశీలించినపిదప, మీరు మమ్మల్ని ఏదిక్కుకు పయనంచెయ్యమనికోరుతూఉన్నారో నేను ఊహామాత్రంగా నైనా పోల్చుకోలేకపోయాను.

ఈ పథం నాకు నిశ్చితంగా తెలియనిమాట అలాఉంచి, కొన్ని సూచనలు నాకు కలవరాన్నికలిగించేవిగా ఉన్నప్పటికి, మీ అభిప్రాయాలేమిటోకూడా నాకు ఖండింతంగా తెలియదు. అందుచేతనే ఈవిషయాలన్నిటిని స్పష్టీకరించవలసిందిగా కోరుతూ, ఫిబ్రవరిలో మీకు లేఖ వ్రాశాను. కాని అప్పట్లో ఆ లేఖకు సమాధానంవ్రాయడానికి మీకు వ్యవధిలేకపోయింది. ఆతరువాత మీరు జబ్బుపడ్డారు. నా సమస్యలు అలాగే అపరిష్కృతంగా నిలిచిపోయి, నాకు మరింత ఆందోళనకలుగ జేయసాగాయి. దీని ప్రతిబింబాన్నే మీరు ఫిబ్రవరి 22న నేను అందించిన నాప్రకటనలో చూడగలుగుతారు. ఆతరువాత నేషనల్ హెరాల్డ్ పత్రికలో నేను వ్రాసిన వ్యాసాలలోకూడా ఈ ఆందోళనే ప్రతిబింబించింది.

ఒక సమగ్రదృష్టి లేక పాత వర్కింగ్‌సభ్యులను వ్యతిరేకించవలెననే ఒక్కఉద్దేశంతోనే సమైక్యమయిన కొన్ని విచిత్రఅభిప్రాయాలుగలవ్యక్తులతో వర్కింగ్‌కమిటీ ఏర్పడే అవకాశం ఉండడం వాంఛనీయం కాదు.

అలాంటి వర్కింగ్‌కమిటీలో నేను ఎలా సభ్యుణ్ణిగా చేరగలవనే విషయాన్ని నేనే ఊహించలేకపోయాను. పాతవర్కింగ్‌కమిటీతో నాకు పేచీఉంటూవచ్చినమాట నిజమేకాని,ఎన్నిభేదాభిప్రాయాలున్నప్పటికీ మేమొకరినొకరం అర్థంచేసుకుని, కొన్నిసంవత్సరాలనుంచి ఏదోఒకవిధంగా కలిసికట్టుగా పనిచేయగలుగుతున్నాము. ఈవిధంగానే ఇకముందుకూడా సాగవలెననేవాంఛ నాకు లేదు. కాని, పరస్పరం అర్థంచేసుకోగలగడమనే

అనుబంధంకూడా లేని ఈ చిన్న నిర్వాహకవర్గంతో సంబంధంపెట్టుకోవడంకూడా నాకు వాంఛనీయంగా అగుపించలేదు. మరొక వ్యక్తిగతవిషయాన్నికూడా నేను మీతో విష్కపటంగా చెప్పదలిచాను. అధ్యక్షపదవికి తిరిగి ఎన్నికఅయ్యేవిషయంలో మీరు మితిమించిన ఆసక్తిచూపుతూ వచ్చారని నేను మొదటినుంచి భావిస్తూవచ్చాను. రాజకీయంగా ఇలా చెయ్యడంలో తప్పేమీ లేదు. తిరిగి అధ్యక్షుడుగా ఎన్నికకావాలని కోరుకొనడానికి మీకు పూర్తిగా హక్కున్నది. అందుకు సర్వవిధాలా ప్రయత్నించడానికికూడా మీకు పూర్తిహక్కున్నది. కాని ఇలాంటివాటికి అతీతంగాఉండగల ఉన్నతపదవి, అంతస్థు మీకు ఉండికూడా ఈవిషయాలలో అంతగా ఆసక్తినిచూపడం నాకు విచారాన్ని కలగజేసింది. మీరు అధ్యక్షపదవికి పోటీచెయ్యక, మరోతీరుగా వ్యవహరించిఉంటే, రాజకీయవిధానాలను, వర్గాలను మరింతగా మీప్రభావంలోకి లాక్కునిఉండగలిగేవారనికూడా నేను భావించాను.

వల్లభాయ్ మిమ్మల్నిగురించి అన్నవిషయాన్ని మీరు నాకు జ్ఞాపకంచేసి, అలాఅన్నందుకు ఆయన్ని నేను విమర్శించలేదని మీ రన్నారు. ఎన్నికసమయంలో వివిధనాయకులిచ్చిన ప్రకటనలవిషయం చెప్పాలంటే ఆ ప్రకటనలు నాకు ఎంతమాత్రం నచ్చలేదు. ఏ ప్రకటనను ఇవ్వకపోవడం సబబుగాఉండేదని నేను భావించాను. కాని నేను జోక్యంకలిగించుకోవలసినంత ప్రత్యేకతఉన్న ప్రకటనఒకటికూడా లేదని నాకు జ్ఞాపకం. మీరు ఎన్నికలో పోటీచేయడం దేశశ్రేయస్సుకు మంచిదికాదనే వాక్యాన్ని వల్లభాయ్ శరత్‌కు వ్యక్తిగతంగా పంపిన ఒక టెలిగ్రామ్‌లో వాడారు. బహిరంగప్రకటనలో ఒకరు ఒకమాట అనడానికి, రహస్యలేఖలోకాని లేక టెలిగ్రాంలోకాని ఒకరు ఒకమాటఅవడానికి వ్యత్యాసం ఉన్నదని నేను అనుకుంటాను. ఈవిషయాన్ని మీఅన్నగారికి పంపడంకూడా గర్హించతగినదే; ఇది చాలా తీవ్రమైన మాటేకాని, అగౌరవకరమైన దురుద్దేశంతో అన్నమాట కాదు. భారతదేశశ్రేయస్సుకు గాంధీజీ నాయకత్వం అవసరమని, మీరు తిరిగి ఎన్నికకావడంవల్ల ఈ నాయకత్వాన్ని కోల్పోయినట్లుకాగలదని, వల్లభాయ్ విశ్వసించినట్లయితే, అలాగ

భావించడానికి, తాము భావించినవిషయాన్ని చెప్పడానికి వల్లభాయ్‌కి పూర్తిహక్కున్నది. గాంధీజీపట్ల మనకు ఎంత గౌరవప్రపత్తులున్నా, ఆయననాయకత్వం దేశానికి ఉపద్రవకరమని మనము ఒకనిర్ణయానికి ఎలా రాగలమో అలాగే ఈవిషయమున్నూ.

మీరు అధ్యక్షపదవికి తిరిగి ఎన్నికయినందువల్ల, కొంత మంచి కొంత చెడు కలిగినదని నేను మీకు వ్రాశాను. మంచితోపోల్చినప్పుడు చెడు ఎక్కువగా కలిగిందనే అభిప్రాయానికి నేను ఈనాటికీ కట్టుబడి ఉన్నాను. అనగా ఈ చెడు మనలో విచ్ఛిత్తిఏర్పడడానికి దారితీస్తుందని నా ఉద్దేశం. మీరు తిరిగి ఎన్నికకావడంవల్ల కలిగిన మంచి ఏమిటంటే, మన పాతనాయకులలోని నిశ్చేతనమైన సంతృప్తి, జడత్వమూ సడలినవి. మీతరఫున ఓటు చాలావరకు ఈ జడత్వంపై అసంతృప్తివల్ల ఇవ్వబడిన ఓటేనని నేను నిస్సందేహంగా చెప్పగలను. ఈవిషయాన్ని గమనించవలసిందని, నేను గాంధీజీని ఇతరులను పునః పునః కోరాను.

పాతనాయకులపట్ల, వారివిధానాలపట్ల ఉన్న ఈ అసంతృప్తి అధ్యక్షఎన్నికసందర్భంలో ఓటింగురూపంలో బహిర్గతమైంది. మీరు అగ్రస్థాయినుంచి జోక్యం కలిగించుకొనడానికి అభ్యంతరాన్ని తెలుపుతూ, అధ్యక్షుడుగా మీరు సచేతనంగా వ్యవహరించలేదని అంటూ ఫిబ్రవరి 4 తారీఖున మీకు నేను వ్రాసినలేఖలో అన్నానని మీరు నాకు జ్ఞప్తిచేశారు. ఈవిషయం నిజమే. అగ్రస్థాయినుంచి మీరు జోక్యంకలిగించుకుంటున్నారన్నవిషయం మీరు అధ్యక్షపదవికి తిరిగి ఎన్నికైన సమయంలో మీరు వ్యవహరించినవైఖరినిగురించి అన్నమాట. అంతకు ముందుదశకు సంబంధించినమాట కాదు ఇది. మీరు సచేతనంగా వ్యవహరించలేదని నేను అన్నవిషయం, గతసంవత్సరం వర్కింగ్‌కమిటీలో మీరు అవలంబించినవైఖరినిగురించి అన్నది. మీరు వర్కింగ్‌కమిటీలో ఇంతకన్నా శక్తివంతమైనమార్గాన్ని సూచించగలరని నేను ఆశించాను. కాని ఆవిధంగా జరగలేదు. ఇంతేకాక, అధ్యక్షుడుగా మీరు రాష్ట్రాలవ్యవహారాల్లో జోక్యంకలిగించుకొనడంకూడా నాకు సబబుగా కనుపించలేదు.

వర్కింగుకమిటీసభ్యులుకొందరు మీరులేనప్పుడు మీ పరోక్షంలో కలుసుకొని డాక్టర్ పట్టాభిని అధ్యక్షపదవికి నిలపెట్టాలని నిశ్చయించారని మీరు మీ లేఖలో అన్నారు. వల్లభాయ్ ప్రకటనవల్ల ఈవిషయంలో కొంత అపార్థంకలగడానికి అవకాశంకలిగింది. ఈవిషయం స్పష్టీకరించే అవకాశం మీరు నాకిచ్చినందుకు నే నెంతో సంతోషిస్తున్నాను. నాకు తెలిసినంతవరకూ ఇలాంటిసమావేశ మేదీ జరుగలేదు. బార్డోలిలో జరిగిన విషయమేమనగా, మౌలానాఆజాద్‌ను అధ్యక్షపదవికి నిల్చోవలసినదిగా నేను, గాంధీజీ, తదితరులు ఒత్తిడిచేశాము. కాని ఆయన అందుకు సమ్మతించలేదు. నేను బార్డోలీనుంచి బయలుదేరినరోజున గాంధీజీవద్ద, తదితరులవద్ద సెలవుతీసుకొనటానికి ఆయనకుటీరానికి వెళ్ళాను. మేము కొందరము గాంధీజీకుటీరద్వారంలో నిల్చొనివున్నాము. అధ్యక్షబాధ్యతలువహించటానికి తాము తటపటాయిస్తున్నానని, మౌలానా మళ్ళీ మాతో అన్నారు. దానిమీదట మౌలానా నిరాకరించినపక్షంలో డాక్టర్ పట్టాభిని నిల్చొనవలసినదిగా కోరవలెనని వల్లభాయ్ అన్నారు. ఈసందర్భంలో డాక్టర్ పట్టాభిపేరు తీసుకురాబడుతుందని నేను వూహించలేదు. నేను అందుకు ఏమీఅనకుండా మౌలానాను నిల్చొనడానికి ఒప్పించేటట్లుచేయాలని అన్నాను. ఆతరువాత నేను బార్డోలీనుంచి అలహాబాదుకు వచ్చాను. నేను అలహాబాదురాగానే మౌలానా అంగీకరించినట్లు నాకు టెలిగ్రాం వచ్చింది. నేను సరాసరి ఆల్‌మోరావెళ్ళి, అధ్యక్షఎన్నికజరగటానికి ముందురోజువరకు అక్కడనే వున్నాను.

ఇక పరస్పరదూషణవ్యవహారాలకుసంబంధించిన తీర్మానాన్ని గురించిన వాస్తవవిషయాలు ఇవి: ఈవిషయాలు స్పష్టీకరించవలసిందిగా మిమ్మల్ని నేను వత్తిడిచేశాను. ఈవిషయాలను స్పష్టీకరించనిపక్షంలో గాంధీజీ, మీరు కలిసి పనిచేయడం అసాధ్యంకాగలదని, నేను భావించాను. ఇంతకుమించి ఈవిషయంలో ప్రత్యేకమైన ఆసక్తి నాకులేదు. గాంధీజీకాని, రాజేంద్రబాబుకాని, సర్దార్‌పటేలుకాని ఈవిషయాన్ని గురించి ఏమైనా అనుకొనివున్నట్లయితే, ఆవిషయాన్ని చెప్పవలసిన బాధ్యత వారిది. ఈవిషయానికి ఎంతో ప్రాధాన్యాన్ని వారు ఇచ్చారని

వారిధోరణులవల్ల నాకు అభిప్రాయమేర్పడింది. మేము త్రిపురిచేరినతరు వాతకూడా నాకు వారు ఇదేమాటను మళ్ళీ చెప్పారు. ఈవిషయాన్ని మీతోకాని, రాజేంద్రబాబుతోకానీ ప్రస్తావించడం సబబుగావుంటుందని నేను అభిప్రాయపడ్డాను. ఈవిషయాన్నిగురించి తీర్మానాన్ని ప్రతిపాదించ వలదని నేను అన్నాను. ఇతరులు ఇందుకు అంగీకరించలేదు. ఏ. ఐ. సి. సి. 'సమావేశంలో ప్రతిపాదించటానికి ఒకతీర్మానాన్ని తయారు చేయటానికి సూచించబడింది. విషయనిర్ణాయకసభ ప్రారంభించటానికి పూర్వం వాతావరణం నిష్కల్మషంగావుంచడమే దీనిఅభిప్రాయం. మామూలుగా తీర్మానాలువ్రాయవలసివచ్చినప్పుడు నన్ను కోరుతూవచ్చి నట్లుగానే ఈసారికూడా ఈతీర్మానం వ్రాయవలసిందని నన్ను కోరారు. వారిదృష్టిలో నేను అంగీకరించకపోయినప్పటికీ నాకు సాధ్యమైనంత వరకు వారిదృష్టిని తీర్మానంలో ప్రతిబింబింపచేయటానికి ప్రయత్నిస్తా నని నేను వారితోఅన్నాను. ఏ. ఐ. సి. సి. సమావేశంలో ప్రవేశ పెట్టడంకొరకు కొద్దిపాటితీర్మానాన్ని తయారుచేశాను. పాతవర్కింగ్ కమిటీలోను, గాంధీజీనాయకత్వంలోను విశ్వాసం ఆ తీర్మానంలో వ్యక్తీ కరించబడింది. అంతేకాక, ఈవిధానంలో మార్పువుండదనేవిషయం కూడా ఆ తీర్మానంలో వ్యక్తీకరించబడింది. ఈతీర్మానంలో పరస్పర దూషణవ్యవహారాలనుగురించి ప్రస్తావనఏమీ లేదు. గాంధీజీఅభిమతాన్ని అనుసరించి వర్కింగ్ కమిటీని ఏర్పరచవలెననేఉద్దేశంకూడా ఈతీర్మా నంలో లేదు. ఈ తీర్మానం అంగీకరింపబడలేదు. ఆతరువాత ఇంతకన్న దీర్ఘమైనతీర్మానం, మార్పులతో, రాజేంద్రబాబుచేత తయారుచేయబడింది. బహుశా ఇతరులతోసంప్రదించి ఆయన ఆ తీర్మానాన్ని రూపొందించి ఉండవచ్చును, (గోవిందవల్లభ్ పంత్ ఇంతవరకు త్రిపురికి రాలేదు) మార్పుచేసిన ఈ తీర్మానాన్ని నాకు చూపించారు. నేను ఈతీర్మానాన్ని అంగీకరించలేదు. ఆవిషయాన్ని వారితో చెప్పానుకూడా. 'పరస్పర దూషణ వ్యవహారాలకు' సంబంధించినక్లాజు నాకు అభ్యంతరపెట్టవల సిందిగా తోచలేదు. ఆ క్లాజును పరిహరించారుకూడా. అయినా, ముఖ్యంగా మీరు జబ్బుగావున్నకారణాన ఈ తీర్మానం కొంత అపం

తృప్తి కలగజేయవచ్చునని భావించాను. అందువల్ల ఈ తీర్మానం నా దృష్టిలో వాంఛనీయంకానట్లు తోచింది. కాని ఈ పరస్పరదూషణ వ్యవహారానికి ఈ తీర్మానంలో ఎంతో ప్రాధాన్యంఉన్నదని వారు నాతో అన్నారు. ఎవరిగౌరవంపై నిందవ్రేలుమబడిందో, వారు, యీవిషయాన్ని స్పష్టీకరించుకోకుండా సహకరించమన్నది సాధ్యపడదు. వారు సహకరించి పనిచేయవలెనంటే ఇది ఎంతో అవసరం. గాంధీజీవిధానానికి కట్టుబడివుండడంకూడా అవసరం. అంతేకాక, ఈవిషయాన్ని తీర్మానంలో ఎంతో మెత్తనిధోరణిలోమాత్రమే ప్రవేశపెట్టడం జరిగిందని వారు నాతో అన్నారు.

ఆతరువాత నేను ఆ తీర్మానాన్నిగురించి ఎక్కువగా వారితో ప్రస్తావించలేదు. కొన్నివిషయాలలో ఈతీర్మానాన్ని ప్రవేశపెట్టవలసిరావడం దురదృష్టకరమైనవిషయమని నేను వారితో స్పష్టంగా చెప్పాను. కాని, అది వారిగౌరవానికిసంబంధించినవిషయం కాబట్టి, నాకు ఇక ఆ తీర్మానంమంచిచెడ్డలతో ఏవిధమైనసంబంధమూ లేదు. తీర్మానచర్చలలో కూడా నేను పాల్గొననని అన్నాను.

ఆతరువాత జరిగిన విషయాలేమిటో నాకు తెలియదు. ఈతీర్మానాన్ని గోవిందవల్లభ్‌పంత్ ప్రవేశపెడుతున్నవిషయాన్ని నేను ఏ. ఐ. సి. సి. సమావేశంలోమాత్రమే తెలుసుకొనగలిగాను. మీరుకూడా ఆ సమావేశంలో వున్నారు. ఆపిదప ఈ తీర్మానం విషయనిర్ణాయకసభలోకి వచ్చినప్పుడు నేను ఈతీర్మానప్రతిపాదకులను కొందరిని కలుసుకుని, ఈ తీర్మానంలో మరికొన్ని మార్పులుచేయవచ్చునని నేను వారికి సూచించాను. తొలిరూపంలోవున్నతీర్మానం ఏ. ఐ. సి. సి. సమావేశంలో ప్రవేశపెట్టడానికిమాత్రమే ఉద్దేశింపబడినదని, అంతటితో ఆ సంఘటన ఆ వాగ్వివాదము ముగిసిపోయినట్లేనని నేను వారితో అన్నాను, కాని ఇప్పుడు ఈతీర్మానం కాంగ్రెసులో ప్రవేశపెట్టబడుతుండడంవల్ల ఈ తీర్మానాన్ని మరొకదృష్టితో సమాలోచింపవలసిన అవసరంవున్నదని అన్నాను. మళ్ళీ వారు నాతో ఇంతకుపూర్వం అన్నమాటే అన్నారు. ఇదిగౌరవానికిసంబంధించినవిషయమని, ఈసమస్య తేలితేనేకాని, సహకరిం

చడమనేవిషయాన్నిగురించి వారు ఆలోచించడానికి అవకాశమేవుండదని వారు నాతో అన్నారు. వారు మీతో సహకరించలేమన్నవిషయాన్ని కాం గ్రెసుకుపూర్వమే మీతో చెప్పివుండడం మీకు జ్ఞాపకంవుండేవుంటుంది. సహకరించేయల్లానికి ఒకవంతెనగా ఈ తీర్మానం ఉపయోగపడగలదని వారు భావించారు. ఈ తీర్మానమే లేకపోయినట్లయితే అసలు ఆ వంతెనకూడా వుండివుండేదికాదు. మీరు జబ్బుతోవున్నప్పుడు బహిరంగ సమావేశంలో ఈ తీర్మానం ప్రవేశపెట్టబడేసమయంలో, ఈతీర్మానంలో కొన్ని మార్పులు చేయించడంకొరకు నేను మరొకపర్యాయంకూడా ప్రయత్నించాను. కాని ఈపర్యాయంకూడా నా ప్రయత్నం సఫలంకాలేదు. ఏ. ఐ. సి. సి. కి ఈతీర్మానం సూచించవలెననే ఆనే ప్రతిపాదనను మటుకు వారు అంగీకరించారు. బెంగాల్‌లో చాలామంది మిత్రులు తన ప్రతిపాదనను అంగీకరించారనేభావాన్ని ఆనే మాకు కలిగించారు. ఆనే చెప్పినమాటలనుబట్టి మీరుకూడా ఆ సూచనను అంగీకరించివుంటారని మేము భావించాము. ఆతరువాత జరిగినవిషయాలన్నీ మీకు తెలిసినవే.

ఆమర్నాటి విషయనిర్ణాయకసభకై ఏర్పాటుచేయబడినపందిట్లో కాంగ్రెసుసభ జరిగినప్పుడు, గోవిందవల్లభ్ పంత్ తీర్మానాన్ని ప్రతిపా దిస్తున్నసందర్భంలో, సురేష్‌ముజుందార్ నాదగ్గరకు వచ్చి, ఏ.ఐ.సి.సి.కి ఈతీర్మానాన్ని సూచించవలసిందని నాతో అన్నారు. అనగా, అతడు ఆనే ప్రతిపాదనను తిరిగి నాతో సూచించాడన్నమాట. పోయినరాత్రి ఈ విషయమై వారిలోవారికి కొన్ని భేదాభిప్రాయాలువచ్చినవని, ఈసూచనను ఇప్పుడు వెంటనే అంగీకరించగలరని, ఆయన నాతో అన్నారు. ఇప్పుడు ఇట్టిపరిస్థితులలో ముఖ్యంగా పంత్ తాను స్వయంగా తీర్మానాన్ని ప్రవేశ పెడుతూవున్నసమయంలో, ఈవిషయమై నేను చేయగలిగింది ఏమీలేదని, ఒకవేళ తాను ఈవిషయాన్ని సూచించదలచినట్లయితే ఈవిషయానికి సంబంధించినవారితోనే సూచించవలసిందని నేను ఆయన్ని కోరాను. ఆతరువాత ఆయన ఏంచేశాడో నాకుతెలియదు. త్రిపురీలో తెరవెనుక జరిగిన విషయాలన్నుగురించి, ప్రతినిధులశిబిరాలలోని పుకార్లనుగురించి, మీకు తెలిసినంతగా నాకుతెలియదు. నేను నా కుటీరంనుంచి ఇవతలకి

కూడా రాలేదు. ముఖ్యమైనసభలకుమటుకే హాజరైనాను. నన్ను చూడ డానికివచ్చినవారిలో కొద్దిమందితోమాత్రమే మాట్లాడినాను. ఈజిప్షియన్ ప్రతినిధులతో కొంతకాలం గడిపాను.

మీరు నా క్లయింట్లనుగురించి మీలేఖలో ప్రస్తావించారు. ముఖ్యంగా నిజానికి వీరికి నా వాదం ఏమాత్రం నచ్చలేదు. వారిఆదరాన్ని పోగొట్టు కొనడంలో నేను విజయంపొందాను. మనతోసంబంధంగలవ్యక్తులకు మనం అసంతృప్తికలిగేటట్లుచేయడం నిజంగా ఒక సాముగరిడీలాంటిదే.

ఈపరస్పర దూషణవ్యవహారం, రాజ్యాంగవిరుద్ధమైనది అవునా, కాదా అన్నవిషయాన్ని, తీర్మానాన్ని ప్రవేశపెట్టడానికి వారికి అట్టి అధికారాలు వున్నవా, లేవా అన్నవిషయాన్ని నిర్ణయించవలసిందిమీరు. ఈవిషయమై అభిప్రాయాన్ని నేను తెలుపడంలో అర్థంలేదు. కాంగ్రెసు కార్యక్రమం సాఫీగా సాగిపోవడము, ఈనాడున్న నిస్తబ్ధత తొలగిపోవటము ఈ రెండువిషయాలే నేను సహజంగా కోరుకుంటాను. మీకువ్యతిరేకంగా నేను బహిరంగంగా ఆందోళనప్రారంభించానని మీరు అనుకోవడం నాకు ఆశ్చర్యాన్ని కలగజేసింది. గాంధీజీతో నేను మాట్లాడినతరువాత నేను ఈపరిస్థితినిగురించి ఎంతో సుదీర్ఘంగా ఆలోచించాను. పైగా అంతర్జాతీయంగా జరిగినసంఘటనలు నన్ను ఎక్కువగా కలవరపెట్టసాగాయి. యిరోపాలో ఒక క్లిష్ట విషమపరిస్థితి ఏర్పడింది. ఆ పరిస్థితి వల్ల యుద్ధానికికూడా దోవతీసేసూచనలు ఏర్పడ్డాయి. మనం జరుగుతున్నవిషయాలను పట్టించుకోకుండా చూస్తూవూరుకోవడం సబబుకాదని నే ననుకున్నాను. శరత్ గాంధీజీకి ఒక టెలిగ్రాంఇచ్చారు. అందులో గాంధీజీని తాను కలుసుకోడానికి రావడంలేదని వున్నది. అందుచేత సంఘటనలు పరిగెత్తిపోతూవున్నప్పటికీ జరుగుతున్నవని ఏమీ కనుపించలేదు. ఆతరువాత నేను టెలిగ్రాంపంపించటానికి నిర్ణయించుకున్నాను. ఆ టెలిగ్రామును గాంధీజీకి, మరిఒకరిద్దరికి నేను చూపాను. పత్రికలకుసంబంధించినవ్యక్తులకు ఎవ్వరికి నేను ఆ టెలిగ్రాము చూపలేదు. ఇప్పటికి కూడా నేను ఆటెలిగ్రాంను ఎవరికీ చూపలేదు. బహుశా ఎవరో ఈవిష

యాన్నిగురించిన సకలువార్తలను విని ఆ వార్తలను పత్రికలకు ఇచ్చి ఉంటారు.

త్రిపురిసభలకుపూర్వం వర్కింగ్ కమిటీసభ్యులు 12మంది రాజీనామానివ్వడాన్నికాంగ్రెసుసభల తదుపరిపరిస్థితితో పోల్చడం సుస్థిరమైనది కాదని మీరు భావించడంలేదా? వారి రాజీనామాలవల్ల స్తబ్ధస్థితి ఏర్పడింది. కాని అలా స్తబ్ధస్థితి ఏర్పడకుండా ఉండిఉండవలసింది. వారు రాజీనామాలివ్వడంపై నిరసనతెలిపేమాట అలాఉంచి, వ్యక్తిగతంగాకాని, సంస్థదృష్ట్యాకాని, వారికి మరో గత్యంతరంలేదని నేను భావిస్తాను.

ఢిల్లీనుంచి నేను మీకు టెలిగ్రాంపంపినప్పుడు, మీరు ఇక్కడికి రావడం పడదన్నవిషయం నాకుతెలుసును. మిమ్మల్ని ధన్‌బాద్‌లో కలుసుకోడానికి గాంధీజీని అక్కడికి రావలసిందిగా ఆయనకు సూచించవలసిందని నేను మిమ్మల్నికోరాను. మీరు ఆయన్ని ఆహ్వానించిఉండి ఉన్నట్లయితే ఆయన ధన్‌బాద్ వచ్చిఉండేవారు. అనాహూతంగా అక్కడికి వెళ్ళడం అనుచితమని ఆయన తటపటాయించడం సహజం. త్రిపురితీర్మానానికి చెల్లుబడిఉన్నా లేకపోయినా, ఆవిషయంపై ఒకచర్యతీసుకోవలసినబాధ్యత మీది. మీ అభిప్రాయాన్ని తెలుసుకొనకుండా ఆయన ముందుగా చర్యతీసుకొనలేదుకదా! ఆయన ధన్‌బాద్‌కు రాలేరని బహుశా మీరు అనుకొనిఉండవచ్చును. మీ కార్యదర్శి నాకు టెలిఫోన్ చేసినప్పుడు గాంధీజీ స్టేషనుకు వెడుతూఉన్నారు. ఒకవేళ గాంధీజీని మీరు వ్యక్తిగతంగా కలుసుకొనే అవకాశం లేకపోయినా, మీరు ఇరువురూ ఉత్తరప్రత్యుత్తరాలద్వారానైనా ఈ విషయాన్ని పరిష్కరించుకునిఉండడం సబబుగాఉండేదని భావించాను. మీకు కష్టంకలిగించేఉద్దేశంతోను, లేక మీకు వ్యతిరేకంగా ఆందోళనలేవదీసేఉద్దేశంతోను నేను మీకు టెలిగ్రాంపంపానని మీరు అనడం కేవలం మీరు నాపట్ల అన్యాయంగా ప్రవర్తించడమే.

ఇక, నాకుసంబంధించినంతవరకు, గ్వయర్ అవార్డుకొరకుగాంధీజీ ఢిల్లీలో వేచిఉండడమన్నది నాకు ఎంతమాత్రం ఇష్టంలేదు. ఆయన నిరశనదీక్ష ప్రారంభిస్తారనికూడా నేను ఊహించలేదు. గాంధీజీ నిరశన

దీక్షను విరమించడానికి దోహదంచేసిన పరిష్కారపద్ధతులనుగూర్చి నేను యోచించిఉండలేదు. ఆయన నిరశనదీక్షను విరమించినందుకు గాను నేను నా సంతోషాన్ని తెలిపి, అంతటితో ఊరుకొన్నాను. ఇది సుదీర్ఘమైనలేఖ, మీ జాబు రాగానే కూచుని ఈలేఖను ఒక్కబిగిని వ్రాస్తున్నాను. ఈలేఖలో నేను విషయాలన్నిటిని ప్రస్తావించిఉండకపోవచ్చును. మీరు మీలేఖలో అనేకవిషయాలను ప్రస్తావించారు. ఆవిషయాలన్నిటిని నేను ప్రస్తావించిఉండకపోవచ్చును. నేను అంగీకరిస్తున్నాను. అంచేత విచారిస్తున్నాను. కాంగ్రెసుఅధ్యక్షపదవిని నేను నిర్వహించినప్పుడు నేను తరుచుగా ఒకకార్యదర్శివలెను, లేక ఒక పెద్ద గుమాస్తావలెను వ్యవహరించేవాడినని మీరు అన్నారు. నిజమే, ఈవిధంగా ఇతరుల వ్యవహార విషయాలలో నేను అనవసరజోక్యం కలగజేసుకునేవాణ్నేమోనన్న భయంకూడా నాకున్నది. కాంగ్రెసుతీర్మానాలు సుదీర్ఘంగాఉండడానికి, ఆ తీర్మానాలలో పదాడంబరం హెచ్చుగాఉండడానికి, కారణంనేనేనన్నమాట కూడా నిజం. వర్కింగ్‌కమిటీలో నేను అతిగా మాట్లాడేవాడినికూడా. ప్రవర్తించవలసినరీతిగా ప్రవర్తించేవాడినికాదు.

'వామపక్ష' 'మితవాద'—అని మీరు ఉపయోగించేమాటలకు నేను అభ్యంతరం తెలిపాను. ఎందుకనగా, మీరు ఆ పదాలను అస్పష్టంగాను, అనుచితంగాను ఉపయోగించేవారు, వామ, మితవాదవర్గాలున్న మాట నిజమే. ఈ వర్గాలు దేశంలోనూ ఉన్నవి; కాంగ్రెసులోనూ ఉన్నవి. కాని ఈ మాటలను సముచితంగా ఉపయోగించకపోతే తత్ఫలితంగా గందరగోళం ఏర్పడుతుంది, రాజకోట్; జయపూర్ సమస్యలు ఇతరసమస్యలన్నిటిని మరుగుపరుస్తున్నవని, నేను అన్నట్లు నాకు జ్ఞాపకంలేదు. రాజకోటసమస్య — అనగా అనేక క్లిష్టవిషయాలతో కూడిన గాంధీజీఉపవాసదీక్ష రాజకీయరంగంలో అనేకవిధాలుగా ప్రాధాన్యం గలదని అన్నాను, అంతే.

ఇక బొంబాయి వాణిజ్యవివాదాలకల్లోలవిషయం—ఈకల్లోలకారణమై బొంబాయిలో కాల్పులుజరిగినపిమ్మటనే, నేను భారతదేశంవచ్చాను. ఇది ఒక క్షమాపణచెప్పుకోవడంగా కాక, వాస్తవవిషయంగానే మీకు

తెలియచేస్తున్నాను. రాష్ట్రకమిటీవద్దనుంచి గ్రామకమిటీవరకు రెండు సంవత్సరాలు ఒకవ్యక్తి కమిటీలకు అధ్యక్షుడుగా వుండరాదని, యు. పి కాంగ్రెసులో మాకు ఒక నియమం ఉన్నది.

వివిధరాష్ట్రాలనుంచి త్రిపురికి ప్రతినిధులను చేరవేయడంలో జరిగిన అవినీతినిగురించి మీరు ప్రస్తావించారు. నా రాష్ట్రానికిసంబంధించినంతవరకు ఇట్టి అవినీతికరచర్య జరిగినదనే నేను భావిస్తాను. ఇతరరాష్ట్రాలలోకూడా జరిగి ఉండవచ్చును. అన్నిరాష్ట్రాలలోను ఈ విషయమై విచారణ జరపవలసిందిగా నేను కోరవచ్చునా? ఇలాగ విచారణజరిపినందువల్ల సంస్థను చక్కబరిచినట్లుకాగలదు.

పంత్‌తీర్మానాన్నిగురించి నావ్యాఖ్యానం ఏమిటో తెలుపవలసినదిగా మీరు కోరారు. అది విశ్వాసరాహిత్యతీర్మానమని నేను భావించను. కాని మీ నిర్ణయంలో తగినంతవిశ్వాసం లేకపోవడాన్నిమటుకు ఆ తీర్మానం సూచిస్తున్నది. గాంధీజీలో విశ్వాసం వుంచవలెనని ఆ తీర్మానాన్నిబట్టి అర్థంచేసుకోవచ్చును.

నేను సోషలిష్టునా? లేక వ్యక్తిత్వవాదినా? ఈ రెండుమాటలూ తప్పనిసరిగా పరస్పరవిరుద్ధార్థంగలిగినవా? ఒక్కమాటలో,ఒక్కపదంలో మనల్ని మనం నిర్వచించుకోగలిగినంతటి సంపూర్ణమానవులమా మనం? స్వభావంచేత, శిక్షణచేత నేను వ్యక్తిత్వవాదినని భావిస్తున్నాను. బుద్ధిచేత సోషలిష్టును. ఇక మీరు నన్ను ఏవిధంగానైనా అర్థంచేసుకోవచ్చును. సోషలిజం వ్యక్తిత్వాన్ని అణిచివేసేది, చంపేదికాదని నా ఉద్దేశం.

ఆర్థిక,సాంస్కృతికబంధాలనుంచి,చాలామందివ్యక్తులకు విముక్తి లభింపచేస్తుందిగనుకనే. నేను సోషలిజంపట్ల ఆకర్షితుడనైనాను, కాని, ఒక సుదీర్ఘలేఖయొక్క కడపటిభాగంలో, లేఖముగించేటప్పుడు, నన్ను గురించి చర్చించడంలో మజాలేదు. తనతోనూ, ప్రపంచంతోనూ సంతృప్తిచెందని ఒకమానవుణ్ణి నేనని అనుకుని ఇక ఈవిషయాన్ని ఇంతటితో విరమిద్దాం.

ఈ ప్రభాతసమయంలో, జాతీయ, అంతర్జాతీయసమస్యలను గురించి నా అభిప్రాయాలను వ్రాసే ధైర్యం నాకులేదు. వ్రాయనవసరమని నియమంలేదు. మీ రెన్నట్లు నేను ఎక్కువగా మాట్లాడుతాను, అంతకన్న ఎక్కువగా వ్రాస్తాను. ఈవిషయం ఇంతటితో విరమిస్తాను. కాని, గడిచిపోయిన విఫలాదర్శాలకొరకు పోరాడుతూ, జర్మనీ ఇటలీలవంటిదేశాలను నిరసించినప్పటికి, బ్రిటిష్, ఫ్రెంచి సామ్రాజ్యవాదాలకు నేను యోగ్యతాపత్రాలను ఇచ్చినట్లు నాకు జ్ఞప్తిలేదు.

రెండురోజులక్రితం, త్రిపురిపూర్వం. నేను 'నేషనల్ హెరాల్డ్' పత్రికలో వ్రాసిన వ్యాసాలు మీకు పంపాను. వాటిలో ఒకవ్యాసం కద్దు. ఇప్పుడు పూర్తివ్యాసాలపెట్టు పంపుతున్నాను. ఫ్రీప్రెస్‌జర్నల్‌కుకాని మరేపత్రికకుకాని నేను ఇటీవల వ్యాసాలేమీ వ్రాయలేదు.

ప్రేమతో,
జవహర్.

256 మహాత్మా గాంధీనద్దనుంచి

న్యూఢిల్లీ,
మార్చి 30, 1939

నా ప్రియమైన జవహర్‌లాల్,

నీ రెండుఉత్తరాలు అందాయి. రెండూ ఉత్తమంగావున్నాయి. నేను నీకు ఉత్తరప్రత్యుత్తరాలనకట్ట పంపుతాను.

యు. పి.లోని సంఘటనలు నన్ను కలవరపరిచాయి. నేను సూచించేపరిష్కారమార్గం యిది. నువ్వు ప్రధానమంత్రివి కావాలి; లేదా మంత్రివర్గాన్ని రద్దుచేయాలి. అదుపులోలేనిశక్తుల్ని మ వ్వదుపులోపెట్టుకోవాలి. నేనూ యిక్కడవున్న సామ్యవాదులూ, మనసువిప్పి మూడు రోజులు సంభాషణలుజరుపుకున్నాము. అవి' నరేంద్రదేవ్ నీకు చెబుతారు. ఆయన తనంతట తాను చెప్పకపోతే, నువ్వాయన్ని చెప్పమని అడుగు.

ప్రేమతో,
బాపూ

## 257 సుభాస్ చంద్రబోస్ వద్దనుంచి మహాత్మాగాంధీకి

జిల్గోరా పోస్టు,
మాన్‌భుమ్‌జిల్లా, బీహార్
మార్చి 25, 1939

నా ప్రియమైన మహాత్మాజీ,

కాంగ్రెసువ్యవహారాలను స్తంభింపచేశానని నన్ను నిందించినవారికి సమాధానంగా నే నీవేళ కావించిన (శనివారం 25 వ తేదీన) ప్రకటన మీరు చూశారని నే నాశిస్తున్నాను. మనం త్వరగా నూతనకార్యవర్గాన్ని ఏర్పాటుచేసుకోవలసివుంటుంది; ఇది అత్యవసరసమస్య. ఈసమస్యను సంతృప్తికరంగా పరిష్కరించాలంటే, ముందు, యింతకంటె ఎక్కువ ప్రాధాన్యంగల ఇతరసమస్యలను పరిశీలించవలసివుంది. అయినప్పటికీ నేను తొలిసమస్యనుగురించి మొదట ప్రస్తావిస్తాను.

ఈ సమస్యనుగురించిన ఈ క్రిందిఅంశాలపట్ల మీ అభిప్రాయమేమో దయవుంచి నాకు తెలియచేస్తే, నేను మిక్కిలి కృతజ్ఞుణి.

(1) ప్రస్తుతం మీరు కార్యవర్గస్వరూపం ఏవిధంగావుండాలని భావిస్తున్నారు? అందులో ఒకేమాదిరిఅభిప్రాయాలుకలిగినవ్యక్తులు సభ్యులుగావుండాలా, లేక కాంగ్రెసులోవున్న విభిన్నపార్టీల (లేదా గ్రూపుల) కుచెందినవ్యక్తులు వుండాలా? వివిధధోరణులుకలిగినసభ్యుల కార్యవర్గం మొత్తంమీద సాధ్యమైనంతవరకు కాంగ్రెసు జనరల్‌బాడీస్వరూపానికి ప్రాతినిధ్యంవహిస్తుంది. (కార్యవర్గం స్వభావరీత్యా ఒకేమాదిరి అభిప్రాయాలుకలిగినవ్యక్తులతో వుండాలన్నభావానికి వ్యతిరేకంగా నేనెప్పుడూ పోరాడుతున్నట్లు మీకు నేను యిక్కడ చెప్పవలసివుంటుంది.)

(2) కార్యవర్గం ఒకేరీతిఅభిప్రాయాలుగలవారితో కూడివుండాలని మీ రిప్పటికీ పట్టుదలవహిస్తే, నావంటివ్యక్తులు సర్దారుపటేలు, తదితరులు ఒకేకమిటీలోవుండడం కుదరదు; ఇది స్పష్టం.

(3) కార్యవర్గంలో వివిధపార్టీలకు, లేదా గ్రూపులకు అందరికీ ప్రాతినిధ్యముండాలనిమీరంగీకరిస్తే, వారిసంఖ్య ఏనిష్పత్తిలోవుండాలని మీ రనుకుంటున్నారు?

కాంగ్రెసులో ప్రధానంగా రెండుపార్టీలు లేదా బ్లాకులు వున్నాయని నా ఉద్దేశం. ఆ రెండూ యించుమించు సమానబలంగానే వున్నాయి. అధ్యక్షునిఎన్నికలో మాకు అధికసంఖ్యాకులు ఓటుచేశారు. కాంగ్రెసు సోషలిస్టుపార్టీవైఖరివల్ల త్రిపురిలో యింపకుభిన్నంగాజరిగింది. కాంగ్రెసు సోషలిస్టుపార్టీ తటస్థవైఖరి అవలంబించకుండావుంటే మాకు అప్పుడు విషయనిర్ధారణసభలో మెజారిటీవచ్చేది. (ఈవిషయం మీ కింకొక ఉత్తరంలోనో, లేక మనంకలుసుకున్నప్పుడో నేను స్పష్టపరుస్తాను)

(4) నేను ఏడుగురుసభ్యులను సూచించినట్లయితే, సర్దార్ పటేల్‌ను ఏడుగురుసభ్యులను సూచించమని మీ రడిగినట్లయితే, అప్పుడు ఏర్పాట్లు సరిసమానంగావుంటాయి.

(5) నేను అధ్యక్షునిగావుంటూ, సరిగా పనిచేయాలంటే, ప్రధాన కార్యదర్శిని నేనే ఎంచుకోవాలి.

(6) కోశాధికారిగా ఎవరువుండాలో సర్దార్‌పటేలు సూచించవచ్చును.

ఇప్పుడు నేను పండిట్ పంత్‌తీర్మానంలోవున్న ఒకటిరెండు అంతరార్థాలను పేర్కొంటాను. (వీటినిగురించి వేరేయింకొకఉత్తరంలో వివరంగా ముచ్చటిస్తాను) మొట్టమొదటిసంగతి: మీరు దీనిని నామీద ప్రకటింపబడిన విశ్వాసరాహిత్యతీర్మానంగా భావిస్తారా? అలా భావించి, అందువల్ల నన్ను రాజీనామాపెట్టమని కోరుతారా? ఈతీర్మానానికి చాలామంది, కొందరు దీనినిబలపరిచినవారుపైతం, అనేకవిధాలుగా వ్యాఖ్యానాలుచేస్తున్నారు; కనుక మిమ్మ ల్నీ ప్రశ్నవేశాను.

రెండవసంగతి: పండిట్‌పంత్‌తీర్మానం ఆమోదింపబడినతరువాత, సరిగ్గా అధ్యక్షుని స్థానం ఏమిటి? కాంగ్రెసు నిర్మాణనియమావళి పదిహేనవ నిబంధన, వర్కింగ్‌కమిటీ నియామకవిషయంలో. అధ్యక్షునికి కొన్ని అధికారాలను సంక్రమింపచేస్తున్నది. అది యిప్పటికీ ఏవిధమైన సవరణలేకుండా అలాగేవుంది. కాని, మీ అభిమతానుసారంగా, వర్కింగ్ కమిటీని నిర్మించవలసివుంటుందని పండిట్ పంత్‌తీర్మానం స్పష్టంగా

నిర్దేశిస్తోంది. మొత్తంమీద ఫలితమేమిటి? ఇక నే నేంచేయాలి? మీరు మీ అభీష్టానుసారంగా వర్కింగ్ కమిటీసభ్యుల జాబితా తయారుచేస్తే మీనిర్ణయాలను ప్రకటించడమేనా నేను చేయవలసినపని? కాంగ్రెసు నిర్మాణసూత్రావళి పదిహేనవనిబంధనలాగే వున్నా అది నిరర్థక మౌతుంది; ఇదీ దాని ఫలితం.

ఈసందర్భంలో నే నొకవిషయాన్ని స్పష్టంచేయదల్చుకున్నాను. పండిట్ పంత్ తీర్మానంలో పేర్కొనబడిన ఆ నిబంధన కేవలం కాంగ్రెసునిర్మాణనియమావళికి విరుద్ధమైనది; ఏమాత్రం చెల్లనట్టిది. వాస్తవానికి, పండిట్ పంత్ తీర్మానం నిర్ణీతకాలంలోకాక, చాలా ఆలస్యంగా అందడంవల్ల, అది క్రమబద్ధమైనదికాదు. కాంగ్రెసువిషయనిర్ధారణసభలో శ్రీ శరత్ చంద్రబోస్ ప్రతిపాదించిన జాతీయస్వాతంత్ర్యతీర్మానం క్రమవిరుద్ధమైనదని, మౌలానా అజాద్ త్రోసిపుచ్చినట్లుగానే, నేనూ, పండిట్ పంత్ తీర్మానం సక్రమమైనదికాదని త్రోసిపుచ్చివుండేవాడిని. ఇంకా, అమాటకువస్తే, దాన్ని చర్చకు అనుమతించికూడా నేను కాంగ్రెసునిర్మాణసూత్రాలదృష్ట్యా. వర్కింగ్ కమిటీనియామకానికిచెందిన పంత్ తీర్మానంలోని తుది సూచన అక్రమమైనదని పదిహేనవసూత్రానికది విరుద్ధమైనదని త్రోసిపుచ్చేవాడిని. కాని, నేను స్వభావరీత్యా ప్రజాస్వామికవాదిని; అందువల్ల ఒకతీర్మానం సకాలంలో అందిందా, లేదా, అది నిర్మాణసూత్రాలకు భిన్నంగావుందా, అభిన్నంగావుందా అనే సాంకేతిక విషయాలకు అనుచితప్రాధాన్యమీయను. అంతేకాక, ఈతీర్మానానికి అనుకూలంగా పెక్కుమంది ఓటుచేస్తారని గ్రహించి, నిర్మాణ నియమ సూత్రాలచాటున దాగుని, దాన్ని తప్పించుకోవడం మగటిమికాదని నేను భావించాను.

ఈ లేఖను ముగించేముందు నే నొకవిషయాన్ని చెప్పదలుచుకున్నాను. ఎన్నిఅనవకాశాలు అవరోధాలు యిక్కట్లు కలిగినా,నేను అధ్యక్షునిగావుంటున్నపుడు, నేను ఏవిధంగా పనిచేయాలని మీ అభిప్రాయం? నేను నామమాత్రపుఅధ్యక్షునిగా వుండకూడదని, దృఢంగా వ్యవహరించాలని గత సంవత్సరం మీ రప్పుడప్పుడు (బహుశా పదేపదే) నాకు సలహా

యిస్తూవచ్చారు. వార్ధాలో 1939 ఫిబ్రవరి 15 వతేదీన, నా కార్యక్రమంతో మీరు ఏకీభవించడంలేదని నేను గ్రహించినపుడు మీతో నే నొకసంగతి చెప్పాను. నన్ను నేను విస్మరించి నా భావాలను తుడిచిపెట్టుకోవడమో, లేదా, నేనునమ్మిన ఆశయాలకోసం పట్టుదలగా నిలబడడమోతప్ప వేరొక గత్యంతరంలేదని మీకు స్పష్టపరిచాను. నాఅంతటనేను బుద్ధిపూర్వకంగా మీదృక్పథాన్నంగీకరిస్తేతప్ప, నాభావాలను నేను విస్మరించడం, ఆత్మను అణచిపెట్టుకున్నట్లౌతుందని, అందుకంగీకరించజాలనని మీరు నాకు అప్పుడు సమాధానంచెప్పారు. నేను అధ్యక్షునిగావుంటున్నట్లయితే, నామ మాత్రపుఅధ్యక్షునిగావుండకూడదని క్రిందటిసంవత్సరం సలహాయిచ్చినట్లు గానే యిప్పుడుకూడా నాకు మీరు సలహాయిస్తారా?

అధ్యక్షునిఎన్నిక జరిగినతరువాత, ముఖ్యంగా త్రిపురీకాంగ్రెసు మహాసభ జరిగినప్పటినుంచి అనేకసంఘటనలు జరిగాయి; కాని ఎన్ని సంఘటనలుజరిగినా, కాంగ్రెసులోవున్న అన్నిపార్టీలు (లేదా గ్రూపులు) కలిసిపనిచేయడానికి యిప్పటికీ అవకాశాలున్నాయని, నాఉత్తరంలో నేను మొదట పేర్కొన్నవిషయాలు స్పష్టంచేస్తున్నాయి.

నేను, సాధారణసమస్యలనుగురించి చర్చిస్తూ మీ కింకొకఉత్తరం వ్రాశాను; వాటిలో కొన్నిటిని నేటి నాప్రకటనలో ప్రస్తావించాను.

నాఆరోగ్యం నెమ్మదిగాఅయినప్పటికీ, బాగానే చక్కబడుతోంది. తగినంత నిద్రలేకపోవడంవల్ల త్వరగా కోలుకోలేకపోతున్నాను.

మీ కనేక పనిఒత్తిడు లున్నప్పటికీ, చక్కగా ఆరోగ్యాన్ని కాపాడుకుంటున్నారని ఆశిస్తున్నాను.

ప్రేమతో, మీ

సుభాష్

258. మహాత్మా గాంధీవద్దనుంచి సుభాస్ చంద్రబోసుకు

న్యూ ఢిల్లీ
మార్చి 30, 1939

నా ప్రియమైన సుభాస్,

మీరు 25వతేదీన వ్రాసినజాబుకు, నేను ఆలస్యంగా జవాబిస్తున్నాను; నే నిచ్చినతంతికి, మీ సమాధానంకోసం నిరీక్షిస్తూవుండడమే యిందుకుకారణం. నిన్నరాత్రి సునీల్‌తంతి అందింది. ఈ సమాధానం వ్రాయడానికి ప్రొద్దున్నే ప్రార్థనవేళకుముందుగా లేచి కూర్చున్నాను. పండిట్ పంత్‌తీర్మానం క్రమబద్ధమైనది కాదని, నిర్మాణసూత్రాలకు విరుద్ధమైనదని, అది చెల్లనేరదని మీరు భావిస్తున్నారుకనుక, మీమార్గం సుస్పష్టం. కమిటీసభ్యులను మీయిష్టప్రకారం మీరు ఎన్నుకోవడంలో మిమ్మల్ని నిర్బంధించకూడదు. కనుక దీనిని పురస్కరించుకొని మీరు వేసిన అనేకప్రశ్నలకు సమాధానంచెప్పడం అనవసరం.

అసలు అభిప్రాయభేదాలు మౌలికవిషయాలలోనే వున్నట్లు మనం అంగీకరించాము. అలాంటపుడు వివిధధోరణులుగలసభ్యులతో కమిటీని నియమిస్తే, అది హానికరమని నా అభిప్రాయం. ఈ అభిప్రాయం, మనం ఫిబ్రవరిలో కలుసుకున్నప్పట్నుంచీ నాలో బలపడుతూనేవచ్చింది. కనుక అఖిలభారతకాంగ్రెసుకమిటీలో అధికసంఖ్యాకులు మీ విధానాన్ని బలపరుస్తున్నారని భావిస్తూ, మీరు మీవిధానంలో నమ్మకమున్నవ్యక్తులతో వర్కింగుకమిటీని నియమించుకోవాలి.

అవును; ఫిబ్రవరిలో మనం సైగాన్‌లో సమావేశమయినపుడు, నాదృక్పథాన్ని నేను మీకు వ్యక్తపరిచాను; మీఅంతటమీరుస్వచ్ఛందంగా మీఅభిప్రాయాలను మీరు ఒదులుకుంటేతప్ప, వాటిని అణచిపెట్టుకుంటే దానికి నే నెంతమాత్రం బాధ్యతవహించలేనని మీకు తెలియచేశాను. మీ అభిప్రాయాలు దేశానికి శుభప్రదమైనవని మీరు విశ్వసిస్తున్నప్పుడు, వాటిని ఇతరులకోసం పరిత్యజించడం, స్వయంవ్యక్తిత్వాన్ని ఆత్మను అణచిపెట్టుకోవడమే ఔతుంది. కనుక మీరు అధ్యక్షుడుగాపనిచేయా

లంటే, మీచేతులకు సంకెళ్ళుతగిలించుకోగూడదు. మీరు స్వేచ్ఛగావ్యవహరించాలి. ఇంతకుతప్ప, ప్రస్తుతదేశపరిస్థితులదృష్ట్యా యింకొక పద్ధ్యేమార్గం లేదు.

గాంధీవాదులకు(వారిని యిలాగపిలవటం పొరపాటు) సంబంధించినంతవరకు, వారుమీకు అడ్డంకులుకలిగించరు. వారు మీకుసహాయపడగలచోట సహాయపడతారు; లేనిచోట దూరంగావుండిపోతారు వారు అల్పసంఖ్యాకులుగావున్నట్లయితే, ఏమైనప్పటికీ, ఏయిబ్బందీ కలిగించకూడదు; వారు స్పష్టంగా అధికసంఖ్యాకులుగావున్నట్లయితే, తమభావాలను తాము అణచిపెట్టుకోకుండా వెల్లడించవచ్చును.

కాని, నన్నుబాధిస్తున్నదల్లా ఒకవిషయం; కాంగ్రెసుప్రతినిధులు బూటకపుసభ్యులమీద ఎన్నికఅయారు; కనుక మెజారిటీ, మైనారిటీ అనే పదాలకు ఏమీ అర్థంలేకుండాపోయింది. అయినప్పటికీ, కాంగ్రెసుసంస్థ పరిశుద్ధమయ్యేవరకు, ప్రస్తుతానికి మనకున్నసాధనంతోనే, మనం వ్యవహారాలు చక్కబెట్టుకోవాలి. ఇంతేకాక, మనలో ఒకరిమీదయింకొకరికి చెప్పలేనంత అసంతృప్తి వుంది. ఇది మరీ నన్ను బాధిస్తోంది. ఒకరిని ఒకరు ద్వేషించుకుంటున్నారు. సమష్టికృషి అనేది పొసగదు.

మీఉత్తరంలో సమాధానంచెప్పవలసినఅంశ మేదీ లేదనుకుంటాను.

మీ రేపనిచేసినా, భగవదాదేశానుసారం నడతురుగాక! డాక్టర్ల సలహాలను పాటించి, ఆరోగ్యాన్ని కాపాడుకుంటారని ఆశిస్తాను.

ప్రేమతో,
బాపు

నాకుసంబంధించినంతవరకు, మన ఉత్తరప్రత్యుత్తరాలు ప్రకటించవలసినఅగత్యం లేదనుకుంటున్నాను. మీరు వాటిని ప్రకటించాలని అనుకున్నట్లయితే, అందుకు నేను అనుమతిస్తున్నాను.

259. శరత్ చంద్రబోస్ వద్దనుంచి

కలకత్తా,

ఏప్రియిల్ 4, 1939

నా ప్రియమైన జవహర్ లాల్,

మీరు 24వతేదీన వ్రాసిన సుదీర్ఘమైనలేఖకు నా ధన్యవాదాలు. నేను 21వతేదీన గాంధీజీకివ్రాసిన ఉత్తరంలోని, యించుమించు అన్ని విషయాలతోను మీ రేకీభవించకపోయినా, మీ ఉత్తరంచదివి మీ అభిప్రాయాలను తెలుసుకున్నందుకు నా కెంతో సంతోషంగావుంది. నేను దానికి ఆలస్యంగా జవాబిస్తున్నందుకు చాలా విచారిస్తున్నాను. నాకు అస్వస్థతగావుండడంవల్ల యింత ఆలస్యమైంది. ఇంకా దురదృష్టవశాత్తూ, ఒంట్లో అలాగేవుంది.

నేను నాఉత్తరంలో, కార్యక్రమాలను విధానాలను కాక వ్యక్తిగత విషయాలను చర్చించానని మీ రంటున్నారు. అవును; ఆ మాట నిజం. కాని, అది తలవనితలంపుగా జరిగిందీ కాదు. వ్యక్తులకు, సిద్ధాంతాలకు మధ్యగల భేదమేమిటో, తారతమ్యపువిలువ ఏమిటో నాకు తెలియకా కాదు. వాస్తవానికి నేనూ మీలాగే వీలైతే కార్యక్రమాలకు విధానాలకు అంటిపెట్టుకునివుంటాను. ఏమైనప్పటికీ రాజకీయాలలో దురదృష్టవశాత్తూ కేవలం సిద్ధాంతమనే గుమ్మపాలమీద మనం సదా జీవించలేము; అందులోనూ వాదప్రతివాదాలుజరుగుతున్న ఈసమయంలో కేవలం సూత్రాలకు కార్యక్రమవిధానాలకు అంటిపెట్టుకునిఉండడం మరీ కష్టం. ఏమీఅంటే, మొదట్నుంచీ అధ్యక్షునిఎన్నిక, కేవలం కాకపోయినా, యించుమించు చాలామట్టుకు వ్యక్తిగతసమస్యగానే తయారైంది.

నే నీ విషయాన్ని ఎత్తకముందు, వ్యక్తులసామ్యంపై దీనిని పరిశీలించారని, త్రిపురిలో దీనిప్రభావం మిగిలినసమస్యలపై ప్రసరించిందని మీరే చెబుతున్నారు. ఈ మీ అభిప్రాయంతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. అంతేకాక, దీనివల్ల మిగిలినసమస్యలు మరుగునపడిపోయాయని చెప్పసాహసిస్తున్నాను. కనుకనే, వ్యక్తిగతసమస్యలున్న వున్నట్లంగీక

రిస్తూ, ఈ బురదగుంటనుంచి మనం బయటపడేమార్గం చూపగలరేమో నని, మహాత్మాజీని అర్థించాను. వ్యక్తిగతద్వేషాలు మనకవరోధం కలిగి స్తున్నపుడు, మనం సిద్ధాంతాలనుసరించి మాట్లాడుకోవడంవల్ల ప్రయోజనంలేదు. ఈ ద్వేషాలు సుభాస్‌వల్ల ఉత్పన్నంకాలేదు; కొంతమంది పాత వర్కింగ్‌కమిటీసభ్యులవైఖరి, వారిపద్ధతులు యిందుకు కారణం.

ఇది, వ్యక్తిగతభేదాలపుట్టుకనుగురించి చెబుతూ మీరు విస్మరించినవిషయంమీదకు, నాదృష్టిని మళ్ళించింది. కొంతమందిసహచరులను గురించి ఏమో అన్నాడని చెప్పబడుతున్న సుభాస్‌చర్య దీనికి మూలకారణమని మీరూహిస్తున్నారు. అసలుగ్రంథం ఎక్కడ ప్రారంభమయిందో, దానిలో ప్రధానభాగ మేదో మీరు విస్మరించడంవల్ల మీ ఊహ సరైనదికాదు. ఈ అపార్థాలప్రకరణం బార్డోలీలో ఆరంభమయింది. వచ్చే సంవత్సరం కాంగ్రెసుఅధ్యక్షులుగా ఎవరుండాలో నిర్ణయించడానికి, ఒక ప్రత్యేకముఠావారు, అధ్యక్షునికి, కొంతమంది ఇతరవర్కింగుకమిటీ సభ్యులకు తెలియనీయకుండా, బార్డోలీలో చాటుగా సమావేశమయారు. ఆ వింత వింత రహస్యసమావేశాలఅంతరార్థం అప్పటికీ ఇప్పటికీ నాకు బోధపడలేదు. సహచరులు పరస్పరం అర్థంచేసుకోవాలని,విశ్వసించాలని, దీనికి ఎంతో ప్రాధాన్యమిస్తున్నానని మీరు చెబుతున్నారు. ఇది, వారిలో మీకు ద్యోతకమైనట్లయితే, నాకు చాలా ఆశ్చర్యంగావుంటుంది. కాంగ్రెసుకు, అధ్యక్షునికిసంబంధించిన అతిముఖ్యమైనవిషయంలో, అతన్ని విశ్వసించనిరాకరించడం ఏపాటిపద్ధతో నాకు అర్థంకాకుండావుంది; ఈ విషయంలో తనఅభిప్రాయం వెల్లడించడానికి అతనికి హక్కువుంది; అలాంటపుడు వారిలాగ ప్రవర్తించడంలో మీ కేపాటిన్యాయంకనిపించినా నా కాశ్చర్యంగావుంటుంది. అధ్యక్షునితో ముక్కుసూటిగా మాట్లాడానికి వారి కయిష్టంగానైనావుండాలి; లేదా అతనంటే వారికి వ్యక్తిగతంగా ద్వేషమన్నా వుండాలి; అంతకుతప్ప, వారిచర్యకు ఎట్టిసమర్థనా కనిపించదు.

నాకుతెలిసినంతవరకు, సుభాస్ ఏవిధంగా ప్రవర్తించాడని చెప్పడానికి నా కెట్టి ఆధారం కనిపించడంలేదు. అతను తన అధ్యక్ష

స్థానంలోవున్నంతకాలం, యిటు గాంధీజీతో, అటు వర్కింగుకమిటీలో వున్న తనసహచరులతో హృదయపూర్వకంగా అన్నివిధాల సహకరించాడు. జనవరిలో బార్డోలీలో జరిగిన వర్కింగ్‌కమిటీసమావేశంవరకు, అతనికీ అతనిసహచరులకు మధ్య అపార్థపుఛాయలు ఏమాత్రం పొడచూపలేదు; గాంధీజీతో హృదయపూర్వకంగా సహకరించాలన్న ఆతని దృఢనిశ్చయం, ఎన్నికఅనంతరంపైతం, పీసమెత్తు సడలలేదు. అలాంటపుడు అతనిసహచరులు మనమంతా బార్డోలీలోవున్నప్పుడే, అతనితో, అధ్యక్షునిఎన్నికవిషయం ఎందుకు చర్చించకూడదు? ఎందుకు తెముల్చుకోకూడదు?

అఖిలభారత కాంగ్రెసుకమిటీసమావేశాన్ని గత సెప్టెంబరులో ఢిల్లీలో సుభాస్ సరిగా నిర్వహించలేదని, సర్దార్‌పటేల్‌కు, మరికొంతమందికి అసంతృప్తికలిగిందట; ఈసంగతి మొట్టమొదటిసారిగా నేను త్రిపురీలో విన్నాను. ఆ సమావేశంలో పౌరస్వత్వపుహక్కులతీర్మానంపై చర్చించడానికి కొందరు సామ్యవాదులకు, సుభాస్ అనుమతియిచ్చాడు. అలాచేయడంవల్ల సుభాస్‌పై పటేల్‌ప్రభృతులకుగలవిశ్వాసం సడలిపోయిందట. వచ్చేఏడాది అధ్యక్షునినిర్ణయించుకోవడంకోసం రహస్యంగా బార్డోలీలో సమావేశంకావడం, అధ్యక్షునితో ముఖాముఖీ మొహమెత్తి మాట్లాడలేకపోవడం, యివన్నీ ఆలోచించుకుంటున్నకొద్దీ, వారు రహస్యంగా కుట్రపన్నుతున్నట్లు నాకు స్ఫురిస్తోంది. అన్నింటికంటె మించి, ఈ గూడుపురాణీదార్లు, తమకుతోచినవ్యక్తిని సింహాసనారూఢుణ్ణి చేయగలమనే ధీమాతోవున్నట్లు ద్యోతకమౌతోంది; అధికారాన్నంతా తమచేతుల్లోవుంచుకుని, కాంగ్రెసును తమకోరికల కొక ఉపాంగంగాచేసుకోవాలని ప్రయత్నిస్తున్నట్లు, అదే వారిఆశయమైనట్లు కనిపిస్తోంది.

నేను నిష్కపటంగా మీ కొకవిషయాన్ని తెలియచేయాలని భావిస్తున్నాను. పాతవర్కింగ్‌కమిటీసభ్యులతో కలసికట్టుగా పనిచేయడానికి, వారిలో నాకు విశ్వాసం దాదాపు లేకుండాపోయింది. ఈ స్థితి నేను వాంఛించినదీ కాదు, అంత సులభంగా అంగీకరించగలదీకాదు. వెనకటి నా సహచరులు, తమప్రవర్తనవల్ల క్రమక్రమంగా నన్నీస్థితికి తరిమి

వేశాను; వారిపై నాకున్న భ్రమలు తొలగిపోయాయి. వారిపాండిత్యంపై, వారివిశ్వాసంపై మొదట నా కెంతో నమ్మకంవుండేది; కాని అధ్యక్షుని కనుమరుగున, వారు పార్టీలో రహస్యంగా సమావేశమయారని, అధ్యక్ష స్థానంవిషయమై వా రొకనిర్ణయానికివచ్చారని విని, నే నెంతో విభ్రాంతుణ్ణయాను. ఈ వార్త నన్ను నిశ్చేష్టుణ్ణిచేసింది; వారిపై నాకుగలవిశ్వాసాన్ని పోగొట్టింది. వా రీ నిర్ణయంతీసుకున్నవెంటనే, అధ్యక్షునిఎన్నిక గురించి ప్రకటన వెలువడింది; ఉత్తరప్రత్యుత్తరాలు ప్రారంభమయాయి. త్రిపురీలో నేను చూసిన, అనుభవించినవాటికంటె ఇవి సైతం, అట్టే చెప్పుకోతగ్గవికావు. వాటితో సరిపోల్చిచూస్తే ఇవి స్వల్ప విషయాలు. అక్కడ కొందరు తమ ఉదారబుద్ధిని విడనాడి, మూర్ఖంగా అతిపట్టుదలతో పూనికవహించారు. కొన్నివిషయాలలో వారివైఖరి శత్రుత్వానికి దారితీసింది; ఇది నన్నెంతో విస్మయపరిచింది.

కొంతమందివ్యక్తులనుగురించి నేను చెప్పినవిషయాలను అంగీకరించడానికి మీకు కష్టంగావుంటుందని నేనెరుగుదును; అందుకు నేనాశ్చర్యపడను. ఇతరులు, అందులోనూ తనసహచరులు అలాగ ప్రవర్తించారని నమ్మడానికి ఏవ్యక్తీ యిష్టపడదు. విశేషించి, ఒకవిధమైనస్వభావంతో, శిక్షణతో పెరిగిన మీరు, అటువంటిసజ్జనమనుష్యులతో స్వచ్ఛందంగా మెలగుతున్నప్పుడు, వా రలాగ ప్రవర్తిస్తారని నమ్మడానికి మరీ కష్టంగావుంటుంది. ఈటన్, హారోలలో అనుసరింపబడే విధానమూల్యాలకు, ప్రవర్తనలస్థాయికి విభిన్నమైనవి ఈ ప్రపంచంలో వుంటాయని నమ్మడానికి ప్రస్తుత బ్రిటిష్‌ప్రభుత్వసభ్యులకు కష్టమన్న విషయం మనకు తెలియనిదికాదుకదా? హిట్లరు ముసులోనీలనుగురించి వా రెంతో పెద్దగా భావించి, మంచిని ఆశించారు; కాని ఆ నియంతలు ఈ బంతిఆటను పాతసంబంధాలను త్రోసిపుచ్చేసరికి, వారివిధానాలను చూసి విస్మేరపోయారు. అదీకాక, మీరు వ్యక్తివాదులు. ఒకవ్యక్తిసహాయ మపేక్షించకుండా, ఒకగ్రూపుతోద్వారా అవసరంలేకుండా నాఅంతటనేను పనిచేసుకోగలనని మీరు చెబుతున్నారు. మీకు సరిపడని రాజకీయాలేమైనావుంటే, అవి లేనట్లే భావించి, మీదారినిమీరు వెళ్ళగలరు.కాని అందరూ ఫీలం

తటి అదృష్టవంతులుకారు; రాజకీయాలనేభవనానికివుండే వెనకమెట్లను, వంటగదినీ వారు మర్చిపోలేరు. అక్కడిదుర్వాసనను భరించలేక, కోపా వేశంతో, ఏదో అనకమానరు. జీవితకెరటాలను చూడకుండా కళ్ళుకప్పు కున్నవారిని వారు అర్థంచేసుకోలేరు,

నేనుకావించిన నేరారోపణలకు తగినన్నికారణా లున్నాయి. ఇందులో కొన్ని నేను స్వయంగా నా కళ్ళతో పరిశీలించినవిషయాలపై ఆధారపడివున్నాయి; మిగిలినవి, తగినంత సాక్ష్యాధారాలను పురస్కరించు కుని కొందరువ్యక్తులు నాకు తెలియచేశారు; వారిమీద నాకు అచంచల విశ్వాసముంది. కేవలం పుకారులను, చెప్పుడుమాటలను విని, నే నీ నేరాలను ఆరోపించలేదు. అలాకనక నేను చేసివుండినట్లయితే, ఈ నేరారోపణలజాబితా చాలా పెరిగివుండేది. అలాంటిసమయమేకనక వస్తే, నేనుచేసిన నేరారోపణలు నిజమని రుజువుపరచగలిగిన సమాచా రాన్ని ఆ యా వ్యక్తులవద్దనుంచి సేకరించి, మీఎదుట వుంచగలను. కాని, సుభాష్ మాజీసహచరులు,తమపై ఖరిని సుస్పష్టంగా బహిరంగంగా ప్రకటించినపుడు. వారిసాధారణదృక్పథం ఎలాగవున్నదో రుజువుచేయ డానికి న్యాయసమ్మతమైనఆధారాలు అవసరంలేదనుకుంటాను. నానేరా రోపణల నిజానిజాలను తెలుసుకునేందుకు మీ కా శక్తివుంటే, న్యాయ శాస్త్రరీత్యా నిజమైనవా అనికాకుండా, అవి స్వభావరీత్యా నిజమైనవా అని తెలుసుకునేందుకు మీకు ఉత్సాహంగావుంటే, వివిధస్థలాల్లో మీరు దర్యాప్తుచేయవలసివుంటుంది. ఇలాగ భోగట్టాసేకరించినపుడు, నేను వ్రాసిన ప్రతివిషయం నిజమని మీఅంతటమీకే సంతృప్తిగకలుగుతుంది. ఇలాగ తాము చేయలేదని వా రిటీవల ప్రకటించారు. అయినాసరే, నే నీ విషయాన్ని మీకు చెబుతున్నాను. తా మిలా చేయలేదని వా రనడం, నన్ను మరీ ఆశ్చర్యచకితుణ్ణిచేసింది; త్రిపురీలో వారిప్రవర్తనపైతం నె న్నింతగా విస్మయపరచలేదు. కాంగ్రెసు పెద్దమనుష్యులదృష్టిలో "సత్యం అహింస" అనే పదాలఅర్థమేమిటో నాకు బాగా అవగతమయింది.

కాంగ్రెసుమంత్రులనుగురించి నేనన్నమాటల్ని మీరు సరిగా అర్థం చేసుకున్నారో లేదోననే సంశయం నాకు వుంది. వారు కాంగ్రెసుసభ

కాంగ్రెసు మహాసభల్లో ఏవిధంగా ప్రవర్తించినా, నా కష్టం తప్పలేదు. కాని వారిని, వారు వహిస్తున్న మంత్రిపదవుల్నీ పూర్తిగా వేరుచేసి మనం చూడలేం. మంత్రులు సభలకు రావడంవల్ల, కాంగ్రెసు వ్యవహారాలలో ప్రత్యక్షంగా పాల్గొనడంవల్ల, అందులోనూ సుభాస్ ఎన్నికకు సంబంధించిన వివాదాలలో జోక్యంచేసుకోవడంవల్ల, దాని కొక ప్రత్యేకత సిద్ధిస్తుంది. రాష్ట్రప్రభుత్వాలసభ్యులైన, వారికి, విశేషాధికారాలు, కొన్ని ప్రత్యేకమైనసదుపాయాలూ వున్నాయి. తమ ప్రాపకంకోసం తహతహలాడేటట్లుగాచేయగల అవకాశాలు చిక్కివున్నాయి. ప్రభుత్వంలోలేని కాంగ్రెసుసభ్యుల కీ శక్తి స్తోమతలు అవలేశం లేవు. వారు తమపలుకుబడిని యింతకోసం వినియోగించవలసిన పనేమీ లేదు; ఒకవేళ వారిలాగ వినియోగించక పోయినా, వారు కొన్ని ప్రయోజనాలు సాధించగలిగినస్థితిలో వున్నారు. ప్రభుత్వంలోలేని కాంగ్రెసుసభ్యులున్నస్థితి అటువంటిదికాదు. పోనీ, మంత్రులు కదలకమెదలక అలాగ కూర్చున్నా, యథాతథస్థితిని అలాగేవుంచాలని ఆసక్తిచూపినా, అది కాంగ్రెసు ప్రవాహగమనానికి అడ్డకట్టవేసినట్లే అవుతుంది. అధికారాన్ని స్వీకరించాలన్నతీర్మానం అంగీకరించబడిననాటి నుంచి, కాంగ్రెసులోను, రాష్ట్రాలలోను కలుగుతున్న పరిణామాలతో సంబంధమున్న ప్రతివ్యక్తికీ, ఈ స్థితి ప్రమాదకరమైనదని తెలుసును. ఇలాగ జరగడానికవకాశంవున్నదన్నవిషయాన్ని చూడకుండా కళ్ళు కట్టుకుంటే ప్రయోజనమేమీలేదు.

అదీకాక, మంత్రులు త్రిపురిలో ఏమిచేశారో మీరు జ్ఞాపకం తెచ్చుకోవలసివుంటుంది. సర్వసభ్యసమావేశాలలో, విషయనిర్ధారణ సభలో జరిగిన చర్చలకుమాత్రమే వారు కేవలం అంటిపెట్టుకొని కూర్చోలేదు; ఒకలక్ష్యాన్ని మనస్సులో పెట్టుకొని, ప్రతినిధులచుట్టూ తిరుగుతూ, పట్టుదలతో, అదేపనిగా ఓట్లకోసం ప్రచారంచేశారు. నిర్మాణనిబంధనల స్పష్టార్థం ఆలోచించిచూస్తే వారి ప్రవర్తనకు అర్థం ఇది: వీరు సుభాస్ కు వ్యతిరేకంగా తమతమ రాష్ట్రాలలో ప్రచారం సాగించారు; కాని, సుభాస్ కు కొందరు పాతవర్కింగుకమిటీసభ్యులకు మధ్యగల ఈసమస్యలో, రాష్ట్రకాంగ్రెసుసంఘాల అధికసంఖ్యాకప్రతి

నిధులు, సుభాష్‌కనుకూలంగా ఓటుచేశారు. ఇది అంతిమనిర్ణయంగా అంగీకరించడానికి మంత్రులకు మనస్కరించలేదు; అందువల్ల దీన్ని తారుమారుచేయడంకోసం వారు పనిచేశారు. అధ్యక్షునిఎన్నిక పార్ల మెంటరీకార్యక్రమంలో మార్పుతీసుకువస్తుందని వారు తలపోశారు. పరిస్థి తులు సందర్భపడ్డాయి; వారు విజయం సాధించారు. ఇప్పుడు ప్రశ్న యిది: అధికసంఖ్యాకులనిర్ణయానికి వారు తలొగ్గాలికదా; మరి అలాంట పుడు వారివిధేయతకు ఏది అడ్డువచ్చింది? వారికి పాత వర్కింగ్‌కమిటీ సభ్యులపట్ల విధేయతవుండడమే దీనికికారణం. స్వేచ్ఛగాజరిగిన ఎన్ని కలఫలితాన్ని, నిర్ణయాన్ని, కొంతమందివ్యక్తులు త్రోసిపుచ్చడమేకాదు; దాన్ని నిరర్థకంచేయడానికి ప్రయత్నించి, తాము కృతార్థులయారు. ఇది ఆలోచించదగినవిషయం; తేలికగా త్రోసిపుచ్చతగిందికాదు. రాష్ట్రీ ప్రభుత్వాలపరపతి, పలుకుబడి ఆ వ్యక్తులకు లేకుండావున్నట్లయితే, వా రీవిధంగా చేయగలిగివుండేవారని నే ననుకోను. స్వేచ్ఛాయుత ప్రజా స్వామిక కాంగ్రెసునిర్ణయాలను మంత్రులపలుకుబడి మార్చగలదని, యింతజరిగినా, మీరు నమ్మలేనంటే, నే నేం చెప్పాలో నాకే బోధపడ కుండావుంది;

కాంగ్రెసులో ఐకమత్యం సాధించవలసినఅవసరం ఎంతోవుందని నేనూ మీలాగే భావిస్తున్నాను. కాని, ఈ ఏకీభావం ఎలా సాధించబడా లనేది మనం వేసుకోవలసినప్రశ్న. ఒకేఒకవ్యక్తికి అధికారాన్నంతా విడిచిపెట్టడంవల్ల, అంటే, "ఒకేఒకనాయకు"డనే సూత్రాన్ని శిరసావ హించడంద్వారానా, లేక ఒకానొకస్నేహితులకూటమికి అధికారాన్ని హస్తగతంచేయడంవల్లనా; కాక, దేశంలోవున్న ప్రధాన భావధోరణు లకు అవకాశమిచ్చి, ఏకీకృతకార్యక్రమాన్ని రూపొందించుకోవడం వల్లనా; లేక, ద్విపక్షవిధానాన్ని ప్రవేశపెట్టి, అధికసంఖ్యాకులపక్షం కార్యభారాన్నివహిస్తూవుంటే అల్పసంఖ్యాకులు ప్రతిపక్షంగా వ్యవ హరించడంవల్లనా— వీటిలో ఏపద్ధతిననుసరించి ఈ ఐక్యతను సాధించ వలసివుంటుంది? ఈ ప్రశ్నలకు సమాధానంచెప్పుకోవాలి. కార్యక్రమా లను, కార్యవిధానాలను మనం చేపట్టేముందు, కాంగ్రెసును మనం

ఏమార్గంలో నడిపించదలుస్తున్నామో, మన కొక స్పష్టమైన అభిప్రాయమంటూ ఒకటుండాలి. గుర్తించబడిన సంప్రదాయసిద్ధమైన నిర్మాణ సూత్రాలంటూ లేనప్పుడు, అధికారంకోసం జరిగే పెనుగులాట, ఐకమత్యతకు భంగంకలిగిస్తుంది. రెండుపక్షాలు తమలోతాము వివాదపడుతున్నప్పుడు, అసలైన ఐక్యత సాధించకుండా, జరిగిన అన్యాయాల్ని మర్చిపొమ్మని ఒకపక్షానికి హితవుగరపడంవల్ల అట్టే ఫలితం కనిపించదు; అంతేగాక, ఇంకొకపక్షం తనవ్యక్తిగతప్రాబల్యాన్ని పెంపొందించుకుంటూ, దాన్ని ఎంత దూరంతీసుకువెళ్ళాలో అంతదూరంతీసుకువెళ్తున్నపుడు ఇలాంటిసలహాలవల్ల ఏమాత్రం ప్రయోజనంకనిపించదు. పండిట్ గోవిందవల్లభ్‌పంత్ తీర్మానం కాంగ్రెసులో అనైక్యతకు మరిగా దోహదంచేస్తున్నదని, భవిష్యత్‌లోనైతే ఒకగ్రూపువారు యింకొకగ్రూపువారితో సహకరించడానికి వీలులేకుండాచేస్తోందని, మీరు మర్చిపోయినట్లున్నారు. ఆ తీర్మానం దేశమంతటా ఎలాంటిభావాలను కలిగించిందో, ఆ భావాలకు గల బలమెట్టిదో మీరు విస్మరించినట్లు తోస్తున్నది. అక్కడక్కడ తరతమభేదాలు కనిపించవచ్చును కాని, మొత్తంమీద దేశమంతా యీ భావాలుమెండుకు వ్యాపించివున్నాయి. ఈ తీర్మానమూ, దీనిలోవ్యక్తమౌతున్న వ్యక్తిగత ద్వేషమూ కాంగ్రెసుఐక్యతకు తీరనిభంగం కలిగిస్తాయి. కాంగ్రెసులో వున్న ప్రగతిశక్తులను బయటకు తరిమికొట్టి, కొద్దిమందిగల మూటమి చేతుల్లో నిజమైన అధికారాన్నిపెట్టి,ఈరీత్యా, కాంగ్రెసుశక్తిని హరించివేస్తాయి; లేదా నిరంతరం ఒకరిపై ఒకరు చాడీలుచెప్పుకుందుకు, అధికారంకోసం పరస్పరం పెనగులాడడానికి దోహదపడుతూ ,కాంగ్రెసును పరస్పరవ్యతిరేకకూటములుగా చీలుస్తాయి.

పాతవర్కింగుకమిటీసభ్యులు మొదట్నుంచి చివరదాకా చిక్కో ధాలను కలిగిస్తూవుండగా, వా రలాగచేయలేదని మీ రెందుకన్నారో, ఎలాగ అనగలిగారో నాకు అర్థంకావడంలేదు. వారు చివరదాకా ఎలాంటెలాంటి అడ్డంకులు కలిగించారో, విశదపరచడానికి నేను ప్రయత్నిస్తాను. అధ్యక్షునిఎన్నికఫలితం ప్రకటింపబడినప్పటినుంచి పాతవర్కింగు కమిటీసభ్యులవిధానాలకు, పద్ధతులకు అది సరిపడకపోయినట్లయితే, వా

రనుసరించవలసిన మార్గం యిది. ఈ నిర్ణయాన్ని విధేయతతో వారు అంగీకరించి, సంస్థనిర్మాణసూత్రాలకనుగుణంగా అధ్యక్షుణ్ణి ప్రవర్తించ నీయవలసివుంటుంది. అయితే ఇది సరియైనదృక్పథమని నేను వ్యక్తిగతంగా అభిప్రాయపడడంలేదు; నా అభిప్రాయంతో చాలామంది ఏకీభవిస్తున్నారు. అధ్యక్షునిఎన్నికఫలితాన్ని నేనీవిధంగాసమాలోచిస్తాను. ఇది, అధ్యక్షపదవికి పోటీచేసిన సుభాస్, డాక్టరు పట్టాభిసీతారామయ్యల అర్హతలపై కావించబడిన ఒకతీర్పు; అదీకాక ఇది, అధ్యక్షునిఎన్నికవిషయంలో అనుసరించబడుతూవస్తున్న పద్ధతిపట్ల ఓటర్లు ప్రకటించిన ప్రాతికూల్యం; అంటే, ఈసమస్యను తాముగాక, ఎవరో కొద్దిమందిగలకూటమి పరిష్కరించడం ఓటర్లకు యిష్టంలేదు; ఎన్నికలో తమభావాలను స్పష్టంగా ప్రకటించాలని వారు వాంఛించారు. తన అభీష్టాన్ని తాను వ్యక్తంచేయడానికి, ప్రజాస్వామికసంస్థకుగలహక్కును వారు దృఢపరిచారు.

అందువల్ల, అధ్యక్షునిఎన్నికఅనంతరం అనుసరించవలసిన సరియైన నిష్కపటమైన మార్గం ఒకటుంది. అంగీకృత కార్యాచరణవిధానాలను రూపొందించడానికి, ఏ భావాలు దోహదంచేస్తాయో వారుఅన్వేషించవలసివుండేది. మహాత్మునిద్వారా యిలాచేయడం చాలా సులభం; ఏమీ అంటే, ఆయనసలహాల నెవరూ ఇంతవరకూ త్రోసిపుచ్చలేదు; ఆయనకుగల పలుకుబడినిగురించి ఇంకొక భిన్నాభిప్రాయంలేదు. సుభాస్ ఎన్నికవల్ల, కాంగ్రెసులో మహాత్మాజీకిగలస్థానాని కేమీ కొరతఏర్పడలేదు. దానికీ దీనికీ సంబంధమేలేదు. అయినప్పటికీ, ఒకసమాధానానికిరావడానికి ప్రయత్నమేమీ చేయకుండా దానికిబదులుగా పాతవర్కింగ్‌కమిటీసభ్యులు తమసభ్యత్వానికి రాజీనామాయిచ్చి, ఒక ప్రతిష్టంభన తెచ్చిపెట్టారు. ఇలాగచేస్తూ వా రవరోధంకలిగించారు; గాంధీజీప్రాపున తమనుతాము బలపరుచుకోజొచ్చారు; వా రెట్టిపరిస్థితులలోను, అధికారా న్నొదిలిపెట్టడానికి యిచ్ఛగించలేదని, జరిగినసంఘటనలు రుజువుచేస్తున్నాయి. వారు నిలబెట్టినఅభ్యర్థి గెలుపొందలేదుకనక, కాంగ్రెసుతో తా మిక సహకరించేదిలేదని దేశం అర్థంచేసుకోవాలని వారిఉద్దేశం. ఇంతకంటే ప్రమాదకరమైనపరిస్థితి దాపురించబోతోందని స్పష్టపడుతున్నది. అవసరమైతే,

కాంగ్రెసు[illegible] రాష్ట్రమంత్రివర్గాలు రాజీనామాచేస్తాయనే బెదిరింపులా యిది ద్యోతకమౌతోంది. అయితే, రాజీనామాపెట్టిన పాత వర్కింగుకమిటీసభ్యులుకాని, లేదా మంత్రులుకాని యిలాంటిప్రకటన చేశారని ప్రత్యేకం నేను చెప్పడంలేదు. కాని, ఇదేధోరణిలో పత్రికలు చేస్తున్న ఊహాగానాన్ని ఎవరూ ఖండించలేదు; పత్రికలలో ఇలాంటి వార్తలు ప్రకటింపబడడంవల్ల, ప్రజలు ఏమని భావించాలని వారు కోరు తున్నారో, అలాంటిభావాలు వ్యాపించాయి.

ఈ నిరోధ ప్రయత్నాల రెండవదశ త్రిపురిలో ప్రారంభమయింది. వ్యక్తులు లేదా గ్రూపులు కాంగ్రెసుముందు ఆరోపణగా కొన్ని ప్రతిపాదనలు పెట్టడం అవరోధంకలిగించడం కాదని మీరంటున్నారంటే, సమస్యను మీ రతి తేలికగా చూస్తున్నారని దానర్థం. ఆ ప్రతిపాదనలు ఏదో గాలిలో నిలబడుతున్నట్లు, వాటి కొక చరిత్ర, ఒకపూర్వరంగం, కొన్నికారణాలు ఏమీలేనట్లు, మీరు మీ లేఖలో వ్రాసుకొచ్చారు. ప్రతిపాదకుల కార్యాచరణపద్ధతిని వ్యక్తంచేయనపుడు, ఆ ప్రతిపాదనప్రయోజన మేమిటీ ఈదృష్టితో విశ్లేషించిచూసినపుడు, పండిట్ గోవిందవల్లభ్ పంత్ ప్రతిపాదించిన తీర్మాన అంతరార్థమేమిటో, తేట పడుతుంది. అధ్యక్షుని స్వేచ్ఛను అరికట్టి, అతనికార్యాచరణ కంతరాయంకలిగించి, అతనిచేతు లను బంధించివేసి, అధ్యక్షుని ఎన్నికను వమ్ముచేయడమే, దాని ఏకైక లక్ష్యం. అధ్యక్షస్థానంనుంచి అధ్యక్షుణ్ణితొలగించడ ప్రయత్నమెలాం టిదో, ఈ ప్రయత్నంకూడా అలాంటిదే; అధ్యక్షుని స్థానభ్రష్టుణ్ణిచేయా లని మొదట అనుకున్నారు. కాని, తమపాచికపారదని వెనక్కిజంకారు. అటువంటి ప్రతిపాదన సులభంగా నెగ్గదని సంకోచించారు.

వర్కింగుకమిటీని నియమించే అధ్యక్షహక్కును అతనికి లేకుండాచేయడం ఇంతవరకు కాంగ్రెసు అనుసరిస్తున్నపద్ధతికి పూర్తిగా విరుద్ధం; ఇది మిక్కిలి విస్మయకరమైనపరిణామం. ఒకసిద్ధాంతంవల్ల ఇలా చేయవలసినపరిస్థితి ఈఏడు దాపురించినదని ఎవరైనా చెబితే, అట్టి పరిస్థితి 1921నుంచీ గాంధీశకమంతటా వుండేదని, నేను చెప్పదలుచు కున్నాను.

ఈతీర్మానంలో కనిపిస్తున్న కాపట్యం మరీ వెగటుగావుంది. పాతవర్కింగుకమిటీసభ్యులపట్ల విశ్వాసాన్నిప్రకటించడం, వారిని తిరిగి చేర్చుకోవడం దీనిఉద్దేశం. అంతటితో అది ఊరుకోకుండా, మహాత్మాజీ మీద విశ్వాసమున్నట్లుగా ప్రకటించవలెనని ఓటర్లను కోరింది. రాజీనామాపెట్టిన పాతవర్కింగ్‌కమిటీసభ్యులమీద విశ్వాసం లేకపోతే, మహాత్మాజీమీదకూడా విశ్వాసంలేనట్లేనని ఒక వింతఅర్థాన్ని అది కల్పించింది. కలగాపులగంగావున్న వ్యక్తిగతసమస్యలను మహాత్మాజీప్రకటన తేటపరిచిందని నే నంగీకరిస్తాను. కాని, మహాత్ముని పేరును ఒకముసుగుగా ఉపయోగించుకోకుండా, పాత వర్కింగ్‌కమిటీసభ్యులు, తమ పద్ధతుల్ని లా మనుసరించివుంటే, వారు కొంత ధైర్యంగా, ధారాళంగా ప్రవర్తించినట్లు నేను భావించేవాడిని. ఇలాగ నే నంటున్నానంటే, అందులో అన్యాయంఏమీ లేదనుకుంటాను. మన రాజకీయజీవితంలో ఇలాంటివాటికి మహాత్ముడు అతీతుడుగావుండాలి. వారు, ఈ వివాదగ్రస్త విషయాలలో మహాత్మునిపేరు ప్రస్తావించకుండావుండవలసింది. ఆయన్ని వీటి కతీతంగావుంచడం వారి కనీసధర్మం.

మీరు మీ ఉత్తరంలో కొన్ని యితరవిషయాలు ప్రస్తావించారు; వాటికి స్పష్టంగా సమాధానంచెప్పవలసివుంటుంది. బెంగాలుప్రతినిధులకు డూప్లికేటుటిక్కట్లుయివ్వడంగురించి నేను దర్యాప్తుచేశాను. నా దర్యాప్తులో తేలినవిషయాలు యివి: చాలామంది బెంగాలుప్రతినిధులు త్రిపురీ చేరుకున్నాక, తమవెంట తమ డెలిగేటుకార్డులు తీసుకురాలేదని తెలుసుకున్నారు. అందువల్ల తమకూ, ఆలస్యంజరగకుండావుండేటందుకై త్రిపురీచేరుకోని కొంతమంది తమమిత్రులకూ, డూప్లికేటుకార్డులీయవలసిందిగా దరఖాస్తులుపెట్టుకున్నారు. ఈపరిస్థితులను తెలుసుకుని త్రిపురీలో వున్న బెంగాలు రాష్ట్రకాంగ్రెసుకమిటీఅధికారులు, డూప్లికేటుటిక్కట్లను తాము జారీచేస్తామని ఎ. ఐ. సి. సి. వారిని కోరారు. ఈ బాధ్యతను వారు స్వీకరించినట్లయితే, బెంగాలుప్రతినిధులను తమకు వ్యక్తిగతంగా తెలుసునుకనుక, టిక్కట్లుయివ్వడంలో పొరపాట్లు జరగవు; పని తొందరగా ముగుస్తుంది; తేలికవుతుంది. కాని, అందుకు ఎ. ఐ. సి. సి.

అంగీకరింపలేదు. ఈలోపునే తమకార్యాలయానికి సహాసకివచ్చిన బెంగాల్ ప్రతినిధులలో కొంతమందికి వారు టిక్కెట్లు యిచ్చారు; ఈ ప్రతినిధులు తమస్నేహితులను కలుసుకోకమునుపే, వారిలో సంప్రదింపకముందుపే ఈ పని జరిగింది. ఈసమయంలో బెంగాలు రాష్ట్రకాంగ్రెసుఅధికారులు ఈవ్యవహారంలో జోక్యంకలిగించుకొని రెండుసార్లు టిక్కెట్లుయిచ్చిన ఘటనలను సరిదిద్ది, వాటిని క్రమపద్ధతిలోపెట్టారు. కాని ఇలాగ రెండు సార్లు టిక్కెట్లిచ్చిన అనుఘటనలను వారు పోల్చుకోలేకపోయారని నాకు తెలియవచ్చింది. బెంగాలు రాష్ట్రకాంగ్రెసుఅధికారులు దీనికితోడుగా ఒక కట్టుదిట్టంచేశారు. దీనిప్రకారం, బెంగాలురాష్ట్రకాంగ్రెసుకమిటీతరఫున ఒక అధికారీ, ఎ. ఐ. సి. సి. తరఫున యింకొకఅధికారీ, సభాప్రాంగణం లోనికి ప్రవేశించే ప్రతీ బెంగాల్ప్రతినిధినీ తనిఖీచేశారు. ఇలాగచేస్తే తాను బెంగాలుప్రతినిధినని నటిస్తూ ఎవరూ లోనికిప్రవేశించలేరని, యిక అనుమానాలకు తావులేకుండాపోతుందని వారు భావించారు. ఒకవ్యక్తికి బదులు యింకొకవ్యక్తి లోనికిప్రవేశించ ప్రయత్నించినట్లుగా, ఈ తనిఖీ వల్ల ఎక్కడా రుజావుకాలేదు. డూప్లికేటుటిక్కెట్లవల్ల జరిగినపొర పాట్లను, ఈ తనిఖీ సరిదిద్దగలిగింది. ఆంధ్రప్రతినిధులకు సంబంధించి నంతవరకు అస్తవ్యస్తత ఏర్పడినట్లు నాకు తెలియవచ్చింది; వారివిష యంలోకూడా ప్రతినిధులవునో కాదో పోల్చుకుందుకు, ఈ పద్ధతి అనుస రింపబడిందో లేదో నాకు తెలియదు. ఈవిషయం బహుశా మీరు దర్యాప్తు చేస్తారని ఆశిస్తాను.

కాంగ్రెసుమహాసభలకు ప్రతినిధులను తీసుకువచ్చేందుకు, డబ్బు ఖర్చుచేయబడిందన్నవిషయం నా కొక వార్త. ఆలాగ ఎవరు ఎక్కడ ఎప్పుడు ఖర్చుపెట్టారో నేను తెలుసుకోవచ్చునా? వెనక, ప్రోచేంజర్లకు నోచేంజర్లకు మధ్య నేనా అన్న పోరాటం సాగుతున్నప్పుడు తమను బలపరిచేప్రతినిధులను తీసుకురావానికి ఇరుపక్షాలవారూ రైలుఖర్చులూ అవీ భరించేవారనీ, వారిని కాంగ్రెసుమహాసభలకు హాజరుపరిచేవారనీ, సొమ్ముఖర్చుపెట్టేవారనీయింతవరకూవినడమేగాని, అదినిజమో, అబద్ధమో నే నింతవరకూ కనుక్కోలేదు. అదేవిధంగా యిప్పుడుకూడా డబ్బుఖర్చు

పెట్టబడిందని, మొట్టమొదటిసారిగా, మీ ఉత్తరంవల్లనే నేను తెలుసుకో గలిగాను.

మీరు ప్రతిపాదించిన జాతీయస్వాతంత్ర్యతీర్మానాన్ని నేను వ్యతిరేకించడం మిమ్మల్నాశ్చర్యపరిచిందని మీరు వ్రాశారు. నా సవరణను ప్రతిపాదించడానికి, నా కనుమతి లభించివుండినట్లయితే, లాంఛనప్రాయంగా దాన్ని వ్యతిరేకించేఅవసరం నాకు కలిగివుండకపోను. కాని నాకా అవకాశమీయనందున, మీ తీర్మానానికి నా అసమ్మతిని లాంఛనప్రాయంగా తెలియజేయవలసివచ్చింది; ఇట్టివైఖరి నవలంబించడానికిగల కారణాలను నేను నా ఉపన్యాసంలో పేర్కొన్నాను. నాదృష్టిలో ఈ తీర్మానం బలహీనమైనది. దానివల్ల జరిగేపని యేమీ కనబడదు. ప్రతి ఏడూ యిలాంటితీర్మానాలు ఆమోదింపబడుతూనేవున్నాయి. కాని ఇవి మనశత్రువులపట్ల నిరర్థకమౌతున్నాయి; మనప్రజలకుసైతం విశ్వాసాన్ని కలిగించలేకపోతున్నాయి; వీటిని ప్రభుత్వం మన్నించకపోతే, తరవాత ఏకార్యక్రమాన్ని చేపట్టవలసివుంటుందో, ఇవి మనప్రజలకు ఎరుకపరచడంలేదు. కాంగ్రెసుచరిత్రలో యిదేదో క్రొత్తదైనట్లు, ఈ తీర్మానానికి తోడు, ఒక కాలపరిమితినిపెట్టాలన్న సూచనను మీరు వ్యతిరేకించారు. కాని యిలాంటిగడువులను యిదివరకు నాకంటె గొప్పవ్యక్తులే కాంగ్రెసుతీర్మానాలలో పొందుపరిచారు. మనకోరికను అంగీకరించాలని యిప్పుడు గడువుపెట్టడం తీవ్రమైనచర్యగా భావించినట్లయితే, ఇదివరకు కాంగ్రెసుపెట్టినగడువులు దీనికెంతమాత్రం తీసిపోవు. హిట్లరువలె అదునుచూసుకుని తీవ్రమైనదెబ్బతీయాలనేఅభిప్రాయాన్ని మనసులోవుంచుకుని, మీ రీ కాలనిర్ణయసూచనను తిరస్కరించినపుడు, ఆ పద్ధతిలో బ్రిటిష్‌సామ్రాజ్యవాదంపై దెబ్బతీయగలసామర్థ్యం మీకు కలదని నేను నమ్మినపుడు, ఈ మీ వైఖరిని నే నర్థంచేసుకోగలిగివుండేవాణ్ణి.కాని, చడీచప్పుడూలేకుండా వచ్చిపడే ఈ "ఆకస్మిక హింసాయుతవిప్లవాలు" సత్యాహింసలసిద్ధాంతాలకు విరుద్ధమైనవిగా పరిగణింపబడతాయని నేను నమ్ముతున్నాను. మనచర్యలు హఠాత్సంభవాలుగా విభ్రాంతిపరిచాయని మనశత్రువు అనక అనకుండా, ముందే మన ఉద్దేశాలను సత్యంపట్ల

న్ప్రమత్తపాస్తూ, మనం అతనికి తెలియపరచి జాగ్రత్తపడుతున్నాము. యుద్ధానికి విశ్రాంతిఅనేది అమూల్యమైనసిద్ధాంతం; కాని సత్యాగ్రహానికిమాత్రం కాదనుకుంటాను.

ఇదంతా, ఏమైనప్పటికీ, అసలువిషయానికిసంబంధించినదికాదు. ఏమిఅంటే, కాలనిర్ణయం విధించడానికి అసలుకారణం వేరే వుంది. కాంగ్రెసులోవున్న మితవాదులు, తమకుశక్తిగలదనేచైతన్యంతో కాక, తాము బలహీనులమనే ఎరుకవల్ల ఈ సూచనను నిరాకరించారు. ఇది వారి దుర్బలత్వానికి చిహ్నం. భారతదేశప్రజలయందు వారికి విశ్వాసం సడలిపోయింది. బలోపేతమైనప్రతిఘటనోద్యమాన్ని లేవదీసే శక్తి ప్రజలకు కలదనేనమ్మకం తొలగిపోయింది; అలాంటిప్రతిఘటనోద్యమాన్ని నిర్మించి నిర్వహించగలమన్నధీమా వారికే లేకుండా పోయింది. గడువంటూ ఒకటి పెడితే అది వెళ్లినతరవాత, విధిగా వారు కార్యోన్ముఖులు కావలసివుంటుంది; కనుక, వారు ఒకగడువంటూ పెట్టనక్కరలేదంటున్నారు. ఇదీ నేను పరిస్థితిని పర్యావలోకించగా నాకు తేలినవిషయం. నేనుచెప్పినదంతా పూర్తిగా సరియైనది కాకపోవచ్చును.

ఇక, అనుసరించతగిన కార్యక్రమవిధానాలనుగురించి, అఖిల భారత కాంగ్రెసుకమిటీకార్యాలయానికి నే నందించిన తీర్మానాలలో, నా అభిప్రాయాలను నేను స్పష్టంగా తెలియజేశాను. అంతకుముందు ఏప్రిల్ జల్పైగురిలో, నాబెంగాల్‌రాష్ట్రమహాసభాధ్యక్షోపన్యాసంలో నేను విశదీకరించాను. దురదృష్టవశాత్తూ, ప్రతివిషయమూ, త్రిపురిలో రేగిన వ్యక్తిగతవివాదాలవల్ల మరుగుపడిపోయింది. బెంగాల్‌లో మిశ్రమమంత్రివర్గస్థాపనగురించి, నా అభిప్రాయాలను విపులీకరించడానికి [illegible] జరిగిన వర్కింగుకమిటీసమావేశాలలో నేను ప్రయత్నించాను. అధికారాన్ని స్వీకరించాలనుకోవడం కేవలం మితవాదధోరణి. అందులో సందేహంలేదు. కాని అధికారస్వీకరణకు కాంగ్రెసు ఒకసారి అంగీకరించినతరవాత, కాంగ్రెసు రాష్ట్రాలూ, కాంగ్రెసేతరరాష్ట్రాలు అంగీకరిస్తున్నప్పుడు, కాంగ్రెసురాష్ట్రాలనీ, కాంగ్రెసేతరరాష్ట్రాలనీ వాటిమధ్య గిరిగీయలేమనీ, గిరిగీయకూడదనీ నా అభిప్రాయం. ఇంతకీ, కొన్ని

రాష్ట్రాలలో కాంగ్రెసు మెజారిటీలోవుండడం యాదృచ్ఛికమైనది; ఆ రాష్ట్రాలలో తలవనితలంపుగా హిందువులు అధికసంఖ్యాకులుగావున్నారు కనుక యిది సంభవించింది. కాంగ్రెసు మంత్రివర్గాలు గత రెండు సంవత్సరాలుగా పరిపాలన కొనసాగిస్తున్నాయి. కాని అవి యింతవరకూ, భారతదేశరాజ్యాంగచట్టాన్ని రద్దుచేయించడానికి, లేదా, ప్రతిఘటించడానికి వీసమెత్తుపనిచేయలేదు. ఈ అనుభవం, మిమ్మల్ని సంతృప్తి పరచిందని నేననుకోను.

గాంధీజీ, అధ్యక్షులమధ్య సహకారభావం తొలగినట్లుగా, నేను గాంధీజీకి వ్రాసినఉత్తరంలో ధ్వనిస్తున్నదని మీరు భావిస్తున్నారు. కాని అది నిజంకాదు. మహాత్మాజీకిగలస్థానంతో, ఆయనవిధానంతో, పాత వర్కింగుకమిటీల స్థానవిధానాలను కలిపివేయడం, రెండూ ఒకటే ననడం నే నంగీకరించనని, మీ కిదివరకే చెప్పాను. ఈవిషయాన్ని సవివరంగా మీకు తెలియచేశానుకనక, యిక పదేపదే దాన్నిగురించి నేను వ్రాయనవసరంలేదు.

ఈ ఉత్తరాన్ని ముగించేముందు. నేను మరొక అపోహను పోగొట్టాలనుకుంటున్నాను. నేనువ్రాసినవిషయాలతో సుభాస్ కూడా ఏకీభవిస్తున్నాడని సహజంగా ఇతరులు భావించడం కద్దు. కాని, అన్నిటా ఇది నిజంకాదు. ఏమీఅంటే, నేను ప్రతీవిషయం అతనితో ఆలోచించను; ఆలోచించలేను; అతనూ అంతే. ఇప్పు డీ సందర్భంలో నేను గాంధీజీకివ్రాసిన ఉత్తరంప్రతిని అతనికి పంపించాను. నాతో తా నెంతవరకు ఏకీభవిస్తున్నాడో, ఎంతవరకు ఏకీభవించడంలేదో అతనే చెప్పాలి. అతనితరపున మాట్లాడడానికి నా కధికారంలేదు.

మీరు కులాసాగావున్నారని తలుస్తాను. రెండుమూడువారాలనుంచి నా ఒంట్లో బాగాలేదు. ఈస్టరుసెలవుల్లో కొండలమధ్య కొన్నిరోజుల పాటు విశ్రాంతితీసుకుందామనుకుంటున్నాను.

మీ విశ్వాసపాత్రుడు,
శరత్‌చంద్రబోస్

## 269. సుభాష్ చంద్రబోస్ వద్దనుంచి

జిల్గుడా పోస్టు,
మాన్భుమ్ జిల్లా,
బీహార్,
ఏప్రియల్ 15, 1939

నా ప్రియమైన జవహర్,

మహాత్మాజీ, మాయిద్దరికిజరుగుతున్న ఉత్తరప్రత్యుత్తరాలను యితరులకు పంపిస్తున్నట్లుగానే, మీకు పంపిస్తున్నారో లేదో నాకు తెలియదు. అవి మీకు అందకపోయినట్లయితే యిప్పటి తాజాపరిస్థితిని మీకు తెలియచేయాలనుకుంటున్నాను. ఈపరిస్థితినిగురించి మీ అభిప్రాయాలను, యికముందు నన్నేంచేయమంటారో మీ సలహాలను నేను మనసారా వాంఛిస్తున్నాను.

ఏకరూపతకలిగిన వర్కింగుకమిటీని నియమించాలని మహాత్మాజీ పట్టుపడుతున్నారు. అలాంటికార్యవర్గాన్ని ఏర్పరచి, నా కార్యక్రమాన్ని ప్రకటించాలని ఆయన నన్ను కోరుతున్నారు. అటుపిమ్మట అఖిలభారత కాంగ్రెసుకమిటీనిర్ణయంకోసం నేను వేచివుండాలి.

అనేకకారణాలవల్ల అలాంటి వర్కింగుకమిటీని ఏర్పరచలేనని, నేను మహాత్మాజీతో పదేపదే చెప్పాను. అదీకాక, నా కార్యక్రమాన్ని నిర్ణయించడానికి, దాన్ని ప్రకటించడానికి నాకు అవకాశంలేదు. కాంగ్రెసు నన్నావిధంగా ఆదేశించలేదు. నేను ఒక ప్రత్యేకమైనరీతిలో, అంటే, పంత్‌తీర్మానంప్రకారం వర్కింగుకమిటీనిమాత్రమే నేను ఏర్పాటుచేయవలసివుంటుంది.

నేను ఆయనసలహాప్రకారం ఏకరూపతగల వర్కింగుకమిటీని ఏర్పరచలేనుకనుక, కొన్ని ప్రత్యామ్నాయసూచనలుచేశాను. ఇవన్నీ, విఫలమైతే, వర్కింగుకమిటీనియామకబాధ్యతను తామే స్వీకరించవలసి వుంటుందని మహాత్మాజీకి నా ఆఖరిమాటగా తెలియజేశాను. ఆయన

యీ బాధ్యతను స్వీకరించవలసినదిగా, నేను ఆఖరిసారి వ్రాసిన నా రెండుఉత్తరాలలోనూ ఆయన్ని అభ్యర్థించాను.

మహాత్మాజీ తమకులాముగా వర్కింగుకమిటీసభ్యులపేర్లను ప్రకటిస్తారో, ప్రకటించరో నాకు తెలియదు. ఆయ నలా ప్రకటిస్తే, యిక ఏ చిక్కూ వుండదు. ప్రతిష్టంభన తొలగిపోతుంది. కాని ఆయ నలా చేయకపోతే ఏమిటౌతుంది. ఈ అపరిష్కృతసమస్య అఖిలభారత కాంగ్రెసుకమిటీఎదుట చర్చికువస్తుంది. అలాంటిపరిస్థితులలో అది ఎటు తీసుకుపోతుందో నాకు తెలియదు.

ఇప్పుడు జరుగుతున్న ఉత్తరప్రత్యుత్తరాలవల్ల పరిష్కారం కుదరకపోతే, ఆఖరిప్రయత్నంగా ఆయనతో ముఖాముఖి సంభాషించా లనుకుంటున్నాను. కాని రాజకోటవ్యవహారాలదృష్ట్యా, గాంధీజీ ఎప్పుడు ఎక్కడవుంటారో నిశ్చయంగా తెలియదు. కలకత్తాలోజరుగనున్న అఖిలభారత కాంగ్రెసుకమిటీసమావేశానికి తాము హాజరయ్యేందుకు "శాయశక్తులా ప్రయత్నించిచూస్తా"మని గాంధీజీ నాకు తంతియిచ్చారు. అయినప్పటికి, ఆయ నక్కడికి విధిగా వస్తారని నమ్మకంలేదు.

గాంధీజీ వర్కింగుకమిటీని నియమించకపోయినట్లయితే ఆయ నను నేను కలుసుకునేందుకు వ్యవధికావాలి కనుక, అఖిలభారత కాంగ్రెసుకమిటీసమావేశాన్ని, నన్ను వాయిదావేయమంటారా? అందుకు సభ్యు లంగీకరిస్తారా, లేక జాగుచేస్తున్నానని, నన్ను వారు దుయ్యబట్టు కుంటారా? మేము సమావేశంకావాలనీ, సమాధానానికై తుదిప్రయత్నం చేయాలనీ, అంతవరకు అఖిలభారత కాంగ్రెసుకమిటీసమావేశం జరగ కూడదనీ చాలామంది వాంఛిస్తున్నారు. వర్కింగుకమిటీసమావేశం కల కత్తాలో 27 వ తేదీన జరుగుతుందికనక ఈలోపున మహాత్మాజీ అక్క డకు రాలేకపోతే, సమావేశాన్ని వాయిదావేయవలసివస్తుంది. సమావే శాన్ని మీరు వాయిదావేయమంటారా? వద్దంటారా?

మహాత్మాజీ మీకు ఉత్తరప్రత్యుత్తరాలను పంపించివుండకపోతే నేను వాటిని పంపిస్తాను.

ఇంకొకవిషయం: మీరొకసారి ఇక్కడికి వచ్చి కొన్నిగంటలు పాటు వుండగలరా? మనం సంప్రదించుకోవచ్చును; ఇకముందు నేనేం చేయాలో మీరు నాకు సలహాయివ్వవచ్చును.

ఈ ఉత్తరం చాలా క్లుప్తంగా ఎంతో తొందరగా వ్రాశాను. ఇ స్నేహితులు, దీన్ని మీకు అందజేస్తారు. మీరు తాజాపరిస్థితిని సరిగా నిష్కర్ష పరిచారో లేదో నాకుతెలియదు—స్పష్టపరచాలనే అనుకుంటాను.

మీ రిక్కడకు రావడానికి కాస్త తీరికచేసుకుంటే, తుఫాన్ఎక్స్‌ప్రెస్‌లో (8 దౌను) బయలుదేరితే టైంకలిసొస్తుంది. అది ధన్‌బాద్ సాయంత్రం నాలుగున్నరకు చేరుతుంది. మీరు బొంబాయిమెయిల్లో బయలు దేరితే, అది అర్ధరాత్రికి ధన్‌బాద్ చేరుతుంది. జమడోబా, ధన్‌బాద్‌కు తొమ్మిదిమైళ్ళదూరంలో వుంది. మీకోసం స్టేషన్‌కు కారు పంపిస్తాను.

ప్రేమతో, మీ

సుభాస్

261. మహాత్మా గాంధీకి

అలహాబాద్,

ఏప్రియల్ 17, 1939

నా ప్రియమైన బాపూ,

మీరు సుభాస్‌తో జరుపుతున్న ఉత్తరప్రత్యుత్తరాలనకళ్ళను ప్యారీలాల్ నాకు పంపిస్తున్నారు. ఈ జాబులనుబట్టి ప్రతిష్టంభన ఏర్పడినట్లుగా నాకుబోధపడింది. ఇది తొలగిపోయేమార్గం నాకు కనుపించడం లేదు. అందుకు భయంగావుంది. నే నిప్పుడు ఎవరిపక్షంలోనూ ఏకీభవించజాలని దురదృష్టకరపరిస్థితిలో వున్నాను. అందువల్ల ఎవరికీ ఏమీ వ్రాయకుండా, బయట ఏమీమాట్లాడకుండా మౌనంవహించడం ఉత్తమమని భావించాను. కాని, నిస్సహాయపరిస్థితిలోనికి మనం జారిపోవడం మంచిదికాదనుకుంటాను. ఈ సమస్యలు చాలా జటిలమైనవి; వీటిపరిణామంగూర్చి ఆలోచించడానికే తలనొప్పిగావుంది.

మీరు చాలామటుకు బాధ్యతవహించడానికి సంసిద్ధులైతేతప్ప, దీని కొక దారీతెన్నూ కనుపించనట్లు నా కనిపిస్తోంది. ఏదిజరిగితే అది జరుగుతుందని మీ రూరుకోకూడదు; మీరే నడుంబిగించి ముందుకురావాలి. సుభాస్‌లో ఎన్నో లోపాలున్నాయి. కాని దీనిని స్నేహపూర్వకంగా పరిష్కరించుకునేందుకు అత నెప్పుడూ అనుకూలుడే. కనుక మీ అంతట మీరే, రాజకోటవ్యవహారాలను మానుకొనిఅయినా, అత న్నొకసారి స్వయంగా కలుసుకుంటే బాగుంటుందని ప్రార్థిస్తున్నాను. అఖిలభారత కాంగ్రెసుకమిటీసమావేశానికి మీరు హాజరుకాలేకపోవచ్చునన్నవార్త చాలా ఆందోళనకలిగిస్తోంది. దీనివల్ల పరిస్థితులు యింకా పాడౌతాయి. కాంగ్రెసు ముక్కముక్కలై పోతుంది. అంతకంటె దీని కింకొక అర్థంలేదు. అఖిలభారత కాంగ్రెసుకమిటీసమావేశం జరిగేలోపున ఏదోఒక సమాధానానికిరావడం సరైనపద్ధతి. అంతేకాని, ఈ సమస్యను అఖిలభారత కాంగ్రెసుకమిటీకి ఒదిలిపెట్టకూడదు. యిప్పటికే ఉన్నగందరగోళం మరింత ఎక్కువౌతుంది. సుభాస్‌ను మీరు కలుసుకొనివుండినట్లయితే బాగుండిపోను. మీ రతన్నికలుసుకోవడంవల్ల పెద్దగా చేకూరేఫలితంమాట ఎలాఉన్నా, అది కొన్నివిధాల సహాయపడివుండును.

వర్కింగుకమిటీ నియామకంలో జరుగుతున్న జాప్యం మంచిది కాదు. దెబ్బలాడుకోవడంకోసమే, మనం సమావేశమౌతున్నట్లయితే, అది అంతకన్నా మంచిదికాదు. నాకు ఇష్టంలేకపోయినా, అఖిలభారత కాంగ్రెసుకమిటీసమావేశాన్ని ఒకటిరెండువారాలకు వాయిదావేస్తే, మీకు కొంత వ్యవధివుంటుంది; సమాధానంచేకూరడానికి మరికొన్ని అవకాశాలు కలుగుతాయి.

ఈపరిస్థితినిగురించి కొన్నిగంటలపాటు చర్చించడానికి నన్నక్కడకు రమ్మనికోరుతూ, సుభాష్‌నుంచి యిప్పుడే ఉత్తరంఅందింది. కాని ఈ వ్యవహారం నాచేతిలోలేదు కనుక, మా సంభాషణలు ఏదోఒక స్పష్టమైనమార్గాన్ని సూచించలేవని, నేను సంకోచిస్తున్నాను. అయినప్పటికీ అతనిమాట నేను కాదనలేను. కనుక రెండుమూడురోజుల్లో అక్కడికి వెళదామనుకుంటున్నాను. అతని కేంచెప్పాలో నాకే సరిగా బోధపడడం

లేదు. ఇప్పటివరకు అతనికి నే నివ్వగలిగినసలహా ఒక్కటే: వర్కింగుకమిటీసభ్యులపేర్లను సూచించవలసినదిగా ఆ వ్యవహార మంతా మీకే విడిచిపెట్టమని నేను చెబుతామనుకుంటున్నాను. అతను తనకుతోచినవారిని ప్రతిపాదించవచ్చును; కాని, వారు సభ్యులుగావుండ డానికి మీరు అంగీకరిస్తే అంగీకరించవచ్చును; లేదా త్రోసిపుచ్చ వచ్చును. స్పష్టమైన ఈ అవగాహనతోనే అతను వాన్నిపూర్తిగాచెప్పి చేస్తాను. ఇక కార్యక్రమానికిసంబంధించినసంగ్రహాలు అవి త్రిపుర కాంగ్రెసుతీర్మానాల కనుగుణంగావుండింది. అంటే వెనకటికార్యక్రమా నికి, అన్నింటిలాగే యిదీ ఎంతమాత్రం భిన్నంగావుండవన్నమాట.

ఈ పద్ధతికి సుభాస్ అంగీకరిస్తే యిక బాధ్యతంతా మీమీద వుంటుంది; బాధ్యతనువహించడానికి మీరు జంకకూడదు. సుభాష్ అధ్య క్షుడుగావుండడానికి మీ రంగీకరించాలి. నేను ఢిల్లీలో యిలాగే అను కున్నాను. యిప్పుడూ యిలాగే అనుకుంటున్నాను. అతనిని బయటికి నెట్టడానికి ప్రయత్నించడం ఘోరమైన తప్పు. అది కూడనిపని అని నేను భావిస్తున్నాను. వర్కింగుకమిటీ ఎలావుండాలో, అది మీరే నిర్ణ యించాలి. కాని ఏకరూపత అనేదాన్ని సంకుచితార్థంలోచూస్తే, అది పరిస్థితిని చక్కపరచదు. చెప్పుకోతగినఫలితాలను సాధించలేము. అయితే, ఏదోఒకరకమైన ఏకరూపత వుండాలనుకోండి; అలాకాకపోతే మనం పనిచేయలేము. వర్కింగుకమిటీలో కొద్దిమందివ్యక్తులు అసలు విధానాన్నే మార్చగలుగుతారని నే ననుకోను. అయితే ఒకటి: వ్యక్తుల నిజాయితీనే శంకిస్తున్నప్పుడు, వారిని సభ్యులుగావుంచడానికి కష్టంగానే వుంటుందనుకోండి. కాని, సర్వాంగీకృతకార్యక్రమమంటూ ఒకటి వుంటున్నపుడు, ఈ ఏకరూపతఅనేసూత్రాన్ని భిన్నభిన్న రాజకీయ దృక్పథాలన్నింటికీ వర్తింపచేయకూడదు. ఇంతకీ ఏకరూపతకలిగిన కార్యవర్గాన్ని మనం కలిగివున్నంతమాత్రంచేత, మనం ఏకరూపతకలిగిన కాంగ్రెసును సృష్టించలేము. విస్తృతపరిధిలో ఏకరూపతను మనం వూహిస్తున్నపుడు, దానిని కాంగ్రెసులో సాధించడంవల్ల మనం చాలా బాగా సుకరమౌతుంది.

గత కొన్నిమాసాలుగా కాంగ్రెసులోకలుగుతున్న పరిణామాలు చూసి, మీ రెంతో వ్యాకులపడుతున్నారు. అవినీతి మొదలుగాగల దుష్కృత్యాలు ఖండిస్తున్నారు. కాంగ్రెసులోవున్న ప్రతి ప్రాజ్ఞుడు, అతనిరాజకీయదృక్పథంమాట ఎలావున్నా, యీ సమస్యను పరిష్కరించ డానికి ఆతృతపడుతున్నాడని భావిస్తున్నాను. కాంగ్రెసుకుబయటవున్న శక్తులు ఏవిధంగా వున్నవో, నేను జాగ్రత్తగా పరిశీలిస్తూనేవున్నాను. దేశంలోజరుగుతున్న సంఘటనలు, కనిపిస్తున్న పోకడలు, నూతనశక్తుల పరిణామాలు నన్ను కలవరపెడుతున్నాయని నేను చెప్పకతప్పదు. కేవలం మతసమస్యనుగురించిమాత్రమే నేను ప్రస్తావించడంలేదు. అంతకంటె నిగూఢమైనశక్తులు దేశంలో పనిచేస్తున్నాయి. ఇలాంటిసమయంలో కాంగ్రెసు బలహీనపడినా, ఛిన్నాభిన్నమైనా ఫలితాలు దారుణంగా వుంటాయి. మనం ఐక్యంకావాలి. కనుక మా అందరికీ నచ్చినా నచ్చకపోయినా, ఏదోఒకవిధమైన సమాధానాన్ని చేకూర్చడానికి మీరు కృతనిశ్చయులు కావాలని, నేను మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను. అలాఅయితేనే మనం అను కున్నమార్గాన్ని మనం అనుసరించగలం. లేకపోతే మనం ఇక్కడే ఆగి పోవలసివుంటుంది.

నాగురించి ఒక్కమాట. నేను చాలావరకు వ్యక్తివాదినికావడం నా దురదృష్టం. వర్కింగుకమిటీ తుదిసమావేశాలలో నేను ఏమీచేయలేని పరిస్థితుల్లో వుండిపోయాను. బహూశా నా సహచరులకు నే నొక తల నొప్పిగా తయారయానేమో, నాకు తెలియదు, ఇలావుండిపోవడానికి కారణం, యిరుపక్షాలమీదా నాకు సదభిప్రాయంలేకకాదు, నావల్ల ఏపనీ కానప్పుడు, నేను వర్కింగుకమిటీసభ్యుడనుగావుండడం భావ్యంకాదను కున్నాను. అంతకంటే మరికొన్నికారణాలవల్ల సుభాష్ ఏర్పరిచిన వేరొక తరహాకమిటీలో ఉండడానికి నాకు మనస్కరించలేదు. అలా ఆలోచించ డానికే నాకు కష్టమైపోయింది. అప్పటికీ, ఇప్పటికీ నా అభిప్రాయం ఒకటే. కాని యిప్పుడు ఏర్పడిన ప్రతిష్టంభనదృష్ట్యా ఒకపరిష్కార మార్గం అన్వేషించగలిగినపుడు, కమిటీలో నేను వుండడంవల్ల మేలు చేకూరుతుందని భావిస్తే నే నావిధంగా సేవచేయడానికి సంసిద్ధుణ్ణి. ఇది

ఆశించతగినపదవిగా నేను భావించడంలేదు, కాని ప్రస్తుత అసాధారణ పరిస్థితులలో ఆ బాధ్యతను వహించమని కోరినప్పుడు నేను నిరాకరించ వేయను.

మహాత్మా గాంధీ,
రాజకోట.

ప్రేమతో, మీ
జవహర్‌లాల్

## 262. అబుల్‌కలాం అజాద్ వద్దనుంచి

కలకత్తా,
ఏప్రియల్ 17, 1939.

నా ప్రియమైన జవహర్,

అలహాబాద్‌లో నాకుజరిగినప్రమాదం జ్ఞాపకంవచ్చినప్పుడల్లా, నేనొక టనుకుంటూవుంటాను. ఆ ప్రమాదమే ఇక్కడ కలకత్తాలో జరిగి వుంటే, నాకు నయంకావడానికి మావాళ్లు అంతకంటే ఎక్కువసదుపాయాలు చేయలేకపోయేవారు. అక్కడ మీరు నన్నాదుకొన్నంతబాగా, యిక్కడ నాఆత్మబంధువులుసైతం ఆదుకోలేకపోయేవారు. నిజం;నామాట నమ్మండి. నా కృతజ్ఞతాభావాలను నే నెలాగ వ్యక్తంచేయాలో నాకు బోధ పడడంలేదు. మీరు చూపినప్రేమకు, దయకు ఎంతో కృతజ్ఞతతో నా హృదయ ముప్పొంగుతోంది. హృదయాన్ని కదిలించే అనేక సామాన్య విషయాలు నాకు తలపుకువస్తున్నాయి. నేను అలహాబాద్‌నుంచి తిరిగి వస్తున్నపుడు, ఆ ఒక్కరాత్రిప్రయాణానికే, మీ రెన్నెన్నో సదుపాయాలు కలిగించారు; ప్రయాణం సుఖంగాసాగించడానికి ప్రతి చిన్నవిషయంపట్ల జాగ్రత్తతీసుకున్నారు. నావెంట ఎన్నెన్నివస్తువులుపంపించారో నాకే తెలియదు. ఇక్కడకువచ్చినతరువాత, ఆఖరికిఉదుకులోన్‌పీసాసైతం మర్చిపోకుండా మీరు పంపించినట్లు తెలిసింది.

గాంధీజీకి సుభాష్‌వ్రాసినఉత్తరం, మీరు చూశారో లేదో, నాకు తెలియదు. ఇంతకుముందు సుభాష్‌బాబు త్రిపురికిముందు ఎలావున్నాడో ఇప్పుడూ అదేస్థితిలో వున్నాడు. ఒకప్రక్క అలసు, సంకల్పాన్నొకటి నెయ

షావళికివిరుద్ధమైనదని, చెల్లనేరదని చెబుతున్నాడు; ఇంకొకప్రక్క గాంధీజీని కొన్నిషరతులను అంగీకరించమని కోరుతున్నాడు. పైపెచ్చు సోషలిస్టుగ్రూపు తటస్థంగావుండకపోతే, పంత్‌తీర్మానం. వీగిపోయివుండే దని గట్టిగా వాదిస్తున్నాడు.

ఏమైనప్పటికీ, అతనివల్ల కాంగ్రెసు ముందుకుసాగుతుందన్న ఆశమాత్రం నాకులేదు. అంతా ఎక్కడిదక్కడ స్తంభించిపోతుంది. కనక మనం భవిష్యత్‌లో ఏంచేయాలో ఆలోచించుకోవాలి.

సుభాస్‌తోపడుతున్న ఈ వివాదం, కుడి ఎడమపక్షాలకు సాగుతున్న సంఘర్షణగా, నే ననుకోవడంలేదు; లేదా వర్కింగుకమిటీ ఏకరూపంతో వుండాలా, మిశ్రమరూపంలో వుండాలా అన్న ప్రశ్న అసలేకాదు. ఇది కేవలం, సుభాస్, అతనిఅనుచరులుకొందరూ సాగిస్తున్న వ్యవహారం.

ఈ చిక్కు ఏరూపంలో తొలగినా ఒకటే, దీన్ని పరిష్కరించ డానికి మనం జాగ్రత్తగా ఈ ప్రశ్నలన్నిటిని నిర్దిష్టంగా, స్వతంత్రంగా యోచించుకోవలసివుంటుంది.

ఇదివరకు నేనువ్రాసినఉత్తరం మీకు అందిందనుకుంటాను. సుల్తానుఅహమ్మద్‌నుగురించి మీరు లక్నోకు ఫోనుచేశారని ఆశిస్తున్నాను.

మీ విశ్వాసపాత్రుడు,
అ. క. అజాద్.

263. సుభాస్‌చంద్రబోస్‌వద్దనుంచి

జీల్గొరా పోస్టు,
ఏప్రియల్ 20, 1939

నా ప్రియమైన జవహర్,

నే నీవేళ గాంధీజీకి రెండుటెలిగ్రాములుయిచ్చాను; నే నీరోజున ఆయనకువ్రాసినఉత్తరంలో పేర్కొన్నవిషయాన్ని ఒక టెలిగ్రాములో పునరుద్ఘాటించాను. మీకు వాటి నకళ్ళను యిందుతోపాటు పంపిస్తున్నాను.

నేను పునఃప్రద్ఘాటించిన టెలిగ్రాము, ఉత్తరప్రత్యుత్తరాలను విషు దలచేయదలంలేదు; మీపేరును నేను వాడుకున్నాను; అందుకు మీరు అభ్యం తరంపెట్టరని ఆశిస్తున్నాను.

గాంధీజీకి జ్వరం ఎలావుంటుందోనని నాకు గాభరాగావుంది; త్వరలోనే విముక్తిస్తుందని ఆశిస్తాను. కాని, జ్వరం అలాగేవుంటే-భగ వంతుడు శమించుగాక—మనం ఏమిచేయాలి? ఈ ఆగంతుకాన్ని మనం ఎలా తప్పించుకోగలమో, దయవుంచి, మీరు సలహాయివ్వండి. ఆయన ఆరోగ్యం ఇప్పుడు చాలా సన్నగిల్లినందుకు నామనస్సు మరీ కలతచెందు తోంది. ఈవిషయంగురించి తప్పకుండా వ్రాయండి. రేపు 21వతేదీన నేను కలకత్తాకు బయలుదేరి వెడుతున్నాను.

ప్రేమతో, మీ
సుభాస్

264. సుభాస్‌చంద్రబోస్‌వద్దనుంచి మహాత్మాగాంధీకి

జిల్గోరాపోస్టు
మాన్‌భుమ్‌జిల్లా, బీహార్,
ఏప్రియల్ 20, 1939

నా ప్రియమైన మహాత్మాజీ,

నేను మీ కీరోజున ఈవిధంగా టెలిగ్రాం పంపించాను.

మహాత్మాగాంధీ, రాజకోట,

మీకు ఒంట్లో ఎలావుందోనని తెలుసుకుందుకు చాలా ఆతృత పడుతున్నాను. మీరు త్వరత్వరగా కోలుకోవాలని దేవుణ్ణి ప్రార్థిస్తున్నాను. మనసమావేశం ఫలప్రదంకావాలని, సమష్టిలక్ష్యాన్ని సాధించడంకోసం అది, కాంగ్రెసువాదులమధ్య సహకారభావాన్ని పెంపొందింపచేయాలని, జవహర్‌లాల్జీ హృదయపూర్వకంగా వాంఛిస్తున్నారు. మనం త్వరలోనే కలకత్తాలో సమావేశంకామన్నాము కనక, ఈలోపున ఉత్తరప్రత్యుత్తరా

లను ప్రకటించడం అనవసరమని, అవాంఛనీయమని మే మిద్దరం భావించాము. ప్రణామాలు—సుభాష్."

మా ఇద్దరికీ గత మూడువారాలలో ఎన్నో ఉత్తరప్రత్యుత్తరాలు జరిగాయి. అవి, ఇంతవరకూ, వర్కింగుకమిటీనియమానికి ఏవిధంగానూ తోడ్పడలేదు. అయితే, అవి యింకొకవిధంగా, అంటే, బహుశా ఒకరి అభిప్రాయాలను యింకొకరు స్పష్టంగా తెలుసుకునేందుకు ఉపకరించి వుండవచ్చును. కాని, వర్కింగుకమిటీలేనిదే యిక ఒక్క అడుగుముందుకు సాగదు; కనక, ఈసమస్యను వెంటనే పరిష్కరించుకోవలసివుంటుంది. కాంగ్రెసువాదులు తమతమవిభేదాలను విస్మరించి, తక్షణమే సమైక్యం కావాలని, ప్రస్తుతజాతీయాంతర్జాతీయపరిస్థితులు ఉద్బోధిస్తున్నాయి. రోజుకు రోజూ అంతర్జాతీయపరిస్థితి ఏవిధంగా దిగజారిపోతున్నదో, మీకు నేను వేరే చెప్పనక్కర్లేదు.

యుద్ధప్రమాదపరిస్థితులనెపంతో, బ్రిటిష్‌పార్లమెంటు ప్రస్తుతం మనరాష్ట్రప్రభుత్వాలకున్న అదికారాన్ని, "సవరణచట్టం" ద్వారా కబళించడానికి సంసిద్ధమౌతోంది. ఏవిధంగాచూసినా మనల్ని, అత్యంత క్లిష్ట పరిస్థితులు ఎదుర్కొనబోతున్నాయి; ఇదివరకు మనం యిలాంటివాటిని నవిచూడలేదు; వీటినిఎదుర్కోవాలంటే, మనం మన విభేదాలను విస్మరించాలి; సమైక్యతను, క్రమశిక్షణను సాధించడానికి మనం శాయశక్తులా కృషిచేయాలి; మీరు ముందుకువచ్చి, నాయకత్వంవహించినపుడు మాత్రమే, ఇది సాధ్యపడుతుంది. అలాగ మీరు నాయకత్వాన్ని స్వీకరించినపుడు, మేమంతా, మాకుచేతనైనంతవరకు మీకు తోడ్పడతాము; మిమ్మల్ని అనుసరిస్తాము. దేశంలో, నేడు ఎంతవరకు అవినీతివున్నది, ఏప్రమాణంలో హింసాప్రవృత్తివున్నదిఅనేవిషయంలో మనకు అభిప్రాయభేదాలువుంటేవుండుగాక; కాని అవినీతిని నిర్మూలించడంలో, హింసాప్రవృత్తిని అరికట్టడంలో మీకూ మాకూ అభిప్రాయభేదాలులేవు. ఇక కార్యక్రమానికిసంబంధించినంతవరకూ, అది ఎలాగవుండాలో, కాంగ్రెసు, లేదా అఖిలభారతకాంగ్రెసుకమిటీ నిర్వచించవలసివుంటుంది. ఈ వంస్థలఎదుట తమ అభిప్రాయాలను స్వేచ్ఛగా ప్రకటించడానికి, అందరికీ

హక్కు వున్నా, అంతిమనిర్ణయం వాటిమీదనే ఆధారపడివుంది. అధ్యక్షతనభావిలో మనల్ని ఎదుర్కొనబోతున్న క్లిష్టపరిస్థితులు మన కార్యక్రమాన్ని నిర్ణయించడంలో ముఖ్యపాత్రవహిస్తాయని, ఇక యీవిషయంలో మనలోమనకు కార్యరంగానికిసంబంధించిన విభేదాలకు ఆస్కారంవుంటదని, నేను భావిస్తున్నాను.

కలకత్తాలోనో, కలకత్తాసమీపంలోనో అఖిలభారత కాంగ్రెసుసమావేశానికి ముందుగా, మనంయిద్దరం కలుసుకుంటామని ఆశిస్తున్నాను. ఆశతో ఆతృతతో నిరీక్షిస్తున్నాను. ఇప్పుడు ఏ సిద్ధాంత ... భేదాలున్నా,' ఇదివరకు ఎన్నిఅభిప్రాయభేదాలు, అపార్థాలు పొడచూపినా, వాటినన్నిటిని విస్మరించి, మన మొకఅంగీకారానికివచ్చి, వర్కింగుకమిటీనియామకసమస్యను తక్షణం పరిష్కరించాలని బెంగాల్‌లోను, తదితరరాష్ట్రాలలోను సర్వేసర్వత్రా ఒకేఒకఅభిప్రాయం శీఘ్రగతిని వ్యాపిస్తోంది. పంత్‌తీర్మానంప్రకారం, వర్కింగ్‌కమిటీని నియమించే బాధ్యత మీమీద వుంది; ఆ బాధ్యతను మీరు స్వీకరించినపుడు, మేము, మా శాయశక్తులా తప్పక మీకు తోడ్పడతాము.

జవహర్ నిన్న యిక్కడకు వచ్చివెళ్ళారు. ప్రస్తుత పరిస్థితిని మేము సాకల్యంగా చర్చించాము. మా అభిప్రాయాలు ఒకేలాగవున్నందుకు నే నెంతో సంతోషించాను.

కలకత్తాకు అత్తే దూరంలోకాకుండా, ఏదోఒకస్టేషన్లో దిగి, ప్రశాంతంగా ఒకరోజు చర్చించడం మంచిదని మేం అభిప్రాయపడ్డాం. మీరు నాగపూర్ మీదుగా వస్తే, మిద్నపూర్ (నాగపూర్ దగ్గర) అందుకు చాలా బాగుంటుంది; మీరు చియోకిమీదుగా వస్తే, బిర్వాన్ సమీపాన, ఎక్కడ కలుసుకుంటే బాగుంటుందో ఆలోచించాలి. ఈవిషయాన్ని గురించి మీకు తంతియిచ్చాను; మీ సమాధానంకోసం వేచివున్నాను. ఇవేవీ వీలుపడకపోతే, మనం కలకత్తాలో సమావేశమౌదాము. మన సంభాషణల్లో పాల్గొనవలసినదిగా, నేను జవహర్‌ను కోరాను; ఆయన అందు కంగీకరించారు.

మీకు జ్వరం ఎలావుందో, తెలుసుకునేందుకు ఆతృతపడు తున్నాను. త్వరలోనే తగ్గిపోవాలని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను.

గౌరవపూర్వక ప్రణామాలతో,

మీ ప్రేమపాత్రుడు,
సుభాస్.

265. సుభాస్‌చంద్రబోసువద్దనుంచి మహాత్మా గాంధీకి

మహాత్మా గాంధీ, రాజకోట,

ఏప్రియల్ 20, 1939

మీరు 27వతేదీన కలకత్తావస్తున్నందుకు ఎంతో ఆనందంగావుంది. మీకు ఎక్కడ యిష్టంగావుంటే, అక్కడ మీరు బసచేయవచ్చును; అభ్యంతరంలేదు. నగరంవెలుపల ఉద్యానభవనంలో దిగితే, మీకు సదుపాయంగావుంటుంది; ప్రజలకు వీలుగావుంటుంది. సతీష్‌బాబుతో సంప్రతించినతరువాత మీకు తంతియిస్తాను. జవహర్‌లాల్జీ నిన్న యిక్కడకు వచ్చివెళ్ళారు; మేమిద్దరం మిమ్మల్నికలుసుకుని మాట్లాడడానికి వీలుగా, కలకత్తాకుసమీపంలో ఎక్కడోఒకచోట ఒకరోజుపాటు, మీ రాగితే బాగుంటుందని, మే మనుకుంటున్నాము. ఈ అభిప్రాయం మీకు నచ్చినట్లయితే, మీ రేమార్గానవస్తారో, తంతియిస్తే, ఏదోఒక వీలైనస్టేషన్లో, మీ రాగడానికి ఏర్పాట్లుచేస్తాను. 21 వతేదీన కలకత్తాకు బయలుదేరుతున్నాను

సుభాస్.

266. శ్రీమతి ఆస్టర్‌వద్దనుంచి

లండన్,
మే 10, 1939.

ప్రియమైన పండిట్ జవహర్లాల్‌నెహ్రూ,

1933 సంవత్సరంలో నిర్బంధింపబడిన నాగజాతికన్య గైడెల్యూమ గురించి మీరు నాతో గతవేసవిలో మాట్లాడినసంగతి మీకు జ్ఞాపకంవుండ

వచ్చును. ఆ పిల్ల 1980 లో జరిగిన మణిపూర్ ప్రయాణీకుల హత్యా సందర్భంలో అరెస్టుగావింపబడింది. ఆమెకేసునుగురించి నేను ఇండియా ఆఫీసు వారితో కొంతవరకు ఉత్తరప్రత్యుత్తరాలు జరిపాను. వారు కొంత సర్యాప్తగావించి, నాకు ఎంతో వివరణపూర్వకమైన భోగట్టాను పంపించారు. క్లుప్తంగా చెప్పాలంటే, నాకు అందినసమాచారం యిది; జదోనంగ్ అనే ఒకవ్యక్తి తనకుతా నొక దేవమాతగా అభివర్ణించుకున్నాడు. ఆ దేవమాతకు ఈ పిల్ల పూజారిణిగా వ్యవహరించింది. ఈ హత్య జదోనంగ్‌మతపై వాలకు నరబలిగా జరిగింది. దానిలో ఈ మహానుభావులైన నాగజాతీయులు తమతెగవారిని సర్వనాశనంచేస్తారని 'కుకీలు' భయపడిపోయారు. ఈ హత్యలలో ఆ పిల్లకు ప్రమేయంవుందని తగినంత సాక్ష్యాధారాలు వున్నాయి. అదీగాక, ఆమె వయసులోవున్నపిల్ల. అందులోనూ జదోనంగ్ ప్రభావానికి లోనైపోయింది. ఈ కారణాలవల్ల కోర్టువారు ఆమెకు మరణశిక్షవిధించారు.

ఇప్పటికీ నాగజాతీయులలో ఈ ఉద్యమం అణిగిపోలేదు; ఆమెను విడుదలచేస్తే, ఉద్యమం తలఎత్తుతుందనీ, ప్రస్తుతపరిస్థితుల్లో ఆమె విడుదల "అస్సాంరాష్ట్రి, మణిపూర్‌సంస్థాన శాంతిభద్రతలకు ప్రమాదం కలిగిస్తుందని" అధికారులు భావిస్తున్నారు.

అదీకాక, ఈ తీర్పు సామ్రాజ్యప్రతినిధికి సంబంధించినదికాదు, మణిపూర్ అంతరంగికవ్యవహారాలసమస్య అనీ, దీనికీ బ్రిటిష్ ఆధీన ప్రాంతాలకు సంబంధంలేదనీ, తాను 'ఘనతవహించిన ప్రభుత్వ' నిర్ణయాన్ని ప్రశ్నించదలుచుకోదనీ ఇండియాకార్యదర్శి స్పష్టంగా చెబుతున్నాడు.

జదోనంగ్ ప్రభావం తొలగిపోయింతరువాత, ఆ పిల్లను జైలులో వుంచడంకంటే, నిర్మాణసంస్కారయుతశిక్షణలో వుంచడం మంచిది కాదా! అని నేను ప్రశ్నించాను. అస్సాంలో జైలు ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆ విధానాన్ని ప్రవేశపెట్టారని నాకు సమాధానంవచ్చింది. ఆ పిల్లకేసులో నేను ఏసూచనచేసినా, వాటిని సామ్రాజ్యప్రతినిధి పరిశీలనార్థం నాను

పంపించగలమని అధికారులు నాకు వాగ్దానంచేశారు. ఈ సమాచారం అందడానికి నాను చాలాకాలంపట్టింది. అయినప్పటికి, నా ప్రయత్నాలు కొంతవరకు ఫలిస్తాయని నేను ఆశిస్తున్నాను.

మీ కూతురు, సోదరి క్షేమంగాఉన్నారని భావిస్తున్నాను.

మీ విశ్వాసపాత్రమైన
నాన్సీ ఆస్టర్

267. మావోసేటుంగ్ వద్దనుంచి

యూనాన్, షెన్సీ,
మే 24, 1939

జె. నెహ్రూ ఎస్క్వైర్
ఆనందభవనం,
అల్లాబాద్. యు. పి.

ప్రియమిత్రమా,

జపాన్‌సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా పోరాడుతున్న చైనా దేశప్రజలను ఉత్సాహపరుస్తూ అభినందిస్తూ భారత జాతీయకాంగ్రెసు పంపిన సందేశం మాకు అందింది. డాక్టర్ అతల్‌నాయకత్వాన బయలు దేరిన వైద్యదళానికి స్వాగతమిచ్చేఅవకాశం ఆనందం మాకు కలిగింది.

భారతీయ వైద్యదళంవారు యిక్కడ అప్పుడే పనిప్రారంభించా రనీ, అష్టమదళసైనికులందరూ వారికి హృదయపూర్వకంగా స్వాగతమి చ్చారనీ, వైద్యదళసభ్యులు మా కష్టాలను తాము సమంగా పంచుకుంటూ, అందరిహృదయాలను చూరగొంటున్నారనీ మేము మీకు తెలియజేయ డానికి ఆనందిస్తున్నాము.

మాకుచేసిన వైద్య వస్తుసహాయానికి, భారతదేశ మహాప్రజలకు, భారతజాతీయ కాంగ్రెసుకు హృదయపూర్వకాభివందనాలను అందజేస్తు న్నాం. జపానుసామ్రాజ్యవాదులను బయటకు పారద్రోలడానికి మాకు

తోడ్పడుతూ,ఆవిధంగా మీరూ, మేమూ కలిసి సామ్రాజ్యవాదులను పార ద్రోలగలమని వాగ్దానంచేసినందుకు భారతజాతీయకాంగ్రెసుకు, భారత ప్రజలకు మా కృతజ్ఞత తెలుపుతున్నాం.

మా అభివందనాలను, హృదయపూర్వకాభివాదాలను యింకొక సారి వ్యక్తపరుస్తున్నాం.

మీ విధేయుడు,

మావో.

263. వల్లభ్భాయి పటేల్ వద్దనుంచి

బొంబాయి,

జూలై 3, 1939.

నా ప్రియమైన జవహర్,

సర్ యస్. ఒకటవతారీఖున బాపూను కలిశారు. తన ప్రాదేశిక ప్రణాళికనుగురించి ఆయనతో సంభాషించారు. ఆ ప్రణాళికనుగురించి తనతో చర్చించనక్కరలేదని బాపూ ఆయనకు చెప్పారు. కాని, తనకు రాజేంద్రప్రసాదువద్దనుంచి కబురువచ్చిందనీ, సర్ యస్.,అతని ముస్లిం లీగుమిత్రులు మతసమస్యను పరిష్కరించాలనుకున్నట్లయితే వారు రాజేంద్రప్రసాద్‌తోనూ కాంగ్రెసుమిత్రులతోనూ సంప్రదించవచ్చునని, అయితే ఎవరూ మాటజారరాదనీ బాపూ తెలియజేశారు. సర్ యస్. ఈ రాత్రి మళ్ళీ వస్తారు, కాని దానివల్ల చేకూరేదేమీలేదు.

సరిహద్దురాష్ట్రాలకు జూలై 6వతేదీనే బయలుదేరిరమ్మని బాద్‌షా ఖాన్, బాపూకు వైరుయిచ్చారు. అందుచేత బాపూ తన సరిహద్దురాష్ట్ర ప్రయాణాన్ని వాయిదావేసుకున్నారు.

'హరిజన్'లో అచ్చైన బాపూ 'యింటర్వ్యూ'ను ప్రచురించు కొని మీరు మీ ఓర్మిని పోగొట్టుకొని, ఆయనతో ఘాటుగా మాట్లాడారు. దానివల్ల మీ రంత కోపోద్రిక్తులైనందుకూ, ఆయనపట్ల తీవ్రంగా ఉన్నందుకు మేమంతా చాలా విచారించాము. ఇలాంటిసంఘటనలు ఒకటి

రెండు జరిగితే, యిక ఆయన ప్రజాజీవితంనుంచి నిర్గమించడానికి నిర్ణయించుకుంటారని మేము భయపడ్డాము. యిప్పుడు ఆయనవయస్సు 71; శక్తి చాలామటుకు సన్నగిలింది. మీ హృదయానికి గాయంతగిలితే ఆయన ఎంతో బాధపడతారు; మిమ్మల్ని ప్రేమిస్తున్నట్లుగా ఆయన యింకొకర్ని ప్రేమిస్తున్నారని నే ననుకోను. ఆయనచర్యలు మిమ్మ ల్నేమాత్రం ఖేదపెట్టినా, ఆయనహృదయం క్షోభిస్తుంది. తమలోతాము ఏమేమో ఆలోచిస్తూ మథనపడుతూవుంటారు. ఆనాటిసాయంకాలంనుంచీ తాము ప్రజారంగంనుంచి విరమించాలని ఆలోచిస్తూనేవున్నారు. ఈ ఆలో చనలకుతోడు పెరేన్, బరూచాల యిద్దరిప్రసంగం అగ్నిలోఆజ్యంపోసి నట్లయింది. రాజన్‌బాబుకు కుర్షీద్ వ్రాసిన ఉత్తరం ఆయన్ని మరింత కార్యవిముఖుణ్ణిచేసింది.

ఆయన తొందరపడి ఏనిర్ణయంచేయకుండావుండేటందుకు నే నన్నివిధాల ప్రయత్నిస్తున్నాను; కాని ఆయనతత్వమేమిటో మీకు తెలుసు. ఆయన ఏమిటిచేస్తారో నేను చెప్పలేను.

ఈవిషయం మీకు తెలియజేయడం నా బాధ్యతగా నేను గుర్తిం చాను. మీతో ఆలోచించకుండా అలాంటి నిర్ణయమేమీతీసుకోవద్దని ఆయనకు మీరు ఉత్తరంవ్రాస్తే అలావ్రాయడం భావ్యమని మీ రను కుంటే, ఆప్రకారం చేయండి.

మీ విశ్వాసపాత్రుడు,
వల్లభాయ్.

## 269. మహాత్మా గాంధీవద్దనుంచి

సెగోన్, వార్ధా,
జూలై 29, 1939.

నా ప్రియమైన జవహర్‌లాల్,

ధర్మిష్ఠప్రజలను నేను నడిపించడానికిబదులుగా వారిని నీచెంతకు పంపించాను. నా ప్రమేయంలేకుండా, స వ్యవహారాన్నివహించాలని నా

అభిప్రాయం. కాంగ్రెసును గుర్తించకుండా, దాన్ని వేరుపాటుచేయాలని సంస్థానాలలో ప్రయత్నాలు కొనసాగుతున్నట్లగుపిస్తోంది. కనుక, సంస్థాన మహాసభలను ఏర్పాటుచేయాలనే అభిప్రాయం పొడచూపుతోంది. మీ కమిటీతో సంప్రదించకుండా, సంస్థాన సంఘాలు లేదా మండలులు, తమంతటతాము స్వతంత్రించి పనిచేయరాదని, నేను హరిజన్‌లో సూచించాను. అంత అవసరమైతే, నువ్వుకోరితే అంటే నన్నొకవిష యాన్నడిగినపుడు, నేను జోక్యం కలిగించుకుంటాను; వర్కింగుకమిటీ విషయంలోకూడా అంతే. గ్వాలియర్ వ్యక్తులతో కూడా నిన్న నే నిలాగే చెప్పాను. మీ కమిటీ సరిగా పనిచేయాలంటే, దాన్ని కాస్త పునర్ని ర్మించవలసివుంటుంది.

ఇంతాచేసి, నేను కాశ్మీర్ వెళ్ళలేకపోయాను. షేక్ అబ్దుల్లాకు అతనిమిత్రులకు నేను ప్రభుత్వఅతిథిగావుండడం కిట్టదు. నా గత అనుభ వాన్ని పురస్కరించుకుని, యిందుకు షేక్ అబ్దుల్లా ఆమోదిస్తాడన్న భావంతో, నేను ప్రభుత్వ ఆహ్వానాన్ని అంగీకరించాను, కాని, నేను పొర పాటుపడ్డానని తర్వాత తెలుసుకున్నాను. కనుక, ప్రభుత్వఆతిథ్యాన్ని తిర స్కరించి, షేకు ఆతిధ్యాన్ని అంగీకరించాను. ప్రభుత్వం తన ఆశ్చ ర్యాన్ని వెలిబుచ్చింది. ఇక, ఈ ప్రయాణమే మానుకుందామని నిశ్చ యించుకున్నాను. నేను రెండువిధాలుగా తెలివితక్కువతనాన్ని ప్రదర్శిం చాను. నువ్వు వెంటరాకుండా నేను అక్కడకు వెళ్ళబోవడం, షేక్ అబ్దుల్లాఅనుమతిలేకుండా, ప్రభుత్వఆహ్వానాన్ని అంగీకరించడం—ఈ రెండూ సాహసకృత్యాలే మరి. ప్రభుత్వఆహ్వానాన్ని అంగీకరించడం ద్వారా, నేను ప్రజలకు సేవచేయగలనని భావించాను. షేక్ అబ్దుల్లాతో, అతనిమిత్రులతో నాకుగల పరిచయం, నన్ను సంతృప్తిపరచలేదని నేను చెప్పకతప్పదు. మా అందరికీ, వాళ్ళు బేనబలైన మనుష్యులుగా కనిపిస్తున్నారు. ఖాన్ సాహేబ్ వారితో చర్చించిచూశారు. కాని ఫలితం లేకపోయింది.

నీ సింహళయాత్ర జయప్రదమైనది. నీ యాత్రవల్ల చేకూరిన సద్యఃఫలితం ఏమిటని నే నాలోచించడంలేదు. నిన్ను బర్మాకు పంపించ

మని పొలేభ్ త్యాబ్జీ నాతో చెప్పారు; దక్షిణాఫ్రికాకు వెళితే బాగుంటుందని ఆండ్రూస్ అంటున్నారు. కాంగ్రెసుప్రతినిధివర్గాన్ని సింహళానికి పంపించాలన్నకోరిక నామటుకునాకే కలిగింది; కాని, ఈ రెండింటివిషయంలోనూ ఇతరులు చెప్పినా, నాకు అలాంటికోరిక కలుగలేదు. మనం సమావేశమైనపుడు వీటినిగురించి మాట్లాడుకుందాము. నువ్వూ, కృష్ణా కులాసాగా వున్నారని ఆశిస్తున్నాను.

ప్రేమతో,
బాపు.

270. మహాత్మా గాంధీవద్దనుంచి

సేగోన్, వార్ధా.
ఆగస్టు 11, 1939

నా ప్రియమైన జవహర్‌లాల్,

ప్లానింగ్‌కమిటీనిగురించి వర్కింగుకమిటీసమక్షంలో నీతో మాట్లాడ్డానికి నా కంత యిష్టంలేకపోయింది. ఆవిషయం యింకొకసారి మాట్లాడదామనుకున్నాను. నీతో మాట్లాడినపిదప, శంకరలాల్ యీవేళప్రొద్దుట ఇక్కడకు వచ్చాడు. వస్తూ యీవిషయమై, తాను కృపలానీకివ్రాసిన ఉత్తరపునకలును తీసుకవచ్చాడు. అతనుచెప్పిన అభ్యంతరంపట్ల సానుభూతి ఉంది. కమిటీచేస్తున్నకృషిని నేను మెచ్చుకోలేకపోతున్నాను. అసలు అదంటేఏమిటోనాకుఅర్థంకాకుండావుంది. కమిటీఏర్పాటుకుదోహదపడిన తీర్మానానికిఅనుగుణంగా అది పనిచేస్తున్నదో లేదో నాకు తెలియదు. అది చేస్తున్న పనులనుగురించి వర్కింగ్‌కమిటీకి తెలుపుతున్నదీ, లేనిదీ నాకు తెలియదు. అనేకఉపసంఘాలుఏర్పడడంవల్ల ప్రయోజనమేమిటో నాకర్థం కాకుండావుంది. నిరర్థకమైనపనులకోసం చాలాడబ్బు,శ్రమ వినియోగపడుతున్నవని నే నమకుంటున్నాను. ఇవీ నా సందేహాలు. సందేహనివృత్తికోసం నే నెదురుచూస్తున్నాను., ఇప్పుడు నీ మనస్సంతా చైనాలోవుందని

నాకు తెలుసు. నీ ఉద్దేశాలేమిటో షా చెప్పగలడని నీవనుకుంటే,అతనివల్ల తెలుసుకొనడానికి ప్రయత్నిస్తాను. లేదంటావా, నువ్వు యాత్రముగించుకొని వచ్చేవరకు ఆగమంటే ఆగుతాను. దేవుడు నిన్ను కాపాడుతూ, నీ మాతృదేశానికి నిన్ను సురక్షితంగా చేర్చుగాక!

ప్రేమతో,
బాపు

271 అబుల్‌కలాం అజాద్ వద్దనుంచి

కలకత్తా,
ఆగస్టు 17, 1939

నా ప్రియమైన జవహర్‌లాల్,

మీ ఉత్తరానికి నా ధన్యవాదాలు. మీ అల్లాబాద్ చిరునామాకు వెంట వెంటనే వరసవరసగా రెండువుత్తరాలు నేను వ్రాశాను. అవి మీకు అందేయనుకుంటాను.

నా ఉత్తరాన్ని రాజేంద్రబాబు కమిటీముందు పెట్టారో లేదో నాకు తెలియదు. సమావేశానికి నేను హాజరుకాకుంటే, నా అభిప్రాయాన్ని తెలుపవలసిందిగా, ఆయన, వల్లభాయ్ నన్ను బలవంతంపెట్టారు. కనుక నా అభిప్రాయాలు సవివరంగా వ్రాసి పంపించాను. సుభాష్‌బాబువైఖరి పూర్తిగా తప్పని నా అభిప్రాయం. వర్కింగుకమిటీ తన అభిప్రాయాన్ని తాను వ్యక్తంచేయడం అవసరం. కాని ఈసమయంలో అంత ఖచ్చితంగా వుండకూడదని నేను సూచించాను. మీరు యు. పి. లో ఆమోదించిన తీర్మానపద్ధతిలోనే, వర్కింగుకమిటి ఒక తీర్మానాన్ని ఆమోదించాలని, మిగిలినవిషయం అధ్యక్షునికి ఒదిలిపెట్టాలని ప్రతిపాదించాను. అప్పుడు అధ్యక్షుడు వారితో ఉత్తరప్రత్యుత్తరాలు జరుపవచ్చును. కమిటీ తీర్మానాన్ని వారు ఆమోదించినట్లయితే, అతను మిగతాచర్యలను మానుకోవచ్చు. దీనికిసైతం వా రంగీకరించకపోతే, ప్రస్తుత పదవులనుంచి వారినితొలగించవచ్చును. కాని, వచ్చేసంవత్సరం ఎన్నికలకునిలబడడానికి వారికి ఎట్టిఅభ్యంతరం వుండకూడదు.

ఈవిషయంలో మీరు జోక్యంచేసుకుంటారని నేను భావిస్తూ, మీకు ఫోనుచేశాను. కాని యిప్పుడు మీరు దీనికి దూరంగావుండిపోయారు. మీ అంగీకారంతో ప్రమేయంలేకుండానే నిర్ణయం జరిగింది.

మీ విశ్వాసపాత్రుడు,
అ. క. అజాద్.

272. మదాం సన్–యట్–సేనువద్దనుంచి

దీ చైనా డిఫెన్సులీగ్,
సెంట్రల్ కమిటీ,
హాంకాంగ్,
సెప్టెంబరు 15, 1939.

ప్రియమిత్రమా,

మీకు చైనాలో స్వాగతం యివ్వలేకపోయినందుకు నే నెంత నిరాశపడ్డానో వ్యక్తంచేయడానికి నాలుగువాక్యాలు వ్రాస్తున్నాను. మీరు చుంకింగ్‌లోవుండగా, నే నొక సందేశం పంపించాను. అది మీకు అందనట్లు డాక్టరు ముఖర్జీవల్ల నే నిప్పుడే తెలుసుకున్నాను. విమానంలో బయలుదేరి మీ దగ్గరకు వద్దామని, నే ననుకుంటూవుండగా, మీరు మీ మాతృదేశానికి వెళ్ళిపోతున్నట్లుపత్రికల్లోవార్తపడింది. సరే, ఏమైనప్పటికి మనం అచిరకాలంలోనే కలుసుకుంటామని విశ్వసిస్తున్నాను. స్వతంత్ర చైనాదేశానికి మిమ్మల్ని ఆహ్వానించే మహాభాగ్యం త్వరలోనే లభిస్తుందని ఆశతో ఎదురుచూస్తున్నాను.

మా సహాయార్థం యూరప్‌నుంచి కొన్ని మందులూ అవీ వచ్చాయి. కాని, అవి చాలవు. వైద్యసహాయవిషయమై మీ దేశం ఏవిధంగా మాకు తోడ్పడివుందో డాక్టరు ముఖర్జీతో నేను చాలాసేపు మాట్లాడాను. మా సంభాషణలను, ఆయన మీకు పూర్తిగా తెలియజేస్తారని నే ననుకుంటున్నాను. చైనా డిఫెన్సులీగుశాఖ నొకదానిని భారతదేశంలో నెలకొల్పడం గురించి నే నాయనతో చర్చించాను. ఆవిషయంకూడా ఆయన మీకు వివ

రిస్తారు. ప్రస్తుత క్లిష్టపరిస్థితులలో మా సంస్థను యిక్కడినుంచి కున్మింగుకో లేదా క్వీలిన్‌కో మేము మార్చుకోవచ్చును. అలా మార్చినపుడు మీ కా విషయం తెల్పుతాము.

మీ నాయకత్వాన జరుగుతున్న కృషిని నేను జాగ్రత్తగా పరిశీలిస్తున్నాను. మీ లక్ష్యమే మా చైనాదేశలక్ష్యం. మీ ఉద్యమపురోగతిని నేను గమనిస్తున్నాను.

హృదయపూర్వకాభివందనాలు.

మీ విశ్వాసపాత్రురాలు,
సూంగ్–చింగ్–లింగ్

273 మహాత్మా గాంధీవద్దనుంచి

సేవాగ్రాం, వార్ధా
సెప్టెంబరు 18, 1939

నా ప్రియమైన జవహర్‌లాల్,

ఇదిగో, యిందుతో చాంగ్‌కై షేక్‌కు నేనువ్రాసిన ఉత్తరాన్ని నీకు పంపుతున్నాను. నే ననుకున్నదానికంటే, ఉత్తరం చాలావరకు పెరిగిపోయింది. యీ ఉత్తరంతోపాటు బహుశా, ఒక 'సైప్ధ'కాపీని పంపిస్తే బాగుంటుందనుకుంటాను.

మహాదేవ్ నిన్న మద్రాసుకు వెళ్ళేడు.

ప్రేమతో,
బాపు

274. కృష్ణ కృపలానికి

ఆనందభవనం,
అలహాబాద్
సెప్టెంబరు 28, 1939

నా ప్రియమైన కృష్ణ,

మీరు సెప్టెంబరు 25వతేదీన వ్రాసిన ఉత్తరం యిప్పుడే అందింది. పనితొందరలోవున్నమనిషినిసైతం మీరు అంతగా మన్నించే

టట్లుకనపడదు. ప్రస్తుతం నే నావిషయంగురించి, అది ముఖ్యమైనదే అయినా, మీకు ఉత్తరంవ్రాయకుండావుండేవాణ్ణి; క్షమించమని కోరే వాణ్ణి. కాని, మీకు ప్రొఫెసరు సాహా వ్రాసినఉత్తరం నన్నలాగ వూరుకో నివ్వడంలేదు. అందులో పేర్కొన్నవిషయాలు యధార్థమైనవికావు; నేను మౌనంవహించి వూరుకుంటే, అనేక దురభిప్రాయాలు తలఎత్తుతాయి. ప్లానింగుకమిటీలో నేను వెలిబుచ్చిన అభిప్రాయాలు ఒకతీరునవుండగా, ఆయన వాటిని యింకొకతీరుగా తనలేఖలో ఉల్లేఖించారు. ఇది దురభి ప్రాయాలకి ఆస్కారమిస్తుంది.

యిప్పుడు ఈవిషయంగురించి పూర్తిగా వ్రాయలేనేమోనని అను కుంటున్నాను. ప్రొఫెసరు సాహాకు, యితరుల కలిగిన దురభిప్రాయాలను పోగొట్టడానికిమాత్రం ప్రయత్నిస్తాను.

ప్లానింగుకమిటీసమావేశాల్లో ఎప్పుడూ, ఏస్థితిలోనూ ప్రత్యేకించి గాంధీజీసిద్ధాంతాలనుగురించి చర్చ జరగలేదు. కాంగ్రెసుతీర్మానాలలో పొందుపరచబడిన కాంగ్రెసుసిద్ధాంతాలనుగురించి మేము చర్చించాం. గత 20సంవత్సరాలుగా కాంగ్రెసుపై అధికప్రభావాన్ని నెరపుతున్న గాంధీజీ సిద్ధాంతాలను ఆవిధంగా, పరోక్షంగా మేము మా చర్చల్లో పరామర్శిం చాము. గాంధీజీసిద్ధాంతాలు శ్రీ కుమారప్పకంటే, లేదా మరెవరికంటెనా కెక్కువ తెలుసునని నే నెన్నడూ చెప్పుకోలేదు. విశేషించి యీ ప్రత్యేక విషయంలో గాంధీజీఅభిప్రాయాన్నిగురించి నాకంటె ఎక్కువ అధికారి కంగా మాట్లాడడానికి శ్రీ కుమారప్పకు అర్హతవుందని నే ననుకుంటు న్నాను. కుటీరపరిశ్రమలకృషిలో ఆయనకు గాంధీజీతో చాలాసంవత్స రాలనుంచీ సన్నిహితసంబంధముంది. కనుక ఆయనకు కుటీరపరిశ్రమల గురించి, గాంధీజీఅభిప్రాయాలగురించి మాట్లాడడానికి సంపూర్ణ అధికార ముంది.

భారీపరిశ్రమలకు కాంగ్రెసు ఎన్నడూ తనవ్యతిరేకతను ప్రకటించ లేదనీ,అనేకకారణాలవల్ల కుటీరపరిశ్రమలఅవశ్యకతను గట్టిగాపేర్కొన్న దనిమాత్రమే నేను ప్లానింగుకమిటీసమావేశంలో చెప్పాను. భారీపరిశ్రమల అభివృద్ధిలో వ్యక్తిగతంగా నాకు నమ్మకముంది. అయినప్పటికి ఆర్థిక,

సామాజిక, రాజకీయకారణాలను పురస్కరించుకొని, నేను ఖాదీఉద్యమాన్ని తదితర గ్రామపరిశ్రమలను హృదయపూర్వకంగా బలపరిచాను. ఈ రెండుపరిశ్రమలకు అభివృద్ధిపరిణామాలలో అప్పుడప్పుడు సంఘర్షణ కలిగితే కలగవచ్చునని, వీటిమధ్య ప్రధానసంఘర్షణ వుంతదని నేను భావించాను; ఈవిషయంలో గాంధీజీదృక్పథానికి నేనంతగా ప్రాతినిధ్యంవహించను. కాని ఆచరణలో యింతవరకు యీ రెండుదృక్పథాల మధ్య ప్రత్యేకమైన సంఘర్షణఅంటూ రాలేదు.

కొన్ని ప్రత్యేకమైన కీలక, ప్రధానపరిశ్రమలు, రక్షణపరిశ్రమలు వినిమయవస్తువులను ఉత్పత్తిచేసేపరిశ్రమలు భారీయెత్తున కొనసాగించవలసివుంటుందని నా దృఢాభిప్రాయం. మరికొన్నిపరిశ్రమలు భారీఎత్తున కొనసాగించవచ్చును; లేదా వాటిని లఘుపరిశ్రమలుగా, కుటీరపరిశ్రమలుగా నిర్వహించవచ్చును. కుటీరపరిశ్రమలనుగురించి అభిప్రాయభేదాలువస్తే రావచ్చును. తాత్త్వికసిద్ధాంతంలో, దృక్పథంలోవున్నభేదాన్ని అనుసరించి, ఆ భేదాలు వుత్పన్నమౌతున్నాయి. తాత్వికసిద్ధాంత దృక్పథాలలోభేదాలకు శ్రీ కుమారప్ప అధికప్రాముఖ్యమిస్తున్నట్లు నాకు ద్యోతకమౌతోంది, ఆధునిక పెట్టుబడిదారీ భారీపరిశ్రమవిధానం హింసపై ఆధారపడివుందని; వస్తుపంపకంసమస్యను అది నిర్లక్ష్యంచేస్తున్నదనీ ఆయన వాదిస్తున్నారు. ఈ అభిప్రాయంతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. కుటీరపరిశ్రమలు అభివృద్ధిచెందడంతోపాటు వస్తువంపకవిధానం సక్రమంగా ఆచరణకువస్తుందని, హింసాప్రవృత్తి అంతకంటె తగ్గుతుందని యిదే దానికి పరిష్కారమార్గమని ఆయన చెబుతున్నారు. దీనితోకూడా నే నేకీభవిస్తాను; కాని యిది అట్టే దూరం వెళ్ళదు. కొద్దిమందివ్యక్తుల చేతులలో సంపదలు పోగుపడడానికి, గుత్తవ్యాపారం, హింసాప్రవృత్తి నెలకొనడానికి కారణం ప్రస్తుత ఆర్థికవ్యవస్థే. అదే వీటిని తయారుచేసింది. ఈ దోపిడివిధానాన్ని, అన్యాయాన్ని భారీపరిశ్రమలు తెచ్చిపెట్టలేదు. వాటిని ధనవంతులు, పెట్టుబడిదారులు తమ స్వార్థప్రయోజనాల కోసం వినియోగించుకోవడంవల్ల యీ దుష్ఫలితాలు కలుగుతున్నాయి.

మానవునినిర్మాణశక్తిని విధ్వంసకరశక్తిని పెద్దపెద్ద యంత్రాలు

హెచ్చిస్తూ, మంచికి చేడుకి అవి ఉపయోగపడుతున్నాయనేమాట నిజమే. కాని యంత్రాలను చెడుకు ఉపయోగించుకోకుండా, వాటివల్ల కీడుమూడ కుండాచేయడానికి వీలువుంది; పెట్టుబడిదారీ ఆర్థికస్వరూపాన్ని మార్చడం వల్ల ఇది సాధ్యపడుతుందని నేను భావిస్తున్నాను. ఆస్తులపై వ్యక్తిగత యాజమాన్యం, సంపదలనార్జించిపెట్టే సామాజిక విధానం పరస్పరపోటీ లను, పరపీడనను తెచ్చిపెట్టాయి; వీటికి అవే ప్రధానకారణం. సామ్య వాద సామాజికవ్యవస్థ నెలకొనిననాడు, ఈ చెడుగు నశిస్తుంది; యంత్రాలవల్ల చేకూరిన సౌలభ్యం మంచీ మిగులుతుంది.

అవును; భారీయంత్రాలలో, భారీపరిశ్రమలలో స్వతస్సిద్ధంగాకొన్ని ప్రత్యేకమైన ప్రమాదాలున్నాయని అనుకుంటాను. ఒకేచోట అధికారాన్ని కేంద్రీకృతంచేసేలక్షణం ద్యోతకమవుతుంది; ఈ అధికారకేంద్రీకరణ పూర్తిగాతొలగింపచేయవచ్చునని, నేను గట్టిగా చెప్పలేను. కాని, భారీ యంత్రాలులేనిప్రపంచాన్ని నే నూహించలేను; అభివృద్ధిచెందుతున్న ఏ దేశమూ యివి లేకుండా, పురోగమించగలుగుతున్నాయని నే ననుకోవడం లేదు. ఇవిలేకుండావుండడం సాధ్యమేఅయినప్పటికీ,తత్ఫలితంగా ఉత్పత్తి ఘోరంగా పడిపోతుంది; జీవనస్థాయి ఎంతో దిగజారిపోతుంది. ఒక దేశం పారిశ్రామికంకాకుండా మనగలుగుతుందని భావించినట్లయితే, ఆ దేశం ఆర్థికంగా యింకొకదేశంమీద ఆధారపడవలసివస్తుంది; అంత కంటె పారిశ్రామికవంతమైన ఇతరదేశాల కది ఎరఅవుతుంది; అవి దానిని కొల్లగొడతాయి; పీల్చిపిప్పిచేస్తాయి. గ్రామపరిశ్రమలను విస్తృత ప్రాతిపదికపై నెలకొల్పి, అభివృద్ధిచేయడానికి, ఆర్థిక రాజకీయాధి కారాలు వుండాలనేది స్పష్టం. కేవలం కుటీరపరిశ్రమలనుమాత్రమేఅంటి పెట్టుకునివున్నదేశం, ఆర్థికంగా రాజకీయంగా ఎట్టిఅధికారాన్ని ఎన్నడూ పొందజాలదు; తత్ఫలితంగా, తాను వాంఛిస్తున్న కుటీరపరిశ్రమలను సైతం అది కొనసాగించలేదు.

కనుక, భారీయంత్రాలను ఉపయోగించుకోవడం, వాటివినియో గాన్ని ప్రోత్సహించడం, తద్వారా భారతదేశాన్ని పారిశ్రామికంచేయడం వాంఛనీయమని అత్యవసరమని నేను తలపోస్తున్నాను. ఇలాగ పారిశ్రా

మికంచేయడంలో అంతా సరిపోతుందని, భారతదేశంలోవిస్తృతప్రాతిపది కపై కుటీరపరిశ్రమలను నెలకొల్పేఆవశ్యకత తీరిపోతుందని నే నను కోవడంలేదు; ఈ కుటీరపరిశ్రమలను విస్తృతప్రాతిపదికపై స్వతంత్రి భాగాలుగా అభివృద్ధిచేయాలని నే నంగీకరిస్తున్నాను. రానున్న ఒకటి రెండుతరాలలో విజ్ఞానశాస్త్రం ఏమి సాధిస్తుందో నేను చెప్పలేను; కాని భారతదేశంలో భారీపరిశ్రమలతోపాటు కుటీరపరిశ్రమలు నెలకొనాలని, వాటిని అన్నివిధాలా ప్రోత్సహించాలనీ, యిది అత్యవసరమనీ నేను అభిప్రాయపడుతున్నాను. కనుక, ఈసమస్య జటిలమైనదికాదు; భారీపరి శ్రమల కుటీరపరిశ్రమలమధ్య సమన్వయంసాధించడమే వున్నసమస్య. ఇది ప్రభుత్వప్రణాళికపై ఆధారపడివుంటుంది. అరాజకంగాఉన్న ప్రస్తుతపెట్టుబడిదారీవిధానంక్రింద ఈ సమస్య సంతృప్తికరంగా పరిష్క-రింపబడజాలదు.

పరిశ్రమలవిషయమై నా అభిప్రాయాలను నేను క్లుప్తంగా తేటప రచడానికి ప్రయత్నించాను. ఇంకొకరిఅభిప్రాయాలకు నేను ప్రాతి నిధ్యంవహించి, భాష్యంచెబుతున్నానని నే ననుకోవడంలేదు; కాని కుటీర పరిశ్రమలు కావాలని కోరేవారి మౌలికసిద్ధాంతాలతో, ప్రధానదృక్పథంతో నేను ఏకీభవించకపోయినా, వారితో నేను సులభంగా పూర్తిగా సహక రించడానికి నాకు సాధ్యమేనని నే ననుకుంటున్నాను.

దురదృష్టవశాత్తూ, మనం ప్రస్తుతం సామ్యవాదవ్యవస్థతో వ్యవ హారం నెరపడంలేదు; పెట్టుబడిదారీవిధానం శిథిలమౌతున్నసమయంలో ఒకదశనుంచి యింకొకదశకు మనం సాగిపోతున్నాము. ఈ పరివర్తన దశ అనేక కష్టాలకు కారణభూతమౌతున్నది. ఏపరిస్థితిలోనైనప్పటికీ, మనం కాంగ్రెసుసూచించినసిద్ధాంతాలను అనువర్తింపచేయవలసివుం టుంది; అనగా, కీలకపరిశ్రమలను, వాణిజ్యవ్యవహారాలను, ఎగుమతి దిగుమతులను ప్రభుత్వం తన అధీనంలోవుంచుకోవలసివుంటుంది. ప్రభు త్వం వీటిపై అధికారాన్ని వహించాలి; లేదా వీటిని తన అదుపులోవుం చుకోవాలి. కీలకపరిశ్రమలు అనేమాటకు అన్ని ప్రధానపరిశ్రమలు అని కనక అర్థమైనట్లయితే, మనం చాలావరకు సామాజికపరం చేసినట్లే

వుతుంది. వ్యక్తిగతయాజమాన్యంక్రింద నిర్వహింపబడుతున్న భారీపరిశ్రమలకు, కుటీరపరిశ్రమలకు మధ్య వైరుధ్యంవచ్చినప్పుడు, ప్రభుత్వం ఆ భారీపరిశ్రమలపై యాజమాన్యంవహించాలని, లేదా వానిని తన అదుపులోపెట్టుకోవాలని, ఇది అవసరమని నేను సూచిస్తున్నాను. అలాగ ప్రభుత్వం చేసినపుడు, తనకు నచ్చినరీతిని ఒకవిధానాన్ని స్వీకరించడానికి అధికారం. స్వేచ్ఛా వుంటుంది; ఈ రెండుపరిశ్రమలమధ్య సమన్వయాన్ని సాధించడానికి వీలుకలుగుతుంది.

గత ఇరవై సంవత్సరాలుగా కాంగ్రెసు అనుసరిస్తూవచ్చిన విధానాల అనుభవం, భారతదేశానికి ఆర్థికంగా సాంఘికంగా ఎంతో ఉపకరించిందని నా విశ్వాసం. భారీపరిశ్రమలు శక్తిస్తోమతలు కలవి కనుక, వాటిఅభివృద్ధిని అవి సాధించుకోగలవని, కుటీరపరిశ్రమలు అలాంటివి కావుకనుక, వాటివిషయమై ఎక్కువ జాగ్రత్తతీసుకోవాలని కాంగ్రెసు భావించింది; ఈ భావంతోనే అది పనిచేస్తూవచ్చింది. ఏపరిస్థితులలో యిది సంభావ్యమైనదో, మనం జాగ్రత్తగా పరిశీలించాలి. ఆ పరిస్థితులను మినహాయించి మన మీ విషయాన్ని అర్థంచేసుకోకూడదు. మనసంస్థ అధికారకమైనదికాదు; దేశ ఆర్థికస్వరూపాన్ని మనం మనచేతులతో చక్కదిద్దడంలేదు. దానిపై మనకు అధికారంలేదు. ఇలాంటిపరిస్థితులలో భారీపరిశ్రమలను ప్రోత్సహించడమంటే, వ్యక్తిగతపెట్టుబడులను, తరుచుగా విదేశీపెట్టుబడులను ప్రోత్సహించడమని అర్థం. భారతదేశంలో నిరుపయోగమౌతున్న మానవశక్తిని, వ్యర్థమౌతున్న కాలాన్నిచక్కగా వినియోగించుకుంటూ, ఉత్పత్తిని పెంపొందింపచేయడమొక్కటే మన లక్ష్యంకాదు; ఇలాగ ఉత్పత్తిని పెంపొందింపచేస్తూ, భారతీయులు తమ కాళ్ళపై తాము నిలబడేటట్లుచేయడమే మన ఆశయం. ఈమార్గంలో కాంగ్రెసు చాలావరకు విజయాన్ని సాధించింది.

ఈవిషయాన్ని మనం కేవలం సిద్ధాంతంగా భావించి, గాలిలోవిలబెట్టి ఆలోచించకూడదు; దేశంలోవున్న జీవితయథార్థాలకు, పరిస్థితులకు దీనిని అన్వయింపచేయాలి. మానవవిలువలను మనం నిర్లక్ష్యంచేయలేము; ప్రస్తుతం చైనాలో కుటీరపరిశ్రమలపట్ల ప్రత్యేకమైనశ్రద్ధ లేదు;

కాని కుటీరపరిశ్రమలను త్వరితగతిని అభివృద్ధిచేయడానికి, చైనావారిని తమదేశపరిస్థితులు బలవంతపెట్టాయి; మన గ్రామపరిశ్రమోద్యమంపట్ల వారికి అమితమైన ఆసక్తివుంది; మన నిపుణులను కొందరిని చైనాకు పంపించవలసినదిగా వారు నన్ను కోరారు; మన గ్రామపరిశ్రమలపద్ధతులను ఆకళించుకుందుకు, కొందరు చైనావారు మనదేశానికి వచ్చే అవకాశంవుంది.

కుటీరపరిశ్రమలు ప్రాచీనపద్ధతులమీద ఆధారపడకూడదని, ప్రొఫెసర్ సాహా చెబుతున్నారు. అలా అవి ఆధారపడివుండాలని ఎవరూ చెప్పరు. విజ్ఞానశాస్త్రం సాధించిన సరిక్రొత్తసాధనాలను, యిందుకు వినియోగించుకోవాలి. కాని ఇలాచేయడంలో ఈ సాధనాలు గ్రామీణ ప్రజలకు అందుబాటులోవుంటాయా వుండవా అన్నవిషయం దృష్టిలో పెట్టుకోవాలి. వారికి అందుబాటులోలేని సాధనాలను ప్రవేశపెట్టి, ప్రయోజనంపొందడం కష్టం. గ్రామంలో సులభంగా చౌకగా శక్తి లభిస్తున్నపుడు, దాన్ని పూర్తిగా సద్వినియోగంచేసుకోవాలి. కుటీరపరిశ్రమలకు సంబంధించిన ఆధునికయంత్రాలధరలు చుక్కలకంటుతున్నపుడు, లేదా వాటిని గ్రామంలో మరామత్తుచేయడం కష్టతరమౌతున్నపుడు, ప్రస్తుత పరిస్థితులలో అవి గ్రామస్తుల కంతగా ఉపకరించవు. పాతపద్ధతిలో వున్నాసరే, సామాన్యమైనయంత్రం అతనికి అందుబాటులోవుంటే అదే చాలును; తీరికవేళల్లో రాట్నంలాంటియంత్రంతో నూలువడుకుకుంటాడు. కనక, అసలు లేనిదానికన్న, ఏదోఒకటి వున్నట్లువుంటుంది. ఏమైనప్పటికీ, అన్నివిధాలా అందుబాటులోవుండే అనువైన యంత్రాన్ని గ్రామస్తునికి యివ్వాలి.

ప్రొఫెసరు సాహా ఈవిషయంలో జపానును ఉదహరించారు; కాని, ఈ ఉదాహరణ అంతగా ఆనందకరమైనదికాదు. అక్కడ కుటీరపరిశ్రమలు లేవు; పరిశ్రమలవికేంద్రీకరణమాత్రమే వుంది. భారీఎత్తున పారిశ్రామికవంతం కావాలనుకుంటున్నపుడు దానికిబదులుగా ఇది ఎంతవరకు తోడ్పడగలదో సందేహాస్పదం.

కీలకపరిశ్రమలు విదేశీయపెట్టుబడిదారుల దోపిడీదారుల చేతులలో వున్నట్లుగా, భారతదేశంలో కొందరు గమనించడంలేదని, ప్రొఫెసర్ సాహా ఊహిస్తున్నారు. దీనికి మన నాయకులు బాధ్యులన్నట్లుగా ఆయన వారిని దుయ్యబట్టుకుంటున్నారు. ఇది నిజంగా ఆశ్చర్యకరమైనవిషయం; భారతదేశంలో ఏమిజరుగుతున్నదో, ప్రొఫెసర్ సాహా గమనిస్తున్నట్లు తోచదు. ఇది పెద్దపరిశ్రమకు, చిన్నపరిశ్రమకు సంబంధించిన సమస్య కాదు; మనదేశంలో విదేశపెట్టుబడులు పెరగడం ఏ భారతీయుడూ హర్షించడు; అతని కిది అమిత విచారకరంగావుంటుంది. వీటిని అరికట్టడానికి నిరంతరప్రయత్నం కొనసాగుతూనేవుంది. పెద్దపెద్ద పారిశ్రామికుల—అందులో హెచ్చుమంది విదేశపారిశ్రామికులచేతిలో మన కాంగ్రెసుమంత్రులు కేవలం కీలుబొమ్మలని ఆయన సందర్భశుద్ధి లేకుండా చెబుతున్నారు; మన మంత్రులు కొన్నిపరిస్థితులవల్ల అనేక విధాల కీలుబొమ్మలుగా వున్నారన్నవిషయం నిజమే; తమకు తోచిన విధంగా ప్రవర్తించలేకపోతున్నమాట యథార్థమే; ఏ ప్రభుత్వమైనా నేడు పెట్టుబడిదారీ ఆర్థికవిధానానికి చాలావరకు కట్టుబడివుండిపోతోంది. అంతేకాని మన మంత్రులు మొగలాయీపాదుషాలవలె మన విదేశవ్యాపారాన్ని విదేశసాహసపరులచేతులలో పెడుతున్నారని ఘోరమైన నేరాన్ని చేస్తున్నారని అనడం వింతగావుంది. వింతగావుండడమేకాదు, భారతదేశ యిటీవలచరిత్రలోజరిగిన ఆర్థిక రాజకీయ సాంఘికసంఘటనల అజ్ఞానాన్ని ఈ ధోరణి వ్యక్తంచేస్తోంది.

ఈ సమస్య విస్తృతమైనది; నాకు తోచినరీతిని నేను ఒకటి రెండువిషయాలనుమాత్రం స్పృశించాను. ఈ సమస్యను జాగ్రత్తగా నిశితంగా పరిపూర్ణంగా పరిశీలించవలసివుంటుంది; కాని ప్రొఫెసర్ సాహా శాస్త్రీయదృక్పథానికి దూరంగా, దురభిమానాలకు ఆస్కారమిస్తూ దీనిని చర్చిస్తూ ఉత్తరంవ్రాశారు.

మీ విశ్వాసపాత్రుడు,

శ్రీ కృష్ణ కృపలానీ,
శాంతినికేతన్, బెంగాల్.

జవహర్‌లాల్ నెహ్రూ

275. సర్ స్టాఫర్డ్ క్రిప్సునద్దనుంచి

హౌస్ ఆఫ్ కామన్సు,
అక్టోబరు 11, 1939

నా ప్రియమైన నెహ్రూ,

మీవైపునుంచి యింకొంచెం వ్యవహారాలు పొత్తునపడేవరకు, నే నింతకాలం ఉత్తరం వ్రాయకుండా ఎదురుచూస్తూవచ్చాను. నే నెంత వరకు పాటుపడగలనో, అంతవరకు పాటుపడుతున్నాను; అపనిలోనే నిమగ్నుడనై వున్నాను. జట్లండును కలుసుకున్నాను; పరిస్థితి ఎంత తీవ్రమైనదో ఆయనకు బోధపరచడానికి ప్రయత్నించాను. మీరు కొన్ని అంశాలను ఆమోదించినట్లుగా కృష్ణద్వారా నాకు తెలిసింది; వాటిని, నాకుతోచిన మరికొన్నిసూచనలను ఆయనఎదుట వుంచాను. ఆయన వీటిని కేబుల్‌ద్వారా వైస్రాయ్‌కి తెలియచేస్తామని అన్నారు; అలా ఆయనచేశారనే అనుకుంటాను; కాని, ఇది, మీరు వైస్రాయినికలుసుకోక పూర్వం ఒకరోజుముందుగా జరిగింది. కాంగ్రెసు అనుసరిస్తున్నవిధా నానికి, యిక్కడ బాగా ప్రచారంలభిస్తున్నదని, అందులో మేము కృత కృత్యులమయామని, ప్రస్తుతపరిస్థితులలో దీని కింతటిప్రచారం లభించడం ఆశ్చర్యకరమని నే ననుకుంటున్నాను. కాని, సాధారణంగా ప్రజల అభి ప్రాయాలను హఠాత్తుగా తల్లక్రిందుచేయగలుగుతానని, ఏవ్యక్తీ భావించక పోవడం సహజం. సాధారణ అంతర్జాతీయపరిస్థితినిగురించి, యుద్ధపరిస్థి తినిగురించి చర్చించేటపుడు మంత్రివర్గసభ్యులఎదుట, మా భారతదేశ వైఖరిలో ద్యోతకమౌతున్న "ప్రజాస్వామికము: స్వాతంత్ర్యము" అనే వాదనలను ప్రతిపాదించడానికి నేను ప్రయత్నించాను. ఈవాదనలలో గర్భితమైవున్న అర్థాన్ని మంత్రివర్గసభ్యులు చక్కగా గమనించగలిగేరవి నా నమ్మకం; కాని, పరిణామంచెందుతున్న అసలుపరిస్థితిని వారు అవగాహనచేసుకున్నారో లేదో, నేను స్పష్టంగా చెప్పలేను; లేబరుపార్టీ— ఇప్పుడు నేను ఆ పార్టీసభ్యుడనుకానన్నవిషయం మీకు తెలుసును— చక్కని సహకారవైఖరిని అవలంబిస్తోంది; ప్రభుత్వంపై ఒత్తిడితీసుకు వస్తోంది. ఇక కొన్నిరోజులలో కామన్సుసభలో ఈవిషయం చర్చకు

వస్తుందని, యిందువల్ల దీనికి బహుళప్రచారం లభించగలదని నే నాశిస్తున్నాను.

ఏమైనప్పటికీ, ఎన్ని జరిగినా, ఈ ప్రభుత్వం యింతకంటె ఎక్కువ ఒరగబెడుతుందని ఆశించడం అర్థంలేనిదని, నేను గుర్తిస్తున్నాను. విన్‌స్టన్ చర్చిల్ ఒకవిషయాన్ని వాస్తవికదృక్పథంతో పరిశీలించేవ్యక్తి అయినప్పటికీ, ఆయనరావడంవల్ల, భారతదేశమిత్రులసంఖ్య పెరగలేదు; రష్యనుపరిస్థితులను ఆయన వాస్తవికదృక్పథంతో పరిశీలించడంవల్ల, ఆయన కీ ప్రత్యేకత సిద్ధించింది.

ఆచరణశూన్యమైన నిరర్థకవాగ్దానాలను అంగీకరించవద్దని, మిమ్మల్ని కాంగ్రెసును హెచ్చరించనవసరంలేదని నే నెరుగుదును. కాంగ్రెసు తన ఈప్సితాలు నెరవేరేవరకు పర్వతంవలె అచంచలంగా నిలబడుతుందని, అలాగ అది నిలబడడం బ్రిటిష్‌ప్రజలకు, భారతదేశప్రజలకు శ్రేయోదాయకమని నా విశ్వాసం. ఆచరణలో స్వాతంత్ర్యాన్ని ప్రజాస్వామ్యాన్ని ప్రసాదించడానికి ఒకసారి అంగీకరించినపుడు, స్వల్పవిషయాలలో అభిప్రాయభేదాలువస్తే, వాటిని సర్దుబాటుచేసుకుందుకు మీరు అంగీకరిస్తారని నాకు తెలుసును; కనుక, అభిప్రాయభేదాల కాస్కారమున్న చిన్నచిన్నవిషయాలను నేను పేర్కొనను. ప్రజాస్వామ్యాన్ని స్వాతంత్ర్యాన్ని యివ్వడానికి అంగీకరించనపుడు, మన ఉభయదేశాలప్రజలను ఐక్యంచేసే ఆశ కనిపించదు; ఇది ఒకటే పరిష్కారమార్గం. భారతదేశంలో తిరిగి దమననీతి ప్రయోగింపబడుతుందన్న భీతి మీవలె నాకూ వుంది.

యూరపులోనిపరిస్థితినిగురించి ఒకటిరెండువిషయాలను నేనుచెప్పదలుచుకున్నాను. ది ట్రిబ్యూన్ పత్రికలో నేనువ్రాసిన వ్యాసాలను మీరు చూశారని ఆశిస్తాను. నా భావాలు ఎటుపరిసరిస్తున్నాయో అవి మీకు తెలియచేస్తాయి; అయితే, సెన్సారునిబంధనలంటూ వున్నవనేవిషయం మీరు మర్చిపోకండి. సెన్సారువారు, నేనువ్రాసినవ్యాసాలను యింతవరకూ అంతగా కత్తిరించలేదు; కత్తిరించినవైనా అంత ముఖ్యమైనవికావు. కాని కొన్నికొన్నివిషయాలలో ఎంత స్వేచ్ఛగా వ్రాయాలనుకున్నా, యీ

యిబ్బందులవల్ల, అలాగ వ్రాయడానికి వీలుండదు. నేను యుద్ధానికి సహాయంచేస్తున్నాను కనక, ఈదేశానికి వ్యతిరేకంగా, జర్మన్ వైర్‌లెస్ ఉదహరించుకుందుకు వీలిచ్చేవిషయాలను నేను వ్రాయకూడదు॥

జర్మనీలో రష్యాలో నూత్నఉద్ధరణవల్ల పరిస్థితులలో మార్పుకలిగిందని స్పష్టపడుతోంది. ఫ్రెంచిప్రభుత్వం తనదేశంలోవున్న ప్రధాన రాజకీయపార్టీలలో నొకదానిని అణచివేయడం, ఇటలీపట్ల పోషణస్యాన్ని ప్రదర్శిస్తూ దాన్ని దగ్గరకుతీసుకోవడం, భారతదేశంపట్ల, వలస సమస్యలపట్ల మా ప్రభుత్వం యిటువంటివైఖరిని అవలంబించడం, ఇవన్నీచూస్తే, ఇటీవల దలాదియర్ చెప్పినట్లు, ఈ యుద్ధం ఆదర్శాల మధ్య జరుగుతున్నయుద్ధం కాదు. ఇలాగ అంగీకరించవలసివస్తున్నందుకు చాలా విచారంగావుంది; ప్రజాస్వామ్యంకోసం, స్వాతంత్ర్యంకోసం మేము యుద్ధంచేస్తున్నామని, కొందరు యింకా అనుకుంటున్నారు. కాని ఈ నెపంతో తనబ్రతుకుకోసం సామ్రాజ్యవాదం యిదివరకటిలాగే ఇప్పుడూ యుద్ధంచేస్తున్నదని యిప్పుడిప్పుడు తేటపడుతోంది. ఇది బ్రతుకుకోసం సాగుతున్నపోరాటం; జర్మనీవలె రష్యాకూడా మాకు వ్యతిరేకంగా వ్యూహంపన్నితే—యిది అసాధ్యంకాదు—ఈపోరాటం మరీ జటిలతరమౌతుంది. అందువల్ల భారతప్రజలతో సక్రమంగా వ్యవహరించడానికి మా శక్తివున్నంతవరకు, అన్నిఅధికారాలను వినియోగించి ప్రయత్నించాలని ఈ పరిస్థితులు మాకు బోధిస్తున్నాయి.

బ్రిటిష్‌ప్రభుత్వం, యిదివరకటికంటె యిప్పుడు యింకా ఎక్కువ విస్పష్టంగా నిర్దుష్టంగా, తన యుద్ధఆశయాలనుగురించి ఒకప్రకటన చేయాలి; ఇంతవరకూ నీటిమూటలుగావున్నమాటలను కట్టిపెట్టి, తాను వ్యక్తంచేసిన ఆశయాలను ఆచరణలో నిర్వర్తించాలి; వాటికి వాస్తవిక రూపాన్ని కలిగించాలి. అలాగ అది చేయనంతవరకూ, ఈ దేశంలో భిన్నభిన్నఅభిప్రాయాలు, అభిప్రాయభేదాలు విస్తృతంగా తలఎత్తక మానవు. ఇవి పొడచూపుతున్నలక్షణాలు యిప్పటికేగోచరిస్తున్నాయి; వీటిని అణచప్రయత్నించడం, అవి వ్యాప్తిచెందడానికే ఉపయోగపడుతుంది.

దురదృష్టవశాత్తూ, గత కొన్నిసంవత్సరాల రాజకీయపరిస్థితులు,

ఈ ప్రభుత్వాన్ని సుస్థిరంగావుంచడానికి దోహదపడ్డాయి; ప్రస్తుతం మార్పువస్తుందన్న ఆశలేదు; వాస్తవానికి అలాంటిమార్పు మాత్రమే ఈ లక్ష్యాలను నెరవేర్చగలుగుతుంది.

ప్రస్తుత నిరాశాపూరితవాతావరణంలో ఒకేఒక ఆశారేఖ కని పిస్తోంది; ప్రజలు, కరడుకట్టిన కొందరు టోరీలు, మా పాత నాగరికత పని అయిపోయిందని గుర్తిస్తున్నారు; స్వార్థప్రయోజనాలకు చివరకు తమప్రయోజనాలకు ఆస్కారంలేని, నూతననాగరికతను సృష్టించడానికి జరిగే ప్రయత్నంలో పాల్గొనడానికి వారు సంసిద్ధులౌతున్నారు. ఇది ప్రత్యేకమైన విశిష్టమైన మార్పు; మేము ఎందుకు యుద్ధంచేస్తున్నామో తెలుసుకుందుకు వారు తహతహలాడుతున్నారు; ప్రస్తుతం ప్రకటించ బడిన ఆశయాలకోసంమాత్రమే ఈ యుద్ధం కొనసాగుతున్నట్లయితే, అది యిక్కడా, భారతదేశంలోనూ నిస్సందేహంగా కొన్నికష్టాలను తెచ్చిపెడుతుంది. ఈ ఆశయాలు ప్రజలను సంతృప్తిపరచజాలవన్న భావం ప్రభుత్వానికి కలిగించడానికి నా శక్తివంచనలేకుండా నేను ప్రయత్నిస్తున్నాను; మంత్రివర్గసభ్యులకుసైతం కాస్తజాగృతికలిగిందని నే ననుకుంటున్నాను. అయితే, వచ్చినచిక్కేమిటంటే. ఈ జాగృతి ఆలస్యంగా, పరిస్థితి మనచేతుల్లోంచి జారిపోయినతరవాత కలుగుతూ వుంటుంది. ఇలాంటిస్థితి కలుగకుండా, కాంగ్రెస్ ముందే మేలుకొని, తనకోరికలు నెరవేరేవరకు, పర్వతంవలె అచంచలంగా నిలబడివుండా లని, అలాగ అది నిలబడినపుడు, ఈ ప్రభుత్వం శుష్కవాగ్దానాలను కట్టి పెట్టి, అస్పష్టమైనప్రకటనలనుచేయకుండా, ఏదోఒక చర్యతీసుకోవాలని మేం గట్టిగా ఒత్తిడిపెట్టడానికి వీలుకలుగుతుంది.

మీకు, కాంగ్రెసుకూ నా అభివందనాలు; మనం ఒకసారి కలుసు కుని చాలాసేపు మాట్లాడుకుంటే బాగుండును.

మీ,
స్టాఫర్డు క్రిప్స్

## 276. రోజర్ బాల్డ్విన్‌నద్దనుంచి

న్యూయార్కు-సిటీ,
అక్టోబరు 12, 1939.

ప్రియమైన జవహర్‌లాల్,

మీరురచించిన "గ్లిమ్సెస్ ఆఫ్ ది వరల్డుహిస్టరీఅనే ఆంగ్ల గ్రంథ ప్రతి నాకు అందింది. ప్రతిని పంపినందుకు మీకు నేనెంతో ఋణపడి వున్నాను. గ్రంథముద్రణ ఆకారాదులలో, పరిశోధనవిషయంలో, రచనా రీతిలో యిది మహత్తరమైనది; పరమోత్కృష్టంగావుంది. జైలులో మీ రొక్కరేవుంటూ, ఇతరసహాయంలేకుండా, అంతటి విపులమైన సమాచారాన్ని ఎలాగ సేకరించారో, అంత అద్భుతంగా ఎలాగ వ్రాయగలిగారో, నాకు నిజంగా ఆశ్చర్యకరంగావుంది. ఇలాంటిపనిచేయడానికి జీవితమల్లా సరిపోతుంది; కనుక నేను యిటువంటివాటి దరిదాపులకుపోడానికి భయపడుతూవుంటాను. గతఏడాది ప్రపంచాన్ని భయపెట్టినవిషయాన్నిగురించి, అమెరికాపై మీరు కాపించిన వ్యాఖ్యలను నే నమిత ఆసక్తితో చదివాను; మీ వ్యాఖ్యానాలతో నేను ఏకీభవిస్తున్నాను.

మనమంతా ఆ ఒడిదుడుకుల్లోనే వున్నామని, చరిత్రలో విధ్వంసకరమైన పరిణామాలమధ్య వున్నామని నేను భావిస్తున్నాను. వీటినుంచి బయటపడగలం కాని, ప్రపంచసమాఖ్య, నిరాయుధీకరణ, సుస్థిరశాంతి పరిస్థితులవైపు మనం పయనిస్తామని నే ననుకోవడంలేదు. ఇందువల్ల, నూత్న నిరంకుశప్రభుత్వాలు తలఎత్తుతాయని నా భావం. స్వభావరీత్యా నేను ఆశావాదిని; కాని, ఈరోజులలో జీవయాత్ర కొనసాగించడం కష్టతరంగావుంది. భారతదేశంలోకూడా పరిస్థితులు గడ్డుగావున్నాయని పత్రికలవల్ల నేను తెలుసుకున్నాను. మీ కాంగ్రెసుతీర్మానాలు, విభిన్నాభిప్రాయాలు, ఇక్కడ పత్రికలలో పూర్తిగా ప్రకటింపబడ్డాయి. ప్రత్యేకమైన మీ కార్యకలాపాలను విశేషంగా ప్రచురించాయి.

గౌరవాభివందనాలతో,

సదా, మీ మిత్రుడు,
రోజర్ బాల్డ్విన్.

## 277. రఘునందన్‌శరణ్‌వద్దనుంచి

ఢిల్లీ,

ఆంతరంగికము; రహస్యము అక్టోబరు 14, 1939

నా ప్రియమైన పండిట్‌జీ,

మీరు ఢిల్లీనుంచి వెళ్ళిన రెండురోజులతరువాత, నవాబ్‌జాదా నుంచి నాకు టెలిఫోన్‌వచ్చింది. ఆయన్ని నేను కలుసుకున్నాను. ప్రత్యేకించి మే మేవిషయాన్నీ చర్చించకపోయినప్పటికీ, మీరు జిన్నాతో జరిపినసంభాషణలు కొనసాగుతున్నాయో, లేదో తెలుసుకుందుకు, ఆయన అభిలషిస్తున్నట్లు నాకు బోధపడింది. హిందూ ముస్లింసమస్య పరిష్కరింపబడాలని హృదయపూర్వకంగా ఆయన వాంఛిస్తున్నారు.

నే నాయన్ని కలుసుకున్నతరువాత కొంతసేపటికి, సుభాస్ ఢిల్లీ వచ్చారు. రాగానే తనను వెంటనే కలుసుకోవలసిందిగా నాకు ఫోన్ చేశారు. ఆయన్ని నేను కలుసుకుని, మీ సమావేశాన్నిగురించి సాధ్యమైనంత స్పష్టంగా ఆయనకి తెలియచేశాను. స్టేట్స్‌మన్‌పత్రికలోపడిన వార్త ఎవరో కోరి వేయించారని, ఆయన దురభిప్రాయపడుతున్నట్లు కనిపించింది. అది సరికాదని నేను చెప్పాను. వైస్రాయిని కలుసుకునే ముందు, ఆయన జిన్నాను కలుసుకోలేకపోయారు. అందు కాయనకు వ్యవధిలేకపోయింది. వైస్రాయిభవనానికి వెళ్ళేముందు, తనను ఆయన కలుసుకోవాలని జిన్నా కోరినట్లు యిక్కడ నేను పేర్కొనవలసివుంది. వారిరువురు మధ్యాహ్నం కలుసుకున్నారు. కాంగ్రెసు హైకమాండు విశ్వాసంలేకపోవడంవల్ల ఒక ఒడంబడిక కుదరలేదని, ఈ వ్యవహారమంతా సుభాస్‌కు అప్పగించితే, ఒడంబడిక కుదరడానికి ఏవిధమైనకష్టమూ వుండదని ఆరాత్రి లాలా శంకరలాల్ నాతో చెప్పారు. ఈమాటను నేను నమ్మలేకపోయాను. కనుక అమర్నాడుప్రొద్దున్న సుభాస్‌ను కలుసుకున్నాను. రాత్రి లాలా శంకర్‌లాల్ ఏంచెప్పారో, యించుమించు సుభాస్ అదే చెప్పారు. అంచుమీదట ఆయన్ని నే నొక ప్రశ్నవేశాను. నెహ్రూఅనుయాయులను విశ్వసించినట్లుగానే, నెహ్రూనుసైతం జిన్నా

విశ్వసించడంలేదా? అని ప్రశ్నించాను. యీ ప్రశ్నకు ఆయన ఆశ్చర్య చకితుడయాడు. జిన్నాతో జరుపుతున్న వ్యక్తిగతసంప్రదింపులవల్ల ఒక ఒడంబడిక కుదిరినపుడు, దానిని తనఅనుయాయులు ఆమోదించేటట్లుగా నెహ్రూ చేయగలిగితే, ఆయన జిన్నాతో తనసంప్రదింపులను కొనసాగించవచ్చునని సుభాస్ సమాధానమిచ్చారు. జిన్నా మూర్తీభవించిన డాంబికపరుడని, ఆయనతో ఎలావ్యవహరించాలో తనఒక్కడికిమాత్రమే తెలుసునని ఆయన అన్నారు. అలాఅయినపుడు నెహ్రూ జిన్నాతో సంప్రదింపులు కొనసాగిస్తున్నపుడు, మీరు పాల్గొనవచ్చునని నే నాయనతో అన్నాను. కాంగ్రెసుకుసంబంధించినంతవరకు నామమాత్రుడుగనక తాను సంభాషణలలో చక్కగా పాల్గొనజాలనని ఆయన సమాధానం చెప్పారు. ఇది ఒక అవరోధమేమీకాదని నా అభిప్రాయం. ఏమైనప్పటికీ తాను జిన్నాను కలుసుకొనివచ్చినతరువాత, ఆసాయంకాలం నన్ను తనను కలుసుకోమని చెప్పారు. అలాగే నేను ఆయన్ను కలుసుకున్నాను. వర్కింగుకమిటీతరఫున రాయబారాలనునడపడానికి మీకు వర్కింగు కమిటీ లాంఛనప్రాయంగా అధికారమిచ్చినట్లయితే, మీతో చర్చలుకొనసాగించడానికి తన కెంతో సంతోషంగావుంటుందని జిన్నా చెప్పారట.

నిజంచెప్పాలంటే, సుభాస్ నాతోచెప్పినవిషయాలను నేను నమ్మలేకపోయాను. అందుకు తగినకారణం వుంది. జిన్నాతో మీరు జరిపినసంభాషణలు, ఆయనపై చాలా మంచిప్రభావాన్ని కలిగించాయని, సంప్రదింపుల్ని మళ్ళీకొనసాగిస్తే బాగుంటుందని ఆయన భావిస్తున్నారని కొందరుమిత్రులు నాతో అన్నారు. ఈమాట నిజమో, కాదో తేల్చుకుందుకు నేను యింకొకసారి నవాబ్‌జాదాను కలుసుకున్నాను. ఆయన చాలా ఉత్సాహంగా సంభాషిస్తూ, యీ శుభసమయంలో మననాయకులు అందుకనుగుణంగా వ్యవహరిస్తే, మన స్వాతంత్ర్యాన్ని మనం పొందడానికి చిక్కులేమీవుండవని, యీ తరుణాన్ని నాయకులు వినియోగించుకోవడంలో యిది ఆధారపడివుందని ఆయన అన్నారు. ఇంతకీ మత సమస్యలు ఏమంత దుర్ఘటమైనవికావు. ఆయనభావాలను నేను హర్షిస్తున్నానని, యోచనాపరులందరూ అలాగే హర్షిస్తారని ఆయనకు

చెప్పారు. జిన్నా, నెహ్రూలమధ్య అంత సంతోషంగా ప్రారంభమైన సంభాషణలు మధ్యలో ఎందుకు ఆగిపోయాయని, చక్కగా ఎందుకు సమాప్తంకాలేదని, నే నాయన్ని ప్రశ్నించాను. దీని కాయన కొంచెం ఆశ్చర్యంప్రకటించారు. ప్రధానసమస్యలనుగురించి జిన్నాతనఅభిప్రాయా లను తాను మీకు తెలియజేశారు కనుక, ఇక చెప్పవలసింది మీరేనని అంటున్నారు. జిన్నాసూచించిన ప్రాతిపదిక మీకు అంగీకారయోగ్య మౌనో కాదో మీరే నిర్ణయించుకోవాలి. జిన్నాకుసంబంధించినంతవరకు యీవిషయంలో చాలా ప్రసన్నమైన, స్నేహపూర్వకమైన మనస్తత్వంలో వున్నాడని, సాధ్యమైనంతవరకు వివాదాలను తప్పించుకొందుకు ప్రయత్నించగలడని ఆయన చెబుతున్నారు. ఈ సంప్రదింపులు కొన సాగించడానికి అందరిలోనూ మీరే తగినవారని, మిమ్మల్ని జిన్నా నిస్సందేహంగా ఆహ్వానించగలడని, ఆయన తెలియజేశారు. ప్రస్తుత కార్యక్రమాలననుసరించి జిన్నా, మరికొన్నిరోజులు ఢిల్లీలో వుంటారట. ఈ విషయంలో ఏంజరిగినా, ప్రభుత్వప్రకటనకుముందుగానే అది జర గాలి. జిన్నాతో సంభాషించడంవల్ల ఏమైనా ప్రయోజనముంటుందని మీరు భావిస్తే, దయచేసి మీ రా విషయం నాకు తెలియజేయండి. మీరు చెప్పినప్రకారం నేను చేస్తాను.

సుభాష్‌బాబు, జమియత్–ఉల్–ఉలేమా, ముస్తే–కిఫాయత్–ఉల్లా నాయకులను కలుసుకున్నారని తెలుసుకుందుకు మీకు బహుశా ఆసక్తి కరంగావుంటుందనుకుంటాను. ఫార్వర్డుబ్లాకును తాము బలపరచగలమని వాగ్దానమొనరించవలసినదిగా, ఆయన వారిని కోరారు. ఇకమీదట కాం గ్రెసు ఏమినిర్ణయించినా, దానితో సంబంధంలేకుండా, ప్రభుత్వంతో తాము పోరాడగలమని ఆయన స్పష్టంగా సూచించారు. బ్రిటిషుప్రభు త్వంతో ఎట్టి రాజీపడినా, దానితో తమ కెట్టిసంబంధంలేదని, ఆయన తెలియజేశారు. కాంగ్రెసు ఒకనిర్ణయానికి వచ్చేవరకు ఓర్మితో వేచి వుండవలసిందని ఆయనకు ముఫ్తీసాహెబు సలహాయిచ్చారు. తొందర పడడంవల్ల ప్రయోజనంలేదు. జాతీయసంస్థలన్నీ ఐక్యంగా నిలబడి,

కార్యాచరణకు పూనుకోవడం మంచిది. సుభాస్‌బాబు కొంచెం నిరాశతో తిరిగివచ్చేశారు.

మీరు ఉల్లాసంగావున్నారని భావిస్తాను.

గౌరవాభివందనాలతో,

మీ విశ్వాసపాత్రుడు,

నందన్

278. రఘునందన్ శరణ్ వద్దనుంచి

ఢిల్లీ,

అక్టోబరు 17, 1939.

నా ప్రియమైన పండిట్‌జీ,

మీ వుత్తరం అందినవెంటనే, నేను ఆయనతో సంబంధాలుపెట్టుకున్నాను. ఆయన నాకు ఫోనుచేస్తూ, జిన్నాకు నాతో మాట్లాడాలనివుందని తెలియపరిచారు. ఆప్రకారం నేను జిన్నాదగ్గరకు వెళ్ళాను. ఆయనతో యీవిషయం మాట్లాడాను. అక్కడనుంచి తిరిగివస్తూ వెంటనే మీకు జాబువ్రాస్తున్నాను.

ఆయన నన్ను ఎంతో మర్యాదతో, ఆర్ద్రహృదయంతో ఆహ్వానించారు. 1922వ సంవత్సరంలో నేను ఆయన్ని, ఆయనసతీమణిని తరచు కలుసుకుంటూవుండేవాడిని. ఆనాటి ఆవిషయాన్ని యిప్పుడు జ్ఞాపకంచేస్తూ, ఆయన ప్రసంగాని కుపక్రమించారు. మాయ మర్మం లేకుండా, చాలా ప్రీతితో ప్రసంగం కొనసాగించారు. ఆయ నెంతో ఉల్లాసంతో, ఉత్సాహంతోవున్నట్లు కనుపించింది. ప్రసంగం ప్రారంభిస్తూనే పుకార్లను, అబద్ధాలను నమ్మవద్దని మిమ్మల్ని హెచ్చరించవలసినదిగా నన్నుకోరారు. సుభాస్ లేదా అలాంటివ్యక్తులు చెప్పేమాటలను నమ్మవద్దని ఆయన తన ప్రసంగమధ్యలో మాటిమాటికి చెబుతూ వచ్చారు. వర్కింగుకమిటీసభ్యులలో తనకు నమ్మకంలేదని తా నెన్నడూ ఎవరితోను అనలేదని,అలాఅంటానని అనుకోవడం వూహించరానివిషయ

మని ఆయన చెప్పారు. పైపెచ్చు తనకు వారిపట్ల అత్యంతగౌరవభావం కలదని చెప్పారు. మీగురించి ప్రసంగిస్తూ మీరంటే తనకు అభిమానమే గాక మీవ్యక్తిత్వంపట్ల అమిత గౌరవంకలదని చెప్పారు. హిందూ ముస్లింసమస్యపట్ల తనవైఖరిని తాను వివరిస్తూ చెప్పవలసినదంతాచెప్పానని, యిక యేంచేయాలో మీరే సూచించాలని ఆయన అంటున్నారు. మీ సహచరులతో మీరుసంప్రదించి సంప్రదింపులుకొనసాగించవలసినదిగా ఆయన మిమ్మల్ని కోరినట్లుగా నాకు తెలియపర్చారు. వైస్రాయితో తన ఇంటర్వ్యూ ముగిసినతరువాత అవసరమైతే మీతోమాట్లాడడానికి తాను మిమ్మల్ని ఆహ్వానించగలనని మీకు చెప్పారట. మీ సహచరులతో మీరు ఆలోచించినతరువాత తనతో మీరు హిందూముస్లింసమస్యను గురించి సంప్రదింపులు కొనసాగిస్తారని ఆయన ఆశించారు. ఈవిషయం స్నేహపూర్వకధోరణిలో పరిష్కరింపబడకపోవడం చాలా విషాదకరమని ఆయన అన్నారు! మేము ఉత్తర, దక్షిణ ధృవాలవలె దూరదూరంగా లేమని, మేము దూరంగావున్నామనుకున్నంత దూరంగాలేమనీ, దగ్గరగానే వున్నామనీ ఆయన చెప్పుకువచ్చారు. మీతో సంభాషణలను పునఃప్రారంభించడానికి ఆయన సిద్ధంగావున్నారు. ఢిల్లీలో జిన్నా 22వతేదీవరకు వుంటారు. 22వ తేదీన యిక్కడే వర్కింగుకమిటీసమావేశాన్ని ఏర్పాటు చేశారు. సమావేశానంతరం ఆయ నెక్కడవుంటారో ఆయనకే సరిగా తెలియదు.

వైస్రాయిప్రకటన రేపుపొద్దుట వెలువడుతుందని ఒక పత్రికా విలేఖరి ఆయనకు తెలియజేశాడు. వైస్రాయిప్రకటనపట్ల జిన్నా హతాశుడయ్యాడని నేను భావించాను. ఆ ప్రకటన ఆయన్ని కలతపెట్టిందని చెప్పకతప్పదు. ఈసాయంకాలం నే నా ప్రకటన చదివి నిరాశ చెందాను. మనం అనుకున్నదానికంటే అది మరీ భ్రష్టంగావుంది. ఇంతకంటే అభివృద్ధినిరోధకంగా, హీనంగా యింకొకటేదీ వుండదు. ఇక జైలుకువెళ్ళడంతప్ప మరొక గత్యంతరంలేదనిపించింది.

ఒక ఒడంబడికకురావడానికి యిది తగినసమయమని నేను మీకు చెప్పకతప్పదు. జిన్నా యిప్పుడు సరియైనస్థితిలో వున్నాడు. ఆయన కొంక

ఉత్తరంవ్రాసి మీ రెండుకు సమావేశంకాకూడదు? మీరిద్దరూ ఏ ఒడంబడి కకుదుర్చినా అది యిటు కాంగ్రెసుకు, అటు ముస్లింలీగుకు ఆమోద కరంగావుంటుంది.

మీరు క్షేమంగా, ఉల్లాసంగా వున్నారనుకుంటున్నాను.

గౌరవాభివందనాలతో,

నందన్

పి. యస్—నేను రెండు ముఖ్యవిషయాలు వ్రాయడం మరచి పోయాను. సంపూర్ణస్వాతంత్ర్యంకావాలనే కాంగ్రెసుకోరికను, ముస్లిం లీగు బలపరచాలని, హిందువులు, ముస్లిములు అనే రెండుజాతులసిద్ధాం తాన్నీ, వారికి రెండుదేశాలుకావాలనేసిద్ధాంతాన్ని విడనాడాలని, నేను జిన్నాను కోరాను. ఇందు కాయన నిర్దిష్టంగా ప్రత్యుత్తరమేమీయివ్వలేదు. దీనికి భిన్నాభిప్రాయాన్ని ప్రకటించనూలేదు. దీన్ని త్రోసిపుచ్చనూలేదు. పైపెచ్చు మా సంభాషణ ఎంతో స్నేహపూర్వకంగా మధురాతిమధురంగా కొనసాగింది. ఆయన నాతోమాట్లాడినదాన్నిబట్టి ఒడంబడికకుదుర్చుకోవ డం ఏమీ కష్టంకాదని నే ననుకుంటున్నాను. ముస్లింలీగులోవున్న ప్రముఖులందరికంటే, ఆయన అన్నివిధాల అధికు డనడానికి నా కేమాత్రం సందేహంలేదు. ఆయనతో మాట్లాడినంతసేపూ నే నొక శక్తిస్తోమతు లున్నవ్యక్తితో మాట్లాడుతున్నట్లు నా కనిపించింది. మన అభిప్రాయా లను అతనికి నచ్చచెప్పగలిగినపుడు, అంతకంటే నమ్మదగిన, ఆధార పడదగిన వ్యక్తి యింకొకడుండడు. యిది నాకు ఆయనముగురించి ఏర్ప డిన అభిప్రాయం.

ఈ ఉత్తర్వం మనిషిద్వారా మీకు పంపిస్తున్నాను. అతనిద్వారా మీ జవాబు పంపించండి. జిన్నాకు మీరేమైనా కబురు పంపదలుచుకుంటే, ఆ ఉత్తరంకూడా ఈ వ్యక్తిచేతి కివ్వండి. అది జిన్నాకు వెంటనే మనిషిద్వారా పంపిస్తాను.

గౌరవంతో,
నందన్.

## 279. ఎమ్. ఎ. జిన్నాకు

లక్నో,

ఆంతరంగికము　　　　　　　　　　　　　　　అక్టోబరు 18, 1939.

నా ప్రియమైన జిన్నా,

నందా, నిన్న మీతో జరిపిన సమావేశంగురించి, సంభాషణలను గురించి నాకు ఉత్తరం వ్రాశారు. నేను మళ్ళీ మిమ్మల్ని ఢిల్లీలో కలుస్తానని మీరూ, మీరు నన్ను ఫోనుద్వారా పిలుస్తారని నేనూ పొరపాటున భావించాం; అలాంటి పొరపాటు పొడచూపినందుకు నాకు విచారంగా వుంది. మిమ్మల్ని మళ్ళీ కలుసుకోవాలని నేను నిజానికి, ఎదురుచూస్తూనే వున్నాను; మీవద్దనుంచి కబురువస్తుందని ఆశిస్తూనేవున్నాను. అవును; నిజమే; ఈ కబురు వైస్రాయిసంభాషణలకుసంబంధించి రాదగినది. మనం స్థూలంగా యితరవిషయాలనుగురించి సంభాషించుకున్నాం; విషయాన్ని సాకల్యంగా చర్చించేఅవకాశం లభించాలని నేను వాంఛిస్తున్నాను.

మిమ్మల్ని నేను సంతోషపూర్వకంగా తిరిగి ఒకసారి కలుసుకుంటాను. నాకు వ్యవధివున్నట్లయితే, ఇప్పుడే ఆపనిచేసేవాడిని. కాని రేపు అలహాబాదు వెళ్ళి, అక్కడ కొన్నిగంటలపాటు ఆగి, అక్కడనుంచి వార్ధాకు బయలుదేరవలసివుంది; వార్ధాలో వర్కింగుకమిటీసమావేశం జరుగనున్నది. కనుక, యిప్పుడు మిమ్మల్ని కలుసుకునేందుకు వ్యవధి వుండదేమోనని సంకోచిస్తున్నాను. మీరుకూడా, కొన్నిరోజులవరకు పని తొందరలోనే వుంటారనుకుంటాను. వైస్రాయిప్రకటన వెలువడినతరువాత, పరిస్థితులు త్వరితగతిని పరిణామంచెందుతాయి; భవిష్యత్‌పధకం ఎలాగవుండాలో ఇప్పట్నుంచే ఊహించడం సులభంకాదు. కాని వార్ధా సమావేశానంతరం, మీకు వీలైనచోట, బొంబాయిలోనో, ఢిల్లీలోనో మిమ్మల్ని కలుసుకునేందుకు సకలప్రయత్నాలుచేస్తాను. త్వరలో బొంబాయివెళ్ళేటట్లయితే, వార్ధానుంచి సరాసరి నేనూ అక్కడకు చేరుకుంటాను. లేదా ఢిల్లీకి వస్తాను.

హిందూముస్లింసమస్య స్నేహపూర్వకంగా యింతవరకు పరిష్క-

రింపబడకపోవడం విషాదకరమన్న మీ అభిప్రాయంతో పూర్తిగా నే నేకీభవిస్తున్నాను. దీనినిగురించి నే నమితంగా కలవరపడుతున్నాను; ఈ సమస్యాపరిష్కారానికి చెప్పుకోతగిన కృషి చేయజాలనందుకు సిగ్గిల్లుతున్నాను. ఈవిషయంలో నామీద నాకే విశ్వాసం సడలిపోయిందని నేను మీకు చెప్పకతప్పదు; గత రెండుమూడుసంవత్సరాలప్రభావం నామీద ఎంతగానో పనిచేసింది. నా మనస్సు అన్యథా లగ్నమైవుంది; ఇతరకార్య కలాపాలలో నేను నిమగ్నుడనై పోయాను. అందువల్ల ఈసమస్యను నే నెంతో దీర్ఘంగా ఆలోచించినప్పటికీ, దానిఅంతరార్థాలను అవగతంచేసుకోగలిగినప్పటికీ, దీనికి నేను దూరస్థుడననేభావం నాలో వ్యాపించింది. కనుకనే నా కీ సంకోచం.

కాని, పరిష్కారమార్గాన్ని కనుగొనేటందుకు నేనుకావించే ప్రయత్నాలకు యిదేమీ అడ్డురాదు; పరిష్కారాన్ని రూపొందించడానికి నే నన్నిప్రయత్నాలూ చేస్తాను. ముస్లింలీగ్‌లో మీకుగలస్థానాన్నిబట్టి మీ సుహృద్భావాన్నిబట్టి పరిష్కారంకుదరడం, అందరూ అనుకుంటున్నట్లుగా, అంత కష్టంకాదు. వర్కింగుకమిటీసభ్యులందరూ పరిష్కారం కుదరాలని మనసారా వాంఛిస్తున్నారని, కుదుర్చుకోవాలని కోరుతున్నారని, నేను మీకు నమ్మకంగా చెబుతున్నాను. ఈ ప్రయత్నంలో మన మింత వరకూ విఫలంకావడం, న న్నమిత ఆశ్చర్యచకితుణ్ణి కావించింది. ఇందుకు నేను చాలా విచారపడుతున్నాను. ఇంతకీ, వివాదగ్రస్తవిషయాలు సులువుగా సరిపుచ్చుకుందుకు అనువుగానేవున్నాయి; అవి అలాగ వుండాలికూడాను.

వార్ధాసమావేశానంతరం సాధ్యమైనంతత్వరలో మిమ్మల్ని కలియడానికి నేను ప్రయత్నిస్తాను. మీ కార్యక్రమ మేమిటో మీరు దయవుంచి నాకు తెల్పుతారా? మిమ్మల్ని కలుసుకున్నపుడు అన్నిదృక్కోణాల నుంచి ఈ సమస్యను మీతో నేను చర్చిస్తాను. కాని, తరువాతదశలో ముస్లింలీగుప్రతినిధులు కొందరు కాంగ్రెసుప్రతినిధులను కలుసుకుంటే యుక్తంగావుంటుందని అనుకుంటాను.

ప్రస్తుతం నా మనస్సు శీఘ్రగతిని సంభవిస్తున్న పరిణామాలపట్ల

నిమగ్నమైవుంది. ఈ పరిణామాలు కొన్నివారాలలో మనల్ని ఎటుతీసుకు వెడతాయో తెలియడంలేదు. సామ్రాజ్యవాద అహంకారపూరితమైన వైస్రాయిపత్రికటన, మనలనందర్నీ సవాల్ చేస్తోంది. ఇది మనలకందరికీ ఆశ్చర్యకరంగానే వుంది. నాకు తెలిసినంతవరకు, వైస్రాయిసూచనల నన్నిటిని పూర్తిగా తిరస్కరించడం వినా, కాంగ్రెసు కింకొక గత్యం తరంలేదు. ఈ తిరస్కరణ మాకేకాక ఇతరులకుసైతం కొన్నిఫలితాలను తెచ్చిపెడుతుంది. మీరూ, ముస్లింలీగులోని మీ అనుయాయులు ఏమినిర్ణ యించుకున్నారో నాకు తెలియదు; కాని, మీరుకూడా వైస్రాయిప్రకటన పట్ల తీవ్రనిరసనను వెలిబుచ్చి తిరస్కరిస్తారని, ఆయనసూచించిన పద్ధతులప్రకారం సహకరించడానికి విముఖత ప్రకటిస్తారని, నేను దృఢంగా విశ్వసిస్తున్నాను. భారతీయులముగా మనకున్న ఆత్మగౌరవాన్ని పొందాత నాన్ని బ్రిటిష్‌ప్రభుత్వం కించపరిచిందని, న్యూనతపరిచిందని నేను భావిస్తున్నాను. తమ చిత్తమొచ్చినట్లు అధికారం చలాయించవచ్చునని, మనం తమ పద్ధతులనుపట్టుకువ్రేలాడుతూ, తమ చెప్పుచేతల్లో మసలే మనుష్యులమనీ పాపం! వారు భావిస్తున్నారు.

లక్నోనుంచి వెలువడే నేషనల్ హెరాల్డును మీరు చదువుతున్నారో లేదో నాకు తెలియదు. నేనువ్రాసినవ్యాసమొకటి అందులో ఇవాళఉదయం ప్రకటింపబడింది. రేపుఉదయం ఇంకొకవ్యాసం వెలువడనున్నది. వైస్రాయిప్రకటనపట్ల ఆత్మసంయమముచేసుకొని, నేను నా అభి ప్రాయాలను ఈ వ్యాసాలలో వ్యక్తపరిచాను. ఆ వ్యాసాలను ఇందుతో పాటు మీకు పంపిస్తున్నాను.

రేపు లక్ష్మివారం 19వతేదీ ఉదయం, మీకు ఫోనుచేయడానికి ప్రయత్నిస్తాను. 20వతేదీన అల్లాహాబాద్ చేరుకుంటాను; 21వతేదీనుంచి వార్ధాలో వుంటాను. ఇదీ నా కార్యక్రమం.

ఆనాడు ఢిల్లీలో మిమ్మల్నికలుసుకున్నప్పుడు నా కెంత ఆనం దంగావుందో వేరే మీకు చెప్పనక్కరలేదుకదా!

ఎమ్. ఏ. జిన్నా ఎస్క్వైర్,
న్యూ ఢిల్లీ.

మీ విశ్వాసపాత్రుడు,
జవహర్‌లాల్ నెహ్రూ

280. మహాత్మా గాంధీనద్దనుంచి

సేవాగ్రాం, వార్ధా,
అక్టోబరు 26, 1939

నా ప్రియమైన జవహర్‌లాల్,

నీకు నామీదవుండే గౌరవ ప్రేమాభిమానాలు ఏమాత్రం సడలక పోయినప్పటికి, మనమధ్యగల అభిప్రాయభేదాలు రానురాను విపరీతంగా పెరిగిపోతున్నాయి. మన దేశచరిత్రలో బహుశా, యిది అత్యంత క్లిష్ట మైనదశఅని అనుకుంటాను. మనదృష్టిని ఆకర్షిస్తున్న ప్రప్రధానసమ స్యలు కొన్నింటిపట్ల నేను చాలా దృఢమైనఅభిప్రాయాలను కలిగి వున్నాను. వాటిపట్ల నీకూ నిశ్చితాభిప్రాయాలువున్నవనీ, అయితే అవి నా అభిప్రాయాలకు భిన్నమైనవనీ నే నెరుగుదును. నీ భావవ్యక్తీకరణ విధానం నాదానికంటె విభిన్నమైనది. నా నిశ్చితాభిప్రాయాలవైపుకు యితరసభ్యులదృష్టిని మరల్చి, వారిని నాతోపాటు తీసుకువెళ్ళగలుగు తున్నానో లేదో నాకు స్పష్టంగా తెలియదు. నే నెక్కడికీ కదలలేని స్థితిలో వున్నాను. ప్రజలతో ఆఖరికి కాంగ్రెసుకార్యకర్తలతోపైతం ప్రత్యక్షసంబంధంపెట్టుకోలేకపోతున్నాను. మీ అందరిని నాతోపాటు ముందుకుతీసుకువెళ్ళలేనపుడు, నే నిక నాయకత్వంవహించకూడదని భావిస్తున్నాను. వర్కింగుకమిటీసభ్యులలో భిన్నాభిప్రాయాలు, భిన్నభిన్న సలహాలు వుండగూడదు. నా భావాలను నేను స్వేచ్ఛగా ప్రకటించేందుకు న న్నొదిలిపెట్టి, నీవు బాధ్యతనంతా స్వీకరించి దేశానికి నాయకత్వం వహించాలని నే నభిప్రాయపడుతున్నాను. కాని, నేను నా అభిప్రాయాలు ప్రకటించకుండా మౌనంగావుండాలని, మీరందరూ భావించినట్లయితే, అలావుండడం కష్టంకాదని నే ననుకుంటాను. విషయాలన్నింటిని చర్చించడానికి యిక్కడకు రావడం నీకు వుచితమనితోస్తే, సు వ్వలాగ చేయవచ్చును.

ప్రేమతో,
బాపూ

281. మహాత్మా గాంధీవద్దనుంచి

రైల్వేస్టేషన్, ఢిల్లీ,
నవంబరు 4, 1939

నా ప్రియమైన జవహర్‌లాల్,

ను వ్వలాగ వెళ్ళడంతోటే, కృపలానీ నన్ను కలిసి, యు. పి.లో శాసనోల్లంఘనానికి అన్నిప్రయత్నాలూ కొనసాగుతున్నాయని, అక్కడి పరిస్థితులు గడబిడగా వున్నాయని నాతో చెప్పారు. టెలిఫోనుతీగలు త్రెంచమని, రైలుపట్టాలు తొలగించమని ప్రజలనుకోరుతూ ఎవరెవరో అట్టలను అంతటా తగిలిస్తున్నారని ఆయన తెలియజేశారు. శాసనోల్లంఘనానికి ప్రస్తుతవాతావరణం అనుకూలంగాలేదని నా అభిప్రాయం. ప్రజలు న్యాయచట్టాలు తమచేతిలోవున్నట్లుగా భావించి ప్రవర్తించినట్లయితే, నేను శాసనోల్లంఘనోద్యమ నాయకత్వాన్ని విరమించుకోవలసివుంటుంది. ఈవారం 'హరిజన్'పత్రికను నువ్వొకసారి చదవాలని నా కోరిక. ఈ సందర్భంలో నా అభిప్రాయాలు ఎలావున్నాయో అది తెలియజేస్తుంది. ఈవిషయమే నీతో చర్చించాలని నే ననుకున్నాను. కాని, అది పడిందిగాదు. ప్రస్తుత క్లిష్టసమయంలో మనమధ్య అపార్థాలు పొడచూపకూడదు. వీలైనంతవరకు, మనం ఒకేభావంతో వ్యవహరించుకోవాలి.

ప్రేమతో
బాపు.

282. చూ—చియా—హ్యా

కొమింగ్‌టాంగ్ కేంద్ర కార్యనిర్వాహకకమిటీ,
చుంకింగ్,
నవంబరు 11, 1939

శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ,
స్వరాజ్యభవనం,
అల్లాహాబాద్, ఇండియా.

ప్రియమైన శ్రీ నెహ్రూ,

భారతదేశానికి సురక్షితంగా చేరినట్లు, కొన్నాళ్ళక్రితం మీరు నా కిచ్చిన టెలిగ్రాంకు చాలా సంతోషం. యుద్ధపరిస్థితుల్లో మీ రిక్కడికి

రావడం, చైనా ప్రజలు సదా జ్ఞాపకంపెట్టుకుంటారు. మీ రాక వారిహృదయంపై గాఢమైన ముద్రనువేసింది.

మీ రిక్కడికివచ్చినపుడు, చైనా భారతదేశాలస్నేహసంబంధాలను పెంపొందించుకునేందుకు కొన్నిసూచనలు చేశారు. ఆసూచనలు ఎంతో విపులమైనవీ, సమగ్రమైనవీ. అందుకు నే నెంతో ఆనందిస్తున్నాను; మిమ్మల్ని శ్లాఘిస్తున్నాను. చైనా భారతదేశాలమధ్య సహకారభావం పెంపొందడానికి జనరల్ జంగ్-కై-షేక్ సలహాలపై నే నొకప్రణాళికను రచిస్తూ మీ సూచనలను అందులో పొందుపరిచాను. నా ప్రణాళికలో పొందుపరచబడినవిషయాలు ఆమోదింపబడ్డాయి. అవి వేరే ఆచరణలోకి వస్తాయి. అందులో ముఖ్యమైనవిషయాలను మీకు తెలియజేస్తున్నాను.

1) వివిధ విశ్వవిద్యాలయాల్లో ఈ రెండుదేశాలవారూ పరస్పరం ఆచార్యపీఠాలను నెలకొల్పడం.

2) ఒకదేశంవారు తమవిద్యార్థులను యింకొకదేశానికి అధ్యయనార్థం పంపించుకోవడం.

3) చైనాభాషలో, లేదా హిందూస్తానీలో పుస్తకాలను ప్రచురించడం, అనువదింపజేసుకోవడం.

4) సెంట్రల్ న్యూస్‌ఏజన్సీ శాఖ నొకదానిని కలకత్తాలో నెలకొల్పడం, బొంబాయిలో దానిఉపశాఖాకార్యాలయాన్ని స్థాపించడం.

5) ఒకరిదేశానికి యింకొకరు పర్యవేక్షణకై పరిశీలకులను, లేదా యాత్రాదళాలను పంపించుకోవడం. పర్యవేక్షకనిపుణులను మార్చుకోవడం, స్నేహసంబంధాలను నెలకొల్పుకోవడం, ఈ శీర్షికక్రింద యిక్కింద పేర్కొనబడిన కార్యక్రమాలు నిర్వహింపబడతాయి. ముందు చైనా చేయబోయేపనినిగురించి చెబుతాను.

1) బౌద్ధభిక్షుకులను చైనా భారతదేశానికి పంపుతుంది.

2) భారతదేశంలో వస్త్రపరిశ్రమ, ప్రత్తిసహకారసంఘాలు, యితర పారిశ్రామికపరిస్థితులు పరిశీలించడానికి నిపుణులను పంపడం.

భారతదేశ పారిశ్రామికదారులను, వ్యవసాయదారులను ఈ నిపుణులు కలుసుకుంటారు, ఒకరిఅభిప్రాయాలను ఒకరు అవగాహనచేసుకుంటారు.

3) శాస్త్రీయపద్ధతులను అవగాహనచేసుకునేందుకు, ఆకళించుకునేందుకు పరిశీలకనిపుణులబృందాలను పంపిస్తూ ఒకసంఘాన్ని ఏర్పాటు చేయడం.

ఇంతేకాక, మేము మా ప్రతినిధిని ఈసంవత్సరం జరుగబోతున్న అఖిలభారత కాంగ్రెసుమహాసభకు పంపిస్తాం.

నా హృదయపూర్వకఅభివందనాలతో, అత్యధికగౌరవంతో,

మీ విధేయుడు,

చూ-చియా-హ్వా

283. మహాత్మా గాంధీవద్దనుంచి

సేవాగ్రాం, వార్ధా

నవంబరు 14, 1939.

నా ప్రియమైన జవహర్‌లాల్,

నీ వుత్తరాలు సరిగా అందుతూనేవున్నాయి. రాజన్‌బాబుకు నువ్వు వ్రాసినఉత్తరం నేను చూశాను. దానిని చూడకమునుపు 'హరిజన్'లో దానినిగురించి ఒక నోట్ వ్రాశాను. పత్రికవెలువడకపూర్వమే నీ కొక కాపీ పంపడానికి ప్రయత్నిస్తాను.

అల్లాబాద్‌లో నే నెక్కువకాలం వుండడం నీ కవసరమైతే, అలాగే నే నక్కడ వుంటాను.

మనప్రకటనలను సంస్కరించి, లండన్‌పత్రికలు ప్రకటించినందుకు నే నేమీ కలతపడడంలేదు. నాకు వ్యవధివుంటే సంక్షిప్తంగా ఒకసందేశాన్ని తయారుచేసి 'న్యూస్‌క్రానికల్' పత్రికకు పంపిస్తాను. నా వ్యాసాలకు యిదివరకే పారితోషికం చెల్లించారు కనుక, అలా పంపించేఅధికారం నాకుంది.

మనం కలుసుకున్నప్పుడు సాకల్యంగా అన్నీ ముచ్చటించుకో వచ్చును.

ప్రేమతో,
బాపు.

నేటితో నీకు యాభై ఏళ్ళు నిండినవని యిప్పుడే నాకు మహదేవ్ జ్ఞాపకంచేశాడు. యింకొక యాభై సంవత్సరాలు నువ్వు పూర్తిచేస్తావని, యిదే తేజస్సుతో, విశ్వాసంతో, ఉల్లాసంతో శతాయువువై వర్థిల్లాలని కోరుతున్నాను.

284. మహాదేవదేశాయ్ వద్దనుంచి,

సేవాగ్రాం,వార్ధా,
నవంబరు 14, 1939

నా ప్రియమైన జవ్హారుభాయి,

పదిహేడుసంవత్సరాలక్రితం మేము లక్నోజిల్లాజైల్లో మీ జన్మ దినోత్సవాన్ని జరుపుకున్నాం. మీ రింతటి ఉన్నతశిఖరాల నందుకోగల రని ఆనాడు మీరు భావించారో లేదో నాకు తెలియదు. ఆత్మసంబంధమైన, మేధోసంబంధమైన పురోగతిని మీ రెంతవరకు సాధించారో చెప్పడానికి గణితశాస్త్రం అక్కరకువచ్చినట్లయితే మీరుసాధించినవిజయాన్ని బీజ గణితంలోగాక, రేఖాగణితంలో చెప్పవలసివుంటుంది. రేపటితో ప్రారంభ మౌతున్న మీ అర్థశతాబ్దపుజీవితంలోకూడా యిదేవిధంగా అద్భుతమైన పురోగతిని మీరు సాధించాలనీ, మీరు చేరుకొన్న మహోన్నతశిఖరాలను అందుకోలేకపోయినప్పటికీ, మీకుగల ఉదారమానవలక్షణాలు మావంటి వారిని సన్నిహితులను, సమతుల్యులను చేయగలవని నే నాశిస్తున్నాను.

"ఏమి పొల్లుమాటలు" అని మీరు వీటిపట్ల చికాకుపడుతూ ఆశ్చ ర్యాన్ని ప్రకటించవచ్చును; కాని, దేశానికి అతిపవిత్రమైనరోజుగా భావించబడుతున్న యీసమయంలో నాకుకలిగిన భావాలను వ్యక్తంచేయ డానికి నేను చిత్తశుద్ధితో ప్రయత్నిస్తున్నాను.

ప్రేమతో,
మహదేవ్

285. సరోజినీనాయుడువద్దనుంచి

హైద్రాబాద్, దక్కన్
దీపావళి, 1939.

ప్రియమైన నా జవహర్,

అర్ధశతాబ్దపు నీ జీవితం అప్పుడే ఒక పాటవలె, అద్భుతమైన ఒక కథవలె గడిచి, చరిత్రకెక్కింది. మిగిలిన అర్ధశతాబ్దపు తొలిసంవత్సరాల్లోనే నీ మధురమైన స్వప్నాలు, మహత్తరమైన లక్ష్యాలు ఫలించి మానవపురోగమనచరిత్రలో అమరత్వాన్ని ప్రసాదించి, నిన్ను దివ్యమానవునిగా, స్వాతంత్ర్యప్రదాతగా చేయునుగాక!

ఏదో లాంఛనప్రాయంగా, సంప్రదాయాన్ననుసరించి నీకు నా అభివందనాలను అందజేయలేను. సామాన్యమానవులకు సాధారణంగా విధులవలెవుండే వ్యక్తిగతసుఖము, ఆనందమూ, సదుపాయము, విశ్రాంతి, సంపదలు యిలాంటివాటికి నీ జీవితంలో అట్టే స్థానంవుంటుందని నే ననుకోను.... విచారం, బాధ, త్యాగం, వేదన, పోరాటం.... అవును, యివి నీకు జన్మతఃవచ్చిన నీ జీవితవరాలు. ఎలాగైనాసరే, వాటిని నువ్వు విజయంగా, స్వాతంత్ర్యంగా మార్చగలవు. నువ్వు అనేకమంది ప్రజలలో కారణజన్ముడవైన, విశిష్టమైన వ్యక్తివి. గాఢంగా ప్రేమింపబడిన, ఏమాత్రం అర్థంచేసుకోబడని పురుషుడవు. ఘూర్ణిల్లుతున్న నీ ఆత్మ తన ఆదర్శాన్ని తాను చేరుకుని, తేజోవంతమై, సౌందర్యంతో విరాజిల్లుగాక!

యివే నీ కవిసోదరి, నీ సహయాత్రికురాలు దీవించే దీవెనలు.

సరోజినీనాయుడు.

నేను 17వతారీఖున ఆగ్రాలో వుంటాను. 19తేదీ తెల్లవారుఝామున 2-32 నిముషాలకు పవిత్రమైన ప్రయాగలో వుంటాను.

286. అసఫాలీకి,

అల్లాహాబాద్,
నవంబరు 16, 1939.

నా ప్రియమైన అసఫాలీ,

మీరు 14వతేదీన వ్రాసినఉత్తరం అందింది. యుద్ధంలో, యిక ముందు ఎటువంటిసంఘటనలు జరుగుతాయో వూహించడం కష్టం. కాని ఒకవిషయంమాత్రం నాకు స్పష్టంగా కనిస్తోంది. ఏకూటమైనా అది సోవియట్‌వ్యతిరేకకూటమైనా మరిఏదైనా అట్టేకాలం మనజాలదు. యూరపులో వారు పరిస్థితులన్నిటినీ తల్లక్రిందులుచేశారు. వీటిని మళ్ళీ చక్కబరచడం చాలా కష్టం. భారతదేశంలో యుద్ధానికిపూర్వంవున్న పరిస్థితులకు దిగజారిపోవడమంటూ యిక జరగదు. వెనుకటినిబంధనలపై కాంగ్రెసు ఎన్నటికీ రాష్ట్రప్రభుత్వాలను నెలకొల్పబోదు.

మతసమస్యపై జిన్నాతోజరిపిన సంభాషణలనుగురించి మీ రేమి వూహిస్తున్నారో నాకుతెలియదు. జిన్నావద్దనుంచి సమాచారం అందేవరకు నేను వేచివుంటానని ఆయనతో చెప్పాను. జిన్నాకు మనకు మధ్య మతసంబంధమైన పరిష్కారానికి అవరోధం అంతగాలేదు. ఉన్నచిక్కల్లా రాజకీయంగానే వుంది. రాజకీయంగా కాంగ్రెసు ఎట్టి చర్యతీసుకున్నా, దానితో అతను పొత్తుగావుండడు. అందువల్ల మతసమస్య రాజకీయచర్యకు గడంగవచ్చునని అనుకోవడం, ప్రధాన వాస్తవికవిషయాన్ని విర్లక్ష్యం చేయడమే అవుతుంది. అంటే, దాని అర్థం హిందువులు, ముస్లింలు సమష్టిచర్యకు పూనుకొనజాలరనికాదు. వారు అలా పూనుకోగలరనీ, పూనుకుంటారనీ నే ననుకుంటాను. కాని, ప్రస్తుతసమయంలో అది ఎట్టి మతసమస్యమీదా ఆధారపడిలేదు.

మీ విశ్వాసపాత్రుడు,
జవహర్‌లాల్

అసఫాలీ ఎస్క్వైర్. ఎమ్. ఎల్. ఎ.,
కూచా—చలన్
ఢిల్లీ.

## 287. ఎడ్వర్డ్ థామ్సన్ వద్దనుంచి

ఐల్స్‌బరీ, బక్స్,
డిసెంబరు 3, 1939.

ప్రియమైన జవహర్‌లాల్,

మీరు నన్ను కొద్దిగా అపార్థంచేసుకున్నారు. కౌన్సిల్లో వుద్యోగం దొరకడం ఒక అదృష్టంగా నే నెన్నడూ భావించలేదు. పదవిని, బిరుదును తలకొొకకిరీటంగా నే నెన్నడూ భావించనని మీరు తెలుసుకోవలసి వుంటుంది. ప్రస్తుతం ఒకప్రక్కకు తూగివున్న సైన్యాలను సమస్థితికి తెచ్చే అవకాశం లభించినదని మాత్రమే నేను చెప్పాను.

ప్రస్తుతం అస్తవ్యస్తంగావున్న సైనికపరిస్థితులు చక్కబడేవరకు భారతదేశాన్ని స్వతంత్రదేశంగా ప్రకటించాలని, నేను కోరడం అసాధ్యమని యింకా భావిస్తూనేవున్నాను. అదలావుండగా, బ్రిటిషసామ్రాజ్యం సమానఅర్హతలుగల దేశాలకూటమిగా రూపొందుతుందని నే నింకా పూర్వంలాగే కలలుకంటున్నాను. ఇది మీకు మూర్ఖంగా కనిపించవచ్చును. కాని, నాతోపాటుగా మీరు నా సహపౌరునిగా నేను భావిస్తున్నాను. ఏమైనప్పటికి, పంజాబును సైనికుల అజమాయిషీక్రింద మీరు వదిలిపెట్టగూడదని, అస్తవ్యస్తంగావున్నపరిస్థితులను సరిదిద్దాలని నా అభిప్రాయం.

కాని,యిది మనిద్దరిమధ్య చాలా స్వల్పవిషయం. మనం పరిగణింపవలసినవిషయాలవైపు దృష్టి మరల్చుదాం—

ఇందిరను చూశాను. ఆవిడ కులాసాగానే వున్నారు. ఆమె సౌష్టవంగాలేదు. సుకుమారంగా పెరిగినపిల్లకావడంవల్ల ఒంట్లో బలం తక్కువ. ఆరోగ్యం జాగ్రత్తగా కాపాడుకోవలసివుంటుంది. కొంతకాలంపోతే ఒంట్లో సత్తువ చేకూరుతుంది. ఆవిణ్ణి, మేము యిక్కడికి రమ్మని ఆహ్వానించాము. కాని, డిశెంబరు 16వతేదీన ఆమె స్విట్జర్లెండు వెడుతున్నానని తెలియజేశారు....విపరీత, విపత్కరపరిస్థితులు సంభవిస్తే, అంటే స్విట్జర్లెండును, జర్మనీ ఆక్రమించుకుంటే, ఆమె ప్రమాదపరిస్థితుల్లోపడకుండా మేము చూడవలసివుంటుంది. స్విట్జర్లెండులో యిలాంటి అపాయంకలుగుతుందని మీరు దిగులుపడకండి.

నేను తిరిగివచ్చినప్పటినుంచి రోజులు చాలా దుర్భరంగా, అశాంతిగా వున్నాయి. నా సోదరుడు మరణావస్థలోవుండగా, నేను రెండు:సార్లక్కడికి వెళ్ళాను. చాలారోజులు అక్కడ వుండిపోవలసివచ్చింది. రోగినిచూసి డాక్టరిలా అన్నాడు "నిజంచెప్పాలంటే, అతనిప్రాణాలు నిలపడానికిసైతం నేను ప్రయత్నించడంలేదు. అలా నిలపడం అతి క్రూరం." చాలామందిడాక్టర్లు యిలాగేఅన్నారు. అతను బ్రతికిబట్టకట్టడం కలలోనిమాట. కాని అతనిఆత్మశక్తి ఎనలేనిది. తాను చనిపోవటం లేదు తున్నాడు. చనిపోవడానికి అంగీకరించడంలేదు. నాకు డాక్టర్లమీద నమ్మకంలేదు. నా కేమీ తెలియదని నాకుతెలుసు. అయినాసరే, ఎలాగో ఒకలాగ అతను బ్రతుకుతాడని నా కెందుకో నమ్మకంగావుంది. అతను నాకంటె చిన్నవాడు. చాలా వుత్సాహంగల యువకుడు, అందర్నీ ఆకర్షించేశక్తిగలవాడు.

ఇన్నాళ్ళూ ఏపనిచేయడానికీ వీలులేకపోయింది. చేయవలసినపనికి మితిఅంటూ లేదు. నా భార్య మాయింటికి వెళ్ళింది. ఈరాత్రి తిరిగి వస్తుంది.

వినండి! వృద్ధుల, అనుభవజ్ఞులమాటలను వినేఅలవాటు మీకులేదు. అంతేకదూ? అధ్యక్షవేదికలమీద, సభలలో మీ రెలాగ ప్రవర్తించేవారో, సరోజినీనాయుడు చెప్పినకథలు నాకు జ్ఞాపకమున్నాయి.

"ఓ! సభలలో తన అభిప్రాయాలనుఖండించే విద్యార్థెవడైనావుంటే, నెహ్రూ వేదికమీదనుంచి క్రిందికురికి, అతన్ని చొక్కాపట్టుకుని గుంజుతూ, ఎడాపెడా వాయించుతూ, సభాప్రాంగణంనుంచి తరిమివేసేవాడు. అదిచూచి అందరూ భయపడేవారు" మీ రీ అలవాట్లను హారోలో అభ్యసించారా? ఏమైనప్పటికి అలాగ మీరు పట్టుకుంటున్నదానికి నేను చాలా దూరంలోవున్నాను. ("మీరు నన్ను రెచ్చగొడుతున్నారు!") కనుక కొన్నినిమిషాలపాటు మీరు నేను చెప్పేదేమిటో వినమని కోరుతున్నాను.

నేను పగలు రాత్రి విధీవిరామంలేకుండా రోమ్ననిషేధిక చదువుతున్నాను. ఆ నివేదికలో అక్కడక్కడ కొన్నిభాగాలను, అంటే మీ

గురించిపున్నభాగాలను ఇందిరకు చూపించాను; నిన్న ఆక్సుఫర్డ్ వెళ్ళవలసివచ్చింది. అక్కడ తరిఫీదుపొందుతున్న ఐ. సి. యస్. ఉద్యోగులతో మాట్లాడాను. ఈరోజు ప్రొద్దున్న రోడ్సుట్రస్టు కార్యదర్శి లార్డు ఈటనోతోమాట్లాడాను. నిన్న లయొనెల్ కర్టిస్ అక్కడే వున్నాడు. రెండు విషయాలు (1) భారతదేశంకోసం రోడ్సుట్రస్టు కొంతసొమ్ము విని యోగించదలచుకొంది. భారతదేశయాత్రికుల నిధివంటిదాన్ని నెలకొల్పాలని నాలోచిస్తున్నాను. దీన్నిగురించి మీకు తెలుసుగదా. అది చక్కగా పనిచేస్తోంది. మంచిమంచి వుద్యోగాలకు కొన్నిగ్రాంట్లను మంజూరు చేస్తోంది. యిది తాత్కాలికమైన దానంకాదు. సృజనాత్మకమైన కృషిని ప్రోత్సహించడానికి యిది కొంత సహాయపడుతుంది. ఆర్థికశాస్త్రంలో పరిశోధనచేస్తున్న లేదా ఫలజాతులగురించి, చెరకునుగురించి పరిశోధన చేస్తున్న భారతీయులకు కొంతనిధిని సేకరించాలని నే నాలోచిస్తున్నాను. లేదా యీ నిధి, వెనుకబడినకులాలవారిక్షేమంకోసం, ప్రాథమికవిద్యా ప్రణాళికకోసం వెచ్చించవచ్చును. (2) భారతదేశపండితులొకరిని విశ్వవిద్యాలయాల కాహ్వానించి సాహిత్యంమీదనో, లేదా చరిత్రమీదనో విశ్వవిద్యాలయంలో వుపన్యాసమిప్పించవలసినదిగా ఏర్పాట్లుచేయమని, అందుకయ్యేఖర్చు తాము భరిస్తామనీ రోడ్సుట్రస్టువారు చాలాకాలంక్రితం ఆక్సుఫర్డ్ విశ్వవిద్యాలయంవారిని కోరారు. యిప్పుడు తమకోరికను ఆమోదించి పనిచేయవలసినదిగా, వారు విశ్వవిద్యాలయాధికారులపై ఒత్తిడితీసుకొద్దామనుకుంటున్నారు. యిందుకు ఎవరు అర్హులో సూచించవలసినదిగా మిమ్మల్ని కోరుతున్నాను. భారతదేశ గౌరవప్రతిష్ఠలను యినుమడింపజేసేవ్యక్తిని, మాతో కలివిడిగా మసలగలిగేవ్యక్తిని పట్టభద్రులుకానున్న యువకులగుంపులలో కలిసిపోతూ ఒక్క ఆక్సుఫర్డులోనేకాక యితర చోట్లసైతం వేలాది ప్రజానమావేశాలలో వుపన్యసించగలవ్యక్తిని మీరు సూచించండి.

మరొకసారి చెవియొగ్గి వినండి. యిప్పుడు నేను చెప్పబోయేది చాలా గంభీరమైనవిషయం. ఈ పురాతన విశ్వవిద్యాలయం ఎవరినైనా ఘనంగా గౌరవించదలచుకుంటే, అది ఒకపనిచేస్తుంది. ఆ వ్యక్తిని

రోడ్స్‌స్మారకదినంనాడు వుపన్యసించవలసిందిగా కోరుతుంది. యిది యింకొకరకమైనపని. అతన్ని కామన్‌రూమ్‌సభ్యుణ్ణి చేస్తుంది. అక్కడికి అనేకమంది ప్రముఖ రాజకీయవేత్తలు విచ్చేస్తారు. ఆ వ్యక్తి వేసవి కాలంలో యిక్కడికి రావలసివుంటుంది. మూడు, నాలుగు లేదా అయిదు వుపన్యాసాలను కావించవలసివుంటుంది. విషయం ఏదైనా కావచ్చును. అది అతనియిష్టం. ఉపన్యాసకుడుమాత్రం విధిగా విదేశీయుడై వుండాలి. అంటే విదేశాలనుంచి అతన్ని ఆహ్వానించాలి. ఉపన్యాసకుడు ఎప్పుడూ అగ్రశ్రేణివ్యక్తిగానే వుండాలి. మేము ఐన్‌స్టీన్, స్మట్సు, ఫ్లెక్సనర్ లను ఆహ్వానించి వారిఉపన్యాసాలను విన్నాము. కొన్నిసంవత్సరాలక్రితం శాస్త్రి, ఇక్బాల్‌ను తీసుకురావడానికి ట్రస్టు ప్రయత్నించింది. యిద్దరూ మహావ్యక్తులే కదా! రాజకీయచతురునకు యిది గొప్ప అవకాశం. పట్టభద్రులుకానున్న మా యువకులతో ఆ వక్త యిష్టాగోష్టి జరపాలని మేం కోరుతున్నాం. అంటే యిది ఎలాజరుగుతుందో మీకు తెలుసును.' అంటే ఒకగదిలో అందరూ సమావేశమౌతారు; యిష్టాగోష్టిలో అందరూ పాల్గొంటారు. దీనికంగీకరించడం, మమ్మల్ని ఎంతో గౌరవించినట్లుగా మేము భావిస్తాము. ఉపన్యాసకుడు తనకిష్టమొచ్చినవిషయంమీద తాను ప్రసంగించవచ్చును. కాని, మాకు ఆసక్తిగలవిషయాన్నిగురించి ఆయన మాట్లాడితే బాగుంటుంది. ఆయనవుపన్యాసాలను విశ్వవిద్యాలయం ప్రకటిస్తుంది......... మనలోమనమాట. రోడ్సుధర్మకర్తలు ఒకవ్యక్తిని ఈసంవత్సరం ఆహ్వానించబోతున్నారు. ఆ వ్యక్తిపేరు జవహర్‌లాల్ నెహ్రూ. (నేను ట్రస్టీని కాదు; అందుకు, నా కంత అర్హతలేదు. కాని నా భావమేమిటో మీకు తెలుపనుకుంటాను. ధర్మకర్తలు కొద్దిగా నా మాట వింటారు.) భారతదేశస్వాతంత్ర్యాన్ని ప్రకటించడానికి మాకు అధికారంలేదు. కాని మే మొకపనిమాత్రం చేయగలం. కాని మే మొక వ్యక్తిని ఎన్నుకుని, భారతదేశస్వాతంత్ర్యాన్నిగురించి ప్రసంగించమని అభ్యర్థించగలం. మీరు ప్రప్రథమశ్రేణివ్యక్తియని, ఆంగ్లభాషనుమాట్లాడే ప్రపంచానికి చాటిచెప్పేఅవకాశం కలిగిస్తారని, అలాంటిగౌరవాన్ని యిస్తారని మేము నమ్ముతున్నాం. మీతో వ్యక్తిగత సన్నిహితపరిచయం, మీ

ఓసాామతించిన మేరకు పెట్టుకోవటానికి విశ్వవిద్యాలయానికి అవకాశం కలిగించాలని మేము వాంఛిస్తున్నాము. వెనుక మే.మాహ్వానించినపుడు శాస్త్రి. ఇక్బల్ యిక్కడికివచ్చి వుపన్యసించడానికి జంకారు. (అలా వారు జంకారని నా అభిప్రాయం. దయవుంచి యీ మాట మరెక్కడా అనకండి. వారితో వుత్తరప్రత్యుత్తరాలు నేనే జరిపాను) ఈ ఆహ్వా నాన్ని మీరు మన్నించండి. వేరే యింకొకఆలోచన పెట్టుకోవద్దు. యిప్పుడీ ప్రపంచం ఉన్మాదావస్థలోవుంది. పలువిధాలుగా విడిపోయింది. యిటువంటి ప్రపంచసమస్యలతో భారతదేశ గౌరవస్థానం ముడివడి వుంది. దీనిని పునర్నిర్మించవలసిన అవసరంవుంది. రాజకీయజ్ఞుల విస్తృత ప్రాతిపదికపై ఎనలేని కృషి సాగించటానికి ఈ అవకాశం మీకు వినియోగపడుతుంది. మీ అనుభవాన్ని పురస్కరించుకొని మీ మనో భావాలను మాకు వివరించడానికి, మా కళ్ళఎదుట ఒకదృశ్యాన్ని స్ఫురింపజేయడానికి యిది చక్కటి తరుణం. మే మిప్పుడు ఎవరితో సంబంధంలేకుండా విడివడివున్నాము. మా వైఖరిని, మా జడత్వాన్ని మీరు కదిల్చివేయవచ్చును. అసాధారణమైన మీ అంతర్జాతీయానుభవంతో మీరు ప్రసంగిస్తూ, మీ ప్రజలను ప్రపంచపటంమీద నిలబెట్టవచ్చును. (మీరు అతిచక్కటి రాయబారులని నాతో ఒకరన్నారు. ఔను, ఆమాట నిజం) వేసవికాలంలో యింగ్లండు మనోహరంగా వుంటుంది. మీరు మా యువకులను చూడవచ్చును. (ప్రపంచంలో మీరు అతిసున్నితమైనవాళ్లు) యింతవరకు భారతీయులుకాని, విదేశీయులుకాని విద్యార్థిగాతప్పితే వారు చూడలేదు. మీరు భారతదేశంగురించి వారి కొక నూతనాభిప్రాయం కలిగించేవచ్చును. (అలాతప్పితే, యింకొకలా మీరు చేయలేరు.) మా రాజకీయనాయకులందరూ ఆక్స్ఫర్డు వస్తారు గనుక, మీరు వారిని కలు సుకోవచ్చును. ఇదివరకు ఠాగూరు యీపని ప్రారంభించారు. మీరు ఆపనిని కొనసాగించవచ్చును. కాని ఠాగూరు చాలా నిస్సారమైన ప్రచు రణలు ప్రచురించి యీపనిలో విఫలులయ్యారు. మీరు నిర్వహించ బోతున్నకార్యం రాజకీయాలకు అతీతమైనది..... వారు మిమ్మల్ని ఆహ్వానించినట్లయితే, యిది యాదృచ్ఛికంగా వస్తుందికనుక,దాన్ని మీరు

స్వీకరించండి. ఈ అవకాశం మీ అదృష్టాన్ని నిర్ణయిస్తుంది. యిక్కడ పొరపాట్లుఏమీ జరగవు. ఈమాట మీరు నమ్మవచ్చును. నేను విశ్వ విద్యాలయప్రేక్షకులను ముందే హెచ్చరిస్తాను. తాము సమావేశంలో జాగ్రత్తగావుండాలని, వుపన్యాసాన్ని శ్రద్ధగా గౌరవంతో ఆలకించాలని, లేకపోతే ఉపన్యాసకుడు విరుచుకపడతాడనీ, కాంగ్రెసుసమావేశాలలో జరిగినట్లే యిక్కడా జరుగుతుందనీ,అల్లరిచేసేవారిని ఎడాపెడా వాయిస్తా రనీ ముందే గట్టిగా హెచ్చరిస్తాను. ఈ ఆహ్వానాన్ని మీ రంగీకరింపక పోతే, యిక (మనలోమనమాట) సప్రూ అందుకంగీకరిస్తాడు. ఆయన ఉపన్యాసానికిసంబంధించినంతవరకు చాకచక్యాన్ని చూపుతాడు; అందరి తోనూ కలివిడిగా మసలగలుగుతాడు. కాని, యిప్పటికీ కరుడుకట్టుకు పోయివున్న మా రాజకీయనాయకులు ఆయనవుపన్యాసంవల్ల మరీ కరుడు కట్టుకుపోతారు. ఈ ఏడు సప్రూను వెనకపెట్టి మిమ్మల్ని నేను సూచిం చాను. (ఆయన తరవాత రావచ్చును) అన్నట్టు యిక్కడికివస్తే, ఇంటి రనుకూడా మీరు చూడవచ్చును. మళ్ళీ మీరు భారతదేశము వెళ్ళడానికి ఆరువారాలుమాత్రమే పడుతుంది.

నన్ను దక్షిణాఫ్రికాకు పంపించి అక్కడ భారతదేశచరిత్రను, రాజకీయాలను, సంస్కృతినిగురించి విశ్వవిద్యాలయంలో, యితరప్రదే శాలలో వుపన్యసించవలసిందిగా రోడ్సుట్రస్టు కోరదలచుకుందనుకుం టాను. దక్షిణాఫ్రికా వైఖరివల్ల భారతదేశవాంఛకు హానికలిగిందని నేను వారికి తెలియజేశాను. నేను ముసలివాణ్ణి. శక్తి వుడిగిపోయింది. చాలా అలసిపోయాను; బుద్ధి సరిగా పనిచేయడంలేదు. దక్షిణాఫ్రికాకు వెళ్ళట మంటేనే నాకు భయంగావుంది. కాని నేను వెళ్ళడంవల్ల భారతదేశాని లాభంచేకూరితే తప్పకుండా అలాచేస్తాను. దక్షిణాఫ్రికాలో పరిస్థితులు చాలా విపరీతంగావున్నాయి. అక్కడ పరిపాలనా నిర్వహణ అత్యంత ఘోరం. కాని నేను ఉద్యోగినిమాత్రమే. అంతకుమించి ఏమీచెయ్య లేనివాడను. వయస్సు మించిపోయింది. మీరు ఆక్సుఫర్డుకు వచ్చినట్లయితే నే నింకొకసారి మళ్ళీ శాస్త్ర సేవచేస్తాను; ఆ ఆటవిక మూర్ఖులకు

భారతదేశాన్నిగురించి నేను తెలియజేస్తాను. యింతకీ నేను పనికిరాని వ్రాయబారినికాను.

గ్రైవింట్ మీచెంతనే వున్నారని నాకుతెలిసింది. ఆయన్నిగురించి మీతో నేను పెద్దగా చెప్పాను. చాలా పొరపాటుచేశాను. ఆయన చాలా మంచి యువకుడు. ఏమిటో ఆయన ఎవరికీ అర్థంకాకుండా వక్రంగా కనిపిస్తూవుంటాడు. ఆయనకంఠస్వరం నాకు నచ్చదు. ఆయనంటే నాకు చిరాకు. నాకు ప్రాయశ్చిత్తంగా ఆయనపట్ల జాలివహించండి.

మాంచెస్టరుగార్డియన్‌కు రెండువ్యాసాలు, టి అండ్ టి కి ఒక వ్యాసం నేను తయారుచేశాను. పెక్కుమంది రాజకీయనాయకులతోనూ కామన్సుసభ్యులతోనూ నేను ముచ్చటించాను. నే నిక్కడికి వచ్చినప్పటి నుంచీ నే నొక సేవకునిగా పనిచేశానని మీరు దయవుంచి భావించండి. ఆంగ్లేయుడు మూర్ఖుడుగాకాకుండా యింకొకలా వుండలేడు. ఏపని సాధిద్దామన్నా అది అత్యంత కష్టమౌతోంది.

నేనువ్రాసిన రెండుపుస్తకాలను మీకు పంపిస్తున్నాను. అవి మీకు కోపాన్నికలిగిస్తాయి. కాని వాటిని పంపించమని మీరు నన్నడిగారు.... దయవుంచి మా దేశాన్నిగురించి మీరు నిరాశపడకండి. మాలో కొంత మందిమి భారతదేశక్షేమంకోసం శక్తివంచనలేకుండాపాటుపడుతున్నాము. మేము కొన్నిపొరపాట్లుచేసినప్పటికీ, మిగిలినదేశాలవారికంటె కాస్త నయం. ఇంగ్లండులో అనేకవిషయాలు మనోహరమైనవి.

మీ

ఇ. టి.

భారతదేశాన్నిగురించి వాస్తవికవిషయాలను అందరూ తెలుసుకో గోరుతున్నారు. రోజూ మాంచెస్టరు, ఛేంబర్ ఆఫ్ కామర్సు, కేంబ్రిడ్జి యూనివర్సిటీనుంచి, కామన్సుసభకూ కరుడుకట్టిన పండితులసంఘాలకు ఆహ్వానాలు వస్తున్నాయి. యిప్పుడు నేను భారతదేశానికి వెళ్ళడం చాలా మూర్ఖంగావుంటుంది. వచ్చేబుధవారంనాడు పార్లమెంటుసభ్యులబృంద

సమావేశంలో నేను మళ్ళీమాట్లాడుతాను. యిదివరకు నేను మాంచెస్టరు గార్డియన్‌పత్రికలో మూడువ్యాసాలు ప్రకటించాను. అవి యిప్పుడు కని పించడంలేదు. అగథా హారిసన్, లేదా మీనన్ ఎవరో ఒకరు వాటిని మీకో, గాంధీకో పంపించివుంటారు. సందేహంలేదు.

ఇ. టి.

288. మహాదేవ్ దేశాయికి

డిసెంబరు 9, 1939.

నా ప్రియమైన మహదేవ్,

మీ 6వతేదీవుత్తరం అందింది. బాపూకు జకీర్ హుస్సేన్ కావించినసూచనతో నేను పూర్తిగా విభేదిస్తున్నాను. ఒక ప్రత్యేకమైన పద్ధతిలో ముస్లింలీగును మనం గుర్తించడమన్నప్రశ్నగాదు. అప్పు డున్నది. జకీర్ హుస్సేన్‌సూచనలో ఎన్నో అంతరార్థాలు యిమిడి వున్నాయి. దాన్నంగీకరించడమంటే, కాంగ్రెసు ప్రధానసిద్ధాంతాలకు తిలోదకాలిచ్చినట్లే అవుతుంది. అంటే, దానిఅర్థం కాంగ్రెసును పూర్తిగా ఛిన్నాభిన్నంచేయడంతప్ప యింకొకటికాదు.

జిన్నా యిటీవల కావించిన ప్రకటన మీరు చూసేవుంటారు. రాజ కీయఅసత్యానికైనా, అసభ్యతకైనా మితిఅంటూ ఒకటివుంది. కాని ఆ మితులన్నీ యిప్పుడు దాటిపోయాయి. ఇక జిన్నాను నే నెలా కలుసు కోవాలో, నాకే తెలియడంలేదు. త్వరలో నేను బొంబాయి వెడుతున్నానని, అప్పుడు ఆయన్ని కలుసుకోగలనని ఆశిస్తున్నాననీ రెండురోజులక్రితమే నేను ఆయనకు వుత్తరంవ్రాశాను. నిన్నటినుంచీ యీవిషయాన్ని గురించి తరచి ఆలోచిస్తూనేవున్నాను. యిప్పుడింకొకవుత్తరం ఆయనకు వ్రాయా లని నిశ్చయించుకొన్నాను. ఆ వుత్తరంప్రతిని బాపూకు దీనితోజతపరచి పంపుతున్నాను.

స్టాఫర్డు క్రిప్సు యిక్కడే వున్నాడు. రేపు ఢిల్లీకి లాహోరుకు బయలుదేరివెడతాడు. అక్కడనుంచి బొంబాయి, వార్ధాలకు చేరుతుం

టాడు. 17వతేదీ ఆదివారంఉదయానికి ఆయన న్యాయంగా వార్ధాలో వుం దాగి. అక్కడ రెండురోజులపాటు ఆగుతాదు. ఈ తేదీలు నాకు నచ్చ డంలేదు. బాపూమౌనవ్రతానికి, వర్కింగుకమిటీసమావేశాలకు అవి అంత రాయం కలిగిస్తాయి. 18, 19 తేదీలలో ఆయన అక్కడికి చేరుకుంటే బాగుండుననుకుంటాను. యిలాఅయితే క్రిప్సుకుకూడా అనుకూలంగా వుంటును.

హైలే, స్కూచరు, ఫిండ్‌లేటర్, స్టేవర్టు, జట్లండ్లతో క్రిప్సు దీర్ఘసంభాషణలను జరుపుతున్నాడు. హాలిఫాక్సునుకూడా కలుసుకున్నా డనుకుంటాను. ఆయన వారిముందు ఒకానొక ప్రతిపాదనకావించాడట. అది వారికి నచ్చినట్లు కనిపించిందట. కాని, ఎవరూ దానినిగురించి ఏమాటా యివ్వలేదట. ఈ ప్రతిపాదనను నేను చూశాను. యిందులో కొన్నివాంఛనీయమైనలక్షణాలు కనిపిస్తున్నాయి. కాని రెండుమూడు ఘోరమైన లోపాలు యిమిడివున్నాయనుకుంటాను. బాపూకు చూపించ మని, మీకు ఒకకాపీ త్వరలోనే పంపించగలననుకుంటాను. అయితే యిది అతిరహస్యంగావుంచాలని మిమ్మల్ని కోరుతున్నాను.

క్రిప్సు నిర్మొహమాటంగా మాట్లాడేవ్యక్తి. ముక్కుకుసూటిగా మాట్లాడుతాడు. ఆయన శక్తి-సామర్థ్యాలు తిరుగులేనివి. అయినప్పటికీ, ఆయననిర్ణయంమీద ఎల్లప్పుడూ ఆధారపడగూడదని నేను చెప్పక తప్పదు.

13వతేదీ ఆప్రాంతంలో బహుశా నేను బొంబాయి వెడతాను.

శ్రీ మహాదేవదేశాయ్,
సేవాగ్రాం.

ప్రేమతో మీ,
జవహర్‌లాల్

239. ఎమ్. ఎ. జిన్నాకు

అల్లాబాద్,
డిసెంబర్ 9, 1939

నా ప్రియమైన జిన్నా,

త్వరలో నేను బొంబాయివస్తున్నానని, అక్కడ మిమ్మల్ని కలియ గలనని,నేను రెండురోజులక్రితం మీకుఉత్తరంపంపించాను.నిన్నప్రొద్దున్న

వార్తాపత్రికలలో వెలువడిన మీ ప్రకటన చదివాను. కాంగ్రెసుప్రభుత్వాలు అధికారంనుంచి తప్పుకున్నాయి గనుక, యిక విముక్తికలిగిందని పేర్కొంటూ, డిసెంబరు 22వతేదీన 'విమోచనదినం' జరపవలసినదిగా మీరు ప్రకటించారు. ఈ ప్రకటనను నే నత్యంతశ్రద్ధతో పెక్కుసార్లు చదివి, ఒకరోజల్లా దీర్ఘంగా ఆలోచించాను. యదార్థవిషయాలనుగురించీ, ఏర్పడిన భావాలనుగురించీ నిర్ణయాలనుగురించీ వాదవివాదాలలోకి ఈ వుత్తరంలో నేను దిగదలుచుకోలేదు. వీటినిగురించి నాకున్న అభిప్రాయాలేమిటో మీకు తెలుసును. సత్యాన్ని తెలుసుకొనేవాంఛతో నేను చిత్తశుద్ధితో కృషిచేయగా, నా కీ అభిప్రాయాలు ఏర్పడ్డాయి. నేను పొరబడితే పొరబడవచ్చును. కాని యింతకంటే యింకా ఎక్కువగా నేను తెలుసుకోదలిచాను. ఈ చిక్కులు తొలగిపోతాయనిఆశించాము. కాని అటువంటిదేమి కానరాలేదు.

కాని నిన్నటినుంచీ నన్ను బాధిస్తున్నదల్లా యింకొకటి. జీవితాదర్శాలపట్ల, రాజకీయ ఆదర్శాలపట్ల మనకుగల దృక్పథం చాలా విభిన్నమైనదనీ, మనం భిన్నభిన్నవిషయాలను అమూల్యంగా ఎంచుతున్నామనీ నాకు తోచింది. అదే నన్ను కలవరపెట్టింది. మనసంభాషణ జరిగిన పిమ్మట యీ విభిన్నదృక్పథం అంత జటిలమైనదికాదని, నే నాశించాను. కాని మనమధ్యనున్న అగాధం ఎప్పటికంటే యిప్పుడు మరింత విస్తరించినట్టు కనిపిస్తోంది. యిలాంటిపరిస్థితులలో మనలనుచుట్టుకొనివున్న సమస్యలను మనం పరస్పరం చర్చించుకోవడంవల్ల ఏఫలితం చేకూరదని నేను అనుమానిస్తున్నాను. చర్చించడానికి ఏదో ప్రాతిపదికంటూ ఒకటి వుండాలి; ఆ చర్చఫలించాలంటే ఒకేఒకఆశయాన్ని దృష్టిలోపెట్టుకోవాలి. యిందులోవున్న యీ కష్టాన్ని నేను తెలుసుకుంటూ మీకు తెలియజేయాలనుకుంటాను.

బిజనూర్ నుంచి మీకువచ్చినఉత్తరాన్ని ఢిల్లీలో మీరు నాకు చూపించినందుకు కృతజ్ఞుణ్ణి. ఆవిషయం నేను దర్యాప్తుచేశాను. జరిగినది ఒకటైతే, మీ కింకొకలాగ సమాచారం అందివట్లుగా నాకు తెలియవచ్చింది. అసలు అక్కడ ఏంజరిగిందో మీకు పూర్తిసమాచారం కావా

లంటే బిజనూర్‌నుంచి, నే నా సమాచారం సేకరించి మీకు తెలియ జేస్తాను. యిందుకోసం, మీకు బిజనూర్‌నుంచి వచ్చిన లేఖాప్రతిని నాకు పంపించవలసిందిగా కోరుతున్నాను.

మీ విశ్వాసపాత్రుడు,
జవహర్‌లాల్

## 290. ఎమ్. ఎ. జిన్నావద్దనుంచి

బొంబాయి
డిసెంబర్ 13, 1939

ప్రియమైన జవహర్‌లాల్,

డిసెంబరు 9వ తేదీన మీరువ్రాసినఉత్తరం నాకు అందింది. మీరు వేరువేరుప్రదేశాలకు వెళ్ళుతూండడంవల్ల నేను ఎక్కడకు జవాబు వ్రాయాలో నాకు తెలిసిందికాదు. డిసెంబరు 14 వతేదీన మీరు బొంబాయి రానున్నారని పత్రికలలోపడినవార్తలననుసరించి ఆచిరునామాకు ఈ వుత్తరం పంపిస్తున్నాను. చర్చించడానికి ఏదో ప్రాతిపదికంటూఒకటి వుండాలని, ఆ చర్చఫలించాలంటే ఒకేఒకఆశయాన్ని దృష్టిలోపెట్టుకోవాలని మీరు వెలిబుచ్చిన అభిప్రాయంతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. ఆ కారణంవల్లనే అక్టోబరులో ఢిల్లీలోజరిగిన సంభాషణసందర్భంలో మీకు, శ్రీ గాంధీకి నేనొకవిషయాన్ని స్పష్టంచేశాను. మొట్టమొదటిసంగతి, భారత దేశంలోగల ముస్లింలకందరికి ముస్లింలీగు ప్రాతినిధ్యంవహించే అధికారిక సంస్థఅని కాంగ్రెసు గుర్తించడానికి సిద్ధంకానంతవరకు, హిందూ ముస్లింసమస్యాపరిష్కారానికి సంబంధించిన సంభాషణలను నెరపడానికి సాధ్యంకాదని నేను తెలియజేశాను. యీవిధంగా కాంగ్రెసుగుర్తించడమే ప్రాతిపదికకాగలదని అఖిలభారత ముస్లింలీగు వర్కింగుకమిటీ స్పష్టంచేసింది. రెండవవిషయం: కాంగ్రెసువర్కింగుకమిటీ ఆమోదించిన, 1939 అక్టోబరు 10వతేదీన అఖిలభారతకాంగ్రెసుకమిటీ స్థిరపరిచిన భారతదేశస్వాతంత్ర్యతీర్మానాన్ని మేము ఆమోదించలేము. గజిబిజిగావున్న ఆచరణసాధ్యంకాని ఆ తీర్మానస్వభావం అలావుంచినా,

అల్పసంఖ్యాకులసమస్యవిషయమై ఒక ఒడంబడిక కుదిరేవరకు దానిని మేము అంగీకరించలేము. పైన్రాయికావించిన ప్రకటనతో కూడా ముస్లింలీగు సంతృప్తిపడడంలేదు. హిందూ ముస్లింసమస్యను మనం సంతోషపూర్వకంగా పరిష్కరించుకోగలిగిననాడు, మనకు నచ్చిన విధంగా ఒకప్రకటనను రూపొందించుకొని ఆవిధంగా దానిని ఆమోదించ వలసినదిగా ఘనతవహించిన ప్రభుత్వాన్ని మనం కోరవచ్చును. ఢిల్లీలో నేనుసూచించిన మొదటిసూచనకాని, రెండవదికాని మీకూ నచ్చలేదు, శ్రీ గాంధీకీ నచ్చలేదు. కాని నన్నొకసారి మళ్ళీ కలుసుకుంటానని మీ రన్నారు. మిమ్మల్ని కలుసుకుందుకు నా కెప్పుడూ సంతోషంగావుంటుం దని నే నన్నాను. నన్ను బొంబాయిలో కలుసుకోబోతున్నట్లుగా, మీరు డిసెంబరు మొదటితేదీన ఉత్తరంవ్రాశారు. నేను ఢిల్లీలో డిసెంబరు మూడవవారంవరకు వుంటానని మీకు జవాబువ్రాస్తూ, మిమ్మల్ని కలుసు కునేందుకు సంతోషపడుతున్నానని తెలియజేశాను. ఈవిషయం మీ రింకా నాతో చర్చించదలుచుకుంటే, అందుకు నే నెప్పుడూ సిద్ధం గానే ఉన్నాను.

యిక బిజనూర్‌సంఘటనగురించి నా కొక విశ్వాసముంది. దానిని గురించి ఒకనిర్ణయానికొచ్చేముందు, ఆ సంఘటనపై పూర్తిగా న్యాయ విచారణ జరిపించాలని, మీరూ అంగీకరిస్తారని నేను నమ్ముతున్నాను. ఏదోఒకసంఘటనను విచారించి ప్రయోజనంలేదు. కాంగ్రెసుప్రభుత్వంపై మేముకావించిన ఆరోపణలను, అది నిర్వహించిన పరిపాలనాపద్ధతులను విచారించడానికి ఒక రాయల్‌కమీషన్‌నునియమించాలని నాఅభిప్రాయం.

మీ విశ్వాసపాత్రుడు,
ఎమ్. ఎ. జిన్నా

పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ,
బొంబాయి.

## 291. ఎమ్. ఎ. జిన్నాకు

బొంబాయి,
డిసెంబరు 14, 1939.

నా ప్రియమైన జిన్నా,

మీరు డిసెంబరు 13వతేదీన వ్రాసినవుత్తరానికి నా అభివందనాలు. ఈవేళమధ్యాహ్నం నే నిక్కడకి చేరగానే అది నాకు అందింది. ముస్లింలు "ధన్యవాదసమర్పణ, విమోచనదినాన్ని" జరపవలసినదిగా మీరు కావించిన ప్రకటనను నేను జాగ్రత్తగా చదివి బాగా ఆలోచించినపిమ్మట, అల్హాబాద్‌నుంచి మీ కొకవుత్తరాన్నిపంపించాను. మీ ప్రకటన నన్నమితంగా కలవరపరిచింది. ప్రజాసమస్యలపరిష్కారానికి కావిస్తున్న మన ప్రయత్నాలమధ్య. యీప్రకటన అగాధాన్ని సృష్టించిందని నా కవగతమైంది. యిందువల్ల నాకు మరింత బాధగావుంది. ఈ ప్రధానమైన విభేదం యిలావుండగా, మనం ఏప్రాతిపదికమీద చర్చించగలమో నా కర్థం కాలేదు. నన్నెదుర్కొంటున్న యీ యిబ్బందినిగురించి మీకు తెలియజేశాను. ఈ యిబ్బంది యింకా అలా వుండనేవుంది.

చర్చ కొక సామాన్యప్రాతిపదిక వుత్పన్నంకావడానికి, మీరు మీ వుత్తరంలో మరి రెండు ప్రాథమికనిబంధనలను నొక్కినొక్కి పేర్కొన్నారు. భారతదేశముస్లింలందరికి ముస్లింలీగు ప్రాతినిధ్యంవహించే ఆధికారికసంస్థగా కాంగ్రెసు గుర్తించివ్యవహరించాలి. యిది మీ మొదటి నిబంధన. లీగు అత్యంత ప్రధానమైనసంస్థఅని దానికి ముస్లింలపై పలుకుబడికలదని, కాంగ్రెసు ఎప్పుడూ గుర్తిస్తూనే వుంది. కనుకనే మనకుగల విభేదాలను పరిష్కరించుకోడానికి మేము తొందరపడుతున్నాము. కాని మీరు సూచిస్తున్నది బహుశా కొంత విపరీతంగావుంది. అలాగ ముస్లింలీగును గుర్తించిననాడు, కాంగ్రెసు ముస్లింలీగులోలేని ముస్లింలతో తెగతెంపులుచేసుకోవలసివస్తుంది. లేదా వారిని తిరస్కరించవలసివస్తుంది. మీసూచనలో ఈవిధమైన ప్రమాదం గర్భితమైవుంది. కాంగ్రెసులో పెక్కుమంది ముస్లిములు వున్నట్లుగా మీకు తెలుసును. వారు మా కత్యంతసన్నిహితులు, సహచరులు. దేశంలో జమాయత్-

ఉల్-ఉలేమా, అఖిలభారతషియామహాసభ,మజ్లిస్-ఇ-అహ్రార్,అఖిల భారత మోమిన్‌మహాసభ మొదలైన ముస్లింసంస్థలు వున్నాయి; అంతే కాక కార్మికసంఘాలలో రైతుసంఘాలలో చాలామంది ముస్లింలు సభ్యులుగా వున్నారు. వీటిలో పెక్కుసంస్థలూ, చాలామంది వ్యక్తులు, మేము కాంగ్రెసులో ఏ రాజకీయవేదికను అనుసరిస్తూవచ్చామో, అలాంటిదానినే వారూ అనుసరిస్తూవచ్చారు. ఇది ఒక సాధారణసూత్రంగా భావించవచ్చును. ఆ సంస్థలనుంచి మేము వేరుపడలేము; లేదా ఏవిధంగానూ వారిని కాదనలేము,

కాంగ్రెసు భారతదేశంలోవున్న అందరికి, ప్రాతినిధ్యం వహించడంలేదని మీరు చాలాసార్లు సరిగ్గానే పేర్కొన్నారు. ఔను, అది ఆవిధంగా ప్రాతినిధ్యంవహించడంలేదు. ముస్లిములు కానీయండి, హిందువులు కానీయండి, వారు కాంగ్రెసుతో ఏకీభవించనివ్యక్తులకు కాంగ్రెసు ప్రాతినిధ్యంవహించడంలేదు. యిలాగ సమాలోచించినట్లయితే అది తనసభ్యులకు, సానుభూతిపరులకు ప్రాతినిధ్యంవహిస్తున్నదని చివరకు తేలుతుంది. ముస్లింలీగుకూడా అంతే. ఏసంస్థఅయినా న్యాయానికి తన స్వంతసభ్యులకు, సానుభూతిపరులకు ప్రాతినిధ్యంవహిస్తుంది. కాని కాంగ్రెసుకు, ముస్లింలీగుకు ఒక ప్రధానమైనభేదముంది. కాంగ్రెసునిర్మాణసూత్రాలననుసరించి దాని ఆదర్శాలను, విధానాలను అంగీకరించిన ఏవ్యక్తిఅయినా అందులో చేరవచ్చును. ముస్లింలీగులో ముస్లింలకుమాత్రమే ప్రవేశార్హత వుంది. యీవిధంగా నిర్మాణసూత్రరచనద్వారా కాంగ్రెసు కొక జాతీయప్రాతిపదిక వుంది. కాంగ్రెసు తన ఉనికిని తాను రద్దుచేసుకుంటేతప్ప, ఈ జాతీయప్రాతిపదికను త్యజించజాలదు. హిందూమహాసభలో అనేకమంది హిందువులున్నారని, కాంగ్రెసు హిందువులకు ప్రాతినిధ్యంవహిస్తున్నదనేభావాన్ని వారంతా వ్యతిరేకిస్తున్నారనీ మీకు తెలుసును. వీరేకాక సిక్కులూ, తదితరులు, మరి కొందరు కొన్నివాదనలను వాదిస్తూనేవున్నారు. మతసమస్యలు చర్చకు వస్తున్నపుడు తమతో సంప్రదించాలని, వారి కట్టి అర్హతవుందనీ చెప్పుకుంటూనేవున్నారు.

కనుక, అందరినీ మినహాయించి ముస్లింలకు కేవలం ముస్లిం లీగుఒక్కటే ప్రాతినిధ్యంవహిస్తున్నట్లుగా గుర్తించాలని మీరు కోరినట్లయితే, మేమే మా కోరికను సమ్మతింపజాలమని నేను అభిప్రాయపడుతున్నాను. అదేవిధంగా కాంగ్రెసు ఎంత విస్తృతమైనసంస్థ అయినప్పటికి, మీవలెనే మేమూ కోరినట్లయితే ఆ కోరిక వాస్తవికవిషయాల దృష్ట్యా విపరీతమే కాగలదు. కాని యీ రెండుసంస్థలూ పరస్పర ఆసక్తితో సమస్యలను పరిగణిస్తున్నపుడు, చర్చిస్తున్నపుడు యిటువంటి ప్రశ్నలు పొడచూపవని మీకు నేను చెప్పగలను.

ఇక మీరుప్రస్తావించిన రెండవఅంశాన్నిగురించి చెబుతాను. బ్రిటిషుప్రభుత్వం స్పష్టమైనప్రకటనచేయవలసినదిగా కాంగ్రెసుకోరిన కోరికను ముస్లింలీగు సమర్థింపజాలదని మీ రంటున్నారు. అలాఅయినట్లయితే,మతసమస్యలమాటకేమి,మనం ముఖ్యంగా రాజకీయవిషయాల్లో ఒకరితోఒకరం విభేదిస్తున్నామని స్పష్టపడుతోంది. అందుకు నే నెంతో విచారిస్తున్నాను. బ్రిటిషుప్రభుత్వాన్ని తన యుద్ధాశయాలేమిటో స్పష్టం చేయమని, కాంగ్రెసు ప్రధానంగా కోరింది. భారతదేశస్వాతంత్ర్యాన్ని అంగీకరించి, అన్యులజోక్యంలేకుండా తమ రాజ్యాంగాన్ని తాము రూపొందించుకునేహక్కు భారతప్రజలకు కలదని ప్రకటించవలసినదిగా కాంగ్రెసు బ్రిటిషుప్రభుత్వంపై మరింత ముఖ్యంగా ఒత్తిడితెస్తోంది. యిందుకు ముస్లింలీగు అంగీకరించకపోతే, మన రాజకీయలక్ష్యాలు విభిన్నమైనవని దానిఅర్థం. ఈకోరికను కాంగ్రెసు కొత్తగా కోరలేదు. కాంగ్రెసుసంస్థ రూపొందించుకున్న నిర్మాణసూత్రాల్లో ఒకదానియందు ఈ ఆశయం పొందుపరచబడింది. ఈసూత్రంమీదనే మా విధానం ఎన్నో సంవత్సరాలనుంచీ ఆధారపడుతూవచ్చింది. అలాంటప్పుడు కాంగ్రెసు దీనిని ఎలా వదులుకోగలదో, లేక పీసమెత్తైనా దీనికి భిన్నంగా ఎలా ప్రవర్తించగలదో, నా వూహాకందనివిషయం. యిలాంటిచర్యకు ఏమాత్రంపూనుకున్నా, న న్నందరూ వ్యతిరేకిస్తారు.

యిది నా వ్యక్తిగతవిషయంకాదు. యిందుకుసంబంధించిన తీర్మానాన్ని, అఖిలభారతకాంగ్రెసుకమిటీ తయారుచేసింది. భారతదేశంలో

అనేకవేలసభలలో యిది బలపరచబడింది. దాన్ని నిర్లక్ష్యంచేయటానికి నాకు హక్కులేదు.

పరిస్థితులిలావుంటున్నప్పుడు రాజకీయంగా మనమధ్య అంగీకృతమైన సామాన్యప్రాతిపదిక లేనట్లు, మనలక్ష్యాలు భిన్నభిన్నమార్గాలలో వుంటున్నట్లు ద్యోతకమౌతోంది. అందువల్ల చర్చ క్లిష్టతరమౌతోంది; ఫలప్రదంకావడంలేదు. అయితే, యిదివరకు నేనువ్రాసిన, నా ఆఖరిపుత్తరానికి ఒకకారణం వుంది. ముస్లింలు 'విముక్తిదినాన్ని' జరపవలసినదిగా మీరుకాపంచిన సూచనను పురస్కరించుకొని నే నా పుత్తరాన్ని వ్రాశాను ఈ 'విముక్తిదినం' జరపడంవలన అనేక అత్యంత క్లిష్టసమస్యలు ప్రధానంగా తలఎత్తుతాయి. వాటిని యిప్పు డిక్కడ చర్చించనక్కరలేదు. అవి తమ ప్రభావాన్ని మనఅందరిమీద ప్రసరింపజేస్తాయి. ఈ వైఖరితో మతసమస్యను పరిష్కరించుదామని ప్రయత్నిస్తేమాత్రం, అదెంతమాత్రం పొసగనేరదు. సమన్వయం దుర్ఘటమౌతుంది.

ఈదశలో, చుట్టూ యిలాంటిపరిస్థితులు ఆవరించివుండగా, మనం సమావేశమైనందువల్ల ఫలితం శూన్యమని నే ననుకుంటున్నాను. ఏమైనప్పటికి కాంగ్రెసుకు, ముస్లింలీగుకు మధ్యవున్న మతసమస్యలనేగాక ఏసమస్యలనైనా స్వేచ్ఛగా, నిష్కపటంగా, చిత్తశుద్ధితో చర్చించడానికి మేము సదా సంసిద్ధులమైవున్నామని మీకు నేను హామీయివ్వగలను.

బిజనూరు సంఘటనగురించి మీరు చెప్పినదానిని నేను గమనించాను. విషయాన్నంతటినీ సమగ్రంగా, సాకల్యంగా దర్యాప్తుచేయకుండా, ఏకపక్షదృక్పథంతో నేరారోపణకావించడం మనదురదృష్టం. నేరాల్నిఆరోపించడం అతితేలికనీ, సమగ్రంగా విచారించకుండా వాటిమీద ఆధారపడడం ప్రమాదకరమనీ, మీకూ తెలుసును.

మీ విశ్వాసపాత్రుడు,
జవహర్‌లాల్ నెహ్రూ

ఎమ్. ఎ. జిన్నా. ఎస్క్వైర్,
బొంబాయి.

292. ఎమ్. ఎ. జిన్నా వద్దనుంచి

బొంబాయి.

డిసెంబరు 15, 1939

ప్రియమైన జవహర్,

ఈనెల 14వతేదీన మీరు వ్రాసినవుత్తరం అందింది. రెండవ అంశాన్నిగురించి నేనువెలిబుచ్చిన అభిప్రాయంతో, నాస్థితితో మీరు ఏకీభవించజాలనందుకు, నేను విచారిస్తున్నాను; బ్రిటిషుప్రభుత్వాన్ని ఒక ప్రకటన కావించవలసినదిగా కాంగ్రెసుకోరినకోరికను, ముస్లింలీగు సమర్థింపజాలదని నేను చెప్పలేదు. 1939 అక్టోబరు 10వతేదీన అఖిల భారత కాంగ్రెసుకమిటీ ధృవపరచిన వర్కింగుకమిటీతీర్మానంలో వుదహరింపబడినప్రకారం ప్రకటించవలసినదిగా కోరినకోరికను ముస్లింలీగు ఆమోదింపజాలదనిమాత్రమే నేను చెప్పాను. అలా ఎందుకు ఆమోదింపజాలదో లోగడ మీకువ్రాసినవుత్తరంలో నేను పేర్కొన్నాను.

ఈ కాంగ్రెసుతీర్మానం ఏవిధంగానూ మార్చడానికి వీలులేకపోతే దాని కేమాత్రం విఘాతంకలిగినా వ్యక్తిగతంగా మీరు విమర్శకుగురి అవుతూవుంటే, భారతదేశముస్లింలకు ప్రాతినిధ్యంవహించేసంస్థగా ముస్లింలీగును పరిగణించడానికి పూర్తిగా మీకు వీలులేకపోతే, యిలాంటి పరిస్థితుల్లో నావద్దనుంచి మీరు ఏం ఆశిస్తున్నారో, నన్ను మీరు ఏంచేయుమని కోరుతున్నారో నేను తెలుసుకోవచ్చునా?

మీ విశ్వాసపాత్రుడు,
ఎమ్. ఎ. జిన్నా.

293. ఎమ్. ఎ. జిన్నాకు

బొంబాయి,

డిసెంబరు 16, 1939.

నా ప్రియమైన జిన్నా,

మీరు డిసెంబరు 15వతేదీన వ్రాసినవుత్తరానికి నా అభివందనాలు.

ప్రకటనవిషయంలో మీరన్నదానికి నేననుకున్నదానికి వున్న భేదాన్ని మీరు పేర్కొన్నారు. ఆ భేదాన్ని నేను గుర్తించాను. బ్రిటిషు

ప్రభుత్వం ఒకప్రకటనకావించవలసినదిగా కోరినకోరికను ముస్లింలీగు వ్యతిరేకించజాలదనే అనుకోండి. అసలుప్రశ్న అదికాదు. ఆ ప్రకటనలోనివిషయం, దానిస్వభావం ఎలాంటివనేది ప్రధానప్రశ్న. తన యుద్ధ ఆశయాలను స్పష్టపరచవలసినదిగా బ్రిటిషుప్రభుత్వాన్ని కాంగ్రెసు కోరింది. భారతదేశస్వాతంత్ర్యాన్నిగుర్తించాలని, స్వాతంత్ర్యంలో స్వతస్సిద్ధంగా గర్భితమైవున్న హక్కును, అంటే తమరాజ్యాంగాన్ని తాము రచించుకునేహక్కు భారతప్రజలకు కలదని బ్రిటిషుప్రభుత్వం గుర్తించాలని కాంగ్రెసు వాంఛించింది. మన స్వాతంత్ర్యలక్ష్యానికి యివన్నీ ప్రధానసూత్రాలు. ముస్లింలీగుకూడా యిదేవిధమైన లక్ష్యాన్నే ప్రకటించింది. కనుక వాటినిగురించి అభిప్రాయభేదాలుండకూడదు. ఈ సూత్రాలను అమలులోపెడుతున్నపుడు ఎన్నో ప్రధానవిషయాలను సమాలోచించవలసివుంటుంది. యిందుకు సందేహంలేదు. కాని ప్రధానకోరికలకు, ఆశయాలకు సంబంధించినంతవరకు భారతజాతీయతఅంతా వాటిలోనే నిగుడివుంది. వాటిని త్యజించడం, లేదా వస్తుగతంగా వాటిని తుచ తప్పకుండా అనుసరించకపోవడం మనస్వాతంత్ర్యాన్ని మనం క్రింపకు జార్చుకున్నట్లేఅవుతుంది.

యుద్ధంపట్లకూడా కాంగ్రెసు తనదృక్పథమేమిటో, తనవిధానమేమిటో గత పదకొండుసంవత్సరాలుగా మాటిమాటికి ప్రకటిస్తూనే వస్తూంది. యిటీవలిప్రకటన, కాంగ్రెసువిధానపు సహజఫలితం. ఈవిధానాన్ని రూపొందించడంలో నాకూ కొంత బాధ్యతవుంది. దీనికి నేను ప్రాధాన్యతయిస్తున్నాను. ఎంతోకాలంనుంచి అనుసరింపబడుతూవస్తున్న ప్రధానవిధానాలను వదులుకోవడంమాట అటుంచి, వాటితో యీషణ్మాత్రం విభేదించకూడదన్నవాంఛను మీరు అభినందించకపోరు. ఈ విధానాల అంతరార్థం, సారాంశం రాజకీయమైనది. భారతస్వాతంత్ర్యవాంఛ అనే ప్రవాహంనుంచి వుత్పన్నమైనవిధానాలుగా వీటిని నేను పేర్కొందుకు సాహసిస్తున్నాను. వివరాలను జాగ్రత్తగా ఆలోచించుకుని చర్చించుకోవచ్చును. పరస్పరసహకారంతో వీటిని అమలులోపెట్టాలి. ప్రత్యేకించి అల్పసంఖ్యాకవర్గాల, వివిధతెగలక్షేమాన్ని దృష్టిలోపెట్టుకొని వారిహక్కు

లను జాగ్రత్తగా సమాలోచించి, రక్షించడానికి పూనుకోవాలి. అంతే కాని, స్వాతంత్ర్యప్రకటన ప్రధానప్రాతిపదికనే సవాలుచేయడం, రాజకీయదృక్పథవిధానాలలో ఎంతో విభేదమున్నట్టు ప్రదర్శించడమే కాగలదు. దీనికీ హిందూ-ముస్లింసమస్యకు సంబంధం ఏమాత్రమూ లేదు. ఈకారణంవల్ల మన రాజకీయలక్ష్యాలకు సారూప్యతలేదని నేను భావిస్తున్నాను.

అయితే, మాలో ఎవరూకూడా ముస్లింలీగుకుగల ప్రాధాన్యాన్ని, పలుకుబడిని, అధికారాన్ని ప్రశ్నించడంలేదని, వాటిని తక్కువచేసిచూడడంలేదని నేను మీకు మళ్ళీ ఒకసారి చెబుతున్నాను. కనుకనే అన్నివిషయాలను దానితో చర్చించి, సమస్యలను సంతృప్తికరంగా పరిష్కరించుకోవాలని మేము ఆతృతపడుతున్నాము. దురదృష్టవశాత్తు అనేక అవాంతరాలవల్ల, అడ్డంకులవల్ల చర్చలు సక్రమంగా కొనసాగలేదు. ఈ పరిస్థితులకు మితిలేని ప్రాధాన్యంవున్నదని నేను మీకు చెబుతున్నాను. ఈ సమస్యలను పరిష్కరించుకోవడానికి, యీపరిస్థితులు ఎందుకు అడ్డురావాలో, వాటిని ఎందు కలాగ అడ్డురానివ్వాలో నాకు అర్థంకావడంలేదు. ఈ పరిస్థితులను తొలగించి, విషయాన్ని కరతలామలకంచేసుకోవడం కష్టమేమీకాదు; అయితే, యీ అవరోధాలు యిలా కొనసాగనిస్తూవుంటే, మరికొన్నిచిక్కులు వీటికి తోడౌతాయి. అలాంటపుడు అసలువిభేదం రాజకీయలక్ష్యాలలోనూ, ఆశయాలలోనూ యిమిడివుందని నేను తప్పనిసరిగా భావించవలసివస్తుంది.

ప్రస్తుతపరిస్థితిలో డిసెంబరు 22వతేదీన అఖిలభారతప్రదర్శనలు జరపబూనడం, వాతావరణాన్ని కలుషితంచేస్తుంది. పరస్పరఅవగాహనకు, చర్చలకు నిరోధంకలిగించి మానసికంగా అగడ్తలను నిర్మిస్తుంది. యిందుకు నే నెంతో విచారిస్తున్నాను, దుష్టపరిణామాలకు దారితీస్తున్న, దారితీయనున్న యీ అవరోధాన్ని తొలగించవలసినదిగా మిమ్మల్ని కోరుతున్నాను. ఆవిధంగా మీరు తొలగించగలరనే నే ననుకుంటాను.

పరస్పరఅవగాహనకు, ఒడంబడికకు ఏది దోహదపడినా నేను దానిని అనుసరించడానికి ప్రయత్నిస్తానని, నా ప్రయత్నలోపమేమీ

లేకుండా, నేను కృషిచేయగలనని మీకు వాగ్దానంచేస్తున్నాను. అయితే, ఒకదానిని సాధించేటప్పుడు, అనుచితమైనవిధానాన్ని స్వీకరించడం మీకూ తగదు; నాకూ తగదు. ఆవిధంగా మనం చెప్పుకోతగినదేదీ సాధించలేము. నాకు కొన్ని ప్రగాఢ రాజకీయవిశ్వాసా లున్నాయి. యిన్నిసంవత్సరాల నుంచీ వాటిననుసరించి నేను కృషిచేస్తూవస్తున్నాను. వాటిని నే నెప్పుడూ ఒదులుకోలేను. అందులో, యిప్పుడు ప్రపంచం అత్యంత క్లిష్టపరిస్థితుల్లో వున్నప్పుడు అసలే వదులుకోలేను.

మీ విశ్వాసపాత్రుడు,
జవహర్‌లాల్ నెహ్రూ

294. మహాత్మా గాంధీవద్దనుంచి

సేవాగ్రాం, వార్ధా,
డిసెంబరు 28, 1939.

నా ప్రియమైన జవహర్‌లాల్,

నీ వుత్తరం అందింది. చైనీయులఉత్తరాల్ని భద్రపరుస్తాను. టైమ్స్ ఆఫ్ ఇండియాపత్రికలో 'విమోచనదినం' ప్రకటన ఒకపుటకు పుట పడింది. కాని నిజానికి ప్రతిచోట అది నీళ్ళుకారిపోయినట్లు కనిపిస్తోంది.

ఫజ్లుల్‌హక్ నేరారోపణపత్రాన్ని నీవు చదివేవా? దాన్నిగురించి మన మేమన్నా ప్రకటించాలంటావా, లేక ఏమీచేయనక్కరలేదంటావా?

కుమారప్ప ఉత్తరాన్నిగురించి నువ్వు తీవ్రమైన ఆక్షేపణలు వెలిబుచ్చావు. ఆ వుత్తరాలు నాకు నువ్వు పంపలేదు. ఆయ నిక్కడే వున్నాడు. నే నాయన్ని అడిగాను. ఈమధ్య తా నేమీ పంపలేదని ఆయ నన్నాడు. దయవుంచి నీదగ్గరున్నవాటిని నాకు పంపించు.

ప్రేమతో,
బాపు.

## 295. ఎడ్వర్డ్ థామ్సన్ కు

అల్హాబాద్,
జనవరి 5, 1940

ప్రియమైన ఎడ్వర్డ్,

కొన్నిరోజులక్రితం మీ తమ్ముడు మరణించాడన్నవార్త నాకు చేరింది. యిది మీ కెంత బాధాకరంగావుంటుందో నాకు తెలుసును. నే నెంతో విచారించాను. మీరు లోగడవ్రాసినఉత్తరంలో అతనివ్యాధిని గురించి ప్రస్తావించారు. అతను కోలుకునేపరిస్థితి చాలా తక్కువగా వుందని తెలిపారు. ఈ దుర్వార్తవల్ల, మీ వుత్తరానికి సమాధానంవ్రాయ డానికి సంకోచించాను.

జాన్ అర్నిసన్, మీ పద్యసముచ్చయము నాకు నిన్ననే అందేయి. యిందుకు, ముఖ్యంగా పద్యగ్రంథాన్ని పంపినందుకు, నే నెంతో సంతోషించాను. ఇతరరంగాలలో మీరు నిమగ్నులై వుంటున్నా, మీరు కవిగానేవుంటున్నారు.

పత్రికలలో వెలువడిన మీ వ్యాసాలను, లేఖలనుకూడా నేను చదువుతున్నాను. అవి నాకు నచ్చేయి. యిదివరకు మీరు వచ్చినపుడు యిక్కడ్కపరిస్థితి ఎలావుందో యిప్పుడూ అలాగేవుంది. కాని, కొన్ని విపరీతమైనవిషయాలు జరిగినా, పరిస్థితి మామూలే. జిన్నా 'విమోచన దినం' గురించి మీరు వినేవుంటారు. న్యాయమైన పరిష్కారధోరణికి అవకాశంలేకుండా ఆయన చేశాడు. కాని ఆయనగురీ, లక్ష్యం తప్పింది. ముస్లింలలో చెప్పుకోతగినంత అసంతృప్తి కలిగింది.

లైపిన్‌నుంచిఇందిరవుత్తరంవ్రాసింది. అక్కడ ఆమె ఆనందంగా వున్నట్లు, ఆ ప్రదేశం ఆమెకు బాగున్నట్లు తోస్తుంది. మూడునెలలలో ఆమెను దయానాగా మార్చుతానని డాక్టరు ఆమెకు చెప్పాడు. సహజంగా యిది ఆమెకు మిక్కిలి ఆహ్లాదకరంగా వుండివుండవచ్చును.

సైన్యవిషయకమైనకష్టం, మీరు చెప్పినట్లు వుండనేవుంది. కాని మీ రిచ్చినంత ప్రాధాన్యం, దానికివుందని నే ననుకోను. సైనికులలో

నూటికి యాభైయిద్దరు పంజాబీలనీ భారతదేశంమొత్తంమీద ముస్లింలు నూటికి ముప్పైయిద్దరనీ నాకు తెలియవచ్చింది. బ్రిటిషుసామ్రాజ్యం సమస్వాతంత్ర్యదేశాల సమాఖ్యగా రూపొందుతుందో లేదో నాకు తెలియదు. కాని, చాలాకాలంనుంచి మీరుకంటున్నకల నిజమైతే, నేను చాలా సంతోషిస్తాను. మీ సూచననుసరించి "పిల్గ్రింట్రస్టు" వంటి సంస్థ ఏదైనా భారతదేశంపట్ల ఆసక్తినిచూపితే చాలా బాగుంటుంది. యిక మీ రెండవప్రతిపాదననుగురించి వ్రాస్తాను. భారతచరిత్రవిషయమై లేదా సాహిత్యవిషయంమీదనో ఉపన్యాసంయివ్వగలిగినవ్యక్తిని హఠాత్తుగా మీకు సూచించడం చాలా కష్టం. అయినప్పటికీ, ప్రస్తుతం నాకు డాక్టరు తారాచంద్ పేరు జ్ఞాపకమొస్తోంది. ఆయన్ని మీ రెరుగుదురో లేదో నాకు తెలియదు. కొన్నిసంవత్సరాలక్రితం ఆయన ఆక్సుఫర్డులో వున్నారు. అక్కడ ఏదో చరిత్రవిషయమై పరిశోధనకావించి, డాక్టరేటుబిరుదును పొందారు. ప్రస్తుతం అలహాబాద్ విశ్వవిద్యాలయంలో ప్రొఫెసరుగా వుంటున్నారు. భారతదేశచరిత్రలో మొగల్‌పరిపాలనాకాలంగురించి ఆయన ప్రత్యేక పరిశోధనకావించారు. ఇస్లాం, హిందూమతాలు ఏవిధంగా తమ ప్రభావాన్ని ఒకదానిపైయింకొకటి ప్రసరింపజేసుకొన్నాయో, తత్పరిణామఫలితాలను ఆయన చక్కగా పరిశీలించారు. యీ విషయాన్ని గురించి కొన్నిరోజులక్రితం హిస్టారికల్‌సొసైటీఎదుట గొప్ప వ్యాసం చదివారు.

నాకు ప్రొఫెసర్లతో పరిచయం అంతంతమాత్రం. అందువల్ల యింతకంటే తగినవ్యక్తి దొరికితే దొరకవచ్చును.

మీరుకోరినట్లుగా రోడ్స్ మెమోరియల్ లెక్చరునుగురించి మీరు కావించినసూచనను, నేను అతిశ్రద్ధతో విన్నాను. మీ సలహాను పాటించి హఠాత్తుగా అందుకు వీలులేదని చెప్పను. ఉపన్యాసమివ్వడానికి అంగీకరించడంవల్ల ఒక ప్రత్యేకత, గౌరవం చేకూరుతాయంటూ మీరు వ్రాసిన విషయాన్ని నేనుహర్షిస్తున్నాను. ప్రత్యేకతను, గౌరవాన్ని పొందడమంటే మనందరికీ ఆశగానేవుంటుంది. కాని, నేను వినమ్రుడను; కనుక నూతన రంగాలలోనికి అడుగుపెట్టడానికి సంకోచిస్తాను. అయినప్పటికీ,

యీవిషయం నాదృష్టిలోవుంచుకొని పరిస్థితులు ఎలావుంటాయో గమనిస్తాను. ముమ్ముందు కొన్నినెలల్లో ఏంజరుగుతుందో, మేము ఏంచేయబోతామో చెప్పడం ఎవరికీ సాధ్యంకాదు. అనేకకారణాలవల్ల, ఇగ్లండుకు, అవకాశముంటే అమెరికాకు వెళ్ళాలని నాకుంది. భారతదేశానికి నేను బయటవుంటే ఎక్కువ ప్రయోజకరంగావుంటుందని నేను ఎప్పుడూ అనుకొంటూవుంటాను. యిక్కడ నేనుండడం అంత సరిపడదనేభావం నన్ను క్రుంగదీస్తూవుంటుంది.

అల్లాహాబాద్‌కుసంబంధించిన రెండుఫొటోలను మీకు పంపుతున్నాను.

భారతదేశ వర్తమానస్థితినిగురించి పెంగ్విన్‌గ్రంథాన్నొకదాన్ని వ్రాయవలసినదిగా ఎలెన్ లేన్ కోరారు. యిలాంటిపని, న్యాయానికి మీది కాని, నాది కాదు. దానినిగురించి నే నేంచేస్తానో నాకే తెలియదు. వ్రాయడానికి వ్యవధిలేదు.

మీ,
జవహర్‌లాల్ నెహూ్రు

## 296. జె. హోమ్సు స్మిత్‌కు

మీరట్,
జనవరి 10, 1940

ప్రియమైన జె. హోమ్సు స్మిత్,

అల్లాహాదునుంచి యిక నేను కొద్దిసేపట్లో బయలుదేరుతాననగా, మీ జనవరిమొదటితేదీవుత్తరం నాకందింది. నేను దీనికి జవాబువ్రాస్తాను. అమెరికాలోవున్న స్నేహితులకు మి మ్మిది పరిచయంచేస్తుందనీ, అక్కడి మీ సహచరులకు సందేశమందిస్తుందనీ ఆశిస్తున్నాను.

భారతదేశస్వాతంత్ర్యోద్యమంపట్ల మీరు వెలిబుచ్చుతున్న హర్షాతిరేకానికి ఆనందిస్తున్నాను. అమెరికాలో యీ వుద్యమానికి దోహదపడాలనే మీకోరికను నే నభినందిస్తున్నాను. ఈ కోరికననుసరించి లాల్‌బాగ్

ఆశ్రమంతో మీకుగలసంబంధాలను మీరు త్రెంచుకుందుకు వెనుకాడలేదు. భారతదేశస్వాతంత్ర్యపోరాటం, భారతదేశంలోనే పురోగమించి ఇక్కడే విజయాన్నిచేపట్టాలని మేము గుర్తిస్తున్నప్పటికీ అమెరికాప్రజలసాను భూతి, సదభిప్రాయాలకు మే మెంతో గౌరవమిస్తున్నాము. నేటిప్రపంచంలో అత్యంత శక్తిమంతమైన ప్రజాస్వామ్యానికి అమెరికన్‌ప్రజలు ప్రాతినిధ్యంవహిస్తున్నారు. ప్రపంచవ్యవహారాలను తిరిగి రూపొందించడంలోవారు నిస్సందేహంగా అధికతరమైనపాత్రను నిర్వహించనున్నారు. భారతదేశంలో ప్రజాస్వామిక స్వేచ్ఛాయుత రాజ్యాంగమనే ఆదర్శానికి మేము కట్టుబడివున్నాము కనుక, ఆ ఆదర్శాన్ని సాధించడానికి కృషి చేస్తున్నాము కనుక, మా దృష్టి అనేకవిధాలుగా అమెరికావైపు మళ్ళడం సహజం. భారత చైనాదేశాలు స్వతంత్రరాజ్యాలుగా గుర్తింపబడనిదే వాటిని యీ ఒడంబడికలోచేర్చనిదే ప్రపంచసమస్యలు ఏవీ సక్రమంగా పరిష్కరింపబడవు. యిది స్పష్టంగా కనిపిస్తున్నసత్యం. సహజంగా మా స్వాతంత్ర్యాన్ని మేము అభిలషిస్తున్నాం. అయినప్పటికీ, కేవలం మా స్వాతంత్ర్యంకోసమేగాక నూతన ప్రపంచవ్యవస్థానిర్మాణానికి మేము దీక్షవహిస్తున్నాం. ఆవిధంగా ప్రపంచవ్యవస్థను రూపొందిస్తున్నపుడు, మేము సంతోషపూర్వకంగా సహకరించడానికి వుత్సాహపడుతున్నాము. అందువల్ల చైనా, భారతదేశాలు ప్రజాస్వామిక స్వతంత్రరాజ్యాలుగా రూపొందాలి. యిది అత్యవసరం. అలా కానినాడు రాజకీయంగా, ఆర్థికంగా సంతృప్తికరమైన పరిష్కారం చేకూరదు. యిప్పుడున్న సంఘర్షణ యిలాగే యికముందుకూడా కొనసాగుతూవుంటుంది. ప్రపంచవ్యవహారాలసమస్థితి దుర్లభమౌతుంది. భారత, చైనాదేశాలకు అద్భుతమైన వనరులు వున్నాయి. అధిక సహజసంపదలుగల ఆ దేశాలురెండూ ప్రపంచవ్యవహారాలలో ప్రధానమైనపాత్ర వహింపవలసివుంది.

ప్రస్తుతం మేము మా దృష్టినంతటిని భారతదేశ స్వాతంత్ర్య విషయమై కేంద్రీకరించాలి. కాని ప్రపంచసమస్యలను దృష్టిలోవుంచుకుంటూనే, మా సమస్యపట్ల మేము మా దృష్టిని కేంద్రీకరించుతాము.

యీ దృష్ట్యా ప్రపంచాన్ని వీక్షిస్తున్నపుడు అమెరికానుగురించి మే మాలోచించడం సహజం.

శ్వేతజాతులయుద్ధంపట్ల మే మెట్టిదృక్పథాన్ని కలిగివున్నామో మీకు తెలుసును. మే మెప్పుడూ ఫాసిస్టు, నాజీసిద్ధాంతాలను తీవ్రంగా వ్యతిరేకిస్తూనే వున్నాము. దురాక్రమణను ఎల్లప్పుడూ ఖండిస్తూనే వున్నాము. ఈ యుద్ధం నాజీజానికి, స్వాతంత్ర్యానికి మధ్య జరుగుతున్న యుద్ధమేనని మనకు స్పష్టపడినట్లయితే, మేము సదా స్వాతంత్ర్యంవైపే మొగ్గుచూపులాం. స్వతంత్రపక్షానికి చేదోడువాదోడుగా నిలబడతాము. కాని, బ్రిటిషుప్రభుత్వంతో మా కున్న అనుభవం యిందుకు విరుద్ధంగావుంది. తన యుద్ధఆశయాలను స్పష్టంగా ప్రకటించవలసిందనీ, భారతదేశాన్ని స్వతంత్రదేశంగా పరిగణించి ఒకప్రకటనకావించవలసినదనీ, మేము బ్రిటిషుప్రభుత్వాన్ని కోరాము. మా కోరికను అది నిరాకరించింది. అంటే దానిఅర్థం, యీ యుద్ధం బ్రిటిషుసామ్రాజ్యవాదాన్ని పదిలపరచడానికే బ్రిటను కొనసాగిస్తున్నదని స్పష్టపడుతోంది. ఇదేకనక దానిలక్ష్యమైతే మా శక్తినీ, మా వనరులను, మనుష్యులను అందుకుపయోగించుటందుకు మేము సమ్మతింపజాలము. మేము నాజీయిజాన్ని వ్యతిరేకిస్తున్నాము. అంటే, సామ్రాజ్యవాదాన్నికూడా వ్యతిరేకిస్తున్నామనే దానిఅర్థం. ప్రస్తుతపరిస్థితులను దృష్టిలోపెట్టుకొని ఆలోచించినట్లయితే, యీ యుద్ధం పరస్పర సామ్రాజ్యవాదాలమధ్య జరుగుతున్న పోరాటంగా తేటపడుతోంది. ఈ యుద్ధలక్ష్యం స్వాతంత్ర్యాన్ని, ప్రజాస్వామ్యాన్ని సాధించడమేనని స్పష్టపడితేతప్ప, దీనికి మేము భాగస్వాములం కాజాలము. ఇట్టిలక్ష్యమే దీనికి కలదని రుజువుపర్చుకోవాలంటే, అది భారతదేశంపట్ల ఆచరణలో నిరూపింపబడాలి. మా కోరిక ప్రప్రధానసమస్యలను లేవనెత్తుతున్నప్పటికీ, అది అతిసాధారణమైనకోరిక. భారతదేశస్వాతంత్ర్యాన్ని ప్రకటించవలసినదిగా మేము కోరుతున్నాము. ఇతరులజోక్యంలేకుండా రాజ్యాంగసభద్వారా తమ రాజ్యాంగాన్ని తాము రూపొందించుకునేహక్కు భారతదేశప్రజలకు కలదని గుర్తించమని అడుగుతున్నాము. ఇలాగ అంగీకరించినపుడు, బ్రిటిషు

సామ్రాజ్యవాదనిర్మాణమేకాక తదితర సామ్రాజ్యవాదాల నిర్మాణ స్వభావంలో అతిముఖ్యమైన మార్పువస్తుందని, సామ్రాజ్యవాదం ఛిన్నాభిన్నమౌతుందని మేము భావిస్తున్నాము.

మా వైఖరిని, మా దృక్పథాన్ని అమెరికన్ ప్రజలు అర్థంచేసుకోవాలని కోరుతున్నాము. ఇలాగ అర్థంచేసుకున్నపుడు మా ఉద్యమాన్ని వారు సానుభూతితో వీక్షించగలరనీ, దానితో సహకరించగలరనీ విశ్వసిస్తున్నాము.

ఇదే అమెరికాలోవున్న మనస్నేహితులకు మీరు అందించే నా సందేశం. భారతదేశంలో ప్రస్తుతపరిస్థితి అస్థిరంగావుందనీ, ఏక్షణంలోనైనా యిక్కడ విపరీతమైనపరిణామాలు సంభవించవచ్చుననీ మీకు తెలుసును. ఈ పరిణామాలు ఏమైనప్పటికీ, మేముమాత్రం యీ లక్ష్యాలకు, పోరాటానికి అంటిపెట్టుకొని వాటినిసాధించడానికి కృషిచేస్తాము.

స్వాతంత్ర్యసాధనమార్గంలో అల్పసంఖ్యాకవర్గాలసమస్య ఒక అవరోధంగా చిత్రింపబడుతూవస్తోంది. కాని వాస్తవానికి యిది అందుకవరోధమేమీకాదు. ఏమీఅంటే, భారతదేశంలో అల్పసంఖ్యాకవర్గాలవారికి భారతదేశసమైక్యతకు, స్వాతంత్ర్యానికి, ప్రజాస్వామ్యానికీ విఘాతంకలగకుండావున్నంతమేరకు అన్నిహామీలను, రక్షణలను యివ్వడానికి మేము సంసిద్ధంగావున్నాము.

మీకూ, మీ సహచరులకూ నా హృదయపూర్వకాభివందనాలు.

శ్రీ జె.హోమ్స్ స్మిత్ | మీ విశ్వాసపాత్రుడు,
ఆశ్రమం, లాల్‌బాగ్, | జవహర్‌లాల్ నెహ్రూ
లక్నో.

297. మహాత్మా గాంధీకి

జనవరి 24, 1940.

నా ప్రియమైన బాపు,

యుద్ధాన్నిగురించి మాలటోవ్ కావించిన ఉపన్యాసంపైనీ అభిప్రాయమేమిటని మీరు నన్ను సేవాగ్రాంలో అడిగారు. నేను ఏదో

జవాబుచెప్పానుకాని, అది అంత స్పష్టంగాలేదు. మాలటోవ్ ఉపన్యాసంతరవాత చాలా సంఘటనలు జరిగాయి. పరిస్థితి అత్యంత క్లిష్టతరంగా రూపొందింది. ఫిన్లండువిషయంలో, రష్యా పొరపాటుగా వ్యవహరించిందని నా నిశ్చితాభిప్రాయము. దీని దుష్ఫలితాన్ని అది అనుభవిస్తుంది. కాని దీనికంటె యింకొక ముఖ్యమైనవిషయాన్ని మనం దృష్టిలోపెట్టుకోవాలి. ఆంగ్ల–ఫ్రెంచి–జర్మన్ యుద్ధవ్యూహగర్భితమైన ఒక యథార్థం ఉంది. రష్యాపై యుద్ధంచేయడానికి ఫాసిస్టు, సామ్రాజ్యవాదశక్తులు సమాయత్తమౌతున్నాయి. ఇరుపక్షాలవారూ యీ యుద్ధాన్ని కేవలం సామ్రాజ్యవాదతృష్ణతో కొనసాగిస్తున్నారని యిదివరకటికంటె యిప్పుడు మరీ స్పష్టపడింది. 1914లో రాజకీయవేత్తలు ఏ మృదుమధుర పదజాలాన్ని ప్రయోగించారో, అవేపదజాలాన్ని యిప్పుడూ ప్రయోగిస్తున్నారు. ఈ పవిత్రమైనపదజాలానికి, ప్రకటనకు మనం మోసపోకూడదు. ఇవి నిజమని మనం నమ్మరాదు. ఈ విషయం చాలాముఖ్యం. బ్రిటిషుప్రభుత్వంతో మనం సంప్రదింపులు కొనసాగిస్తున్నప్పుడు, ఈ పదాల ప్రభావంమనమీదపడకుండా చూడుకోవాలి. భారతదేశంలోమనఉనికిమీద వీటి ప్రభావం పడకుండా జాగ్రత్తపడాలి. తామునడిపిస్తున్న యుద్ధానికి మన సహాయసంపత్తులను పొందాలని బ్రిటిషుప్రభుత్వం తాపత్రయపడుతూంది. అదే దానిలక్ష్యం. భారతదేశసమస్యను కాస్త అవతలవుంచి ఆలోచించినా, యిప్పుడున్నపరిస్థితులలో మనం యీ సామ్రాజ్యవాద యుద్ధానికి నైతికంగానైనా ఎందుకు తోడ్పడాలో నాకు బోధపడడంలేదు. అయితే బ్రిటిషుప్రభుత్వం భారతదేశంపట్ల తనవైఖరిని మార్చుకుని మన స్వాతంత్ర్యాన్నిగుర్తించినట్లయితే, దాని సామ్రాజ్యవాదవిధానం ప్రధానంగా మార్పుచెందుతున్నదని అనుకోవచ్చును. కాని, జరిగేది యిదికాదు. ఈ సామ్రాజ్యవాదం యిలా కొనసాగింపబడడానికే యీ యుద్ధం జరుగుతూవుంటుంది. పరిస్థితులఒత్తిడివల్ల భారతదేశంపట్ల ఏవేవో అస్పష్టమైన ప్రకటనలుచేస్తున్నప్పటికీ, బ్రిటిషుప్రభుత్వం తన సామ్రాజ్యవాదాన్నిపదిలపరుచుకొనడానికే ఈయుద్ధంకొనసాగిస్తూవుంటుంది, భారతదేశస్వాతంత్ర్యంపట్ల యిప్పుడు ఒకవేళ అది ఎన్నిప్రకటనలుచేసినప్ప

టికీ, వాటిని యుద్ధానంతరం పాటించగలమని బ్రిటిషుప్రభుత్వం చెబుతుంది. ఇది మనకు మరీ ప్రమాదకరమైనస్థితి, మనం కోరినా కోరక పోయినా, బ్రిటిషుప్రభుత్వం భావించే అతి దుర్మార్గమయిన, నీచమైన ప్రయత్నాలలో మనమూ భాగస్వాములమై బ్రిటిషుసామ్రాజ్యవాదాన్ని సమర్థించే నికృష్టస్థితికి కట్టుబడిపోతాము, కనుక మనం అతిజాగరూకులమైవుండాలి; ఈ యుద్ధంలో సామ్రాజ్యవాదలక్ష్యాలను ఏమాత్రం సమర్థించబోమని, వీటితో లవలేశం సంబంధంలేదని మనం కుండబద్దలుకొట్టినట్లు స్పష్టంగా ప్రకటించాలి.

నేను పైన చెప్పినట్లుగా రష్యాకువ్యతిరేకంగా పశ్చిమరాజ్యాలు ఒకకూటమిగా సమాయత్తమైతే యిప్పుడున్నపరిస్థితి మరింత జటిలమౌతుంది. దీనిని కమ్యూనిజానికివ్యతిరేకంగా కొనసాగే పవిత్రమైన యుద్ధంగా పేర్కొంటూ, ఆ ముసుగుక్రింద తమ సామ్రాజ్యాన్ని దిట్ట పరుచుకోవడమేకాకుండా, సోవియట్ రష్యా సామ్యవాదరాజ్యాన్ని ముక్కముక్కలుచేయడానికి పూనుకుంటారు. రష్యన్‌విధానంలో మనం ఏకీభవించినా, ఏకీభవించకపోయినా ఏదృష్టితోచూచినా, యిది మహా ప్రమాదకరమైనది. సంప్రదింపులు కొనసాగిస్తున్నప్పుడు ఈవిషయాన్ని మీరు దృష్టిలోపెట్టుకోవలసిందని నేను మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను.

ఈమధ్య మీరువ్రాసినవ్యాసాలలో ఆశాభావాన్ని స్ఫురింపజేసే ఒకటిరెండు పదసముచ్ఛయాలు దొర్లడం, సంయుక్తరాష్ట్రాలగవర్నరు ఆనందభవనం విచ్చేయడంవంటి కొన్ని స్వల్పసంఘటనలూ, ప్రజల కొక విపరీతమైన ఆశాభావాన్ని కలిగించాయి. బ్రిటన్‌తో ఏదోఒకవిధమైన పరిష్కారం కుదరబోతున్నదనీ, కాంగ్రెసుమంత్రివర్గాలు తిరిగి త్వరలోనే అధికారాన్నిస్వీకరిస్తాయనీ, సర్వేసర్వత్రా ఒకభావం వ్యాపించింది. దీనినిపురస్కరించుకొని మన స్వాతంత్ర్యాన్ని గేలిచేస్తూ జిన్నా లాభంపొందుతాడు. ముస్లిమ్‌లీగు కొద్దిగా తలఎత్తడానికి అవకాశంచిక్కుతుంది. యథాప్రకారంగా మన పత్రికాసంపాదకులు ధూర్తంగా ప్రవర్తిస్తారు. మనదేశప్రజలలోనూ, ఇంగ్లండుదేశస్థులలోనూ యీ పరిస్థితి పొరపాటుఅభిప్రాయాన్ని కలిగిస్తుంది. ఒకవేళ పరిష్కారానికి అవకాశ

మంటూ ఒకటుంటే, దాన్ని సైతం యీ పరిస్థితులు మరింత దుర్ఘటం చేస్తాయి. తానుయితరులవల్ల తప్పుత్రోవత్రొక్కవలసివచ్చిందనివై స్రాయి మళ్ళీ దోషారోపణచేస్తాడు. "కాంగ్రెసు మంత్రివర్గాల రాజీనామా బూట కం—వైస్రాయివల్ల ఉపసంహారం" అనే శీర్షికతో అప్పుడే పైసీర్ పత్రిక వెలువడనేవెలువడింది. తెరచాటున ఏమిటి జరుగుతోంది? అనే ప్రశ్న ప్రతీచోటా వినవస్తోంది. ఏదో బృహత్పరిణామం హఠాత్తుగా సంభవించనున్నదని అందరూ ఆశిస్తున్నారు.

ఇవన్నీ యధార్థవిషయాలకూ, ఉన్నపరిస్థితికీ పూర్తిగా విరుద్ధంగా వున్నాయి. మన ప్రజలు మానసికంగా సంసిద్ధంకావడానికి, తదితర ప్రయత్నాలు కావించడానికి అనువుకాని కలుషితవాతావరణాన్ని యివి స్పష్టించాయి.

బ్రిటిషుప్రభుత్వం ఏదోఒకవిధమైన పరిష్కారం కుదర్చుకోవాలని తాపత్రయపడుతున్నప్పటికీ, పరిష్కారానికి ఎట్టిఅవకాశంలేదని నేను వ్యక్తిగతంగా భావిస్తున్నాను. మన కనీసపుకోరికను అంగీకరించడానికి బ్రిటిషుప్రభుత్వం సుముఖంగాలేదు. దానికీ, మనకూ చాలాదూరం వుంది. ఇదివరకటికంటే యిప్పుడు బ్రిటిషుప్రభుత్వం మరింత అభివృద్ధి నిరోధకంగానూ, సామ్రాజ్యవాదతత్వంతోనూ వుంది. ఈదశలో సంధా వ్యంకానిది. ఏదో చేకూరుతుందని మనం ఆశించడం నిరుపయోగం. లేనిపోని ఆశలుకలిగించడం అసంగతం; అనుచితం. ఈ అడియాశలు మనస్థితిని బలహీనపరుస్తాయి. మన స్వాతంత్ర్యకాంక్షను పదేపదే మనం వ్యక్తపరుస్తూ, యిలాంటి రాజీబేరాలకు లొంగిరామని చెప్పడం యుక్తంగా వుంటుందని నా సూచన. అప్పుడు ఎదిరిపక్షంవారు, పరిస్థితుల యధా తధస్వరూపాన్ని గ్రహించుకొని, ఆప్రకారం సర్దుకుంటారు.

ప్రేమతో, మీ
జవహర్‌లాల్

298. మహాత్మా గాంధికి,

అలహాబాద్,

వ్యక్తిగతం. ఫిబ్రవరి 4, 1940.

నా ప్రియమైన బాపు,

మీరు రేపు ఢిల్లీ చేరుకుంటారు. అక్కడ ఒకవారమో, అంత కంటే ఎక్కువో వుంటారని తోస్తోంది. అక్కడ ఎలాంటిపరిణామాలు కలుగనున్నవో నాకు తెలియదు. కలుగనున్న పరిణామాలదృష్ట్యా మాలో ఎవరినో ఒకరిని రమ్మని కబురుపెట్టడం అవసరంపడుతుందేమో; యిలాగ జరగడానికి ఏపాటిఅవకాశంగాని కలుగుతుందని నే ననుకోను. ఏమీఅంటే, ప్రభుత్వవైఖరిలో ఈషణ్మాత్రమైన మార్పుకూడా నాకు కనుపింపడంలేదు. ఏమైనప్పటికీ, వచ్చే రెండువారాలలో నేను ఢిల్లీ రావడం చాలా కష్టమని మీకు తెలియజేయబోతున్నాను. ఈ రెండు వారాలూ చేతినిండా పనివుంది. ఈవేళరాత్రి నేను లక్నోవెళుతున్నాను. అక్కడ రెండురోజులుంటాను. 7వ తేదీని అలహాబాద్ తిరిగివచ్చి, ఆవేళల్లావుండి, మర్నాడుప్రొద్దున్న బొంబాయి బయలుదేరతాను. అక్కడ జరగబోయే ప్లానింగుకమిటీ ముఖ్యసమావేశాలకు నేను హాజరుకావలసి వుంది. కొన్ని నిర్దిష్టవిషయాలను చర్చించడానికి అక్కడ నే నీ ప్రత్యేక సమావేశాన్ని ఏర్పాటుచేశాను. నే నక్కడికి వెళ్ళకపోతే సమావేశం పూర్తిగా తలక్రిందులవుతుంది. ఏపనీ జరగదు. నేను బొంబాయిలో 9వ తేదీఉదయంనుంచీ 12వతేదీరాత్రివరకు వుంటాను. ఆరాత్రి అక్కడ నుంచి లక్నోకు బయలుదేరతాను. లక్నోలో 14, 15, 16తేదీలవరకు వుంటాను. అక్కడ మన రాష్ట్రకాంగ్రెసు ప్రతినిధులసమావేశాలు జరగ బోతున్నాయి. అటుపిమ్మట రెండురోజులు గోరక్‌పూర్‌లో ఉంటాను. అక్కడ కొన్ని బహిరంగసభలకు నేను హాజరౌతానని ప్రజలు ఆశిస్తు న్నారు. వచ్చేరెండువారాలకు ప్రస్తుతం నే ననుకుంటున్న కార్యక్రమం యిది.

బ్రిటిషుప్రభుత్వం మనస్థానాన్ని, మనవైఖరిని ఆమోదించ డానికి ఏమాత్రం అవకాశంలేదనే నా నమ్మకాన్ని, గతమాసంలో జరి

గిన సంఘటనలన్నీ యింకా ధృవపరుస్తున్నాయి. నిజానికి వారు స్పష్ట మైన సామ్రాజ్యవాదవిధానాన్ని అనుసరిస్తున్నారని ఋజువుపరిచే అనేక సంఘటనలు యిటీవల జరిగాయి. పన్నులు విధించడంలో రాష్ట్రప్రభు త్వాలకుగలహక్కులను పరిమితంచేస్తూ గవర్నమెంటు ఆఫ్ ఇండియా ఆక్టును సవరిస్తూ ఒకబిల్లును బ్రిటిషుపార్లమెంటు యిప్పుడే అంగీకరించి నట్లు మీరు గమనించివుంటారు. యు. పి. లో ఆస్తిపై పన్నులను దృష్టిలోపెట్టుకొని యిది ప్రత్యేకం చేయబడింది. రాష్ట్రఅసెంబ్లీలకుగల హక్కులను తగ్గించే యీ నిర్ణయంలోగల అనౌచిత్యాన్ని అలావుం చండి. బ్రిటిషుప్రభుత్వం దీనిని ఆమోదించడానికి తాను ఏపద్ధతిని, ఏసమయాన్ని ఎంచుకున్నదో మనం గమనించినట్లయితే, దాని సామ్రాజ్య వాదఅహంకారం ఎలాంటిదో మనకు బోధపడుతుంది. బ్రిటిషుసామ్రాజ్య వాదవిధానంలో ఎలాంటిమార్పూ కలగలేదని యిది ద్యోతకంచేస్తోంది.

ఈమధ్య రాయల్ సెంట్రల్ ఏషియన్ సొసైటీవారి ఆధ్వర్య మున లండనులో ఒకసాంఘికసమావేశం జరిగింది. దానిని మీరు గమనిం చారో లేదో నాకు తెలియదు. ఆ సమావేశానికి లార్డు జట్లండ్ అధ్యక్షత వహించాడు; అనేకమంది మంత్రులు హాజరయ్యారు. లండనులో ముస్లిం మతసంస్కృతులకేంద్రాన్ని స్థాపించడం యీ సమావేశ పవిత్రలక్ష్యం. కాని, మూలలక్ష్యం వేరొకచోట వుంది. పాన్—యిస్లామిజాన్ని ప్రోత్సహిస్తూ భారతదేశంలో సానుభూతినిసంపాదించడం సమావేశ ప్రధానోద్దేశం. పాన్—యిస్లామిజంపేరుతో యిస్లాందేశాల అనుకూల భావాలను రెచ్చగొట్టి యుద్ధప్రయత్నాలలో తమకు తోడ్పడేటట్లుగా, చేసు కోవాలని వారు తాపత్రయపడుతున్నారు. యుద్ధం రోజురోజు సామ్రాజ్య వాదపద్ధతులలో కొనసాగింపబడుతోంది. అదేధోరణిలో సంఘటనలు ఒకదానివెంట యింకొకటి జరిగిపోతున్నాయి.

ఇంగ్లండు తనసామ్రాజ్యాన్ని తాను ఒదలుకొనడానికి తయారౌ తున్నదనే అభిప్రాయానికి యిది ఏమీ సరిపడడంలేదు. మీ నాయకత్వాన కొంతమంది పైసారియితో యింటర్వ్యూజరపకపోవడం ఉత్సాహకరంగా వుంటలేదు. తిరిగి ఒకసారి ఆడిననాటకమే యిప్పుడూ ఆడతారు. నాట

కానికి నేపథ్యరంగం అప్పుడూ యిప్పుడూ ఒక్కటే. దానిలక్ష్యాలు ఒక్కటే. నటులు పాతవారే. ఫలితాలు మామూలే.

అయితే పరోక్షంగా కొన్ని దురదృష్టకరమైనసంఘటనలు కూడా ఘటిల్లకపోవు. ఒడంబడికకు అస్కారంలేని యీ తరుణంలో రాజీవాతావరణం దేశాన్నంతటినీ అలముకొంటుంది. ఇది మన బలాన్నిబట్టి ఉత్పన్నంకావడంలేదు. కొంతమందివ్యక్తులు, ఏమైనప్పటికీ సంఘర్షణ రాకుండా తప్పించుకోవాలని అమితంగా ఆశిస్తున్నారు. మనం యిదివరకు పొందిన అధికారఛాయలక్రింద చేరాలని వాంఛిస్తున్నారు. ఈ బలహీనత వల్ల యీ ధోరణి తలఎత్తుతోంది. సంఘర్షణ అవాంఛనీయమే. కాని అన్నివిధాల దానిని తప్పించలేము. ఒక్కొక్కప్పుడు సంఘర్షణ విరోధించడం మరింత హానికరం; ప్రమాదకరం. ఏమైనప్పటికి ప్రస్తుతం వెనువెంటనే సంఘర్షణ రానున్నదన్నప్రశ్న లేనేలేదు. మన స్థాయినీ, మన గౌరవాన్నీ భంగపరుచుకోకుండా, ఎలా కాపాడుకోవడమనేది యిప్పుడు మన ఎదుటవున్న ప్రశ్న. ఎట్టిసమయంలోనూ, ఎలాంటి సంఘర్షణకూ మనం సంసిద్ధంగాలేమని, అందువల్ల చేతిలోఏమిపెట్టినా అదే మహాప్రసాదమని కళ్ళకద్దుకొని స్వీకరిస్తామని ఇంగ్లండులోనూ, భారత దేశంలోనూ ఒక భావం ప్రబలంగా వ్యాపించివుంది. యిలాంటిభావం వ్యాపించడం నైతికంగా శ్రేయస్కరంకాదు. నైతికబలాన్నిది క్షీణింపజేస్తుంది. గత పదిహేనురోజుల్లో కాంగ్రెసుప్రతినిధుల ఎన్నికల్లోపైతం యీ భావం ఎలాంటిపరిణామాన్నికలిగించిందో నేను కళ్ళారాచూచాను. పోరాటమొస్తుందని భయపడి వెనకకుజంకిన చాలామంది పెద్దమనుష్యులు, అలాంటిప్రమాదం యిప్పుడిక లేదని, అధికారం, హోదా, పదవులూ తమముందు నాట్యంచేస్తూవుంటే, తాము ముందుకు మళ్ళీ రంగంలోకి తోసుకువచ్చారు.

అవాంఛనీయమైన వ్యక్తులను కాంగ్రెసు దూరంగావుంచాలనే ప్రయత్నం దాదాపు విఫలమైంది. భారతరాజకీయవాతావరణంలో కలిగిన యీ హఠాత్పరిణామం బ్రిటిషుప్రభుత్వంతో రాజీకుదురుతుందనే విశ్వాసాన్ని కలిగించింది. వారు మళ్ళీ ముందుకురావడానికి యిదే కారణం.

బ్రిటిషుప్రభుత్వం మెత్తమెత్తటిమాటలు చెబుతున్నా, మనకు అననుకూలంగా ప్రవర్తిస్తోంది. మనతో అది ఏదోఒక పరిష్కారానికి రావాలనిచూస్తున్నదీ అంటే దానికికారణం లేకపోలేదు. యుద్ధంలో మన సహాయసంపత్తులను పొందాలని అది ఆశిస్తోంది. అయితే, అంతమాత్రం చేత తన అధికారాన్ని పీసమెత్తయినా అది వదులుకోదలచలేదు. మనతో ఒడంబడికకురావాలనే పేరుతో తన ప్రధాన సామ్రాజ్యవాదవిధానాన్ని ఏమాత్రం మార్చుకోదలచలేదు. కాంగ్రెసును మెత్తపరచడానికి అప్పుడప్పుడు ఏవేవో రెండుమూడు కఠినవాక్యాలు ముస్లింలీగును అంటూనే, యిదివరకటిలాగే మతసమస్యఅనే తన పాతపల్లవిని పాడుతూనేవుంది. యికముందుకూడా పాడుతూనేవుంటుంది. ప్రస్తుతస్థితిని యథాతథంగా పదిలపటుచుకుంటూనే, మన్నల్ని తనవైపుకు త్రిప్పుకొనేందుకు బ్రిటిషు ప్రభుత్యం ప్రయత్నిస్తుంది. ఇది సాధ్యపడిందా సరేసరి. యింతకంటే దానికికావలసింది మరొకటిలేదు. ఒకవేళ యిలాజరగనినాడు, భారతీయ నాయకులతో అప్పుడప్పుడు సంప్రదింపులుకొనసాగిస్తూ, యిక నేడో రేపో ఒడంబడిక కుదురుతుందనేభావం వ్యాపింపజేయడానికి ప్రయత్ని స్తుంది. ఈవిధంగా అది ప్రపంచప్రజల, భారతప్రజలభావాలను తనకు సుముఖంగాచేసుకోడానికి ప్రయత్నిస్తుంది. మొదటివిధానంకంటె, రెండోవిధానాన్ని స్వీకరించడం, వారిదృష్ట్యా మరింత క్షేమకరం. సంప్రదింపులపేరుతో మనలను నెమ్మదిపరచి, బుజ్జగించి మనశక్తిని చల్లార్చవచ్చును. తీరా పోరాటంతప్పదని మనం అనుకునేసరికి, అందుకు అవసరమైనవాతావరణం లేకుండాచేయవచ్చును.

ఇలాంటి అవకాశం యీ రెండవవిధానంలో గర్భితమైవుంది. తమ శత్రువులపట్ల తా మనుసరిస్తున్న యిలాంటివిధానంవల్ల, వాయిదావేస్తూ జాప్యంచేయడంవల్ల, అప్పుడే యిలాంటి ఫలితం చేకూరిందన్నభావం ఇంగ్లండులో అధికారవర్గాలలో యిప్పుడు బాగా వ్యాపించివుంది. కాంగ్రెసుమంత్రివర్గాలు రాజీనామాయిచ్చినపుడు పరిస్థితులు ప్రమాదకరంగా వున్నాయని, ఆ ప్రమాదం యిప్పుడు తొలగిపోయిందని, యికముందు ఏదో ప్రమాదంవస్తుందని భయపడనవసరంలేదని వారు భావిస్తున్నారు.

మనం పోరాటాన్ని రెచ్చగొట్టగూడదు. అలాగ రెచ్చగొట్టలేము కూడా. ఈమాట నిజమే అయినా, మనం గౌరవప్రదమైన రాజీకుదుర్చు కోవాలనే తాపత్రయంతో ఒకరిగుమ్మంముందు పడిగాపులుపడకూడదు. అలాంటిపద్ధతులు మీకు ఎంతమాత్రం గిట్టవు. అయినప్పటికి యిదివరకు మనం ఏషరతులుపెట్టేమో, ఆ షరతులప్రకారంమాత్రమే రాజీకుదురుతుందని, అందుకు భిన్నంగా ఎట్టిరాజీచేసుకోబోమనీ మనం స్పష్టపరచాలి. వాస్తవానికి యుద్ధపరిణామాలను దృష్టిలోవుంచుకొని, యీ షరతులనుసైతం పునరాలోచించవలసివుంటుంది. ఇది సామ్రాజ్యవాదయుద్ధం అవునా, కాదా అని అప్పు డడిగినట్లు యిప్పుడు మనం అడగనగత్యంలేదు. ఇది అక్షరాలా సామ్రాజ్యవాదయుద్ధమేనని, బ్రిటిషు ప్రభుత్వం తన యుద్ధవిధానాలవల్ల విదేశాంగనీతివల్ల అడుగడుగునా, మనకు స్పష్టపరిచింది. ఇది జగమెరిగిన సత్యం. ఈ సత్యాన్ని మనం దృష్టిలోవుంచుకుని, ఇది సామ్రాజ్యవాదయుద్ధమనే చైతన్యంతో, మనం మన కార్యాచరణకు పూనుకోవాలి. ఇది సామ్రాజ్యవాదయుద్ధం కాదన్న వాదం ఎంతమాత్రం నిలవజాలదు. రానురాను ఈ యుద్ధమూ, బ్రిటిష్ రాజ్యాంగనీతీ, రోజుకురోజూ మరింత క్రౌర్యంగా తయారౌతున్నాయి; ఈ సామ్రాజ్యవాదయుద్ధంలో భారతదేశం తలదూర్చడం, నా కెంత మాత్రం గిట్టదు. ఇలాగ యిరుక్కున్ననాడు, భారతదేశం భౌతికసంపత్తిని మాత్రమేకాక, ఆత్మవిభూతినిసైతం కోల్పోతుంది. నే డీ విషయాని కత్యంత ప్రాధాన్యమున్నదని నా భావం.

ఇలాంటిపరిస్థితులలో, మనవైఖరిని మనం ఇతమిత్థంగా బ్రిటిష్ ప్రభుత్వానికి, ప్రపంచానికి, భారతదేశప్రజలకు చాటిచెప్పడం అత్యవసరం. రాజీవిషయమై ఎన్నో ఊహాపోహాలు అలముకున్నాయి. ఈ ఊహాపోహాలు మన కననుకూలమైనవి; బ్రిటిష్‌ప్రభుత్వానికి అనుకూలమైనవి. వీటివల్ల మనకు నష్టంవాటిల్లుతుంది. బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి లాభం చేకూరుతుంది. ఈలోపున అది మన వనరులనన్నిటిని పూర్తిగా వినియోగించుకుంటూ, మన అండదండలు తనకున్నట్లుగా ప్రపంచంఎదుట నటిస్తోంది. మన మిప్పుడు చెయ్యిజాపి, బ్రిటిష్‌ప్రభుత్వంవద్దకో, లేదా

వై ప్రాయివద్దకో వెళ్ళినట్లయితే, ఈ అపోహలు ఇనుమడిస్తాయి; బ్రిటిష్ ప్రభుత్వం మరింత బిర్రబిగిసికూర్చుని, సబలైన రాజీకిరాకుండా యింకా దూరంగా తొలగిపోతుంది.

ఇటీవల రాజగోపాలాచారి కావించిన ఉపన్యాసాలు న న్నెంతో కలవరపెట్టాయి. అధినివేశ ప్రతిపత్తి, మరి అలాంటిదేదో కావాలని కోరుతూ ఆయన మరింత రాజీధోరణికి దిగజారిపోతున్నాడు. కాంగ్రెసు అనేకానేకగొంతుకలతో మాట్లాడుతోంది; ఇది గందరగోళానికి, విభ్రాంతికి దారితీస్తుందనడంలో ఆశ్చర్యంలేదు. పోనీ, కనీసం స్వాతంత్ర్య సమస్యపట్ల మనం ఒకేఒకగొంతుకతో మాట్లాడాలి.

మీ కీ రోజున నేను రెండు సుదీర్ఘమైన జాబులు వ్రాశాను. అందుకు మీరు నన్ను క్షమించాలని ప్రార్థిస్తున్నాను.

ప్రేమతో, మీ
జవహర్ లాల్

299. అబుల్ కలాం అజాద్ కు,

అల్హాబాద్,
ఫిబ్రవరి 22, 1940.

నా ప్రియమైన మౌలానా,

మీ పరిశీలనార్థం కొన్నిఅంశాలను నేను మీముందు వుంచుతున్నాను. నిన్న మనం స్టేషన్లో ఏవిషయం చర్చించడానికీ వ్యవధిలేకపోయింది.

1) యుద్ధంప్రారంభమైనదిమొదలు, నాటినుంచి నేటివరకు బ్రిటిషుప్రభుత్వంబుద్ధిపూర్వకంగా, అడుగడుగునా నిరంతరం, సామ్రాజ్యవాద పద్ధతులను అనుసరిస్తోందని, వారివిధానం స్పష్టంచేస్తోంది. యుద్ధానికి పూర్వం చేంబర్లేనుప్రభుత్వం నఖశిఖపర్యంతం అభివృద్ధినిరోధకమైనదని ప్రపంచానికంతటికీ విదితమైంది; అనేకసందర్భాలలో వారు ఫాసిస్టు నాజీప్రభుత్వాలను ప్రోత్సహించారు; యూరపులో ప్రజాస్వామ్యాన్ని

మట్టుపెట్టారు. అబిసీనియా, స్పెయిన్, ఆస్ట్రియా, జకోస్లోవేకియా, ఆల్బేనియాలవిషయంలో వారవలంబించినవిధానం దీనినే స్పష్టపరుస్తోంది. మంచూరియాపట్ల వారవలంబించినవైఖరిసైతం దీని క్షేమాత్రం తీసిపోదు. ఇంతకుముందెన్నడూ వందసంవత్సరాలలోపున ఛేంబర్లేను ప్రభుత్వంవంటి అత్యంత అభివృద్ధినిరోధక సామ్రాజ్యవాదప్రభుత్వాన్ని ఇంగ్లండు కనీవినీ ఎరుగదు. ఇది జగద్విదితం.

ఏమైనప్పటికీ, తమ సామ్రాజ్యానికి ప్రమాదంవచ్చేసరికి బ్రిటిష్ వారు ప్రజాస్వామ్యమన్న సిద్ధాంతంచాటున తలదాచుకుని, దానిపేరిట ఈ యుద్ధాన్ని ప్రారంభించారు. వారకస్మాత్తుగా ప్రజాస్వామిక వాదులుగా మారిపోయారని నమ్మడం చాలాకష్టం. ఇదివరకు ఏవిధానాన్ననుసరించారో, ఇప్పుడూ అదేవిధానాన్ననుసరిస్తున్నారు. అందులో ఏమాత్రం మార్పురాలేదని తరువాతజరిగిన సంఘటనలు స్పష్టంచేశాయి. అయితే, తమసామ్రాజ్యానికి ప్రమాదంగా పరిణమించిన హిట్లరును తొలగించాలనిమాత్రం ఇప్పుడు కోరుతున్నారు. అదే అప్పటికీ, ఇప్పటికీ వారివిధానంలో కనిపించే తేడా. యూరపులో, దూరప్రాచ్యంలో ఆఖరికి అమెరికాలోవున్న అభివృద్ధినిరోధకశక్తులను ప్రోత్సహిస్తూ, ఈ అన్నిశక్తులకు, సామ్రాజ్యవాదానికి ఒక సవాల్‌గావున్న రష్యాను దుర్బలపరచడమే తమవిధానంగా వారు రూపొందించుకున్నారు. పెరిగిపోతున్న నాజీప్రభుత్వబలాన్ని చూసి, ఒకపక్క హడలిపోతూ, రష్యా సహాయంకోసం అప్పుడప్పుడు అరుస్తూచాచుతూనేవున్నారు. అయినా రష్యాఅన్నా, ప్రజాస్వామ్యమన్నా కంటగించుకుంటూనేవున్నారు. ఈ ఏవగింపుతో రష్యాతో ఏవిధంగానూ సహకరించడానికి వారు ఇష్టపడలేదు. పైగా, ఆఖరిక్షణంవరకు హిట్లరు ముసలోనీలను బుజ్జగిస్తూ వారికి విపరీతమైన శక్తిసామర్థ్యాలు చేకూర్చిపెట్టారు సోవియటురష్యాపై హిట్లరును ఉసికొల్పి యుద్ధంచేయించాలని, ఆ యుద్ధంలో తమ ప్రధాన శత్రువులిద్దర్నీ దుర్బలపరచాలని ఆశించారు. అదే వారిలక్ష్యం. ప్రపంచం తల్లక్రిందులైనాసరే జర్మనీ, ఇటలీలలో ప్రగతికాముక ప్రభుత్వాలు తలఎత్తడం వారికి యిష్టంలేకపోయింది.

రానురాను పరిస్థితులు తనకు ప్రమాదకరంగా పరిణమిస్తున్నాయని రష్యా గ్రహించేవరకు, ఈవిధంగా బ్రిటిషుప్రభుత్వం నాటకమాడుతూనే వచ్చింది. బ్రిటిషుప్రభుత్వవిధానాన్ని పూర్తిగా శంకిస్తూ, నాజీజర్మనీతో ఒకఒడంబడికకువచ్చి, తనకు రానున్న ప్రమాదాన్ని తప్పించుకుందుకు రష్యా ప్రయత్నించింది. దీనితో బ్రిటిష్‌ప్రభుత్వపథకం ఆ క్షణానికి తల్లక్రిందులైంది.

అయినప్పటికీ, బ్రిటిషుప్రభుత్వం మౌలికమైన తన సోవియటు వ్యతిరేకవిధానాన్ని అనుసరిస్తూనేవచ్చింది; నేటికిసైతం ఇంగ్లండు జర్మనీతో యుద్ధంచేస్తున్నా, రష్యాపట్ల బ్రిటిషుప్రభుత్వవిధానం అలాగే వుంది. ఈతరుణంలోసైతం బ్రిటిషుప్రభుత్వం జర్మనీకంటె రష్యాపై ఎక్కువ వ్యతిరేకభావాన్ని ప్రదర్శిస్తోంది. జర్మనీలో ఆంతరంగికమైన ఏదోఒకమార్పును తీసుకురావాలని, ఆ మార్పుతో హిట్లరుస్థానే జర్మను సేనానాయకులు అధికారంలోకివస్తే వారితో సంధికుదుర్చుకోవచ్చునని బ్రిటిషువారు కలలుకంటూనేవున్నారు. ఈ మార్పు వస్తుందో రాదో చెప్పడం కష్టం. కాని, ఒక్కవిషయంమాత్రం స్పష్టంగా పేర్కొనవచ్చును. యుద్ధానికిపూర్వం యుద్ధానంతరంకూడా బ్రిటిషుప్రభుత్వవిధానం ఎప్పుడూ అభివృద్ధినిరోధకంగానే వుంటోంది. అది సామ్రాజ్యవాదానికి అనుకూలమైనది. దానికి, వారు ప్రకటించే ఆశయాలకూ ఎంతమాత్రం పొత్తు కనబడదు.

2) రష్యా ఎన్నో పొరపాట్లుచేసింది. ఆచరణరీత్యా, సిద్ధాంతరీత్యా ఎలాచూసినా రష్యా ఫిన్లండుపై దండెత్తడం చాలా ఘోరమైన తప్పిదమని నా అభిప్రాయం. ఫిన్లండును రష్యాకు వ్యతిరేకంగా వుపయోగించుకోవాలని ఇంగ్లండు ఆశించింది. అందుకు సందేహంలేదు. భవిష్యత్‌లో ఆ దేశాన్నొక వేదికగాచేసుకొని, రష్యాపై దండెత్తాలని అది తలపోసింది. అక్కడ యుద్ధపరికరాలు సమీకరింపబడ్డాయి. ఈ పరిణామాలు చూసి రష్యా భయపడి ఆ దేశాన్నాక్రమించుకోవడంద్వారా యీ ప్రతిబంధకరపరిస్థితులను స్తంభింపచేసింది. ఇది చాలా తెలివితక్కువపని. ఇలాచేయడంవల్ల అది ఇంగ్లండు, ఫ్రాన్సులవలలో చిక్కుకుంది.

అంతేకాక, తన కనుకూలమైన ప్రగతికాముకఅభిప్రాయాలను ప్రవంచ మంతటా కోల్పోయింది. ప్రజాస్వామ్యానికి తాను నెచ్చెలినని నటిస్తున్న ఇంగ్లండుకు ఒక అవకాశాన్ని కలిగించింది. ఇంగ్లండు గత కొన్ని సంవత్సరాలుగా చేసిన పాపాలను, ఘోరకృత్యాలను ప్రజలు మరచి పోయేటట్లుచేయడానికి ఈ సంఘటన దోహదపడింది. మున్నెన్నడూ ఫాసిస్టులు, నాజీలు జరిపిన దండయాత్రలను, దురాక్రమణలను కలలో నైనా గమనించని నానారాజ్యసమితి హఠాత్తుగా రష్యాను చుయ్యబట్టడం ప్రారంభించింది. ఇటీవల రష్యాఅనుసరించినవిధానం తప్పని, దానిని ఖండించితీరాలని నేను నిస్సందేహంగా నమ్ముతున్నాను. కాని యీ విధానం అది ఎందుకు అనుసరించవలసివచ్చిందో ఎవరూ మర్చిపో గూడదు. బ్రిటిషుప్రభుత్వం రష్యానుచుట్టుముట్టడానికి నిరంతరం ప్రయ త్నించడంవల్ల అది యిలాంటివిధానాన్ని రూపొందించుకోవలసివచ్చింది. అంతకంటె మనం గమనించవలసిన ముఖ్యవిషయం మరొకటివుంది. ఫిన్లండుపరిస్థితిని తన స్వకీయ సామ్రాజ్యవాదానికి అనుకూలంగా వుపయోగించుకోడానికీ, రష్యాలో యుద్ధాన్ని వ్యాపింపజేయడానికీ ఇంగ్లండు ప్రయత్నిస్తోంది. ఇది మనకు పూర్తిగా ప్రమాదకరం. ఇంగ్లండు రష్యాలమధ్య యుద్ధంకనుక సంభవిస్తే, మనదేశసరిహద్దులు దానికి గురికాకతప్పదు. కనుక మనం మనవిధానమేమిటో స్పష్టపరుచు కోవడం అతిముఖ్యం. రష్యాచర్యలను మనం ఆమోదించక తీవ్రంగా ఖండించాలి. అయితే మన ఖండనమండనలను తనకు అనుకూలంగా బ్రిటిషుసామ్రాజ్యవాదం వుపయోగించుకోనిచ్చినట్లయితే, అంతకన్నా ప్రమాదకరమైన దింకొకటివుండదు.

సోవియట్ రష్యా యీ యుద్ధంలో ఉక్కిరిబిక్కిరై దుర్బలపడిన ట్లయితే, అది అత్యంతవిషాదకరం. అప్పు డిక సామ్రాజ్యవాదాన్ని శక్తి వంతంగా ప్రతిఘటించేశక్తి ఏదీ లేనట్లేఅవుతుంది. పోనీ యీవిషయా న్నలావుంచినా, బ్రిటిషుసామ్రాజ్యవాదాన్ని బలపరిచే ఏచర్యఅయినా మనకు ప్రమాదకరంగానే పరిణమిస్తుంది. అందువల్ల యిప్పుడు మనం పరిస్థితులు స్పష్టంగా అర్థంచేసుకోవాలి. రష్యాపట్ల ప్రస్తుతం బ్రిటిషు

ప్రభుత్వవిధానమేమిటో స్పష్టంగా అవగాహనచేసుకోవడం అత్యంతావశ్యకం. ఈ విధానానికి మనం పూర్తిగా వ్యతిరేకులమని, రష్యాకు వ్యతిరేకంగా బ్రిటిషుప్రభుత్వం ఎట్టిచర్యతీసుకున్నా, ఎలాంటిపరిస్థితులలోనూ అందు కంగీకరించబోమనీ, సహాయపడబోమనీ మనం విస్పష్టంగా ప్రకటించవలసివుంటుంది. మనం మనవిధానాన్ని స్పష్టపరిచిననాడు వ్యత్యాసమేమిటో ద్యోతకమౌతుంది. తాను ఏమిచేసినా నిరభ్యంతరంగా భారతదేశం అంగీకరిస్తుందని బ్రిటను అభిప్రాయపడినట్లయితే, అప్పు డీ యుద్ధం సర్వత్రా వ్యాపించడానికీ, రష్యా యీ యుద్ధంలో చిక్కుకోడానికీ, తత్ఫలితంగా మన స్వీయ భారతదేశపరిహద్దులకు ప్రమాదంవాటిల్లడానికీ అన్నిఅవకాశాలూ వున్నాయి. అలాకాక, ఇంగ్లండు రష్యాపై దండెత్తినట్లయితే, దానిని భారతదేశం ఒక్కనిముషంకూడా సహించదనీ, అలాంటివిధానాన్ని భారతదేశం ప్రతిఘటిస్తుందనీ, బ్రిటిషుప్రభుత్వం గుర్తించిననాడు యీ యుద్ధాన్ని యితరప్రాంతాలకు విస్తరింపజేయడానికి ప్రయత్నించేముందు, కాస్త తటపటాయిస్తుంది. బ్రిటిషుప్రభుత్వం ప్రస్తుతం తా నేమిచేయాలో తెలియనిపరిస్థితిలోపడిపోయినా రష్యాను ఢీకొనాలని ఉవిళ్ళూరుతూనేవుంది. కాని పర్యవసానమెలావుంటుందోనని భయపడుతోంది. భారతదేశంలోని పరిస్థితులు తనకు ఊపిరిసలపనిస్తే, అది ఒక్కపెట్టున రష్యాపైకి దుమకడానికి ప్రయత్నిస్తుంది. అలాకానినాడు వెనక్కుతగ్గి కిమ్మన్నాస్తిగా వూరుకుంటుంది. కనుక, యీవిషయంలో మనమనుసరించేవైఖరిమీద యిది చాలావరకు ఆధారపడివుంది. మనవైఖరిని ఎంతస్పష్టంగా, ఎంతదృఢంగా వ్యక్తంచేయగలమో అంత స్పష్టంగా అంతదృఢంగా ప్రకటించడం వాంఛనీయం.

3) ఇంగ్లండు, ఫ్రాన్సుదేశాలలో జరుగుతున్నసంఘటనలను మనం గమనించినట్లయితే, ఆ దేశాలు ఎంత అభివృద్ధినిరోధకంగా తయారౌతున్నాయో మనకు విదితమౌతుంది. ఫ్రాన్సులో ఇప్పుడు పౌరసత్వ హక్కులు పూర్తిగా సర్వనాశనమయాయి. అక్కడ సైనికనియంతృత్వం నెలకొనివుంది. అనేకమంది పార్లమెంటుసభ్యులఅభిప్రాయాలు తనకు సరిపడనందున, వారిని ప్రభుత్వం నిర్బంధించింది. ఇదేకారణాన్ని పుర

స్కరించుకుని, వేలాది పురపాలకసంఘాలను రద్దుకావించింది. ఇంగ్లండులో యింతవరకూ యింకా పరిస్థితు లింత వికృతరూపందాల్చకపోయినా లక్షణాలుమాత్రం అక్కడా ఇక్కడా ఒకలాగే వున్నాయి. మొత్తంమీద చూస్తే, ఇంగ్లండు ఫ్రాన్సులు ప్రజాస్వామ్యాన్నిగురించి ఎన్ని ప్రగల్భాలు పలుకుతున్నా, తమప్రభుత్వాలను రానురాను మరింత ఫాసిస్టుధోరణితో పెంపొందించుకుంటున్నాయి. తమ యుద్ధాశయాలను ప్రకటించడానికి అవి నిరాకరిస్తూనేవున్నాయి. 1914లో ఏ ఆశయాలతో యుద్ధంకొనసాగించాయో ఆ ఆశయాలతోనే నేడూ పోరాడుతున్నాయి. తమకు ప్రత్యర్థి సామ్రాజ్యవాదాలను తమ సామ్రాజ్యంలోనూ, బయటా, వున్న ప్రగతికాముకశక్తులను దుర్బలపరచి తమసామ్రాజ్యవిస్తరణకు అవి తాపత్రయపడుతున్నాయి. గత సెప్టెంబరులో కాంగ్రెసు ప్రశ్నించిన ప్రశ్నకు సమాధానం యిట్టే లభించింది. బ్రిటిషుప్రభుత్వ ఫ్రెంచి పభుత్వ విధానాలు ఆ ప్రశ్నకు స్పష్టమైన సమాధానాలిచ్చాయి. బ్రిటిషుసామ్రాజ్యవాదానికి మద్దత్తుగా మనం నిలబడి దాని పరిరక్షణకు మనం పోరాడాలని ఆ ప్రభుత్వం తనవిధానాలవల్ల మనకు సమాధానమిచ్చింది. మనం ఫాసిజాన్ని నాజీజాన్ని తప్పక ఖండించితీరులాం; ఈ యుద్ధంలో హిట్లరు జయంపొందితే, అది హానికరం. దాని నెన్నడూ మనం అభిలషించం. అయితే బ్రిటిషుసామ్రాజ్యవాదం ఈ యుద్ధంలో జయించినట్లయితే, అదీ యింతే అనర్థదాయకం; యిదివరకటికంటె, యిప్పుడు మరింత ఎక్కువగా, ఛేంబర్లేనుతత్వం బలపడుతుంది; ఈ యుద్ధాలు ఎడతెరపిలేకుండా ఇంకముందుకూడా యిలా సాగుతూనేవుంటాయి. కనుక జాతీయాంతర్జాతీయదృక్పథంతో, ఏవిధంగా చూచినా, మన మెంతమాత్రం ఇటువంటి విజయానికి దోహదపడకూడదు. అలాగ దోహదపడడం అవివేకమే కాగలదు. కనుక, ఇంగ్లండు భారతదేశాలమధ్యవున్న భారతదేశ ఆంతరంగికసమస్యల పరిష్కారంమాట ఎలావున్నా, మనంమాత్రం బ్రిటిషు సామ్రాజ్యవాదాన్ని పదిలపరచడానికి, ఈ సామ్రాజ్యవాదయుద్ధంలో దిగజాలం. ఇది స్పష్టం.

4) పాన్ — ఇస్లామిజమనేభావం పునరుద్భవించినదని మీరు

గ్రహించివుంటారు. ఈ భావం తిరిగి ప్రాణంపోసుకోడానికికారణం యిక్కడున్న ముస్లింలీగూ కాదు, లేక ఏ ఇతరసంస్థా కాదు. బ్రిటిష్ ప్రభుత్వం దీనిని ప్రోత్సహించాలని కోరుతున్నందువల్ల, ఇది తిరిగి తన శక్తిని తాను పుంజుకుంటున్నది. 1914సంవత్సరంలోనూ, అటుపిమ్మటా పాన్–ఇస్లామిజము తానొక సామ్రాజ్యవాదవ్యతిరేకశక్తిగా వుండేది. బ్రిటిష్ప్రజల యుద్ధప్రయత్నాలను దుర్బలపరచి, భారతదేశంలో ఖిలాపత్ ఉద్యమపూర్వరంగానికి వన్నెతెచ్చింది. కాని, ఇప్పుడీ ఇజం బ్రిటిషు సామ్రాజ్యవాదానికి మద్దత్తుగా ఉపయోగపడుతోంది. కొంతవరకు ఇది భారతదేశంలోవున్న జాతీయవేదికను భగ్నపరిచి, ఇంగ్లండుకనుకూలంగానమీపప్రాచ్యముస్లిములభావాలనుమరల్చడానికివినియోగపడుతుంది. టర్కీ ఈనాడు ఇంగ్లండుతో స్నేహసంబంధాలు కలిగివున్నదేశం; కనుక ఈదృష్ట్యా అది బ్రిటిషువిధానానికి దోహదకారికాగలదనడానికి సందేహంలేదు. ముస్లిముదేశాలలో బ్రిటిషుప్రచారఫలితాలేమిటో నాకు తెలియదు; కాని నేనొకవిషయాన్నిమాత్రం పేర్కొనదలిచాను. పాన్–ఇస్లామిజం సామ్రాజ్యవాదస్వభావంతో వుంది; అది దాని నూతనదశ.

5) వీటినన్నిటినిబట్టి చూస్తే, మన కొకసంగతి స్పష్టపడుతోంది. మన స్వీయ ఆంతరంగికసమస్యలన్నీ, అవి మతసమస్యలు కావచ్చును, లేదా స్వాతంత్ర్యసమస్యలు కావచ్చును. ఏవైనప్పటికీ, అవి విస్తృత యుద్ధసమస్యలతో, బ్రిటిషుప్రభుత్వవిదేశాంగనీతితో ముడివడివున్నాయి. వీటికీ భారతదేశానికీ సంబంధంలేదని మనం అనుకుంటే అంతకంటే పొరపాటింకొకటుండదు. మతసమస్యలో యిమిడివున్న కష్టాలకన్నిటికి నేటి బ్రిటిషుప్రభుత్వవైఖరే కారణం. ఆఖరికి ముస్లిమ్లీగు, సికిందర్ హయత్లు సుముఖంగావున్నా, దీనిని పరిష్కరించడం మాటలతోపని కాదు. అయితే, ఈ యుద్ధంలో తనను తాను బలపరుచుకుందుకు తన స్వీయసామ్రాజ్యవాదాన్నికట్టుదిట్టంచేసుకుందుకు వీలుగావుండేటట్లు భారతదేశసమస్యను పరిష్కరించుకోవాలని బ్రిటిషుప్రభుత్వం వాంఛిస్తోంది. సికిందర్హయత్ బ్రిటిషుప్రభుత్వవిధానాన్ని పూర్తిగా పూసుకొస్తూ, తదనుగుణంగా ప్రవర్తిస్తున్నాడు. ఆయనకూడా ఇంతే వాంఛిస్తున్నాడు.

అయితే, ఈ వాంఛ మౌలికంగా బ్రిటిషుసామ్రాజ్యవాదాన్ని దిట్టపరుస్తుంది. మనవిధానం దీనికి పూర్తిగా విభిన్నమైనది. అది బ్రిటిషుసామ్రాజ్యవాదాన్ని బలహీనపరుస్తుంది. ప్రధానమైన ఈ భేదంవల్ల సమాధానం కుదరడం సాధ్యంకాకుండాపోతోంది. బ్రిటిషుప్రభుత్వం తన సామ్రాజ్యవాదాన్ని విడనాడడానికి సంసిద్ధపడనిదే, వైస్రాయితో లేదా ముస్లిములీగుతో ఎన్నిసంప్రదింపులు కొనసాగించినా ప్రయోజనం శూన్యం. బ్రిటిషుప్రభుత్వం తన సామ్రాజ్యవాదాన్ని విడనాడడానికి సంసిద్ధపడాలని, కాంగ్రెసువర్కింగుకమిటీ సెప్టెంబరు 14వతేదీన ఒక ప్రకటనకావిస్తూ స్పష్టంగా కోరింది. బ్రిటిషుప్రభుత్వం యిందు కంగీకరించకపోగా, పైపెచ్చు, తన సామ్రాజ్యవాదాన్ని తాను మరింత ధృవపరుచుకుంది. భారతదేశవైఖరి,అమెరికా తదితరతటస్థదేశాలపై ప్రసరింపచేయగలదుకనుక, దాని కధికతరప్రాముఖ్యముంది. ప్రస్తుతం అమెరికా అత్యంతదృఢంగా హిట్లరును వ్యతిరేకిస్తోంది. ఈ అర్థంలో, అది బ్రిటిషుప్రభుత్వానికి అనుకూలంగావుంది. అయితే, అంతమాత్రంచేత, అది బ్రిటిషుసామ్రాజ్యవాదాన్ని సమర్థిస్తున్నదని భావించరాదు. బ్రిటిషుసామ్రాజ్యవాదాని కది అనుకూలంగాలేదు కనుక, బ్రిటిషుప్రభుత్వంతో తాను చేతులుకలుపడానికి సందేహిస్తోంది. భారతదేశంతో తాము ఒక సమాధానానికిరాగలిగామని బ్రిటిషువారు అమెరికాకు బోధపరచగలిగినట్లయితే, అది వారి కెంతో ఉపకరిస్తుంది.

6) బ్రిటిషుప్రభుత్వంతో రాజీకుదరనున్నదనే వదంతులు గత కొన్నిమాసాలుగా భారతదేశంలోనూ, బయటా వ్యాపించిపోతున్నాయి. ఈవదంతులు మనప్రజలను, ప్రపంచదేశాలప్రజలను తప్పుదారులు పట్టిస్తున్నాయి. ఏమి జరుగుతున్నదో ఎవరికీ తెలియదు. ఈ సామ్రాజ్యవాద చట్రం యిలావుండగా, మనతో సమాధానం కుదుర్చుకోవడం సంభవం కాదని ఆఖరుసారిగా మనం ఖండితంగా స్పష్టపరచాలని నా అభిప్రాయం. రాజీప్రయత్నాలు మనం ఎంత త్వరగా మానుకుంటే అంత మంచిది. దీన్నిగురించి మనం తుదినిర్ణయంతీసుకోవాలి.

7) భారతదేశంలో గత కొన్నిమాసాలనుంచి, బ్రిటిషుప్రభుత్వం

అనుసరిస్తున్నవిధానం క్రమేపీ, అతి నిరంకుశంగా మారిపోతూవస్తోంది. ఈ నిరంకుశపరిపాలనకు మనం ఎలాగ తలయొగ్గి వుండగలుగుతున్నామని, విదేశ ప్రజలు ఆశ్చర్యచకితులౌతున్నారు. ప్రజలు ఎన్నుకున్న మన రాష్ట్రిప్రభుత్వాలు తల్ల క్రిందుకాబడ్డాయి. అంతేకాదు; రాష్ట్రిప్రభుత్వాల పరిపాలనాధికారాన్నిసైతం తన సవరణశాసనాలద్వారా బ్రిటిష్‌పార్లమెంటు పరిమితంచేసింది. పై ప్రాయి, పైకి ఎన్ని తీపికబుర్లు చెప్పినా, అవన్నీ లబ్జులని ఈ చర్యలు మనకు తేటపరుస్తూనేవున్నాయి. ఒక రాజ్యాంగచట్టాన్ని అమలుకానీయకుండా నిలిపివుంచినపుడు, సాధారణంగా అది సంఘర్షణకు దారితీస్తుంది. అయినాసరే, మారుమాటాడకుండా, మనం దీనిని సరిపెట్టుకున్నాం. అదేవిధంగా మన రాష్ట్రిప్రభుత్వాలఅధికారాలను హరించినా, సవరణశాసనాలనుసైతం సహించాం. మనకుసంబంధించినంతవరకు, బ్రిటిష్‌విధానపు ధోరణికిచెందినమేరకు తప్ప, ఈ రాజ్యాంగచట్టసవరణ ప్రధానమైనది కాదు. మనకూ బ్రిటిష్ ప్రభుత్వానికీ మధ్య నరిపడే లక్షణాలు మృగ్యమనీ, బ్రిటిషుసామ్రాజ్యవాదం ఎప్పట్లాగే బలపడుతూవుంటుందనీ, ఈ చర్యలు మనకు విదితం చేస్తున్నాయి.

8) నిన్న మీతో నేను చెప్పినట్లుగా. ప్రస్తుత శాసనసభలతో కూడిన రాజ్యాంగసభను అంగీకరించడం చాలా ప్రమాదకరమని నా అభిప్రాయం. అలా అంగీకరించినట్లయితే, వయోజనఓటింగుహక్కు కావాలని గత నాలుగుసంవత్సరాలుగా మనం చేస్తున్న ఆందోళనకు మనం తిలోదకాలివ్వడమే కాగలదు. అంతేకాక, దీనితో మన రాజ్యాంగసభ, బ్రిటిషుసామ్రాజ్యవాదచక్రంలో యిమిడిపోవలసినదుస్థితి కలుగుతుంది. ప్రస్తుతపరిస్థితులలో ఇది, అవే మతకలహాలను, తదితరసంఘర్షణలను ప్రకోపింపచేస్తుంది; ఆవిధంగా మన బలహీనతను బహిర్గతంచేయడానికి హేతుభూతమౌతుంది. ఇక రాజ్యాంగాన్నిగురించి ఏకాభిప్రాయం కుదరడానికి వీలులేకుండాపోతుంది. ఈ రాజ్యాంగచట్టాన్ని అంగీకరించడమంటే మనం కొన్ని స్వల్పమార్పులతో 1935 సంవత్సరపుచట్టాన్ననుసరించి తవిచేయడానికి పూనుకున్నామని దానిఅర్థం. రాజ్యాంగసభ ఫల

ప్రదంకావాలంటే, అది ఈ చట్టపరిమితుల కేమాత్రం లోబడివుండ కూడదు. బ్రిటిష్‌సామ్రాజ్యవాదధోరణికి లవలేశమూ, దీనితో ప్రమేయ ముండరాదు. రాజ్యాంగసభ మన రాజ్యాంగచట్టాన్ని రూపొందించిన పిమ్మటమాత్రమే, మనకూ బ్రిటిష్‌ప్రభుత్వానికీమధ్య ఎలాంటిసంబంధా లుండాలనేవిషయం ఆలోచనకు వస్తుంది. అంతవరకూ మనం దీనిని పట్టించుకోబోము. వయోజనవోటింగుపద్ధతిని అమలుపరచడానికి పరి పాలనరీత్యా ప్రస్తుతంవున్న యిబ్బందులను, పరోక్షఎన్నికలద్వారా అందాకా తొలగించుకోవచ్చును. మనం జాగ్రత్తవహించవలసిన ముఖ్యాంశమొకటి వుంది. బ్రిటిషు సామ్రాజ్యవాదపరిధికీ, బ్రిటిషుపార్ల మెంటు పరిమితులకులోనుకాకుండా భారతదేశప్రజలు నడుచుకోదానికి ఈ రాజ్యాంగసభ ఒక ఉపకరణంగా వుండాలి. లేకపోతే, దీనికి అర్థం వుండదు. బ్రిటిష్‌పార్లమెంటు కావించిన శాసనంవల్ల, పుట్టినబిడ్డగా మాత్రమే ఇది వుండిపోతుంది.

9) ప్రస్తుతమున్న విధినిర్వహణల అజమాయిషీ మొదలైన అధి కారాలనుంచి రాష్ట్రప్రభుత్వాలు వెనక్కి తగ్గడమంటూ వుండదని మనం స్పష్టపరచాలని నా అభిమతం. ఈ అంశాన్ని పంత్‌జీ నొక్కినొక్కి చెప్పినందుకు నా కెంతో ఆనందంగావుంది. ప్రభుత్వస్వరూపం ఆమూ లాగ్రంగా మారిపోవాలి.

ఇంత దీర్ఘమైనఉత్తరం వ్రాసినందుకు మీరు నన్ను మన్నించ గలరని భావిస్తాను. చెప్పవలసినవిషయా లింకా చాలా వున్నాయి; కాని ఇంతటితో ముగిస్తాను.

మీ విశ్వాసపాత్రుడు,
జవహర్‌లాల్

మౌలానా అబుల్‌కలాం అజాద్,
19, ఎబాలీగంజ్ పర్క్యులర్‌రోడ్డు,
కలకత్తా.

## 300. అబుల్‌కలాం అజాద్‌వద్దనుంచి

కలకత్తా,
మార్చి 27, 1940

నా ప్రియమైన జవహర్‌లాల్,

మీరుకావించిన నా ఉపన్యాస ఆంగ్లానువాదాన్ని 15వతేదీ ఉదయం రైలులో, నా చేతికిచ్చినపుడు, ఆ అనువాదాన్ని ఊరకే యథాలాపంగా చూశాను; దానిని జాగ్రత్తగా చదవడానికి యింతవరకూ నాకు తీరికలేక పోయింది. ఇప్పుడు, ఇదివరకటికంటే నాకు తీరికచిక్కింది; కనుక దానిని ఆమూలాగ్రంగా పఠించాను. మీ అనువాదం, నన్ను ముగ్ధుణ్ణి చేసింది. మీ సాటిలేనిఉపజ్ఞకు, ఎనలేని నేర్పరితనానికి నా హృదయపూర్వ కాభివందనాలు తెలియజేయకుండా, నే నుండలేకపోతున్నాను. మీకు గల ఆంగ్లభాషాపాండిత్యం అపారమైనది; మీ కింతటిపాండిత్యమున్న దని నే నింతవరకూ ఊహించలేదు. ఇంత సర్వోత్కృష్టంగా ఈపనిని నిర్వర్తించడానికి, నేటి నిష్ణాతులలో చాలామందికి, ఎన్నోరోజులు పడు తుంది; కాని మీరు కొన్నిగంటలలో అప్రయత్నపూర్వకంగా అవలీలగా దీన్ని పూర్తిచేశారు.

ఒకవిధంగా చెప్పాలంటే, స్వతంత్రంగా వ్రాయడంకంటె, అను వాదంచేయడంఎక్కువకష్టం. మూలరచనలోని సాహిత్యవస్తువుచెక్కు చెదరకుండా అనువదించడం, ఆ అనువాదం మూలరచయిత భాషాశైలిని తుచతప్పకుండావుండేటట్లుచేయడం మాటలతోపనికాదు. రెండుభాషలపై సమానాధికారంగల వ్యక్తికిమాత్రమే, యిది సాధ్యపడుతుంది. మూలం లోని ఏ పోకడా మీ అనువాదంవల్ల చెదరిపోలేదు; అదీ మీ అనువా దంలో నాకుకనిపించిన ప్రత్యేకలక్షణం; అంతేకాక, నా ఉర్దూసాహిత్య శైలిని మీరు ఆంగ్లంలోనికి అనువదించారు. దీన్నిచదివిన పాఠకుడు, దీనిమూలం ఆంగ్లమనే అనుకుంటాడు తప్ప, ఉర్దూఅనిఅనుకోడంటే, నా కాశ్చర్యమనిపించదు।

దీనికి సమతుల్యమైన సల్లక్షణం మీ అనువాదంలో యింకొకటి ద్యోతకమౌతోంది; ఉపన్యాసరచనలో, వివరణలు ఉత్కృష్టమైన భావనా ప్రౌఢిమను, మీరు చక్కగా ఆకళింపుచేసుకున్నారు; నా వాక్యనిర్మాణానికీ, నా రచనారీతికీ కారణభూతమైన నా ఊహలను మీరు నిర్దుష్టంగా గ్రహించగలిగారు. నిజంచెప్పాలంటే, మీరు అనువదించేముందరే, నా ఉపన్యాసప్రణాళిక మీకు కరతలామలకమైంది. ఇది నిస్సందేహంగా మహత్తరమైనకృషి; అందులోనూ, నా రచన మీకు ప్రత్యక్షంగా సహాయ పడనప్పుడు, దీన్నింతరమ్యంగా మీ రెలాగ మలచగలిగారో, తలుచు కుంటే అద్భుతమనిపిస్తుంది.

కొన్నికొన్నిచోట్ల, ఆంగ్లానువాదానికి సరిపోయేటందుకుగాను, ఉర్దూపాఠాన్ని కొద్దిగా పెంచారు; లేదా సంక్షిప్తపరిచారు; నేను మీ అను వాదాన్ని పఠించి, ఈ మార్పులను జాగ్రత్తగా గమనించాను. కొన్నిసంద ర్భాలలో, మీరు నా రచనకు మెరుగులుదిద్దినందుకు చాలా సంతోషంగా వుంది. ఎక్కడా, మచ్చుకు చూద్దామన్నా, నా ఉపన్యాసంలోవిభావవ్యక్తీ కరణకుకాని, రీతికిగాని ఏమాత్రం భంగంకలగలేదు. పైప్రాయి ప్రకట నపై వ్యాఖ్యానిస్తూ నేను ఈ దిగువపంక్తులు వ్రాశాను.

"షఫాన్ పర్ షఫే పార్జానేకే బాద్ భీ బా....ముష్కిల్ ఇస్కాదర్ బతానే పర్ ముస్తా—ఎద్ హోతా హై....

ఇక్కడ "బా—ముష్కిల్" అనే పదం నా రూపకాలంకరణ యుక్తమైన భావవ్యక్తీకరణకు అతి ముఖ్యమైనది. ఈ అలంకారమాధు ర్యాన్ని అలాగ వుంచుతూనే, మీరు ఈవిధంగా దాన్ని విస్తరించి అభి వ్యక్తీకరించారు.

"ఒక్కొక్కపుటను చదువుతున్నకొద్దీ ఆఖరుకు ఎలాగైతేనేమి సంకోచిస్తూనే ఈ తెర ఎత్తినట్లు మనకు తెలియవస్తుంది. తెరతొల గించినవెంటనే ఇక మన కన్నులఎదుట కనిపించేది...."

"బా—ముష్కిల్" అనే పదంతో, నేను వ్యక్తీకరించవలెనన్న భావాన్ని మీరు ప్రయోగించినపదం మరింత అర్థవంతంగా, గంభీరంగా

వ్యక్తపరిచింది. నా రచనాపద్ధతికంటె, మీది మరింత యుక్తియుక్తంగా వుందని నే నంగీకరించకతప్పదు. మీరు ఇదేవిధంగా నా ఉపన్యాసానికి అనేకచోట్ల మెరుగులుదిద్దారు. ఉదాహరణకు నే నొకదాన్నిమాత్రమే పేర్కొన్నాను.

నేను బహుశా 30వతేదీన అల్లాహాబాద్ చేరుకోగలనని ఆశిస్తున్నాను. అప్పటివరకు మీరు అక్కడే వుంటారని అనుకుంటాను.

మీ విశ్వాసపాత్రుడు,
అ. క. అజాద్

301. అబుల్‌కలాం అజాద్‌వద్దనుంచి

కలకత్తా,
ఏప్రియల్ 24, 1940

నా ప్రియమైన జవహర్లాల్,

మీరు ఏప్రియల్ 2వతేదీన వ్రాసిన వుత్తరానికి నా ధన్యవాదాలు. కృష్ణమీనన్ ఒకరిపనుపునకాక, తనకుతానుగా అమెరికా వెడితే ప్రస్తుత సమయంలో కొంతవరకూ ఉపయోకరంగావుంటుందన్న మీ అభిప్రాయంతో నే నేకీభవిస్తున్నాను. ఈ ప్రతిపాదన మన వర్కింగుకమిటీ సమావేశానికిముందు వచ్చివుంటే, అప్పుడే సమావేశంలో ఒకనిర్ణయానికి వచ్చివుండేవాళ్ళం. ఏమైనప్పటికీ ఆయనకు నూరుపౌనులు పంపించమని ప్రధానకార్యదర్శికి వ్రాస్తున్నాను. మీరు బొంబాయినుంచి యింకొక నూరు పౌనులు ఆయనకు పంపించేఏర్పాటుచేస్తారని ఆశిస్తున్నాను.

ఆయనకు నన్ను వుత్తరంవ్రాయవలసినదిగా మీరు కోరారు. అధ్యక్షునిహోదాలో నే నాయనకు జాబువ్రాసినట్లయితే, అమెరికాకు ఆయన కాంగ్రెసుతరఫున వెడుతున్నట్లు దాని కర్థంచెప్పబడుతుంది; అలాగకాక మీరు వ్రాసినట్లయితే, ఈవిషయం అంతదూరంవరకూ వెళ్ళదు. కనుక మీ రిలా ఆయనకు ఉత్తరంవ్రాస్తే బాగుంటుంది. "మీరు అమెరికా వెడుతున్నారని విని నేను చాలా సంతోషించాను, మీ రక్క

దకు వెళ్ళడంవల్ల భారతదేశ ప్రస్తుతపరిస్థితులు అమెరికావారు చక్కగా అర్థంచేసుకోగలుగుతారని నమ్ముతున్నాను." మీ జాబు ఆయన కొక బాధ్యతాయుతమైన హోదానుయిచ్చి, పూర్తిగా సహాయపడుతుంది. అంతే కాక, అధ్యక్షునిహోదాలో వ్రాసినవుత్తరం తెచ్చిపెట్టగలపరిస్థితిని మీ ఉత్తరం నివారించగలుగుతుంది.

ముస్సోరీలో ముగ్గురుస్నేహితులయిళ్ళు ఇప్పుడు నిండిపోయి వున్నాయి. మీ స్నేహితులలో ఎవరైనా ముస్సోరీలో ఒక ఇల్లు యివ్వ గలరా? ఇది సాధ్యంకాకపోతే నేను అద్దె చెల్లించడానికి సిద్ధంగా వున్నాను. ఇల్లుమాత్రం బాగుండాలి; యిమ్ముగా వుండాలి. మీ కెవరైనా అలాంటి మిత్రులున్నట్లయితే, ఏర్పాట్లనుగురించి నాకు తంతియివ్వండి. కలకత్తా వాతావరణస్థితి నాకు బాగులేదు.

ముస్సోరీ కాకపోతే, నైనిటాల్‌కో లేదా ఆల్మోరాకో వెడదామను కుంటున్నాను. దీన్నిగురించి పంత్‌జీకి ఉత్తరంవ్రాస్తున్నాను.

మీ విశ్వాసపాత్రుడు,
ఎ. కె. ఆజాద్

302. కృష్ణకృపలానీకి

అల్లాహాబాద్,
ఫిబ్రవరి 20, 1940

శ్రీ కృష్ణ కృపలానీ,
శాంతినికేతనం, బెంగాల్

నా ప్రియమైన కృష్ణ,

నీ ఉత్తరం అందింది. నేను సుధీర్‌సేన్‌కు వ్రాసినఉత్తరాన్ని నువ్వు "విశ్వభారతి" సంచికలో ప్రచురించవచ్చును. కాని, అందులోని ఎల్మిరిస్టుపేరును ప్రస్తావించకపోవడం బాగుంటుందనుకుంటాను. ఒక ఆంగ్లేయున కా లేఖ వ్రాయబడినదని, నువ్వు పేర్కొనవచ్చును. ఈ దిగువపేర్కొన్నపంక్తులను, ఒక 'నోట్' గా నువ్వు చేర్చవచ్చును.

"భారతదేశ సంపూర్ణ స్వాతంత్ర్యం వెనువెంటనే సమకూడాలి; ఇది అత్యంతప్రధానమైన ఒక నిబంధన; ఈవిషయంలో ఇక చర్చలకు తావులేదు; దీన్నిగురించి వివరించవలసినఅగత్యం అంతకన్నా లేదు. స్వాతంత్ర్యంగురించి నేను మాట్లాడుతున్నానంటే, బ్రిటన్‌నుంచి అఖరు పారిగా మనం విడిపోవాలని తప్పనిసరిగా దానితాత్పర్యం కాదు. బ్రిటన్ సామ్రాజ్యవాదధోరణిని విడనాడుకోవాలన్నదే నా ఆలోచనల కంతరార్థం. ఇలాగ అది ఒదులుకుంటుందన్నభావం ప్రస్తుతం ద్యోతకంకావడంలేదు; ప్రస్తుతమేకాదు, అద్యతనభావిలోసైతం యిందుకు సూచన కానరావడం లేదు. బ్రిటిషుప్రభుత్వం పూర్తిగా తానొక సామ్రాజ్యవాదశక్తిగా వ్యవహరిస్తోంది. తన సామ్రాజ్యాన్ని పదిలపరుచుకునేందుకు తనసామ్రాజ్య వాదాన్ని బలపరుచుకునేందుకు శతధా ప్రయత్నిస్తోంది. ఇలాగ ప్రయత్నిస్తున్నట్లు దానిచర్యలు మనకు స్పష్టపరుస్తూనేవున్నాయి. ప్రస్తుత అవ్యవస్థ ముస్ముందు యింకా యిలాగే కొనసాగితే ఏమోకాని, రానున్న వ్యవస్థలో, భవిష్యత్‌లో, వివిధదేశాలమధ్య సన్నిహిత సహకారసంబంధాలు నెలకొనితీరాలి. ఇప్పుడు అందరూ ప్రపంచసమాఖ్యనుగురించి ఊరికే మాట్లాడుతున్నారు. ఎక్కడ విన్నా ఈ మాటే వినిపిస్తోంది. స్వతంత్రభారతదేశం అలాంటి యథార్థమైన ప్రపంచసమాఖ్యకు చెందుతుంది. కాని, యూరోపియన్‌రాజ్యాలసమాఖ్యను లేదా యూరపు, అమెరికా, బ్రిటిషుడొమినియన్ల సమాఖ్యను నెలకొల్పాలని ఎవరైనా ప్రతిపాదించినట్లయితే, దానిఅర్థం సామ్రాజ్యవాదదేశాలను బలపరుచుకొని, ఆసియా ఆఫ్రికాలను దోపిడీచేయాలనేగాని యింకొకటి కాదు. అందుకు మే మెంతమాత్రం అంగీకరించం.

"భారతదేశభవిష్యత్తు సామ్రాజ్యవాదనిర్మితితో ముడివడివున్నదని ఎవరైనా అంటే, అది మే మెంతమాత్రం అంగీకరించం. ఇది గమనించవలసిన ప్రధానవిషయం. రాజ్యాంగసభనుగురించి మేం మాట్లాడుతున్నామంటే, అది బ్రిటిషుసామ్రాజ్యవాదచట్రానికి ఒదిగివుండవలసినదనికాదు; దీనికీ దానికీ ఎలాంటిసంబంధమూ లేదు. బ్రిటిషుసామ్రాజ్యవాద పరిమితులకు రాజ్యాంగసభ ఏవిధంగానూ లోబడివుండదు. ఇం

గ్లండు తదితర దేశాలతో సహకరించడానికి మా కెట్టి అభ్యంతరం లేదు; కాని, సామ్రాజ్యవాదధోరణిగల ఏప్రయత్నాన్నైనా మేం అభ్యంతర పరుస్తాం."

న్యూయార్క్‌లోవున్న ప్రపంచ సమాఖ్యవాదులు కొందరికి, మొన్న నే నొక ఉత్తరం వ్రాశాను. బహుశా ఆ ఉత్తరం నీకు ఆసక్తి కలిగించవచ్చును. కనుక దాని ప్రతిని నీకు పంపెస్తున్నాను. నీ కిష్ట మున్నట్లయితే ఉత్తరంలోని కొన్నిభాగాలు ప్రచురించవచ్చును.

కుటీరపరిశ్రమలపై నేను మీ పత్రికలో వ్రాసినలేఖకు చాలా అచ్చు ప్రతులను మీరు పంపించారు. అవన్నీ నాకు అందాయి.

నందిత ఇక్కడవున్నపుడు కొన్ని ఫొటోలు తీసుకున్నాను. ఆమె ఫొటోలను నీకు అనిల్‌చంద్ చూపించాడా? కొన్నిఫొటోలు నీకు యిచ్చాడా?

నీ విశ్వాసపాత్రుడు,
జవహర్‌లాల్ నెహ్రూ

30ఎ. ఎడ్వర్డు థామ్సన్ వద్దనుంచి

అయిల్స్‌బరీ, బక్స్,
మార్చి 7, 1940

ప్రియమైన జవహర్‌లాల్,

బహుశా, ఈ లేఖ రంజిత్‌కు చేరుతుందనే అనుకుంటాను. ఈ లేఖను చదవడానికి నిజంగా తెలివైనపాఠకుడు అవసరం.

తెలుసుకోవలసినది: భారతదేశంలో గంగానది అని భారతీయులచే పిలువబడుతున్న, గేంజస్ అని ఇతరదేశాలవారిచే పిలవబడుతున్న నది ఒకటుంది. థేమ్సునదిని "ప్రవహిస్తున్నచరిత్ర" అని అందరూ అంటూం టారు. అలాగే గంగానదిపైతం ప్రవహిస్తున్న ఒక చరిత్రవంటిది. ఈ అక్టోబరు నెలలో బహుశా నేను భారతదేశానికి తిరిగివస్తాను. శివునిజటా జూటమునుంచి ఉద్భవించిన గంగానది పుట్టినప్రదేశంనుంచి, సాగర

సంగమంవరకూ దానిని నేను చలనచిత్రంగా తీయాలనుకుంటున్నాను. అంచేకని ఈ అక్టోబరునెల ప్రారంభంలోనే, నేను భారతదేశానికి చేరుకోవచ్చును. ఈ కార్యనిర్వహణకు అనువైనకాల మేదో నాకు మీరు తెలియచేయండి. గంగానదిని ఫిల్ముగాతీసేటపుడు ఎవరైనా ఈ విషయాలు దృష్టిలో పెట్టుకోవలసివుంటుంది: (1)ప్రకృతిదృశ్యరామణీయకత:వర్షాలు కురుస్తున్నపుడు, వరదలు పొంగుతున్నపుడు ఇందు కుపక్రమిస్తే బాగుంటుందనుకుంటాను. (2) సానుకూలత: అయితే వర్షాకాలంలో కొన్ని యిబ్బందులుండడంవల్ల ఇది అనుకూలమైనకాలం కాదు. (3)ఉత్సవాలు: మీ అల్హాబాద్‌లో జరుగుతూవుండే కుంభమేళాలవంటివి. ప్రకృతి సౌందర్యం, గాంభీర్యమే కాక అక్కడి జనులతోనూ, వారివేడుకలతోనూ ఉత్సవాలతోనూ సంబంధంకలిగివుండాలని ఎవరికైనా కోరికగా వుంటుంది. ఒకకారు అద్దెకుపుచ్చుకొని, నదిపొడుగునా ప్రయాణంచేస్తూ ఫిల్ముతీయాలనుకుంటాను.

మీరువ్రాసిన ఉత్తరం చూశాను. దానితో నేను ఏకీభవిస్తున్నాను. ఎల్మిర్స్టు నాకు దాన్ని చూపించాడు.

ఇప్పుడు, మా పెద్దబ్బాయి సైన్యంలో రెండవ లెఫ్టినెంటుగా వుంటున్నాడు; త్వరలోనే దూరదేశాలకు వెళ్ళబోతున్నాడు; ఎక్కడికి వెళ్ళుతున్నాడో, ఉత్తరంలో నేను వ్రాయకూడదు. ఇంకొకఆరునెలల్లో వాడికి ఇరవై ఏళ్ళువస్తాయి. చిన్నవాడు స్కూల్లో చదువుకుంటున్నాడు, నా కీమధ్య ఫ్లూ వచ్చింది; ఫ్లూవల్ల మా ఆవిడ బొత్తిగా నీరసించిపోయింది. ఇది తప్పితే, మేం కులాసాగానే వున్నాం.

ఇందిరభోగట్టా విని మీరు సంతృప్తిపడ్డారని భావిస్తాను.

ఇవాళఉదయం నాకు చాలా ఉల్లాసమనిపించింది. ప్రభుత్వం పాల స్తీనావిషయంలో గట్టిపట్టుదలగావుంది, అది నా కెంతో ఉత్సాహంకలిగించింది. మా మురావారి అంటే, అతివాదుల, అత్యంత అవినీతికరమైన అట్టివాదనలను నే నింతకుముందెన్నడూ వినలేదు; వాళ్ళు చపలచిత్తులు; అరబ్బువ్యతిరేకులు; జియోనిష్టుల కనుకూలురు. ఈధోరణి నన్ను వేగంగా

ఒక టోరీగా మార్చివేస్తున్నది. నేను భారతదేశానికి వచ్చినప్పుడు, టాగూరు శాంతినికేతనాన్ని కూడా ఫిల్ముతీస్తాను.

నాకు కొంతసమాచారాన్నందించి స్నేహితులు ఎక్కడ సహాయ పడగలరో! పాట్నావంటి ప్రదేశాలలో హోటళ్లు వున్నాయనుకుంటాను. అయితే హరిద్వార్, అంతకంటె చిన్నచిన్నపట్నాలసంగతి ఏమిటి? కారుమీద, గంగాతీరమంతా ప్రయాణంచేస్తే, మరి చాలాచోట్ల ఆగవలసి వుంటుంది....తరువాత, రంజిత్‌తో కలసి, ఉత్కళ అటవీ ప్రదేశాలలో నేను పనిచేయవచ్చును. నా భార్య అంగీకరించినట్లయితే, ఆమెను భారత దేశానికి తీసుకురావాలని ప్రయత్నిస్తున్నాను.

ఈ ఉత్తరంతో మిమ్మల్ని విసిగించకూడదని, ఆమె అంటోంది. నేనూ అలాగే అనుకుంటున్నాను. దయవుంచి ఈ ఉత్తరం, రంజిత్‌కు చేర్చుతారా? ఆయనచిరునామా నావద్ద లేదు. నాన్ ఆఫీసు చిరునామా మాత్రమే వుంది.

మీ,

ఇ. టి.

304. ఎడ్వర్డు థామ్సన్‌కు

అలాహాబాద్,
ఏప్రియల్ 7, 1940.

ప్రియమైన ఎడ్వర్డ్,

మార్చి 7వతేదీన మీరువ్రాసినఉత్తరం నాకు అందింది. అక్టో బరులోనో, అంతకుముందో, మీరు భారతదేశానికి వస్తున్నట్లు తెలుసు కొని, నేను చాలా సంతోషించాను. అప్పుడు నన్నెచ్చట మీరు కలుసుకో గలరో, లేదా నన్ను కలుసుకొనడానికి వీలుంటుందో వుండదో, నాకు తెలి యదు. కాని భారతదేశంమాత్రం ఇక్కడే వుంటుంది; అలాగే గంగానది కూడా ఎక్కడికీ పోదు.

గంగానదిని ఫిల్ముతీయాలన్న మీ సంకల్పం ముచ్చటగావుంది. నాకంటె ఎక్కువ విజ్ఞుడైన రంజిత్‌కు మీ ఉత్తరాన్ని అందజేస్తున్నాను.

కాని, నా మటుకు నేనుకూడా అంతో ఇంతో భావుకుడను కనుక, దాన్ని గురించి కొన్నివిషయాలు చెప్పాలనుకుంటున్నాను. దురదృష్టవశాత్తూ రంజిత్‌కు యిప్పుడు వొంట్లోబాగులేదు; మంచంమీదవున్నాడు. అయితే, నే నీవిషయం అతనికి చెప్పాను; ఈమాట విన్నవెంటనే, అతనిఉల్లాసానికి మేరలేకపోయింది; ఎన్నెన్నో ఊహలు అతనికి కలిగాయి. ఇప్పుడు నేను వ్రాస్తున్నవిషయాలు కొంతవరకూ అతనిఊహలేనని చెప్పకతప్పదు.

మహానది గంగకు ఒక చరిత్రవుంది; కనుక, ఆ చారిత్రకవిషయాలన్నీ ప్రస్ఫుటమయేటట్లు ఫిల్మ్ తీయవలసివుంటుంది. కొన్ని పురాణకధలతో, సంప్రదాయంతో, సంస్కృతితో, కళతో, చరిత్రతో గంగానదికి సన్నిహితత్వంవుంది. ఆమె ఎక్కడపడితే అక్కడ పొంగులు వారుతూవుంటుంది. దీనిని నవ్యంగా చక్కగా ఒక ఇతివృత్తంగా స్వీకరించి నిర్వహించడం, అత్యద్భుతమైనకార్యం; కాని, ఎట్టిసందర్భంలోనూ దాని చారిత్రక సాంప్రదాయిక అంతరార్థాన్ని విస్మరించరాదు; నిర్లక్ష్యంచేయరాదు. అభూతకల్పనలను పెద్దజేసి చెప్పనవసరంలేదు. అయినప్పటికీ, భారతీయకళను, పురాణగాధలను అర్థంచేసుకొనడానికి పౌరాణికసంబంధమైన గంగానదిపుట్టుకను స్పర్శించవచ్చును; అంటే, గంగ శివుని జటాజూటముపై బడడం, ఆయనశిరస్సు హిమాలయపర్వతములను స్ఫురింపచేస్తుంది. ప్రసిద్ధికెక్కిన శిల్పఖండాలను చూపించి, ఈభావాన్ని అభివ్యక్తీకరింపవచ్చునని నా ఉద్దేశం. ఇలాంటి శిల్పఖండాలు అనేకం వున్నాయి.

అటుతరవాత, కొన్ని ప్రసిద్ధిగాంచిన చారిత్రకదృశ్యాలను చూపించాలి. ఉదాహరణకు, ఆర్యులు ఆర్యావర్తానికి రావడం, గంగానదీతీరాన్ని చేరుకోవడం గంగనుచూసి వారు ముగ్ధులుకావడం, ఆనందించడం ఇవన్నీ చూపించవలసినదృశ్యాలు. సర్ మహమ్మద్ ఇక్బల్ వ్రాసిన "సారా జహాఁసే అచ్ఛా హిందూస్థాన్ హమారా" అనే గీతంలో ప్రసిద్ధిచెందిన రెండుచరణా లున్నాయి; ఇవి ఆర్యులఆగమనాన్ని తెలియచేస్తాయి. ఈ పంక్తులను చలనచిత్రంలో జ్ఞాపకంచేయడం ముఖ్యం. అవి ఇవి.

"ఐ అబ్-ఇ-రాష్-ఇ గంగా వహ్ దిన్ హై యాద్ తుఝ్‌కో
ఉతారా తేరే కినారే జబ్ కేరవాన్ హమారా"

పాకిస్థాన్ కావలెననే ఈరోజులలో, ఒక ముస్లింలీగునాయకుడు దీన్నిగురించి చేసిన వ్యాఖ్యకూడా గమనింపదగినది.

ఇంతేకాక, గంగానదీతీరంలో అనేకయుద్ధాలు జరిగాయి. చంద్రగుప్తమౌర్యునికాలంలో, గంగానదీతీరంలో గ్రీకులదండయాత్ర నిలువరింపబడింది. ఇది బహుశా, అలహాబాద్‌కు అర్థదూరంలో జరిగిందనుకుంటాను. చంద్రగుప్తునికాలంలో జీవితపద్ధతులు ఎలావుండేవో, చూపిస్తే మనోహరంగా వుంటుంది. ఆరోజులలో కనోజ్ గొప్పనగరం. మహాయుద్ధాలకు, ఖడ్గాలకు, ఉక్కు-అస్త్రాలకు అది ప్రసిద్ధికెక్కింది. కనోజ్‌నోగల ఆయుధా లెలావుండేవో, సొరాబ్, రుస్తుంకథలనుబట్టి, అలెగ్జాండర్ దండయాత్రనువర్ణించిన షాహ్‌నామా వర్ణనలనుబట్టి మనం తెలునుకోవచ్చును.

ఇంతకంటె ముందుగానే రామాయణ, మహాభారతకథలను ఆధారం చేసుకుని దీనిచరిత్రను చిత్రింపవచ్చును. తరువాత అశోకునికాలం; ఆయన రాజధాని పాటలీపుత్రం గంగానదీతీరమందే వుంది.

భారతీయసాహిత్యమంతటా గంగానదిప్రస్తావన వుంటనేవుంది. బర్మా, ఇండో-చైనా, తదితరదేశాలపాటల్లో దానిపేరు మనకు వినిపిస్తూనే వుంటుంది. హర్షునికాలంలో భారతదేశానికి వచ్చిన చైనాయాత్రికుడు హూయున్‌సాంగ్ అల్హాబాదులో జరుగుతూవుండే కుంభమేళాను అభివర్ణించాడు. అప్పటికే ఈ ఉత్సవం అతి ప్రాచీనమైనది. గంగానదికి సంబంధించినవీ, చక్కగా పరిపోషించతగినవీ అనేక చారిత్రక సంఘటనలు వున్నాయి. గంగానదిలోయా, ముఖ్యంగా దొబాపరిసరప్రాంతమూ, అనగా గంగా యమునానదులమధ్యగల ప్రదేశమూ, చారిత్రకగాథలతో సంప్రదాయంతో కవిత్వంతో నిండివున్నాయి. సుందరమైన గంభీరమైన యమునా నదిని తలుచుకోగానే మధుర, బృందావనములచుట్టూ అల్లుకునివున్న కృష్ణునికథ కళ్ళకుకట్టినట్లుంటుంది. వ్రజభాషలోని అనేకగీతికలు చెవులలో ప్రతిధ్వనిస్తాయి.

ఏకాలంలో దీనిని దృశ్యంగా తీయవచ్చునో సరిగ్గాచెప్పడం కష్టం. శీతాకాలంలో గంగానది కుచించుకుపోతుంది. చూడడానికి చాలా చోట్ల ఏమీ కనబడదు. వర్షాకాలమయితే బాగానేవుంటుంది మరి. కాని గొప్ప గొప్ప మేళాలన్నీ యించుమించు శీతాకాలంలోనే జరుగుతాయి. అన్నింటిలోకి గొప్పది కుంభమేళా; ఇది పన్నెండుఏళ్ళకొక్కసారి అల్లాహాబాద్‌లో జరుగుతుంది. మీ రదృష్టవంతులు; ఇది వచ్చేసంవత్సరం జనవరి ఫిబ్రవరినెలల్లో జరుగబోతోంది.

గంగ ఆవిర్భవించినప్రదేశం గంగోత్రి; మీ రక్కడకు వెళ్ళగలరో లేదో నాకు తెలియదు. ఇది కష్టంతోకూడినప్రయాణం. రైలుదిగి అక్కడికి వెళ్ళడానికి పదిహేనురోజులు పడుతుంది. బండిదారి లేదు, కనక చాలాదూరం గుఱ్ఱంమీద ప్రయాణంచేయవలసివుంటుంది. గుఱ్ఱం మీద వేగంగా వెళ్ళగలిగితే వారంరోజుల్లో అక్కడికి చేరుకోవచ్చును. నే నెప్పుడూ అక్కడకు వెళ్ళలేదుకాని, రెండేళ్ళక్రితం గార్వాలపర్వతాల గుండా ప్రవహించే గంగానదిని కొంతదూరంవరకూ అనుసరించాను. తరువాత అక్కడనుంచి విమానంమీద బదరీనాథ్ చేరుకొని. గంగానది గమనాన్ని ఆకాశమార్గంలోంచి వీక్షించాను.

గంగ ఉద్భవించిన పర్వతపంక్తులు, హరిద్వార్ పరిసరప్రాంతాలు చాలా ముఖ్యమైనవి.

బసచేయడానికి ఏమంత ఇబ్బందిగావుండదు. సాధారణంగా చౌకీగృహాలు, డాక్‌బంగళాలు వుంటూనేవున్నాయి, పాట్నావంటి పట్నాలలో తృతీయశ్రేణికిచెందిన హోటళ్ళుకూడా వున్నాయి. కాని స్నేహితులకు చెప్పి కొన్ని ఏర్పాట్లుచేయించుకోవచ్చును. అది కష్టమైనపనికాదు.

యమునానదీతీరాన నే నీమధ్యనే ఒకవారంరోజులు గడిపాను. రానురాను యమునకూ నాకూ మరింత గాఢానుబంధం ఏర్పడుతోంది.

"గేంజస్" అనే పదం మీరు ప్రయోగించరనే నే నాశిస్తున్నాను. నా కా పేరు యిష్టంలేదు. 'గంగ' అనే పేరు చెవికి మృదుమధురంగా వుంటుంది. మీ ముందుతరంవారు దీనిని "గేంజస్"గా ఎలా మార్చారో

నా కాశ్చర్యంగావుంది గంగ గేంజస్‌గామారడానికి కారణమేమిటో ఒకా నొకస్నేహితు డొక వివరణ తెలియచేశాడు. అది సబబుగావున్నట్లు తోస్తోంది. గంగాజీ అనేపదానికి గేంజస్ అనేది అపభ్రంశరూపమని ఆయన చెప్పాడు.

నాన్, రంజిత్, నేనూ అందరమూ ఆనందభవనంలో వుంటు న్నాము. కనుక చిరునామాలో మార్పేమీలేదు. నాన్ ప్రస్తుతం హౌజా యిలో వుంటున్నాడు.

ఇందిర నెమ్మదినెమ్మదిగా కోలుకుంటున్నది. ఇంకొంచెం త్వరి తంగా కోలుకుంటే బాగుంటును. త్వరలోనే, భారతదేశానికి రావాలని ఆమె తహతహలాడుతోంది. మూడునెలలుపోయాక, ఆమె ఇక్కడకు చేరుకోవాలని, నేనూ కోరుతున్నాను. కాని ఆమె ఎప్పుడువెళ్ళితే క్షేమం దేదీ చెప్పవలసింది డాక్టర్లే కదా.

మీ,

జవహర్‌లాల్

డాక్టర్ ఎడ్వర్డు థామ్సన్,

అయిల్స్‌బరీ,

బక్స్ (ఇంగ్లండు)

305. ఎడ్వర్డు థామ్సన్‌వద్దనుంచి

అయిల్స్‌బరీ,

బక్స్,

ఏప్రియల్ 28, 1940

ప్రియమైన జవహర్లాల్,

మీరు స్వాగతమిస్తూ వ్రాసిన దీర్ఘమైనలేఖ నాకు అందింది. అవును; రంజిత్ నా మనిషని నాకు తెలుసును. కావి ఒక్కవిషయం; నాకు నాన్‌అన్నా, రంజిత్‌అన్నా చాలా భయం; మిమ్మల్ని మధ్యవర్తిగా పెట్టుకునితప్ప, వాళ్ళచేరువకు నేను వెళ్ళలేను.

సెన్సారునిబంధనలవల్ల, ఈ ఉత్తరంలో నేను మీకు వ్రాయతగ్గది ఆట్టేవుండదు; నార్వేజియన్ యుద్ధం భీషణమైనదని మీకు బోధపడి వుంటుంది. ఇక్కడేమీ పనిలేకుండా కూచునేందుకు నాకు మనస్కరించడంలేదు. ఎదురొక్కనేందుకు విపరీతాలేవీ కనిపించవు; పంధొమ్మిదేళ్ళ వయస్సుగల మా పిల్లవాడు, దూరప్రదేశాలకు వెళ్ళిపోకతప్పదు; అందువల్ల నేనూ నార్వేవెళ్ళాలని ప్రయత్నిస్తున్నాను. దేవునిదయవుంటే, నాకు తుఫానులమధ్యనే వుండాలని వుంది తప్ప, తుఫానులనుతప్పించుకొని, వాటికి సాధ్యమయినంతఎడంగా వుండాలనిలేదు. స్కాచ్, ఐరిష్ వారి దుర్మార్గాన్నంతటినీ 'ఇంగ్లీషు' అనే నామధేయానికి మీవాళ్ళు అనువర్తింపచేస్తున్నారు. మా నాగరికతకు ఈ ఇంగ్లీషు నామధేయానికి వినా శంకలిగేయెడల వాటినుండి విడివడివుండాలని నాకులేదు. ఏమైనప్పటికీ, నావంటి వయసుమీరినవ్యక్తి, యుద్ధరంగానికి చేరువగావుండడం చాలా కష్టం.

నిజమే; మీరు చెప్పినవిధంగా 'గంగ'ను జ్ఞాపకముంచుకుంటాను. నేను మీకు ఉత్తరంవ్రాసినపుడు ఫిల్ము విషయమై నా ఉద్దేశాలు ఒకలాగ వున్నాయి. అప్పటికంటె ఇప్పుడు మా ఆశయాలు మరింత యినుమడించాయి. మా డైరెక్టరు ప్రస్తుతం కెనడాలో వున్నాడు. త్వరలోనే యిక్కడకు చేరుకుంటాడు. ప్రపంచంలో ఒక ఉత్తమచిత్రంగా, దీనిని మేము తీయాలని అనుకుంటున్నాం. మళ్ళీ నేను భారతదేశానికి వచ్చినట్లయితే, ఈవిషయమై రంజిత్‌కు తెలియచేస్తాను.

భారతదేశానికిరావడం, రానురాను నాకు కష్టమౌతోంది. దక్షిణ భారతదేశంలో అసహ్యించుకోతగ్గ ఆంగ్లేయునిగా నేను తయారుతాబోతున్నాను. 1942వసంవత్సరం బి. ఏ. కు "ఏన్ ఇండియన్ డే" అనే గ్రంథాన్ని పాఠ్యగ్రంథంగా మదరాసువిశ్వవిద్యాలయంవారు వేసినట్లు తెలిసింది. ఆ గ్రంథానికి ఎవరో నోట్సు తయారుచేశారనుకుంటాను. మీ విశ్వవిద్యాలయాలు 'ఏన్ ఇండియన్ డే' అనే ఈ నవలకంటె 'ది రైజ్ అండ్ ఫుల్‌ఫిల్మెంట్' అనే పుస్తకాన్ని వినియోగించుకుంటే బాగుంటుందని నా ఊహ. అది మంచిపుస్తకం.

మా చిన్నవాడు మీకు వ్రాసిన ఉత్తరాన్ని నేను భారతదేశం వచ్చినపుడు పట్టుకువస్తే సరిపోను; కాని ఇందుతో పాటు దాన్ని జతచేసి మీకు పంపుతున్నాను. ఇది మీకు ఆసక్తికరంగా వుండవచ్చును.

ఇందిర కులాసాగా వుంటున్నదని అగాథా హారిసన్ వ్రాసింది. చాలా సంతోషం. ఆమె కామధ్య ఒంట్లో ఏమీ బాగులేదు. ఆమె ఎప్పుడు ఇంగ్లండుకు తిరిగివస్తుందో, దయవుంచి తెలియపర్చండి. మీ కీ ప్రదేశాన్ని ఒకసారి వీక్షించాలని నా కోరిక. ఇంగ్లండు ఆగ్నేయప్రాంతాల్లో, యిది చాలా ముగ్ధమోహనమైన పల్లె. ఇటువంటి పల్లెను, అనేకవిధాలైన పుష్పాలతో, చరిత్రతో అలరారుతున్న యీ ప్రదేశాన్ని మీరు చూడనిదే, ఇంగ్లండుదేశాన్ని గురించి తెలుసుకున్నట్లుకాదు.

భారతదేశాన్ని గురించి నేను చాలా కలతపడుతున్నాను. నే నేమీ చెప్పలేను; కాని, నిర్విరామంగా మాత్రం ఆలోచించగలను. గత నవంబరులో మీరు జిన్నాసాహేబ్‌తో ఒకపరిష్కారం కుదుర్చుకోలేకపోయి నందుకు, నా కెంతో విచారంగావుంది; అలాగ ఒకఒడంబడిక కుదిరినపుడు, మిమ్మల్ని అది, బలమైనస్థానంలో వుంచివుంటును. దీన్ని మీరు వాయిదావేయడం తార్కికంగా, సబబుగావుందని నాకు తెలుసును. కాని, అది జరిగినట్లయితేనా!! అది కుదురుతుందనే నే నప్పట్లో భావించాను. నేను మీకు విధేయుణ్ణి; నేను తోడ్పడేకాలం రావచ్చును. ఏమైనప్పటికీ, ఒకటిరెండువిషయాలు గాఢంగా లోతుగా వ్యాపించివోయాయి భారతదేశంతో సంప్రదించకుండా, ఆ దేశం యుద్ధంలో పాల్గొంటున్నట్లుగా మేము ప్రకటించడం ఘోరమైన దోషమని ప్రతివాడికి తెలుసును. మిమ్మల్ని నేను కలుసుకోగలిగినట్లయితే, మీతో స్వయంగా చెప్పవలసిన సంగతులు అనేకం వున్నాయి. ప్రస్తుతంమటుకు ఒకమాటమాత్రం చెప్పగలను. మా ఆలోచనలన్నీ మీ ఆలోచనలవలె వున్నాయి; మా అభిప్రాయాలూ మీ అభిప్రాయాలూ ఒకటే; ఇందిర మళ్ళీ బాగా కోలుకుంటోందని మేమంతా ఆశిస్తున్నాము.

మీ

ఇ. టి.

## 356. అబుల్ కలాం అజాద్ వద్దనుంచి

నైనిటాల్,
మే 9, 1940

నా ప్రియమైన జవహర్ లాల్,

ముస్సోరీనిగురించి, మీరిచ్చిన టెలిగ్రాం నాకు అందింది; అందుకు నే నెంతో కృతజ్ఞుణ్ణి. నైనిటాల్‌లో ఏర్పాట్లుచేసుకోవడంవల్ల ముస్సోరీకి వెళదామనేఅభిప్రాయం వదలుకున్నాను.

నే నిక్కడకు 6వ తేదీన చేరుకున్నాను. పరిస్థితులు అనుకూలించి నట్లయితే ఇక్కడ జూలైవరకూ వుంటాను. మీరు బొంబాయిలో మే మాసాంతంవరకూ వుండి, పిమ్మట అల్లాహాబాద్ వెడతారని అనుకుంటాను. నైనిటాల్‌వచ్చి, నాతోపాటు కొంతకాలం, మీ రెందుకుండకూడదు? ప్లానింగుకమిటీనివేదికను ఇక్కడే మీరు పూర్తిచేసుకోవచ్చునుకదా. రాష్ట్రికార్యకలాపాలకు సంబంధించినంతవరకూ అల్లాహాబాద్‌కూ నైనిటాల్‌కూ భేదమేమీలేదు. అలహాబాద్‌లోవుంటే ఎలాగుంటుందో మీకు యిక్కడున్నా అలాగేవుంటుంది. ఇక్కణ్ణుంచిసైతం అక్కడనుంచి లాగే పనితో సంబంధంపెట్టుకోవచ్చును. అదీకాక, మీరు ఇక్కడవుంటే అనేకవిషయాలనుగురించి ఎప్పటికప్పుడు మీతో సంప్రదించేఅవకాశం నాకు వుంటుంది.

వార్ధాలో, శ్రీ పట్వర్ధన్‌తో నేను మాట్లాడాను. మరోమారు తాను నాతో మాట్లాడతానని ఆయన అన్నాడు కాని, ఇంతవరకూ ఆయన నన్ను కలుసుకోలేదు. వర్కింగ్ కమిటీసభ్యుడుగావుండడానికి అంగీకరిస్తారో అంగీకరించరో ఆయన్ని మీరు దయవుంచి తోగట్టాచేయండి. నా కాయనచిరునామా తెలియక, మిమ్మ ల్నిలాగ యిబ్బందిపెడుతున్నాను. సోషలిష్టుమిత్రులు, బొత్తిగా కొరగానివారని తేటతెల్లమయింది. పనిచేయడానికి వారికి ధైర్యంచాలదు; ప్రతిపక్షమంటే భయం. తమ స్వంతకాళ్ళమీద తాము నిలబడలేరు. ఈ క్లిష్టసమయంలో, వారు కొంతసహాయపడగలరని నే నాశించాను; కాని నా ఆశలన్నీ నిరుపయోగమయాయి.

వర్కింగుకమిటీసభ్యుడుగా వుండేటందుకు, పట్వర్ధన్‌కు యిష్టం లేకపోతే, వెంటనే ఇంకొకరిని నామినేటుచేయవలసివుంటుంది. మీరు ఎవరిపేరునై నా సూచించగలరా?

సమ్మెనుగురించి ది ఇంపీరియల్ టుబాకో కంపెనీవారు నా కొక 'నోట్' పంపించారు. కంపెనీవారికథనాన్నిబట్టి సమ్మెస్వభావం, కార్మికులు చెబుతున్నదానికి పూర్తిగా భిన్నంగావుంది. ఏమైనప్పటికీ, గౌరవప్రదమైన రాజీకుదర్చడానికి మార్గాంతరాన్ని కనుగొనేందుకు ప్రయత్నిస్తున్నాను.

మీ విశ్వాసపాత్రుడు,
ఎ. కె. ఆజాద్

307. అబుల్‌కలాం అజాద్‌నద్దనుంచి

నైనిటాల్
మే 25, 1940

నా ప్రియమైన జవహర్‌లాల్,

మీ 18వతేదీ ఉత్తరానికి నా ధన్యవాదాలు. పత్రికలలోపడిన రాజేంద్రప్రసాద్ ప్రకటనను నేను చదివాను; ఆశ్చర్యపడ్డాను. ఈలోపున ఆయనవద్దనుంచి నా కొక ఉత్తరం వచ్చింది. ఆయన ఆలోచనధోరణి ఎటుసాగుతున్నదో, నా కా ఉత్తరం స్పష్టపరిచింది. నే నాయనకు ఉర్దూలో వ్రాసిన ఉత్తరంనకలును, మీకు పంపలేకపోతున్నందుకు విచారిస్తున్నాను; ఆఫీసులో ఆఫీసుకుసంబంధించినఉత్తరాలనకళ్ళుతప్ప మరే నకళ్ళూ అట్టేపెట్టరు. కాంగ్రెస్‌ప్రస్తుతవైఖరికి సంబంధించినంతవరకూ ఈ ఉత్తరం యించుమించు మీ ఉత్తరాన్నే పోలివుంది. ఈ విషయంలో, మన ఆలోచనలు ఒకేమార్గాన కొనసాగుతున్నందుకు నా కెంతో సంతోషంగావుంది; గాంధీజీకూడా వీటితో ఏకీభవించడం నిజంగా ముదావహం.

రాజన్‌బాబుప్రకటనకంటె, అసఫాలీపత్రికాప్రకటన మరింత అభ్యంతరకరంగావుంది. వాస్తవానికి, దాన్నిచదివి,నే నెంతో ఖేదపడ్డాను. ఆయన్ని తీవ్రంగా విమర్శిస్తూ వెంటవెంటనే వరుసగా రెండుఉత్తరాలు

వ్రాశాను. ఇకముందు, తా నట్టి పత్రికటనలుచేయబోనని ఆయన నాకు వాగ్దానంచేశారు.

మీరు, నాకూ రాజన్‌బాబుకూ వ్రాసిన ఉత్తరాలలోనివిషయాలు, కాంగ్రెసువైఖరికిసంబంధించినంతవరకూ పూర్తిగా సరియైనవి. ప్రస్తుత దశలో, మార్పుఅనేప్రశ్న తలఎత్తడానికి అవసరమేమిటో బోధపడడం లేదు. కాని, మీఉత్తరాల్లో వీటితోపాటు రెండువిషయాలు వ్రాశారు; వాటితో నే నేకీభవించలేకపోతున్నాను. కాంగ్రెసుకార్యవిధానానికి, మీరు యోచిస్తున్న ఈ ఆలోచనలు ఎలా సరిపడగలవో నాకు అర్థంకాకుండా వుంది. రాజన్‌బాబుకు వ్రాసినఉత్తరంలో మీ రిలాగ పేర్కొన్నారు: "సత్యాగ్రహానికి మనం సంసిద్ధులమైవున్నప్పటికీ, వెనువెంటనే దాన్ని ప్రారంభించాలని సూచింపబడలేదు. ఈ ప్రత్యేకపరిస్థితుల్లో, బ్రిటన్ ప్రమాదావస్థలో చిక్కుకునివున్నసమయంలో, దాని నిస్సహాయస్థితిని ఒకఅవకాశంగాతీసుకుని, మనం దాని గొంతుకనులమడం భావ్యంకాదనీ, అది తప్పనీ నా భావం" ఇదే భావాన్ని మీరు మీ లక్నోఉపన్యాసంలో వ్యక్తపరిచారు; పయినీర్‌పత్రిక మీరుచెప్పినవాక్యాలను యథాతథంగా ఉదహరించడం అవసరమనుకుంది. "యహ్ బాత్ హిందూస్థాన్‌కీ షాన్‌కే ఖిలాఫ్ హై, కి, వహ్ ఇంగ్లండ్‌కీ కంజోరీసే ఫా-యి-దా ఉఠాకర్ ఇస్ వక్త్ సత్యాగ్రహ్ షురూకర్‌దే" ఈవిధమైన ఆలోచనాపద్ధతిని నేను గ్రహించడానికి అశక్తుడనయిపోతున్నాను. వాస్తవానికి, మొత్తంమీద ఈరకమైన ఆలోచన పూర్తిగా తప్పు; రాజకీయపోరాటాలవిషయంలో మొట్టమొదట ఇటువంటిఊహలు ఊహించుకోవడం, మన కార్యాచరణకుసంబంధించి, దోషభూయిష్టమైన నిర్ణయాలకువావడం అసంగతం. భారతదేశానికి ఏది "గౌరవప్రదమో" మరి, నాకు తెలియడంలేదు. కావించిన నిర్ణయమేమిటో, ఆ నిర్ణయం మనలను ఎక్కడకు తీసుకుపోతుందో నేను తెలుసుకోగోరుతున్నాను. అంధులవలె మనం చీకట్లో తపుళ్ళాడలేం; కళ్ళుతెరచి, మన మొక నిర్దిష్టమైనమార్గాన్ని అనుసరించాలి. ముందొకమార్గాన్ని అనుసరించాలని నిర్ణయించుకొని, తరవాత,

దాన్ననుసరించ నిరాకరించడం చాలా తప్పు. అంతకంటే దోషం యింకొకటిలేదు.

మనల్ని తనతోపాటు కూడాతీసుకువెళ్ళడానికి బ్రిటన్‌కు మనం అన్నిఅవకాశాలూ యిచ్చాం. కాని అలాచేయడాని కది మూర్ఖంగా మొండిగా నిరాకరించింది. ఈ సామ్రాజ్యవాదయుద్ధంలో పాల్గొనకూడదని మనం నిర్ణయించుకోక తప్పిందికాదు. మనం అలాగ నిర్ణయించుకోవలసినపరిస్థితిని అదే సృష్టించింది. మనం అవలంబిస్తున్న ప్రస్తుతవైఖరి గాంధీజీమాటలలో చెప్పాలంటే, బ్రిటన్‌కు అశ్చర్యకరంగావుంటే లేదా మీ మాటలలో చెప్పాలంటే అది భారతదేశానికి "గౌరవప్రదం"గా లేదంటే అందుకు మన మేమీ చేయలేము. దానికి గత్యంతరమంటూ ఏదీలేదు. ఇందుకు మన మెంతమాత్రం బాధ్యులంకాము. బ్రిటిషుప్రభుత్వపు మూర్ఖమైన స్వార్థశయమే యిందుకు హేతువు.

ప్రస్తుతపరిస్థితులలో మనం సత్యాగ్రహనమరాన్ని ప్రారంభించకూడదని మీ రంటున్నారు. కాని, సత్యాగ్రహమంటే ఏమిటని మీ ఉద్దేశం? కాంగ్రెసు యింతకుపూర్వం ఎన్నడూఎరుగని యుద్ధంకాదుకదా యిది? ఈ యుద్ధంలో బ్రిటిషువారికి సహాయపడకూడదని చెబుతూ అలాంటిసహాయాన్నిఆపుచేయడమే కాంగ్రెసుచేయదలచుకున్న యుద్ధం. అంతకన్న మరేమీకాదు. ఈ సహాయనిరాకరణ ఆచరణలో నిజంగా యింకా ప్రారంభంకానేలేదు, భవిష్యత్‌లో దీని నింకా ముందుకు కొనసాగించవలసివుంటుంది. యుద్ధానికిసంబంధించిన ఆర్డినెన్సులుండడం వల్ల, వ్యక్తులను అరెస్టుచేయడంవల్ల ఈ సత్యాగ్రహం దానంతట అదే శాసనోల్లంఘనోద్యమరూపాన్ని ధరించక తప్పదు.

భారతదేశగౌరవానికి సంబంధించి మీకుగల నైతిక తాత్త్విక దృక్పథం సబబైనదని భావించినట్లయితే దానర్థం యిదిః రామ్‌ఘర్ తీర్మానం భారతదేశ గౌరవప్రతిష్ఠలకు పూర్తిగా విరుద్ధమైనది.

ప్రభుత్వంతో ఏదో ఒకవిధమైన పరిష్కారం కుదిరినట్లయితే మన భవిష్యత్‌కార్యక్రమమూ, వైఖరీ ఎలాగేఉండాలో మీ రీ లేఖలో వ్రాసుకొచ్చారు. "ఇవన్నీఅంగీకరింపబడినప్పటికీ (అనగా స్వాతంత్ర్యం,

స్వయంనిర్ణయాధికారం, వయోజనఓటింగుపద్ధతిద్వారా ఏర్పడే రాజ్యాంగసభ) ఈ యుద్ధంలో మన ప్రధానశక్తిని వినియోగిస్తామని దానర్థం కా"దని మీ రంటున్నారు.

కాని, అదలాగ జరగనప్పుడు బ్రిటిషుప్రభుత్వం మనం అడిగిన దంతా యిస్తుందని మన మెందుకు ఆశించాలి? బ్రిటిషుప్రభుత్వంపై మనం ఒత్తిడితెచ్చినప్పుడు యిక గత్యంతరంలేక దానికి యిష్టంలేక పోయినా ఇవన్నీ విధిగా యివ్వడానికి అంగీకరిస్తుంది. కాని ఈ సమయంలో బలప్రయోగమన్న ప్రశ్నయేలేదు. సత్యాగ్రహమనే నైతిక శక్తిని ప్రయోగించడమే భారతదేశగౌరవానికి భంగకరంగా భావిస్తున్నపుడు ఇక ఒత్తిడిపెట్టడమన్నప్రశ్న రానేరాదు కదా।

ఇంతటి అశాస్త్రీయమైన, గజిబిజిగావున్న ఆలోచనలు మీ కెలాగ కలిగాయో నాకు అర్థంకావడంలేదు. అందరిమాటకేమిగాని, మీరుమాత్రం యీ పద్ధతిలో ఆలోచిస్తారని నే నెన్నడూ అనుకోలేదు.

లాహోరులో మీ ఉనికి, అక్కడికార్యకలాపాలకు దోహదకారిగా వుంటుందని ఆశిస్తున్నాను. సికిందర్ హయత్ ఈవేళ నా కొక టెలిగ్రాం యిచ్చాడు; దాని కాపీ బహుశా, మీకు అందగలదనుకుంటాను. ప్రస్తుత పరిస్థితికి బాధ్యతంతా, బ్రిటిషుప్రభుత్వానిదేనని, మా దెంతమాత్రం కాదని, నే నాయనకు తంతియిచ్చాను.

పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ, మీ విశ్వాసపాత్రుడు,
C/o డాక్టర్ ఖాన్‌సాహేబ్, ఎ. కె. ఆజాద్
మాజీ ముఖ్యమంత్రి, పెషావరు

308. ఖాన్ అబ్దుల్ గఫ్ఫూర్ ఖాన్‌వద్దనుంచి

దుంగాగాలీ,
అనువాదం హజరాజిల్లా,
జూలై 13, 1940

ప్రియమైన పండిట్‌జీ,

మీ టెలిగ్రాం నిన్న యిక్కడ నాకు అందింది. క్యాంపుకు యింకా తేదీ నిర్ణయింపబడలేదు; కారణం, వారంతా నాకోసం నిరీక్షిస్తు

న్నారు. ఇక్కడకు చేరినవెంటనే, వారికి ఉత్తరంవ్రాశాను. నిర్ణయించబడినవెంటనే తేదీ మీకు తెలియచేస్తాను. రాజాజీ, మౌలానాసాహేబ్‌లు వ్యక్తపరిచినభావాలు రేడియోద్వారా, మీరు వినివుంటారు. జిన్నా, మౌలానాసాహేబ్‌లకు జరిగిన సంభాషణలతాత్పర్యం మీకు అవగతమై వుంటుంది. మౌలానాసాహేబ్ ఏమిటిచెప్పారో గ్రహించగలిగాను కాని, జిన్నాఉద్దేశ మేమిటో నేను బోధపరుచుకోలేకపోయాను.

క్యాంపువున్నన్నాళ్ళూ నే నిక్కడ వుంటాను; పిమ్మట పని ప్రారంభిస్తాను, ఇక్కడివాతావరణం చాలా బాగుంది. నా ఆరోగ్యం చాలా మటుకు బాగుపడింది. యూనస్ సాహేబ్‌వద్దనుంచికూడా నేను విన్నాను. శ్రీనగర్‌లో ఉష్ణోగ్రత ఎక్కువగావుంటుంది; ఆయన చాలావరకూ గ్రామీణప్రాంతాల్లోనే కాలంగడుపుతూవుంటారట.

నేను పూనాకు రాలేను; అక్కడకూడా అఖిలభారత కాంగ్రెసు కమిటీ, యిదేవిధంగా తీర్మానించినట్లయితే, కమిటీసభ్యత్వానికి రాజీనామాయివ్వడానికి నాకు స్వేచ్ఛవుంది.

మీరు కులాసాగావున్నారని తలుస్తాను. ఉపాధ్యాయకు తదితరులకు దయవుంచి న న్నొకసారి జ్ఞాపకంచేయండి.

అబ్దుల్ వాలీ, ఘనీ, రోషన్, మెహ్రతాజ్ మిమ్మల్ని ఎప్పుడూ అడుగుతూవుంటారు; తమ సలామ్‌లను మీకు అందచేయమంటున్నారు.

మీ,
అబ్దుల్ గఫూర్‌ఖాన్

309. అబుల్‌కలాం అజాద్‌వద్దనుంచి

నైనిటాల్,
జూలై 19, 1940

నా ప్రియమైన జవహర్‌లాల్,

మీ 16నతేదీలేఖకు నా ధన్యవాదాలు. దయవుంచి నా పత్రికటపను మళ్ళీ ఒక్కసారి చదవండి. తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదింపబడిం

దని నే ననలేదు. తీర్మానఅంతరార్థాన్నిమాత్రమే నేను విశదీకరించాను. అలాగ విశదీకరిస్తూ, భారతదేశవాంఛ అంగీకరింపబడినట్లయితే, అది (భారతదేశం) యుద్ధంలో పాల్గొనాలని, అందరూ స్పష్టంగా భావిస్తున్నారని నేను చెప్పాను. స్టేట్సుమన్ మొదలైనపత్రికలు ప్రకటనకు యిదే అర్థమని గ్రహించాయి.

మనం పూనాలో సమావేశమయేలోపున, ప్రస్తుతం మీరు ఈవిషయాన్నిగురించి ఎట్టిప్రకటనచేయకుండావుంటే, మీకు నే నెంతో కృతజ్ఞుడను. ఈవిషయమై మీతో సాకల్యంగా మాట్లాడాలని అనుకుంటున్నాను. ఢిల్లీలో మనం మాట్లాడుకుందుకు మనకు అవకాశంలభించకపోవడం చాలా విచారకరం. చైనానుంచివచ్చిన లేఖాప్రతి నాకు అందింది.

మీ విశ్వాసపాత్రుడు,

ఎ. కె. అజాద్

310 జయప్రకాశ్ నారాయణ్ వద్దనుంచి

[జయప్రకాశ్నారాయణ్ అప్పుడు హజారీబాగ్ సెంట్రల్ జైలులో వున్నారు. అక్కడనుంచి ఆయన ఈ ఉత్తరం పంపించారు.]

ఖుద్దున పంపినలేఖ

జూలై 20, 1940

ప్రియమైన భాయ్.

ఇటీవలిసంఘటనలు మనల్ని ఎంత బాధపెట్టాయో, మన కెంత మనోవ్యథను కలిగించాయో మీరు ఊహించుకోగలరు. మనలను రాజాజీ వెన్నుపోటుపొడిచారు. ఈ అపఖ్యాతికరమైనకార్యాన్ని మీరూ ఖాన్ సాహెబూ వ్యతిరేకించారని విని, ఆత్మ ఉపశమిల్లింది. కాని, కేవలం వ్యతిరేకించడంతో యిది సరిపోతుందా? ఎ. ఐ. సి. సి. లో వున్న ప్రతిపక్షాన్ని, దేశాన్ని మీరు నాయకత్వంవహించి ముందుకు నడిపిస్తారని ఇక్కడివాళ్ళమంతా ఆశిస్తున్నాం. అందుకు మిమ్మల్ని అభ్యర్థిస్తున్నాం, కమిటీలో మీ పదవికి మీరు రాజీనామాయివ్వాలి. ఒడంబడిక

కుదిరినపిమ్మట అనగా అలాగ కుదిరిననాడు మీరు కాంగ్రెసును విడిచి పెట్టి యింకా అసంపూర్ణంగా మిగిలివున్న రాజకీయకార్యక్రమాన్ని భారత దేశ విప్లవ సాంఘిక ప్రధానకార్యభారాన్ని నిర్వహించి వాటిని పరిపూర్తి చేయడానికి వేరే యింకొక రాజకీయసంస్థను నెలకొల్పాలి. ఇది మీరు చేస్తారా? కాంగ్రెస్‌మరణాన్ని రాజాజీతీర్మానం సూచిస్తున్నదని బహుశా, మీరందరూ అభినందిస్తారనుకుంటాను. కాంగ్రెసు విచ్ఛిన్నమౌతుందన్న భయం యిక యిప్పుడు అవాస్తవికమైనది. గాంధీజీ, తనమార్గాన తాను ఉదాత్తంగా వ్యవహరిస్తున్నారు. కాని, ప్రత్యక్షంగా కాకపోయినా, పరోక్షంగా ఆయనతోడ్పాటు దేశద్రోహులకు లభిస్తూనేవుంది. గాంధీజీతో విడిపోడానికి వల్లభాయ్, రాజాజీలు ఏమాత్రం సంకోచించలేదు. స్పష్టంగా కనిపిస్తున్న చారిత్రకమైనబాధ్యతను నిర్వర్తించడానికి మీరు సంకోచిస్తారా? అయితే, మీ రెంతవరకూ సాధించగలరో నేను చెప్పలేను. కాని, యిందువల్ల మీతరవాతవచ్చినవ్యక్తులకు ఒక మహత్తరమైన మార్గాన్ని మీరు ప్రకాశవంతంచేసినవారౌతారు.

ఈ ఉత్తరం ఉద్రేకంతోకాని, లేదా క్రోధంతోకాని వ్రాయలేదు. చాలా ప్రశాంతంగా, జాగ్రత్తగా ఆలోచించి వ్రాశాను.

మీ

జయప్రకాశ్

పి.యస్. అక్టోబరునెలమధ్యలో నేను విడుదలకావచ్చునునుకుంటున్నాను.

311. చెంగ్ ఇన్–షెన్ వద్దనుంచి

చైనా బ్రాంచి,
ఇంటర్నేషనల్ పీస్ క్యాంపైన్,
పోస్టుబాక్స్ 123, చుంకింగ్, చైనా,
ఆగస్టు 21, 1940

ప్రియమైన శ్రీ నెహ్రూ,

మీకు మేం ఉత్తరంవ్రాసి చాలాకాలమైంది. ఈఏడు జనవరి 9వ తేదీన ఒకలేఖ వ్రాశాము.. ఇంతకాలం ఉత్తరంవ్రాయకుండావుండడానికి

కారణం మా అలసత్వంకాదు; మీకు ఉత్తరంవ్రాయడానికి మే మెప్పుడూ ఉత్సాహపడుతూనేవచ్చాం: కాని, నెమ్మదిగా, నిర్విరామంగా, రోజులతరబడి జరుగుతున్నపోరాటంవల్ల ఉత్తరంవ్రాయడానికి వీలులేకపోయింది; మేము ఓర్మివహించి, సహనంతో కృషిసాగించవలసివుంది.

ఇంతకీ, ఇన్నాళ్ళనుంచీ అవ్యక్తంగా రాశీభూతమైవున్న భావానుభావాలను, ఇప్పుడు మీకు వ్యక్తంచేయకుండావుండలేం; భారతదేశ ప్రస్తుత క్లిష్ట చారిత్రకదశలో సైతం, మీ రే ఆశయార్థం పోరాడుతున్నారో, అదేఆశయంకోసం పోరాడుతున్న మీ పొరుగునవున్న మీ మిత్రుణ్ణి మీరు మరువలేదు. చైనాపై మీకుగల అపారమైన సానుభూతిని ఇటీవల మీరు లక్నో "నేషనల్ హెరాల్డ్"లో వ్రాసిన "భారతదేశం, చైనా, ఇంగ్లండు" అనే వ్యాసం యింకొకఉదాహరణ. మీ నిరవధికమైన సానుభూతి సహకారాలకు, మళ్ళీ యింకొకసారి మా ప్రశంసలను కృతజ్ఞతను తెలియపరచనీయండి; ఇలాగ వ్యక్తపరచడంద్వారా, మేము మా సర్వ చైనాప్రజలమన్ననలనూ మీకు అందజేస్తున్నామని తలపోస్తున్నాము. "భారతదేశం, చైనా, ఇంగ్లండు" అనే మీ వ్యాసానికి చుంకింగ్‌లో, అపారమైన ప్రాచుర్యమీయబడింది. అత్యంత పలుకుబడిగల "టాకుంగ్ పావో" అనే పత్రికలోనూ, చుంకింగ్‌నుంచి వెలువడే "హాంకా హెరాల్డు" లోనూ పునర్ముద్రింపబడిన మీ వ్యాసభాగాన్ని కత్తిరించి, ఇందుతో ఆ కత్తిరింపులను మీకు పంపడానికి ఉత్సాహపడుతున్నాం.

ఇంగ్లండు భారతదేశంపట్ల అనుసరిస్తూవస్తున్న బుజ్జగింపు విధానం దానంతటదేలోకానికివెల్లడయిపోయింది; తద్విధానవిషఫలితాలను ఇప్పుడది ప్రత్యక్షంగా అనుభవిస్తోంది. బర్మారహదారిని మూసివేయడం వల్ల ఇంగ్లండుకు లాభించేదేదీలేదు; దాని తూర్పుసరిహద్దు సురక్షితంగా వుండజాలదు.; అంతమాత్రాన, ఇంగ్లండును జపానువారు ఖాతరుచేయరు: వారు ఏరోజునైనా, తూర్పుదిశనుంచి ముందుకుత్రోసుకువస్తారు. దీనివల్ల నలభైఅయిదుకోట్ల జనసంఖ్యగల ఒక అగ్రదేశపు స్నేహభావాన్ని ఇంగ్లండు పోగొట్టుకుంటోంది. కాని, దీన్నిచూసి, చైనాప్రజలు విభ్రాంతులుకావడంలేదు;వారు నిశ్చేష్టులంతకన్నాకావడంలేదు. సంపూర్ణ స్వాతం

త్ర్యంతప్పు. మరేదీ భారతప్రజలనుసంతృప్తిపరచనట్లే,చైనాప్రజలు,తమ పోరాటాన్ని ఒదులుకొనేటట్లు ఏదీ చేయలేదు; మా మార్గంలో ఎన్ని కష్టాలు ఎదురైనప్పటికీ, మేము ఎందుకు ఆయుధాలను చేపట్టామో, ఆ లక్ష్యం నెరవేరి, విజయంసిద్ధించేవరకూ మేం పోరాటాన్ని విరమించ జాలం. కోట్లాది చైనాప్రజలజీవితాలు, అపారమైన సంపదలు నిరుప యోగంగా వెచ్చింపబడవు. ప్రజలు మాపట్ల వుంచిన విశ్వాసం ఊరికినే పోదు; వారెన్నటికీ ఆశాభంగంచెందరు.

మాటిమాటికీ బ్రిటిష్ రాజనీతిజ్ఞులు తమ రాజకీయఎత్తుగడలలో విఫలులౌతున్నా, ఈ అనుభవం వారికి జ్ఞానోదయంకలిగించకుండా వుంది; తమ ప్రభుత్వవిదేశాంగనీతిని దురాక్రమణదారులు చక్కదిద్దుకో లేకపోతున్నా, దురాక్రమణకులోనయినదేశాలు ఈ పెద్దమనుష్యుల అతి తెలివైనపోకడలవల్ల గుణపాఠాలను నేర్చుకుంటూనేవున్నాయి. బ్రిటిష్ వారి చిత్తశుద్ధిని శంకించి, ఈ సంవత్సరారంభంలోనే, భారతజాతీయ కాంగ్రెస్ బ్రిటిష్ప్రభుత్వ యుద్ధప్రయోజనాలను ప్రశ్నించడం ఆశ్చ ర్యంగాలేదు. సంకుచిత స్వప్రయోజనాలవల్ల దృష్టి మందగించిన బ్రిటిష్ప్రభుత్వం మానవజాతికి ప్రధానమైన ఆశయాలు ప్రమాదావస్థలో వున్నవనేసత్యాన్ని గుర్తిస్తుందని కలలోకూడా విశ్వసించలేం. తన మాటలకూ చేతలకూ పొందనివిధానాన్ని బ్రిటిష్ప్రభుత్వం అవలం బిస్తోంది. ఈ విధానాన్ని ఇంగ్లండులోని విద్యావంతులు పూర్తిగా ఆమో దిస్తున్నారని మనం నమ్మడానికి సిద్ధంగామాత్రం లేం. ఏమీఅంటే యూరపులో యుద్ధంప్రారంభమయినవెంటనే బ్రిటిష్ ఐ. సి. సి. కావిం చిన నిశితమైనప్రకటన యింకా మనకు జ్ఞాపకంవుండనేవుంది. భారత దేశస్వాతంత్ర్యవాంఛను చిత్తశుద్ధితో అంగీకరించి ప్రజాస్వామికసిద్ధాం తాలపట్ల తనకుగల విశ్వాసాన్ని తాను ఋజువుచేసుకోవలసినదిగా బ్రిటిష్ ప్రభుత్వాన్ని వారా ప్రకటనలో కోరారు. ప్రస్తుతం బర్మారహదారివిష యంలో అనేకమంది బ్రిటిషుప్రజలు చైనాపట్ల తమసానుభూతిని వ్యక్తంచేస్తూ ఇంగ్లండులోని చైనారాయబారికి శరపరంపరగా లేఖలు వ్రాస్తున్నారు. కాని దూరదృష్టిగల ఈ ప్రజలు యింతకంటే మరేమీ

చేయలేనపుడు ఈ స్థితి బ్రిటిషుప్రభుత్వవిధానాన్ని మార్చలేదు; ఇప్పటికీ తనపట్లగల సానుభూతిని బ్రిటన్ క్రమేపీ పోగొట్టుకుంటుంది. నైతికంగా భౌతికంగా తత్ఫలితం వినాశకరంగా పరిణమించకతప్పదు.

భారతప్రజలపట్ల మాకు అపారమైన సానుభూతివుంది. ఇక్కడివారు అమిత శ్రద్ధానక్తులతో భారతదేశంలోజరుగుతున్న పరిణామాలను గమనిస్తున్నారు. జీవన్మరణసంగ్రామంలో పూర్తిగా మునిగివుండడంవల్ల చైనా ప్రస్తుతం మీ కేమీ సహాయపడలేకపోతోంది. అయినప్పటికీ మా విజయం, మీకు పరోక్షంగా సహాయపడగలదని మేము విశ్వసిస్తున్నాం. ప్రజాస్వామికచైనాకు జనకుడనదగిన డాక్టర్ సన్‌యట్‌సేన్ బోధలేమిటో మీకు బాగా తెలుసును. మా జాతీయతత్త్వం ఈ బోధనలతో నిండివుంది.

మీ స్వాతంత్ర్యపోరాటంనుంచి మేం నిరవధికమైన ప్రోత్సాహాన్నీ నూతనోత్సాహాన్నీ సదాపొందుతూనేవున్నాం. ఒకప్పుడు బాముకోల్పోయిన స్వాతంత్ర్యాన్ని తిరిగి యిప్పుడు సముపార్జించుకునేందుకు, భారతీయ మిత్రులు అనేక కష్టాలకుసైతం లోబడి, అకుంఠితదీక్షతో పోరాడుతున్నారు; ఈ స్వాతంత్ర్యమన్నది ఎంతటి అమూల్యమైనదో, వారిపోరాటంవల్ల మేం గ్రహించగలిగాం; అందువల్ల మేం యిప్పుడు అనుభవిస్తున్న స్వాతంత్ర్యం అత్యంత ప్రియమైనదని ఎనలేనిదని మేం భావిస్తున్నాం. భారతదేశంలో శ్రీ గాంధీనాయకత్వాన, మీ నాయకత్వాన, చైనాలో జనరల్ జంగ్‌కైషేక్‌నాయకత్వాన, మనం మన జాతీయస్వాతంత్ర్యాన్ని సాధించగలమని నా విశ్వాసం. చైనా భారతదేశప్రజల సమైక్య అభీష్టాలకు అవరోధంకలిగించగలిగేదేదీ వుండదు. గత మూడేండ్లప్రతిఘటనసంగ్రామంలో, మేం గడించుకున్న అనుభవం మా కొక అప్రతిహతమైన విశ్వాసాన్ని కలిగించింది; బానిసలుగా పడివుండడానికి, దోపిడీ చేయబడడానికి, ఇప్పుడిక నలభై కోట్ల చైనాప్రజలు సంసిద్ధంగాలేరు; శత్రువు అధికబలవంతుడైనప్పటికీ, అపారమైన ఆయుధాలతనికి వున్నప్పటికీ, చైనాప్రజలు అప్రతిహతంగాఅతన్నెదిరించగలరు; అచంచలమైనవారివిశ్వాసమే శత్రువును నిరోధించగల అడ్డుగోడ కాగలదు.

భారత చైనాదేశాలచరిత్రను అవలోకించినట్లయితే, ఈ దేశాల కెన్నడూ సరిహద్దులలో ఎట్టిసంఘర్షణ కలగలేదన్నసంగతి విదితమౌతుంది; ఈ రెండుదేశాలవారూ తమతమ దూతలను ఒకరిదేశానికింకొకరు పంపుకుంటూ, ఒకరినాగరికతనుంచి యింకొకరు మంచిని స్వీకరించి, స్నేహభావంతో మెలగుతూవచ్చారని, చరిత్ర చాటిచెబుతున్నది. ఇది మన రెండుదేశాల సుదృఢమైత్రికి గట్టి పునాదిరాయివంటిది. మనం మన జాతీయవిముక్తికోసం కృషిచేస్తున్నాం. ఈ కృషి మనకున్న స్నేహసంబంధాలను యింకా దృఢతరంచేస్తుందని మా విశ్వాసం. ప్రపంచ శాంతికోసం, చైనా భారతదేశప్రజలు భుజంభుజంకలిపి, కృషిచేసేరోజు రావాలని మేం ఆత్రుతతో ఎదురుచూస్తున్నాం.

భారతదేశాన్నిగురించి చాలినంతభోగట్టా మా కిక్కడ లభించడం లేదు. మీరు ఏమాత్రం సమాచారాన్నిపంపడానికి శ్రద్ధవహించినా, మేం మిక్కిలి సంతోషిస్తాం. దానికి విస్తృతమైనప్రచారం లభించేటట్లు చేయగలమని, అందువల్లచైనా భారతదేశప్రజలు ఒకరినొకరు చక్కగా అర్థం చేసుకోగలరని మా నమ్మకం.

మీ ఉదాత్తకృషికి, మా హృదయపూర్వకాభివందనాలు.

గౌరవంతో, మీ,

పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ,
అల్లాబాద్, ఇండియా

చెంగ్ యిన్-ఫన్
కార్యనిర్వాహకకార్యదర్శి

212. మదాం జంగ్‌కై షేక్ వద్దనుంచి

జనరలిస్మో ప్రధానకార్యాలయం,
చుంకింగ్, షెచువాన్,
చైనా,
సెప్టెంబరు 10, 1940

ప్రియమైన శ్రీ నెహ్రూ,

మీరు శ్రీ హ్స్యాలియాన్-చుంగ్‌ద్వారా చైనీస్ కాన్సల్‌జనరల్ ద్వారా పంపించిన మీ ఉత్తరాలకు ధన్యవాదాలు తెలియచేస్తూ లేఖ వ్రాయాలని నే నెన్నోసార్లు అనుకుంటూవచ్చాను.

అనేకకష్టాలతోనిండివున్నఈరోజులలోసైతం నేనూ, జనరలిస్మో భారతదేశంలో జరుగుతున్న పరిణామాలను ఎంతో ఆందోళనతో ఆత్రుతతో గమనిస్తూనేవున్నాం. మీరు చైనాను సందర్శించడంవల్ల భారతదేశ సమస్యల యథాతథస్వరూపాన్ని మేం మరింత సమగ్రంగా ఆకళించుకోగలిగాం; ఆ అవగాహనతోనే భారతజాతీయకాంగ్రెస్‌పట్ల బ్రిటిషువారి విధానం యింతకంటే ఉదారంగా వుంటుందని మీవలె మేమూ ఆశించాం.

ఈ అక్టోబరునెలలో చైనాకురావలసినదిగా మీ సోదరి శ్రీమతి పండిట్‌ను మరికొందరు మహిళామణులను ఆహ్వానిస్తూ మీసోదరికి తంతియిచ్చాను. నే నిదివరకు మీకు ఉత్తరంలో సూచించినట్లుగా గడచిన వేసవికాలమెల్లా నిర్మలంగావున్నప్రతిరోజూ జపాన్‌విమానాలు చుంకింగ్ నగరంపై బాంబులుకురిపిస్తూనేవచ్చాయి. నిజానికి ఒక్క చుంకింగ్‌నే కాదు; స్వతంత్రచైనాదేశపు అన్నిప్రాంతాలపై వారివిమానాలు దాడి చేశాయి. ఇప్పుడు మీరు చుంకింగ్‌కు వచ్చినట్లయితే, దాన్ని మీరు పోల్చుకోలేరు. వాణిజ్యవ్యాపారాలతో కలకలలాడుతూవుండే జిల్లాలలో, కొన్నిచదరపుమైళ్ళప్రాంతాలు నానాభీభత్సంగా తయారయ్యాయి. ఎటు చూసినా, శిధిలవాతావరణం మీకు కనిపిస్తుంది. కనుచూపుమేరవరకూ మరేదీ కనిపించదు. ఇదివరకెన్నడూ మానవుడెరుగని ఈ ఉన్మాదచర్య వల్ల మానవజీవితాల, ఆస్తుల విధ్వంసంవల్ల వేలాదిపౌరులు కొంపా గోడీ పోగొట్టుకొని, శరణార్థులుగా మారిపోయారు. వంట్లో ఓపికవున్న మావంటివాళ్ళం, ఈ శరణార్థులసహాయార్థం పగలూ రాత్రీ ఊపిరిసలపకుండా పనిచేస్తూనేవున్నాం.

వింతయేమంటే, ఇంతజరిగినా, మా ప్రజల ఆత్మస్థైర్యం చెక్కు చెదరలేదు. కొంతమంది యూరపియనులవలెకాక, మా ప్రజలు కష్టాలకు గురిఅవుతున్నకొద్దీ, ఆత్మస్థైర్యాన్ని పెంపొందించుకుంటూ, తాత్త్విక దృక్పథాన్ని అలవర్చుకున్నారు. మే మిప్పటికే అనేకబాధలుపడ్డాం; ఎన్నోకష్టాలు అనుభవించాం; ఓర్మివహించి కష్టాలను తట్టుకోవాలనీ, సదా చైనా మనగలిగేటట్లు, దురాక్రమణకు వ్యతిరేకంగా పోరాడాలని, మంతా యింతేనని మాకు అవగాహనఅయింది.

గత మూడువారాలపాటు నేను ఇన్‌ఫ్లూయన్‌జాతో బాధ పడ్డాను. ఈ మూడువారాలూ అతికష్టంమీద, మంచంమీదనే వున్నాను. మీ జీవితచరిత్రను చదువుతూ కాలంగడపడంవల్ల మంచంమీ..కిన నాకు కాస్త ఉపశమనంకలిగింది. ఒకగ్రంథాన్ని తీరికగా, ఒక..సారి చదవడానికి జీవితంలో నాకు వ్యవధిదొరకడంకష్టం; మీ గ్రంథాన్ని తీరి కగా, ప్రశాంతచిత్తంతో పఠించాలని అనుకున్నాను. ఇంతవరకూ, నా కందుకు అవకాశంచిక్కిందికాదు; ఇప్పుడు ఆ అవకాశం లభించింది. మీ దేశస్వాతంత్ర్యంకోసం, మీరుకావించిన వీరోచితపోరాటాలలో మీ హృదయం ఎట్టి అనుభూతులనుపొందిందీ, ప్రశాంతంగా ఆలోచనా పూర్వకంగా తెలుసుకుందుకు-నాకు అవకాశంకలిగింది కనుక, మిమ్మల్ని నే నిప్పుడు బాగా అర్థంచేసుకోగలిగానని అనుకుంటున్నాను.

మీ గ్రంథం అమృతమైన పత్రం. నిత్యనైమిత్తికాల కలితంగా, ప్రజ్ఞాపూర్వకమైన రసార్ద్ర ప్రపంచంలోనికిపయనించే మానవాత్మయొక్క యాత్రనుగురించి తెలియచేసే ఈ గ్రంథం హృదయాన్ని స్పందింపచేస్తోంది. అన్నియుగాలలోనూ, అత్యుత్తమగ్రంథాలశ్రేణిలో చేర్చదగిన గ్రంథం మీ జీవితచరిత్ర.

మీకూ భారతదేశానికీ ఉజ్జ్వలభవిష్యత్తు చేకూరవలెనని, ఆశిస్తూ నేనూ దీవనలిస్తూ, మా శుభాకాంక్షలు అందచేస్తున్నాం.

మీ విశ్వాసపాత్రమైన,
మేలింగ్ సూంగ్ చియాంగ్

313. జి-గెస్ట్ లెవోవద్దనుంచి

లండన్, సెప్టెంబర్ 29, 1940

ప్రియమైన అయ్యా,

మీకంటే నేను ఎక్కువ జీవితకాలం గడిపాను కనుక, సహజంగా నేను అనేకభాషాగ్రంథాలు పఠించాను. ఈగ్రంథాల్లో ఏదీ రచ

యితపట్ల నాకు వ్యక్తిగతగౌరవభావం అంతగా కలిగించలేదు. మీ గ్రంథం చదివిన నేను, మీరు మన్నించినట్లయితే, నా భావాలను మార్చుకుంటున్నాను. ఇప్పుడు కలిగిన భావం చాలా సబబైనదని నా నమ్మకం. కనుక షేక్స్పియర్ గొంతుతో నా గొంతుక యిలాగ కలుపుతున్నాను.

ఆతని జీవిత మతి యుదాత్తమము
ఆదిభౌతికశక్తులన్నియు నతని
వ్యక్తిత్వమున దాగ వ్యక్తమయ్యెడిని;
కావున, ప్రకృతి కాంచి యతనిని
ప్రస్తుతించి మిగుల పలికె నిట్లనుచు,
"మానవు డనచెల్లు మహి నీత డొకడె,
మానవుడననేల మానవోత్తముడు!"

మీ విశ్వాసపాత్రుడు,
జి. గెస్ట్లెవో
(యం. ఏ. మాగ్డలెన్, ఆక్స్ఫర్డ్)

314. ఖాన్ అబ్దుల్ గఫూర్ఖాన్ వద్దనుంచి

లక్నో,
అనువాదం అక్టోబరు 18, 1940

ప్రియమైన జవహర్లాల్జీ

నిన్న నే నిక్కడికి సురక్షితంగా చేరుకున్నాను; మెహర్బాన్ సాహెబ్ స్టేషనుకు వచ్చారు. ఆయనయింటిలోనే దిగాను. చాలా హాయిగా గడిపాను. ఇవాళ రెండుగంటలబండిలో, బయలుదేరి వెళ్ళిపోతున్నాను. ఆయన బహుశా నేను తనకు అతిధిననుకున్నారు కాబోలును, పంచ భక్ష్యాలతో విందుభోజనంపెట్టారు. నేను, మెహర్తాజ్ను, ఆమె ప్రిన్సిపాల్ను కలుసుకున్నాను. మెహర్తాజ్ చాలా మంచిపిల్ల అనీ, కాని ఉద్రేకస్వభావురాలనీ, ఇతరపిల్లలప్రభావానికి యిట్టే లోనౌతుందనీ

ప్రిన్సిపాల్ నాతో చెప్పింది. మెహ్రితాజ్ చదువు చక్కగా సాగేటట్లు చూడడమేకాక, ఇతరత్రా ఆమెనడవడినిగురించి శ్రద్ధవహిస్తాననీ, ప్రిన్సిపాల్ వాగ్దానంచేసింది. మీరుకూడా అప్పుడప్పుడు మెహ్రితాజ్‌కు ఉత్తరాలువ్రాస్తూవుండాలని నా కోరిక. ఈ ప్రపంచాన్ని, తనసుతానూ అర్థంచేసుకోవాలనీ, ఇప్పుడు తా నొక ఎదిగినపిల్లకనుక, చిన్నపిల్లవలె ప్రవర్తించరాదనీ, ఈ ఈ ఆశయాలను లక్ష్యాలను కలిగివుండాలనీ, ఆమెకు మీరు ఉపదేశిస్తూ ఉత్తరంవ్రాయాలని, నేను కోరుతున్నాను. ఈవిషయాలన్నీ మీకు పూర్తిగా తెలుసునుకనుక, ఇంతకంటె ఎక్కువగా నే నేమీ వ్రాయనవసరంలేదు.

ఇక్కడికివస్తున్నపుడు, నేను మౌలానాసాహేబ్‌నుకూడా కలుసుకొని, ఆయన కొకసంగతి చెప్పాను; ఆ విషయమై, మీతో ఫోన్‌లో మాట్లాడతానని ఆయన వాగ్దానంచేశారు. మీతో ఆ విషయం ఆయన మాట్లాడివుండవచ్చుననుకుంటాను. నిజానికి నా కీ విషయం సెగాన్‌లో మహాత్మాజీ చెప్పారు. జవహర్‌లాల్ నెహ్రూ తనదృక్పథంతో ఎంత మాత్రం ఏకీభవించలేదని ఆయన కలవరపడ్డారు. వినోభా ఆయనతో జరిపిన సంభాషణలఅనంతరం ఆయన కీ మనోవ్యధ కలిగింది; ఆయన ఏమిచేయాలో ఆయనకే అర్థంకాలేదు. పండిట్‌జీని నేను స్టేషనువద్ద కలుసుకున్నానని, ఆయనతో మాట్లాడానని ఆయనతోజరిపినసంభాషణలు సంతృప్తికరంగా వున్నాయనీ, ఆయనకు నేను తెలియచేశాను. కొంత మందికి (సందేహాలు?) వున్నాయి. కనుక నేను వచ్చేరావడంతోనే నా అభిప్రాయాలు మౌలానాసాహేబుకు తెలియచేశాను. ఆయన నాతో ఏకీభవించారు. ఫోనుద్వారా మీకు తెలియపరచాలని నిర్ణయింపబడింది; మీరు మహాత్మాజీకి ఉత్తరంవ్రాస్తారని, మహాత్మాజీ ఆశించినట్లుగా వ్యవహారాలు తేటపడడానికి వీలుగా మీ రాయనకు వాగ్దానంచేస్తారని ఆశిస్తున్నాను. నేనూ, మౌలానాసాహెబూ అదే కోరుతున్నాము.

ఇక్కడ అంతా సవ్యంగావుంది; మీరంతా క్షేమంగావుండాలని కోరుతున్నాను.

మీ

అబ్దుల్ గఫూర్

733

315. జనరలిస్మో జంగ్ కై షేక్ వద్దనుంచి

(1940 అక్టోబరు 18వతేదీన వ్రాసిన ఉత్తరానికి అనువాదం)

ప్రియమైన శ్రీ నెహ్రూ,

క్రిందటిసంవత్సరం చుంకింగ్‌లో మనం జరిపిన ప్రసన్నవంత మైన సంభాషణ ఇప్పటికీ నాకు మధురస్మృతులను జ్ఞాపకంచేస్తున్నది. మీరు చైనాకు విచ్చేసినఫలితంగా, మనకు కలిగిన ఆత్మానుబంధాన్ని తరుచు నేను స్మరిస్తూవుంటాను.

దురాక్రమణదారులైన జపానువారిని మేము తీవ్రంగా ప్రతిఘ టిస్తున్నామనీ, దేశమంతా ఒక్కమాటమీద నిలబడడంవల్ల, ఈ ప్రతిఘ టన రానురాను మరింత శక్తినీ నైతికస్థాయినీ పొందుతున్నదనీ, మీకు తెలియచేయడానికి, ఈ అవకాశాన్ని వినియోగించుకుంటున్నాను. మన ఆసియాప్రజల సమైక్యపోరాటంవల్ల, ప్రస్తుత అరాచకపరిస్థితులవ్యవస్థ స్థానే, భవిష్యత్‌లో ప్రపంచవ్యవస్థ రూపొందింపబడగలదని విశ్వసిస్తు న్నాను. జపానువారిదురాశలను ప్రపంచ పరిణామాలను దృష్టిలోపెట్టుకొని మనం మన స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను సంరక్షించుకుందుకు, శాంతికి విఘాతంకలిగించే ప్రధానశత్రువును గణనలోనికి తీసుకోవలసివుంటుంది.

ప్రపంచపరిస్థితులతో సన్నిహితసంబంధమున్న మీ దేశనాయ కులు పరిస్థితులకనుగుణంగా, అటువంటివిధానాన్ని రూపొందించగలరనీ, దురాక్రమణకు వ్యతిరేకంగా సాగుతున్న మా పోరాటలక్ష్యాలతో, అను భూతులతో పూర్తిగా పాలుపంచుకోగలరనీ నేను విశ్వసిస్తున్నాను.

శ్రీ టాయ్ చి-టావో స్నేహపూర్వకయాత్రార్థం మీదేశానికి బయలుదేరి వస్తున్నాడు; నా శుభాకాంక్షలను మీకు స్వయంగా తెలియ చేయవలసినదని నేనాయన్ని కోరాను.

మీ విశ్వాసపాత్రుడు,

జంగ్ కై షేక్

## 316. మహాత్మా గాంధీవద్దనుంచి

వార్ధా,
నా ప్రియమైన జవహర్‌లాల్, అక్టోబరు 21, 1940

ఇందుకు వినోబా నియమింపబడ్డాడు. ఆయన ఈ నాలుగురోజులు జరిపిన రాజకీయకార్యనిర్వహణ ఫలవంతమైనదని నా ఉద్దేశం.

నే నొక 'నోట్' జారీచేస్తున్నాను; నీ వది చూడగలవు. నువ్వు సిద్ధంగావున్నట్లు ప్రొఫెసర్ ఫోనుచేశాడు. నీ ప్రకటనకూడా నేను చూశాను. నా వ్రాతలలో, చేతలలో నీకు ఆమోదయోగ్యమైనదేదైనా కనిపిస్తున్నదా అని, ఇప్పటికీ నిన్ను నేను అడిగి తెలుసుకోవాలను కుంటున్నాను. నువ్వు కేవలం క్రమశిక్షణపాటించి మెలగాలని నేను కోరడం లేదు. నా వ్యూహాన్ని, అన్నివివరణలలో కాకపోయినా, మొత్తంమీద నమ్మేవారు, దానిపై విశ్వాసమున్నవ్యక్తులు అవసరం. నీకు వీలుంటే తంతియివ్వు.

ప్రేమతో,
బాపూ

## 317. మహాత్మా గాంధీవద్దనుంచి

వార్ధా,
ప్రియమైన జవహర్‌లాల్, అక్టోబరు 24, 1940

నీ తంతి అందింది. సంతోషం. నా పత్రికాప్రకటన అనుమతింపబడినట్లయితే, ఈ ఉత్తరం అందేలోపున, నువ్వు దాన్ని చూడగలవు.

నువ్వీనరికి సిద్ధంగావున్నట్లయితే,నీశాసనోల్లంఘనాన్నినువ్వులాంఛనప్రాయంగాప్రారంభించవచ్చును. ఇందుకు నువ్వు ఒకగ్రామాన్నిఎంచుకొని, ఆగ్రామస్థులఎదుటశాసనోల్లంఘనకార్యక్రమాన్నిప్రారంభించాలనిసూచిస్తున్నాను.అధికారులు నువ్వు నీ ప్రవచనాన్ని పలికేలోపునే, నిన్ను నిర్బంధిస్తారని అనుకుంటాను. వినోబాకుసంబంధించినంతవరకు, వారు వారివ్యూహాలతో సిద్ధంగాలేరు. అయితే, వారు నిన్ను నిర్బంధించకుండా స్వేచ్ఛగావుండనిచ్చినట్లయితే, వినోబావేకోసం రూపొందించబడినపథకాన్ని నువ్వు అనుసరించాలని నా సూచన. కాని, మరొకమార్గాన్ని

అనుసరించాలని నీకుంటే, నువ్వావిధంగానే చేయవచ్చును. నీ కార్య క్రమమేమిటో నాకుతెలియచేయాలనిమాత్రమే, నేను కోరుతున్నాను. శాసనోల్లంఘనను, నువ్వేతేదీన ప్రారంభిస్తావో, నాకు ముందుగా తెలియ చేస్తే, నేను ఆ తేదీని, స్థలాన్ని ప్రకటించడానికి వీలుంటుంది. నీ మొట్టమొదటి కార్యక్రమానికే, వారు అంతరాయంకలిగించవచ్చును. ప్రభుత్వం అలాంటిచర్య ఏదితీసుకున్నా, నే నందుకు సంసిద్ధంగా వున్నాను. మనకార్యక్రమానికి ప్రచారం లభించడానికి అనువైన అన్ని వ్యాయమార్గాలను నేను వినియోగించుకుంటాను; క్రమమైన ఆలోచన, భావపరివ్యాప్తి, దానిఫలితాలను అది సాధిస్తుందని నా నమ్మకం; దీని మీదనే నేను ఆధారపడ్డాను. ఈ నమ్మకం నీకు లేకపోయినట్లయితే, ఇప్పుడప్పుడే నువ్వొకనిర్ణయానికిరావలదనీ, ఫలితాలకోసం నిరీక్షిస్తూ వుండవలసినదనీ, నిన్ను నేను కోరుతున్నాను. నువ్వీవిధంగా ఓర్మి వహించగలవనీ, యిదేరీతిని మనప్రజలను నీవలె ఓపికపట్టివుండమని చెప్పగలవనీ, నాకు తెలుసును. నువ్వు నామీద విశ్వాసముంచి, నన్నునుస రించడానికి ఎంతబాధపడుతున్నావో, నే నెరుంగుదును. నామీద నువ్వు విశ్వాసముంచావు. నీ సద్భక్తిని నే నెంతో మెచ్చుకుంటున్నాను. ఈ కార్యక్రమం తగినస్థానాన్ని పొందుతుందని, నా నమ్మకం; ఏమీఅంటే, ఇది "చేయాలి, లేదా మరణించాలి" వంటిది. ఇక తిరిగి వెనక్కివెళ్ళడ మనేదిలేదు. మనఉద్యమం అప్రతిహతమైనది. దీన్ని విడిచిపెట్టడమనేది జరగదు. పరిశుద్ధమైన అహింసాశక్తిని ప్రయోగించిచూడడానికి, నా మార్గాన్ని నాకు ఒదిలిపెడితే చాలును.

ద్వితీయసత్యాగ్రహిని నేను ఎంచుకోవాలని చెబుతూ, మౌలానా సాహేబ్ నాకు ఫోనుచేశారు. నువ్వు యిందుకు సమాయత్తమైనట్లయితే, ఇంకొకవ్యక్తిని ఎంచుకోనని, నే నాయనకు తెలియచేశాను.

హరిజన్‌విషయంలో నేను తీసుకున్నచర్యపట్ల నీకుగల అభి ప్రాయాలను నేను తెలుసుకోగోరుతున్నాను.

ప్రేమతో,
బాపూ

## 318. మదాం జంగ్ కై షేక్ వద్దనుంచి

హాంకాంగ్
జనవరి 16, 1941

ప్రియమైన శ్రీ నెహ్రూ,

మీరు శ్రీ టాయిచి—టావో ద్వారా పంపించిన ఉత్తరం నాకు త్తనా కందచేశారు. గత రెండుమాసాలు వ్యాధిగ్రస్తురాలనై, ఔషధసేవచేస్తూ హాంకాంగ్‌లో గడిపాను. యుద్ధం ప్రారంభమయిన తొలిరోజుల్లో షాంఘై యుద్ధరంగంనుంచి కారులో వస్తూ నేను క్రిందపడిపోయాను; దెబ్బ గట్టిగా తగిలింది; ఎముక విరిగిపోయింది. ఒకవారం గడిచాక, తిరిగి మామూలుగా నా పనిని నేను చేసుకోజొచ్చాను. నాటినుంచి నా వెన్నెముక బాధ పెడుతూనేవుంది. కాని దాన్ని నే నంతగా లక్ష్యపెట్టలేదు. అప్పటికి బాగానేవుంది కాని, ఈ వేసవిలో భరింపశక్యంగానంతగా నొప్పి ఆరంభమయింది. ఈలోపున చుంకింగ్‌నగరంపై విమానాలు బాంబులవర్షం కురిపించసాగాయి. విమానదాడులకు గురిఅవుతున్న ఆ నగరాన్ని నాకు ఒదిలిపెట్టబుద్ధిపుట్టలేదు. బాంబులఋతువు ముగిసినతరవాత, అక్కణ్ణుంచి వెళ్ళిపోదామనుకున్నాను.

హాంకాంగ్‌కు వచ్చినపిమ్మట, ఎక్స్‌రేతీయించి చూస్తే, వెన్నెముక వంకరటింకరగా మారినట్లు తెలియజొచ్చింది. నా మతి మతిలో లేదంటే ఆశ్చర్యమేముంది! తగిన చికిత్సచేయించుకుంటున్నాను. ఇప్పుడు ఇదివరకటికంటె నయంగావుంది. కొన్నివారాలలో నా పని నేను చేసుకోవచ్చునని ఆశిస్తున్నాను. నేనుతిరిగివచ్చాక, శ్రీ టాయ్‌నికలుసుకుంటాను; మీ గురించినభోగట్టా తెలుకోగలుగుతాను.

మిమ్మల్ని నిర్బంధించారని విన్నాక నా మన స్సెంత కలవరపడిందో మీకు నేను వేరే చెప్పనవసరంలేదు. అప్పట్నుంచీ మిమ్మల్ని గురించి ఆలోచిస్తూనేవున్నాను. మీకూ భారతదేశానికీ ఏవిధంగానైనా తోడ్పడాలన్నవాంఛ నాలో జనించింది. మీరు వ్రాసినట్లుగా, కాలం రోజుల వల్ల నిశ్చయింపబడదు. మీ రిక్కడ స్వల్పకాలమేవున్నప్పటికీ మీరు మాకు చిరకాలస్నేహితులని మేం భావించాం; ఇప్పుడూ అలాగే భావి

స్తున్నాం. మీ స్వభావమూ మా స్వభావమూ ఒకటేనని, మన ఆశయాలు లక్ష్యాలు ఒకటేకనుక మీరు నిజమైనమిత్రులని నేనూ, జనరలిస్మో సంతోషపడ్డాం.

మీకోసం నేను చేసేది వాస్తవాని కేమీలేదు. మీమీద మాకున్న ప్రేమ, విశ్వాసాలు ఇప్పుడు మీరు గడుపుతున్న రోజులభారాన్ని తగ్గించి నట్లయితే మీవంటి స్వార్థరహిత ధైర్యోపేతమైన ఆత్మలు కలవని మేము ఆనందిస్తున్నామని మీరు విశ్వసించండి. భారతదేశఉద్యమం విజయవంతమౌతుందని మా విశ్వాసం. మీ విజయంకోసం మేం చేస్తున్నప్రార్థనలు, మా హృద్గతప్రేమ నిరుపయోగంకావు.

ఈ ఉత్తరంవ్రాసి నే నొకస్నేహితునికి యిస్తున్నాను. ఆయన తొందరగా వెళ్ళిపోతూవుండడంవల్ల నే నింతకంటె ఎక్కువ వ్రాయ లేకపోయాను. నాదేశప్రజలు మీరు నిర్బంధింపబడ్డారన్నవార్త విని, ఎంత ఆందోళనపడ్డారో వారి ఆందోళనతరంగాలు ఎంతటివో మీకు కొద్ది మాటలలో వ్యక్తంచేయలేను. బ్రిటిష్ ప్రజాస్వామికంపట్ల విశ్వాస ముంచిన అనేకులు "మనం బ్రిటిష్సామ్రాజ్యవాదాన్ని చూసి ఉదార వాదంగా పొరబడలేదుకద" అని తమను తాము ప్రశ్నించుకుంటున్నారు. ఇంతకంటె మరేమీ నేను చెప్పనక్కరలేదు.

నా స్నేహితుడా, మీకు నా శుభాకాంక్షలు.

మేలింగ్ సూంగ్ చియాంగ్

319. జీన్ ఫ్రాస్టువద్దనుంచి

న్యూయార్కు,
మంగళవారం, ఏప్రియల్ 15, 1941

నా ప్రియమైన శ్రీ నెహ్రూ,

కేవలం అపరిచితుడనైన నేను, మీ కీవిధంగా ఉత్తరంవ్రాయ డానికి సాహసించడం నిజంగా, నా మూర్ఖత్వమేకావి, ఏదో ఒక అంతః ప్రేరణవల్ల నేను వ్రాయకతప్పిందికాదు; అందుకు మీరు ఈ విషయాన్ని

పట్టించుకోరాదని మిమ్మల్ని నేను ప్రార్థిస్తున్నాను. మీరు నాకు ఆలోచించడానికి చాలా అవకాశంయిచ్చారు. మీకు నేను మిక్కిలి కృతజ్ఞుణ్ణి. ఇప్పు డిక ఏమివ్రాయాలో నాకు తోచడంలేదు. కృతజ్ఞతాభావంతోనిండి వున్న నా హృదయాన్ని విప్పిచెప్పడానికి మాటలులేకపోగా, నా అధీనంలోవున్న కొద్దిపాటిమాటలతో, దాన్ని వ్యక్తంచేయకోరుతున్నాను. నేను గాఢంగాఅనుభూతిపొందినఏవిషయాన్నైనా వ్యక్తంచేయడానికి నేనెప్పుడూ భయపడుతూనేవుంటాను కనుక, ఈ వాక్యాలలో నన్ను నేను ఎలాగ వ్యక్తంచేసుకోవాలో, నాకుతెలియడంలేదు. అలాంటిభయం ఎలాగూవుండనేవుంది కాని, నన్ను నేను వ్యక్తంచేసుకోవలసిన ఆవశ్యకతకూడావుంది; ఆ భయంకంటె ఈ ఆవశ్యకత హెచ్చుగా వున్నది కనుక, నా శక్త్యానుసారం ప్రయత్నించిచూస్తాను.

మీ ఆత్మకథను నేను చదువుతున్నాను; అది నా అభిమాన గ్రంథంగా మారిపోయింది. ఆ గ్రంథం, నన్ను నేను చూసి సిగ్గుపడేట్లుగాచేసింది. నన్ను నేనుచూసి సిగ్గుపడడానికి కాలం మించిపోయింది. నేను గతంలో వ్యక్తిగతవిషయాలకు సంబంధించిన బురదగుమ్మిలో, నిరాశతో నిస్పృహతో విఫలమనోరథుడనై, పొర్లాడుతూ, ఎంతకాలం వృథాపుచ్చానో చెప్పలేను. జీవితంలో నాకు తారసపడిన ఆచరణయుక్తమైన ప్రతి వాస్తవికవిషయాన్ని దుయ్యబడుతూ, ఎట్టికార్యక్రమమూ లేకుండా, నిష్ప్రయోజనంగా నా జీవితకాలమంతా తిరగబడుతూవచ్చాను. మానవులకుదూరంగా అన్నిసంబంధాలను తెంచుకొని,ఏకాకినై పోయాను; నా హృదయం క్రుంగిపోతూంటే దీనికి కారణమేమిటని ఆశ్చర్యపడ్డాను; నేను ఏ సమాజంలో అయితే పెరిగానో, ఆ సమాజంనుంచి అవతలకి పోవాలని తహతహపడ్డాను; నా కుటుంబాన్ని పరిత్యజించి, సమాజానికి దూరంగావుండిపోయాను. ఇప్పుడు నా స్థితి "కాలుతున్న పెనంనుంచి మండుతున్నపొయ్యిలో పడ్డట్లుగా" వుంది. నా భారాన్ని, లేదా నా తీవ్రమైన అభిప్రాయాలను ఒదిలించుకుందుకు, నేనేమీ చేయలేనుకనుక, నిరభ్యంతరంగా, నిస్సంకోచంగా నా కుటుంబం నన్ను ఆదుకోవాలని సమర్థించాలని నేను భావించాను.

ఇప్పుడు నన్ను నే నొక కీటకంతో సరిపోల్చుకుంటున్నాను. వగర్వంగా తలఎత్తుకొని, నేను నిజాయితీపరుణ్ణని చాటుకోవాలని కోరుతున్నాను. చిట్టచివరకు, ఉత్సాహమంటూఒకటి కలిగింది. జీవితంలో ఆదర్శాలను కాపాడుకోవాలని, ఏమైనప్పటికీ, వాటికి భంగంరానీయకూడదనీ, అదే జీవితానికి ముఖ్యమనీ, నే నిప్పుడు గ్రహించాను. గతంలో జరిగిన సంఘటనలు మార్చడానికి వీలులేనివని, అయినప్పటికీ, పాపపరిహారార్థం పశ్చాత్తాపపడవచ్చునని, లేదా, అందుకు ప్రయత్నించవచ్చునని, ఒకప్పటిమనిషిని యిప్పుడు యిక నేనుకానని తలపోస్తున్నాను. విషయాలను ఎంత పేలవంగా వ్యక్తపరుస్తున్నాను !

నా దృక్పథం ఈవిధంగా మారిపోవడానికి మీ గ్రంథపఠనమే కారణం; అందుకు మీకు నా ధన్యవాదాలు. జీవించడానికి అనువైన చక్కటిస్థలంగా, ప్రపంచాన్ని మార్చడానికి నా బాధ్యతను నేను నిర్వర్తించాలని కుతూహలపడుతున్నాను. దూరంగా చీకట్లో కనిపిస్తున్న కాంతినిచూసి, ఈకీటకం గగ్గోలుపెడుతోంది. దానిఆత్మ ఘూర్ణిల్లుతోంది. మానవజాతిచేసే మోసాలకు లేదా ఎండకు,వానకు యిక ఇది లెక్కచేయదు. ఇటువంటి చైతన్యం కలిగించినందుకు మీకు నా ధన్యవాదాలు. నా భావాలను నే నాడంబరంగా వ్యక్తపరచితినేమో కాని, అవి యింతచక్కగా అభివ్యక్తం కాలేదనుకుంటాను. కాని ఏమైనప్పటికీ అవి నా హృదయాంతరాళంలోంచి వెలువడిన భావాలుమాత్రం అవును.

మీ విశ్వాసపాత్రుడు,
జీన్ ప్రాస్టు

320. రఫీ అహమ్మద్ కిద్వాయివద్దనుంచి

గోరఖ్‌పూర్,
ఏప్రియల్ 26, 1941

ప్రియమైన జవహర్‌లాల్జీ,

శ్రీమతి పండిట్ పెట్టుకున్న అమెరికాప్రయాణంగురించి యుద్ధప్రమాదాన్ని దృష్టిలోపెట్టుకునికాదు కాని, ఇక్కడ భారతదేశపరిస్థితులను

సమాలోచించి నేను కొంత తటపటాయిస్తున్నాను. మన దేశవ్యవహారాల పట్ల మనకు శ్రద్ధాసక్తులున్నట్లయితే, మన కళాగ వున్నవని ఇతరులు విశ్వసించాలని మనం కోరుతున్నట్లయితే శ్రీమతి పండిట్‌వంటి ఉన్నత స్థాయికిచెందిన మనుష్యులు మనకు ప్రత్యక్షంగా సంబంధించని కార్య కలాపాలలో, కాలంవెచ్చించకూడదని నా అభిప్రాయం; రాజేంద్ర ప్రసాద్ వంటి ఉన్నతస్థాయికిచెందినవ్యక్తి, వర్ధంగాలోనో ఢిల్లీలో తాలిమీ సంఘంలోనో జరుగుతూవుండే ఉత్సవాలకు హాజరౌతూ, దేశమంతా తిరగడం సబబుగాలేనట్లే, శ్రీమతి పండిట్ భారతదేశం విడిచివెళ్ళడం న్యాయంగా కనిపించడంలేదు.

నే నిలాగ వ్రాసినందుకు, మీరుకాని, లేదా శ్రీమతి పండిట్‌కాని, అన్యథా భావించరని అనుకుంటాను.

నేను కులాసాగావున్నాను; ఈ యుద్ధం ఇరవై సంవత్సరాలు కొన సాగిస్తామనీ, అంటే దానిఅర్థం, మనల్ని అంతవరకూ నిర్బంధంలోవుంచు తామనీ, లార్డ్ హాలిఫాక్స్ బెదిరించే బెదిరింపులకు నే నేమీ బెదరడం లేదు.

మీ
రఫీ

### 321. పూర్ణిమా బెనర్జీ నద్దనుంచి

అల్లాబాద్,
మే 7, 1945

నా ప్రియమైన జవహర్‌లాల్జీ,

నాలుగుసంవత్సరాలనుంచి మిమ్మల్ని నేను చూడలేకపోవడం నాకే దురూహ్యంగావుంది. మీరు లక్నోలోవున్నప్పుడు, మీ కొక్క-క్షణం తీరికలేకపోయిందని నాకు తెలుసును; డెహ్రాడూన్‌లో వుంటున్న ఇప్పుడుకూడా బయటవారు మిమ్మల్నికలుసుకుందుకు వీలుకానంతగా మీకు పనులువుంటాయని నే నెరుగుదును. కాని, నాకు మిమ్మల్ని చూడాలని వుంది. ఇందుకు ప్రత్యేకకారణం ఏమీలేదు; కేవలం ఇది నా మనోవాంఛ.

పాపుతో నే నొక అనుచరురాలివలె, ముస్సోరీకి వెడదామను కుంటున్నాను. నేను వస్తానని వెంటపడినట్లయితే, తాను వెళ్ళనే వెళ్ళనని, మారుసర్యాగ్రహంచేస్తానని ఆయన బెదిరిస్తున్నారు. ఈవిధగా వస్తానని పట్టుబట్టి, విశ్రాంతితీసుకోవాలన్న ఆయనకోరికను భగ్నంచేయడం నా కిష్టంలేదు; అందువల్ల నేను లొంగకతప్పదు. ఈలోపున, నేను అరెస్ట యితే, ఇక ఈసమస్య రానేరాదు. దానంతటదే పరిష్కరింపబడుతుంది.

* * *

నే నేమీ ఈ ఉత్తరంలో విశేషించి వ్రాయదల్చుకోలేదు; అత్యవసరమైన మామూలువిషయాలుమాత్రమే వ్రాయదల్చుకున్నాను.

నేను 25వతేదీఉదయం ఏడున్నరగంటలకు, డెహ్రాడున్ చేరు తుంటాను; అక్కడ మిమ్మల్ని చూడాలని నా కెంతో కోరికగావుంది. ఆవేళ, మిమ్మల్ని చూచేపాటిఅదృష్టం నాకు లేకపోతే, 25వతేదీతర వాత, ఏరోజునైనా మీఇంటర్వ్యూకోసం నిరీక్షిస్తాను. నేను ముస్సోరీ నుంచి సునాయాసంగా రాగలను.

మీతో ఇంటర్వ్యూ అనుమతించమని కోరుతూ, సూపరింటెం డెంటుకు, ప్రత్యేకంగా దరఖాస్తుపెడుతున్నాను. ఈలోపున, నేను అరె స్టయినట్లయితే, ఆవిషయం సూపరింటెండెంటుకు తెలియచేస్తాను. అలా అయినట్లయితే, 25వతేదీన మీతో ఇతరులెవరైనా ఇంటర్వ్యూకోరినట్ల యితే, వారికి నానుంచి యిబ్బందివుండదు.

ఈ ఉత్తరం మీకు చేర్చడానికి జైలుఅధికారులు యిష్టపడతారో లేదో, నాకు తెలియదు.

ఇందును కలుసుకుని ఆమెతో కొంచెంసేపు మాట్లాడాను. నే నప్పుడే పెద్దదాన్నయిపోయినట్లూ, ముసలిదాన్నయిపోయినట్లూ భావిస్తు న్నాను. పిల్లలతల్లిననేభావం కలుగుతోంది. కనుక, యూరపునుంచి తిరిగివచ్చిన, తెలివిగలవ్యక్తులతో చర్చించలేకపోతున్నాను. కృష్ణమీనన్

---

*** ఇక్కడ వ్రాసిన వాక్యాలను సెన్సారుఅధికారులు కొట్టివేశారు.

గురించి ఖోగట్టాచేశాను. ఆయన ఎప్పట్లాగే అ_స్తవ్య_స్తంగా ఉన్నాడని ఇందు చెప్పింది.

అల్హాబాద్‌లో ఇప్పు దెవరూలేరు. అందుకని, ఇప్పుడు జైల్లో వున్నా బయటవున్నా ఒకలాగే వుంటుంది.

అల్హాబాద్‌లోవున్న ఖైదీలు బాగానేవున్నారు. ముజఫర్‌ను పోల్చు కోలేం. ఆయన్ని నేను శనివారం చూచాను. శక్తి కూడబెట్టుకున్నాడు.

నేను బయలుదేరేముందు ఒకసారి మౌలానాను కలుసుకోవాలను కుంటున్నాను. ఈ ఎండలు, జైలు ఆయనప్రశాంతతను, జీవితంపై ఆయనకువుండే సహజదృక్పథాన్ని ఏమాత్రం భగ్నపరచలేకపోయా యనుకుంటాను. జైళ్ళు నిజంగా నిరర్థకమైన సంస్థలు. అవి ఎవర్నీ మార్చలేవు; దండించడంలోనూ, హింసించడంలోనూ అవి నిరుపయోగ మౌతాయి.

మీ రెలావున్నారు? ఇంటర్వ్యూలుసైతం నిరర్థకమైనవే; మిమ్మల్ని కలుసుకొనివచ్చినతరువాత, నా మనస్సు మరీ అధ్వాన్నంగావుంటుందని నాకు తెలుసును; అయినా, మిమ్మల్నిచూడడం కొంత నయం. మనస్సు పరిపరివిధాల బాధపడుతుందని, దాన్ని తప్పించుకోవడంలో నాకు నమ్మకంలేదు.

ఈ 8వతేదీన, అల్హాబాద్ స్త్రీసత్యాగ్రహులు విడుదలఅవుతారు. ఫైజాబాద్‌లో నాయకత్వంవహించినందుకు సుచేత పెనాల్టీ చెల్లించుకుం టోంది. ఆమెకు, లక్ష్మీదేవికి, ఉమాభాభికి ఒకసంవత్సరం శిక్షవిధిం చారు. కమ్యూనిటీ బేరక్స్‌లో వుంటున్నానన్న మనోవ్యథతప్ప నేను కులాసాగానేవున్నాను. శ్రీమతి పండిట్, నేనూ అల్హాబాద్‌లో కొంత సేపు గడిపాం.

నేను ప్రభావతిని కలుసుకున్నాను. జయప్రకాశ్ డియోలీలో వున్నట్లు బహుశా మీకు తెలుసుననుకొంటాను. రామ్‌మనోహర్ క్షేమం గానేవున్నాడు; కాని గడ్డంపెంచాడు; సన్నగా తలగీయించుకున్నాడు. చూచుకుందుకు ఎదుట అద్దంలేదుకనుక, ఆయన దాన్నంతగా పాటించడు;

అదివుంటే తన పూర్వపురూపానికి వచ్చివుండును. నే నాయన్ని గతనెల 28వతేదీన కలుసుకున్నాను.

డెహ్రాడున్‌లో చాలా మంచిమంచి పక్షులు వున్నాయి. అవి మీ జైలుఆవరణలోకి వస్తున్నాయా? పక్షులను పరిశీలించడంలో నాకు కొంత గట్టిఅనుభవం వుంది. మీకు సరదాగావుంటే, నే నొకపుస్తకం తెచ్చి మీకిస్తాను. దానిలో మన భారతదేశపక్షుల భోగట్టా అంతా వుంది. ముస్సోరీలో వున్నప్పుడు, రోజూ చాలాదూరం నడిచివెళ్ళేదాన్ని. పక్షులను తిలకిస్తూ నడిచివెడుతూవుంటే ఎంతో ఆనందంగావుండేది.

గౌరవ నమస్కృతులతో,

మీ అభిమానంగల,
నోరా

322. రిఛర్డ్ రీజ్లసన్ నద్దనుంచి

సుడెటాన్ జర్మన్ సోషల్‌డెమొక్రటిక్‌పార్టీ,
లండన్ ప్రతినిధి,
లండన్,
ఆగస్టు 13, 1941

ప్రియమైన పండిట్ నెహ్రూ,

ఎంతోకాలం ఆలోచించినతరవాత, ప్రవాసంలోవున్న సుడెటాన్ సోషలిస్టుల శుభాకాంక్షలను మీకు పంపడానికి మేము తీర్మానించుకున్నాం. 1938 వేసవిలో ఆ క్లిష్టదినాలలో బుడాపెస్టులో, ప్రేగ్‌లో మీతో మేం జరిపినసంభాషణలు ఇప్పటికీ మాకు జ్ఞాపకంవున్నాయి. హిట్లరుకువ్యతిరేకంగా మేం సాగిస్తున్న రాజీలేని పోరాటాన్ని, మీరు ఆనాడు ప్రోత్సహించారు; అందుకు మేము మీకు సదా కృతజ్ఞులం. మ్యూనిక్‌ఒడంబడిక జరిగినతరవాత, మేము యుద్ధరంగాన్ని విడిచిపెట్ట వలసివచ్చింది. మాలో ఇరవైవేలమంది యోధులను మూడవ రీచ్ కాన్‌సెన్‌ట్రేషన్‌క్యాంపులలోనికి ఈడ్చుకొనిపోయారు. వీరిలో చాలామంది చనిపోయారు. అయినప్పటికీ, నాజీతత్త్వానికివ్యతిరేకంగా ఒక ప్రజా

స్వామికదేశంలో తుది రాజకీయపోరాటంచేయగల అవకాశం మా పార్టీకి దక్కింది. మా పోరాటంద్వారా మా పార్టీప్రతిష్టను నిలబెట్టగలిగామని మేం గర్విస్తున్నాం. శత్రువులవారినుంచి మూడువేలమంది స్నేహితులు తప్పించుకునేటట్లు సహాయపడ్డాం. ఇప్పుడు వారు తమకు అదను ఎప్పుడు వస్తుందా అని నిరీక్షిస్తూ ఇంగ్లండు, స్వీడను, కెనడాలలో ప్రవాసజీవితాన్ని గడుపుతున్నారు. స్వదేశంలోవున్న స్నేహితులపై హత్యానేరాలు మోపబడి ఘోరమైన విచారణలుజరుగుతున్నా వారు ప్రశాంతచిత్తంతో వున్నారు. దాబోల్‌లో రెండేళ్ళపాటు వున్న మా కామ్రేడ్స్‌వద్దనుంచి అనేక అభినందనలేఖలు మాకు చేరాయి. తమ పూర్వపు ఆదర్శాలకోసం పోరాడగలమన్న తమ దృఢనిశ్చయాన్ని వెలిబుచ్చుతూ మాకు వాగ్దానంచేశారు.

పండిట్ నెహ్రూ!

అనేక సంఘటనలఫలితంగా ఏ ఉద్యమంలోని సంఖ్యాబలం తగ్గుతూవచ్చిందో, అలా తగ్గినప్పటికీ ఏ ఉద్యమం అప్రతిహతమైన పాశ్చాత్యదేశాల సామ్యవాదశక్తికి అంతర్భాగంగావున్నదో ఆ ఉద్యమము పేరిట మేము మీ కీ ఉత్తరం వ్రాస్తున్నాము.

మిమ్మల్నీ మీ స్నేహితుల్నీ నిర్బంధించారని విని, మే మెంతో విచారపడ్డాం. అభ్యుదయకరమైన, శక్తివంతమైన జాతీయకాంగ్రెసు ఈ మహాసమరానికి బయట దూరంగా వుండిపోవలసివచ్చినందుకు మాకు చాలా విచారంగావుంది. ప్రపంచంలోని ప్రజాస్వామిక సామ్యవాద శక్తులు జాతీయసామ్యవాదాన్నీ ఫాసిజాన్నీ ప్రతిఘటిస్తున్నతరుణంలో, జాతీయకాంగ్రెసు ప్రజాస్వామిక సామ్యవాదులపరపున నిలబడి పోరాడకుండా వుండిపోవలసివచ్చింది. జాతీయకాంగ్రెసు బ్రిటిష్‌ప్రభుత్వ సంబంధాలలో ఏర్పడిన ప్రతిష్టంభన ఈపరిస్థితిని సృష్టించింది. భారతదేశ సమస్యకుగల చారిత్రక సామాజిక పూర్వరంగ మెలాంటిదో మాకు క్షుణ్ణంగా తెలియదు. కనుక ఈ సమస్యతో సంబంధంగల శక్తివంతమైన యిరుపక్షాలవారికీ సలహాయిచ్చే అధికారం మాకు లేదు. కాని, రష్యా

ప్రవేశించినతరవాత ఈ యుద్ధస్వభావం మారిపోయిందనీ, ఇది విముక్తి యుద్ధమనీ మేం విశ్వసిస్తున్నాము. హిట్లరు, ముసోలినీ, ఫ్రెంచి ప్రభుత్వాల ఓటమి ప్రపంచమంతటా ప్రజాస్వామికం నెలకొనడానికి దారి తీయగలదని, అప్పుడు భారతదేశం తనస్థితిని బాగుపరచుకుందుకు అవకాశం లభించగలదనికూడా మేం నమ్ముతున్నాం.

ఈ యుద్ధభీభత్సంనుండి సమైక్య స్వేచ్ఛాయుత యూరోపు ఉద్భవించాలనీ, మనప్రయత్నాలన్నీ ఈ గమ్యంచేరుకుందుకు ఉద్దేశింపబడాలనీ, సామ్యవాదులమైన మేం వాంఛిస్తున్నాం. మా మార్గంలో అనేక అడ్డంకులున్నాయి. ఐనప్పటికీ, వివిధదేశాల అత్యుత్తమ అభ్యుదయకర శక్తులు స్వేచ్ఛాయుతదేశాల ప్రజల పరస్పరసహకారంపై శాంతి భద్రతలు ఆధారపడివున్నవని స్పష్టంగా గుర్తించడం, ఎంతో ఆనంద దాయకంగా ప్రోత్సాహకరంగా వుంది. స్వతంత్ర భారతదేశం తనసరసను తన భాగస్వామిగా వుండవలెనని యూరోపు వాంఛిస్తోంది. భారత దేశానికిసైతం స్వతంత్రయూరోపు భాగస్వామిగావుండడం అత్యవసరం.

ఈ లక్ష్యాన్ని దృష్టిలోవుంచుకొని, మీకూ మాకూ సమానంగా వున్న కొన్నివిషయాలనుగురించి, మా అభిప్రాయాలను మీకు మేం నివేదించవచ్చునుకదా!

ఆంగ్లేయులవిధానం అనేక పొరపాట్లతో కూడివుండవచ్చును. మ్యూనిక్ ఒడంబడికకు తొలిసారిగా బలిఅయినది మేమే; అయినప్పటికీ, రష్యాపై హిట్లరు దండెత్తిన, ఫ్రాన్సుపతనమైన ఆ సంవత్సరంలో, ప్రపంచదేశాల స్వాతంత్ర్యభారాన్ని నిర్వహించేబాధ్యత ఇంగ్లండు ప్రజలపై పడింది. 1938 గ్రీష్మఋతువులో ఇంగ్లండుపై మేము పెట్టుకున్న ఆశలన్నీ అడియాసలయ్యాయి; మా కప్పుడు కలిగిన పరితాపాన్ని పురస్కరించుకొని, ఇప్పుడు మీరు జైలులో ఎంత పరివేదనపొందుతున్నారో మేం అర్థంచేసుకోగలం. కాని, ఇక్కడకు మేము ప్రవాసం వచ్చినతరవాత, ఆంగ్లదేశం ఎంత బాధపడుతున్నదో, ఎన్నిఅవస్థలకు లోనవుతున్నదో, ఎంత వీరోచితంగా పోరాడుతున్నదో మేం గమనించాము; మా పరివేదన వారిదీక్షను ప్రశంసించేదిగామారిపోయింది. పండిట్

నెహ్రూజీ! మామాట నమ్మండి; దారుణమైన, హత్యాసదృశమైన బాంబుల దాడిని ప్రతిఘటిస్తున్న లండన్ ప్రజలు పోరాటానికి సంసిద్ధమౌతున్నపుడు, వారిదృష్టిలో సామ్రాజ్యవాదఆశయాలు లేనేలేవు; సుడెటాన్ ప్రాంతాలలో వీరులైన ప్రజ్ఞావంతులూ, మీరూ మేమూ ఏ స్వాతంత్ర్యం కోసం పోరాడుతున్నామో అదేలక్ష్యసాధనకోసం ఆంగ్లదేశప్రజలు పోరాడుతున్నారు.

శాంతియుత, స్వేచ్ఛాయుత, ప్రజాస్వామికయుగ సంస్థాపనార్థం, పోరాడుతున్న శక్తులన్నీ, ఈ యుద్ధానంతరం ఒకదానిసరసన యింకొకటి నిలబడి, అందరికీ ఏకైకలక్ష్యమైన మార్గాన్ని అనుసరించవలసి వుంటుందని మా అభిప్రాయం. భారతదేశవ్యవహారాలు ఫలప్రదమౌ యనీ, ఇంతకంటే మంచి చేకూరుతుందనీ మేం ఆశిస్తున్నాం.

మీ దేశంలోగల హిందూ—ముస్లింసమస్యఅంతటి పెద్దదికాకపోయినా, మా జక్-సుడెటాన్-జర్మన్‌సమస్య పరిష్కారమౌతుందనీ, ఏదోఒకరోజున, మా స్వతంత్రదేశానికి మిమ్మల్ని ఆహ్వానించి, మధ్యయూరోపు నిర్మాణసమస్యలను మీతో చర్చించి, మీ సలహాలను స్వీకరించగలమనీ మేం ఆశిస్తున్నాం. మీ రింకొకసారి ప్రేగ్, బొదన్‌బర్గ్‌లకు రాగలరని విశ్వసిస్తూ ఇదే మా ఆహ్వానంగా భావించవలసినదని కోరుతున్నాం.

మా ప్రవాసకాలాన్ని మేం వ్యర్థపుచ్చకుండా, ఆంగ్లభాషతో ఆంగ్లసాహిత్యంతో, ఆంగ్లతత్త్వంతో పరిచయం పెంపొందించుకున్నాం; కనుక, మీ రీసారి మా దేశం వచ్చినపుడు, మేం మీతో ఆంగ్లభాషలో సంభాషించగలం.

మా కామ్రేడ్సు అందరితరపునా మా ప్రగాఢ సానుభూతిని మీకు తెలియచేస్తున్నాము. మా సహకారం ఎల్లప్పుడూ మీకు లభించగలదని వాగ్దానంచేస్తున్నాము.

రాజకీయసాహిత్యాన్ని చదవగలిగిన సావకాశం మీకు వుంటే, మీరు చదవగలరనే ఆశతో "ఇంగ్లండు: తుది జర్మన్ స్వతంత్రపౌరులు" అనే మా కరపత్రాన్నీ, సుడెటాన్‌సమస్యపై మా పార్టీ కావించిన ప్రకటన ప్రతిని మీకు దీనితోపాటు పంపిస్తున్నాము.

మీ విశ్వాసపాత్రమైన,
రిఛర్డు రీట్జనర్
వెంజల్ జాక్సీ

323. ఎలియనార్ ఎఫ్. రాత్‌బోన్‌ఎద్దనుంచి

[ నేను అప్పుడు జైలులోవున్నందున ఈ లేఖ యు. పి. రాష్ట్ర గవర్నరుకు పంపబడింది. గవర్నరు దానిని డెహ్రాడూన్ జిల్లాజైల్లోవున్న నాకు పంపారు. ]

కామన్సుసభ,
లండన్,
ఆగస్టు 28, 1941

ప్రియమైన పండిట్ నెహ్రూ,

మీరుపంపిన సుదీర్ఘమైనలేఖ చేరింది. ధన్యవాదాలు. అది కొన్ని వారాలక్రితమే నాకు అందినప్పటికీ, పనివత్తిడివల్ల ఇంతవరకు జవాబు వ్రాయలేకపోయాను. పార్లమెంటుసమావేశాలు ముగిశాక, సమాధానం వ్రాద్దామన్నదృష్టితో ఆగాను. ఈలోగా శ్రీ అమెరీ, అనేకమంది పార్లమెంటుసభ్యులు. ఇంకా భారతీయవ్యవహారాలలో ఆసక్తిగల అనేకమంది ఆ లేఖను చదివారు. అందుచేత కాలం వృధాకాలేదు.

మీ లేఖకు సమగ్రమైన జవాబుయివ్వడంలేదు. నాకు ముఖ్యవిషయాలుగా తోస్తున్నవాటికే సమాధానమిస్తాను.

"ఇండియా—ఇంగ్లండుదేశాలమధ్య సంబంధాలనుగురించి పరిశీలించేటప్పుడు ఏవిషయంలోను ఏకీభావం ఏమాత్రం వుండజాలదు" అని మీరు భావిస్తున్నందుకు విచారిస్తున్నాను. మనమధ్య కొంతవరకు ఏకీ

భావం సాధ్యమనే నేను ఆశించాను. ఉదాహరణకు ఇతర దేశాల ప్రజల మాదిరిగానే భారతప్రజలుకూడా స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం, సామాజికాభ్యుదయం పొందాలన్నవిషయంలో అభిప్రాయభేదానికి అసలు తావే లేదు. పోతే, ఈ లక్ష్యాల నిర్వచనవిషయంలోనై తేనేమి, వాటిని సాధించేమార్గంవిషయంలోనై తేనేమి వాటిని ఎంతత్వరగా సాధించాలన్న విషయంలోనై తేనేమి మనమధ్య విభేదం హెచ్చుగా వుందనడం నిస్సందేహం.

ఈ లక్ష్యాలను ఎంతకాలంలో సాధించాలి అన్నవిషయంలోగల భేదాభిప్రాయమే అన్నిటిలోకి ముఖ్యమైనదని నేను భావిస్తున్నాను. గత 25 సంవత్సరాలకాలంలో వివిధదశలలో, దఫాలవారీగా సాధించబడిన స్వపరిపాలనను కొన్నిషరతులతో అధినివేశ ప్రతిపత్తి ఒసగబడుతుందన్న వాగ్దానాన్ని మీరు "అవమానకరంగాను, హేళనగాను" పరిగణిస్తున్నారు. అయితే, వివిధదశలలో, దఫాలవారీగా స్వపరిపాలనను మంజూరుచేయడం, ఇతర సంస్కరణలను అమలుజరపడం అన్న పద్ధతిని మా ప్రభుత్వాలు మావిషయంలోను అమలుజరిపివున్నవి. అదే పద్ధతిని ఇప్పుడు భారతదేశానికి వర్తింపజేయడం జరుగుతుంది. నేను, అలాగే ఇంగ్లండులోని ప్రతిఒక్కరూ ఇదేఅభిప్రాయం కలిగివున్నాము. పైన పేర్కొన్నపద్ధతిలోనే, క్రమక్రమంగా మాదేశంలో పౌరస్వత్వాలు రూపొందాయి. క్రమేణా అభివృద్ధి సాధించబడింది. అందుచేత "క్రమానుగతం, విధివిహితా" అన్న విశ్వాసం అనుభవంద్వారా మాలో నెలకొన్నది. ఇది వేదాంతజనితమైన విశ్వాసంకాదు; జీవితానుభవంలో నిగ్గుతేలిన ఒకసత్యం. ఈపద్ధతిని మేమూ అప్పుడప్పుడు దుయ్యబట్టుతుండవచ్చును. త్వరగా జరగవలసినపనులు నెమ్మదిగాసాగడం కద్దు. ఒకసంస్కరణను అమలుజరిపినతర్వాత, ఇది ఇంత ఆలస్యమైనదే అని అనుకోవడం బాధాకరంగానే వుంటుంది. ఏదిఏమైనప్పటికీ, 'క్రమానుగతం' అన్నపద్ధతి మొత్తంమీద మాకు ఉపకరించింది. దానిపుణ్యమా అంటూ మేము, ఇతరదేశాలప్రజలవలె, అనేక యమయాతనలకు లోనుకాకుండా తప్పించుకోగల్గాం. రక్తప్లావిత విప్లవాలపీడ లేకుండా

పోయింది. మా ప్రజలలో విద్వేషాలు ప్రవర్తిల్లలేదు. తొట్రుపాటుతో మేము పిచ్చిపిచ్చిసంస్కరణలను పెద్దఎత్తున అమలుజరపలేదు. సంస్కరణల దాగోగులను ఆచరణలో అనుభవంద్వారా నిగ్గుతేర్చుకుంటూ మేము క్రమంగా ముందడుగువేశాం. అక్కరకురానివాటిని ఎక్కడికక్కడ ఒదిలివేస్తూవచ్చాం. "ఎంతవేగంగా యిది జరుగుతుందన్న" విషయంలో మీవంటి ఆలోచనగల భారతీయులమనస్తత్వం నాకు విచిత్రంగా కన్పిస్తోంది. "ఇస్తే అంతాయివ్వండి. లేకపోతే అసలేవద్దు. అంతా ఇప్పుడే జరగాలి, ఒక్కదెబ్బలో" అన్నధోరణిలో మీరున్నారు. భారతదేశం, దానితోపాటు ఇంకా అనేకదేశాల భద్రత, శ్రేయస్సు యిమిడివున్న పెద్దపెద్ద రాజకీయమార్పులనుగురించి చర్చించేటప్పుడు మీరు పైవిధమైనధోరణిని ప్రదర్శిస్తూ, అదేసమయంలో సామాజికసంస్కరణలు వచ్చేసరికి—నిజానికి వాటిని త్వరగా అమలుజరిపినా అంతగా ప్రమాదంవుండదు—భారతీయులు 'క్రమానుగత' ధోరణిని వ్యక్తం చేస్తున్నారు. ఇదే మాకు విచిత్రంగా కన్పిస్తున్నది. బాల్యవివాహాలు, పర్దా పద్ధతి రద్దువిషయంలో జరుగుతున్నదేమిటి? వీటివిషయంలో బ్రిటిషుఅధికారులు పిరికితనం ప్రదర్శిస్తూ, అతినెమ్మదిగా ముందుకుపోతున్నారు. అయినా దీనిని భారతీయసంఘసంస్కర్తలు మెచ్చుకుంటున్నట్లే కన్పిస్తున్నది. స్వతంత్రభారతదేశంలో వాటిని త్వరితగతిని రద్దుచేస్తామంటూ ఉద్ఘాటిస్తున్నప్పటికీ, అలా జరిగే సూచనలేమీ నాకు కన్పించడంలేదు. అంటరానితనంవిషయంలో శ్రీ గాంధీవైఖరిమాత్రం విశిష్టంగావుందని చెప్పవచ్చును; అయితే, అస్పృశ్యతానివారణ అన్నది స్త్రీపురుషులిద్దరికీ వర్తించే సమస్య. బాల్యవివాహాలు, పర్దాపద్ధతివల్ల భారతదేశంలో ఆరోగ్యం, దేహదారుఢ్యం, విద్య మున్నగువాటి పురోభివృద్ధి ఎంతో కుంటుబడింది. నిజానికి బ్రిటిషుపాలనలో జరిగిన పొరపాట్లవల్ల జరిగిన హానికన్నా, వాటివల్ల జరిగిన నష్టం అధికం.

మీ దృక్పథానికి సన్నిహితంగావుండే ఆంగ్లేయులు చేస్తున్న కృషిని మీరు చాలా తేలికగా చూస్తున్నారు. "సహృదయంగలవ్యక్తులు, గూఢిపుల పలుకుబడి, ప్రభావం ప్రభుత్వవిధానాలు రూపొందించేవిష

యంలోగానీ, దారిద్రోపిడీసామ్రాజ్యవాదాలపైగానీ ఏమాత్రం పరిశీలించము" అని మీరు అంటున్నారు. ఈవిషయంలో మీకన్నా బ్రిటిషు పార్లమెంటుసభ్యుడు సరిగా తీర్పుచెప్పగలడు. ఈవిషయంలో మీది పూర్తిగా పొరపాటుఅభిప్రాయం అని నిస్సందేహంగా చెప్పగలను. 1920నుంచి వివిధదశలలో దఫాలవారీగా ప్రవేశపెట్టబడిన స్వపరిపాలన కేవలం నామమాత్రమైనదిగా మాత్రమే కాక, 'అవమానకరంగాను, హేళనగాను' మీరు పరిగణిస్తున్నారు. పార్లమెంటులోపల, వెలుపల గల భారతదేశఅనుకూలురు ఈ సంస్కరణలు ప్రవేశపెట్టించేందుకు చాలా కృషిచేశారు; తద్వారా ప్రభుత్వవిధానాన్ని రూపొందించడంలో పాత్ర వహించారు. భారతీయఅనుకూలురులో కొందరు—తమ భారతీయ మిత్రుల అభీష్టానికి అనుగుణంగా—అసాధ్యమైనదానిని కోరారు. లేక పోతే, ఇప్పటిదానికన్నా ఇంకా ఎక్కువ సాధించేందుకు అవకాశం వుండేదనుకొంటాను. 1935చట్టంగురించి శ్రీ జోషీ చెప్పిన మాటలు నాకు గుర్తున్నవి. లేబరుపార్టీ తమ ట్రేడ్‌యూనియన్ కార్యకర్తలవిషయంలో సాధించలేనివానిని (ఓటింగుఅర్హతలు, సీట్ల రిజర్వేషన్ మున్నగువిషయాలలో) ముసాయిదాబిల్లును మరింత 'మెరుగుపర్చడంలో మీరు ఎలా కృతకృత్యులు కాగలిగారని శ్రీ జోషీ ప్రశ్నించారు. లేబరు పార్టీ అనుసరించేపద్ధతికి నా పద్ధతికి గల తేడాను నేను ఆయనకు వివరించాను. లేబరుపార్టీ చాలా తీవ్రస్వభావంగల్గిన సవరణలు ప్రతిపాదిస్తుంటుంది. పోతే, నేను ఎంతవరకు సాధించడానికి అవకాశంవుందో ముందుగానే అంచనావేసుకుని, దానిప్రకారం బేరానికి వీలుగా, 20శాతం పెంచి, వ్యవహారం నడుపుతాను. గరిష్టలక్ష్యంకాదు; సాధించడానికి వీలైనగరిష్టలక్ష్యంఅన్నదే నేను అనుసరించేసూత్రం. దీనిని పచ్చి అవకాశవాదంగా మీరు భావించవచ్చును. తీవ్రంగా ద్వేషించవచ్చును; నేను చెప్పగల్గినదల్లా, 'ఇదే కార్యసాధనపద్ధతి.'

"హిట్లర్ ఏజెంట్లకు వైస్రాయిలకు, గవర్నరులకు మధ్య సిద్ధాంత రీత్యాగానీ, ఆచరణదృష్ట్యాగానీ, తేడా ఏమీలే"దని మీరు వ్యాఖ్యానించారు. దీనినిబట్టి నా మనఃస్థితి ఎలావుందో తేలికగా అర్థంచేసుకో

వచ్చును; పైగా, నేను "క్రోధావేశంతో, కపితోకూడుకున్న యుద్ధమన స్తత్వాన్ని ప్రదర్శిస్తున్నట్లు" మీరు ఆరోపిస్తున్నారు. ఈ పాలకులలో కొంతమంది—లార్డ్ హాలిఫాక్స్, వెల్లింగ్డన్, లిన్‌లిత్‌గో, హెయిలీ సర్ మాంటేగూ, బట్లర్, సర్ హెర్బర్టు ఎమర్సన్ (కొత్తవారిని గురించి నాకు తెలియదు.)—ఈక్షణాన నాకు గుర్తుకొస్తున్నారు. వీరంతా న్యాయంకోసం, సమరసభావంతో, నిష్పక్షపాతబుద్ధితో కడు దీక్షతో పరస్పరవిరుద్ధమైన లక్ష్యాలను సమన్వయపర్చడానికి ప్రయత్నించారు. వారి ప్రయత్నాలు అన్నిసందర్భాలలో విజయవంతం కాకపోతే కాకపోవచ్చుగాక. అలాంటివీరికీ, హిట్లరుఏజెంట్లకు సిద్ధాంతరీత్యాగానీ, ఆచరణదృష్ట్యాగానీ తేడా ఏమీలేదంటారు మీరు!

ఏమాటకు ఆమాటే చెప్పాలి; జనరల్‌విషయాలనుంచి ప్రత్యేక విషయాలు వచ్చేసరికి, మీ లేఖలో పేర్కొన్నఅంశాలను—భారతదేశ ప్రభుత్వంపై చేసిన ఆరోపణలను—అంత గట్టిగా కాదనగలిగేస్థితిలో నేను లేను. పోతే, యుద్ధపరిశ్రమకు సంబంధించినంతవరకు మీరు ఉదాహరించినవాటినిగురించి నేను చెప్పదలచింది ఇది: నిర్మించ తల పెట్టిన విమాననిర్మాణయంత్రాగారం, భారతీయనౌకాకంపెనీలవ్యవహారం ఆదిగాగల విషయాలనుగురించి శ్రీ అమెరీ పార్లమెంటులోనే కొంత వరకు సమాధానమిచ్చారు. మీరుచేసిన ఆరోపణలు పూర్తిగా నిరాధారాలని అమెరీ నాతో మచ్చటిస్తూ ఉద్ఘాటించారు. (చర్చసందర్భంలో ఆగస్టు 1న సర్ జార్జి షుస్టర్ ప్రసంగాన్నికూడా చూడండి. 'హన్‌సార్డ్' పంపుతున్నాను) అసమగ్రమైన, పాక్షికమైన సమాచారంవల్ల నిర్ణయాలకురావడంలో కొన్ని పొరపాట్లుచేయడం, తప్పుడుఅంచనాలు వేయడం సంభవమే. ఈ దేశానికిచెందిన అగ్రనాయకులు బ్రిటిషు స్వార్థపరవర్గాల ప్రభావాలకులోనయి వ్యవహరిస్తారనిగానీ, అసూయతో భారతీయ యుద్ధోత్పత్తిని పరిమితంచేస్తారనిగానీ మీరు అనుకుంటేమాత్రం మీరు పూర్తిగా పొరబడుతున్నారు. ఇక్కడి ప్రజలహృదయాన్ని అర్థం చేసుకోవడంలో మీరు పూర్తిగా విఫలులయ్యారని తేలుతోంది. యుద్ధాన్ని జయించితీరాలన్న ప్రధానలక్ష్యంపైన ఇక్కడ జనమంతా దృష్టిని

లగ్నంచేసి, కృషిసాగిస్తున్నారు. వైట్‌హౌస్‌లోని ప్రభుత్వానికిచెందిన వారికి ఢిల్లీలోని ప్రభుత్వానికిచెందినవారికి భారతీయయుద్ధోత్పత్తికిగల అవకాశాలనుగురించి నాకన్నా ఎక్కువగానే తెలిసివుంటుందనడంలో సందేహంలేదుగదా. రవాణాసౌకర్యాలకొరత, ముడిసరుకులు, పరికరాలు, నిపుణులు మున్నగువారి కొరతలవల్ల ఏర్పడుతున్న పరిమితులు ఏమిటో వారికి బాగా తెలుసును.

పోతే, మీరు ప్రస్తావించిన ఇతరవిషయాలు—ఖైదీలవిషయంలోను డిటెన్యూలవిషయంలోను అధికారులు అనుసరిస్తున్న వైఖరినిగురించీ, గూఢచారిదళంగురించీ నేను ఆందోళనచెందుతున్నాను. ఈవిషయాలలో మీరు వాస్తవికదృష్టినే ప్రదర్శించివుంటారనుకొంటాను. పదేళ్ళక్రితం నేను భారతదేశంలో పర్యటించాను. ఆతర్వాత భారతీయులనుంచి, ఇంగ్లండులోని భారతదేశమిత్రులనుంచి నేను అనేకవిషయాలు విన్నాను. చివరకు శాంతికాలంలోసైతం అనవసరమైన క్రూరత్వాన్ని ప్రదర్శిస్తున్నట్టు నాకు తెలిసింది. బహుశా, ఇది కేంద్రీకృతపరిపాలనవల్లనూ, సరియైన శిక్షణపొందిన సమర్థులైన పరిపాలనోద్యోగులు తగినంతగా లేకపోవడంవల్లను జరిగివుంటుందని భావిస్తున్నాను. బెదిరిజంవల్ల జనించిన క్రోధావేశమూ భయోత్పాతమూ కారణంగా ఈ తీవ్ర ప్రతీకారచర్యలు జరిగివుంటాయని తలుస్తాను. 1935 చట్టంక్రింద రాష్ట్రప్రభుత్వాలకు దఖలుపడిన విస్తృతాధికారాలు అమలులోకిరావడంతో ఇదంతా అదృశ్యమైపోతుందని నేను ఆశించాను. కాని, యుద్ధం పాశవికమనస్తత్వాన్ని ప్రజ్వలింపచేస్తుంది. బెదిరిజంవలెనే, అది క్రోధాన్ని, భయాన్ని రేకెత్తిస్తోంది. సమర్థులైన పరిపాలకులంతా యుద్ధబాధ్యతలు స్వీకరించవలసిరావడం అందుకు ఒక కారణమైవుండవచ్చును. ఈవిషయాలనుగురించి బాధ్యులైనవారితో నేను చర్చిస్తాను. ఆ చర్చలవల్ల వాస్తవికవిషయాలు బయటపడవచ్చును. సంస్కారమార్గాలు కనుగొనడానికి ఆ చర్చలు కొంతవరకు ఉపకరించవచ్చును.

పోతే, మళ్ళీ అసలుసమస్యకు వస్తాను. మీ లేఖలో అవంగతమైన అంశం ముఖ్యంగా ఒకటి నాకు కొట్టొచ్చినట్టు కన్పిస్తోంది:

మొత్తం భారతావనికీ, యావన్మందిభారతీయప్రజకూమీరే ఏకైకప్రతినిధి అన్నభావం మీ లేఖలో అడుగడుగునా వ్యక్తంచేశారు. ("మేము కలిసి కట్టుగా వ్యవహరించలేకపోతే, బ్రిటిష్‌ప్రభుత్వం మా గొడవలను మాకే వదిలేసి పోకూడదా") మీ రొకవిషయాన్ని విస్మరిస్తున్నారు. మీ గొడవలను ఏదోఒక కుంచెతో ఇట్టే తుడిచేయవచ్చునన్నట్లు మీరు మాట్లాడుతున్నారు. భారతదేశం భవిష్యత్తువిషయమై మీతో ఏమాత్రం ఏకీభవించనిజనం భారతదేశంలో అనేకమంది కలరు. 'మీగొడవలతో మేము విసిగివేసారిపోయాం. మీగొడవలు మీరే తేల్చుకోండి.' అని మేము ప్రకటించినపక్షంలో మిమ్మలను వ్యతిరేకిస్తున్న భారతీయులంతా మేము ద్రోహంచేసినట్లు ఎంచుతారు; తమను నట్టేటముంచి పోతున్నట్టు భావిస్తారు. వారు అలా భావించడంలో సబబులేకపోలేదు. మీరేకనుక మా స్థానంలో వుండివుంటే మీ రేమిచేస్తారు? మీ అంతటమీరే ఈప్రశ్నవేసుకొని, నిజాయితీగల వ్యక్తివలె జవాబుచెప్పండి.

కాంగ్రెసుకోర్కెల మంచిచెడ్డలమాట అలావుంచండి. మేము ఈనాడున్నస్థానంలోనే మీరున్నట్టయితే, ఒకేఒకపార్టీకి—అది పెద్దదే కావచ్చును. అత్యంత ప్రగతిశీలమైనదే కావచ్చును; మీరు లొంగిపోతారా? ఇతరపార్టీలకు, గ్రూపులకు లోగడ మీరిచ్చిన హామీలను, చేసిన వాగ్దానాలను మీరు ఆ పార్టీకోసం కాలదన్నగలరా? మీతో సహకరించినవారిని, సహాయపడినవారిని ప్రక్కకు నెట్టివేస్తారా? యుద్ధసమయంలో వారిసహకారం ఎంతో అవసరమైనతరుణంలో మీరు ఆ పని చేయగలరా? చేస్తామని వాగ్దాన మివ్వగలరా? చెప్పండి. పైగా ఈ యుద్ధం జయాపజయాలపై బ్రిటన్‌భవితవ్యంమాత్రమే కాక, యూరప్, భారతదేశాల భవిష్యత్తుకూడా ఆధారపడివున్నసంగతి ఈ సందర్భంలో గమనించతగినది. కాంగ్రెసు, భారతదేశంపట్ల మేము కడు ఉదారంగా వ్యవహరిస్తే, ఇంతవరకు మాతో స్నేహంనెరపుతూవచ్చిన అనేక గ్రూపులను మేము దూరంచేసుకోవలసివుంటుంది. అదీకాక, కాంగ్రెసు మాతో సహకరిస్తుందన్న గ్యారంటీవుండదు. ఏదో ఆశాభావంపై ఆధారపడి, అలాంటిపనిని మేము ఎలాచేయగలం?

ఐర్లండువిషయంలోను, సంధిరేవులవిషయంలోను మేము గడించిన గుణపాఠాలనుదృష్టిలోవుంచుకున్నప్పటికీ, మీవిషయంలోమాకువిశ్వాసంకలగడంలేదు. అలాగే, మీ లేఖ ధోరణిగాని, మీ గ్రంథంపోకడగానీ, మీ పార్టీకిచెందిన ఇతరుల ఉద్ఘాటనలుగానీ మాలో విశ్వాసంకల్గించేవిగా లేవు. ఇలా వ్రాస్తున్నందుకు కోపగించకండి. మీ మాటలలోను, చేతలలోనుకూడా శతృత్వభావమే గోచరిస్తోంది. ఈ ధోరణి మారుతుందన్న నమ్మకంలేదు. ఎందుకంటే, ఈ ధోరణికిగల తల్లివేరు మార్పుకు అవకాశంలేనిగతంలో లోతుగా వేరుతన్నివుంది.

నిజమే, మీరన్నట్టు ఒండొరుల నిజాయితీని మనం శంకించకూడదు. అయితే, మీ నిజాయితీని చూస్తున్నకొలదీ, మనమధ్య అధిగమించలేని అగాధంవున్నట్టు నాకు కన్పిస్తున్నది. బహుశా నేను పొరబడేవుండవచ్చును.

భవదీయుడు,
ఎలినార్ ఎఫ్. రాథ్‌బోన్

తాజాకలం: మరొకకవరులో భారతదేశంపై తాజాచర్చపడిన 'హన్సర్డ్', భారతదేశంపై నేను రచించిన చిన్నపుస్తకాన్ని పంపుతున్నాను. మీ గ్రంథప్రతినికూడా పంపుదామనుకొన్నానుగాని, అందుకు సాధ్యంకాదేమో. మీగ్రంథప్రతిని మీరు చూడలేదన్నారుకదూ.

324. సర్ జార్జి షుష్టర్ వద్దనుంచి

మిడిల్‌బార్టన్, ఆక్సోన్
సెప్టెంబరు 23, 1947

ప్రియమైన జవహర్‌లాల్ నెహ్రూ,

నేనూ, మరొకరు కలసి రచించిన గ్రంథం (భారతదేశం: ప్రజాస్వామ్యం) ప్రతులు నౌకలో భారతదేశంచేరగానే, దానిప్రతి నొకదానిని మీకు అందజేయవలసిందని మాక్మిలన్స్‌వారికి చెప్పాను. ఈ గ్రంథం జూన్‌మాసారంభంలో పూర్తిఅయింది. అప్పటికి రష్యాపై

దండయాత్ర ప్రారంభంకాలేదు. ఈ గ్రంథరచన పూర్తిఅయినపిమ్మట ఇంకా అనేకపరిణామాలు సంభవించాయి. పరిస్థితి అనుక్షణం మార్పు చెందుతోంది. అయితే, ఈ గ్రంథంలో దూరదృష్టితోకూడిన సింహావలోకనం జరిపాం. అందుచేత నిత్యం జరుగుతున్న మార్పులనుబట్టి ఈ గ్రంథంలో పేర్కొన్నవిషయాలు మార్చవలసిన అగత్యంలేదు. ఈ గ్రంథం రెండుభాగాలుగా వుంది. మొదటిభాగం వింట్ రచించాడు. అందులో భారతదేశపు చారిత్రక, సాంఘిక పూర్వరంగందృష్ట్యా ఈనాటి పరిస్థితిని సమీక్షించాడు. ఈ భాగంలో ఉల్లేఖించిన అనేకఅంశాలతో మీరు ఏకీభవించరు. అయినప్పటికి, ఎంతో చిత్తశుద్ధితో ఈ రచన సాగించాడు. ఆయన వాస్తవికదృక్పథం అందులో ప్రస్ఫుటమవుతున్నది. వింట్ దృక్పథంపై నా ప్రభావం ప్రసరింపచేయటానికి నేను ఎట్టిప్రయత్నం చేయలేదు. ఉపోద్ఘాతంలోనే ఉదాహరించినట్టు తద్భిన్నమైనఅంశాలను ఎన్నింటినో నేను ఉదాహరించాలనుకొన్నాను. అయితే, నేను రచించినభాగానికి, మొదటిభాగాన్ని ప్రాతిపదికగా తీసుకొన్నాను. ఆ ప్రాతిపదిక ఆధారంతో నా సొంతవ్యాఖ్యానంచేశాను. "భవిష్యత్తు ఏవిధంగా వుంటుంది? మనం చేయవలసిన దేమిటి?" అని ప్రశ్నించాను. నేనురచించినభాగం మీకు తప్పక ఆసక్తికలిగిస్తుందని అనుకొంటున్నాను. ఈసందర్భంలో నేను ఒకమాటమాత్రం గట్టిగా చెప్పగలను. నాదృష్టికి వాస్తవంగా ఏమికన్పించినదో, దానినే నారచనలో వ్యక్తంచేశాను. ఈ రచనలో వ్యక్తమైన నా వైఖరిని బహుశా మీరు అర్థంచేసుకోగలరనీ, మొత్తంమీద సానుభూతితోనే చూడగలరనీ నా నమ్మకం. సత్యాన్వేషణకు నారచన ఉపకరిస్తే, తేలినసత్యం నేను ఊహించినట్టిది కాకపోయినప్పటికీ, నేను కృతార్థుడనైనట్టే భావించుకొంటాను.

మీదేశాన్నిగురించి విదేశీయులమైన మావంటివాళ్ళు రచనలు సాగించటం "పిలువనిపేరంటానికి తగుదుమమ్మాఅంటూ వచ్చినచందంగా మీరు పరిగణిస్తున్నారన్నసంగతి నాకు తెలుసును. పైగా, మీరు ఫలానావిధంగా వ్యవహరించాలని మేము సూచించినప్పుడు మీరు ఎలా భావిస్తారో ఇక వేరే చెప్పాలా? ఇలాంటివిషయాలలో వారు ఎలా చిరాకు

చెందుతుంటారో నేను మిమ్ములనుకలుసుకొన్న అనేకసందర్భాలలో గ్రహించాను. ఉదాహరణకు: గతపర్యాయం 'చాతంహౌస్' లో మీరు ప్రసంగించినప్పటిదృశ్యం ఇంకా నా స్మృతిపథంనుంచిచెరిగిపోనేలేదు. మళ్ళీ అలా జరగరాదనే ఆశిస్తాను. మీ తండ్రిగారిపట్ల నాకు ప్రగాఢాను రక్తి, అభిమానం కలవు. పోతే, మీకుసంబంధించినంతవరకు సిమ్లాలో పీటర్ హౌస్‌లో మీరు నన్నుకలుసుకొన్నప్పటిదృశ్యాన్నిసదాస్మరించుకుం టూంటాను. మీరు అప్పుడు నాతోను, నా భార్య, ఇద్దరుపిల్లలతోను కలసి విందారగించారు. నా కొడుకులిద్దరూ ఆక్స్‌ఫర్డునుంచి సెలవులకు వచ్చారు. ఆ కాసేపు సహచరభావం, పరస్పరఅవగాహన మెరుపులా మెరిశాయి. అలాంటిదే పదేపదే సంభవంకావాలని కాంక్షిస్తాను. బహుశా ఈ యుద్ధం ముగిసేలోపున, మన ఉభయదేశాలను ఎదుర్కొంటూన్న సమష్టిప్రమాదాలవల్లనైనా మనం మరింత సన్నిహితులం కాగలమేమో; లేదా యుద్ధాగ్నిజ్వాలల్లో గలానికిచెందిన ప్రతిఘటనాప్రతిబంధకాలు తునాతునకలైపోవచ్చును. మీరు చూసిన నా కొడుకులిద్దరిలో ఒకడు అప్పుడే యుద్ధాగ్నులకు ఆహుతిఅయిపోయాడు. రెండోకొడుకుకూడా విదేశాలలో ప్రమాదకరమైన యుద్ధరంగంలో పోరాటంసాగిస్తున్నాడు. ఈ ఘటనలఉప్పెనలో అల్పవిషయాలు దూదిపింజలవలె ఎగిరిపోతాయి. మూలవిషయాలుముందుకువస్తాయి. మూలవిషయాల్లో విభేధించేవారుసైతం, ఉదాహరణకుమీరూ, నేనూ, నేనుమాత్రం అలాఅనుకోవడంలేదనుకోండి. ఒండొరుల నిజాయితీని శంకించడం మానేస్తే, పరస్పర అవగాహన సౌహార్దం సాధించడం అంత కష్టంకాదు. భారతదేశసమస్య ఒకవిధంగా బ్రిటన్‌కుకూడా చెందినదన్నవిషయం మీరు అంగీకరిస్తారనుకొంటాను. భారతదేశంలో స్వతంత్రప్రభుత్వం నెలకొనడానికి అవసరమైన పరిస్థితు లను కల్పించడంలో బ్రిటన్‌కూడా సహకరిస్తే, ఎన్నో బాధలు తప్పి పోతాయన్నవిషయం మీరూ ఒప్పుకొంటారనుకుంటాను. కాగా, మా నిజాయితీలో మీకు విశ్వాసంఏర్పడేటట్టుచేయడంలో నా గ్రంథం కొంత వరకు దోహదకారి కాగలదనుకొంటాను.

నా గ్రంథంలోని అంశాలు, మీకు నచ్చినా నచ్చకపోయినా, దానిపై మీ అభిప్రాయాన్ని మాత్రం తప్పక తెలియజేయండి.

భవదీయుడు,
జార్జి షుస్టర్

తాజాకలం: ఈ లేఖ వ్రాసిన పిమ్మట కుమారి ఎలియనార్ రాథ్ బోన్ తనకు మీరు వ్రాసిన లేఖను తీసుకొచ్చి, నాకు చూపించింది.

ఆ లేఖను చూసిన తర్వాత, నా లేఖలోని అంశాలుగాని, నా గ్రంథంలోని అంశాలుగానీ మీకు పూర్తిగా అంగీకారయోగ్యాలు కాగలవని నేను అనుకోవడంలేదు. మనం అనేక విషయాలలో—అన్ని విషయాలలోను కాదనుకోండి—పరస్పర "విరుద్ధమైన ఉద్దేశాలు" కలిగివున్నాం. కుమారి రాథ్ బోన్ కు మీరు వ్రాసిన లేఖలో పేర్కొన్న అంశాలన్నింటికి సమాధానమివ్వాలని అనుకొంటున్నాను. మరొకసారి నేను మీకు లేఖ వ్రాయడం మీకు అభ్యంతరకరంగా వుండదనే తలుస్తాను.

సర్ స్టాఫర్డ్ క్రిప్స్ నుంచి

సెంట్రల్ జైలు,
లక్నో,
నవంబరు 8, 1941

ప్రియమైన జవహర్ లాల్జీ,

నా మనస్సులో ఎలాంటి వేడుక జరుపుకోకపోయినా, ఈ లేఖ వ్రాయడంవల్ల 'జన్మదిన దినోత్సవం' జరుపుకొందామనుకొన్నాను. నా లేఖ మీకు చిరాకుకల్పించబోదనే తలుస్తాను. ఒకవేళ ఇతరులవద్దనుంచి లేఖలకోసం మీరు ఎదురుచూస్తూవుంటే, ఆసందర్భంలో నా లేఖ మీకు చేరడం, తద్వారా మీకు చికాకుకల్గడం జరిగితే, నేను అందుకు విచారిస్తాను.

హావలాక్ ఎల్లిస్ ఆత్మకథను మీకు పంపుదామనుకొంటున్నాను. అది మీకు బాగా నచ్చుతుంది. అయితే, కొత్తగా వెలువడిన గ్రంథాలను

మీరు ఎప్పటికప్పుడు ముందుగా తెప్పించుకొంటారన్నసంగతి నాకు తెలుసును. అందుకే సందేహిస్తున్నాను.

అల్హాబాద్‌లో నెలరోజులు గడిపినతర్వాత నేను ఇక్కడకు వచ్చాను. సుచేరా, ఉమాభాభీల శిక్షాకాలం ఈనెలలోనే పూర్తిఅవుతుంది. ఒకవేళ అధికారులుచేసినతప్పిదాన్ని జె. జగన్నాథ్ తన తీర్పులో సరి దిద్దినా, దానివల్ల వారికి ఎట్టి మేలు జరగబోదు. చివరకు డాక్టరు కట్జూకు జరిగే మేలుకూడా బహు పరిమితమైనదే అవుతుంది. ఇక నా సంగతి చెప్పనేఅక్కరలేదు. అయినా నేను అందుకు చింతించను. నాకు ఒరిగేదిగానీ, పోయేదిగానీ ఏమీలేదు. పోయేందుకు నాకు చేతులకు శృంఖలాలుకూడా లేవు. నా జీవితం జవాబులేని లేఖగా తయారైంది. సమాధాన మిచ్చేవారు ఎవరూ లేకపోతే,చివరకు కాలమే జవాబిస్తుంది. లేదా రోజులు దొర్లుకుపోతూనేవుంటాయి.

సుచేత నన్ను విడిచి వెళ్ళిపోతుంది. అయినా, ఒంటరిగా గడుప డం నాకు అంత కష్టంకాదు. ఇక్కడ జనం పలచబడిపోతున్నారు. కొద్ది రోజులకు మేము నలుగురంమాత్రమే మిగిలిపోతాం. మాలో ఇద్దరు శిక్షలు పడినవారు, మిగతా ఇద్దరూ డెటిన్యూలు.

కేంద్ర కార్యవర్గసమితినిగురించిన వార్త ఈరోజుఉదయం పత్రిక లలో పడింది.

దియోలీజైలులో యువకులను చిత్రహింసలపాల్జేస్తున్న పద్ధతి తలుచుకొంటూంటే, మాకు ఇక్కడ బొత్తిగా అన్నం సయించడంలేదు. ఆ యువకులభార్యలనుగురించే నేను హెచ్చుగా బాధపడుతున్నాను. జయ ప్రకాశ్‌స్థితిని తలుచుకుంటే, జాలివేస్తోంది. విచారించడం మినహా చేయ గలిగినదేమిటి? 'స్టేట్స్మమన్' పత్రిక చదివారా? జైలులో చివరకు నడవ డానికి నిర్దేశించిన నియమాలుసైతం ఎంత హాస్యాస్పదంగా వున్నాయి!

మీరు త్వరలోనే మామూలుస్థితికి చేరగలరు. డిసెంబరులో శ్రీ పండిట్ విడుదలకాగలరని విన్నాను. పదిమందితో కలిసివున్నా మీరు ఏకాంతజీవిలాగానే కన్పిస్తారు. పదిమందితోవున్నా లేక ఏకాంతంగావున్నా

మీకు ఒకటిగానే వుంటుందనిపిస్తూవుంటుంది. అందుచేత మీరు ఎన్నడూ ఏకాంతజీవికారనే నా నమ్మకం.

శ్రీ పండిట్‌ను, డాక్టరు రామ్‌స్వరూప్‌ను, మీ జైలర్‌ను అడిగినానని చెప్పండి.

అభివందనాలతో,

సెన్సార్‌చే ఆమోదింపబడింది.

మీ అనురాగమాల,
నోరా

సంతకం: ఎస్. కె. పి. I. ఎస్. లక్నో,
9—11—41

326. శ్యామప్రసాద్ ముఖర్జీ వద్దనుంచి

కలకత్తా,
నవంబరు 23, 1941

ప్రియమైన పండిట్‌జీ,

వెంటనే జవాబిచ్చినందుకు ధన్యవాదాలు. మీ జవాబు చూసి నేను ముగ్ధుడనయ్యాను. మీతో వాదించాలన్న అభిలాష నాకు లేదు. మీరు వెలిబుచ్చిన మనోభావాలతో నేను పూర్తిగా ఏకీభవిస్తాను. ఈనాటి భారతదేశంలో ఎక్కడచూసినా బందిఖానాలే. వాటికి అవధులంటూ లేవు. మీ రెన్నో అగ్నిపరీక్షలలో నెగ్గినప్పుడే, భారతదేశం రక్షిస్తిత మీదేరుతుంది.

అయితే, మీకు నా దొక అభ్యర్థన. దయచేసి మీనిర్ణయాన్ని పునరాలోచించండి. ప్రపంచచరిత్రగురించి మీరుచేసిన సునిశితపరిశీలనవల్లనైతేనేమి, భారతపోరాటపు పూర్వరంగందృష్ట్యానైతేనేమి, ఈనాడు మీరు అగ్రరాజకీయవేత్తలశ్రేణిలో నిలబడివున్నారు. మన మీనాడు మహాసంక్షోభంలో వున్నాం. అనైక్యత అనే మేఘాలు, దమననీతి అనే మబ్బులు అప్పుడప్పుడు మనకు నిరాశకల్గిస్తున్నమాట నిజమే అయినా, ఇక పరిస్థితి కలకాలం స్థిరీభూతం కావడానికి మనం చచ్చినా అంగీక

రించం. దానికి మనం తలొగ్గేదిలేదు. మార్పు తప్పనిసరిగా జరిగితీరాలి. అయితే, ఆ మార్పును సాధించగల్గింది మానవాళిమాత్రమే. వినాశకర మైన మూడుశక్తుల ప్రాబల్యంనుండి—అధికారం, అక్రమణ, ప్రతిష్ఠ అనే శక్తుల ప్రాబల్యంనుండి — మానవాళి విముక్తంకాగలిగినప్పుడు మాత్రమే అది మార్పును సాధిస్తుంది.

ఇక భారతదేశపరిస్థితికిసంబంధించినంతవరకు,ముఖ్యంగా హిందువులభవిష్యత్తుకు సంబంధించినంతవరకు, కొన్నిఅంశాలలో మీ దృక్పథం, నా దృక్పథం కలిగివున్నవారిమధ్య అభిప్రాయభేదాలకు తావుండడంలో అసహజమేమీలేదు. మానవహృదయానికి సంపూర్ణస్వేచ్ఛ అన్న అమరసందేశాన్ని భారతదేశం యుగయుగాలుగా ప్రపంచానికి చాటింది. ఈ అమరసందేశమే మానవనాగరికతను కాపాడి, దానిని మరింత మహోన్నతపథానికి కొనిపోతుందని మనందరివిశ్వాసం. మీకు అవకాశంవున్నప్పుడు, మీకు అంగీకారమైతే, ఫలానానాటికి అని నేను సూచించలేదు—కమలాఉపన్యాసాలపేరిట, భారతదేశచరిత్ర మంచిచెడ్డలనుగురించి సమగ్రమైన సమీక్షచేయవలసిందిగా మిమ్మలను కోరుతున్నాను. భారతదేశ శక్తి - స్తోమతులు, బలహీనతలు, రాజకీయ దాస్యంసైతం నిర్మూలించజాలని అమరవిలువలను రూపొందించడంలో భారతదేశం నిర్వహించినపాత్ర, స్వాతంత్ర్యం, ఆత్మగౌరవంగల జీవితం గడపడానికి అనువైనపరిస్థితులను కల్పించుకోడానికి భారతదేశం నిర్వర్తించవలసిన కర్తవ్యాలు మున్నగువాటినిగురించి మీరు వివరించవచ్చును; మానవజాతి ఈనాడు చాలా క్లిష్టమైనపరిస్థితులలో చిక్కుకొంది. సంకుచితమైన పార్టీప్రయోజనాలను పరిగణించకుండా ఉదాత్తభావంతో వ్యవహరించగల్గినవారు ఈనాడు బహు కొద్దిమందే వున్నారు. ఆ కొద్దిమందిలో మీ రొకరు. విభిన్నదృక్పథాలను మీరు అర్థంచేసుకోగలరు. వాటిని సహించగలరు. కూలిపోతున్న ఆధునిక నాగరికతనుంచి ఉజ్వలభవిష్యత్తును మీరు రూపొందించగలరు. తద్వారా భారతదేశానికి సముచితస్థానం సంపాదించగలరు.

దయచేసి నా కోర్కెను 'సరే' అని అంగీకరించండి. మీరు ఏ విషయంగురించి ప్రసంగిస్తారో ముందుగా తెల్పండి. ఇందుకు సంబంధించిన సన్నాహాలు పూర్తిచేసుకోడానికి అనుమతించండి.

శుభాకాంక్షలతో మరి సెలవు.

భవదీయుడు,

శ్యామ్‌ప్రసాద్ ముఖర్జీ

327. జయప్రకాశ్ నారాయణనద్దనుంచి

దియోలీ డిటెన్షన్ శిబిరం,
దియోలీ, రాజపుటానా,
డిసెంబరు 7, 1941

ప్రియమైన సోదరా,

మీకు మనఃపూర్వకమైన వందనాలు.

.........దేశానికి మీ సారథ్యం అత్యవసరమైన ఈరోజుల్లో మీరు విడుదలఅవుతున్నందుకు కడు సంతోషం.

*　　*　　*

*　　*　　*　　*

నరేంద్రదేవ్ఆరోగ్యస్థితినిగురించి మీకు తెలిసేవుంటుంది. ఆయన తనఆరోగ్యంగురించి బొత్తిగా శ్రద్ధతీసుకోనే తీసుకోరు. ఆయనకున్న పెద్దలోపాలలో ఇదొకటి. ఆయన ఆరోగ్యంవిషయమై తగిన శ్రద్ధతీసుకోకపోయినపక్షంలో, జీవితాంతంవరకు ఆయన అవిటిబ్రతుకు వెళ్ళమార్చవలసివస్తుందేమోనని నేను భయపడుతున్నాను. యు. పి. గానీ, లేక ఉత్తరభారతంలోని ఇతరప్రదేశాలుగానీ ఆయనకు అంతఅనువుగాఉండవు. మహారాష్ట్రంలోని సతారావంటిజిల్లాలో లేక దక్షిణాదిన అనంతపురం జిల్లాలోని బళ్ళారివంటిప్రాంతమో ఆయనకు అనువుగా వుండవచ్చును; కనీసం గుజరాత్ అయినా ఫరవాలేదు. ఈవిషయం ఆయన సొంతనిర్ణ

---

** సెన్సార్ చేయబడిన భాగం

యానికి వదిలేసినపక్షంలో, యు. పి. లో ఎక్కడో ఒకచోటకు పోతారు. మహాఅయితే, ఆయనను శ్రీ ప్రకాశ్ బెనారస్‌లోని తన సేవా శ్రమానికి తీసుకుపోవచ్చును; ఆయన తన అశేష మిత్రుల సహాయం అర్థించడానికి సంకోచిస్తారు. అందుచేత ఈవిషయంలో మీరు ప్రత్యేక శ్రద్ధతీసుకోవాలని సూచిస్తూ నే నీ లేఖ వ్రాస్తున్నాను. అనువైనప్రదేశానికి ఆయనను పంపించండి. మీరు దీనిని ఆయనఇష్టానికి వదిలేయరాదు. బిడ్డను తండ్రిచూసినట్టుగా, మీ రీ విషయంలో ఆయనను చూడాలి. బాపూజీకూడా నరేంద్రదేవ్‌ఆరోగ్యంవిషయమై శ్రద్ధతీసుకుంటున్నందున మీరు ఈసందర్భంలో ఆయననుకూడా సంప్రతించవచ్చును.

నాకు ఇప్పుడు స్వస్థత చేకూరింది. నెమ్మదిగా బలం పుంజుకుంటున్నాను. పేట్‌జీకూడా కులాసాగా వున్నారు. మీకు శుభాకాంక్షలు తెల్పుతున్నారు. గౌతమ్ మలేరియాతో తీసుకొంటున్నాడు. ప్రస్తుతం ఆసుపత్రిలో వున్నాడు. మిగతా మిత్రులంతా క్షేమం.

ప్రేమతో, మీ
జయప్రకాశ్

దియోలీ డిటెన్షన్‌శిబిరం,
సెన్సార్ చేయబడి. ఆమోదింపబడినది.
సూపరిన్‌టెన్‌డెంట్.

328. ఆర్. అచ్యుతన్‌వద్దనుంచి

సెంట్రల్‌జైల్,
రాజమండ్రి,
డిసెంబరు 8, 1941

నా ప్రియమైన పండిట్‌జీ,

మీరు జైలునుంచి విడుదల అవుతున్నసందర్భంలో మేము మా శుభాకాంక్షలను,ప్రేమానురాగాలను మీకు అందజేస్తున్నాం. మేమంతా ఈ రాష్ట్రంలోని విద్యార్థిడిటెన్యూలం. మీకు శుభాకాంక్షలు పంపించా

అన్న ప్రత్యేకాభిలాష మా అందరికి కలదు. అందుకు కారణం లేక పోలేదు. యువతీ యువకుల ఆశలకూ, ఆశయాలకూ చిహ్నం మీరే. పండిట్‌జీ! ప్రేమానురాగబద్ధమైన మా ప్రణామాలు అందుకోండి. ఈ జైలునుంచి మేము మీకు పంపించగల్గింది ఈ లేఖ మాత్రమే.

మీరు విడుదలఅయినవెంటనే జారీచేసిన ప్రకటనను మేమంతా ఎగబడిచదివాం. జాతీయనిరుత్సాహా,నిస్తేజాలమధ్య మీకంఠారావం ఢంకా ధ్వానమై విన్పిస్తోంది. చివరకు జాతీయవర్గాలలోనైతం ఈనాడు కల్మష మైన పార్లమెంటరీమనస్తత్వం పెచ్చరిల్లుతోంది. ఇట్టితరుణంలో, మీరు యిచ్చిన పిలుపు, బాపూజీయిచ్చినపిలుపు మా హృదయాలను పులకిత మొనర్చాయి. నాలుగుగోడలమధ్య బంధితులమైవున్నప్పటికీ, మా గుండెలు ఉత్సాహంతో ఉప్పొంగుతున్నాయి.

మేమంతా జీవితాన్ని అలాగే ఈడ్చేస్తున్నాం. మా హృద యాలలో నాటుకుపోయిన ఆదర్శాలే మాకు ఉల్లాసాన్ని కలుగచేస్తు న్నాయి. ఈ దేశాన్ని చరమలక్ష్యంవైపు నడపడంలో అవసరమైన శక్తిసోమతులు, ధైర్యసాహసాలు, దూరదృష్టి మీకు కలుగుగాక అని కోరుకొంటున్నాను.

మనఃపూర్వకమైన శుభాకాంక్షలతో, సెలవు.

భవదీయుడు,
ఆర్. అచ్యుతన్

పండిట్ జవహర్‌లాల్‌నెహూ్రు,
అల్లాబాద్.

గమనిక: ఇదేమీ రాజకీయలేఖ కాదు. సెన్సార్‌వారు ఇది గమ నించకపోరు. మా ప్రియతమనాయకునికి ఈ లేఖద్వారా శుభాకాంక్షలు అందజేసుకొంటున్నాం.

సెన్సార్‌చేయబడెను. 8/12

ఆర్. అచ్యుతన్

329. సరోజనీదేవినద్దనుంచి

హైదరాబాద్, దక్కన్,
డిసెంబరు 9, 1941

ప్రియమైన జవహర్,

జైలునుంచి మీరువ్రాసిన అపురూపమైన లేఖను, విడుదలై వచ్చిన పిమ్మట జారీచేసిన మరింత అపురూపమైన మీ ప్రకటనను చూసి, నే నెంతో ఉత్తేజంపొందాను. దిగులుగొన్న నా మనస్సుకు అవిరెండూ ఎంతో ఊరటకల్గించాయి. ఈ లేఖవ్రాయటంలో ఆలస్యమైంది. మీకు సుస్వాగతమిస్తూ నేను పంపించిన తంతి మీకు అందేవుంటుందనుకుం టాను. (క్రిస్మస్ సెలవులకు ముందా?)నాజీవితంలోకల్లా అత్యంత విషాద కరమైనదశ—మూడుమాసాలకాలం—ఎట్లాగో గడిపేశాను, ఈదశలో కొచవలేని విషాదం పొందాను. ఏదిఏమైనా, స్వకీయమైన విచారమూ, బాధా వ్యక్తిగతమైనవీ, ఆంతరంగికమైనవేగదా! జీవితాంతం మరువలేని ఈ మూడునెలల్లోను నేను ఎంతో క్షోభ అనుభవించాను. రోజులతరబడి మృత్యువుతో పోరాడుతున్నవ్యక్తి శయ్యప్రక్కనే వుంటూ, చెప్పనలవి గాని బాధను అనుభవించాను. ఏమైనా మేమంతా—బంధువులు, మిత్రులు, ఆగంతుకులు అంతా—ఈ మూడునెలల్లోను ఆధ్యాత్మికంగా అభివృద్ధి చెందాం; ఉత్తేజితులమయ్యాం. వారంతా ఆసమయంలో రోగిప్రక్కనే వుండటం మా అదృష్టం. మరణశయ్యపైనుంచి మృత్యువుతో వీరోచి తంగా పోరాడిన ఆడపిల్లను కనులారా చూడగలిగాం. నిజానికి ఆ పిల్ల కొనవూపిరితోవుంటూకూడా జీవితంకోసం ఎంతగానో పోరాడింది. నే నీ రోజు అనుకుంటున్నాను, ఆశిస్తున్నాను, దేవుడిని ప్రార్థిస్తున్నానుగదా: ఆమె నిజంగా బాధాతప్తయాత్రను పూర్తిగా ముగించి, ఒడ్డుకుచేరివుం టుందని: శీతంగమ్మిన ఆమె నన్నుచేతిని చేతబట్టుకొని బేబీ కూర్చున్నది. ఆమెబాధను చూసి, భరించలేని బాబా బయటకుపోయి, ఎక్కడో ఒక మూల కూర్చున్నాడు. రేయింబవళ్ళు నేను ఆమెకు సేవచేశాను. ఆమెను నేను గాఢంగా ప్రేమించాను. అలాంటి నేను మీకు ఈ లేఖను రాస్తు న్నానంటే, ఇందులో పొందే ఊరట....నాజీవితంలో నే నెన్నడూ చూడ

లేదు. మనోబలంఅన్నది శారీరకబాధను అంతగా తట్టుకొని, గట్టిగా నిలవగల్గుతుందని, విజయంసాధిస్తుందని, మృత్యుకౌగలిలోకి పోతున్న సమయంలోసైతం అంతటి హుందాతనం, మర్యాద, సాహసం, సహనం ప్రదర్శించడం నే నెన్నడూ చూడలేదంటే నమ్మండి. మీరు ఈవాను చూసేవుంటారని ఆశిస్తాను. కొనవూపిరితోవుండి, మధ్యమధ్య గొంతుపెగిలినపుడల్లా అంటున్నదిగదా: "నేను జవహర్‌లాల్‌ను చూశాననుకొంటాను. ఆయన ఎలావున్నారు? ఆయనకు నాతరపున ధన్యవాదాలు అందచేయి...."

అధ్యక్షులు కాంగ్రెసుకార్యవర్గాన్ని, అఖిలభారతకాంగ్రెసుసంఘాన్ని త్వరలోనే సమావేశపర్చగలరని భావిస్తాను. బహుశా, నేను ఆ సమావేశాలకు హాజరుకాగలను. తేల్చవలసిన ముఖ్యవిషయాలు వున్నాయి. మీకూ, నాకూ సంబంధించినంతవరకు, చేయతగు నిర్ణయం ఒక్కటే ఒకటి వుంది. మిగతావేవీ మన ఆదర్శాలకుగానీ, దేశానికిగానీ అనువైనవీకాదు, అర్థమైనవీకాదు.

ప్రేమతో,
సరోజని

330. ఫీల్డ్ మార్షల్ ఎ. పి. వేవెల్‌నద్దనుండి

కమాండర్ ఇన్ చీఫ్ ఇన్ ఇండియా,
న్యూఢిల్లీ,
డిసెంబరు 28, 1941

డియర్ సర్,

ఈమధ్య నేను చుంకింగ్‌కు వెళ్ళినప్పుడు మదాం చాంగ్‌కైషేక్ "మీరు తిరిగి భారతదేశానికి చేరగానే, పండిట్ నెహ్రూకు నా శుభాకాంక్షలు తెలుపండి" అని నాతో చెప్పింది. ఆమె కులాసాగావుంది. ఉల్లాసంగాఉన్నట్టు కన్పించింది. అంతకుముందు ఆమెను నేను చూడలేదు. ఆమె నన్ను ముగ్ధుణ్ణిచేసింది.

దయచేసి దీనిని ఆంతరంగికమైనలేఖగా పరిగణించండి. శుభా కాంక్షలు అందజేయడంగామాత్రమే భావించండి. కమాండర్ ఇన్ చీఫ్ హోదాలో నే నీ లేఖను వ్రాయడంలేదు.

భవదీయుడు,
ఎ. పి. వేవెల్.

331. జడ్. ఎ. అహమ్మద్ వద్దనుంచి

డిటెన్షన్ శిబిరం,
దియోలీ, రాజపుటానా,
జనవరి 10, 1942

ప్రియమైన పండిట్‌జీ,

మీరు విడుదలైనప్పటినుంచీ మీకు లేఖ వ్రాద్దామనుకొంటూ వచ్చాను. అయితే, మీరు అనేక అతిముఖ్యమైనవిషయాలలో మునిగి తేలుతుంటారన్నదృష్టితో ఇప్పటిదాకా జాబు వ్రాయలేదు. మీకు ఉత్త రాలు అసంఖ్యాకంగా వచ్చిపడుతుంటాయి. జాగ్రత్తగా మీరు వాటన్ని టికి సమాధానాలిస్తుంటారు. ఇట్టిస్థితిలో నేను జాబురాసి, మీకు అదనపు శ్రమకల్గించడం ఎందుకన్న ఉద్దేశంతో నా లేఖను వాయిదా వేస్తూవచ్చాను.

కాని ఈవేళ నేను మంచంపై పరుండి గతించినవిషయాలను తల పోశాను. గత ఐదారేళ్ళనుంచి మీతో నాకు సన్నిహితసంబంధాలు కొన సాగాయి. గతాన్ని తలచుకొంటూంటే, మీప్రభావం నాపై ఎంతగా ప్రసవ రించిందా అని ఆశ్చర్యమేస్తుంది. రాజకీయసమస్యలపట్ల నా వైఖరీ, అలాగే నిత్యజీవితంలో జరిగే సంఘటనపట్ల నాలో చెలరేగే భావాలూ మీ ప్రభావానికి లోనై మరీ రూపొందాయి. అందుచేత వెంటనే మీకు లేఖ వ్రాయాలని బుద్ధిపుటింది. అయితే, నేను చెప్పవలసింది అంతగా లేదేమోననిపిస్తున్నది. అయినా నాలుగుగోడలమధ్య బందిఖానాబ్రతుకు వెళ్ళబుచ్చుతున్న నాకు, 'మనస్సులో భావాలను విడమర్చి చెప్పటం సాధ్యమా? మాది ఎడారిబ్రతుకులా వుంది. రాజపుటానా ఎడారిలో మా జీవితం ఒకభాగమైపోయింది. మేముంటున్నచోటుకు 70 మైళ్ళదూరంలో

కాని రైలుస్టేషన్ అంటూ లేదు. బయటప్రపంచాన్ని, సజీవంగా సంచరించే మానవమాత్రులను, స్త్రీపురుషులను, ఉద్యమాన్ని, జీవితఉధృతాన్ని మేము దాదాపు పూర్తిగా మర్చిపోయినట్టే. అవన్నీ లీలామాత్రమైన స్వప్నంగాకూడా మాకు జ్ఞాపకంలేవు! అందుచేత మమ్మల్ని తిరిగి మా స్వరాష్ట్రాలకు 'బదిలీ'చేస్తున్నారని విని, ఎంతో సంతోషించాం. పుట్టి పెరిగిన రాష్ట్రంలోనిజైళ్ళలో వుంటే, కనీసం సజీవప్రపంచంలో జీవిస్తున్నట్టయినా అనిపిస్తుంది. ఇక్కడే మరికొంతకాలం వుంటే, ఎందుకూ పనికిరాకుండాపోతాం.

హుజరా కొన్నినెలలకొకసారి ఇక్కడకు వచ్చి చూసి పోతున్నది. ఇక్కడకు రావటమంటే, ఎన్నో వ్యయప్రయాసలకు లోనుకావలసివుంటుంది. అందుకని తరచు రావద్దని ఆమెకు నేను నచ్చచెప్పుతున్నాను. సొంతరాష్ట్రంలోఅయితే, ఆమెను తరచు చూడడానికి అవకాశంవుంటుంది గదా.

మమ్మల్ని ఎప్పుడు బదిలీచేసేదీ ఇంకా తెలుపలేదు. ఎక్కడకు బదిలీచేస్తారోకూడా తెలియదు. ఏదిఏమైనా ఈనెలాఖరులోగా యు. పి. లోని ఏదోఒకజైలుకు మారుస్తారని ఊహిస్తున్నాం.

నా ఆరోగ్యం పర్వాలేదు. మొత్తంమీద బాగానేవుంది. నిరాహార దీక్షదెబ్బనుంచి పూర్తిగా కోలుకున్నాను.

శ్రీమతి విజయలక్ష్మిజీని, శ్రీ పండిట్‌ను, టాండన్‌జీని అడిగానని చెప్పండి. ఇతర మిత్రులకు, కామ్రేడ్స్‌కు, ముఖ్యంగా కేశవ్,లాల్ బహదూర్‌గార్లకు నా శుభాకాంక్షలు తెల్పండి.

భవదీయుడు,

జైన్

352. సయ్యద్ మహ్మద్‌కు

అల్హాబాద్,

ప్రియమైన మహ్మద్, ఫిబ్రవరి 2, 1942

జనవరి 25 న నాకు వ్రాసిన జాబు అందింది. హిందూముస్లిం సమస్యపై నీవు రచించిన చిన్నపుస్తకాన్ని చదివాను. అది చాలా బాగా

వుంది. బాగా నచ్చింది. అందులోని కొన్ని అంశాలతోను సూత్రీకరణల తోను నేను పూర్తిగా ఏకీభవించలేను. ఏమైనప్పటికీ, నాదృక్పథందృష్ట్యా మాత్రం ఆగ్రంథంలో సమస్యనుచాలాచక్కగా, సమర్థవంతంగా చిత్రించావనిచెప్పవచ్చు. ఇదేసమస్యపై నేనువ్రాయడమే తటస్థిస్తే, మరొకవిధంగా వ్రాసివుండేవాణ్ణి. అంటే, నీవు దాదాపు వదిలేసిన కొన్ని అంశాలను వక్కాణించివుండేవాణ్ణి. ఇటీవల పరిణామాలను, ముఖ్యంగా భారతదేశంపై ప్రభావాన్ని ప్రసారంచేసే ప్రాపంచికఅంశాలను నీ సమీక్షలో అలక్ష్యం చేశావు. జిన్నా, ముస్లిలీగ్‌లపై ఖరినిగురించి ప్రధానంగా నా ఉద్దేశం ఇది: తీవ్రమైనమార్పులను, లేదా ఇండియాలో ప్రజాతంత్రీకరణకార్యక్రమాన్ని విరోధించాలన్న అభిలాషే వారిపై ఖరికి మూలంగావుంది. అంతేకాని, హిందువులమెజారిటీ అన్నది వారికి అంత ముఖ్యమైనవిషయం కాదు. ఎందుకంటే, తీవ్రవాదశక్తులు పై చేయిసంపాదిస్తే, సెమీ ఫ్యూడల్ ప్రయోజనాలు మున్నగువాటికి అంతం తప్పదు. నీలేఖలో ఇదే విషయం ధ్వనింపచేశావు. రాజ్యాంగసభలో ప్రధానంగా ప్రజాశక్తులదే పై చేయిగావుంటుంది. అది మతసమస్యనుగాని, ఇతరసమస్యలనుగాని మధ్యతరగతిదృక్పథంనుంచి పరిశీలించదు. అసలు మధ్యతరగతిదృక్పథంవల్లనే ఈ ప్రతిష్టంభన ఏర్పడింది. మూడవపక్షం (బ్రిటిషువారు) రంగంనుంచి నిష్క్రమించనంతవరకు మనం ఎంత గట్టిగాప్రయత్నించినా, ఈ సమస్య పరిష్కారంకావడం కల్ల. ఇదే నా వ్యక్తిగతాభిప్రాయం. పరిస్థితులవత్తిడివల్ల తప్పనిసరిఅయినప్పుడు ఏదోఒక పరిష్కారానికి అంగీకరించక తప్పదు. అలాకాకపోతే, పెద్దఎత్తున సంఘర్షణలైనా తప్పవు. ఉభయపక్షాలలో దేనికీకూడా బ్రిటిషుసహాయంకాని, లేదా ఏఇతరదేశసహాయంకాని లభ్యంకాదని స్పష్టంగా తేలినప్పుడే ఇది సాధ్యమవుతుంది.

కాంగ్రెసుకాని, ముస్లింలీగ్‌కాని, (ఇతరులుకాని) అనుసరించదగుమార్గం—సరియైనమార్గం ఒకటేవుంది. అదేమిటంటే, ఒకవిషయంలో వారంతా ఏకాభిప్రాయానికి రావాలి. కావలిస్తే, పాకిస్తాన్‌ఏర్పాటు సమస్యతోసహా మిగతాసమస్యలవిషయంలో వారు తమ భేదాభిప్రాయా

లను అట్టిపెట్టుకోవచ్చును. విదేశఆధిపత్యానికి, జోక్యానికి వ్యతిరేకంగా అంతాకలవాలి, ఇదే అందరూఅంగీకరించవలసినఏకైకప్రధానవిషయం. విదేశఆధిపత్యంతో విడిపోయినతర్వాత మనమంతా కలసి కూర్చుని, ఒక అంగీకారానికి రావడమో లేక పోరాడుకోవడమో చేసుకోవచ్చును; అప్పుడు ఒకఅంగీకారానికిరావడానికే హెచ్చు అవకాశాలు వుంటాయి. ఎందుకంటే, నిజమైన పోరాటంఅన్నది ఎవరికీ అంత ఆహ్లాదకరంకాదు కనుక.

జిన్నా బండిని తీసుకొచ్చి గుర్రంమొఖానికి తగిలిస్తున్నాడు. ఆయన తనషరతులన్నింటిని ముందుగా అంగీకరిస్తేతప్ప, రాజకీయరంగంలో ముందడుగువేయటం సుతరామూసాధ్యంకాదంటున్నాడు. అంటే, దీని అర్థం ప్రస్తుతపరిస్థితులలో అభ్యుదయంపై వీటో ప్రయోగించటమే. సరియైనమార్గం ఏమిటిఅంటే: పాకిస్తాన్ఏర్పాటుకే నేను కట్టుబడివుంటాను. ఈవిషయంలో తిరుగులేదు. దీనికిమినహా మరొకదానికి నేను అంగీకరించను. కాని, విదేశఆధిపత్యాన్ని మెడపట్టి బయటకునెట్టడంలోమాత్రం ఇతరులతో చేతులుకలపడానికి నేను సిద్ధంగావున్నాను. దీనినిబట్టి ఆయన, ప్రస్తుతపరిస్థితులు ఇలాగే కొనసాగాలని కోరుకొంటున్నట్టు స్పష్టమవుతున్నది. అందుచేత ఆయనవైఖరి ఏవిధంగానూ సమర్థనీయంకాదు;

అదృష్టవశాత్తు ప్రపంచం మారుతోంది. సంఘటనల సంఘర్షణలో అత్యంత జటిలసమస్యలుసైతం ఒకవిధంగా పరిష్కారమైపోతున్నవి. సంస్కారయుతమైన పరిష్కారమార్గం సరియైనదీ, వాంఛనీయమైనదీ అయితే, అందుకు కొంతకాలం పడుతుంది. ఘటనాపరంపరలో పడి మనం ఈనాడు కొట్టుకుపోతున్నాం. పెద్దపెద్ద పరిణామాలు త్వరితగతిని సంభవిస్తున్నాయి. ఈ పరిణామాలను మనం ఎంత తొందరగా గుర్తిస్తే, అంతమంచిది.

నీవు కాంగ్రెసుకార్యవర్గసభ్యుడవు. జిన్నా, ముస్లింలీగ్‌లతో ఒప్పందంకుదుర్చుకోడానికి నీవు కొన్ని సూచనలుచేశావు. కాంగ్రెసు కార్యవర్గసభ్యుడుగా నీవు ఇలాంటి సూచనలుచేయడం ఎంతవరకు

సమంజసమో నాకు తెలియదు. దీనివల్ల గందరగోళం, అపోహలు తప్పవు. ఈవిషయంలో నీవు మౌలానా అజాద్‌తో సంప్రతిస్తే బాగుంటుందేమో! ఆయన రేపు ఇక్కడకు వస్తున్నారు. మూడు నాలుగు రోజులపాటు ఇక్కడే వుంటారు. నీకు ఇష్టమైతే నీ వ్రాతప్రతిని ఆయనకు అందజేస్తాను,

అనురాగంతో,
జవహర్‌లాల్

౩౩౫. మహాత్మా గాంధీవద్దనుంచి

(మూలం హిందీలో)

వార్ధా,
మార్చి 4, 1942

ప్రియమైన జవహర్‌లాల్,

నీ లేఖ నిన్ననే అందింది. ఈ లేఖ చదవటానికి నీవు అంతగా యిబ్బందిపడవనే ఆశిస్తున్నాను.

ఇందూవివాహవిషయం : బయటనుంచి ఎవరినీఆహ్వానించరాదని నా నిశ్చితాభిప్రాయం. అల్హాబాద్‌లోవున్నకొద్దిమందిని సాక్షులుగా ఆహ్వానించవచ్చును; ఆహ్వానపత్రికలను (లగ్నపత్రికలను) కావలసినంత మందికి పంపించుకో. అందుకు అభ్యంతరంలేదు. అందరినుంచి ఆశీర్వచనాలను ఆహ్వానించు. అయితే ఎవరూ ప్రత్యేకంగా వివాహానికి పని కట్టుకొనిరావలసినపనిలేదనిమాత్రం స్పష్టంగా తెలియజేయి. వివాహానికి రమ్మని వ్యక్తులను ఆహ్వానించడం మొదలుపెడితే, ఎవరినని వదిలిపెట్టగలం?

ఇలాంటి నిరాడంబరమైనవివాహం అసలు ఇందూకు ఇష్టమో లేదో ఆలోచించాలి. బహుశా నీకుకూడా ఇంత నిరాడంబరమైనవివాహం అంటే నచ్చకపోవచ్చును; అలాఅయినపక్షంలో నా సూచనను గురించి అంతగా పట్టించుకోకు.

ఇంకోవిషయంలో నీ అభిప్రాయాలు గమనించాను. అవి నాకు నచ్చాయి. నిత్యం ఆమె వివాహానికిసంబంధించినలేఖలు నాకు అందు

తున్నాయి. అందులో కొన్ని భయంకరంగావున్నాయి. అన్నింటినీ చించి పారేశాను. వీటన్నిటికిసమాధానంగా హరిజనపత్రికలో చిన్నవాఖ్యప్రకటిస్తున్నాను. ఆ వాఖ్య ప్రతిని ఇందుతో జతపర్చి పంపుతున్నాను. సోమవారంనాడు ఈ వాఖ్యవ్రాశాను. నిన్నటినుంచి ముస్లింలవద్దనుంచి లేఖలు ధారావాహికంగా వచ్చిపడుతున్నాయి. దాడిచేస్తామన్న బెదరింపులు వాటిలో వున్నాయి. అవ్వన్నీ పాతఫక్కీలోనివే. ఇది ఇలాగే సాగుతూ వుంటుంది.

స్వదేశసంస్థానాలవిషయంలో నాకు చేతనైనదంతా నేను చేస్తాను. నిరంతరంవేధించేది నిధులసమస్య. దీనికంతటూ పూర్తిబాధ్యతను జమ్నాలాల్‌జీ నెత్తినవేసుకొన్నారు. దానిని ఆయన ఎలా నిర్వహిస్తాడో తెలియదు. ఇప్పుడు డబ్బువసూలుచేయడం ఎలాగా అని తీవ్రంగా ఆలోచిస్తున్నాను. వార్తాపత్రికనుగురించి పట్టాభితో సంప్రతిస్తున్నాను. బల్వంత్రాయ్ రావడం సాధ్యపడదు. అయినా అనంత ముఖ్యంకాదు. ఇక్కడ సహాయంచేసేవారు చాలామంది వున్నారు. నీవు ఇక్కడికువచ్చినప్పుడు అన్నివిషయాలు మాట్లాడుకొందాం. బొంబాయిలో పనిపూర్తిచేయడానికి మీనన్ బయలుదేరి వెడుతున్నాడు.

టాంగ్‌కై షేక్ ప్రకటన చూశాను. బాగుంది. నీ ఆమోదంకూడా అందించి. అయితే ఆ లేఖను ప్రచురించవలసినఅగత్యం ప్రస్తుతం లేదనుకొంటాను. విషయం పాతదై పోయింది; ఆసక్తిని కోల్పోయింది.

భగీరధి వచ్చారు. చంద్రసింగ్‌ను ఖాయిదాలో పెట్టటం కష్టంగా వుంది. అతనికి ఆవేశం జాస్తి; ఆలోచన నాస్తి. చిన్నచిన్నవిషయాలపై అతను కీచులాడుతుంటాడు. ఒకవేళ అతను ఎవరినైనాకొట్టినా నేను ఆశ్చర్యపడను. అయితే అతను బాగా కష్టపడేవ్యక్తి. ఆందోళన చెందవలసినపనిలేదు. ఈ లేఖనుచదవడం నీకు కష్టంగావుంటే, మరింత స్పష్టంగావ్రాయడానికి ప్రయత్నిస్తాను. ఏమైనా, మనజాతీయభాషలోనే ఉత్తరప్రత్యుత్తరాలునడుపుకోడం మన విధ్యుక్తధర్మం. కొంతకాలానికి ఇదే సులభంగావుంటుంది. పేదలకు ఎంతో లాభంచేకూరుతుంది.

బాపూవద్దనుంచి దీవెనలు

334. అబుల్ కలాం అజాద్ వద్దనుంచి

కలకత్తా,

మార్చి 8, 1942

ప్రియమైన జవహర్‌లాల్,

మీ రెండో లేఖ చేరేటప్పటికే మొదటిదానికి నేను జవాబు వ్రాశాను. వార్ధా వెళ్ళి రెండుమూడురోజులపాటు అక్కడ గడపవచ్చునని ఇంతకుముందు అనుకొన్నాను. అయితే బెంగాల్‌లోని సునిశితపరిస్థితిదృష్ట్యా నేను ఇక్కడనుంచి కదలడానికి వీలులేకపోయింది. పౌరరక్షణకుసంబంధించిన కొన్ని క్లిష్టసమస్యలను వెంటనే పరిష్కరించకుండా వాయిదావేయడానికి వీలులేదు. కాంగ్రెసు కార్యవరసమావేశం 17వతేదీన జరుగుతోంది. అందుచేత నేను ఈనెల 11, 12 తేదీలలో వార్ధాకు బయలుదేరుదామనుకొంటున్నాను. 17వతేదీకి రెండురోజులు ముందుగా మీరుకూడా వార్ధాచేరితే బాగుంటుంది. నేను ఎప్పుడుబయలుదేరేదీ తంతిద్వారా మీకు తెలియజేస్తాను.

వార్ధాలో వాగ్దానంచేసినప్రకారం ప్రకటన జారీచేయవలసిందని కోరుతూ బాద్షాఖాన్ నాకు అనేకలేఖలు వ్రాశాడు. అన్నికోణాలనుంచి ఆ సమస్యను పరిశీలించినపిమ్మట, ఆయనఅభిలాషను మన్నించడంమినహా మరొకమార్గంలేదని నా కనిపించింది. తదనుగుణంగానే పత్రికాప్రకటన జారీచేశాను. బహుశా మీరు దానిని చూసేవుంటారు. ఈలోగా ఆయనతో మీరు ఉత్తరప్రత్యుత్తరాలు జరిపిందీ లేనిదీ నాకు తెలియదు.

నాలుగైదురోజులక్రితం బెర్లిన్‌రేడియో సుభాస్‌బాబుప్రకటనను ప్రసారంచేసింది. ఆ మరుసటిరోజునే మరొకప్రకటనకూడా వెలువడింది. ఆయన తనప్రకటనను స్వయంగా మైక్‌ముందు నిలబడి చదివాడనీ, అది రికార్డుచేయబడినదనీ, ఆ రికార్డును రేడియోద్వారా ప్రసారంచేస్తామని ఆ ప్రకటనసారాంశం. దానిని నేను విన్నాను. అది సుభాస్‌బాబుగొంతే. బహుశా అది రికార్డుకాదేమోననుకుంటాను. ఆయనే స్వయంగా రేడి

యోలో మాట్లాడివుండవచ్చు. అయితే టోకియోనుంచివెలువడినప్రసారం మాత్రం తప్పనిసరిగా రికార్డే. రికార్డు మోత స్పష్టంగానే వినిపించిందికూడా.

ఇక్కడి ఫార్వర్డ్‌బ్లాకుమంత్రులైన సంతోష్, బెనర్జీలు చాలా దిగులుచెందుతున్నారు. అసలు ఫార్వర్డుబ్లాకుతో తమ కెట్టిపొత్తూలేదని వారు అంటున్నారు.

భవదీయుడు,
ఏ. కె. ఆజాద్

పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ,
అలహాబాద్.

323. మేడాం చాంగ్ కై షేక్ వద్దనుంచి,

జనరలిస్మో హెడ్‌క్వార్టర్స్,
చుంకింగ్, చైనా,
మార్చి 13, 1942

ప్రియమైన శ్రీ నెహ్రూ,

భారతదేశంనుంచి కున్మింగుగుండా మేము ఇక్కడికుచేరినతర్వాత పార్టీ హెడ్‌క్వార్టర్స్‌కు సోమవారంనాడు జనరలిస్మో ఒక నివేదికసమర్పించారు. ఆ నివేదికప్రతిని ఇందుతో జతపర్చిపంపుతున్నాను. అది మార్చి 9వతేదీ అని నాకు గుర్తు. ఆ ప్రసంగాన్ని కరపత్రంరూపంలో ప్రకటించి, అన్నిరాష్ట్రాలఅధిపతులకు, ప్రభుత్వసంస్థలుమున్నగువాటికి పంపడం జరుగుతుంది. కాని దానిని పత్రికలకు విడుదలచేయడమంటూ జరగదు. మీకు ఇప్పుడు పంపిస్తున్న ఇంగ్లీషుఅనువాదాన్ని వాషింగ్టన్, లండన్‌లలోగల మా రాయబారికార్యాలయాలకు తంతిద్వారా పంపిస్తున్నాం. దీనిని చర్చిల్, రూజ్వెల్ట్‌లకు స్వయంగా అందజేయాలని మా రాయబారులకు స్పష్టమైన ఆదేశాలు జారీచేస్తున్నాం. భారతదేశంలో మా కళ్ళతోచూసినవిషయాలనుగురించి నిజాన్ని వెల్లడించడంభావ్యమని నేనూ జనరలిస్మో అభిప్రాయపడ్డాం. అలాచేయటం భారతీయమంత్రులపట్ల

మాకుగల విద్యుక్తధర్మాన్ని నెరవేర్చడంగా మేము ఎంచుతున్నాం. మేము బ్రిటిషుప్రభుత్వఅతిథులుగా అక్కడికి వచ్చాం. అందుచేత బ్రిటిషుప్రభుత్వాన్ని బాహాటంగా విమర్శించడం భావ్యంకాదుకదా. భారతప్రజలలో ఐక్యతలేనందువల్లనే నిజమైనఅధికారాన్ని వారికిఅప్పగించడం సాధ్యం కావడంలేదు అన్న వాదన మాకు అర్థరహితంగా కన్పించింది. ఈ వాదనను గట్టిగాసమర్థిస్తూ, లండన్ క్రానికల్ పత్రిక వ్యాసంవ్రాసినట్టు నేటిదిన పత్రికలద్వారా తెలుసుకొన్నాను. నాకు వళ్ళుమండదా మరి?

నిర్దిష్టమైనప్రతిపాదనలతో క్రిప్స్ భారతదేశానికి బయలుదేర బోతున్నట్లూ, దానినిగురించి వ్యాఖ్యానించవలసినదిగా విలేఖరి మిమ్మలనుకోరినట్టూ, దానికి మీరు అంతుచిక్కకుండా సమాధానమిచ్చినట్టూ పత్రికలద్వారా తెలుసుకొన్నాను. ప్రియమిత్రమా! మీరు రాజకీయవేత్తలు కాదని ఎవరనగలరు?

మేము కున్మింగ్ చేరినమరుసటిరోజునే, ఫిబ్రవరి 22న, మీ కొక లేఖవ్రాశాను. నా రికార్డులో అలాఅనేవుంది. మీనుంచి నాకు జవాబు రాకపోయేసరికి, అసలు ఆ లేఖను మీకు అందజేసిందీ, లేనిదీ, ఒకవేళ అందజేస్తే ఏ తేదీన అందజేసిందీ వెంటనే తెలియజేయమని కలకత్తాలోని మా కాన్సల్ జనరల్‌కు తంతిపంపాను. అతనివద్దనుంచి ఇప్పుడే జవాబు వచ్చింది—ఆ లేఖ తనకు మార్చి 6న అందినట్టూ, దానిని 6వతేదీన ప్రత్యేకదూతద్వారా మీకు పంపించినట్టూ అతను తెలియజేశాడు. ఆరి భగవంతుడా! ఉత్తరంజేరడానికి ఇంత ఆలస్యమా? ఇది ఊహాతీతమైన విషయం. ఈ లేఖ మీకు ఎప్పటికి జేరుతుందో నాకు తెలియదు. ఏరోనాటికల్ కమిషన్‌కుచెందిన జనరల్ మావోద్వారా దానిని పంపిస్తున్నాను. దీనిని స్వయంగా కాన్సల్ జనరల్‌కు అందజేసి, వెంటనే మీకు అందే ఏర్పాటుచేయించవలసిందిగా ఆతనికి ప్రత్యేకమైన ఆదేశంఇచ్చాను. జనరల్ మావో రేపు కలకత్తాకు బయలుదేరివెళుతున్నట్టు కొన్నినిముషాలక్రితంమాత్రమే నాకు తెలిసింది.

మీరు ఇక్కడకువచ్చినప్పుడు మమ్మలను ఏ యింట్లో అయితే కలుసుకొన్నారో, అక్కడనుంచే మీకు ఈ లేఖను వ్రాస్తున్నాను.

చుంకింగ్ సమీపంలోగల నది అవలిగట్టునే వున్న ఈ ఇల్లు మీకు గుర్తు వుండేఉంటుంది. కాస్త ఏకాంతంగా గడుపుదామని గతరాత్రే మే మిక్కడకు వచ్చాం. మేము స్వదేశంచేరినవెంటనే పనిఒత్తిడితోను, వచ్చే పోయేజనంతొక్కిడితోను సతమతమైపోతున్నాం. నగరంలో జనసందోహంజాస్తి. గాలి,వీధులు,చివరకువ్యక్తులసాంగత్యములలోసైతంతొక్కిసలాటే ద్యోతకమవుతుంటుంది. తెనిపోనిఆలోచనలు ఏవేవో మనస్సులో చెలరేగుతుంటాయి. అందుచేత వ్యక్తులు పైకి ఎంత ప్రశాంతంగాకన్పించినా, లోలోనమాత్రం కంటికికనిపించని ఆలోచనాతరంగాలు క్షోభపెడుతూనేవుంటాయి. ఈ బాధనుంచి తప్పించుకొనేమార్గంలేదు. ఈ తొక్కిసలాటకంతకు ఏదో ఒక మనస్తత్వసంబంధమైనకారణం వుండివుంటుందనుకొంటాను. కాగా, ఈ కొండలనడుమ, ఉక్కిరిబిక్కిరిగానీ, తొక్కిసలాటగానీ వుండవు. నేను భారతావనిని ప్రేమిస్తాను. అయితే ఢిల్లీలోని ధవళభవనాలతేజస్సుతో నాకు గ్రుడ్డితనంప్రాప్తించినంతపనైంది. ఇక్కడ చుంకింగ్‌లో మేము ఇంచుమించు ఏడాదిపొడుగునా పొగమంచులోనే వుంటాం. కొండలకోనలను అన్నివైపులా ఆవరించిన పొగమంచు చూడముచ్చటగా కంటికి కన్పిస్తుంది. దానికితోడు కొండల ప్రక్కనే పచ్చదనంకప్పుకొన్న మైదానాలు (ఇవ్వన్నీ మీకు జ్ఞాపకం వున్నవా?) ప్రకాశవంతమైన సూర్యరశ్మికి అలవాటుపడనివారందరికీ ఈ దృశ్యం ఎంతో మనోహరంగావుంటుంది. భారతదేశంలోవున్నన్నాళ్ళు ఇంట్లోనుంచి అడుగులీసి బయటపెట్టితేసరి, నాకు విపరీతమైన తలనొప్పి పుట్టుకువచ్చేది. ఇది మీకు గుర్తుందా? అయినప్పటికి భారతదేశయాత్ర నాకు మహదానందాన్ని కలుగజేసింది. దీనిని నా జీవితంలో ఎన్నటికీ మరువలేను.

నావ్‌కు కొన్నికానుకలు పంపుదామన్నదృష్టితో కొన్నివస్తువులు సేకరించుమని నా కార్యదర్శికి ఫోనుచేస్తున్నాను. ఆ వస్తువులుసేకరించడం సాధ్యమవుతుందో లేదో చెప్పలేను. సాధ్యమైతే వాటిని జనరల్ మావోద్వారానే పంపిస్తాను. వెంటనే సాధ్యంకాకపోతే, తర్వాత మరొకరిద్వారా పంపిస్తాను. ఈ విషయం ఆమెకు తెలియజేయుండి. కుమారి

చౌ వాహ్యాళికి వెళ్ళింది. (సర్వనాశనంపొందిన చుంకింగ్‌లో ఇది సాధ్యమా?)

మార్చి 6న ఇంటికి చేరినతర్వాత, లేఖలఫైలు తిరగేస్తుంటే, క్రిప్స్ వద్దనుంచి నా కొచ్చినలేఖ కన్పించింది. దానిని దీనితో జతపర్చుతున్నాను. మీరు జైలులోవుండగా, మిమ్మలనుగురించి మేము ఎంతగా ఆందోళన చెందామో, ఆ లేఖనుబట్టి మీరు గ్రహించవచ్చును. అయినా ఈవిషయం మీకు తెలిసేవుండాలి.

భారతదేశంలోని పరిస్థితులనుగురించి రూజ్వెల్టుకు జనరలిస్మో తంతిద్వారా తెలియపరుస్తున్నారు. ఆయనవద్దనుంచి మాకు తాజాగా అందినసమాచారం ఇది: రూజ్వెల్టుపంపిన తంతిలో ఈ క్రిందిఅంశాలు వున్నాయి: (1) శాంతిసభలోపాల్గొనే భారతప్రతినిధిని కాంగ్రెసు నియమించాలి. తద్వారా భారతదేశానికి నిజమైన ప్రాతినిధ్యంఒనగాలి. (2) భారతసమస్యపరిష్కరించడానికి దేశాన్ని రెండుగా—ముస్లింహిందూ విభాగాలుగా—చీల్చడమొక్కటే ఉత్తమమార్గం అని ఆయన భావిస్తున్నాడు. రెండోసూచన పూర్తిగా పొరపాటనీ, దానిని అసలు దృష్టిలోకే తీసుకోరాదనీ తెలియజేస్తూ జనరలిస్మో, నేనూ, నా సోదరుడు టి. వి. కి తంతి పంపాము. చైనావలెనే భారతదేశంకూడా అవిభాజ్యమైనది. భారతదేశ ప్రజలలో మతసంబంధమైనతేడాలు వుండవచ్చును. అంతమాత్రంచేత, వారంతా రాజకీయంగా ఏకం కాలేదనుకోడం పొరపాటు. అయితే వారికి అలాంటి అవకాశం కలుగజేయాలి. మూడోపార్టీజోక్యం లేకుండా చేయాలి. అలాచేస్తే వారంతా రాజకీయంగా ఏకంకాగలరు.

లేఖనురాయడంముగించమని జనరలిస్మో తొందరపెడుతున్నారు. రూజ్వెల్ట్‌వద్దనుంచి వచ్చిన సందేశాన్నొకదానిని జనరల్ మగ్రూడర్ చేతబట్టుకువచ్చాడు. అతనితో సమాలోచనలుసాగించాలి. మీకు నిజమైన లేఖనురాయటానికి నాకెప్పుడూ క్షణంతీరికదొరికేటట్టుగాలేదు. ఎప్పుడూ, ఎల్లప్పుడూ తలదిమ్మెత్తిపోయేబాధ్యతలతో సతమతమైపోతున్నాం. ఏదో అర్థంపర్థంలేనివాక్యాలనుగిలికాను. మరి నావిషయంలోకోపగించకండేం?

తదేకంగా ఆలోచించుకొనేందుకు నాకు అవకాశంలేకుండాపోతోంది. గాంధీజీవలె దీర్ఘాలోచనాజనితమైన కార్యాచరణనురూపొందించుకోవడం, నా జన్మలో నాకు సాధ్యంకానట్టే కన్పిస్తున్నది.

నా ఆప్తమిత్రుడైన దేశదిమ్మరికి—సలాం:

వేలె,

ఎమ్. ఎస్. సి.

౫౫౯. స్టాఫర్డు క్రిప్స్ నద్దనుంచి

3, క్వీన్ విక్టోరియారోడ్డు,
న్యూఢిల్లీ,
ఏప్రియల్, 1042

వ్యక్తిగతం, అంతరంగికం.

ప్రియమైన జవహర్ లాల్,

మీ కిదే నా తుదివిజ్ఞప్తి. నిర్ణయంచేయవలసిన పృధుతరబాధ్యత మీపైనే వుంది. ఇప్పుడు మీరుచేసే నిర్ణయంమీదనే భవిష్యత్తులో మన రెండుదేశాలప్రజలమధ్య సంబంధాలు ప్రధానంగా తీర్చిదిద్దబడబోతున్న సంగతి గుర్తుంచుకోండి. మనం మనరంగాలలో మనం మనదేశాలప్రజలను స్నేహసహకారాలవైపు ముందుకు తీసుకుపోవాలి.

ఇప్పటి నదవకాశం మళ్ళీ లభించదు. ఇది విఫలమైతే ఇతర మార్గాలనేవి వుంటాయనుకోండి. అయినా మనప్రజలమధ్య స్నేహాన్ని ప్రత్యేకమైనస్ఫూర్తికి ఇప్పుడులభించిన నదవకాశానికిమించినది మరొకటి వుండదు.

నాయకత్వం—మీకున్ననాయకత్వంవంటిదిమాత్రమే సత్ఫలితం సాధించగలుగుతుంది. మహానాయకుడన్నవాడు అచంచలమైన సాహసంతో ముందంజవేయవలసినతరుణం ఇది. ఎన్నిప్రమాదాలనైనా, కష్టాలనైనా ధైర్యంగా ఎదిరించాలి. అనేక ప్రమాదాలు, కష్టాలు కలవన్నసంగతి నాకు తెలుసును. సాహసంతో ముందంజవేస్తే లక్ష్యాన్ని సాధించవచ్చును.

మీలోని శక్తి స్తోమతులు, సామర్థ్యం నాకు తెలుసును. వాటిని ఇప్పుడు ఉపయోగించవలసిందిగా నేను మిమ్ములను అభ్యర్థిస్తున్నాను.

భవదీయుడు,

స్టాఫర్డ్

337. ఫ్రాంక్లిన్ డి. రూజ్వెల్ట్‌కు

న్యూఢిల్లీ,

ఏప్రియల్ 12, 1942

అధ్యక్షమహాశయా,

మీకు ఈ లేఖరాయడానికి నేను సాహసిస్తున్నాను. ఈనాడు భారతదేశంలోని స్థితిగతులు, వాటివల్ల యుద్ధపరిస్థితిలోవచ్చేమార్పులనుగురించి మీరు కడుఆసక్తితోవున్నసంగతి నాకు తెలుసును. బ్రిటిషుప్రభుత్వానికి భారతప్రజలకుమధ్య ఒప్పందంసాధించడానికి సర్ స్టాఫర్డ్ క్రిప్స్ జరిపిన సంప్రదింపులు విఫలమయ్యాయి. ఈ పరిణామం మావలెనే మీకు విపరీతంగా బాధకల్పించి వుండవచ్చును. భారతదేశస్వాతంత్ర్యంకోసం అనేకసంవత్సరాలపాటు మేము పోరాటం సాగిస్తూవచ్చినసంగతి మీకు తెలియనిదిగాదు, అయితే యిప్పుడు ఏర్పడిన ప్రమాదందృష్ట్యా మిగతా విషయాలన్నింటినీ అవలకునెట్టి దురాక్రమణవాదుల్ని దండయాత్ర చేసేవాళ్లనిరోధించేందుకు విసలైనజాతీయప్రజాప్రతిఘటనోద్యమం నిర్మించాలని మేము గాఢంగాఅభిలషిస్తున్నాం. అయితే అందుకు మాకు అవకాశం కల్గించాలి. మాప్రజలకు స్వేచ్ఛ స్వాతంత్ర్యాలు ఒసగి 'మీ మాతృదేశాన్నిరక్షించుకోండి' అని చెప్పడం ఉత్తమంగాఉంటుందని మా నిశ్చితాభిప్రాయం. అలా చేస్తే కోటానుకోట్ల ప్రజలహృదయాలు ప్రజ్వలితమవుతాయి. ప్రజాహృదయాలలో రగిలిన అగ్నికణాలు దురాక్రమణదారునిపాలిట దావాగ్నిగా మారుతుంది. ప్రతిఘటనోద్యమం విజయవంతమవుతుంది.

ఒకవేళ మేము అభిలషించినవిధంగా చేయడం యుద్ధావసరాల దృష్ట్యా సాధ్యంకానిపక్షంలో కనీసంప్రజాప్రాతిపదికపై ప్రతిఘటనోద్య

మాన్ని నిర్మించేందుకు అధికారాలు, బాధ్యతలతో కూడిన సిసలైన జాతీయ ప్రభుత్వాన్నైనా ఏర్పాటుచేయాలి. ఇది కనీసం చేయవలసినపని. దురదృష్టవశాత్తు ప్రస్తుతానికి విఫలమైన సంప్రతింపులఘట్టాన్నంతా ఇక్కడ ఏకరువుపెట్టి మిమ్ములను విసిగించదల్చుకోలేము. ఇక్కడవున్న మీ ప్రతినిధులద్వారా ఆవిషయాలన్నీ మీకు అందేవుంటాయని తలుస్తాను. ఇంతకీ నేను మీకు తెల్పవలసిన విషయం ఒక్కటే వుంది.

భారతదేశరక్షణకు, స్వేచ్ఛా ప్రజాస్వామ్యాలరక్షణకు మా శక్తి కొలదీ పాటుబడాలని మేము గాఢంగా అభిలషించాం. ఇప్పటికీ ఆతురత చెందుతున్నాం. ఈవిషయంలో మేము అనుకొన్న విధంగా కృషిచేయలేక పోవడం నిజంగా మా కెంతో విచారం కలిగిస్తున్నది. మా దేశరక్షణకు సర్వస్వంఒడ్డి పోరాడడంఅంటే మా కెంతో ఇష్టం. ఎన్నిత్యాగాలుచేయడానికైనా వెనుదీయం. దురాక్రమణదారుణ్ణి పారద్రోలి, దేశానికి స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలు సాధించడంకన్నా గొప్పవిషయం ఇంకేముంటుంది?

ఇప్పుడు మాకున్న శక్తిస్తోమతలు బహుపరిమితమైనవేకావచ్చును. గతంలో బ్రిటిషుప్రభుత్వం కావాలనికల్పించినఅవరోధాలవల్లనే భారతదేశంలో పారిశ్రామికీకరణ జరగలేదు. మా ప్రజలను నిరాయుధులనుచేసి వుంచారు. అయితే యుద్ధస్తోమతమాత్రం మాకు అపారంగావుంది. చైనా వలెనే మాకూ అంగబలంవుంది. సువిశాలమైన దేశంవుంది. ఇవ్వన్నీ మా కెంతో సహాయకారి కాగలవు. మాదేశంలో ఉత్పత్తిని త్వరితంగా పెంచడానికి అనేక అవకాశాలువున్నాయి. యజమానులు కార్మికులమధ్య సహకారంసాధిస్తే ఉత్పత్తిని తేలికగా పెంచగలం. దేశంలోనిప్రభుత్వం ప్రజాప్రాతినిధ్యంకలిగివున్నప్పుడుమాత్రమే ఈ స్తోమత అంతా పూర్తిగా వినియోగంలోకివస్తుంది. ప్రజాసహకారం ఎంతో అవసరమైన తరుణంలో ప్రజలతోసంబంధంలేనిప్రభుత్వం సాధించగలిగింది బహు పరిమితం. అందులోను విదేశీప్రభుత్వం సాధించగలిగేది మరీ తక్కువ. ఎందుకంటే, విదేశీప్రభుత్వంపై ప్రజలకుసహజంగా అయిష్టత, అనుమానాలువుంటాయి.

ప్రమాదమూ, ఉపద్రవమూ మమ్ములను చుట్టుముట్టుతున్నాయి. అద్భుతసభవిష్యత్తు ముంచుకొస్తున్న దురాక్రమణప్రమాదం అనే కాదు

మేఘాలతో అంతా అంధకారబంధురంగావుంది. దండయాత్రతోపాటు దానివెనుకనే అనేక ఘోరకృత్యాలూ ప్రత్యక్షమవుతాయి. చైనాలోకూడా సరిగా ఇలాగే జరిగింది. సర్ స్టాఫర్డు క్రిప్స్‌దౌత్యం విఫలంకావడంతో పరిస్థితి మరింత విషమించింది. దీని చెడుప్రభావం మా ప్రజలపై బాగా పనిచేస్తున్నది. ఎన్నికష్టాలు ఎదురైనా మేము ధైర్యసాహసాలతో నిలబడి, ప్రతిఘటనాపటిమ ప్రదర్శిస్తాం. మాకు ఎలాంటి అవకాశం లేకుండాచేశారు. భారతదేశంలో బ్రిటిషుఅధికారుల కార్యకలాపాలకు చేయూతనివ్వడానికి వీలులేకుండాచేశారు. అయినప్పటికీ, జపానుదురాక్రమణను, దండయాత్రను, లేక మరేదేశదురాక్రమణనైనాసరే మేము మా శక్తికొలదీ ప్రతిఘటించితీరుతాం. దురాక్రమణదారులకు మేము తలొగ్గేదిలేదు. స్వాతంత్ర్యంకోసం వెనుకటి దురాక్రమణకు వ్యతిరేకంగా దీర్ఘకాలపోరాటంసాగించిన మేము సర్వనాశనంపొందడానికైనా సిద్ధపడతాంగాని, కొత్తదురాక్రమణదారునికి తలొగ్గబోము.

ఫాసిజానికి వ్యతిరేకంగా, స్వాతంత్ర్య, ప్రజాస్వామ్యాలరక్షణకోసం పోరాటంసాగిస్తున్న శక్తులపట్లనే, మాకు సానుభూతివుంది. ఈ విషయాన్ని మేము అనేకసార్లు స్పష్టంగా ప్రకటించాం. మా దేశానికి స్వాతంత్ర్యంసిద్ధిస్తే, ఆ సానుభూతియావత్తూ మహత్తరమైన కార్యరూపంధరించడానికి వీలుండేది.

ఒక మహాదేశానికి మీరూ గౌరవనీయులైన అధిపతులు. మీ మహాదేశానికివే మా శుభాకాంక్షలు. అధ్యక్షమహాశయా! స్వాతంత్ర్యరక్షణలో మీ సారథ్యంకోసం, నేతృత్వంకోసం ప్రపంచం నాలుగుచెరగులా, అనేకమంది ఆతురతతో ఎదురుచూస్తున్నారు. అలాంటి మీ - కివే మా సాదరపూర్వకమైన ప్రణామాలు,

భవదీయుడు,
జవహర్‌లాల్ నెహ్రూ

అధ్యక్షుడు ఫ్రాంక్లిన్ రూజ్వెల్ట్,
వాషింగ్టన్,
యు. ఎస్. ఏ.

౩౨౮. మహాత్మా గాంధీనుండి
[ మూలం హిందీలో ]

వార్ధా,
ఏప్రియల్ 15, 1942

ప్రియమైన జవహర్‌లాల్,

ప్రొఫెసర్ ఇక్కడే వున్నాడు. ఆయన అన్నివిషయాలు చెప్పాడు. నీవు యిచ్చిన ప్రెస్‌ఇంటర్వ్యూనుగురించికూడా తెలుసుకున్నాను. మన దృక్పథాలమధ్యగల విభేదాలు క్రమేణా ఇప్పుడు మన కార్యాచరణలోకికూడా చొరబడుతున్నాయి. ఈ పరిస్థితులలో వల్లభాయ్‌గానీ, ఇతరులుగానీ, చేయవలసిందేమిటి? నీ కార్యవిధానాన్ని ఆమోదిస్తే ప్రస్తుతకార్యవర్గం యథాతథంగావుండేందుకు వీలులేదు.

దానినిగురించి ఆలోచించేకాలమిది. మొత్తంమీద నీవు పొరబడి వుంటావన్నభావం నాలో బలపడుతోంది. అమెరికన్, చైనాబలాలు భారతదేశంలోకి ప్రవేశించినప్పుడు, గెరిల్లాపోరాటంలోకిదిగడం నాకు అంత సబబుగాతోచడంలేదు.

నిన్ను హెచ్చరించటం నా విద్యుక్తధర్మం.

ఇందూ, ఫిరోజ్ యిద్దరూ కుశలమనిభావిస్తాను.

ప్రేమతో,
బాపూ

ఉత్కళలో ఫార్వర్డ్‌బ్లాకువారు సాయుధులైనట్లు నిన్ననే నాకు తెలిసింది, కమ్యూనిస్టులు గెరిల్లాయుద్ధానికి సన్నిద్ధమవుతున్నట్టుగాకూడా తెలిసింది. దీనిలో యదార్థం ఎంతో తెలియదు.

౩౨౯. హువాన్ సింగ్ షేన్‌వద్దనుంచి

నేషనల్ పెకింగ్ యూనివర్సిటీ,
కున్మింగ్, చైనా,
ఏప్రిల్ 18, 1942

ప్రియమైన పండిట్,

చనువుతీసుకొని, ఈ లేఖవ్రాస్తున్నందుకు మన్నించండి. (1939 ఆగస్టులో మీరు కున్మింగుకువచ్చినప్పుడు, హోటల్ దులాక్‌లో ఒక

సాయంత్రమంతా, వసపిట్టలాగా మాట్లాడినవ్యక్తి మీకు జ్ఞాపకంవున్నాడా? ఆ వ్యక్తి మీనుంచి ఎన్నోవిషయాలు నేర్చుకొన్నాడు. ఆవ్యక్తే ఇప్పుడు ఈ లేఖవ్రాస్తుంట. యుద్ధంవల్ల మీపర్యటన మధ్యలోనే అంతమైపోతుం దని, మిమ్మల్ని తిరిగి చుంకింగ్‌లో కలుసుకోవడం సాధ్యంకాదనిముందు గానే తెలుసుకొనివుంటే, ఆరోజు నేను మిమ్మల్ని ఇంకా అనేకప్రశ్నలు అడిగేవాడిని. ఆరోజునేచుంకింగుకు ప్రయాణంకాబోతున్నాను. ప్రజారాజ కీయసమితిసమావేశంలోపాల్గొనేనిమిత్తం నేను ప్రయాణంపెట్టుకొన్నాను. తీరా నేనుచుంకింగుచేరేటప్పటికి మీరుఇండియాకు బయల్దేరనేబయల్దేరారు.

ఆకురాలుకాలంనుంచి మీకు లేఖవ్రాయాలని అనుకొంటున్నాను. మీకు వ్రాసేలేఖ మధ్యలో సెన్సార్ అవుతుందేమోనన్నభయంతో ఇప్పటి దాకా జాబువ్రాయలేదు. ఇప్పుడు పరిస్థితి కొంత మారింది. మధ్యలో ఎలాంటి అవాంతరంరాకుండా, ఈ లేఖను మా కాన్సల్ జనరల్ మీకు చేరుస్తారనే ఆశిస్తాను.

ఈమధ్య జరిగిన సంప్రదింపులు విఫలంకావడం నాకు విచారం కల్గించింది. ఈ సంప్రతింపులు విఫలమయ్యాయన్నవార్త నాకు చేర దానికిముందే ప్రొఫెసర్ లాస్కీకి ఈ క్రిందివిధంగా వ్రాశాను.

సర్ స్టాఫర్డ్ క్రిప్స్ వర్తననూ, భారతదేశంలోని పరిస్థితులపరిణా మాలను నేను కడుజాగ్రత్తగా ఆసక్తితో పరిశీలిస్తున్నాను. ఒకవిధంగా ఈ రెండింటికీ అవినాభావసంబంధంవుంది. భారతీయసమస్యను సంతృప్తి కరంగా పరిష్కరించాలి. అందుకు సర్ స్టాఫర్డ్‌కన్నా అన్నివిధాల తగిన వ్యక్తి మరొకడులేడు. ఈ యుద్ధంలోనుంచి బ్రిటను విజయవంతంగా బయటపడాలంటే, బ్రిటిషుప్రభుత్వంలో సర్ స్టాఫర్డ్‌కు అత్యంత ప్రముఖమైనపాత్ర యిచ్చితీరాలి. అయితే సర్ స్టాఫర్డ్ అంటే బ్రిటను లోని పాలకపార్టీకి అంతగా గిట్టదు. కనుక ఈ ప్రతిబంధకాన్ని అధిగ మించాలంటే, ఆయన ద్విగుణీకృతమైన దర్హామ్‌పాత్ర నిర్వహించాలి. సంపూర్ణస్వాతంత్ర్యంకావాలని కాంగ్రెసు ఒకవిధంగా పట్టుబట్టుతున్న దన్నసంగతి తెలిసికూడా, బ్రిటను ఇలాంటి ప్రతిపాదనచేయడం నాకు ఆశ్చర్యం కల్గించింది. ఆ ప్రతిపాదనను సర్‌స్టాఫర్డ్ స్వయంగా ప్రక

టించాడు. ఈ ప్రతిపాదనవల్ల కాంగ్రెసుకు, సర్ స్టాఫర్డ్ కుకూడా చాలా అన్యాయం జరిగింది. ఈ ప్రతిపాదనకారణంగా ఐక్యస్వతంత్రభారత దేశం రూపొందడం దుర్లభమౌతుంది. కనుక కాంగ్రెసుకు ఎంతో అన్యాయం జరిగింది. పోతే, సర్ స్టాఫర్డ్ భవిష్యత్తుకూడా దీనివల్ల పెద్దగా దెబ్బతింటుంది. నిజంగా ఇది ఒకవిధంగా ఆయనపాలిట వెన్నుపోటు అనవచ్చును. అయనకు లేనిపోని ప్రతిబంధకాలు కల్పించారు. ఆయనభవిష్యత్తుతో బ్రిటనుభవిష్యత్తు ముడిపడివుంది. తాజావార్తలు కొంచెం ఉత్సాహకరంగా వున్నాయి. అయినా నాకున్న భయసందేహాలు పూర్తిగా పోనేలేదు. రాయిటర్ వ్యాఖ్యలను జాగ్రత్తగా చదివితే, బ్రిటిషుఅధికారవర్గాలపై ఖరి తేలికగా బోధపడుతుంది. వారిపై ఖరి నాకేమీ నచ్చలేదు. అమెరికన్ పత్రికల వ్యాఖ్యలుకూడా నాకు నచ్చలేదు. అవి బ్రిటిషుధోరణిలోనేవున్నాయి. మా ప్రయత్నాలన్నీ, ఉమ్మడిగానైనా వశ్యకతను వక్కాణించాలన్న ఆయుర్దాయంలో, బ్రిటిషుఅధికారవర్గాలపన్నాగంలో పడిపోయినవనే నా భయం. ఇదే నిజమైతే మా ప్రభుత్వంపై ఖరీ నాకు నచ్చదు. సర్ స్టాఫర్డ్ పైకి చెప్పకపోయినా కనీసం హృదయంలోనైనా ఆదినుంచి కాంగ్రెసుపై ఖరిపట్ల సానుభూతి కలిగివున్నాడనిమాత్రం ఆశిస్తాను. కాంగ్రెసు ఎటుతిరిగి సురకొన్నకోర్కెలుకోరటం తథ్యం. అప్పుడు ఆ కోర్కెలను అంగీకరిస్తే కాంగ్రెసుకు ఎంతో సంతృప్తి కలుగుతుంది. ఆవిధంగా రాము సమస్యను సంతృప్తికరంగా పరిష్కరించవచ్చునన్న ఉద్దేశంతోమాత్రమే సర్ స్టాఫర్డ్ మంత్రివర్గప్రతిపాదనను ఆమోదించివుంటాడని అనుకొంటున్నాను.

సంప్రతింపులు విఫలమైనతర్వాత మీరూ, సర్ స్టాఫర్డు జారీచేసిన పత్రికాప్రకటనలపకంపనను నేను చదివాను. సర్ స్టాఫర్డు తనవాదనలకు ఆధారంగాచేసుకొన్నఅంశాలుకొన్ని నాకు విస్మయంకల్గించాయి. వాటిలో మొదటివి: భారతదేశంలోని అధికసంఖ్యాకులఅభిమతాన్నిమన్నించడం కన్నా — అల్పసంఖ్యాకవర్గాలఅభిలాషలను తీరేటట్లుచూడవలసిన నైతికబాధ్యత బ్రిటనుకు హెచ్చుగావుందని. రెండోఅంశం: అల్పసంఖ్యాకవర్గాలప్రయోజనాలను కాంగ్రెసుకన్నా బ్రిటిష్‌వారే హెచ్చుగా

మన్నించగలరని. మూడో అంశం: భారతరక్షణమంత్రి విధిగా పైన్యాధి పతులబాధ్యతలలో జోక్యంకల్పించుకొని, లేనిపోనియిబ్బందులు తెచ్చి పెడతాడని బ్రిటిషువారుచేస్తున్న ఊహాగానం. సంప్రతింపులు విఫలంకావ డానికి ఈ మూడో అంశమే ముఖ్యంగా దారితీసింది. సర్ స్టాఫర్డ్ న్యాయం కోసంనిలబడేవ్యక్తిఅనీ, భారతదేశస్వాతంత్ర్యంపట్ల ఆయనకు సాను భూతివుందనీ నేను నమ్ముతూవచ్చాను. అందుచేతనే నేను అంతగా అమితాశ్చర్యంపొందాను. క్రొత్తదృక్పథాన్ని అలవర్చుకోకపోతే, బ్రిటను యుద్ధంలో విజయంసాధించడం కష్టసాధ్యమవుతుంది. అది శాంతిని సాధించలేదు. సర్ స్టాఫర్డువంటివ్యక్తికూడా అచ్చం కన్సర్వేటివ్‌వలెనే వ్యవహరించాడు. ఎందుచేతనో ప్రభుత్వాన్ని వదిలి, బాగా ముందుకు పోతే 1939 జనవరి—ఫిబ్రవరిలో జరిగినదే మళ్ళీ పునరావృతమవుతుం దని ఆయన భయపడ్డాడా? ఈ ప్రశ్నకు నాకు జవాబుకన్పించడంలేదు. ముందుగా ఆయన కాంగ్రెసుఅభిప్రాయాలను బాగా ఆకళింపుచేసుకొని, ఆతర్వాత తన సహచరులుకూడా ఆ అభిప్రాయాలను అర్థంచేసుకొనే టట్లు నచ్చచెప్పగలడనీ, అలాంటి అవకాశం ఆయనకు లభించగలదనీ నేను ఇప్పటికే ఆశిస్తున్నాను.

ఈ వివాదంవిషయంలో మాప్రభుత్వంవైఖరి ఏమిటో నాకు తెలి యదు. ఉమ్మడిరక్షణ, సౌహార్దంగురించిమాత్రం మాప్రభుత్వం వక్కా ణించవచ్చును. కాంగ్రెసునాయకులప్రతిపత్తిని పూర్తిగా అర్థంచేసు కోడం జనరల్‌గా చైనావారికి సాధ్యంకాకపోవచ్చును. గాంధీజీ మహ ర్షిగా ప్రపంచానికితెలుసును. మీరేమో పినపెలైవ దేశభక్తులుగా గణుతి కెక్కారు. మీరు కేవలం దేశభక్తులుమాత్రమేకాదు. మీరు రాజకీయ వేత్తలుకూడా. అబ్రహాంలింకన్ ఎలాంటిరాజకీయవేత్తో, మీరూ అలాంటి వారే. మీవెనుక అశేషజనసామాన్యంవుంది. వారిని ముందుండి నడిపించ వలసింది మీరే. భారతీయులకన్నా చైనీయులకు రాజకీయచైతన్యం తక్కువ. అందుచేత ఈవిషయాలన్నీ వారికీ అంతుచిక్కవు.

మాదేశంలోని రాజకీయపరిస్థితులుగానీ, ఆర్థికపరిస్థితులుగానీ నాకు ఎలాంటిసంతోషంకల్గించడంలేదు. దీనికిసంబంధించిన నా అభిప్రాయా

లను మరొకసారి వ్రాస్తాను; నేను వ్రాసేజాబు మీకు తప్పకుండా చేరు తుందన్నసమ్మకం నాకు కుదిరినప్పుడు, నేను ఉద్రేకభరోణిని వ్యక్తం చేయడం తలవిరుసుతనంప్రదర్శించడమే కాగలదు. అయినప్పటికి, భారతప్రజలు తమదేశానికి తామే పాలకులమన్నభావంతో అన్నివిధాల మాతృదేశరక్షణకు సన్నద్ధంకాగలరని కాంక్షించడం క్షమార్హమేనని ఆశిస్తాను. భారతీయులు ఆవిధంగా చేయడంద్వారా భయంకరమైనశత్రువును తిప్పికొట్టడంలో సహాయపడడంమాత్రమేకాక, అద్యతన భవిష్యత్తులో పరిపాలనను, రాష్ట్రకేంద్రపరిపాలనను స్వీకరించడానికి సన్నాహాలు పూర్తిచేసుకొన్నవారు కాగలరు.

గౌరవభావంతో,

భవదీయుడు,
తువాన్ షెంగ్ షేన్

పండిట్ జవహర్ లాల్ నెహ్రూ,
అల్లాహాబాద్,
ఇండియా.

## 340. మహాత్మా గాంధీవద్దనుంచి
(మూలం హిందీలో)

వార్ధా,
ఏప్రియల్ 24, 1942

ప్రియమైన జవహర్ లాల్,

నేను ఏదో ఒక చర్యతీసుకోవాలని మీరా బెన్ అంగీకరించింది. త్యాగంచేయడానికి ఆమె సిద్ధపడింది. నేను రాకపోయినా తాను అల్లాబాద్ వెళతానని ఆమె అంటున్నది. నా అభిప్రాయాలను తీర్మానరూపంలో ఆమెద్వారా పంపిస్తున్నాను. నేను అల్లాబాద్ వెళ్ళితీరాలని మౌలానా సాహెబ్ పట్టుబట్టాడు. అది నాకు సాధ్యంకాదన్నాను. ఈరోజుల్లో ప్రయాణంచేయడం నా కెంతో కష్టం. పైగా ఆదేకాలంలో మూడు సమావేశాలను ఏర్పాటుచేశాను. అందుచేత ఈవిషయంలో క్షమించవలసిందిగా

మౌలానాను కోరాను. నా అభిప్రాయాలను తీర్మానరూపంలోపంపిస్తానని ఆయనకు లేఖ వ్రాశాను నా తీర్మానాన్ని సమర్థిస్తూ, వాదనలుచేయవలసినఅగత్యం నాకు కన్పించడంలేదు. నా తీర్మానం నీకు నచ్చకపోతే, దానినిగురించి నేను మొండిగా పట్టుబట్టలేనుగదా. మనలో ప్రతిఒక్కరు ఎవరికినచ్చినదారినివారు ఎంచుకోవలసినసమయం ఆసన్నమైంది.

ఫినీ, తదితరచోట్ల ప్రభుత్వప్రవర్తన దుస్సహంగావుంది. ఇలాంటిప్రభుత్వం నిలబడగలిగితేమాత్రం చివరకు చేసేది ఏమిటి? ఈనాడు అది మనుగడకోసం కొట్టుమిట్టాడుతోంది. ఈ ప్రభుత్వం పోయినతర్వాత మనం జపానువాళ్ళకు తగినవిధంగా జవాబుచెప్పగలమన్నవిశ్వాసం నాకు వున్నది. ఈ ప్రభుత్వం తొలగిపోయినతర్వాత మనలోమనం గుద్దులాడుకొంటామని ఎవరన్నాఅంటే అది వేరేవిషయం. అయితేమాత్రం మన ఆంతరంగిక తగవులనుంచి బయటపడడంకోసం ఈ ప్రభుత్వాన్ని దేవురించాల్సిన అవసరంవుందా?

ఆచార్య నరేంద్రదేవ్ తీర్మానాన్ని చూశాడు. అది ఆయనకు నచ్చింది.

ప్రేమతో,
బాపూ,

341. లూయీ జాన్సన్ వద్దనుంచి

అమెరికా అధ్యక్షుని
ప్రత్యేకప్రతినిధి కార్యాలయం,
న్యూఢిల్లీ,
మే 12, 1942

ప్రియమైన జవహర్‌లాల్,

"పూర్వరంగం" అన్నదానిని కడు ఆసక్తితో చదువుతున్నాను. వారంపదిరోజులకాలంలో నేను చదువుతున్నది ఇదే. ఆసుపత్రినుంచి నిన్ననే బయటకొచ్చాను. శుక్రవారంనాడో, శనివారంనాడో—ఇంకా స్పష్టంగా చెప్పాలంటే ఈదఫావచ్చే స్ట్రాటోలైనర్‌లో బయలుదేరుతాను.

మీరు విశ్రాంతికై వెడుతూ, తీరికచేసుకొని నాదగ్గరికి వచ్చినందుకు ధన్యవాదాలు. మీరు పూర్తిగా విశ్రాంతిపొందగలరని ఆశిస్తాను. మీరు ఇక్కడకు తిరిగివచ్చినతర్వాత, కొద్దిరోజులకే కొచ్చిన్ భవనం నుంచి, నేను చెప్పవెళ్ళుతున్నసంగతులు మీరు చేరగలవు.

మీ పరిచయభాగ్యంవల్ల నా భారతదేశపర్యటనకు సార్థక్యంచేకూరింది. నాకుసంబంధించనంతవరకు, మన పరిచయం కొద్దికాలంపాటే కాక మీతో స్నేహంకొనసాగాలని కాంక్షిస్తూంటాను.

భవదీయుడు,
లూయీ జె.

పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ,
నగ్గర్ (కులూ)

తాజాకలం: ఇంటికితిరిగిపోతూ దారిలో "రివర్ ఆఫ్ కింగ్స్" చదువుతాను. దానిని పంపించినందుకు మీ కివే నా ధన్యవాదాలు.

జర్మన్లు ఈవేళనే తమ దండయాత్ర ప్రారంభించారు. మనం ఇప్పుడు సంక్షోభంలోకి ప్రవేశిస్తున్నాం. యుద్ధం త్వరలోముగిసేదీ, లేక దీర్ఘకాలం సాగేదీ దానిపైనే ఆధారపడివుంటుంది.

మీ స్నేహితుడు,
లూయీ

342. జ. అధికారివద్దనుంచి

మే 3, 1942

ప్రియమైన పండిట్‌జీ,

అఖిలభారత కాంగ్రెసుసంఘసమావేశ పర్యవసానాలనుగురించిన కొన్నివిషయాలు మీముందుంచడంకోసం నే నీ లేఖను వ్రాస్తున్నాను. మీతో నాకు అంతగా పరిచయంలేదు. క్రిప్స్‌రాయబారంసందర్భంలో ఢిల్లీలో మిమ్మలను కలుసుకొన్న నా మిత్రుడు, సహచరుడు మీకు సుపరిచితుడే. అయినా ఇది అంత ముఖ్యవిషయంకాదు.

ఏ. ఐ. సి. సి. సమావేశపర్యవసానాలను గురించి మేము తీవ్రంగా ఆందోళనచెందుతున్నాం. ఏ. ఐ. సి. సి. సమావేశనిర్ణయాలవల్ల దేశమూ, ప్రజలూకూడా మరింతవిషమపరిస్థితిలో చిక్కుకున్నారని మేము అనుకొంటున్నాం. ఈ నిర్ణయాలు మీకూ అంత ఉత్సాహకరంగాలేవనే నేను భావిస్తున్నాను. నా భావన పొరపాటుకావచ్చు. కాని, ప్రధానఅధికార తీర్మానంపై మీరు చేసిన ముగింపుఉపన్యాసంలో మీరు ధ్వనింపచేసిన అంశాలనుబట్టి నాకు అలాంటి అభిప్రాయంకల్గిందనిమాత్రం చెప్పగలను. మీ ఉపన్యాసానికి ఉపోద్ఘాతమాఅన్నట్టు మీరు సుదీర్ఘమైన, వ్యక్తిగతమైన, ఆత్మపరిశీలనాత్మకమైన అంశాలెన్నో పేర్కొన్నారు. వాటినిబట్టే నేను అలాంటి అభిప్రాయానికివచ్చాను. ఆ తీర్మానానికి మీరు కొన్నిసవరణలు ప్రతిపాదించినట్టు కన్పిస్తున్నది. వాటిలో కొన్ని ఆమోదించబడినవి. మరికొన్ని తిరస్కరించబడినవి. ఈ యుద్ధంలో ఉభయపక్షాలను ఒకే గాటనుగట్టుతున్నవారిని మీరు మందలించినతీరు చాలా చక్కగావుంది.

ఇదే అసలువిషయంకూడా. ఇద్దరు శత్రువులమధ్య సంపూర్ణమైన తాటస్థ్యం అన్న భావంతో తీర్మానం రూపొందించబడినదనడం నిస్సందేహం. ఇద్దరు శత్రువులమధ్య తారతమ్యాలను తీర్మానంలో ఉదహరించనేలేదు. సవరణలు, ఏవైనప్పటికీ అసలుతీర్మాన స్వరూప, స్వభావాలను ఏమాత్రం మార్పుచేయలేకపోయాయి. క్రిప్స్‌రాయబారం విఫలమైన వెంటనే పత్రికలవారికి మీ రిచ్చిన ఇంటర్వ్యూ చాలా బాగావుంది. ఆ ఇంటర్వ్యూలో మీరు వెలిబుచ్చినభావాలకు ఈ తీర్మానానికి అసలు సామ్యమేలేదు. ఇదే మాకు ఆందోళనకల్గిస్తున్నది. ఈ క్లిష్టసమయంలో ప్రతిదేశభక్తుణ్ణీ కలవరపరచేదీ ఇదే.

మీకు అసంతృప్తిగానేవుండవచ్చును. అయినా మీరు మావైపుకు తిరిగి అంటారుగదా; ఇంతకన్నా చేయగల్గింది ఏముంది? మన ప్రజలలో బ్రిటిషువారిపట్లగల తీవ్రవ్యతిరేకతను మీరు గుర్తించడంలేదుఅని. లేదు, కామ్రేడ్; మేము ఆ విషయాన్ని స్పష్టంగా గుర్తిస్తున్నాం. ఈ తీర్మానం, మొత్తం ఏ. ఐ. సి. సి. చర్చలూ బ్రిటిషువ్యతిరేకతను రెచ్చగొట్టడానికే ఉపకరిస్తాయి. దీనివల్ల చివరకు జరిగే దేమిటి? మరింత సామ్రా

ట్యవాదవ్యతిరేకతా? మరింత స్వాతంత్ర్యఅభిలాషా? మరింత ఆత్మ విశ్వాసమా? ఇదేదీ కాదని నా భయం. తటస్థవైఖరి అవలంబించాలన్న ధోరణితోను, శత్రువు మనదేశంలోకి జొరబడివచ్చినపుడు అహింస పాటిస్తూ సహాయనిరాకరణ సాగించాలన్నలక్ష్యంతో బ్రిటిషువ్యతిరేక భావాన్ని మిళితంచేసినప్పుడు, బ్రిటిషువ్యతిరేకతనుంచి జపానుఅను కూలత పుట్టుకొస్తుంది; పరాస్తమనస్తత్వం పెంపొందుతుంది.

ఈ విషమతరుణంతో ఏ. ఐ. సి. సి. మన ప్రజలకు సరియైన దారి చూపలేకపోయింది. ఆశ, ఆత్మవిశ్వాసాలను వారిలో రేకెత్తించలేక పోయింది. కార్యాచరణమార్గాన్ని చూపలేకపోయింది. అయితే ప్రజలలో బ్రిటిషువ్యతిరేకతనుమాత్రం విపరీతంగా రెచ్చగొట్టి చూర్చున్నది. ఈ బ్రిటిషువ్యతిరేకజ్వరం తగ్గిపోగానే, ప్రజలలో పరాస్తమనస్తత్వం ప్రబలి, జపానుఅనుకూలభావాలు అంకురించితీరుతాయి. దురాక్రమణ దారునికి, రహస్యంగా స్వాగతమిచ్చేవారినిగురించి మౌలానా మాట్లాడారు. కాంగ్రెసువెనకాలగల మధ్యతరగతిప్రజలలో ఈ భావం ప్రబలంగావుంది. ప్రస్తుతం కాంగ్రెసుతీసుకొన్నవైఖరితో ఆ భావం మరింత బలపడుతుంది. ఆ భావం తప్పనిసరిగా మన ప్రజలహృదయా లను క్రమేణా కలుషితంచేయకమానదు. సౌమ్యంగా చెప్పాలంటే ఈ భావం ప్రబలమవడంవల్ల శత్రువుతోపోరాడాలన్నదీక్ష సడలిపోతుంది.

మనం జాతీయప్రభుత్వాన్ని సాధించుకోలేకపోయాం. ప్రజలను సాయుధులుగాచేయడానికి మనకు యింకా ఆయుధాలు లేవు. ఆత్మగౌరవం గల వ్యక్తులవలె దేశరక్షణకు నడుంబిగించేందుకు మనకు అవకాశాలు లేవు. ఇవన్నీ నిజమే, దీనికంతకూ బ్రిటిషువారే కారణం. అయితే, ఇక ఇంకా మనం జాతీయప్రభుత్వాన్ని సాధించుకోలేం. ఆయుధాలు సంపా దించుకోలేం. సమయంకూడా చేయిదాటిపోతున్నది. అహింసాపద్ధతిలో మనకుమనం జోహారుచేసుకోడంతప్ప మరొకమార్గంలేదు అని ప్రజలకు చెప్పడంఅంటే....సౌమ్యంగా చెప్పాలంటే ఇంతకన్నా ప్రమాదకరమైన పరాస్తమనస్తత్వం మరొకటి వుండబోదు. బ్రిటిషువారు మనకు జాతీయ ప్రభుత్వాన్ని యివ్వలేదు. వారు మనకు ఆయుధాలు ఇవ్వలేదు...........

అందుచేత మన ప్రజలవద్దగల ఏ కైక ఆయుధాన్ని క్రిందకుదించమని మనం చెబుదామా? అంతేనా మనం చేయవలసింది? మనదేశాన్ని సమర్థవంతంగా రక్షించుకోవడానికి బ్రిటిషువారు మనలను అనుమతించరు. అంతమాత్రంచేత మనం మనప్రయత్నాలన్నింటినీ విరమించుకోవలసిందేనా? వారిపై మనం ఒత్తిడితీసుకరానక్కరలేదా?..........తటస్థ వైఖరి, దురాక్రమణదారునితో అహింసాపద్ధతిలో సహాయనిరాకరణ, దండయాత్రకులో నైన ప్రాంతంలో పోరాటంసాగిస్తున్న బ్రిటిషు సైన్యంతో సహకరించనిరాకరించడం అంటే అర్థం అంతేకదా? ఇంతకన్నా అవివేకమైనవిషయం మరొకటి మాకు కన్పించడంలేదు. మన వేళ్ళతో మన కళ్ళనే పొడుచుకుంటామా?

నా అభిప్రాయాన్ని స్పష్టంగా వివరించగలిగానో లేదో నాకు తెలియదు. ఇంతకీ నేను చెప్పదల్చుకొన్నవి ఇవి: పత్రికాప్రకటనలో మీరు వెలిబుచ్చిన అభిప్రాయాలకూ, ఏ. ఐ. సి. సి తీర్మానంలోని భావాలకూ చాలా తేడా కన్పిస్తోంది. ఎ. ఐ. సి. సి. లో చేసిన ప్రసంగాలనుబట్టి చూస్తే, కాంగ్రెసుకుచెందిన మధ్య (రాష్ట్రీ) నాయకత్వం ఈ తీర్మానం ఏవిధంగా ప్రజలకు వ్యాఖ్యానించి చెప్పుతారో ముందుగానే ఊహించవచ్చును; దీనికి ఉదాహరణగా, ఏ ఐ. సి. సి. లో మాట్లాడిన ఒక వక్తమాటలను తీసుకోవచ్చును; జపాను బ్రిటిషుప్రభుత్వానికి శత్రువు (మనశత్రువుకాదు!)అని ఆ వక్త చిత్రించాడు. ఇదేదో ఒకవ్యక్తి నోరుజారడంగాతీసుకోరాదు. ద్వేషంతోకూడిన తటస్థతాభావంయొక్కఫలితమే ఇది. అనేకమంది కాంగ్రెసువాదులు తీర్మానాన్ని ఇదేధోరణిలో అర్థంచేసుకొంటారు; ఇదేతీరులో వ్యాఖ్యానిస్తారు. మన ప్రజలహృదయాలలో మొక్కవోనిధైర్యసాహసాలను రేకెత్తించేదీ, మన ప్రజల పోరాటపటిమను పెంపొందించేదీ వీరేనా? కాదండి. దీనివల్ల ప్రజలలో ఓటమితత్వం వేరూనుతుంది. శత్రువును తీవ్రంగా ద్వేషించడంనేర్చుకొనిదే శత్రువును గట్టిగా ప్రతిఘటించడం ఎవరికీ సాధ్యంకాదు. రెండురోజుల క్రితం మేదినోత్సవసందర్భంలో స్టాలిన్ తన ప్రజలను ఉద్బోధిస్తూ ఇదేవిషయం చెప్పాడు.

ముఖ్యంగా ఈసమయంలో ఈ గుణపాఠాన్ని స్టాలిన్ ప్రసంగం నుంచి గ్రహించడం మనకు మేలుచేకూర్చుతుంది. ఈరోజున ముఖ్యంగా మనం నిర్వర్తించవలసినకర్తవ్యం ఒకటి వుంది. జపానుదురాక్రమణ దారులకు వ్యతిరేకంగా దేశంనాలుగుచెరగులా పెద్దఎత్తున ప్రచారం చేయాలి. జపానుదురాక్రమణదారులపట్ల, రాజులపట్ల ప్రజలలో ద్వేషా గ్నినిరగుల్కొల్పాలి. ఫాసిస్టులు మనదేశంపై కన్నువేసివుంచారన్నసంగ తినీ,మనప్రజలను బానిసత్వంలోముంచెత్తదానికి పన్నాగాలుసిద్ధంచేశారన్న విషయాన్నీ మనం ప్రజలకు వివరించి చెప్పాలి. దీనివల్ల ప్రయోజన మేమిటని మీరు ప్రశ్నించవచ్చును. దీనివల్ల ప్రజలలో జాతీయరక్షణ భావం పెంపొందుతుంది.

ప్రజారక్షణదళాలు, తదితర కార్యకలాపాలకు నిర్దిష్టమైన ధ్యేయం ఏర్పడుతుంది. మనదేశంలోని దేశభక్తయువజనులందరినీ ప్రజారక్షణ దళాల్లో సమీకరించవచ్చును. దేశరక్షణకు, తదితర రక్షణావసరాలకు వారిని సుశిక్షితులుగా తయారుచేసుకోవచ్చును; వారిలో జపానుప్రతికూల భావాలను రేకెత్తించవచ్చును. ఈ యుద్ధంలో ప్రధానంగా తేలే అంశ మేమిటో వారికి విశదీకరించవచ్చును. ఫాసిస్టులు మనదేశంపైకి దండెత్తి వచ్చినప్పుడు, ప్రజారక్షణదళాలే గెరిల్లాదళాలుగా రూపాంతరంచెందు తాయి. బ్రిటిషుప్రభుత్వం ఎన్ని అడ్డంకులుకల్పించినా, దురాక్రమణదారు లను ప్రతిఘటించడంలో మనప్రజలకు ఆయుధాలు లభింపగలవన్న నమ్మకం నాకు వుంది. అయితే ఈలోగా మనప్రజలహృదయాలలో జపాను వ్యతిరేకభావాలు గట్టిగా వేరూనుకునేటట్లు మనం చూడాలి. 1937కు పూర్వం అనేకసంవత్సరాలపాటు చైనావారు ఇదేవిధంగా చేశారు. ఓటమితత్వాన్నిప్రేరేపించే తటస్థతాభావంతో ప్రజలమనస్సులు కలుషితం చేయకండి. ప్రజారక్షణదళాలలో మా పార్టీ యువకులు వున్నారు. అయితే వారు జపానువ్యతిరేకప్రచారంచేస్తున్నారన్నదృష్టితో, ఇది మన యుద్ధం అని ప్రచారంచేస్తున్నారన్న కారణంతో, మన స్వాతంత్ర్యరక్షణకు సాగుతున్నయుద్ధం అని చెప్పినందుకు, ప్రజారక్షణ దళాలలోనుంచి వారిని వెళ్ళగొట్టేధోరణి ప్రస్ఫుటమవుతున్నది. ఈ తీర్మానంవల్ల ఈ ధోరణి మరింత ప్రబలుతుంది.

ఎ. ఐ. సి. సి.లో తలెత్తిన ఇతర రాజకీయవివాదాలజోలికి నేను పోదల్చుకోలేదు. తీర్మానంలోని ఒకానొకఅంశంపట్ల మా అభిప్రాయ మేమిటో వివరించడమే ఈ లేఖ ప్రధానోద్దేశం. ఈ తీర్మానంఫలితంగా సంభవించే చెడుపర్యవసానాలను చక్కదిద్దడానికి మీరు ఇచ్చగించగల రన్నదృష్టితోను, ఈవిషయంలో పరస్పరం అభిప్రాయాలుతెలుపుకోవడం మీకు ఆమోదకరంగావుంటుందన్నభావంతోను నేను మీకు ఈ లేఖను వ్రాస్తున్నాను. పోతే, కాంగ్రెసుసభ్యులలో ఎవరైనా దేశభక్త జపాను ప్రతికూలప్రచారంసాగించినా, యుద్ధంయొక్క నిజస్వభావాన్ని ప్రజలకు విడమర్చి చెప్పినా, అలాంటివారిని కాంగ్రెసునుంచి బహిష్కరించాలన్న తలంపు వుందా? ఈవిషయం తెలుసుకోగోరుతున్నాం. కొంతమంది కార్యకర్తలు, రైతు, విద్యార్థిసంఘాలలో పనిచేస్తున్న కార్యకర్తలు తటస్థతకు వ్యతిరేకంగా ఓటమితత్వానికి వ్యతిరేకంగాను తీవ్రమైన ప్రచారం ప్రారంభించబోతున్నారు. ఆ ప్రచారంలోపాల్గొన్న కాంగ్రెసు వాదులను బహిష్కరిస్తారా? ఇలాంటిసమస్యలు ఉత్పన్నమవుతాయి. తీర్మానన్ని పచ్చి తటస్థవిధానంగా వ్యాఖ్యానించడాన్ని వెంటనే నివారించడం అవసరమనుకొంటాను. చైనావారు అంటున్నట్లు నైతికంగా ప్రజలనుసమీకరించడానికి ఉద్యమించినవారికి ఈ తీర్మానం గుదిబండ కారాదు. దురాక్రమణపరులకు ప్రతికూలంగా, అందువాటులోవున్న అన్ని పద్ధతులలోను జాతీయప్రతిఘటనోద్యమాన్ని నిర్మించడానికి తల పెట్టినవారిపాలిట ఈ తీర్మానం ప్రతిబంధకం కారాదు.

మిగతావిషయాలలో అభిప్రాయభేదాలు ఎన్నివున్నా, ఒకవిషయంలోమాత్రం ఏకాభిప్రాయం అవసరం. దేశప్రజలలో దేశభక్త జపానుప్రతికూల దురాక్రమణవ్యతిరేకచైతన్యం కల్గించాలి. జాతీయరక్షణకు వారిలో ధైర్యసాహసాలను పెంపొందించాలి. మనప్రజలు దొరికిన ఆయుధాలన్నింటినీ చేతబుచ్చుకొని, దురాక్రమణదారులను ప్రతిఘటిస్తూ బ్రిటిషుసైన్యంతో సహకరించాలి. దీనివల్ల మనకు నష్టమేమీలేదు; పైగా ఎంతో మేలుచేకూరుతుంది. పరిస్థితులు ఇలాగే కొనసాగినట్లయితే, కొద్ది చోట్ల మాత్రమే, బహు తక్కువ గెరిల్లాదళాలుమాత్రమే ఏర్పడతాయి.

అయినప్పటికీ ఈ దళాలు తమ ఆత్మత్యాగంద్వారా మాతృదేశానికి పేరు ప్రతిష్ఠలు తెచ్చిపెట్టగలవు. భారతదేశం మరీ అంతనిస్సహాయస్థితిలోలేదని ప్రపంచానికి తెలిసివస్తుంది. సైనికసమీకరణ, యుద్ధసన్నాహాల విషయంలో బ్రిటిషుప్రభుత్వం సహకరించాలని కమ్యూనిస్టులు చేస్తున్న సూచన మీకు ఆమోదకరంకాకపోవచ్చును; అయినా అదే దురాక్రమణ దారులను దెబ్బతీసి, ప్రజలనురక్షించేమార్గం. ప్రజ్వలితమవుతున్న దేశ భక్తిభావంతో కమ్యూనిస్టులు ఈ సూచనచేస్తున్నారన్నసంగతినైనా మీరు గుర్తించండి. బ్రిటిషువ్యతిరేకవాగాడంబరతకు తటస్థభావాన్ని జోడించి నప్పుడు, పర్యవసించేది ఓటమితత్వంమాత్రమేనని గుర్తుంచుకోండి. మాతృదేశాన్ని రక్షించుకొనే దేశభక్తయోధులను సృష్టించుకొనేమార్గం అదికాదు. అది శత్రువుకుమాత్రమే సహాయకారి అవుతుంది.

అందుచేత, ఫాసిస్టుఅనుకూలశక్తులచేతుల్లో ఈ తీర్మానం ఒక సాధనంకాకుండా చూడాలని మీకు విజ్ఞప్తిచేస్తున్నాం. మీరు పత్రికాప్రకట నలో వెలిబుచ్చినభావాలకు అనుగుణంగా (ఉదా: గెరిల్లాపోరాటం, 'దగ్ధ పటలవిధానం') ఈ తీర్మానం అమలుజరిగేటట్టుచూడండి.

ఇంత దీర్ఘమైన లేఖవ్రాసినందుకు నన్నుమన్నించండి. మహత్తర మైన మన జాతీయసంస్థలో అద్వితీయస్థానంలోవున్న మీకు ఒక దేశ భక్తుడు చేసిన విజ్ఞప్తిగా దీనిని పరిగణించండి. ఎ. ఐ. సి. సి. తీర్మానం వల్ల ఉత్పన్నమయ్యే ఘోరప్రమాదాలను నివారించగల్గినశక్తి మీకేవుంది.

భవదీయుడు

*జి. అధికారి.

343. మౌలానా అజాద్‌వద్దనుంచి

కలకత్తా,

మే 18, 1942

ప్రియమైన నెహ్రూ,

ఢిల్లీనుంచి పంపిన తంతికి, వ్రాసినలేఖకు మీకు ఇవే నా ధన్య వాదాలు. నేను 'ఐ థ్యాంక్యూ' అని ఉపయోగించినసంగతి గమనించండి.

---

*జి. అధికారి భారతకమ్యూనిస్టుపార్టీప్రముఖులలో ఒకరు.

'థ్యాంక్స్' అనిమాత్రమే వూరుకోలేదు. ఆవిధంగా మీరు నాకు ఢిల్లీలో చెప్పినట్లు, రెండింటిమధ్యగల స్వల్పమైన తేడానుకూడా పాటించాను.

కిద్వాయ్‌నుంచి ఒకలేఖ, పాలీవాల్ పంపిన తంతి నాకు అందాయి. పిల్లలతరలింపునకు పాలీవాల్ తన సంసిద్ధతను వ్యక్తంచేశాడు. బెంగాల్ ప్రభుత్వంతో వివరాలను మాట్లాడబోతున్నాను. ఆ చర్చలు నిర్దిష్టరూపం తీసుకోగానే యు. పి. మిత్రులకు తెలియజేస్తాను.

అయితే కిద్వాయ్‌ని హఠాత్తుగా నిన్న భారతరక్షణచట్టంక్రింద అరెస్టుచేసినట్లు ఇవాళే తెలిసింది. ఇది నాకు చాలా ఆశ్చర్యంకలిగించింది. గత కొలదిరోజులలో కిద్వాయ్ ఏమిచేశాడని ఇప్పుడు ఆయనను అరెస్టు చేశారు? మళ్ళీ యు. పి. ప్రభుత్వానికి ఆయన ప్రమాదకరంగా తయారయ్యాడు గావును!

బొంబాయికి బయలుదేరుతున్నానని క్రితంరేఖలో వ్రాశాను. అయితే బెంగాల్‌లోనిపరిస్థితులదృష్ట్యా నే నిక్కడనుంచి కదలటానికి వీలులేకపోయింది. అందువల్ల నా ప్రయాణాన్ని వాయిదావేసుకొన్నాను. చిటగాంగ్‌పై జపాను విమానదాడిజరపడంతో ఇక్కడిప్రజలు భయాందోళనలకు లోనవుతున్నారు. కలకత్తాపైకూడా విమానదాడి త్వరలో తప్పదని భయపడుతున్నారు. పైగా, బెంగాల్‌కోస్తాప్రాంతాల ప్రజలవిషయంలో అనేక క్లిష్టసమస్యలు హఠాత్తుగా తలెత్తాయి. అందువల్ల నేను రాష్ట్రం వదిలిరావడానికి వీలులేకపోయింది.

ఇఫ్తకార్ మితిమీరుతున్నట్టున్నాడు. అది నాకు బాధకల్గించింది. ఆయనను దారికితీసుకురావడానికి మీరు ప్రయత్నించారా? అయితే ఫలితం ఏమిటి?

కులూలో మీరు ఎక్కువరోజులపాటువుంటే, నే నెంతో సంతోషిస్తాను. అలహాబాద్‌లో మీరు దిగులుగావుండడం చూసి నేను ఆందోళన చెందాను. మీరు ఇప్పుడు అరవైయ్యోపడిలోపడుతున్నారు. అందుచేత మీ ఆరోగ్యంగురించి మరింత జాగ్రత్తతీసుకోవడం అవసరం.

భవదీయుడు,

ఏ. కె. ఆజాద్

### 344. క్లేర్ బూత్ లూస్ వద్దనుంచి

గ్రీన్‌విచ్, కానెక్టికట్
జూన్ 4, 1942

ప్రియమైన జవహర్‌లాల్ నెహ్రూ,

మొదటిప్రపంచయుద్ధకాలంలో డిప్లొమాటుగాపనిచేసిన మిత్రుడు ఒకడు చెప్పినకథ ఇప్పటికీ నాకు గుర్తుంది. వర్సెయిల్స్‌సంధి జరిగిన పిమ్మట కొన్నిసంవత్సరాలకు ఆయన పడెరెవిస్కీతోకలసి విందారగిస్తున్నాడు (అని ఆయనచెప్పాడు). ఆ మిత్రుడు పడెరెవిస్కీతో ఇలా అన్నారు, "ఎంతో విశ్వాసపాత్రంగా ప్రవర్తించిన యూరపుదేశాలకు 'పిన్‌స్ట్రైప్డ్‌ట్రౌజర్డ్' పెద్దమనుష్యులు చాలా అన్యాయాలుచేశారు; అద్దాల మేడలో కూర్చుని తమయిష్టంవచ్చినవిధంగా విభజించారు. అలాంటి పరిస్థితిలో పోలెండు, మిగతాదేశాలతోపోల్చితే, అంత పెద్దదిగాను, స్వాతంత్ర్యంతోనూ బయటపడడం నిజంగా ఆశ్చర్యకరమే. మీరు యుద్ధకాలంలో వాషింగ్టన్‌లో రాయబారిగా పనిచేశారు. మరి మీరు ఏ విధంగా శ్రీ విల్సన్‌ను ఒప్పించి, పోలెండుకు లాభంచేకూర్చగలిగారు? ఇందులో ఏదో కిటుకువుండాలి" దీనికి ఆ పోలిష్‌పెద్దమనిషి ఇచ్చిన జవాబిది (అని ఆ మిత్రుడు చెప్పాడు):"ఓ అదా,నేనుఅసలువిల్సన్‌తో ఎప్పుడూ రాజకీయాలనుగురించి చర్చించేవాడినేకాదు. అనేకసందర్భాలలో నేను వైట్‌హౌస్‌నుసందర్శించినమాట నిజం. నిజంచెప్పాలంటే, నేను పియానోవాయిస్తుంటే ఆయన చెవికోసుకొని వింటుండేవాడు. అందుకే నేను అక్కడకు వెళ్ళుతుండేవాణ్ణి."

ఈ కథ నిజంగా కల్పితమైనదేకావచ్చును;....ఇంతకీ నేను దీనిని ఎందుకు ప్రస్తావించానంటారా? ఇప్పటివలెనే అప్పుడూ, అప్పటివలెనే ఇప్పుడూ దేశాలభవిష్యత్తును వాషింగ్టన్, వైట్‌హౌస్‌లు నిర్ణయిస్తున్నాయి ('విజయం' సాధించితేనే అనుకోండి). అయితే ఇప్పుడుకూడా అప్పటివలెనే గొప్పవ్యక్తుల విచిత్రప్రభావంవల్ల దేశాలకు స్వాతంత్ర్యం లభించనూవచ్చును; లేదా శతాబ్దంపాటు రావణాకాష్టంలాగాకాలుతూ వుండే సంఘర్షణలు ప్రజ్వరిల్లనూవచ్చును.

అమెరికాను సందర్శించడానికి మీరు అవకాశందొరికితేమాత్రం తప్పకుండారండి; దానిని నిరాకరించకండి. భారతదేశంలోను, ఇంగ్లండు లోను, అమెరికాలోను కొంతమంది వ్యక్తులున్నారు. వారంతా ఒకగదిలో కూర్చొని చర్చిస్తేమాత్రం భారతసమస్యాపరిష్కారానికి మార్గాలు కనుగొనగలరన్నవిశ్వాసం నాకు ఉన్నది. అలా జరిగితే మీ పని సుకరమవుతుంది; బ్రిటనుకూ, మాకూ ఎంతో లాభంచేకూరుతుంది; భవిష్యత్తులో ఏలాంటిగొడవలు లేకుండా హాయిగా జీవించవచ్చును। అలాంటి వ్యక్తులలో పండిట్ నెహ్రూ ఒకరు; ప్రెసిడెంట్ రూజ్వెల్ట్ మరొకరు. ఇందులో సందేహంలేదు. మీ ఇద్దరికీ ఒకరిపట్ల మరొకరికి, సద్భావం వుందో లేదో నాకు తెలియదు. సద్భావం ఏర్పడడానికిముందు సాన్నిహిత్యం అవసరం. అయితే, మీ యిద్దరూ 19వ శతాబ్దపు భాషలోకాకుండా 20వ శతాబ్దపుభాషలో మాట్లాడుకోగలరు। మా అధ్యక్షులు అనేకసార్లు పెద్దతప్పిదాలే చేశారు; (గుడ్డొచ్చి పిల్లను వెక్కిరించి నట్లుంటుందని తెలిసికూడా ఈ మాట చెప్పుతున్నాను) అయితే ఆయన ఎప్పుడూ సరియైనమార్గంలోనే పయనిస్తున్నారు. ఆ మార్గంలో ఆయన అప్పుడప్పుడు పొరపాట్లుచేస్తున్నారు. అయినా అది సరియైనమార్గం; అదే గదా ముఖ్యం. మీ యిద్దరిమనస్సులు తేలికగా కలుస్తాయనడంలో నాకు సందేహంలేదు. మూలవిషయాలలో మీరు ఏకీభావానికిరాగలరు. ఇంతకన్నా చెప్పగల్గిందిలేదు. మంచి జరుగుతుందని మీకు నమ్మకంకుదిరితే తప్ప మీరు రారు; ఇతరులు ఎంతచెప్పినా లాభంలేదు. అమెరికా అధ్యక్షునికీ మంచిపని అని తోస్తేతప్ప, మీకు మంచిపనిగా గోచరించదు.

ఈవేళ ఉదయాన, ఈ వారంలోను భారతదేశంనుంచి వచ్చిన సమాచారం కొంత మెరుగుగావుందిగదా। అంటే దేశంలోదిగుతున్న సైన్యాలనుగురించిసుమా నేను చెప్పుతున్నది. చివరకు ఇదంతా ఎలా పర్యవసిస్తుందో నేను ఊహించలేను. జపానువాళ్ళు చిటగాంగ్‌ముంగిట భారతదేశంవెలుపలా ఏమి చేస్తారో నాకు తెలియదు.

మీరు క్షేమంగావుండాలి. పిలవనిపేరంటంఅన్నట్టు, నేను జోక్యం కల్పించుకొని సలహాలు ఇస్తున్నందుకూ, సూచనలు చేస్తున్నందుకూ మన్నించండి. మనస్సులో క్షోభ మళ్ళీ ప్రారంభమైంది. ఆస్ట్రేలియా వెళదామనుకొంటున్నాను. శుభాకాంక్షలు అందుకోండి.

క్లేర్ లూస్

345. యస్. హెచ్. షెన్‌వద్దనుంచి

న్యూ ఢిల్లీ,
జూన్ 16, 1942

ప్రియమైన పండిట్ నెహ్రూ,

మహాత్మాగాంధీ జనరలిస్మోకు వ్రాసినలేఖను మీరు జూన్ 14వ తేదీన వ్రాసినఉత్తరం డాక్టర్ మీనన్‌ద్వారా నాకు చేరాయి.

గాంధీజీవ్రాసినలేఖను, చియాంగ్‌సతీమణికి మీరు వ్రాసినలేఖను ట్రాన్స్మిట్‌చేయవలసినదిగా జనరల్ లోట్స్‌యిన్‌కు అందజేశాను. ఆయన బర్మాలోవున్న మా సైన్యాలకు అధిపతి; జంగ్‌కై షేక్‌ను కలుసుకుందుకు ఆయన రేపు న్యూఢిల్లీనుంచి చుంకింగ్‌కు బయలుదేరి వెళుతున్నాడు. దీనికితోడు ఆ సందేశాన్ని మా రహస్యసైనికసాంకేతిక భాషలో టెలిగ్రాంద్వారా జనరలిస్మోకు పంపించాను. ఇందువల్ల టెలిగ్రాం త్వరగా చేరుతుంది.

ఈలోపున స్వతంత్రించి నేను మహాత్మాగాంధీ తమలేఖలో వ్రాసినవిషయాలను తెలుసుకుందుకు సాహసించాను. భారతదేశానికి వెను వెంటనే స్వేచ్ఛాస్వాతంత్ర్యాల నొసంగవలెననే వాదన కిక తిరుగులేదని, అదే సముచితమైనమార్గమని, చైనాకు హానికలిగించే ఎలాంటిపనుల కైనా తాను దూరంగావుండగలనని, చైనాపైకాని, లేదా భారతదేశంపై కాని జపాను దురాక్రమణసాగించినప్పుడు దానిని తాను సమర్థింపజాల నని, ఆయన తమలేఖలో ఉద్ఘాటించారు. వారినిర్ణయం అర్థవంతమైనదని ఆ లేఖ చదివిన ఎవరికైనా విశ్వాసంకలగకమానదు. మీరు తలపెట్టిన

ఉద్యమం చైతన్యయుతమైనది; దానిలో చిత్తశుద్ధి తొణికిసలాడుతోంది. ఆ ఉద్యమాన్ని చైనాప్రజలందరూ హృదయపూర్వకంగా బలపరచి తీరుతారు. మీకు న్యాయంగా రావలసిన స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు మీకు లభిస్తాయని మీ ఉద్యమం విజయలక్ష్మిని చేపట్టగలదని నేను నమ్ము తున్నాను.

మీరు మళ్ళీ న్యూఢిల్లీకి ఎప్పు డొస్తారా అని ఆతృతతో ఎదురు చూస్తున్నాను. అప్పుడు మీరు ఈనాటి ప్రధానసమస్యలనుగురించి ప్రసం గిస్తూ నాకు ఆత్మవికాసాన్నికలిగిస్తారని నా ఆశ.

మీ విశ్వాసపాత్రుడు,
యస్. హెచ్. షెన్

పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ,
బొంబాయి

346. లాంప్టన్ బెర్రీకి

జూన్ 23, 1942

ప్రియమైన శ్రీ బెర్రీ,

కల్నల్ జాన్సన్‌సందేశాన్ని తెలియచేస్తూ మీరు జూన్20వతేదీన వ్రాసినఉత్తరం నాకు చేరింది. అందుకు ధన్యవాదాలు. ఆ సందేశానికి నేను స్వాగతమిచ్చాను. శ్రీ వెల్స్ కావించిన ఉపన్యాసంకూడా నేను ఆసక్తితో చదివాను. కలనల్ జాన్సన్‌ఆరోగ్యం బాగుపడుతున్నదని తెలుసుకొని నే నెంతో సంతోషించాను; కొద్దిరోజుల్లోనే, ఆయనకు పూర్తిగా నిమ్మళిస్తుందని ఆశిస్తున్నాను. నేనూ తరచు ఆయన్నిగురించి ఆలోచిస్తూవుంటానని తెలియచేస్తూ, నా గౌరవభావాన్ని ఆయనకు అంద చేస్తారని నమ్ముతాను.

ఇటీవల శ్రీ గాంధీకావించిన ప్రకటనలనుకొన్నింటిని అమెరికాలో చాలామంది అపార్థంచేసుకున్నారని, నేను అర్థంచేసుకోగలను. బహుశా, గాంధీజీ మొన్నమొన్న చేసినప్రకటనలు, ఈ అపార్థాన్ని పోగొట్టడానికి తోడ్పడివుంటాయనుకుంటాను. ఒకవిషయంమాత్రం స్పష్టం : జపాను

దాడిని అరికట్టడానికి, భారతదేశీయదురాక్రమణను నిరోధించడానికి, తన శక్తికొలదీ కృషిచేయాలని, తనకు చేతనైనంతవరకూ పాటుపడాలని శ్రీ గాంధీ అనుకొంటున్నారు. భారతదేశప్రజలను ఉత్తేజితులనుకావించాలని ఆయన సంకల్పించుకొన్నారు. భారతీయులు జపానువారికి లొంగిపోవడం ఆయ నెంతమాత్రం సహించజాలరు. ఆయనపై ఖరి యిలావుండగా, భారతదేశంలో బ్రిటిష్ప్రభుత్వం అనుసరిస్తున్నవిధానం దానికి విరుద్ధమైనఫలితాలను కలిగిస్తోంది. అందువల్ల ప్రజలలో అలసత్వం ఏర్పడులోంది. ప్రస్తుతపరిస్థితులకు మారుగా, ఏదో ఒక మార్పు, అది ఎంత చెడ్డదైనాసరే, రావాలని ప్రజలు వాంఛిస్తున్నారు. ప్రజలలో ఏర్పడిన యిట్టిధోరణి హానికరమైనది; అత్యంత ప్రమాదకరమైనది. ఈ ధోరణిపై ధ్వజమెత్తి పోరాడాలని శ్రీ గాంధీ తలపోస్తున్నారు.

జపానువారు మలయా బర్మాలను ఆక్రమించుకొన్నతరవాత ఆ సంఘటన చూసిన భారతదేశప్రజలలో ఒకభావం దాగా వ్యాప్తిచెందింది. జపానువారు భారతదేశంపై ముఖ్యంగా బెంగాల్‌పై దండెత్తివస్తే, భారతదేశంలోవున్న బ్రిటిషుప్రభుత్వం వారివాడిని ఎదుర్కోలేదనీ, దాని కట్టి శక్తిసామతలు లేవని ప్రజలు నమ్ముతున్నారు. ఒకవేళ జపాన్‌వారు దండెత్తివచ్చినట్లయితే, ఏ యే స్థానాలను ఏవిధంగా ఖాళీచేయాలో, ఉన్నతోద్యోగులు తమ తాబేదార్లకు పనులనుఅప్పగించి ఏ పద్ధతి ప్రకారం నిష్క్రమించవలసివుంటుందో స్పష్టంగా వివరంగా సూచిస్తూ బెంగాల్‌లోని అధికారులకు ప్రభుత్వం రహస్యమైన తాఖీదులను పంపించింది. శత్రువులఆదేశానుసారం దైనందినకార్యక్రమాన్ని నిర్వహించి కార్యాలయాల్లో చిన్నచిన్న ఉద్యోగులు మసులుకోవలసివుంటుందని, ప్రభుత్వం తెలియచేసింది. చిన్నఉద్యోగులు యిలా పనిచేసుకుపోవడం అంతర్జాతీయన్యాయసూత్రానికి అనుగుణమైనదేకదా. ఇలాంటి సూచనలు ప్రతిఘటనోద్యమానికి ఉపకరించవు. ఇవి ఓటమితత్వానికి చెందినట్టివి. రెండునెలలక్రితం మద్రాసుప్రభుత్వం నంచరించినపద్ధతి ఎంతో వింతగావుంది. జపానువారు బహుశా దండెత్తిరాగలరనేభీతితో (తర్వాత యిది ఒట్టి పుకారని తేలిపోయింది) అధికారులు పలాయనం చిత్తగించారు.

ముందు ఖాళీచేసి, తరవాతదశలో జపానువారిని తీవ్రంగాప్రతిఘ టించాలని భావించినప్పటికీ, బెంగాలురాష్ట్రం కనుక వారిచేతికిచిక్కితే, తత్ఫలితాలు భారతదేశమంతటా దారుణంగావుండకతప్పదు. గ్రామసీమ లలో సైనికులస్థావరాలను నెలకొల్పడంమాట అటుంచి, పౌరపరిపాలన క్రమక్రమంగా కుంటువడిపోతుంది. ఇందువల్ల సైనికపరిస్థితులు తారు మారై, బలం సన్నగిల్లిపోతుంది. ఇది తప్పదు.

అమెరికావిమానాలు, తదితర సహాయకసాధనాలు పరిస్థితులను ఎంతవరకు మెరుగుపరిచాయో నాకు తెలియదు. కాని, పరిస్థితి రెండు మాసాలక్రితం ఎలాగవున్నదో, ఇప్పుడూ యించుమించు అలాగే వుంది వుండాలి; భారతీయుడెవడూ ఈ పరిస్థితిరాబోతుందని ఊహించజాలడు. అంటే దేశంలోగల ప్రధానప్రదేశాలను జపానువారు ఆక్రమించుకోవడం, తదితరప్రాంతాలలో తత్ఫలితంగా, అరాచకం వ్యాప్తిచెందడం అని దా నర్థం. అయినప్పటికీ, ఈ పరిస్థితిని నివారించగలమని మేం భావిస్తు న్నాం. కేవలం సైనికదృష్ట్యా ఆలోచిస్తే మేము అద్యతనభావిలో చేయ గలిగింది అట్టేవుండదు. సైనికచర్యలన్నీ భారతదేశంలోగల మిత్ర దేశాలసైనికదళాలే నిర్వహించుకోవలసివుంటుంది. అయితే, భారతదేశ స్వాతంత్ర్యాన్నిగుర్తించి, జాతీయప్రభుత్వాన్ని నెలకొల్పినపుడుమాత్రం, అది, భారతదేశవాతావరణాన్ని విద్యుద్దీకరిస్తుంది; ప్రపంచంలో అందు వల్ల ఎంతో మార్పు కనిపిస్తుంది. దరదృష్టవశాత్తు, ఒకవేళ జపానువారు భారతదేశంలో కొన్ని ప్రాంతాలను ఆక్రమించుకోగలిగినప్పటికీ, అంత మాత్రాన మిగిలినప్రాంతాలు వారిచేతికి చిక్కవు. చైనాప్రజలవలె, ఇతరప్రాంతాలప్రజలు ప్రతిఘటిస్తూనే వుంటారు. అసంతృప్తి నిర్లిప్తంగా వున్నప్పటికీ, క్రమక్రమంగా చైతన్యవంతమైన ప్రతిఘటనకు దారి తీస్తుంది.

కనుక, మిత్రదేశాలసైనికులతోసహకరించి భారతదేశాన్ని కాపాడ డానికీ, చైనాకు తోడ్పడడానికీ, భారతదేశానికి స్వాతంత్ర్య మీయడం అత్యవసరం. ఇది ఎంతో ముఖ్యమైనప్రయోజనాన్ని సాధిస్తుంది. ఈ

నాటీసమస్యను ఈ విషయాన్నిమాత్రమే దృష్టిలోవుంచుకొని ఆలోచించ వలసివుంటుంది.

మాలో కొంతమందిమి, ఎంతో కొంతబాధ్యతను స్వీకరించి, కేవలం వ్యక్తులుగా వ్యవహరించినంతమాత్రాన, అది చాలదు. అలాగ చేయవలసినదేకాని అందువల్ల అంతగా ఫలితం కనబడదు. ఈ బాధ్యతను మావలె, తాముకూడా స్వీకరించాలని ఇతరులకు మేం నచ్చచెప్పాలి. సవ్యమైనమార్గంలో ప్రజలభావాలువుండేటట్లుగా మేం మలచగలగాలి. ఈ పనిచేయడానికి నేను అన్నివిధాలా ప్రయత్నిస్తూనేవున్నాను. ఎట్టిపరిస్థితులలోనూ, భారతదేశం ఎట్టిదురాక్రమణకు తలయొగ్గడం నేను సహించను. దురాక్రమణను చైతన్యవంతంగా నిరంతరం ప్రతిఘటించాలని నేను కోరుతాను. అయితే ఈ ప్రతిఘటన బలోపేతమైనదిగావుండాలంటే భారతదేశంలోవున్న బ్రిటిషుప్రభుత్వం, తొలగిపోయి, దానిస్థానే జాతీయ స్వతంత్రప్రభుత్వం నెలకొనితీరాలి. ఈ జాతీయప్రభుత్వం, దేశరక్షణ ఏర్పాటులతోగాని, సైనికచర్యలతోగాని ప్రమేయంపెట్టుకోదు.

జనరలిస్మోకు శ్రీ గాంధీ వ్రాసినలేఖ జూన్21వతేదీ హరిజన పత్రికలో అచ్చుకాబోతున్నదని, లోగడ మీకు వ్రాసినలేఖలో నేను తెలియచేశాను. ఆ లేఖ అచ్చుఅవుతున్నఆఖరుక్షణంలో, జనరలిస్మో వద్దనుంచి మాకొక కబురువచ్చింది. ఆ లేఖను ఇప్పుడుకాక మరొకసారి ఎప్పుడైనా పత్రికలో ప్రచురించవచ్చునని ఆయన తెలియచేశారు. లేఖ పత్రికలో అచ్చయిందికాని, పత్రికలను మేము బయటకు విడుదల చేయలేదు. పదివేలపత్రికలను యిందువల్ల ధ్వంసంచేయవలసివచ్చింది,

మీ విశ్వాసపాత్రుడు,
జవహర్‌లాల్ నెహ్రూ

శ్రీ లామ్‌ప్టన్ బెరీ,
అమెరికాఅధ్యక్షుని వ్యక్తిగత ప్రతినిధికార్యాలయం,
న్యూఢిల్లీ

## 347. యస్. హెచ్. పెన్‌వద్దనుంచి

న్యూఢిల్లీ,
జూన్ 25, 1942

ప్రియమైన పండిట్ నెహూౄ,

మీరు జూన్ 23వతేదీన వ్రాసినజాబు నా కిప్పుడే అందింది. దానికి జవాబువ్రాస్తూ శ్రీ రఘునాథ్‌శరణ్ ఎలాగూ లక్నోవస్తున్నారు కనుక, ఆయనకిచ్చి మీకు పంపిస్తున్నాను.

నే నిదివరకు డాక్టర్ మీనన్‌ద్వారా మీకు పంపించినలేఖలో పేర్కొన్నట్లుగా, మీరు మళ్ళీ ఢిల్లీ ఎప్పుడు వస్తారా అని ఎదురుచూస్తున్నాను. మీరు ఢిల్లీవస్తే అనేక ప్రస్తుతసమస్యలపట్ల మీ అభిప్రాయాలు తెలుసుకొనే మహద్భాగ్యం నాకు కలుగుతుంది. ఇప్పుడు ఢిల్లీలో జరుగనున్న సమావేశాలకు మీరు హాజరుకాకపోతే, అవి ఎంతో వెలితిగా వుంటాయికనుక, మిమ్మల్ని ఢిల్లీకి ఆహ్వానించడానికి నా కెంతో ఉత్సాహంగావుంది; ఇంకొకచోట ఇవి జరుగబోతున్నట్లయితే, మిమ్మల్ని ఢిల్లీకి నే నాహ్వానించివుండను. అలా ఆహ్వానించడం మర్యాదకరమూ కాదు; అర్థవంతమైనదీకాదు; నేను వ్రాస్తున్న వ్యక్తిగతమైనలేఖలమీద నేను స్వయంగా సంతకంచేయడంలేదని మీరు, శ్రీమతి నెహూౄద్వారా నాకు తెలియచేశారు. ఇందువల్ల కలిగినఅపార్థాలను నే నికముందు వ్రాసేఉత్తరాలమీద స్వయంగా దస్కత్తుచేస్తూ, పోగొడతాను. ఇది మీ అంగీకారాన్నిపొందగలదని విశ్వసిస్తున్నాను.

జనరల్‌ఎస్మోకు గాంధీజీ వ్రాసినఉత్తరాన్ని హరిజన్‌పత్రికలో మొదటఅచ్చువేసి, తరువాత ఆ పత్రికను విడుదలచేయకుండా ఆపడంలో మీకు కలిగిన ఇబ్బందులకు, అందువల్ల పత్రిక ఆలస్యంగా వెలువడవలసివచ్చినందుకు నే నెంతో విచారిస్తున్నాను. నామటుకునేను నా బాధ్యతను వెనువెంటనే నెరవేర్చాను. గాంధీజీ ఉత్తరంలోనివిషయాలను టెలిగ్రాఫ్‌ద్వారా జనరల్‌ఎస్మోకు ఏమాత్రం జాగుచేయకుండా ట్రాన్స్మిట్ చేశాను; ఆ లేఖను ప్రచురించవద్దన్న తన కోరికను జనరల్‌ఎస్మో పైతం ఎట్టి ఆలస్యంలేకుండా వెంటనే తెలియచేశారు. ఏమైనప్పటికి

ఆ ఉత్తరాన్ని ప్రకటించకుండా నిలిపివుంచినందుకు జనరలిస్మో కోరికను మన్నించి అందుకనుగుణమైనచర్యను వెంటనే తీసుకున్న మీ కార్యాలయంవారికి నా ధన్యవాదాలు. ఈ విషయంలో మీరుకావించిన సహాయానికి జనరలిస్మోకూడా మీకు ధన్యవాదాలర్పించగలరని చెబుతున్నాను.

వార్ధాలో జరుగబోతున్న కాంగ్రెసువర్కింగ్కమిటీసమావేశంలో మిమ్మల్ని అదృష్టదేవతవరించాలని నేను కోరుతున్నాను. ఈ సమావేశం చేయగల మహత్తరనిర్ణయాలపట్ల నా ఆనందాన్ని వ్యక్తంచేస్తూ నేను వ్రాస్తున్న ఈ వాక్యాలకు మీరు అభ్యంతరపెట్టరని తలుస్తాను.

మీ విశ్వాసపాత్రుడు,

యస్. హెచ్. షెన్

పండిత జవహర్‌లాల్ నెహ్రూ,

లక్నో

348. మడాం జంగ్ కై-షేక్ నద్దనుంచి

ఈ ఉత్తరం మీ అంతరంగికసమాచారార్థం ఉద్దేశింపబడింది.

ఉత్తరంసంఖ్య 8.

జనరలిస్మోకార్యాలయం, చైనా,

చుంకింగ్, స్జెచువాన్,

జూన్ 26, 1942

ప్రియమైన శ్రీ నెహ్రూ,

మీ 9వ నెంబరుగల ఉత్తరం, ఖుద్దున 10వనంబరుఉత్తరం నాకు అందాయి. ఇంతకాలంబె కాస్తముందుగా, మీకు జవాబు వ్రాయలేకపోయినందుకు నేను చాలావిచారిస్తున్నాను. చేయవలసినపనులు చూస్తే చాలా వున్నాయి. తక్షణమే పరిష్కరించవలసినసమస్యలు నన్ను ఊపిరిసలపనివ్వలేదు; అంతేకాక, ఇవన్నీ, నా ఒంట్లో బొత్తిగా బాగులేనప్పుడే,

దాపరించాయి. జనరలిస్మోతోపాటు నేనూ ఛంగ్టూ వెళ్ళాను. ఇప్పుడే ఛుంకింగ్‌కు తిరిగివచ్చాను. సమస్యలు యిలాగవున్నా, నా ఒంట్లో బాగా లేకపోయినా, మీరూ, భారతదేశమూ నా స్మృతిపథంలో నిరంతరం వుంటూనేవున్నారు.

గాంధీజీ, తనకు వ్రాసినఉత్తరం, అందగానే, జనరలిస్మో అమెరికా, చైనాదేశాలు నిర్దిష్టమైన కార్యాచరణకు పూనుకోవాలని, వాషింగ్టన్‌కు టెలిగ్రాఫ్‌చేశారు. ఇప్పుడాయన, గాంధీజీ వ్రాసిన ఉత్తరానికి సమాధానం వ్రాస్తున్నారు; కాని ఈలోపున, అంటే, తాను వాషింగ్టన్‌తో జరుపుతున్న రాయబారాలఫలితాలు స్పష్టంగాతేలేవరకు, భారతదేశంలో ఏదీ జరగకూడదని మీకు తెలియచేయమని నన్ను కోరారు. అంటే దానిఅర్థం యిది: జనరలిస్మోవద్దనుంచి స్పష్టమైనవార్త మీకు అందేవరకు, గాంధీగాని, లేదా కాంగ్రెసుకాని, ఉద్యమాన్నిప్రారంభించడం మంచిదికాదు.

అయితే జనరలిస్మో, ప్రస్తుతం మీ కెట్టివార్తను పంపించలేరు. కాని, స్పష్టమైనసమాచారంఅందీఅందగానే, దానిని, మీకు తెలియచేస్తారు. ఒకసారి కనుక ఉద్యమం ప్రారంభమయితే, దుష్ఫలితాలు లేకుండా, దానిని ఆపడం ఎవరితరంకాదు. భారతదేశంతరపున తానెంత చేయగలరో, అంతా జనరలిస్మో చేస్తున్నారు. చైనానుంచి వాషింగ్టన్‌కూ వాషింగ్టన్‌నుంచి చైనాకు టెలిగ్రాములు శరపరంపరగా చేరుతున్నాయి. చర్చిల్ వాషింగ్టన్‌లోవుండడం, మన కొక అవకాశంగా వినియోగించుకోవచ్చును.

భారతదేశానికి ఎంతమేలుచేయగలమో, అంతా, నేనూ, జనరలిస్మో చేయగలమని, మీరు విశ్వసించవచ్చును. రాయబారాలు ఫలప్రదమయేసూచన కనిపించినట్లయితే, మేం ఎలాంటిజాగుచేయకుండా, అన్ని విధాల ప్రయత్నిస్తాం.

హృదయపూర్వకాభివందనాలతో,

మీ విశ్వాసపాత్రులు,

మెయిలింగ్ షూంగ్ చియాంగ్

పి. యస్. గాంధీజీ తనపై ఖరిని మార్చుకొని ఇంతమేరకు ఆ విధంగా వ్రాయడానికి మీ రెంత కష్టపడి మీ ప్రభావాన్ని ఆయనమీద నెరపారో, నాకు తెలుసును; కలకత్తాలో ఇదివరకు మేం ఆయన్ని కలుసుకున్నప్పుడు ఆయనవైఖరి యీవిధంగాలేదు. జపాన్ కనుక దురాక్రమణకు దిగినట్లయితే తాను సహాయనిరాకరణను, అహింసను అవలంబించగలనని అప్పు డన్నారు. కాని ఇప్పుడు జపానును భారతదేశం ప్రతిఘటించడానికి ఆయన అంగీకరించారు. ఇది నిజంగా చెప్పుకోతగ్గవిషయం. ఇది ఒక ముందడుగు.

అమెరికాకు నేను ఎప్పుడు వెళ్ళగలుగుతానో, ఇప్పటికీ నాకు తేలలేదు. ఇక్కడ నేను లేకపోతే ఏపనీ జరగదు. అదీకాక, నాకు మళ్ళా గాస్ట్రిక్‌నొప్పివచ్చింది. అందువల్ల అక్కడ ఎండవేడికి తట్టుకోగలనని నే ననుకోను. ఇంతకీ, ఆకురాలుకాలంవచ్చేసరికిల్లా విమానమార్గం బంద్ అయిపోతుందేమో ఎవరుచెప్పగలరు? టోబ్రుక్‌వలె ఈజిప్టుకూడా శత్రువులచేతికి చిక్కినట్లయితే ఇది తప్పక సంభవిస్తుంది. అలాంటప్పుడు నేను రష్యామీదుగా వెళ్ళవలసివుంటుందనుకుంటాను. కాని నేను భారతదేశంమీదుగా వెడితే బాగుంటుందనుకొంటాను. అలాఅయితే మిమ్మల్నొకసారి చూడవచ్చును. ఇలాగ నేను కోరడం సహజమని మీకుమాత్రం తెలియదూ!

అభివందనాలతో,

తొందరగా,
యమ్. యస్. పి.

344. యస. హెచ్. షెన్‌వద్దనుంచి

న్యూఢిల్లీ,
జూలై 8, 1942

ప్రియమైన పండిట్ నెహ్రూ,

జనరలిస్మోవద్దనుంచి ఈ దిగువపేర్కొన్నవిధంగా వాషింగ్టన్ నుంచి నా కొక టెలిగ్రామ్ (చైనాభాషలో) చేరింది.

"ప్రస్తుతం సెలవుమీద లండన్లోవుంటున్న లార్డ్ హాలిఫాక్స్ తాను అమెరికానుంచి బయలుదేరివెళ్ళేముందు వాషింగ్టన్‌లోవున్న మా ప్రతినిధి కొక విషయాన్ని తెలియచేశాడని నీవు పండిట్ నెహ్రూ ద్వారా గాంధీకి తెలియచేయి. లార్డ్ హాలిఫాక్స్ తాను భారతదేశసమస్యా పరిష్కారానికై తన ప్రభుత్వానికి కొన్ని నిర్దిష్టమైనసూచనలు అంద చేయగలనని, పరిణామాలను ఎప్పటికప్పుడు మనప్రతినిధికి తెలియచేస్తూ వుంటానని చెప్పాడు. లిబియాలోనిపరిస్థితిని ప్రస్తుతం అమెరికా నిల ద్రొక్కుకున్నదికనుక దానిదృష్ట్యా నా కొక అభిప్రాయమేర్పడింది. భారతదేశంలో తొందరపడి కాంగ్రెసు ఎట్టిచర్యకు పూనుకోరాదని, మిత్ర దేశాల నమష్టిప్రయోజనార్థమై ఉపలక్షింపబడిన సైనికస్థావరాలకు ప్రమాదంకలిగించేచర్యలకు కాంగ్రెస్ దూరంగావుండాలని నేను అభి ప్రాయపడుతున్నాను. ఇలాగచేయడంవల్ల భారతదేశంపట్ల మిత్రదేశాల వారికిగల సానుభూతి హెచ్చుతుంది. భారతసమస్యాపరిష్కారాని కిది దోహదపడుతుంది—జంగ్ కై షేక్"

1940లో మహాత్మా గాంధీని కలుసుకునే మహద్భాగ్యం నాకు కలి గింది. ఆయన కీ సమాచారాన్ని అందచేయడంతోపాటు నా గౌరవ నమస్కృతులను వారికి తెలియచేయవలసిందిగా మిమ్మల్ని అభ్యర్థిస్తు న్నాను.

మీ ప్రస్తుతసమావేశం జయప్రదంకావాలని మనసారా వాంఛి స్తున్నానని తెలియచేయడానికి ఈ అవకాశాన్ని నేను వినియోగించు కొంటున్నాను.

మీ విశ్వాసపాత్రుడు,
యస్. హెచ్. షెన్

పండిత జవహర్లాల్ నెహ్రూ,
వార్ధా.

350. లాంప్టన్ బెర్రీనుంచి

అమెరికా అధ్యక్షుని వ్యక్తిగత ప్రతినిధి
కార్యాలయం,
న్యూఢిల్లీ,
ఆగష్టు4, 1942

ప్రియమైన పండిట్ నెహ్రూ,

కలొనెల్ జాన్సన్ వ్రాసినఉత్తరం విమానంలో, నా కిప్పుడే చేరింది; అది సురక్షితమైనహస్తాలద్వారా నా కందింది. అమెరికన్‌పత్రికలవ్యాఖ్యానాలు, ఇక్కడిపత్రికలలో అచ్చుఅయినాయి. దానినిగురించి మీకు నేను తెలియచేసినసందేశం మీరు అందివుంటుందని భావిస్తున్నాను. ఇక్కడ వెలువడిన అమెరికన్‌పత్రికలవ్యాఖ్యానాలు, అమెరికాలోని పత్రికలభావాలను చక్కగా అభివ్యక్తంచేస్తున్నవని, వాటికి ప్రాతినిధ్యం వహిస్తున్నవని, నేను మీకు గట్టిగా చెప్పగలిగేస్థితిలోవున్నాను,

ఆఖరిక్షణంలో ఏదో ఒక పరిణామం రావచ్చునని, అది, మీరు ఉద్యమాన్ని ప్రారంభించకుండా నిలువరించగలదనీ ఆశిస్తున్నాను; అలాంటిఉద్యమం అనవసరమని మీయూ వాంఛిస్తారని నా నమ్మకం.

మీ విశ్వాసపాత్రమైన,
లాంప్టన్ బెర్రీ

పండిట్ జవహర్లాల్ నెహ్రూ,
బొంబాయి.

పి. యస్. ఈ ఉత్తరాన్ని మీ కందజేస్తున్నవ్యక్తికి, యిందులో వున్నవిషయాలు తెలియవు.

351. క్లేర్ బూత్ లూస్‌వద్దనుంచి

[ఇది మొట్టమొదట శ్రీ వెండల్ విల్కీకి అందచేయబడింది. అప్పుడు నేను అహమ్మద్‌నగరుకోటజైలులో వున్నాను. ఈ ఉత్తరం ఈ దిగువ పేర్కొనబడిన "నోట్"తోపాటు, అటుపిమ్మట నాకు పంపబడింది.

"నవంబరు 2, 1942; శ్రీ విల్కీ, అమెరికానుంచి బయలుదేరే టపుడు, ఆయన కీ ఉత్తరాన్ని శ్రీమతి లూస్ యిచ్చింది: అంచువల్ల, ఇది ఇప్పటికే ప్రపంచమంతా, విల్కీతోపాటు పర్యటించింది. శ్రీ కు సౌజన్యంవల్ల మీ కీ ఉత్తరం ఆయనద్వారా, యిప్పుడు పంపబడు తున్నది."

గ్రీన్‌విచ్,
కనెక్టికట్,
ఆగస్టు 25, 1942

ప్రియమైన జవహర్‌లాల్ నెహ్రూ,

అద్భుతమైన సంధానకర్త శ్రీ వెండల్ విల్కీకి ఈ ఉత్తరాన్ని మీ కందచేయమని యిచ్చాను; ఆయన దీన్ని మీ చేతిలోవుంచినట్లయితే, దానర్థం మనం యుద్ధంలో జయించినట్లే; ఇదొక శుభసూచన. భారతదేశంలో శ్రీ వెండల్ విల్కీ, ఈ ఉత్తరాన్ని మీ చేతుల్లోవుంచడం మాకూ, మీకూ, మిత్రమండలి విదేశాలవారికీ అత్యంత ప్రధానవిషయం; యుద్ధాశయాలకుగల సత్యం ఎటువంటిదో, అన్వేషణ నిజంగా ఏనాడో ఆరంభమయింది. శ్రీ విల్కీ, ఒక మైనారిటీపార్టీ రాజకీయాశయాలకు కాక, అత్యధికసంఖ్యాక అమెరికన్‌ప్రజలమనోభావాలకు ఆశయ ఆదర్శాలకు ప్రాతినిధ్యంవహిస్తున్నాడు.

అమెరికా ఈ యుద్ధంలో ఎందుకు పోరాడుతున్నదో, దాని లక్ష్యాలేమిటో, ఆశయాలేమిటో, భారతదేశంలోవున్నప్రజలకు సరిగ్గా సమాచారంఅందడంలేదని నేను విన్నాను. అదేవిధంగా, భారతసమస్యకుగల వాస్తవికతనుగురించి మా కిక్కడ తెలియరావడంలేదు. ప్రపంచంలో అయిదవవంతుజనసంఖ్యగల భారతదేశానికి, మా దేశానికి మధ్య సెన్సార్ అనే విషాదకరమైన అతిఎత్తైన ఒక గోడ నిర్మించబడివుంది. అందుచేత ఇరుదేశాలవారూ తమతమభావాలను ఒకరికొకరు సరిగ్గా తెలియచేసుకోలేకపోతున్నారు. కనుక, పరస్పర అననుకూల్యత, అపార్థాలు, తెలియనితనం నెలకొనడం సహజం. శ్రీ వెండల్ విల్కీ భారతదేశాగమనం, ఈ అడ్డుగోడను మొట్టమొదటిసారిగా బ్రద్దలుకొట్టగలదు.

యింతవరకూ అనకట్టవేయబడి నిరోధింపబడిన సత్యమనే ప్రవాహం ఆయనఆగమనంవల్ల, కెరటాలుగా ముందుకు చొచ్చుకువస్తుంది. అయితే, ఆయన అక్కడ మీతో ముఖాముఖీ ఏకాంతంగా సంభాషించడానికి వీలు చిక్కనపుడు, ఆయన భారతదేశానికిరావడంవల్ల కొన్నిభ్రమలు జనించక తప్పదు. మీరు ప్రజాస్వామ్యానికి, ఆసియాపట్ల అమెరికాకుగల ఆశయాలకు, గాఢమిత్రులన్నవిషయం మాలో చాలామందికి తెలుసును. కాని, వెండిల్ విల్కీ గాఢమైన నిజమైన స్నేహితుడని ఎంతమంది భారతీయులకు తెలుసును? మీ సమావేశం తప్పక జయప్రదమౌతుంది. ఎవరో కొందరు విరక్తులు నిరాశావాదులు ఇది జయప్రదంకాదని సందేహిస్తారు; నాకు మాత్రం అలాంటి సందేహం లేనేలేదు.

శ్రీ వెండల్ విల్కీ, ఇక ఇప్పుడే తన సుమహాప్రపర్యటనార్థం విమానంఎక్కబోతున్నాడు. ఇది మీకు చేరడానికి, కొన్నినెలలుపట్టినా పడుతుంది; మీరు కులాసాగావున్నారని, మీరు హాయిగావున్నవేళ యిది మీకు చేరుతుందని నే నాశిస్తున్నాను.

ఈ ఉత్తరం, నేను మాటలలోవ్యక్తంచేసినభావాలకంటె మిన్న అయినభావాలను వ్యక్తంచేస్తుందన్నభావంతో, ఆశతో, నే నేమీ చెప్పదలుచుకోలేదు; నా భావాలను మాటల్లో వ్యక్తంచేయగలుగుతాననుకోవడం నిరర్థకం; అవివేకం.

ప్రతిచోటా, నదభిప్రాయాలుగల స్త్రీపురుషు లనేకులున్నట్లు మీకు తెలుసుకదా; అమెరికాలో, భారతదేశంలో, బ్రిటన్‌లోసైతం వారు కలిసికట్టుగా కృషిచేసి యుద్ధంలో జయాన్నిపొందేమార్గాలను అన్వేషిస్తున్నారు. జయాన్నేకాదు; శాంతినికూడా సాధించడానికి అనేకమార్గాలను వెదకుతున్నారు.

ఈ ఉత్తరం మీమీద ఎంతో ప్రీతితో,
అతి తొందరలో వ్రాశాను.

విశ్వాసపాత్రమైన,
క్లేర్ బూత్ లూస్.

352. అసఫ్ అలీవద్దనుంచి

[భారతజాతీయకాంగ్రెసుకార్యవర్గసభ్యులు 1942 ఆగస్టు9న అరెస్టు చేయబడి, 1945 మార్చి28వరకు అహమ్మద్‌నగర్‌ఫోర్టుజైలులో వుంచబడ్డారు. అటుతర్వాత అధికారులు వారందరినీ క్రమంగా వారివారి రాష్ట్రాలలోనిజైళ్ళకు బదిలీచేశారు. నరేంద్రదేవ్‌నీ నన్నూ మార్చి28న అహ్మద్‌నగర్‌జైలునుంచి మార్చి, అటుతర్వాత వరుసగా యు. పి. లోని అనేక జైళ్ళలోబంధించారు. మిగతావారు తరువాత ఏప్రిల్‌లో అహ్మద్‌నగర్‌జైలునుంచి మార్చబడ్డారు. అసఫ్ అలీని పంజాబులోనిజైలుకు మార్చారు. అక్కడ నుంచే ఆయన ఈ లేఖను వ్రాశారు. అహ్మద్‌నగర్‌ఫోర్టుజైలునుంచి నన్ను బదిలీచేయడంగురించి ఆయన ఈ లేఖలో ప్రస్తావించారు]

సబ్‌జైలు,
గురుదాస్‌పూర్ (పంజాబు)
ఏప్రియల్ 30, 1945

ప్రియమైన జవహర్,

మీరు వెళ్ళిపోవడం నాకు, మౌలానాకు పెద్ద గొడ్డలిపెట్టువంటిది. మరుసటిరోజుఉదయందాకా మేము దానిని గుర్తించనేలేదు. మౌలానాను నేను వదిలిపెట్టి, వెళ్ళిపోతుంటే ఆయన ఎంతో దిగులుచెందినట్టు కన్పించారు.

మీకు తెలియజేయవలసినసమాచారం బోలెడువుంది. కట్టలు త్రెంచుకొనిప్రవహించే నదీవరదలాగా అది పెల్లుబుకుతోంది. ఇదిగో సమాచారాన్ని స్వీకరించండి.

1) మీరు సీసాలో భద్రపర్చిన 'లియానా'ను దాని సీటిబ్రేళ్ళతోను, సుకుమారమైన ఆకులతోనహా తోటమాలి పీరాజీకి కానుకగా యిచ్చివచ్చాను. ఆఖరిక్షణంవరకు అతను నన్ను ఎంతో బాగా చూశాడు. మర్చంటు నావద్ద సెలవుతీసుకోటానికి వచ్చినప్పుడు గులాబీమొక్క-

లన్నింటినీ అతని కప్పగించి, నా బాధ్యతను అక్కడితో వదిలించు కొన్నాను. మర్చంటుతోటలో ఆ గులాబీమొక్కలను నాచే బాధ్యతను సాంటక్ తీసుకొన్నాడు. ఎంతప్రయత్నించినా కాఫీక్లబ్బును పునరుద్దరించు దామని మాటల్లోనే అనుకొని పూరుకొన్నాం. మేము కొద్దిమందిమి మాత్రమే వున్నాం. ఏకొత్తసంప్రదాయంనెలకొల్పుదామనుకొన్నాఅందుకు కావలసిన మనస్థిమితం కరువైపోయింది. అయితే నేను మామూలుగా పూలతోటవెంటతిరగడం మానలేదు. బాట్మింటన్కోర్టు పచ్చికబయలుగా మారింది. అయితే వాలీబాల్ టీములుమాత్రం కడకంటా జోరుగా, మహా ఉత్సాహంగా ఆడుతూవచ్చాయి. అన్నట్టు సంచదారను మస్తుగా ఎక్కిం చాను. పదిహేనురోజులకోటాను ఒక్కసారే ఎక్కించాను. నా వీలు నామాలో ఈవిషయం తప్పక పేర్కొనాలి. సంచదారను ధారాళంగా పంచిపెట్టాలని నా వీలునామాను అమలుజరిపేబాధ్యత అంతా మౌలానాకు మాత్రమే సంక్రమిస్తుంది. ఔనౌను, ఆ చిన్న, చిన్నారిపిల్లి నా దగ్గరకు పరుగెత్తుకొచ్చింది. (నిజమైన లాబేలువలె చప్పుడుచేయకుండా) రెండు సొసర్లపాలు దానికి కేటాయిద్దామనుకొన్నాం. వెంటనే గుర్తుకొచ్చింది. ఆ రేషన్ను నికరంగా పాటించలేకపోతేనో? (పాటించడం అసాధ్య మన్నవిషయం సుస్పష్టం) అంతకన్నా ప్రమాదత్వం మరొకటివుంటుందా? నా ఉత్సాహాన్ని చంపేసుకొన్నాను. మిగతావన్నీ యథామాదిరి వున్నాయి. కాగాపోగా "వీడిపోయిన ఆత్మలు" కొరత కన్పించింది. నేనూ వచ్చే శాను.

2) ఇచ్చటకు వస్తూంటే దారిలో ఎన్నెన్నో చిత్రాలు జరిగాయి. నే నూహించినవాటికన్నా మిన్నగా శారీరకబాధ క్రమంగా హెచ్చింది. ఆరోగ్యం క్రమంగా తగ్గిపోయింది. ఢిల్లీ చేరేసరికి, నిద్ర సరిగాలేనం దునా, జాగ్రత్తగా సమపాళ్ళలో రూపొందించుకున్న నా నిత్యకార్యక్ర మం తలక్రిందులైనందునా, నా శారీరకస్థితి, మనస్థితి సంక్షోభశిఖరాన్నందు కొంది. కళ్ళుతెరిచిచూసేసరికి నేను జైలుకటకటాలమధ్య బంధించబడి వున్నాను. ఇది నా మనోఫలకంపై చెరగని ముద్రవేసింది.

3) పత్రికలు మామూలుగా తప్పులే ప్రకటిస్తున్నాయి. 'కొందరు

బంధువులు' నన్ను చూడడానికి వచ్చినపుడు 'అశ్రుధారపూరితమౌనాన్ని' ప్రదర్శించాననటం చాలావరకు అతిశయోక్తి. అది ఉత్ప్రేక్షాలంకారమే మోననుకొంటాను. భూలాభాయ్‌కి యిచ్చిన "రాజకీయేతరసందేశానికి" మధ్యనే సంధికొట్టిందనటం కేవలం ఊసుపోని ఊహాగానం. కాగా,'హృద్రోగంఅనిఅనుమానించబడుతున్నదన్నవార్త' ఊహాగానమే; ఇదీ గురితప్పింది. అయితే పత్రికలవిషయంలో మనం చేయగల్గిందేమిటి? ఈ వార్తలను అధికారరీత్యా ఖండించడానికి నేను కనీసం వారం పది రోజులైనా ఆగక తప్పదు. అయితే జగన్నాధరధచక్రాలవలెనే, పత్రికా రధచక్రాలుకూడా నిరవధికంగా దొర్లుకుపోతూంటాయి.

4) (పేరాగ్రాఫులకు నంబర్లువేస్తున్నందుకు మరి కోపగించకండి. పాత 'సెక్రెటరీ' అలవాటు ఇది. లేక న్యాయశాస్త్రసంబంధమైన విజ్ఞప్తులపద్ధతి ఇది.) ఎట్టకేలకు 4, 5 పౌనుల బరువు తగ్గినతర్వాత ఇక్కడకు చేరాను. నికరంగా 100, 101 పౌనుల బరువుతేలాను. తల బద్దలైపోయే తలనొప్పి, కడుపులో తిరుగుబాట్లసంగతి చెప్పనేఅక్కర్లేదు. చివరకు 'కందకంకోసం వేట' ప్రారంభించాను. గంటగంటకు ఏదో ఒక మార్పుచేసుకొంటూ, కొత్తవాతావరణానికితగినవిధంగా వ్యక్తిగతఅవసరాలను కత్తిరించుకుంటూ, స్థిరపడ్డాను. ఇక్కడ కొత్తనియమాలు, నిబంధనలు పాటిస్తున్నాను. పాటించక ఏమిచేస్తాను? మళ్ళీ యధాస్థితిలోపడడానికి మరొక పదిహేనురోజులు పట్టింది. అప్పటికికాని యంత్రం పనిచేసేస్థితిలోపడలేదు.

5. ఇప్పుడిప్పుడే నా మనస్సు "కోలుకొంటున్నది" మనస్సుకు సంబంధించిన కార్యకలాపాలన్నింటినీ కట్టిపెట్టేశాను. చేతిలోనిపని పూర్తికావడం నిజంగా నా అదృష్టం. ఏమాత్రం ఎగుడుదిగుడు వచ్చినా, మనస్సులోని ఉత్సాహమంతా యిట్టే యింకిపోతుంది. ఇది మీకు తెలియనిదికాదు. సరదాకోసం మరొకపని ప్రారంభించాను. సంతృప్తికరంగా సాగుతోంది. షుమారు 100 పద్యాలు పూర్తయ్యాయి. ఇంతలోకే ఈ మార్పు వచ్చిపడింది. నే నేం చేస్తాను? ఆ పని ఇక్కడ ఎందుచేతనో గాని సాగటంలేదు. అందుచేత ఆ పథకానికి స్వస్తిచెప్పాను. అసం

పూర్తిగా మిగిలిన ఇతరపనిని దేనినైనా పూర్తిచేసేందుకు నేను ప్రయత్నించవచ్చు. అయినా బుద్ధిపుట్టినప్పుడుగదా. ఈలోగా నన్ను బాట్లకార్యక్రమం కొనసాగుతోంది.

8. ఇది పర్వతశ్రేణిసొంతం: రోరిక్ ఇల్లు బహుశా ఇక్కడకు కనుపించే మంచుదిగువభాగంలో వుండి వుండాలి, అని నేను ఊహిస్తున్నానుసుమా! అది పఠాన్‌కోటకు సమీపంలోనే వుంది. హిమాలయపర్వతశ్రేణిలో కొంతభాగం ఇక్కడకు కన్పిస్తోంది. అదంతా మంచుకప్పబడి వుంది. ఇక్కడున్నా, గుల్మార్గ్‌లో వున్నట్టేవుంది. అయితే వాతావరణం మారింది. కొన్నిసంవత్సరాలలో భరించలేనంత ఉక్కపుట్టుకొస్తోంది. తొందరలోనే నాకు పంకా సప్లయిచేయవచ్చు. నేనిప్పుడు ఆసుపత్రిలోని ఒకభాగంలో వున్నాను. నిజానికి నాకోసం స్టోర్ రూమ్‌ను ఖాళీచేయించి వుంచారు. మొత్తంమీద ఘనవాలేదు. ఇది చాలా చిన్నజైలు. అహ్మద్ నగర్‌లోని యెల్లిట్ కోషర్ అంత వుంటుంది. అంతకన్నా కాస్త పెద్దదనే చెప్పాలి. అయితే ఈ జైలుకు ఇనుపపటకటాలు, కంచెలు, తాళాలు ఆదిగాగలవన్నీ వున్నాయి. అన్నం జైలుఅంటే ఇదే. నా గదిలో రోగులబట్టలు దాచుకొనేందుకు ఒక చెక్కలబీరువా వుంది. అన్ని అవసరాలకు దానినే మప్పితంగా వాడుకుంటున్నాను. దోమలకుకూడా అది ఆశ్రయమిస్తున్నదనుకోండి. ఇది కొత్తమాట్ప. ఇలాంటివే మీకూ వుంటివుంటాయి. కావాలంటే పందెంవేస్తాను. బహుశా ఈగలవిషయంలో మాత్రం నేనే నెగ్గవచ్చు. కాగా, అనేకరకాలనల్లులుకూడా ఇక్కడ పుష్కలంగావున్నాయి. మేము (అంటే మా జైలు) స్వయంగా మామిడిపళ్ళు, జమాన్లు, మల్బరీలు పంపిస్తున్నాం. కావలసినవన్నీ పూలున్నాయి. నాలుగువారాలఎడబాటు అయితే మాత్రమే, ఇదంతా హాయిగా లేదూ?

మీకు, నరేంద్రదేవ్‌కు నా ప్రేమానురాగాలు.

మీ అనురాగపాత్రుడు,

అనఫ్.

తాజాకలం: దయచేసి మన పుస్తకాలకాంట్రాక్టునుగురించి మరచిపోకండి. ఢిల్లీనుంచి పత్రికలనుతెప్పించేఏర్పాట్లు చేస్తున్నాను. ఇక్కడ

అంతా గందరగోళంగానేవుంది. కుదటపడిందనుకోకండి. రూజ్వెల్టు సంగతి విచారకరం. శాన్‌ఫ్రాన్సిస్కోలోవున్న సరూప్‌ఆరోగ్యం గురించి తెలుసుకొంటున్నాను. స్థానికపత్రికలు వట్టిచెత్తగావుంటున్నాయి. ఆమెకు జాబు రాశాను.

358. తేజ్ బహద్దూర్ సప్రూవద్దనుంచి

ముస్సోరి,
జూన్ 15, 1945

నా ప్రియమైన జవహర్‌లాల్జీ,

ఒకటిరెందురోజుల్లో, మీరు అలహాబాద్‌లో వుంటారని నేను ధైర్యంచేసి చెప్పగలను. మీకు స్వేచ్ఛనొసంగబడినట్లుగా, పైప్రాయి నిన్నరాత్రి రేడియోలో ప్రసంగించినట్లు, అది విన్న నా మిత్రుడొకడు నాకు తెలియచేశాడు. ఆ వర్తమానాన్ని పురస్కరించుకొని, మీరు ఒకటి రెండురోజుల్లో అల్లాబాద్‌లో వుంటారని నేను చెప్పగలుగుతున్నాను. మీరు స్వేచ్ఛను తిరిగిపొందాలనివాంఛిస్తూ అందుకు స్వాగతమిస్తున్నాను. మీరు కావించనున్ననిర్ణయం భారతదేశానికి ఎంతో ప్రయోజనకారికాగల దని ఆశిస్తున్నాను.

మీకు ఒంట్లో నయంగావుందని మీ శరీరఉష్ణోగ్రత మామూలుగా వుంటున్నదని ఆశిస్తున్నాను; పత్రికలలో, అలాగే వార్తపడింది మరి. ప్రశాంతమైన ఏదో ఒకప్రదేశంలో మీరు కాస్తవిశ్రాంతితీసుకోవడం చాలా అవసరం; కాని వచ్చే నాలుగయిదువారాలపాటు మీకు శ్రమ అధికంగావుంటుందని, నా భయం.

ఆనంద్‌ను చూడడానికి, నేను జూన్ 13వతేదీన ఇక్కడకు వచ్చాను. ఆనంద్ ఇప్పుడు నెమ్మదినెమ్మదిగా నడవగలుగుతున్నాడు. ఇక్కడ నేను 25వతేదీవరకు వుంటాను. ఆవేళ, అలహాబాద్ బయలుదేరగలను.

హృదయపూర్వకాభివందనాలతో,

ప్రేమగల మీ,
తేజ్ బహద్దూర్ సప్రూ

పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ,
అల్లాబాద్

364. యం. యస్. సాహా

యూనివర్సిటీ ఆఫ్ సైన్సు,
డిపార్టుమెంట్ ఆఫ్ ఫిజిక్స్
కలకత్తా,
ఆగష్టు 12, 1945

నా ప్రియమైన పండిట్‌జీ,

మీరు జూలై 28వతేదీన శ్రీనగర్‌నుంచి వ్రాసినఉత్తరానికి ఎంతో సంతోషం. మీ కింకా కావలసినంత విశ్రాంతి లభించలేదని పత్రికా వార్తలవల్ల తెలిసింది. అయినప్పటికీ, ఆరోగ్యప్రదమైన కాశ్మీరు వాతావరణం, కొన్నివారాలలో మీ ఆరోగ్యాన్ని మీరు తిరిగి పూర్తిగా కోలుకొనేటట్లు చేస్తుందని ఆశిస్తున్నాను.

మీరు అలహాబాద్ ఎప్పుడువస్తారో, నాకు వ్యవధివుండగా తెలిస్తే నేను ప్రయాణసౌకర్యాన్ని సాధించగలిగితే, మిమ్మల్ని అక్కడ ఎప్పుడు వడితేఅప్పుడు కలుసుకోగలను; కాని ఈరోజులలో ప్రయాణసౌకర్యం లభించడం కష్టం. కాని రెండురోజులు వ్యవధివుంటే, నే నది బహుశా సాధించగలననుకుంటున్నాను. నేను మిమ్మల్ని స్వయంగా కలుసుకుని, నా అమెరికా, బ్రిటను, సోవియట్‌రష్యాల పర్యటనానుభవాలను మీకు తెలియజేయడానికి ఆతృతపడుతున్నట్లు వేరే చెప్పనక్కరలేదనుకొంటాను.

కమలాఉపన్యాసాలసందర్భంలో, మిమ్మల్ని మౌలానా అజాద్‌ను ఉపన్యసించవలసినదిగా కోరడానికి, కలకత్తా విశ్వవిద్యాలయంవారు నిర్ణయించుకొన్నారు; మౌలానా ఆంగ్ల భాషలో ఉపన్యసించలేరని ముస్లిం లీగర్లు అభ్యంతరపెట్టారు. ఆగస్టునెలలో ఉపన్యసించడానికి, మీకు తీరిక చిక్కినట్లయితే, మేం సంతోషిస్తాం. ఏవిషయంమీద ఉపన్యసిస్తారో, అది మీ యిష్టం. అయితే శీర్షిక నింకా మీరు ఎంచుకోకపోయినట్లయితే, మీరు "జాతీయనిర్మాణపథకం" అనే విషయాన్నిగురించి ఉపన్యసించవలసినదిగా మీకు నేను సూచిస్తున్నాను.

కాంగ్రెసు, తాను అధికారంలోకివచ్చినట్లయితే, ఎట్టి నిర్మాణ కార్యక్రమాన్ని పథకాన్ని తలపెట్టనున్నదో తెలియచేయడానికి అదను వచ్చిందని నా నమ్మకం. ప్రస్తుతం, దాని కార్యక్రమం పాతప్రపంచపు ఆదర్శాలకు ఎంతగానో ముడివడివుంది; రాట్నంత్రిప్పడం, ఇంట నూలువడకడం, మధ్యయుగాలలోమాదిరి పనిని విభజించుకోవడంపైననే, దానిదృష్టి లగ్నమైవుంది. విజ్ఞానశాస్త్రంసాధించిన సాధనాలను, శక్తిగల వనరులను, రసాయనిక పరికరాలను, ఇంధనాలను అనేకవిధాలుగా ఉపయుక్తపడగల నీటినీ, భూమినీ పూర్తిగా వినియోగించుకోవాలని, కొత్త పద్ధతులపై సమాజాన్ని పునర్నిర్మించాలని, ఇది "భారతదేశప్రజానీకానికి చక్కటి జీవితాన్ని ప్రసాదించగలదని" మనం దేశానికి కొత్తకొత్త నినాదాల నీయాలి. "నేచర్" "హిందూస్థాన్‌స్టాండర్డ్" పత్రికలలో అచ్చుపడిన నా వ్యాసాలను రెండింటిని, మీకు దీనితోపాటు పంపిస్తున్నాను; అవి నా అభిప్రాయాలను తెలియచేయగలవు.

ప్రేమాభివందనాలతో,

మీ విశ్వాసపాత్రమైన
యం. యన్. సాహా

పండిట్ జవహర్లాల్ నెహ్రూ,
అల్లాహాబాద్.

355. యస్. హెచ్. షెన్‌వద్దనుంచి

చైనా రిపబ్లిక్ కమీషనర్ కార్యాలయం,
న్యూఢిల్లీ,
ఆగస్టు 15, 1945

ప్రియమైన పండిట్ నెహ్రూ,

యూనాన్ ఎగ్జామినేషన్ అధ్యక్షులైన హిజ్ ఎక్స్‌లెన్సీ డాక్టర్ టాయ్—చిన్—టావో 1940వ సంవత్సరంలో సౌహార్దప్రతినిధిసంఘాధ్యక్షుడుగా భారతదేశాన్ని సందర్శించడం బహుశా మీకు జ్ఞాపకముంది

వుంటుంది. ఆ సంఘంలో నే నొక సభ్యునిగావుండే అవకాశం నాకు కలిగింది. క్రిందటిఏడాది మీరు చైనాకు కావించిన పిలుపును పురస్కరించుకుని ఈనాడు మేం భారతదేశానికి వచ్చాం; కాని దురదృష్టవశాత్తూ మేం మిమ్మల్ని కలుసుకొనలేకపోయాం.

ఇది డాక్టర్ టాయ్‌కి ఎంతో ఆశాభంగం కలిగించింది. తన ఆశాభంగాన్ని వ్యక్తపరుస్తూ ఆయన ఒక గీతాన్ని రచించారు. దాన్ని మీకు ట్రాన్స్‌మిట్ చేయవలసిందిగా శ్రీమతి పండిట్‌కు అందచేశారు. ఆవిడ మమ్మల్నెంతో ఆప్యాయంగా అల్లాహాబాద్‌లో సత్కరించి, ఆతిథ్యమిచ్చారు.

ఈమధ్య జరిగిన పరిస్థితులదృష్ట్యా మీకు విజయం లభించాలని కోరుతూ, మీకూ, మౌలానా అజాద్‌కూ తన శుభాకాంక్షలనంపజేయమని డాక్టర్ టాయ్ స న్నాదేశించారు. ఆయన కూర్చిన గీతాన్ని ఆయనే తన అంచమైన పేరెన్నికగన్న దస్తూరితో నాకు పంపించారు.

ఆ గీతాన్ని ఆంగ్లభాషలోనికి అనువదించడానికి ప్రయత్నించాను. అయితే ఏ భాషలో రచించినగీతమైనా ముఖ్యంగా చైనాభాషలో నుంచి అది అనువదింపబడుతున్నపుడు మూలంలోని సొగసును పోగొట్టుకుంటుందన్నవిషయం మీకు తెలియనిదికాదు.

శుభాకాంక్షలతో,

మీ విశ్వాసపాత్రుమైన,

పండిట్ జవహర్‌లాల్ నెహ్రూకూ, యస్. హెచ్. షెన్

పండిట్ జవహర్‌లాల్ నెహూకు

నిన్ను తలచుకొంటూ నే నెంతో బాధపడుతూ
నిన్ను వెదుక్కుంటూ సుదూరంనుంచి వచ్చాను వచ్చాను
వెదకి వెదకి నీకోసం వేసారిపోయాను
ఎవరు బుద్ధునివలె హృదయంలో, వీరునివలె
మేధతో, అహరహం కృషిచేసి ఆత్మత్యాగం
చేస్తారో వారే ఉదాత్తులు మహోదాత్తులు.

—టాయ్—చిన్—టావో.

356. గోవింద వల్లభ్ పంత్ వద్దనుంచి

నైనిటాల్,

ఆగష్టు 15, 1945

నా ప్రియమైన జవహర్‌లాల్‌జీ,

నా జవాబుతోపాటు, గంగన్‌విహారీ వ్రాసిన ఉత్తరాన్నికూడా, ఇందుతోపాటు మీకు పంపిస్తున్నాను. ఆ ప్రతిపాదనలను నేను అంగీకరించలేదు కనుక, మీ కింతకంటె ముందుగా ఉత్తరం వ్రాయలేక పోయాను. ఏమైనప్పటికీ మీ రా ప్రతిపాదనలను పరిశీలిస్తున్నట్లు పత్రికావార్తలవల్ల నేను తెలుసుకున్నాను. ఆ విషయం మీ పరిశీలనలో వున్నట్లు "సివిల్ అండ్ మిలిటరీ గెజెట్" పత్రికావిలేఖరి స్పష్టంగా ఒక ప్రకటన కావించాడు. కనక, గంగన్‌విహారీ కావించిన సూచన మీకు ఇందుతోపాటు అందచేస్తున్నాను. ఈవిషయంలో నా అభిప్రాయాలేమిటో, మీకు తిరిగి నేను చెప్పనక్కరలేదు. గంగన్‌విహారికి నేను వ్రాసినజాబులో నా అభిప్రాయాలు తెలియచేశాను; ఆ లేఖను టైపు చేయించి మీకు దీనితోపాటు జతపరచి పంపుతున్నాను. ఇంగ్లండులో వున్న లేబర్‌పార్టీని చూసి నేను ప్రత్యేకంగా, మురిసిపోవడంలేదు. లేబర్‌పార్టీ అధికారంలోకవచ్చిందని కొంతమంది మిత్రులు దానిని పొగడుతున్నారు కాని, వారు ప్రదర్శిస్తున్న హర్షాతిరేకాలలో నేను భాగస్వామిని కాలేను. ఆ పార్టీ నాయకులు మన కేదో ఒరగబెడతారని నేను ఆశించడంలేదు; అయితే, ప్రస్తుతపరిస్థితులలో, అట్లీసైతం యింకా అలాగే కిమ్మనాస్తిగా ప్రశాంతంగా కూర్చుంటాడని నే ననుకోను. త్వరలోనే ఏదో ఒక రోజున, లాస్కీ లేదా లేబరుపార్టీనాయకుల్లో ఎవరో ఒకరు మిమ్మల్ని రమ్మని ఆహ్వానించవచ్చును. క్రిప్స్‌వైఖరి ఏమిటో నాకు సరిగ్గా స్పష్టంగా తెలియడంలేదు. సిమ్లాసమావేశానంతరం, ఆయన చేసిన ప్రకటన సందేహాస్పదంగానూవుంది; వ్యాకులపరచేదిగానూవుంది. 1942లో తాను కావించిన దురదృష్టకరప్రతిపాదనలకుసంబంధించిన సంప్రదింపులలోను, మిగిలిన కార్యాచరణలోనూ, ఆయనప్రవర్తన ఆయనగౌరవప్రతిష్ఠలను హెచ్చించలేదు. మీకూ, జిన్నాకూ మధ్య సమ

తూకంఉండేటట్లుగా చూడాలని పాపం! ఆయిన అనవసరమైన శ్రద్ధతీసుకొన్నారు; అతిజాగ్రత్తతోకూడుకొనివున్న ఆయనవైఖరికి అర్థంపర్థం లేదు. జిన్నాతో యిచ్చకాలాడి, ఆయన్ని సంతోషపెట్టాలనుకొనే క్రిప్సు ధోరణి, క్రిప్సుకు సహజంగా పుట్టినటువంటిదో, ఇందులో చర్చిల్ అమెరీ, లిన్‌లిత్‌గోలపాత్ర ఎంతమటుకు ఉన్నదో చెప్పడం కష్టం. దాన్నిగురించి ఈ నా దెవరూ బాధపడనక్కరలేదు. ఆయనప్రస్తుతవైఖరి ఎలావున్నప్పటికీ, ప్రస్తుతపరిస్థితులలో, భారతదేశానికిసంబంధించినవ్యవహారాలలో, ఆయన ప్రముఖపాత్రమాత్రం నిర్వహించగలడు, అందుకు సందేహంలేదు; కామన్సుసభలో లేబరుపార్టీకి అధికసంఖ్యాక బలమున్న వన్నవిషయాన్ని దృష్టిలోవుంచుకొని, ఇటువంటి అసంబద్ధఊహలతో— అదెంత నిర్మాణయుతమైనపార్టీఅయినా, క్రిప్సు వాటికి అధీనుడై కొట్టుకుపోకుండావుంటాడనిమాత్రం నే నాశిస్తున్నాను. ఎంత చెప్పినా, నా సందేహాలు నాకు వుండనేవున్నాయి. ఆయనస్వభావం నియమరహితమైనది కాకపోయినా, బహుశా ఆయన నిగూఢమైనమనిషి.

మీరు త్వరలోనే ఇక్కడకువస్తారు, అంటే అప్పటికి మీరు కాశ్మీరులో నెలరోజులున్నట్లు లెక్క. ప్రశాంతమైన పరిసరాలు, ఆరోగ్యదాయకమైనవాతావరణం, చక్కటి విశ్రాంతి, మీ కెంతో మేలుచేకూర్చిందని నమ్ముతాను. అహమ్మదాబాద్‌లో మనం కలసివున్నపుడు, మీ ఆరోగ్యం పూర్తిగా చెబ్బతింది., మీ ఆరోగ్యాన్నిగురించి నే నపుడు పడినబాధ యిప్పటికీ నన్ను కలవరపెడుతూనేవుంది. మీకు ఏమాత్రం సేవచేయలేకపోతినిగదా అని, నా నిస్సహాయస్థితిని, అసమర్థతను నేను సహజంగా నిందించుకొంటూ, బాధపడుతున్నాను. మీరు మళ్ళీ యథాప్రకారం మీ ఆరోగ్యాన్ని పుంజుకొన్నారని, శక్తిని కూడగట్టుకోగలిగారని ఆశిస్తున్నాను.

నే నీవేళ ఆల్మోరా వెడుతున్నాను. అక్కడ పదిహేనురోజులపాటు వుందామనుకుంటున్నాను.

ప్రేమతో మీ
జి. బి. పంత్

357. పి. షిన్ హాన్ఫ్

చైనా రిపబ్లిక్ కమిషనర్ కార్యాలయం,

రిఫరెన్సు నంబరు 5666. న్యూ ఢిల్లీ,

ఆగస్టు 22, 1945

ప్రియమైన పండిట్ నెహ్రూ,

కమిషనర్ ప్రస్తుతానికి చుంకింగ్‌లోవున్నందున, జనరలిస్మో పంపిన ఈక్రింది తంతిని మీకు అందజేయటానికి సంతోషిస్తున్నాను.

"జపాను లొంగిపోయినసందర్భంలో మీరుపంపిన శుభాకాంక్షలకు నా ధన్యవాదాలు. ఈ విజయోత్సవంనాడు చైనాప్రజలు ఐ.రా.స.యొక్క ఉన్నతాశయాలను సాధించటానికి ప్రయత్నిస్తామని తిరిగి ప్రతినపూనుతున్నారు. ముందున్న శాంతి కర్తవ్యాలనిర్వహణలో వారు శక్తివంచన లేకుండా పాటుపడతారు. భవిష్యత్తులో చైనా, భారతదేశాల మధ్య స్నేహం మరింతగా పరిఢవిల్లగలదన్న సంపూర్ణ విశ్వాసం నాకున్నది. కొత్త ప్రపంచవ్యవస్థను రూపొందించడంలో మన ఉభయదేశాలప్రజలు ప్రశంసనీయమైన కృషిచేయగలరని నమ్ముతున్నాను.

చాంగ్ కై షేక్"

దయచేసి దీనిని గమనించండి.

భవదీయుడు,

పి షిన్ హాన్ఫ్ (?)

పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ

358. అరుణా అసఫాలీవద్దనుంచి

నవంబరు 9, 1945

ప్రియమైన జవహర్‌లాల్జీ,

మీరు దయతో నన్నుగురించి చెప్పిన విషయాలకు నేను మీకు ధన్యవాదాలర్పించాలని అనుకోలేదు. ఎందుకంటే, వ్యక్తిగతంగా నన్ను

మీరు ప్రశంసించలేరు. మీరు ప్రశంసించింది తిరుగుబాటునే. మీరు చెప్పే పద్ధతి అది. ఆ తిరుగుబాటులో మీ పాత్ర ఏమిటో అందరికీ సరిగా తెలియదు.

మీరు క్రితంసారి బొంబాయివచ్చినప్పుడు నన్ను కలుసుకొంటారని ఆశించాను. మీరు చాలా హడావిడిలోవున్నందువల్ల, నా అంతట నేను మీదగ్గరకు రావడానికి ప్రయత్నించలేదు.

రేపు మన పత్రికలు సాఫీగా సాగడానికి వీలుగా నేనొక పద్ధతి కనిపెట్టాను. దయచేసి ఇందులో జతపర్చిపంపుతున్న లేఖలు చదవండి— నా రాజకీయాలనుగురించి తెలుసుకోవడానికి అది మీకు ఉపకరించవచ్చును.

అనురాగంతో,
అగుగా.

౪౬౧. మహాత్మా గాంధీనుండి
[మూలం హిందీలో]

పూనా
నవంబరు 13, 1945

ప్రియమైన జవహర్‌లాల్,

నిన్నటి మన సంభాషణలు నాకు సంతోషం కల్గించాయి. మనం ఇంకా ఎక్కువసేపు మాట్లాడుకోవడానికి వీలులేకపోయింది. అందుకు విచారిస్తున్నాను. ఒకేసారి అన్నిటిని తేల్చడం సాధ్యంకాదని భావించాను. మనం అనేకసార్లు కలసికూర్చుని చర్చించడం అవసరమనుకొన్నాను. పరుగెత్తడానికి నా శారీరక పరిస్థితి అనువుగావుంటే, నీవు ఎక్కడున్నప్పటికీ, నీ దగ్గరకు ఎగిరివచ్చి వాలేవాడిని. నీతో రెండురోజులపాటు వుండి, మనస్సువిప్పుకొని ముచ్చటించుకొన్నతర్వాత తిరిగివచ్చేవాడిని. ఇంతకుముందు ఇలాగే చేశాను. మనిద్దరం పరస్పరం బాగా అర్థంచేసుకోవలసినఅవసరం వుంది. అలాగే ఇతరులుకూడా మన ఇద్దరి అభిప్రాయాలు ఏమిటో స్పష్టంగా తెలుసుకోగల్గాలి. ఇప్పటిలాగే మనిద్దరి మన

స్సులు కలిసివున్నంతకాలం, చర్చలలో ఏకాభిప్రాయంఎప్పుడకపోయినా, మనకు ఏకీభావం కుదరదనే అని అనుకొన్నా ఫరవాలేదు. నిన్నటి సంభాషణలనుబట్టి, మన ఇద్దరి దృక్పథాలలోను నాకు ఆట్టే తేడా కన్పించలేదు. ఇది వాస్తవమో కాదో తేల్చుకోటానికి నిన్న చర్చలను నేను ఎలా అర్థంచేసుకొన్నానో ఇక్కడ ఉదాహరిస్తాను. ఒకవేళ ఎక్కడన్నా తప్పువుంటే సరిదిద్దు.

(1) మానవునియొక్క మేధాశక్తిని, ఆర్థిక, రాజకీయ, నైతిక ప్రమాణాలను సాధ్యమైనంత ఉన్నతస్థాయికి కొనిపోవడమే అసలు సమస్య అని నీవు అన్నావు. దానితో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను.

(2) ఇందుకు అందరికీ సరిసమానమైన హక్కులు, అవకాశాలు వుండాలి.

(3) ఇతరమాటల్లో చెప్పాలంటే, ఆహారపానీయాదులప్రమాణం దుస్తులు, తదితర జీవనస్థితిగతులవిషయంలో పట్టణవాసులకు, గ్రామీణ ప్రజలకు మధ్య సరిసమానత్వం వుండాలి. ఈ సరిసమానత్వం సాధించే నిమిత్తం ప్రజలు తమకు కావలసిన జీవితావసరవస్తువులను, బట్టలు, ఆహారపదార్థాలు, ఇళ్ళు, దీపాలు, నీరు మున్నగువాటిని తామే తయారు చేసుకోవాలి.

(4) మానవుడు ఏకాకిగా జీవించడానికి పుట్టలేదు. మానవుడు ప్రధానంగా సామాజిక జంతువు. స్వతంత్రజీవి; పరస్పర పరాధీనప్రాణి. ఎవరూ ఎవరినెత్తినా ఎక్కి పెత్తనంచేయకూడదు. అలాంటి జీవితం రూపొందించే పరిస్థితులను సృష్టించాలనుకొంటే, అందుకు గ్రామాన్ని సమాజంలో యూనిట్‌గా తీసుకోకతప్పదు. ఆ యూనిట్‌ను గ్రామం అని పిలవండి. లేదా చిన్న సమూహం అని పిలవండి. ఏ పేరుపెట్టి పిలిచినా, ఆ యూనిట్ (ప్రధాన జీవితావసరవస్తువులవిషయంలో)స్వయం సమృద్ధిని సాధించగలుగుతుంది. పరస్పర సహకారం, పరస్పర సహాయంతో ఆ యూనిట్ అవిచ్ఛిన్నంగా నిలుస్తుంది.

ఇంతవరకు రాసిన విషయాలనుబట్టి, నేను నిన్ను సరిగా అర్థం

నేను స్పష్టపడినా? అయినట్లయితే తరువాతలేఖలో సమస్యకుసంబంధం ఉన్న ఇతర అంశాన్ని పరిశీలిస్తాను.

నిన్న నేను రాసిన మొదటిలేఖను రాజకుమారిచేత అనువాదం చేయించాను. అది ఇంకా నాదగ్గరే పడివున్నది. ఆ లేఖ ఇంగ్లీషుఅనువాదాన్ని దీనిలో జతపర్చి పంపుతున్నాను. నా భావాలు నీకు పూర్తిగా, స్పష్టంగా అర్థంకావడానికి ఇంగ్లీషుఅనువాదం ఉపయోగించవచ్చును. పైగా, నిన్ను నేను సరిగా అర్థంచేసుకొన్నదీ లేనిదీ స్పష్టంగా తేల్చుకోడానికి వీలుఅవుతుంది.

ఇందుకు నా దీవెనలు.

ప్రేమతో,
బాపూ

సర్. సర్ ఫ్రాన్సిస్ వైలీవద్దనుంచి

గవర్నర్ క్యాంప్,
యు. పి.

గవర్నరు యు. పి.

ఫిబ్రవరి 22, 1946

ప్రియమైన పండిట్ జీ,

మనం ఎన్నడూ కలుసుకోలేదు. అది నా దురదృష్టం. అయితే మనిద్దరికి ఉమ్మడిమిత్రులుమాత్రం అనేకమంది వున్నారు. మీ గ్రంథాల ద్వారా మీతో సంవత్సరాలబట్టి నేను సంబంధం ఏర్పరచుకొన్నాను. క్రితం నెలలో నేను అల్హాబాద్ వెళ్ళినసందర్భంలో, మనం కలుసుకోగలమా లేదో మిమ్మల్ని అడుగుదామనే ప్రధానంగా అనుకొన్నాను. చిల్లరమల్లర విషయాలు అనుకోకుండా వచ్చిపడుతున్న పార్లమెంటరీ ప్రతినిధివర్గంతోసహా...నాకు అంతరాయం కల్గించాయి. ఈలోగా అగథా హారిసన్ వచ్చి నన్ను కలుసుకొంది. మిమ్మల్ని సాధ్యమైనంత త్వరలో కలుసుకోమని ఆమె నాకు సూచించింది. పాపం, ఆమాటచెప్పటానికే ఆమె యింతదూరం, లక్నోదాకా స్వయంగా వచ్చింది. ఈవిషయంలో నాకు నచ్చచెప్పవలసిన అగత్యంలేదు. అయితే యిక్కడ వత్తిడిపనుల

మూలంగా మిమ్ములను కలుసుకోవాలన్న అభిలాష కొంత వెనుకకు పోయింది. అగనా వెళ్ళిపోయింది. ఏదో ఒకటి వెంటనే చేయాలను కొన్నాను. అల్లాహాబాద్‌లోని వెంకటాచారిగారితో ఫోనుమీద మాట్లాడాను. ఆయన ఇంట్లో నన్ను కలుసుకునేందుకు మీకు అవకాశం వుందో లేదో తెలుసుకోమని కోరాను. కొన్నిగంటలతర్వాత పూర్తిగా ఆశాభంగం కలించే కబురు అల్లాహాబాద్‌నుంచి అందింది. మీరు అల్లాహాబాదునుంచి వెళ్ళిపోయారనీ, 28వ తేదీదాకా తిరిగిరారనీ. తిరిగివచ్చినతర్వాత వెంటనే మరొక సారి ఎన్నికల పర్యటనకు బయలుదేరతారనీ తెలిసింది.

వీలైతే మనం కలుసుకోవడం మంచిదని నేను ఇప్పుడు గట్టిగా అభిప్రాయపడుతున్నాను. మనం మాట్లాడుకొంటే పరిస్థితులు చాలావరకు చక్కబడగలవని నేను చెప్పటం అంత సముచితంకాదనుకొంటాను. బహిరంగంగా వచ్చి మిమ్ములను కలుసుకోవడం నాకు యిష్టంలేదు. మీరు నాతో లక్నో రావడం సాధ్యపడకపోయినపక్షంలో, నన్ను కలుసుకోవడానికి మీకు ఎక్కడ వీలైతే అక్కడకు రావడానికి నేను సిద్ధంగా వున్నాను.

ప్రత్యేక దూతద్వారా ఈ లేఖను పంపిస్తున్నాను. ఈ జాబు తెచ్చినవ్యక్తిద్వారానే దయచేసి మీ జాబు పంపిస్తారని ఆశిస్తాను.

భవదీయుడు,
ఎఫ్. వి. వైలీ

## 361. మహాత్మా గాంధీవద్దనుంచి

[ గాంధీజీ నాకు రాసిన ఒక లేఖకు ఇది ఆంగ్లానువాదం. మూలం హిందీలో వుంది. ఢిల్లీలో ఏర్పడిన మతవైషమ్యంపట్ల తమ విచారాన్ని వ్యక్తంచేయడంకోసం గాంధీజీ నిరసనవ్రతం పూని, కొన్ని రోజులపాటు కొనసాగించిన పిమ్మట, ఆ దీక్షను విరమించారు. దీక్ష విరమించినరోజునే ఆయన ఈ లేఖ వ్రాశారు.

ఢిల్లీలో ఘటనలు, అలాగే గాంధీజీ నిరాహారదీక్ష నాకెంతో ఆందోళన కల్గించాయి. ఒకటి రెండు రోజులపాటు నేను భోజనంచేయ

లేదు. ఇది నిరశనవ్రతంవంటిది కాదు. ఏవేవో గొడవలు సంభవించి నప్పుడు, దానినంతటి చేసేవాని ఇది. ఈ సంగతి ఎవరికీ తెలియదు. కాని గాంధీజీ ఎలాగో ఈవిషయం తెలుసుకొన్నారు. నిరాహారదీక్ష విరమించమని అందు కీ సలహాయిచ్చారు.

"భారతదేశానికి మణి" అన్న పదానికి విశిష్టార్థం ఏమీలేదు. గమ్మత్తుకు ఉపయోగించిన మాట అది. నా పేరు జహ్వార్; జహ్వార్ అంటే మణి అని అర్థం.

ఆయన నాకు వ్రాసిన ఆఖరిఉత్తరం ఇదే. పన్నెండురోజుల తర్వాత, 1948 జనవరి 30వ తేదీన, ఒక హంతకుని చేతిలో ఆయన చని పోయారు.]

జనవరి 18, 1948

ప్రియమైన జవహర్‌లాల్,

నీవు నిరశనవ్రతం విరమించు.

పాకిస్తాన్‌పంజాబు స్పీకరువద్దనుంచి నాకు వచ్చిన తంతి ప్రతిని ఇందుతో జతపర్చి పంపుతున్నాను. సరిగ్గా నీకు నేను చెప్పినట్టుగానే సయ్యద్ హారున్ (?) చెప్పాడు.

నీవు దీర్ఘాయువు కలుగుగాక. భారతదేశానికి మణిగా వెలుగొందుతూ వుండు.

దీవెనలతో,

బాపూ

పశ్చిమ పంజాబు శాసనసభ స్పీకరునుంచి వచ్చిన టెలిగ్రామ్

నిస్వార్థభావంతో మహోన్నతలక్ష్యసాధనకై, మీరుసాగిస్తున్ననిరాహారదీక్షనుగురించి జనవరి 18వ తేదీనశాసనసభలోపలువురుచేసిన ప్రసంగాలలోని అంశాలను మీకు తెలియజేయడానికి నా కెంతో సంతోషంగా వుంది. ఈ ప్రసంగాలలో వ్యక్తమైనభావాలతో నేనూ, శాసనసభవారూ ఏకీభవిస్తున్నాం.

మాలిక్ మహ్మద్ ఫిరోజ్‌ఖాన్ నూన్ "మతప్రవక్తలను మినహాయిస్తే, ఇంతటి మహాపురుషుణ్ణి, మహాత్మాగాంధీకి మించిన మహనీయుణ్ణి ప్రపంచంలో మరేదేశం సృష్టించలేము."

గౌరవనీయులైన మియాన్ మహ్మద్ ముంతాజ్‌ఖాన్ దౌల్తానా (ఆర్థిక మంత్రి) "ముస్లిములపట్ల మహాత్మాగాంధీ నిరాహారదీక్ష వ్యక్తం చేస్తున్న సద్భావాన్ని అర్థంచేసుకోడం మన విద్యుక్తధర్మం. హిందూ ముస్లిం ఐక్యతకోసం ఆత్మార్పణచేయడానికి సిద్ధంగావున్న కనీసం ఒక్కడైనా భారతదేశంలోవున్నాడని దీనినిబట్టి స్పష్టమవుతున్నది. ఆయన నిరాహారదీక్ష ఇంకా కొనసాగించవలసిన అవసరం తప్పిపోవాలని సర్వేశుండైన దేవుడిని ప్రార్థిద్దాం. అల్పసంఖ్యాకులహక్కుల రక్షణవిషయంలో మహాత్మాగాంధీఅభిప్రాయాలతో మనం పూర్తిగా ఏకీభవిస్తున్నామని శాసనసభప్రాంగణంనుంచి ఆయనకు నేను హామీయిస్తున్నాను."

గౌరవనీయులైన ఖాన్ ఇఫ్తికార్ హుస్సేన్‌ఖాను, ప్రధానమంత్రి "ఉదాత్తమైన ఆశయంకోసం కృషిచేస్తున్న మహాత్మాగాంధీ చేస్తున్న ఆందోళనలో మనం పాలుపంచుకొంటున్నాం. మహాత్మాగాంధీ సాగిస్తున్న కృషికి నా తరఫున, నా సహచరులతరఫున ప్రగాఢమైన ప్రశంసను, హృదయపూర్వకమైన అభినందనలను అందజేస్తున్నాను. అమూల్యమైన ఆయన జీవితాన్ని కాపాడడానికి ఈ రాష్ట్రంలో చేయగల్గినదంతా మనం చేస్తాం"

స్పీకరు, పశ్చిమ పంజాబుశాసనసభ

362. జార్జి బెర్నార్డ్ షాకు

న్యూఢిల్లీ,
సెప్టెంబరు4, 1948

ప్రియమైన షా,

ఈ ఉత్తరం నే నెందుకు వ్రాస్తున్నానో నాకే తెలియదు. ఎందుకంటే మనిద్దరంకూడా క్షణంతీరికలేని మనుష్యులం. మీ మీద అదనపు

శ్రమ పడ్డాలన్న దృష్టి నాకు లేదు. అయితే, జూలై 16వ తేదీన మీరు దేవదాసు గాంధీకి రాసిన లేఖ ప్రతిని, ఆయన నాకు పంపించాడు. దానితో ఈ లేఖను రాయాలన్న బుద్ధి నాలో కల్గింది.

40 సంవత్సరాలకు పూర్వం — అప్పుడు నా వయస్సు 18 యేళ్ళు. కేంబ్రిడ్జి విద్యార్థిని. ఒకనాడు సభలో మీ ప్రసంగం విన్నాను. అప్పటినుంచి మళ్ళీ యింతవరకు మిమ్మల్ని చూడనేలేదు. మీకు ఉత్తరమైనా వ్రాయలేదు. అయితే, నా తరానికి చెందిన అనేకమందివలెనే, మీ రచనలు, గ్రంథాలమధ్య మేము పెరిగి పెద్దవాళ్ళమయ్యాం. మీ గ్రంథ అధ్యయనం నన్ను కొంతవరకు మూసపోసింది. దాని అంశం నాలో ఇప్పటికీ కొంత వుందనుకొంటాను. ఇది మీకు గర్వకారణం అవునో కాదో నాకు తెలియదు.

మీరు ఒకవిధంగా నాకు సన్నిహితులు; ఇంకా వివరంగా చెప్పాలంటే, మీరు నా ఆలోచనలకు చాలా సన్నిహితులు. మీతో సన్నిహిత సంబంధా లేర్పరచుకోవాలనీ, మిమ్మల్ని కలుసుకోవాలనీ, నేను ఎన్నో సార్లు అనుకొన్నాను. కాని అందుకు అవకాశం లభించలేదు. అందుచేత మిమ్మల్ని కలుసుకోడానికి ఉత్తమమార్గం మీ రచనలను చదవడమే నన్న నిర్ణయానికి వచ్చాను.

గాంధీజీని పొట్టబెట్టుకున్న హంతకుడ్ని ఏమిచేస్తే బాగుంటుందని దేవదాసు మిమ్మల్ని సలహా అడిగినట్టున్నాడు. బహుశా అతనికి ఉరి తప్పకపోవచ్చు. నేను నిరంతరం మరణశిక్షను రద్దుచేయాలన్న సూచనకు సుముఖంగా వున్నప్పటికీ, ఈ హంతకునికి మాత్రం మరణశిక్ష పడవలసిందే. ఈ హంతకునికి ఉరిశిక్షపడకుండా తప్పించటానికి నేను ప్రయత్నించను, కాని, మామూలుకేసులలో అయితే, మరణశిక్ష విధించటకన్నా, పదిహేను ఇరవై యేళ్ళపాటు నేరస్థుడిని జైలులోపెట్టటం మంచిదా కాదా అని ఇప్పటికీ అనుకొంటున్నాను.

జీవితం అన్నది చాలా చౌక అయిపోయింది. కొంతమంది నేరస్థులకు మరణశిక్ష విధించినా, విధించకపోయినా ఈ పరిస్థితులలో మార్పు

ఏమీ వుండదు. ఒక్కొక్కప్పుడు అనిపిస్తుంటుంది గదా, అసలు జీవించడంకన్నా భయంకరమైన శిక్ష మరొకటి వున్నదా అని.

భారతదేశంగురించి అభిప్రాయాలు తెల్పవలసిందంటూ మిమ్మల్ని మా దేశస్థులు కొందరు వేధించుకొనితింటున్నందుకు నేను మిమ్మల్ని క్షమాపణకోరుతున్నాను. ఇతరులనుంచి యోగ్యతాపత్రాలు పొందడానికి ఆతురతచెందే అలవాటునుంచి మాలో చాలామంది ఇంకా బయటపడలేదు. ఒకరకంగా దీనికి కారణం ఆత్మవిశ్వాసం కొరవడడమే కావచ్చు ఘటనలు మమ్మల్ని తలకిందులుచేస్తున్నాయి. మేము ఊహించుకొన్న ఉజ్వలభవిష్యత్తు వాస్తవంలో అంత ఉజ్వలంగా కన్పించడంలేదు.

వచ్చే అక్టోబరునెలలో నేను ఇంగ్లండు రావచ్చు; అక్కడ రెండు మూడు వారాలపాటు వుంటాను. ఆ సందర్భంలో మీ యింటికి ఒకసారి రావాలనివుంది. మీ నిత్యకార్యక్రమానికి విఘాతంకల్గకపోతేనే సుమా. ప్రశ్నలతో మిమ్మల్ని నేను విసిగించబోను. మనస్సులో సందేహాలకు లోటులేదు. వాటికి సరియైన సమాధానాలున్నట్టు కన్పించదు. ఒకవేళ వాటికి సరియైన సమాధానాలున్నా, అవి అక్కరకురావు. ఎందుకంటే, వాటిని ఆచరించవలసినది మానవులు కనుక-అవి ఆచరణలోకి రావడం కల్ల. మీతో కాసేపు కాలక్షేపంచేయడానికి అవకాశం చిక్కితే దానివల్ల నేను ఎంతో లాభిస్తాను. దానిని కలకాలం గుర్తుంచుకొంటాను.

భవదీయుడు,
జవహర్‌లాల్ నెహ్రూ

జార్జి బెర్నార్డ్ షా.
అయోత్ సెయింట్ లారెన్స్,
వెల్విన్, హెర్ట్స్, ఇంగ్లండు.

## 368. జార్జి బెర్నార్డ్ షానుండి

లండన్,
సెప్టెంబరు 18, 1918

ప్రియమైన శ్రీ నెహ్రూ,

నా రాజకీయ రచనలను మీరు చదివారని తెలుసుకొని, ఎంతో సంతోషించాను. మీరు నా యింటికి రాదలచుకున్నా, మహాభాగ్యం మరొకటి వుంటుందా? దానినిగురించి వేరే చెప్పాలా? అయినా మీరు నా యింటికి వచ్చి పొందగల్గిందేముంది? మీ అమూల్యకాలాన్ని పాడు చేసుకోవడం మినహా? నన్ను వెదుక్కుంటూ ఇంతదూరాన సూరుమైళ్ళ మున్న కుగ్రామానికి మీరు రావడమా? అయినా, బెర్నార్డ్ షాలో ఇప్పుడేమున్నది. అస్థిపంజరం మినహా? అసలు బెర్నార్డ్ షా ఏనాడో చచ్చిపోవలసింది.

నేను ఒకప్పుడు ఒకవారం బొంబాయిలోను, మరొకవారం సింహళంలోను గడిపాను. భారతదేశం గురించి స్వయంగా తెలుసుకొన్నది అంతవరకే. మానవజాతికి పసిపాపల ఉయ్యాలవలె సింహళం నా కంటికి కన్పించింది. అక్కడ కన్పించిన ప్రతిదీ ఒరిజినల్‌గానే వుంది. పోతే మిగతా జాతులన్నీ పునస్సృష్టిగా ఉత్పత్తి అయ్యాయి.

పత్రికలలో పడిన సంగతులు మినహా భారతదేశం గురించి నాకు ఇంకేమీ తెలియదు. అయినప్పటికీ నేను భారతదేశాన్ని వాస్తవదృష్టితోనే చూడగలను. ఎందుకంటే, నేను ఆంగ్లేయుణ్ణి కాను; ఐర్లండ్ దేశస్థుణ్ణి. ఇంగ్లీషుపాలననుంచి విముక్తి కావడానికి మా దేశం దీర్ఘకాలం సాగించిన పోరాటంలో నేను పెరిగి పెద్దవాణ్ణయ్యాను.

మా దేశాన్ని రెండుగా- -ఐర్, ఉత్తర ఐర్లండుగా - చీల్చారు. దీనిని పాశ్చాత్య హిందూస్థాను, పాకిస్తానుగా తీసుకోవచ్చు.

మీరు కేంబ్రిడ్జికి ఎలా విదేశీయులో, అలాగే నేనూ ఇంగ్లండుకు విదేశీయుణ్ణే.

జిన్నర్ (పాపం శమించుగాక) మరణంవల్ల మీరు ఇంగ్లండుకు రావడం వాయిదాపడుతుందేమోనని భయపడుతున్నాను. ఆయనకు సమర్థుడైన వారసుడు లభించకపోతే, మీరే మొత్తం ద్వీపకల్యాన్ని పరిపాలించవలసివుంటుంది.

భవదీయుడు,
జి. బెర్నార్డ్ షా

హిజ్ ఎక్సలెన్సీ ప్రధానమంత్రి,
న్యూఢిల్లీ, ఇండియా

364. బెర్నార్డ్ షాకు

జార్జి హోటల్,
పారిస్,
అక్టోబరు 28, 1948

ప్రియమైన షా,

మీరు సెప్టెంబరు 18న ఢిల్లీకిపంపిన లేఖ ఈవేళ పారిస్‌లో నాకు చేరింది. మీరు జాబురాసినందుకు ధన్యవాదాలు. ఆ లేఖ ఢిల్లీ చేరడానికి, మళ్ళీ అక్కడనుంచి ఇక్కడకు రావడానికి ఎందు కిన్నిరోజులు పట్టాయో తెలియకుండావుంది. అక్టోబరు 15 న ఆ లేఖ ఢిల్లీకిచేరినట్టున్నది. మీ లేఖ నాకు ఇంత ఆలస్యంగా అందడం విచారకరం.

నేను ఇంతకుముందే వ్రాసినట్లు, ఇంగ్లండుకు వచ్చినసమయంలో మిమ్మల్ని కలుసుకొనడానికి ఎంతో సంబరపడ్డాను. అయితే ఇంగ్లండులో నా కార్యక్రమాన్ని నిర్ణయించినవారు మరొకరు. ఊపిరి సలపని కార్యక్రమం నిర్ణయించారు. అందుచేత తప్పనిసరిగా చేయాలను కొన్నపనులుకూడా చేయలేకపోయాను. అయినప్పటికీ ఎలాగైనాసరే తీరికచేసుకొని, మిమ్మల్ని కలుసుకొనివుండేవాణ్ణి. కాని, నేను వ్రాసిన లేఖకు మీనుంచి సమాధానం నాకు చేరనందున నా రాకవల్ల మీకు ఏమైనా యిబ్బంది కలుగుతుందేమోనని భయపడి, మీ దగ్గరకు రాలేదు.

నేను భారతదేశానికి తిరిగిపోతున్నాను. మిమ్ములను కలుసుకొని, నా శుభాకాంక్షలు అందజేసుకొనే అవకాశాన్ని కోల్పోయినందుకు నేనెంతో విచారిస్తున్నాను. అయితే ఆ సదవకాశం కనీసం భవిష్యత్తులోనైనా నాకు లభించగలదని ఇప్పటికీ ఆశిస్తున్నాను.

భవదీయుడు,
జవహర్‌లాల్ నెహ్రూ

జార్జి బెర్నార్డ్ షా,
అయోట్ సెయింట్ లారెన్స్,
వెల్విన్ హెర్ట్స్,
ఇంగ్లండు.

365. జార్జి బెర్నార్డ్ షా నుంచి

4, వైట్‌హాల్ కోర్టు (130),
లండన్, ఎస్. డబ్ల్యు--1,
నవంబరు 12, 1948

ప్రియమైన పండిట్ నెహ్రూ,

నేను ఆశాభంగంపొందలేదు. మీరు లండన్‌లోవున్నప్పుడు చాలా హడావిడిగావుంటారన్నసంగతి నాకు తెలుసును. ఊపిరాడని కార్యక్రమంలో మునిగితేలే మీరు నన్ను చూడడానికి మారుమూలనున్న కుగ్రామానికి రావడం సాధ్యంకానివిషయం అని నేను అప్పుడే అనుకొన్నాను. అయితే, వస్తేమాత్రం మీకు మనఃపూర్వకమైన సుస్వాగతం ఇచ్చివుండేవాణ్ణనిమాత్రం తెలుసుకోండి.

మహాసభలలో మీరు నిర్వహించినపాత్ర గొప్ప విజయం సాధించింది. మీ రేడియోప్రసంగం మిగతా ప్రసంగాలకన్నా భిన్నంగావుంది. ఆసియాలో స్టాలిన్‌తో సరితూగగలవారు మీరేనని మీ ప్రసంగాలు రుజువు చేస్తున్నాయి. వెంటనే యుద్ధంరాగల ప్రమాదం లేదని మీ రిచ్చిన హామీ

సరియైనసమయంలో యిచ్చిన సరియైన అభయం. మా మంత్రివర్గ సభ్యులు బుద్ధిలేనివారు కాదు; అయితే వారికి రాము మాట్లాడుతున్న దేమిటో తెలియదు.

జి. బెర్నార్డ్ షా

366. తేజ్ బహదూర్ సప్రూ వద్దనుంచి

అల్హాబాద్,
డిసెంబరు 2, 1948

ప్రియమైన జవహర్‌లాల్జీ,

మీరుచెప్పే ప్రతివిషయాన్ని పత్రికాముఖాన చూస్తూనేవున్నాను. మీపట్లనాకుగల అభిమానం అనుదినం హెచ్చుతోంది. మీ జన్మదినోత్సవ సందర్భంలో కే మీకు లేఖ వ్రాద్దామనుకొన్నాను. కాని, ఆ సమయంలో నా ఆరోగ్యం బొత్తిగా బాగాలేదు ఇప్పుడు ఫర్వాలేదు. గాలిబ్ మహాకవి అమూల్యవాక్కులతో మీకు నా శుభాకాంక్షలు సమర్పించుకొంటున్నాను.

" .... .... .... .... .... .... .... .... .... .... .... .... .... .... ....

.... .... .... .... .... .... .... .... .... .... .... .... .... .... ...."

భాషాసమస్యపై యు. పి. కాంగ్రెసునాయకులలో కొందరు ,అవలంబిస్తున్న వైఖరి నాకేమాత్రం నచ్చడంలేదు. హిందీభాష అవశ్యం అభ్యసించవలసిందే, అయితే, ఉర్దూ ముస్లిములభాషకాదన్నసంగతి మర్చిపోరాదు. ఉర్దూభాషాభివృద్ధికి హిందువులు ఎంతో తోడ్పడ్డారు. యు. పి. తూర్పుప్రాంతంలో వాడుకలోవున్న హిందీభాష రోహిల్ ఖండ్ లోను, పశ్చిమప్రాంతంలోను గల ప్రజలకు బొత్తిగా అర్థంకాదు. ఇతర ప్రాంతాలలోని ప్రజలుకూడా ఈవిషయంలో చాలా ఆందోళనచెందుతున్నారన్నసంగతి నాకు తెలుసును. ఉన్నతశ్రేణిహిందీని అర్థంచేసుకోవడం వారికి మహా కష్టం. కొన్ని ఇంగ్లీషుపదాల హిందీఅనువాదాన్ని మీరు సైతం అర్థంచేసుకోలేరని నేను గట్టిగా చెప్పగలను. ఈ సమస్యను గురించి రాపీగా యోచిస్తున్నకొలదీ, పరిస్థితి గొడవకు దారితీసేట్టుగా వుంది. దీర్ఘమైన లేఖను డిక్టేట్‌చేసే ఓపికకూడా నా కిప్పుడు లేకుండా పోయింది.

నా శారీరకపరిస్థితిలో చెప్పుకోతగ్గ అభివృద్ధి కన్పించటంలేదు. పక్షవాతం, మూత్రకోశంబాధపటోడు, పసుపునొప్పికూడా ఆరంభమైంది. వీటన్నిటిపర్యవసానం ఒకటే: అంతిమయాత్రకు సిద్ధం కావాలి. మీ సారధ్యంలో భారతదేశానికి స్వాతంత్ర్యంసిద్ధించటం నా కళ్ళారా చూడ గలగడం నిజంగా నా అదృష్టం.

గౌరవాభివందనాలతో,

మీ ప్రేమపాత్రుడు,
తేజ్ బహాదూర్ సప్రూ

గౌరవనీయులైన పండిట్ జవహర్‌లాల్ నెహూౄ,
భారత ప్రధానమంత్రి,
న్యూఢిల్లీ

౨౨౬ యం. నహోస్ వద్దనుంచి

శాన్ స్టెఫనో,
ఆగష్టు 2, 1938

ప్రియమైన జవహర్‌లాల్ నెహ్రూ,

నావట్ల, నా సహచరులపట్ల ఉదాత్తప్రేమపూరితభావాలను వ్యక్తం చేస్తూ, ఓడలోనుంచి, లండన్‌నుంచి మీరు పంపిన ఆహ్లాదకరమైన మీ రెండులేఖలు నా కిప్పుడే అందాయి.

మీ ఆగమనం మా కందరికి, ముఖ్యంగా నాకు ఎంతో సంతోషాన్ని ఆనందాన్ని కలిగించిందని నేను మీకు వేరే చెప్పనక్కరలేదు. అది ఒక మరపుకురాని సంఘటనగా మేము భావిస్తున్నాము.

మీ రిక్కడకు వచ్చి మాతో కొన్నిగంటలుమాత్రమే గడిపారు. అయితేనేమి, ఆ కొన్నిగంటలు అమిత హర్షదాయకమైన కాలంగా మేము ఎంచుకొంటున్నాము. మన ఉభయదేశాలరక్షణకు మనం కావిస్తున్న పవిత్రోద్యమాన్నిగురించి మనం మనదృక్పథాలను, అభిప్రాయాలను ఒకరికొకరం తెలుపుకుందుకు మీ రిక్కడవున్న ఆ కొద్దిగంటల

కాలం ఎంతగానో తోడ్పడింది. స్వాతంత్ర్యసాధనకుకావించే మన ఉభయ దేశాలపోరాటాలను సమన్వయపరచడానికి దారిని సుగమంచేసిందని దానిని మనం తప్పక పరిగణించగలము.

ఇంతవరకు మీకు ఉత్తరంవ్రాయకుండా ఆలస్యం చేశానంటే అందుకు కారణంలేకపోలేదు; జాతీయ వాఫ్డ్‌కాంగ్రెసుసమావేశం ఎప్పుడు జరపాలో ముందొక తేదీ నిర్ణయించి, ఆ సమావేశాలు జరుగుతున్నప్పుడు ఈజిప్టుకు రావలసినదిగా మిమ్మల్ని మీ పార్టీకిచెందిన సౌహార్ద్ర ప్రతినిధులను స్వయంగా ఆహ్వానించాలనుకొన్నాను. అటుపిమ్మట, నా యూరోపుపర్యటనకార్యక్రమాన్ని స్పష్టంగా తిరిగి నిర్ణయించుకోలేక పోవచ్చును.

ఈ సంవత్సరం నవంబరు 24, 25వ తేదీలలో వాఫ్ట్. మహాసభలను జరుపుకొంటున్నది. భారతజాతీయకాంగ్రెస్‌ప్రతినిధులను, పాలస్తీనా తదితర అరబ్‌దేశాలవంటి సమీపప్రాచ్యరాజ్యాల పీడితప్రజల ప్రతినిధులను ఈ సంవత్సరపు మహాసభలకు ఆహ్వానించి స్థానికస్వభావాన్ని అధిగమిస్తూ ప్రాచ్యలక్షణాలను మరింత ప్రస్ఫుటంచేసుకోవాలని, వాఫ్ట్ నిర్ణయించుకొన్నది. నా సహచరులతరఫున, నా తరఫున, మీకు భారతజాతీయకాంగ్రెస్‌ప్రతినిధులకు ఈ ఆహ్వానాన్ని అందచేస్తున్నందుకు నాకెంతో ఆనందంగావుంది. మీ హృదయపూర్వక ఆహ్వానాన్ని పురస్కరించుకొని, వాఫ్ట్‌ప్రతినిధివర్గాన్ని సంతోషపూర్వకంగా భారత దేశానికి పంపుతాము.

ఇక నా యూరోపుయాత్రాకార్యక్రమాన్ని నా భార్యతో సంప్రదించినపిమ్మట నిర్దిష్టంగా నిర్ణయిస్తాను. కార్యక్రమం ఈ దిగువ పేర్కొన్నవిధంగా వుంటుంది; మే మిక్కడనుంచి "కాసార్" అనే ఓడమీద ఆగష్టు11వ తేదీన, జెనీవాకు బయలుదేరుతాము; ఇటలీలోని మాంటికేటినీకి వెళ్ళి అక్కడ చికిత్సనిమిత్తం పదిహేను ఇరవైరోజుల వరకు వుంటాము. చికిత్సఅయినపిమ్మట, కార్టినాడి అంపెజో అనే పర్వతంమీద (ఇటలీలో వున్న హోటల్ మిరామొన్టి) పదిరోజులు విశ్రాంతితీసుకొంటాము. తరువాత స్విడ్జర్లండుమీదుగా ప్రయాణంచేసి

పారిస్ చేరుకొంటాము; మిమ్మల్ని కలుసుకొనుటకు మీరు పిలువుంటే, మే సుకృత ఆగుతాము. అక్టోబరు 11వ తేదీవరకు పారిస్‌లో వుండి, ఆ మరునాడు మార్సెల్లీస్‌లో బయలుదేరే 'షైల్' అనే ఓడలో తిరిగి వస్తాము.

ఈ ప్రయాణంలో ఎక్కడో అక్కడ యూరోపులో మిమ్మల్ని కలుసుకునుటకు మా ప్రయాణం పొడిగించవలసివస్తే అది నిజంగా ఆనందదాయకమే మరి. గత జూన్ 10వ తేదీన శాన్‌స్టెఫనోలో ప్రారంభమైన మన ఆసక్తిజనకమైన సంభాషణలను తిరిగి ప్రారంభించడానికి మనసమావేశం వీలుకలిగిస్తుంది.

మీ ఆనందకరమైన ఆగమానికిసంబంధించిన మూడు ఫోటోలను, వేరే ఒక కవరులో భద్రపరిచి పంపిస్తున్నాను.

మీ అత్యంత విశ్వాసపాత్రుడు,
యమ్. నహాస్.

232 ముస్తాఫా ఎల్ నహాస్ పాషనుండి

హెలియోపోలిస్
17-10-1938

నా ప్రియమైన జవహర్‌లాల్ నెహ్రూ,

మీరు వ్రాసిన రెండు ఉత్తరాలు నాకిప్పుడే అందాయి; మేము కైరోకు వెళ్ళినప్పుడు ప్రజలు మాకిచ్చిన స్వాగతసందర్భంలో పోలీసులసిబ్బంది ధూర్తంగా ప్రవర్తించినందుకు, మునుపే ఊహించుకొని మాపై అతినీచంగా హత్యాప్రయత్నం కావించినందుకు, మీరు ప్రకటించిన సానుభూతికి నా హృదయపూర్వక కృతజ్ఞత.

మా మీద దాడి జరిగి మాకు తీవ్రమైనగాయాలు తగిలినప్పటికీ, ప్రాణాలుపోకుండా భగవంతుడు మమ్మల్ని కాపాడాడు; ఆ గాయాల నుంచి మేమింకా పూర్తిగా కోలుకోలేదు.

మక్రాంపాషాకు నుదుటమీద ఆపరేషన్ చేశారు; అదృష్టవశాత్తు నాకుకాని, మక్రాంపాషాకు కాని ఎముకలు దెబ్బతినలేదు. ప్రజలు ఆవేశపూరితులైనారు; ఎక్కడ చూచినా ఉద్రిక్తత నెలకొన్నది.

మీ సోదరి అలెగ్జాండ్రియాకు వచ్చినపుడు ఆమెకు, మా అనుచరులలో కొందరు సంతోషంతో స్వాగతమిచ్చారు; ఆమెతోపాటు మేము కూడా ప్రయాణంచేయడానికి ఆమెకు సౌకర్యాలుకలిగించడానికి, మీకు అవకాశం కలుగుతున్నది.

మీరు మీకుమార్తెతో అలెగ్జాండ్రియాకు విచ్చేసినపుడు, మా సహచరుల ప్రతినిధివర్గం మీకు అక్కడ స్వాగతమిస్తుంది; కైరోలో ఈజిప్టులో మీరు మాతో ఒక వారం ఉండే అవకాశం మీకు కలుగుతున్నది.

పాలస్తీనాసమస్యపై ప్రభుత్వస్థాయిలో జరుగబోతున్న సమావేశంపై, సామ్రాజ్యవాదంపై మీరు వెలిబుచ్చిన అభిప్రాయాలన్నిటితోను, మేము పూర్తిగా ఏకీభవిస్తున్నాము.

మీ విశ్వాసపాత్రుడు,
ముస్తాఫా ఎల్ నహాస్

ఈ లేఖ ప్రతి నొకదానిని జాగ్రత్తకోసం లండన్ చిరునామాకు పంపిస్తున్నాను.

244. ముస్తాఫా ఎల్ నహాస్ పద్దనుంచి

హెలియోపొలిస్,
12-12-1938

ప్రియమిత్రమా,

మీరు వెళ్ళిపోతూ, పోర్టుసయ్యద్ నుంచి వ్రాసిన లిఖితపూర్వ మీ ఉత్తరం నన్ను పరవశుణ్ణిచేసింది. మీ రిక్కడ మాతో స్వల్పకాలం మాత్రమే వుండి ఎన్నెన్నో జ్ఞాపకాలను మీవెంట తీసుకుపోతున్నారంటే నమ్మండి; ఆ జ్ఞాపకాలను మీ రిక్కడ అట్టేపెట్టినట్లయితే, మీ స్నేహితులు మిమ్మల్ని భద్రంగా చూసుకొని మీకు సేవచేసినరీతినే, వాటిని భద్రపరుచుకుందురు.

తూపస్టుసి.ముగా మీరు చేసిన మీ ప్రయాణ కథనాన్ని ప్రచురించిన పత్రికలను మీకు నేను పంపించాను. ఈ దేశభక్తులకు మీపట్లగల గౌరవమర్యాదలు సాటిలేనివని అని మీకు వ్యక్తంచేస్తాయి.

మనదృష్టిని ఆకర్షిస్తున్న ఒక సమస్యపై నే నిప్పుడు తీవ్రంగా ఆలోచిస్తున్నాను: పరస్పరం విశ్వాసాన్ని పొందడానికి మనము ఆయత్తపడదాము. మనస్వాతంత్ర్యపరిరక్షణకు ఏకీకృతలక్ష్యాలతో మనమిద్దరము. సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పోరాడుదాము. మనం పురోగమిద్దాం. పురోగమించి ప్రపంచసంక్షోభానికి కల్లోలానికి కారణభూతమైన సామ్రాజ్యవాదపోకడల దుర్మార్గప్రవర్తనలతాహతు ఎంతో చూద్దాము.

మీరు పోర్టుసయ్యద్ చిరునామాకు పంపించిన మీ పుస్తకానికి నా అభినందనాలు. గ్రంథాన్ని చదివినతరువాత మీ సాహసోపేతమైన జీవితంపట్ల నాకుగల గౌరవం యినుమడించింది.

వాఫ్దిస్టు జాతీయకాంగ్రెస్ సరిగ్గా ఏ తేదీన జరుగుతుందో మీకు నేను త్వరలో ఎరుకపరుస్తాను; మహాసభలలో అతిముఖ్యమైన సమస్యలు చర్చింపబడతాయి.

మీ సోదరి అలెగ్జాండ్రియాను వెడుతున్నపుడు హాజరుకావడానికి ఆమె ఆరోగ్యాదిసౌకర్యాలను చూడడానికి మా స్నేహితులకు వీలుకుదరలేదు; అందుకు నే నెంతో విచారిస్తున్నాను. ఆ పని మేము చేసివుండినట్లయితే, మాకు ఆమెఎడలగల గౌరవభావాన్ని వ్యక్తపరచినట్లయేది; మా కర్తవ్యాన్ని మేము సంతోషపూర్వకంగా నెరవేర్చినట్లయేది. ఇక మీపట్ల నమ్మకమున్నది నామాట, ప్రియస్నేహితుడా. మీతో చిత్తశుద్ధితో స్నేహంచేస్తున్నాను. మీకు మీ ముద్దులకూతురుకు నేను నాభార్య మా శుభాకాంక్షలను ఉత్తమజ్ఞాపకాలను తెలియజేస్తున్నాము.

మీ విశ్వాసపాత్రమైన,
యం. నహాస్.



మీరు వెడుతున్నపుడు వీడ్కోలుసందర్భంలో తీసిన కొన్ని ఫొటోలను మీకు పంపించాను.